# కందుకూరి-వీరేశలింగకృతగ్రంథములు.

మొదటి సంపుటము.

# ప్రహసనములు.

మూఁడవ కూర్పు.

శ్రీ మనోహరముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినవి.

రాజమహేంద్రవరము.

1917

THE

# Complete Works

OF



RAO BAHADUR

## K. VEERESALINGAM PANTULU,

*Retired Telugu Pandit, Presidency College, Madras.*

# Vol I. Farces.

THIRD EDITION

1917.

MANORAMA PRESS, RAJAHMUNDRY

# ప్రకటన

(మొదటికూర్పు.)

పుస్తకములు విడి విడిగా నుండుటచేత పోవుచున్న వనియు, పుస్తకముల నన్నింటిని జేర్చి సంపుటముగాఁ బ్రచురించినయెడల నవి యెక్కువ సురక్షితముగా నుండుటయేకాక పుస్తకభాండాగారములకుఁ గూడ నుపయోగపడు ననియు, నా పేర పలువురు పలుమారులు వ్రాసి యున్నారు. అట్టిపని వ్యయప్రయాస సాధ్యమైనను, ఆంధ్రభాషాభిమానులును మిత్రులును నాకుఁ దగిన ప్రోత్సాహము కలిగింపకపోరను నమ్మకముతో నాపుస్తకముల నన్నింటిని సంపుటములుగాఁ బ్రచురించుట కారంభించి ప్రథమసంపుటమును ముగించినాను. ఇందు నిమిత్తమయి ముద్రాశాల నిచ్చట నూతనముగా స్థాపింపవలసివచ్చినందున ప్రారంభదశలో పని చురుకుగా జరగకపోయినను, పనిముట్లును పనివాండ్రును పూర్ణముగా సమకూడినందున తక్కినసంపుటములపని యిప్పుడు వేగముగా సాగుచున్నది. రెండేసిమాసములకు లోపలనే యొక్కొక్కసంపుటము ముగియుచుండును. ఈసంపుటమును బట్టి యొక్కొక్కసంపుట మేనూరుపుటలకు తక్కువ కాకుండను ఆఱునూఱుపుటల కెక్కువ కాకుండను ఉండునని తెలిసికొనవచ్చును. పుస్తకము లన్నియుఁ జేరి యిటువంటి సంపుటములు పదింటికి తక్కువకావు. ఎక్కువయినను, ఇప్పు డేర్పఱిచిన వెలకే యన్నిసంపుటములు నియ్యఁబడును. ఈసంపుటములు కొన్ని దళమైనకాగితముల మీఁదను కొన్ని పలచనికాగితములమీఁదను ముద్రింపఁబడుచున్నవి. విడివిడిగా కొనెడుపక్షమున సంపుట మొకటికి దళసరికాగితములప్రతి మూడురూపాయల చొప్పునను పలుచనికాగితములప్రతి రెండురూ

పాయల యెనిమిదణాల చొప్పునను విక్రయింపఁబడును. క్యాలికోగుడ్డతో నిండుగా బయిండుచేయింపఁబడిన యీసంపుటముల వెల సహితమిప్పటి విడిపుస్తకములకంటె హెచ్చు కాదు. నాపుస్తకము లన్నిటి వెలలును జేరి ముప్పదిరూపాయ లగునుగదా ? ఎప్పు డయినను సంపుటముల నన్నిఁటిని మొత్తముగాఁ గొనువారికి దళసరికాగితములవి యిరువదియైదురూపాయలకును పలుచనికాగితములవి యిరువదిరూపాయలకును ఇయ్యఁబడును. ఇప్పుడే ముందుగా సొమ్మిచ్చి చందాదారులుగాఁ జేరువారికి దళసరికాగితముల సంపుటము లన్నియు నిరువది రూపాయలకును పలుచనికాగితముల సంపుటము లన్నియు పదునేను రూపాయలకును నియ్యఁబడు నని యీవఱకే ప్రకటించి యున్నానుగదా ? పుస్తకముల యుపయోగమును గూర్చియు రమ్యతనుగూర్చియు నేను జెప్పుట యుచితము కాదు. ఇష్ట మున్నవా రీవఱ కీపుస్తకములను జదివినవారి నడిగి తెలిసికొనుట సముచితముగా నుండును. ఎట్లయినను నేను బూనిన యీకార్యమున కాంధ్రభాషాభిమానమాననీయు లగువా రెల్లరును దోడ్పడి నాకుఁ దగినంత ప్రోత్సాహమును గలిగింతురు గాక యని ప్రార్థించుచున్నాను.

కందుకూరి--వీరేశలింగము.

# విషయసూచిక:

# అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము.

ఇందు వచ్చు పాత్రములు.

రామాకాంతము పంతులు—కథానాయకుఁడు.

కరటకరెడ్డి—పంతులవారి సేవకుఁడు.

వెంకఁడు—తోటపనివాఁడు.

సోమభట్లు—పురోహితుఁడు.

శ్యామలాంబ—రామాకాంతము పంతులభార్య.

మోహిని—కరటకరెడ్డి భార్య.

రంగము—రాజమహేంద్రవరము రామాకాంతము పంతులుగారి గృహము.

[సేవకుఁడు కరటకరెడ్డి ప్రవేశించుచున్నాఁడు.]

కర—ఇక్కడికి రెండుసంవత్సరాలనుంచి నాభార్యను నాయజమానుడికంట పడకుండా కాపాడుకొని వచ్చినాను. అతనికంట బడితే యిక నాకు భార్యఆశ లేదు. యిదివరకూ నాయజమానుఁడు నేను బ్రహ్మచారి ననేభ్రమతోనే వున్నాఁడు. ఈప్రకారంగానే యింకా మోసంచేస్తూ నాబుద్ధిబలంచేత యీభ్రమ యెల్లకాలమూ వుండేటట్టు చేస్తాను. నాకు పెళ్ళాము వున్నట్టు పంతులుగారికి తెలిసి వున్నట్టయితే యిదివరకే నాకొంప మునిగేది. పెళ్ళాలు వున్న యీవీధివాళ్ళంతా ఆయనజీవానికి వుసూరుమని యేడుస్తూ వున్నారు. ఆయన మ్యూనిసిపల్ కమీషనరూ, లోకల్ ఫండుమెంబరూ, బెంచిమేజస్ట్రీటూ, జస్ట్రిస్

కోర్టుప్లీడరూ కావడంచేత యెప్పుడు యేమి చేసిపోతారో అని అందరూ జడుస్తూ వుంటారు. వాసుదేవరావుపంతులుగారి భార్య పుట్టింటికి వెళ్ళిపోతూ వుండడంచేత ఆవిడనిమిత్తం మాపంతులుగారు యీవాళ స్టీమరుదాకా కొవ్వూరు వెళుతారు. అమ్మగారు పుట్టింటికి వెళ్ళినారు. ఈవేళ నేను నాభార్యను యిక్కడకు దీసుకునివచ్చి అమ్మగారి పడక గదిలో నేను యీరాత్రిఅంతా ఖులాసాగా వుంటాను; అవతలినుండి యెవరో వస్తూవున్నట్టున్నారు.

[రామాకాంతముపంతులుగారు ప్రవేశించు చున్నారు.]

రామా—కరటకా! కరటకా! వాసుదేవరావుపెళ్లాము స్టీమరు మీాదకి వెళ్ళిందా?

కర—ఇప్పుడే వెళ్ళింది. మీారు వెంటనే వెళ్ళితే స్టీమరు అందుతుంది. మీారు వేగిరం బయలుదేరవలెను. (తనలో) నేను యీరాత్రి యీయనను యెలాగయినా పంపించి వెయ్యవలెను.

రామా—నన్నుకూడా వెళ్ళమన్నావా? మీాఅమ్మగారుకూడా వూళ్ళో లేరు. ఇల్లు నీవు చూస్తూ వుంటావా?

కర—అవశ్యంగా వెళ్ళండి. నేను బ్రహ్మచారిని. పెళ్ళాము వద్దకు పోవలసినపని లేదు. నేనీరాత్రి యిక్కడనే పరుండి మీాయిల్లూ వస్తువులూ మీాకు పదిలంగా వప్పగిస్తాను.

రామా—ఈలోగా వూరినుంచి మీాఅమ్మగారు రాదుగదా? మగవాణ్ణి కావడంచేత నేను దాన్ని వదలిపెట్టి వుండగలిగినా, అది పనికమాలినఆడది కావడంచేత పట్టుమని పదిరోజులయినా పుట్టింటికాడ నన్ను వదలిపెట్టి వుండలేదు. నేను వర్తమానం పంపించకుండానే బండీ చేసుకొని దుముంగున వస్తూ వుంటుంది. పుట్టిల్లు దగ్గరవూరు కావడంచేత యీఅసందర్భం వస్తూ వుంటుంది.

కర—ఆవిషయంలో మీ రేమీ భయపడనక్కర లేదు. అమ్మగారు యీరోజుకు రారు. ఒకవేళ వచ్చినా నేను సర్ది చెప్పి మీరు కొవ్వూరు రేగాడాలో స్థలం చూడడంనిమిత్తం వెళ్ళినారని చెపుతాను. స్టీమరు మించిపోతుంది. మీరు త్వరగా వెళ్లవలెను.

రామా—నేను వేగిరం వెళ్లవలెనని నాకు బహుతొందరగా వున్నది. ఎందుచేత?

కర—నాకే మేమీ తొందర లేదు. కావలిస్తే నెయ్యేళ్లు యింట్లోనే వుండండి. ఒకరోజయినా పూటదాటిపోతే చాలునని సంతోషించడానికి నాకు పెళ్ళామయినా వున్నదా యేమిటి?

రామా—ఆహాహాహా! పెళ్ళాలు వున్నా వెళ్లిందరికీ నేను వెళ్ళిపోవలెనని వుంటుందేమి? నేను యిప్పుడు వ్యభిచారం మానివేసి పెద్దమనిషి నవుతూ వున్నాను. యీనాటినుంచి బొత్తిగా మానివేస్తాను. నేను వాసుదేవరావు పెళ్ళాముజానికమ్మను విడిచి ఒక్కనిమిషం తాళలేను. ఆవిడ కేవలమూ నాకే దేవే. నాపాలిటికి శ్రీమహాలక్ష్మి. నీమాట తీసివెయ్యరాదు. నేనుకూడా స్టీమరులోనే వెళుతాను. నేను వెళుతూ వున్నాను. ఇల్లు పదిలము. మీ అమ్మగారు తాను వచ్చేలోగా మంచిదాసీని కుదుర్చుమని చెప్పి పోయింది. ఆమాట మఱచిపోకు. ఇవిగో ఇంటితాళముచెవులు. రేపు ఆదివారం గనుక నేను రావడం రెండురోజులు ఆలస్యమయినా యీలోపుగా అమ్మగారు ధవిళేశ్వరంనుంచి వస్తే తాళంచెవు లియ్యి.

(అని వెళ్ళుచున్నాడు.)

కర—ఈయనను వదల్చుకున్నాను. ఇక నాపెళ్లాం యిక్కడకు స్వేచ్ఛగా రావచ్చును. వచ్చేటప్పుడుమాత్రం నాపెళ్ళాము దోవలో యీయనకంట పడకుండా రావలెను. ఆలావస్తే ఈరాత్రి మాప్రభువు

గారిపడకగదిలో పందిరిపట్టెమంచంమీద మామోహినీ నేనూ రాజ దంపతులలాగు వుంటాము. అదుగో మోహిని వస్తూ వున్నది.

[అప్పుడు మోహిని ప్రవేశించుచున్నది.]

మోహి—కరటకరెడ్డీ! నీయజమానుఁడు వూరికి వెళ్ళినాఁడా?

కర—నీపుణ్యాంచేత యిప్పుడే వెళ్లినాఁడు. నీకు వీధిలోయెదురు పడలేదు గద? నీవు అదృష్టవంతురాలవు. నీకు యీరాత్రి పందిరిపట్టె మంచమూ పరుపూ దొరకుతుంది. నీవు మన వివాహంమాటమాత్రం యెవరితోనూ చెప్పకుమా?

మోహి — ఎవరితోనూ చెప్పను. వక్క నాస్నేహితులు బుచ్చితోనూ అచ్చితోనూ మంగితోనూ—(ఆలోచించి)— యింకా యెవరితో చెప్తానా? మా మేనమామ పుల్లిగాడితోకూడా—

కర—సరి యేడిసినట్టే వున్నది నీరహస్యం. డప్పు పుచ్చుకొని టమటమా వేసేమాదిగవాడితో కూడా చెప్పు. నాయజమానుడితో నాకు పెళ్లి కాలేదని చెప్తూవున్నాను గదా. నాగుట్టు ఆయనకు తెలిస్తే?

మోహి—ఎవరితోనూ చెప్పవద్దని వాళ్లచేత చేతిలో చెయ్యి వేయించుకొంటాను లే.

కర—నీరహస్యం నీవు దాచుకోలేవుగాని యిఖ యితరులు దాస్తారా? యెలాగా నాయజమానుడికి తెలియక మానదు. ఆడదాని వద్ద రహస్యం దాగదని పెద్దలు చెప్పినమాట వూరికే పోతుందీ?

మోహి—అవును నావద్ద రహస్యం దాగదు. రహస్యం దాగ వలెనంటే నీవు నాకు తెలియకుండానే పెళ్లి చేసుకోలేకపోయినావా?

కర—సరిసరి యిది మరీ విచిత్రముగా వున్నది. నీకు తెలియ కుండానే నిన్ను నేను పెళ్లి చేసుకోవలసినది కాదూ? ఇటువంటి దేవ రహస్యాలు నాయజమానుడికేగాని నాకు తెలియవు.

మోహి — మనరహస్యం నీయజమానుడికి తెలిస్తేమాత్రం మనకు వచ్చినభయం యేమిటి? నన్ను చూచి అతడు సంతోషిస్తాడో లేదో వక్కపర్యాయం తీసుకునివెళ్లి చూపు. తాను పెళ్లిఆడి సుఖపడుతూ వున్నప్పుడు నవుకర్లు పెళ్లిఆడితేమాత్రం యెందుకు కోపం వుంటుంది ?

కర—నిన్ను చూస్తే అతడు తప్పకుండా సంతోషిస్తాడు. అతడికి పెళ్ళిమాత్రమే యిష్టం లేదుగాని నీవంటి పడుచు పళ్ళికూతుళ్ళంటే చాలా యిష్టమే.

మోహి—అలాగైతే యింకా యెన్నాళ్లు నేను యీరహస్యం దాచవలెను ?

కర—ఎన్నాళ్ళో అక్కరలేదు. నేను ఆయనదగ్గిర నవుకరీ వదులుకున్నదాకా దాస్తే చాలును. నా కిప్పుడు ముప్పయియేళ్లు వున్నవి. ముసలివాణ్ణి అయినతరువాత నేను నవుకరీ తక్షణం మానుకుంటాను. నేను నవుకరీ మానుకున్నదాకా దాచలేకపోతే నాయజమానుడు ముసలవాడయినదాకా నైనా దాచు. అంతే చాలును. అతడు నాకంటె నాలుగేళ్లుమాత్రం చిన్నవాడు. నీవలాచేస్తే నాకు యితడు డబ్బు చాలా యిస్తాడు గనుక నేను యెప్పుడూ నవుకరీ వదలుకోకుండా సుఖంగా వుంటాను.

మోహి—నీవు నవుకరీ వదలుకున్నదాకానే రహస్యం దాచుతాను గాని అతడు ముసలివాడైనదాకా నేను దాచలేను. ఈలోగా యేలాగయినా కష్టపడుతాను గాని నాకోసం నీవు చేప్పుదయాన్నుంచీ తప్పకుండా నవుకరీ మానుకుందూ.

కర—నవుకరీ మానుకుంటే నీకు నగలూ బువ్వా యెక్కడనుంచి వస్తుంది ?

మోహి—అలాగయితే నీవు డబ్బు బాగా సంపాదించి పరుపులూ పట్టెమంచాలు చేయించి నాకు నవుకర్లనూ దాకర్లనూ పెట్టి బండిలో యెక్కించి నన్ను వూరంతా తిప్పి సుఖపెడుతావా ?

కర—అవన్నీ యీరాత్రే చేస్తాను. ఈరాత్రి మనం అమ్మగారిగదిలో పరుపులమీదనూ పట్టెమంచాలమీదనూ పరుందాము ; చీకటిపడ్డతరువాత పంతులుగారిబండిలో ఎక్కించి నిన్ను పెద్దవీధిగుండా తిప్పుతాను; తోటమాలీ వెంకడిచేత నీకు కావలసినన్ని పనులు చేయిస్తాను.

మోహి—అలాగయితే పెళ్ళినాడు పెట్టిన మధురచీర కట్టుకుని అయిదునిమిషాలలో నేను యింటికి వెళ్ళి మళ్లీ వస్తాను. ఈలోపుగా బండీ అన్నీ సిద్ధము చేయించు.

కర—వెళ్ళి యిక్కడ వున్నట్టు రా. నీవు వచ్చేటప్పటికి ఫలహారానికి మిఠాయికూడా తెప్పించి వుంచుతాను. మనం ఫలహారం చేసి చల్లపాటువేళ చల్లగాలిలో హాయిగా షికారు బయలుదేరుదాము

మోహి—మంచిగంధమూ మల్లెపువ్వులూకూడా తెప్పించవలెను సుమా.

(అని పోవు చున్నది.

కర—ఓరీ ! వెంకా ! తోటపని మానివేసి యిలా రా ?

వెంక—(ప్రవేశించి) బాబూ ! యెందుకండి ?

కర—పంతులుగారు వూరికి వెళ్ళేటప్పుడు నీవు తోటపని మానివేసి ఈరోజల్లా నావద్దలో వుండి నేను చెప్పినపనల్లా చేయమన్నారు. విన్నావా ? నేను చెప్పినపని చెయ్యకపోతే నీకు నవుకరీ వుండదు సుమా. నీవు పెందరాళే భోంచేసి వచ్చి రాత్రి నేనునాభార్యా పడుకున్నప్పుడు నీవు మాకు పంఖా విసరవలెను. బ

వాడితో చెప్పి సాయంకాలము షికారు వెళ్లడానికి బండి కట్టించి తయారుగా వుంచేచు. నివ్వు ముందుగా పోయి నేను యిమ్మన్నానని పంతులుగారికి వాకెగా మిఠాయి యిచ్చే కసినేసింగువద్ద యేబులం పంచదారమిఠాయి రెండుపోట్లాలు కట్టించుకుని రా.

వెంక—అలాగే చేస్తానుగానండి సిరా లేక పువ్వులచెట్లు చచ్చి పోయినవని రేపు పంతులుగారు కోపపడితేనో—

కర—నాదగ్గిర యెదురుమాట చెప్పకు చెప్పినట్టు చెయ్యి. నీకు క్రొత్త గనుక యింకా తెలియదేమో గాని నాఆజ్ఞ అంటే పంతులుగారి ఆజ్ఞకంటేనూ యెక్కువ. పంతులుగారికి కోపమువచ్చినా నివ్వు పని చెయ్యగలవు గాని నాకు కోపంవస్తే నిక్కుసనిముషం పని చెయ్యలేవు. పంతులుగారు నిన్ను అంతగా అడిగితే నేను పనిమీద పంపించినానని చెప్పు.

వెంక—చిత్తము. చిత్తము.

కర—ముందుగా పోయి మిఠాయి తీసుకొని రా. పో.

వెంక—పణసతొనలమిఠాయా ? (అని వెళ్లుచున్నాడు.)

కర—నేను యీవాళ నాయజమానుడికంటేనూ యెక్కువగా వుంటాను. ఈపాటికి మోహిని వస్తూవుంటుంది. ఎవరో వస్తూవున్నట్టు అడుగులచప్పుడవుతూవున్నది. అది మోహినే అయివుంటుంది. కాదు. బూట్సుచప్పుడులాగున్నది. అది యేమి నాయజమానుడు మళ్ళీవస్తూ వున్నాడు. అయ్యో! దైవమా! ఏమి యీదురదృష్టము! యిప్పుడు మోహిని వచ్చి యితనికంట పడితే నాకాపురం కూలిపోయిందే. ఇక నేను సంసారానికి నీళ్లు వదలుకోవలెను. నేను యేదోపని కల్పించుకొని వీధిలోకి వెళ్ళి నాశిష్యుమును రావద్దని చెప్పి వస్తాను. ఈలోపుగా మిఠాయి పట్టుకొని వెంకడు రాడుగదా ?

[అప్పుడు రామాకాంతముపంతులు ప్రవేశించుచున్నాఁడు.]

రామా—కరటకా!

కర—(ఎవ్వరయిన వచ్చుచున్నారేమో యని గుమ్మమువంక చూచుచు) అయ్యా! ఏమి మీరు వెళ్ళినారుకారేమి?

రామా—నేను స్టీమరువద్దకు వెళ్లేటప్పటికి నక్కతమాషా జరిగింది. టిక్కెట్లు పుచ్చుకొని, ఆతమాషా చూచి మళ్ళీవత్తామని యిట్టే అవతలికి వెళ్లేటప్పటికి స్టీమరువాళ్లు స్టీమరు తీసుకొని చక్కాపోయినారు. రివిన్యూవుద్యోగస్థులకోసం కనిపెట్టుకొనివుంటూ నా నిమిత్తం యెందుకు కనిపెట్టుకుని వున్నారుకారో వాళ్ళపని నేను రేపు పట్టిస్తాను. గడ్డీ! ఆతమాషా యేమో నీవు వూహించఁగలవా?

కర — నాకు ఆమాత్రంబుద్ధి లేదు. అయినాకానీ మీకు యెవర్తో చక్కనిపడుచుచిన్నది కనపడ్డదనుకుంటాను.

రామా—నీవు చక్కగా కనిపెట్టినావు. నీకు జ్యోతిషంకూడా తెలిసినట్టున్నదే. నీవు మాసిద్ధాంతిగారికంటెనూ దాఖలాగా చెప్పినావు. నీ వెక్కడ బుద్ధిహీనుడవు? నీవు బుద్ధికి బృహస్పతివి!

కర—ఇదంతా మీదయ.

రామా—నాకు మూడురోజులకిందట రతీదేవివంటి వొక చక్కనిచిన్నది నేనూ నాస్నేహితుఁడూ కలిసి వస్తూవుండగా కనపడ్డది. ఆచిన్నదే స్టీమరుమీదికి యెక్కబోతూవుండగా దూరంగా మళ్ళీ కనపడ్డది. నేను రేవులోనుంచి వీధిమొగకు వచ్చేటప్పటికి యేయింట్లోకి పోయిందో మళ్ళీ కనపడ్డదికాదు. వీధంతా యీచివరనుంచి ఆచివర వరకు నాలుగుమాట్లు తిరిగి యెక్కడా కనబడక ఇంతలో స్టీమరుకూడా దాటిపోయినందున తిరిగి యింటికి వచ్చినాను.

కర—(తనలో) ఇతని కేదో గొప్పమెర దొరికింది. అందుచేత

యిత్తెస్తే మళ్ళీ పంపించివేసి యీరాత్రి నేను భార్యతో సుఖంగా వుండ వచ్చును. ఇత్తెస్తే మాయచేసి యెక్కడా పసుపులు లేనియింటియెదుట వీధిఅరుగుమీద తెల్లవారిందాకా కూర్చోపెట్టి వస్తాను.(ప్రకాశముగా) మీకు కనపడ్డచిన్నది యెఱ్ఱని పలచని చిన్నది కాదుగదా ?

రామా—అవును. యెఱ్ఱనిచిన్నదే. ఇంకా యేదయినా ఆన వాలు చెప్పు.

కర—అట్టె పొట్టికాకుండా పొడుగుకాకుండా వుంటుంది.

రామా—అవును. అలాగే వుంటుంది. మరివకగురుతు చెప్పు.

కర—తలవెంట్రుకలు నల్లగా వుంటవి. కొప్పు పెడుతుంది.

రామా—అందరు కొప్పు పెడుతారు. అందరితలవెంట్రుకలు నల్లగానే వుంటవి. ఇదేం ఆనవాలు?

కర—అలాగయితే యెవరికీ లేని మంచిఆనవాలు యింకొకటి చెప్పుతాను వినండి. ఆచిన్నది కుంకుమబొట్టు పెడుతుంది కాదు? కళ్లకి కాటుక పెడుతుంది.

రామా—ఈ రెండుపనులూ అందరూ చేస్తారు.

కర—అందరూ యెందుకు చేస్తారు? మా అన్నగారిపెళ్ళాం చెయ్యదు. ఆవిడ యెప్పుడూ బొట్టు పెట్టుకోదు. కాటుక పెట్టుకోదు. కొప్పు పెట్టుకోదు. గాజులు పెట్టుకోదు.

రామా—మీ అన్న పెళ్ళాం వెధవచిన్నది కాబోలును.

కర—అవును వెధవచిన్నదేకాబోలును. మీ రన్నది నాఅన్న పెళ్ళామూ? ఇప్పుడు మీ మేనమామగారి యింట్లో పనిలోవున్న అన్న గారిపెళ్ళాము కాదూ? ఆవిడ వెధవే. ఆవిడను మొగుడు కోపమువచ్చి నప్పుడు యెప్పుడూ వెధవా వెధవా అంటూవుంటాడు. నిరుడు మరిడీ జాడ్యాలలో చచ్చినఅన్నగారిపెళ్ళాం వక్కతేమాత్రం విధవ కాదు.

రామా—మీఅన్నగారు బ్రతికివుండగా పెళ్ళాం వెధవ యెలా గయిందోయి?

కర— నన్ను వూరికే ప్రశ్నలువేసి భ్రమపెట్టకండి. మీరు య్యాభై ప్రశ్నలువేసినా నేను అబద్ధం ఆడను. మహారాజులాగు యింట్లో కూర్చునేవారికి మీకు లోకంసంగతి యేమి తెలుస్తుంది? లోకంలో దేవరహస్యాలు యెన్నో వుంటవి. యెరిగినవాణ్ణి నామాట నమ్మండి. మొగుడు బ్రతికివుండగానే కొందరుపెళ్ళాలు వెధవలూ అవుతారు; పెళ్లి అయినతరువాత కొందరుగృహస్థులు బ్రహ్మచారులూ అవుతారు. ఇవన్నీ యిప్పు డెందుకు గాని మీరు చూచినది పొన్నమండ భీమన్న కూతురు. దానిమొగుడు ముసలివాఁడు.

రామా—ఆచిన్నదానిసంగ తంతా నీ విదివరకే యెరుగుదువా?

కర—ఒక్క యెరగడమే కాదు. రేపు తెల్లవారేలోగా ఆచిన్న దాన్ని మీసొమ్మే చేసివేస్తాను. మీరు యిప్పుడే బయలుదేరి వారి యింటికి యెదురుగుండా వున్నఅరుగుమీద ఈరాత్రంతా పరుండ వలెను. తెల్లవారేలోగా మీ కాచిన్నదాన్ని తీసుకునివచ్చి మీకన్నుల పండుగ చేస్తాను. మీకు తెలియకుండా మీవద్దకు తీసుకురావడానికై మీనిమిత్తం నేను ప్రయత్నం చేస్తూవున్నదే ఆచిన్నది.

రామా—అలాగా? నీవు బహుబుద్ధిమంతుఁడవు. నీఋణం నేను వుంచుకోను. ఆచిన్నదాన్ని నాకు దక్కించితివా, నీకు యిరువయి రూపాయలు బహుమానం చేస్తాను. నేను యెప్పుడూ చేసినమేలు మరిచిపోను సుమా.

[అప్పు డకస్మాత్తుగా మగని వెనుకవైపునుండి మోహిని లోపలికి వచ్చుచున్నది]

కర—అయితేయిరువై రూపాయలూ నాచేతిలో పడ్డవే. పాపం దాని మొగుడు అదృష్టహీనుఁడు.

రామా—(మోహినిని చూచి) ఏమి యీభాగ్యము! కరటకా! ఇదిగో నీరూపాయలు పుచ్చుకో. (అని చేతిలో పెట్టుచున్నాడు.)

కర—ఏమి యీభాగ్యము! నాకు ముందుగానే రూపాయలు యిస్తూవున్నారు? (అని వెనుకతిరిగి మోహినిని చూచుచున్నాడు.)

మోహి—(తెల్లపోయి నిలుచున్నది.)

రామా—ఆచిన్నదాన్ని మాటలోనే యిక్కడికి తలవనితలంపుగా రప్పించినావు? ఈమెకు వెయ్యేళ్ళు ఆయుస్సున్నది.

కర—(తనలో) అయ్యో! నాకొంప మునిగింది.

మోహి—కరటకా! నన్ను క్షమించు. నేను అసమయంలో వచ్చినాను.

రామా—అసమయం కాదు. మంచిసమయంలోనే వచ్చినావు. నాభార్య ఊళ్ళో లేదు. ఈవేళ్లె నిన్ను రమ్మన్నది నాసిఖ్ధుకేమే.

కర—(మోహినితో రహస్యముగా) ఇతడే నాయజమానుండైనరామాకాంతముపంతులు. మనరహస్యం జాగ్రత.

రామా—సుందరీ! నీవెవరు?

మోహి—నా పేరు మోహిని. నేను మీపాదసేవకురాలను.

కర—(రహస్యముగా) ఇతనికి పాదసేవకురాలవా? నీవు అలా అనబోకు.

మోహి—నేను నిజముగా సేవకురాలను కాను. గోదావరి యొడ్డున కాపుర మున్నముసలిగంగమ్మకూతురిని.

రామా—ముసలిగంగమ్మకూతురవా? పాపము! మొగుడుపోయినప్పటినుంచీ జీవనానికి జరగక గంగమ్మ చాలా యిబ్బంది పడుతూవున్నట్టున్నది. మీరు నిర్విచారంగా వుండండి. మీయిద్దరినీ నేనే పోషిస్తాను. నీవు మాపిల్లవాళ్ళను యెత్తుకుంటూ వుండువుగాని.

నీతల్లి నీతో వుంటుంది. మీరు రేపు వచ్చి మాతోటయింట్లో దిగండి. కరటకా! నీవు వీరిసంరక్షణ కనుక్కుంటూ వుండవలెను.

కర——(లేచి మోహినికిని రామాకాంతముపంతులకును నడుమ వచ్చి మోహినిని పొమ్మని సైగచేయుచు) మీకు పిల్లలు లేనిదీ యేపిల్లల నెత్తుకుంటుంది?

రామా——(కరటకరెడ్డిని వెనుకకు తోయుచు) ఆపని కాకపోతే మరివకపని చెప్తాను. ఈచిన్నది నేటినుంచీ పనిలో వున్నట్టే.

కర —— (పని యొప్పుకోవద్దని వెనుకనుంచి సైగ చేయు చున్నాడు.)

మోహి——నాకు పని వద్దు.

రామా——నీయిష్ట మైనపని చెయ్యవచ్చును. నీ కేపని చేత నవునో చెప్పు.

మోహి——నా కేపనీ చేతకాదు.

రామా——ఏపనీ చేతకాకపోతే, తోటమాలీ పువ్వులచెట్లకు నీళ్లు పోస్తూవున్నాడో లేదో చూస్తూవుందువుగాని లే. మీరు రేపు వచ్చి మాయింట్లో ప్రవేశించండి. కరటకా! నీవు యీరాత్రి మన తోటయిల్లు ఖాలీ చేయించు.

మోహి——నేను మాయింటికి భోజనానికి వెళ్లవలెను. నన్ను పోనియ్యండి.

రామా——నీకు తినడానికి పంచదారమితాయి తెప్పిస్తాను. వక్కనిముషం వుండు. మనము యిద్దరమూ తిందాము. కరటకా! నీవు పరుగెత్తుకుని వెళ్లి వకవీసెడు పంచదారమితాయి పట్టుకుని రా.

మోహి——నేను మా అమ్మను అడిగి రావలెను.

రామా——నేను నిన్ను బండిలో తీసుకుని వెళ్లి మీయింటివద్ద

దిగబెట్టివస్తాను లే. తొందరపడకు. కరటకా! కదలవేమి? వేగిరము మిఠాయీ పళ్ళ్యా తీసుకుని రా.

కర—(తనలో) నాకు చావుగా వున్నది. (ప్రకాశముగా) మోహినితల్లి యింటివద్ద కనిపెట్టుకొని వుంటుంది. కూతురు వేగిరం రాకపోతే యేమిఅపాయం జరిగిందో అని ముసలిది యేడిచిపోతుంది. ఈచిన్నదాన్ని వేగిరం పంపించివెయ్యండి.

రామా— అలాగైతే యీచిన్నది సుఖంగా వున్నదని నీవు పరుగెత్తుకొనిపోయి చెప్పి రా.

కర —(తనలో) నాకు మతి పోతూ వున్నది. ఇప్పుడు యేమి చెయ్యడానికీ తోచకుండా వున్నది. తొందరపడి యేమయినా చేస్తే నాపనికి నీళ్లు వదులుకోవలెను.

[మిఠాయిపొట్లము పట్టుకొని వెంకఁడు ప్రవేశించు చున్నాఁడు.]

వెంక—. రెడ్డిగారూ! ఇదిగో మిఠాయి తెచ్చినాను.

కర—(తనలో) పీనుకూడా సమయానికే వచ్చినాఁడు.

రామా—వెంకా! పొట్లము యిలా తీసుకొని రా. ఇది మాకోసము. (అని పుచ్చుకొను చున్నాఁడు.) ఓరీ! నీవు వెళ్ళి బండి వాణ్ణి బండికట్టి సిద్ధముగా వుంచు మని చెప్పు.

వెంక — రెడ్డిగారిసెలవుప్రకారం నేను యిదివరకే చెప్పినా నండి. బండివాఁడు యెడ్లను కడుతూవున్నాఁడు.

రామా—(కరటకరెడ్డివంక చూచి) ఓరి దొంగా! నీ పన్ని యిదివరకే యేర్పాటు చేసినావు! అందుచేతనేనా నేను వెళ్ళుమంటే వెళ్ళక యేమీ యెఱుగనట్టు నటిస్తూ నిలుచున్నావు? ఎప్పుడో జరగ బోయే దంతా నీవు ముందుగానే కనిపెట్టి అన్నీ చెప్పకమునుపే జాగ్రతపెడుతూ వున్నావే! అన్నీ సరే కాని తల్లి యింటికాడ విచా

రిస్తూ వుండకుండా నీకూతురు భద్రిముగా వున్న దన్ని నీవు ముందుగా పోయి చెప్పి రావలెను. వేగిరం వెళ్ళు.

కర — ఈ వెంకణ్ణే పోయి చెప్పి రమ్మనరాదా ?

రామా — ఈపనికి వెంకడు పనికిరాడు. వెంకణ్ణి వేరేపనిమీద పంపవలెను. ఇందుకు నీవే తగినవాడవు. నీవు అబద్ధాలు మహాబాగా చెప్పగలవు. నీశక్క మఱియెవరకి రాదు. సమయోచితంగా నిమిషంలో కథ కల్పించి నమ్మేటట్టుగా నీవు బొంకుతావు. వెంకా ! నీవు పల్లెములో తమలపాకులు వేసి పట్టుకుని రా.

కర — మీరు వూరికే నన్ను స్తుతిచేస్తూ వున్నారు. ఈవెంకడు నాకంటెనూ యెక్కువఅబద్ధాలు ఆడుతాడు. వీణ్ణే పంపండి.

రామా — వీడయితే అబద్ధా లాడుతాడుకాని నీకుమల్లె నమ్మేటట్టుగా చెప్పలేడు. నీవు అబద్ధమాడినా నిజంకంటెనూ దివ్యంగా వుంటుంది.

కర — అవునుగానండి —

రామా — అవునూ లేదు కాదూ లేదు. మీరు యిద్దరూకూడా తక్షణం పొండి. (అని కన్ను లెఱ్ఱజేసి కోపపడి కేకలు వేయుచున్నాడు.)

వెంక — నేను వెళుతూవున్నాను. (అని పోవుచున్నాడు.)

కర — (తనలో) నేను కార్యం చెడగొట్టకపోతినా రెడ్డిని కాను. నీ వయితే నేను వెళ్ళిపోతాను కులకవలెనని సంతోషిస్తూవున్నావు కాని — (అని వెళ్ళుచున్నాడు.)

రామా — నీవంటి చక్కనిది భూలోకంలో లేదు.

మోహి — అయ్యా ! మీ స్తుతికి నేను తగినదాన్ని కాను.

రామా — ప్రియురాలా ! నేను చెప్పినది వాస్తవము కాని

స్తుతి కాదు. నీబుగ్గ యొక్కసారి ముద్దు పెట్టుకోనిస్తావా ?

కర — (మరల ప్రవేశించి తొందరచేత చేతిలోని తమలపాకుల పళ్లెము క్రింద పడవేయు చున్నాడు.)

రామా — ఓరి నిర్భాగ్యుడా! ఈచిన్నదాన్ని నిష్కారణముగా బెదరకొట్టినావు. పళ్లెముచప్పుడు విని వులికిపడి జడుసుకున్నది.

కర — అయ్యా — మీరు ముద్దు — కాదుకాదు — నేను పళ్లెము—

రామా — (మిఠాయిపొట్లము విప్పి, ఉండలు మోహినిచేతిలో పెట్టుచు) మోహినీ ! కూరుచో — ఓ నిర్భాగ్యుడా ! నిన్ను పోయి మోహినితల్లితో వర్తమానం చెప్పి రమ్మంటే మళ్ళీ వచ్చినా వేమి ? నీవు బుద్ధిపూర్వకంగానే పళ్లెం పడవేసినావు.

కర — లేదు లేదు. తమలపాకులు మీకు నేను స్వయంగా తీసుకురావలె నని వెంకడిని అక్కడకు పంపినాను. మిమ్మలిని చూడ గానే చెయ్యి వణకెత్తి పళ్ళెం జారి పడిపోయింది.

మోహి — (తనలో) ఈసమయంలో మావాళ్ళు యెవరయినా వచ్చి చూచిపోతారేమో అని నాకు సిగ్గు వేస్తూవున్నది.

కర — (తనలో) నేను వీరిని విడిచి వక్కనిముషం అవతలకు వెళ్ళను. యేమిచేస్తారో చూతాము.

రామా — ప్రియురాలా ! తినవేమి ?

మోహి — మీరు చేసేఆదరణచేతనూ గౌరవంచేతనూ నాకు ఆకలి కనపడడం లేదు. (అని తినుచున్నది.)

కర — (తనలో) అది మిఠాయివుండలు యేలాగు మింగుతూ వున్నదో దాన్ని చూస్తే నానోరు వూట లూరుతూ వున్నది.

రామా — కరటకా ! ఆతమలపాకులు యిక్కడ పళ్ళెములో

వుంచి యీమిఠాయివుండలు యీచిన్నదానికి అందిస్తూ వుండు.

కర—(దగ్గరకు వచ్చి పళ్లెము బోర్లించు చున్నాడు.)

రామా—ఓ నిర్భాగ్యుడా ! నీకు మతి పోయినట్టు వున్నదే. పళ్లెం బోర్లించినా వేమి? అది తిన్నగా తీసి యీమిఠాయివుండ మోహిని కందియ్యి.

కర—(పుచ్చుకొని తానే తిను చున్నాడు.)

రామా—ఓరి నిర్భాగ్యుడా ! నీకు పిచ్చి యెత్తినదా యేమి? (తనలో) దీని సౌందర్యం చూస్తే వీడికీ ఆశ కలుగుతూవున్నట్టున్నది. అయినా వీడిమనస్సు పరీక్షచేసి చూస్తాను. (ప్రకాశముగా) ఈమె సౌందర్యం వర్ణించడానికి శక్యమైనది కాదు.

కర—ఆరంభంలో అలాగే కనుపడుతుంది కాని తరువాత—

రామా—ఆమందహాసము సొగసు చూచినావా?

కర—ఆఫళ్ళు యికిలించడమా?

రామా—ఆకళ్ళఅందము కనిపెట్టినావా?

కర—చికిలికళ్ళ—

రామా—నీవంటిగుడ్డివాళ్ళ కాలాగేకనపడతవి కాని మావంటి రసికులకు—

కర—(తనలో) ఈవ్యవహారం యింకా రెండు నిముషాలు యీలాగు జరుగుతూవుంటే నాకు నిజంగానే పిచ్చి యెత్తుతుంది.

రామా—ఓ మోహినీ! నీకు ప్రియు లెంద రున్నారు?

మోహి—ఒక్కడే.

రామా — ఒక్కడేనా? అతడు మిక్కిలి చక్కనివాడ కాబోలును.

మోహి—ఆరంభంలో అలాగే కనుపడుతాడు గాని తర

వాత— ఏమయినా అంటే అతను వంటరిగా వున్నప్పుడు నన్ను కొడతాడేమో అని భయము వేస్తూవున్నది.

రామా—అతనికి నీమీద అనుమానంకూడా వున్నదా?

మోహి—ఇప్పటిస్థితి చూస్తే అదికూడా వున్నట్టే కనుపడుతూ వున్నది.

కర—ఇప్పుడు వెళ్ళి—(అని కాలు నేల తన్నుచున్నాఁడు.)

రామా—అ దేమిటి?

కర—ఏమీ లేదు. కాలు తిమ్మిరిగా వున్నది. (తనలో) ఇక నిజం చెప్పివేస్తాను.

రామా—నక్క కాలే కాదు. నీకు నళ్ళంతా తిమ్మిరిగా వున్నట్టున్నది.

[అప్పుడు వెంకఁడు పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు.]

వెంక—అయ్యో! అమ్మగారు వస్తూ వున్నారు.

రామా—యేఅమ్మగారు!రా?

మోహి—మాఅమ్మ వస్తూ వున్నదా?

వెంక—యేఅమ్మగారా? యేలినవారి భార్యాగారు. శ్యామలాంబగారు. నేను వెళుతూవుండగా అమ్మగారిబండి యెదురుగా వస్తే నేను వెనక్కు పరుగెత్తుకొని వచ్చినాను.

కర—ఇక నేను బ్రతికినాను. నాకు మళ్లీ ప్రాణాలు వస్తూ వున్నవి.

రామా—మీారు యీఆకులూ అన్నీ తీసివెయ్యండి. వేగిరం. కరటకా! సీ!పీదొడ్డితలుపు తీసి మోహినిని యింటికి పంపించివెయ్యి. (అని తలుపువద్దకు పరుగెత్తుకొని పోయి) ఈపెరటితలుపు తాళము వేసియున్నది. కరటకా! తాళంచెవి యేదీ?

కర—తాళించెవా?

రామా—అవును. తాళించెవి వేగిరం ఇయ్యి.

కర—(దేహము తడవుకొనుచు) తాళముచెవి పోయింది.

రామా—అయ్యో! ఇప్పు డేమి చెయ్యను? నాకు అసాధ్యం వచ్చినది. నాభార్య బండి దిగి వస్తూ వున్నది. కరటకా! నీ వీచిన్న దాన్ని యిప్పు డీవసారాలోకి తీసుకునివెళ్లు. నేను యెదురుగా వెళ్ళి నాభార్యను తీసుకొని వస్తాను.

కర—మంచిది.

(అని మోహినితో వసారాలోకి పోవుచున్నాఁడు.)

[అప్పుడు శ్యామలాంబ ప్రవేశింపఁగా రామాకాంతముపంతు లెదురుగా పోవుచున్నాఁడు. మోహినిని విడిచి కరటకరెడ్డి వచ్చుచున్నాఁడు.]

శ్యామ—ఓ ప్రాణేశ్వరా! మీకు తెలివి వచ్చినదా? నేను మిమ్మల్ని చూడనేమో నని యేడుస్తూ వచ్చినాను.

రామా — ఈసోది యేమిటి? నీవు ఇప్పుడు పడిపోయినట్టు వంటిరిగా యెందుకు వచ్చినావు?

శ్యామ—మీరు దాచబోకండి. మీకథంతా నేను విన్నాను సుమా!

రామా—(తనలో) మోహినిమాట యెవరూ చెప్పలేదు గద. (ప్రకాశముగా) కథంతా విన్నావా? ఏకథ విన్నావు?

శ్యామ—తాచుపాముకాటు బ్రతికినా చచ్చినా నాలుగు ఝాములలో తెలుస్తుంది. నాకు భూమిలో పసుపూ కుంకమూ పెట్టుకొని అయిదోతనం చెయ్యవలసినయోగం వున్నది గనుక నాపుణ్యం చేత మీరు సజీవులయి తేరుకున్నారు. మీరు చెప్పకపోయినా నాకు యీవుత్తరం చెప్పినది. (అని వుత్తరం చేతి కిచ్చుచున్నది.)

రామా—(ఉత్తరము పుచ్చుకొని చదువుచు) ఎవడురా యీ వుత్తరం వ్రాసినదుర్మార్గుడు? నాకు రాత్రి తోటలో తాచుపాము కరిచిందట! నేను స్పృహ తెలియకుండా పడివున్నానట! నేను బ్రతుకుతానో లేదో తెలియదట! దీనికింద దస్కతు లేదు. కరటకా! యీదస్తూరీ యెవరిదో నీవు చెప్పగలవా? (అని చూపుచున్నాడు.)

కర—ఈదస్తూరీ నాకు యెంతమాత్రమూ తెలియదు. ఇది క్రొత్తవ్రాత. (తనలో) తన పెళ్ళాముతో యీయన తిరగడానికి వేగలేక గుమస్తా భీమారావూ నేనూ కలిసి వ్రాసినవుత్తరం వూరికే పోలేదు. తగినపని చేసింది.

శ్యామ—ఇది దొంగవుత్తర మయినందుకు నాకు సంతోషంగా వున్నది. మీ కేమీ తొందర కలుగలేదు గదా?

కర—పాముకాటు మహాచెడ్డది. దానివల్ల యెంతఅపాయమయినా వున్నది. ఈయన యెప్పుడూ భార్యను విడిచి వంటిగా వుండకూడదు.

శ్యామ—నీవు కూడావున్నతరువాత భార్యలేనిలోపం వుండదు. ఇటువంటిది ముందు యెప్పుడయినా మళ్ళీ తటస్థిస్తే నాకు ముందుగా వర్తమానము పంపుమా.

కర—తప్పకుండా పంపుతాను. ఇక నాలుగురోజులకు తటస్థమవుతుందనగానే మనిషిని పంపుతాను.

రామా—అయినదానికి విచారించిన కార్యము లేదు. మనము లోపలకు వెళుదాము రా. (కరటకరెడ్డితో రహస్యంగా) మేము వెళ్లగానే మోహినిని అవతలికి పంపివెయ్యి.

శ్యామ—నాకు చెమట పట్టింది. లోపలికి రాను. కొంచెము సేపు చల్లగాలికి యీవసారాలో మల్లెపందిరిదగ్గిర కూర్చుంటాను.

నా మల్లిచెట్టుకు రోజూ నీళ్లు పోయిస్తూవున్నారా?

రామా—వసారాలోకా?

శ్యామ—వసారాలోకే వెళుతాను.

రామా—(కరటకశాస్త్రితో రహస్యంగా) నీ వేదో మాయోపాయం కల్పించి బొంకవలెను. తక్షణం యేదో అబద్ధం కల్పించి నామానం దక్కించు.

కర—అమ్మా! వసారాలో యెవరున్నారో మీకు తెలియదు. నన్ను క్షమించవలెను.

శ్యామ—వసారాలో యెవరున్నారు? నిన్ను క్షమించడానికి యేంనేరం చేసినావు?

కర—ఒక చక్కనిచిన్నదాన్ని నేను తీసుకువచ్చి—

రామా—(తనలో) వీడు నాగుట్టు బయలపెడుతూ వున్నాడు-

శ్యామ—ఏమీ! నేను లేనిసమయంలో నాయింటికి ఆడదాన్ని తెచ్చినావా?

రామా—(కోపముతో) చక్కనిచిన్నదాన్నా! కానీ చెప్పు చెప్పు.

కర—నేను చెప్పేది చివరిదాకా వినండి. నాకు చెప్పడానికి సిగ్గు వేస్తూవున్నది. మీయిద్దరికీ కోపం తెప్పించడానికి కారణమయిన అనిర్దోషురాలు నా పెళ్ళాము.

రామా—నీభార్యా?

శ్యామ—నీపెళ్ళామా?

కర—అవును నా పెళ్ళామే. పంతులుగారు మీనిమిత్తమయి మంచిదాసీని కుదుర్చుమని నాతో చెపితే నా పెళ్ళాము పెద్దమనిషీ వళ్లువంచి పనిచేసేద్ అని తీసుకుని వచ్చినాను. అమ్మగారు కొన్నాళ్లు

చూచి తమమనసు వచ్చినట్టు పనిచేసేదని తోస్తే జీతం నిర్ణయించి భార్యాభర్తల నిద్దరినీ పోషించేభారమే మీది.

రామా—(తనలో) వీడు బహుబాగా బొంకినాడు. ఇందులో వీడు చెప్పినది వక్క్రతురమయినా నిజం కాదనడానికి లేశమయినా అవకాశము లేదు.

శ్యామ—నాకోసము శ్రమపుచ్చుకొని మీరు దాసీనిమిత్తమయి యింతప్రయత్నం చేసినందుకు నాకు సంతోషంగా వున్నది. కరటకా! యేదీ నీభార్యను నాకు చూపించు.

కర—రండి వెళ్ళి చూతాము.

(కరటకరెడ్డియు శ్యామలాంబయు పోవుచున్నారు.)

రామా—ఔరా! రెడ్డీ! యెంతచక్కగా బొంకనావురా? నాకదివరకు నిజం తెలిసివుండకపోయినట్టయితే చెప్పినదంతా నేనూ నమ్మేదును. వీడు నిముషంలో ఆకోస్త్రదాన్ని పెళ్ళాముగా మార్చివేసినాడు. యెలాగయినా యీ అపూర్వవివాహంవల్ల మాదంపతులకు కలహం తప్పిపోయింది. నేటికి నేను బ్రతికినాను.

[శ్యామలాంబ ప్రవేశించుచున్నది.]

శ్యామ—నేను మన రెడ్డిపెళ్ళామును చూచినాను. దానివద్ద వినయమూ తెలివీ కావలసినంత వున్నవి. అది శూద్రదయినా యెంతో చక్కగా మాటాడినది. దాని కపటంలేనిమాటలు వింటే నాకు బహుసంతోష మయినది.

రామా—అది నీమనసుకు నచ్చినదిగద?

శ్యామ—చివరకు నాకు మంచిదాసీ దొరికింది. మన రెడ్డి దాని మీద ప్రాణములు విడుస్తూ వున్నాడు. మొగుడూ పెళ్ళామూ యిద్దరూ మనయిల్లు కనిపెట్టుకు వుంటారు. వాళ్ళ అనురాగమూ

ఐకమత్యమూ చూస్తే నాకు ముచ్చటవుతూ వున్నది.

రామా—(తనలో) వాడు యెంతసేపటికీ కదలి రాకుండా వున్నాడు. దొడ్లో దానితో యేమి చేస్తూ వున్నాడు?

శ్యామ—యీఅద్దంలో వాళ్లు కనుపడుతూ వున్నారు. మన రెడ్డి పెళ్ళామును యెలా ముద్దు పెట్టుకుంటూ వున్నాడో?

రామా—పట్టపగలు ఆడదాన్ని వాడలాచెయ్యడం నీకు యిష్టముగా వున్నదా?

శ్యామ—మొగుడు పెళ్ళామును ముద్దుపెట్టుకుంటే అందులో తప్పేంవున్నది?

రామా—తప్పితం లేదుగాని నేను వక్కమాటు కరటకరెడ్డిని కూకలు వెయ్యవలెను. నీ వవతలకు పో.

శ్యామ—పెళ్లామును ముద్దుపెట్టుకొన్నందుకు కాదుగద?

రామా — అందుకోసముకాదు. మరొకందుకు కూకలు వేస్తాను.

శ్యామ—ఆలాగైతే నేను లోపలికి పోయి వాళ్లు కాపురం వుండడానికి దంపుళ్ళగది చోటుచేయించి వస్తాను. (అని వెళ్లుచున్నది.)

[అప్పుడు కరటకరెడ్డి ప్రవేశించుచున్నాడు.]

రామా—అప్పుడే మీరు రావడానికి తీరుబడి అయిందీ? యింతవేగిరం దయచేశారేమి?

కర—(శ్యామలాంబకు వినబడునట్లు బిగ్గరగా) క్షమించండి నాభార్యతో—

రామా—(మెల్లగా) నీభార్యా?

కర—అవును నాభార్యా. అమ్మగారు దాన్ని తమపనికత్తెగా వుంచుకోవడానికి వప్పుకున్నారుగనుక, ఆమెవద్ద యెలాగు నడుచుకో

వలెనో: దానికిబుద్ధి చెప్తుతూ వున్నాను. మీరుమెరుగుదురుగదాండి—

రామా—నీవు వట్టిఝూటాకోరువని నేను యెరుగుదును. ఇలాగంటి పనులు చెయ్యకుండా నిన్ను గుర్రపుకొరడాతో వీపు బద్దలుకొట్టవలెను.

కర—ఈపరియాచకం బాగానే వున్నది.

రామా — బాగానే వుంటుంది. తెలివితక్కువదాన్ని చేసి నీ వాచిన్నదాన్ని చెరపడానికి చూస్తూవున్నావు. మాయింట్లో యిటు వంటినీతిమాలినపనులు యెంతమాత్రమూ పనికిరావు.

కర—దైవముతోడు ! నిజముగా: అది—

రామా—నావద్ద నీఅబద్ధపుప్రమాణాలు గిమాణాలు సాగవు. నీ వాచిన్నదాన్ని యెందుకు ముద్దుపెట్టుకున్నావో చెప్పు.

కర—(తనలో) యెవరూలేనప్పుడు నేను రహస్యంగా ముద్దు పెట్టుకున్నసంగతి యితనితో యెవరుచెప్పినారో ఓయిదేవుడా ! ఇక్కడ గోడలకుకూడా చెవులు వున్నవికదా ?

రామా—నీవు మళ్ళీయేదో పెద్దఅబద్ధమాడడాని కాలోచిస్తూ వున్నావు. నీమాటలకు నేను మోసపోను.

కర—నేను అబద్ధం యెంతమాత్రమూ ఆడను. నిజంగా నేను మోహినిని ముద్దుపెట్టుకున్నాను. మీరు నమ్మినాసరే నమ్మకపోయినా సరే నిజం చెప్పినాను.

రామా—యెందుకు పెట్టుకున్నావు ?

కర—మీకోసమే ముద్దుపెట్టుకున్నాను. అమ్మగారిమనస్సులో మీయందువుండే అనుమానం పోగొట్టడానికి నే నాపనిచేసినాను. నేను చేసినపని మీ క్షేమంనిమిత్తమేకాని నానిమిత్తంకాదు. సేవకులు యజమానులనిమిత్తమయి యెంతపని చేసినా వారికి మెప్పు కనుపడదు.

రామా—ఆముద్దు నాకోసంకాకుండా నీ కోసమే పెట్టుకున్నావని నాకు యిప్పటికీ అనుమానము బాధిస్తూనే వున్నది. అదుగో మోహిని యిలాగే వస్తూ వున్నది. నేను లోపలికిపోయి యీతలుపు కంతలోనుంచి మీయిద్దరిచర్యలూ కనిపెడుతూవుంటాను. నీవు నన్ను మోసం చెయ్యలేవు.

కర—అయ్యో! మోహిని వకవేళ వచ్చి మోహించి నన్ను యేమయినాచేస్తే అదీ నాతప్పితమేనా? ఆడవాళ్లు వచ్చి యెదుట నిలవబడ్డప్పుడు మగవాళ్లు మనసుపట్టలేరు. మీవిషయంలో నాశాయశక్తులా పనిచేస్తానుగాని వకవేళ ఆచిన్నది తనంతట వచ్చి నన్ను—

రామా—దానికి ఫర్వాలేదు. నీవుమాత్రం మళ్లీ యెప్పుడూ ముద్దు పెట్టుకోకూడదు. యీసారి నీవు మళ్లీముద్దుపెట్టుకున్నట్టయితే నిన్ను గుర్రపుకొరడాతో బాదగొట్టి మాయింట్లోనుంచి సాగనంపుతాను. (అని లోపలికి పోయి తొంగి చూచుచున్నాడు.)

[మోహిని ప్రవేశించుచున్నది.]

మోహి.—ఆమె బహుదొడ్డయిల్లాలు. యిక మనరహస్యం మానివేసి మనం యిక్కడ సుఖంగా వుండవచ్చును.

కర—మెల్లిగా మాట్లాడు! మెల్లిగా. (తనలో) ఇది యెంత సౌంజ్ఞచేసి చెప్పినా మెల్లిగా మాట్లాడకుండా వున్నది. నేను జవాబు చెపితే నాపని పోతుంది. చెప్పకుండా వుంటే పళ్లాము పోతుంది. నాకంతా అసాధ్యంగానే వున్నది.

మోహి—నీవు నామొగుడవని నే నిప్పు డందరితోనూ చెప్పవచ్చును.

కర—(నవ్వుచు) నీమొగుడా! ఈరహస్యం కొంచెముసేపు చాలించు. అది యెల్లప్పుడూ పనికిరాదు.

మోహి—నీవు నాకు మొగు డవటమే హాస్యమా?...ఇన్నాళ్ళ నుంచీ మనం మొగుడూ పెళ్లామూ కావడమంతా యిప్పుడు హాస్యమయిపోయిందీ? (అని మొగమునకు కొంగడ్డము పెట్టుకొనుచు) మంచిది యిప్పుడు నీవు నన్ను విడిచిపెడితే నాకు మొగుళ్లు దొరక్కపోరులే. నాకు యీలాగంటిమొగుళ్ళు లక్షమంది దొరుకుతారు. నీవు వదలిపెడితే రేపుయీపాటికి నేను విధవావివాహం చేసుకుంటాను చూడు.

కర—(తనలో) నేను యిప్పుడు దీన్ని సముదాయించకపోయినట్టయితే కార్యం చెడుతుంది. (తనయజమానుఁడాగదిలో నున్నాఁడని సైగచేయుచు మెల్లగా) నేను నీపెనిమిటినే, అందుకు సందేహాము లేదు. కాని నాయజమానుడు—నేమి స్వతంత్రిస్త్రీ. అయితే—క్షమించు తెలిసిందా?

మోహి—నాకు తిన్నగా తెలిసిందికాదు కాని వక్కముద్దు పెట్టు క్షమిస్తాను.

కర—(తలుపుకేసి చూచి తనలో) నేను చొరవచేసి వక్కముద్దు పెట్టుకుంటాను.

మోహి—యేమి యింకా ముద్దుపెట్టుకోవడానికే అనుమానిస్తూ వున్నావేమి? పోనీ! నేను యిప్పుడు పోయి నీదుర్మార్గ మంతా అమ్మగారితో మనవిచేస్తాను.

కర—ఓభగవంతుడా!

మోహి—నేను పంతులుగారితోకూడా చెప్పుతాను. ఆయన బహుదొడ్డవాడు. నీవలె నన్నాయన అనాదరణ చెయ్యడు.

[శ్యామలాంబ ప్రవేశించును.]

శ్యామ—ఏమిటి?మీలోమీరప్పుడేతగవులాడుతున్నారా?

కర—అమ్మా! తప్పితం దానిదికాని నాది కాదు.

మోహి—అమ్మా! తప్పితమంతా ఇతనిదే. నేను తనకు ముద్దియ్యబోతే పుచ్చుకున్నాఁడుకాఁడు.

శ్యామ—యేమిటి! పెళ్ళాము ప్రేమతో ముద్దుయిస్తే పుచ్చుకున్నావుకావా? ఏది ఇప్పుడు నాయెదుట ముద్దు పెట్టుకో.

కర—(తలుపు కేసిచూచి) యిఖ నాతప్పితం లేదు. (అని ముద్దు పెట్టుకొని) మోహినీ! జరిగిపోయినది మరిచిపో. యిఖ నేను నీవుచెప్పి నట్టు వింటాను.

రామా—(తలుపు తీసికొనివచ్చి కోపముతో) నేను యింత దూరము చెప్పినా నిర్భయంగా నీవు మళ్ళీ ముద్దు పెట్టుకున్నావుగా!

మోహి—అయ్యా! నాపెనిమిటిమీద కోపపడకండి.

రామా—(తనలో) పెనిమిటా? ఇదికూడా హాస్యానికన్న మాటే నిజం చేస్తూవున్నదే. (ప్రకాశముగా) నేను యిప్పుడు వీడిపని తీసివేస్తాను.

శ్యామ—మీరు నిష్కారణంగా పని తీసివెయ్యకూడదు.

రామా — నిష్కారణంగా కాదు. కావలసినంతకారణం వున్నది. ఆకారణ మేమో రెడ్డికే తెలుసును.

కర—నాకా? నాకు యేకారణమూ తెలియదు.

రామా—నీకు కారణమేమీ తెలియదు గా?

శ్యామ—రెడ్డీ! నీవు మారుమాట యేమీ చెప్పవద్దు. మీ దంపతులు యిద్దరూ దంపుళ్ళగదిలోకి పొండి. నేను తరువాత ఈయనను సమాధానం చేస్తాను.

మోహి—రెడ్డీ! వెళ్ళుదాము రా.

శ్యామ—మీరు నిజముగానే వీళ్ళను పంపించివేస్తారా?

రామా.—నేనుకాదు. నీవే పంపించి వేస్తావు. నిజం చెప్పవలసి నట్టయితే వాళ్ళిద్దరూ మొగుడూ పెళ్లాలు కారు.

శ్యామ—కారా ?

రామా.—కారు.

మోహి — (మగనితో) మనం వివాహ మయినసంగతి యీాయనకు తెలియనేలేదా ?

కర—వూరుకో.

శ్యామ—నా క్షేమాయ తెలియకుండావున్నది. వాళ్ళిద్దరూ కూడా బహుమంచివాళ్ళుగా కనపడుతూవున్నారే.

రామ—పయికి మంచివాళ్ళుగానే కనపడుతూ వున్నారు. వాళ్లు నిజంగా భార్యాభర్తలయితే వాళ్ళను వెళ్ళగొట్టడానికి నాకు మాత్రం యిష్టం వుంటుందా ?

కర—మేము పెళ్ళిచేసుకున్న మొగుడూపెళ్ళాల మయినమాట నిజమయినట్టయితే మమ్మలిని వెళ్ళగొట్టడం మీాకు యిష్టం లేదుగద ! అలాగయితే దీనినిజమంతా ఆ వచ్చేశాస్త్రుర్లుగారు చెపుతారు. ఆయ ననుఅడగండి.

[అప్పుడు సోమభట్లు ప్రవేశించు చున్నాడు.]

రామా—అయ్యా ! సోముభట్లుగారూ ! నమస్కారము. మీారు యేంపనిమీాద వచ్చినారు ?

సోమ—ఈరోజున మీాతండ్రిగారి తిథిప్రయోజనము. నిన్నటి రాత్రినుంచీ మీాకోసం తిరుగుతూవుంటే మీాదర్శన మయిందికాదు. వుదయమైనతరువాత నాలుగుమాట్లు యిక్కడకు వచ్చినాను. మీారు వంటిఘంటవఱకూ యింటికే రాలేదు.

రామా—అవును మా ఆడవాళ్లు వూళ్ళో లేకపోవడంచేత

మాబంధువుల యింట్లో భోజనం చేసినాను. మీరు యీసంగతి యెక్కడా చెప్పబోకండి. అంతగా కావలిస్తే తద్దినం రేపువుదయాన్న పెడుదాము.

సోమ—చిత్తము. అలాగే కానిత్తాము. నాకు నాలుగు రోజులలో తూర్పు వెళ్ళవలసినపని వున్నది. వెళ్ళితే నాలుగునెలల దాకా రానండి. ఈలోగా తమలోపలవచ్చేకార్యాలు మరియేమీలేవు.

శ్యామ—ఏమయ్యా బ్రహ్మడా! నీకు వూరికి వెళ్ళవలసినపని వున్నదని యింతకక్కుర్తిపడుతావు? మామామగారుపోయింది వైశాఖ మాసమయితే యీచైత్రమాసంలో తద్దినం యేలాగువస్తుందయ్యా?

సోమ—అమ్మగారు! కోపపడకండి. నేను పంచాంగం పొరపాటుగా చూచినాను కాబోలును. మళ్ళీవెళ్ళి తద్దినాలజాబితా తిన్నగా చూచి వస్తాను. (అని పోబోవుచున్నాడు.)

కర—(ఆపి) అయ్యా! మీరు మాయిద్దరికీ పెళ్ళిచేయించిన సంగతి యీయనతో వక్కసారి చెప్పి మరీపొండి.

సోమ—అవును. అందులో యేమితగాదా వున్నది? నేను మంత్రాలు తిన్నగా చెప్పలేదని యెవరయినా ఆక్షేపణచేసినారా యేమిటి? శూద్ర పెళ్ళి పురాణోక్తం గనుక మంత్రా లక్కరలేదు.

రామా—వీళ్ళకు మీరు పెళ్ళి యెప్పుడు చేయించినారు?

సోమ—రెండుసంవత్సరాలకిందట చేయించినాను.

రామా—కరటకా! నీవు రెండుసంవత్సరాలనుండి గృహస్థువై వుండిన్నీ నావద్ద బ్రహ్మచారివిగానే నటించినావా?

కర—నేను వూరికే బ్రహ్మచారిగా నటించడం మాత్రమేకాని నిజానికి సంసారసుఖాలన్నీ అనుభవిస్తూనే వున్నాను. లోకంలో అనేకులు పేరుకు గృహస్థులమని నటిస్తూవున్నా మీదయవల్ల సంసార

సుఖంలేకుండా నిజమయినబ్రహ్మచారులుగానే వున్నారు. ఆసంగతి దేవరవారికే విశదము.

రామా — ఆసంగతి నీవు చెప్పనక్కరలేదు. నీవు దీన్ని పెళ్లాడినమాట నిజమేనా !

కర — నిజమే. ముమ్మాటికీ నిజమే.

రామా — అన్నీ అబద్ధాలాడేవాడవు నీవు యిందులో మాత్రం నిజం చెప్పివుంటావా ?

కర — యీవేళ నేను నిజం చెప్పడానికి ఆరంభం చేసినాను. దేవరవారు నేను యిఖ గృహస్థబ్రహ్మచారినిగా వుండనలసిన ఆవశ్యకం లేకుండా చేస్తే నేను నేటినుంచి సత్యహరిశ్చంద్రుణ్ని అవుతాను.

రామా — కరటకా ! ఇందాకటి నీఅవస్థలు తలుచుకుంటే నాకు నవ్వు వస్తూ వున్నది. ఇప్పుడు జరిగినదంతా మఱిచిపోయి మీరు యిద్దరూ యిఖ మాయింట్లో సుఖముగా వుండవచ్చును. నేను యిఖ ముందు నీవు చెప్పిన గృహస్థబ్రహ్మచారులను నిజమైనగృహస్థులనుగా చెయ్యడానికే ప్రయత్నంచేస్తాను. లోపలికి పోదాము రండి.

కర — అలాగయితే మాకు యిదివరకు జరిగినవివాహం వివాహంకాదు. ఇప్పుడు మీరు జరిగించినదే వివాహము. నాబ్రహ్మచర్యం వదలి మీదయవల్ల నేను యిప్పుడు నిజమయిన గృహస్థు నవుతూ వున్నాను.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి

# విచిత్రవివాహప్రహసనము.

## ఇందు వచ్చుపాత్రములు.

ధనకోటిరాజుగారు—హైకోర్టువకీలు.

వేంకటపతిరాజు—ధనకోటిరాజుగారిఅన్నకుమారుఁడు.

తిమ్మయ్య—ధనకోటిరాజుగారిభటుఁడు.

మోహినీదేవి—రతిసుందరిమేనత్త.

రతిసుందరి—మోహినీదేవిమేనకోడలు.

---

రంగము—చెన్నపట్టణము. ధనకోటిరాజుగారి కచేరీగది.

[వ్రాఁతబల్లవద్ద కూరుచుండి వేంకటపతిరాజు ప్రవేశించుచున్నాఁడు.]

వేంక—(బల్లమీఁది కాగితములును కలములును క్రింద త్రోసివైచి కోపముతో) వెధవపని. నేను యిఖ యీపని చూడను. యెన్నిమాట్లు అడిగినా చిన్నాయన పెళ్ళికి యిప్పుడేమితొందర వచ్చిందంటాడు. నాకు యిప్పుడు యిరవైయేళ్లు కావచ్చినవి; బియ్యే ప్యాసయినాను. ఇంకా యెన్నాళ్ళు బ్రహ్మచర్యం చేస్తాను? చిన్నాయన వచ్చినతరువాత యీమాటు స్పష్టంగా అడిగి, పెళ్ళి చెయ్యానంటే దేశాంతరం లేచిపోతాను. గుమాస్తా లేకుండా యీబండపని నేను చేస్తూ కూర్చుంటానా? (అని కలము క్రిందవేసి కొట్టుచున్నాఁడు.)

[ఇంతలో ధనకోటిరాజుగారు ప్రవేశించుచున్నారు.]

ధన—ఓరినిర్భాగ్యుడా! కాగితాలన్నీ ఆలాకింద వేసినావేమిరా?

వేంక—నేను యీపని నేర్చుకోను. నాకు స్త్రీదరీపనియందు యిష్టము లేదు.

ధన—నీవు వట్టికోతివి. నీకు యేపనియందూ యిష్టం లేదు.

వేంక—నీవు నాచేత ప్రొద్దున్న మొదలుకొని సాయంత్రం దాకా వట్టివెట్టిపని చేయిస్తావు. నేను చెయ్యలేను.

ధన—పనిపాటలు లేకుండా వూరికే సోమరిగా కూర్చుండి భోజనం చెయ్యగలవా?

వేంక—ఇదివరదాకా చూచినట్లు నన్ను యిఖ పిల్లవాణ్ణిగా చూస్తే పనికిరాదు. నేను యిప్పుడు పెద్దవాణ్ణి అయినాను.

ధన—అయితే యేమంటావు?

వేంక—నేను మీ అన్నగారి కొడుకును గానా?

ధన—అయితే?

వేంక—అయితే గియితే అంటే పనికిరాదు. నేను అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పండి. మీదగ్గిర డబ్బు వున్నదా లేదా?

ధన—ఇప్పుడు నా డబ్బుసంగతి నీ కెందుకు?

వేంక—నన్ను మళ్ళీ ప్రశ్నలు వెయ్యక నేను అడిగినప్రశ్నకు వుత్తరం చెప్పండి. మీరు భాగ్యవంతు లవుదురా కారా? జవాబు చెప్పండి.

ధన—(కోపముతో) నేను భాగ్యవంతుణ్ణి కాను. నీకు యిప్పుడు కావలసింది యేమిటి?

వేంక—నాకు కావలసిందా? మొట్టమొదట మీరు మీఆఫీసు పని చూడడానికి వేరే గుమాస్తాను పెట్టుకోండి. అటుతరువాత మీ ఆస్తిలో నాకు భాగం పంచిపెట్టండి.

ధన—నాది స్వార్జితం. నీకు భాగం యెట్లా వస్తుంది?

వేంక—ఈమధ్య హైకోర్టువారు ప్లీడరీవుద్యోగంవల్ల సంపాదించినదానిలో భాగం వస్తుందని తీర్పుచేసినారు.

ధన—(తనలో) వీడు సామాన్యుడు కాడు. (బిగ్గరగా) పని చేసినందుకు నీకు మంచిజీతం యిస్తానులే.

వేంక—జీతమా? వెధవజీతం. నీవు జీతం యివ్వకపోతే నాకు అన్నానికీ బట్టకూ జరగదా?

ధన—అన్నమూ బట్టాకంటె నీకు యింకా యేమి కావలెను?

వేంక—యేమికావలెనా? నాకు పెళ్ళాము కావలెను.

ధన—(ఉలికిపడి) ఏమికావలెనూ?

వేంక—పెళ్ళాము.

ధన—పెళ్ళామా?

వేంక—అవును. పెళ్ళామే. నాకు పెళ్లయినా చెయ్యండి. లేకపోతే నేను గృహస్థాశ్రమంలో ప్రవేశించి సుఖజీవనం చెయ్యడానికి తగినంత సొమ్మయినా యివ్వండి.

ధన—నీకు పెళ్ళికి సొమ్ము యివ్వవలెనుగా?

వేంక—నేను పెళ్ళాడడం మీకు యిష్టం లేదా?

ధన—(కోపదృష్టితో) లేదు. లేదు. ముమ్మాటికీ లేదు.

వేంక—అలా కోపపడడం మీకు ధర్మం కాదు.

ధన—ఓరి దౌర్భాగ్యుడా! నీకప్పుడే భార్య కావలెనేమి? భార్యను యేమిచేసుకుంటావు? నాభార్యా పోయి అంతకాల మయింది. నేను మళ్ళీ భార్యాను చేసుకోలేదు. భార్యా! ఆమాట తలుచుకుంటే నాకు భయం వేస్తూ వున్నది.

వేంక—భార్యా అంటే భయమా? సంతోషమని మీ అభిప్రాయం కాబోలును. ఇంట్లో భార్యా వుంటే యెంతసంతోషంగా

వుంటుంది.

ధన— సంతోషం గాదు దుఃఖంగానే వుంటుంది. ఇదంతా నేను స్వానుభవంచేత చెపుతూ వున్నాను. ఆడవాళ్ళు బహుగయ్యాళి వాళ్ళు. భార్యా రావడం అనేఆపద పగవాడికయినా కోరకూడదు. పిల్లవాళ్ళూ బుద్ధిహీనులూ తప్ప మరియెవరూ పెళ్ళి కావలెననికోరరు.

వేంక—మీరాలుబ్ధత్వంచేతనే బ్రతికివున్న కాలంలో మాపిన్ని గయ్యాళిదయి పోయింది. దాన్నిబట్టి ఆడవాళ్లందరూ గయ్యాళివాళ్లనడం న్యాయం కాదు. ఇప్పుడు మీరు స్త్రీలు మంచివాళ్లు కారని యెంతదూషిస్తూవున్నా, మీరుకూడా యెప్పుడో స్త్రీలవలలో పడి పెళ్లి కావలెనని కోరేకాలం వస్తుందికాని రాకపోదు లెండి.

ధన—నేను పెళ్లి కావలెనని కోరేకాలమా? యెన్నటికిన్ని రాదు. నేను భార్య కావలెనని కోరేటంత గాడిదనయితే, అప్పుడు నేను నీకు—

వేంక—అప్పుడు నాకు యేమి యిస్తారు?

ధన—ఏమయినా యిస్తాను.

వేంక—ఇరవైవేలరూపాయలు యిస్తారా?

ధన—తప్పకుండా యిస్తాను.

వేంక—నాకేనా?

ధన—నీకే యిస్తాను.

వేంక—అన్నమాట తిరిగిపోకూడదు సుమండీ.

ధన—నేను యెప్పుడూ తిరిగిపోను.

వేంక—చేతులో చెయ్యి వెయ్యండి.

ధన—ఇదుగో వేస్తాను.

(అని చేతిలోచేయి వేయుచున్నాడు.)

వేంక—అలాగయితే నేను వివాహం కావడం మీకు బొత్తిగా యిష్టం లేదా?

ధన—ఎంతమాత్రమూ యిష్టము లేదు. అయినా ఆలోచించి చెప్తాను. వక్క నిముషం తాళు. (ఆలోచించి) వక్కలాగైతే నీవివాహానికి నేను యిష్టపడుతాను.

వేంక—(ఆనుతో) ఎలాగయితే పడుతారు?

ధన—నీవు వివాహమాడబోయే చిన్నది యిరవై వేలరూపాయలు అరణం తీసుకుని వచ్చేదయితే నేను ఇష్టపడుతాను. ఇక యిప్పటి క్రపసంగం చాలించి, నేను ఘంటసేపట్లో మళ్ళీ వస్తాను. అందాకా పని చూస్తూవుండు. (అని వెళ్ళుచున్నాడు.)

వేంక—యింత నడివయస్సులో స్త్రీలవిషయమయి యితని మనస్సు చలించకుండా వుండడంచూస్తే, యితణ్ని సృష్టించేటప్పుడు బ్రహ్మదేవుడు యితనిహృదయం రాతితోనో యినుముతోనో చేశాడని తోస్తుంది. ఓరతిసుందరీ! నాపినతండ్రిప్రతిజ్ఞ విన్నట్టయితే నీవు యెంత విచారిస్తావో! ఓహృదయేశ్వరీ! నేను యేమిచెయ్యను? అతని యిష్టం లేకుండా నిన్ను నేను యెలాగు పెళ్ళిచేసుకోగలను? (అని లేచి యిటు నటు తిరుగుచు) యెవరోవస్తూవున్నారు. యెవరయి వుందురు? (కిటికిలోనుండి చూచి) ఆమే. అవును. కాదు. ఆమెకాదు. అవును. ఆమే. ఆవచ్చేది తప్పకుండా రతిసుందరి మేనత్త అయిన మోహినీదేవే. యీామె రతిసుందరికి తండ్రి తోడబుట్టిన దయినా, మంచిస్వభావంగలది గనుక మేనకోడలి సౌఖ్యంనిమిత్తమయి యేకష్టాలయినా పడుతుంది. (అని తలుపువద్దకు వెళ్లి) మోహినీదేవీ! అమ్మా! లోపలికి రా.

[అప్పుడు మోహినీదేవి ప్రవేశించుచున్నది]

మోహి—(మెల్లగా) మీాపినతండ్రిగారు యెక్కడ వున్నారు?

వేంక—ఆగదిలో యేదో జమాబందీ చూచుకుంటూ వున్నారు.

(అని చూపుచున్నాడు)

మోహి—అలాగయితే మనకార్యం మనం వేగిరం చూచుకోవలెను. నీవన్న ప్రకారంగా నీవీవేళ యెందుకురాలేదో తెలుసుకుని రమ్మని రతిసుందరి నన్ను పంపినది.

వేంక—అయ్యో! మోహినీదేవీ! నాకు బహువిచారంగా వున్నది. రతిసుందరీ! నాప్రియురాలా! యీవార్త వింటే నీ వెంతదుఃఖిస్తావో కదా? యీవేళ అంతా ఫరిష్కారమయింది. రతిసుందరీ నేనూ సుఖపడేయోగం దాటిపోయింది.

మోహి—ఎందుచేత? నీమాటలతాత్పర్యం యేమిటో నాకు తెలియకుండా వున్నది.

వేంక—మాచిన్నాయన యిప్పుడు నా పెళ్లికి వప్పుకున్నాడు కాడు.

మోహి—ఎందుచేత? అతనికి యిన్నియేళ్లువచ్చినా వివేకం లేకుండా కేవల పశువుగా వున్నాడే. తాను పెళ్లాడలేదని అందరికీ పెళ్లి అక్కరలేదంటాడా?

వేంక—మాచిన్నాయన తాను యెవరో అయితేనేకాని పెళ్లాడడం తటస్థించదన్నాడు. ఆపేరుమాత్రం నేను నీతో చెప్పను.

మోహి—నేను మీచిన్నాయనకు, భార్యను అయి వున్నట్టయితే అతన్ని నేను చెప్పినట్లల్లా వినేట్టుచేసి నిముషంలో యీయభిప్రాయమంతా మార్చివేస్తును.

వేంక—ఇందాకా చాలాసేపు ఆయనకూ నాకూ వివాహం విషయమయ్యే ప్రసంగం జరిగినది. ఆప్రసంగంలో నేను మాచిన్నాయనతో మీకు యిదివరకు స్త్రీలవిషయంలో కలిగిన అసూయ అంతా

విడిచిపెట్టి యెప్పుడో వకప్పుడు మీరుకూడా పెళ్లిఆడుతారని అనే టప్పటికి, మాచిన్నాయనగారు, తానటువంటిగాడిద కావడం తటస్థిస్తే పెళ్లిరోజుననే నాకుయిరవై వేలరూపాయలుయిస్తానని పందెంవేసినారు. నీకు యిప్పుడు ముప్ఫయియేళ్లయినా నిండాలేవు. నీవు యేవుపాయం చేతనైనా మాచిన్నాయనగారిమనస్సు చలింపచేసినట్టయితే, ఆయన ఖజానాలోనుంచి యిరవైసంచులు కదిలి నాచేతులోకి వస్తవి.

మోహి—రతిసుందరియొక్క సౌఖ్యంనిమిత్తం నన్ను యేమి చెయ్యమన్నా చేస్తాను. దానికి తల్లి నాలుగోయేట పోయినది. ఎనిమిదేళ్లు వచ్చేటప్పటికి దానితండ్రి నాఅన్నగారుకూడా హైకోర్టువకీలుగా వుండి కాలంచేసినారు. నాఅన్నగారు పోయేటప్పటికి నాకు పద్దెనిమిదేండ్లుమాత్రమేవున్నా, తల్లిదండ్రులు లేనిబిడ్డ అని దానిసంరక్షణ నిమిత్తమే నేను వివాహంకూడా మానివేసినాను. దానికి యిప్పుడు పదహారేళ్ళువున్నవి. మీచిన్నాయనను మోహపుచ్చడం యెంతప్రయాసమయినపని అయినా, మా రతిసుందరికీ నీకూ వివాహం సంఘటనచెయ్యడానికి యెన్నిపాట్లయినా పడుతాను.

వేంక—ప్రయత్నంమాత్రం చెయ్యి. నీవు నిజంగా నాపినతండ్రిని పెళ్లిచేసుకోనక్కరలేదులే.

మోహి—నాఅన్నగారికిన్నీ నీపినతండ్రికిన్నీ పూర్వం చాలంస్నేహంసుమా. వారిద్దరూ బాల్యస్నేహితులు.

వేంక—అలాగా? అలాగయితే మనంచేసేప్రయత్నానికి అది సహాయకారిగానే వుంటుంది. ఎలాగయినా నీవు నీనేర్పున్నూ సామర్థ్యమున్నూ చమత్కారమున్నూ వాఙ్మాధుర్యమున్ను కనపరచి మాచిన్నాయనను వలలో పడవేస్తేనా, మీరతిసుందరికి మంచిమొగుడు రావడమే కాకుండా మేనకోడలిభర్తకు యిరవయివేల రూపాయలు

కూడా చేతులో పడతవి.

మోహి—ఇదంతా జరగడం నేను నీపినతండ్రిని వివాహం ఆడ డంవల్లనా?

వేంక—వివాహమాడడమా? అదియెప్పుడూ సాధ్యంకాదు. మాటలు చెప్పడంసులభంగాని కార్యంచెయ్యడం సులభంకాదు. ఆయ నకు యెన్నిచిక్కులు తెచ్చిపెట్టినా, తనఆస్తి అంతాలయినా విడిచి పెడుతాడుగాని నిన్నుమాత్రం వివాహంకాడు.

మోహి—అలాఅనబోకు. స్త్రీలు తారసించినప్పుడు పురు షుడిమనస్సు యెంతగట్టిదయినా కరగక మానదు. ప్రయత్నంచేసి ముందుగా మీాచిన్నాయనగారి మనస్సులో కొంచెం కామాగ్నిని తగి లించి దరికొల్పినతరువాత, అది అంటుకుని మండుతూవుంటే మళ్లీ ఆర్పివెయ్యడం సాధ్యంకాదుసుమా.

వేంక—అలా నిజంగా కామాగ్ని రవులుకొని మండితే మన్మ థాగ్నిచేత కాలిచావడంకంటె తప్పకుండా వివాహ మాడడమే వృత్త మం. అయినాకానీ నీప్రయత్నంమాత్రం సాధ్య మవుతుం దనుకోకు. నేను యెరిగినంతవఱకు మాచిన్నాయనగారిమనస్సు స్త్రీలవిషయంలో రాయి అయిపోయినది. వజ్రంకంటెనూకఠినమయిన ఆమనస్సు నూర గ్నిహోత్రాలు దరికొల్పినా కరిగేదికాదు. దాన్ని కరిగించేశక్తి లోకంలో యెక్కడనూ లేదు.

మోహి—వొక్కచోటమాత్రం వున్నది.

వేంక—యెక్కడవున్నది?

మోహి—ఇక్కడ వున్నది. (అని తనహృదయమును చూపు చున్నది).

వేంక—ఏదీ నీశక్తి చూతాము కాదూ!

మోహి— నీవే శీఘ్రకాలంలో చూచి మెచ్చుతావు. నాకు యిప్పుడు వకవుపాయం తోస్తూవున్నది. పూర్వంవకసారి నాయన్నగారున్ను మీాచిన్నాయనగారున్ను కలిసి యేదోవక లా (ధర్మశాస్త్రం) వున్నదని పయికి తీసి వ్యాజ్యం వేసి పురుషుడికి యిష్టంలేనిదే ఆతణ్ని మోహించిన వకచిన్నదానికి బలవంతంగా వివాహం చేయించినారు.

వేంక— అలాగంటె ఆక్టుకూడా వకటి అమలులోవుండేదా?

మోహి— వెరుక వుండేది. అది యిప్పుడు రద్దుకాకుండా వున్నట్టయితే, యిరవై వేల రూపాయలున్ను నీచేతిలో పడ్డవే. యీకాలంలో ఆక్టులు గడియగడియకూ మారుతూ వుంటవి.

తిమ్మయ్య—(తనలో నేమో యనుకొనుచు వెలుపల) ఈసంగతి నా యజమానుడితో చెపుతాను.

వేంక—(ఆమాటలాలకించి) అదుగో తిమ్మడు వస్తూవున్నాడు. మనంయిద్దరిమూ మాట్లాడుతూవున్నట్టు వాడికి తెలియకూడదు. నీవు యీదారిని వీధిలోకి వెళ్ళు.

(అని యొకతలుపు తీయుచున్నాడు.)

మోహి—నీవేమీా భయపడవద్దు. మరివక మోస్తరుగా నేను యిప్పుడే మళ్ళివస్తాను. (అని వెళ్ళుచున్నది.)

[అప్పుడు ధనకోటిరాజు గారును తిమ్మయ్యయు ప్రవేశించుచున్నారు]

ధన—ఓరి సోమరిపోతా! ఇంతసేపటిదాకా యెక్కడికి వెళ్ళినావురా?

తిమ్మ—సోమిదేవమ్మగారి యింటికి. మీారుఅక్కడికి వుత్తరం యిచ్చి పంపించినారుకారా?

ధన—ఓరి వెధవా! యేమిటి తింటూవున్నావు?

తిమ్మ—నేను యీలాతింటూవుంటేనే బ్రతుకుతూవున్నాను.

లేకపోతే చచ్చిపోనా?

ధన—ఓరి తాగుబోతా? నీవు తాగడంకూడా మొదలుపెట్ట లేదుగద!

తిమ్మ—యీ మిఠాయివుండ మింగనియ్యండి. తరువాత చెప్తాను.

ధన—ఓరి నిర్భాగ్యుడా! నీకు మిఠాయి యెక్కడనుంచి వచ్చిందిరా?

తిమ్మ—నేను కొనుక్కున్నాను. రొక్కం యిచ్చి మరీ కొన్నాను.

ధన—ఈరోజున నీకు నేనేమీ డబ్బియ్యలేదే.

తిమ్మ—మీరా? మీరా? మీ రివ్వలేదు. నేను వేరే విధంగా డబ్బుసంపాదించుకోకుండా మీరు యిచ్చినదానితోనే తృప్తిపొంది వున్నట్టయితే నేను యిదివరకే స్వర్గానికి వెళ్ళి వుందును.

ధన—ఓరి దొంగా? నేను యిచ్చినది కాకపోతే నీకు యింకా డబ్బెవరు యిస్తారురా?

తిమ్మ—ఎవరు యిస్తారా? మీపార్టీలుయిస్తారు. వారు మీస్వభావం యెరుగుదురు గనుక నామీద జాలితలచి యేమయినా యిస్తూ వుంటారు. యీరోజు వుదయాన్న కాగితాలు పట్టుకుని వెళ్ళి యిచ్చినందుకు సోమిదేవమ్మగారు బిళ్ళకుడుంలాగు రూపాయి చేతిలో పడవేసినారు.

ధన—(తనలో) అలాగయితే యికముందు నా క్లయింట్లకు కాగితాలు నేను స్వయంగానే తీసుకునివెళ్ళి యిస్తూవుంటాను. (బిగ్గరగా) ఏది? ఆరూపాయ నాచేతికియ్యి. నేను జాగ్రతచేసి పెడుతాను.

తిమ్మ—అప్పుడే ఆరూపాయి నా కడుపే జాగ్రతచేసి పెట్టింది. నాచేతులోడబ్బుపడితే నేను అక్కడనేకానిమరియెక్కడా దాచుకోను.

ధన—ఆఁ! యేమిటి? నీవు అప్పుడే రూపాయికి రూపాయి అంతా మింగివేసినావా?

తిమ్మ—రూపాయి మింగలేదు. రూపాయి విలువచేసే వస్తువులను మింగివేసినాను.

[అపుడు తలుపు ఎవరో తట్టుచున్నారు.]

ధన—తలుపు ఎవరో తట్టుచున్నారు. నీవు వెళ్ళి తలుపు తీసి రా. నేను లోపలికి వెళ్లుతాను. (అని వెళ్లుచున్నాఁడు.)

తిమ్మ—చిత్తము. (అనివెళ్లి తలుపుతీయుచు) తలుపుగుద్దుతూ నిలుచోకు. వేగిరం లోపలికిరా.

[అప్పుడు మోహినీదేవి ప్రవేశించుచున్నది.]

మోహి—ధనకోటిరాజుగారు యింట్లో వున్నారా?

తిమ్మ—యెవరు వచ్చినారనిచెప్పను?

మోహి—మోహినీదేవిగారు.

తిమ్మ—(తనలో) ఆహాహాహా! మోహినీదేవిగారా? (బిగ్గరగా) మీరు వచ్చినపని యేమిటి?

మోహి—ఆపని మీయజమానుడితో చెప్పుతాను.

తిమ్మ—ఆలాగైతే మీరు యేదో కేసులో సలహాపుచ్చుకోవడానికి వచ్చినట్టున్నారు.

మోహి—ప్లీడరుగారితో మాట్లాడడానికి వచ్చినాను గాని ఆయననవుకరుతో మాట్లాడడానికి రాలేదు.

తిమ్మ—నీవు భ్రమపడుతూ వున్నావు. నాకూ ఆయనకూ భేదంలేదు. నేను ఆయనకు అంతరంగ స్నేహితుణ్ని.

మోహి—నీ వాలకం చూస్తే నీవందరికీ అంతరంగ స్నేహితుడిలాగే కనపడుతూవున్నావు.

తిమ్మ—పయిఆకారాన్ని పట్టి వూహ చెయ్యరాదు. పయి వేసం యేలాగున్నా లోపలిసారం కావలసినంత వుండవచ్చును. నీవేషం చూస్తే నీవు మాన్యాలూ గీన్యాలూ బాగావుండి బలిసి చాలాడబ్బు గలదానివలె కనపడుతూ వున్నావు.

మోహి—నేను డబ్బున్నదానిలాగు కనపడుతూవుంటే నీవు తెగమెండిపోయి డబ్బు లేనివాడవులాగు కనపడుతూవున్నావు.

తిమ్మ—నీకు మాయజమానుడిదర్శనం కావలెనా?

మోహి—కావలెను.

తిమ్మ—అహాహాహా! అలాగయితే ఆయన యింట్లో లేరు.

మోహి—నేను యెరుగుదును. ఆయన యింట్లోనే వున్నారు. ఆగదిలోనే వున్నారు.

తిమ్మ—అలాగయితే ఆయన మిమ్మలిని యెరిగిన వారేనా?

మోహి—నేను ఆయనముఖంమాత్రం యెరుగుదును. నాకూ ఆయనకూ పరిచయం లేదు.

తిమ్మ—మీకూ ఆయనకూ పరిచయం లేనిమాటనిజమే. ఇది వరకు పరిచయమేవున్నట్టయితే, ఆయన ఆడవాళ్ల తరవున యేవ్యవహారంలోనూ పూనుకోడని మీకు తెలిసేవుండును. ఈమాటలు చెప్పి మీమనస్సుకు నొప్పి కలిగించడం నాకు యిష్టంలేక మీతో మృదువుగా ఆయన యింట్లో లేడని చెప్పినాను.

మోహి—మీ యజమానుడిసంగతి నాకు బాగా తెలుసును. ఆయనబాగా ఫీజు యిస్తే యెవరికేజులోనయినా పనిచేస్తారు.

తిమ్మ—అలాగయితే మీరు బాగా ఫీజుయివ్వగలవారే అనుకుంటాను.

మోహి—అడిగినంతఫీజు యిచ్చేదాన్ని కాకపోతే నేను యిక్క

డకు రానేరాకపోదును.

తిమ్మ.— ఆలాగయితే వ్యవహారంలో వుండేచిక్కులూ ప్లీడరు పడేప్రియాసమూ మీకు బాగా తెలుసును కాబోలును!

మోహి—బాగా తెలుసును. పూర్వం మాఅన్నగారు లాయరు పనిలో వుండేవారు. ఆయన బ్రితికివున్నప్పుడు ఆయన వ్యవహారం నేనే చూచేదాన్ని.

తిమ్మ—మీకు లెక్కలుకూడా తెలుసునా?

మోహి—లెక్కలలో నాకు వట్టిసున్నాలకు కూడా విలువ కలుగచెయ్యడం తెలుసును.

తిమ్మ—సున్నాలకు విలువ యేలాగు వస్తుంది?

మోహి—ముందు అంకెలు చేరిస్తేసరి. నీ అంకిలి లేకుండా వుండడానికి యిదిగో. (అని యొకరూపాయ చేతిలో పెట్టుచున్నది)

తిమ్మ—(నవ్వి) అమ్మా! నీకు కోర్టువ్యవహారం బహుబాగా తెలుసును. అంతా యిందులో వున్నది. బంట్రోతు మొదలుకొని ప్లీడరుగారివరకూ డబ్బు చేతులో పడనిదే యేపనీ చెయ్యరు. అమ్మా! యిప్పుడు నావల్ల మీకు యేకార్యం కావలెను?

మోహి—మీప్లీడరుగారిదర్శనం చేయించు. ఇంకోసారి వచ్చినప్పుడు నీకు రెట్టింపు బహుమానం చేస్తాను.

తిమ్మ—నీతల్లికడుపు చల్లగా నీవు వెయ్యేళ్లు వర్ధిల్లవలెను. ఇక నీకు నిముషంలో నాయజమానుడి దర్శనంచేయిస్తాను. వుండండి.

(అని వెళ్లుచున్నాడు)

మోహి—నేను వీణ్ని వశ్యంచేసుకున్నాను. ఇప్పుడు వక ప్రతిబంధం తక్కువయింది. ఓధనమా! నీప్రభావం యెవరు పొగడగలరు! లోకంలో యెంతటి వారున్నా నీకు దాసులేకదా! ఓభాషా

దేవి! ఇఖ నీవు నాకు తోడుపడి నాకు జయము కలుగ చెయ్యి. నీ అనుగ్రహంవల్ల నాకు యిదివరకు యెప్పుడూ సమయోచితంగా మాట్లాడడంలో పరాభవం రాలేదు.

[తిమ్మయ్యాయు ధనకోటిరాజును ప్రవేశించుచున్నారు]

ధన—అమ్మా! ఏదో వ్యవహారంలో నీవు నన్ను ఆలోచన అడగడానికి వచ్చినానని నా నవుకరు చెప్పుతూవున్నాడు.

మోహి—అవును. నేనందునిమిత్తమే వచ్చినానుగాని నేను మీతో రహస్యంగా మాట్లాడవలసి యున్నది.

ధన—ఓరితిమ్మా! నీవు అవతలికి పో.

తిమ్మ—చిత్తము. (అని వెడలిపోయి గుమ్మమువద్ద పొంచుండి వినుచున్నాడు)

మోహి—అయ్యా! నేనువచ్చిన వ్యవహారాన్నిగురించి మాటాడడానికి ముందుగా నాసంగతి కొంచెం చెప్పుతాను.

ధన—అవశ్యంగా చెప్పవచ్చును. మీరు కూర్చోండి.

(ఇద్దఱును కూర్చున్నారు)

మోహి—అయ్యా! నేను యిప్పుడు మీసలహా కోరి వచ్చిన విషయం బహు వింతైనదిగా కనబడుతుంది. అందుచేత-అందుచేత-

ధన—అమ్మా! తొందరపడబోకు. సావకాశంగా చెప్పవచ్చును.

మోహి—నేను యిప్పుడు మీకాలం వ్యర్థంపుచ్చడం లేదు గదా? మీకవతల తొందరపని వున్నదేమో!

ధన—లేదులేదు. నింపాదిగాచెప్పు. పనివచ్చినప్పుడు వేరే పనివున్నా సావకాశంగా వినవలెను.

మోహి—మాఅన్నగా రయిన భూపతిరాజుగారు—

ధన—(ఆశ్చర్యముతో) భూపతిరాజుగారు మీకన్నగారా?

ఆయన నాకు ప్రాణమిత్రుడు.

మోహి—అవును. ఆయనా నేనూ యేకగర్భజనితులము.

ధన—ఆయన చాలా ధనం సంపాదించినారు. మీకుటుంబా నికి తగినంత ఆధారం వుంచి పోయినారా?

మోహి—ఆయన మాకు అన్నవస్త్రాలకు యేమీ లోపం లేకుండా తగినఆధారం చేసే పోయినారు.

ధన—ఆమాట వినడంచేత నాకు బహుసంతోషంగా వున్నది. నేను చూస్తూవుండేవాణ్ని. ఆయన కప్పుడు పదిపదహారు సంవత్సరాల వయస్సులోవున్న పెళ్లికాని తోడబుట్టిన పడుచు వుండేదే! ఆవిడె మీకు అప్పగారా? చెల్లెలా?

మోహి—ఆ పదహారేళ్లచిన్నదాన్నే నేను. నేను యిప్పటి కిన్ని వివాహం చేసుకోనేలేదు.

ధన—ఓహో! నీవు యిప్పుడు యెంత మారిపోయినావు! నిన్ను నేను యిప్పుడానవాలు పట్టలేకనేపోయినాను. నీరూపంకొంచెం-

మోహి—(అతనివంక తేరపార చూచుచున్నది.)

ధన—అమ్మా! మారడంఅంటే నీవు మరివకలా గనుకోకు. నీరూపం కొంచెం మారినా అందం యేమీ చెడలేదు. ఇప్పుడు మరి వకమోస్తరుఅందం వచ్చినది. (తనలో) కొంచెం ముఖం ముదురుగా వున్నా యీమె యిప్పటికిన్ని చక్కనిదిగానే వున్నది.

మోహి—నేను యేమనుకుంటానోఅని మాట తిప్పుకున్నారు గాని, ఏ డెనిమిదేళ్లకిందట నేను యింతకంటె కోమలంగానే వుండి వుంటాను. మా అన్నగారు పోయినవిచారంచేత కూడా నారూపం కొంత మారిపోయింది.

ధన—ఏమిమారినా యిప్పటికీ నీరూపము యౌవనపురుషులను

వివాహాని కాంక్షించేలాగునే వున్నదిగాని మరివక విధంగా లేదు. ఇప్పుడే యింత మనోరంజకముగా వున్న నీరూపము అప్పు డెంతమహాశ్చర్యకం కలుగచేసేదిగా వుండేదో?

మోహి—నాయందలి వాత్సల్యంచేత మీరు యూరికే నన్ను స్తుతిచేస్తూవున్నారు. మనం మాట్లాడవలసిన కార్యం విడిచి దూరంగా వెళుతూ వున్నాము.

ధన—నేను శ్రద్ధగా వున్నాను వచ్చినకార్యంచెప్పు.

మోహి—ఇప్పుడు నా స్థితిగతులు మీకు పూర్ణంగా తెలిసినవికదా. నిజమయిన ప్రేమయున్ను గౌరవమున్ను గలిగి నేను మోహించిన వకపురుషుణ్ని యెలాగయినా బలవంతముగా నాకు వివాహం చేయించడానికి మీసహాయం కావలెను.

ధన—అదెంతపని? అవశ్యంగా చేస్తాను.

మోహి—ఆపురుషుడికి యిష్టంలేకున్నా వివాహం చేయించవలెను.

ధన—ఆతని యిష్టానికి విరోధంగా చెయ్యడం కష్టమేకాని, అసాధ్యంమాత్రం కాదు.

తిమ్మ—(తనలో) వారు మెల్లిగా గుసగుసలాడుతూ వున్నారు. ఎవరికొంప తియ్యడానికో యీప్రయత్నం!

ధన—మరివకప్లీడరుదగ్గిరకు వెళ్లక యీవిషయంలో నావద్దకు సలహాకు రావడం నీవు మంచిపని చేసినావు.

మోహి—మీరు ఆమాట అనడం నాకు పరమసంతోషంగా వున్నది. నాకార్యం సఫలం కావలసినయోగం వుండి నా అదృష్టంచేతనే మీదగ్గిరకు రావడం తటస్థ మయింది.

ధన—(తనలో) పాపము! ఆపురుషుడియం దీమె కెంత ప్రేమ

చ్ఛక్తినీ వుపయోగపరిచి కార్యసాఫల్యం చేస్తారని నాకు సంపూర్ణ విశ్వాసం వుంటుంది. తెలివిమాలిన ఆడదాన్నిగనుక మనసులోవుండే ఆదుర్దా చేత మిమ్మలిని యిటువంటి కోరిక కోరుతూ వున్నాను. నాకీ అభయహస్తం యివ్వడానికి మీ కేమయినా అభ్యంతర మున్నదా?

ధన—ఎంతమాత్రమూ అభ్యంతరం లేదు. సంతోష పూర్వంగా వ్రాసి యిస్తాను. (అని కలమును కాగితమును పుచ్చుకొని వ్రాసి యిచ్చుచున్నాఁడు)

మోహి—ఇది వ్రాసి యివ్వడంవల్ల మీరు నాకు కలుగజేసిన ఆనందం యింతా అంతా అని చెప్పడానికి నాకు శక్యం కాకుండా వున్నది.

తిమ్మ—(తనలో) ఓహో! యీవిడె యౌవనపురుషుల పాలిటి మృత్యుదేవతగా వున్న దే!

ధన—నావంటి పురుషుణ్ని వకణ్ని ధన్యుణ్ని చేసి బలవంతంగానైనా సమస్తాశ్రమాలలోకీ వుత్తమమైన గృహస్థాశ్రమసుఖం ఆతనికి కలుగచేస్తున్నానుగదాయని నామనస్సులోనూ సంతోషం అపారంగా పొంగి పొర్లి పోతూ వున్నది.

మోహి—మీది సాధుహృదయం. మీకు మిక్కిలిశ్రమ కలుగజేసినాను.

ధన—ప్రియత్నం సఫల మయితే యిది వక శ్రమే కాదు. ఓసుందరీ! మళ్లీ యెప్పుడు వస్తావు?

మోహి—కొంచెంసేపటిలోనే వచ్చి నాకున్న నాప్రియుడికిన్నీ జరిగినప్రథమదర్శనప్రసంగతి తిరిగీ తమతో మనవి చేస్తాను.

ధన—ఓసుందరీ! పోయిరమ్ము. ఈశ్వరుడు నీప్రియత్నము సఫలము చేయునుగాక?

మోహి.—ఇదంతా మీఆశీర్వచనము? (అని వెళ్లుచున్నది)

ధన—(తనలో) నాభార్యపోయినతరువాత స్త్రీలతో చాలా సేపు మాట్లాడినది యీమెవక్కతెతోనే. స్త్రీలు చూడడానికీ సంభాషించడానికీ మనోహరంగానే వుంటారు; కాని పురుషులు వాళ్ళవలలో పడితేమాత్రిం మోసం తటస్థిస్తుంది. (బిగ్గరగా) ఓరీ తిమ్మా!

తిమ్మ—అయ్యా! వచ్చినానండి.

ధన—నీవు చీమలాగు పాకుతావు. వేగిరం నడిచి రాలేవేమి? యీవుత్తరాలు తీసుకునివెళ్లి పయిచిరునామాలప్రికారం యెవరివి వారి కిచ్చి వచ్చేటప్పుడు సోమిదేవమ్మగారియింటికి వెళ్లి ఆవిడె నక్కదోసకాయలు యిస్తానన్నది తీసుకునిరా.

తిమ్మ—చిత్తము. నక్కదోసకాయలు రుచిగానే వుంటవి. నా కవి బహుయిష్టము.

ధన—దోవలో నీకడుపాతురత కనపరచక యిచ్చినకాయలన్నీ తిన్నగా యింటికి తీసుకుని రా. నేను వీధిలోకి వెళ్ళి పావుగంటలో మళ్లీ వస్తాను. నేను మళ్లీవచ్చేటప్పటికి నీవు యిక్కడ వుండవలెను. దోసకాయలు తీసుకురావడం మరిచిపోకుమా! జాగ్రత.

(వీధిలోనికి వెళ్ళుచున్నాఁడు)

తిమ్మ—(ఆయన కేసిచూచి తనలో) నాకు దోసకాయ లక్కరలేకుండా ఆవిడెమాటతోనే కడుపునిండింది. యీవేళ నాకు లావిషయమయి కావలసినంత తెలిసింది. నేను జన్మంయెత్తినతరువాత యిటువంటి లా వున్నదని యెప్పడూ వినలేదు. ఆలాగైతే యిక యేస్త్రీ ఆయినా యే పురుషుణ్ని పడితే ఆపురుషుణ్ని బలవంతముగా పెళ్ళాడి తోడేలు మేకపిల్లను నోట్లో వేసుకున్నట్టు వాత వేసుకోవచ్చును. ఇది మహాదొడ్డధర్మశాస్త్రుం! ఇక నేను స్త్రీరూపం చూచినప్పుడల్లా బహు

జాగ్రత్తగా వుండవలెను. ఎవరో తలుపువద్ద పిలుస్తూవున్నారు. (వెళ్ళి తలుపు తీసి చూచి తొందరపడి) అయ్యో! ఆరంభములోనే నాకు స్త్రీదేవత ప్రత్యక్ష మయింది! దేవుడా! నాగతి యేమవుతుందో!— అమ్మా! లోపలికి రా.

[అప్పుడు రతిసుందరి ప్రవేశించుచున్నది]

రతి—ధనకోటిరాజుగా రింట్లో వున్నారా?

తిమ్మ—లేరు. ఇంట్లో లేరు.

రతి—ఆయన వేగిరం ఇంటికి వస్తారా?

తిమ్మ — పావుగంటలో రావచ్చును. ఏమో యెలాతెలుస్తుంది? ఆయన గంటసేపటిలోనూ రావచ్చును. సాయంకాలందాకా రాకపోనూ వచ్చును. ఆయన ఇప్పుడు మాత్రం ఇంట్లో లేరు. అది నాకు తెలుసును. మీరు యిప్పుడు వెళ్ళి మళ్ళీ వస్తారా?

రతి—వెళ్లను. ఆయన వచ్చినదాకా ఇక్కడనే వుంటాను.

(అని కూర్చున్నది)

తిమ్మ—(ఉలికి పడి) అమ్మా! నేను వంటరిగా వున్నాను.

రతి—వుంటే యేమి? నా కేమీ భయం లేదు.

తిమ్మ—నీ కేమీ లేదుగాని నిన్ను చూస్తే నాకు మహాభయంగా వున్నది.

రతి—(నవ్వి) నీవు మహాధైర్యశాలివిగా వున్నావే! ఆడదాన్ని చూస్తే మగవాడికి నీకే భయం వేస్తూవున్నదా?

తిమ్మ—అందుచేతనే నాకు భయం వేస్తూవున్నది. నేను మగవాణ్ని కాకపోయినట్టయితేనాకుభయంపడవలసినఅవసరమేలేకపోవును.

రతి— నీ కెలావున్నదోగాని నిన్ను చూస్తే నాకు భయం వెయ్యడంలేద.

[వేంకటపతిరాజు ప్రవేశించి రతిసుందరికి కనఁబడకుండ వెనుక నిలుచున్నాఁడు]

తిమ్మ—నీకు భయంవెయ్యదు. నాకది నిశ్చయంగా తెలుసును.

రతి—నీవు పట్టి పశుప్రాయుడవుగా వున్నావు. యిలాగు యింటికి వచ్చినపార్టీలను అవమానపరచడంనిమిత్తమే నీయజమానుఁడు నీకు జీతం యిచ్చి వుంచినాఁడా?

వేంక—(ముందుకు వచ్చి) ఏమిటిది? నీవు యీమెను ఎందుకు అవమానపరుస్తున్నావు?

తిమ్మ—ఈమె వ్యాజ్యదారురాలని నాకు తెలియదు. నేను యేమనుకున్నానా—నేను యిప్పుడే పొంచుండి విన్నాను—కాదు. ఆమాటకాదు—నేను వంటరిగావున్నాను. ధర్మశాస్త్రంచూడబోతే- అదీకాదు. నేను యేమి చెప్పుతూవున్నానో నాకు నాకు తెలియకుండా వున్నది.

వేంక—(కుర్చీవేసి) ఓసుందరీ! దీనిమీద కూర్చుండు— ఓరీ! నీవు యిఖముందు యెప్పుడైనా ఇటువంటి దౌర్జన్యం చేసినావంటే—

(అని తిమ్మయ్యను వీథికేసి గెంటుచున్నాఁడు)

తిమ్మ—మీచిన్నాయనగారు వుత్తరాలు తీసుకుని వెళ్ళమన్నారు. సామిదేవమ్మగారి నడిగి దోసకాయలు తేవలెను. పోతాను.

(అని వెళ్ళుచున్నాఁడు)

వేంక—ఓరతిసుందరీ! ప్రియురాలా! మనపాలింటి క్రూరసింహంవున్న యీగుహాలోకే వెతుక్కుంటూవచ్చినావేమి? నీవు వచ్చిన పని యేమిటి?

రతి—ఆపనియేమో నాకూ తెలియదు. మాఅత్తయ్య తాను ఇక్కడికి నాలు గైదునిముషాలలో వస్తాను. ముందుగా వెళ్లి కనిపెట్టుకుని వుండుమంటే వచ్చినాను. నేను యెందుకో సాక్షిగా వుండవలెనఁట.

నిన్ను చూస్తే నేను యెందులో సాక్షిగా వుండవలెనో చెప్తా నను కున్నాను.

వేంక—ఆవిషయం నీకెంత తెలుసునో నాకూ అంతే తెలుసును.

రతి—ఆవిడ యేపని తలపడితే ఆపని సాధిస్తుందని నాకు నిశ్చయంగా నమ్మకంవున్నప్పటికీ, ఆవిడె యిప్పుడు యేమిచెయ్యదలచు కున్నదో నాకు తెలియలేదు. ఆవిడే నిజంగా మగవాడయినట్టయితే యీ దేశంలో వుండేలాయర్లనందరినీ మించిపోను.

వేంక—అవును. ఆవిడెముందర యే లాయరూ పనికి రాడు. అయినాకానీ ఆవిడె యీప్రయత్నంలో తప్పిపోయినట్టయితే మన బ్రిదుకప్పుడు యే మవుతుందో!

రతి—ఏమీకాదు. అప్పుడు నేను కఠినహృదయు డైనమీపిన తండ్రిని ప్రార్థించి, నిన్ను వివాహ మాడనియ్యక పోయినట్టయితే విరహతాపముచేత నేను ప్రాణాలు విడుస్తా నని చెప్తాను.

వేంక — ఆయనముందర ఆమాటలు సాగవు. వివాహాలు కావడంకంటె ప్రాణాలు విడువడమే ఆయనకు యెక్కువ యిష్టంగా వుంటుంది.

రతి—మీపినతండ్రిగారి విషయంలో అలా అనడం న్యాయం కాదు.

వేంక—ఓప్రియురాలా! ఆమాటలు నీవు నిజం చెయ్యకు. నేను వూరికే పరియాచికానికి అన్నాను.

రతి—అది నాకు తెలుసును. నీవు నన్ను కామించడమూ నన్ను వివాహము చేసుకోవడమూ కూడా పరియాచికానికే కాదుగద!

వేంక—నే నలా వివాహం ఆడను. అందులో పరియాచకం యేమీ లేదు.

రతి—నన్ను వివాహమే ఆడవా? ఏ మేమిా?

వేంక—ఓప్రియురాలా! నామాటల కపార్థాలు చెయ్యకు. నేను నిన్ను పరియాచకానికి వివాహ మాడ నన్నాను. నీమిాద నాకు యెంతప్రేమ వున్నదో నీమనస్సుకే తెలుసును. ఓ ప్రియురాలా! (దగ్గిరకువచ్చి) యేదీ వక్కముద్దు పెట్టు.

(అని కౌగిలించుకొని ముద్దుపెట్టుకొనుచున్నాడు)

[అప్పుడు వగ్గుచు ధనకోటిరాజుగారు ప్రవేశించుచున్నారు]

వేంక—మాచిన్నాయనగారు వస్తూవున్నారు.

రతి—(తొందరపడి) మిాచిన్నాయనగారా?

వేంక—అవును. వెంటనే మూర్ఛపో.

రతి—ఆ. ఆ. (అని యాతని చేతులలో మూర్ఛిల్లుచున్నది)

వేంక—(పినతండ్రిని చూడనట్టు నటించుచు) ఓ కాంతా! నాకు బహువిచారంగా వున్నది. నేను క్షమార్పణ వేడుకుంటాను. అయ్యో! పాపము! ఈమె మూర్ఛపోయింది! నేను యిప్పుడు యేమి చెయ్యను? యీస్థితిలో యీామెను యిక్కడ వంటిగా విడిచి అవతలకు వెళ్ల వల్లకాదు. ఎవరయినా కొంచెం చన్నీళ్ళుతెస్తే బాగుండును. ఈసంగతి వింటే పరమఛండాలుడైన తిమ్మన్నిన్ని మాచిన్నాయనగారు తక్షణం తీసివేస్తారు. ఆయ నయినా యింటికి వస్తే బాగుండును.

ధన—ఇదిగో నేను వచ్చినాను. ఇదంతా యేమిటి?

వేంక—ఏమిాలేదు. మిాబంట్రోతు యీావిడెను విస్తారంగా అవమానపరచినాడు. నేను వచ్చి నాలుగుతన్ని వాణ్ని వీధిలోకి గెంటి వేసినాను. ఇంతలోకే యీావిడె మూర్ఛపోయింది.

ధన—మనం యిప్పుడు యేమిచేతాము? ఆడదానితో యీాతంటాలన్ని యిప్పుడు యెవరు పడుతారు? అబ్బాయిా! యిప్పుడు మనం

చెయ్యవలసినపని యేమిటి ?

వేంక—కొంచెంసేపు మీరు యీచిన్నదాన్ని పట్టుకోండి. నేను వెళ్లి సహాయం తీసుకుని క్షణంలో వస్తాను. (రహస్యంగా రతి సుందరితో) నీవు కదలమెదలకుండా వుండు.

ధన—పట్టుకోవడమా ? నే నీచిన్నదాన్ని చేతులో పట్టుకోవలెనా ? ఆపని నాచేత కాదు. నేను యిదివరకు యెప్పుడూ పరాయి ఆడదాన్ని నాచేతిలో పట్టుకో లేదు.

వేంక—(రతిసుందరితో రహస్యముగా) నీవు మూర్ఛలోనే వుండు. లేకపోతే మన యిద్దరికీకూడా భంగం వస్తుందిసుమా. (బిగ్గరగా) నాన్నగారూ ! మీ రెలాగయినా కొంచెంసేపు పట్టుకోవలెను. నేను వీధిలోకి వెళ్లి యీచిన్నదాన్ని తీసుకు వెళ్ళడానికి యే దయినా బండి తీసుకువస్తాను. ఈసమయంలో మనయింటికి యెవ రయినా వస్తే-

ధన—అవును. అవును. అది సత్యమే కాని—

వేంక—కానీ లేదు. యేమీ లేదు. నేను వదలిపెడుతూ వున్నాను. వేగిరం వచ్చి పట్టుకోండి.

ధన—(దూరముగా నుండి యామెను పట్టుకొనుచున్నాఁడు.)

వేంక—(వెళ్ళుచున్నాఁడు.)

ధన—అబ్బాయి ! వేంకటపతీ ! నన్ను వక్కణ్ణి వదలిపెట్టి వెళ్లకు. అయ్యో ! వాడు వెళ్ళిపోయినాడు. నేను పట్టుకోలేను. నా చేతులు వణకుతూవున్నవి. నేను వదిలిపెడితే యీవిడెకు దెబ్బతగులుతుం దేమో ! గట్టిగా పట్టుకోవలెను. (దగ్గఱకు జరిగి గట్టిగా పట్టుకొని మొగమువంకజూచి) ఈమె ముఖం యెంతమనోహరంగా వున్నది (అని యింతలో మోహినీదేవిని చూచి తొందరపడి రతిసుందరిని మెల్లగా క్రిందికి జార విడిచి తనచేతులు తీసుకొనుచున్నాఁడు)

[అప్పుడు మోహినీదేవి ప్రవేశించుచున్నది.]

మోహి—అయ్యో! యిదేమిటండి!

ధన—ఏమో! నే నెఱుగను.

[వేంకటపతిరాజు ప్రవేశించుచున్నాడు.]

వేంక—నాన్నగారూ! నేను బండి తీసుకుని వచ్చినాను. ఈమెకు తెలివి వస్తూ వున్నట్టున్నది. (రతిసుందరితో రహస్యముగా) ఓప్రియురాలా! ఈపాటి నీమూర్ఛవిడిచి తెలివి తెచ్చుకొని మెల్లగా లేచి రా. నీవు నీమేనత్తను యెరుగనట్టు నటించు.

(వారిద్దరును వెళ్లుచున్నారు.)

మోహి—(వారు వీథిలోనికి వెళ్లువఱకును వారివంక చూచి అయ్యో! నాకు నిజంగా నవ్వు ఆగకుండా వున్నది.

ధన—ఏమి? నన్ను చూస్తే నీకు నవ్వు వస్తూవున్నదా?

మోహి—కాదు, అందుచేత కాదు. నాఅదృష్టదినాలు తలుచుకుంటే సంతోషం వస్తూవున్నది. నేను తలపెట్టినపని యేవిఘ్నాలూ లేకుండా దివ్యంగా సాగుతూవున్నది. ఆపురుణ్ని నే నప్పుడే రెండు మాట్లు చూడడం అయింది నేను యీసంగతి మీతో మనవి చేసి వెళ్లుదామని వచ్చినాను!

ధన—నీవుమహాచెడ్డదానవు.అప్పుడేరెండుమాట్లుచూచినావా?

మోహి—చూచినాను. యీవేడిలోనే కార్యం సాగించవలెను గాని వేడిచల్లారితే తరువాత శ్రద్ధవుండదు.

ధన—నీవు సాక్షులను పెట్టినావా?

మోహి—ఆసాక్షులు వెలుపల నున్నారు. (అని వీథివంక చూపుచు) యిందాకా నేను వచ్చేటప్పటికి మీరు కౌఁగిలించుకొన్న చిన్నది మీకు దగ్గిరబంధువురాలా!

ధన—బంధుత్వ మేమీా లేదు. ఆమె యెవరోపరాయిచిన్నది. ఏదో వ్యవహారంవిషయంలో నన్ను ఆలోచన అడగడానికి వచ్చింది. నానవుకరు కొంచెంమోటతనం చేసేటప్పటికి మూర్ఛ పోయింది. ఇంతలో నాఅన్నకొమారుడు వచ్చి వాణ్ని వీధిలోకి తరిమి వేసినాడు.

మోహి—ఆచిన్నదానితో కూడా వెళ్ళినపడుచుచిన్నవాఁడు మీాఅన్నగారి కొమారుడా ?

ధన—అవును. అతడామెను యింటికి తీసుకుని వెళ్ళినాఁడు.

మోహి—ఇంటికా ? అలాగయితే ఆతడాచిన్నదాన్ని మీా వలె యెరగనివాడు కాఁడు కాబోలును.

ధన—ఓహోహో ! నీమాటలవల్ల నాకొక కొత్తసంగతే తెలిసినట్టున్నది.

మోహి—అదంతా నాకెందుకు? నేను యిక్కడికి పనిమీాద వచ్చినాను. నాపని నేను చూచుకోవలెను. ఆవిషయంలో ముందు నన్ను యేమి చెయ్యమంటారో చెప్పండి.

ధన—నీవు ఇదివరకె రెండుసారులుచూచినావుగదా? మంచిది. నీతరపున నేను ప్లీడరునుగనుక నిన్ను కొన్నిసంగతు లడిగి తెలుసుకో వలసి వున్నది. నావద్ద నీ వేమీా దాచకుండా నిజంచెప్పవలెను. నీవుమంచిస్థితిలోవున్నట్టు చెప్పినావని జ్ఞాపకం, నిజమేనా?

మోహి—సాధారణంగా అనుకూలమైనస్థితిలోనే వున్నాను.

ధన—నీ కేమయినాపిల్ల లున్నారా?

మోహి—నాకు వివాహమే కాలేదు. నాసంరక్షణలో మా అన్నగారి కొమార్తెమాత్రం వక్కపిల్లవున్నది.

ధన—ఆచిన్నదానికి తండ్రి యేమయినా ధనంయిచ్చి పోయి నాడా?

మోహి—నావివాహదినమందు దానికి యిరవై వేలరూపాయలు వస్తాయి.

ధన—(తనలో) ఇరవై వేలరూపాయలా! ఆచిన్నదాన్ని మా వెంకటపతి కిస్తే బాగా వుండును. (బిగ్గరగా, మీఅన్నగారు ప్లీడరీలో బాగా సంపాదించి వుందురు.

మోహి—సాధారణంగా సంపాదించినారు.

ధన—ఆయనపోయి యెంతకాలం అయింది?

మోహి—ఏడెనిమిది సంవత్సరా లయింది.

ధన—ఆయనను గురించి మీరు యిప్పుడు మరిచిపోయి వుంటారు.

మోహి—యెంతకాల మయినా కొన్నిసంగతులు మరపునకు రావు.

ధన—అవు నవును. అది నిజమే. నీమేనకోడలికి సంబంధం యెక్కడనైనా కుదిరిందా? నాకు అన్నకుమారుడు వక డున్నాడు. వాడు మంచిచక్కనివాడు; యౌవనంలో వున్నాడు. నేను ధనహీనుణ్ని కానిసంగతి నీకు తెలుసునుగదా?

మోహి—నాకు తెలియదా? నన్ను గెలిపించలేకపోతే మీరు యెంతో వోడిపోతానని పందెంవేసినారే. మీరు ధనవంతులు కాకపోతే యెలా పందెం వేస్తారు?

ధన— ఆహాహాహా! ఆవిషయంలో నేను పందెం వోడిపోతానని లేశమూ నాకు భయం లేదు. నీమేనకోడలికి యిరవై వేలరూపాయలు వస్తాయనికాదా ఇప్పుడు చెప్పినావు!

మోహి—నేను కోరినపురుషుణ్ని నేను వివాహ మాడితే, అప్పుడు వస్తాయి.

ధన—నీవు తప్పకుండా వివాహమాడుతావు. నాఅన్నకొడుకు విషయమయి యేమాలోచించినావు?

మోహి—ముందుగా నాపెళ్లి అయితే, అటుతరువాత నామే నకోడలికి మొగుణ్ని గురించి ఆలోచించడానికి కావలసినంతకాలం వుంటుంది. అయ్యో! మీరు మీఅన్నగారికుమారుడి వివాహంనిమిత్తం యింత ఆతురపడుచున్నారు గదా, మీవివాహం సంగతి యెందు కాలోచించినారుకారు?

ధన—నేను నీతో నిజం చెప్తాను. నాది పట్టి పిరికి స్వభావం నాకు స్త్రీలంటే భయము.

మోహి—భార్య వస్తే మిమ్మల్ని ధైర్యశాలినిగా చేస్తుంది.

ధన—నాకు కొంచెం కోపం హెచ్చు.

మోహి—భార్య కోపం పోగొట్టి శాంతుణ్ని చేస్తుంది.

ధన—నాకు నామనస్సు వచ్చినట్టుగా నడవడం యిష్టం.

మోహి—ఆవిడె అదీ పోగొడుతుంది.

ధన—ఈవిషయం నీతో వాదించడం కష్టం, నీవు లాయరు చెల్లెలవుకాదా?

మోహి—ఆ హేతువుచేతనే మీవంటి లాయర్ల జట్లులూ, నావంటివాళ్ల నేర్పు కలిస్తే మరీ శోభిస్తుంది అవునా! అహాహాహా! (అని నవ్వుచున్నది)

ధన—(తనలో) ఆహాహా! నిశ్చయంగా యీమె సంతోష దాయినిగా వున్నది.

మోహి—(తనలో) నిశ్చయించగా యితడు వివాహం ఆడ తగినవాడే.

ధన—(తనలో) యేస్త్రీతో ముచ్చటించినప్పుడున్నూ యింత

సంతోషం యెప్పుడూ నాకు నాజీవితకాలంలో కలుగలేదు.

**మోహి**—(తనలో) ఇటువంటివాడు వివాహం కాకుండా వుండడం చూస్తే విచారకరంగా వున్నది. (బిగ్గరగా) అయ్యా! ప్రస్తుతం నేను సెలవుపుచ్చుకుని మళ్లీ దర్శనం చేస్తాను. ఈసారివచ్చినప్పుడు కడపటి దైన మా మూడో సందర్శనాన్ని గురించి మీకు మేలువార్త తేగల నని నమ్ముతాను.

ధన—ఆహాహా! అందుకు సందేహం లేదు. నీకు జయం కలుగుతుంది.

మోహి—నాకు జయం కలుగుతుందని మీకు నమ్మకంవుంటే కార్యం అయినట్లే. ఆహాహాహా!

ధన—నిశ్చయంగా నీకుకార్యసిద్ధిఅవుతుంది. అనుమానంలేదు.

**మోహి**—ఆహాహాహా! నాప్రయత్నం విఫల మయితే మీరు వేసిన పందెం మాట జ్ఞాపకం వుంచుకోండి. మీరు నాకు దండుగ యివ్వవలసి వుంటుంది.

ధన—నాకాభయంలేదు. నీకార్యం విఫలంకాదు. నీఅభీష్టము శీఘ్రముగానే నెరవేరుతుంది.

**మోహి**—మీ ఆశీర్వచనప్రభావంవల్ల నెరవేరవలెను. నేను యిది మీరు యిచ్చిన వర మనుకుంటాను. నాయందు పరిపూర్ణానుగ్రహం వుంచండి. నేను సెలవు పుచ్చుకుంటాను. (అని వెళ్లుచున్నది)

ధన—(ఆమెవంక చూచుచు) ఆహాహాహా! ఈవిడెది బహు సుందరమయిన విగ్రహము. మొగం యెప్పుడూ నవ్వుతూ కలకల లాడుతూ వుంటుంది. నాకు యీయామె భార్య అయితే నేను బహు సుఖంగా వుందును. భార్యా? ఆమాట తలపెట్టకూడదు. వద్దువద్దు. ఈయింద్రియసుఖాపేక్షనుంచి నాహృదయము మళ్ళునుగాక!

[తిమ్మయ్య ప్రవేశించుచున్నాడు.]

తిమ్మ—నేను దోసకాయలు తీసుకువచ్చినాను. మీరు కొంచెముసేపు వోపిక పెట్టినట్టయితే నేను వెళ్ల నక్కరలేకుండా అవే యిక్కడకు వచ్చును.

ధన—నేను ఇంట్లో లేనప్పుడు మన యింటికి వచ్చినచిన్నదాన్ని యెందుకు జడిపించినావురా ?

తిమ్మ—నేను జడిపించ లేదు. ఆవిడెను చూచి నేనే జడుసుకున్నాను.

ధన — దొంగవెధవా ! ఆవిడెను చూచి నీవు జడుసుకున్నావేమి ?

తిమ్మ—ఆవిడె నేను వుంటే భయంలేదు తానున్నచోట నన్ను వుండవచ్చు నన్నది. నే నదివరకు విన్నమాటలమీద నాకు భయం వేసినది.

ధన—నీ వేమిమాటలు విన్నావు ?

తిమ్మ—మగవాడియిష్టం లేకుండానే స్త్రీ వెళ్ళి వంటరిగా మాటుమాట్లు మాట్లాడివస్తే బలవంతంగా పెళ్ళి చెయ్యావచ్చునని మీ రావిడెతో చెప్పడం నేను వినలేదా ? మీతో చెపుతాను. నాకు యిష్టంలేనిది యెవత్తయినావచ్చి బలవంతంగా నన్ను పెళ్ళిచేసుకోవడానికి నేను లోబడుతానా ?

ధన—ఓరి బండకుంకా ! ఆమాటలు విన్నావుట్రా ?.

తిమ్మ—విన్నాను.

ధన—ఎక్కడనుంచి ?

తిమ్మ—తలుపుచాటునుంచి.

ధన—ఆచేతికర్ర యీలాగు తీసుకుని రా.

తిమ్మ—వీధిలోకి వెళుతారు కాబోలును. జోడుకూడా తీసుకుని రానా?

ధన—ముందుగా ఆకర్ర తీసుకుని రా.

తిమ్మ—ఇదుగో (అని తెచ్చి యిచ్చుచున్నాడు.)

ధన—(పుచ్చుకొని దానితో తిమ్మయ్యను కొట్టి) వెధవా! ఇక ముందుకూడా యిలా తలుపులవద్దపొంచు నిలుచుండి వింటావా! బుద్ధి వచ్చిందా?

తిమ్మ—(ఆత్మసంరక్షణార్థముగా బల్ల నెత్తి కడ్డము పెట్టుకొని) నేను పోయి మీమీద ఫిర్యాదు చేస్తాను.

[వేంకటపతిరాజు ప్రవేశించుచున్నాడు]

వేంక—నాన్నగారూ! ఇది యేమిటి?

ధన—నేను ప్రొద్దున్న వక క్లయింటుతో రహస్యంగా మాట్లాడినమాటలు యీాదున్నపోతు విన్నాడు.

తిమ్మ—నావినడంవల్ల మీారిప్పుడు చెప్పడంవల్ల వచ్చేదానిలో సగం నష్ట మయినా లేదు.

ధన—గాడిదా! నోరు మూసుకో? మేము మాట్లాడుకొన్న దానిలో రాజద్రోహం యేమీా లేదు.

తిమ్మ—రాజద్రోహం దానిలో వెయ్యోవాలయినా కాదు. అది మీాకూ నాకూ మగవాడై పుట్టినవాడికెల్లా అపాయకర మైనది.

వేంక—ఓరీ! నీకాతలుపు కనపడుతూ వున్నదా?

తిమ్మ—నిస్సందేహముగా కనపడుతూ వున్నది.

వేంక—నీమాట నాకు నమ్మకం తోచకుండా వున్నది. ఆతలుపువద్దకు వెళ్ళి చూపించు.

తిమ్మ—ఇదిగో (అని గుమ్మమువద్దకు వెళ్లి చూపుచున్నాడు)

వేంక—(పానిని తోసివేసి) ఫో (అని వీథిలోనికి గెంటి తలుపు లోపల గొళ్లెము వేసి) నాన్నగారూ! అది యేమిటో యిప్పుడు చెప్పండి.

ధన—నేటి వుదయాన్న నేను వకక్లయింటుతో రహస్యంగా చెప్పినసలహాను తాను పొంచుండి విన్నానని యీ కుక్కలకొడుకు నాయెదుట వప్పుకుంటూవున్నాడు. ఆసంగతి యెందుకుకాని, నీకు భార్య కావలె నన్నావుగదా యింకా నీ వాకోరికతోనే వున్నావా?

వేంక—ఆకోరికతోనే వున్నాను.

ధన—నీకోసం చక్కని గుణవంతురా లయిన పదహారేళ్ల చిన్నదాన్ని మాట్లాడినాను.

వేంక— మీమేలు యెప్పుడూ మరచి పోను.

ధన—ఆచిన్నది యిరవై వేలురూపాయలు అరణంకూడా తీసుకు వస్తుంది.

వేంక—ఆలాగైతే ఆచిన్నది మారతిసుందరి.

ధన—మారతిసుందరిని గురించి యెవరు చెప్పినారు? నేను కుదిర్చినచిన్నది నకస్నేహితుని కూతురు.

వేంక—ఆలాగయితే ఆచిన్నది నాకు భార్యగా పనికిరాదు.

ధన—ఆచిన్నదే నీకు తప్పకుండా భార్య అవుతుంది? ఆచిన్నది నీ కక్కరలేకపోతే నీకెప్పుడూ భార్యేరాదు.

వేంక—నేను మరికొంతకాలం కనిపెట్టుకొని వుంటాను.

ధన—ఇఖ నీకనిపెట్టుకు వుండడం పనికిరాదు. నీవు ఆ చిన్న దాన్ని పెళ్లాడితే పెళ్లాడు. లేకపోతె నేను నీముఖం చూడను.

వేంక—ఆచిన్నదాన్నా?

ధన— అవును. ఆచిన్నదాన్నే. నేను చెప్పినచిన్నదాన్ని వివాహం చేసుకుంటే నేను నాఆస్తిలో సఖం నీకు యిస్తాను. చేసు

శోకపోతే యేమీయివ్వకుండా నిన్ను కట్టుబట్టలతో నాయింట్లోనుంచి వెళ్ళగొడుతాను.

వేంక—నాన్నగారూ! ఆలోచించుకోవడానికి నాకు కొంచెం కాలం సావకాశం యివ్వండి.

ధన—పదినిముషాలకాలం యిచ్చినాను. ఈలోపుగా ఆలోచించుకో.

[తిమ్మయ్య ప్రవేశించుచున్నాడు]

తిమ్మ—అయ్యా! మోహినీదేవి వచ్చింది. ఆవిడె యిప్పుడ మిమ్మలిని వెంటనే చూడవలె నంటూవున్నది. (ధనకోటిరాజుగా వద్దకి వెళ్ళి మెల్లగా) ఆవిడె మిమ్మలిని పిశాచంలాగు పట్టుకున్నది ఇఖ వదలిపెట్టదు.

ధన—వదురుబోతా! నీలధిక ప్రసంగం చాలించి, ఆవిడను లోపలికి రమ్మను.

తిమ్మ—చిత్తము. (అని వెళ్ళుచున్నాడు)

ధన—అబ్బాయీ! నీవు కూడా వెళ్లి మోహినీదేవి వెళ్లి తరువాత మళ్ళీ రా.

వేంక—మంచిది. (అని వెళ్లి మోహినీదేవియు నతడును ఏమేమో సైగలు చేసికొనుచున్నారు)

[మోహినీదేవి ప్రవేశించుచున్నది]

ధన—ఓసుందరీ! కార్యం నీ వనుకొన్న ట్లయినదా?

మోహి—దివ్యంగా అయినది. కాని నామనోభీష్టసిద్ధి అయే కాలం మిక్కిలీ సమీపించడంచేత—మనస్సులో యేలాగో వున్నది అది యిలాగంటిదని నేను చెప్పలేను. నాకు మూర్ఛ వచ్చేటట్లు వున్నది. (అని సోలుచున్నది)

ధన—(తొందరపడి మెల్ల మెల్లగా సమీపమునకు వెళ్ళి పట్టుకొని) ఓ యీశ్వరుడా! నన్ను రక్షించు. తెల్లవారి లేచినతరువాత స్త్రీని నాచేతులతో పట్టుకోవడం ఈరోజున యిది రెండోమాటు. (ఆమెకేసి చూచుచు) అయ్యో! పాపము. (ఈ సమయములో తిమ్మయ్య వెంటరాఁగా వేంకటపతి రాజును రతిసుందరియు చప్పుడుకాకుండ మెల్లగా ప్రవేశించుచున్నారు)

ధన—ఈవిడను చూస్తే నాకు జాలి వేస్తున్నది. చిన్నపిల్లవాడు నాతొడలమీద కూర్చుండి నాన్నా అని పిలుస్తూవుంటే కలిగేసంతోషం నేనుమాత్రం యెందుకు పొందరాదు? ఇక్కడ యెవరూ సమీపంలో లేరు. (అని యామెను ముద్దు పెట్టుకొనుచున్నాఁడు)

తిమ్మ—(అప్పు డెదుటకు వచ్చి నిలుచున్నాఁడు)

మోహి—(మూర్ఛ తేరి కేక వేయుచున్నది)

ధన—(నివ్వెఱపడి వేగిరము మాటరాక తడఁబడుచు) ఏ—ఏ—ఏమిటిది?

మోహి—ఏమీలేదు. (తిమ్మయ్యవంక చూచి) ఏదోకొంచెం భయంవేసి వెనుక కొరిగినాను.

ధన—కొంకనక్కా! ఈగది విడిచి అవతలికి పో.

మోహి—అతడు వెళ్ళ నక్కరలేదు. నేను యిప్పుడు చెప్పబోయేదానికి రహస్యం అక్కరలేదు.

ధన—సత్యం. ఇఖ రహస్యంతో పనిలేదు. నీ విప్పుడు చెయ్యవలసిన పనల్లా ఆపురుషుడిపేరుమాత్రం చెప్పి సాక్షులను తీసుకుని రావలెను.

మోహి—సాక్షులు దగ్గరనే వున్నారు. ఆపురుషుడిపేరు—ఆహాహాహా!—నేను నిజంగా నవ్వు ఆపుకోలేకుండా వున్నాను. క్షమిం

చవలెను—ఆతడి పేరు—ఆతణ్ని మీరు బాగా యెరుగుదురు.

ధన—అతడు పురుషులలో ధన్యుడనిమాత్రం నేనెరుగుదును.

మోహి—అతడు ధన్యుడని మీరు మనస్ఫూర్తిగా తలుస్తారా?

ధన—నామనస్ఫూర్తిగా తలుస్తాను.

మోహి—ఆలాగయితే అతడు—ఆహాహా!—మీరు యిదివరకే గ్రహించి వుంటారు—ఆతడు సామాన్యపురుషుడు కాడు—హాహాహా!—ఆధన్యపురుషులు మీరే. ఆయన పేరు ధనకోటిరాజుగారు. ఇరుగో వీరే నాసాక్షులు.

[అప్పుడు వేంకటపతిరాజును రతిసుందరియు ముందుకు వచ్చుచున్నారు]

తిమ్మ—ఆహాహాహా! దివ్యంగా వున్నది. చివరకు ప్రభువు వారే వీడెవలలో పడ్డారు.

ధన— మోహినీ! నీవు నాకు తగినదానవే.

తిమ్మ— మిమ్మలిని మించినది.

ధన —ఆచిన్నది యెవరు?

మోహి— నామేనకోడలు.

ధన —ఆచిన్నదానికి యిరవై వేలరూపాయలూ వస్తవా?

మోహి—నేను కోరినపురుషుణ్ని నేను వివాహా మాడినతరువాత వస్తవి.

ధన—ఎవరిని ?

తిమ్మ—ఏలినవారినే. మీరే యీవెవలలో తగులుకొన్నారు. ఆహాహాహా!

ధన—మోటదున్నపోతా! వూరుకో—ఈచిన్నదాన్ని నేను యిదివరకు చూచినాను. అమ్మాయీ! నీవు యీవుదయాన్న యిక్క-

కిక యెందుకు వచ్చినావూ?

రతి — నేను వేంకటపతిరాజుగారిని చూడడానికి వచ్చినాను.

ధన — ఆలాగయితే నీవు మావాణ్ని యిదివరకేయెరుగుదువా?

రతి— ఎరుగుదును. ఆయన నన్ను వివాహం చేసుకుంటానని ఆరునెలలక్రిందటనే మాట యిచ్చినారు.

వేంక — ఇఖ నేను దాచనలసిన పని లేదు. ఈమె చెప్పిన మాట నిజమే. నేను వివాహం చేసుకోవడానికి వరించి లోబరుచుకొన్నది యీ చిన్నదాన్నే. యీచిన్నదాని సుఖం కోరే మోహినీదేవి గారు మావివాహానికి మిమ్మల్ని వప్పించడానికి యింత ప్రయాసపడ్డది.

ధన—వివాహ మంటే నాకు వుండే అసూయే మీకు యిరవై వేల రూపాయల అరణం యిప్పించిందా?

మోహి —నిశ్చయంగా. నేను మీకు భార్యను కాలేక పోయి నప్పటికీ, అప్పుగాలినిగానైనా వుంటాను.

ధన — ఓముద్దరాలా! నీ అమాయకత్వానికి చాలా సంతోషించినాను. యీఅమాయకత్వం నిన్ను చూచి నేను నేర్చుకుంటాను. (తనలో) పాపము నేను వద్దంటే యిప్పుడు యీమె యెంత చిన్న పోతుందో. నా మనస్సులో వున్న అభిలాషప్రకారంగా యిప్పుడు యీవిడెను వివాహం చేసుకోవడానికి వప్పుకుంటే యీ దౌర్భాగ్యుడు వేంకటపతిగాడు బ్రతికివున్నంతకాలమూ నన్నాక్షేపించి నవ్వుతూ వుంటాడు. (బిగ్గరగా) నాకు చాలా విచారంగా వున్నది.

వేంక—(ముందుకు వచ్చి) విచారంగా యెందుకు వున్నది?

ధన —ఈమెను నిరాకరించవలసి వచ్చినందుకు.

వేంక— యెందుకు నిరాకరించవలెను?

ధన — నేను నిరాకరించడంవల్ల కలిగేదుఃఖానికి యీమె

తాళగల దని నీకు ధైర్యం వున్నదా?

వేంక—(తల యూఁచుచున్నాఁడు)

ధన—తాటికాయలాగు తల ఆడిస్తా వేమి? పరిహాసం మాని నే నడిగిన దానికి జబాబు చెప్పు.

వేంక—యీామెయందు మీాకు నిజమయినయిష్టం వున్నదా? చెప్ప నక్కర లేదు. మీాఅభిప్రాయాన్ని మీామాటలకంటె యిప్పుడు మీా చూపులే నాకు బాగా చెప్తుతూవున్నవి. ప్రస్తుతస్థితినిబట్టి మీాసుఖమందు నాకు వుండే అపేక్షనుబట్టి నేను తప్పకుండా—

ధన—చాలును. నీఅభిప్రాయం నాకు తెలిసింది. మోహినీ! నీవు నాకు వోడిపోయినావు. నీఆస్తి నాకు యిచ్చుకోవలెను.

మోహి—ఎందువల్ల?

ధన—నాకు లోబడడంవల్ల. ఇప్పుడు పాణిగ్రహణం చేసి నిన్ను నాకు సమర్పించుకోవలెను. (అని చేయి చాచుచున్నాఁడు)

మోహి—రాజుగారు నన్ను యిప్పుడు వేళాకోళం చేస్తూ వున్నారు—

తిమ్మ—(తనలో) ఆతడు నిన్ను పెళ్ళి చేసుకుంటే నీవే వేళా కోళం చేస్తావు.

మోహి—ఇది మోసానికి యెదురుమోసం కాబోలును.

ధన—ఇది మోసంగాదు. నేను నామనస్ఫూర్తిగానే చెప్తుతూ వున్నాను. నీవు నాస్వభావానికి సహించగలిగే టట్లయితే, నిన్ను నా అర్ధాంగినిగా చేసుకొని నా ధనమంతా నీ స్వాధీనం చేస్తూవున్నాను.

మోహి — ఈ అనుగ్రహం నేను యెంతమాత్రమున్ను యెదురు చూడనిదిన్ని ఆకస్మిక మయినదిన్ని కాబట్టి నేను—నేను—

ధన—నీవు వప్పుకుంటావా?

మోహి—(కొంచెం సే పాలోచించి) ఆ. నప్పుకున్నాను.

ధన—హోహోహో! ఇప్పుడు నవ్వవలసిన వా రెవరు? మన ప్రథమ దర్శనసమయమందే నిన్ను చేపట్ట గల అదృష్టమంతుణ్ని నేను కానేమోనని మనస్సులో కించపడ్డాను.

తిమ్మ—ఇప్పుడు నవ్వవలసినవాణ్ని నేను. నాకు యజమానుణ్ని మించినయజమానురాలు వచ్చినందుకు బహుసంతోషంగా వున్నది. (అని గంతులు వేసి ఆడుచున్నాడు)

వేంక—మీకు యిటువంటిమంచిభార్య దొరికినందుకు నేను ఆనందిస్తున్నాను.

తిమ్మ—భార్యకాదు. అమ్మగారను.

వేంక—నాన్నగారూ! "నేను భార్య కావలె నని కోరేటంత గాడిద నయితే"— ఆహోహోహో! నా యిరవై వేల రూపాయిలూ దయచేస్తారా?

ధన—వెధవ యిరవై వేలరూపాయలు లక్ష్య మేమిటి? నాది యిఖ పదిరెట్లుధనం పోయినా, నేను యీ సుఖం వదులుకోను. అబ్బాయీ! నీ వాచిన్నదాన్ని వివాహ మాడి, నే నాచిన్నదాని మేనత్తను యెలా సుఖపెడతానో నీ వాచిన్నదా న్నలా సుఖపెట్టు.

మోహి—తుద కిదంతా విచిత్రంగా అయింది. ఇప్పుడు చూచిన వాళ్లకందరికీ నామేనకోడలినిమిత్తంకంటె నానిమిత్తమే నే నెక్కువప్రయాసపడ్డట్టు తోస్తుంది. పరియాచికానికి భర్త అనుకున్న వాడు నిజంగా భర్త కావడమే తటస్థిస్తూ వున్నది. ఇ దంతాచూడగా ధనకోటిరాజుగారు—

ధన—తాముపన్నిన వలలో తామే పడ్డారు—మిగిలినది నేను పూర్తి చేసినాను. (అందఱు నిష్క్రమించు చున్నారు)

# మహాబధిర ప్రహసనము.

ఇందువచ్చు పాత్రములు.

సుమంత్రుఁడు—ఇందుముఖితండ్రి.

ధనపాలుఁడు—ఇందుముఖిని వివాహ మాడఁదలఁచుకొన్నవరుఁడు.

విజయవర్మ—విశాలాక్షియన్న.

వసంతసేనుఁడు—అన్నపూర్ణమ్మతమ్ముఁడు.

ఇందుముఖి—సుమంత్రునికూఁతురు.

విశాలాక్షి—ఇందుముఖిచెలికత్తె; విజయవర్మచెల్లెలు.

అన్నపూర్ణమ్మ—పూటకూళ్లమ్మ.

చండిక—వంటలక్క.

సుబలుఁడు, రాముఁడు, కృష్ణుఁడు—అన్నపూర్ణసేవకులు.

---

౧. రంగము—అమలాపురములోని పూఁటకూటిఇల్లు.

[సుమంత్రుఁడును, ధనపాలుఁడును, కూరుచుండఁగా అన్నపూర్ణమ్మ పరివేషించుచున్నది.]

అన్న—ఓరీ! సుబలా! రామా! కృష్ణా! ఒక్క చండిక తప్ప నవుకర్లు యెవరూ కనపడ రేమి? బజారికి వెళ్లడానికి యిక్కడ వక్కడూ లేడు.

(అని లోపలికి వెళ్ళుచున్నది.)

సుమం—ఈవిడె కేకలవల్ల నాకు ఆట తోచకుండా వున్నది. ఇఖ ఆట మానివేసి లేతాము. (అని చేతిలోని చీట్లు క్రింద పడవేయుచున్నాఁడు)

ధన—ఆటంతా పాడుచేసినారు. నాకు యీమాటు ఆరు బొమ్మలు వచ్చినవి. చివరదాకా ఆడితే యీమాటు నేను తప్పకుండా గెలుస్తును. నేను గెలిచేటప్పుడు మీరు యెప్పుడూ యిలాగే చేస్తారు. యిలాచేస్తే నాకు మహాకోపం వస్తుంది.

సుమం—(లేచి) నీవు కోపం చల్లార్చుకోవలెను. నీకు చీమ చిటుక్కుమంటే కోపం వస్తుంది. చీటికీ మాటికీ యిలా ముక్కుమీద కోపంవుంటే సరిపడదు. నీకు నాకూతురుని యివ్వబోతూ వున్నాను గనుక, మొఖమాటంలేకుండా చెప్పడం ధర్మమని చెప్తుతూవున్నాను.

ధన—కూతురిని యివ్వబోతానని నావంటి గొప్పయింటి బిడ్డను యిలా తృణీకరించడం మాత్రం మీకు ధర్మంకాదు. మీకూతురూ వారూ యింకా వచ్చినారు కారు. నిష్కారణంగా యిలా ఆలస్యం చెయ్యడం నాకు యిష్టంగా వుండదు.

సుమం—పడవలు రానిదే వాళ్లు యెలా వస్తారు? యింకా పడవలు వచ్చేవేళ కాలేదు. రాజమహేంద్రవరమునుంచి వచ్చే పడవలు పన్నెండుగంట లయితేనే కాని రావు. కొత్త పెళ్ళికొడుకువు గనుక నీకు తొందరగా వుంటుంది.

ధన—ఇది తొందరా? పన్నెండుగంట లయ్యేటప్పటికి పిండివంటలతో భోజనం సిద్ధంకావలె నని యీపూటకూ టావిడతో చెప్పి యేర్పాటుచేసినాను. ఆలస్య మైతే అన్నంచల్లారి పాడయి పోతుంది.

సుమం—నీవు మహాబుద్ధిమంతుడవు.

ధన— అవును, నేను బుద్ధిమంతుణ్నే. మాపల్లంకురులో నన్నందరూ నూతనబృహస్పతిగా భావిస్తారు.

సుమం—అది గొప్పగా యెంచడానికి మీపల్లంకురు అంత పెద్దగ్రామం కాదు. అక్కడ చదువుకున్న పండితులు యెవరూలేరు.

అందుచేత నీ వక్కడ బృహస్పతివే కావచ్చును.

ధన—మీరు యెగతాళి చెయ్యకండి. నన్ను మావూళ్ళో వాళ్ళు పూర్వం చిన్నతనంలో తెలివితక్కువవాడే అనుకునేవారుగాని, నేను స్వతంతు్రణ్ణాయి వెనుక రెండుమాసాలు రాజమహేంద్రింలో వుండి వచ్చి నప్పటినుంచీ మావూళ్ళో బ్రాహ్మలు నన్ను బృహస్పతి కంటెనూ గొప్పవాణ్ణని నిత్యమూ స్తుతిచేస్తూ వుంటారు.

సుమం—ఆహాహాహా!

ధన—వోపికవుంటే మీమనసువచ్చినంత సేపు నవ్వండి. మొట్ట మొదట యెరుగక మావూళ్ళోవాళ్ళు నన్ను తెలివితక్కువగాడిదనే అనుకునేవారు. కాని మాతండ్రిగారు పోవడంతోటే నేను మూడు నెలల్లో మూడువేలరూపాయలు ఖర్చు చేసే టప్పటికి బ్రాహ్మలు అప్పుడు నా తెలివి కనుక్కుని స్తోత్రపాఠాలు చెయ్యడానికి ఆరంభించి నారు. మానాన్నగారు నిలవచేసినడబ్బు ఖర్చుచేసినతరువాత నాకు మరీ తెలివి వచ్చింది. యిప్పుడు పరదేశస్థుడు రెండురూపాయలప్పుడు వచ్చి అన్నంలేక నాలుక పెరుక్కున్నా చిల్లిగవ్వ చేతులో పెట్టను. ఇఖ నాకు పెళ్ళాం వస్తుంది. డబ్బు పాడుచేసుకోను. ఆహాహాహా! మీరు నాకు యెన్ని తోటలు వున్నవో కళ్ళారా చూచినారుకదా! హాహాహా! సంవత్సరానికి రెండువేలరూపాయలు వస్తవి. హాహాహా! మీకు సంతోషంగా వున్నదా? హాహాహా! ఇఖ నేను పెళ్ళి ప్రయత్నానికి మాపల్లెంకురు వెళ్ళవలెను! హాహాహా! మీకోమార్తె సుఖపడుతుం దని యిప్పుడు మీకు నమ్మకం తోచిందా? హాహాహా!

సుమం—అట్టే నవ్వబోకు. ఇప్పుడు నీసంతోష మంతా పొంగి పొర్లి పోతూ వున్నది. అంతా యిప్పుడే అయిపోకుండా పెళ్ళినాటికి కొంచెం దాచుకో. (తనలో) ఈవాలకం చూస్తే నాఅల్లుడు వట్టి

బుద్ధిహీనుడులాగు కనపడుతూ వున్నాడు.

[అన్నపూర్ణమ్మ ప్రవేశించుచున్నది.]

సుమం—అన్నపూర్ణమ్మగారూ ! ఈపాటికి పడవలు వచ్చి వుంటవి. మావాళ్లను తీసుకుని రావడానికి పంపించిన బండికోసం మేము వీధిగుమ్మంలో కూర్చుండి యెదురు చూస్తూ వుంటాము. నాకూతురు రావడంతోటే కూర్చుండడానికి గది సిద్ధం చేయించండి.

అన్న—ఎంతసేపు ? నిముషంలో సిద్ధం చేయిస్తాను—ఓసీ ! చండీ ! చండీ !

[అప్పుడు చండిక ప్రవేశించుచున్నది.]

చండి—అమ్మా ! వస్తున్నాను. నేను యిక్కడికే వస్తూ వుండగా మీమాట వినపడేటప్పటికి అమ్మగారు యేదో జరూరుపని వుంటేనేకాని పిలవరని మళ్ళీ వెనక్కు వెళ్లకుండా చటుక్కున చక్కా వచ్చినాను.

అన్న—ఆసోదంతా యెందుకు ? నేను చెప్పిన పని చెయ్యి. యీతాళంచెవి పట్టుకొని వెళ్లి దక్షిణపుసావిట్లో నాలుగోగదితలుపు తీసి చాపలూ అవీ వేసి సిద్ధంగా వుంచు. ఇప్పుడే పడవలలో యీయన కొమార్తె మొదలయినఆడంగులు వస్తారు.

ధన—పిండివంటలతో భోజనం పెట్టడానికి తలకు వక అర్ధ రూపాయ చొప్పున యిస్తానని యిదివరకే యేర్పాటు చేసినాను. ఇందులో నీవు మళ్ళీ యేమీ పేచీ పెట్టగూడదు. కూరలూ పచ్చళ్ళూ యేమేమి చెయ్యవలెనో యిదివరకే యేర్పాటు చేసినాను. చెప్పిన దానికంటె యెక్కువగా చేసి సొమ్ము తెమ్మంటే తరువాత నేను యిచ్చే వాణ్ని కాను. ఇప్పుడే చెప్పివేస్తూ వున్నాను. పిండివంటలతో భోజనం పెట్టవలసినవారు నలుగురే సుమా ? నవుకర్లు భోజనానికి పూటకు

రెండేసి అణాలు. యీపత్రికారం యివ్వడం నీకు చాలాలాభం. అయినా కానీ యిదివరకు వప్పుకున్నాను గనుక, అనుకున్నట్టు యిచ్చివేస్తాను.

అన్న—ఇది నాకే లాభమా? నేను యీఅన్నసత్రం పెట్టిన తరువాత యెప్పుడూ పిండివంటలతో భోజనం పెట్టడానికి—

ధన—ఆసంగతి పోనీ—మామగారూ! పిండివంటలతో పెట్టడానికి మనిషినక్కంటికి అర్థరూపాయి యివ్వడానికి వప్పుకున్నాను. (తనలో) నాలుగర్థలు రెండు రూపాయలు. అబ్బో! రెండు రూపాయలా? నవుకర్లు యెంతమంది వుంటారో!— (బిగ్గరగా చండికతో) నాగదికి పక్కనువున్న గదిలో భోజనానికి నాలుగువిస్తళ్ళు వేయించు. మే మంతా కలిసి భోంచేస్తాము. లెఖ్ఖనాలుగు విస్తళ్లేసుమా!

చండి—మీారు నాతో చెప్పేది యింతేనా? ఇంకా యేమైనా వున్నదా?

ధన—అంతే. అంతే. నీతో యేమో చెప్పవలెననుకొని మరిచిపోయినాను. నేను పడుకునే గదిలో పరుపు వెయ్యేమి? జాగ్రత నేను చెప్పింది మరిచిపోకు.

చండి—డబ్బు చేతులోపడుతూవుంటే మీా యెదుటవున్నంత సేపూ నేను యేదీ మరిచి పోను. యీస్థలం విడిచి వెళ్ళితే తరువాత మీాకు యెంతజ్ఞాపకమో నాకూ అంతే జ్ఞాపకము.

ధన—ఆహాహాహా! బాగా చెప్పినావు——మామగారూ! బండి వస్తూవున్నదేమోచూతాముర౦డి. (అని వీధిలోనికి వెళ్ళుచున్నాడు)

సుమం—చూచినకొద్దీ నాఅల్లుడు వట్టిగాడిద అయినట్టు స్పష్టమవుతూ వున్నది. ఇతను వట్టి కోపిష్టీన్నీ లుబ్ధున్నూ వదరుపోతున్నూగా కనపడుతూవున్నాడు. ఇంతమట్టునకు వచ్చినతరువాత ఇక పిల్లనియ్యననడం బాగా వుండదు

ధన— (వీధిలోనుండి) రండి మామగారూ! రండి.

సుమం—వస్తున్నాను. (అని వెళ్లుచున్నాఁడు)

చండి—అమ్మా! ఈధనపాలుడుగారు బొత్తిగా పనికి మాలిన వారుగా నున్నారు. ఈయన కిచ్చి పెళ్ళి చెయ్యబొయ్యే చిన్నదాన్ని తలచుకుంటే నాకు విచారంగా వున్నది. నన్ను పెళ్ళి చేసుకోమంటే యితణ్ని నేనుకూడా---

అన్న—ఈ విషయం నీకు యేమీ తెలియదు. ఇతను బుద్ధి హీనుడయినా డబ్బున్న బుద్ధిహీనుఁడు. లోకంలో డబ్బువుంటే—

చండి—నన్ను ఎవరో పిలుస్తూ వున్నారు. వెళ్ళుతాను.

అన్న—పరుగెత్తబోకు. నేను చెప్పేమాట విని మరీ వెళ్ళు. యీ పెళ్ళివారు తప్ప మరి యెవరువచ్చినా చోటు లేదని చెప్పి పంపించి వెయ్యి. యెంతడబ్బు యిస్తామన్నా డబ్బు కాశపడి యెవరినీ లోపల ప్రవేశపెట్టకు.

చండి—గది లేదు. సావిడి లేదు. వసారా లేదు. కూర్చోడాని కయినా స్థలం లేదు. యేమీ లేదు. అని చెపుతాను.

అన్న—వూరికే వాగబోకు. నీ అధికప్రసంగం చాలించి యెవరు పిలుస్తూవున్నారో వెళ్ళి చూచిరా.

చండి—నిముషంలో చూచి వస్తాను. (అని పరుగెత్తుచున్నది)

అన్న—ఇది తెల్లవారి లేచింది మొదలుకొని రాత్రి పడుకో పోయిందాకా వూరికే వదురుతూ వుండడమేకాని పని యేమీ చెయ్యదు.

(చండిక యిందుముఖిని విశాలాక్షిని వెంటఁబెట్టుకొని వారల ప్రవేశించుచున్నది)

అన్న—అమ్మా! యిలారండి.

చండి— అమ్మలారా! యిలారండి. యిలారండి. గుమ్మం దాటే టప్పుడు జాగ్రత. కాలికి దెబ్బ తగులుతుంది. గడప మెల్లిగా దాటండి. మీరు చాలా దూరాన్నుంచి వచ్చినారు కాబోలును. లోపలికి వచ్చి కూర్చుంటారా? అమ్మా! మీ పెట్టెలు —

అన్న—(చండికను చేయి పట్టుకొని యీవలికి లాగి రహస్య ముగా) చండీ! నీవు వూరికే అగవక నోరు మూసుకో.

ఇందు— పెట్టెలు మా నాన్నగారు లోపలికి పట్టించుకుని వస్తారు.

అన్న—అమ్మా! మీరు రావడం నాకు చాలా సంతోషంగా వున్నది. మీరు వస్తారని యీరోజున యిరవైమందిమార్గస్థులను బస దొరకదని చెప్పి పంపివేసినాను. లోపలికి రండి.

చండి—ఇరవైమందా? యెక్కడ యిరవైమంది? చలిది భోజ నాలవేళలకు లోపుగానే బసలు లేవని చెప్పి నేను వక్కర్తెనే నలభై మందిని అవతలికి పంపివేసినాను.

అన్న—చండీ! వూరుకో—అమ్మా! మీరు వచ్చేముందరనే వక పదుచు చిన్నవాడు వచ్చేటప్పటికి బస దొరకదని చెప్పి పంపివేసి నాను. అతడు వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళిపోయినాడు.

విశా—(ఇందుముఖితో రహస్యముగా) చెలీ! ఆవచ్చిన వతడే కాబోలు.

అన్న—అమ్మా! నేను వెళ్ళి మీగది తయారుగా వున్నదో లేదో చూచి వస్తాను—చండీ! మనము వెళ్ళుదాము రా. (అని యిద్దఱును వెళ్ళుచున్నారు)

ఇందు—అతడే కాబోలునా? ఆహాహాహా! ఆపడుచు చిన్న వాడికి అమలాపురంలో పూటకూళ్ళసత్రంలో వుండవలసిన అవసరం

లేదు. ఆ వచ్చినవాడు ఒకవేళ మనం రాజమహేంద్రివరంలో విడిచి పెట్టివచ్చిన నీవరుడు వెంకయ్యగారు కావచ్చును.

విశా——ఎవరయినా కావచ్చును. మాఅన్న విజయసర్మమాత్రం యెందుకు కాగూడదు? వారిద్దరిలో యెవరో ఒకరు మనకంటె ముందు పడవలో వచ్చి వుండవచ్చును. వస్తే యిద్దరూ వచ్చి వుండవచ్చును.

ఇందు——నీవు యిందాకాకూడా యిలాగే చెప్పినావు.

విశా——వారు సమీపానికి వచ్చివుంటారని నాకు దృఢంగా నమ్మకం వున్నది. నామాట నమ్ము.

ఇందు——ఓసీ! నీవు వూహాలు మహాబాగా చేస్తావు. మానాన్నగారు రాజమహేంద్రవరాన్నుంచి యిప్పుడు నన్ను యెందుకు పిలిపించినారో వూహచేసి చెప్పు. నేను యిరవయిసార్లు మళ్ళీ మళ్ళీ చదివినా నాకు బోధపడలేదు. ఇదిగో మానాన్నగారు వ్రాసిన వుత్తరం చదువుతాను విను. (అని యుత్తరము తీసి చదువుచున్నది). "అమ్మాయీ! ఆస్తీ తోటలూ నేను స్వయంగా చూచినాను. అవి చూడడంతోటే నాకు చాలా సంతోషం కలిగి నిన్ను ధన్యురాలినిగా చెయ్యడానికి నిశ్చయించు కున్నాను"——నన్ను ధన్యురాలినిగా చెయ్యడానికా? ఈమాటలు నాకేమీ అర్థం కావడంలేదు. తరువాత చదువుతాను విను——"మీరు వెంటనే పడవమీద బయలుదేరి అమలాపురంలో అన్నపూర్ణమ్మగారి సత్రింలో నన్ను వచ్చి కలుసుకోండి. వచ్చేటట్టయితే నీ స్నేహితురాలిని విశాలాక్షినికూడా వెంట బెట్టుకునిరా".

విశా——అన్నిమాటలూ నాకు అర్థమయినవి. నిన్ను ధన్యురాలినిగా చెయ్యడం అంటే నీకు వివాహం చెయ్యడం. ఇక పెళ్లికొడుకు యెవ్వరంటావేమో? మా [illegible]వుతారు. ఆస్తీ తోటలూ వివాహకాలమందు [illegible]దంపతులకు

మీా నాన్నగారు అరణం యిచ్చేవి. ఇప్పు డన్నిమాటలకూ అర్థం బాగా తెలిసిందా?

ఇందు—బహుబాగా తెలిసింది. నీ అన్నగారిని మాత్రం పుట్టి బుద్ధియెరిగిన తరువాత మానాన్నగారు యెప్పుడూ చూడలేదు; పేరయినా చెప్పఁగోగా వినలేదు. ఇంతకం టే యేమి తెలియవలెను? మా మేనత్తగారియింటికి వెళ్లినప్పుడు నాకు పెద్దాపురంలో మీాఅన్న గారితో మొట్టమొదట పరిచయం కలిగినది.

విశా—అవును. నాకు యిప్పుడు వకటి తోస్తూవున్నది.

ఇందు—వెంకయ్యగారుతప్ప నీకు మరియేమీా తోచదు. నేనూ తోచడం లేదు; మీా అన్నగారూ తోచడం లేదు; నేను యిప్పుడు చదివినవుత్తరంయొక్క అర్థమూా తోచడంలేదు.

(రాముఁడు వెంటరాఁగా చండిక ప్రవేశించుచున్నది)

చండి—అమ్మా! మీాగది సిద్ధంగా వున్నది. మీాకోసం నేను శ్రమపడి గదంతా శుభ్రం చేసినాను. అది యీాయింట్లోవున్న గదులలో కల్లా మంచిగది. మీా రాగది చూస్తే—

రాము—చండీ! అమ్మగార్లతో నీవు చెప్పేది వేగిరంకానియ్యి. నీవు చెప్పే దయిపోతే నేను చెప్పవలసింది నేను చెప్తాను.

చండి—అయ్యో! నేను మరిచే పోయినాను. అమ్మా! యితను రాముఁడు. ఇందాకా యితను నాతో చెప్పినాఁడు. ఏమని చెప్పినాడా? ఏమిటో మరిచి పోయినాను. జ్ఞాపకం చేసుకోనియ్యండి. మీారు రావడం తోటే తనతో—ఓరామూ! నేను చెప్పేది సరిగా వుంటూవున్నదా?

రాము—చండీ! నీవు వూరికే ఆయాసపడక నాపని నన్నే చెప్పనియ్యి. అమ్మా! రాజమహేంద్రవరాన్నుంచి వచ్చిన ఆడంగులు మీారే అయినట్టయితే, యిదుగో మీాలో వకరికి నేను వుత్తరం తెచ్చి

నాను. (అని విశాలాక్షి చేతి కిచ్చుచున్నాఁడు.)

విశా—(పుచ్చుకొని) ఈవుత్తరంపయిని చిరునామా లేదే. ఇది నీచేతికి యెవరు యిచ్చినారు ?

రాము—ఆయన మిాతో తనపేరు చెప్పమన లేదు. ఆయన తనపేరు నాతోనూ చెప్పలేదు గనుక నేను యిప్పుడు చెప్పుదామన్నా చెప్పలేను.

విశా—(ఇందుముఖితో)మనం యీావుత్తరం పుచ్చుకుందామా?

ఇందు—వుత్తరం పుచ్చుకుంటే నష్టం యేమి వుంటుంది ? పుచ్చుకో.

రాము—అమ్మా ! భయపడక పుచ్చుకో. వుత్తరం పుచ్చుకుంటే నష్టం యేమిాలేదు. నేను యీాసత్రంలో దిగినవారికి యెంత మందికో వుత్తరాలు యిచ్చినాను. నావుత్తరాలవల్ల యెప్పుడూ యెవరికీ నష్టం కలగడంలేదు. నామాట నమ్మండి.

చండి—అమ్మా ! యితడు చెప్పినమాట నిజం. అందుచేతనే యీాసత్రంలో వాళ్లందరూ యెప్పుడూ యితన్నే వుత్తరాలు యిమ్మంటారు.

విశా—ఈవుత్తరం పట్టుకువెళ్లి యివ్వడానికి నీకు యివ్వవలసింది యిచ్చినారా ?

రాము — పుచ్చుకున్న తరువాత లేదని యెట్లా చెప్పను ? అయినాకానీ మీారు కూడా యేమైనా యిస్తే వద్దనకుండా పుచ్చుకుని సంతోషిస్తాను. యీాలోకంలో ధనంతో తృప్తి పొందినవారు యెవ్వరున్నారు ?

విశా—ఇదుగో పుచ్చుకో. (ఒక అణా చేతిలో పెట్టి) దీనితో నీకు తృప్తి కలిగిందా ?

రాము—అమ్మా! మీకు దేవుడు మేలు చెయ్యవలెను. ఈడబ్బులతో నాకు సంతోషం కలిగినట్టే యీవుత్తరంతో మీకు సంతోషం కలుగవలెను. (అని వెళ్లుచున్నాడు.)

విశా — వుత్తరములో యేమి వున్నదో చూతాము. (అని విప్పి చదువుచున్నది)—“ఓకాంతలారా! యేమి జరిగినా చూడండి; వినండి; యేమీ మాట్లాడకండి. మీ రేమీ ఆశ్చర్యపడ్డట్టు కనపడవద్దు. ఎందుచేత నేను యిలాగు చెప్పుతూవున్నానో, అదంతా ముందు మీకే తెలుస్తుంది.”—ఈవుత్తరం మనయిద్దరినీ వుద్దేశించి వ్రాయబడ్డ దనుకుంటాను. ఇందులో దస్కతు లేదు.

ఇందు—ఏమి జరిగినా విని వూరుకోవలెనా? ఆదస్తూరీ యెవ రిదో నీ వెరుగుదువా?

విశా—గుర్తుపట్టడానికి తెలియడం లేదు. ఇది స్వాభావికంగా వ్రాసినవ్రాత కాదు. ఎవరో మారుదస్తూరీతో పట్టిపట్టి వ్రాసినారు. అయినా కానీ మనం యిందులో చెప్పినట్టు చేసి ఫలితం యేమి జరుగు తుందో చూతాము.

ఇందు—ప్రయాణం మూలముగా మాసిపోయినయీబట్టలు విడిచి మంచిబట్టలు కట్టుకుందాము. లోపలికి రా. (చండికతో) మా తండ్రిగారు వస్తే మేము యిప్పుడే వచ్చి కలుసుకుంటా మని చెప్పు.

చండి—తప్పకుండా చెప్పుతాను. నేను పదురుబోతు నని నాయజమానురాలు నన్ను యెప్పుడూ తిడుతూ వుంటుంది. నేను పదురుబోతు నయిందీ కానిదీ దేవుడికి తెలుసును. ఆసంగతి యెట్లా వున్నా నేను వచ్చినబాటసార్లకు చేసేవుపచారంలో మాత్రం యేమీ లోపం చెయ్యను.

ఇందు—అదంతా సరే కాని ముందు మాగది చూపించు

పోవలెను. ఇదిగో నీబహుమానము. (అని రెండణా లిచ్చుచున్నది.)

చండి— అమ్మా ! దణ్ణాలు దణ్ణాలు ఇదంతా డబ్బుకోసం కాదు. కాని యెవ రైనా డబ్బు చేతిలో పెడితే— మీరు తొందర పడుతూవున్నారు— మార్గం యిది. యిలారండి— మీదగ్గిర నేను మహారాణివద్ద కనిపెట్టుకునివున్నట్టు వుంటాను. మీరు మాత్రం వాకిట్లోకివచ్చి "చండీ! చండీ!" అని పిలువవలెను. పిలిచే టప్పటి కల్లా యక్షిణీచేత వచ్చినట్టు మీయెదుట నిలువబడుతాను.

(ఇందుముఖియు విశాలాక్షియు వెళ్ళుచున్నారు.)

చండి—ఈఅమ్మలు బహుమంచివారు. ఈ ఇద్దరిలో యెవరికయినా ధనపాలుడు మొగుడుకావడం తటస్థ మయితే నా కయినట్టు దుఃఖపడుతాను.

ఇందు—(లోపలినుండి) చండీ ! రావేమి ?

చండి—అమ్మా ! మరిచిపోయినాను. వస్తూవున్నాను. (అని వెళ్ళుచున్నది)

[అప్పు డన్నపూర్ణమ్మ ప్రవేశించుచున్నది.]

అన్న—ధనపాలుడు కుబేరు డంత ధనముగలవాడే కావచ్చును. కాని నేను యెప్పుడూ యింత బుద్ధిహీనుణ్ని యీలోకంలో యెక్కడా చూడలేదు. ధనాశచేత యీ యిద్దరుకన్యలలో యెవరినైనా యీనిర్భాగ్యుడికి వివాహ మనే మిషమీద బలిపెట్టే టట్టయితే నామనస్సు బహుఖేదపడుతుంది. పాపం వీరిని చూస్తే నాకు జాలి వేస్తూవున్నది.

[ఈలోపల విజయవర్మ ప్రవేశించి మెల్లగా బల్లమీద కూరుచుండి యేదో పుస్తకము చూచుచున్నాడు]

అన్న—(ఆశ్చర్యముతో) అయ్యో ! ఈయన యెవరు? ఈయన

యిక్కడకు యేలాగు వచ్చినాఁడు? ఈయన రాక చూడగా యీయన పయినుంచి వూడిపడ్డట్టు వున్నది. అయ్యా! మీకు యేమి కావలెను?

విజ—అక్కరలేదు. అక్కరలేదు. నీవు నా నిమిత్తమయి శ్రమ పడి నీళ్ళు తేనలసిన పని లేదు. నేను యెవ్వరికీ శ్రమ కలుగచెయ్యను.

అన్న—అయ్యా! మీరు యీరాత్రి యిక్కడ బస చెయ్య వలె నని వచ్చినా రనుకుంటాను.

విజ—కాదు కాదు. ఆతఁడు యీరాత్రి యిక్కడకు రానే రాడు. రేపు వుదయాన్న భోజనపువేళకు తప్పకుండా వచ్చి కలుసు కుంటాఁడు. (అని తలవంచుకొని చదువుకొనుచున్నాఁడు.)

అన్న—ఇతనిమాట యేమిటో నాకు తెలియకుండా వున్నది. వసంతసేనా! తమ్ముఁడూ!

[వసంతసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వసం—అప్పా! వచ్చినాను.

అన్న—ఈయన యెవరు? యెక్కడనుంచి వచ్చినాడు? ఇతఁడు పిచ్చివాడా యేమిటి?

వసం—కాఁడు. పిచ్చివాఁడు కాఁడు. ఈయనకు మాటమాత్రం వకపట్టాన వినపడదు.

అన్న—ఇతడు యీలోపలికి యెలాగు వచ్చినాడు?

వసం—ఈయన దొడ్డితోవను లోపలికి వచ్చినాడు. ఆయన గుర్రాన్ని తిన్నగా దొడ్లోకి తోలుకొనివచ్చి, అక్కడ గుర్రం దిగి, పట్టుకొమ్మని గుర్రం కళ్లెం నాచేతి కిచ్చినాఁడు. అప్పుడు నేను లోపల బస దిగడానికి స్థలం లేదని చెప్పినాను.

అన్న—మంచిపని చేసినావు. అందుకు యిత డేమన్నాడు?

వసం—నవ్వి, "గుర్రానికి గుగ్గిళ్ళకు శేరు వులవలు చాలును.

నీవు నాతో రా నక్కరలేదు. లోపలికి నేనే వెళుతాను" అన్నాడు. అప్పుడు నేను మాఅప్పతో మాట్లాడవలె నన్నాను.

అన్న—దాని కేమన్నాడు ?

వసం—"అబ్బాయీ! దీన్ని బాగాతోము." అని నాచేతులో వకరూపాయి పెట్టి తిన్నగా లోపలికి నడిచివచ్చినాడు. అప్పుడు నాకు యేమి చెయ్యడానికీ తోచక నీతో చెప్పడానికి నేను కూడా వెనుక వచ్చినాను.

అన్న—స్థలంవుంటే గుర్రాన్ని పాకిలో కట్టివెయ్యి.

వసం—కావలసినంతస్థలం వున్నది. ఇదుగో యితడు యిచ్చినది కొత్తరూపాయి సరి కొత్తరూపాయి. (అని వెళ్లుచున్నాడు.)

అన్న—ఇతడు స్వంతయింట్లో వున్నట్లు సుఖంగా కాలిమీద కాలువేసుకొని కూర్చున్నాడు. ఇతడు బహుమంచివాడుగా కనపడుతూ వున్నాడు. ఇతనికి చెవుడు రావడం చూస్తే జాలి వేస్తూవున్నది. ఇతడు మంచి పడుచుతనంలో వున్నాడు. బహుచక్కనివాడు. అయినా యితడు యిక్కడనుంచి వెళ్ళిపోవలెనని చెప్తాను. (మిక్కలిబిగ్గరగా) అయ్యా! పెళ్ళివారిచేత మాయిల్లంతా నిండి వున్నది. ఇక్కడ స్థలంలేదు. మీరు మరివకచోట బస చూచుకోవలెను.

విజ—అమ్మా! అతడు వేళకు రాగలుగునో లేదో అని నాకు విచారంగానే వున్నది. కోర్టులో రేపువచ్చే కేజులలో మొట్టమొదటిదే అతనిది.

అన్న—ఇక్కడ బస దొరకదు. మీరు మరివకచోటికి వెళ్లి పోవలెను.

విజ—మంచిది. నేను యీరోజున మీబసలోనే వుంటాను. నీవు బహుదొడ్డయిల్లాలవు. నీకోరికప్రకారం నేను యీవూళ్ళో వున్న

న్నాళ్ళూ మీబసవిడిచి మరివకచోటికి వెళ్లను. (అని పుస్తకము చదువు కొనుచున్నాడు)

అన్న—(గొంతుక సవరించుకొని) నేను గొంతుక బద్ద లయ్యే టట్టు యెంతబిగ్గరగా అరిచినా వక్కమా టయినా యితనికి వినపడదు. ఇతడు బహునెమ్మదిగానూ వినయంగానూ మాట్లాడుతూ వున్నాడు. ఇతడు యిక్కడ వుండడంవల్ల యింతవరకు యెవరిపనికీ అడ్డం రా వడంలేదు.

[ధనపాలుడు ప్రవేశించుచున్నాడు]

ధన— అన్నపూర్ణమ్మా! మేము యిలాగు భోజనంలేకుండా యెంతసేపు మాడేము? మేము సొమ్ము యిచ్చే టప్పుడు పెందరాళే మెతుకులు పడవేయ నక్కరలేదా?

అన్న—నేను యెంతో తొందరపడే వంట చేయించినాను. నిష్కారణంగా కోపపడక కొంచెంసేపు శాంతం వహించండి. పని చేయించుకుని యిస్తూ వున్నారుగాని నాకు మీరు సొమ్ము ధర్మానికి యివ్వడం లేదు.—ఓసీ! చండీ!

[చండిక ప్రవేశించుచున్నది.]

చండి—అమ్మా! యెందుకు పిలిచినారు? మీసెలవుప్రకారం వారికి గదిచూపి—

అన్న—నీవు వెంటనే మడికట్టుకొని వీరి భోజనానికి విస్తళ్లువేసి వడ్డన చేయించు.

ధన—చండీ. వేగిరం రా. మీయజమానురాలు చెప్పినట్లు వెంటనే చేయించు.

చండి—పక్షిలాగు యెగరడానికి నాకు రెక్కలులేవు. ఇక్కడా అక్కడా కూడా వక్కమాటే వుండడానికి నీకోసం దేవుడు నాకు

దేహాలు రెండైనా పెట్టినాను కాను. అట్టే తొందర పెట్టకండి. వెయ్యిమందికి సంతర్పణ చేసినప్పుడైనా నా కింతతొందరకలుగలేదు.

ధన—ఇది బాగా వున్నది. నౌకర్లు యిలా నిర్లక్ష్యంగా మాట్లాడుతూవుంటే నేను సహించలేను. పెద్దమనుష్యులు యిది తమ్ము అవమానంచేసినట్లు యెంచుకుంటారు. నీకు బుద్ధి చెప్తాను. నీవు ఇఖ ముందు యెప్పుడూ పెద్దమనుష్యులు మాట్లాడుతూవుంటే యెదురు జవాబు చెప్పకు.

చండి—పెద్దమనిషి నాతో మాటాడితే నేను యెప్పుడూ యెదురు జవాబే చెప్పను. (అని వెనుక తిరుగుచున్నది)

ధన—సరిసరి. బాగానేవున్నది. భోజనాలు రేపు చెయ్యవలెను గాని యిఖ యివాళ వడ్డన అయ్యేటట్లు కనపడదు. దయచేసి లోపలికి వేగిరంవెళ్లి వెంటనే వడ్డన అయ్యేటట్టు చెయ్యి.

చండి—అమ్మగారు కోపపడుతారుగాని లేకపోతే యితనికి బుద్ధివచ్చేటట్టు చేస్తును. (అని వెళ్ళుచున్నది.)

ధన—అన్నపూర్ణమ్మా! బాగా విను. భోజనాలవేళ యెవ రైనా చక్రకేళీ అరటిపళ్లు తెమ్మంటే వెయ్యకు. అవిచాలా ప్రియం. ఆ ముసలాయన చక్రకేళీపళ్లు తెమ్మంటే పొరపాటున పంపించినట్లు బొంతపళ్లు పంపించు. నేను చెప్పింది తెలిసిందా?

అన్న—భోజనానికి వచ్చినవారు యేమి కావలె నంటే అవన్లా వడ్డించి తరువాత సొమ్ము పుచ్చుకోవడం యిక్కడ ఆచారం.

ధన—ఇదివరకు యేర్పరుచుకున్న ప్రకారం పిండివంటలతోనూ కూరలతోనూ పెట్టే భోజనాని కయ్యే అర్ధరూపాయికి మాత్రమే నేను జవాబుదారీ చేస్తాను. ఎవరైనా యెక్కువవస్తువులు కావలె నంటే వాటిసొమ్ము వారివద్దనే పుచ్చుకోవలెను.

[చండిక పరివేశించుచున్నది]

చండి—అయ్యా! వడ్డన అయింది. ఇఖ మీరు మీవారితో కూడా భోజనానికి రావచ్చును.

విజ—(లేచి) వడ్డనయిందంటావా? ఇదుగో వస్తూవున్నాను.

(అని లోపలికి వెళ్ళుచున్నాడు)

ధన—ఇది మరీ బాగా వున్నది. అన్నపూర్ణమ్మా! తలకు అర్థ రూపాయి చొప్పున నేను నలుగురికేసుమా యిస్తానని చెప్పినాను. ఎక్కువమంది భోజనం చేస్తే అవతల నన్ను యివ్వమంటే నేను యివ్వను. ఇప్పుడే చెప్పినాను.

అన్న—ఆహాహాహా!

ధన—నవ్వు. నీయిష్టం వచ్చినంతసేపు నవ్వు. నేను రెండు రూపాయలకంటె పక్కదమ్మిడీ యెక్కువ యివ్వను. వడ్డన యేగదిలో చేసినారో చూపింతువుగానిరా.

(అని ధనపాలుడును, అన్నపూర్ణమ్మయు వెళ్ళుచున్నారు)

౨ రంగము—భోజనములు చేసెడు పడమటి యిల్లు.

[విస్తరిముందు పీటమీద కూరుచుండి విజయశర్మయు, సమీపములో నిలుచుండి చండికయు, పరివేశించుచున్నారు]

విజ — (జమాఖర్చు పుస్తకమును తీసి పత్రములు తిరుగ వేయుచు) మనకు కోనసీమ తోటలవల్ల సాలుకు రెండువేల యేనూరు రూపాయలు వస్తవి. ద్రాక్షారామ తాలూకాలో వున్న భూములను మూడువేల యేనూరు రూపాయలకు అమరకం చేసినాము. ఈయేడు

పంటలు బాగావుండవని అంటూవున్నారు. ఆలాగయినట్టయితే రహితులను తొందరపెట్టక కొంతశిస్తు మానివేతాము. మండపేటకోమటి అయిదువేల రూపాయలు యీనెలాఖరులోగా తీర్చవలెను. పాపము! అతనికి వడ్డీ మానివేస్తాను. నాదగ్గిర యేభయివేల రూపాయలు నిలవ వున్నవిగదా. అందులో పదివేలరూపాయలుపెట్టి యీగ్రామంలో ధర్మసత్రం వేయిస్తే బాగావుండేటట్టు తోస్తూవున్నది. అయినాకానీ యీసంగతి సావధానంగా ఆలోచింతాము.

చండి—ఈయన విస్తారం భాగ్యవంతుడు కావడమేకాకుండా ధర్మాత్ముడుగా కూడా కనపడుతూవున్నాడు. ఇతడు ధనపాలుని చుట్టంకామల్ను. అందుచేతనే విందుకు పిలిచివుంటాడు.

(అన్నపూర్ణమ్మ ప్రవేశించుచున్నది)

అన్న—చండీ! అన్ని వస్తువులూ జాగ్రత్తగా వడ్డించేటట్టు చెయ్యి. లేకపోతే ఆనిర్భాగ్యుడు ధనపాలుడు వచ్చి కాట్లకుక్కలాగు మనమీద పడుతాడు. ఈయన యిక్కడకు యేలాగువచ్చినాడు?

చండి—ఆయనను మాటాడించక విను.

అన్న—ఆయనను మాట్లాడించడానికి బ్రహ్మాతరం గాదు. ఈగోడలతో మాట్లాడితే యెంత వినిపించుకుంటవో యీాయనా అంతే వినిపించుకుంటాడు. ఈయనకు వల్లమాలిన చెవుడు.

చండి—పాపం ఇంత చిన్నతనంలో యీాయనకు చెవుడు పట్టుకున్నదా! ఈయిన బహు భాగ్యవంతుడు.

అన్న—ఈయన భాగ్యవంతు డని నీకు యెట్లా తెలిసినది?

చండి—ఆచేతులో వున్నపుస్తకం చదివి యీాయన జమాఖర్చులు చూచుకుంటూ వున్నాడు. మనం పావలాలు అర్ధలూ లెఖ్ఖచూచుకునేటట్టుగా, ఈయన వేలూ లక్షలూ లెఖ్ఖచూచుకుంటూ

వున్నాడు.

అన్న—అలాగయితే యీయనను యిక్కడ కూర్చోనీ. ధన పాలుడు వచ్చి యేమయినా అంటే—

విజ—(తలయూచుచు) ఇక్కడ నవుకర్లు యెవరు వున్నారు?

చండి—ఈయన తనకువలెనేలోకానికంతా చెవుడయినట్టు యెంతబిగ్గరగా మాట్లాడుతూవున్నాడో! (అని సమీపమునకు వెళ్ళుచున్నది)

విజ—సరి. నీవే నా నవుకరువు? భోజనానికి యెంత ఆలశ్యం వున్నది?

చండి—ఆలశ్యం లేదు. మీసెలవు యెప్పుడయితే అప్పుడే వడ్డిస్తాము.

విజ—ఆహాహాహా! నేను నిన్ను అడిగినది ఆసంగతి కాదు. భోజనానికి యెంత ఆలస్యంవున్నదని అడిగినాను. (అన్నపూర్ణమ్మతో) అమ్మా! మీ నవుకరుకు కొంచెం చెవుడు కాబోలును. యీచిన్నది అంతకష్టె.

అన్న — చండీ! ఈయన నిన్ను అందెకష్టెవు అంటూ వున్నాడు. నీకంతే చాలునులే.

చండి—యీయనకు చెవులు చెడిపోయినా కళ్లు చెడిపో నందుకు సంతోషిస్తూవున్నాను.

[ధనపాలుడును ఇందుముఖియు విశాలాక్షియు సుమంత్రుడును పరివేశించుచున్నారు]

ధన—ఇలాగురండి. మనకు మాత్రమే ప్రత్యేకంగా యీగది మాట్లాడినాను. ఇక్కడకు రెండోవారు రారు. మనం నలుగురమూ కలిసి యేకంగా భోజనం చెయ్యవచ్చును.

ఇందు—(విశాలాక్షితో రహస్యముగా) ఇతడు వెర్రివాడు లాగు వున్నాడు.

విశా—(ఇందుముఖితో రహస్యముగా) వూరుకో. అదుగో మనవిజయవర్మ వచ్చినాడు.

సుమం—పుస్తకంలో పత్రాలు తిరగవేస్తూ మనపీటమీద కూర్చున్నాఁడు. ఈయన యెవరు? ఇతఁడు మనవంక తలయెత్తి చూడ నైనా చూడడం లేదు.

ధన—అన్నపూర్ణమ్మా! మాగదిలోక వచ్చి నా పీటమీద కూర్చున్నాడు. యితఁడు యెవరు?

అన్న—ఈయన యెవరో బహు తమాషావాఁడుగా కన బడుతూ వున్నాఁడు. నాకింతకంటె యేమీ తెలియదు. ఈయనను వుంచడమో పంపించివెయ్యడమో మీలో మీరే చూచుకోండి.

(అని వెళ్ళుచున్నది)

[అప్పు డిందుముఖియు విశాలాక్షియు సుమంత్రుఁడును తమ పీటలమీఁద కూరుచుండగా ధనపాలుఁడు తనకు పీట లేక నిలుచుండి విజయవర్మతో సంభాషణ కారంభించుచున్నాఁడు]

ధన—(విజయవర్మవీపుమీద తట్టి) అయ్యా! ఈగది మాది. మేము ప్రత్యేకంగా మాకోసం యేర్పరుచుకున్నాము.

విజ—మీరు బహుదొడ్డవారు. అక్కర లేదు. అగ్రస్థానమందు నేను కూర్చోను. మీఆదరణకు సంతోషించినాను.

ధన—మిమ్మలిని యిప్పుడు యెవరూ అగ్రస్థానమందు కూర్చో మనడం లేదు. మీరు యీగదిలోనుంచి తక్షణం లేచిపోవలెను. ఈ పీట నాది. (అని చేతితో పీట కొట్టుచున్నాఁడు)

విజ— ఈ పీటమీదనుంచి లేచి మొదటిపీటమీద కూర్చో

మంటున్నారా? అక్కరలేదు. నాకు యిక్కడనే సౌఖ్యంగా వున్నది. పెద్దవాణ్ణి ఆయననే ఆపీటమీద కూర్చోనియ్యండి.

ధన—ఈయన నామాట వినకుండావున్నాడు. మామగారూ! మీరు గట్టిగా చెప్పండి.

సుమం—పాపం ఈచిన్నవాడికి చెవుడని నీకు తెలియలేదా?

ధన—ఆమాట యితడు మొట్టమొదటనే నాతో యెందుకు చెప్పరాదు? అలాగైతే యిప్పుడు యీయనకు తెలిసేటట్టు చేస్తాను. (బిగ్గరగా అరచుచు) అయ్యా! ఇది నాగది. ఇది నాపీట; ఈయన నామామగారు; ఈ సుందరులు నా— (అని చూపుచున్నాడు)

విజ—చిన్నవాడనయినా నీయోగ్యత బహుదొడ్డది. అగ్రస్థానమందు కూర్చోకపోతే యీకన్యల యిద్దరిమధ్యనైనా కూర్చోమంటారా? అలాగే కూర్చుంటాను. పట్టుపట్టి అన్నిటిలోనూ మూర్ఖత్వం చెయ్యరాదు. (అని తనపీట వారియిద్దరిమధ్యను వేసికొని కూర్చున్నాడు)

ధన—(కోపముతో ఇటు నటు తిరిగి విస్తరి చేతబట్టుకొని) ఈ విస్తరి నాది. మీరు లేచిపోవలెను.

విజ—(విస్తరి చేతిలోనుండి పుచ్చుకొని) అయ్యా! నా నిమిత్తం మీకీ ఆయాసమంతా యెందుకు? మీరు తెచ్చి యివ్వకపోతే యీవిస్తరి నడ్డనచేసే మనిషి తీసుకుని రాదా? మీరు శ్రమ పడకండి.

ధన—ఇది మరీబాగా వున్నది. విస్తరిమాత్రమేకాదు. నాచెంబులజోడూ నెండిగిన్నెకూడా పుచ్చుకో. (అని కోపముతో తెచ్చి ముందు పడవేయుచున్నాడు)

విజ—(అవి పుచ్చుకొని తనవద్ద పెట్టుకొని) అయ్యా! నేను

మీ ఋణం యెలా తీర్చుకోగలనో తెలియకుండా వున్నది. ఇంతమంది గృహస్థులను చూచినానుగాని మీకువలె అతిథికి యింత శ్రద్ధాభక్తులతో స్వయంగా వుపచారం చేసేవారిని నేను యెక్కడా చూడలేదు. ఇక మీరు వుపచారం చేస్తే నేను అంగీకరించను. ఎవరినైనా నవుకరును ఆజ్ఞాపించండి.

ధన—ఇప్పుడు నీకు వుపచారం యెవరు చెయ్యవచ్చినారు? నాకు స్థలంలేక నేను తంటాలు పడుతూవున్నాను. నేను యెక్కడ కూర్చోను? అలాగయితే నాకు భోజనమే అక్కరలేదు. నీవు వక్కడవే కూర్చుని భోజనం చెయ్యి. నేను వెళ్తుతాను. (అని కొంచెము నడుచుచున్నాడు)

విశా—అయ్యా! ఈ వృద్ధమనిషికి చెవుడు. ఈయన చూస్తే ఘరానామనిషిలాగు కనపడుతూవున్నాడు. చెవిటివానితో వృథాగా యెందుకు ఆయాసపడుతారు? ఈయనను యీవిస్తరిలో భోంచెయ్య నిచ్చి మీరు మరివక విస్తరి వేయించుకొని కూర్చోండి.

సుమం—అవును. నీవు వేరే విస్తరి వేయించుకొని కూర్చో.

విజ—వక్షిన చెయ్యవచ్చును. నాఅభ్యంతరము లేదు.

(చండిక వడ్డించుచున్నది)

ధన—(చివరను కూరుచుండి) మామగారూ! మీరు యేమను కున్నారోకాని యిదిమాత్రం బాగున్నదికాదు—చండీ! వేసుకున్న విస్తరి వకరికి విడిచిపెట్టి కడపక్కని కూర్చోవడం వ్యసనకరంగా వుంటుందో లేదో నీవుచెప్పు. నలుగురిలో తిరిగేవానికి యింతకంటె అవమానం యేమిటి?

ఇందు—మీకు ఆసంగేహం వుంటే నావిస్తరివద్ద యెగువను కూర్చోండి. (అని లేచుచున్నది)

ధన—అక్కరలేదు. అందుకోసం కాదు. కాని—

విజ—నావంటి కొత్తవాణ్ని యీప్రకారంగా అందరికం టెనూ మొదట కూర్చోమని బలవంతపెట్టడం మీవంటి పరోపకార పారీణులకు తగివున్నది. మీరు చేసిన ఆదరణ నేను బ్రతికి వున్నంత కాలమూ మరిచిపోను. నామాట నమ్మండి.

ధన—ఆదరణాలేదు గీదరణాలేదు వూరుకో. నేను అన్న మాటలన్నీ నీకు వినపడ్డట్టయితే సిగ్గుమాలి యిటువంటి మాటలు యెప్పుడూ అనవు. చండీ! చండీ! వినిపించుకోవేమి? నాకు విస్తరి విస్తరి. తినడాని కారంభిస్తే బకాసురుడిలాగు యితడు పిండివంటలూ అన్నీ మింగివేస్తాడు. ఈవృకోదరుడు భోజనానికి మొదలుపెట్టకమునుపే నాకుకూడా వేరే వడ్డించు.

చండి—ఇల్లంతా తగులుపడిపోతూవున్నట్టు అలా అరుస్తా వేమయ్యా! మీకు యేమి కావలెను.

ధన—నాకు యేమి కావలెనా? ఈ చెవిటివాడు నావిస్తరి కడ తేర్చినాడు. మరివకవిస్తరి కావలెను.

చండి—విస్తరా? (అని పరుగెత్తుచున్నది)

విజ—నేను చూచినవాటిలోకెల్లా యిది మహామంచి సత్రం.

ధన—ఇక్కడ అన్నీ ప్రియమని అయ్యగారికి యింకా బోధ పడలేదు. అయ్యో! ఒక్కనిముషం వోపిక పట్టు. అంతా తెలుస్తుంది.

విజ—మీరు నాకోసం కనిపెట్టుకొని వుండనక్కరలేదు. ఆరం భించండి. (అని తినుట కారంభించు చున్నాడు)

చండి—ఆహాహాహా! విస్తరి యిదిగోనండి.

ధన—ఎందుకు నవ్వుతావు? నవుకళ్లు యీలాగు నవ్వడం నేను యెక్కడా చూడలేదు.

చండి — ఆభోజనం చేసేవారితో మీరు కలుసుకోవడానికి యెంతో తొందరపడవలెనుగదా అని నవ్వుతూ వున్నాను. ఈవిందు కయినసొమ్మంతా యిచ్చుకోవడం మీరేకదా?

ధన — సొమ్మా? నేనే యిచ్చుకోవడం! నాకూ ఆముగ్గురికీ నేనే యిస్తాను. నేను యెన్నడూ ముక్కూ మొగమూ యెరగని ఆకొత్త వాడి తిండికి మాత్రం నేను యివ్వను. ఇప్పుడే చెప్తూవున్నాను.

సుమం — అలా అనడం సిగ్గుచేటు. అటువంటి పెద్ద మనిషి తనభోజనానికి నిన్ను యిమ్మంటూ డనుకొన్నావా యేమిటి? అతడు నీవు యిచ్చినా వప్పుకోడు.

విజ — ఓసుందరులారా! ఈకూర బహుబాగావున్నది. మీకు తెప్పింతునా?

విశా — ధనపాలా! ఇతడు చెవిటివాడయినా యెంతమర్యాదగా మాటాడుతూ వున్నాడో చూచినావా?

ధన — పొగడండి. ఇంకా పొగడండి.

విజ — కాంతలారా! క్షమించండి. మీరేమో మాట్లాడుతూ వున్నట్టున్నారు.

ధన — ఈవిడె మీసంభాషణ బహుమర్యాదగా వున్నదంటూ వున్నది. హాహాహా!

విజ — బాగానే వున్నది. కాని యిది నిలవవుండదు. ఇక వక మాసం పోయిన తరువాత పెడితే చాలాకాలం నిలవవుంటుంది.

ధన — చండీ! నాకు మాత్రం వక్క చక్రికేళీ అరిటిపండు తీసుకుని రా. దాని ఖరీదు నేను వేరే యిస్తాను.

చండి — ఖరీదు పండు వక్కంటికి రెండేసి డబ్బులు. ఇదుగో పండు. (అని క్రింద పెట్టుచున్నది.)

విజ.—(చటుక్కున పుచ్చుకొని) ఈపండు నాకోసం తెప్పించి నారా ? మీరు చాలా మంచివాళ్ళు.

(అని యొలుచుకొని తినుచున్నాఁడు.)

ధన—నేను తినవలెనని ఆశపడి యెంతో మంచిపండు తెప్పించు కుంటే యీగిజిగాడు మధ్య యెగరవేసుకుని పోయినాడు. ఇతనికి చెవులు పోయినట్టే కళ్ళుకూడా పోయినట్టయితే బాగా వుండును.

ఇందు—ఆహాహాహా ! ఈశాపనార్థాలన్నీ వక్క అరటిపండు కోసమా ?

ధన—నాకు యిష్టమయినది. వక్కఅరటిపండే.

విశా—ఇక్కడ దానితొక్క లున్నవి. అవి యిస్తునా ?

ధన—కావలిస్తే ఆతొక్కలు నీవే తిను. నాకక్కర లేదు. నన్నందరూ వేళాకోళాలు చేస్తూ వున్నారు. నేను విస్తరి విడిచిపెట్టి లేచి పోతాను. (అని లేవఁబోవుచున్నాఁడు.)

సుమం—లేవకు. కూర్చో కూర్చో.

ధన—(కూరుచుండి బిగ్గరగా విజయవర్మతో) అరిటిపండు నిముషంలో మాయం చేసినావు.

విజ.—పానకమా ? ఏది తెప్పించినా తెప్పించవచ్చును. ముం దుగా యీఆడంగుల కేది యిష్టమో అది తెప్పిస్తే బాగా వుంటుంది.

ధన—ఆహాహాహా ! ఏది యెలాగువున్నా నీమూలంగా మాకు కొంత వినోదంమాత్రం కలుగుతూవున్నది.

విజ—అమ్మా ! యింకా ఏది చక్రకేళీపళ్లు తెప్పించు. కొన్ని వీరికీ కొన్ని నాకూ ఉపయోగిపడతవి.

చండి—చిత్తము. (అని పరుగెత్తుచున్నది)

ధన—చండీ ! ఆగు. ఆగు. అర్ధరూపాయిలో నేను చక్రకేళీ

అరిటిపళ్ళు వెయ్యడానికి యేర్పరుచుకో లేదు. నేను నలుగురికి నాలు గర్ధలకంటె యెక్కువ యివ్వను తేవద్దు.

[చండి అరిటిపండ్ల అత్తము చేతం బట్టుకొని పరివేశించి పండ్లు విజయశర్మ చేతి కిచ్చుచున్నది.]

విజ— (ఒకటొక్కటి విస్తరిలో గెంటేసి పండ్లు వేసి) పనస తొనలా? అవీ తెప్పిస్తాను. అమ్మా! యిందాకా నట్టింటిబుట్టలో పెద్ద పనసతొనలు చూచినాను. వాటిలో యిరవై తొనలు తీసుకొని రా.

చండి— అవి ప్రశస్త మయిన తేనెపనసతొనలు. తొనవక్కంటికి డబ్బు ఖరీదు. నిముషంలో తెస్తాను. (అని వెళ్ళుచున్నది.)

ధన— పనసతొనలా?

విజ— వీటి ఖరీదుకూడా మీరాగే యిస్తా మంటూవున్నారా? మీ ఔదార్యము నాకు యిదివరకే తెలిసింది. మీరు నాకు చేసిన గౌరవాలలో యిది వకటి. అవుదార్యం మాట అటువుండగా మీరు చేసే హాస్యంవల్ల వినోదంగా వుండి నాకు జాము నిముషంగా ప్రొద్దు జరుగుతూ వున్నది.

[పనసతొనలతో చండిక, మగల పరివేశించుచున్నది]

ధన— చండీ! నేను చెప్పేది బాగా విను. ఈపనసతొనలూ పళ్ళూ చెవిటివాడు తెమ్మన్నాడు. వాటి ఖరీదుకూడా చెవిటివాడే యిచ్చుకోవలెను. నేను యిందులో వక్కటి తినను.

చండి— మాఅమ్మగారు యివన్నీ మీపద్దులోనే వేస్తారు. కావలిస్తే తరువాత మీరూ యీయనా లెఖ చూచుకొని సరి పెట్టుకోండి.

విజ— అయ్యా! ఈరోజు నాకు మీ సహాపంక్తిని భోజనం లభించి నేను కృతార్థుణ్ని అయినాను. ఈ యతిథిసత్కారము నేను మరవను.

ధన—మాయింటికంటె నీవు యముడియింటికి అతిథి వైతే నాకు బహుసంతోషంగా వుంటుంది.

విజ—ఇదంతా మీ ఆశీర్వచన ఫలం. దేవుడు మీకు కూడా ఆలాగే అనుగ్రహించవలెనని నామనస్ఫూర్తిగా ప్రార్థిస్తూ వున్నాను.

సుమం—అయ్యా! మీకీబధిరత్వం పుట్టినప్పటినుంచీ వున్నదా? మధ్య యేదయినా కారణంచేత వచ్చిందా?

విజ—లేదు లేదు. పనిమీదనే వచ్చినాను. నాకు యిక్కడ జరూరైనపని వున్నది.

ధన—ఆహాహాహా! మళ్లీ ప్రసంగ మారంభ మయినది.

విజ—నేను యిక్కడకు వచ్చినపని బహుముఖ్య మైనది.

సుమం—చాలును. మీకథ నాకక్కర లేదు.

విజ—నామామగారు—కాదు నాకాయన మామనరుస అవుతాడు—ఆయన తన కూతురిని ఆచిన్నదాని యిష్టం లేకుండా వక నిర్భాగ్యుడి కిచ్చి వివాహం చెయ్య తలచుకున్నాడు. ఆవివాహం మాన్పించవలె నని నేను యిక్కడకు వచ్చినాను.

ధన—నీవు కావలసినంతసేపు వాగు. నీమాటలు వినకుండా నేను భోజనం చేస్తూవుంటాను.

విజ—ఆచిన్నది అప్సరసవంటిది. ఆయన వివాహం చెయ్య దలచుకున్నవరుడు కేవల పశుప్రాయుడు. ఆ పశుప్రాయుడు నేను చెప్పిన తరువాత కూడా నామాట వినకపోతే, అతని రెండు చెవులూ మొదలంటా కోసివెయ్యవలెనని నిశ్చయించుకుని వచ్చినాను.

ధన—(పనసతొనలు దూరముగా త్రోయుచు) నీకు చెవులు కొయ్యడమంటే తృణప్రాయంగా వున్నది.

విజ—నేనుహృదయపూర్వకంగాచెపుతూవున్నాను.అవిమీవే.

ధన—నావా?

విజ—నవ్వులాటకుకాదు. నేనదిమనస్ఫూర్తిగా చెప్పినమాటే.

ధన—నీవు యీలాగు మోటతనంగా మాట్లాడుతా వని మొదటిలోనే తెలిసివున్నట్టయితే నిన్ను యీగదిలోకి రాకుండానే పడగెంటుదును. మీరంతా చూస్తూవుండండి. నేను యీ అవమానం సహించేవాణ్ని కాను.

విశా—ఇందుముఖీ! మనము లేచి వెళ్ళి చేతులు కడుక్కుం దామా? (విజయవర్మతక్క అందరును లేచుచున్నారు. ఇందుముఖియు విశాలాక్షియు వెళ్ళుచున్నారు)

విజ—భోజనా లయినవా?

ధన—నీది కాకపోతే నీవు మళ్ళీ ఆరంభించు. నీ కేమి? నీవు పొట్ట బద్దలయ్యేటట్టుగా చెడతిన్నావు. నాకు నాలుగుముద్దలైనా లోపలికి పోలేదు. (కొంచె మాలోచించి) చండీ! చండీ! వేగిరం యిలాగు రా.

చండి—వచ్చినాను. పనియేమిటో చెప్పండి.

ధన—నీవు పరుగెత్తుకుని వెళ్ళి మాభోజనాల కెంతయిందో పద్దువ్రాయించుకుని రా. పో—ఓ చెవిటిముద్దా! నీవు తిండి బహు బాగా తిన్నావు. ఇఖ డబ్బు యెలాగు యిస్తావో చూడవలెను.

చండి — వసంతసేనుడిచేత వ్రాయించుకొని వస్తాను. (అని వెళ్ళుచున్నది)

విజ—(ముందుకువచ్చి) మనం వెళ్లకముందు సొమ్ము యివ్వ వలెను. చక్రికేళీపళ్ళకుకూడా మనం ఖరీదు యివ్వవలెను.

ధన—మనమేమిటి? చక్రికేళీపళ్లకు నీవొక్కడవే యిచ్చుకో వలెను. అవి కావలెనని తెప్పించినది నీవే కాని నేను కాదు.

విజ— నిశ్చయంగా కాదు. మొట్టమొదట నే నలాగుద్దేశించుకున్నాను. (సుమంత్రుని జూపుచు) ఈ ముసలాయనకు దానితో యేమీ పనిలేదు.

ధన— మాభోజనాలకు నేను యిస్తాను. చక్రకేళీ పళ్లతోనూ పనసతొనలతోనూ నాకు జరూరులేదు.

విజ— మీ రింతగా నిర్బంధపెడుతూ వున్నారుగనుక మీ రన్నట్టే కానియ్యండి. ఇంకొకసారి మనమంతా కలిసి భోజనం చేసినప్పుడు పనసతొనలఖరీ దంతా నేనే యిస్తాను.

ధన— యేమిటీ?

విజ— నావద్ద సొమ్ము యెంతవున్నదో చూడవలెను. (అని మూట విప్పి చూచి) ఈ నాలుగణాలున్నూ నాభోజనానికి. మిగిలిన అణాన్నరా యీవస్తువ చేసినావిడకు యిస్తాను.

ధన— భోజనానికి మనిషికొక్కంటికి యెనిమిదణాలు.

విజ— పూర్వ మలాగే వుండేది గాని యిప్పుడు వస్తువులన్నీ ప్రియం కావడంచేత ప్రతిపూటకూటియింట్లోనూ నాలుగేసి అణాలే పుచ్చుకుంటూ వున్నారు.

ధన— (అర్థరూపాయ చేతబట్టుకొని విజయవర్మకు చూపి) ఎనిమిదణాలు. నీకు చెవులు వినబడకపోయినా కళ్లు కనపడతవనుకుంటాను. నీవు యెనిమిదణాలు యివ్వవలెను.

విజ— (ఆశ్చర్యముతో) ఆఁ! ఏమిటీ?

ధన— నీవు యెనిమిదణాలు యివ్వవలెను.

విజ— మీ రాదరణ చేసి శ్రమపడడమే కాకుండ మీ నాలుగణాలూ నా నాలుగణాలూ కలిపి యెనిమి దణాలూ మీ కే యిస్తామంటారా?

ధన—నీభోజనానికికూడా నేను యిస్తానా? అయ్యా! మీరు న్యాయం విచారించండి. ఇదిగో యింటి యజమానురాలు వచ్చింది.

[అప్పుడు పద్దుపట్టుకొని అన్నపూర్ణమ్మయు చండికయు ప్రవేశించుచున్నారు]

ధన—అన్నపూర్ణమ్మా! ఆపద్దు అతనికి చూపించి భోజనానికి మనిషి వక్కంటికి యెనిమిదణాలని చెప్పు.

అన్న—అయ్యా! పద్దు.

విజ—అమ్మా! యీపుణ్యాత్ముడు నాకు సమస్తోపచారాలూ చెయ్యడమే కాకుండా నాకు యింక సొమ్ముకూడా తానే యిస్తున్నాడు.

ధన— నేనా? నేనా? నీసొమ్ముకూడా నేనే యిస్తే నీకు యీవేళ కడుపునొప్పి రాకుండా తిన్న అన్నం అరుగుతుందీ?

విజ—ఈసారి మే మంతా ఇక్కడ మళ్లీ భోజనం చెయ్యడం తటస్థమయితే—నేను చెప్పేది వినకుండా వున్నావా?—అందరి సొమ్మూ నేనే నీకు—(అని లేచుచున్నాడు)

ధన—లేచిపోక నేను చెప్పినమాట తిన్నగా విని మరీ వెళ్లు.

సుమం—ఇంతకంటె నీవు చెప్పదలచుకొన్నది వక కాగితం ముక్కమీద వ్రాసి చేతికిస్తే బాగా వుంటుంది.

ధన—ఈ చెవిటివాడికి చదవడం వచ్చునో రాదో యెవరికి తెలుసును?

సుమం—వక కాగితంమీద వ్రాసి, అసలు నీకు వ్రాతవచ్చి నట్లు కనపడదూ.

ధన—వ్రాసి కనపరిస్తే బాగానే వుంటుంది. చిన్నతనంలో పంతులు నాకు వ్రాత తిన్నగా నేర్పినాడుకాడు. అయినా కానీ వ్రాస్తాను. చండీ! మంచికలమూ కాగితమూ సిరాబుడ్డీ యిలాతీసుకొని

రా. నాపెళ్ళాం—ఆహాహాహా—నాపెళ్ళాం—ఆహాహాహా – వచ్చిందని కూడా నాబంధువులకు వుత్తరం వ్రాయవలెను.

విజ—నేను యెంతబతిమాలుకున్నా యితడు ప్రుచ్చుకోకుండా వున్నాడు గనుక, ఓచిన్నదానా! యీసొమ్మంతా నీవే పుచ్చుకో.

(అని చండిక కిచ్చుచున్నాఁడు)

చండి—(పుచ్చుకొని) మీతల్లి కడుపుచల్లగా మీరు వెయ్యేళ్ళు వర్ధిల్లవలెను—ధనపాలా! మీకు కావలసిన వన్నీ ఆగూట్లో వున్నవి.

ధన—(పుచ్చుకొని వ్రాసి) అయ్యా! మీకు చదువువస్తే యిది చదవండి. (అని కాగితమును చేతి కిచ్చుచున్నాఁడు)

విజ—(పుచ్చుకొని చూచి) "చెవిటి బాటసారికి"— ఇదియెవరిని వుద్దేశించి అన్నమాట? నిజంగా నాకు చెవుడే అనుకున్నా పెద్దమనిషి అయిన వాడికి యిలా వ్రాయడం మర్యాదగా వుంటుందా? నీవున్నట్టి బుద్ధిహీనుడ వనుకో. అప్పుడు "ఈలోకంలో వుండే వారిలో నెల్లా బుద్ధిహీను డయినవానికి" అని నిన్ను వుద్దేశించి నేను వ్రాస్తే బాగా వుంటుందా?

ధన—అదంత ముఖ్యమైనది కాదు. తరువాత చదువు.

(అని చేతితో చూపుచున్నాఁడు)

విజ—"నీవు భోంచేసింది దాశేపాయ్యేవారితో కాదు. నక మర్యాదాగృహస్థు చేయించిన వంటలో"—(ధనపాలునితో) ఆమాటే మొట్టమొదట యెందుకు చెప్పలేక పోయినారు? మొదట్లోనే మీరు నాకు చెప్పినట్టయితే పూటకూటివాళ్ళ కిచ్చినట్టు డబ్బు ఇవ్వవచ్చి మీమనస్సుకు నొప్పి కలుగ చెయ్యకపోదును.

ధన—కడతేరా చదవండి. (అని విజయవర్మ చేయి పయి కెత్తుచున్నాఁడు)

విజ—"మనిషి ఒక్కంటికి అర్థరూపాయి చొప్పున నేను నలుగురికి మాత్రమే భోజనానికి సిద్ధయించినాను. పిలవకుండా వచ్చిన వాళ్లకు విందు చెయ్యడం నాకు ఆచారం లేదు గనుకనూ, నీవు పిలవకుండా వచ్చినవాడవు గనుకనూ, నీభోజనానికి నీవే యిచ్చుకోవలెను. చిత్తగించవలెను. విధేయుడు ఫలానా"— అంతే కదా ? సంతోషపూర్వకంగా యిస్తాను. (అని బట్టకొంగుముడి విప్పి లెక్క చూచి) ఇవిగో పదణాలు ఇందులో అర్ధరూపాయ నాభోజనానికి. రెండణాలు నావంతుకు నేను పుచ్చుకొన్న అరటిపళ్లకూ పనసతొనలకూను.

ధన—తక్కిన అరటిపళ్లకూ పనసతొనలకూ యెవరు యిస్తారు?

విజ—(చండికతో) అమ్మా! నీకు యిందాకా యిచ్చినది నీవే పుచ్చుకో. (అని లేచి నడుచుచున్నాడు)

చండి—ఈయన బహు ధర్మాత్ముడు.

ధన—చండీ! ఈసొమ్ము నీకు నామూలంగా వచ్చింది. నన్ను పొగడవలెను.

చండి—మీరుకూడా మంచి బహుమానం చేస్తే, ఆలాగే పొగుడుతాను. అమ్మగారు మానిమిత్తం కనిపెట్టుకుని వున్నారు. ముందుగా మీరు యివ్వవలసింది యివ్వండి.

ధన—మామగారూ! నాకు నిద్రవస్తూ వున్నది. వేగిరం వెళ్లి పడుకోవలెను.

సుమం—ముందుగా సొమ్మిచ్చివెయ్యి.

ధన — సొమ్మా? దానికి తొందర లేదు. అన్నపూర్ణమ్మ నన్ను బాగా యెరుగును.

సుమం—నీవు ఆయనను యిమ్మని అంతతొందర పెట్టినప్పుడు, నీవుకూడా నీవు వెంటనే యిచ్చి వెయ్యవలసినదే.

అన్న—ఆయన చెప్పింది బాగుంది. మనవ్యవహారం యిప్పుడే పరిష్కారం కావలెను.

ధన—ఇప్పుడే పరిష్కారం కావలెనేమి? అలాగైతే ముందు మాసతారీనికి మేముబాగానే వస్తాము. నాడబ్బు నీవు పుచ్చుకోవడం యిదే ఆఖరుసారి. తెలిసిందా? నేను యిప్పుడు యివ్వవలిసింది నలుగురికీ నాలుగర్ధలు రెండు రూపాయలు. ఇవిగో పుచ్చుకో.

అన్న—(చేయిచాచి పుచ్చుకొని) ఇఖ పనసతొనలకు నాలుగణాలు అరటిపళ్లకు నాలుగణాలూ వెరసి యెనిమిదణాలు రావలెను.

ధన—రెండురూపాయలూ గాక యింకా యెనిమిదణాలా? ఈ సారికి యిస్తాను. పుచ్చుకో; ఇఖముందు యిలాగంటి వస్తువులు యెవరు తెమ్మంటారో వారే యిచ్చుకోవలెనుగాని నేను యివ్వను సుమా. (అని యిచ్చుచున్నాడు)

చండి—అయ్యా! నా బహుమానము. (అని చేయి చాచుచున్నది)

ధన—చండీ! నీవు వెళ్ళి దీని పక్కగదిలో నాపరుపు దులిపి పక్క వేసిరా. కదలవేమి? నాకు నిద్ర వస్తూవున్నది. వేగిరం వెళ్ళి పక్క వేసిరా.

చండి—ఇతడూ వట్టి పిసినిగొట్టు. (అని వెళ్లుచున్నది)

ధన—(లేచి వేళ్లు లెక్క పెట్టుకొనుచు గదిలో తిరుగుచు) అబ్బో! రెండు రూపాయలన్నరా! యింతసొమ్ము నేను ప్రతిసారీ ఖర్చు పెట్టలేను.

అన్న—నేను సెలవు పుచ్చుకొంటాను. (అని వెళ్లుచున్నది.)

సుమం—ధనపాలా! నీతో మాట్లాడవలసి యున్నది. నాతో కూడా నాగదిలోకి వచ్చి వక అరఘంటసేపు మాట్లాడి వెళతావా?

విజ—(లేచి ముందుకు వచ్చుచున్నాడు)

ధన—నేను యిప్పుడు రాను. నాకు యింకా ఆకలి తీరలేదు. మీరు వెళ్లండి. నేను యింకా వక అరఘుంటసేపు యీగదిలోనేవుండి తరువాత వెళ్ళి యీపక్కగదిలోనే నాపరుపుమీద పరుంటాను.

విజ—(వారికి తెలియకుండా మెల్లగా నడచి ధనపాలునిపడక గదిలోనికి పోవుచున్నాడు)

ధన—మామగారూ! సెలవియ్యండి. నమస్కారము.

సుమం—దీర్ఘాయుష్య మస్తు! (అని లేచి నడుచుచు తనలో) వీడా నాఅల్లుడు? వీడు వట్టి లుబ్ధాగ్రేసర చక్రవర్తి. తెల్లవారేలోగా యీవివాహం తప్పించుకోవడానికి యేదయినా వుపాయం దొరికతే యితనికి యిదే ఆఖరు సెలవిచ్చి పంపివేస్తాను. నాకూతురికి యితని కంటె ఆచెవిటివాడే తగినవరుడుగా కనపడుతూ వున్నాడు. అతనిక వక్క చెవులు లేవుకాని యితనిక బుద్ధే లేదు. (అని వెళ్లుచున్నాడు)

ధన — నా మామగారు వట్టి బుద్ధిహీనుడుగా కనపడుతూ వున్నాడు. నేనట! తనతో అరగంటసేపు వంటరిగా మాట్లాడవలెనట! నా తెలివిచూస్తే, అతనిమనస్సునకు ఆశ్చర్యం కలిగి వుండవచ్చును. నేను యివన్నీ నాగదిలో పెట్టుకుని తింటాను. (అని మిగిలిన అరిటి పండ్లను పనసతొనలను పిండివంటలను పోగుచేసి మూట కట్టుచు న్నాడు)

[అంతట చండిక ప్రవేశించుచున్నది]

చండి—అయ్యా! మీపక్క వేసివచ్చినాను. నేను వచ్చేటప్పుడు తనలో తాను "యీరాత్రి గదిలో సుఖంగా నిద్రపోవలెను" అను కుంటూ మీ చెవిటాయన మీగదిలోకి వెళుతూ వున్నాడు.

ధన--(నోటిలోనున్న బూరెముక్కనుమలి తొందరగా మ్రింగి)

ఈ చెవిటి గాడిదకొడుకు పోడుగునా నాకే— (కోపముతో పిడికిలి పట్టి) ముక్కుమీద పక్కగుద్దు గుద్దుతాను— (తలుపువద్దకు వెళ్ళి) కుక్కలకొడుకు తలుపు లోపల గొళ్ళెం వేసుకున్నాడు— (తలుపు గుద్దుచు బిగ్గరగా) ఓరి చెవిటివాడా! ఈగది నాదిరోయి. నాగదిలో నుంచి యివతలికిరా.

విజ— (లోపలినుండి) ఇక్కడ నిశ్శబ్దముగా వున్నది. ఇక సుఖంగా నిద్రపోవచ్చును.

ధన—(తలుపు గుద్దుచు) ఓహోయి! ఈలోపలిది నాపరుపు. లేచిరా. వేగిరం లేచిరా. (అని మరింత బిగ్గరగా గుద్దుచున్నాడు).

చండి—అయ్యో! మీచప్పుడువల్ల యీయింట్లో వున్నవాళ్లం దరికీ నిద్రాభంగం కలుగుతుంది.

ధన—నాకు పడుకోవడానికి పరుపు లేనప్పుడు యితరులకు నిద్రాభంగమైతే నాకేమి? కాకపోతే నాకేమి? నేను యిప్పుడు యీతలుపు బద్దలుకొట్టుతాను. (అని తలుపు కాళ్ళతో తన్ని చేతులతో గుద్దుచున్నాడు)

విజ—గాలి మహా వేస్తున్నది. ఇది పాడు రాత్రిగా వున్నది.

ధన—ఇదిగాలికాదు. నేను నేను. తలుపులు బద్దలు కొడుతూ వున్నది ధనపాలుడు. నాగది నాకు విడిచిపెట్టివేసి నీవు మరినొక చోట చాపు!

[అన్నపూర్ణమ్మ ప్రవేశించుచున్నది]

అన్న—ఇక్కడ యీచప్పుడంతా యేమిటి?

ధన—ఆ చెవిటిముండాకొడుకు నన్ను వెలుపల పెట్టి లోపల తలుపు గడియపెట్టుకున్నాడు.

అన్న—అయినాకాని నీవలాగు తలుపు బద్దలుకొట్టకూడదు.

ధన—తలుపులు బద్దలవుతవని నాకేమీ భయంలేదు.

అన్న—నీకు భయంలేదు కాని నాకు వున్నది—ఓసి చండి! నీవు పోలీసుస్టేషనుకు వెళ్ళి వేగిరం వక కనిస్టేబులును తీసుకుని రా.

విజ—ఇదంతా చూస్తే నేను దురదృష్టవంతుణ్నిగా వున్నాను.

ధన—అడుగో! అతడు లోపల మూల్గుతూ వున్నాడు.

విజ—పగటివేళ నాచెవుకువల్ల అంత బాధలేదు గాని రాత్రి వేళ యిటువంటి పరాయిస్థలంలో అపాయకరంగా వుంటుంది. నాచందుగాపెట్టిలో మూడునందల కాసు లున్నవి. ఈసత్రాలలో తలుపులు వూదితే యెగిరిపోతవి. దొంగలు లోపల చొరబడి సన్న నిముషంలో దోచుకుని పోవచ్చును. ఈచెవులో పిడుగులు పడుతూ వున్నా నాకు నిద్ర మెలుకువ రాదు. నేను మంచం తలుపుదగ్గిరగా వేసుకుని యీపిస్తోలితో—

ధన—(తలుపుదగ్గిఱనుండి పక్కకు తొలగుచున్నాడు)

విజ—గుళ్లబారుపెట్టి మొట్టమొదట యీగదిలో అడుగు పెట్టినవాణ్ని తల యెగిరిపోయేట్టుగా కాలుస్తాను. యీగుండు దెబ్బ గోడలలోనుంచికూడా దూరిపోతుంది!

ధన—(మరింత వెనుకకు జరుగుచున్నాడు)

అన్న—ఈరాత్రి నీ పరుపు మెలాగు రాదు. అది నిశ్చయం. ఇక గదిఆశ వదులుకొని కావలిస్తే యీబల్లమీద పడుకో.

ధన—నేను బల్లమీద పడుకోలేను. నావళ్ళు వత్తుకుంటుంది.

అన్న—మాయింట్లో యీబల్లతప్ప మరి యేమీలేదు. నీవు దీనిమీద పడుకునేదీ లేనిదీ యిక్కడ కూరుచుండి సావకాశంగా ఆలోచించుకుంటూవుండు. నేను వెళ్ళి పడుకుంటాను.

ధన—ఈరాత్రికి యీబల్లమీద పడుకుని చూస్తాను—

చండీ! నాకు వకదుప్పటి తలగడా తీసుకొనిరా.

చండి — ఇవిగో అవి యిక్కడనేవున్నవి.(అనియిచ్చుచున్నది.)

ధన— (పక్క వేసుకొని పరుండి) ఈ చెవిటివాడన్నట్లు యీ యింట్లో యెలాగంటె మనుష్యులున్నారో తెలియదు. దొంగలు దాక్కొని వుంటారని విన్నాను -- ఓహో! యెవళ్ళో వస్తూవున్నట్టు న్నారు.

[వసంతసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ధన—ఆవచ్చేది యెవరు? ఓవసంతసేనా! నీవా! రా. మంచి సమయానికి వచ్చినావు.

వసం — ఏమి? ఏమి?

ధన — చెప్తాను విను. అతను—అతను—

వసం—అత డేమిటి?

ధన — అతని పిస్తోలు తలుచుకుంటె భయంవేస్తూవున్నది కాని లేకపోతే—

వసం—యేమి పిస్తోలు?

ధన —యేమీ లేదు, అతణ్ని-అతణ్ని-అతనికి వినబడుతుంది. మెల్లిగా మాట్లాడవలెను—వక దుప్పట్ని నీకు యేమయినా యిస్తే తీసుకొనివెళ్ళి గురప్పుతబేలా వస్తూవున్న తూముకాలువలో పడవెయ్య గలవా?

వసం—అత డంతగా దుష్టుడైతే ఆపని నేను చెయ్యలేనుగాని నాతరఫున బలమైన మనుష్యులను యిద్దరిని తీసుకునివచ్చి వాళ్ల చేత చేయించగలను.

ధన—ఈఆలోచన దివ్యంగా వున్నది. యేమి చెయ్యవలెనో చెప్తానువుండు. వాళ్లను తీసుకునివచ్చి సిద్ధంగా వుంచు. నేను దొంగ

దొంగ అని కేక వెయ్యడంతోటే, ఆగదిలో వున్న మనుష్యుణ్ణి వెలుపలికి యీడ్చుకునివచ్చి మెత్తగా దంచవలెను. నీకు నేనేమి యిస్తానా?—ఈరోజున నాకు వూరికే ఖర్చులే అవుతూ వున్నవి.

వసం—ఏమిస్తారు?

ధన—నాకు సొమ్ము లక్ష్యం లేదు. పూర్తిగా వక్కరూపాయ యిస్తాను. నాలుగర్థలు రెండు రూపాయలు భోజనానికి. అర్థరూపాయి పల్లకు. వకరూపాయి శూముకాలువలో పడ వెయ్యడానికి. ఆబ్బో! యీవేళ మూడురూపాయలన్నర ఖర్చా?

వసం—అంతకు తక్కువైతే, నేనానికి వప్పుకోను.

ధన—అతను నాస్థలం ఆక్రమించుకొన్నాడు; నా భోజనం తన పొట్టను పెట్టుకున్నాడు; నాపరువు కూడ తీర్చినాడు. పోని డబ్బు పోతే పోయింది. రూపాయి యిస్తాను. పెద్దమనిషిని నామాట నమ్ము. పనిచెయ్యడంతోటే తెల్లనిరూపాయి తెచ్చి నీచేతులో పెడుతాను. (అని యేమో యాలోచించుకొంటూ వున్నాడు)

వసం—ముందుగా రూపాయి చేతులో పడితేనేగాని పని జరగదు. నేను యిందులో తటస్థంగావుండి పయివాళ్ళచేత చేయిస్తాను. వాళ్ళుయిద్దరికీ కల్లుకు చెరివక పావలా యివ్వవలెను. పని జరగడంతోటే వాళ్ళు వక్కపెట్టుకు కనపడకుండా మాయమై పోతారు. తక్కిన అర్థరూపాయీ నేను పుచ్చుకుంటాను.

ధన—సరే. డబ్బుపోయినా యెలాగయినా నాపగ తీర్చుకుంటేనేగాని నామనస్సుకు విశ్రాంతి వుండదు. నీ పరిహాస్యం యెక్కడా బయలు పెట్టకూడదుసుమా!

వసం—వకరిదగ్గరమాటలు వకరిదగ్గర నేను యెప్పుడూ చెప్పను. అసలు నాస్వభావమే అటువంటిదిగాదు. ఈపని యెవరుచేసినారో

బ్రిహ్మాకు తెలియనియ్యను.

ధన—నేను పడుకుని నిద్రిపోతూవున్నట్టు నటిస్తాను. నేను యిందులో యేమీ యెరగనట్టు వుండవలెను. ఇదుగో రూపాయ. మహామంచి రూపాయ. (అని యిచ్చుచున్నాడు)

నసం—పయికి మంచిదిలాగే కనపడుతూ వున్నది. చెల్లుతుంది గద ? నేను వెళ్లి వస్తాను. (అని వెళ్ళుచున్నాడు)

ధన—ఇప్పుడు నే నాచెవిటిపెద్దమ్మవారిపని పట్టిస్తాను. అయినా కానీ నేను యిక్కడ పరుండి నిద్రపోతూవున్నట్టు నటిస్తూవుంటాను. ఏమీ యెరగనట్టు వుండి చెవిటివాడు తూముకాలవలో ప్రివేశించడంతోటే నేను మెల్లిగా నాగదిలో ప్రివేశిస్తాను. (అని బల్లమీద పరుండి కన్నులు మూసికొని) తూముకాలువలో పడ్డప్పుడు చెవిటివాడికి యెంత కోపం వస్తుందో ! గొంతుక బద్దలయ్యేటట్టు అరిచినా నేను సహాయం చెయ్యను. అత డాతూముకాలువలోనుంచి తనంతట తానే లేచి రావలెను. ఇందులో పాపం యేమీ లేదు. ఓరి చెవిటిపెద్దమ్మా! నామీద కోపంవస్తే నీవు నన్ను యేమి చెయ్యగలవు ? నీ వన్నట్టు చెవులు మొదలంటా కోస్తావా యేమిటి! ఇక్కడితో యిలాగంటిపనులు ముందు యెప్పుడూ చెయ్యకుండా నీకు బుద్ధి వస్తుంది. లోపల చెవిటివాడు నిద్రిపోయిందాకా వూరుకుండి, అప్పుడు దొంగ దొంగ అని కేకవేసి మావాళ్ళకు సౌంజ్ఞచేస్తాను. అటుతరువాత నేను గుర్రిపెట్టిపడుకుంటే, అందరూ నన్ను నిర్దోషి అనుకుంటారు. చెవిటిమొద్దా ! ఈరాత్రి బట్టలు తడిసి గుర్రిపుసాలవస్త్రి మురికికాలువలో సుగంధం అనుభవిస్తూ హాయిగా నిద్రిపోతావు లే. లోపలచేరి మెత్తగా నాపరుపుమీద శయనించడంకాదు. నకవేళ నామీద ఫిర్యాదుచేసి రుజువుపరిచినా, స్వసంరక్షణార్థం చేసినానని చెప్పి తప్పించుకుంటాను. ఫర్వాలేదు.

[ఈ ప్రసంగము జరుగుచుండఁగా విజయుఁడు తలుపు తీసికొనివచ్చి ధనపాలుఁడు పెట్టుకొన్న దీపము పట్టుకొని వెళ్ళిపోవుచున్నాఁడు]

ధన—(కన్నులు తెఱచి చూచి) అయ్యో! గాలి లేకుండానే దీప మారిపోయింది? నాకు చీకట్లో భయం వేస్తూవున్నది! ఇక్కడ వంటిగా వుండలేను. అదుగో చెవిటివాడి గదిలో తలుపుసందునుంచి దీపం కనపడుతూ వున్నది. వెళ్ళి చూస్తాను. (అక్కడికి వెళ్ళి) తలుపు కూడా తీసివున్నదే. లోపలికి వెళ్ళుదునా? పిస్తోలు పుచ్చుకుని కాలుస్తాడేమో! ముందుగా తొంగి చూస్తాను. అతడు కొంచెం కదలగానే దొంగలు దొంగ లని కేకలువేస్తాను. (అని తొంగిచూచి) లోపల యెవరూ లేరు. అతను యెక్కడికో వెళ్ళిపోయినాడు. అతను దొంగయి వుండును. ఇంట్లోవాళ్ళ వస్తువులు యేమయినా యెత్తుకుని పారిపోయినాడేమో! నారూపాయీ మురికికాల్వా అన్నీ వ్యర్థమయిపోయినవి. అతడు తప్పకుండా దొంగయి వుంటాడు. దొంగయితే వెళ్ళేటప్పుడు యేమీ యెత్తుకుపోకుండా వుండడు. ఇఖ నేను దొంగ లని కేకలు వేసి యింట్లో వాళ్ళను లేపుతాను.

(అని గదిలో చేరి "దొంగ" "దొంగ" అని బిగ్గరగా అరచుచున్నాఁడు)

[అప్పుడు వసంతసేనుఁడును, ఇద్దరు మనుష్యులును ప్రవేశించుచున్నారు]

వసం—అదుగో ఆ గదిలో వున్నాడు. అతడు యేమన్నా వినిపించుకోక గట్టిగా పట్టుకుని తిన్నగా తీసుకునివచ్చి తూ[illegible] పడవేసి కాలికొద్దీ దూటండి.

మను—లేళ్ళలాగు పరుగెత్తుతాము. (అని గదిలోనికి [illegible]చున్నారు)

ధన—ఇంట్లో అంతా చచ్చిపోయినారా యేమిటి? యెంత

కేకలు వేసినా వక్కరూ రారు. ఓరి దొంగలరో. (అని కేక వేయు చున్నాడు)

వసం— ఇక నేను వెళ్ళిపోతాను. వాళ్ళేపని చేస్తారు.

(అని వెళ్ళుచున్నాడు)

మను—ధనపాలుని పట్టుకొనుచున్నారు)

ధన—ఇదేమిటి? మీరు పట్టుకోవలసింది నన్ను కాను. ఆమ నిషి వేరే వున్నాడు.

మను—మన పని మనం చేతాము. (అని యిద్దరును ధన పాలుని పట్టుకొని చేతులమీద నెత్తుకొని వెలుపలకు వచ్చుచున్నారు)

ధన—దొంగలు. నిజంగానే దొంగలు చంపిరి చంపిరి.

(అని యరచుచున్నాడు)

[అప్పుడు దీపము పట్టుకొని సుమంతుడును, అన్నపూర్ణమ్మయు, చండికయు, ప్రవేశించుచున్నారు]

అన్న— ఈ అల్లరంతా యేమిటి?

సుమం — నా కూతురిని యెవరో దుర్మార్గులు యెత్తుకుని పోయినారు.

ధన—మీరు నన్ను యిలా చెయ్యడం ధర్మం కాదు. వదలండి-

[విజయవర్మ ప్రవేశించుచున్నాడు]

విజ—(ధనపాలునితో) అయ్యా! మీరనుగ్రహపూర్వకంగా నాకోసం వుద్దేశించిన మురికికాలువలో మీకే ప్రవేశం కాకుండా మిమ్మలిని రక్షించడానికి వచ్చినాను. మీలో మీరు చేసుకున్న ప్రసంగ మంతా నేను బాగా విని మీవుద్దేశం పూర్ణంగా గ్రహించినాను. మీ రిప్పుడు దాచిన్నదాన్ని వదిలిపెట్టినా నా వదిలిపెట్టవలెను. లేదా నాతో దెబ్బలాట కయినా రావలెను.

ధన— నేను దెబ్బలాటకుంటాను.

సుమం — నాకూతురు యెక్కడ వున్నది ?

ధన— యేమిటి ? నీవు చెవిటివాడవు కానేకావా యేమిటి?

విజ— కాను. నేను చెవిటివాణ్ని కాను. నన్ను నీవు యిప్పుడు యేమి ప్రశ్నలడుగుతావో అడుగు. అన్నిటికీ జవాబులు చెపుతాను- (సుమంతునితో) అయ్యా! మీకొమార్తె యిక్కడనే వున్నది. ఆచిన్నది తన చెలికత్తెతోకూడా నా దగ్గిరకువచ్చి నన్ను వివాహంచేసుకోవడానికి వప్పుకున్నప్పటికీ మీరు అనుమతి యిచ్చేదాకా పాణిగ్రహణం చెయ్యడానికి నే సంగీకరించలేదు.

[అప్పు డిందుముఖియు విశాలాక్షియు ప్రవేశించుచున్నారు]

విజ— (ధనపాలునితో) ఏమయ్యా! మీమాట యేమిటి? నేను చెప్పిన పనులు రెండింటిలో వక్కటి వెంటనే చెయ్యవలెను. యేది చేసేదీ వేగిరం చెప్పండి.

ధన— ఇప్పుడు నేను నిజం చెపుతాను. నాయందు గౌరవం లేకుండా యీ చిన్నది నన్ను యెగతాళిచేసి మాట్లాడడానికి మొదలు పెట్టింది. ఇటువంటి అలక్ష్యపుమనిషిని పెళ్ళాడడం నాకు యెంతమాత్రమున్ను యిష్టంలేదు. అయినా యిప్పుడు నేను యీ చిన్నదాన్ని వద్దంటే ముసలాయన ఖర్చులన్నీ తెమ్మంటారేమోనని కాని లేకపోతే—

సుమం— నీ కాసంకోచం అక్కరలేదు. నిన్ను క్షమించి నేను ఖర్చులన్నీ వదలివేస్తాను. బుద్ధిహీనుడికి పిల్లనియ్యడంకంటె ఖర్చులు వదులుకోవడమే వుత్తమం. ఈ విజయవర్మ తగిన వరుడేయిన్నట్టు స్థిరపడితే—

విజ— నేనర్థాన్నాయినసంగతి మీకు తెలిసేటట్టు చెయ్యడానికి

ప్రయత్నం చేస్తాను. ప్రవర్తనవల్ల నాయోగ్యత మీకు కనపరచ డానికి నాకవకాశం కలుగచేసినందుకు చాలా సంతోషంగా వున్నది- ఓ ధనపాలా! నాయోగ్యతచేతకంటె నీబుద్ధిహీనతవల్లనే నా క్కలాభం కలిగింది కాబట్టి రాత్రిఅయిన భోజనఖర్చులన్నీ నేనే యిస్తాను.

ధన—పనసతొనలఖరీదూ అరటిపళ్లఖరీదూ కూడనా?

విజ—అన్నీ యిస్తాను. అంతేకాకుండా నాపెళ్ళినాడు నిన్ను విందుకుకూడా పిలుస్తాను.

ధన—ఇప్పుడు నాకు బహుసంతోషంగా వున్నది. నీయందు నాకు మనస్సులో యేమీ ద్వేషంలేదని చూపించడానికి నీ వెన్నిమాట్లు పిలిస్తే అన్నిమాట్లూ భోజనానికి వస్తూవుంటాను. అంతేకాకుండా— నేను యిప్పుడు యేమి చెప్పబోయినానూ?— జ్ఞాపకం వచ్చింది. నేను చెప్పను. చెపితే మీరంతా నవ్వుతారు. ఆహోహోహో! ఇందులో యెవ రికి యెవరు యేమి అపకారంచేసినా అదంతా యిప్పుడు చెప్పవచ్చిన సంగతిని నేను మరిచిపోయినట్టే మరిచిపోయి యెవరి యిళ్లకు వారు సంతోషిస్తూ వెళ్ళుదాము.

(అందరు నిష్క్రమించుచున్నారు)

# పునర్మరణ ప్రహసనము.

ఇందు వచ్చు పాత్రములు.

దృఢవ్రతుఁడు—మృదుభాషిణియొక్క భర్త.
సాహసవర్మ—మనోరంజనియొక్క ప్రియుఁడు.
మాధవుఁడు—సాహసవర్మయొక్క సేవకుఁడు.
చండశాసనుఁడు.—మనోరంజనితండ్రి; మృదుభాషిణి యన్న.
దంభప్రియుఁడు—చండశాసనుని మిత్రుఁడు.
సుబలుఁడు—దృఢవ్రతుని సేవకుఁడు.
మృదుభాషిణి—దృఢవ్రతుని భార్య; మనోరంజని మేనత్త.
మనోరంజని—సాహసవర్మయొక్క ప్రియురాలు.
జానకి—మృదుభాషిణియొక్క పరిచారిక.

౧ రంగము—రాజమహేంద్రవరములోని సాహసవర్మ యిల్లు.

[నెత్తిమీఁద పెద్దవెదురుపేళ్ళబుట్ట పెట్టుకొని మాధవుఁడు ప్రవేశించుచున్నాఁడు]

మాధ—(బుట్ట క్రిందదింపి మూతతీసి) నాకు యింతేచాలును. ఇది మహా పెద్దబుట్ట. ఈబుట్టలో పరుమనిపి. కాళ్ళు ముడుచుకొని హాయిగా పరుండవచ్చును. ఈ బుట్టనిండా కావలసినన్ని వస్తువు లున్నవి. ఈమూల రెండు కుంచాల బియ్యము వున్నవి. వాటిపక్కను చింతపండూ, వుప్పూ, మిరపకాయలూ, అన్నీవున్నవి. యీ సరుకులతో బజారులో మంచిదుకాణం పెట్టవచ్చును. ఇవన్నీ మా జానకికి పంపుతాను. ఇంతవిలవ గలిగిన యీవస్తువులతోనే దానిమనస్సు

కరుగక పోయినట్టయితే, యిఖ దాని మనస్సు దేవుడు నల్లరాతితో చేశాడని చెప్పవలెను.

[అప్పుడు సాహసవర్మ ప్రవేశించుచున్నాడు]

సాహ—హాహాహా! నాకు బహుసంతోషంగా వున్నది. చివరకు ఆచిన్నది వున్నచోటు కనుక్కున్నాను. ఏమీ! మాధవా! నీవు యిక్కడనే వున్నావా?

మాధ—యిక్కడనే వున్నాను స్వామీ.

సాహ— మాధవా! నీకు శుభవార్త చెప్పుతాను. అదృష్టవశంచేత నాకు ఆవిడెవున్నచోటు తెలిసింది.

మాధ—మనోరంజని వున్నచోటునా? ఎట్లా తెలిసింది?

సాహ— నాప్రియురాలు వకయింట్లో గది కిటికీలో కూర్చుండి వుండగా నెలపలనుంచి చూచినాను.

మాధ—మీరాయింట్లోకి వెళ్లి లేక పోయినారా?

సాహ—వెళ్లలేదు. నాప్రాణానందమయిన వస్తువుమీద కన్ను వేసినాను. ఇఖదాన్ని సాధించి తెచ్చే వుపాయాలన్నీ నాఅదృష్ట దేవత చేతులలో వున్నవి.

మాధ—మంచిదానిచేతులలోనే వున్నవి. మీకోరిక తీర్చడానికి అంతకంటె మంచివారు యెవరూ నాకుకనపడరు. అయ్యా! నామాట విని మీరు యీవృథాప్రయత్నం మానివెయ్యండి. మీరు వక స్నేహితునియింట్లో రెండు మూడు మా ర్లాచిన్నదాన్ని చూచి మారు పేరుతో వుత్తరప్రత్యుత్తరాలు జరిగిస్తూ వున్నారు—

సాహ— ఈసంగతి నా పినతండ్రిగా రయిన కేశవవర్మగారికి తెలిసి పోతుం దేమో నన్న భయంచేత మారుపేరుతో వుత్తరాలు వ్రాయవలసి వచ్చింది. నా ప్రియురాలితోనయినా నా నిజమయిన

పేరు విప్పి చెప్పడానికి నాకు ధైర్యం చాలకుండా వున్నది. తనతో చెప్పకుండా నేను యిటువంటిపనులు చేస్తూవున్నానని తెలిస్తే చిన్నాయనగారు తన ఆస్తిలో నాకు చిల్లిగవ్వయినా యివ్వరని నీకూ తెలుసును. ఆయన పెద్ద లయినారు. యింకా చాలాకాలం జీవించరు. అంతోధనం వూరికే పోగొట్టుకోరాదు.

మాధ—అవును. పోగొట్టుకోరాదు. త్రివిక్రమశర్మా! మీ నిజమయిన పేరుకంటె మీరు యిప్పుడు కొత్తగా పెట్టుకున్న యీపేరే మీకు బాగావున్నట్లు నాకు తోస్తూవున్నది. మీరు వ్రాసిన వుత్తరాలు మీ మనోరంజనియొక్క దాసీది కనిపెట్టి వచ్చి తీసుకువెళ్ళి ఆమెతండ్రికి యిచ్చింది. అందుమీద అతడు ఆచిన్నదాన్ని మీకు కనపడకుండా యెక్కడికో బంధువుల యింటికి పంపివేసినాడు. ఇంతటితోనైనా మీప్రయత్నం మానుకోండి.

సాహ—నేను మానను. ప్రాణసఖి మనోరంజనా ప్రియురాలు యెక్కడవున్నదో ఆస్థలం కనుక్కున్నతరువాతకూడా ప్రయత్నం మానుకోవడానికి నేను బుద్ధిహీనుణ్ణనుకున్నావా యేమిటి? నీకు చెప్పడానికి యింతకంటె మంచి ఆలోచన తోచక పోయినట్లయితే, యీ విషయం చాలించి యేమయినా మరివకసంగతి మాట్లాడు. ఆబ్రహ్మరాక్షసిబుట్ట యిక్కడికి యెందుకు తెచ్చినావు?

మాధ—అదా? అదిమహారహస్యం. పరమరహస్యం. అయినాకాని మీరహస్యాలన్నీ నాతో చెప్పుతూవున్నారు గనుక మీకు వినడానికి యిష్టంవుంటే నారహస్యంకూడా మీతో చెప్పుతాను.

సాహ—తప్పకుండా వింటాను. చెప్పు చెప్పు.

మాధ—నాకు వకవేలు విడిచిన మేనమామ అవుతాడు. ఉత్తర బజారులో చిల్లర దుకాణం పెట్టుకుంటూ నెల్లాళ్ళ కిందట

పెళ్లామూ బిడ్డలూ యెవరూ లేకుండా చచ్చిపోయినాడు. ఆతని తాలూకు వస్తువులన్నీ మేము నలుగురం పంచుకున్నాము. నావంతుకు వచ్చిన వస్తువులన్నీ నేను యీబుట్టలో వేసి తెచ్చుకున్నాను. యీబుట్టపాళంగా యిందులో వున్నసరకులన్నీ నేను పెళ్లాడడానికి ప్రియత్నం చేస్తూ వున్నమాజానకికి పంపించడాని కాలోచిస్తూ వున్నాను. అది వకరియింట్లో పనిలోవున్నది. అక్కడికి పంపవలెను.

సాహ—యెవరి యింట్లో?

మాధ—గోదావరివడ్డున నీళ్లలోకివున్న పెద్ద మేడయింట్లో.

సాహ—ఏమి? కిటికీలకు పచ్చరంగు వేసినఆపెద్దమేడ యింట్లో నేనా?

మాధ—ఆయింట్లోనే. అక్కడ పనికత్తెగా వున్నది.

సాహ—ఓహోహోహో! నాకు పరమసంతోషంగా వున్నది. (అని చప్పట్లు చరచుచున్నాడు)

మాధ—మీసంతోషం చూస్తే యిందుతోకూడా పంపించడానికి మీరు నా పెళ్లానికి వక చీరెకూడా కొని పెట్టేటట్టు తోస్తుంది.

సాహ—కాదు కాదు. నేను వకసంగతి ఆలోచిస్తూవున్నాను.

మాధ—మీకు యేదో గొప్పఅలోచనే పుట్టినట్టున్నది.

సాహ—(చెయి పయి కెత్తి) ఈ నాలుగు రూపాయలూ చూచినావా?

మాధ—చూచినాను. అవి మీ చేతిలోనుంచి నాచేతులోకి వస్తవి కాబోలును.

సాహ—నీవు వక్కపనిచేస్తే ఆలాగే వస్తవి. యీసరకులకు బదులుగా నన్నే యీబుట్టలోపెట్టి ఆయింటికి పంపించు. నాప్రాణ నాయకురా లయినమనోరంజని వున్నది ఆ యింట్లోనే.

మాధ—మిమ్మలిని పంపిస్తే జానకి యేమనుకుంటుందో?

సాహ—యేమనుకుంటే యేమిలే. యీబుట్టలో యేమివున్నవో వివరంగా వ్రాసి ఆచీటి దీని కంటించు. వేగిరం నన్ను ప్రయాణంచేసి పంపించు. అక్కడకు వెళ్లినతరువాత యెవరితోను చెప్పకుండా వుండడానికి చేతులో రెండు రూపాయలు పెట్టి మీ జానకిని నేను సమాధానం చేసుకుంటాను.

మాధ—అలాగయితే యిందులో మిమ్మలిని పెట్టి పయిని కట్టడానికి రెండుతాళ్ళు యిప్పించండి. లోపలికి వస్తాను.

(ఇద్దరును నిష్క్రమించుచున్నారు)

౩. రంగము—దృఢవ్రతుని యిల్లు.

[రోకలిచేతఁబట్టుకొని రోటిముందు నిలుచుండి మృదుభాషిణియు, మనోరంజనియు, ప్రవేశించుచున్నారు]

మృదు—అమ్మాయీ! మనోరంజనీ! నీవదేధ్యానంగా వూరికే విచారిస్తూ కూర్చోక యేదయినా పని చేస్తూవుంటే పని సందడిలో విచారం మరిచిపోతావు.

మనో—మరిచిపోవడంకూడానా? నేను యెప్పుడూమరిచిపోను. నేను విచారంగానే వుంటాను. అత్తా! నేను వకటి చెప్తాను విను. నన్ను యీప్రకారంగా నీవు వోదార్చడానికి ప్రయత్నం చెయ్యడం యెంతమాత్రమూ బాగా వున్నది కాదు.

మృదు—నేను మంచి వుద్దేశముతో నీమేలు కోసరమే చేస్తూవున్నాను. నీతండ్రికూడా మంచివుద్దేశముతోనే చేస్తూవున్నాడు.

మనో—అవు నవును. మీ రన్నీ నామేలుకోసమే చేస్తూవుంటారు. మాసవతితల్లి నాకు తిన్నగా అన్నం పెట్టకుండా మాడుస్తూ

నదీ నామేలు కోసరమే నని చెప్పేది. ఇటువంటిమే ళ్లంటే నాకు తల నొప్పి వస్తుంది.

మృదు — చుట్టాలయింటికి వెళ్లినప్పుడు యెప్పుడో వక్కమాటు చూచినంత మాత్రంచేత వూరూ పేరూ యెరగని వక చిన్నవాణ్ని మోహించి అతనితో వుత్తర ప్రత్యుత్తరాలు జరపడం బాగావున్న దేమో ఆలోచించు కో.

మనో — బాగా వుండడం యేమిటి ? ప్రేమా, వుత్తర ప్రత్యుత్తరాలూ, యేమీ లేకుండా డబ్బుకోసం పెద్దవాణ్ని పెళ్ళిచేసుకుని తరువాత పోట్లాడుతూవుంటే బాగా వుంటుందా ?

మృదు — (తనలో) ఇది నన్ను యెత్తిపొడుస్తూవున్నది. (బిగ్గరగా) చాలించు. ఈప్రసంగం చాలించు—

మనో — త్రివిక్రమవర్మవద్దనుంచి వుత్తరంకోసం యెదురుచూస్తూ తోటలో తిరుగుతూవుండి వుత్తరం రావడంతోటే నామనసు కలిసిన చెలికత్తెలను నలుగురిని దగ్గర వుంచుకొని చదువుతూవుంటే యెంతో హాయిగా వుండేది. అప్పుడు నాసంతోషం చూచి నాచెలికత్తెలందరూ తమ కటువంటి భాగ్యం లేకపోయినదిగదా అని విచారపడేవారు. అటుతరువాత వకనాడు నాచెలికత్తెలలో వకదానికీ నాకూ మాటామాటా వచ్చి, అదిపోయి నాగుట్టంతా నాసవతితల్లియొక్క దాసీదానితో చెప్పింది. అదిపోయి నాసవతితల్లితో చెప్పగా, ఆవిడే ప్రోత్సాహపరిచి నాతండ్రిగారికి చెప్పించింది. ఆరోజున యింట్లో యేమి గడబిడ! యేమి అల్లరి! కేకలతో యింటిమీద పెంకులు నాలుగూ యెగిరిపోయినవి. నేను వెళ్లేస్థలమయినా త్రివిక్రమవర్మకు తెలియచెయ్యడానికి అవకాశం లేకుండా, ఆకస్మికంగా నన్ను యిక్కడకు యీడ్చుకునివచ్చి పడవేసినారు. పదహారేళ్ల చిన్నదాన్ని నన్ను నిష్ఠా

రణంగా యిలాగు క్షోభ పెట్టడంకంటె క్రూరకృత్యం లోకంలో యేదీ వుండదు. నీవు యిన్ని నీతులు చెపుతావుగాని, పాపం నీపెనిమిటి విషయమయి నీవు యెందుకు క్రూరంగా నడుస్తూ వుంటావో చెప్పు.

మృదు— నీవు యిప్పుడు క్రూరత్వమనేది ఆయనకు తగినంత వివేకం లేకపోవడంవల్ల తటస్థ మవుతూవున్నది.

మనో—వివేకం లేకపోవడమూ గివేకం లేకపోవడమూ నాకు యేమీ కనపడడం లేదు. ఆయన యేజోక్యమూ కలుగ చేసుకోకుండా యెవరు వచ్చినా మాట్లాడుతూ ఋషిలాగు యెప్పుడూ పురాణాలు ముందు పెట్టుకుని చదువుకుంటూ కూర్చుంటాడు.

మృదు—ఇంటిజోక్యం యెంతమాత్రమూ కలుగచేసుకోకుండా వచ్చినవారితో టల్లా మాట్లాడుతూ వుండడమే పెద్ద అవివేకము. చిల్లరవిషయాలలోకూడా మన దాసీముండవంటిది వచ్చి ఆలోచన అడిగినా పొమ్మని కోపపడక యేదో చెపుతూ వుంటారు.

మనో— పాపం. ఆయన ధర్మరాజువంటివాడు.

మృదు—అందుచేతనే ఆయనను లోకువ చేసి మనదాసీది జానకికూడా మాటమాటకూ ఆయనదగ్గిరకు వెళ్లి యేదో వకటి అడుగుతూ వుంటుంది. అలా నెత్తిమీద యెక్కించుకోవడంచేత నామాటంటే లక్ష్యం లేకుండా అది నాతో సమానంగా వుండడానికి ప్రయత్నం చేస్తూవుంటుంది. నేను గాజులు తొడిగించుకుంటే అదీ గాజులు తొడిగించుకుంటుంది; నేను కొప్పులో పువ్వులు పెట్టుకుంటే అదీ పువ్వులు పెట్టుకుంటుంది; నేను రంగుచీర కట్టుకుంటే అదీ కట్టుకుంటుంది. ఇంటి కయిన మగవాడు దానితో చనువుగా మాట్లాడుతూ యేదడిగినా లేదనకుండా చేస్తూవుంటే, అది యేలాంటి కోరికలు కోరుతుందో నాకు యెలా తెలుస్తుంది?

[తనలో నేమో యనుకొనుచు దృఢవ్రతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

దృఢ—. రేపు యేకాదశి వుపవాసంచేసి రాత్రి జాగరం చెయ్య వలెను. ఓసీ! యింట్లో యేమిచేస్తున్నావు?

మృదు— ప్రాణేశ్వరా! ప్రొద్దున్న జానకివిషయం అంతదూరం చెప్పినతరువాత యేమి చెయ్యకుండా యిలాగు నెమ్మదిగా వచ్చి నాతో మాట్లాడడానికి మీమనస్సు వప్పిందా?

దృఢ— అవును. నీవు పొద్దున్న యేమిటో చెప్పినావు గాని, అది యేమిటో నాకు జ్ఞాపకం లేదు.

మృదు— తనకూతురుని తీసుకుని నాసవితన్నగారు చండశాసనుఁడు గారు కూడా యిక్కడకు వచ్చి వున్నారు. నేను యిప్పుడు మీతో పోట్లాడకూడదు. నేను మీతో నేటి వుదయాన్న చెప్పిన సంగతే మరిచిపోయినారుగా!

దృఢ— నా ప్రాణేశ్వరీ! నిజంగానే మరచిపోయినాను. నేను నీవు చెప్పేమంచిసంగతులు మాత్రమే జ్ఞాపకం వుంచుకుంటాను.

మృదు— మీ మంచితనం చూస్తే నాకు వళ్ళు మండుకు పోతూవున్నది. మీవుపేక్షవల్ల నామనస్సుకు యెంతైన నొప్పి కలుగుతూ వున్నది.

దృఢ— నేను బుద్ధిపూర్వకంగా యెప్పుడూ నీ మనస్సుకు నొప్పి కలిగించలేదు. నీ విషయమయి నాకు వుపేక్ష లేదు. నేను యెప్పుడూ నిన్నే తలచుకుంటూ వుంటాను— అమావాస్యనాడు రాత్రి భోజనం లేదు.

[జానకి ప్రవేశించుచున్నది]

జాన— అమ్మా! ఆవిడె—

దృఢ— అయ్యో! మరచిపోయినాను. నేను వుదయాన్న బజా

రుకు వెళ్ళినప్పుడు నీకోసం బొట్టుపెట్టె కొన్నాను. ఓ ప్రాణేశ్వరీ ! అదుగో చూచినావా?

మృదు— మీరు చేసినపనికి యీముష్టిపెట్టె యిస్తే నాకోపం పోతుం దనుకున్నారా యేమిటి? (కిటికీ తలుపు తీసి) మీరు యిచ్చిన వస్తువు యెక్కడ దాస్తానో చూడండి. (అని కిటికీలోనుండి గోదావరిలో పడవేయుచున్నది)

జాన — (తనలో) మాణిక్యంవంటి పెట్టె పారవేసింది. నాప్రియుడుకూడా నాతో వివాదపడి యీలాగంటివస్తువు యే దయినా నాకోపంతీరడానికి బహుమానం పంపిస్తే బాగావుండును. నేనుమాత్రం గోదావరిలో పడవెయ్యనూ?

మృదు— నేను యేమిచేసినానో చూచినారా?

దృఢ.— చూచినాను. బొట్టుపెట్టె కిటికీలోనుంచి గోదావరిలో పారవేసినావు.

. మృదు— అందువల్ల మీ కేమీ విచారం కలగలేదా?

దృఢ— యెందుకుకలుగుతుంది? నీవస్తువు నీవు పారవేసుకుంటే నాకేమి? యెవరివస్తువు వారు మనసువచ్చినట్టు చేసుకోవడానికి ప్రతి వారికీ స్వతంత్రం వున్నది.

మృదు.— పయికి మంచివానివలె నటిస్తూ మీరు నన్ను యెంత క్షోభయినా పెడుతూ వున్నారు. ఏమయినా అంటే నానోరు బయల పడుతుంది.

జాన— అమ్మా! ఆవిడే. —

మృదు— ఏమీ! నీవుకూడా యిక్కడే వున్నావా? (మనోరంజనితో రహస్యముగా) నే నన్నమాట నిజ మవునో కాదో యీజానకిని చూడు. నేను తలదువ్వుకుంటే అదె తల దువ్వుకున్నది. బొట్టుకూడా

నేను పెట్టుకున్న మోస్తరుగానే పెట్టుకున్నది— జానకీ! యేమిం
చెప్పవచ్చినావు?

జాన.—అమ్మా! ఆవిడే యీమధ్యాహ్నం మీరు తన యిం
టికి వస్తారో రారో కనుక్కొని రమ్మని వర్తమానం పంపించింది.

మృదు—ఆవిడె యెవరు?

జాన—కనకాంగిగారు మీ పెత్తల్లి కూతురు.

మృదు—అవును జ్ఞాపకం వచ్చింది. వస్తామన్నారని చెప్ప
మను. పాపం కనకాంగికి వంట్లో జబ్బుగా వున్నది.

జాన—(దృఢవ్రతునితో మెల్లగా) మీ యింటి యజమాన
రాలుగారు వెళ్ళిన తరువాత మీకు వకటి చూపించవలసి వున్నది
జ్ఞాపకం చెయ్యండి.

మృదు.—నేను తప్పకుండా వెళుతాను. కదలవేమి? జాన
నేను వెళ్ళననుకుంటున్నావా యేమిటి? మాఅమ్మగారు యిప్పుడే వస్తా
రని చెప్పు.

జాన—నేను మీరు వెళుతారే ననుకున్నాను. ఇదుగో వెళ్ళి
చెపుతాను. (అని వెళ్ళుచున్నది)

మృదు—ప్రాణేశ్వరా! మీకు సిగ్గులేకుండా నాయెదుట అలా
నిలుచోవడం బాగావున్నదికాదు.

దృఢ—నీకు యిష్టంలేకపోతే నేను పుస్తకాలగదిలోకి వెళ్ళి
పురాణపారాయణం చేసుకుంటానులే— ఏకాదశీవ్రతం నియమంగా
జరపవలెను. (అని వెళ్ళుచున్నాడు)

మనో — పెనిమిటిని చూస్తే నీవు ఆలా చిర చిర లాడుత
వుంటావేమి?

మృదు—నీవు మహా పతివ్రతవు. నీ కొసంగతి తరువాత చె

తానులే. ముందుగా ఆపానకపుచెంబు యిలాగుతీసుకుపిరా. అందులో యిప్పుడు నేను రోట్లో నలగకొట్టినమందు వేస్తే యెంతఖాయిలాలో వున్నవారి కయినా కుంభకర్ణుడిలాగు నిద్ర పడుతుంది. కనకాంగికి రాత్రి బొత్తిగా నిద్రపట్టకుండా వున్నది. యీమందు తీసుకునివెళ్లి యివ్వవలెను.

[పెద్దబుట్ట తలమీఁద పెట్టుకొని యిద్దఱుమనుష్యులు ప్రవేశించుచున్నారు]

మృదు — అబ్బీ! యీరాతిసిబుట్ట యిక్కడకు యెందుకు తెచ్చినారు?

మను—జానికమ్మకోసం తెచ్చినాము. మీానవుకరు మేడమీాద వున్నది. అక్కడకు తీసుకువెళ్లమంటే తీసుకు వచ్చినాము.

మృదు—జానికమ్మా? మంచిది. బుట్ట అక్కడ వుంచి మీారు వెళ్ళిపొండి.

మను—ఇక్కడ వుంచుతాము. (అని యుంచి వెళ్ళుచున్నారు)

మనో— నీవు అవుషధం తయారుచేస్తూ వుండు. నేను యింటిలోపలికి వెళ్ళి కనకాంగిఅత్తగారి యింటికి నీతోకూడా రావడానికి గావృాదాచీర కట్టుకుని వస్తాను. వెనుక త్రివిక్రమవర్మను కలుసుకోవడానికి యీావృాదాచీర కట్టుకుని మాతోటలోకి యెంతో సంతోషంగా వెళ్లేదాన్ని. (అని వెళ్ళుచున్నది)

మృదు—ఇందులో యేమున్నది? ఈబుట్ట కదులుతూవున్నట్టున్నది. లోపల యెవడూ మనిషిలేడుగద?

[అప్పుడు సాహసవర్మ బుట్టలోనుండి పయికి దుముకుచున్నాఁడు]

సాహ — అమ్మా! అమ్మా! నిన్ను బతిమాలుకుంటాను. కేలు వెయ్యబోకు. నేను పరాయివాణ్ణయినా నీఅనుగ్రహం నమ్ముకొని వున్నాను.

మృదు — ఈవేషం యేమిటి?

సాహ — చల్లకువచ్చి ముంత దాచిన ప్రయోజనం లేదు. త్రివిక్రమవర్మ పేరు మీరు యిదివరకు విని వుంటారు. నేనే అతణ్ని.

మృదు — మనోరంజనిప్రియుడవు నీవేనా? నీవు యెవరవో యెక్కడివాడవో యెవరికీ తెలియదు. అయినాకానీ నీవు నాఅనుగ్రహాన్ని నమ్ముకొని వున్నానని చెప్పినావు గనుక, నిన్ను బయలపెట్టక నీకు సహాయం చేస్తాను.

సాహ — నీవు మహాదొడ్డదానవు.

మృదు — వచ్చినట్టుగానే నిన్ను మళ్ళీ పంపించివెయ్యడానికి నేను సహాయం చేస్తాను. బుట్టలోనికి తిరిగీ వెళ్ళు. మళ్ళీ యిద్దరుమనుష్యులు యీబుట్ట నీవు యేస్థలానికి తీసుకుని వెళ్లమంటే అక్కడకు తీసుకునివెళ్ళి విడిచి పెస్తారు. నీవు యిక్కడికి వచ్చిన సంగతి యెవరికీ తెలియనియ్యను.

సాహ — (తనలో) ఇది మంచిఅనుగ్రహమే. (బిగ్గరగా) అమ్మా! నన్ను తిరిగీ బుట్టలోకి వెళ్లమనడం మీకు న్యాయమా? బాగా ఆలోచించుకోండి. ఈబుట్టలో దూరడంవల్ల నాకు తగిలిన దెబ్బలూ గాయాలూ అటుండగా వత్తుకుని నావంటినిండా చాప అల్లినట్లు శిరస్సు మొదలుకొని పాదందాకా యీఅల్లికపని యెట్లా అంటుకున్నదో చూడండి.

మృదు — ఈబుట్టలో దూరడంకంటె నాకు వుపాయాంతరం యేమీ తోచడం లేదు. నీకు మామనోరంజనితో సంధానం కలుగచెయ్యడానికి నేను సహాయం చెయ్యజాలను. పరపురుషుడితో నేను వంటరిగా మాట్లాడుతూవుంటే చూచేవారు యేమనుకుంటారో అదికూడా ఆలోచించవలెను. వేగిరం బుట్టలోకి వెళ్లు. బుట్టమోసుకుని వెళ్ళడానికి నేను

యిప్పుడే మనుష్యులను తీసుకుని వస్తాను.

సాహ—అమ్మా! నీకు సాధనాంతరం తోచకపోయినట్టయితే యీకాగితంలో వ్రాసినచోటికి నన్ను పంపించండి. (అని కాగితము చేతి కిచ్చి బుట్టలో ప్రవేశించి) బుట్ట క్రిందివైపు మీదకీ మీదివైపు కిందికీ తిప్పకుండా జాగ్రతగా తీసుకుని వెళ్ళమనండి.

మృదు—ఆలాగే చెపుతాను. కదిలితే లోపలవున్న సామాను దెబ్బలు తగులుత వని కదలకుండా తీసుకుని వెళ్లమని గట్టివుత్తరువు చేస్తాను. (అని వెళ్ళుచున్నది)

సాహ—వస్తికపు సరుకులాగు యిందులో కూర్చుండి నేను మళ్లీ వెళుతానా? వెళ్లను. (పయికి వచ్చి) నేను యీయింట్లోనే యెక్కడయినా దాక్కుంటాను. నాకు బదులుగా యీబుట్టలో యేమయినా వెయ్యవలెను. యీయింట్లో యేమి వున్నవి? యిక్కడ వక రోలూ, రోకలీ తలుపుకు యెత్తుపెట్టుకునే రాయీ కనుపడుతూ వున్నవి. యివి యీబుట్టలో వేస్తాను. (అని వానిని బుట్టలో వేసి) యీవిడె చేతికి నేను బస చేసి వున్నవారి పేరు వ్రాసి యిచ్చినాను. నాకు బదులుగా యివే అక్కడకు వెళుతవి. (అని వెళ్ళుచున్నాడు)

[జానకి ప్రవేశించుచున్నది]

జాన—యీరోజున నాయజమానురాలు వూరికే చిరచిరలాడుతూ వున్నది. ఆవిడె నన్ను చూస్తే యెప్పుడూ కోపపడుతూనే వుంటుంది. ఈసారి సన్నేమైనా అంటే నామనస్సులో వున్నది మొగంమీద అని వేస్తాను. ఆవిడె యిందాకా యీకిటికీలోనుంచి బొట్టుపెట్టె నిష్కారణంగా నీళ్లల్లో పారవేసింది. అది తేలివున్నదేమో చూస్తాను. (అని కిటికీవద్దకు పోయి చూచి) అదుగో నాప్రియుడు మాధవుడు పడవులో యెక్కి షికారు బయలుదేరినాడు. అతనిదగ్గర యెవత్తో

ఆడది కూడా కూర్చున్నది. నేను చూడలేను. ఈమాటు అతడు నన్ను చూడడానికి వచ్చినప్పుడు కట్టుకున్నబట్టలు చింపివేసి యిలా గంటి పని చేసినందుకు తగిన ప్రాయశ్చిత్తం చేస్తాను. ఇక్కడ యీ బుట్ట యేమిటి? దీనిమీద యేమిటో చీటి అంటించి వున్నది. చదువుతాను. జా — జా — జాన — జానకి — ఇది నాదే. ఇది వట్టి పాడు దస్తూరీ. నేను చదువలేను. తరువాత యెవరిచేత నయినా చదివిస్తాను. (అని చీటీ తీసి) ఈబుట్టలో యేదో పెట్టి పడవలో నేను యిప్పుడు చూచినమానిర్భాగ్యుడు నాకు బహుమానం పంపించినాడు. నేను యిది పుచ్చుకోను. యిందాకా తన భర్తగారు యిచ్చిన బహుమానాన్ని మాఅమ్మగారు యెలా చేసిందో నేనూ దీన్ని ఆలాగే చేస్తాను. ఈకిటికీలోనుంచి యిది గోదావరిలో పడవేస్తాను. (అని యెత్తి చూచి) అమ్మో! ఇది యెంత బరువుగా వున్నది? తాళు. యెవరో వస్తూ వున్నట్టున్నారు. అడుగులచప్పుడవుతూ వున్నది.

దృఢ — (వెలుపలనుండి) ఈసంవత్సరం కార్తీకసోమవారాలన్నీ వుండవలెను.

జాన — ఆ వచ్చేది మాయజమానుడు దృఢవ్రతుడు గారు. ఈయన నిగర్వచూడామణి. ఈయనకు కోప మన్నమాట లేదు. అయ్యా! మీరా?

[దృఢవ్రతుఁడు ప్రవేశించుచున్నాఁడు]

దృఢ — జానకీ! ఇక్కడ యేమిచేస్తూ వున్నావు?

జాన — అయ్యా! మీరు నాకు వక్కవుపకారం చెయ్యవలెను. మీ దేహంలో బాగా బలం వున్నదా!

దృఢ — (తనలో) ఇది నన్ను యీప్రశ్న యెందుకు అడిగి వుంటుంది?

జాన—అయ్యా! మరేమీ లేదు. సందేహించకండి. మీకు జెబ్బపుష్టి బాగా వున్నదేమో తెలుసుకోవడాని కడిగినాను.

దృఢ—సాధారణంగా వున్నది.

జాన—మీరు దొడ్డ మహారాజులు. మీకు శ్రమ యిచ్చి నందుకు క్షమించవలెను. మీరు నాయం దనుగ్రహించి యీబుట్ట కిటికీలోనుంచి గోదావరిలో త్రొయ్యడానికి కొంచెం సహాయం చెయ్య గలరా?

దృఢ—యెందుకు త్రొయ్యడం?

జాన—అయ్యా! క్షమించండి. ఇది కొంచెం రహస్యమయిన సంగతి.

దృఢ—ఈబుట్ట గోదావరిలో వెయ్యడం రహస్యమా? నీమాట నమ్మతగి వుండలేదు.

జాన—నాప్రార్థన చిత్తగించి యీకాస్త పని చేసిపెట్టండి. యిది నేను గోదావరిలో యెందుకు త్రోయిస్తానో తరువాత సావకాశంగా తమతో మనవి చేస్తాను.

దృఢ—ఇప్పుడు చెప్పితే చెప్పినావు గాని యిటువంటిపనులు యిఖముందు నాతో యెప్పుడూ చెప్పకు. ఈమాటుమాత్రం చేస్తాను. అవతలవయిపున నీవు పట్టు. ఇది యెంత బరుగా వున్నదీ! (ఇద్దఱును పట్టి బుట్ట గోదావరిలో త్రోయుచున్నారు)

జాన—ఎంత చప్పుడయిందో! నీళ్ళు పయికి నిలువెడెత్తు లేచి బుట్ట తిన్నగా అడుక్కుపోయింది. నాకీసహాయం చేసినందుకు మీకు పదివేల దణ్ణాలు.

దృఢ—ఇది యెత్తే టప్పటికి నా చెయ్యంతా నొప్పిపెట్టింది. నకీ! నీకు వక బుద్ధి చెప్పుతాను. నీవు యింకొకసారి యెప్పుడైనా

యిటువంటి రహస్య మయినపని చెయ్యవలసి వచ్చినప్పుడు నాతో చెప్పక యెవరి నైనా యిద్దరిని బలమైన మనుష్యులను మాటాడి తెచ్చుకో.

జాన — అయ్యో ! క్షమించండి. మీకు పది వేలదణ్ణాలు పెడుతాను. ఈబుట్టలో పెట్టి విశ్వాసహీనుడైనమాధవుడు నాకు యేదో బహుమానం పంపినాడు. నాకు అతనిమీద బహుకోపంగా వున్నది. ఈసమయంలో అతను యిక్కడవుంటే బాగా వుండును. అప్పుడు యీబుట్టకు బదులుగా అతణ్నే యీగోదావరిలో తొయ్యమని యేలినవారిని ప్రార్థిస్తును. తమరు నాయందువుండే దయచేతనూ తమ మంచి స్వభావంచేతనూ నాప్రార్థనను తప్పకుండా చెల్లించి వుందురు. (అని వెళ్ళుచున్నది)

దృఢ — ఇది వట్టి మతిలేని మాట లంటూ వున్నది. ముఖ్యమాటంచేత కాస్తపనిచేసిపెడితే నవ్రకర్తు యెప్పుడూ వేపుకుతింటాడు. మాతోటమాలీకి యిదివరకు ఆరువుత్తరాలు వ్రాసిపెట్టినాను. ఈజానకి యిదివరకు తన ప్రియుడు వ్రాసినవుత్తరాలు నాలు గైదైనా నాచేత చదివించుకున్నది. నేను చదివే పురాణాలు జ్యోతిషగ్రంథా లనుకుని మా ఆవులను పాలు పితికే వాడు తన కొడుకు పెళ్లికి ముహూర్తం పెట్టుమని వచ్చినాడు. ఆపను లన్నిటికంటెనూ యీబుట్ట తొయ్యడం పని బహు విచిత్రంగా వున్నది.

[మృదుభాషిణి ప్రవేశించుచున్నది]

మృదు — ఓప్రాణేశ్వరా ! మీరు యిక్కడ బుట్టచూచినారా? పెద్దబుట్ట.

దృఢ — చూచినాను.

మృదు — మీరు కూడా లోపల దాక్కో వచ్చును. అం

పెద్దిబుట్ట.

దృఢ—అవును. పెద్దబుట్టే. (తనలో) జానకీ నేనూ తోసు పట్టి గోదావరిలో పడ వేసినమాట చెప్ప కూడదు. చెపితే ఖజ్జాకు వస్తుంది.

మృదు— ఈసంగతి మీరు యెవరితోనూ చెప్పనని నాచేతులో చెయ్యి వెయ్యండి.

దృఢ—నామాట నమ్ము. నేను యెవరితోనూ చెప్పను.

మృదు—ఆబుట్టలో యేమి వున్న దనుకొన్నారు?

దృఢ—నాకు తెలియదు. ఏమి వున్నదో నీవు చెపితే వింటాను.

మృదు—మనిషి వున్నాడు.

దృఢ— ఏమిటి! మనిషా ?

మృదు—మనిషే. నిశ్చయంగా మనిషే.

దృఢ— (తనలో) మనిషికాదు. అందులో పెద్ద దయ్యం వున్నది. (బిగ్గరగా) ఓ ప్రాణేశ్వరీ! నీవు యేదో పొరపాటు పడ్డావు.

మృదు—పొరబాటూ లేదు. యేమీ లేదు. అతణ్ని నేను కళ్లారా చూచినాను. అతనిమాటలు చెవులారా విన్నాను. అతను యెవరనుకున్నారు? మన మనోరంజనిని మోహించి తిరుగుతూ వుండే త్రివిక్రమవర్మ. అతను బుట్టలో నుంచి యివతలికి వస్తా నన్నాడు. నేను యింట్లోనుంచి అవతలకు పంపివేస్తా నన్నాను. వీళ్లయిద్దరికీ సంబంధం కాకుండా చెడ కొట్టడానికి నేను చేస్తూవున్న ప్రయత్నం మీాకే తెలుసును.

దృఢ— ఈసంబంధం చెడకొట్టడంలో నీపగ మొదలంటా తీర్చుకున్నావు. అయ్యో! పాపం!

మృదు— తెల్లపోయి అలాచూస్తా రేమి? మీామనస్సు స్వస్థంగా

లేనట్టు కనపడుతూ వున్నది.

దృఢ - నామనస్సుకు స్వస్థం లేదంటూ వున్నావా? ఇది బుద్ధి పూర్వకమయిన పనికాదు. కేవలం పొరబాటుచేత జరిగింది. అయ్యో! అయ్యో! బుట్టలో మనిషి వున్నాడా?

[సుబలుఁడు ప్రవేశించుచున్నాఁడు]

సుబ—అమ్మా! మేమంతటా చూచినాము. మాకు యెక్కడా బుట్ట కనపడడం లేదు.

మృదు—కనపడడం లేదూ?

దృఢ—కనపడడం లేదు! ఇది యేమో వింతగా వున్నది! మీరు రది చూచి వుండరు.

మృదు—ఆలాగైతే జానకి తనబుట్టచూచి తీసుకుని వెళ్ళి వుండవచ్చును. సుబలా! నీవు వెళ్ళిపోవచ్చును.

సుబ—మంచిది. (అని వెళ్ళుచున్నాఁడు)

మృదు—నామనస్సులో యేమీ తోచకుండా వున్నది.

దృఢ— నాకూ తోచకుండానే వున్నది. కాని నీకు తోచక పోవడమంటే విరుద్ధంగా కనపడుతూవున్నది.

మృదు—ఆలాగంటారేమి? అతడు బుట్టలోనుంచి తప్పించుకునిపోయి చండశాసనుడికూతుర్ని కలుసుకుని, మాట్లాడవచ్చును.

దృఢ—ఆవిషయమయి నీవు యెంతమాత్రమూ భయపడవలసినపని లేదు. అతడు బుట్టతోకూడా యీకిటికీలోనుంచి తప్పించుకొని పోయినాడు.

మృదు—మీరెరుగరాయేమిటి ? ఆకిటికీఅవతల కింద పెద్దనది పారుతూ వున్నది.

దృఢ—అవును పారుతూ వున్నది. అతడు నీళ్లలో పడకుండా

యీకిటికీలోనుంచి తప్పించుకుని పోలేదు. అయ్యో! పాపము!

**మృదు — నేను మనోరంజనిదగ్గిరకు వెళుతాను. కామాంధు లైవున్న యీయిద్దరూ కలుసుకుంటే వాళ్లను మళ్ళించడానికి బ్రహ్మ తరంగాదు. చండశాసనుడు వక వేళ యిక్కడకు వస్తే బుట్టలో మనిషి వున్నట్లు అతగాడితో చెప్పకం డేమి? (అని వెళ్లుచున్నది)**

దృఢ—నేను ఈరహస్యం బయల పుచ్చను. నేను తెల్లవారిలేచి మహాఘనకార్యం చేసినాను. నిష్కారణంగా వక ప్రాణం తీసివేసి నాను. అయిపోయింది మళ్లీ తలపెట్ట రాదు. ఇఖ దీనివిషయ మయి నే నాలోచించను. మని షయితే బుట్టలో దూరి యెందుకు కూర్చో వలెను? ఇందులో నాతప్పితం యేమీలేదు. నేను నిర్విచారంగా వుండ వచ్చును. నేను పుస్తకం చదువుకుంటూ మనస్సు దీనిమీదినుంచి మరివకదానిమీదికి మళ్లించుకుంటాను. గౌతమీమహత్యం చదువు దునా? పనికిమాలిన పుస్తకం. మళ్ళీ నీళ్ళూ గోదావరీ జ్ఞాపకం వస్తూ వున్నవి.

[జానకి ప్రవేశించుచున్నది]

దృఢ— ఓహో! నీవు యిక్కడనే వున్నావా? నీవు మహా మంచిదానవు.

జాన—మగవా ళ్లందరూ నన్నాలాగే అంటారు.

దృఢ—ఓసి రంకుముండా!నాముఖంచూడడానికి నీకు మనస్సు యెలాగు వప్పింది?

జాన—నేను నిజంగా రంకుదాని ననే మీరు—

దృఢ—నీ వంతకంటెనూ నూరురెట్లు చెడ్డదానవు. ఆపనికంతా నీవే కారకురాలవు.

జాన—ఏపనికి?

దృఢ—ఆ ఘోరమైనపనికి. నరహత్యకు.

జాన—అయ్యో! మీరు నన్ను పరిహాసం చేస్తూవున్నారు.

దృఢ—పరిహాసమా! ఆబుట్టలో మనిషి వున్నది యెరగనట్టు నటించడం నీకే తగివున్నది.

జాన—మీరు పన్నినది మంచియత్నం. మీరు నాతో హాస్య మాడుతూ వున్నారు కాబోలును. ఆబుట్టకు వకచీటీకూడా అంటించి వున్నది. అది తీసి నేను జేబులో వేసుకున్నాను. (చీటి పయికి తీసి) అయ్యో! ఇందులో యేమయినా హాస్యపుమాటలు వుంటే నన్ను యెగతాళి చెయ్యకండి. (అని చీటి చేతికిచ్చుచున్నది)

దృఢ—(చదువుచు) "నాప్రాణాధికురాల వయిన జానకీ!"

జాన— ఓరి యిచ్చకాలమారి దొంగా!

దృఢ —"యిందులోపెట్టి నాయజమానుణ్ని నీనగ్గిరకు పంపించి నాను."

జాన—అయ్యో! (అని అరచుచున్నది)

దృఢ—అరవబోకు. అరవబోకు. నీవు గట్టిగా అరిస్తే యిప్పుడు నీకూ నాకూ కూడా తంటావస్తుంది.

జాన -- అయ్యో! అయ్యో! అయ్యో! ఆచీటి నన్ను చూడ నియ్యండి. (చూచి) య—య— య—యజ—యజ—యజమా-యజమానుణ్ని—మీరు చెప్పింది నిజమే. అయ్యో! అయ్యో! మనకు తప్పకుండా తంటా వస్తుంది.

దృఢ—అలాగైతే మొదటినుంచీ యీసంగతి నీకు తెలియనే తెలియనట్టున్నది.

జాన—ఎంతమాత్రమున్ను తెలియదు. యెవరైనా చదివి పెడితేనేగాని నేను వుత్తరాలు స్వయంగా చదువుకోలేను. నేను చిన్న

ప్పుడు గరల్సుస్కూలులో చదువుకున్న నాలుగు ముక్కలూ మరిచి పోయినాను. మాదౌర్భాగ్యుడు నాకు యేదో పంపించినాడని అది మాఅమ్మగారు చేసినట్టు గోదావరిలో త్రొయ్యవలె ననే కాని నాకు రెండో ఆలోచన లేకపోయిండి.

దృఢ—అయిందేమో అయింది. ఇఖ నేను ముందుసంగతిని గురించి ఆలోచిస్తూవున్నాను. నీవు బుద్ధిపూర్వకంగా చేసినావని నీమీద నిష్కారణంగా అనుమానపడ్డాను. నీవు నిర్దోషురాల వని నా కిప్పుడు తెలిసినది. మనమిద్దరమూ యిందులో పనికిమాలిన దోషులమూ నిర్దోషులమూకూడానూ. ఆబుట్టనీ అంతట నీవే త్రొయ్యక నన్నుకూడా యెందుకు రమ్మన్నావు? అయినాకాస్సే యీచీటీ కడతేరా చదువుదాము. (ఇద్దఱును దగ్గఱగాచేరి చదువుచున్నారు)

[అప్పుడు సాహసవర్మ ప్రవేశించుచున్నాఁడు]

సాహ—(తనలో) మనోరంజని నాకు యెక్కడా కనపడలేదు. ఈలోపల యెవడైనావచ్చి నన్నుచూచి యేమైనా అంటాడేమోనని ప్రతినిముషమూ భయంవేస్తూవున్నది. అక్కడెవరో వున్నారు. నేను అదృష్టమంతుణ్నే. అతడు నాపూర్వపు స్నేహితుడు దృఢవ్రతుడు. అందుకు సందేహంలేదు. (బిగ్గరగా) ఓయీ! దృఢవ్రతా!

దృఢ—(తనలో) అడుగో కనిష్టేబిలు వచ్చినాడు. (బిగ్గరగా) కాదండీ ఇక్కడనుంచి కాదండి. అది మా పక్క యింట్లోవారి కిటికీలోనుంచి పడ్డది. (తేఱిపారచూచి) ఓయీ సాహసవర్మా! నీవా? నీవు క్షేమంగా వున్నావా? (తనలో) తలుపులన్నీ వేసి వుంటే ఇత డేదారిని వచ్చినాడు?

సాహ—(తనలో) నే నితనితో బుట్టసంగతేమీ మాట్లాడక వూరికేచూడడానికి వచ్చినట్టు నటిస్తాను. (బిగ్గరగా) మీరంతా క్షేమం

గా వున్నారా: మిమ్మలిని చూచి నాలుగు సంవత్సరాలు పయిగా అయింది.

దృఢ—నాలుగు సంవత్సరాలా? అవును కావచ్చింది. నీవు పూర్వపు స్నేహితుణ్ని జ్ఞాపకం వుంచుకుని చూడడానికి వచ్చినందుకు చాలా సంతోషంగా వున్నది.

సాహ—అవును చూడడానికే వెతుక్కుంటూ వచ్చినాను.

దృఢ—నామీద నీకు చాలా దయవున్నది గనుక వచ్చినావు. నేను యిక్కడ వున్నసంగతి నీకు యెట్లా తెలిసింది?

సాహ—మిమ్మలిని కిటికీలోనుంచి చూచినాను.

దృఢ—రా. రా. వెళుదాము. యీముందుభాగం మేము కాపురంవున్నభాగం కాదు. యీయింటి వెనకభాగం సరిగా నీళ్లలో వున్నది.

సాహ—అవును. పావుగంటసేపటి క్రిందట యీదారిని గోదావరిలో పడవమీద కారు వెళ్ళినప్పుడు చూచినాను.

దృఢ—ఏమిటి? నీవు నన్ను కిటికీలోనుంచి చూచినావు కాబోలును! అప్పుడు నేను యేమయినా పనిచేస్తూవున్నానా?

సాహ—లేదు. అసలు నేను మిమ్మల్ని చూడనేలేదు.

దృఢ — అవును. చూడలేదు. నిశ్చయంగా చూడలేదు. అప్పుడు కిటికీలోనుంచి చెయ్యడానికి నాకేమిపని వున్నది?

సాహ—(తనలో) ఇతనిమాటల ధోరణి చూస్తే యేదో వింతగా వున్నది.

జాన—అప్పుడు నే నీయనసమీపమున నిలుచోలేదు కాదూ?

సాహ—లేదు.

దృఢ— నిజంగానే నిలుచోలేదు.

సాహ.—(అని తనలో) యిదంతా యేమిటి? ఏదోతప్పుపని చెయ్యడంచేత వీరికి మనస్స్థిమితం లేకుండా వున్నట్టున్నది. ఈకిటికీవద్ద నిలుచుండి యీాయన యీచిన్నదాన్ని ముద్దు పెట్టుకొని వుంటాడు. (బిగ్గరగా మీరుచేసినపని నేను కనిపెట్టినాను.

దృఢ—అయ్యో! అది నీకంట బడ్డదా?

జాన—హా దైవమా?

సాహ—దృఢవర్తా, నీవు మహాచెడ్డవాడవైనావు!

దృఢ—అవునవును—కాదు కాదు— నీమనస్సులో అన్ని పిచ్చివూహలు పుడుతూవుంటవి. అయినా కానీ నీవెప్పటివలెనే నవ్వు మొగంతోటే కనపడుతూ వున్నావు.

సాహ—అవును. నాది యెప్పుడూ నవ్వుమొగమే. లోపల యేమివున్నా పైకి ఈనీళ్లు యెలాగు శాంతంగావున్నవో నేను అలాగే వుంటాను.

దృఢ—(తనలో) ఇతని వుపమానాలు వింటే నాకు గుండెలు పగులుతూ వున్నవి.

జాన—(తనలో) యీపాడుపోలికలు చూస్తే నాకు తలనొప్పి వేస్తూ వున్నది.

సాహ—(తనలో) ఆబుట్టలో నావొళ్లంతా నలిగి పోయింది. ఆ అలసటచేత నాకు నోరు యెండుకు పోతూన్నది. (బిగ్గరగా) మనలో మనకు వున్న పూర్వపు స్నేహాన్నిబట్టి యేమీా అరమరలేకుండా అడుగుతూ వున్నాను. దృఢవర్తా ! నాకు కొంచెం పానకం చేయించి తెప్పించగలరా ?

జాన—యిందాకా అమ్మగారు పానకం చేయించి కొంత గిన్నెలో పోసి వుంచినారు. అది తీసుకు వస్తునా ?

దృఢ—వేగిరం తీసుకు రా.

జాన—నిముషంలో తెస్తాను. (అని వెళ్ళుచున్నది)

సాహ—నేను యిప్పుడు ప్రయాణంలో చాలా అలసట పడి వచ్చినాను. దానితో నా కిప్పుడు దాహశాంతి కావచ్చును. ఆ గిన్నెడు పానకమూ నేను యిప్పుడు గిన్నెడు అమృతంగా యెంచుకుంటాను.

దృఢ—ఏమి? బండిమీాద వచ్చినావా యేమి?

సాహ—(తనలో) బండిమీాద కాదు. బుట్టలో వచ్చినాను. (బిగ్గరగా) నేను వెనుక చూచినప్పుడు మీాకు భార్య లేదు. ఈమధ్యను వివాహమాడినారు కాబోలును. ఈయింట్లో మీారు కాపురంవున్నారా?

దృఢ—ప్రస్తుతం మట్టుకు వున్నాము. మేము యిక్కడ చిర కాలం వుండము.

సాహ—మరియెక్కడకు వెళుతారు?

దృఢ—(తనలో) బహుశా చెరసాలలోకి. (బిగ్గరగా) ఎక్కడకు వెళ్లేది ముందు సంగతులనుబట్టి తెలుసుకోవలెను.

[జానకి గిన్నెపట్టుకొని ప్రవేశించుచున్నది]

జాన—అయ్యా! ఇదుగో తెచ్చినాను.

సాహ—(పుచ్చుకొని త్రాగుచు) పానకం దివ్యంగా వున్నది. పానకంలో పంచదార వెయ్యక బెల్లం వేసినారు కాబోలును. అడుగున నోట్లోకి తుక్కువస్తూ వున్నది. అది చెరుకు పిప్పేనా? నాలుక చేదుగా వున్నట్టున్నది. మీారు తాగినప్పుడు చేదు కనపడలేదా?

దృఢ—నేను యెప్పుడూ పానకం తాగను.

సాహ—అలాగైతే మీారు మంచినీళ్లు మాత్రమే గుత్తచేసి పట్టున్నారు. నాకు కొంచెం వికారంగా వున్నది.

దృఢ—మంచినీళ్ళు గుత్తచెయ్యడమా? నీళ్ళు గుత్తచెయ్యడ

మంటే నీ అభిప్రాయం యేమిటి? నేను మంచినీళ్ళు తప్ప మరియేమీ తాగనని నీ యభిప్రాయం కాబోలును.

సాహ—అవును. నా అభిప్రాయం అంతే. యీపానికిమాలిన తుక్కు కంటె నేనుకూడా మంచినీళ్లు తాగితేనే బాగా వుండిపోను. నాకు లోపల యేలాగో వున్నది.

దృఢ—(తనలో) నాకూ అలాగే వున్నది.

జాన—(తనలో) నాకూ అలాగే వున్నది.

సాహ—నిజంగానే యీపానకంలో యేదో కలిసింది.

దృఢ—ఏమీ కలియలేదు. వట్టి అనుమానము.

సాహ—(చేతులతో కన్నులు మూసికొని) నీళ్లల్లో చేపలాగు లోపల తిరుగుతూ వున్నది.

దృఢ—నీళ్లల్లోనా? (అని కిటికీయొద్దకు పరుగెత్తుచున్నాఁడు)

జాన—చేపలాగునా? (అని కిటికీయొద్దకు పరుగెత్తుచున్నది)

దృఢ—ఏమి నీటిప్పైని తేలిందా?

సాహ—నాప్రాణాలు పోతూవున్నవి. నిశ్చయంగా యీపానకంలో యేదో కలిపినారు. అది విషమయివుంటుంది.

(అని బల్లమీఁద మూర్ఛపోయిపడుచున్నాఁడు)

దృఢ—జానకీ! యిది యేమిటి? (అని రెప్పవాల్పక చూచుచున్నాఁడు)

జాన—(కన్నులు నలుపుకొనుచు) యిదేమిటి?

దృఢ—ఇది రెండో నరహత్య. జానకీ—

జాన—అయ్యో!

దృఢ — (గిన్నె వాసన చూచి) ఈపానకంలో తప్పకుండా యేదో కలిసింది.

జాన—(ఏడ్చుచు) అలాగైతే నన్ను వురితీస్తారు.

దృఢ—బహుశా తీస్తారు. నీకూ నాకూ కూడా రెండేసి వురి తాళ్ళు కంఠానికి బిగియడానికి సిద్ధంగా వున్నవి. నీ దుర్మార్గంలో నన్ను కూడా సహకారినిగా యేవుద్దేశంతో చేస్తూ వున్నావు?

జాన—ఇదంతా కేవలం పొరబాటు!

దృఢ—నీ పొరబాట్లన్నీ ప్రాణాల మీదికివచ్చే పొరబాట్లు. బుట్టలోవాడా యేట్లో వున్నాడు; ఇక్కడ సాహసవర్మ విషప్రయోగం చేత ప్రాణాలు విడిచినాడు. ఇఖ మనను యిద్దరినీ తప్పకుండా వురి తీస్తారు. అప్పుడు పోయినవన్నీ మనవాటితోకూడా నాలుగుప్రాణాలవుతవి. ఇందువల్ల భూభారం కొంత తగ్గుతుంది.

జాన— అతడు పానకం యెందుకు కావలెనన వలెను?

దృఢ—అసలు యితడు నేను పిలువకుండా మన యింటికి యెందుకు రావలెను? ఇతణ్ని యిక్కడకు రమ్మని యెవరు పిలిచినారు?

జాన—ఇతన్ని మనం యిప్పుడేమి చేతాము? ఆ బుట్టలోవాడికి సహాయంగా యితణ్నికూడా ఈ కిటికీలోనుండి అవతలకు తోసివేతామా?

దృఢ—అవిగో యెన్నోపడవలు యీదారిని వెళుతూవున్నవి. మనం కిటికీలోనుంచి తోస్తే వాళ్లు చూస్తారు. (అప్పుడు తలుపుచప్పుడగుచున్నది) ఎవరో తలుపు గుద్దుతూవున్నారు. వారు లోపలికి వస్తూవున్నారుకాబోలు!

జాన—అయ్యో! నాకు మూర్ఛవస్తూవున్నది.

దృఢ—ఇలాగంటి చిక్కుసమయంలోనా? ఈ కష్టసమయంలో నీవు యెంతమాత్రమూ మూర్ఛపోగూడదు. ఇప్పుడు నాకు నీ సహాయం అవశ్యంగా కావలసివున్నది. ముందుగా తలుపులోపల గొళ్లెం

వేసిదా.

జాన—ఈపక్క తలుపు తప్ప తక్కినవన్నీ యిదివరకే వేసి వున్నవి. ఇదికూడా వేస్తాను. (అని వేయుచున్నది)

దృఢ—ఇతణ్ని యీపెద్దమంచంమీద చివరగా పడుకోపెట్టి యెత్తుసరి పోవడానికి యితని పక్కను చిన్నపరుపువేసి పయిని పెద్ద పరుపు వేతాము. అప్పుడు పరుపుకింద మనిషి వున్నాడని యెవరూ కనుక్కోలేరు. (అని యట్లు చేయుచున్నారు)

చండ—(వెలుపలనుండి తలుపుగుద్దుచు) దృఢవ్రతా! దృఢవ్రతా!

మృదు—(వెలుపలనుండి) ఓప్రాణేశ్వరా! తలుపు తలుపు.

జాన—యీశవం అప్పుడే ఎంతబరు వెక్కింది!

దృఢ — వాళ్లు తలుపవతల వున్నారు. మనము పరుపూ దుప్పటీ బాగా వేసినాం గనుక యిఖవాళ్లకు తలుపు తీస్తాను.

జాన—మనం యిద్దరమూ వక్కగదిలో తలుపులు వేసుకుని వున్నట్టు అమ్మగారికి తెలయకూడదు. ఆమె అసలే అనుమానపు మనిషి.

దృఢ—యీవీణె బురకాతీసి వీణె యెవరికీ కనపడకుండా మంచంకింద గోడదగ్గిరగా పెడుతాను. నీవు యీ బురకాలో దూరి వీణెవున్నట్టుగా ఆమూలను గోడ దగ్గిర నిలుచుని వుండు.

జాన—ఆపని వేగిరం చెయ్యండి.

దృఢ—(వీణెగవిసెనతీసి జానకిపయినగప్పి) నీవు యీ మూల యీ గలీబులో కదలకుండా నిలుచుండు. (అని వీణను మెల్లగా మంచముక్రింద పెట్టుచున్నాడు)

చండ—ఓదృఢవ్రతా!

మృదు—ఓప్రాణేశ్వరా!

దృఢ—(చదువుకొనుచున్నట్టుగా ఒకపురాణమువిప్పి ముందు వేసికొని) వస్తూవున్నాను. కేకలు వెయ్యకండి. (అని తలుపు తీయుచున్నాఁడు)

[అప్పుడు చండాశాసునుఁడును, మృదుభాషిణియు, ప్రవేశించుచున్నారు]

మృదు—ప్రభువువారికి ఆఖరికి యింతసేపటి కయినా మాపిలుపులు వినపడ్డవి. సంతోషించవలెను.

దృఢ—యింతసేపటికా? ఓప్రాణేశ్వరీ! నీవు నన్ను వక్కపిలుపుకంటె యెక్కువ పిలిచినావా?

మృదు—సరి సరి వక్కపిలుపా? మేము మీకు అఘాత్తుగా చెప్పడం వచ్చిందనుకున్నాము.

చండ—అన్ని తలుపులూ లోపలవేసి వుండడంచేత యీవిడె అనుమాన పడడాని కారంభించింది. ఈవిడతప్పకుండా లోపల యెవరో వున్నారంటే, నేను వుంటే వున్నారు లోపల యేమీహాత్య జరగడం లేదుగదా వూరుకోమన్నాను.

మృదు— ప్రాణేశ్వరా! లోపల తలుపు వేసుకుని మీరు యేమి చేస్తూవున్నారు?

దృఢ—పుస్తకం చదువుకుంటూ వున్నాను. కర్మవిపాకంలో నరహత్య పాపానికి యేమిప్రాయశ్చిత్తం విధించినాడో అని చూస్తూ వున్నాను. పుస్తకం విప్పివుండడం నీవు చూడలేదా?

మృదు—చూచినాను. చదవడానికి వీలులేకుండా పుస్తకం తల్లకిందుగా పెట్టివున్నది.

దృఢ—నేను పుస్తకము తల్లకిందులుగా కూడ చదువగలను. చదువునందు శ్రద్ధవుంటె యేలాచదివినా చదువవచ్చును.

మృదు—అవును కాని మీరు ప్రేతంలాగు మొఖాన్ని కళ లేకుండా తెల్లగా పాలిపోయినట్టు కనపడుతూ వున్నారేమి?

దృఢ—ప్రేతమా? ఎక్కడ?

చండ—మీరు ప్రేతమంటే జ్ఞాపకం వచ్చింది. నామిత్రుడు దంభప్రియుడు యిప్పుడు వస్తాడు. అతను మీకు కావలసినన్ని భూత ప్రేత పిశాచాదుల కథలు చెపుతాడు. అతను ప్రతియింటికీ తప్పకుండా వకదెయ్యం ఆశ్రయించి వుంటుందని నమ్ముతాడు. బావా! నేను మీచదువుకు యేమీ అడ్డం రాలేదుగదా? మేము యిందాకా సంగీత విషయంలో వక తగాదాపడి మీరు చెప్పినట్టు వప్పుకుంటూ మనుకున్నాము. నేను వీణకు యిరవైమూడు మెట్లంటే నాచెల్లెలు ముప్ఫయిరెండంటుంది.

మృదు—అవును నేను యిప్పుడూ అలాగే అంటూవున్నాను. వీణకు తప్పకుండా ముప్ఫయిరెండు మెట్లే.

చండ—కావు. నిశ్చయంగా యిరవయిమూడు మెట్లే.

మృదు—వూరికే అరిస్తే యేమిప్రయోజనం? నిజానికి ముప్పయిరెండు మెట్లు.

దృఢ—మీయిద్దరిలెఖ్ఖా సరిగానేవున్నది. మీలో యెవరయినా వకరు మీ అంకెలు తారుమారుచేస్తే యిద్దరిలెఖ్ఖా వక్కటిగా టక్కున సరిపోతుంది.

మృదు—యిదా తగవుతీర్చడం? మీతీర్పు యేడిసినట్టేవున్నది.

చండ—పోట్లాడకు. నామిత్రుడు దంభప్రియుడు వచ్చేటప్పటికి మనం వకరితో వొకరుతగువు లాడుకుంటూవుంటే బాగావుండదు.

[మనోరంజని ప్రవేశించుచున్నది]

చండ—ఓసీ! మనోరంజనీ! నీ సామర్థ్య వీణె నేర్చుకుంటూ

వుండే దానవు గదా వీణెకు యెన్ని మెట్లు వుంటవో చెప్పు.

మనో—నాకు జ్ఞాపకంలేదు. అమగో ఆమూల నావీణెవున్నది లెఖ్ఖ చూచిచెపుతాను. (అని జానకి దాగియున్న వీణెగవిసెన చూపుచున్నది)

చండ—బావా! అది నీకు దగ్గరగావున్నది. మూతతీసి ఆవీణె యిలా నా చేతికియ్యి.

దృఢ—(తనలో) ఇప్పుడు మళ్ళీకొత్తచిక్కు వస్తూవున్నది. (బిగ్గరగా) వద్దు వద్దు. ఈవీణెమెట్లు సరిగాలేవు. ఈమధ్య కిందపడి కొన్ని విరిగిపోయినవి. ఇది పనికిరాదు.

మృదు— పనికివస్తుంది. నన్ను చూడనియ్యండి.

దృఢ— నేను పనికిరాదని చెపుతూవుంటేను—

మనో— ఆయన యెంతపట్టుగా మాట్లాడుతూ వున్నాడో?

మృదు—పనికిరాకపోతే పోయెను నన్ను ముట్టుకొని చూడనియ్యండి.

దృఢ—నీ వది ముట్టుకోకూడదు.

మృదు—నేను చూడకమానను.

చండ—తప్పకుండా చూడవలసినదే. వీణె దగ్గిరవున్నప్పుడే తగాదా పరిష్కారం చేసుకోకపోతే మరియెప్పుడు?

దృఢ — ఈ తగాదా పరిష్కార మయ్యేదికాదు.

మృదు —ఇదిగోయిప్పుడేపరిష్కారమవుతుంది.(అనిలేచుచున్నది)

దృఢ—నిశ్చయం కాదు. (అని యడ్డమువెళ్లి యామెను పట్టుకొనుచున్నాడు)

[అప్పుడు వీణెమూత మూలనుండి కదలి నడుచుచున్నది]

చండ— అహాహాహా! వీణెగవిసెన నడుస్తూవున్నది.

మృదు— నా కిప్పుడంతా బోధపడ్డది. దానికింద యెవరో దుర్మార్గులు దాక్కున్నారు. వెంబడించి పట్టుకుంటాను.

మనో—నీతో నేనుకూడా వస్తాను.

దృఢ —(ఆమెను పట్టుకొని) వెళ్లకు వెళ్లకు.

[దంభపిర్యుడు ప్రవేశించుచున్నాడు]

చండ—ఆహాహాహా! మిత్రుడా! క్షేమమా? నీవు యిక్కడికి మంచి సమయానికి వచ్చినావు.

దృఢ—సుఖంలేకుండా యిలాకుటుంబకలహం బాగావుండదు.

మృదు—నీవు చంపివేసినతరువాత కలహంలేకుండా యెలాగు వుంటుంది?

దృఢ—నేను యెవరిని చంపినాను?

మృదు—నాసుఖాన్ని.

దృఢ—అంతేగద? దానికి పర్వాలేదు.

చండ—బావా! నీస్థితియేమీ బాగావున్నదికాదు.

మనో—ఈయన భార్యను బహుబాధ పెడుతూవున్నాడు.

మృదు — ఈయన మూలంగా నాగుండెలు పగిలిపోతవి. (అని యేడ్చుచున్నది).

దంభ— ఏడుపుకూడానా? ఇది మహా అనురాగంగల కుటుంబము. నేను అసమయంలో వచ్చినాను కాబోలును.

దృఢ— (తనలో) నాకు యిప్పుడు వక అలోచన తోస్తూ వున్నది. (భార్యతో నేకాంతముగా) ప్రాణేశ్వరీ! చెవులో మాట. నేను నీళ్లల్లో యెవరిని పడవేసినానో నీకు తెలుసునుగదా?

మృదు— ఎవరిని?

దృఢ—బుట్టలోకూర్చుని వచ్చినవాణ్ని.

మృదు—అయితే?

దృఢ—(ఏకాంతముగా) అతడు యింతకుముందు మనలోపలికివచ్చినాడు. చండశాసనుడిమాట నాకు వినపడడంతోటే, అతను చూచి మనమీాద అనుమానం పడకుండా వుండడానికి ఆబుట్టలో వచ్చిన పెద్దమనిషిమీాద నేను ఏసెబురకా కప్పినాను. ఆ వెళ్లింది అతడే. (తనలో) అతడు నిజంగా బ్రతికివస్తే నాకు సంతోషంగా వుండును.

మృదు—ఓస్సి! ఇంతేనా? ప్రాణేశ్వరా! మీారు మహాబుద్ధికుశలతగలవారు—అన్నా! ఆబురకాలో యేమీా లేదు. మనంవ్రూరికే భ్రమపడ్డాము.

చండ—ఇప్పుడంతా బహు తృప్తికరంగా వున్నది.

మృదు—మీాబావగారు మన నందరినీ వక్కసారి యేడిపించి తమాషా చూడడానికి వట్టి యంత్రం వేసినారు.

చండ—ఆయనయంత్రం బహుబాగాపారింది. నేనుయెప్పుడూ యిటువంటి తమాషా చూడలేదు.

దంభ—నేనూ చూడలేదు. యీా యింట్లో యేదో పిశాచం వుండివుంటుంది.

దృఢ—ఓప్రాణేశ్వరీ! నామీాద నీవు నిష్కారణంగాసందేహపడ్డావు. నేను చేసిన తప్పితమంతా—(తనలో) వక్కనరహత్య.

మృదు—మీారు కోపపడకండి. పయి సంగతులన్నీ చూస్తే మీా మీాద అనుమాన పడడానికి తగినట్టు కనపడ్డవి.

చండ—వంటయి భోజనాలకు పిలిచేలోగా వక్కసారి చల్లపాటువేళ యీాగోదావరి వడ్డున తిరిగి వస్తామా?

మనో—ఇప్పుడు ప్రదోషసమయ మయింది. మంచి చల్లగాలి

కొడుతూ వుంటుంది. వక్కసారి హాయిగా తిరిగి వత్తాము.

దంభ—దయ్యాలకథలకు ఇది మంచి సమయం.

మృదు—ప్రాణేశ్వరా! వెళుదాము రండి.

దంభ—రండి. ఇక్కడనే గోదావరిలో పడి చచ్చిపోయి పిశాచ మయినవాడి కథ చెప్తాను రండి. ఆకథ దివ్యంగా వుంటుంది. (ఒక్క దృఢవ్రతుఁడు తక్క అందఱును వెళ్ళుచున్నారు)

దృఢ—ఇప్పటికి నాకు వంటరిగా సమయం దొరికింది. ఇది నాకు వట్టి దురదృష్టదినం. తెల్లవారి లేచిన తరువాత రెండు నర హత్యలూ వక్క పోట్లాటా తటస్థమయినవి. సమయానికి జానకి యెక్కడకు పోయిందో! అదుగో వస్తూవస్తూవున్నది. — జానకీ! నీవు యెలాగు వున్నావు?

[జానకి ప్రవేశించుచున్నది]

జాన—ఎలాగు వుండవలెనో అలాగు వున్నాను. నామనస్సులో వున్న ఆందోళనం మీకు చెపితే తెలియదు.

దృఢ—తెలుసును. అపరిమితంగా వుంటుంది.

జాన—మురికికంపు కొడుతూవున్న ఆబురకాలో దూరి వూపిరి సలుపకుండా కూర్చున్నప్పుడు చచ్చిపోతా నేమో నని తోచింది.

దృఢ—నీవు చావకపోయినా చచ్చే టంత పని అయినా పుట్టింది. నాకు ఆ భాగ్యమూ కలుగలేదు.

జాన—నేను దానిలోనుంచి వూడిపడడంతోటే ప్రాణాలు లేచివచ్చి చల్లగాలి నిమిత్తం తిన్నగా గోదావరి వడ్డుకు పరుగెత్తినాను. అక్కడ పిల్లలు యేదో వృత్తాంతపత్రిక చదువుకుంటూ వున్నారు.

దృఢ—ఏమి వృత్తాంతాలు చదివినారు?

జాన — మొట్టమొదట యెవరో వక మనిషిని చంపినా రని

చదివినారు.

దృఢ—వక్క మనిషినే కద! అలాగయితే ఆ పుణ్యాత్ముడు యెవరో మనంత దోషికాడు. యీరాత్రి మనం యిద్దరమూ తెల్లవారినదాకా మేలుకునివుండి దాన్ని మనం యిద్దరమూ తోడుపట్టుకునివెళ్ళి యెవ్వరికీ తెలియకుండా గోదావరిలో పడవేసి రావలెను. దాన్నంటే దేన్నో బాగా తెలిసిందా?

జాన—తెలిసింది. సుబలుడు దుప్పటీపట్టుకుని పక్కవెయ్యడానికి వస్తూవున్నాడు. వినిపోతాడు మాట్లాడకండి.

[సుబలుఁడు ప్రవేశించి పక్కదులిపి పరుపుమీద దుప్పటి వేసిపోవుచున్నాఁడు]

దృఢ—ఓసీ జానకీ! మంచంయెంత బరువుగా వున్నదో వక్కమాటు యెత్తిచూతాము. అవతలవైపు పట్టు. (ఎత్తిచూచి) అబ్బో! ఇది వుపద్రపు బలువుగా వున్నది!

జాన—బలువూ లేదు. యేమీ లేదు. యిది మనం యిద్దరమూ తోడు పట్టుకుని తీసుకు వెళ్ళగలము దింపండి. అదుగో వారు వస్తూవున్నారు.

[చండశాసనుఁడును, మృదుభాషిణియు, మనోరంజనియు, దంభప్రియుఁడును, ప్రవేశించుచున్నారు]

దంభ—(తనలో) ఇది మహామంచికుటుంబంగా వున్నది. ఈ చిన్నది నేను దెయ్యపుకథ యేది మొదలుపెట్టినా మాటిమాటికీ అడ్డమే వస్తూవుంటుంది. ఈముసలాయన యెంత మంచికథ చెప్పినా అంతా అబద్ధ మంటాడు. (బిగ్గరగా) మన మంతా సుఖంగా యిల్లుచేరినాము.

చండ—మీకు కరకర లాడుతూ ఆకలి బాగా వేస్తూవున్నట్టున్నది.

దంభ—వేస్తూనే వున్నది. మధ్యాహ్నం రెండోమాటు ఫల

హారమయిన తరువాత మళ్ళీ యేమీ పుచ్చుకోలేదు.

చండ — మనం అదృష్టవంతులము. మనకు యీరాత్రి పిండి వంటలతో విందు దొరుకుతుంది.

దంభ — (తనలో) నేను యిక్కడకు వచ్చినతరువాత విన్న వాటిలో యిది వక్కటే మంచిమాట.

వృష — ఈరాత్రి కాదు. రేపుదయాన్న దొరుకుతుంది. ఈసారి రెండు యేకాదసులు వచ్చినవట. యింతకుముందే విన్నాను. యివాళ స్మార్తపు యేకాదశీ, రేపు వైష్ణవు యేకాదసీని. ఈరాత్రి కొంచెం అటుకుల ఫలహారం తప్ప యేమీ తినకూడదు. (తనలో) ముఖ్యమయి నది నాకు యీరాత్రి ఆకలి కావడం లేదు. వీళ్లతో కూర్చుని యేమి తినకుండా లేచిపోతే వీళ్ళు అనుమాన పడుతారు.

[సుబలుఁడు ప్రవేశించుచున్నాఁడు]

సుబ — ఓదంభప్రియా! మీాబసలో పడుకోవడానికి ప్రత్యే కంగా గది లేదని మీానవుకరు మీాతో చెప్పమన్నాఁడు.

చండ — ఇక్కడకూడా అందరికీ పడుకోవడానికి మంచాలు లేనట్టున్నవి.

[పళ్లెములో అటుకులు వేసికొని జానకి ప్రవేశించుచున్నది]

దంభ — ఇక్కడ యెదుట వకమంచము కనుపడుతూ వున్నది.

చండ — మిత్రుడా! యీామంచము నీవు వుపయోగించుకొన వచ్చును. మేము లోపల యెక్కడైనా పడుకుంటాము.

జాన — అయ్యో! (అని కేకవేసి పళ్లెము క్రిందపడ వేయు చున్నది.)

వృద్ — దౌర్భాగ్యురాలా. పళ్ళెం అలాకిందపడ వేసినా వేమి? నీకేమి కళ్ళు కనపడవా యేమిటి ?

దంభ—ఇది సరసంగా వున్నది. యిక్కడ నవుకర్లకు కూడా కళ్లు నెత్తిమీదికి వచ్చినట్టున్నవి.

జాన—అమ్మా! యెందుకు పళ్లెం జారిపోయిందో చెప్తాను వినండి—ఏమయ్యా! వక్క రాత్రికి విందుకువచ్చినవారు వీరుకూడ నామీద కోపపడుతూ వున్నారు! మీరు నామీద కోపపడడానికి మీరు నన్నేమీ జీతమూ భత్యమూ యిచ్చి నిలపలేదు. నాకు కోపం వచ్చి నేను మళ్ళీ యేమయినా అన్నానంటే మీామనసుకు భారంగా వుంటుంది. వూరుకోండి.

దంభ—ఇది కొత్తఖర్జా. బాగా వున్నది!

చండ—ఆహాహాహా! బాగానే వున్నది. అటుకులు కిందపడి మయిలపడిపోయినవి. ఈరాత్రి మనకందరికీ యేకాదశీఫలం పూర్ణంగా లభించింది. వీరాకందరికీ జాగారపు పుణ్యంకూడా దక్కించుకోవలెనని లేకపోతే వెళ్లిపడుకుందాము రండి.

దంభ—యివేళ దివ్యమయిన విందు దొరికింది.

చండ—అలాగంటే యేకాదశి నిలహారం చేసిన పుణ్యంకూడా పోతుంది. మిత్రుడా! నీవు స్వస్థంగా యీామంచంమీాద పడుకుని వేగిరం కళ్ళు మూసుకుని నిద్రపో. మేము లోపలికి వెళుతాము.

జాన—వద్దు వద్దు. ఈమంచంమీాద యెవరూపడుకోకూడదు. దీనిది పాతనవ్వారు తెగిపోతుంది. దీనిమీాద పరుపు లేదు. దీనిమీాద యెవరైనా పడుకుంటే కింద పడుతారు.

దృఢ—(తనలో) దీనకి దేవుడు మంచివుపాయం తోపించినాడు.

దంభ—నేను పీనుగుతో జాగరంచేసినట్టు తెల్లవారిందాకా మేలుకోలేను. పడితేపడ్డాను. నేను యీామంచంమీాద నే పడుకుంటాను

(అని పడుకొనుచున్నాడు

మృదు—మనంకూడా వెళ్ళి పడుకుందాము రండి. ప్రాణే శ్వరా! మీకు యింకా నిద్రరావడం లేదా?

దృఢ—ప్రాణేశ్వరీ! నీవు వెళ్లి పడుకో. యేకాదశినాడు యెంతసేపు మేలుకుంటే అంత పుణ్యం వస్తుంది. నేను మధ్యాహ్నం ఆరంభించిన గ్రంథం పూర్తి చేస్తేనే కాని పడుకోవటానికి రాను.

మృదు—మీకు పురాణాలమీదనూ వ్రతాలమీదనూవుండే శ్రద్ధలో సగం సంసారముమీదవుంటే బాగుపడి పోదురు. (అని మృదు భాషిణియు, మనోరంజనియు, వెళ్లుచున్నారు)

చండ—నిద్రవస్తూవున్నది. నేనుకూడా సెలవుపుచ్చుకుంటూను. (అని వెళ్లుచున్నాడు)

దృఢ—(రహస్యముగా జానకీ! ఇతనికి నిద్రపట్టగానే కత్తెర వకటి పట్టుకుని నీవు యిక్కడకు రా. మనం అడుగునుంచి నవ్వారు కత్తిరించి, అతణ్ని కిందివైపునుంచి పయికి తీతాము. ఇతడు పయిని పడుకుని వుండగా పయి వైపునుంచి తియ్యడం సాధ్యం కాదు.

జాన—ఆ సమయంలో వకవేళ యితడికి మెళుకువ వస్తేనో?

దృఢ—అప్పుడు యితణ్నికూడా చంపుదాము. (అని వెళ్ళు చున్నాడు)

దంభ—(తనలో) ఇది కొంచెం అందకత్తెలాగున కనపడుతూ వున్నది. దీనితో కాస్తసేపు మాట్లాడుతాను. (బిగ్గరగా) పిల్లా! నీవు యిక్కడ కొంతసేపు వుండవచ్చును. తొందరగా వెళ్లనక్కరలేదు.

జాన— మీనిద్రకు భంగం కలగచెయ్యడంనాకు యిష్టంలేదు.

దంభ—నా కసలు నిద్రే రావడం లేదు.

జాన—(తనలో) పరమదుర్మార్గుడు. అతడు మాపనికి విఘ్నం చేస్తూవున్నాడు. (బిగ్గరగా) మీరు నిద్రపోవలెను. వేగిరం నిద్రపో

వలెను. వక్క నిముషంలో నిద్రపోవలెను. నిద్రపోక తప్పదు. మిమ్మ లిని యిద్దరు పట్టుకుని కదిపినా కానీ మెళకువరానంత గాఢనిద్ర పోవ లెను. (అని వెళ్లుచున్నది)

దంభ—తెల్లవారగానే నేను యిక్కడనుంచి వెళ్ళిపోతాను. ఇఖ నా దేహంలో ప్రాణంవుండగా యిటువంటియింటికి యెప్పుడూ రాను. ఎక్కడ చూచినా పోట్లాటలే. ఎక్కడచూచినా కేకలే. నాగ్రహ చారంచేత యీరాత్రి వుపవాసంకూడా తటస్థించింది. కునికిపాట్లు వస్తూవున్నవి. వీళ్లసంగతి మరిచిపోయి హాయిగా నిద్ర అయినా పోతాను. (అని నిద్రపోవుచున్నాడు)

[దృఢవ్రతుఁడును, జానకి యు, కత్తెర చేతఁబట్టుకొని తలుపుసందునుండి తొంగిచూచుచు ప్రవేశించుచున్నారు]

దృఢ— అతడు నిద్రపోతూ వున్నాడు.

జాన—రేపు నేనూ పోతాను. (తనలో) బహుశా వురిస్తం భాలకు.

దృఢ—ఇఖమనం ముందుగా మనపని చూచుకోవలెను.

జాన — మనది మంచిపనికాదు గనుక వుత్సాహం లేకుండా వున్నది.

దృఢ—ఇతడు నిద్రపోయినాడు. మన సందేహం పోవడానికి దీపం యితని ముఖందగ్గిరగాపట్టి చూస్తాను. (అని లాంతరు దంభప్రి యుని ముఖమువద్ద పెట్టుచున్నాడు)

దంభ—(ఉలికిపడి లేచినప్పుడు లాంతరు నెత్తికితగిలి దృఢవ్ర తుని చేతిలోనుండి క్రిందపడి దీపమారిపోఁగా) అయ్యో పాపమా! ఇది యేమిటి? నాతలవ్రూడి పోయింది. నానెత్తి చిల్లిపడ్డది. ఈచీకట్లో నా గ్రహచారం కాలింది.

దృఢ — (హీనస్వరముతో) మన ప్రాణంమీదికి వచ్చింది. ఇప్పుడు మనం యేమిచేతాము?

జాన—(హీనస్వరముతో) నావళ్ళు వణకుతూవున్నది. ఇతణ్ని లేపడం తప్పుపని చేసినారు. ఇఖ మన మా చచ్చినవాణ్ని వెలపలకు తీసుకు వెళ్లలేము.

దంభ—ఇక్కడ యేమిటో గుసగుసలాడుతూవున్నట్టు చప్పుడు వినబడుతూవున్నది. ఇంట్లో యేదైనా దెయ్యం వున్నదేమో నాకు భయం వేస్తూవున్నది.

జాన—(తనలో) నాకూ భయంవేస్తూ వున్నది.

దృఢ—(తనలో) నాకూ భయంవేస్తూవున్నది. (జానకితో) ఇఖమనం వెలపలకు వెళ్లిపోవలెను. తలుపుయెక్కడ వున్నది? (అని తడవుచు చీదుచున్నాడు)

దంభ—తప్పకుండా యీగదిలో యేదో పిల్లివున్నది. ఇదేమిటి? నేను పడుకున్న పరుపు కిందికీ మీదికీ యిలా కదులుతూవున్నది! పరుపు కింద యేదోవున్నట్టున్నది. అది నిశ్చయంగా దెయ్యమయి వుంటుంది. లేస్తూవున్నదే. ఓదయ్యమా! అణిగి పడుకో.

జాన—నాకు తలుపు కనపడడంలేదు. యీచీకట్లో యెవరయినా దొంగలు తలుపెత్తుకొని పోయినారేమో!

దృఢ— ఆపరుపుమీదివాడు అరుస్తూవున్నాడు. దారి కనపడదు.

[అప్పుడు సాహసవర్మ పరుపును, పరుపుతో దంభప్రియుడును క్రింద పడునట్టుగా లేపుచున్నాడు]

దంభ—అయ్యో! నన్ను చంపుతూవున్నారు. దొంగలు దొంగలు. దయ్యాలు ఓచండశాసనా వేగిరం రా.

[చేతిలో దీపము పట్టుకొని చండశాసనుఁడు ప్రవేశించుచున్నాఁడు]

దృఢ—దీపం వెలుతురు వచ్చింది శవంలేచింది పట్టుకో. (దృఢవ్రతుఁడును జానకియు తమచేతులతో సాహసవర్మను గట్టిగా పట్టుకొనుచున్నారు.)

చండ—ఈ అల్లరంతా యేమిటి? మీ కేకలతో యీచుట్టుపట్లవాళ్లకందరికీ మెళుకువ వచ్చింది. ఇందులో ముగ్గురు వకరిని వకరు కౌగలించుకున్నారు. నాలుగోవాడు చంపిరి చంపిరని కేకలు వేస్తూవున్నాడు. ఇదంతా యేమిటి?

దృఢ—నేను మరిచిపోయినాను. మిమ్మలని యిద్దరినీ వకరిని వకరికి చూపలేదు. ఓచండశాసనా! ఇతడు సాహసవర్మ ఓసాహసవర్మా! ఇతడు చండశాసనుడు.

చండ—సాహసవర్మను చూస్తే నాకు బహుసంతోషంగా వున్నది. ఇతడు యీలోపలికి యెలాగువచ్చినాడు?

జాన—అయ్యా! మీరు బ్రతికేవున్నారా? ఆశ్చర్యం!

దృఢ—ఇతడు నాకు ముఖ్యస్నేహితుడు.

చండ—ఇతడు జానకికికూడా ముఖ్య స్నేహితుడులాగే కనపడుతూవున్నాడు. ఓదంభప్రియా! నీసంగతి యేమిటి?

దంభ—నా సంగతా? ఒకటేమిటి? అన్నీని. ఈమంచమే యీయింట్లో మనుష్యులను కిందపడవేస్తుంది.

చండ—ఇంకా యెవరో వస్తూవున్నారు.

[సుబలుఁడు ప్రవేశించుచున్నాఁడు]

సుబ—ఎవరో ఒక మనిషి జానకిని చూడవలెనంటూ వున్నాడు. జానకి పేరువున్న బుట్టవకటి అతనికి నదిలో దొరికినదట.

జాన—నాకాబుట్ట అక్కరలేదు. అతణ్ని పంపించివేసివెయ్యి.

నే నాబుట్ట పుచ్చుకోను.

దృఢ—సుబలా! ఆబుట్టనూ బుట్టను తెచ్చిన మనిషినీకూడా వీధిలోకి గెంటివెయ్యి.

చండ—ఆబుట్టలో యేమిపున్నదో తెలుసుకోకుండానే పం పించివెయ్యమంటారేమి?

జాన—అందులో యేమిపున్నదో నాకు తెలుసును.

దృఢ—తెలియదు. నీకు తెలియదు.

జాన— తెలియకపోయినా నాకు బుట్ట అక్కరలేదు. నాకు బుట్టలంటే వొళ్లు గరుపొడుస్తుంది. బుట్టలు చూస్తే నేను జడుసుకుం టాను. నా కక్కరలేదు.

చండ—అందులో యేమయినా విలువగలవస్తువులున్న వేమో.

దృఢ—ఆ చిన్న దే అక్కరలేదంటూవుంటే, ఆ సంగతంతా మన కెందుకు? అది వద్దంటూవుంటే దానికి బలవంతంగా కట్టపెట్టడం మనపని కాదు.

మాధ—(వెలుపలనుండి) సాహసవర్మగారు లోపల వున్నారు. నాకు తెలుసును.

సాహ— అది మా నిర్భాగ్యుడి కంఠస్వరము. ఓరీ! నేను యిక్కడవున్నాను.

[మాధవుడు ప్రవేశించుచున్నాడు.]

జాన—ఓహోహో! విశ్వాసఘాతకుడైన మాధవుడా?

మాధ—(రొజుచు) అయ్యా! మీకు పుత్త్రరం తెచ్చినాను. (అని చేతికిచ్చి) మీరు యిక్కడవున్నసంగతి నాకు తెలుసును. ఎలా తెలుసునో చెప్పకోండి. నేనే కాదూ మిమ్మల్ని—ఆహాహా ఈవుత్త్ర రంలో యేమి వున్నదోకూడా నాకు తెలుసును. ఈవుత్త్రరం తెచ్చిన

మనిషి నాకంతా చెప్పినాడు. మన ముసలాయన కేశవవర్మగారు కాలం చేసినారు.

సాహ—త్రివిక్రమవర్మను నేనే. నా నిజమయినపేరు సాహస వర్మ. నాకు యిప్పుడు కావలసినంత ధనం వచ్చినసంగతి మీకు యీ వుత్తరం వల్ల తెలుస్తుంది. యీవుత్తరం మనోరంజనికి చూపించండి.

దృఢ—ఏమీ! త్రివిక్రమవర్మా? త్రివిక్రమవర్మవు నీవేనా? వకబుట్టలోవచ్చి నాభార్యను కనపడి మాట్లాడింది నీవేనా?

సాహ—అవును. నేనే మాట్లాడినాను.

దృఢ—అలాగయితే యిప్పుడు యెవరూ చావలేదు. జానకీ! మనము యెవరినీ చంపనేలేదు.

[మృదుభాషిణియు, మనోరంజనియు, ప్రవేశించుచున్నారు]

మనో—ఏమి! త్రివిక్రమవర్మా!

సాహ—ప్రియురాలా! మనోరంజనీ! నీ అనుగ్రహం కనిపెట్టి వున్నాను.

చండ—అమ్మాయీ! నేనిదివరదాకా యితడే త్రివిక్రమవర్మ అని యెరుగను. ఇష్టమున్నపక్షమున నీవు యితణ్ని వివాహ మాడ వచ్చును. నా ఆటంక మేమీలేదు.

మాధ—జానకీ! ఈసంతోషసమయంలో మనంకూడా పెళ్లి చేసుకుని మన యజమానులకు సంతోషం కలిగింతాము. (అని చేయి పట్టుకొనుచున్నాడు)

దంభ—ఇదంతా నాటకంలాగు తోస్తూవున్నది. ఇది పరియా చకమా? అంతా నిజమేనా?

చండ—ఈ దాంపత్యం బుట్టకోసమేనా?

దృఢ—బుట్టకథంతా మీకు రేపువుదయాన్న భోజనాలదగ్గిర

చెప్తాను. ఈరోజున యీసాహసవర్మ మాచేతులలో రెండుమాట్లు చంపబడ్డాడు. అన్నీ రేపు మాట్లాడుకుందాము. ఇప్పుడే చాలాప్రొద్దు పోయింది. మనం యివాళ పడ్డ ఆయాస మంతాపోయేటట్టుగా హాయిగా నిద్రపోయి తెల్లవారి లేతాము రండి. మీరు యెవ్వరూ నిద్రలో యీకథ పలవరించకండి.

జాన — నాకు యీరాత్రి బుట్టలూ పానకంగిన్నెలూ కల లోకి రాకుండా వుండునుగాక.

దృఢ—నామిత్రు డైనసాహసవర్మ యీరోజున రెండుసార్లు చచ్చి బ్రతికినసంగతి మీరందరూ తెలుసుకున్నారుగదా? ఇకముందు యితడు రోజూ రెండేసిమాట్లు చావకుండా చిరకాలము సుఖంగా జీవించునుగాక! దంపతు లాయు రారోగ్యైశ్వర్యములు కలవా రయి సుఖింతురుగాక! మన మీరాత్రి సుఖంగా నిద్రపోయి మంచిరోజున పీరిపెళ్ళికి తర్లి వెళుదాము రండి.

(అందఱును నిష్క్రమించుచున్నారు).

# బలాత్కారగానవినోదప్రహసనము

ఇందు వచ్చు పాత్రములు.

---

గానప్రియుఁడు—లీలావతితండ్రి.

సంగీతరావు—గానప్రియుని మేనల్లుఁడు.

సుమతి—సంగీతరావుమిత్రుఁడు.

విస్సప్పపాత్రుఁడు—ఓఢ్రదేశపువడ్రంగి.

గోవిందుఁడు—ఉద్యానవనపాలకుడు.

మాధవుఁడు—గానప్రియుని సేవకుఁడు.

వామనుఁడు—గానప్రియుని సేవకుఁడు.

లీలావతి—గానప్రియునికూఁతురు.

రంగము—రాజమహేంద్రవరములో గానప్రియుని యింటిలోని గది.

[వీణ ముందు పెట్టుకొని పాడుచు లీలావతి ప్రవేశించుచున్నది.]

లీలా—(లేచి) ఈరాగము బహు కష్టమయినది. యిది నాకు యెప్పుడూ రాదు.

[అప్పుడు సంగీతరావు గుమ్మములో నుండి తొంగి చూచుచు ప్రవేశించుచున్నాఁడు]

సంగీ—(మెల్లగా) లీలావతీ! లీలావతీ!

లీలా—(ఉలికిపడి) యెవరు వారు?

సంగీ—(ముందుకు వచ్చి) భయపడబోకు. మరి యెవరూ కారు. నీ మేనత్త కొడుకు సంగీతరావు.

లీలా—(ఎదురుగా వెళ్ళి కౌఁగిలించుకొని) బావా! నిన్ను చూడడంచేత నాకు బహుసంతోషంగా వున్నది. నీవు యిక్కడికి యెలాగు

వచ్చినావు? నిన్ను వాకట్లో యెవరూ అడ్డపెట్టలేదా యేమిటి? నిన్ను లోపలికి రానియ్య వద్దని మానాన్నగారు నౌకర్లతో చెప్పినసంగతి నీకు యిదివరకే తెలుసునుగదా.

సంగీత— నాకూ అదే అశ్చర్యకరంగా వున్నది. వాకట్లో యెవ్వరూ వక్కపెట్ట లేరు.

లీలా— యివాళ నాన్నగారు నవుకర్ల నందరినీ వక విచిత్ర మైనపనిమీద పంపించినారు. నీవు సంగీతం పూర్తిగా నేర్చుకోకుండా తంజావూరు వదిలిపెట్టి అప్పుడే మళ్ళీ వచ్చినా వేమి?

సంగీ— నేను మాగురువుగారివద్ద సెలవు పుచ్చుకొని వచ్చి నాను. వచ్చేటప్పుడు నాతో వకస్నేహితుణ్ని కూడా తీసుకుని వచ్చి నాను. అతను యిప్పుడు సత్రంవద్ద వున్నాడు.

లీలా— (తలయూచి) ఇఖ నీవు సంగీతం వదలిపెట్టివెయ్యి. నన్ను వివాహం కావడానికి నీకు వక్కటే వుపాయం వున్నప్పుడు యీలాగు నీవు కాలం యెందుకు వ్యర్థంగా పోగొడుతావు ?

సంగీ— అవు నవును. ఆ వుపాయం నాకు తెలుసును. నేను సంగీత పాటకుణ్ని కావడ మని నీయభిప్రాయం. ఆవిషయంలో నీవు యెంత మాత్రమున్ను సంకోచపడవలసినపని లేదు. నేను యిదివరకే సంగీ తంలో గట్టిగా కృషిచేసి యిఖ వేరే సాధకం అక్కరలేకుండానే మిమ్మ లిని మెప్పించి నీచెట్టపట్టగలనన్న ధైర్యంతోనే యిప్పుడువచ్చినాను. నా సామర్థ్యాన్నిగురించి నేనుయేమిచెప్పను. మీనాన్నగారు వచ్చి యిప్పుడు వక్కనిముషం నాపాట వింటే—(నమ్రత నటించుచు) నావిషయం నేను విశేషంగా చెప్పుకుంటే ఆత్మస్తుతిగా వుంటుంది—నేను కొంచెం పాడ గలను. మామగారు యెలాగు వున్నారు? ఆయన మునుపటివలెనే సంగీతమంటే చెవి కోసుకుంటూ వున్నారా? యిప్పు డావు దేకంయేమ

యినా తగ్గిందా లేదా?

లీలా — ఇప్పుడాయనకు సంగీతపు పిచ్చ మునపటి కంటెనూ యాభయిరెట్లు యెక్కువ ముదిరి పోయింది. ఆయనస్థితి చూస్తే ఆయ నకు నిజంగానే మతిభ్రమయెత్తిందేమోనని నాకు తోస్తూవుంటుంది.

సంగీ—పాపం! ఆయనకు యిఖసంగీతంతో మతిపోతుంది.

లీలా—ఈమధ్య మైసూరినుంచి వచ్చిన ఆగొప్పసంగీతపాట కుడి సంగతి వృత్తాంతపత్రికలలో చదివినప్పటినుంచీ బొత్తిగానే మతి పోయింది. ఆసంగీతపాటకుడి పేరు యెవరూ? యేదో మంచిపేరు. జ్ఞాపకం చేసుకుంటూను వుండు. ఆయన పేరు—మొదటి అక్షరం వి— విశ్వనాథశాస్తుర్లు కాబోలును.

సంగీ—(నవ్వుచు) విశ్వపతిశాస్త్రిగారా?

లీలా—అవునవును. అదుగో ఆయననే. ఇప్పుడు మా నాన్న గారు యేమిమాటాడినా ఆయనసంగీతాన్ని గురించితప్ప మరి యేమీ మాట్లాడరు. రాత్రిళ్ళు నిద్రలో కూడా ఆయనసంగీతాన్ని గురించే పలవరిస్తూ వుంటారు. మొట్టమొదటినాటి రాత్రి ఆయనను పిలిపించి సంగీతం పాడిస్తూవున్నట్టు కలగని నిద్రలో బిగ్గరగా రాగాలు తియ్య డాని కారంభించేటప్పటికి నాకు భయంవేసి యేదో జబ్బువచ్చిందని వైద్యుడికోసం కబురులు పంపించడానికి ప్రయత్నం చేసినాను.

సంగీ—(నవ్వుచు) ఆవచ్చింది మరి యేజబ్బూకాదు. కేవలం సంగీతపు జబ్బు.

లీలా—చూడు. "మోసపోవద్దురా" అనే సారంగపాణి పదం నేర్చుకొమ్మని నాన్నగారు నన్ను రాత్రి, పగలూ వూరికే ప్రాణాల తీస్తూవున్నారు. అది మంచిది కాదంటే వినరు.

సంగీ—దానిమట్టు యిక్కడ యెవరికయినా వచ్చునా?

లీలా— యెవరికీ రాదు. ఆ పదం విశ్వనాథశాస్త్రి—కాదు, కాదు—విశ్వపతి శాస్త్రిగారు శనివారపుపేట జమీందారుగారివద్ద పాడినారట. ఆపాట పట్టుకుని నాన్నగారు నన్ను పాడమంటారు. ఆ పదాన్ని కేవలమూ ఆశాస్త్రిగారి ముఖతానే వినవలెనని యెంత ఖర్చయినా యిస్తాను వక్కసారి దర్శనం యిచ్చి పొమ్మని ప్రార్థనపూర్వకంగా ఆయనకు వుత్తరం వ్రాసినారు.

సంగీ—(నవ్వుచు) సర్వసాధారణంగా ప్రతివాళ్ళూపాడే ఆ సారంగపాణిపదం పాడడానికి యెంతోసొమ్ము ఖర్చుపెట్టి విశ్వపతి శాస్త్రిగారిని యిక్కడకు పిలిపిస్తారా? అట్లా యెప్పుడూ జరగదు.

లీలా—తప్పకుండా జరుగుతుంది. ఈమధ్య నాలుగు రోజులు జ్వరం వచ్చి వెళ్ళలేక పోయినారుగాని లేకపోతే నాన్నగారు స్వయంగానే మేలూరువెళ్ళి శాస్త్రిగారిని వెంటబెట్టుకుని రావలె నను కున్నారు.

సంగీ—ఆ పిచ్చవుత్తరానికి యేమిజవాబు వచ్చింది?

లీలా—యేమీ జవాబేరాలేదు. అందుమీద నాన్నగారికి మహాకోపం వచ్చింది.

సంగీ—అలాగయితే ఆయనకోపం నేను శాంతపరుస్తానులే.

లీలా—నీవా? అది యెంతమాత్రమూ సాధ్యంకాదు.

సంగీ — నీవు కొంచెం వోపికచేసి కనిపెట్టివుండు. నేనాయనకు ఆశ్చర్యం కలుగజేసి ఆసంగీతప్రాటకుడు రానిలోపము కనపడకుండా చేస్తానోలేదో నీవే చూస్తావు. వకవేళ నామాటలు మీ తండ్రిగారి చెవులలో చొరకపోయినా నాసంగీతంమాత్రం ఆయనచెవులలోదూరి మనసు కరిగించకుండా మానదు.

గాన—(వెలుపలనుండి) లీలావతీ! లీలావతీ! (అని హెచ్చుస్వర

ముతో పిలుచుచున్నాఁడు)

లీలా—— పిలవడంలో కూడా ఆరాగం తియ్యడం వింటూవు న్నావా? అతడు రాత్రి పగలూ యిదేమోస్తరు. ఆయన యిక్కడకు వస్తూవున్నాడు. నీ వాయనకంట పడకూడదు.

సంగీ——అవును. నేను యీవాడ్లో తోటలోకి వెళ్ళి నీకోసం కనిపెట్టుకొని వుంటాను. (అని సంగీతరావు వెళ్లగా లీలావతి వీణ చేత బట్టుకొనుచున్నది)

[అంతట గానప్రియుడు ప్రవేశించుచున్నాఁడు]

గాన——అమ్మాయీ! లీలావతీ! నీవు వొక్కత్తెవూ వున్నావా?

లీలా—— (వీణ క్రింద పెట్టి) వొక్కత్తెనే వున్నాను.

గాన——యింకా యెవరూ రానేలేదా?

లీలా——రాలేదు.

గాన——(తలుపు వద్దకుపోయి ఆలకించి) వూరుకో.

లీలా——అదేమిటి?

గాన—— (చెవియొగ్గి యాలకించుచు) మాటాడకు వూరుకో.

లీలా——నేను మాట్లాడడం లేదు.

గాన——(ఆలకించి సంతోషముతో) అరుగో వాళ్లు వస్తూవున్న ట్టున్నారు.

లీలా——యెవళ్ళు?

గాన——మన నవుకర్లు. వాళ్లను అతనికి యెదురుగుండా పం పించినాను.

లీలా—— యెవరికి యెదురుగుండా? వుత్తరాలు తెచ్చే బంట్రో తుకా?

గాన—— ( తిరస్కారభావముతో ) బంట్రోతుకా? కాదు.

ఈదినం ఆమహానుభావుడి దర్శనముచేసి, ఆయన సేవచేసి, కర్ణోత్సవంగా ఆయనపాట విని, పరమానందంపొంది కృతార్థుణ్ని అవుతాను.

లీలా—యేమిటి! మీవృత్తాంతంలో ప్రార్థించిన ప్రకారంగా మీరు యింకా ఆయన వస్తాడనే ఆశతోనే వున్నారా?

గాన—(బొమ్మ తట్టుకొనుచు) మెల్లగా ఆశ అంటావేమి? యేదయినా ఆలోచన యీ హృదయంలో ప్రవేశించిన తరువాత నేనది నెరవేరకుండా వదలిపెట్టను.(బిగ్గరగా) అతడు రావలెను. ఈరోజున నిశ్చయంగా మనయింటికి వచ్చి తీరవలెను.

లీలా—ఆలాగా?

గాన—మరి యెలాగనుకొన్నావు? యివేళ నేను వకవుపాయం పన్నినాను. రేపుసాయంకాలం పిఠాపురం రాజుగారి యింట్లో పాట పాడడానికి విశ్వపతి శాస్త్రులుగారు నిన్నటిదినం యేలూరు పడవయెక్కి ధవళేశ్వరంమీదుగా యీరోజున పిఠాపురంవెళ్ళుతా రని నిన్నసాయం కాలం వృత్తాంతపత్రికలో చదివినాను. చదివి యేమిచేసినాననుకొన్నావు? నానేర్పుచూడు. వక్కమాటు తప్పకుండా దర్శనమిచ్చి ఘంట సేపయినా మాగృహం పావనంచేసి వక్కపాటపాడి మళ్ళీ వెళ్ళవల సినదని వుత్తరంవ్రాసి మనవుకర్ల చేతికిచ్చి తెల్లవారుజామునే బండినీ మనుష్యులనూ ధవళేశ్వరం పంపించినాను.

లీలా—ఆయన యీదినం మనయింటికి వస్తా రని తోచదు.

గాన—(బిగ్గరగా) తప్పకుండా వస్తారు. రాకతప్పదు. ఆయన మంచిమాటలతో రాకపోతే బలవంతంగానైనా పట్టుకుని తీసుకుని రావలసిందని నవుకర్లకు గట్టివుత్తరువు చేసినాను.

లీలా—బలవంతంగానా? బలవంతంగా లాక్కువస్తే తరువాత జరగబోయేసంగతి ఆలోచించుకోండి.

గాన—నేను ఆలోచించుకోను. నేను యేదయినా వక కార్యం చెయ్యవలెనని వుద్దేశించుకుంటే అది చెయ్యడమే కాని తరువాత దాని వల్ల యేమిజరుగుతుందో యెప్పుడూ ఆలోచించుకోను. అవతలవెయ్యి వచ్చినా పోయినా నేను తలపెట్టినకార్యం ముందుగా జరిగి తీరవలెను. నామాటకు తిరుగులేదు. యీపాషుజ్వరంమూలంగా గాని లేకపోతే యీప్రదయాన్న ధవిళేశ్వరం నేను స్వయంగానే వెళ్ళివుందును. ఆయ సను చూచినదాకా నాకు యేమీ తోచకుండా వున్నది. (ఆలకించి) ఈమాటు పొరబాటులేదు. (సంతోషముతో) బండిచప్పుడు వినపడుతూ వున్నది. ఆయన వస్తూవున్నాడు. వస్తూవున్నాడు.

[అప్పుడు తొందరగా గోవిందుడు ప్రవేశించుచున్నాడు]

గాన—గోవిందా! గోవిందా! యేమి? మీ రాయనను తీసుకుని వచ్చినారా?

గోవిం—తీసుకుని వచ్చినాము. అతడైతే తప్పించుకుని పారి పోవడానికి చాలాప్రయత్నం చేసినాడుకాని మేము పోనియ్యకుండా ముగ్గురమూ మీదపడి కాళ్ళూ చేతులూకట్టి బండిలో పడవేసినాము.

గాన— మంచిపని చేసినారు. మీ కాయన యెక్కడ దొరికి నాడు? పడవలు దిగేచోటనా? సత్రువువద్దనా?

గోవిం—ఆరెండు చోట్లనూ కాదు. కాలవ వడ్డున కిల్లుదుకా ణంకాడ పట్టుకున్నాము. అత డక్కడ నిలుచుండి పిఠాపురం వెళ్లడా నికి చామర్లకోట పడవమీద కేవు యెంత పుచ్చుకుంటారని అడుగుతూ వున్నాడు. (నవ్వుచు) అతడు నిజంగా యేదో తక్కువ కులంవాడు గా కనపడుతూ వున్నాడు గాని వేషంవల్ల గొప్పవాడు గా యెంత మాత్రమూ కనపడడంలేదు. ఆయనవద్ద బట్టలమూటా గొడుగూ తప్ప మరియేమీ వస్తువులు లేవు.

గాన—సరి సరి నాకు తెలిసింది. అతడు పెద్దవేషంతో వెళితే దోవపొడుగునా పాడడానికి యెవరయినా పట్టుకుని పోతారని మారువేషం వేసినాడు. ఆయనను మీరు యెలాగు ఆనవాలుపట్టినారు?

గోవిం—నేను తిన్నగా దగ్గరకువెళ్లి చెయ్యిపట్టుకొని మీపేరు "విస్సప్పశాస్తుర్లు" కాదా అని అడిగినాను. అడిగేటప్పటికి అతడు తెల్లపోయి నాకేసి గుడ్లగూబలాగు తేరిపార చూచి "నాపేరు నీకు యెట్లా తెలిసింది?" అని ఆశ్చర్యపడి నిలుచున్నాడు. "అదంతా మీకెందుకు? మీరు వక్కపాట పాడుతారా? మీకు సంగీతం బాగా వచ్చునని విన్నాను" అని నేను బదులు చెప్పినాను. "నన్ను కదలకుండా వుత్తరాది పిశాచంలాగు పట్టుకున్నావు నాచెయ్యి వదులు. నేను కొంచెం పదాలు పాడగలనుగాని నేను యిప్పుడేభోంచేసి పిఠాపురం వెళ్ళవలెను. తిండిలేకుండా పాటలు పాడుతూ కూర్చోవడానికి నాకు తీరదు" అని చెయ్యి వదుల్చుకొని పోబోయినాడు.

గాన—(నవ్వుచు) నీవు మహాబాగాకనుక్కున్నావు. బుద్ధంటే యిలాగు వుండవలెను.

గోవిం—నాకు నిజం తెలిసిపోయింది. మీరు చెప్పినసంగీత పాటకుడు యితడేనని నాకు తెలియడంతోటే, ఆయనకు మీనమస్కారాలుచెప్పి తిన్నగావచ్చి బండిలో కూర్చోమని మంచిమాటలతో చెప్పినాను. ఆయన నామాటలు లక్ష్యంచెయ్యక బండిలోకి రాకుండా తప్పించుకుని పోవడానికి చూడడమే కాకుండా కేకలువేసి నలుగురినీ పోగుచేసి తగవుపెట్టడానికికూడా ప్రయత్నంచేసినాడు. అయితే నేనా సంగతి కనిపెట్టి మీబండివాడికిన్నీ బంటోతుకున్ను సంజ్ఞ చేసేటప్పటికి, వామనుడున్ను మాధవుడున్ను పిడుగుల్లాగు మీదపడి అతని నోటి వెంబణ్ని మాటవచ్చేలోగా కాళ్లూచేతులూ విరిచికట్టి అతణ్ని

బండిలో పడవేసి మళ్ళీ అక్కడ నిలవకుండా బండి వక్కపరుగున తోలుకుని వచ్చినారు.

గాన— బహుబాగా చేసినారు. సర్వకార్యంకు మీవంటివాళ్లు వుండవలెను.

[అవతలనుండి పిలుపులు వినబడుచున్నవి]

గోవిం— అరుగో మనవాళ్లతణ్ని లాక్కువచ్చినారు.

విస్సప్పపాత్రుడు—(వెలుపలనుండి) ఓపశువుల్లారా! నన్ను వదిలిపెట్టండి. వదిలి పెట్టండి.

లీలా— (తనలో) నేను పరుగెత్తుకుని వెళ్లి బావతో చెప్పి వస్తాను. (అని వెళ్ళుచున్నది)

[మాధవుడును వామనుడును ముందుకు తోయుగా వారితో పెనగు

లాడుచు, చంకను మూటయు చేతిలో గొడుగును పట్టుకుని విస్సప్ప

పాత్రుడు ప్రవేశించుచున్నాడు]

విస్స—(భయముతో నడకుచు) నన్ను వెళ్లనియ్యండి నన్ను వెళ్ళనియ్యండి. నేను యేమీ చెయ్యను.

గాన—ఆయన వస్తాడు. మీరు వదలిపెట్టండి.

విస్స—(ముందుకు నడచుచు) నేను నిస్సందేహముగా దొంగల చేతులో పడ్డాను. ఈప్రాంతములలో మహాపెద్దదొంగలు వున్నారని నేను విన్నసంగతి ప్రత్యక్షంగా నాకే అనుభవం అయింది. వీళ్లు నావస్తువులు దోచుకుని నన్ను యిక్కడ చంపివేస్తారు.

గాన—(సేవకులతో) ఈయన తప్పించుకొని పారిపోకుండా యీ తలుపులూ కిటికీలూ అన్నీ వేసి రండి. (అని సేవకుల యొద్దకు వెళ్ళుచున్నాడు)

విస్స—అయ్యో! నేను సాలిగూట్లోపడ్డ యీగలాగైనాను.

ఇఖ వీళ్లతో పోట్లాడితే కార్యం లేదు. ఈకూౄరుడు దొంగలగురువు కాబోలును. ఈముసలివాడిమొఖం చూస్తేనే నాకు భయంవేసి ప్రాణాలు పోతూవున్నవి.

గాన— ఓరి! యిఖ మీరు వెళ్ళిపొండి. (సేవకులు పోవుచున్నారు)

విస్స— (తనలో) నన్ను చంపిన తరువాత పాతిపెట్టడానికి దొడ్లో యెక్కడనో గొయ్యి తవ్వడానికి వాళ్లను పంపివేసినాడు. సందేహం లేదు. నేను యెన్నాళ్ళో కష్టపడిసంపాదించుకొని మొలనువుంటే పోతుందని చంకమూటలో పెట్టుకొన్న యాభయి రూపాయల వెండి మొలతాడూ నేడు పోతుంది.

గాన—(వినయముతో దగ్గరకు వచ్చి) స్వామీ! స్వాగతము. విశ్వపతిశాస్త్రిగారికి స్వాగతము.

విస్స—దూరంగా వెళ్లండి. మీసంస్కృతం నాకు తెలియదు. నన్ను ముట్టుకోకండి. (తనలో) ఈకిరాతుడు నవ్వుతూవున్నాడు. వీడి విషపునవ్వు చూడడంతోటే నావళ్ళు గరుపొడిచి మనస్సు నీరవుతూవున్నది.

గాన—(పాదము మొదలుకొని శిరస్సు వఱకును జూచి చిఱునవ్వు నవ్వుచు) ఏదీ? "మోసపోవద్దురా" (అని పాడుచున్నాడు).

విస్స—(ఉలికిపడి) నాజోలికి రాకు. (తనలో) ఈ కిరాతుడు పిట్ట తనవలలో పడ్డదని సంతోషంగా పాడుతూ వున్నాడు. (వికారముగా) హోదైవమా! ఏమి చేతును?

గాన—(దగ్గరకు జరుగుచు) ఒక్కసారి —

విస్స —వద్దువద్దు (అని వెనుకకు తొలగుచున్నాడు)

గాన—ఈలా తప్పించుకుంటే తప్పదు.(అని గొడుగు చేతిలో

నుండీ లాగుకొని బల్లమీద పెట్టుచున్నాఁడు)

విస్స— (తనలో) ఇతడు తనపని ఆరంభించినాఁడు.

గాన—(చిఱునవ్వునవ్వుచు వినయముతో) మాయింటికి మిమ్మ లిని రప్పించిన మార్గంచూస్తే మీకు సందేహం లేకుండా అద్భుతం గానే వుండివుంటుంది.

విస్స—(తనలో) యిల్లనడంకంటె దీన్ని మనుష్యుల బోనంటే బాగా వుంటుంది.

గాన—ఇందులో తప్పితమంతా మీదేకాని నాదికాదు. మీరు నా వుత్తరానికి జవాబు వ్రాసినారుకారు.

విస్స—యేమి వుత్త్రరమో నేను యెరుగను. నాకు వుత్త్రరమే రాలేదు.

గాన—(నవ్వుచు) నేను యెరుగుదును. సాధారణంగా వుత్త రాలకు జవాబు వ్రాయనివారు చెప్పేసబబు యిదే.

విస్స—ఓ దొంగలపెద్దా! నీతో నేను ప్రమాణపూర్వకంగా చెపుతాను. నాకు వుత్త్రరం యేమీ రాలేదు.

గాన—దొంగలపెద్దా? చివరకు నావే దొంగమాటలకింద కట్టి వేసినారా? ఈపరాచికాలు మానివేసి యిఖ మనం పెద్దమనిషి తర హాగా మాట్లాడుదాము.

విస్స—యింతకంటె పెద్దమనిషి తరహాగా మాట్లాడడం నా చేతకాదు.

గాన—మీరు యీదారిని వెళుతూవున్నా రన్నసంగతి నాకు తెలియడం తోటే—

విస్స— (ముఖము తుడుచుకొనుచు) మీ మాటలు వింటే నాకు వళ్లు చెమటపడుతూ వున్నది.

గాన—(నవ్వుచు) బాగావున్నది. కానియ్యండి. కానియ్యండి. మీకు సుతి కావలెనా?

విస్స—నాకు సుతి అక్కరలేదు. నేను బాడితతో పనిచేసుకుంటాను.

గాన—(తనలో) బాడితలంటే నీణె అయివుంటుందా? మరి యేదయినా దక్షిణదేశపు తంబూరా అయివుంటుందా? (బిగ్గరగా) దేనితోనో ఏకదానితో రానియ్యండి. పయికి రానియ్యండి. శంకరాభరణం.

విస్స—(అద్భుతపడి తనలో) ఇతడు నాదగ్గర నగవున్న సంగతి కూడా కనిపెట్టినాడు. ఆభరణ మంటూవున్నాడు. ఇతని అభిప్రాయం నా వెండిబిళ్ళలమొలతాడని కాబోలును. (బిగ్గరగా) నావద్ద ఆభరణం లేదు.

గాన—శంకరాభరణము. రాగము.

విస్స—(భయముతో తనలో) ఇతను యెక్కడివాడో అసాధ్యుడులాగున్నాడు. ఆభరణం చంకలో వున్నసంగతికూడా గ్రహించినాడు! ఆభరణం యివ్వకపోతే నన్ను రాగాలు పట్టేటట్టు చేస్తానంటూవున్నాడు.

గాన—రాగ మారంభించకుండా యేమిటో ఆలోచిస్తూ వున్నారేమిటి? శంకరాభరణము.

విస్స—(భయముచేత వడకుచు) ఇతడు మళ్ళీతనపని కారంభిస్తూవున్నట్టున్నాడు. అయినా కాసే యితనిముఖంచూస్తే మంచివాడులాగు కనపడుతూవున్నాడు. ఇతనితో కొంచెం మంచి మాటలాడి చూస్తాను.

గాన— (చంకను తగిలించియున్న మూటమీద చేయివేసి)

మీకిది భారంగా వున్నది. నేను తీసి దాస్తాను.

విస్స—(మూటను గట్టిగా పట్టుకొని) అక్కరలేదు. నాదగ్గరనే వుంచుకుంటాను.

గాన—అలాకాదు. ఇలా నాచేతి కివ్వవలెను. (అని బలవంతముగా మూటలాగుకొని బల్లమీద పెట్టుచున్నాడు).

విస్స—(తనలో) సందేహంలేదు. ఇఖ నా బొడ్డుకొంగు రూపాయలుకూడా శీఘ్రింగానే వెళుతవి.

గాన — ఆరంభించండి. (విస్సప్పపాత్రుని బలవంతముగా తీసికొనిపోయి కుర్చీమీద కూర్చుండబెట్టి) ఎలాగైతేనేమి మీరు యిక్కడికి వచ్చినందుకు నాకు బహు సంతోషంగా వున్నది. మీకు నారదుడూ తుంబురుడూ గంధర్వులూ అప్సరసలూ యెవరూ చాలరు.

విస్స—(వడకుచు తనలో) ఓస్సి! వీళ్లందరూ యెవరు? వీళ్లంతా యీసరదారుకిందవున్న దొంగలు కాబోలును. యింతమందక్కరలేదు. నాప్రాణానికి యిందులో వక్కడు చాలును. అయినా యితణ్ని మంచిమాటలతో బతిమాలుకుని చూస్తాను. (బిగ్గరగా) అయ్యా! మీకాళ్ళకు మొక్కుతాను. నన్ను విడిచి పెట్టండి.

గాన— (నవ్వుచు) మీరు దొంగవేషం వేసి నావద్దనుంచి తప్పించుకుని పారిపోవడానికి చూస్తూవున్నారు. మీవేషాలు నా దగ్గర సాగవు. నేను దొంగలకు గురువును. నాపని యెలాగు చెయ్యవలెనో నాకు బాగా తెలుసును.

విస్స—(తనలో) నీపనిలో నీవుగట్టివాడ వని నాకు తెలుసును.

గాన—(నవ్వుచు) మాసినబట్టలు కట్టుకుని యీ బికారివేషం వేస్తే నేను మిమ్మలిని కనుక్కోలేకపోతా ననుకున్నారా?

విస్స—అనుకోలేదు. మీది అఖండశక్తి. ప్రయాణం మూలం

గా బట్టలు మాసినవి. (తనలో) వున్నదేమో పుచ్చుకునేవాడికి నా వేషం సంగతి యెందుకు? ఇంకా నావద్ద యేమివున్నవో కనుక్కోవడానికి మాట్లాడుతూ వున్నట్టున్నాడు.

గాన— యిఖ మన మీా వృథాకాలక్షేపం మానివేసి మనపని చూచుకుందాము. నేను మిమ్మల్ని యిక్కడకు యెందుకు రప్పించినానో మీాకు తెలియనే తెలుసును.

విస్న —నేను మనస్సులో వూహచేసుకున్నాను.

గాన—అలాగయితే వెంటనే మొదలు పెట్టండి.

విస్న— యేమి మొదలుపెట్టను?

గాన—రూపక తాళము. దరువు.

విస్న— (తనలో) అయ్యో! యితడు నా రూపాయల సంగతి కూడా కనిపెట్టినాడు. ఇతనిమాటలు కొంచెం యాసగా వున్నవి. రూపాయ అనడానికి రూపకమంటూ వున్నాడు. రూపాయలు యివ్వకపోతే నన్ను వక తాళం వేస్తాడట. వకదరువు వేయిస్తాడట. ఇతనివన్నీ సఖం సఖం మాటలు.

గాన—ఇక జాప్యం చెయ్యకూడదు. నేనుచెప్పినపని తక్షణం చెయ్యావలెను.

విస్న—నేను చెయ్యను.

గాన—నాకు కోపం తెప్పించకండి. మీారు నేను చెప్పినట్టు వెంటనే చెయ్యకపోతే నేను జ్వరంచేత బలహీనుణ్ని గావున్నా వక్కసారి లోపలికి వెళ్ళివచ్చినానంటే మీాచేత నేను బలవంతంగా చేయించగలను.

విస్న —(తనలో) ఇందాకటి దుర్మార్గుల నందరినీ పిలుచుకుని వస్తాడుకాబోలును.

గాన—ఈ యింటి తలుపులూ కిటికీలూ అన్నీ వేసివున్నవి. మీకు తప్పించుకు పోవడానికి శక్యంకాదు.

విస్స—(దీనత్వముతో) ఓనాయకుడా!

గాన—(కోపముతో) నన్ను నాయకుడా గీయకుడా అని పిలు నవద్దు. మీకు ఆలోచించుకోవడానికి రెండు నిముషాలు అవకాశం యిచ్చినాను. యీ రెండు నిముషాలలోనూ బాగా ఆలోచించుకుని నేను చెప్పినట్టు చేసేది చెయ్యనిదీ యేదోవకటి చెప్పండి.

[సంగీతరావు ప్రవేశించి వెనుకనుండి వినుచున్నాఁడు]

విస్స—నాప్రాణాలమీాదికి వచ్చింది. ఓ నాయకుడా! యిటు వంటి విషయంలో ఆలోచించుకోవడానికి నాకు రెండు నిముషాలా?

గాన—ఇఖ నాయకుడూ గీయకుడూ వదలి పెట్టండి. మీకు యిప్పుడే తెలియచెప్తుతూవున్నాను. నేనుచెప్పినట్టుచేస్తేనేకాని మీారు యీస్థలాన్నుంచి ప్రాణాలతో వెళ్లరు. (అని కోపముతో వెళ్ళు చున్నాఁడు)

విస్స—ఇతను యింతదుర్మార్గానికి వడికట్టినతరువాత యీరూ పాయలమూటకూడా యివ్వక తప్పదు. (అని బొడ్డుకొంగుమూట తడ వుచున్నాఁడు)

సంగీ— (ముందుకువచ్చి వీపు తట్టి) నీవు ఆయన చెప్పినట్టు చెయ్యకూడదు.

విస్స—(భయముతో వెనుకకు తొలగి అయ్యో! మరివకకొత్త వాడు వచ్చినాడు.

సంగీ— (తనలో) నాపాటవినకుండా నామామగారు ముందు గా యితనిపాట వింటే అంతా చెడిపోతుంది. (బిగ్గరగా) అయ్యా! మీారు యిక్కడకు వచ్చినసంగతి నేను యిప్పుడే విన్నాను. నేను ప్రవే

శించిన పనిలో మరియెవరూ ప్రవేశించకూడదు.

విస్స—(అద్భుతపడి అర్థము తెలియక) ఆలాగా? (తనలో) యితడు మరివకదొంగల గుంపుకు నాయకుడుకాబోలును. వీరిద్దరికిన్ని పడనట్టువున్నది. వీరిద్దరిమధ్యనూ నేను చావవలసి వచ్చింది.

సంగీ—నామాటలకర్థం మీరు బాగా తెలుసుకోండి. మీరు తొందరపడి ఆయన చెప్పినట్లు చేశారంటే మిమ్మల్ని చంపుతాను.

విస్స—నన్ను చంపడం? వద్దు వద్దు. మీకే యిస్తాను.

సంగీ—(ఆశ్చర్యముతో) యేమి యిస్తారు?

విస్స—యిరవయి రూపాయలూను.

సంగీ—(తనలో) ఇప్పుడు నాకు తెలిసినది. తాను ముందుగా పాడితే నాకు వచ్చేసొమ్ము పోతుం దంటానన్నుకొని యీరాత్రి తనకు దొరికే యిరవయి రూపాయలూ నాకు యిచ్చివేస్తానంటూవున్నాడు. ఇఖ మాటల కవకాశంలేదు. (బిగ్గరగా)నాకు రూపాయలతో పనిలేదు. అవి మీకాయిష్టంవచ్చినవారికి యిచ్చుకోండి. జాగ్రత్త యిప్పుడే తెలియ చెప్తుతూ వున్నాను. నేను యిప్పుడు చెప్పినట్టు మీరు చెయ్యకపోతే నేను చెప్పినంతపనీ చేసి తీరుతాను సుమండీ. (అని దొడ్డిగుమ్మమున తోటలోకి వెళ్లుచున్నాడు)

విస్స—(మతిచెడి) నాకు మతిలేదు. ఇదంతా యేమిటో నాకు తెలియకుండా లేదు. మొట్టమొదట నన్ను కాళ్లూ చేతులూ కట్టి బండిలో వేసి యీవూరుకునివచ్చినారు. అవతల ఆ ముసలివాడు వచ్చి యేమేమో అని పోయినాడు. యిప్పుడీ పడుచువాడు నన్ను చంపుతానని బెదరిస్తూ వున్నాడు. ఇప్పుడు వాళ్లకయినా పిచ్చియెత్తి వుండవలెను. నాకయినా పిచ్చియెత్తివుండవలెను. అదుగో మళ్ళీ ఆముసలిముండాకొడుకు వుస్తూవున్నాడు.

[చేతిలో పెద్ద పట్టాకత్తిని పట్టుకొని గానపిప్రయ్యుడు ప్రవేశించుచున్నాడు]

గాన—(తనలో) ఈ కత్తి చూడడంతోటే యితనికి బుద్ధి వస్తుందనుకుంటాను. (బిగ్గరగా) నేను చెప్పిన రెండు నిముషాలూ అయిపోయినవి.

విస్స—(కత్తి చూచి తుళ్ళిపడి) ఓయి దేవుడా! యితడు కత్తి కూడా తీసుకుని వచ్చినాడు.

గాన—మీరు ఆలోచించుకున్నారా? సిద్ధంగా వున్నారా?

విస్స—(తడబడుచు) ఆ. ఆ. ఆలోచించు కున్నాను. సిద్ధంగా వున్నాను. ఆకత్తి దూరంగా పెట్టి మాట్లాడండి.

గాన—అలాగే (అని కత్తి క్రింద పెట్టి) మీకు తుదకు యింత సేపటికి వివేకం వచ్చినందుకు సంతోషంగా వున్నది. (నవ్వు మొగముతో) ఇప్పుడంతా సిద్ధంగా వున్నది. మావాళ్లందరూ కనిపెట్టుకుని వున్నారు.

విస్స— (భయముతో) నాకోసమా! యెందుకు? పాతిపెట్టి పయిని మన్ను వెయ్యడానికా?

గాన—మీమాట లేమిటో నాకు తెలియడం లేదు. మీకు బట్టలు సిద్ధంగా వున్నవి.

విస్స—(తనలో) వీళ్ళునాకు బట్టలూ పువ్వులూ అలంకరించి యేదో దేవతకు బలి పెడుతారు కాబోలును. (బిగ్గరగా)యేమిబట్టలు?

గాన—మీరు ధరించుకోవడానికి తెల్లబట్టలు. మీరు వస్త్రాలు ధరించుకొనివచ్చి యేదీ వక్కసారి సురట.

విస్స—(తనలో) సురంటే కల్లు. నాకు కల్లుకూడా పోస్తారు కాబోలును. నాకు యిష్టంలేదు. (బిగ్గరగా) అది వద్దు.

గాన—అదికాకపోతేమరివకటీయెను."నారాయణగౌళ"—

విస్స—(తనలో) ““నారాయణా” అని హరినామస్మరణ చేసు కోమంటూ వున్నారు. ఇక వీళ్ళు నన్ను చంపివేస్తారు. నిశ్చయం.

గాన— ““ఏకతాళము” ““ఆఠాణా” లేకపోతే ““జంపె”; ““హుసేని”.

విస్స—(తనలో) ఓడి వీడిభాష కాలా! సగం సగం మాటలు చెప్పి నన్ను చంపుతూవున్నాడు! అయినా కానీ నాకు యితని మాటలు అర్థమవుతూవున్నవి. అవతల యెవరినో కూర్చుండబెట్టి నాకు తెలియదని హిందూస్థానీమాట లంటూవున్నాడు. ఆఠణాఅంటే యెనిమిదణాలు. ఏకతాళం అంటే వక్కతాళం వెయ్యడం. మొట్టమొదటిదానికి నన్ను వక్కదెబ్బకొడితే యెనిమిదణాలు యిస్తానని తాత్పర్యం. హుసేనా? ఇదియెవరో సాహేబుపేరు. జంపె తెలుస్తూనే వున్నది. సాహేబును పిలిచి నన్ను చంపుమంటూవున్నాడు. (బిగ్గరగా) ఓమహారాజా! నన్ను చంపకు. నీవు చెప్పినట్టు చేస్తాను.

గాన—నీవు మహాచెడ్డవాడవు—ఓ గోవిందా!

[గోవిందుఁడు ప్రవేశించుచున్నాఁడు]

గోవిం—అయ్యా! ఏమి సెలవు?

గాన—ఈయనకు యిప్పటికి జ్ఞానం వచ్చింది. ఈయన అలసి వచ్చినాడు. ఈయనను లోపలికి తీసికొనిపోయి మంచి బట్టలు కట్టబెట్టి ఫలహారం పెట్టించు.

విస్స—నాకు మూర్ఛ వచ్చేటట్టు వున్నది.

గాన— అన్నీపోతవి. రెండు పూరీలు తిని మిరియాలచారు తాగండి.

విస్స — మిరియాలచా రక్కరలేదు. నాకు దాహం వేస్తూవున్నది. గేదెమజ్జిగ కావలెను.

గాన—వద్దు వద్దు. మజ్జిగ తాగితే గొంతుక పోతుంది. అది కావలిస్తే తరువాత—

విస్స—ఏ మయిన తరువాత?

గాన—ఒక్క రాగం తీసినతరువాత.

విస్స—(తనలో) ఈముసలివాడిది రాతిహృదయం. ఇతడు నన్ను యిప్పుడు వేళాకోళాలు చేస్తూ వున్నాడు.

గాన—(విస్సప్పపాతుర్ని తోర్నియుచు) ఇఖ ఆలస్యం చెయ్యక వేగిరం వెళ్లండి. (అని లాగుచున్నాడు)

విస్స—(తనలో) ఇతని వన్నీ కోతిచేష్టలులాగు వున్నవి. నాకు ఆకలి వేస్తూ వున్నది. తరువాత యే మయినా కడుపునిండా భోజనం చేసి వస్తాను. (బిగ్గరగా) తిమ్మన్నగారూ! నమస్కారము. (అని గోవిందునివెంట పోవుచున్నాడు)

గాన—తిమ్మన్నగారా? ఇదివట్టి మోటమాట. ఇతడు నాతో మోటు సరసా లాడుతూ వున్నాడు. అయినాకానీ గొప్పవాళ్ల దగ్గిర కూడా యేవో లోపాలు వుంటవి. మనం క్షుద్రులు పాటిగా పట్టరాదు.

[ప్రక్కగదిలో నుండి లీలావతి ప్రవేశించుచున్నది]

లీలా—నాన్నగారూ! యిక్కడ మీరు వక్కరే వున్నారా?

గాన—అమ్మాయీ! రా. ఆయన పాడడానికి వప్పుకున్నాడు. ఆయనపాటవింటే నేడు మనం కృతార్థుల మవుతాము. ఆయన సంగీతం కర్ణరసాయనంగా విందాము. నీవు యిక్కడనుంచి కదలకు. నేను వెళ్లి బహుమానం నిమిత్తం రూపాయలసంచీ పట్టుకుని వస్తాను. (అని వెళ్లుచున్నాడు)

లీలా—అలాగయితే యిప్పుడు వక్క నిముషమయినా వృథా

నా పోగొట్టరాదు. (అని దొడ్డిగుమ్మముదగ్గరికి పోయి మెల్లగా పిలిచి) బావా! యిలా లోపలికి రా. నాన్నగారు వెళ్లినారు.

[సంగీతరావు ప్రవేశించుచున్నాఁడు]

సంగీ—ప్రియురాలా! లీలావతీ! యిందాకా నీతో చెప్పిన నా స్నేహితుణ్ణి చూచితివా? ఇతడు సంగీతమునందు నిధి. (అని రమ్మని చేసైగ చేయుచున్నాఁడు)

[అంతట సుమతి ప్రవేశించుచున్నాఁడు]

సుమ—అమ్మా! నమస్కారము.

సంగీ—నేను యిప్పుడు మీతండ్రిగారివినోదం నిమిత్తం పాట పాడడంలో నాకు సహాయం చెయ్యడానికి యితడు యింతదూరం నాతో కూడా వచ్చినాడు.

లీలా--ఈయనసుగుణసంపత్తికినాకుబహుసంతోషంగా వున్నది.

సుమ—అమ్మా! అది మీ విషయంలో నే ననవలసినమాట.

లీలా—(సంగీతరావుతో) నీవు వెంటనే పాడడానికి సిద్ధంగా వుండవలెను. నీ ప్రతిపక్షి పాటపాడడం నిమిత్తంబట్టలు వేసుకోవడానికి లోపలికి వెళ్ళినాడు. నాన్నగారు ముందుగా అతనిపాట వింటే—

సంగీ—నా కాభయం లేదు. నేనతనినోరు కట్టిపెట్టినాను.(నడుచుచు) సుమతీ! లీలావతీ! యీగదిలోకి రండి. ప్రియురాలా! నీవీణె నా కియ్యి. (అని ప్రక్కగదిలోనికి వెళ్ళుచున్నాఁడు)

లీలా—ఇదిగో వచ్చి వీణయిస్తాను. (అని ముగ్గురును గదిలోనికి వెళ్ళుచున్నారు).

[అప్పుడు మంచిబట్టలు వేసికొని చేతులలో పూరీల దొంతరలతో విస్సప్పపాత్రుడు ప్రవేశించుచున్నాఁడు]

విస్స—(పూరీలు నమలుచు) వీళ్లవుద్దేశం యేమోకాని నన్ను

గొంతుకదాకా మేపినారు. నన్ను యే దేవతకయినా బలి యిస్తారేమో! పోనీ దేవుడు నొసటవ్రాసిపెడితే యేదీ తప్పదు. మనస్సులో విచారానికి చోటియ్యరాదు. అందుచేత నేను ధైర్యంగా వుంటాను. వీళ్ళు యేమయినా దౌర్జన్యం చెయ్యడానికారంభిస్తే దొంగలనీ చంపుతూ వున్నారనీ కేకలు వేసిన కార్యంలేదు. వీళ్లు చాలామంది వున్నారు. యేలాగూ నన్ను వదలిపెట్టరు. ఇఖ నాచావు నిశ్చయం. ఇదే నాఆఖరు భోజనం గనుక కడుపుపట్టినంత తిని మరీ చస్తాను. (అని పూరీలు వేగిర వేగిరముగా తినుచున్నాఁడు)

[మంచిబట్టలు కట్టుకొని చేతిలో రూపాయలసంచిని పట్టుకొని
గానప్రియుఁడు ప్రవేశించుచున్నాఁడు]

గాన — (విస్సప్పపాత్రుని తేరిపాఱఁజూచి) ఇప్పుడు మీరు మారువేషంపోయి యెప్పటిరూపంతో కనపడుతూ వున్నారు.(పూరీలు నమలుచుండుట చూచి) ఇదేమిటి? మీరు యిప్పుడు యేమిచేస్తూ వున్నారు?

విస్స—(నమలుచు) మీరు తినమన్నారుగనుక బలం చెయ్యడానికి పూరీలు తింటూ వున్నాను.

గాన—అతివిస్తారంగా తింటే గోధుమపిండి అరగదు.

విస్స—నాకు యితరులది యెంతతిన్నా అరుగుతుంది. నేను రాళ్ళు తిని జీర్ణం చేసుకోగలను.

గాన—ఇన్ని తిన్నతర్వాత మీరు గవ్వకు పనికిరారు. మీ కంఠం పోతుంది. (అని చేతిలోని పూరీలు లాగుకొనుచున్నాఁడు)

విస్స—(వడకుచు) అయ్యో! భగవంతుడా! (తనలో) వీళ్లుయీ పూరీలలో యెవరినో చంపవలెనని విషం పెట్టినారు కాబోలును. పొరబాటున తిని నాచావుకు నేనే మందు పుచ్చుకున్నాను.(మూర్ఛిల్లుచు

గద్గదస్వరముతో) అయ్యో! వేగిరం వైద్యుణ్ని పిలిపించండి. మందు తెప్పించండి.

గాన—మీగొంతుక అప్పుడే పాడయిపోతూవున్నది. స్వరం బాగా రావడం లేదు. అయినాకానీ మీకంఠస్వరం బొత్తుగా చెడి పోకముందే వక్కసారి నన్ను బాగా విననియ్యండి.

విస్స—(చెవిచెంతఁజేరి బిగ్గరగా అఱచుచు) ఓ-ఆ-ఊ-క్-కే- ఇక చాలునా? నీకు తృప్తి కలిగిందా?

గాన—ఒకమోస్తరుగా వున్నది. స్వరం కొంచెం బొంగుగా వున్నది. అయినా కానీ ఫర్వాలేదు. ఏదీ? వరాళి, రూపకము.

విస్స—(తనలో) అయ్యో! యితడు మళ్ళీ మొదటికి వచ్చి నాడు. వరాలూ రూపాయలూ తెమ్మంటూ వున్నాడు. నన్ను వీళ్ళు యేలాగూ చంపకమానరు. నేను రూపాయలు యివ్వను.

గాన—ఇక వ్యర్థకాలక్షేపం పనికిరాదు. ఇదివరకే కాలమంతా వృధాగా పాడయిపోయింది. వేగిరం కానియ్యండి. తక్షణం ఆరంభిం చకపోతే—(అని బల్లమీాద నున్నపట్టాకత్తిని తీయుచున్నాఁడు)

విస్స— వద్దువద్దువద్దు. అవి కిందపడవెయ్యండి. మీరు కోరి నట్టుచేస్తాను.

గాన—(సంతోషముతో) నాకు బ్రహ్మానందముగా వున్నది. (రూపాయల మూటను చూపి) ఇదిగో మీాబహుమానము. నూరు రూపాయలు.

విస్స—(అద్భుతపడి) నూరు రూపాయలా!

గాన—(వినయముతో) మీాగొప్పతనానికి యిది యెంతమాత్రమూ అర్హమయినది కాదని నాకు తెలుసునుగాని నాభక్తినిబట్టి మీారిది అంగీకరించవలెను.

విస్స — మీమాటలు నాకు బోధపడడంలేదు. మీరు యీ నూరు రూపాయలూ నాకు యెందుకోసం యిస్తారు?

గాన— మీ కంతా తెలుసును. మీరు వూరికే కాలయాపనం చెయ్యకండి. (అని బలవంతముగా తీసికొనిపోయి బల్లమీదనున్న వీణెవద్ద కూరుచుండబెట్టి వీణెమెట్లమీద నాతని వేళ్ళుమోపి) కానియ్యండి. కానియ్యండి. (అని తాను పోయి కుర్చీమీద కూర్చున్నాడు)

[అప్పుడు చేరువగదిలోనుండి సంగీతరావు పాడగా దివ్యమయిన పాట వినబడుచున్నది]

పున్నాగ వరావళి రాగము—ఆట చాపు తాళము.

పల్లవి

మోసపోవద్దురా—వేశ్యల—మోహము వట్టెదిరా.

అను పల్లవి.

కాసు పో మూలమిదేరా—చెలికాడ! యింతట నైన మేలు కోరా.

చరణములు.

౧. దానితల్లి చెడ్డతొత్తు—దానన్న తమ్ము డిందజిత్తు—
దానిసోదరి పలువవిత్తు — దయలేకతీసె హంసలనత్తు—
మోస॥

౨. ఉప్పుచట్టి నమ్మించు —చెవులనున్నది కుదువపెట్టించు-
అప్పులపాలు చేయించు—అదియైతే తెమ్మని చాలకోపించు — మోస॥

౩. ఇంటిపనులన్నీ చేయించునో—రేత్రైతే నూయవద్దని మూయించు—
గొంటుకాడై చరియించు—వేణుగోపాల నినుగూడి రతుల

మెప్పించు—మోస॥

విస్స—(అద్భుతపడి) తనలో ఇతడు నన్ను పాడుమంటాడు. నాకు పాటచేత కాదు. అయినాకానీ।యితడు యేమి చేసిపోతాడోనని టింగుటింగు వీణెమీటుతూ పాడుతూ వున్నట్టు నటిస్తూ వున్నాను. ఇప్పుడు యెక్కడనుంచో తమాషాగా సంగీతం వినపడుతూ వున్నది. ఇది యింద్రజాలంలాగు వున్నది.

గాన — (కన్నులు మూసికొని తాళము వేయుచు తలయూచుచు) వహ్వా వహ్వా! భళీ భళీ! మేలు మేలు! శాబాసుశాబాసు! పాట యిలావుండవలెను. ఈపాటకు యెూళ్ళు చిగిరిస్తూవున్నవి.

విస్స—(యథాప్రకారముగా వేళ్ళు కదల్చుచు నోరు మెదల్చుచు తనలో) నేను యిక్కడ యేదో దయ్యాలయింట్లో వున్నాను. అయినాకాని యితడు నాకేమీ హానిచెయ్యకుండా వుండడానికి వీణ వాయిస్తూ పాడుతూవున్నట్టు నటిస్తాను.

గాన — నేడు దివ్యమయిన పాట విన్నాను.ఇంతకాలానికి నేడు నాజన్మం సార్థక మయింది. కంఠం కేవలమూ కిన్నెర స్వరము.

[అప్పుడు సుమతి మరియొక పదము పాడుచున్నాడు]

శంకరాభరణరాగము—ఆది తాళము.

పల్లవి.

ఏమి నేరమో—నన్ను బ్రోవ—నెంతభారమో—

నావలన నీ కెంతభారమో.

అను పల్లవి.

సామజవరదుడని మును పే—సత్కీర్తి కల్గ లేదా నాపై.

చరణము.

దీనబంధుడని దేవదేవుడని.—

మానఘనుడని ధర్మాత్ముడనుచు—
జ్ఞానధనులు గుణగానము చేయ బి—
రాన జూడవు త్యాగరాజార్చిత నాప్ప. ఏమి.

విస్న—(యథాప్రకారముగా వీణెమీటుచు పాడునట్లు నటించుచు తనలో) ఇప్పుడు గొంతుక మారిపోయింది. ఇది వేరేస్వరం. ఆపాడేది పిశాచం కాకపోతే యిన్ని గొంతుకలుండవు. (అని వికారచేష్టలు చూపుచున్నాడు)

గాన—(సంతోషపరవశుడయి) ఇప్పుడు మహాహెచ్చుస్వరముమీద పాడుతూ వున్నాడు. స్వరంలో యిందాకటికంటె కొంచెం సారస్యం తక్కువగా వున్నట్టున్నది. లేదు. బాగానే వున్నది.

[అప్పుడు సంగీతరావును సుమతియు కలిసి పాడుచున్నారు]

గంభీరకళ్యాణిరాగము—రూపకతాళము.

ప ల్ల వి.

రాదా నామీద దయలేదా-మొరలిడగ విన.

అ ను ప ల్ల వి.

వాదా నీదాసుడ శ్రీవరద వేంకటేశ్వర విన.

చ ర ణ ము లు.

౧. పరమపురుష వినుము పతితపావన దీనజనావన-
కరిమొరాలకించిన శ్రీహరిహరియని మొరలిడవిన. రా.

౨. సతతము చాలామదిని నిజమ్ముగనమ్మిన యలద్రౌ-
పదిమానము గాచిన శ్రీపతి గతి నీ వనగా విన. రా.

3. తిరముగ వరములొసంగే వరదుడ నీవయనుచు శ్రీ-
హరి వరద వేంకటాద్రివిహార రారాయన విన. రాదా.

గాన—(ఆలకించి) ఏమి యీవింత? ఒక్కకంఠములోనుంచే

రెండు స్వరములు వినపడుతూవున్నవి? ఇటువంటి విచిత్రం నేను యిది
ఒకు యెక్కడా చూడలేదు. (అని లేచి వెళ్లి విస్సప్పపాత్రిని
కౌగిలించుకొని) ఓగాయకశిఖామణీ! నారదతుంబురాదులు నీకాలిగో
రునుపోలరు. ఇదికూడా పుచ్చుకో. (అని తనవ్రేలివజ్రపుటుంగరమును
దీసి యాతనివ్రేలికిఁ దొడుగుచున్నాఁడు.)

విస్స—వద్దు. అది నావేలికి పట్టదు. వద్దు. బిగువు.

గాన—అది వజ్రం వేసిన వుంగరం. చాలాఖరీదు చేస్తుంది.

విస్స—ఆలాగా? మరిచిపోయినాను. ఆలాగయితే యీవుం
గరం నావేలికి వదులు. సరిగా సరిపోతుంది.

గాన—(ఉత్సాహముతో) నాపేరు గానప్రియుడు. నేను లక్ష
రూపాయల కధికారిని. నాకు వక చక్కని కూతురు వున్నది. మీరు
యిక్కడ వుండి యీవార్ధకదశలో నిత్యమూ మీసంగీతంతో నాచెవు
లకు విందుచేస్తూ వుండడానికి వప్పుకొన్నట్టయితే నాకూతురుని మీ
కిచ్చి వివాహం చేస్తాను.

విస్స—నాకు—మహారాజుగారుకూడా తనకూతురినియిస్తారు.

గాన—వేళాకోళంకాదు. నేను నిజంగానే చెప్తుతూ వున్నాను.
మీకు ధర్మపత్ని కావడమంటే నాకొమార్తెకుకూడా పరమసంతోషం
గానే వుంటుంది.

[అప్పుడు లీలావలి ప్రవేశించుచున్నది]

లీలా—(తనలో) మానాన్నగారు యిప్పు డేమిటీ అంటూ
వున్నారు? విశ్వపతిశాస్త్రికి సన్నిచ్చి వివాహం చెయ్యడమా?

గాన—అదుగో నాకూతురు. నాఆజ్ఞ చెల్లించడానికి సరిగ్గా
సమయానికి వచ్చింది.

విస్స—ఓయీశ్వరుడా! యింతచక్కనిదాన్ని నేను యెక్కడా

చూడలేదు !

గాన—ఒక్క సౌందర్యముమాత్రమే కాదు. దీనికి నమ్రతా, సుగుణసంపత్తీ, విద్యా సమస్తమూ వున్నవి.

లీలా—నాన్నగారూ! నాప్రార్థన వినండి.

గాన—మాట్లాడబోకు. ఇటువంటి గాయకచక్రవర్తికి ధర్మ త్నివి కాగలిగిన నీభాగ్యానికి సంతోషించు.

లీలా—మిమ్మలిని బతిమాలుకుంటాను. వక్కమాట వినండి.

గాన—వక్కమాట వినను! అరమాట వినను. నేను యేదైనా మాట అంటే ఆమాట తక్షణం జరిగి తీరవలెను.

విస్స—నన్ను యీమెతో వక్కమాటు మాట్లాడనియ్యండి. (రహస్యముగా గానప్రియునితో) మీరు భయపడకండి. నేను వక్క రాగంతీసి యీచిన్నదాన్ని నావలలో పడవేస్తాను.

గాన—అలాచెయ్యండి. (తనలో) ఇతని పాటఅంటే మృగాలూ పక్షులూకూడా సంతోషిస్తవి. మనుష్యులమనస్సులు కరగడాని కాశ్చర్యం యేమి వుంటుంది?

విస్స—అమ్మా! నేను మహాపాటకుణ్ణని మీతండ్రిగారు చేసే స్తోత్రాలకు నేను తగను. అయినాకానీ నాపాట వక్కసారి వినండి. (అని వికారముగా తలత్రిప్పుచు చేతు లాడించుచు పాడుచున్నాడు.

ఆరభిరాగము—చాప్రతాళము.

అగ్గితిరునాళ్లంట-అర్జుని కతలంట-
ఔరా యెంతసొగ్గమే-భారతకత-
ఔరా యెన్నియింతలే.

అనుపల్లవి.

సుగ్గీవజయము దీనిసుట్టూ-బలాదూరు-

అగ్గురోరపు అయ్యోర్నడు గే నీసొంచ్చిగ.

గాన.—(చెవియొగ్గి విని) అబ్బే! యీపాట యేడిసినట్టేవున్నది. గాడిదకూతలాగుఉన్నది. అయినాకానీ యింకొక్కనిముషంవిందాము.

విస్స—(మఱింత బిగ్గరగా) చరణములు.

౧ ఇగినేశుప్పై నెక్కి-యిబీసనూడొచ్చి
బగుపెగ్గలెన్నినోన్-పలికి దుశ్శాసనుని-
మొగముసూడగానే-మోర్చెపోయెనట్టె-
గుగురుమిగురనకుండ-గుడ్లెల్ల గుక్కేనే—అగ్గి.

గాన—(తనలో) ఇది సుతిమించి రాగాన్ని పడుతూ వున్నది. ఇఖ మాన్పింతాము. (బిగ్గరగా) యేమి టీపాట? యీవెత్తిపాట!

విస్స—వూరుకోండి. మాటాడకండి. మద్దె రసబంగం చెయ్యకండి. చాలా చరణాలు వున్నవి. (అని మరింత యుత్సాహముతో పాడుచున్నాడు)

చరణము.

౨ ఇరన్నేశుసడ్డకు-డిందరిజిత్తోకరెయ్యి-
దురియోదనుని చెవిఃలో-దూరి ముక్కుననెల్ల.
అరసి పిసాసాలే-అశ్శద్దామను మింగె-
సురియోదమూయెనే-సూడయేడుకాయె— అగ్గి.

గాన—(చెవులలో వ్రేళ్లు చెరువుకొని బిగ్గరగా) వూరుకో చాలించు. యీపాటి చాలించు. చెవులు గింగు రెత్తుతూ వున్నవి. వూరుకోవేమి? (అని చేయిపట్టుకొని త్రోసివేసి) నేను యేదో పొరపాటు చేసినాను. నీపేరు యెవరు?

విస్స—నా పేరు విస్సప్పపాత్రుడు. నేను వడ్డిదేశపు వడ్రింగిని. కరువుకు బరంపురాన్నుంచి లేచివచ్చి యేలూరులో వడ్రపుపని చేసు

కుంటూ వున్నాను. పిఠాపురం తీర్థానికి మాపనివాళ్లచేత ముందుగ అమ్మగారికి పెట్టెలు పంపివేసి నేను వెనుక వెళుతూవున్నాను.

గాన — నేను వట్టిబుద్ధిహీనుణ్ణయిపోయినాను. నీ వాగ్గోష్ఠ సంగీతపాటకుడైన విశ్వపతిశాస్త్రివని భ్రమపడ్డాను. ఇందాకా మంచి పాట వినిపడ్డదే. అపాడింది నీవు కావా ?

లీలా — నాన్నగారూ! ఇతడు కాడు. ఆపాడింది మీామేనల్లుడు సంగీతరావున్నూ ఆతనిస్నేహితుడు సుమతిన్నీ.

[సంగీతరావును సుమతియు ప్రవేశించుచున్నారు]

సంగీ — మామగారూ! యిందాకా పాడింది నేను. సంగీతం బాగా పాడడం నేర్చుకుంటేనేకాని మీారు కూతురిని యివ్వనన్నారని నేను తంజావూరు వెళ్ళి రాత్రి పగలూ కష్టపడి నేర్చుకొని మీాదయకు పాత్రుణ్ణి కావడంనిమిత్తం మీారు యిప్పుడు విన్నమోస్తరు పాట పాడడానికి తగినపాండిత్యం సంపాదించుకొన్నాను.

సుమ — ఇతడు బహుభక్తిగా పాడుతాడు.

గాన — అబ్బాయీ ! నీపాటకు నేను మెచ్చినాను. ఇక లీలావతి నీసొమ్మయింది. నీ కిచ్చి పెళ్లిచెయ్యడానికి నాకేమీాఆక్షేపణలేదు.

విస్స — నన్ను వక్కసంగతి చెప్పనియ్యండి.

గాన — మాకు నీసంగతులూ వద్దు యేమీా వద్దు. నీవు యెంత శీఘ్రంగా మమ్మల్ని వదలిపెట్టి వెళితే మే మంత సంతోషిస్తాము.— ఓరీ ! గోవిందా ! మాధవా! వామనా! దారిచూపి యితణ్ని మీారు వేగిరం. వీధిలోకి పంపివెయ్యండి.

[ముగ్గురు సేవకులు ప్రవేశించుచున్నారు]

విస్స — (సేవకునితో) మీారు నన్ను ముట్టుకోవద్దు. వీరితో నేను కొన్ని సంగతులు మనవి చేసుకోవలెను.— అయ్యలారా!

వినండి. వీళ్లు నన్ను బలవంతంగా లాక్కువచ్చి నాప్రయాణం చెడగొట్టి నాబట్టలన్నీ చింపివేసినారు. కాబట్టి యీబట్టలుమాత్రం నాకియ్యండి. నాకు యిచ్చిన పెళ్ళాన్నీ పెళ్ళి వుంగరాన్నీ కూడా కావలిస్తే పుచ్చుకోండి. నాకక్కరలేదు. (అని యుంగర మియ్యఁబోవుచున్నాఁడు)

గాన—అక్కరలేదు. ఆవుంగరం నీవు వుంచుకో. పొరపాటు చేత నేను నీకు చాలా తొందర కలుగజేసినాను. దానికి ప్రతిఫలంగా నే నీవుంగరం నీకు బహుమానం చేసినాను. నీమూటా నీగొడుగూ కూడా తీసుకుని వెళ్ళిపో.

విస్స—వెళ్లిపోతూ వున్నాను. వుంగరం దొరికినందుకు సంతోషంగానే వున్నది; కాని నాపాటమాత్రం కడతేరా వినకుండా పంపి వేస్తూవున్నందుకు విచారంగా వున్నది. అయినా కానీ యీసారి యెప్పుడయినా యీదారిని వెళ్లేటప్పుడు యిక్కడకువచ్చి కీర్తనఅంతా వినిపించి మరీవెళుతాను లెండి. నేను వచ్చినప్పుడల్లా నేను చేసిన పెట్టెలుమాత్రం రెండూ మూడూ కొంటూవుండండి. వెళ్ళివస్తాను. దయ వుంచండి. (అని వెళ్లుచున్నాఁడు)

గాన—మన మందరమూకూడా లోపలికి వెళుదాము రండి. ఇవాళ ఇదంతా చిన్ననాటకంలాగు జరిగింది.

(అందఱును నిష్క్రమించుచున్నారు)

---

# కలహప్రియాప్రహసనము

ఇందు వచ్చుపాత్రములు.

—:o:—

వీరభద్రుఁడు—ఒక వడ్రంగి పటాలములో నాయకుఁడు.

భీమయ్య—ఒక వడ్రంగి కనకాంగి పెంపుడుతండ్రి.

విశ్వకర్మ—ఒక వడ్రంగి కనకాంగివరుఁడు.

గోపాలుఁడు—ఒక గొల్లవాఁడు.

కనకాంగి—భీమయ్య పెంపుడుకూఁతురు.

సుబ్బమ్మ—ఒక చాకలిది. గూడెపునాయకురాలు.

వెంకమ్మ—ఒక చాకలిది.

బుచ్చమ్మ—ఒక చాకలిది.

శేషమ్మ—ఒక చాకలిది.

---

స్థలము—రాజమహేంద్రవరములో గోదావరియొద్దున చాకలిగూడెపు సమీపమున భీమయ్యయింటిముంగిలి.

[అప్పుడు బుచ్చమ్మ, శేషమ్మ, వెంకమ్మ బట్టలమూటలు పట్టుకొని ప్రవేశించుచున్నారు]

బుచ్చ—మనం తెల్లవారగట్ల లేచి యింటింటికీ తిరిగి బట్టలన్నీ పోగుచేసినాము. అలసట పోయిందాకా కొంచెంసేపు లోకాభిరామాయణం చెప్పుకుని మళ్ళీ పనిలోకి వెళ్దాము. ఏదీ మన సుబ్బమ్మ యింకా రాలే దేమి? ఆవిడ లేకపోవడంచేత మనసభ అంతా చిన్నపోయింది.

వెంక—ఆవిడె యేదో పనిచేత రాలేదుగాని లేకపోతే మన కంటె ముందుగానే యిక్కడికి వచ్చివుండేది. ఆవిడెచేతులు వూరికే వున్నా నోరు యెప్పుడూ వూరికే వుండదు.ఆవిడె వచ్చేటప్పుడు యేవో కబుర్లు మూటకట్టుకుని వస్తుంది.

శేష—ఆవిడె ప్రతిదినమూ తెల్లవారి లేచేటప్పటికి యిన్ని క్రొత్త కబుర్లు యెక్కడనుంచి పోగుచేసుకువస్తుంది ?

వెంక—మనం యీబట్టలు పోగుచేసుకుని వచ్చినట్లే వెళ్లిన యింటికాడ నెల్లా నాలుగేసి కబుర్లు పోగుచేసుకుని వస్తుంది. ఆవిడె దగ్గిర ఆశుకవనంకూడా వున్నది. యెక్కడా కబుర్లు దొరకకపోతే ఆవేళకు క్రొత్తవయినా నాలుగు కల్పించి మన కందరికి ఖులాసాగా పొద్దుజరిగేటట్టు చేస్తుంది. ఆవిడె తెచ్చే కబుర్లన్నీ పదిభాగాలుచేసి, అందులోవకభాగంలోపదోవంతుమాటలుమాత్రమే నేను నమ్ముతాను.

బుచ్చ—నిజంగా యీవూళ్లో అందరివ్యవహారాలూ ఆవిడెకు తెలుసును.

వెంక—ఆవిడె అందరి వ్యవహారాలలోనూ ఖులాకా కలుగ చేసుకుంటుంది. ఆవిడె మాటలు చూస్తే నాకూరికేనవ్వువస్తుంది.ఆవిడె నావ్యవహారంలో ప్రవేశించకుండా వున్నంతవరకు యెవరివ్యవహారంలో ప్రవేశించినా నాకు యిబ్బందిలేదు.

[అప్పుడు సుబ్బమ్మమాట వినబడుచున్నది]

బుచ్చ—ఓసీ! వూరుకో. ఆవిడె వస్తూవున్నది.

శేష—మనం ఆవిడెసంగతి మాట్లాడుకుంటూ వున్నట్టు ఆవిడెకు తెలియకూడదు.

[అప్పుడు చంకక్రింద బట్టలమూట పెట్టుకుని సుబ్బమ్మ ప్రవేశించుచున్నది]

సుబ్బ—అమ్మలారా! మొన్నడూలేనిది నేను యివేళ మీా

అందరికంటెనూ ఆలస్యంగా రావలసివచ్చింది. అయితే యేమిలెండి. కబుర్లులేకుండా యిదివరదాకా వృధాఅయినకాల మంతా వక్కనిము షంలో కూడతీస్తాను. యివేళ మీలో యెవరయినా కనకాంగిని చూచినారా? యివేళ ఆవిడెకు పెళ్ళిసుమా.

బుచ్చ—యెక్కువ సొగసుగా కనపడడానికి యివేళ ఆవిడె దువ్వుకోవడంలోనూ తొడుక్కోవడంలోనూ వున్నది. ఆవిడెదర్శనం మన కెక్కడ అవుతుంది?

సుబ్బ—యీపెళ్ళి స్వార్థాపడదు. నేను ముందుగానే చెప్తుతూ వున్నాను వినండి. పెళ్ళిఅయినా దంపతులు సుఖపడరు. ఆపెళ్ళికొడుకు విశ్వకర్మ వట్టిగర్వపోతు. అంతే కాకుండా అతను పెళ్ళికోసం గొప్ప వేషం వేసినాడు.

వెంక—ఆలాగా?

సుబ్బ—అతనుగోదావరిగట్టు కారుఖానాలో పనిలో వుండి యిప్పుడు వీళ్ళతో ఆకారుఖానా అంతా తనదేనని చెప్పినాడు. జంగం పేరయ్య కనకాంగిపెళ్ళికోసం పట్టురవికా పట్టుచీరే తీసుకుని వెళుతూ వుండగా చూచినాను. ఆపట్టుచీరెకు చుట్టూ జరీనక్కవేసి కుట్టినాడు. వడ్రపుపని చేసుకునేవాడికూతురు కేమిటి? పట్టుచీరె యేమిటి?ఇలాగు తలకుమించిన వ్యయంచేసి సంసారంపాడుచేసుకోవడం చూస్తే భీమయ్య వట్టిబుద్ధిహీనుడుగా కనపడుతూ వున్నాడు. ఇంతాచేస్తే యిది వాడి కూతు రవునోకాదో!

బుచ్చ— ఏమీ! కనకాంగి అతనికూతు రేకాదా?

బుచ్చ—మీరు నన్నాప్రశ్న అడగకండి. ఇది అతనికూతురు అయితే అవనేఅవుతుంది. కాకపోతే కానేకాదు.

బుచ్చ—ఇందులో యేదో రహస్యంవున్నది. చెప్పు చెప్పు.

సుబ్బ—నేను లక్షవరహాలుయిచ్చినా చెప్పను. పాపం! ఆచిన్న దానిమీద అపవాదలు వెయ్యడం నాకు యెంతమాత్రమూ యిష్టం లేదు.

వెంక—నీవు మాకు చెప్పకపోతే చెప్పకపోయినావుకాని కనకాంగిగుట్టు యేదో నీకు తెలిసింది. అంతమట్టుకు నిశ్చయం.

శేష—సుబ్బమ్మా! నావక్కదానితోనూ చెప్పు. నేను యెవరితోనూ చెప్పను.

సుబ్బ—నేను యెవరితోనూచెప్పను. దానిసంగతి మాఅమ్మ నిన్నసాయంకాలం నాకు యెంతోరహస్యంగా చెప్పింది. నేను యీసంగతి నావదినెగార్లముగ్గురితోనూ మాత్రం చెప్పినాను. అటుతరువాత నాప్రాణస్నేహితులయినవారితో అయిదుగురితోనో ఆరుగురితోనో యేకాంతంగా చెప్పినాను. వీరితోతప్ప యింతవరకు నేను యీసంగతి వక్కపిట్టతో చెప్పలేదు. అజాగ్రతగా వున్నప్పుడు యిప్పుడు మాటల పరాకున మీదగ్గిర కొంచెం నోరుజారి పయికి వచ్చింది.

వెంక—నేను యీసంగతి యెంతరహస్యంగా వుంచుతానో నీకే తెలుసును.

బుచ్చ—నాచెవులలో పడ్డమాట పయికిరాదని నీకే తెలుసును.

శేష—నా నోట్లోమాట నానోట్లోనే వుంటుందిగాని వెలుపలకు రాదనిమాత్రం నీకు తెలియదా?

సుబ్బ—అలాగయితే మీమాటనమ్మకంమీద మీతోకూడా చెపుతాను. ఈభీమయ్యకు పూర్వం వక పెళ్ళామూ కూతురూకూడా వుండేవారు. అత్తవారియింటికివెళ్లినప్పుడు అక్కడ మరిడీజాడ్యాలచేత యిద్దరూకూడా చచ్చిపోయినారు. అటుతరువాత యితను కొన్నియేళ్ళ దాకా యీవూరికిరాక అక్కడనేవుండి కొంతకాలానికి యీపిల్లను

తీసుకొని మళ్ళీవచ్చి యీయింట్లో ప్రవేశించినాడు. అందరూ యీ చిన్నది యితనికూతురనుకుంటూ వున్నారు.

వెంక—ఇది నీకు నిశ్చయంగా తెలుసునా?

సుబ్బ—అప్పుడు మాఅమ్మ వీళ్ళయింట్లో బట్టలు వుతుకుతూ వుండేది. వీళ్ళసంసారస్థితి అంతా దానికి బాగా తెలుసును.

వెంక—అయితే కనకాంగి యెవరయి వుంటుంది?

సుబ్బ—ఎవరికి తెలుసును? అయితే వకవేళ అతని కూతురే అయి వుండవచ్చును. దాని కేమిగాని విశ్వకర్మ యెంత దుర్మార్గుడో చూచినావా?

బుచ్చ—యెందుచేత?

సుబ్బ--వెనుక యితను ఆకారుఖానాలో వకవడ్రంగి కూతురుని పెళ్ళిచేసుకుంటానని ఖరారు చేసినాడు. యిప్పుడు యీవివాహం సంగతి తెలియడంతోటే పాపం ఆచిన్నది చిక్కి సగమయిపోయింది. మొగవాళ్లు మోసం చేస్తారు. పెళ్లివిషయంలో మనం మొగవాళ్లను యెప్పుడూ నమ్మకూడదు. జాగర్త మీలో యెవరూ నమ్మి మోసపోకండి. (అప్పుడొకసుబ్బమ్మతప్ప తక్కినవారందరును బట్టలపాకలోనికి వెళ్ళుచున్నారు)

[పెళ్ళిచీర కట్టుకొని యింటిలోనుండి కనకాంగి వచ్చుచున్నది]

సుబ్బ—(ముందుకు వెళ్ళి కనకాంగిచేయి పట్టుకొని) అమ్మాయీ! యీదినం నిన్నుచూస్తే నాకు బహుసంతోషంగా వున్నది. యీచీరె నీకు యెంతో అందంగా వున్నది. (అని పాకలోని వాకె తలతో రహస్యముగా) నే నీమాట లంటే దీని కెంతభయంగా వున్నదో చూచినారా?

అందరు—ఆహాహాహా! (అని పకపక నవ్వుచున్నారు)

కన— నాస్నేహితుల కందరికీ యీదినం బహు ఖులాసాగా వున్నది.

[అప్పుడింటిలోనుండి భీమయ్య ప్రవేశించుచున్నాడు]

భీమ—సుబ్బమ్మా! క్షేమమా?

సుబ్బ—యీదినం మీదర్శనం కావడమే నాకు క్షేమం. మీ దర్శనం దొరకడంచేత నాకు బహుసంతోషంగా వున్నది.

భీమ— చాకలమ్మలందరూ మహాపనిమీద వున్నారు.

అంద—అవును పనిమీదనే వున్నాము. హాహాహా! (అని నవ్వుచున్నారు)

సుబ్బ— నేనుకూడా పోయి పని చేసుకోవలెను. (అని పాకలోనికి వెళ్లుచున్నది)

భీమ—అమ్మాయీ! నీపెళ్లికంతా సిద్ధమయింది. బంధువులనందరినీ పిలిచి వచ్చినాను. లగ్నసమయంలోవచ్చి వక్కసారి వధూవరులను ఆశీర్వదించి పోవలసిందని నాగాచార్యులపెళ్లాన్ని మరీ మరీ ప్రార్థించినాను. అంతదూరం రాలే నన్నది.

సుబ్బ—(చాకెతలతో)నాగాచార్యులపెళ్లాన్నిరమ్మని ప్రార్థించినాడట! ఆవిడెసుకుమారం చూచినారా?

అంద—హీహీహీ. (అని నవ్వుచున్నారు)

భీమ—(ఆవంక జూచి) ఏమి నాగాచారి పెళ్లామంటే మీకింత పరిహాసంగా వున్నదా? ఆవిడె సుకుమారికాదా?

సుబ్బ—కాకేమి? ఆవిడె మహా సుకుమారి. మొగుడు ఆవిడెను యింట్లోయేమీ పనిచెయ్యనియ్యడు. వక్క సూరయ్యగారికుమారుడు వస్తేతప్ప మరియెవరువచ్చి పిలిచినా పీథితలు పయినా భార్యను వెళ్లి తియ్యనియ్యడు. సూరయ్యగారి కుమారుడు పిలిస్తేమాత్రం అవిడె స్వ

యంగా వెళ్లి తలుపు తీస్తుంది; ఆయన యింట్లో ప్రవేశిస్తాడు; ఇంటి యజమాని వెంటనే వీధిలోకి పనిమీద వెళతాడు. ఇది నేను ప్రత్యక్షంగా చూచినాను.

భీమ—సంసార్లమీద లేనిదోషాలు వెయ్యరాదు. యీవాళ్కరోజయినా పరులను అడి పోసుకోవడం మానివెయ్యండి. అని కె పిలువ లేదంటారు. మీరందరూ వచ్చి మాఅమ్మాయిపెళ్లి చూచి పొండి.

సుబ్బ—నాకు యెవరిమీదా ద్వేషం లేదు. నేను యెప్పుడూ యెవరిమీదా లోకంలోవాళ్లవలె లేనిపోని దోషాలు చెప్పను. యింత పొద్దుయెక్కినా పెళ్ళికొడుకు యింకావచ్చినాడుకాడు. యిలాగుమీకందరికీ ఆయాసం కలుగచెయ్యడం విశ్వకర్మకు ధర్మంకాదు. నేను వకవేళ పెళ్లికి రాలేకపోయినా నీకూతురికీ అల్లుడికీ యెప్పుడూ శుభం కోరుతూ వుంటాను.

[అప్పుడు చాకెతలందఱును పాకలోనుండి యీవలకు వచ్చుచున్నారు]

వెంక—పెళ్లికి నేనూ రాలేను.

బుచ్చ—నేనూ రాలేను.

శేష—నేనూ రాలేను.

సుబ్బ—యెక్కడకైన వెళ్లితే తనకు సమానమయినవాళ్ల యింటికి వెళ్ళవలెనుగాని తనకంటె తక్కువవాళ్లయింటికి వెళ్లకూడదు. యెక్కువవాళ్ల యింటికీ వెళ్లకూడదు. నేను యీవూళ్ళో చాకలవాళ్లలోయింతపరువుగా బ్రతుకుతూ వున్నదాన్నేకాని వట్టిదాన్ని కాను.

బుచ్చ—కొంచెం యెక్కువ తక్కువగా నేనూ నీఅంత పరువు గలదాన్నే.

శేష—నాపరువూ మీయిద్దరికెంటెనూ తక్కువయిందికాదు.

వెంక—నా మొగుడు కచేరీ మహాల్చీపనిలో వున్నాడు. నాచేతులో నాలుగురూపాయలసొమ్ము వున్నది. నాకు మాత్రిం పరువుకు యేమి తక్కువ?

సుబ్బ—అలాగయితే మనమందరమూ సమానమయినపరువు గలవాళ్లమే. మనలో పరువుతక్కువవాళ్లు వక్కరూ లేరు.

భీమ—ఇప్పుడు నేను మిమ్మలినందరినీ పేరంటానికి పిలుస్తూ వున్నాను.

సుబ్బ—నేను బహుశా వస్తాను. కనకాంగి నాకు ప్రాణస్నేహితురాలు.

బుచ్చ—నేనూ ముఖ్యస్నేహితురాలనే.

వెంక—నేనూను.

శేష—నేనూను.

భీమ—అలాగయితే మీరందరూ యిళ్లకు వెళ్లి పెళ్ళిముస్తాబయిరండి.

వెంక—నేను బజారులో పట్టుపుళ్ళిరవిక కొనుక్కుంటాను.(అని వెళ్ళుచున్నది)

శేష—నేనూపట్టురవికేకొనుక్కుంటాను. (అని వెళ్ళుచున్నది)

బుచ్చ—మీరందరూ రవికలు కొనుక్కుంటే నేను చీరె కొనుక్కుంటాను. అందరమూ కలిసి వెళదాముురండి. యిక్కడ మనబట్టలు సుబ్బమ్మ చూస్తూ వుంటుంది. (అని యందరును వెళ్ళగా సుబ్బమ్మ పాకలోనికి పోవుచున్నది)

కన—నాన్నగారూ! మీఅల్లుడు యింతసేపటిదాకా రాకపోవడానికి కారణం యేమయివుంటుంది?

భీమ—ఆతడు పెళ్ళికియివీఅవీసవరించుకుంటూవుండివుంటాడు.

సుబ్బ—(పాకలోనుండి) అంతతొందరపడకండి. పడుచువాడు వివాహానికి వచ్చేటప్పుడు చక్కపెట్టుకోవలసిన వ్యవహారాలు యెన్నైనా వుంటవి. పూర్వపుసంబంధాలన్నీ వదులుకోవలెను. ఇవ్వవలసిన చోట యిచ్చి సమాధాన పరచవలెను.

భీమ—దాని మాటలకేమి? సుబ్బమ్మ యెప్పుడూ యిలాగంటి మాటలే అంటూవుంటుంది. విశ్వకర్మ యిప్పుడే వస్తాడు. అమ్మాయీ! నీవు యిక్కడ కనిపెట్టి చూస్తూవుండు. నేను యింతలో లోపలకావలసినవన్నీ సిద్ధంచేస్తూవుంటాను. (అని యింటిలోనికి వెళ్ళుచున్నాడు)

కన—అడుగో అతడు వస్తూవున్నాడు.

[అప్పుడు చేత బుట్ట పట్టుకొని విశ్వకర్మ ప్రవేశించుచున్నాడు]

విశ్వ—ఓప్రియురాలా! నీకోసం బజారులో కొన్నివస్తువులు కొనేటప్పటికి కొంచెం ఆలశ్యం అయింది. మనం సొమ్ము వృథాగా పోగొట్టరాదు. అందుచేత వస్తువులు యెక్కడచవుకగా దొరుకుతవో అక్కడ కొందామని బజారంతా తిరిగేటప్పటికి యింత ఆలస్యం అయింది.

సుబ్బ—(పాకలోనుండి) విశ్వకర్మగారూ! మీరు క్షేమముగా వున్నారా! మిమ్మలిని చాలాకాలానికి చూచినాను. మీరు మహాఅదృష్టమంతులు.

విశ్వ—సుబ్బమ్మా! మీచాకిరేవు యిక్కడనేనా!—కనకాంగీ! ప్రియురాలా! నీవు వుండవలసినంత సంతోషంగా కనబడవేమి?

కన—యేమీలేదు. మీరు యింతసేపటిదాకా యెందుకు వచ్చినారుకారా అని యిదివరదాకా ఆలోచిస్తూ వున్నాను.

విశ్వ—నేను యెందుకోసం ఆలస్యం చేసినానో నీకు తెలిసింది గనుక యిక విచారం పెట్టుకోరాదు. చూడు యిదుగో నీ కెన్నివస్తు

వులు తెచ్చినానో! దంతపుదువ్వెన వకటి; వక బొట్టుపెట్టె; యిత్తడి కుంకం బరిణె; యిత్తడి కాటుకకరాటం; యిత్తడి పాందాను; యిత్తడి అడకొత్తు; యిత్తడి సున్నపుకాయ; మంచి అద్దము; అయిదు బొంబాయి రవికెల గుడ్డలు; రెండు పట్టురవికెలు; వక మధురచీరె; రెండు వుప్పాడ చీరెలు ఇవన్నీ చూచినతరువాతనైనా నీమనస్సుకు తృప్తికరంగా వున్నదా?

కన—వున్నది. (అని యీవస్తువులు పయికితీసి చూచి మరల బుట్టలో పెట్టుచున్నది)

సుబ్బ—పాకలోనుండివచ్చి విశ్వకర్మగారూ! యీవస్తువులన్నీ యెక్కడ కొన్నారు?

విశ్వ—మావస్తువులసంగతి నీ కెందుకు?

సుబ్బ—నాకక్కరలేదుగాని వూరికే అడిగినాను.

విశ్వ—కనకాంగీ! యీమధురచీరె కట్టుకుంటే నీవు యెట్లా వుంటావో చూడవలెనని వున్నది.

సుబ్బ—బహుబాగావుంటుంది. రంభలాగు వుంటుంది. ఆమధురచీరె యిప్పుడు కట్టుకున్నపట్టుచీరెను మించి వుంటుంది.

విశ్వ—ఓహోహో! నేను చూడనే లేదు. ప్రియురాలా! నీకు పట్టుచీరెకూడా వున్నదా?

కన—ఈపట్టుచీరె నావంటికి తగి వున్న దనుకుంటాను.

సుబ్బ—విశ్వకర్మతో రహస్యముగా ఆపట్టుచీరె మహారాజుల పెళ్ళాలు కట్టుకోవలసిందిగాని సాధారణ మయిననీవంటివడ్రంగిపెళ్ళాం కట్టుకోతగ్గదికాదు. ఇలాగు తలకు మించినవేషాలు వేస్తే చూచిన వారు నలుగురూ నవ్వుతారు. ఇలాగంటివేషాలు సాగనిస్తే వక్క రోజులో నీయిల్లు గుల్లఅవుతుంది. ఈపట్టుచీరె కనకాంగికి యెవరో

యిచ్చినారట.

విశ్వ—ఏమిా! యెవరో యిచ్చినారా?

సుబ్బ—వూరుకో మెల్లిగా.

విశ్వ—(తనలో) సుబ్బమ్మ చెప్పినమాట నిజమయ్యేవుంటుంది. (బిగ్గరగా) కనకాంగీ! నీకు ఈచీరె యెవరు యిచ్చినారు?

సుబ్బ—(కనకాంగితో రహస్యముగా) ఆ అడగడంధోరణి చూచినావా? అప్పుడే పెళ్లాంమిాద అధికారం చెయ్యడాని కారంభించినాడు.

కన—మాబాబు కొనిపెట్టినాడు.

సుబ్బ—(విశ్వకర్మతో రహస్యముగా) నీ వామాటలు నిజమనే నమ్ముతావా?

విశ్వ—కనకాంగీ! నీవు యీపట్టుచీరె కట్టుకుంటే. చూచిన వాళ్ళు యేమనుకుంటారు? పల్లెవాడిపెళ్ళానికి పెళ్ళిలోనే యీనీటేమిటని నలుగురూ నవ్వరా? నీకు యిది తగదు.

కన—పయివాళ్ళు నవ్వుకుంటే నవ్వుకోనియ్యండి. మనకేమి?

విశ్వ—(బిగ్గరగా)నీకు నేను యిది తగదని చెప్తూ వుంటేను-

సుబ్బ—(విశ్వకర్మతో రహస్యముగా) మేలు మేలు! ఆలాగు వుండవలెను. చివరకు యేమి చేస్తావో యిందులో నీమొగతనం తెలుస్తుంది.

కన—యిది మాబాబు—

విశ్వ—మిాబాబు మాట నాతో చెప్పకు. నాకదిజరూరు లేదు.

సుబ్బ—ఇటువంటి స్వల్పవిషయంలో తగువులాడకండి. మిారు పెళ్లి కాకముందే యిలాగు పోట్లాడితే పెళ్లయినతరువాతకూడా యెప్పుడూ పోట్లాడుతూనే వుంటారు. ఈపనికిమాలినపట్టుచీరెకోసం

యింతకలహా మెందుకు ?

విశ్వ—(ముందుకు వచ్చి) నేను యిప్పుడే చెప్పుతూ వున్నాను. నలుగురిచేతా నవ్వించుకోవడం నాకు యిష్టం లేదు.

కన—యెవరూ యెందుకు నవ్వుతారు ? ఇది నాకు మాతండ్రి కొనిపెట్టినాడు.

సుబ్బ—(విశ్వకర్మతో రహస్యముగా) ఇలాగంటి పట్టుచీరె కొనిపెట్టడానికి దీనితండ్రిదగ్గిర డబ్బు యెక్కడ యేడిసింది ?

కన—మళ్ళీ చెప్పుతాను. దీన్ని నాకు మాతండ్రి కొనిపెట్టి నాడు. నేను కట్టుకుంటాను. నన్ను చూచి నవ్వడానికి యెవళ్లసొమ్ము యేమి పడిపోయింది ?

సుబ్బ—(కనకాంగితో రహస్యముగా) బాగా చెప్పినావు.

విశ్వ—నీవు యీచీరె కట్టుకోకూడదు.

సుబ్బ—(విశ్వకర్మతో రహస్యముగా) నీదగ్గిర మొగతనం కాస్త కనపడుతూ వున్నది. ఆడదానికి లోబడకు.

విశ్వ—లోబడను.

కన—మీరు నిష్కారణంగా యెందుకు తగువులాడుతారు ?

విశ్వ—నేనా ? నేను తగువులాడడం లేదు.

సుబ్బ—(కనకాంగితో రహస్యముగా) ఈమొగుణ్ని చేసుకుని నీవు సుఖపడవు—

విశ్వ—నీ వాచీరె విప్పివేస్తావా వెయ్యవా ?

సుబ్బ—(కనకాంగితో రహస్యముగా) వెయ్యనను నీకేంభయం!

కన—వెయ్యను.

విశ్వ—అలాగైతే నీజోలి నాకక్కర లేదు. ఇప్పుడే నేను చెప్పినమాట విననిదానవు యిఖ ముందేమి వింటావు ?

సుబ్బ—(విశ్వకర్మతో రహస్యముగా) మేలుమేలు ! నీవు నా మనసువచ్చినమగవాడవు. మగతనం అంటే యిలాగువుండవలెను.

కన—యిటువంటి స్వల్పవిషయంలోనే యిలా తామసం వస్తూవుంటే, ముందు నిజంగా నాయందు తప్పితం వున్నప్పుడు మీరు నన్ను యేలాగు సాగ్లాచేస్తారు?

సుబ్బ—(కనకాంగితో రహస్యముగా) తగినట్టు బుద్ధిచెప్పినావు. ఆడదానవంటే నీవే ఆడదానవు.

విశ్వ.—నీకు పట్టుచీరెమీదనూ వేషంమీదనూ తప్ప మరి దేనిమీదనూ ధ్యానం లేదు.

కన.—నీవు యెప్పుడూ నీగొప్పతనమే చూచుకుంటావు. నీవు గర్విష్ఠివి.

విశ్వ—నీవు పనికిమాలినగయ్యాళివి.

కన—(వెనుక తిరిగి వెళ్ళుచు) అవు నవును. న న్నలా అనవలసినదే. ఇక నేటినుంచి నాకు నీతో సంబధం విడిపోయింది. (మరల ముందుకు వచ్చి) ఇఖ నేను నీతో యెప్పుడూ మాట్లాడను.

విశ్వ—(వెళ్లుచు) మంచిది. యిఖ నేనూ నీతో యెప్పుడూ మాట్లాడను. (అని మరల వచ్చుచున్నాడు.)

కన—ఇదుగో నీవు తెచ్చిన వస్తువులూ బుట్టాకూడా తీసుకునివెళ్లు. (బుట్ట ముందుకు త్రోసిచి) ఈపనికిమాలినవస్తువులు నా కక్కరలేదు. నీవి నీవే తీసుకునివెళ్ళు.

విశ్వ—మంచిది. అలాగే తీసుకొని వెళుతాను. (తనలో) ఇవి తీసుకునివెళ్ళి సఖంఖరీదు కైనా మళ్లీ అమ్మివేస్తాను.

కన—మీరు నాదగ్గిరగా రాకండి.

విశ్వ—యెప్పుడూ రాను.

కన—మనకు యిదే ఆఖరుచూపు. (అని యింటిలోనికి వెళ్ళు చున్నది.)

విశ్వ—యిదే ఆఖరుచూపు. (అని వెళ్ళుచున్నాఁడు.)

సుబ్బ—(నవ్వుచు) హాహాహా! నాకిప్పుడు పరమసంతోషంగా వున్నది. చెప్పుకుని నవ్వుకోడానికి మాకు యీవేడుక రెండురోజుల దాకా సరిపోతుంది. ఇది వూళ్ళో యెలాగున చెప్పవలెనో ఆలోచించు కోవలెను. మనం చెప్పేటప్పుడు భీమయ్యకూడా దగ్గరవున్నట్టే చెప్ప వలెను. అలా చెపితేనేకాని కథలో సొగసే వుండదు. విశ్వకర్మ చీరె నిన్ను కట్టుకోనియ్యనంటే, కనకాంగి నేను కట్టుకోకమాన నన్నది. అందుమీద విశ్వకర్మ నీ కాచీరె యెలావచ్చిందన్నాఁడు. దానికి యెలా వస్తే యేమి దానిమనసువచ్చినచోట సంపాదించుకొన్న దని తండ్రి అందుకున్నాఁడు. ఆపయిని చీరె కట్టుకోకూడ దని వకరూ, కట్టుకోక మాననని వకరూ, కట్టుకుంటే యేమిచేస్తా వని వకరూ, ముగ్గురూ మాటామాటా అనుకొని తరువాత కలియబడి కొట్టుకొని దెబ్బలాడి లేచిపోయినా రని చెపుతాను. మధ్య కొట్టుకోవడం పెడితేనేకాని వినేవాళ్ళకు యింపుగా వుండదు. ఆదెబ్బలాటలో విశ్వకర్మ కనకాంగిని కొట్టి కిందబడద్రోసినాడు. కనకాంగి కిందపడి యేడుస్తూ లేచి విశ్వ కర్మ మొఖ మంతా బరికింది. దానిమీద కోపం వచ్చి విశ్వకర్మ కన కాంగికొప్పు పట్టుకొని పీకే టప్పటికి గుప్పెడు వెంట్రుకలు చేతు లోకి వూడివచ్చినవి. అప్పుడు భీమయ్య కలియబడి విశ్వకర్మబట్ట లన్నీ చింపినాఁడు. అటుతరువాత తండ్రీ కూతురూ చేరి వంటిగాణ్ని చేసి బ్రహ్మరాక్షసులలాగు మీదపడి చావకొట్టేటప్పటికి విశ్వకర్మ వాళ్ళతో గెలువలేక పారిపోయినాడు. యేసంబంధంలో నయినా కనకాంగి మూర్ఛవచ్చి క్రింద పడిపోయిం దనికూడా చెప్పవలెను. ఆహాహాహా!

ఇప్పుడు వినడానికి యెంతయినా వేడుకగా వుంటుంది. యితరుల పోట్లా-
టంటే నాకు పండుగ.

[అప్పుడు వీరభద్రుడు ప్రవేశించుచున్నాడు]

వీర— (ముందుకు వచ్చుచు) ఇక్కడితో నాప్రయాణం తుద
ముట్టింది. భీమయ్యయిల్లు యీసమీపంలోనే నని చెప్పినారు. పాపం
కనకాంగి యెట్లావున్నదో! దాన్ని నేను యిప్పు డానవాలు పట్టలేనను
కుంటాను. తనకు వకఅన్నగారు వున్నాడన్నసంగతయినా దానికి తెలి
యదు. వక కారణంచేత యీసంగతంతా దాచవలసి వచ్చింది. (సుబ్బ
మ్మనుచూచి) అమ్మా! వక్కసారి యిలాగువస్తావా?

సుబ్బ— (పాకలోనుండి వచ్చి) నాయనా! యేమికావలెను?
బట్టలు వుతకడానికి చాకలిది కావలెనా? యీవూళ్ళో నాతో సమాన
ముగా బట్టలు వుతికేవాళ్ళు యెవరూ లేరు. నెలజీతానికి కుదుర్చుకుం
టారో చాకిరేవుకు యింతని యిస్తారో మాట్లాడుకోండి.

వీర—నాకు వద్రింగిభీమయ్యయిల్లు యెక్కడో చెప్పవలెను.

సుబ్బ—భీమయ్యయిల్లా? మీరు కుర్చీలు; కొంటారు కాబోలును.

వీర — మాకు యేమీ అక్కర లేదు. ఆతనియిల్లుమాత్రమే
కావలెను.

సుబ్బ—అతడు మీకు యిప్పుడు కనపడడు. అతనికి యిప్పుడు
మనసు స్థిమితంగా లేదు. యీవుదయాన్న అతనికూతురు కనకాంగికి
పెళ్లిలగ్నం పెట్టుకున్నారు. పెళ్ళి చెడిపోయింది.

వీర—కనకాంగికా పెళ్ళి?

సుబ్బ—అవును కనకాంగికే. అదంతా మీతో చెపుతాను
వినండి. కనకాంగికి గర్వం యెక్కువ. తనస్థితికి మించినవేషం వేసుకుని
తిరుగవలె నంటుంది. అందుచేత వూళ్ళోఅందరూ యెక్కడచూచినా

కనకాంగిమాటే చెప్పుకుంటారు.

వీర—కనకాంగి మంచిదికాదని చెప్పుకుంటారా?

సుబ్బ—బొత్తిగా మంచిదికాదని చెప్పుకుంటారు. ఆమాటలు వినే తీరా పెళ్ళిసిద్ధమయ్యేటప్పటికి పొద్దున్న యింటికి వచ్చినవాడే పెళ్లికొడుకు యిఖ తాను కనకాంగిని పెళ్లిచేసుకోనని అనవలసినమాటలు మొఖంమీద అనివేసి వెళ్లిపోయినాడు. ఈపెళ్లి తప్పిపోవడంవల్ల వచ్చిననష్టం యేమీ లేదు. ఆపెళ్లికొడుకు వట్టిదార్భాగ్యుడు.

వీర—నేను పనిలోనుండి కీర్తిసంపాదిస్తూవుంటే నాచెల్లెలు యీవూళ్లో వుండి యింత అపఖ్యాతి తెస్తూ వున్నదా? నాకు బహు విచారంగా వున్నది. భీమయ్యయిల్లు యేదో వెంటనే చెప్పు!

సుబ్బ—అయ్యో! నీవు కనకాంగి తోడబుట్టినవాడవా? యీ మాటలు చెప్పి మీమనస్సు కాయాసం కలుగజేసినందుకు నాకు విచారంగా వున్నది. నేను యిప్పుడు మీతో చెప్పినదంతా యెవళ్ళో గిట్టని వాళ్ళు వూళ్లో చెప్పుకొన్నమాటలుకాని అపుణ్యమూ పాపమూ నేనేమీ యెరుగనుసుమా. నేను యెరిగినంతమట్టుకు ఆచిన్నదానివద్ద వక్కదుర్గుణం కనపడదు. ఆచిన్నది అన్నగారు వచ్చినారంటే బహు సంతోషిస్తుంది. అంత బుద్ధిమంతురాలు యీచుట్టుపట్ల ఆడవాళ్ళలో మరియెవ్వరూ లేరు. ఆవినయం యేమి? ఆకలిసికట్టుతనం యేమి? ఆద యాదాక్షిణ్యా లేమి? ఆమాటపొందిక యేమి? యీవీధివాళ్ళంతా కనకాంగిని వెయ్యినోళ్ల స్తుతిస్తూ వుంటారు. నీవు చెల్లెలికి చాలాడబ్బు తెచ్చినట్టున్నది.

వీర—ఇదేమిటి? యేదిపట్టుకున్నా వదలవు. నాకు చావుగా వున్నది. కాస్త నేవు నీకథ కట్టిపెట్టి నా కాయిల్లు చూపించు.

సుబ్బ—భీమయ్యగారియిల్లా? అతనియిల్లు యిదే.

వీర—ఇంతసేపు చంపకపోతే యీమాట మొట్టమొదటనే చెప్పలేకపోయినావా? (అని లోపలికి వెళ్ళుచున్నాడు)

సుబ్బ—ఇతడు డబ్బుగలవాడు. అందుకు సందేహం లేదు. కనకాంగి భీమయ్యకూతురు కానిమాట యిప్పుడు స్పష్టపడింది. ఈవిడె యెవరో మహాధనికుడి కూతురు. ఇందులో యేదో పరమరహస్యం వున్నది. అడుగో విశ్వకర్మ వస్తూ వున్నాడు. కనకాంగికి భాగ్యవంతుడయినతోడబుట్టినవా డున్నా డన్నసంగతి వింటే వాడు మరీ యేడుస్తాడు.

[అప్పుడు విశ్వకర్మ ప్రవేశించుచున్నాడు]

విశ్వ—ఏమిబుద్ధి? నేను యిప్పుడు యేమిచెయ్యను? నేను బుద్ధిహీనుణ్నయి నిష్కారణంగా మంచిమాట లాడవలసినదానికి బదులుగా తగవులాడినాను. ఎలాగయినా ఆడదానిమాట సాగనియ్యకూడదు. అది పట్టుచీరె కట్టుకోవడం మానివెయ్యవలెను.

సుబ్బ—విశ్వకర్మగారూ! మీకొకవిశేషం చెప్పుతాను యిలాగు రండి. మీరు యిందాకా పట్టుచీరె కట్టుకున్నందుకే హాశ్చర్యపడిపోయినారు యిప్పుడు కనకాంగికి బనారసు చీరెలూ మొహిరీలపేర్లూ వజ్రాలనగలూ పెట్టుకోవలసినయోగం పట్టింది.

విశ్వ—ఛెస్సి, యిదంతా అబద్ధం.

సుబ్బ—ఛెశ్శని మీరు నామాట అబద్ధంకింద కట్టివెయ్యవచ్చును. ఆచిన్నది భీమయ్యకూతురుకాదు.

విశ్వ—కాదూ?

సుబ్బ—కాదు. ఆవిడె యెవరో జమీదారు కూతురు. ఆవిడె అన్నగారు యిప్పుడే వచ్చినాడు. నేను కళ్లారా చూచినాను. ఆయన మాటలు నేను చెవులారా విన్నాను.ఆయన బహుదొడ్డవాడు. ఆయన

యెనిమిదిగురాత్రిలబండిలో వచ్చినాడు. బండీ యీగుమ్మందగ్గరనే నిలిచింది. ఆయన బండీదిగి నాదగ్గిరకు వచ్చినాడు. ఆయనను చూచేటప్పటికి నాకు సిగ్గుచేతనూ భయంచేతనూ కంపం యెత్తి వళ్లంతా చెమట పోసింది. అప్పుడు నేను మూర్ఛవచ్చి కింద పడిపోతా ననుకున్నాను. ఆయనకు కాస్తయినా గర్వం లేదు. కనకాంగిసంగతీ భీమయ్యసంగతీ నన్నడిగి చెల్లెలికి కావలసినంతధనం తీసుకువచ్చినా నని నాతో చెప్పినాడు. ఆయనతో నీపేరుచెప్పి నీవు మహామంచివాడవని చెప్పినాను. ఆయన యీపాకలోకి వచ్చి నాబట్టలు వుతకడంచూచి సంతోషించి నాకు తమసంస్థానంలో పనియిప్పిస్తామన్నారు. ఆమాటలు చెప్పి నవ్వుతూ ఆయన దేవదూతలాగు యీయింట్లోకి వెళ్లినాడు.

విశ్వ—ఇఖ నాబ్రతుకు యేమవుతుంది? నేను చెడిపోయినాను.

సుబ్బ—నీవు మొదలంటా చెడిపోయినావు. నీవు పొద్దున్న బుద్ధిపోయి ఆలాపోట్లాడకుండా వున్నట్టయితే యీపాటి కనకాంగి నీకు భార్యఅయి వుండును. అప్పుడు నీకు ముప్ఫయి నలభయి వేల రూపాయల ఆస్తి వచ్చివుండును. ఆరూపాయలసంచులు చూచుకుంటే నీకు యీపాటి పిచ్చ యెత్తకపోయిందా?

విశ్వ—ముప్ఫయి నలభయి వేల రూపాయలా? అన్ని రూపాయలు వుంటే గొప్పకారుఖానా పెట్టవచ్చును. మరి ప్రొద్దున్న ఆచిన్నదానితో పోట్లాడడానికి నన్ను నీవు యెందుకు పురికొల్పినావు?

సుబ్బ—నిన్ను నేను పోట్లాటకు పురికొల్పినానా? సరిసరి! ఇది మరీ బాగావున్నది. నేను పొద్దున్న నీతో వక్కమాటమాట్లాడలేదు. (అని పాకలోనికి వెళ్ళుచున్నది)

విశ్వ—నీమాటలు వింటే నాకు పిచ్చ యెత్తిపోతూ వున్నది. నీ వాడదాన వైపోయినావుగాని మగవాడ వయినట్టయితే యీపాటి

నాపగంతా తీర్చుకొందును. నే నిప్పుడు యేమి చెయ్యను? వూళ్లోవా ళ్లంతా యిఖ నన్ను చూస్తే పరిహాసం చేస్తారు. ఇఖ నాకు నిశ్చయంగా చావు వ్రాసింది. నేను నూతిలోనో గోతిలోనో పడవలెనుగాని నాకు పెళ్ళాడి భార్యాతో సుఖంగా కాపురం చెయ్యవలసిన యోగం లేదు. యిందాకా పిలిచినారు. పంతులుగారికుర్చీ బాగుచేసి వచ్చి యేదో సాహసకార్యం చేసుకుంటాను. (అని వెళ్లుచున్నాఁడు)

[అప్పు డింటిలోనుండి వీరభద్రుఁడును, భీమయ్యయు ప్రవేశించుచున్నారు]

వీర—నేను విన్నదంతా అబద్ధమని నీవు నమ్మకంగా చెప్పడం వల్ల నామనస్సులో విచారమంతా పోయింది. నీవు చెప్పినట్టుగా మన కనకాంగి గర్వములేనిదీ అనువర్తనకలదీ అయివున్నట్టయితే నేను యిప్పుడు యిక్కడకు వచ్చినందుకు నాకు సంతోషమేకాని విచారం వుండదు. అది యిప్పుడు యింట్లోలేదుగనుక కొంచెంసేపు నేను వచ్చిన సంగతి రహస్యంగానే వుంచండి. అప్పుడు నేను తనబీదస్థితిలో దాని నడత యెట్లా వుంటుందో స్వయంగా కనిపెట్టి, తరువాత మాతండ్రి యిచ్చిపోయినఈభాగ్య మంతా దానితో నేను సుఖంగాఅనుభవిస్తాను.

భీమ—మీతండ్రి మహావీరుడు. అతడూ నేనూ పటాలంలో కొంచెంకాలమే పనిచేసినా, మేము యిద్దరమూ ప్రాణస్నేహితులుగా వుండేవాళ్ళము.

వీర—మాతల్లి పోవడంచేత యింట్లో ఆడదక్షత లేక కూతురు పోయి విచారిస్తూవున్నావని నీకు పెంచు కోవడానికి యిచ్చిన కనకాంగిని పెంచి పెద్దదాన్ని చేసినందుకు మాతండ్రిపోయినా నాకు విశ్వాసం పోలేదు. నీవు బ్రతికినంతకాలమూ సుఖంగా జీవనంచెయ్యడానికి తగిన జీవనాధారం నేను యేర్పరుస్తాను.

భీమ—ఆమాటలు యిప్పుడేమీ నాతో చెప్పవద్దు. మన కన

కాంగిని యివ్వదలచుకొన్న విశ్వకర్మను నీకు యిప్పుడు చూపిస్తాను. అతనుభాగ్యవంతుడు కాకపోయినా మాటనిలకడ గలవాడున్నూ కష్ట పడి వొళ్ళు దాచుకోకుండా బాగా పాటుపడేవాడున్ను పెద్దమనిషిన్ని అవును. వాళ్ళయిద్దరికీ వకరిమీద వకరికి మోహం విస్తారంగా వున్నది గనుక వారి వివాహానికి నీవేమీ అడ్డం చెప్ప వని తలుస్తాను.

వీర—నీవు చెప్పినఆమూడుగుణాలూ వుంటే లోకంలో యిం కా ధనంయేమి కావలెను? అయినాకానీ నేను యీవూళ్ళోకి వచ్చిన సంగతీ కనకాంగికి ధనం తెచ్చినసంగతీ విశ్వకర్మకుకూడా తెలియకుండా వుండనియ్యండి. అతడికి నిజంగా కనకాంగిమీద ప్రేమవున్నట్టు నాకు కనపడ్డట్టయితే యీపెళ్ళికి నే నేమీ అభ్యంతరము చెప్పను.

భీమ—(రహస్యముగా) అలాగయితే నీవు బీదవాడవనిన్ని భు క్తికి జరగక యిక్కడకు వచ్చినావనిన్ని వదంతి వేస్తాను. ఆపాకలో చాకలిది మనకేసి చూచి మనం యేమిచెప్పుకుంటామో అని ఆలకిస్తూ వున్నది. దానికి తెలిస్తే వూరంతా తెలిసినట్టే. మంచిసమయం తట స్థమయింది. (బిగ్గరగా) అయ్యో! వీరభద్రా! నీ వనుభవించినకష్టాలూ నీబీదతనమూ వింటే నాగుండెలు బద్దలవుతూ వున్నవి.

సుబ్బ—(ఉలికిపడి) ఏమీ!

వీర—నేనేమీ అక్రమం చెయ్యలేదుగదా అన్న ధయిర్యము తప్ప నావద్ద యీరాత్రి భోజనాని కయినా చిల్లిగవ్వ లేదు.

సుబ్బ—ఓయి దేవుడా! అంతా ఇంతేనా?

భీమ—మంచిది. నీవెంతమాత్రమూ అధైర్యపడబోకు. నీవు పడిదెకు తెచ్చుకుని వేసుకున్న యీబట్టలుచూస్తే యీవూళ్లో నిన్ను యెవళ్లూ బీదవా డని అనుమానపడరులే. నిన్ను గోదావరివద్దు కారు ఖానాలో పనికి పెప్పగిస్తానురా. (రహస్యముగా) తాలూకా కచేరీ

ఆవైపుననే వున్నది. అక్కడ నీనోట్లు మార్చుకొని మళ్ళీ యిప్పుడే వత్తాము. (అని వెళ్ళుచున్నారు)

సుబ్బ—(పాకలోనుండి వచ్చి) ఇప్పుడు నేను వక కొత్తసంగతి కనిపెట్టినాను. అతనికి పూటకూటికి టికాణా లేదట. గర్భదరిద్రమట. కారుఖానా అని పేరుపెట్టుకొని వాళ్ళు వూళ్ళో ముష్టికి బయలు దేరినారు. సందేహంలేదు. లేకపోతే వకవేళ యెక్కడనయినా కన్నంవేసి పట్టుకు పోతారని యీవూరికి పారిపోయివచ్చినారేమో! సందేహం లేదు. అదేఅయివుంటుంది. నేను యిప్పుడు యెంతయినా చెప్పవలసి వున్నది. వినేవాళ్ళు యిక్కడ వక్కరూ లేకుండావున్నారు. ఇప్పుడు వూళ్ళోకి పరుగెత్తుకుని పోయి నలుగురితోనూ చెప్పి వత్తునా? వెళుదామంటే బట్టలదగ్గిర కనిపెట్టుకుని వుండేవారు యెవరూ కనపడరు. యిందులో చిలువలూ పలవలూ కల్పించి గింపైనకబుర్లు చెప్తాను. యిక్కడ వుండడానికి యెవరినైనా పిలుచుకుని వస్తాను.

(అని వెళ్ళుచున్నది)

[చేతివేళ్ళకి కట్టుకట్టుకొని చేబాడిత పట్టుకొని విశ్వకర్మ ప్రవేశించుచున్నాడు]

విశ్వ—(ముందుకు వచ్చి) నాకు యిప్పుడు యేమీ మతిలేదు. కుర్చీకాలు చెక్కపోయి పరధ్యాన్యంచేత వేలు తెగకోసుకున్నాను. యిప్పుడు నాధ్యాసమంతా కనకాంగిమీద వున్నది. తీరా సిద్ధమయిన పెళ్ళి చెడగొట్టుకోవడంచేత నాసుఖం పోయింది. సంతోషం పోయింది; వుత్సాహంపోయింది. నాకు తెలివికూడా సెలవుపుచ్చుకుంటూవున్నది.

[అప్పుడు సాధారణమైన బట్టకట్టుకొని కనకాంగి ప్రవేశించుచున్నది]

కన—(విశ్వకర్మనుజూచి) వి-వి-విశ్వకర్మా! (ముందుగా నేను పలుకరించకూడదు)

విశ్వ—క-క-కనకాంగీ! (నేను ముందుగా పలుకరించరాదు)

కన—నీవు నన్ను పిలిచినావా?

విశ్వ—నీవే నన్ను పిలిచినా వనుకున్నాను.

కన—నేను పిలువలేదు.

విశ్వ—నేనూ పిలువలేదు. కనకాంగీ! నాకు యిప్పుడు నేత్రోత్సవంగా వున్నది.

కన—యేమిటీ!

విశ్వ—యేమిటా? నీవు యిప్పుడు కట్టుకున్నకోక బహుబాగా వున్నది.

కన—నిజంగా నేనా?

విశ్వ—నిజంగా నే. యిందాకటి పట్టుచీరెకంటె షదిరెట్లు బాగా వున్నది. ఇఖ మనవివాహం నిజంగా చెడిపోయినట్టేనా?

కన—(కన్నుల నీరు పెట్టుకొనుచు) ఏమిటీ? మనవివాహమా? ఆలాగె కినపడుతూ వున్నది.

విశ్వ—(తనలో) నేను మళ్ళీ అడిగితే, నేను తన డబ్బుకోసం పళ్ళాడుతానంటూ వున్నా ననుకుంటుం దేమో? నే నేమి చెయ్యాను?

కన—విశ్వకర్మా! నేను యిక్కడ నిలుచుని కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూవుంటే నీవు వూరికే చూస్తూ నిలుచున్నావుకాని నాదుఃఖం పోగొట్టడానికి కొంచెమయినా ప్రయత్నం చెయ్యడం లేదుగదా?

విశ్వ—(తనపై బట్టతో గన్నీరు తుడుచుచు) నాకు బహువ్యసనంగా వున్నది. నా కప్పుడు తెలియలేదు. నేను యిప్పుడు సిద్ధంగా వున్నాను.

కన—యెందుకు సిద్ధంగా వున్నావు?

విశ్వ—నీతో మళ్ళీ యెప్పటిలాగు స్నేహంచెయ్యడానికి. నీకు

అభ్యంతరం లేకపోతే నాకు యేమీ అభ్యంతరం లేదు.

కన—నీవు నిర్దయుడవు. నీకు నామీద నిజంగా ప్రేమవున్నట్టయితే ప్రొద్దున్న పట్టుచీరెకోసం నాతో అలాపోట్లాడివుండవు. నేను యిప్పుడు యేమి చేసినానో చూచినావా? పట్టుచీరెవిప్పి సాదాచీరె కట్టుకున్నాను.

విశ్వ—నీకు నామీద దయవున్నది గనుక అలాచేసినావు. నీవు యిప్పుడు నీమనసు వచ్చినచీరె కట్టుకోవచ్చును. మనం యిద్దరమూ యిప్పుడు మళ్లీ స్నేహితులమయినామూ? అయినట్టే తోస్తూవున్నది. నీమొఖానికి యిప్పుడు కళ చేరుకున్నది. పెదవులసందునుంచి చిరునవ్వు బయలుదేరుతూ వున్నది. నీముఖవికాసము చూస్తే నాకు సంతోషంగా వున్నది. నాకు వక్కముద్దు పెట్టు! మళ్ళీ స్నేహితుల మవుదాము. (అని కౌఁగిలించుకొని ముద్దు పెట్టుకొనుచున్నాఁడు.)

[అప్పుడు సుబ్బమ్మ ప్రవేశించుచున్నది]

సుబ్బ—ఓరితుంటరీ! యిప్పుడు యేమి సేస్తూవున్నావు?

విశ్వ—నీవు పొద్దున్న పెట్టినకలహాన్ని చంపివేస్తూ వున్నాను.

సుబ్బ—అయ్యో! యెంతదురదృష్టమూ.

విశ్వ—దురదృష్టమా?

కన—దురదృష్టమా?

సుబ్బ—దురదృష్టంకంటెనూ హీనమయినది. వట్టిసిగ్గులచేటు. కనకాంగీ! నీఅన్న వచ్చినాడు చూచినావా?

కన—నాఅన్నా! నాకు అన్నే లేడు.

సుబ్బ—తప్పకుండా వున్నాడు.

విశ్వ—ప్రియురాలా! నీవు యెరగనేయెరగవా? అతడు బహు ధనవంతుడు.

సుబ్బ—నీకు యీసంగతి తెలియనేలేదా? నీకు అన్నవున్నాడు. అతను యీరోజున యిక్కడకు వచ్చినాడు. అతడు కటికదరిద్రుడు. పూటకూటికి గతిలేదు. వట్టిబిచ్చగాడులాగు వున్నాడు.

విశ్వ—యెవరు ?

సుబ్బ—కనకాంగితోడబుట్టినవాడు.

విశ్వ—అతడు భాగ్యవంతుడనీ, గుర్రపుబండీవున్నదనీ, నవు కర్లు వున్నారనీ, మంచిబట్టలు కట్టుకున్నాడనీ, యింతకుముందేకాదా నాతో చెప్పినావు.

సుబ్బ—అది అరగంట సేపటికిందట. ఇప్పుడాగురుడు వెళ్ళి పోయినాడు. జనుల స్థితిగతులు నిముషంలో మారిపోతవి. అతగాడి వేషం మళ్లీ వచ్చేటప్పుడు చూస్తిని గదా ముష్టివాడివేషంకన్నను కనాకష్టంగా వున్నది. నల్లగా మాసిపోయిన పాతచిరుగుల పీలికలగుడ్డ కట్టుకున్నాడు. కాలికి జోడులేదు.—

విశ్వ—చాలుచాలును. ఊపాటి వూరుకో. నీమాటలు నేను నమ్మను. మంచిజరీబట్టలు అరఘంటసేపటిలో మాసి చిరిగిపోయి పీలిక లయినయ్యంటే యెవరైనా నవ్విపోతారు.

సుబ్బ—నేను నిజం చెప్పినాను. నామాటలు నమ్మితేనమ్ము. నమ్మకపోతే నమ్మకు. (కనకాంగివంకఁ జూచి) నీఅన్నగారు నీవు భీమయ్య కూతురవు కావని స్పష్టంగా చెప్పినాడు. అతడు యిప్పుడు నిన్ను తమవూరికి తీసుకునిపోవడానికే వచ్చినాడు. దారిఖర్చునిమిత్తం కారుఖానాలో కూలిపనిచేసి సాయింత్రానికి పావలాడబ్బులు సంపా దించి వాటితో యీరాత్రి నిన్ను మోటబండిమీద యెక్కించి తన వెంట తీసుకుపోతాడు. అతణ్ని యింతకుముందే కార్ఖానాలో వప్ప గించడానికి భీమయ్య వెంటబెట్టుకుని వెళ్ళినాడు.

[అప్పుడు భీమయ్యయు వీరభద్రుఁడును ప్రవేశించి వారికి కనబడకుండ వెనుక నిలుచున్నారు.]

విశ్వ—ఏమిటే! అతడు కనకాంగిని తనవెంట తీసుకునిపోతాఁడా? ఈవిడెను తీసుకునిపోతే నన్ను కూడా తీసుకునిపోవలెను.

కన—సుబ్బమ్మా! నేను 'నీవు చెప్పిన దానిలో వక్కమాటయినా నమ్మను. నీవు మాకు మళ్లీ పోట్లాట పెట్టవలెనని చూస్తూవున్నావు. నేను యిప్పుడు మాతండ్రి కూతురిని కానడం పట్టి దూషణగా వున్నది. లోకంలో యింతకంటె విచిత్రం లేదు.

సుబ్బ—నీకు తండ్రి యెవరో యెవరికీ తెలియదు. ఈవిశ్వకర్మ అభమూశుభమూ యెరగని అమాయకుడు గనుక, నీవు యెవరి కూతురవో తెలుసుకోకుండా చేతులో దమ్మిడీగవ్వలైనా లేని నిన్ను తగుదునని పెళ్లాడడానికి తయారయినాడు. నీఅన్నగారిని చూడబోతే చిరుగులగుడ్డలూ తానూ నీకంటెనూ గర్భదరిద్రుడుగా వున్నాడు.

విశ్వ—(దగ్గరగా వచ్చి) సుబ్బమ్మా! నేను వక్కమాట చెప్తాను విను. కనకాంగికి తండ్రివున్నా లేకపోయినా, యీచిన్నది బీదదయినా భాగ్యవంతురా లయినా, అన్నగారివి చిరుగులగుడ్డలయినా, జరీబట్టలయినా, వాటితో నాకు యేమీ పనిలేదు. నాకు కనకాంగి మీద మోహం వున్నది; నేను కనకాంగిని పెళ్ళాడుతాను. ఈవిడె అన్నగారికి బట్టలు లేకపోతే నాబట్టలలో కొన్ని యిస్తాను; యిల్లు లేకపోతే నా యింట్లోనే కాపురం వుండనిస్తాను; అన్నం లేకపోతే నేను మరింత కష్టపడి సంపాదించి పెడుతాను. నాకు వంట్లో సత్తువ వుంటేనూ యీరెండుచేతులూ చల్లగావుంటేనూ, యీవిడెఅన్నగారు వచ్చినా తండ్రి వచ్చినా యేటేటా వొక్కొక్కడు చొప్పున పదిమంది పిల్లలు వచ్చినా వళ్ళుదాచుకోకుండా పనిచేసి సంపాదించి అందరినీ

పోషిస్తాను. ఇఖ యిప్పు డేమి చెపుతావు?

వీర—(ముందుకు వచ్చి విశ్వకర్మ చేయిపట్టుకొని) నిన్నుచూస్తే నాకు బహు సంతోషంగా వున్నది. ఈకనకాంగిఅన్నగారిని నేనే. నేను నీవల్ల సహాయంపొందడానికి బదులుగా నాచెల్లెలినీ సంవత్సరానికి మూడువందలరూపాయలు వడ్డీవచ్చే సొమ్మ్కూడా నీకే నేను యిస్తూ వున్నాను.

కన—మీారు నాకన్నగా రవుతారా ?

వీర—(కనకాంగి చేయిపట్టుకొని) చెల్లాయీ! నీవు సౌభాగ్యవతివి కమ్మ. నీకు నేను అన్నగారినంటే నీకు అద్భుతంగానే వుంటుంది. మనవంశకథ అంతా యీరాత్రి నీవివాహం అయినతరువాత రేపు సావకాశంగా నీతో చెపుతాను.

విశ్వ—సంవత్సరానికి మున్నూరురూపాయలా! మనం ఇఖ పెద్దకార్ఖానా పెట్టుకోవచ్చును.

సుబ్బ—అయ్యా! మీారు మహాదొడ్డవా రని నేను యిదివరకే విశ్వకర్మగారితో చెప్పినాను. కావలిస్తే ఆయనను అడగండి.

బుచ్చమ్మ, శేషమ్మ, వెంకమ్మ, గ్రామస్థులు—(వెలుపలనుండి) సుబ్బమ్మ యెక్కడ వున్నది? చాకలి సుబ్బిముండ యెక్కడ వున్నది?

విశ్వ—సుబ్బమ్మా! నీకోసం యెవరో చాలామంది వస్తూ వున్నారు?

[అప్పుడు బుచ్చమ్మయును, శేషమ్మయును, వెంకమ్మయును, గోపాలుఁడును, ప్రవేశించుచున్నారు.]

వెంక—(సుబ్బమ్మతో) ఓసీ చాకలితొత్తా! నేను బట్టలు వుతికే రామా౯రావుపంతులుగారి భార్యవద్ద నావిషయమయి నీవు యేమని చెప్పినావు? మామడివేలు పెళ్లిచేసుకున్న వాడుకాడు, వుంచు

కున్నవాడని నీవు యెందుకు చేలినావు? ఇలాగంటి సంసారఘాతలు పలకడానికి నీకు నోరెట్లావచ్చిందే! మాపంతులుగారు నీకు "కలహప్రియ" అని పేరు పెట్టినందుకు వూరికే పోలేదు.

బుచ్చ—(సుబ్బమ్మను జూచి) నేను చిన్నప్పుడు గోదావరివడ్డున కూలికి పేడతట్టలు మోసేదాన్నని అబద్ధాలమాటలు పూజారాయనతో యెందుకు చెప్పినావు?

శేష—(సుబ్బమ్మ దగ్గరకు పోయి) నేను వెనుక యెవరి యింట్లోనో యేదో యెత్తుకుపోయినాననీ, నేను పడుచుదాన్నిగా కనపడడానికి తలవెండ్రుకలకు రంగువేసుకుంటాననీ, బజారులో బట్టల దుకాణం వేసుకునే కోమటి మల్లయ్యతో యెందుకు చెప్పినావు?

సుబ్బ—నేను యెవరితోనూ యేమీ చెప్పలేదు.

వెంక—చెప్పినావు. (అని యొక లెంపకాయ కొట్టుచున్నది)

బుచ్చ—తప్పకుండా చెప్పినావు. (అనివీపుమీదగుద్దుచున్నది)

శేష—నీవు చెప్పినందుకు యేమీ సందేహంలేదు. (అని బుగ్గలు పొడుచుచున్నది.)

భీమ—నీవు యిలాగంటి తంపులు పెట్టకుండా వీళ్లు నీకు బాగా బుద్ధిచెప్పినారు.

గోపా—ఆహాహా! దీనికి తగిన శాస్తి అయినది. యిది నాపెళ్ళానికీ యెవరికో రంకుకట్టిందట. నేనుకూడా ఆడదాన్నయినట్టయితే దీన్ని నాలుగు తన్నులు తన్నుదును.

సుబ్బ—అందరూ కాట్లకుక్కలలాగు మీదపడితే వంటరి కత్తెను యేమి చెయ్యగలను. ఇప్పుడు మీకాలంవచ్చింది. నవ్వండి. నవ్వండి. యేమి చేస్తాను? నేను రేపటినుంచి మీతో యెవరితోనూ మాట్లాడను. నాతో నేనే మాట్లాడకుంటాను. నాతో నేనే నవ్వు

కుంటాను. (అని వెళ్ళుచున్నది.)

గోపా — హాహాహా !

విశ్వ — ఇప్పుడు కలహాలమారి సుబ్బమ్మ మనను విడిచిపెట్టి వెళ్ళిందిగనుక, ఈఖ యీరోజు మనమంతా సంతోషంగా వుండ వచ్చును. మనం లోకంలో స్నేహమున్ను గౌరవమున్ను సంపాదించు కోవలెనంటే యెవరివిషయంలోనూ జబ్బుమాటలు చెప్పకుండా వుండ వలెను. మనం యెవరివిషయంలోనైనా మంచిమాటలు చెప్పలేకపోతే మౌనం ధరించి వూరికే వుండడం మంచిది. పొద్దుపోయింది లోపలికి వెళుదామురండి. (అందఱును నిష్క్రమించుచున్నారు.)

# మహామహోపాధ్యాయప్రహసనము

ఇందు వచ్చుపాత్రములు.

—:o:—

కళావిదుఁడు—విద్యాలయమ్ముదాదరముగల యొకక్షత్రియుఁడు.

ధీనిధి—కళావిదునికుమారుఁడు.

విద్యానాథుఁడు—ఒక యుపాధ్యాయుఁడు.

భీముఁడు — మహామహోపాధ్యాయతర్కపంచాననుఁడు-ఒక శాస్త్ర పండితుఁడు.

వసంతతిలక—కళావిదునిమేనకోడలు.

చంద్రిక—వసంతతిలకదాసి.

---

౧ రంగము—కళావిదుని తోటలోని యిల్లు.

[అప్పుడు చంద్రిక ప్రవేశించుచున్నది]

చంద్రి—(చీపురుగట్ట చేతబట్టుకొని) నాకు పనిఅంటే బద్ధకం. యీపని మానివేసి వీథివంక చూస్తూ మహారాణిలాగు కూర్చుంటే బాగావుండును. మేడగోడ తుడవబోతే క్రింద పడిపోయిందని యీచీపురుకట్ట వీధిలో పడవేస్తునా! అరుగో యెవరో వస్తూవున్నారు. మరి యెవరూ కాదు. వసంత తిలక.

[చప్పుడు కాకుండ మెల్లగా నడుచుచు గృహములోనుండి వసంతతిలక ప్రవేశించుచున్నది]

వసం—ఓసీచంద్రీ! మామగారు వీధిలోకి వెళ్ళినారా?

చంద్రి—యిప్పుడే వెళ్ళినారు. మీమేనమామగారు యిప్పుడే

కాదా గదిలోకూర్చుండి చదువుకోమని మిమ్మలిని లోపలికి పంపివేసి నారు. అమ్మా! మీరప్పుడే మళ్ళీవచ్చినారేమి?

వసం—యెప్పుడూ అదేపనిగ కూర్చుని చదువుకోమంటే విసుగువస్తుంది. ఓసీ! నీతో చెప్పనా? నాకు కామబాధ మహావిస్తారంగా వున్నది. నాకు యిప్పుడు యేమి చెయ్యడానికీ తోచకుండా వున్నది.

చంద్రి—నాకూ అలాగే వున్నది.

వసం—చంద్రీ! నేను వెనుక యెప్పుడూ కామంచేత యింత బాధ యెరగను.

చంద్రి—అమ్మా! నాబాధ యెవరితో చెప్పుకోను. అవును కాని మీమేనమామగారు తనకుమారుడు ధీనిధిగారు చెన్నపట్నం కాలేజీనుంచి వచ్చినప్పటినుంచీ మిమ్మల్ని యిద్దరిని వక్కచోట వుండకుండా చేస్తూవుంటారు యెందుచేత? నేను చూస్తూవుంటాను. మీమేనమామగారికి మిమ్మలినీ ధీనిధిగారినీ కనిపెట్టి చూస్తూవుండడం తప్ప రెండోపని కనపడదు.

వసం—వూరికే అలా చూడడమే కాని అందువల్ల యేమీ ప్రయోజనంలేదు. ధీనిధి నేనూ కలుసుకోవలె నంటే ఆయన పట్టుకోగలడా?

[ధీనిధి ప్రవేశించుచున్నాఁడు]

ధీని—వసంతతిలకా! ఇప్పుడు వచ్చింది మరి యెవరూ కాదు. నేనే. తొందర పడబోకు.

చంద్రి— మీరు యిద్దరూ వేరేవేరే గదులలో కూర్చుని వక్కమోస్తరు చదువే చదువుకుంటూ వున్నట్లున్నారు. ఇప్పుడు మీమీ చదువులు నూడాపలుక్కోవడానికి వుభయులుకూడా యిక్కడికి వచ్చినట్లున్నారు.

ధీని—అవును. అందుకేను వచ్చినాము; మానాన్నగారునన్ను వక్కసారిగా శేషాహిహాల్మికిని కమ్మంటారు. నైషధమూ,మాఘమూ, భారవీ, యీలాగంటి రాళ్ళవంటి పాతపుస్తకాలు మరికొన్ని చదువు మని రాత్రి పగలూ వూరికే నాప్రాణాలు తీస్తూవున్నారు?

వసం—మీరు కాలేజీలో చాలాకాలం చదివినారు.

ధీని—అవును. యఫేక్లాసులో రెండేళ్లూ, బియే క్లాసులో రెండేళ్లూ నాలుగేళ్లు చదివినాను. అక్కడ వున్నకాలంలోకూడా నాకు నీచదువే విస్తారంగా వుండేది. నీవు పెద్దదాన వవుతూవున్నావనీ నా మీద నీకు ప్రేమ హెచ్చుతూ వున్నదనీ, నీవు మహా సౌంద్యవతివనీ, నాధ్యానమంతా నీమీదనే వుండేచి.

వసం—ఆలాగయితే మీ రక్కడ చాలా మంచిచదువే చదివినారు. ఇఖమీరు చదివింది చాలును.

చంద్రి—ఎక్కువ. యీమధ్య మీనాన్నగారూ చదువులపంతులువిద్యానాథుడుగారూ మాట్లాడుకోవడంలో యీకాలపు కుర్రవాళ్ళు అతివిస్తారంగాచదువుకుంటారని।చెప్పుకున్నారు. అది నిజమేనా?

ధీని—విస్తారంగానే చదువుతారు. అయినాకానీ పురుషుడు వకరిని కామించివున్నప్పుడు చదవడం బహుకష్టం.

చంద్రి—అలాగయితే పెళ్లయినతరువాత చదువు సాగుతుందనుకుంటాను.

ధీని—సాగుతుంది. అప్పుడు మేము యిద్దరమూ కలిసి చదువుకుంటాము. పాపం! యీచంద్రికకు యీకామవిషయంలో యేమీ అనుభవం లేదు.

చంద్రి—నాకూ వున్నది. నేనూ ఒకరిని కామించే వున్నాను. పెద్దమనుష్యులయిళ్ళల్లో పనిచేసే పడుచుతనంలో వున్న నావంటిబీద

వాళ్ళ నడతను ముఖ్యంగా చూస్తారు. అందుచేత నేను నిరుడు నాపె త్తల్లితోకూడా చెన్నపట్నం వెళ్లినప్పుడు నేను యెవరిని పెళ్లిచేసుకో వలెనో యేర్పరుచుకున్నాను. ఈ ఆరునెలలబట్టీ నాకు యేమీ పని తోచడంలేదు. ఈబట్టు రెండు నెలలకిందటనే కొరుప్రట్టినాయీ కా స్త చిరుగూ కుట్టుకోనయినా కుట్టుకోలేదు.

వసం—(ముందుకువచ్చి) ఓసీ చంద్రీ! నీమొగుడి సంగతి నాతో కొంచెం చెప్పు. అతను పనుచువాడేనా? చక్కగా వుంటాడా? ఇంత మర్యాదగలవాడేనా?

చంద్రి—అతను మహాచక్కనివాడు. యెప్పుడూ పెద్ద మను ష్యులదగ్గిర వుంటాడు. అతను యెప్పుడూ పెద్దఅంగరకా వేసుకుని జరీ నక్కి చుట్టిన పాగా పెట్టుకుంటాడు.

వసం—ఆనక్కి మంచిజరీదేనా?

చంద్రి— మంచి జరీదే. నడుముకు కట్టుకునే పటకా కూడా జరీదే.

ధీని—ఇప్పుడు తెలిసింది. అలాగయితే అతనికి యెవరివద్దనో బంట్రోతుపని.

చంద్రి—అయితే యేమి? అతని యజమానుడూ పూర్వం బీద వాడుగానే వుండేవాడట. యజమాను డయినప్పుడు నవుకరుమాత్రం యెందుకు భాగ్యవంతుడు గాకూడదు? యీ ఆరు నెలలబట్టీ నాకు అతని కబురే తెలియడం లేదు. విచారంచేత నాకు మతి లేకుండా వున్నది.

ధీని—చంద్రీ! విచారింపబోకు. మాకుపెళ్లి అయినతర్వాత అతను యెవరో కనుక్కొని తెప్పిస్తాములే. మాపెళ్ళి వేగిరం కాకుండా వుండడానికి యేదోతంత్రం జరుగుతూ వున్నది.

చంద్రి—అది మీకు యెలాగు తెలిసింది?

ధీని—మీ చదువులపంతులూ మాతండ్రిగారూ కూర్చుని యే కాంతంగా యెప్పుడూ యేదో గుసగుస లాడుకుంటూ వుంటారు.

చంద్రి—వారియేకాంతంవల్ల యెవరికీ యేమీ నష్టంరాదు.

వసం—మేము యీసాయంకాలం వుత్సవంలోకి వెళ్ళదలచుకు న్నామని వారికేమయినా అనుమానం కలిగిందా?

చంద్రి—కలిగినట్టు లేదు. మీమేనమామగారు నాలుగు గం టలకు బండీవాణ్ని బండీ తోలుకుని రమ్మన్నారు. వారు మరియెక్క డికో వెళ్ళేటట్టున్నారు.

ధీని—అలాగయితే మనం యీరోజున వారిని బుట్టలోవెయ్య వలెను. అరుగో మానాన్నగారు వస్తూవున్నారు. మీరు యిద్దరూ లోపలికి పరుగెత్తండి. నేను యీతోటలోకి వెళుతాను.

[వసంతతిలకయు చంద్రికయు లోపలికి పోవుచున్నారు]

ధీని—వీలయితే ఆయనకు కనపడకుండా నేను యీ దారిని తోటలోకి వెళుతాను. (అని మెల్లగా గోడదరినుండి ప్రక్కకి పోఁబోవు చున్నాఁడు)

[అంతట కళావిదుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కళా—పోకు పోకు. వుండు. ఇదేనా చదువుకోవడం? నీవు గది లోకూర్చుని కావ్యాలు చదువుకుంటూ వున్నావనుకున్నాను. చదువు కోవడానికి బదులుగాతోటగుమ్మంవద్ద ముంగిలాగు పొంచుతూవున్నావా?

ధీని— చదువుకుంటూనే వున్నాను. వకచోట వక సుందరి యొక్క మంచిసౌందర్యవర్ణన కనపడితే దాన్నిచూచి ఆశ్చర్యపడుతూ వున్నాను.

కళా— అదియేదీ చూతాము చెప్పు.

ధీని — మీరు అధాత్తుగా రావడంతోటే పోయింది. కాస్త సేపు నేను ఆలోచించుకుంటూవుంటే మళ్ళీరావచ్చును.

కళా — నీవు చెప్పేది వట్టి అసందర్భంగా వున్నది. నేను చిన్నప్పుడు నీలాగే చదువుకునేవాణ్ననుకున్నావా యేమిటి? ప్రొద్దున్న లేస్తే రాత్రి పదిఘంట లయిందాకా వక్కమోస్తరున చదివేవాణ్ని. నేను సంస్కృతం మాత్రం చదవలేదు. నిన్ను సంస్కృతంలో కూడా పండితుణ్ని చెయ్యడానికి నిశ్చయించుకున్నాను.

ధీని — మీరు అంతసేపూ చదివినదానిఫలం యేమిటో నాకు కొంచెం చెపుతారా?

కళా — వోపికపెట్టు దానిఫలం నీకు వేగిరమే తెలుస్తుంది. బహుశా యివాళే తెలియవచ్చును. ఆడుకో. ఆడుకో. ఇంకా యెంత సేపు ఆడుకుంటావు? ఇప్పుడు నీమనసువచ్చినచోటికి వెళ్ళవచ్చును.

ధీని — (తనలో) ఇవేళ యేదో వున్నది. ఇప్పుడు నేను వసంత తిలకవద్దకు వెళుతాను. (అని లోపలికి వెళ్ళుచున్నాడు)

కళా — వీడన్నట్లు నాకు విద్యరానిలోపం బాగా కనపడుతూ వున్నది. వీణ్నయినా విద్యలో ఘట్టివాణ్ని చెయ్యవలెను.

(అని నడుచుచున్నాడు)

[అప్పుడు విద్యానాథుడు ప్రవేశించుచున్నాడు.]

విద్యా — చంద్రికా! యెక్కడ వున్నావు? — ఓహోహో! కళావిదుడుగారు యిక్కడనే వున్నారా? మీరు యీదినం బహు సంతోషంగా వున్నట్టున్నారు.

కళా — విద్యానాథుడుగారా? రండి. ఇవేళ అప్పుడే బడి వదలిపెట్టి వచ్చినారేమి?

విద్యా — యీరాత్రి వూళ్ళోవుత్సవమని యిప్పుడే ఆటవిడుపు

యిచ్చినాను. మొన్నటిదినం మనం మాట్లాడినసంగతి యేమి ఆలోచించినారు?

కళా—మీారు చెప్పినట్లే చెయ్యడానికి నిశ్చయించినాను.

విద్యా—మంచిపని చేసినారు. చిన్నవాళ్ళకు మంచిశిక్ష వుండవలెను. బాగా శిక్షిస్తేనేకాని పిల్లలు యెప్పుడూ లొంగరు. నాబళ్ళో చదువుకునే పిల్లవాళ్ళను నేను వకొక్కణ్ని రోజుకు డజను దెబ్బలయినా కొట్టకుండా విడిచిపెట్టను. అందుచేత వాళ్లకు యెంత విధేయత? యెంత భయము? యెంత సద్వర్తన? నా శిక్షలో వుంచడానికి మీాకుమారుడు యిప్పుడు పెద్దవాడై పోయినాడేమో? యిప్పుడు స్కూళ్లలో చదువుకునేవాళ్లకు బొత్తిగా వినయ విధేయతలూ, పిన్నపెద్ద తారతమ్యాలు యేమీాలేవు.

కళా—మీారు చెప్పినమాట సత్యము.

విద్యా—అలాగయితే మీాఅబ్బాయికి సదా యింట్లో వుండి వినయవిధేయతలు నేర్పేగురువు వుండవలెను.

కళా—అటువంటివాడే వుండవలెను.

విద్యా—బాగా ఆలోచించినారు. (తనలో) నేనయితే యిల్లు విడువకుండావుండి రెండుపూటలూ భోజనం చేస్తూ వుందును.

కళా—తెలివయినవాడు తక్కువజీతానికి రాడు. మాయింట్లో భోజనంపెట్టి ఆరునెలలవరకూ నెలకు యాభయ్యేసిరూపాయల చొప్పున జీతం యివ్వడానికి నిశ్చయించినాను.

విద్యా—(తనలో) నేనే యీాపనికి తప్పకుండా తగినవాణ్ని. (బిగ్గరగా) నెలకు యాభయి రూపాయలా? జీతం బాగానే వున్నది.

కళా—నేను యేర్పరచిన ఆయన బహుసమర్థుడు. ఆయన యీారోజున యిక్కడకు వస్తాడు.

విద్యా—(సంతోషముతో) ఆయన యిఖను వస్తాడా? యిది వఱకే యిక్కడికివచ్చి వుండ లేదా?

కళా—యిదివరకే వచ్చివున్నాఁడా? (అని తొందరపడి చూచు చున్నాఁడు)

విద్యా — మీరు చూడలేదా? (అని తాను ముందుకు వచ్చి నిలుచున్నాఁడు)

కళా.—మంచివుపాధ్యాయుడినిమిత్తమయి మీరు యెప్పుడు నాతో చెప్పినారో అప్పుడే పని చేసినాను. మాఅబ్బాయివిషయంలో యీవుపకారమంతా మీరు చేసిందే. మీమేలు నేను యెప్పుడూ మరిచిపోను. లోపలికి వెళ్లవలెను. సెలవు పుచ్చుకుంటాను.(అని వెళ్ళు చున్నాఁడు)

విద్యా—అయ్యో! వక్కమాట. అప్పుడే వెళ్ళిపోయినాడు. సమయం వచ్చినప్పుడు పని నాకు యివ్వకుండా మరివకడికి వేసిన తరు వాత నామేలు మరచిపోయినా మరిచిపోకపోయినా వకటే. యిప్పుడు నన్ను మరచిపోయినారుగద.

[లోపలినుండి వచ్చి చంద్రిక ప్రవేశించుచున్నది.]

చంద్రి—అయ్యో! యేమిటి ఆలోచిస్తూవున్నారు.

విద్యా—యింట్లోనే బస.

చంద్రి—యేమిటి?

విద్యా—రెండుమాట్లు పంక్తిని భోజనము. పయిగా నెలకు యాభయి రూపాయలు.

చంద్రి—యేమిటి?

విద్యా—ఇవన్నీ పోయినవి. మాబళ్ళోపిల్లలు యిచ్చే జీతా లన్నీ పోగుచేసినా నెలకు నాలుగయిదు రూపాయలకంటె యెక్కువ

రావు. యిప్పుడు వెళ్ళి నాబళ్ళో పిల్లలినందరినీ బాది వదలిపెడుతాను. ఇంతమందిపిల్లలు యెందుకు? ధీనిధివంటివాడువక్కడువుంటేచాలును.

చంద్రి—ధీనిధా?

విద్యా— ధీనిధి కాకపోతే ధీనిధితండ్రి. యెవరో వకరు ఈము సలాయన తగినవాణ్ని నేను యిక్కడవుండగా నామాట మరిచిపోయి తనకొడుక్కు గురువుగా వుండడానికి యెవడోబుద్ధిహీనుడుకోసం చెన్న పట్నం వ్రాసినాడట. ఆవచ్చేవాడు యెవడోవేదజడు డయినశుద్ధశ్రోత్రి యుడయి వుంటాడు.

చంద్రి— అయ్యో! పాపం ప్రాణస్నేహితుడవు నీమాటేమరచి పోయినాడా?

విద్యా— అయితే పెరటిచెట్టు యెప్పుడూ మందుకు రాదు. దూరపుకొండలు నునుపు. మనం అందరమూచేరి యిందులో వకవుపా యం చెయ్యవలెను. చంద్రికా! నీకు నేను పనివేయించినందుకు నీవు నాకు సహాయం చెయ్యవలెను. అవచ్చే వుపాధ్యాయుడిమీద మనం అందరమూ అబద్ధాలు కల్పించి చెప్పి యీయింట్లో నిలువలేకుండా మూడుదినాలలో తోక తెంచుకుని పారిపొయ్యేటట్టు చెయ్యవలెను. మీనవుకర్లందరూ చేరి అతణ్ని నిత్యము యేడిపించవలెను. నేను వెళు తాను. అతడు రావడంతోటే నాకు కబురు చెప్పు. (అని వెళ్ళుచు న్నాడు)

చంద్రి—ధీనిధివిషయంలో చేసినకుట్రాలోచనంతా యిదా? నేను యిప్పుడేపోయి యీసంగతి ఆయనతో చెపుతాను. యెవరో మాట్లాడుతూ వస్తూ వున్నారు. (అని చూచుచున్నది.)

[మహామహోపాధ్యాయతర్కపంచాననుఁడనని భీముఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భీము—మీవుత్తరంప్రకారంగా నేను యిప్పుడే వచ్చినాను.

నాతో పెట్టెలూ సామానూ యేమీ తీసుకొని రాలేదు. యీచిన్న మూటమాత్రం వక్కటి తెచ్చినాను. నేను ప్రయాణం చేసేటప్పుడు యెప్పుడూ సామానంతా యింటికాడనే దిగవిడచి వస్తాను. నేను వచ్చినసంగతి కళావిదుఃసుగారితో చెప్పడానికి యిక్కడ యెవరూ లేరా?

చంద్రి—(ముందుకు వచ్చి) మీరు యెవరు?

భీము—(చంద్రికవంక తిన్నగాచూడక) ఓచిన్నదానా! నీవు పరుగెత్తుకునిపోయి యీవేళ వస్తారని యెదురుచూస్తూవున్న పండితుడు గుర్రపుబండియెక్కివచ్చి యిప్పుడే మీగుమ్మమువద్ద దిగినాడని కళావిదుడిగారితో చెప్పు. వేగిరం వెళ్లు.

చంద్రి—ఆయనే యీయన కాబోలును. అక్కడక్కడ మనిషిని పోలినమనిషి వుంటూవుంటాడు. (అని వెనుక తిరిగి చూచుచు మెల్లగా వెళ్లుచున్నది.)

భీము—ఈమనిషి నాకేసి యెలా తేరి పార చూస్తూ వున్నదో. ఇది నన్ను దెయ్యమనుకున్నదో భూతమనుకున్నదో! ఇక్కడ నన్ను యెవరయినా ఆనవాలు పడుతారేమో! నేను మావుపాధ్యాయులు గారివేషం బాగా వేసినాను. ఆయన యిక్కడ యీయనకొడుక్కి వుపాధ్యాయులుగా వస్తానని వప్పుకున్నప్పటికీ యీమధ్య జ్వరం రావడంచేత రాలేనని వుత్తరంవ్రాసి టపాలో వెయ్యమని నాచేతికి యిచ్చినారు. ఆ వుత్తరం నేను టపాలో వెయ్యకుండా యీచొక్కా జేబులో వేసుకున్నాను. దుమ్ము దులిపించి తెస్తానని ఆయన పాత శాలూ పుచ్చుకుని చాకలిదానియింటికి వెళ్లి ఆయనబట్టలు పుచ్చుకుని యీవేషం వేసినాను. నేను అద్దంలో చూచుకుంటే అచ్చంగా సంస్కృతశాస్త్రుల్లగారులాగే వున్నాను. నేను సరిగ్గ మహామహో

పాధ్యాయతర్కపంచాననులవారిలాగున వుండడానికి సందేహం లేదు. భోజనంకాకుండా నెలకు యాభయిరూపాయలు వస్తవి. వక్కనెల వచ్చినా వచ్చినవే. యెందుకు పోగొట్టుకోవలెను? మావాళ్లను చూచి రావడానికి నేను మాశాస్తుర్లగారివద్ద నెల్లాళ్లు సెలవు పుచ్చుకున్నాను. యిక చదువుమాట విచారించవలెను. మాశాస్తుర్లగారు పండితులతో ప్రసంగాలు చేస్తూవుంటే చాలకాలంనుంచి వింటూ వుండడంచేత నాలుగు సంస్కృతంముక్కలు పట్టుకున్నాను. అవి కొన్నాళ్లుచాలును. ఆచిన్నవాడికి నాస్వభాష బాగా నేర్పుతాను. అదుగో ఆయన వస్తూ వున్నారు.

[అప్పుడు లోపలనుండి కళావిదుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కళా—(ముందుకు వచ్చి నమస్కారముచేసి) స్వామీ! మీదర్శనం కావడం నేను సుదినం, మాగృహం పావనమయింది. మహా మహోపాధ్యాయతర్కపంచాననులవారంటే లోకప్రసిద్ధిగా వున్నది. అటువంటిలోకైకపండితులు నాకుమారుడికి గురువులు కావడంకంటె యెక్కువ అదృష్టం యేమివుంటుంది?

భీము—మీరు వూరికే నన్ను ముఖస్తుతి చేస్తూ వున్నారు. తమవంటిసుజనుల్ని చూడడంచేత నాకు బహుసంతోషంగా వున్నది.

కళా—మీరు మహావినయసంపన్నులు. మిమ్మల్ని మీయెదుట స్తుతిచెయ్యడం మీకు యిష్టంలేదు.

భీము—యెంతమాత్రమూయిష్టంలేదు. మీరునిజంకనిపెట్టినారు

కళా—నేను చదువుకున్నవాణ్ని కాకపోయినా నాకు విద్య అంటే మహాఅభిలాష.

భీము—మీవిద్యాసక్తిఅంతా నావంటిపండితుల్ని పిలిపించడంలోనే తెలుస్తూవున్నది. నాచిన్నశిష్యుడు యెక్కడవున్నాడు? నాకు

తెలిసినదంతా ఆ బాలుడికి మర్మం విడిచి చెపుతాను. నేను చెప్పినట్టు విని నేర్చుకుంటే నేర్చుకోవడానికి యెంతో కాలం పట్టదు.

కళా—మీరు అతణ్ని పసిపిల్లవా డనుకుంటూ వున్నారు. అంతపసివాడు కాడు. అతనికి యిరువయివొక్క——

భీము—యిరువయివకటా? (తనలో) యిరువయివక్కమాసం కాబోలును.

కళా—అతను యిదివరకే కొంతచదువుకున్నాడు.

భీము—అలాగా? నేను అతడు పసిపిల్లవాడనుకున్నాను.

కళా—కాదుకాదు. అతను యీయేడే యింగ్లీషులో బి యే పరీక్ష ప్యాసుఅయినాడు. సంస్కృతంకూడా చాలావచ్చును.

భీము—అలాగైతే నేను అతగాడివిషయమై విశేషప్రయాస పడవలసినపని లేదు.

కళా—అతనికి కొంచెము వ్యాకరణమూ, తర్కమూ, అలంకారశాస్త్రమూకూడా తెలుసును.

భీము—అంతా యిదివరకే తెలిస్తే నేను యిప్పుడు క్రొత్తగా చెప్పేది యేమున్నది?

కళా—మీరు అతనికి శాస్త్రాలలో మెరుగులు చెప్పవలెను. ముఖ్యగా సత్ప్రవర్తన నేర్పవలెను.

భీము—ఓహోహో! మెరుగులా? యిప్పుడు బోధపడ్డది. అవి వక్కనిముషంలో నేర్పుతాను. (తనలో) చెప్పులజోళ్లకు మెరుగు పెట్టడమూ, వెండి బంగారపు వస్తువులకు మెరుగు పెట్టడమూ, అద్దాలకు మెరుగు పెట్టడమూ, అన్నీ నేర్పుతాను.

కళా—అతనికి వినయవిధేయతలూ మర్యాదలూ అన్నీ నేర్పవలెను. ఇంగ్లీషు చదువుకోవడంచేత వచ్చిన అవిధేయత ముఖ్యంగా

పోగొట్టవలెను. తమకు విశద మయిందా?

భీము—అంతా తెలిసింది. ఇఖ మీరు నాకు వేరే చెప్పనక్కర లేదు. నేను అతనికి నవుకర్లతో కలిసి మెలసి వుండకుండా వుండడమూ వాళ్ళమీద కోపపడకుండా వుండడమ్మూ వాళ్ళకు లేనిపోనిపనులు చెప్ప కుండా వుండడమూ, మొదలయినగృహనీతులుకూడా బోధ చేస్తాను.

కళా—అవీ చెప్పవలసినవేకాని, అవి అంత ముఖ్యమయినవి కావు.

భీము—కావు. ఆసంగతి నాకూ తెలుసును.అయినాకానీ చిన్న వని వాటినీ అలక్ష్యం చేయరాదు. నేను చెప్పవలసినవి లక్ష వున్నవి. అందులో మిక్కిలి స్వల్పమయినవి ముందుగా చెప్పినాను. నాచెప్పే మోస్తరంతా మీరే చిత్తగిస్తారు.

కళా—సమస్తమూ తెలిసినమీతో నేను మనవిచెయ్యవలసి నది యేమీలేదు. అయినాకానీ వక్కమాట మీచెవిని వెయ్యవలసి వున్నది. అతనికి నామేనకోడలయిన వసంతతిలకమీద మోహం విస్తా రంగా వున్నది. దాన్ని యితని కిచ్చి వివాహం చెయ్యవలెననే, ఆచిన్న దాన్ని నేను చిన్నప్పటినుంచీ తెచ్చి యింట్లో వుంచుకుని విద్యాబుద్ధులు చెప్పిస్తూ వున్నాను. అది యిప్పుడు యౌవనవతియై వున్నది. వాళ్ళ యిద్దరికీ వివాహం చెయ్యతలచుకున్నాను. కాని యిప్పుడే కాదు. నా భావం తమరు గ్రహించినారా?

భీము—గ్రహించినాను. మెరుగులన్నీ గ్రహించినదాకా పెళ్లి చెయ్యదలచుకోలేదు.

కళా—(తనలో) తుదకు మంచివుపాధ్యాయుడు దొరికినాడు. (బిగ్గరగా) తమపడకకూ సామానులకూ గదులు చూపిస్తాను. ఈవూ ళ్ళో మీతో ప్రసంగానికి విద్యానాధుడని వకవుపాధ్యాయుడువున్నాడు.

ఆయన పాండిత్యానికి మీతో సమానుఁడు కాకపోయినా, చిన్న తనంలో చాలా సంస్కృతం చదువుకొన్నవాడే. ఆయనను పిలిపించి మీదర్శనం చేయిస్తాను. (అని లోపలికి వెళ్ళుచున్నాఁడు)

భీము—(తనలో)యీయింట్లో నేను యెలాగునెగ్గుకు వస్తానో!

కళా—ఎవఁడురా నవుకర్లు?

భీము—అయ్యో! వచ్చెవచ్చె (అని పరుగెత్తుచున్నాఁడు)

కళా—(ఆశ్చర్యముతో) ఇదేమిటి?

భీము—నాతాత్పర్యం మీనవుకరువచ్చెనని, (తనలో)అయ్యో! అప్పుడే తంటాలు నస్తూవున్నవి. ఇఖ జాగ్రతగా వుంటాను.

[తాళముచెవులు తీసికొని చంద్రిక ప్రవేశించుచున్నది]

కళా— చంద్రీ! నీవు వెళ్ళి యీయన కాగది చూపించు. అయ్యో! నేను యిప్పుడే మీశిష్యుణ్ని పంపుతాను.

(అని వెళ్ళుచున్నాఁడు)

చంద్రి—ఇత డత డయినందుకు యెంతమాత్రమూ సందేహం లేదు. (ఇద్దరును గదిలోనికి వెళ్ళుచున్నారు)

౨ రంగము —చదువుకొను గది.

[మహామహోపాధ్యాయతర్కపంచాననుని వెంటఁ బెట్టుకొని చంద్రిక ప్రవేశించుచున్నది]

చంద్రి—ఇది మార్గము.ఇలారండి. ఆయన లోపల వున్నారు.

భీము—(తనలో) ఈ విద్యానాధుఁడు నన్ను వూరికే బాధపెడుతూవున్నాఁడు. అయినాకానీ నావిద్యార్థితండ్రి ముసలాయన వెర్రిబాగులవాఁడులాగు కనపడుతూ వున్నాఁడు. కాబట్టి నేను వీరియింట్లో సుఖంగా తింటూ జీతంపుచ్చుకుని పనిలేకుండా వూరికేకూర్చోవచ్చును.

చంద్రి—ఇఖ నేను మనసుపట్టలేకుండావున్నాను— ఓయీ! భీమా!

భీము—ఆపిలిచింది యెవరు? అయ్యో! నాకిప్పుడు మతి పోతూ వున్నది.

చంద్రి—అవును అతడే.

భీము— (చంద్రికవంక చూచుచు తనలో) ఓహోహో! నే నప్పుడు పెళ్లి చేసుకుంటానన్న చిన్నది యిక్కడికి వచ్చింది! నేను నేను కానని దీనిదగ్గిర ప్రమాణాలు చేస్తాను. (బిగ్గరగా) అమ్మా!నీవు చాలా శ్రమపడి నన్ను యిక్కడకు తీసుకుని వచ్చినావు.

చంద్రి— దున్నపోతా! నన్ను యెరగనట్టు నటిస్తావేమి?

భీము—(తనలో) ఇ దెక్కడిగ్రహచారం! నేను యీ భూమి మీద అసలే పుట్టకపోతే బాగావుండిపోను. ఎరక్కపోయి పుట్టినాను. (బిగ్గరగా) నీతోడు! నిన్ను! నేను నిజంగానే యెరగను. (తనలో) దీని ముఖం యెలా వెల వెల పోతూ వున్నదో!

చంద్రి—(ఏడ్చుచు) నీ మాటలవల్ల నాకడుపు పగిలి పోతూ వున్నది.

భీము—(తనలో) ఇది యేడవడానికి మొదలు పెట్టింది. ఇఖ వూరుకునేటట్టు లేదు. (పయికి) ప్రియురాలా! కాదుకాదు. అమ్మా! నీవు నీవే కాని, నేను అతణ్ని కాను. నీవు నన్ను చూచి నిన్ను మోసం చేసిననిర్భాగ్యు డనిభ్రమపడుతూ వున్నావు. (తనలో) అయ్యో! నాకు చావు వ్రాసింది. మగవాళ్లనాశనానికి యెక్కడా ఆడవాళ్ళు కారణం.

చంద్రి—(ఏడ్చుచు) నేను నీదుర్మార్గం అంతా బయిట పెడు తాను వుండు.

భీము—అలాచేస్తే మనం యిద్దరమూకూడా చెడిపోతాము.

నీముందులాభం చూచుకో. నేను నీప్రియుణ్ని భీముణ్నిసుమా. ఇప్పుడుమాత్రం మహామహోపాధ్యాయుణ్నయి వున్నాను.

చంద్రి—ఎవడవైనా నన్ను వదలిపెట్టకూడదు.(అని యేడ్చుచున్నది)

భీము—కళ్ళ నీళ్ళు తుడుచుకో! నేను యెప్పుడూ నీదాసుణ్నే. (అని కాళ్ళమీద పడుచున్నాఁడు)

[ఇంతలో కళావిదుఁడు ప్రవేశించుచున్నాఁడు]

భీము—ఓయి దేవుడా! ఇఖ నాకు బ్రతికేయోగం లేదు.

చంద్రి— అయ్యో! (అని తాళము చెవులాతనిముందు పడవేసి లోపలికి పరుగెత్తుచున్నది)

కళా — (వులికిపడి వెనుకకు రెండడుగులు నడచి) ఏమి యీవింత! ఇప్పుడు నాకళ్ళపడ్డది యేమయి వుంటుంది?

భీము— అయ్యా! ప్రమాణపూర్వకంగా చెపుతాను. నేను కాళ్లమీద.---కాదు — నేను మోకారించుకుని కూర్చున్నానని మీరు భ్రమపడ్డట్టున్నారు. అది వట్టిభ్రమేకాని యెంతమాత్రమూ సత్యం కాదు. నేను కాస్తయినా మోకారించుకొని కూర్చోలేదు.

కళా—ఓ పండితసార్వభౌమా! మీరింకా ఆలాగే కూర్చున్నారే.

భీము—(తాళము చెవులు చేత పట్టుకొని) ఇది మోకారించుకొని కూర్చోవడం లాగు పయికి కనపడుతుందికాని నిజంగా మోకారించుకోవడం కాదు. (లేచి) ఆచిన్నది యిక్కడ తాళంచెవులు పారవేసి పోయింది. నేను భరతశాస్త్రప్రకారంగా వాటిని తీసుకుంటూ వున్నాను. అంతేకాని మరియేమీ కాదు.

కళా—కాదుకాదు. మహామహోపాధ్యాయులవారు శృంగార

నాయకులుగా కనపడుతూ వున్నారు. పండితు లెప్పడూ మహారశికులు గదా.

భీమ:—అదికాదు. ఇది కేవలనమ్రత. వినయం పండితలక్షణము.

కళా—ఇది యేదో అపూర్వపండితలక్షణం కాని సామాన్య మయిందికాదు.

భీము—(గంభీరముగా) యిప్పుడు నాకంటె మీరే గొప్పపండితులయినట్లు నటిస్తూవున్నారు. నాకంటెనూ మీకు యెక్కువ తెలుసునని గర్వం వున్నదా యేమిటి?

కళా—నాకు అటువంటి గర్వం లేదు.

భీము—ఇప్పుడు నాకు సంతోషంగా వున్నది. నాకంటే మీకే యెక్కువ పాండిత్యం వున్నట్టు లోపల మీకు వూహ వున్నట్టయితే మీరు యిచ్చే యాభయిరూపాయలూ నేనే మీకు యిచ్చి మీచేత నాపిల్లలకు నేనే చదువు చెప్పించవలసి వుంటుంది.

కళా—మీరు చెప్పింది సత్యం. ఇక ఆసంగతి పోనియ్యండి. మాఅబ్బాయిని మీకు వప్పగింత పెట్టడానికి వచ్చినాను. అరుగో మా ధీనిధిన్నీ విద్యానాధుడుగారున్ను వస్తూ వున్నారు.

[విద్యానాధుడును, ధీనిధియు ప్రవేశించుచున్నారు]

భీము—వారు రావడం నాకు సంతోషంగా వున్నది.

కళా—ఓ విద్యానాధా! మహామహోపాధ్యాయులవారువీరే.

భీము—(విద్యానాధునితో) మీదర్శనం లభించడంవల్ల నేడు సుదినం.

విద్యా—అది నేనడవలసినమాట. (అని అసూయతో మొగము త్రిప్పుకొనుచున్నాడు)

కళా—స్వామీ! వీడే నాకుమారుడు.

భీము—ఇతను బహుమంచిచిన్నవాడు.

ధీని—(తనలో) అవును. చంద్రిక చెప్పినది నిజమే.

విద్యా—(తనలో) ఇప్పు డేలాగైనా యీపండితుడిగర్వం అణచవలెను. (భీమునివద్దకు వెళ్ళి) అయ్యా! మీరు వుపదేశించే విద్య యొక్క పధకం నాకు కొంచెం సెలవిస్తారా?

భీము—కొంచెం యేమిటి? అంతా సెలవిస్తాను. మాది పాత పతకం.

కళా—అబ్బాయీ! విను. ఈపండితులప్రసంగం వింటే నీకు చాలాసంగతులు బోధపడతవి.

విద్యా—మీది పాతపతకమా? అందులో మీరు నవద్వీపంలో చెప్పేపద్ధతిప్రకారం బోధ చేస్తా రనుకుంటాను.

భీము—(తనలో) నవద్వీపం యేమిటో నాకు తెలియకుండా వున్నది. అది యేదో లంక. (బిగ్గరగా) నాది నవద్వీపంలో చెప్పే పద్ధతీ కాదు దశద్వీపంలో చెప్పే పద్ధతీ కాదు. నాది లక్షద్వీపంలో చెప్పే పద్ధతి. తెలిసిందా ?

విద్యా—(తనలో) ఇతనిమాటలు నాకు తిన్నగా బోధ పడడం లేదు. యితణ్ని మరివకప్రశ్న అడిగి చూస్తాను. (బిగ్గరగా) మీరు చెప్పింది తెలిసింది. మీది కాశీలో చెప్పేపద్ధతిప్రకారంగా వుంటుంది కాదా ?

భీము—కాశీలోనా ? నేను యెప్పుడూ కాశీ వెళ్లలేదు. నాకది తెలియదు. నేను చాలాకాలం కంచిదగ్గర వున్నాను. కంచిలో చెప్పే పద్ధతి నాకు బాగా తెలుసును.

విద్యా—(తనలో) యితడు చూస్తే వట్టిమూఢుడులాగు కన పడుతూ వున్నాడు. ఇతణ్ని వోడగొట్టివేస్తాను. (బిగ్గరగా) మీకు

మీమాంసలో బాగా ప్రవేశం వున్నది కదా ?

భీము—మీమాంసం లేదు మామాంసం లేదు. ఏ దయినా మంచిప్రశ్న వెయ్యండి. పండితులతో చేసే ప్రసంగం యీలాగంటి దేనా? అడిగితే తర్కంలో అడగండి, వ్యాకరణంలో అడగండి; యింకా యేదయినా శాస్త్రంలో అడగండి. వూరూ పేరూ లేని మీమాంసం యేమి టయ్యా ? నేను యెప్పుడూ మాంసంజోలికి పోను. అది శూద్ర యిళ్లలో వుండేనవుకర్ల పనిగాని నాపని కాదు.

విద్యా—(తనలో) ఇతడుమహాశాస్త్రవేత్తలాగునవేవున్నాడు. (బిగ్గరగా) ఏమిటీ యిప్పుడు సెల విచ్చినారు ? మీమాంస శాస్త్రం కాదా ?

భీము—చాలును యీపాటివూరుకోండి. నేను మీతో యెంత మాత్రమూ యేకీభవించను. మీపాండిత్యం వేరు. మాపాండిత్యం వేరు. వకరిది వకరికి సరిపడదు.

విద్యా—అవును సరిపడదు.

భీము—ఎలా సరిపడుతుంది ? పండితుడికి పండితుడికి కలు స్తుంది కాని మిడిమిడిజ్ఞానంగలవాడితో యెలా కలుస్తుంది ?

విద్యా—మీశక్తి నాకు తెలిసిపోయింది. మిమ్మలిని నేను నిముషంలో వోడగొట్టగలను.

భీము—నీవు యెప్పుడో వోడగొట్టగలనంటూ వున్నావుగాని నేను నిన్ను యిప్పుడే వోడగొడుతాను చూడు. ఇదుగో కాసుకో నాదెబ్బ. (అని పిడికిలి పట్టి చేయెత్తి విద్యానాథునిమీదికి లేచు చున్నాడు.)

కళా—(లేచి విద్యానాథు నావలికి త్రోచి) మీరు యిప్పుడు వెళ్లండి.

విద్యా.—(కోపముతో తలయూచుచు) చిత్తము.

(అని పోవుచున్నాఁడు)

భీము—(బిగ్గరగా నఱచుచు) ఫో-ఫో-నీవూ నీమాంసంకూడా విరగడయిపోండి.—ఈచదువులపంతులు వట్టి తెలివిమాలినవాఁడని మీకందరికీ నిముషంలో తెలిసేటట్లు చేసినానా? అతఁడు తిన్నగా వాదం చెయ్యలేక తనచేతకానితనం కప్పిపుచ్చడానికి కోపం తెచ్చుకున్నాఁడు. లోపల సారంలేని అల్పజ్ఞానులు చేసే మాయోపాయాలు యిలాగంటివే.

కళా — మీరు చెప్పింది సత్యము.అతణ్ని ఓడగొట్టగల సామర్థ్యం మీదగ్గిర వున్న దని నాకు యిదివరకే తెలుసును. అయినా కానీ యిప్పు డాయనశాంత మంతా పోయింది. నేను వెళ్ళి ఆయనను సముదాయించివస్తాను. ఈలోపుగా మీరూ మీశిష్యుడూవకరిసంగతి వకరు మాట్లాడుకుంటూవుండండి. (అని వెళ్లుచున్నాఁడు.)

ధీని — శిష్యుడికి గురువుగారి సంగతి యిదివరకే బాగా తెలుసును.

భీము—ఈరోజున పరాభవం యేమీ లేకుండా నాకు జయం కలిగింది. దేవుఁడు నాకు గొప్పగొంతుక యిచ్చినాఁడు.

ధీని.—ఏదీ సత్తువకొద్దీ వక్కమాటు అరువు. ఎంత గొంతుక యిచ్చినాడో చూతాము.

భీము—అరవనా? అబ్బాయీ! నీవు నమ్రతా పెద్దలయెడల గౌరవమూ నేర్చుకోవలెను. గురువులవిషయంలో అలా యేకవచన ప్రయోగం చెయ్యవచ్చునా?

ధీని—నీగురుత్వం యేడిసినట్టే వున్నది వూరుకో. నీసంగతంతా నాకు చంద్రిక చెప్పింది.

భీము—అటువంటిదానిమాటలు వింటే అది యింకా యేమ యినా చెపుతుంది.

ధీని—చాలునులే యీపాటి నోరు మూసుకో. నీవు భీము డవన్న సంగతి నేను స్వయంగానే యెరుగుదును. నిరుడు సంకురాత్రి నాడు చెన్నపట్నంలో మేమంతా నాయుడుగారిమేడమీద సంగీతం పాడించినప్పుడు నీ వక్కడ ఫిడేలు వాయించలేదా?

భీము—ఓస్సీ! ఇక్కడ నన్ను అందరూ యెరుగుదురూ! మీరు యిప్పుడు నన్నుకనుక్కున్నారుగనుక నేనుయిఖ కపటంవిడిచి నిజంచెపు తాను వినండి. నేను భీమున్నే.

ధీని—నీవు యెంతమాత్రమూ భయం లేకుండా యీవేషం వెయ్యడానికి యేలాగు సాహసించినావు?

భీము—ఇది యేమివేషం? పూర్వం నేను సాహసంచేసి తహ శ్శీలుదారువేషం వేసి సర్కారుగ్రామాలలోనే దస్తు వసూలు చేసి నాను. అటువంటివేషం కూడా పట్టుపడకుండా తప్పించుకొని పారి పోయినాను.

ధీని — నీవు అఖండశక్తి గలవాడవు. మీరహస్యం వకటి వున్నది. అది నీవు దాచేపక్షమునకు నీగుట్టు బయలపెట్టకుండా నేను దాస్తాను.

భీము—అలాగయితే మీరహస్యమూ ప్రతినెలా నాయాభ య్యేసిరూపాయలూ కూడా దాస్తాను.

ధీని—మంచిది. రూపాయలు నీమనసు వచ్చినట్టు చేసుకో. భీమా! యిప్పుడు మనలో వకరిసంగతి వకరికి బాగా తెలిసింది. ఇఖ నేను చెప్పేమాట విను. ఈసాయంకాలము మాతండ్రిగారు యిక్క డకు క్రోసుదూరంలో వున్నమామాతోట చూడడానికి వెళుతారు.ఆయన

మళ్ళీ రాత్రిపొద్దుపోయినదాకా యింటికి రారు. ఆయన వెళ్ళినతరు వాత మేము సాయంకాలము వుత్సవం చూడడానికి వెళుతాము. వక వేళ మాతండ్రిగారికి తెలిసి నిన్ను అడిగినట్టయితే మేము యిల్లుకదలి యెక్కడకూ వెళ్లలే దని నీవు ప్రమాణము చేసి చెప్పవలెను. అందు నిమిత్తమయి కొన్నియేర్పాటులు చేసిరావడానికి యీలోపుగా వక్క మాటు వీధిలోకి వెళ్లవలసి వున్నది. నీవు యింతలో యీబట్టలు పింజెలు పెట్టి నేను లోపలినుంచి వచ్చేటప్పటికి తమలపాకులు చుట్టి సిద్ధంగా వుంచు.

భీము—నావంటి మహానుభావాపాధ్యాయుడికి యిటువంటివి చెప్పవచ్చునా?

ధీని—నోరుమూసుకో. నీవు భీముడవుకాదా? (అని మీాఁద నడవేసి వెళ్ళుచున్నాఁడు)

భీము—అవును మరిచిపోయినాను. నెలకు యాభయి రూపా యలుపుచ్చుకునేటప్పుడు యేపని చ్చెపినా చెయ్యవలెను. (అని యేదో పాటపాడుచు బట్టలు పింజెలు పెట్టుచున్నాఁడు)

[కళావిదుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కళా—శాస్త్రిగారూ! నేను మా తోటలోకి వెళ్లకముందు మీాతో—(బట్టలు పింజెలు పెట్టుచుండుట చూచి) ఇ దేమిటి? మా అబ్బాయిబట్టలు పింజెలు పెడుతూవున్నారా?

· భీము—(తనలో)అయ్యో! నాకు చావు వచ్చింది. యిప్పుడు యేమని బొంకను? (బిగ్గరగా) అవును. ఈవిషయంలో మీారు మరివక లాగు అనుకోకండి. వక్కనిముషం వోపిక పెడితే మీాకంతా తెలుస్తుంది. మీాకుమారుడి విషయంలో నేను చేసేపన్నులలో యిదికూడా వకటి.

కళా—ఇదంతా చూస్తే నాకు వింతగా వున్నది. వక్కనిము

షం కిందట మీరు మాదాసీదానికాళ్ల మీద పడ్డారు; ఇప్పుడు మా వాడిబట్టలు సింజెలు పెడుతూ వున్నారు. మీసంగతి యేమీ నాకు బోధపడడం లేదు.

భీము—అయివుండవచ్చును. మీరు వక్కనిముషం శాంతం వహిస్తే నాతాత్పర్యం యేమిటో మీకే విశద మవుతుంది.

ధీని—(వెలుపలనుండి) నాబట్టలు యిలాగుతీసుకునిరా. వేగిరం తీసుకునిరా..

భీము—అదుగో! అదుగో! అతను నాకోసం కనిపెట్టుకుని వున్నాడు. ఈబట్టలు అతనికి యిచ్చి మళ్లీ వస్తాను.

కళా—కనిపెట్టుకుని వుండనియ్యండి. మీరు వెళ్ళకూడదు. వాడు గురువుగారియెడల గౌరవం నేర్చుకోవలెను.

భీము—(తనలో) అతను యిక్కడకువస్తే నాపరు వంతా పోతుంది. నాగుట్టు బయల పడుతుంది.

[ధీనిధి మహావేగముతో ప్రవేశించుచున్నాడు.]

ధీని—మొద్దులాగు యెంతసేపటికి నాబట్టలు తీసుకొనిరావేమి? నేను యిప్పుడు—(అప్పుడు తండ్రినిచూచి సిగ్గుపడి యూరకున్నాడు)

భీము—నీకుఅడ్డంయేమిటి? యిష్టంవుంటే వకదెబ్బకూడాకొట్టు (కళావిదునివంక దిరిగి) ఇదిగో యిప్పుడు చూడండి. మీకుమాకుడికి సత్ప్రవర్తన యెలాగు నేర్పుతానో. (ధీనిధితో రహస్యముగా) నేను మీబట్టలు పింజెలు పెట్టినందుకు క్షణంసేపు మారుమాటాడకుండా నేను చెప్పేనీతులు వినండి. నేను మీకు యిప్పుడు వినయం బోధిస్తాను. (బిగ్గరగా) ఇవిగో నీబట్టలు పుచ్చుకో. ఇలాగుపెద్దలవిషయంలో అప చారం చెయ్యడంవల్ల పెద్దలకు యేమీలోపంరాదుగాని చిన్నవాళ్లే దుర్నయం పట్టుపడి చెడిపోతారు. ఇలా నడుచుకోవడం నీకు యెంతమా

త్రిమూ శ్రేయస్కరం కాదు. దీన్నిబట్టి నీవుపెద్దలయెడల భక్తి,నమ్రత నేర్చుకోవలెను. తెలిసిందా?

ధీని—తెలిసింది.(అనిసిగ్గునటించుచుతలవంచుకొనుచున్నాడు.)

భీము—ఓకళావిదుడుగారూ! ఆచిన్నవాడివంక చూడండి. అతడు తలవంచుకొని యెలాపశ్చాత్తాపపడుతూ వున్నాడో? దీనితో బుద్ధి వచ్చింది. యితను యిక యెప్పుడూ పెద్దలయెడ అవిధేయతగా ప్రవర్తించడు.

కళా—ఇదంతా నాకు నిజంగానే అద్భుతంగా వున్నది.

భీము—(ధీనిధితో) నేనుయిప్పుడు బోధించిననీతి నీవుయెప్పుడూ మరిచిపోకూడదు. ఇదిశిలాక్షరంవలె నీమనస్సులో నాటుకొనివుంటుంది.

కళా—(తనలో) సందేహం లేదు. ఈయన గొప్పవాడే. (బిగ్గరగా) మీబోధ చేసేవిధం అద్భుతంగా వున్నది. ఈమోస్తరు నేనుయెక్కడాచూడలేదు. ఇప్పుడు నేను వచ్చినపని మీతోచెప్పడం మరిచిపోయినాను. నేను వక ముఖ్యమయిన సంగతి మీతో చెప్పుదామని వచ్చినాను. ఈసాయంకాలం వూళ్ళో వుత్సవం జరుగుతుంది. ఇతణ్ని యెంత మాత్రమున్నా మీరు వుత్సవంలోనికి వెళ్ళనియ్యకూడదు. నాబండిదాకా నాతో దయచెయ్యండి. ఈవిషయములో మీతో కొన్నిసంగతులు మనవిచెయ్యవలసివున్నవి.(అనిభీమునితోగూడవెళ్ళుచున్నాడు)

ధీని—ఆహాహాహా! ఈభీమిగాడు నాఅదృష్టంచేత నాగురువుగా దొరికినాడు. ఏమినాభాగ్యము!

[వసంతతిలక ప్రవేశించుచున్నది.]

వసం—మామగారు యిప్పుడే వెళుతూవున్నారు. యింకొక్క నిముషంలో యీయిల్లంతా మనస్వాధీనంఅవుతుంది. మనంస్వేచ్ఛగా వుండవచ్చును. మనం యివేళ వుత్సవంలోకి వెళ్ళడం వున్నదాలేదా?

ధ్వని—కొంతసేపు శాంతం వహించు. ఆయన కొంచెందూరం సాగడంతోటే మనమూనడుతాము. నీకోసం బండిమాట్లాడివచ్చినాను.

వసం.— కావలసినంతసేపు వహిస్తాను. నాకు మహాసంతోషంగా వున్నది. తనముసలిసరసుడు భీముడు మీకు గురువుగా వచ్చినాడని చంద్రిక యిప్పుడే నాతో చెప్పింది. (అని నవ్వుచున్నది.)

ధ్వని.— అవును (అనినవ్వుచున్నాడు.)

[చంద్రిక ప్రవేశించుచున్నది.]

చంద్రి—కళావిదుడుగారు తోటలోకి వెళ్ళిపోయినారు. ఆయన బండిలోయెక్కబోతూ వుండగా విద్యానాథుడిగారి బళ్ళోపిల్లవాడు వకడు వకవుత్తరం తీసుకునివచ్చి చేతికిచ్చినాడు. ఆవుత్తరం చూడగానే లోపల యేదోవిచారంగలిగి ముఖం చిన్నపోయింది. అయినాకానీ ఆయన ఆగకుండా వెళ్ళిపోయినాడు.

ధ్వని—ఆవుత్తరంయేమయివుంటుంది? యేమీ లేదు. ఆవుత్తరం జోలి మన కెందుకు?

చంద్రి—అంతేకాదు చెప్పవలసింది యింకా వున్నది. ఆయన వెళ్ళిపోయినతరువాత మీ మహామహోపాధ్యాయులుగారు నాదగ్గరకు వచ్చి నీతో కొన్ని రహస్యమైనసంగతులు చెప్పవలసివున్నవి. నీగది యెక్కడ నని నన్ను అడిగినారు.

వసం—నీవు నీగది అతనికి చూపించినావా?

చంద్రి—చూపించలేదు. అదుగోనని కిటికీమాత్రం చూపించి మీతో చెప్పడానికి పరుగెత్తుకుని వచ్చినాను.

ధ్వని—ఓ ప్రాణేశ్వరీ! దీనిమాటలుయేమివింటావె? అవతల వుత్సవంలో యీపాటి తమాషాలారంభమవ్రతవి. వెళ్ళిచూతాముర్రా.

(అందఱును వెళ్ళుచున్నారు.

౨. రంగము—బజారులోని కొట్టుముందరియరుగు.

[ధీనిధిమిత్రుడగు సుహృదుడును మతిముగ్గురుమనుష్యులును ప్రవేశించుచున్నారు.]

సుహృ—రథం యీవీధినుంచి వెళ్లేవేళ కావచ్చింది. ధీనిధి యింకా వచ్చినాడు కాడేమి?

మొదటివాడు—ఆతడు తండ్రితోతోటలోనికి వెళ్లినాడేమో!

సుహృ—వెళ్లివుండడు. అతను యిక్కడికి ఆడంగులతో కూడా వస్తానని యీవుదయాన్న నమ్మకంగా చెప్పి వెళ్లినాడు. స్త్రీలకోసం నేను యీకొట్టు ఖాలీ చేయించి వుంచినాను. మాస్త్రీలుకూడా వచ్చి వున్నారు.

రెండవవాడు—అడుగో బండీముందు ధీనిధి వస్తూవున్నాడు.

[ధీనిధియు, వసంతతిలకయు, చంద్రికయు ప్రవేశించుచున్నారు]

అందరు—ధీనిధిగారూ! దయచెయ్యండి. మేమందరమూ మీ రాకనిమిత్తమే యెదురు చూస్తూవున్నాము.

ధీని—మీరు నాకోసం కనిపెట్టుకుని వుంటారనే తొందరపడి సాధ్య మయినంతశీఘ్రంగా వచ్చినాను. యింకా సంగీతం ఆరంభించి నారు కారేమి?

సుహృ—ఫిడేలు వాయించేజోగడు యింకా వచ్చినాడు కాడు. ఫిడేలుమాత్రం పొద్దున్నే యిక్కడ పెట్టి పోయినాడు. వర్తమానం పంపుతే వాడు యింటికాడ కనపడలేదు.

ధీని—ఫిడేలువాయించేవాణ్ని మరియెవరినైనా చూడవలెను. వసంతతిలకా! మీరాగదిలోనికి వెళ్ళండి. యీదారిని వెళ్లేతమాషా లన్నీ మీకక్కడనుంచి కనపడతవి.

వసం—చంద్రీ! మనం లోపలికి వెళుదాముర. (అని వెళ్ళు చున్నారు.)

[అప్పుడు రోజుచు భీముడు ప్రవేశించుచున్నాడు]

భీము—అయ్యో! నేనుచచ్చిపోతాను? నావీపువిరిగిపోయింది.

ధీని—భీమా! అదేమిటి?

భీము—ధీనిధీ! నీవు యిక్కడనే వున్నావా? అదంతా నీతో నిమ్మళంగా చెపుతాను. మీతండ్రిగారు నిన్ను యిక్కడికి వెళ్ళవద్దని చెప్పినారుగదా యెందుకు వచ్చినావు?

ధీని—ఆ స్టే అధికప్రసంగం చెయ్యకి వూరుకో. ఈయన సంగీతం పాడుతాడు. ఇక్కడ ఫిడేలు వాయించేవారు యెవరూ లేకుండా వున్నారు. కాస్సేపు వాయిస్తావా?—ఓసుహృదా! ఇతనితో సమానంగా ఫిడేలు వాయించేవారు మనదేశంలో యెవరూ లేరుసుమా. ఆఫిడేలు యితని చేతికివ్వండి.

భీము — వద్దు వద్దు. అటువంటి నీచపు పని నాకు చెప్పడం మీకు ధర్మం కాదు. నేను మీగురువు నన్నమాట జ్ఞాపకం వున్నదా? గురువుకు మర్యాద చెయ్యవలెను.

ధీని—కావలసినంతమర్యాద చేస్తాను. నీకు మా అందరికంటెనూ వున్నతాసనం యిస్తాము. ఆగూట్లోకూర్చుని వాయించు. నా మాటకు యెదురుచెప్పినావంటే చావగొడుతాను.

భీము—సలుగిరిలోనూ నాగౌరవ మంతా పోతూ వున్నది. ఫిడేలుయిలాతెండి. (అని గూటిలోకూరుచుండివాయించుచున్నాడు)

సుహృ—“బుద్ధిరాదు బుద్ధిరాదు—పెద్దల సుద్దులు వినక—యోగములభ్యసించిన యాగములెన్నిచేసిన—” అని శంకరాభరణము రాగముమీద శాస్త్రీయ్యముగా పాడుచున్నాడు)

భీము—మేలు మేలు! (అని యుత్సాహముతో తల యెగరవైచుచు వాయించుచున్నాడు)

[ఆసమయములో కళావిదుడును, విద్యానాథుడును, ప్రవేశించుచున్నారు]

కళా—ఇక్కడధీనిధీన్ని మహామహోపాధ్యాయులుగారున్నా కూడా వున్నారా?

భీము—(చటుక్కున ఫిడేలు వెనకకుపెట్టుకొనుచు) ఇఖ నేను చెడిపోయినాను.

కళా—ఉపాధ్యాయులుగారూ? మీచర్యలు చూస్తే నాకు సహానం వుండకుండా వున్నది.

భీము—మీరుయిక్కడ నన్ను చూచినారుకాబోలును? ఇక్కడ నేను వున్నమాట నిజమే కావచ్చునుకాని యిందులో నాతప్పితం యేమీ లేదు. మీదగ్గిర శెలవుపుచ్చుకుని నేను వస్తూవుండగా యిక్కడ నాకు ధీనిధి కనపడ్డాడు. అతణ్ని యింటికి తీసుకుని వెళ్లడానికి నేను యిక్కడ వున్నాను. మీకిది స్పష్టంగా కనపడడం లేదా?

కళా—అదే నిజమైతే మీరు గూట్లో కూర్చుని తలతిప్పుతూ ఫిడేలు యెందుకువాయిస్తూ వున్నారు?

భీము—వాయించకపోతే వీళ్ళు కొట్టిపోతారని ఫిడేలు వాయిస్తూవున్నాను.ఇఖ గూట్లో కూర్చోవడానికి కారణం వినండి.ఇదివున్నత స్థానము. నావంటి మహామహోపాధ్యాయులకు అర్హమైనది.

కళా—ఇఖ నీమాటలు నేను యెంతమాత్రమూ నమ్మను.

విద్యా—ఇందాకా వీణ్ని చీపురుకట్టపుచ్చుకుని వీపు బద్దలయ్యేటట్టు కొట్టినాను. ఈసారికొడితే తల బద్దలకొడుతాను.

భీము—తలబద్దలు కొట్టడానికి నీ తాతతరంకాదు. నేనుయిక్కడ ఘరానా మనిషిలాగు నడుచుకుంటూ వున్నాను గాని చిల్లరమనిషి లాగు ప్రవర్తించడం లేదు.

కళా—మీవంటి ఘరానా మనుష్యులున్ను పండితులున్ను

నా మేనకోడలినన్ద వున్న దానీదానివంటిదాన్ని పెళ్లి చేసుకోవడానికి ప్రయత్నం చేస్తారా?

భీము—నావంటిపండితుల కటువంటి భేదాలు వుండవు. నా దృష్టికి గొప్పవాళ్లూ కొద్దివాళ్ళూ సమానమే. విద్యానాథా! చంద్రి కదగ్గిర యేమయినా డబ్బు వున్నదా?

విద్యా—అది నూరు రూపాయలు నాకు బదులిచ్చింది. అది నిన్ను పెళ్ళాడే టట్టయితే దాని నూరురూపాయలూ తక్షణం పార వేస్తాను.

భీము — ఆరూపాయిలు యివ్వండి. నేను చంద్రికను పెళ్లాడుతాను.

సుహ్మ్రా—(ముందుకువచ్చి) నీపెళ్ళిలో నన్ను సంగీతం పాడడానికి పిలుస్తావా?

భీము—రేపు ధీనిధికిన్ని వసంతతిలకకున్ను పెండ్లి అయ్యేటప్పుడు మా పెళ్ళికూడా వారిపెళ్ళితోనే అవుతుంది. అప్పుడు నీవువచ్చి సంగీతం పాడుదువుకానిలే.

కళా—వాళ్ళయిద్దరికీ రేపు పెళ్ళిఅవుతుందని నీతో యెవరు చెప్పినారు?

భీము—యెవరూ చెప్పలేదు. నేను వూరికే అనుకున్నాను.

కళా—నీవు శుద్ధదొంగవు.నీసంగతంతా నేను కనుక్కున్నాను. ఈవుత్తరంవల్ల నిజమయిన మహామహోపాధ్యాయ తర్క పంచాననులవారు రావడానికి వప్పుకోనట్టు కనపడుతూవున్నది. నీవు ఆయన పేరు పెట్టుకుని దొంగవేషం వేసుకుని వచ్చినావు. నీవు యెవరు?

ధీని—నామాట వినండి. నేను యితడ్ని బాగా యెరుగుదును. కాలకర్మదోషంచేత యితడు యిప్పుడు యీవేషం వేసుకుని వచ్చినా,

ఇతడు బహుమంచివాడున్ను కష్టపడి పనిచేసేవాడున్ను. చంద్రికకు యితను తగినవరుడు. చంద్రికను యితనికి వివాహంచేయించి యితణ్ని మనయింట్లో నవుకరీకి వుంచుకుందాము. ఇతనిదగ్గిర దొంగతనము లేదు. పరులసొమ్ము దమ్మిడీ హరించడు. బహుబనమ్మిక మయినవాడు.

భీము—ఆవిషయంలో మీ రేమీ సందేహించకండి. పెళ్లయినతరువాత కొన్నాళ్ళు మీయింట్లో వుంచుకొని పరీక్షచేసి చూడండి. నాపేరు భీముడు. నేను వెనుకటి భీముడిలాగు పనిచేస్తాను. ఈసభవారితో వక్కమనవి చేసుకుంటాను. యికముందు అయ్యగారి యింటికి మీరు వచ్చినప్పుడు మీకందరికీ తలుపులు నేనే తీస్తూవుంటాను.

కళా—నీవు ఆసాధ్యుడవు. యీపాటి యింటికి వెళుదాము నడవండి.

(అందఱును వెళ్ళుచున్నారు)

---

# యోగనిద్రాప్రహసనము

ఈనాటకమునందు వచ్చుపాత్రములు.

—o—

**మతిమంతుఁడు**—యోగశాస్త్రాభ్యాసము చేయుచున్నయొకవృద్ధుఁడు.

సుబలుఁడు—మతిమంతుని మేనల్లుఁడు.

సదానందయోగి—భూతవైద్యము తెలిసినయోగి.

గజాననదాసు—వైద్యుఁడు.

రాముఁడు—మతిమంతునిసేవకుఁడు.

సుమతి—మతిమంతునికూఁతురు.

గౌరి—మతిమంతుని యింటిదాసి.

—o—

రంగము—మతిమంతుని యిల్లు.

[సుమతి ప్రవేశించుచున్నది.]

సుమ—వొంటరిగాకూర్చుంటే యేమీ తోచకుండావున్నది. మాట్లాడడానికి వక్కరాముడుతప్ప మరియెవరూ కనపడరు. వాడు ఎప్పుడూ యేదో గొణుక్కుంటూ వుంటాడు. నాన్నగారు యోగపుపిచ్చిలో పడి రాత్రీపగలూ ముక్కుమూసుకుని కూర్చుంటూ పాతతాటాకులపుస్తకాలు ముందు వేసికొని ఆకులు తిరగవేస్తూ రెండోధ్యానం లేకుండా వున్నారు. ఆపిచ్చపుస్తకాలచేత ఆయనకు మతి పోతూవున్నట్లున్నది. అదుగో యేదో చప్పుడవుతూ వున్నది. (చూచి) రాముడు పుస్తకాలకట్ట కింద పడవేసినాడు. ఓరీ! రామా! యేమిటి చేస్తూ వున్నావు?

[అప్పుడు రాముఁడు ప్రవేశించుచున్నాఁడు]

రాము—యేమీ చెయ్యడంలేదు. పుస్తకాలు చేతులోనుంచి జారిపోయినవి. దిక్కుమాలినపుస్తకాలు వొక్కొక్కటి నాలుగేసిమళ్ల బలువు వున్నవి. ఈగదిలోకి తీసుకురావలసినవి యిటువంటివి పదిపుస్త కాలున్నవి. ఈపొస్తకం కాలిమీద పడి కాలి వేళ్ళన్నీ నలిగి పోయి నవి. (అనిచేతిలోని పుస్తకములు బల్లమీద పెట్టుచున్నాఁడు)

సుమ — (నవ్వుచు) ఆపుస్తకం కింద పడవేసినందుకు నాన్న గారు కోపపడుతా రేమో!

రాము — నేనుపడవెయ్య లేదు. దానంతట అదేపడ్డది. చేతులో వుండకుండా పసిపిల్ల కాయలాగు జారి కింద పడ్డది. నా తప్పితం యేమీ లేదు.

మతి —(వెలుపల నుండి) రామా! రామా!

రాము—వస్తూవున్నాను. వచ్చె వచ్చె—అమ్మగారూ! చూచి నారా ఆయన యెలాగు తొందరపెడుతూ వున్నారో!

మతి —(వెలుపలనుండి) రామా! రామా!

రాము—తొందరపడకండి. వస్తూవున్నాను. ఇక్కడ నేను ఆడుకోవడం లేదు.(అని క్రిందపడ్డపుస్తకమును చేతితో తీయుచున్నాఁడు)

[అంతట మతిమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు]

మతి —రామా! మిగిలిన పుస్తకాలు నీవు యివేళయిక్కడకు తీసుకునిరావడం వున్నదా? రోజంతా యిక్కడనే వుంటావా?— అమ్మాయీ! నీవూ యిక్కడనే వున్నావా?

సుమ — యిప్పుడే వచ్చినాను. తోటలో నాకు సంపెంగ పువ్వులు కోసి యిస్తామన్నారు వస్తారా?

మతి— యిప్పుడు రావడానికి తీరుబడి లేదు. నేను యిప్పుడు

పుస్తకంలో ప్రాణాయామాన్ని గురించి చదువుతూ వున్నాను. అది అర్థం కావడం లేదు. అది గ్రహిస్తేనే కాని నేను యెక్కడికీ రాను— ఓరీ రామా! మాటలు ఆలకిస్తూ అలా నిలుచున్నా వేమి? నీవు కింద కూర్చుండి పుస్తకాలన్నీ బల్లమీద వరుసగా పెట్టు.

రాము—చిత్తము. (అని యొకపుస్తకము క్రిందవేసి దాని మీాద కూర్చున్నాడు)

మతి—ఓరి పశువా! పతంజలిమీాద కూర్చున్నావేమిరా? లేలే. అపచారం వస్తుంది. ఆయన యెవరనుకున్నావు? మొట్టమొదట యోగ సూత్రాలు చేసినమహానుభావుడు.

రాము—అపచారం రావడానికి నేను యెవరిమీాదా, మనిషి మీాద కూర్చో లేదు. బట్ట బుర దవుతుం దని యెందుకూ పనికి మాలినయీపాతతుక్కుపుస్తకంమీాద కూర్చున్నాను. కింద మనిషి వుంటే పయినికూర్చోవడానికి నాకంత బొత్తిగా కళ్లు కనపడ వను కున్నారా యేమిటి?

మతి—అది పనికిమాలినపాతతుక్కుపుస్తక మట్రా? దాని విలువ చదువురాని శుద్ధపశువు నీకు యేమి తెలుస్తుంది? నేను నిన్నటి రోజల్లా కష్టపడి అంటలుకట్టుకుపోయిన పత్రాలన్నీ జాగ్రతగా విడ దీసి పురుగులు దులిపివేసి కట్టకట్టినాను. రెండువాఖ్యానాలతో వున్న దాన్ని పనికిమాలినతుక్కంటావురా?

[అన్నపుడు చేతిలో నొకయుత్తరము పట్టుకొని గౌరి ప్రవేశించుచున్నది]

గౌరి—అయ్యా! మీాకు టపాలో వుత్తరం వచ్చింది. (అనిచేతి కిచ్చి వెళ్ళుచున్నది)

మతి—ఏమిటీ! వుత్తరమా? ఆగమశాస్త్రవేత్త అయినగౌరీపతి శాస్తుర్లు దగ్గిరనుంచి కాబోలును. (అని చూచి) కాదు. కాదు.

ఈవుత్తరం తరువాత నెమ్మదిగా చదువవచ్చునులే. (అని క్రింద పడ వేయుచున్నాడు)

సుమ — నాన్నగారూ! మీరు వుత్తరంవిప్పి చదువుకోకుండానే కింద పడ వేసినారు. దానిలో యేవయినా జరూరుసంగతులున్న వేమో! నేనువిప్పి చదువుదునా? (అని యుత్తరము పుచ్చుకొని చూచి) దీని మీద పెద్దాపురంముద్ర వున్నది. ఇది మామయ్యదగ్గరనుంచి వచ్చింది వేగిరం చదవండి.

మతి —(ఉత్తరమువిప్పిచదివి) పిచ్చివాడా! ఇది బాగానేవున్నది. అంతకంతకు పిచ్చిముదిరితే యేమోస్తరుకు వస్తుందో. అయినా ఫర్వా లేదు. నేను యోగదృష్టితో చూచి మనోబలం వుపయోగ పరిస్తే యెటువంటి వాణ్ణయినా నిముషంలో వశపరుచుకోవచ్చును. అతను రావడంతోటే ప్రయత్నంచేసిచూస్తాను. ఇప్పుడు వెళ్ళి వక్కనిముషం ప్రాణాయామంబట్టి మళ్ళీవస్తాను. (అని యుత్తర మక్కడ పడవైచి వెళ్ళుచున్నాడు.)

సుమ — నాన్నగారు వూరికే జపంపిచ్చిలో పడిపోయినారు. తిన్నగా వేళకు భోజనానికైనా రావడంలేదు. నేను యీవుత్తరములో యేమి వున్నదో చదువుతాను. (అని చదువుచున్నది.)— ''మీచెల్లెలు పోయినప్పటినుంచీ మీమేనల్లుడికి విచారంచేత బొత్తిగా పిచ్చియెత్తి పోయినది''— పాపం సుబలుడికి పిచ్చియెత్తింది కాబోలును. అతణ్ని చూచి నాలుగుసంవత్సరాలు కావచ్చింది. ఇక్కడ వున్నప్పుడు అతను నామీద యెంతో ప్రేమగా వుండేవాడు. తరువాత చదువుదాము— ''అతనికి యేమీ తోచక వూరికే పిచ్చివాడులాగు తిరుగుతూ వున్నాడు. అతనికి మనస్సు స్వస్థపడేదాకా కొంతకాలం మీదగ్గిరవుండ డానికి నేటిసాయంకాలమే మీదగ్గరకు పంపిస్తున్నాను. రేపుమధ్యా

హ్నానికి అక్కడకు వస్తాడు.''—రేపు మధ్యాహ్నానికా ? అలాగైతే యింక కాస్తసేపటికి వస్తాడు.—‹‹అతని విషయం మీరు కొంచెం శ్రద్ధవహించి మనస్సు స్థిమితపడేటట్టు చెయ్యవలెను. సుమతితోకూడి అల్లరిగా తిరగనియ్యకండి. మావాణ్ని మీయోగపిచ్చలో మాత్రం దింపవద్దు. వాడికి యిదివరకువున్న పిచ్చ చాలును.''

రాము—అలాగైతే యిఖ మన యింట్లో పిచ్చవాళ్లు వకరికి యిద్దరవుతారు.

సుమ—వక రెవరురా ?

రాము—అయ్యగారు.

సుమ—నోటిమీద తన్నిపోయేరు. ఇటువంటి పేలాపనలు పేలకు. గౌరిని నేను రమ్మన్నానని నాగదిలోకి పంపించి నీవు వెళ్లి నీ పని చేసుకో. పో. (అని వెళ్లుచున్నది)

రాము—అమ్మా ! యిప్పుడే వెళుతాను. అయ్యో ! అప్పుడే యీవిడె వెళ్ళిపోయిందే. అమ్మాయిగారికి నామీద కోపంవచ్చింది, కాబోలును. అదుగో గౌరి యిక్కడికే వస్తూవున్నది. నేను వెళ్ల నక్కరలేదు.

[గౌరి ప్రవేశించుచున్నది]

గౌరి—ఓయీరామా ! నీవు వొంటరిగా యిక్కడ యేమి చేస్తూ వున్నావు ? మామూలుప్రకారంగా నీలో నీవు సణుక్కుంటూ వున్నావా యేమిటి ?

రాము—నేను చేసే పనే నీవు చేసేటట్టయితే నీవు నాకంటె యెక్కువ సణుక్కుందువు. పురుగులు దులిపివేసి వక్కపుస్తకానికి వస్ణంవేస్తే నాకు వుండేకష్టం నీకు అప్పుడు తెలుస్తుంది. ఓసీ ! గౌరీ ! ఈరోజు మనయింటికి యెవరో వస్తారట! యెవరువస్తారో యెరుగుదువా?

గౌరి — యెరగను. యెవరో మంత్రాలు తెలిసినయోగులు వస్తారనుకుంటాను.

రాము—కాదు కాదు. వకపిచ్చివాడువస్తూవున్నాడు.

గౌరి — పిచ్చివాడా? నాకు భయంవేస్తూవున్నది. అతనుయెవరినీ కొట్టేతిట్టేవాడు కాడుగద.

రాము—ఏమో తెలియదు. ఆతడు మనయజమానుడికి జతగా వుంటాడు. అయినా కానీ అతడుకూడా తాను వచ్చేటప్పుడు పాతతాటాకుల పుస్తకాలుయేమయినా తెస్తాడేమోనని నాకూ భయంగానే వున్నది.

గౌరి—పుస్తకాలు తెస్తేనేమికాని అతడుకొట్టేవాడవునో కాదో కనుక్కొని ముందుగా చెప్పుదూ!

రాము — కనుక్కో సక్కరలేదు. వాళ్లకుకోంచెంవ్యతిరేకంగా యేమయినా చేసినా అన్నా పిచ్చివాళ్లందరూ కొడుతారు. నీవుజాగ్రత్తగా వుండవలెను. నీవు అతను చెప్పినట్లల్లా చెయ్యకపోతే నీకొప్పులో వెంట్రుకలు నాలుగూ వూడదీసి చేతులో పెడుతాడు.

గౌరి—అలాగైతే నాకు మరీభయం వేస్తూవున్నది. మూర్ఛ వస్తూవున్నది. (అనిమీద పడబోవుచున్నది.)

రాము—గౌరీ! దూరంగా పో. ఇక్కడ మూర్ఛపోకు. నీకు మూర్ఛపోవడం యిష్టంగా వున్నట్టయితే లోపలికి పోయి నీళ్లపొయి కాడ నిప్పులలోనో నీళ్లలోనే మూర్ఛపో.

గౌరి—రామా! నీవు యింత క్రూరుడవవుతావని నేను యెన్నడూ అనుకోలేదు. నీవు నామతి పోగొట్టివేసినావు.(అని యేడ్చుచున్నది.)

రాము—నీ కేమి భయము లేదు యేడువకు. ఆపిచ్చివాడు

నీజోలికి రాములే. ధైర్యంగా వుండు.

గౌరి—నీవు చెప్పినమాటలు విన్నతరువాత మళ్ళీ ధైర్యాం యెలా వస్తుందీ ? మూర్ఛ వస్తూవున్నది. ఇదుగో మూర్ఛపోతూ వున్నాను. (అని సోలుచున్నది.)

మతి—(వెలుపలనుండి) రామూ ! రామూ !

రాము—అయ్యో ! అయ్యగారు పిలుస్తూ వున్నారు.

గౌరి—ఇటువంటి మూర్ఛలో నీవు నన్ను వదిలిపెట్టి వెళ్ళకూడదు.

రాము—మూర్ఛపోవడానికి ఇది సమయం కాదు. మనయజమానుడు జపంమీాద కూర్చున్నప్పుడు సమయం కనిపెట్టి చెప్తాతాను. నీవప్పుడు కావలసినంతసేపు సావకాశంగా మూర్ఛపోవచ్చును. ఇప్పుడు లేచి వేగిరం యింట్లోకి పరుగెత్తు.

గౌరి—నీమాటప్రకారం నడుచుకుంటాను. (అని లేచివెళ్ళుచున్నది.)

[అంతట మతిమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మతి—ఓరి మొద్దా! పిలవగానే యెందుకురావు!నీవుయెప్పుడూ దానితో పరియాచికా లాడుతూ కూర్చుంటావు.

రాము—ఆలాగంటి పని నేను యెప్పుడూ చెయ్యడం లేదండి. అదే నన్ను పరియాచకాలు చేస్తూవుంటుంది.

మతి—చాలును. ఈపాటినోరుమూసుకో. ఈవేళ మనయింటికి నామేనల్లుఁడు వస్తూవున్నాడు. అతనికి కొంచెంచిత్తచాంచల్యం.

రాము—అది యేమిటండీ?

మతి—మరేమీలేదు. మతిభ్రమవస్తూవుంటుంది.

రాము—మీారుచెప్పినవేవో నాకుతెలియవు. ఆవచ్చేవిరెండూ

యేవో జంతువులనుకుంటాను. అవియేమీ హానిచేసేవికావుగద?

మతి—జంతువులూ లేదు. నీమొఖమూ లేదువూరుకో. నామేన ల్లుడివిషయంలో నీవే చాలాశ్రద్ధ పుచ్చుకోవలెను. అతణ్ని నీవు యెప్పుడూ కనిపెట్టివుండి చూస్తూ మంచిమాటలుచెపుతూ కోపం రాకుండా చెయ్యవలెను. అతణ్ని రెచ్చకొట్టినావంటే నీతలకాయ బద్దలుకొడుతాడుసుమా జాగ్రత్త. అతనికి యెప్పుడూ చిరాకు తెప్పించకు.

రాము—తెప్పించను. అతనిమీద యెప్పుడూ వకకన్ను వేసి జాగ్రతగా వుంటాను.

మతి—(ఆలకించి) అదుగో బండిచప్పుడవుతూవున్నది. అతను వచ్చినట్టున్నాడు రామా! అతణ్ని నీవు వెళ్ళి లోపలికి తీసుకునిరా.

రాము—చిత్తము. (అని వెళ్ళుచున్నాఁడు.)

మతి—సదానందయోగికిన్ని గజాననదాసుకున్ను వర్తమానం పంపించినాను. వారుయిద్దరూవచ్చి యితణ్ని సావకాశంగా పరీక్షచేసి చూచి జబ్బుయొక్క స్వభావం నిశ్చయంచేసి చెపుతారు. వారిద్దరూ నిస్సందేహంగా చిత్తచాంచల్యమనే నిశ్చయం చేస్తారు. పాములమంత్రి గాడు తాచుపామును వశ్యంచేసుకున్నట్టు నేను యీరోగిని యోగ దృష్టిచేత చూచి నిముషంలో లోబరుచుకుంటాను. యోగమహిమకన పరచడానికి యిప్పుడు మంచి అవకాశం కలిగింది. మనోబలంచేత యెటు వంటిరోగాలనైనా మళ్ళించవచ్చును. అతడు యెంతఅల్లరిచేస్తూవున్నా మనస్సు స్థిరపరిచి తేరిపారచూచినానంటే యోగనిద్రచేత చిత్రపు ప్రతిమలాగు అయిపోతాడు. అదుగో అతను వస్తూవున్నాడు. నేనులో పలికివెళుతాను అతణ్నిచూస్తే నాకు దేహం పులకరిస్తూవున్నది.

(అని వెళ్ళుచున్నాఁడు.)

[సుబలుఁడును రాముఁడును ప్రవేశించుచున్నారు.]

సుబ—పడవలు కొంచెం ఆలస్యంగా బయలుదేఱినా యెలాగై తేనేమి కష్టపడి అనుకున్న వేళకు యిక్కడ చేరినాము.—ఓయి రామా! మా సామానంతా లోపల యేదైనా గదిలో పెట్టించు. ప్రయాణం తొందరలో రాత్రి నేను తిన్నగా భోజనంచెయ్యలేదు. ఆకలి వేస్తూవున్నది. వంటయిందేమో కనుక్కునిరా.

రాము—(ఇల్లునాలుగుప్రక్కలనుచూచి) వీటితోయెవరినీకొట్టడానికి యితనికి అవకాశం లేకుండా చేస్తాను. (అని గోడమూలలనున్న చేతికఱ్ఱ లన్నియు పోగుచేయుచున్నాఁడు.)

సుబ—(కోపముతో) ఓరీ! నీతో నేను చెప్పినపని యేమిటి? నీవు యిక్కడ చేస్తూవున్న పనియేమిటి?

రాము—చిత్తము చిత్తము. వెళుతూ వున్నాను. (అని కఱ్ఱలు చేతఁబట్టుకొని నడుచు చున్నాఁడు.)

సుబ—వీడిమోస్తరు చూస్తే తమాషాగా వున్నది. ఇక్కడ వుంటే నేనాకఱ్ఱలు యెత్తుకుని పారిపోతా ననుకున్నాడు కాబోలును. ఈసావిట్లో నేను యిదివరకు కూర్చుని నాలుగుసంవత్సరాలు అయింది. అప్పుడు నేనూ సుమతీ యెంతోవినోదంగా ఆడుకుంటూ వుండేవాళ్లము. సుమతి యీపాటి బాగా పెద్ద దయి వుంటుంది. అప్పటికే యెంతో అందంగావుండేది.

మతి—(తలుపుచాటునుండి చూచుచు) అమ్మాయీ! సుమతీ! మీబావస్థితి చూచినావా? గౌరీ! మమ్మలిని తోసుకుని రాకు. నీవు తరువాత చూస్తువుకానిలే.

సుబ—మానాన్నగారు నన్ను యిక్కడకు అథాత్తుగా పంపించివేసినారు. మామామగారు వట్టిచేదస్తుడు.ఇప్పుడు యోగపు పిచ్చిలోపడి

నిద్రాహారాలు లేకుండా రాత్రీపగలూ దానిలోమునిగి తేలుతూ వున్నాడట. అయినాకానీ యిక్కడ నాకు మనసుకలిసినసుమతి యింటో వున్నదిగనుక వేడుకగా ప్రొద్దుగడపవచ్చును. యీ తాటాకుపుస్తకాలక్ష్మీ మామగారి పాతపురాణాలు కాబోలును.

మతి—(చెవిలో గుసగుస లాడుచు) అమ్మాయీ ! అవి పాత పురాణాలట. తాను కాదు. నేనే పిచ్చిలోపడి వున్నానట. ఆమాటలు విన్నావా? ఈ గౌరి వూరికే తొందరపడుతూవున్నది. దాన్ని చూడనియ్యి. మనం వెళుదాము. (అని వెళ్ళుచున్నారు.)

సుబ—(తల యెత్తి చూచి) యెవరో గుసగుసలాడుతూ వున్నట్టున్నారు. అదుగో ఆతలుపుదగ్గిర యెవరో చీరెకట్టుకుని నిలుచున్నారు. (అని తలుపువద్దికి వెళ్ళి తయిపుతీసి గౌరిని ఈవలికిలాగుచున్నాడు.)

గౌరి—(కాళ్లమీదపడి) మహాప్రభో! నన్ను రక్షించండి. చంపకండి. నాతల్లిముసలిది. దానికి నేను తప్ప మరియెవరూ దిక్కులేరు. నేనూ పదిహేడేళ్ళదాన్ని. కొంచెంకాలంలోనే పెళ్లిచేసుకుని సుఖపడవలె ననుకుంటూవున్నాను. నాప్రాణాలు కాపాడండి.

[అంతట రాముడు ప్రవేశించుచున్నాడు.]

రాము—(తనలో) ఈపిచ్చివాడు దీన్ని కౌగిలించుకోవడానికి ప్రయత్నం చేస్తూవున్నట్లున్నాడు. ఇది వకవేళ అయితే మదపిచ్చ అయివుంటుంది.

సుబ—(పకపక నవ్వుచు దానిని లేవదీసి) హాహాహా! నీకిప్పుడేమీ ప్రాణభయం లేదు లే. (పయివంకచూచి) ఆవచ్చినవారెవరు?

రాము—బాబూ నన్నుకొట్టకండి. నేను వెళ్లిపోతాను. (అని గంతులు వేయుచున్నాడు.)

సుబ—అమ్మా! నీవు వెళ్లిపో.

గౌరి—దేవుడా! ఇవేళకుబ్రతికి పోయినాను. (అని లోపలికి పరుగెత్తుచున్నది.)

సుబ—పాపం యిది పడుచుతనంలో బాగానే వున్నదికాని దీనికి కొంచెం వెర్రి అనుకుంటాను. వెర్రి కాకపోతే యేమీకారణం లేనిదే నన్నుచూచి భయపడి యిలాగు వెర్రికేకలువెయ్యదు. వీడు కూడా లోపలికి పరుగెత్తబోతూవున్నాడు. (అని పై బట్టపట్టుకొని) ఓరీపిచ్చివాడా! యెక్కడికి పరుగెత్తుకుపోతావు!

రాము—బాబూ! బాబూ! నాబట్ట చింపివెయ్యకండి. నెల్లాళ్లయినా కాలేదు కొత్తబట్టకొనుక్కొన్నాను.

సుబ—(బట్ట విడిచి) ఓరి మూఢుడా! నేను నీబట్ట చింపుతానను కున్నావురా?

రాము—అయ్యా! మీకు దణ్ణం పెడుతాను. దూరంగా వుండండి నాజోలికి రాకండి. మీపిచ్చిచేష్టలు నామీద చూపకండి.

సుబ—దున్నపోతా! నావి పిచ్చిచేష్టలు అంటావురా? (అని రాముని జుట్టు పట్టుకొని వంగతీయుచున్నాఁడు.)

రాము—బాబూ! చస్తిని చస్తిని. (అని కేకలు వేయుచున్నాఁడు)

[అప్పుడు మతిమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మతి—మావాడికి పిచ్చి మహాయెక్కువగావున్నది. నవుకర్లి సందరినీ కొడుతూవున్నాడు. నేను యోగదృష్టితో చూచి యితన్ని తక్షణం శాంతపరుస్తాను. (అని రెప్పవాల్పక చూచుచున్నాఁడు.)

సుబ—(మేనమామను చూచి తొందరపడి) మామయ్యా! వీడు నావి పిచ్చిచేష్టలంటే కోపంవచ్చి కొంచెం జుట్టు పట్టుకున్నాను. అంతేకాని మరేమీ కాదు.

మతి—(సుబలుని స్థిరదృష్టితో చూచుచు సమీపమునకు వెళ్ళి

చేయిపట్టుకొని) నాడి బహుపడిగా కొట్టుకుంటూ వున్నది. ఇటువంటి వాళ్లకు వుండే మోస్తరేయిది.

సుబ—(తనలో) ఈయనకు మతిపోయిందా యేమిటి? రెప్పవాల్చకుండా దయ్యాలు పెట్టేవాడులాగు నావంక ఆలాచూస్తాడేమి?

రాము—(మతిమంతుని వెనుకకు వచ్చి చెవిలో రహస్యముగా) సమయానికి మీరు రాకపోయినట్టయితే యితడు యీపాటినన్ను చంపివేసును. ఇతనిది సాధారణమయినపిచ్చకాదు. యితణ్ని తాళ్లోగీళ్లో వేసి కట్టిపెట్టి గదిలోవేసి వుంచవలెను. లేకపోతే మీయింటికి వచ్చేవారికి యెవరికైనా అపాయం వస్తుంది.

[అప్పుడు సుమతి ప్రవేశించుచున్నది]

సుమ—(భయపడుచు వచ్చి) నాన్నగారూ! (సుబలునిచూచి తొందరపడి) యిక్కడ మీరు వక్కరే వున్నారనుకున్నాను.

సుబ—సుమతీ! నన్నుచూచి యెవరినోపరాయివాణ్ని చూచినట్టు ఆలాతొందరపడుతావేమి? నేను నీబావనుసుబలుణ్ని. నన్నప్పుడే మరచిపోయినావా? (అని సుమతిచేయిపట్టుకొనుచున్నాడు.)

రాము—అడుగో ఒకదాన్నివదలి రెండో ఆడదానిమీద పడబోతూవున్నాడు.

సుమ—నన్ను ముట్టుకోకు. పడుచువాళ్ళు యెదిగినఆడదాన్ని ముట్టుకోరాదు. (తనలో) ఇతనిమోస్తరుచూస్తే నాకంతపిచ్చవాడుగా కనపడడంలేదు.

సుబ—దగ్గిరబంధువులలో అటువంటి అభ్యంతరాలు వుండకూడదు. చిన్నతనంలో మనంయిద్దరమూ ప్రాణస్నేహితులముగావుండే వాళ్లము కామా?

సుమ—నాచెయ్యివదులు. చిన్నతనంలో చేసినట్టు యిప్పుడు

చెయ్యరాదు. (అని చేయివదల్చుకొనివెళ్లి బల్లమీద కూర్చుచున్నది.

మతి—(రెప్పవాల్చక సుబలుని యోగదృష్టితో చూచుచు (తనలో) ఇతడు లొంగిపోయినాడు. కాస్తసేపు దృష్టిపట్టి చూచేటప్పటికి పరమసాధువైనాడు. ఆహా! యేమియోగబలము! (బిగ్గరగా) అబ్బాయీ! నీకు ఆకలిగావున్నట్టున్నది. నీవుకొంచెంసేపు నీమరదలితో మాట్లాడుతూకూర్చో. నేను లోపలికి వెళ్లి నీకుకావలసినవిజాగ్రత పెట్టించి యిప్పుడే వస్తాను. (అని సుమతియొద్దకువెళ్లి అమ్మాయీ! నీవు కొంచెంసేపు యితనితో మంచిమాటలు చెప్పుతూ కూర్చో. అతనుయేమన్నా అవునని అన్నిటికీ తలవూపుతూ వుండు. ఆతనికి వ్యతిరేకంగా యేమీచెప్పకు. వాళ్ళుచెప్పింది కాదంటే పిచ్చవాళ్లకు పిచ్చ యెక్కువై కోపం వస్తుంది సుమా! (అనివెళ్లుచున్నాఁడు.)

రాము—ఆయన లేనప్పుడు నేను మంత్రిస్తాను. (అని సుబలునికేసి రెప్ప వాల్చక చూచుచున్నాఁడు.)

సుబ—(చేతితో రాముని జూపుచు) సుమతీ! వీడికి కొంచెం మతిభ్రమ వున్నదనుకుంటాను.

సుమ— వున్నది. తప్పకుండా వున్నది. (తనలో) ఇత డన్నమాట కర్థం యేమిటో.

సుబ—వీణ్ని పిచ్చవాళ్ళవైద్యశాలలో నుంచి తీసుకుని వచ్చినట్టున్నారు.

సుమ—మీమామయ్య కోనసీమ వెళ్ళినప్పుడు అమలాపురాన్నుంచి తీసుకుని వచ్చినారు. (ఇంతలో జ్ఞప్తి తెచ్చుకొని) కాదు కాదు. పిచ్చవాళ్ళ వైద్యశాలలో నుంచే తీసుకుని వచ్చినారు.

సుబ—(నవ్వుచు) సుమతీ! నీ వలాగు తడబడుతూ మాట్లాడుతా వేమి? నాదగ్గిర నీకు భయం యెందుకు? నీ కావుంగరం మామ

య్యగారు కొత్తగా చేయించినారా? నీచేతిని వుండడంవల్ల ఆవుంగరా నికి యెంతో అందం వచ్చింది. (అని చేయి పట్టుకొను చున్నాడు)

సుమ —(చటుక్కున చేయి తీసికొని తనలో) మాట్లాడడాన్ని పట్టి చూస్తే యితడు మంచివాడులాగే కనపడుతూ వున్నాడు కాని పిచ్చివాడులాగు కనపడడం లేదు. (బిగ్గరగా) మీరు వూరికే నన్ను స్తుతి చేస్తూవున్నారు.

సుబ—సుమతి! సిగ్గువిడిచి దగ్గరగా వచ్చి కూర్చో. యెవరో కొత్తవాడిలాగు నన్ను మీరూమీరూ అంటూ వుండకు. మనలో మనకు మర్యాదలు యేమిటి? మునుపు పిలిచేటట్టుగానే నీవు అని పిలు పిస్తూ వుండు. మనం చెట్టాపట్టాలు వేసుకుని యీతోటలో తిరుగుతూ పళ్లు కోసుకొని ఆడుకుంటూ వుండేవాళ్లం ఆసంగతంతా అప్పుడే మరిచి పోయినావా?

సుమ—మరిచి పోలేదు. మనం.వకరోజుశాస్త్రిల్లుగారితోట లోకి వెళ్ళి నారింజపండు కోసినప్పుడు జరిగినతమాషా నీకు యిప్పుడు జ్ఞాపకం వున్నదా?

సుబ—బాగా జ్ఞాపకం వున్నది. అతనుమనల్ని తరుముకువచ్చే టప్పటికి మనం లేళ్లలాగు పరుగెత్తుకువచ్చి వీధిలో పడ్డాము. అతడు మనను పట్టుకోవలె నని వెనుక పరుగెత్తుకొని వచ్చిపరుగెత్తలేక కాలు జారి బొండులాగు బురదకాలువలో పడాడు. బట్టలన్నీబురదయి పోయినవి. ఆసంగతి చెప్పుకుని మనం నెల్లాళ్లదాకా రోజూ కడుపు లుబ్బేటట్టుగా నవ్వుకుంటూ వుండేవాళ్లము. ఆచిన్ననాటిఖులాసా దినాలు మళ్ళీ రావు.

సుమ—అటువంటిదినాలు మళ్ళీ రావు. అప్పుడు నీవు పిచ్చ— (జ్ఞప్తికి తెచ్చుకొని) కాదు కాదు. నాఅభిప్రాయంఅదికాదు. యేమీ

లేదు. (అని తొందర పడుచున్నది.)

సుబ—సుమతీ! అలా భయపడుతా వేమి? తొందరపడబోకు. నాదగ్గిర నీకు భయం యెందుకు?

సుమ—(లేచి మెల్లగాలోపలికినడుచుచు) మానాన్న గారు—

సుబ—మీనాన్న గారు యేమిటి? ఆయన చూస్తే యేమి చేస్తాడు? తల కొట్టివేస్తాడా యేమిటి? వచ్చి కూర్చో. (అని చేయి గట్టిగా పట్టుకొని లాగుచున్నాడు.)

సుమ—(తనలో) ఇతనికిపిచ్చ యెక్కువవుతూ వున్నది. (బిగ్గరగా) అవును. మీరు చెప్పినదంతా నిజం. ఆయన మనను యేమీ చెయ్యలేదు. వచ్చి కూర్చుంటాను. నాచెయ్యి వదలండి.

సుబ— ఇదిగో వదలినాను.

సుమ—మీకు వంటయిందేమో కనుక్కొని వస్తాను. (అని చటుక్కున లోపలికి పోయి తలుపు వేసుకొనుచున్నది)

సుబ— ఇదేమిటి ? (అని అద్భుతపడి నిలుచున్నాడు)

[రెండుగిన్నెలను, ఒకగరిటెయు పట్టుకొని రాముడు ప్రవేశించుచున్నాడు.]

రాము—ఇదుగో మీకు ఔషధం—కాదు. భోజనం తీసుకుని వచ్చినాను.

సుబ—ఆగరిటెలోది యేమిటి?

రాము—బుడంవరుగులు నేతిలో వేయించినాము.

సుబ—ఆగిన్నెలలోదో?

రాము—వకగిన్నెలోది మిరియాలచారు, రెండోగిన్నెలోది పెసరట్లూను పొట్టు తియ్యకుండా ముడిపెసలు నూరి రొట్టెలు చేసినాము.

సుబ—యేడిసినట్టే వున్నది. యీభోజనం. ఈపాడురొట్టెలు యెవరికికావలెను?

రాము—కోపపడకండి. మీరు రెండురొట్టెలు ఫలహారం చేస్తే కడుపులో కొంచెం చల్లపడి శాంతిస్తుంది. భోజనం చెయ్యండి.

సుబ—(లేచి రామునిజుట్టు పట్టుకొని గట్టిగా ఊపి) నన్ను యీప్రకారంగా అడవిమృగంలాగుచూడడానికి యింట్లోవాళ్లందరూ కలిసి యేదో కుట్రచేసినారో లేదో నిజం చెప్పు.

రాము—(జుట్టు వదల్చుకొనుచు) నాజుట్టు వదలండి. మృగం లాగు చూడడానికి కుట్ర చెయ్యడం యేమిటి? మీరు నిజంగాఆలాగే కనబడుతూ వున్నారు. మీరు పెద్దభల్లూకప్పుపట్టు పట్టినారు. అడవి మృగ మైనా యింతపట్టు పట్టదు. మీరు నాజుట్టు వదలకపోతే నానాకు పోయి బంట్రోతును తీసుకుని వస్తాను.

సుబ—నీఅవకతవకప్రసంగం మానకపోయినట్టయితే యిప్పుడు నాలుగు తన్ని నిన్ను యింట్లోనుంచి అవతలికి సాగనంపుతాను. (తనలో) బాగా ఆలోచిస్తే వీడితో విరోధం పడడం బాగా కనపడడం లేదు. ఇక వీడితో మంచిమాట లాడుతాను. వీడివల్ల యేదైనా వుప యోగం వుంటుంది. (బిగ్గరగా) రామా! నేను వూరికే వేళాకోళానికి జుట్టు పట్టుకని వూపినాను. అంతేకాని మ రేమీ లేదు. నీవు మహా మంచివాడవు గా కనబడుతూ వున్నావు. ఇదిగో రూపాయి యిస్తూ వున్నాను పుచ్చుకో. (అని రూపాయి చేతిలోఁ బెట్టుచున్నాఁడు.)

రాము—(పుచ్చుకొని సంతోషముతో) మీరు మహాదొడ్డ వారు. మాయజమానులవంటివారు షడిమం దైనా మీతో సమానం కారు.

సుబ—నాకు ఆకలిగా వున్నది. తెచ్చినవి విస్తట్లో వడ్డించు.

రాము—చిత్తము. (అని రొట్టెలు విస్తరిలో వేసి నిలు చున్నాఁడు.)

సుబ—(విస్తరిముందు కూరుచుండి) ఇ వేమిటి యీరొట్టెలు నల్లగా వున్నవి! వీటికంటె మరియేమయినా చేసినట్టయితే బాగా వుండును. (అని తినుచున్నాడు.)

రాము—చెయ్యి కరుచుకుంటారు. జాగ్రతగా తినండి.

సుబ—చెయ్యి కరుచుకోవడానికి నేను పసిపిల్లవాణ్ని అనుకున్నావా యేమిటి. రామా! యివి బాగున్నవి కావు. తినడానికి వీటి కంటె యేమయినా మంచివి తెస్తూ?

రాము—మరేమీ తేవడానికి వల్లకాదు. అయ్యగారు యివి మాత్రమే మీకు పెట్టుమన్నారు. యివన్నీ పైత్యహారపువస్తువు లట.

సుబ—అయ్యగారిని—(ఆపుకొని) పైత్యహారమూ లేదు యేమీ లేదు. మరి యేమయినా తీసుకొనివస్తూ. నాకు వీటితో ఆకలి యెంత మాత్రమూ తీరలేదు.

రాము—అలాగా? (అని గరిటెయు గిన్నెలును తీసికొని పరుగెత్తుచున్నాడు.)

సుబ—వీడు నేను గరిటెలూ గిన్నెలూ యెత్తుకుని పారిపోతానను కున్నాడు కాబోలును. అవన్నీ వీడు యెంతతొందరగా తీసుకుని పోయినాడో? ఇక్కడి మోస్తరు చూస్తే నా కంతా విచిత్రంగా కనపడుతూవున్నది. దాసీది పిచ్చదిగా వున్నది. ఈరాముడు తెలివిమాలిన మోటపశువులాగు కనపడుతూ వున్నాడు. నామరదలు కూడా నన్ను చూస్తే పెద్దపులినో వెలుగుబంటినో చూచినట్టు భయపడుతూ వున్నది. ఇఖ నా మామగారిసంగతి చెప్పనక్కరలేదు. ఆయనకు పాడు పొస్తకాలు చదవగా చదవగా మతిపోయింది. మహారాణిగారిని చూచినట్టు ఆయన నాకేసి వూరికే రెప్ప వాల్చకుండా చూడడం మొదలు పెట్టినాడు. ఆయనకు పిచ్చ అయినందుకు ఆవగింజంతయినా సందేహం

లేదు. కాని సుమతిసంగతిమాత్రం నా కేమీ బోధపడడం లేదు. ఇప్పుడు సుమతికి వకవుత్తరం వ్రాసి రాముడిచేత పంపిస్తాను. (అని వ్రాయుచు చదువుచున్నాఁడు)—“అత్యంతప్రియురాల వైనసుమతీ! నన్ను చూస్తే నీ కంత సిగ్గూ భయమూ రావడానికి కారణం యేమిటి? నీకు నామీద కోపం రావడానికి నేను యేమి నేరం చేసినాను? నేను చేసిన అపరాధం చెప్పినట్టయితే నేను వెంటనే నీకాళ్ళమీద పడి క్షమాపణ కోరుకుంటాను. కాబట్టి నాయందు దయవుంచి విచారగ్రస్తుడనై వున్ననన్ను సంతోషపెట్టవలె నని మరీమరీ వేడుకుంటూ వున్నాను. నీచిన్ననాటిప్రియమిత్రుఁడు సుబలుడు”—ఇది చాలును.

[పోకదొన్నెయు విస్తరియు చేతఁబట్టుకొని రాముఁడు ప్రవేశించుచున్నాఁడు.]

రాము—ఇవిగో మీకు పెసరట్లు మళ్ళీ తెచ్చినాను. ఈసారి ఆకలి తీరేటట్టుగా కావలసినన్ని తినండి. (తనలో) ఇప్పుడు గరిటె తీసివేసి దొన్నెలు తెచ్చినాను గనుక వీటితో యితడు యెవరికీ హాని చెయ్యలేడు. (అని క్రింద పెట్టుచున్నాఁడు)

సుబ—(విస్తరిముందు) కూరుచుండి ఈమాటయినా మంచి రొట్టెలు తెచ్చినావా? వెండిగిన్నె లోపల పడవేసి యీవెధవదొప్ప తెచ్చినా వేమి? లోపలికి వెళ్ళి గిన్నె తీసుకుని రా. (అని పోకదొప్ప విసరి వేయుచున్నాఁడు)

రాము—గిన్నె తీసుకునిరాను. మిమ్మలిని నమ్మి మీ చేతికి గిన్నె యివ్వడం క్షేమం కాదు. (తనలో) ఈయనచేతికి గిన్నెలూ గరిటెలూ యిచ్చి వాటితో నాతల బద్దలుకొట్టించుకుంటానా? నాకు అపాయం రాకుండా యేలా కాపాడుకోవలెనో నాకు బాగా తెలుసును. నేను మోసపోను.

సుబ—(కోపముతో) జాగ్రత నన్ను నీవు దొంగవాణ్నిగా

భావిస్తూ వున్నట్టున్నావు.

రాము—ఆసంగతి నా కేమీ తెలియదు. మీ కది ముదిరితే అపాయం సంభవిస్తుంది గనుక మీదగ్గర గిన్నెలు మొదలయిన గట్టి వస్తువులు యేమీ వుంచవద్దని మీ మామగారు సెలవిచ్చినారు.

సుబ—(కోపముతో) ఏదిముదిరితే—

రాము—మీ కున్న జబ్బు.

సుబ—జబ్బేమిటి?

రాము—అయ్యగారు దాని కేమిటో పేరు పెట్టినారు. జ్ఞాపకము చేసుకుని చెపుతాను వుండండి. "చిచ్చాల్యం". జ్ఞాపకం వచ్చింది. అవును అదే.

సుబ—నీమొఖం చిచ్చాల్యం యేమిటి?

రాము—దానికి యింకో పేరు "తిభ్రిమ"

సుబ—మతిభ్రిమ అనా నీ తాత్పర్యం?

రాము—అవును ఆమాట అదే.

సుబ—మొదటిమాట చిత్తచాంచల్యం కాబోలును.

రాము—నానోరు తిరగదు. మీ మామగారు నాతో చెప్పింది యిప్పుడు మీ రన్నమాటే.

సుబ—(నవ్వుచు) ఇప్పుడు నా కంతాబోధపడ్డది.

రాము—అవును మీకు బోధపడ్డది. (అని నవ్వుచున్నాడు.)

సుబ—(నవ్వుచు) ఈవింత బహుబాగావున్నది. ఆ పిచ్చముసలాయన నాకు పిచ్చని యెందుకనుకున్నాడు?

రాము—ఏమో! నాకు తెలియదు.

సుబ—నీకు తెలియకపోతేపోయిందిగాని నీవు నాకు వక్క సహాయం చేసిపెడుతావా?

రాము—ఏమిసహాయం? మీచేతులూ కాళ్ళూ కట్టిపెట్టవలెనా యేమిటి?

సుబ—అలాగంటిపనికాదు. నాకు మామగారివిషయంలో వక్కతమాషా చెయ్యవలె నని వున్నది.

రాము—అయ్యో! పాపం ఆయనకు—

సుబ—తొందరపడకు. మరేమీ కాదు. వూరికే పరిహాసాచకం. అందులో నీవు సహాయం చేస్తే నీకు వకరూపాయి యిస్తాను.

రాము—అలాగైతే ఆలోచిస్తాను. ఆయన విషయంలో చేసేది యీపుస్తకాలు తగలపెట్టడం తప్ప మరేమీ నాకు కనపడదు. ఈపుస్తకాలన్నిటినీ అగ్నిహోత్రుడికి సమర్పణ చేస్తే నాకు యెంతో సంతోషంగా వుంటుంది. అలా చేస్తానూ! నాశ్రమ నివారణ అవుతుంది. వీటిపురుగులు దులపలేక చచ్చిపోతూ వున్నాను.—ఓఅగ్ని దేవుడా! నీకు నమస్కారం చేస్తాను? ఈయనపాతతాటాకులపుస్తకాలన్నీ పూర్ణాహుతిగా సమర్పిస్తాను. గనుక, మీరు వక్కపుస్తకమయినా మిగలకుండా కంఠపూర్తిగా భక్షించి నన్ను కృతార్థుణ్ని చెయ్యండి.

సుబ—చెయ్యవలసిన పని మనము యిద్దరమూ కొంచెం సేపటిలో నిశ్చయింతాము గాని నీవు ముందుగా యీవుత్తరం తీసుకుని వెళ్ళి సుమతికి యిచ్చి రా. యిదుగో రూపాయి (అని యిచ్చుచున్నాడు.)

రాము—(పుచ్చుకొని) రూపాయ పుచ్చుకోవడానికి నా కేమీ అభ్యంతరం లేదు. గాని వుత్తరం మాత్రం నేను తీసుకొని వెళ్ళను. వుత్తరం ఆ ఆడదానిచేత పంపించండి.

సుబ—గౌరిచేతనా? అది నన్నుచూస్తే పరుగెత్తుతుంది. నా

దగ్గరకే రాదే.

రాము—దాని చేతులో రెండణాలడబ్బులు పారవెయ్యండి. అప్పు డది కావలసినంతదగ్గరగా వస్తుంది. దానికి కావలసిం దంతే.

సుబ—ఆలా గయితే దాన్ని వక్కసారి యిక్కడికి పంపించు.

రాము—నిముషంలో పంపుతాను. (అని వెళ్ళుచున్నాడు)

సుబ—(ఒంటరిగా) నేను ఆలోచించింది బహుబాగా వున్నది. వీరందరూ కలిసి వస్తే కాస్తసేపటిలో తమాషా చేస్తాను. రాముణ్ని బెదరకొట్టకూడదు. వీడు యిందులో చాలా పనికివస్తాడు. అదుగో అప్పుడే గౌరి వస్తూవున్నది.

[బెదరి బెదరి చూచుచు గౌరి ప్రవేశించుచున్నది.]

గౌరి—అయ్యా! రాముడు మీరు యెందుకో నన్ను రమ్మన్నా రని చెప్పినాడు.

సుబ—అవును. యీవుత్తరం సుమతికి తీసుకుని వెళ్లడం నిమిత్తం పిలువ మన్నాను. అటువంటి సౌందర్యవంతురాలికి వుత్తరం తీసుకుని వెళ్ళడానికి నీవంటి అందగత్తెలు తప్ప యితరులు తగరు.

గౌరి—(తనలో) యితణ్ని పిచ్చవా డంటారేమి? ఈయన మహారాజులాగు మాట్లాడుతూ వున్నారు.

సుబ—(ఉత్తరము చేతి కిచ్చి) యీవుత్తరం తీసుకునివెళ్ళి నీయజమానురాలి కియ్యి. యిదుగో నీబహుమానము. (అని నాలుగు అణా లిచ్చుచున్నాడు.)

గౌరి—(సంతోషముతో) వుత్తరం యిచ్చివస్తాను. వుత్తరంతీసుకొని వెళ్ళినప్పుడల్లా యిలా బహుమానం యిస్తూవుండవలెను.

సుబ—నీవు బహుమంచిదానవు. ఆలాగే యిస్తూ వుంటాను. వేగిరం వెళ్ళు. (అని వీపుమీద తట్టుచున్నాడు.)

[అప్పుడు మతిమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మతి—(తనలో) అడుగో సుబలుడు దాన్ని కొడుతూవున్నాడు. నేను మళ్ళీ యోగదృష్టితో చూచి శాంతపరచవలెను.

గౌరి—(చూచి పరుగెత్తుచు) అదుగో! అయ్యగారు వస్తూవున్నారు. (అని వెళ్ళుచున్నది.)

సుబ—ఆ వెర్రివాడా! (అని మరియొకదారిని వెళ్ళుచున్నాఁడు)

మతి—అయ్యో! కుర్రవాడు తప్పించుకొనిపోయినాడు. పిచ్చ యింత వేగంగా హెచ్చిపోవడం నేను యెక్కడా చూడలేదు.

[రాముఁడు ప్రవేశించుచున్నాఁడు.]

రాము—అయ్యా! మీకోసం యెవరో యిద్దరు పెద్దకుంకం బొట్లు పెట్టుకునివచ్చి వాకిట్లో నిలుచుని వున్నారు. వారిని చూడడంతోటే దెయ్యాలపోతు లేమో నని నాకు భయంవేసింది.

మతి—వారు వైద్యులయివుంటారు. సందేహములేదు. వారిని లోపలికి తిసుకుని రా.

రాము—అదుగో వారే వస్తూవున్నారు.

[సదానందయోగియు, గజానందాసును ప్రవేశించుచున్నారు.]

మతి—(సుబలుని కొఱకు నాలుగు దిక్కులను జూచి) మావాడు యిప్పుడు యెలాగో వెళ్లినాడు. సందేహం లేదు. అతను మళ్లీ యిప్పుడే వస్తాడు. రావడంతోటే అతణ్ని మీకు చూపిస్తాను. మీరు జాగ్రత్తగా వుండవలెను. పయికి చూడడానికి అత నంతపిచ్చవాడుగా కనపడడుగాని యీవ్యాధి మీవంటి ఘనవైద్యులు చక్కగా శోధించ తగ్గ దని తలుస్తాను.

సదా—మీరు చెప్పినదాన్నిబట్టి చూస్తే మీవాడికి పైత్య చలన మని నిశ్చయిస్తాను.

గజా—క్షమించవలెను. అది పైత్యచలనంకాదు. భూతావేశమని నేను భావిస్తాను.

సదా.—మీరు మహాబాగా కనిపెట్టినారు. (తనలో) ఇతనికి యేమీ తెలియదు.

గజా—(తనలో) యేమీ తెలియకపోయినా యితడన్నీ తనకే తెలుసునంటాడు.

మతి.—మీ రతణ్ని సావకాశంగా పరీక్షచేసి చూడవచ్చును. మీరు వైద్యు లని చెప్పక నాస్నేహితు లనిమాత్రము చెపితే అతను మీతో మనసిచ్చి మాట్లాడుతాడు. అలాచేస్తే బాగావుండదా?

సదా—దివ్యంగా వుంటుంది.

గజా—బాగానే వుంటుంది.

మతి — అతనివిషయంలో మీరు బహుజాగ్రతగా వుండవలెను. వొక్కొక్కప్పుడు అతనికి పిచ్చకోపం వస్తుంది. అలాగంటప్పుడు అతను వళ్ళు పై తెలియకుండా దౌర్జన్యం చేస్తాడు. యిందాకా మా నవుకరునూ దాసీదాన్నీ కొట్టినాడు. అయితే నేను వెంటనే వచ్చి యోగదృష్టితో చూచే టప్పటికి ఆ వుద్రేక మంతాపోయి నిముషంలో శాంతపడిపోయినాడు. మీ కేమైనా తొందర కలిగితే నన్ను వెంటనే పిలవండి. నేను వచ్చి యోగదృష్టితో చూచి తక్షణం శాంతుణ్ని చేస్తాను.

సదా—ఈవిషయంలో నాకు మీసహాయం అక్కరలేదు. అది మేము నిత్యమూ చేసేపనే. అదుగో! ఆవచ్చేది అతనే కాబోలును.

[సుబలుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మతి—(రహస్యముగా) అవును. అతనే. (సుబలునితో దగ్గరగా) అబ్బాయీ! వీరిద్దరూ నాస్నేహితులు. బహు తెలిసినవారు. గొప్ప

విద్వాంసులు.

సదా—(మతిమంతునితో రహస్యముగా) ఆముఖలక్షణంచూడగానే నాకు పైత్యచలన మయినట్టు నిశ్చయంగా పొడకట్టుతూవున్నది.

గజా—(మతిమంతునితో రహస్యముగా) అతని చూపువల్ల యిది గ్రహలక్షణ మయినట్టు నాకు స్పష్టపడిపోయింది.

మతి—(ఇద్దరితోను రహస్యముగా) మీరిద్దరూ ఆలోచించుకొని యేదో నిశ్చయం చెయ్యవలెను; యిక మిమ్మలిని యిద్దరినీ యితనివద్ద విడిచి నేను వెళుతాను. (సుబలునితో బిగ్గరగా) అబ్బాయీ! నేను వకసారి లోపలికి వెళ్ళి వస్తాను. ఈలోపుగా నీవు వీరియిద్దరితోనూ మాట్లాడుతూవుండు. వీరు బహుమంచివారు. (అని వెళ్ళుచున్నాడు.)

సుబ—(తనలో) ఈముసలివాళ్ళు యిద్దరూ నా కేసి చూచి యేమో ఆలోచిస్తూవున్నారు. వీరుకూడా మా మామగారియోగపు పిచ్చిలో చేరినవా రనుకుంటాను. (బిగ్గరగా) అయ్యా! దయచెయ్యండి. నేను యీవూరు మంచి దనుకుంటాను.

సదా—బహుమంచిగ్రామం.

గజా—ఇక్కడ సమస్తసదుపాయాలూ వున్నవి.

సుబ—ఈయేడు పంటలు బాగా వున్నవా?

సదా—బాగానే వున్నవి.

సుబ—మీ కేమయినా నల్లమందు వెయ్యడం అలవాటు వున్నదా?

సదా—లేదు. మిమ్మల్ని మేము కొన్ని ప్రశ్నలను వెయ్యవలెనని వున్నది. అడుగవచ్చునా?

సుబ—అడగవచ్చునుగాని నేనే ముందుగా కొన్ని ప్రశ్నలు వేస్తాను. వాటికి జవాబు చెప్పండి. మాతండ్రిగారి మేనమామకొడుకు

మీతల్లిగారిమేనత్త మనుమ శాస్త్రియైతే, అతను పూజారిజాంబ
వంతుడికి యేమవుతాడు?

సదా—యేమీకాడు.

సుబ—యేమీకాకపోతే నన్ను మీరు యిలాగంటి సందర్భం
మాలినప్రశ్నలుమాత్రం వెయ్యకండి.

సదా—(తనలో) నేననుకున్నట్టే యితనిది తప్పకుండా పైత్య
చలనమే. (బిగ్గరగా) మీ రేమీ సందేహపడవలసినపని లేదు. మే
మటువంటి ప్రశ్నలు వెయ్యము. ఏమండీ! గజాననదాసుగారూ! మీ
రేమంటారు?

గజా—యెంతమాత్రమూ వెయ్యము. (తనలో) ఇది భూత
లక్షణమే సందేహము లేదు.

సుబ—అలాగయితే ఆరంభించండి.

సదా—మీవూళ్లో వింతవర్తమానాలు యేమయినావుంటే
చెపుతారా?

సుబ—(తనలో) వీళ్ళు వర్తమానపత్రికలకు వ్రాసేవాళ్ళు
కాబోలును? వీళ్ళకు తగినట్టు చెపుతాను. (బిగ్గరగా) మావూళ్లో వక
లేగదూడ అయిదుకాళ్ళతో పుట్టింది. వకసములావుకు మూడుకొమ్ము
లున్నవి.

సదా—(తనలో) దీనితో యితనికి పైత్యలక్షణమయినట్టు
స్థాపన అయినది. అయినాకాని యింకొక్కప్రశ్నకూడా అడిగి చూ
స్తాను. (బిగ్గరగా) ఇవి వింతసమాచారాలే! రామాయణం విన్నారు
గదా రాముడికి సీత యేమవుతుందో చెప్పగలరా?

సుబ—(తనలో) వీళ్ళు నన్ను పిచ్చవాణ్ని చేసి ఆడించవలె నను
కుంటూవున్నారు. వీళ్ళకు బుద్ధివచ్చేటట్టు జవాబుచెపుతాను. (బిగ్గరగా)

మీకు యీయన అయినట్లు రాముడికి సీత మేనమామ మొగుడవు తుంది. తెలిసిందా?

సదా—(తనలో) ఇక ప్రశ్న లక్కరలేదు. ఇప్పుడు పిచ్చ స్థిర పడ్డది.

గజా—(తనలో) ఇతణ్ని యిప్పుడు దెయ్యం సంపూర్ణంగా ఆవహించి వున్నది. (బిగ్గరగా) అయ్యా! యోగిగారూ! మీ సెల వైతే నేను కూడా యీచిన్నవాణ్ని వకటి రెండు ప్రశ్నలు అడుగు తాను. అబ్బాయీ! యిప్పుడు మీయెదట యెవరైనా నిలుచున్నట్లు కనపడుతూ వున్నారా?

సుబ—కనపడుతూ వున్నారు. మీరు యిద్దరూ నిలుచున్నట్లు కనపడుతూ వున్నారు.

సదా—అబ్బాయీ! మిమ్మల్ని నేను నక్క-ప్రశ్నలడుగుతాను గాని మరివకలాగు అనుకోక సరిఅయిన జవాబు చెప్పండి. మీతండ్రి గారికి యెప్పుడయినా ప్రత్యభ్రిమ వుండేదా?

సుబ—(తనలో) వీళ్ళు బుద్ధిమాలిన ప్రశ్నలు వేస్తూవున్నారు. అయినాకానీ యింకా యేమి అడుగుతారో నక్కనిముషం వోపిక చేసి వింటాను. (బిగ్గరగా) లేదు.

సదా—పోనీ. మీబంధువులలో యెవరికైనా వున్నదా?

సుబ—వున్నది. మామేనమామగారికి యోగపుపిచ్చి వున్నది. (తనలో) ఇఖ నే నీపాడుప్రశ్నలకు జవాబు చెప్పలేను. నిద్రవచ్చినట్లు నటిస్తాను. (అని గోడకుం జేరగిలంబడి కన్నులుమూసికొనుచున్నాఁడు)

సదా—(దగ్గిరకు పోయి మెల్లగా చేయిపట్టుకొని చూచి) చేతిలో ప్రత్యనాడి బాగా ఆడుతూ వున్నది. గజాననదాసుగారూ! మీరుకూడా చూడండి.

గజా—(చేయిపట్టుకొని చూచి) యిది పైత్యనాడికాదు. తప్ప కుండా భూతనాడి ఆడుతూ వున్నది. ఇది గ్రహాలక్షణం.

సుబ—(కన్నులు విప్పి లేచి) మీరు నాకు నిద్రాభంగం కలుగ చేస్తూవున్నారు. మీరు తక్షణం యీగదివిడిచి వెళ్ళకపోయినట్టయితే మిమ్మలిని యిద్దరిని కొట్లోపెట్టి తాళం వేస్తాను. (అని ముందుకు వచ్చుచున్నాడు)

ఇద్దఋ—(చేతు లడ్డము పెట్టుకొని వెనుక వెనుకకు నడుచుచు) తాళండి వెళుతూ వున్నాము. (అని గుమ్మముచేరి పరుగెత్తుచున్నారు)

సుబ—వేగిరం వెళ్లకపోతే యీపొస్తకాలకట్ట పుచ్చుకుని నెత్తి పగలవేస్తాను. (అని రెండుచేతులతోను రెండుతాటాకుల పుస్తకములు విసరి వేయుచున్నాడు.) దెబ్బ తగలలేదు. వాళ్ళు తప్పించుకుని పారిపోయినారు. ఇఖ నేను యీయింట్లో వుండకూడదు. యీ వూళ్ళో యింతమంది పిచ్చవాళ్ళు బాహాటంగా తిరుగుతూవుంటే పట్టుకోకుండా పోలీసువాళ్ళు యేమి చేస్తూవున్నారు? నేను యిప్పుడు మా ముసలి పిచ్చాయనను తీసుకునివెళ్ళి ష్టేషనులో వప్పగించి ఆయన కూతురిని తీసుకుని లేచిపోతాను. సుమతికూడా నేను కనపడినప్పుడల్లా యేదో వింతగా చూస్తుంది.

[సుమతి ప్రవేశించుచున్నది.]

సుమ—(కలయజూచి) యీపుస్తకాలన్నీ యీలాగుపారవేసి వున్నవేమి?

సుబ—సుమతీ! యీపుస్తకాలా?

సుమ—(తనలో) ఇతడే పారవేసినట్టున్నాడు. నన్నేమి చేసిపోతాడో అని నాకు భయం వేస్తూ వున్నది. (అని పరుగెత్తబోవుచున్నది.)

[తేటి పాఱమామను మతిమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మతి—అమ్మాయీ! భయపడకు. అబ్బాయీ! కొంచెం శాంతించు. పుస్తకాలు పాడుచెయ్యకు. (అని మాతనివంక రెప్ప వాల్చక చూచుచున్నాఁడు.)

సుబ—మామా! అంతా చెపుతాను వినండి. నేను మహా నెమ్మదైనవాణ్ణి. నాకు సాధారణంగా కోపం రాదు. యీయింట్లో జరుగుతూవున్న పిచ్చపనులవల్ల నావంటి శాంతుడికికూడా కోపం వస్తూవున్నది. యిఖనైనా మీరు యీపిచ్చపనులు కట్టిపెట్టకపోతే మిమ్మల్నికూడా మెడపట్టుకుని అవతలికి గెంటివేస్తాను.

మతి—(చిఱునవ్వుతో రెప్పవాల్చక చూచుచు) సుబలా! కొంచెం శాంతించు. (తనలో) యిప్పుడు లాంగుబాటులో లేడు. పోలీసుబంట్రోతు వస్తే బాగా వుండును.

సుబ—శాంతిస్తాను. (అని మీదికి వచ్చుచున్నాఁడు)

సుమ—బావా! ముసలాయనజోలికి రాకు. (అని యిద్దఱికిని నడుమ వచ్చుచున్నది.)

మతి—అమ్మాయీ! అడ్డంరాకు. నాకు భయంలేదు. నన్ను యోగదృష్టితో చూడనియ్యి.

సుబ—ఓప్రియురాలా! నీవేమీ భయపడకు. నీతండ్రికి నే నేమీ అపాయం చెయ్యను. మామగారూ! నేను వక్కనిముషం మీతోమాత్రతో మాట్లాడవలెను. దయచేసి మీరు వక్కపర్యాయం అవతలికి వెళ్లండి. (అని సుమతిని ముందుకు లాగుకొని మతిమంతుని మెల్లగా గుమ్మమువద్దకు త్రోసికొనిపోయి యీవలకుఁ బంపి తలుపు వేయుచున్నాఁడు.)

సుమ—అయ్యో! మానాన్నగారు.—

సుబ—సుమతీ! నీ వికారపుచేష్టలు మాని వక్కనిముషం నాతో నెమ్మదిగా మాట్లాడు. యీలావచ్చికూర్చో నాకేసి బెదరి చూడకు. నాహృదయేశ్వరీ! భయం మాని నేను యిప్పుడు తరిమివేసిన యిద్దరు ముసలివాళ్ళూ యెవరో చెప్పు.

సుమ—(కూరుచుండి) వారు పిచ్చివైద్యులు.

సుబ—వాళ్లు పిచ్చివాళ్లని నేను చూడడంతోటే అను కున్నాను.

సుమ—వారికి పిచ్చలేదు. వారు పిచ్చికుదిర్చే వైద్యులు. నీ పిచ్చ యెటువంటిదో చూడడంనిమిత్తం వారు వచ్చినారు.

సుబ—యేడిసినారులే. సుమతీ! భయపడకు. తిన్నగా కూర్చో. నాకేసి మొగం యెత్తిచూడు. మనబాల్యస్నేహమంతా యీనాలుగు సంవత్సరాలలోనే మరచిపోయినావా?

సుమ—(అతనివంక చూచుచు) బావా! నీకు నిజంగా పిచ్చ వున్నదో లేదో చెప్పు.

సుబ—నీకలాగంటి సంశయం యెందుకు కలిగింది?

సుమ—తల్లి పోయినప్పటినుంచీ మీమేనల్లుడికి విచారంచేత పిచ్చయెత్తిపోయిందని మానాన్నగారిపేర మీబాబయ్యగారే వ్రాసి నారే.

సుబ—దాని కర్థం స్పష్టంగా తెలుస్తూనే వున్నది. విచారం చేత పిచ్చయెత్తిపోయిందంటే దుఃఖంచేత యేమీ తోచకుండా వున్న దని అర్థం నీకు బోధపడలేదా? నన్ను చూచినతరువాత యిప్పుడైనా నాకు పిచ్చ లేదని నీకు నిశ్చయం కలిగిందా లేదా?

సుమ—నీవు యిప్పుడు మంచివాడవులాగే కనపడుతూ వున్నావు.

సుబ—అలాగైతే నిన్ను వక్కప్రశ్న అడుగుతాను. నిజం చెప్పు. నిన్ను మీనాన్నగారు యెవరికైనా యిచ్చి వివాహం చెయ్య డానికి నిశ్చయించినారా యింకా లేదా?

సుమ—(తలవంచుకొని) యింకా యెవరికీ యివ్వడానికి నిశ్చ యం చెయ్యలేదు.

సుబ—అలాగయితే నన్ను వివాహం చేసుకోడానికి. నీకు యిష్టం వున్నదా? మనం యిద్దరమూ మేనత్తమేనమామ బిడ్డలమూ బాల్యస్నేహితులమూ మాత్రమే కాకుండా యేకశరీరులము కూడా కావలెనని నాకు కోరిక వున్నది. వేగిరం చెప్పు.

సుమ—నేను ఆలోచించుకొని చెపుతాను.

సుబ—ఆలోచనా లేదు యేమీా లేదు. వప్పుకో.

సుమ—నీవు యీాసంగతి మానాన్నగారిని అడగవలెను.

సుబ—ఆయన వప్పుకోడు. ఆయన యిప్పుడు నన్ను చేసిన అవమానానికి నేను తగినపని చేస్తాను.

సుమ—నీవు అలాగింటిపని యెంతమాత్రమూ—

సుబ—తొందరపడబోకు. నిజంగా నేను యేమీా చెయ్యను. పరియాచకానికి వక్కతమాషా చేస్తాను. ఇందులో నాకు నీవు కూడా సహాయం చెయ్యవలెను.

సుమ—అదేమిటో అంతా నాతో చెప్పు.

సుబ—ముందుగా చెప్పడానికి వల్లకాదు. కాని కొంచెం సేపటికి నీకదంతా తెలుస్తుంది. ఆయన నన్ను పిచ్చవాణ్ణిగా కట్టి వేసినాడు. ఆయనవిషయంలో ఆపని నేను చేస్తే ఆయనకు యేలాగ వుంటుందో చూతాము.

సుమ—ఆయనకు యేమీా శరీరబాధమాత్రం చెయ్యకు. ఆయన

పిలుస్తూవున్నారు. నేను తలుపుతీసి లోపలికి వెళ్ళిపోతాను. (అప్రకారముగా చేయుచున్నది.)

[మంగలికత్తి చేతఁబట్టుకొని మతిమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మతి—(తనలో) నేను యిప్పుడు యితనికి తల గొరగవలెను. లేకపోతే పిచ్చి నిమ్మళించదు.

సుబ—(తనలో) ఇతడు మంగలికత్తి తెచ్చినాడు. గొంతుక కోస్తాడా యేమిటీ? (బిగ్గరగా) మామా! ఆగండి. ఆచేతిలోది దూరంగా పెట్టండి.

మతి—(తనలో) ఇతని కప్పుడే అనుమానం కలిగింది. యేమరి పాటుగా వున్నప్పుడు ఆపని చెయ్యవలెను. (బిగ్గరగా) అబ్బాయీ! నాదగ్గిరగా వచ్చి కూర్చో.

[గౌరి ప్రవేశించుచున్నది.]

గౌరి—(మతిమంతునితో) అయ్యా! తమకోసం యెవరో తమాషావేషం వేసుకుని వకమనిషి వచ్చినాడు. (అని తనలో నవ్వుకొనుచు సుబలునికి చేసైగ చేయుచున్నది.) అతను ఠాణానుంచివచ్చినా నని చెప్పినాడు.

మతి—అతణ్ని లోపలికి తీసుకుని రా. తక్షణం తీసుకుని రా. (తనలో) సందేహం లేదు. అతను పోలీసు బంట్రోతు. అతను మంచి సమయంలో వచ్చినాడు. అతను యితనితల గట్టిగాపట్టుకుంటే యీ కత్తితో నేను క్షవరంచేస్తాను. (అని కత్తి పయికి తీయుచున్నాఁడు.)

గౌరి—యిప్పుడే తీసుకునివస్తాను.

(అని వెళ్ళుచున్నది.)

సుబ—(మతిమంతుని మొగమువంక చూచుచు) ఈముసలాయనకు నిజంగానే పిచ్చి అనుకుంటాను.

[మొగము కనఁబడకుండ ఎఱ్ఱతలగుడ్డ వికారముగా చుట్టుకొని రాముఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మతి — ఇఖ నేను సిద్ధంగా వుండవలెను. (అని కత్తి క్రిందపెట్టి బట్ట సవరించుకొనుచున్నాఁడు.)

సుబ — ఇడుగో రాముడు వచ్చినాడు. నాఅదృష్టం బాగా వున్నది. (అని రామునకు చేసైగచేయఁగా రాముఁడు మరల సైగ చేయు చున్నాఁడు.) మామా! ఈమనిషివేషం బహువిచిత్రంగా వున్నది. యితడు యిక్కడికి యెందుకు వచ్చినాడు?

మతి — యెందుకూలేదు. వూరికే వచ్చినాడు. యితడు గారిడీ చేస్తాడు. (అని రామునిదగ్గరకు పోయి సుబలుని చూపి సైగచేసి మెల్లగా) నేను పట్టుకోవడానికి కబురుపంపించినచిన్నవాడు యితడే. నీవు భయపడకుండా గట్టిగా పట్టుకోవలెను.

రాము — మీరు ముందు నడవండి. ముసలివారు మీరేభయ పడకపోతే నేను భయపడుదునా?

మతి — (రామునితో) నేను యోగదృష్టితో చూచి అతణ్ని కదలమెదలకుండా చేస్తాను. అతడు నిశ్చేష్టితుడై చిత్రప్రతిమలాగు. వున్నప్పుడు నీవు వెళ్ళి పట్టుకోవలెను.

రాము — మీ యోగదృష్టి గీగదృష్టి యేమీ నాకు సహాయం అక్కరలేదు. నేను సిద్ధంగా వున్నాను.

మతి — నే నాకుర్చీ తెచ్చి యితనికి యెదురుగా వేసుకుని కూర్చుంటాను. (అని వెళ్లుచున్నాఁడు.)

సుబ — (రామునితో) ఆతడు కుర్చీలో కూర్చోవడంతోటే నీవు వెనుకనుంచి తాళ్ళువేసి వెంటనే కట్టవలెను.

రాము — మంచిది అలాగే చేస్తాను. ఇయిగో తాళ్ళు నాచే

తులో సిద్ధంగానే వున్నవి. (అని చూపుచున్నాఁడు.)

మతి—(కుర్చీ తెచ్చి సుబలున కెదురుగా వేసికొని కూరు చుండి రెప్పవాల్చక సుబలుని చూచుచు) అబ్బాయీ! జాగ్రతగా కూర్చో (అని వెనుకతిరిగి రామునికి సైగలు చేయఁగా సుబలుఁడుకూడ సైగలు చేయుచున్నాఁడు) అబ్బాయీ! నీవు యిందాకా చాలా దురుసుగా వున్నావు. ఇప్పుడు నెమ్మదిపడ్డావనుకుంటాను. (అని రెప్ప వాల్చక మరల సుబలుని చూచుచున్నాఁడు.)

సుబ—అవును (అని కన్ను లరమోడ్చి కుర్చీకి జేరగిలఁబడి కూర్చుండి నిద్రపోయినట్లు నటించుచున్నాఁడు.)

మతి—(మెల్లగా) ఇదే సమయం. ఇతడు నాతపోమహిమచేత యోగనిద్రలోపడి దేహం తెలియకుండా వున్నాడు. ఇతణ్ని యిప్పుడు పట్టుకుని కట్టిపెట్టవెయ్యి.

రాము—అలాగే చేస్తాను. మీరు రెప్పవాల్చకుండా అతని కేసి చూస్తూవుండండి. (అని తాళ్ళు పయినుండి పోనిచ్చి మతిమంతు నినే కుర్చీ కంటకట్టుచున్నాఁడు.)

మతి—(పెనఁగులాడుచు) ఓరి బుద్ధిహీనుఁడా! ఇందులో నీవు పొరపాటుపడి: వకరినికట్టడానికి వకరిని కట్టినావు.

రాము—వూరికే పెనగులాడకండి. నేను యెప్పుడూ: పొర పాటుపని చేసేవాణ్ని కాను. (అని మరింత గట్టిగా బిగించి కట్టు చున్నాఁడు.)

మతి—(కోపముతో) ఇదేమిపని? నేను చెప్పినాకాని నీకు బుద్ధిరాకుండా వున్నదేమి? పిచ్చివాణ్ని నేను కాను. నాకు యెదు రుగా కుర్చీమీద కూర్చున్న అతడు పిచ్చివాడు.

రాము—(అద్భుతపడ్డట్టుతలయూచుచు) పిచ్చివాళ్లు యెప్పుడూ

యిలాగే అంటూవుంటారు.

సుబ—నాకు బహువిచారంగా వున్నది?

రాము—నాకూ విచారంగానే వున్నది. అయినాకానీ పిచ్చి వాళ్ళ విషయంలో చెయ్యవలసినపని చెయ్యక తప్పదు.

మతి—(ఆగ్రహముతో) ఓరి పశువా! నేను పిచ్చివాడ నటా? (అని పండ్లు పటపట కొరుకుచున్నాడు.)

రాము—ఇతనిది సాధారణమయిన పిచ్చి కాదు. నేను యింత మంది పిచ్చివాళ్లను చూచినాను గాని ముసలితనంలో యిలా పళ్ళు కొరికేపిచ్చి నేను యిదివరకు యెక్కడా చూడలేదు. మీరేమంటారు?

సుబ—అవును. ఇది బహుప్రబలమయిన పిచ్చి.

మతి—సుబలా! నీవు పిచ్చిలోవుండి యీదౌర్జన్యంలో నీవు నాకు యేమీ సహాయం చెయ్యలేని స్థితిలో వున్నందుకు నాకు బహు వ్యసనంగా వున్నది.

సుబ—నాకూ వ్యసనంగా వున్నది.

రాము—ఈపిచ్చాయనతో మాటకుమాట జవాబు చెప్పకండి.

మతి—ఓరామా! ఓసుమతీ! ఓగారీ! వేగిరంవచ్చి నన్ను వదలించండి. (అని పెనగులాడుచు కేకలు వేయుచున్నాడు.)

[సుమతి ప్రవేశించుచున్నది.]

సుమ—అయ్యో!—

మతి—(వికారముగా కాళ్లును చేతులును గింజుకొనుచు) అమ్మాయీ సుమతీ! రా. వేగిరం రా. నాకట్లు విడిపించు. పిచ్చివాణ్ని నేను కానని యీపశువుతో చెప్పు.

సుమ—(ఏడ్చుచు) అయ్యో! గొప్పవిపత్తువచ్చినది. యీమధ్య మీచేష్టలుచూచి యెప్పుడో యింతగతిపడుతుందని నేను యిదివరకే

భయపడుతూవున్నాను.

రాము—అమ్మా! యెందుకు విచారిస్తావు? పిచ్చవాణ్ని కట్టి వేస్తే క్షేమమేకాని యెవరికీ విపత్తు లేదు.

మతి—(కన్ను లెఱ్ఱఁజేసి పండ్లు పటపట కొఱుకుచు) పరమ నిర్భాగ్యురాలా! బుద్ధి లేకుండా నీవుకూడా నీతండ్రికి పిచ్చ అంటూ వున్నావా? చూడు నిన్ను—(అని ముందుకు జరుగుచున్నాఁడు.)

సుమ—(పరుగెత్తి) సుబలా! నన్ను రక్షించు. ఓరీ! అబ్బీ! నీవు అయినను గట్టిగా పట్టుకుని నామీదికి రాకుండా చెయ్యలేవా?

రాము—చేస్తాను. మనయింట్లో చేంతాడు యెక్కడ వున్నది?

మతి—(కోపముతో) ఓరిశుద్ధమున్నపోతా! నీకండకానరం—

రాము—ఈయనను చూడండి. ఈయనపని యీలా కుదరదు. అయ్యా! సుబలా! ఈయనకు క్షవరం చేసి నిమ్మకాయల పులుసు పట్టించి నీళ్ళు పోస్తేనే కాని ఈవుద్రేకం తగ్గదు.

సుబ—అలా చేతాము. దీనితో పిచ్చ బొత్తిగా పోకపోయినా కొంచెం ఉపశాంతి కలుగుతుంది. (అని క్రిందనున్న మంగలికత్తి తీయఁబోవుచున్నాఁడు.)

మతి—(మరింత గట్టిగా గింజుకొనుచు) సందేహం లేదు. వీళ్లు యిప్పుడు నన్ను చంపివేస్తారు. వక్కసారి నేను వీళ్ళను యోగదృష్టితో చూచి స్తంభింపజేస్తినా—

[సుబలుఁడును, రాముఁడును మతిమంతుని తలగొఱుగుటకు సిద్ధపడుచుండఁగా సదానందయోగియు, గజాననదాసును ప్రవేశించుచున్నారు.]

సదా—(గజాననదాసుతో) ఇది మరీవింతగా వున్నది.

సుబ—(వెనుక తిరిగి వారిని చూచి) ఇరుగో యీయనపిచ్చ స్నేహితులుకూడా వచ్చినారు. రామా! వక్కనిముషం ఆగు,

రాము — ఈలోగా నీళ్ళతో తల తడుపుతూవుంటాను.

సుబ—వద్దువద్దు. (అని మతిమంతుని వెనకవైపునున్న సదా నందయోగి గజాననదాసులవద్దకు వెళ్లుచున్నాడు.)

రాము—మంచిది. (అని వెనకతిరిగి చూడకుండ మతిమంతుని కుర్చీలో సదిమి పట్టుచున్నాడు.)

సుబ—(ఆ వైద్యులచేతులు పట్టుకొని)మీరు మంచిసమయంలో వచ్చినారు. మీరాక నాకు బహుసంతోషంగా వున్నది.

సదా—నాకూ సంతోషంగానే వున్నది.

గజా—నాకూనూ.

సుబ—మీరు యిటువంటిఘనవైద్యులన్నమాట నాకు మొట్ట మొదట తెలియలేదు. మీరు యిద్దరూ ధన్వంతరియొక్క అపరావ తారాలు.

సదా—ఈచిన్నవాడు చాలాబుద్ధిమంతుడులాగు కనపడుతూ వున్నాడు.

గజా—అయ్యో! మీరు మహాసరసులు.

మతి - (వారి కంఠస్వరము గుఱుతుపట్టి) ఓసదానందయోగీ! గజాననదాసా! మీరు యిది చూచినారుగదా? నన్ను మీరు చూడ గలరుగాని మిమ్మలిని నేను చూడలేను. మాయింట్లోవున్నవారందరికీ నక్కసారిగా పిచ్చెత్తిపోయింది. ఈపనుపాత్రియుడు పోలీసువాడి వేషం వేసుకునివచ్చి నన్ను కట్టివేసినాడు.

సుబ—అయ్యో! మా మామగారు యెటువంటిదురవస్థలో వున్నారో మీరు చిత్తగించినారా?

రాము—యెవరికీ హాని కలుగలేకుండా తన్ను కాపాడుతూ వున్నవాణ్ని నన్ను యెలాగు దూషిస్తూ వున్నారో చూచినారా?

సదా—ఇదిగో వచ్చి చూస్తాము. (అని వారిద్దరును చేరువకు రాఁగా రాముఁడు ముందుకు వచ్చుచున్నాఁడు.)

మతి—ఇప్పుడు కన్నులయెదటికి వచ్చినావు. ఇఖ యోగ దృష్టితో చూచి నిన్ను నిముషంలో నాస్వాధీనం చేసుకుంటాను. (అని రామునివంక రెప్పవాల్చక చూచుచున్నాఁడు.)

రాము—మీామంత్రం పారకుండా నేనూ మిమ్మలిని యోగ దృష్టితో చూస్తాను. (అని గ్రుడ్లు పెద్దవిచేసి తేఱిపార చూచుచున్నాఁడు.)

సదా—(మతిమంతునివంక చూచి) ఈయన వెర్రిచూపులు చూస్తూవున్నాడు. గుడ్లు పెద్దవయినవి. ఇది పిచ్చ కావడానికి సందేహం లేదు. నేను మొదటినుంచీ యీాయనకు యెప్పుడో పిచ్చ యెత్తుతుందనే అనుమానపడేవాణ్ని.

గజా—(మతిమంతుని తేరిపార చూచి) ఆముఖచిహ్నాలనుబట్టి చూస్తే యిది భూతావేశంగా తోస్తూవున్నదిగాని చూపులలో పిచ్చ లక్షణం యెంతమాత్రము కనపడడం లేదు.

సదా—మనం నాడికూడా పరీక్షచేసి చూతాము.

రాము—అయ్యా! వైద్యులు చెయ్యి చూస్తారట. మీాచెయ్యి వక్కమాటు చాపండి.

సదా—అయ్యా! కుడిచెయ్యి యిలాగివ్వండి. (అని మణికట్టు పట్టుకొనుచున్నాఁడు.)

గజా—ఎడమచెయ్యి నాచేతి కియ్యండి. (అని పట్టుకోఁబోవుచున్నాఁడు.)

మతి—(చేయి వదల్చుకొని గింజుకొనుటచేత కట్టినవ్రాళ్ళు కొంచెము వదులు కాఁగా కుర్చీతో లేచి) ఓ ముసలిగాడిదెకొడుకు

ల్లారా! మిమ్మలిని యిద్దరినీ తల బద్దలుకొడుతాను వుండండి. నాకు కాదు మీకే పిచ్చయెత్తింది. (అని యిద్దరిని చెతిరొయొకగుద్దును వేయఁగా వారు పరుగెత్తుచున్నారు.)

రాము—(మతిమంతునికుర్చీకాళ్ళు పట్టుకొని వెనుకకులాగుచు) మీకు భయం లేదు. మెల్లిగా పరుగెత్తండి.

మతి—పిచ్చికుక్కలకొడుకుల్లారా పారిపోకండి. (అని కుర్చీతో రాముని వారికేసి యీడ్చుచు రాముఁడును తానును ముందుకు పడు చున్నారు.)

సుబ—అయ్యో! (అని నవ్వు పట్టలేక నోటికి చేయడ్డము పెట్టుకొని క్రింద కూలఁబడుచున్నాఁడు.)

సుమ—అయ్యో! (ఏడ్చుచు తండ్రికి సహాయపడుటకు పరుగెత్తు చున్నది.)

రాము—నామోకాళ్ళు విరిగిపోయినవి. (అని లేచి సుమతి సహాయముతో మతిమంతుని కుర్చీకట్లు విప్పుచున్నాఁడు.)

సుమ—బాబయ్యగారూ! మీకు దెబ్బ తగలలేదు గదా? సుబలా! నీవు వట్టి అల్లరివాడ వయినావు. (రాముని మొగమువంక చూచి) ఓస్సి! ఏడు మన రాముడేనా? తలగుడ్డా వేషమూ చూచి యెవరో అనుకున్నాను.

మతి—(మెల్లగా లేచి) రాముడా? వీడికీచేటుకాలం వచ్చిం దేమి? యిందులో యేదో కుట్ర వున్నది. (వెనుక తిరిగి సుబలుఁడు నవ్వుచుండుట చూచి) ఆ పిచ్చకుర్రవాఁడు యేలా నవ్వుతూవున్నాడో! ఇదంతా అతనిపని అయివుంటుంది.

సుబ—మామా! మీకు వెయ్యినమస్కారాలు చేస్తాను. ఈపని చేసినందుకు నన్ను క్షమించండి. మీదగ్గిర చేరేవాళ్ళూ మీ

దగ్గిర యోగమనీ మంత్రాలనీ మాట్లాడేవాళ్ళూ యెటువంటివాళ్ళో చూపించడానికి నేను యీపని చేసినాను.

మతి—(తనలో) వీడు మహా తెలివయినవాడుగా కనపడుతూ వున్నాడు. (బిగ్గరగా) అబ్బాయీ! యిక యీవైద్యులనిద్దరినీ మన యింటికి యెప్పుడూ రానియ్యను. నేను నీవన్నట్లు యోగపుపిచ్చ మానివేసి తెలివి గలిగి వుంటాను.

రాము—వీరిద్దరూ సఖ్యపడ్డారు. ఈయన నాతాళం పట్టిస్తాడు. దూరంగా వెళ్ళవలెను.

మతి—(రాముని జూచి) పోకు. ఆగు. నీకు యేమిశిక్ష చెయ్య వలెనో నాకు తెలియకుండా వున్నది.

రాము—ఈచిన్నవాడిదిగాని యిందులో నాతప్పితం యెంత మాత్రమూ లేదు.

మతి—చాలును. ఈపాటి నోరుమూసుకో. నిన్ను పనిలో నుండి తీసివెయ్యవలెను.

[అంతట గౌరి ప్రవేశించుచున్నది.]

గౌరి—అయ్యా! మీరు నామనవి చిత్తగించవలెను.

మతి—ఓసీ! నీ వీగాడిని పెళ్ళాడుతావా? నిన్ను తరుముతాను.

రాము—ఏమి? గౌరీ! నన్ను పెళ్ళిచేసుకుంటావా?

గౌరి—అయ్యగారియిష్టం వుంటే నేను వద్దంటే మానుతుందా?

మతి—(తనలో) బాహా మరదలూ వాళ్ళు యెట్లా మాట్లాడు కుంటూవున్నారో!

సుబ—మామగారూ! మీస్నేహితులను పంపించి వారిచేత నన్ను కావలసినన్ని ప్రశ్నలు వేయించినారు. మిమ్మలిని నేను వక్క ప్రశ్న వేస్తాను. దానికి జవాబు చెప్పండి. మీకోమార్తైను నాకు

యిస్తారా యివ్వరా చెప్పండి.

మతి—అమ్మాయీ! యిదేమిటి? ఇతనిజబ్బుసంగతి నీ వెరుగుదువు గదా.

సుమ—ఆవిషయంలో నా కేమీ భయంలేదు. నేను వుపచారం చేస్తూవుంటే యితని కన్నిపిచ్చలూ పోతవి.

సుబ—ఆమాట నిశ్చయం. మీ రావిషయంలో యేమీ భయపడవలసిన పనిలేదు. యిప్పుడు నేను మీకు మంచివాణ్ని కానని తోస్తే యిక ముందైనా మీచేత నిజంగా మంచివా ణ్ననిపించుకోవడానికి ప్రయత్నంచేస్తాను. నా నడతవల్లనే మీ కన్నీ తెలుస్తవి.

మతి—అమ్మాయీ! నీచుట్టూ పిచ్చికొడుకులనూ పిచ్చికూతుళ్ళనూ పెట్టుకోవడానికి నీకు యిష్టంవున్నట్టయితే నీకోరికకు నేను యేమీ అడ్డం చెప్పను. ఇంతలేసీ యింతలేసీ పిల్లవాళ్లను నేను నిత్యమూ యోగదృష్టితో చూస్తూ యీకంటితో యిద్దరినీ ఆకంటితో యిద్దరినీ శాంతపరుస్తూ వుంటాను. నాయోగమహిమ లోకానికి కనపరచడానికి నాకు ముందు మంచిఅవకాశం కలుగుతుంది. (సుమతిని సుబలుని చెఱియొకచేతితోను నిమురుచు) బిడ్డలారా! మీరు దీర్ఘాయుష్మంతులయి సుఖపడండి.

రాము—(గౌరిచేయి పట్టుకొని ముందుకువచ్చి) అయ్యా! మీరు మమ్మలినికూడా వక్కమాటు ఆశీర్వదించండి. యిదే నాకు మీ ఆఖరుదీవెన. ఇదివరదాకా స్వతంత్రంగా వుండేవాణ్ని. ఇప్పుడు యీగౌరమ్మచేతులో పడ్డాను. ఇది యిక నన్ను నగలు తెమ్మని చంపుతుందో బ్రతికిస్తుందో దేవుడికి తెలియవలెను. మీకు నాచావు తప్పించవలెననివున్నట్టయితే రెండువందలరూపాయలు ఇవ్వండి. నగలు చేయించుకుంటాము. మీ పాతతాటాకులపుస్తకాలు వకకావడి నాకు

దయచేసినారంటే యీశీతాకాలము చలిమంటవేసుకుని మీరు పెళ్ళి చేయించినందుకు మీపేరు చెప్పుకుని సుఖపడుతాము. అప్పటితో నాకు నిత్యమూ పురుగులు దులపవలసిన బాధకూడా విరగడై పోతుంది.

మతి—ఓరీ మోటపశువా! పవిత్రమైన పుస్తకాలవిషయమై అటువంటి మాటలంటే పాపం వస్తుంది. వూరుకో.

సుమ—రామా! బాబయ్యగారి మనసు నొచ్చేమాట లనకు. మావివాహం అయిన తరువాత మిమ్మలిని ఇద్దరిని మాదగ్గిర వుంచుకుని నీపెళ్ళాము నిన్ను మింగివెయ్యకుండా కాపాడుతాములే.

సుబ—మామగారూ! మీరు నన్ను నిష్కారణంగా పిచ్చవాణ్ని చేసినారు. అందుచేత నేను మిమ్మలిని మళ్ళీ పిచ్చివాణ్ని చేసినాను. వంతుకువంతు సరిపోయింది. క్షమించి ఇక మీరు చెయ్యవలసిన పని శీఘ్రంగా చేయించండి.

మతి—రండి లోపలికి వెళుదాము. రామా! నీవు బంధువులకందరికీ శుభలేఖలుతీసుకొని వెళ్ళవలెను. రేపు ప్రయాణానికి సిద్ధంగా వుంతు.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

# మహాపంచకప్రహసనము

ఇందు వచ్చుపాత్రములు.

—:o:—

జియ్యరుసూరి—ధనికుఁడగు నొక చైతన్యమతస్థుఁడు.

దామోదరుఁడు—జియ్యరుసూరి సేవకుఁడు.

నారాయణుఁడు—కంఠీరవదేవుని సేవకుఁడు.

శ్రీమన్మహామండలేశ్వర కంఠీరవదేవు—రామామణి ప్రియుఁడు.

పంచకాచార్యులు—కంఠీరవదేవుని కల్పితజనకుఁడు.

భవానిసింగు—రాజభటుఁడు.

శివప్రసాదు—రాజభటుఁడు.

రామామణి—జియ్యరుసూరికూఁతురు.

పార్వతి—జియ్యరుసూరి దాసి.

---

౧. రంగము—బృందావన గ్రామములోని జియ్యరుసూరి యిల్లు.

[దామోదరుఁడును పార్వతియు ప్రవేశించుచున్నారు.]

దామో—ప్రొద్దున్నే లేవడంవల్ల యెంతలాభం వున్నదో చూచినావా! యెవరయినా చూచిపోతారనే భయంలేకుండా మనం స్వేచ్ఛగా సరసాలాడుకుంటూ వున్నాము.

పార్వ—మన యజమానుడుగారు లేచి వచ్చేవేళ అయింది. ఆయన యీసమయంలో యిక్కడకు వస్తే యేమనుకుంటారు?

దామో—ఆయన మన యిద్దరిపెళ్ళి చెయ్యవలెననుకుంటారు. ఆయన యేమనుకుంటే యేమిలే. నేను అనేదాన్ని విను. నేను

యిక్కడ పనిచేస్తూవున్న పది సంవత్సరాలలోనూ నాజీతంలోనుంచీ నాహస్తలాఘవంచేతనూ నూరురూపాయలు కూడబెట్టినాను. అనుభవించేవారు లేకపోతే పదేళ్ళనుంచీ కూడబెట్టిన యీసొమ్మంతా వ్యర్థమయిపోతుంది.

పార్వ—నేను అనుభవిస్తాను. ఆసొమ్ము నాకియ్యి.

దామో—వూరికే అనుభవించడంకాదు. నీవు నాతో కలిసి అనుభవించవలెను.

పార్వ—మనం యిద్దరమూ కలిసే అనుభవింతాము. మన అమ్మగారు కంఠీరవదేవుడిగారిని మోహించినసంగతి నీవు విన్నావా?

దామో—ఆవిడె కతనిమీద మోహంవున్నసంగతి యెరుగుదును గాని, అయ్యగా రావివాహానికి వప్పుకోరు. ఆయనకు యీసంగతి తెలియడంతోటే—

జియ్యరుసూరి—(వెలుపలినుండి) దామోదరా! మొఖంకడుక్కోవడానికి నీళ్ళు.

దామో—అదుగో అయ్యగారు లేచినారు. నేను వేగిరం వెళ్లవలెను. వక్కముద్దు పెట్టు వెళ్లిపోతాను. (అని వెళ్ళుచున్నాడు.)

పార్వ— దామోదరుడు వెళ్ళిపోయినాడు. వీడు నాకంటికి మన్మథుడులాగు వున్నాడు. పైత్యహరమని అయ్యగారు పొద్దున్నే పెసరట్టు ఫలహారం చేస్తారు. నేను అన్నీ సిద్ధంచెయ్యవలెను. అదుగో టపాబంట్రోతు దొడ్డితోవను వుత్తరం తీసుకునివచ్చినాడు. ఇది రామామణిగారికి కంఠీరవదేవుడుగారు పంపించినదయి వుంటుంది. నేను వెళ్లి పుచ్చుకుంటాను. (అని వెళ్లుచున్నది.)

[దామోదరుడు వెంటరాగా జియ్యరుసూరి ప్రవేశించుచున్నాడు.]

జియ్య—దామోదరా!

దా మో.—అయ్యా!

జి—యేమీ లేదు. నీతో చెప్పకూడదు. పెసరట్టయిందా?

దా—అయింది. అయ్యా! నాతో—

జి—నీతో చెప్పను. విస్తరి తీసుకుని రా.

దా—చిత్తం దయచేసి—

జి—వూరుకో? రొట్టెలు తీసుకుని రా.

దా—తీసుకువస్తాను.

జి—వచ్చేటప్పుడు రాత్రి వచ్చిన వృత్తాంత పత్రిక కూడా తీసుకుని రా.

దా—చిత్తం. (అని వెళ్లుచున్నాఁడు.)

జి—(పీటమీఁద కూరుచుండి) నేను యీవూరికివచ్చి యీ తోట యింట్లో ప్రవేశించి ఖులాసాగా వున్నాను. ఆపెద్దమేడలో వున్నప్పుడు సన్నందరూ వచ్చి డబ్బుకోసం వూరికే బాధపెడుతూ వుండేవారు. ఈయిల్లు వూరిచివరను మారుమూలను వుండడంచేత యిక్కడకు ఆట్టేమంది రారు. అదుగో దామోదరుడు వార్తాపత్రిక పట్టుకుని వస్తూవున్నాడు.

[దామోదరుఁడు పెసరట్లును, వృత్తాంతపత్రికయు, ఉత్తరమును పట్టుకొని ప్రవేశించుచున్నాఁడు.]

దా—పెసరట్లు—

జి—పెసరట్లు కిందపెట్టి పత్రిక ముందుగా యిలా ఇయ్యి.

(అని పుచ్చుకొనుచున్నాఁడు.)

దా—అయ్యా! పెసరట్లు చాలునా? యింకా రెండు తేనా?

జి—చాలును. వకటి యిలా చేతికందియ్యి. (అని పత్రిక విప్పి చదువుచున్నాఁడు)—“ఇప్పుడు కొత్తమోస్తరు మోసాలు మహా

యెక్కువవుతూ వున్నవి. కాకినాడలో వారంరోజులకిందట మంచి బట్టలు కట్టుకొని గోపాలదాసని పేరుపెట్టుకుని బంధువుడనని వక పెద్దమనిషియింట్లో ప్రవేశించి వారియింట్లో భోజనంచేసి తరువాత వారియింట్లో వున్న వస్తువులు కొన్ని యెత్తుకొని వకదుపారిపోయినాడు. అతనిజాడ యింకా యేమీ తెలియలేదు. దర్యాప్తు చెయ్యగా అతని నిజమయిన పేరు వంచకాచార్యుడనిన్నీ, అతను యింకా అనేక చోట్ల యిటువంటి మోసాలు చేసినాడనిన్నీ పోలీసువారికి తెలియవచ్చింది."—ఇది వట్టి పాడుప్రపంచము. అందరూ మోసగాళ్ళుగానే కనపడుతూ వున్నారు. యెవరినీ నమ్మకూడదు. మనం బహుజాగ్రతగా వుండవలెను. (అని రొట్టె నములుచు) దామోదరా! మంచి తీర్థం తీసుకుని రా.

దా—మీపీటదగ్గరనే పెట్టినాను. తమరు సెలవిచ్చినట్లు యీ లోకం వట్టి పాడులోకంగా కనపడుతూవున్నది. యిక యీలోకం వదలిపెట్టి మరియెక్కడికైనా లేచి వెళ్ళవలెను.

జి—రొట్టెలు బాగా వున్నవి కావు. వీటిని తీసుకుని వెళ్ళు. నీచేతిలోనిది యేమిటి?

దా—ఇదా? వుత్తరం టపాబంట్రోతు యిప్పుడే తీసుకుని వచ్చినాడు.

జి—(చేతితో పుచ్చుకొని) ఈవుత్తరం నాకేనా?

దా—కాదు. అమ్మగారికండి.

జి—అమ్మాయిదా! ఇదిదానిప్రియుడు వ్రాసిందయివుంటుంది.

దా—అందుకు నాకేమీ సందేహంలేదు.

జి—నీకు సందేహం యెందుకు వుండవలెను? నీవు వెళ్ళి మా అమ్మాయిని వెంటనే యిక్కడికి పంపించు.

దా—చిత్తం. (అని వెళ్ళుచున్నాఁడు.)

జి—వీడు వూరికే అధికప్రసంగం చేస్తాడు. యిఖ ముందు వీణ్ని విస్తారం మాట్లాడకుండా వుండేటట్టు చేసి యేప్రశ్న అడిగితే ఆప్రశ్నకు మాత్రమే జవాబు చెప్పేటట్టు చెయ్యవలెను. అదుగో అమ్మాయి వస్తూవున్నది.

[దా మోదరునివెంట రామామణి ప్రవేశించుచున్నది.]

రామా—నాన్నగారూ! మీవద్దకు నాది యేదో వుత్తరం వచ్చిందట. యిప్పిస్తారా?

దా—వుత్తరం వచ్చినసంగతి నేనే యీమెతో చెప్పినాను.

జి—నీవే చెప్పినావు గనుక నీవే అనుభవించు.

(అని నెత్తిమీఁద రెండుదెబ్బలు వేయుచున్నాఁడు.)

దా—నేను యిఖ యెప్పుడూ చెప్పను. పారిపోతాను. (అని పరుగెత్తుచున్నాఁడు.)

జి—అమ్మాయీ! యిదుగో నీవుత్తరం. యీవుత్తరాలసంగతి నాకు బాగా తెలుసును. కాముకులు వ్రాసే యిటువంటి వుత్తరాలను నమ్మి నీవు యెప్పుడూ మోసపోవద్దు. లోకానుభవం తెలిసినపెద్దవాణ్ని గనుక నీకు బుద్ధి చెప్పుతూవున్నాను.

రామా—(తనలో) ఆలాగయితే యిది కంఠీరవదేవుగారు వ్రాసిందని యీయనకు తెలిసిందికాబోలును.

జి—యిందుకోసం నాకు నీమీద కోపం లేదు. యిది యెవరు వ్రాసిందో చెప్పు నాకు అంతేచాలును.

రామా—మీతో అంతా చెప్పుతాను. యీవుత్తరం వ్రాసిన ఆయన బహుగొప్పవాడు. నిజమయినప్రేమచేతనే నన్ను వరించినాడు. ఆయన పేరు—

[కేకలు వేయుచు దామోదరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

దా—శ్రీమన్మహామండలేశ్వర కంఠీరవదేవుగారు.

రామా—ఆయన యిక్కడికే వచ్చినారా? అలాగయితే నేను వెళ్ళవలెను. (అని వెళ్ళుచున్నది.)

జి—మహామండలేశ్వరుఁడా? అలాగయితే ఆయనను వెంటనే దయచెయ్యమని చెప్పు.

దా—చిత్తం. (అని వెళ్ళుచున్నాఁడు.)

జి—మహామండలేశ్వరుడైతే చాలా గొప్పవంశంలోవాడై వుంటాడు.

[కంఠీరవదేవు ప్రవేశించుచున్నాఁడు.]

కంఠీ—జియ్యరుసూరిగారూ! నేను బహుసుదినం. తమదర్శనం దొరకడంవల్ల నాకు బహుసంతోషంగావున్నది.

జి—నేను ముసలివాణ్ని యీగౌరవానికి నేను అర్హుణ్ని కాను. మీవంశంలో మీరే కడపటివా రనుకుంటాను.

కం—దురదృష్టవశంచేత నేనే యిప్పుడు శేషుకునొక్కాయి మిగిలివున్నాను. మాపెద్దలందరూ దైవవశంచేత వక్కరూ లేకుండా కాలంచేసినారు. నాపేరు యీదేశంలోవుండే రాజసభలలో యెంత ప్రసిద్ధికెక్కిన దయినప్పటికీ, నేను వివాహం చేసుకోకపోయినట్టయితే మావంశము నాతోనే నష్టమయి పేరులేకుండా పోతుంది. మీ అనుమతిని పొంది మీకొమార్తెను భార్యనుగా గ్రహించవలె ననే వుద్దేశంతో నేను యిప్పుడు తమదర్శనానికి వచ్చినాను.

జి—నేను వక్కటి చెప్పుతాను వినండి. యెంతగొప్పవంశంలో పుట్టినవాడయినా డబ్బులేకపోతే యేమీ ప్రయోజనంలేదు. నాచిన్నతనంలో నేను బీదతనంవల్ల బహుకష్టాలు పడివున్నవాడను గనుక

డబ్బులేనివాడికి యెవరికీ నాకూతురిని యివ్వకూడదని నిశ్చయం చేసుకున్నాను. మీకు తగినంత ధనం వున్నట్టు మీరు నాకు తృప్తికరంగా కనపర్చేటట్టయితే పిల్లదాన్ని మీకు యిచ్చి వివాహంచెయ్యడానికి నాకు యేమీ అభ్యంతరం లేదు. యీపని మీరు చేసేవరకూ మీరు మళ్ళీ మాయింటికి రావలసిన పని వుండదు.

కం—అదెంత భాగ్యము? నేను యిప్పుడు ప్రమాణంచేసి చెప్తాను.

జి—ప్రమాణాలూ గిమాణాలూ నాకు యేమీ పనికిరావు. ఆ వ్యాపారం నేను చాలాకాలంక్రిందటనే కట్టిపెట్టినాను.

కం—(తనలో) ఇప్పు డీముసలివాడితో అసాధ్యం వచ్చింది. ఇప్పుడు యేమిచెయ్యను? యెలాగయినా యితణ్ని మోసం చెయ్యవలెను. (బిగ్గరగా) దైవానుగ్రహంవల్ల నాకు కావలసినంత ధనమూ వసతులూ వున్నవి. నాయిష్టంవచ్చినప్పుడల్లా వెళ్ళివుండడానికి మా వూళ్ళో నాకు గొప్పరాజభవనం వున్నది. (తనలో) సెంట్రల్ జయిలు తప్పకుండా రాజభవనమే.

జి—అంతేనా? యింకా యేమయినా వున్నదా?

కం—మంచియిళ్లూ ఫలవృక్షములూ వున్నవుద్యానవనం వకటి కూడా వున్నది. (తనలో) చిత్రవస్తుప్రదర్శనశాలా తోటా పట్నంలో వారి అందరిహక్కూ గనుక అందులో నాకుకూడా హక్కు వున్నది.

జి—మీకు భూములు యేమయినా వున్నవా?

కం—వందలకొద్ది కానులున్నవి. (తనలో) వక్కకాని భూమైనా నాకు లేకపోయినా అయిదురూపాయలడబ్బులు మొన్ననే మార్పించినాను గనుక మూడువందలకానులు పైగా వున్నవి.

జి—అది సరే కాని మీవద్ద రొక్కం యెంతవున్నది?

కం—అది యింతా అంతా అని నేను చెప్పలేను. (తనలో) యేమీా లేనప్పుడు యిం తని యెలాచెప్పగలను? ఆవున్న డబ్బులలో నైనా కొన్ని వాడుకున్నాను గనుక యి న్నని సరిగ్గా చెప్పలేను.

జి—అయిపోయింది. యిఖ వకప్రశ్నమాత్రం అడుగుతాను యీాఆస్తంతా మీాకు యేలాగువచ్చింది.

కం—మాతండ్రిగారివల్ల వచ్చింది. ఆయన యిప్పుడు యీా ఆస్తంతా అనుభవిస్తూ గోదావరీతీరంలో రాజమహేంద్రవరంలో వున్నారు.

జి—ఇంతకుముందు మీారు మీావంశంలో మీారే కడపటివా రని చెప్పినట్టున్నారే?

కం—అవును. ఆయన వక్కడుపోతే నేనే కడపటివాణ్ని. అదంతముఖ్యమయింది కాదు. ఆయన వున్నా లేనట్టే. ఆయనసంగతే నేను మఱచిపోయినాను. ఆయన బహుముసలివాడు.

జి—ఆలాగైతే మీారు మీాతండ్రిగారిని వక్కపర్యాయంఇక్కడకు పంపిస్తే ఆయనా నేనూ మాట్లాడుకొని సంబంధనిశ్చయం చేసుకుంటాము. అప్పుడు మాచిన్నదాన్ని మీారు వివాహంకావచ్చును.

కం—అయితే—

జి—అయితే గియితేలు నావద్ద పనికిరావు. నేను ఖండితంగా మాట్లాడుతూ వున్నా నని కోపగించుకోక మీాతండ్రిగారిని వక్కపర్యాయం తీసుకురండి. నాకు పని వున్నది. నేను వెళుతాను.

(అని వెళ్ళుచున్నాడు.)

కం—ఇదంతా నా తెలివితక్కువమాటలవల్ల తటస్థమయింది. నేను యేది యెలాగైనా రామామణిని సంపాదించుకోవలెను. సంపాదించుకుంటాను. పెళ్ళాన్ని సంపాదించుకోవడంకంటె ముందుగా నేను

యిప్పుడు తండ్రిని సంపాదించుకోవలెను. నాకు యిప్పుడు అధాత్తుగా తండ్రి యెక్కడదొరుకుతాడో యేమీ తెలియకుండా వున్నది. యెవ రికో వకరికి వేషంవేసి ప్రస్తుతం వకతండ్రిని యెరువు తెచ్చుకోవలెను.

[నారాయణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కం—నీకు యిక్కడ యేమి కావలెను?

నారా—నా కేమీ అక్కరలేదు. మీ కేమైనా కావలెనా?

కం—కావలెను. నాకు తక్షణం వకతండ్రికావలసివున్నాడు. నారాయణా! ఇందులో నీవు నాకు సహాయం చెయ్యవలెను.

నారా—రెండ్లొబట్టి మీవద్ద నన్ను నవుకరీవుంచుకుని మీకు తండ్రికావలసివున్నమాట వక్కనాడూ చెప్పినారుకారే.

కం—అప్పటిమా టంతా యెందుకు? ఇప్పుడు చెప్పినాను తీసుకుని రా. వ్యర్థంగా కాలక్షేపం చెయ్యకు.

నా—నాకు యిప్పుడు ఆకలివేస్తూవున్నది. నా ఆకలి తీరితేనే కాని నేను యిప్పుడు యేపనీ చెయ్యను.

కం—నీ వాసత్రంలో భోంచేసిరాలేదా?

నా—యెలా భోంచేస్తాను? అన్నం పెట్టిస్తాను వాకిట్లో వుండు మని నన్ను కూర్చోపెట్టి మీరు లోపలికి వెళ్ళి భోజనంచేసి దొడ్డి తోవను పరుగెత్తివచ్చినారు. నాసంగతి ఆ మహాసత్రంలో కనుక్కునే వా రెవరు? నేను కడుపుకాలుతూ కూర్చుని కూర్చుని మీరు వెళ్ళినా రని విని మీజాడ వెతుక్కుంటూ యిక్కడికి పరుగెత్తుకుని వచ్చినాను.

కం—ఛీ ఛీ నోరుమూసుకుని వూరుకో. వక్కపూట భోజనం లేకపోతే యింత బ్రహ్మాండంచేస్తూ వున్నావూ! స్వామిభక్తిగల సేవ కుడు యెన్ని వుపవాసాలు చేసి అయినా స్వామికార్యం నిర్వహించ వలెను. నీవు ప్రయత్నం చేసి నాకు వక్కతండ్రిని సంపాదించిపెట్టినా

- ఓ దానితో నీదరిద్రమూ నాదరిద్రమూ కూడా విరగడై పోతుంది.

నా—అలాగైతే: మీకు తండ్రి అసలే లేడా ?

కం—వున్నాడు. కాని నేను తండ్రి నని పయికివచ్చి చెప్పే వాడు యిప్పుడు యెక్కడా కనబడకుండా వున్నాడు.

నా—అలాగైతే ఇక మీకు తండ్రి దొరకనే దొరకడు.

కం—పోనీ నీవు నాతో కూడా రా. మనం యిద్దరమూ కలిసి తండ్రికోసం వెతుక్కుంటూ వెళదాము.

నా—యెక్కడికి వెళదాము.

కం—యెక్కడికా ? మక్కాకుపోదాము. రా.

(అని వెళ్ళుచున్నాడు.)

నా—నాకు యెక్కడకు పోయినా యింతకంటె నష్టంరాదు. వెళుతాను. (అని వెళ్ళుచున్నాడు)

——o——

౩ రంగము—ఊరిబయిలి రచ్చావడి.

[అటుకులు తినుచు వంచకాచార్యులు ప్రవేశించుచున్నాడు.]

వం—ఎవరో వస్తూవున్నట్టున్నారు. ఇక్కడినుంచి వేగిరం పారిపోవలెనా. అక్కరలేదు. ఉండవచ్చును. నా అంతటి బుద్ధిమంతుడికి భోజనంలేకుండా యీబండమీద కూర్చుండి ,అటుకులు తినవలసిన యోగం పట్టింది. ఆవచ్చేవారు యెవరయివుందురు? ఇతడు విచారం చేతనో సంతోషంచేతనో మనసుకు యేదో వుద్రేకం కలిగినవాడుగా కనపడుతూ వున్నాడు. నాపాలిటి భాగ్యదేవత మోసంచేసి వక్కపూట తిండి కయినా యితనివద్ద సంపాదించుకోవడానికి యితణ్ణి యిక్కడికి పంపివుంటుంది.

[కంఠీరవదేవు ప్రవేశించి, వంచకాచార్యు లక్కడ నున్న ట్టే చూడక ముందుకును వెనుకకును నడుచుచున్నాఁడు.]

కంఠీ—నాకు తంత్రి యెలాగు దొరుకుతాడు ?

వంచ—(తనలో) తంత్రా !

కం—వక్కతంత్రి దొరికితే నాకు రామామణి, ధనమూ కూడా దొరుకుతుంది. తంత్రి దొరక్కపోతే భార్యాపోతుంది చెరసాల ప్రాప్తమవుతుంది. నాకు యేమీా తోచకుండా వున్నది.

వం—(ముందుకు వచ్చి తనలో) యీాపెద్దమనిషి యేదో చిక్కులో వున్నట్టు కనపడుతూవున్నాడు. (బిగ్గరగా) అయ్యా ? మీారు యేదో కష్టంలోవున్నట్టున్నారు. మీాకు నావల్ల సహాయం యేమయినా కావలసివున్నదా ?

కం—నీ కంఠస్వరం నేను తరుచుగా విన్నదిలాగున్నది. మనం యిద్దరమూ యెక్కడనో వకచోట కలిసివున్నట్టున్నది. చుట్టలు యెగుమతీచేసి కోస్తాలనుంచి బంగారప్పుయిసుక తెప్పిస్తామని కాకినాడలో పెద్దమేడలో పెట్టినకంపినీకి మీారు కార్యనిర్వాహకులుగా వుండలేదా ?

వం—అవును. ఆకంపెనీలో భాగస్థుడుగా చేరుమని మీాతో చెప్పినాను. మీారు వున్నారుకారు.

కం—వుండలేదు. నేను పుట్టి బుద్ధియెరిగినతరువాత చేసిన తెలివిగలపని అది వక్కటే అని తలుస్తాను. తరువాత ఆకంపినీస్థితి యేమయింది ?

వం—లక్షరూపాయల మూలధనంగల ఆకంపెనీవారు యింటి అద్దె నిమిత్తం వ్యాజ్యంవచ్చేటప్పటికి హాజరువారంటు వస్తుందేమోనని నానాముఖాలా పారిపోయినారు. నేను కార్యనిర్వాహకుణ్ని

గనుక, ఆకంపెనీవారికి ముందుగా నేనే దారిచూపి పారిపోయినాను. అప్పటినుంచీ నేను నాస్వార్జితధనంవల్లనే జీవనంచేస్తూవున్నాను.

కం .. కంపెనీ దివాలాతీసినతరువాత మీానద్ధ ధనం యెలాగు వచ్చింది?

వం — అప్పటినుంచీ నేను జనులను లోకోపకారంనిమిత్తం అనేకవిధాల మోసాలుచేసి ధనం సంపాదించి జీవనం చేస్తూవున్నాను.

కం —.యిది మరీవింతగా వున్నది. మోసం చెయ్యడంవల్ల లోకోపకారం యెలా తటస్థమవుతుంది?

వం — చెపుతాను వినండి. లోకంలోవుండే జనులందరూ మోసపుచ్చేవారూ మోసపోయేవారూ అని రెండుతెగలుగావుంటారు.

కం — ఇది మంచివిభాగమే.

వం — లోకంలో మోసంచేసే బుద్ధిమంతులు తక్కువగానూ మోసపొయ్యే బుద్ధిహీనులు యెక్కువగానూ వుంటారు. బుద్ధిమంతుల వల్ల బుద్ధిహీనులకు వుపకారం కలుగుతుంది గనుక, అల్పసంఖ్యగల వంచకులవల్ల అధికసంఖ్యగల వంచితులకు వుపకారం కలుగుతుంది. అనగా బహుజనోపకారం కలుగుతుం దని తాత్పర్యం.

కం — అది యెలాగు?

వం — మీాకు విప్పిచెపితేనేకాని తెలిసేటట్టు లేదు. చెపుతాను వినండి. పెద్దకంపినీకి కార్యనిర్వాహకుణ్ని గనుక పెద్దషాపులోకి వెళ్ళి పదికోట్లకు గుడ్డ చింపించి కుట్టించి తయారుచేయించి బిల్లుతో కోట్లు మాయింటికి పంపవలసిం దని ఆర్డరు యిస్తా ననుకో. ఆర్డరుప్రకారం కోట్లు వస్తవి. నావద్దనుంచి షాహుకారుకు వక్కదమ్మిడీ వెళ్ళదు. దర్జీవాడు కుట్టినందుకు షాహుకారువద్ద కూలి పుచ్చుకోకుండా వుండడు గనుక, ఆకూలితో వాడిపెళ్ళామూ బిడ్డలూ భోజనంచేస్తే కుటుంబాని

కంతా వుపకారం కలుగుతుంది; వాడు కావలసినవస్తువులు బజారులో కొంటాడు గనుక వాళ్ళందరకూ వుపకారం కలుగుతుంది; వాడు సాయంకాలం మిగిలినసొమ్ము పట్టుకుని కల్లంగడికి వెళుతాడు గనుక అక్కడ వాళ్ళకు వుపకారం గలుగుతుంది; అక్కడ తాగి పడిపోతే పోలీసువారు పట్టుకుంటే నేరాలుపట్టుకున్నందుకు పోలీసువారికి వుపకారం కలుగుతుంది; మరునాడు మేజస్ట్రీటు జురుమానావేస్తే గవర్నమెంటువారికి లాభం కలుగుతుంది. యిలాగంటి వ్యవహారాలవల్ల వర్తకుడు దివాలాతీస్తే భగవద్భక్తికలిగి అతనికి వుపకారంకలుగుతుంది; యిలాగు చెప్పడానికి మొదలుపెడితే యెన్నివుపకారాలయినా చెప్పవచ్చును. నావక్క మోసంవల్ల ప్రజలు మొదలుకుని దొరతనంవారి వరకూ యెంతమందికి వుపకారం కలిగిందో కనిపెట్టినారా?

కం—మోసంవల్ల యిలాగంటి లోకోపకారం వుంటుందని నే నిదివరకు యెప్పుడూ ఆలోచించలేదు. (తనలో) దీన్నిపట్టి చూస్తే యితడు నాకు తండ్రిగా వుండడానికి తగినవాడుగానే కనపడుతూ వున్నాడు. (బిగ్గరగా) మీ రిదివర కెప్పుడయినా నాటకంలో వేషం వేసి కథ వినిపించినారా?

వం—మీరో?

కం—మీరు యెప్పుడయినా తండ్రిగా వున్నారా?

వం—నాకు పెళ్లి కాలేదుగనుక ఆప్రశ్న నన్నడగకండి. సిరం చెపితే అన్నీ తంటాలు వస్తవి.

కం—నాఅర్థం నిజమయిన తండ్రి అనికాదు. మీరు నాటకంలో యెప్పుడయినా తండ్రివేషం వేసినారా?

వం—అదెంతసేపు? నిముషంలో వెయ్యవచ్చును. రెండు చొప్పబెండ్లు పళ్ళు పెట్టుకుని మీసాలకూ గడ్డానికీ మర్రిపాలతో తెల్ల

బొచ్చు అంటించుకుంటే అరఘడియలో అరవయి తండ్రివేషా
వెయ్యవచ్చును. అపయిని ‹‹అబ్బాయీ! యెన్నాళ్లకు నిన్ను చూ
నానురా ?''—(అని గట్టిగా కంఠీరవదేవుని కౌఁగిలించుకొని)-ఇలా
అంతా నాకు తెలుసును.

కం—దివ్యంగా వున్నది. నీవు నాకు తండ్రివి కాదగినవాడ
నాకు తండ్రివి కావడానికి ముందుగా నీవు నాకు వక్కచిన్నపని చే
పెట్టవలెను. నీవు యీవుత్తరం తీసుకునివెళ్ళి సమీపంలోనే వక
యింట్లో యిచ్చి రావలెను. (అని చెవిలో చెప్పుచున్నాఁడు.)

వం—అలాగే చేస్తాను.

కం—మామనిషిని చేరేవకచోటికి పంపించినాను. నీవు వచ్చిన
దాకా యిక్కడ కనిపెట్టుకుని వుంటాను.

వం—ఇదుగో వెళుతూ వున్నాను. వక్కసంగతి అడగడం
మరిచిపోయినాను. యీపూట మీభోజనం యెక్కడ ?

కం— వెళ్ళిరా. తరువాతమనంయిద్దరమూకలిసేభోంచేతాము.

వం—కూరలు వుంటవా ?

కం — వుంటవి.

వం—పప్పో ?

కం—పప్పూను.

వం—నెయ్యో?

కం—నెయ్యీని.

వం—పెరుగో ?

కం—అన్నీవుంటవి. వేగిరం వెళ్లి రా. (అని వెళ్లుచున్నాఁడు)

వం— మన మోసం బాగాపారింది. ప్రపంచమంతా మోసం
లోనే వున్నది. యెక్కడ చూచినా వీరిని వారూ వారిని వీరూ

నాను.
లాగు
యత్నం
న్నాను.
వ్వా

మోసం చేస్తూవుంటారు.

(పాట—ద్విపద.)

1. పట్టణంబులయందు • పల్లెలయందు,
బిట్టుగా జనులెల్ల • భేదంబు లేక,
వేసాలు వేయుచు • వేయివిధాల,
మోసాలు చేయుచు • మురువొందుచుంద్రు.
2. అప్పిచ్చువారెల్ల • నధికాశచేత,
నప్పులు గొనువారి • నలయింపఁ జూడ,
నప్పులుగొను వార • లంతకు మించి,
యప్పుల నెగవేయ • నరయుచుందురు.
3. కాముకజనుఁడు తా • కాంక్షించినట్టి
కామిని వంచింప • గణనలేనట్టి
మాయలు పన్నుచు • మరిబొంకుచుండు;
వేయేల ? మోసంబు • విశ్వమంతయును.

(అని పాడుచు వెళ్ళుచున్నాఁడు.)

[అంతట కంఠీరవదేవు డగల ప్రవేశించుచున్నాఁడు.]

కం — అతడు మహాబుద్ధిమంతుడు. నాతండ్రి కావడానికి బాగా తగివున్నాడు. నన్ను బాధపెట్టే అప్పులవాళ్ళు యిక్కడ యెవరూలేరు. ఇక్కడ నాప్రాణం హాయిగా వున్నది. నాకు కాబోయే తండ్రి వచ్చేలోపుగా యేమి చెయ్యవలెనో ఆలోచించుకొంటూ వుంటాను. (అని కన్నులు మూసికొని, ఆలోచించుచున్నాఁడు.)

[అప్పుడు పాతరువారంటు పట్టుకొని భవానిసింగు, శివప్రసాదు, అను భటులు ప్రవేశించుచున్నారు.]

భవా—అదుగో! అతను యిక్కడ వున్నాడు. ఈసారి యితను

నన్ను తప్పించుకొని పారిపోలేడు. యీవుచ్చు యితనిచేతులకు వేసి బిగించినామంటే యితడు మనకు చిక్కినట్టే.

కం—(తనలో) ఈసారి యీధనంతో ధనమిత్రుని వదుల్చుకో వచ్చును. ఆచిన్నదానిధనమంతా నాచేతిలో పడితే దాన్ని యెలాగు వుపయోగించుకోవలెనో తెలియకుండా వున్నది.

భవా—తెలుస్తుంది. (అని శివప్రసాదుతో మెల్లగా దగ్గఱకు వచ్చుచున్నాఁడు.)

కం—(తనలో) రామామణికి నాకూ వుండే బంధము—

భ—(తనలో) ముందుగా యీబంధమువమాట చూచుకో. (అని యుచ్చు చేతికి తగిలించి బిగించుచున్నాఁడు.)

కం—(ఉలికిపడి కన్నులు విచ్చి) ఇదేమిటి? (అని పెనఁగు చున్నాఁడు.)

భ—చేత నయితే యీతాళ్ళు తెంపు చూతాము. కిందటి మాటు నీవు మాకోస్టు బంట్రోతులను గుద్ది పారిపోవడంచేత యీసారి మేము సాధనాలన్నీ పట్టుకుని జాగ్రతగా వచ్చినాము. ఇప్పుడు నీవు మమ్మల్ని గుద్దడానికి వల్లలేదు.

కం—(చేతులు లాగుకొనుచు) మోటుపనువల్లారా! కట్టు విప్పండి. విప్పకపోతే—

భ—వూరికే గింజుకోకు. ఈసారి నిన్ను భద్రంగా తీసుకుని వెళుతాము లే—శివప్రసాద్! నీవు వెళ్ళి నకబంధీకుదిర్చి తీసుకుని రా. నీవు వచ్చిందాకా నేను యితణ్ని భద్రంగా వుంచుతాను.

శివ—జాగ్రత! (అని వెళ్ళుచున్నాఁడు.)

కం—అయ్యా! మీా రెవరు?

భ—భవానిసింగు.

కం—భవానిసింగుగారూ! మీరు కొంచెం కట్లు వదులుచేసి వక్క చెయ్యి విడిచిపెట్టినారంటే బొడ్డకొంగునవున్న మూట విప్పి బంగారపుకాసులు మీచేతులో పెడతాను.

భ—నీఆటలు నాదగ్గిర సాగవు. (బొడ్డుకొంగు తడవి) ఇక్కడ యేమీ మూట లేదు. వట్టిదే.

కం—నీకు జ్ఞానం లేదు. యెవరిబొడ్డుకొంగున అనుకున్నావు?

భ—ధనమిత్రునిబొడ్డుకొంగున. మళ్ళీ సొమ్ము యేమయినా వుంటే నీకు సమర్పించడానికి నిన్ను భద్రంగా తీసుకొని రమ్మన్నాడు.

కం—అలాగా? ఇప్పుడు వంచకాచార్యులిక్కడ వుంటేనా—

[వంచకాచార్యులు ప్రవేశించుచున్నాడు.]

వం—ఇదుగో సమయానికి వచ్చినాను. ఆహాహాహా! ఇదేమిటి, క్రొత్తవినోదంగా వున్నది? ఈబంట్రోతేమిటి? చేతులు కట్టడ మేమిటి?

కం—కట్టివుండడంచేత నాచేతులు నేను వుపయోగించుకోలేను. నీచేతులు స్వేచ్ఛగా వున్నవి. వాటిని బాగా వుపయోగించు—తెలిసిందా?

వం—తెలిసింది. (చేయెత్తి చరవబోయినట్టుగా భవానిసింగు మీదికి వెళ్ళి) విడిచిపెట్టు.

భవా—యితణ్ని విడిపించినావంటే నీకు యేమిశిక్ష అవుతుందో తెలుసునా?

వం—ఛీఛీ విడువు.

భ—ఓ శివప్రసాద్! ఎక్కడవున్నావో పరుగెత్తుకుని రా.

వం—శివప్రసాదు కాదు నీతాత యమునువచ్చుడో రానియ్యి. వేగిరం యితణ్ని విడిచి దూరంగా పో.

భ—ఇదుగో మెల్లిగా విడిచిపెట్టి వెళుతూ వున్నాను. కొంచెం

ఓపిక పెట్టు. (అని ముడివేసి జరుగుచున్నాడు.)

వం — వోపికాలేదు గీపికాలేదు పో. (అని భవానిసింగును ఈడ్చి తరిమివేయుచున్నాడు.) ఇక్కడివారు వాళ్ళంతా చెమటలు పట్టేటట్టుగా పరుగెత్తుతూ వున్నారు. మిమ్మల్ని యెలా వదిల్చినానో చూచినారా?

కం — నీవు మంచిసమయంలో వూడిపడ్డావు. మనం గొప్పగండం తప్పించుకున్నాము. అమ్మగో! అయ్యరుగారి యిలాగు వస్తూవున్నాడు. వేగిరం కట్టువిప్పు లేకపోతే నేను పాడయిపోతాను.

వం — ఈముడి రాదు.

కం — అది జారుముడి కాదా?

వం — కాదు గట్టిముడి.

కం — ఏమిబుద్ధి? ఈస్థితిలో అయనను నేను యెట్లా చూడను?

వం — నీకు నేను ఒకవుపాయం చెప్పుతాను. నాబట్ట వంటినిండా కప్పుకుని చేతులు పయికి కనబడకుండా నోటితో మాట్లాడు. చేతులతో చెయ్యవలసినపని యేమయినా వస్తే నీవెనక నిలుచుండి నేనే చేస్తాను. పెద్దవాడు గనుక అయనకు కళ్ళు తిన్నగా కనబడవు. (అని తనపయి బట్ట కప్పి తాను వెనుక బట్టలో దూరుచున్నాడు.)

కం — ఈవుపాయం బాగా వున్నది. అయనదగ్గరకు వచ్చినాడు. నన్నసమూలు పట్టలేడు.

[అయ్యరుగారు ప్రవేశించుచున్నాడు.]

కం — అయ్యా! నమస్కారము. మీరు యీలాగు దయచేసినారేమి?

జా — ఎవరు? కంఠీరవదేవుగారా? మీరు మీతండ్రిగారి రాక నిమిత్తం యిక్కడ యెదురుచూస్తూ వున్నారు కాబోలును. నేను మా

తోటలోకి వెళుతూ వున్నాను.

కం—ఆయనకోసమే నిరీక్షిస్తూ వున్నాను. ఘామునేపటినుంచి కనిపెట్టుకొని వున్నా యింకా ఆయనజాడ కనపడడం లేదు. నిన్నే కలిగాళ్ళిం పంపినాను.

జి—ఆయని యిప్పుడు రాకపోతే సాయంకాలము వస్తారు. నాకూతురివివాహం విషయములో యేమీ మోసంలేదు గదా?

కం—ఇందులో మోసం కూడానా?

జి—మీావద్ద పొడుంకాయ వున్నదా?

కం—నేను తొందరలో తేవడం మరిచిపోయినాను.

జి—నేను రాత్రే చేయించినాను. యీపొడుం యెలాగున్నదో చూడండి. (అని పొడుముకాయ చేతి కందిచ్చుచున్నాడు.)

కం—ఈరాత్రే చేయించినారా? (పంచకాచార్యులు చంక క్రిందనుండి చేయిచాపి పొడుముకాయ యందుకొని ముక్కుదగ్గర పెట్టుకున్నాడు.) దివ్యంగా వున్నది. యెక్కడ తెప్పించినారో కాని యిటువంటి పొగాకు మాగోదావరిలంకలోకూడా పండదు. (పంచకాచార్యులు పొడుముకాయను మరల నిచ్చివేయుచున్నాడు.)

జి—పొద్దెక్కుతూవున్నది. నేను యిక సెలవు పుచ్చుకొని తోటలోకి వెళ్ళివస్తాను.

(అని వెళ్ళుచున్నాడు.)

వం—నామోసం బాగా సాగిందా?

కం—దివ్యంగా సాగింది. నీవు మోసాల రాజువు. నేను మరిచి పోయినాను. నామొలలో పలుదోముపుల్లలుకోసుకునేకత్తి వున్నది. అది పుచ్చుకుని మళ్ళీ వాళ్ళు రాకమునుపే—

వం—చెప్పనక్కరలేదు. తెలిసింది. (అని కత్తి పుచ్చుకొని

కళ్లు కోసివేయుచున్నాడు.)

కం—ఇప్పుడు నాకు బంధవిమోచనం కలిగింది. మనం వేగిరం వెళ్ళి యీముసలాయనను వలలోపడవేసే ప్రయత్నం చెయ్యవలెను.

వం—పక్కదెబ్బలో చేతాము.

కం—ఆపాలంలోనుంచి వచ్చే వాళ్లు యెవరు?

వం—ఇందాకటి బంట్రోతులు.

కం—ఇక మాటల కవకాశం లేదు. నాసిక్కబలం చూపవలెను. (అని పరుగెత్తుచున్నాడు.)

వం—యెవరికీ దొరక్కుండా పరుగెత్తు. ఓ బంట్రోతుల్లారా! వగరుస్తూ పరుగెత్తుకురండి. మిమ్ము పట్టుకోవడానికి యిక్కడ యెవరూ లేరు. చేతనయితే నాపరుగు కలుసుకోండి. నేను లేడిలాగు పరుగెత్తుతాను. (అని పారిపోవుచున్నాడు.)

౩. రంగము — వియ్యాలవారి యిల్లు,

[పార్వతియు, దామోదరుడు ప్రవేశించుచున్నారు.]

పార్వ—దామోదరా! నేను యెక్కడికు వెళితే అక్కడికల్లా తోకలాగు వెంట తిరుగుతూ వుంటావేమి? నేను యిందాకా యిచ్చినరొట్టెముక్క తింటూ వకమూల అణగి కూర్చోరాదా? వెళ్లు.

దామో—నీసెలవుప్రకారం వెళ్ళి మళ్ళీ యిప్పుడే వస్తాను.

(అని వెళ్లుచున్నాడు.)

పార్వ—నేను మాఅమ్మగారిలాగు గొప్పదాన్ని అయితే బాగా వుండును. నాకు భాగ్యం యెత్తుకోవడానికి వెనుక యెరకలవి రెండుడబ్బులుయిస్తే వేరుముక్క కడుతానన్నది. అదుగో అమ్మగారు వస్తూవున్నారు.

[రామామణి ప్రవేశించుచున్నది]

రామా—పార్వతీ! ఈవుదయాన్న వెళ్ళిన తరువాత కంఠీరవ దేవుగారు నాకు యేమయినా వుత్తరం పంపించినారా?

పార్వ—లేదు. నావద్దకు పంపలేదు.

రామా—దామోదరా!

[దామోదరుడు ప్రవేశించుచున్నాడు]

దామో—అమ్మా! వస్తూవున్నాను.

రామా—నీవు యీవుత్తరం తీసుకుని వెళ్ళి పూటకూళ్ళయింటి కాడ యిచ్చి వస్తావా?

పార్వ—దామోదరా! కథంలవేమి?

దామో—నాపని కుక్కలాగు యిక్కడికీ అక్కడికీ తిరగడంతో సరిపోతూ వున్నది. (అని వెళ్లుచున్నాడు.)

రామా పార్వతీ! నేను పూటకూళ్ళయింటికి వెళ్ళినకాలంలో కంఠీరవదేవుగారు ఇక్కడికి రాలేదని నీకు నిశ్చయంగా తెలుసునా?

పార్వ—రాలేదు యెంతమాత్రమూ రాలేదు.

రామా—అతడు యిప్పుడు యేమి వుపాయం ఆలోచిస్తూ వుండివుంటాడు? అతనికి నామీద ప్రేమవున్నందుకు లేశమూ సందేహం లేదు. కాని అతని వుపాయాలు సాగుతేవో లేదో అని మాత్రం నాకు సందేహంగా వున్నది. రాజమహేంద్రవరంలో అతనికి తండ్రి వున్నట్టు నేను యెప్పుడూ వినియుండలేదు.

పార్వ—(ముందువంకచూచి) అదుగో ఆయన వస్తూవున్నారు.

[కంఠీరవదేవు ప్రవేశించుచున్నాడు]

కంఠీ—ప్రియురాలా! రామామణీ! నిన్ను చూడడంచేత నాప్రాణాలు లేచివచ్చినవి.

పార్వ—బహుపొడ్డవాడు. ఈయన దేవుడులాగు మాట్లాడు తున్నాడు.

రామా—మీరు యింతదూరం నాకోసం నడచివచ్చినారా? యే మయినా యెక్కి రాలేదా?

పార్వ—ఆయన యెందెక్కి వచ్చినారు.

రామా—పార్వతీ! యీపాటి నీవు వెళ్ళిపో.

పార్వ—వెళుతూ వున్నాను. (తనలో) వీరు యిద్దరూ కలుసుకోవడంతోటే యేదో రహస్యం వున్నట్టు నన్నవతలికి పంపివేస్తారు. నేను అవతలికి వెళ్ళి వీరు యేమి చేస్తూ వుంటారో యీతలుపుసందు నుంచి చూస్తూ వుంటాను. (అని వెళ్ళుచున్నది.)

కంఠీ—ఓ ప్రాణేశ్వరీ! వ్యవహారమంతా కుదిరింది. రేపు తెల్లవారేలోగా మీతండ్రిగారి అనుమతితోనే నిన్ను నాసొమ్ముగా చేసుకుంటాను.

రామా—కంఠీరవా! నీదగ్గిర వున్నతెప్పితేమల్లా తలకుమించిన పెద్దయెత్తులు యెత్తేడ మనుకుంటాను.

[పార్వతి ప్రవేశించుచున్నది.]

పార్వ—అమ్మా! బాబయ్యగారిసెల వయింది. మిమ్మల్ని ఆయన పుస్తకాలగదిలోకి తీసుకుని రమ్మన్నారు.

రామా—కంఠీరవా! నేను యిక్కడ వుండడం వల్లకాదు. వెళ్లిపోతాను. నీవు చేసేప్రయత్నం సఫలంకానడం నాకు యిష్టమేకాని నీగౌరవానికికాని నాయోగ్యతకుకాని భంగంవచ్చేపనిమాత్రం నీవు యెంతమాత్రమూ చెయ్యకూడదు సుమా. (అని వెళ్ళుచున్నది.)

పార్వ—(తనలో)వీళ్ళు నన్ను అవతలికిపంపించడానికి యెప్పుడూ మఱిచిపోరు. అయినా కానీ! వీళ్ళు చాలానేపు మాట్లాడుకోవడానికి

అవకాశం లేకుండా వెంటనే వచ్చి పంపివేసినారు. నేను పోవలెను.

(అని వెళ్ళుచున్నది.)

కంఠీ — నా ప్రియురాలిమాటలతో నాధైర్యమంతా చెడి పోయింది. జియ్యరుసూరిగారివద్దకు వెళ్లి, ఆయనకాళ్ళమీద పడి, చేసిన దంతా చెప్పుకుంటాను. (అని వెళ్ళఁబోవుచున్నాఁడు.)

[అంతట తెల్లగడ్డముతోను మీసములతోను ముసలివేషము వేసికొని చేతకఱ్ఱ పట్టుకొని వంచకాచార్యులు ప్రవేశించుచున్నాఁడు.]

కంఠీ—నీవు యెవరు? ముందుగా వర్తమానం చెయ్యకుండా పెద్దమనుష్యులయింట్లో యిలా ప్రవేశించినా వేమి?

వంచ—నేను యెవరినా? నన్ను నీవు ఆనవాలు పట్టలేదా? నిన్న తండ్రిని తెలుసుకునేవాఁడు యెంతటివాఁడు కావలెను? నీవు చేసుకున్నతండ్రినే నీవు గుర్తుపట్టలేకుండా వున్నావు.

కంఠీ— ఆహాహాహా! ఏమీ! వంచకాచార్యులా?

వంచ—అవును. కఱ్ఱ గడ్డమూ మీసాలూ అన్నిటితోనూ వచ్చినాను.

కంఠీ—నీవు వేసినవేషంలో కథ బాగా వినిపించగలవా?

వంచ—మీ చిత్తంవచ్చినట్లు వినిపిస్తాను. నేను యేమోస్తరు ముసలికథ వినిపించవలెను? "నేను వీధులలో ఆడుకునేదినాలలో అరణ్యైర్యేళ్ళకిందట" అని పాతకథలుచెప్పే ముసలివేషం కావలెనా? "ఆహాహా! ఇహీహీ శబాసు! మహామంచికథ. ఆహాహా! ఇది తలుచుకుంటే నాకు చిన్నప్పటికథ జ్ఞాపకం వస్తూవున్నది. ఇహీహీ హీ!" అని మాటమాటకూ నవ్వుతూవుండే ముసలివేషం కావలెనా? "ఇప్పటివాళ్ళను చూస్తే నాకు తలకాయనొప్పి. వాళ్ళమాట తలపెట్టకు. కాలమంతా చెడిపోతూ వున్నది. పాడుకాలం వచ్చింది. యెవరితో

నైనా మాట్లాడితే నాకు చిరాకు" అని చిరాకుపడుతూ నిష్కారణంగా కొరకొరలాడుతూవుండేముసలి వేషం కావలెనా? ఈమూడింట్లో యేది కావలెను?

కంఠీ—సమయం కనిపెట్టి నీ యిష్టంవచ్చినట్టు చెయ్యి. ఆ ముసలాయసమనసు కనిపెట్టి యెప్పటి కెలాగుమాట్లాడవలెనో అలాగు మాట్లాడు. నేను చెప్పినసంగతిమాత్రం మరిచిపోకు.

వం—చూడు. ఆయనను నావలలో యెలాపడవేస్తానో!

కంఠీ—అలాగయితే కార్యం యెంతశీఘ్రంగా నెరవేరితే అంతమంచిది. ఆయన పుస్తకాలంటే చెవి కోసుకుంటాడు. ఆయన యిప్పుడు పుస్తకాలగదిలో వున్నాడు.

వంచ—ఇక ఆయనవద్దకు మనపుస్తకంలో యెక్కించుకో వచ్చును.

కంఠీ—ఆలస్యంచెయ్యక వెంటనే వెళ్లు.

వం—నామనస్సులో నేను వలఅంతా పన్నినాను. ఆముసలి గొడ్డు నావలలో పడుతుంది వెళుదామురండి.

(అని ఇద్దఱును వెళ్లుచున్నారు.)

---

౪. రంగము—జియ్యరుసూరిపుస్తకములగది

—○—

[జియ్యరుసూరి ప్రవేశించుచున్నాడు.]

జియ్య—కంఠీరవదేవు తనతండ్రిని యింకా చంపించినాడు కాడు. అతనికి వకవేళ తండ్రిలేనేలేడేమో! అమ్మాయికి యిష్టంవుంటే అతణ్ని పెళ్లిచేసుకోవచ్చును.

పార్వ—(వెలుపలనుండి) అయ్యా! నేను లోపలికి రావచ్చునా?

జియ్య—పార్వతా? రావచ్చును. రా.

[పార్వతి ప్రవేశించుచున్నది]

పార్వ—అయ్యా! ఆయన వచ్చినాడు.

జియ్య—ఆయన యెవరు?

పార్వ—కంఠీరవదేవుగారితండ్రిగారండి. ఆయన మహాతమాషాగా వున్నారు. మిట్టపళ్ళూ జనపనారపీచువలె గడ్డమూ ముసలిపండులాగు వున్నారు. ఆయనచేతులో పెద్దకర్ర వున్నది.

జియ్య—ఆయనను లోపలికి తీసుకొని రా.

(అని లేచుచున్నాడు.)

పార్వ—కర్రనూ ఆయననూ కూడానా?

జియ్య—అందరినీని.

పార్వ—ఆయన గుమ్మవద్దనే వున్నారు. (అని వెళ్ళుచున్నది.)

[వంచకాచార్యులతో పార్వతి మరల బ్రవేశించుచున్నది.]

పార్వ—అయ్యా! యిది మార్గము. అదుగో ఆనిలుచున్నవారే జియ్యరుసూరిగారు. (అని వెళ్లుచున్నది.)

వంచకాచార్యుడు—(ఆయనవీపు తట్టి) బావగారు క్షేమంగా వున్నారా?

జియ్య—మీరు ముసలివారయినా చాలాబలంగా వున్నారు--పార్వతీ! ఈయనకు కుర్చీవెయ్యి—కూర్చుండండి.

వంచ—(కూరుచుండి) సంగతంతా విని సంతోషించినాను.

జియ్య—మీకు మారునిఉత్తరం అంది వెంటనే బయలుదేరి వచ్చినారు కాబోలును.

వం—వుత్తరం లేకుండానే వచ్చినాను. మాకంఠీరవుణ్ని నేను యీవూరు వచ్చిన తరువాతనే చూచినాను?

జియ్య—మీరు అలసి వచ్చినారు. కొంచెముపాలు దాహం

పుచ్చుకుంటారా ?

వంచ—సిద్ధంగావుంటే కొంచెం ఫలహారంకూడా చేస్తాను.

జియ్యా—పార్వతీ! వెండిగిన్నెతో పాలూ పూరిలూ యిలా తీసుకుని రా.

వం—మీరు బహు మర్యాదస్థులు. (అని త్రాగుచున్నాడు.)

జియ్యా—కాలం వ్యర్థంగా పోగొట్టడం యెందుకు? ఫలహారంతోపాటు మన వ్యవహారంకూడా చక్కపెట్టుకుందామా? మాతో సంబంధంచేసుకోవడం మీకు యిష్టంగా వున్నదా?

వంచ—పరమానందముగా వున్నది.

జియ్యా—మీభూములన్నీ గోదావరితీరమందు వున్న వని విన్నాను.

వంచ—నిజంగానా ?

జియ్యా—నిజంగానే. మీభూములకు పన్ను లేదుగదా?

వంచ—నేను సర్కారుకు చిల్లిగవ్వ పన్ను యివ్వవలసిన పని లేదు.

జియ్యా—(లేచి) మీసంభాషణవల్ల నాకు తృప్తి కలిగింది. కావలసింది పార్వతి నడిగి తెప్పించుకొని యిఖ మీరు సావకాశంగా ఫలంహారంచేస్తూవుండండి. ఈసమీపంలోనే మాకు బంధువుడున్న స్నేహితుడున్ను వకాయనవున్నాడు. ఆయనతో యీసంగతి ఆలోచించి కార్యనిశ్చయం చేసుకొని వస్తాను.

వంచ—వెళ్ళిరండి.

జియ్యా—మళ్లీయిక్కడవున్న ట్టేవస్తాను.(అనివెళ్ళు చున్నాడు)

వంచ—ఆయన వెళ్ళినాడు. ఇక్కడ నావేషంబాగా పారింది. ఇఖ కంఠీరవదేవు రామామణిని వివాహం చేసుకుంటాడు. నేను పడ్డ

శ్రీమకు నాకుకూడా కొంతలాభం కలుగుతుంది. తెలివితక్కువవాళ్ళు సత్యమే జయ మంటారుగాని నిజానికి అసత్యమే జయం. నేను చేసే మోసాలూ అబద్ధాలూ యెలా సాగుతూ వున్నవో!

[పార్వతి ప్రవేశించుచున్నది.]

పార్వ—అయ్యా! యేమిటి సెలవిస్తూ వున్నారు?

వంచ—ఓసిభూతమా! నేను యెవరితోనూ అననిమాటలు నీవు పొంచుండి యెందుకు వింటూవున్నావు?

పార్వ—యెన్ని తెచ్చినా చాలకుండా భూతంలాగు అన్నీ నీవే దిగమింగివేస్తూ వున్నావు. భూతాన్ని నీవా? నేనా?

వంచ—పోనీ వూరుకో. నీవు యీసంగతి యెవరితోనూ చెప్పకు. నీకు తరువాత నేను యేమయినా యిస్తాను. మీాయజమానుడు యింట్లో లేడు. ముందుగా యీపూరీలు నాలుగుతిను.

(అని యిచ్చుచున్నాడు.)

పార్వ—(పుచ్చుకొని తినుచు) మీాకు మేలు కలుగవలెను. మీారు మాఅమ్మ బ్రతికినంతకాలం బ్రతకండి.

వంచ—చెప్పులచప్పుడవుతూ వున్నది. యెవరో వస్తూ వున్నట్టున్నారు.

[జియ్యరుసూరియు, కంఠీరవదేవుడు, రామామణియు, దామోదరుడును ప్రవేశించుచున్నారు.]

జియ్య—కంఠీరవా! నీవుచేసినమోసం, నీఅంతట నీవే ధారాళంగా చెప్పివేసి క్షమార్పణకోరడంచేత నీవుచేసినతప్పును నేను క్షమించినాను.

కంఠీ—అయ్యా! వక్కమనవి—

జియ్య—నీవేమీా చెప్పనక్కరలేదు, మాచిన్నదానికి నీడబ్బ

క్కఅలేదు. నీవు గుణవంతుడవైతే—

వంచ—(వెలుపలినుండి) నేనుకాను నేనుకాను. అసిమరివకరు. వదిలిపించిన వాడికి శిక్షలేదు. నాయజమానుడు వారిలో వున్నాడు. పట్టుకొండి.

[పార్వతి వెనుకరాగా భవానిసింగుచేతను శివప్రసాదుచేతను పట్టుకోబడి వంచకాచార్యుడు ప్రవేశించుచున్నాడు]

కంఠీ—ఏమిా! వంచకాచార్యులా?

వంచ— ఏమివంచకాచార్యులు? చివరికు వంచకాచార్యులే వంచతుడయినాడు. నేను లోపల ఫలహారప్రయత్నంలో వుండేట ప్పటికి వీళ్లు వెలుపలనన్ను పట్టుకోవడపు ప్రయత్నంలోవుండి అధా త్తుగా మీాదపడ్డారు.

భవా—ఇప్పుడుపట్టుపడ్డది నీవునక్కడవేకాదు. నీయజమా నుడుకూడా పట్టుపడ్డాడు. ఇఖతప్పించుకుపోవడానికి వల్లకాదు. వెలు పల పోలీసువారిని కావలి పెట్టివచ్చినాము.

జయ్య— మాయింట్లో వుండగా యెవరికి కష్టముకలుగరాదు. వీరు యెంతసొమ్మయివ్వవలెనో నేను యిచ్చివేస్తాను. వీరిని వదలి పెట్టండి.

భవా—ఇతణ్ని వాకంటుమీాద పట్టుకున్నమనిషిని విడిపించి నందుకు పట్టుకున్నాము. ఇతణ్ని విడిచిపెట్టవల్లకాదు.

జయ్య—వెండిరూపమయిన యీమందు మీాచేతికి తగిలితే యితన్ని పట్టుకోవడానికి మీాకే చేతులురావు. ఇవి పుచ్చుకొని వెళ్లి పొండి. (అని పదిరూపాయలు చేతిలో పెట్టుచున్నాడు.)

భవా— ఈమందుతో నాచేతులు కట్టివేసినారు. మీాఔషధం శివప్రసాదుచేతికికూడా తగిలిస్తేనేకాని అతనిచేతులు కట్టుపడవు.

శివ—నా చేతులా?

జియ్యా—మాట్లాడకు. నీచెయ్యి యిలాగుపట్టు. (అని యతని చేతిలో మరిపదిరూపాయలు పెట్టుచున్నాఁడు.)

శివ—మేమెప్పుడూ డబ్బుకులోబడేవాళ్లంకాము. లక్షవరహాలుకుప్పపోసినా మేము వకఅక్రమకార్యం చెయ్యము. మీవంటి పెద్దలమాట మీరరాదు గనుక వీరిని విడిచి పెడుతూవున్నాము. బాకీ సొమ్ము దయచేయించండి.

జియ్యా—దామోదరా! వీరిని తీసుకొనివెళ్లి లోపల సొమ్మిప్పించిపంపివేసిరా.

దామో—చిత్తము. (ముగ్గురును వెళ్లుచున్నారు.)

జియ్యా—వంచకా! నీకు రాజమహేంద్రవరంలో తోట వున్నదనిబొంకి నన్ను మోసం చెయ్యతలచుకొన్నావుకావా?

వంచ—నాకక్కడతోటలేదా? నిజంగానే వున్నది. నేనుచెప్పినవానిలో యేమీ మోసంలేదు. ఆవూళ్లో మ్యూజియంతోటమాదే.

జియ్యా—చందాలువేసికట్టిందది అందరిహక్కున్ను. నీది యేలాగు అయింది?

వంచ—నేను అందరిలోవాణ్ణి గనుక అందరితోటిపాటు నాదీఅయింది.

జియ్యా—ఆహాహా! నీయుక్తికి సంతోషించినాను.

వంచ—మీరొక్కరేమిటి? నాయుక్తికి అందరూ సంతోషించేవారు. చిన్నతనంలోనే నాతమ్ముడయిన దామోదరుణ్ణి—

[దామోదరుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

దామో—దామోదరుణ్ణా? యెవరు నాపేరెత్తుతూవున్నారు?

వంచ—దామోదరుణ్ణి మోసం చేసి వాడిచేతులో వుండే

పళ్ళా పంచదారా తింటూవుంటే నాశక్తికి నన్ను మాతల్లికూడా మెచ్చుకునేది.

దామో—గొప్పవాడుకావలెనని చిన్నతనంలోనే దేశాలు తెగించిపోయినజనార్దనుడవా నీవు? మాజనార్దనుడు చిన్నతనంలో నాచేతిలోయేమివున్నా యిట్టే మాయంచేసి యెత్తుకొనిపోయేవాడు.

వంచ—ఆజనార్దనుణ్ణే నేను. యిల్లువిడిచి వెళ్లినతరువాత నాశక్తిసామర్థ్యాలచేత నేనువంచకాచార్యుల నయినాను. దామోదరా! యిలావచ్చి నన్ను కౌగిలించుకో. ఇప్పుడు నేను కొడుకునుపోగొట్టుకున్నాతమ్ముణ్ణి సంపాదించుకొన్నాను. (అనికౌగిలించుకొనుచున్నాడు.)

దామో—అన్నయ్యా! అప్పుడే యింతముసలివాడవై పోయినావేమి?

వంచ—నేను ముసలివాణ్ణి కావడం నీకు యిష్టంలేకపోతే యిదుగో మళ్ళీ పడుచువాణ్ణవుతాను చూడు. (అని క్రొత్తగాపెట్టుకొన్నపండ్లను మీసములను గడ్డమును తీసివేయుచున్నాడు.)

పార్వ—దామోదరా! నీవు నన్ను పెళ్ళాడుతావా?

దామో—నేను అన్నమాట తప్పను. తప్పకుండా నిన్ను పెళ్లిచేసుకుంటాను.

కంఠీ—నీతమ్ముణ్ణి చూచి మన మంతా మంచిమార్గం నేర్చుకోవలెను. వంచకా! నీవు యింతటినుంచి అబద్ధాలూ మోసాలూ మానివేసి పెద్దమనిషివికావలెను. నేనూ అవుతాను.

వంచ—నేను రూపంచేత యిప్పుడే పెద్దమనిషినయినాను. ఇక నడతచేతకూడా అవుతాను. ఇప్పుడే నిశ్చయం చేసుకున్నాను.

బియ్యా—కంఠీరవా! ఇప్పుడు పశ్చాత్తాపంకలిగి నిజంగానే

నీనడత తిన్న చేసుకునే ట్టయితే నాకూతురిని నీకు తప్పకుండా యిచ్చి నిన్ను యిల్లరికం వుంచుకుంటాను.

కం°—మామా! ముందు నానడత మీరు జాగ్రతగా పరీక్ష చేసి చూడండి. నాకు యింతటితో బుద్ధి వచ్చింది. మోసాలూ అబద్ధాలూ కొంతకాలం లాభకరంగా వున్నా కడపటు సత్యమే జయిస్తుంది — ఓ మహాజనులారా! నామాట నమ్మండి. అల్పలాభం నిమిత్తమయి అబద్ధాలూ మోసాలూ మానండి. లోపలికి వెళుదాము రండి. (అని అందరును వెళ్ళుచున్నారు.)

# అసహాయశూరప్రహసనము.

ఇందువచ్చు పాత్రములు.

—0—

భావరాజు భీమరాజు—మహాశూరుఁడు.

పెంటయ్య—మహావీరుఁడు.

వీరభద్రుఁడు—సరస్వతిప్రియుఁడు.

భ్రమరాంబ—భీమరాజుభార్య.

సరస్వతి—భీమరాజుకూఁతురు; వీరభద్రునిప్రియురాలు.

రంగము—భీమరాజుగారి మందిరిలోగిలి.

[భ్రమరాంబయు సరస్వతియు ప్రవేశించుచున్నారు.]

సర—(విచారముతో) అమ్మా! ఆయన యెలాగు వున్నారు?

భ్రమ—అమ్మాయీ! యెలాగువున్నా రని చెప్పను? రాత్రి పొద్దుపోయి యింటికి వచ్చినప్పటినుంచీ ఆయనచర్య నాకు మహా వింతగా వున్నది. నాకు యేమని చెప్పడానికీ తోచదు. యేమాట అడిగినా దేనికీ జవాబు చెప్పరు. వూరికే పరధ్యాన్నంగా వుంటారు. రాత్రి యెవరియింట్లోనైనా కన్నంవేసినారో, యెవరికైనా తలకాయ బద్దలుకొట్టినారో, యేదో అటువంటి గొప్పకార్యం చేసి వుంటారు.

సర—మానాన్నగారిమీద నీవు నిష్కారణంగా లేనిదోషాలు ఆరోపిస్తూ వున్నావు.

భ్రమ—నిష్కారణంగానా? మొట్టమొదట రాత్రివంటిగంట దాకా ఆయన యింటికే రాలేదు. వచ్చిన తరువాత రాత్రి తెల్లవారిందాకా నిద్రపట్టక మంచంమీద ఇటూ అటూ దొర్లుతూ తనలో

తానేమో అర్థంలేనిమాటలు గొణుక్కుంటూ పలవరిస్తూనేవున్నారు. రెండో అంశము తెల్లవారిన తరువాత మూలగదిలో ముసుకువేసుకుని కూర్చుండి కచేరీవేళ అయిందని భోజనానికి యెన్నిమాట్లు పిలిచినా లేచి రాకుండా వున్నారు. ఇదివరకు యెప్పుడయినా యింత ప్రొద్దెక్కిందాకా కచేరికి వెళ్ళకుండా యింట్లో అట్టె వున్నారేమో చెప్పు. యేదీ లేకపోతే యెందుకు అట్టె వుంటారు? ఆయనకు యిష్టమయినకూర అని నేను యెంతో ఆసక్తితో ముద్దంకాయ చేసి పిలిచినా రాలేదు. ఇంతకూ యిదంతా నాదురదృష్టం.

సర—నీవు తొందరపడబోకు. ఆయనమనస్సు స్వస్థంగా లేకపోవడానికి అనేకకారణాలు వుంటవి. ఈమధ్య మనయింటికి చుట్టాలు రావడం యెక్కువఅవడంచేతనే కాదా నేనుకూడా లోపలి భవంతిలోనే సర్దుకుని యిదివరదాకా నేను పడుకునే తోటలోవున్న యీ ముందరభవంతి ఖాళీచేసి అద్దెకు యివ్వడానికి సిద్ధం చేసినారు.

భ్రమ—నీవు యేవిధంగా సర్దిచెప్పినా నామనస్సుకు సమాధానం కలుగదు. నేను వట్టి అదృష్టహీనురాలిని. అమ్మాయీ! నీకు వక్కసంగతి చెప్పుతాను విను. నీవు మాత్రం యెప్పటికి నీదేహాన్నీ స్వేచ్ఛనూ యితరులకు అమ్ముకోకు.

సర—స్వేచ్ఛను అమ్ముకోవడం అంటే నాకు యేమీ అర్థం కావడంలేదు. ఆమాటలకు వివాహం అని నీఅభిప్రాయం అయివున్నట్టయితే నాన్నగారు వప్పుకుంటే వీరభద్రరాజును నేను తప్పకుండా పెళ్ళిచేసుకుంటాను. అతనికి కచేరీలో పనికావడంతోటే మావివాహానికి నాన్నగారు వప్పుకుంటామన్నారు.

భ్రమ—అమ్మాయీ! యీవిషయంలో నీకు లోకానుభవం బొత్తిగాలేదు. ముందుగా తొందరపడి యేదైనా కార్యంచేస్తే తరు

పాత విచారించవలసివస్తుంది. నేను ముసలివాణ్ని చేసుకుంటే సుఖ
పడుతానని నీతండ్రిని రెండో పెళ్లివాణ్ని వివాహం చేసుకున్నాను.
చేసుకున్నందుకు నేను యిప్పుడు యెలాగు విచారిస్తూ వున్నానో
చూస్తూవున్నావా? వీరభద్రరాజు వచ్చినాడా అని యీవుదయా
న్నుంచీ మీతండ్రిగారు నన్ను చాలామార్లు అడిగినారు.

సర—నిజంగా అడిగినారా? యిదివరదాకా ఆయన వీరభద్ర
రాజుకు కచేరీలో పని అయ్యేవరకూ ఆపేరే తనవద్ద తలపెట్టవస్త
న్నారు. నాకు వేగిరం వివాహంచెయ్యాలనే ఆసక్తిచేత యిప్పుడు
ఆయనమనస్సు మార్చుకున్నట్టున్నారు. అయ్యో! యిప్పుడు వీరభద్ర
రాజువస్తే బాగా వుండును. ఇది కచేరీవేళగనుక నాన్నగారు యింట్లో
వుండరనుకుంటాడేమో అతనికి యెవరిచేతనైనా వర్తమానం పంపిం
తునా? నాన్నగారు వుండగానేవస్తే సంబంధనిశ్చయం యిప్పుడే
అవుతుంది.

భ్రమ—వూరుకో. మీనాన్నగారు వస్తూన్నారు. మనయిప్పటి
ప్రసంగం ఆయనముందర యేమయినా అనేవు సుమా! జాగ్రత.

[వీరిద్దరుండగా తొంగిచూచుచు భీమరాజుగారు ప్రవేశించుచున్నారు.]

భీమ— యెవరూ వస్తూవున్నట్టు లేదు. యేమివచ్చినాసరే నేను
ఒక్కసారు కచేరీకివెళ్ళి ముఖంచూపించి రాకతప్పదు. యివేళకచేరీకి
యింత ఆలస్యంగా వెళ్ళినందుకు యేదయినా కారణం కల్పించుకోని
పోవలెను. నిన్నటిరాత్రి వ్యవహారం యేలా ముగిస్తుందో నాకు తెలియ
కుండావున్నది. (భార్యను కొమార్తెనుజూచి) మీరు యిక్కడ యేమి
చేస్తూవున్నారు? మీకు యేమి కావలెను? అలాచూస్తారేమి!

భ్రమ—మీయీనడత నాకు యేమీ బోధపడకుండావున్నది.

సర—నాన్నగారూ! యీవుదయాన్నుంచి మీచూపులు

యెలాగోవున్నవి.

భీము—(తనలో) నాముఖంచూచి వీళ్ళు యెలాగో నాసంగతి కనిపెట్టినారు. (బిగ్గరగా) నాముఖంకేసి చూడడమూ పిచ్చివ్యూహాలు చెయ్యడమూతప్ప మీకు యింట్లో వేరే యేమీ పనిలేదా? పొండి. ఇక నాతో మాటుమాట ఆడకండి. అమ్మాయీ! నేను కచేరీకి వెళ్ళ డానికి నాతలపాగా అంగరఖాయిలా తీసుకుని రా. పోరేము?

సర—వెళుతూవున్నాము. (నవ్వుచు) పిన్నీ! ఇదేమిటె?

భీమ—యేమనిచెప్పను? లోకంలో మొగవాళ్ళంతాయిదే మోస్తరు. యింతపొద్దెక్కి యిప్పుడు భోజనంచెయ్యకుండా కచేరీకి వెళుతారట. (అని యిద్దఱును వెళ్లుచున్నారు.)

భీమ—(అంతట కలయజూచి) అందరూ వెళ్ళినారా? వెళ్ళి నారు! నేను యెటువంటి పాపిష్టిరాత్రి గడపినాను. అదిరాత్రికాదు. నాపాలిటికి వకమహాయుగంలాగు కనపడ్డది. నేనుయెప్పుడూ నాటకాలు చూడడానికి వెళ్లేవాణ్నేకాను. భోంచేసి శిరస్తాదారుగారి యింటికి వెళ్ళివస్తూ దోవలో నాటకంఆడుతూవున్నారంటే యిట్టేలోపలికిపో యినాను. అప్పుడు నారొంటిని అర్ధరూపాయి వుండడంచేత దానితో రెండవతరగతి టిక్కెట్టుకొని బల్లమీద కూర్చున్నాను. నేను కూర్చో వడంతోటే వెనకనుంచియెవళ్లో అల్లరివాళ్ళుపాగాఅడ్డంతీసివెయ్యిమని కేకలు వేస్తే నాతలపాగాతీసి నేను కూర్చున్నబల్లమీద పక్కగా పెట్టినాను. నాటకం అయిపోయే ముందర నాతలపాగాకోసం చూచు కునేటప్పటికి కనపడ్డదికాదు దగ్గిరవున్నవాళ్ళను యెవరిని అడిగినాలేద న్నారు. అందుమీద నాబల్లమీద వున్నవారినందరినీ లెమ్మనేటప్ప టికి నాపాగా వక పెద్దమనిషిముడ్డికింద నలిగివున్నది. “ఏమయ్యా! నాపాగా మెత్తగా వేసుకుని కూర్చోవడం మీకు ధర్మమేనా?”

అని నేనా పెద్దమనిషిని మందలించేటప్పటికి తాగివుండడంచేత నన్ను అతడుతిట్టి అడ్డమయిన కారుకూతలుకూసినాడు. నేను శాంతంవహించి వూరుకునేవుందునుగాని దగ్గిరనున్నవాళ్ళందరూ ప్రోత్సాహంపరిచి పురియెక్కించడంచేత రోషంవచ్చి నేనుకూడా తిట్టి అతణ్ని మెడపట్టుకుని గెంటినాను. అతడు కిందపడిలేచి,, యిది నాటకంపాక అయింది గనుక బ్రతికిపోయినావు నీ పేరూయిల్లూ చెప్పు. రేపుయేమిచేస్తానో చూడు '' అన్నాడు. నేను,, భావరాజు '' అని యింతలోనే అతనిమీద జాలిపుట్టడంచేతనో మరియెందుచేతనోగాని కోపమంతా మింగివేసి ,, మంగళవారప్పేట '' అని చెప్పినాను. అతను వెంటనే తన జేబులోనుంచి వకకాగితముతీసి దానిమీద తన పేరు ,, పెంటయ్య లక్ష్మివారపుపేట సత్రము '' అని వ్రాసి నాచేతికిచ్చి రేపుదెబ్బలాడుదామురమ్మన్నాడు. నేనుయింటిపేరుచెప్పి పేరుచెప్పకపోవడంచేతనూ, పేట తప్పుపేట చెప్పడంచేతనూ యీబుధవారప్పేటలో నన్ను అతను కనుక్కోలేడు. పెంటయ్య అనే పేరునిజమయినదిగానమ్మడానికి వీలులేదు. అతని ముఖంచూస్తే అతడు ఖూనీలుచేసే తెంపరిగా కనపడ్డాడు. అతడు యెక్కడ కనపడుతాడో అని నేనుయివేళవీథిలోకివెళ్లలేదు. నేను వీరభద్రరాజుతో మాట్లాడవలెను. అతను తనకు నాయందు గురుభక్తి అనిన్నీ సమయంవస్తేనానిమిత్తం ప్రాణాలయినా విడుస్తాననీ చెప్పుతూవుంటాడు. ఇప్పుడు సమయంతటస్థించింది గనుక నాతరఫున వాడితో పోట్లాడడానికి వెనుకతియ్యడని తలుస్తాను. అతను దిట్టంగావున్నాడు. ఇటువంటి యిద్దరు పెంటయ్యలను కొట్టగలడు.

[అంగరఖాయును, తలగుడ్డయును పట్టుకొని సరస్వతియు, భ్రమరాంబయు ప్రవేశించుచున్నారు.]

సర—నాన్నగారూ! ఇవిగో.

భీమ—(అంగరకా తొడుగుకొనుచు) దోవలో అతను నాకు యెదురుపడుతాడేమో! (మొగము కనపడకుండ తలపాగా ముందుకు పెట్టుకొని) ముందుగానే జాగ్రతపడడం మంచిది—అమ్మాయీ లోపలికివెళ్ళి బణాచుపచ్చడం తీసుకునిరా.

సర—మండువేసవికాలములో బణాచుపచ్చడం యెందుకు?

భీమ—యెందుకైతేనేమి? నామాటకుఅడ్డంచెప్పకతీసుకునిరా.

భ్రమ—అమ్మాయీ! వెళ్ళితీసుకునిరా. ఆయన నిన్ను వదల్చుకోవలెనని పనికల్పన చేస్తూవున్నారు.

భీమ—వదల్చుకోవలెననా? నేనేవదలుతాను. ఇకముందు నీవు వకర్తెదానవూసుఖపడుదువుగానిలే. కాపురానికివచ్చిన నాలుగు సంవత్సరాలలోనే అప్పుడే నేనంటే నీకింత విసుగుదలగావున్నదా? నీకోరికే లభిస్తుంది. పోనీ నీతో నేను యిప్పుడు తగువులాడను.

సర—(పచ్చడముతో ప్రవేశించి) ఇదుగో తెచ్చినాను.

భీమ — (పుచ్చుకొని మొగమునిండ ముసుగు వేసికొని) అమ్మాయీ! వెళ్ళివస్తాను. నాతప్పులు క్షమించండి. (తనలో)ఏదయినా అపాయంవస్తే యిదేఆఖరుసెలవు.

(అని వెళ్ళుచున్నాడు.)

భ్ర—ఆయనమాటలు విన్నావా? అందులో చాలాఅర్థంవున్నది. నేనువకర్తెదాన్ని సుఖపడడమట! ఈవకర్తెమాటలోనూ యెంత అర్థమయినా వున్నది.

సర—నాకు యేమీ కొత్తఅర్థం కనపడడంలేదు.

భ్రమ—నీకుకనపడడంలేదు. పెళ్ళి చేసుకుని నాలుగేళ్లపాటు మొగుడితో వుంటేనేకాని యిటువంటువి యేవీ కనపడవు. నాకు పనివున్నది లోపలికి వెళుతాను. యెవరైనా అద్దెకుఅడిగితే తోటబం

గాళా నాలుగురూపాయలకు యిచ్చివెయ్యి. నీపెళ్ళివిషయంలో నేను యిందాకాచెప్పింది మరచిపోకమా. మగవాళ్ళంతా వక్కటేఅచ్చు. వక్కరినీ నమ్మరాదు. యెవరినైనా మగవాణ్ణి పెళ్ళిచేసుకోవడానికి ముందుగా బాగాఆలోచించుకో. (అనివెళ్ళుచున్నది.)

[వీరభద్రరాజు ప్రవేశించి సరస్వతికి కనబడకుండా వెనుకనిలుచున్నాడు.]

సర— ఆలోచించుకోనా? ఇదివరకే బాగాఆలోచించుకున్నాను. వీరభద్రరాజు తనమీద మక్కువవున్నదా అనిఅడిగితే మాట్లాడక వూరుకున్నాను. నామనస్సులో వున్న కోరికె చెప్పే టట్టయితే మక్కువ వున్నదని వెంటనే చెప్పవలసిందే. అయితే నాకు అతని మీద మోహంవున్నసంగతి కొంతకాలందాకా తెలియకుండా వుంచుతాను.

వీర—ఏమీ!

సర—ఎవరు వారు? మీరా? నేనా! ఏకాంతంలో తాను రహస్యంగా మాట్లాడుకునే మాటలు యెవరూ విన కూడదు.

వీర—కొంచెము వినవచ్చును. అవును గాని ప్రియురాలా!—

సర—నన్ను ప్రియురాలా గియురాలా అనకండి. ఇవేళమీరు యింతసేపటిదాకా యెందుకు మాయింటికిరాకుండా ఆలస్యంచేసినారో వివరంగా చెప్పేవరకూ నేను మీతో మాట్లాడను.

వీర—పొద్దస్తమానంతా వుద్యోగంకోసం అనుసరిస్తూ వారింటి కాడ కూర్చున్నాను.

సర—చాలును. ఇక చెప్పనక్కరలేదు. నేనుతృప్తి పొందినాను.

వీర—మీ కీబంగాళా ఖాళీచేసినట్లున్నారు. ఇది నేను అద్దెకు పుచ్చుకుంటాను. నాకు వుద్యోగం అయి మన పెళ్ళికిమీతండ్రిగారు వప్పుకునే వరకూ ఇందు మూలంగా నైనా నేను యెప్పుడూ నిన్ను చూస్తూ వుంటాను.

సర.—సరిసరి. చాలును. నీవు ఇక్కడవుండవద్దు. యీ సంగతి మానాన్నగారికి తెలిస్తే మనంయిద్దరమూ ఆలోచించుకుని యేదో పన్నినామని అనుమానపడుతారు. మీకు ఇల్లుయివ్వడానికి అసలేవప్పుకోరు.

వీర—నేనువెళ్ళి మీసవతితల్లితో మాట్లాడుదునా?

సర—వద్దు మనం యిద్దరమూ నంటరిగా యిక్కడవున్న సంగతి ఆవిడకు తెలియకూడదు.

వీర—అయినా కానీ

సర—నేను చెప్పినట్లు చెయ్యకపోతే మీరు యీయింట్లో వుండడానికి నేనే వప్పుకోను.

వీర—అలాగైతే నేను వెళ్ళిపోతాను. (అనివెళ్ళుచున్నాడు.)

[అప్పుడుభ్రమరాంబ తొందరగా ప్రవేశించుచున్నది]

భ్రమ—ఇక్కడయెక్కడనైనా యిల్లు అద్దెకు దొరుకుతుందా అని యెవరో వీధిలో అడిగితే పొరుగువారు మనయిల్లు చెప్పినారు. మాటవినపడి నేను పని వదలిపెట్టి వేగిరంవచ్చినాను. అదుగో ఆయన ఇలాగువస్తూన్నారు.

సర—అలాగైతే అద్దె నీవేమాట్లాడి ఫరిష్కారంచెయ్యి. నేను లోపలికి వెళ్లివస్తాను. (అనివెళ్ళుచున్నది.)

[మొగము కనబడకుండబట్టముసుగువేసికొని పెంటయ్యప్రవేశించుచున్నాడు.]

భ్రమ—దారియిది ఇలాగురండి.

పెంట—(ముసుగుతీసి ఇంటికేసిచూచి) ఈయిల్లు యెవరిది?

భ్రమ—భీమరాజుగారిది. రుమీరు ఇంటికోసం వెతుకుతూ వున్నారుకాబోలును.

పెంట—అవును. ఆయన మీకు యేమవుతారు? తాతగారా?

భ్రమ—కారు. ఆయనమావారే.

పెంట — మీాయింటిఆయనా? ఈయింట్లో వేరే పురుషులు యెవరూ లేరుకదా.

భ్రమ — లేరు.

పెంట — అలాగైతే యీాయిల్లు బహుబాగావున్నది.

భ్రమ — పొరుగంతా బహుమంచిది. దీనికివున్నలోపమల్లా ఇదివూరికి చివరను కొంచెం మారుమూలగా వున్నది.

పెంట — నాకు అలాగంటియిల్లేకావలెను. అది యెంతమాత్రిమూలోపంకాదు. ఇళ్లమీాద ఇళ్ళువుండడంకంటె ఇలాగంటితోటలూ దొడ్లూఅంటే నాకు బహుసంతోషం.

భ్రమ — మీారీవేళ పొద్దున్నుంచీ భోజనం చెయ్యలేనట్టున్నది. మీాకు తొందరగా వున్నట్టయితే మాకువండుకున్న అన్నమూ కూరలూ మీాకుపెట్టి మేము మళ్ళీ వండుకుంటాము. మంచి ముక్వాంకాయ వండినాను. నాలుగుఅణాలు యిస్తే యీాపూట మీాకుపెరుగుతో భోజనం పెడుతాను. (తనలో) ఈచల్లారిపోయిన అన్నమూ కూరలూ యీాయనకుపెట్టక చేరీనుంచి ఆయనవచ్చేటప్పటికి మళ్ళీవంటచేస్తాను.

పెంట — (తనలో) ఇక్కడ భోజనంకూడా దొరికింది. నేను యీారోజున గుమ్మందాటివెళ్లనక్కరలేదు. (బిగ్గరగా) నీవుమహాదొడ్డ యిల్లాలులాగు: కనపడుతూ వున్నావు. నీతో నేను బేరమాడను. ఇంటిఅద్దె యెంతో కూడా చెప్పివెయ్యి. నన్ను పరాయివాణ్నిగా చూడక మీాకుటుంబంలో వకణ్నిగా చూడవలెను. అయ్యో ! మడిబట్టలేదుగదా?

భ్రమ — ఈపూటకు మావారిపట్టుబట్ట యిస్తాను. కట్టుకోండి.

(అని తెచ్చియిచ్చుచున్నది.)

పెంట — ఇన్నిచోట్ల తిరిగినానుగాని నీవంటిదొడ్డయిల్లాలిని

నాజన్మంయెత్తినతరువాత నేను యెక్కడాచూడలేదు. (అనిపట్టుపంచ పుచ్చుకొని) ఇటువంటి భార్య దొరకడంచేత మీయింటాయన చేసు కున్న పుణ్యామేపుణ్యాం.

భ్రమ—మీరునన్ను వూరికేపొగుడుతూవున్నారు.

పెంట—నేనుచెప్పినదంతా నిజం ఇది ముఖస్తుతికాదు.

[సరస్వతి ప్రవేశించుచున్నది.]

భ్రమ—ఈచిన్నదినాకూతురు.

పెంట—కూతురా? ఈచిన్నది మీచెల్లెలో అప్పగారోఅను కున్నాను. సవితికూతురుకాబోలును.—అమ్మాయీ! నీవుకూడా నీతల్లిగారు చూపించినదయే నామీద కనపరచవలెనుసుమా.

సర—మీరు బహుదొడ్డవారు. ఇటువంటిసత్పురుషులు మాపుణ్యాంచేత మాయింటికి కాపురానికి వచ్చినారు.

పెంట—నేనుధన్యుణ్నయినాను. అమ్మా! అద్దెమాట చెప్పి నారుకారు.

భ్రమ—నెలకు నాలుగురూపాయలు.

పెంట—ఇదిగో వకనెలఅద్దె పుచ్చుకోండి. (అని నాలుగురూ పాయ లిచ్చుచున్నాడు.)

భ్రమ—(పుచ్చుకొని) ముందుగానేయిస్తూవున్నారా?

పెంట—యెప్పుడైతేనేమి ఇవ్వవలసింది ముందుగానే ఇచ్చి నాను. (తనలో) ఈవిడె అద్దె పుచ్చుకున్నది. ఇక బ్రహ్మ దిగివచ్చినా నెల్లాళ్లదాకా నన్ను యీ యింట్లోనుంచి యెవరూ లేవకొట్టలేరు.

(అని లోపలికి వెళ్ళుచున్నాడు.)

సర—(తల్లితో రహస్యముగా) ఇతడు తమాషా మనిషిలాగు వున్నాడు. నాన్నగారూ యితడూ తగవులాడకుండావుంటే బాగా

వుంచును.

పెంట——(కిటికీలోనుండి చూచుచు) ఈయిల్లు బహుళతమాషా గావున్నది. చుట్టూ తోటలు యెంతోముచ్చటగావున్నవి. ఈవైపున పువ్వులచెట్లున్నవి. అవతలవైపున కూరగాయల పాదులు వున్నవి. అమ్మా. వడ్డనచేయిస్తారా!

భ్రమ——మాఅమ్మాయివెళ్లి తెస్తుంది. అమ్మాయీ! నీవువెళ్ళి అన్నమూకూరలూ పట్టుకువస్తావా?

పెంట——నాపుణ్యంచేత నేడు యీఅమ్మాయిచేతివడ్డన కూడా నాకులభ్యమైనది.

సర——ఇదుగో తెస్తాను. (అని వెళ్ళుచున్నది.)

పెంట——యీఅమ్మాయి మహామంచిది. ఈవిడె పేరు యెవరు?

భ్రమ——సరస్వతి. మీపేరుయెవరో సెలవిస్తారా?

పెంట——నాపేరా? పేరు మంచిదైతేనేకాని మీవంటివారితో చెప్పకూడదు. నాది చెప్పరానిపేరు.

భ్రమ——మీపేరు యెవరికీతెలియకుండా ఇక్కడ వుండవలెనని వుద్దేశించుకున్నారా?

పెంట——లేదు. అటువుంటి వుద్దేశంయెంతమాత్రమూ లేదు! నాపేరు ప్రసిద్ధిలోకిరావలెననే నావుద్దేశం ఐనాకానీ ఇటువంటి చెడ్డపేరుతో నాకు మంచిపేరుయేలాగువస్తుందో తెలియకుండావున్నది.

(అని పేరు మెల్లగా చెప్పుచున్నాడు)

భ్రమ——(ఉలికిపడి) ఏమీ!

పెంట——నాపేరు మీకసహ్యంగా వుంటుందని నాకు తెలుసును. అదిమాపెత్తండ్రిపేరు నాకు పెట్టినారు. ఈపేరు మార్చుకోవడవు వుద్దేశంతోనే ఇప్పు డీవూరికి వచ్చినాను. మాపెత్తండ్రిగారు

బ్రతికివుండగానే ఆయన నావుద్దేశం కనిపెట్టి పేరుమార్చుకోకుండా వుంటే సంవత్సరానికి నూరురూపాయలు వచ్చే తనమాన్యం నాకు వుండేటట్టును పేరు మార్చుకునేటట్టయితే ఆమాన్యం తనపెళ్ళానికి వెళ్ళేటట్టును యేర్పాటుచేసి చచ్చిపోయినాడు. ఆవిడిప్పుడు యీవూళ్ళోవున్నది. వక చిన్నది నన్ను పెళ్ళిచేసుకుంటా నని తీరా వివాహం సిద్ధమయ్యేటప్పటికి యీపాడుపేరు మార్చుకుంటేనేకాని పెళ్ళిచేసుకోనన్నది. ఇప్పుడావిడె మాపెత్తండ్రికి మూడోపెళ్ళిపెళ్ళాము! ఆవిడెకు పద్దెనిమిదేళ్ళువుంటవి. ఇక్కడి స్త్రీపునర్వివాహసమాజంవారి ప్రోత్సాహంవల్ల ఆవిడె రెండునెలలకిందట వకభాగ్యవంతుణ్నిమళ్ళీ పెళ్ళి చేసుకున్నది. ఆవిడెకు యీముష్టినూరురూపాయలూ యేమీలక్ష్యం లేదు. ఆవిడెను బతిమాలుకుని యెలాగైనా ఆవిడెచేత ఈ మాన్యం తనకు అక్కరలేదనిపించుకుని పేరు మార్చుకోవలెనని ఇక్కడకు వచ్చినాను. ఆవిడె నాలుగురోజులకిందట మొగుడితో యెక్కడికో వూరికి వెళ్ళిందట. ఆవిడె బహుమంచిమనిషి. చిన్నప్పుడు బాలికాపాఠశాలలో చదువుకున్నది. ఆవిడెకు ఇష్టంలేకుండానే మూడోపెళ్ళి మొగుణ్ని తల్లిదండ్రులుకట్టిపెట్టినారు. ఆవిడెతిరిగివచ్చిందాకా ఈవూళ్ళో వుంటాను.

భ్రమ—మీకార్యం వేగిరం సఫలం కావలెనని నేను దైవాన్ని ప్రార్థిస్తాను.

పెంట—నీతల్లికడుపుచల్లగా నీనోటిమాట ఫలించవలెను.

భ్రమ—మంచివారికి దైవం యెప్పుడూ సహాయం చేస్తాడు. నేను సెలవుపుచ్చుకుంటాను. (అని వెళ్ళుచున్నది.)

పెంట—ఇఖ నేను తప్పించుకున్నాను. ఆపెద్దపులినోట్లోనుంచి తప్పించుకున్నాను. అతడు వెళ్ళి నేను చెప్పినయింటికి వెళ్ళిచూచి నేను

యెక్కడికో పారిపోయినానని పేటంతా వెతుకుతాడు. వూళ్ళోవున్న సత్రాలూ వంటపూటియిళ్ళూ అన్నీ వెతికినా నేను యెక్కడా కనపడను. నేను యీమారుమూలను బుధవారపుపేటలో వుంటానని అతను అనుకోడు. రాత్రి కొంచెంతాగి మత్తుగా వుండడంచేతగాని లేకపోతే నానిజమయిన పేరూ వున్నస్థలమూ చెప్పివుండను. రాత్రి సంగతి తలుచుకుంటే నావొళ్ళంతా గరుపొడుస్తూవున్నది. నే నేమిటి? ఆజానుబాహుడైన ఆమోటముసలవాడితో పోట్లాడడం యేమిటి ? ఆమత్తులో వొళ్ళు తెలియక వూరికే దెబ్బలాడుతానన్నాను. అనరహాంతకుడు పెందరాళే లేచేవాడు కాకపోవడంచేత నేను చాలా ప్రొద్దెక్కి లేచినా వేగిరం పూటకూళ్ళకు యివ్వవలసిన సొమ్ము యిచ్చివేసి అతను అక్కడికి రాకమునుపే తప్పించుకొని పారిపోయి వచ్చినాను. అతడు ప్రొద్దున్నే వచ్చినట్టయితే యీపాటికి నాపని యేమవునో !

[అప్పుడు వీరభద్రరాజు ప్రవేశించుచున్నాడు.]

వీర— యెవ రక్కడ ?

పెంట—(భయపడి) దగ్గిరకు రాకండి. (వీరభద్రరాజుమొగము వంక చూచి) మిమ్మల్ని చూచి నిష్కారణంగా వులిక్కిపడి జడుసుకున్నాను.

వీర—ఏమరిపాటున వచ్చినందుకు క్షమించండి. (తనలో) ఇతడు యెవ్వరై వుంటాడు ?

పెంట—(తనలో) జాగ్రతగా వుండవలెను. ఇతడు వకవేళ మనజాడ తియ్యడానికి పంపించిన వేగువాడై వుండవచ్చును. (బిగ్గరగా) క్షమాపణ అక్కరలేదు. నేను ఇక్కడ వున్నానని మీరు యెరుగరు కాబోలును.

వీర—యెరుగను. నేను భ్రమరాంబగారితో మాట్లాడిపోవ

డానికి వచ్చినాను.

పెంట—నాకు యిల్లిచ్చిన యీయింటామెతోనా!

వీర—యీయిల్లు మీకప్పుడే ఇచ్చివేసిందా!

పెంట—ఇచ్చివేసింది. అప్పుడే పావుగం టయింది వచ్చి నే నీ యింట్లో ప్రవేశించినాను.

వీర—(తనలో) వకదాని తరువాత వకటి నాకన్నీ దురదృష్టాలే వస్తూవున్నవి. ఇఖ భ్రమరాంబతో మాట్లాడిన ప్రియోజనం లేదు. ఇతనితోనే యెలాగైనా మాట్లాడి యీయిల్లు పుచ్చుకోవలెను. (బిగ్గరగా) అయ్యా!

పెంట—(ఉలికిపడి) నలుదిక్కులుచూచి యెవ్వరును లేకుంటుట చేత ధైర్యము తెచ్చుకొని) నాకు చెవుడు లేదు. మీరంత బిగ్గరగా పిలువనక్కరలేదు.

వీర—మీరు పుచ్చుకున్న యీయిల్లు నాకు ముఖ్యముగా కావలసి వున్నది.

పెంట—నాకూముఖ్యంగానేకావలసివున్నది.మీరుప్రియత్నం చేస్తే వూళ్ళో కావలసినన్ని ఇళ్లు దొరుకుతవి.

వీర—అట్లనుగాని నాకు యీయిల్లే అవశ్యంగా కావలెను. నిజం చెపుతాను వినండి. ఈయింటియజమానుడయిన భీమరాజుగారి కూతురు సరస్వతిమీద నాకు చాలా ప్రేమ వున్నది. ఆచిన్నదాన్ని వివాహంచేసుకోవడానికి నేను ప్రయత్నంచేస్తూ వున్నాను. నేను యీయింట్లో వుంటేనేకాని మావివాహానికి ఆయన వప్పుకోడు. కాబట్టి మీరు సిద్ధమైన పెళ్ళికార్యానికి భంగంకలుగచెయ్యక వేరే ఇల్లు కుదుర్చుకుంటారని నమ్ముతాను.

పెంట—నేను నీకు నాచేతనైన సహాయం చేస్తానుగాని ఇందులో

వక్కసంగతి వున్నది. రాత్రి యీవూళ్ళో నేను వక పెద్దమనిషితో తగవులాడి నాతో పోట్లాటకు రమ్మని నాపేరూ వున్న ఇల్లూ వ్రాసి యిచ్చినాను. ఆపెద్దమనిషి యెవరో అదివరకు నేను యెప్పుడూ చూచి వుండలేదు. నాకైతే భయంలేదుగాని ముక్కూ మొగమూయెరుగని వాళ్లతోపోట్లాడడం నాకిష్టంలేదు. అందుచేతనే నేను ఇదివరదాకా వున్న పూటకూటియిల్లు వదలివేసి ఇక్కడవచ్చి ప్రవేశించినాను. నేను యీవూళ్ళో కొంచెంకాలమే వుంటాను. ఈలోపుగామరివకచోటికి వెళ్ళ డానికి నాకు యిష్టం లేదు.

వీర—ఈచుట్టుపట్ల చాలా యిళ్ళు దొరుకుతవి. మీకు యింత కంటె మంచియిల్లు చూచిపెడుతాను. మీరు నాకు యీమాత్రపు వుపకారంచేస్తిరా, మీప్రాణానికి నాప్రాణమయినా అడ్డంవేసి యెవరి వల్లనూ యేవిధమైన తొందరా రాకుండా నేను జాగ్రతపెడుతాను.

పెంట—నీమాటలువింటే నాకుజాలివేస్తూవున్నది. నీవుతప్ప కుండానీవుచెప్పినంతా చేసేవాడవే. నేను చెప్పేసంగతికూడావిను. నేనుయీవూళ్ళో యెంతోకాలంవుండను. కొన్నిరోజులే వుంటానో కొన్నిఘుంటలేవుంటానో!

వీర—అంతేనా?

పెంట—శ్యామలాంబ అనే ఆవిడెకు నేనువ్రాసినవుత్తరానికి జవాబునిమిత్తం యెదురుచూస్తూవున్నాను.

వీర—కొత్తపేటలో వున్న శ్యామలాంబా?

పెంట—అవును. ఆవిడెను నీవుయెరుగుదువా?

వీర—యెరుగుదును. ఆవెడెను కొత్తగా పెళ్ళాడింది నామేన మామే. వక్కనిమిషం తాళండి జ్ఞాపకం చేసుకుంటాను. తనపేరుమా ర్చుకోవడానికి సెలవడుగుతూ కొన్నిరోజులకిందట ఆవిడెకు ఉత్తరం

వ్రాసిన పూర్వపుభర్తతాలూకు బంధువుడవు నీవేకాదుగద ?

పెంట — ఆదురదృష్టవంతుణ్ని నేనే.

వీర — మీ పేరు —

పెంట — చెప్పకండి. చెప్పకండి.

వీర — (నవ్వుచు) ఆహాహా!

పెంట — నవ్వకండి. ఇది నవ్వులాటవ్యవహారం కాదు. ఇది ముఖ్యమయినకార్యం. ఆవిడె వూళ్ళోకి రావడంతోటే —

వీర — ఆవిడె వూళ్ళోకి యీవుదయాన్నే వచ్చింది.

పెంట — ఆలాగైతే ఆవిడెదగ్గరనుంచి నావుత్తరానికి జవాబు రానడంతోటే —

వీర — మీరు యీయింట్లోనుంచి వెళ్లిపోతారు. నాకు తెలిసింది. నేను యిప్పుడు పక్షిలాగు యెగిరిపోతాను.

పెంట — యెక్కడికి?

వీర — మీవుత్తరానికి జవాబుతీసుకురావడానికి. నేను యెంతో సేపువుండను. ఈలోపుగా మీకు నాపని యేమయినా కావలసివున్నట్టయితే నాపేర వుత్తరం వ్రాసి కొత్తపేటలో సత్రంయింటికి పంపండి. మీరు పరోపకారధురీణులు. మీమేలు నేను యెప్పటికి మరిచిపోను. మీతరపున నిలిచి యెవరితోనైనా పోట్లాడమంటే పోట్లాడుతాను. నాప్రాణం యిమ్మన్నా యిస్తాను. (అని వెళ్ళుచున్నాడు.)

[విస్తరియు, చెంబులును, పీటయు పట్టుకొని సరస్వతి ప్రవేశించుచున్నది.]

సర — వీరభద్రరాజుయీయనతో మాట్లాడివెళుతూవున్నాడు. వీరిద్దరికీ పూర్వపరిచయం వున్నట్లున్నది.

పెంట — (గదిలోపల) ఈపట్టణంలో కంపుయెక్కువగా వున్నా యిక్కడవుండేజనులు బహుమంచివాళ్ళగా కనుపడుతూ వున్నారు.

ఈచిన్నవాడు నానిమిత్తం తనప్రాణమయినా యిస్తానన్నాడు. ఇతను మహామంచి అంతఃకరణ కలవాడు. నాకు యిల్లు దొరకకపోయినా యీయిల్లు యితనికి యిచ్చివేస్తాను. (అని యీవలికివచ్చుచున్నాడు)

సర—అయ్యా! మీకూరలూ అన్నమూ పొయిమీద కొంచెము వెచ్చపెట్టి మాపిన్ని తెస్తూ వున్నది.

పెంట—అమ్మాయీ! నీవా? అంతా పరిష్కార మయింది. ఈయిల్లు ఆతనికియిచ్చివేస్తాను. నీవు చిరకాలం సుఖడవలెనని ఆశీర్వాదం చేస్తూవున్నాను.

సర—మీ మాటలు నాకేమీ తెలియడం లేదు.

పెంట—అవును. తెలియవు. యోగ్యురాండ్రయిన కన్నెలకు యిటువంటివి యేమీ తెలియవు. సరస్వతీ! నీవద్ద రెండుయోగ్యతలు వున్నవి. నీకు చక్కతనమూ వున్నది. దానికి తగినట్టు వినయమూ వున్నది. నేను వక్కసారి యీగదిలోకి వెళ్లివస్తాను. నీవు సంతోషముగా వుండు. ఈయిల్లు అతనికి యిచ్చివేస్తాను. (అని లోపలికివెళ్ళుచున్నాడు.)

[భ్రమరాంబ ప్రవేశించి విస్తరిలో వడ్డించుమన్నది]

భ్రమ—ఈయన యెక్కడికి వెళ్లినాడు? అన్నమూ కూరలూ మళ్ళీ చల్లారిపోతవి.

[భీమరాజుగారు తలుపుతీసికొని ప్రవేశించుచున్నారు.]

భీమ—(భార్యను కొమార్తెను చేసైగచేసి దగ్గరకు పిలిచి మెల్లగా) నేను వెళ్లినతరువాత మనయింటికి నాకోసం యెవరయినా వచ్చినారా?

సర—యెవరూ రాలేదు.

భీమ—ఓప్రాణేశ్వరీ! యెవరూ రాలేదా?

భ్రీమ—రాలేదు.

భీమ—నాకు సంతోషంగా వున్నది. (అని గంతులు వేయుచున్నాడు.)

భ్రీమ—మీయిందాకటి విచారమంతా పోయి మళ్ళీ యెప్పటి సంతోషం వచ్చిందా?

భీమ—నేను వకప్పుడు విచారంగావున్నానా? నాకు యెప్పుడూ విచారం లేదు. నేను యెప్పుడూ సంతోషంగానే వుంటాను.

భ్రీమ—విచారం లేకపోతే పోనియ్యండి. మీయిందాకటి స్థితి చూస్తే నాకు నిజంగా భయం వేసింది.

భీమ—ఇకముందు యెప్పుడూ అలాభయపడబోకు.

సర—నాన్నగారూ! మీరువెళ్లినతరువాత మీఆశలవుప్రకారం యీయిల్లు వకరికి అద్దెకు యిచ్చి వేసినాము.

భీమ—యెవరికి యిచ్చినారు?

భ్రీమ—ఆయన యెవరో మహామంచివాడు. వకనెలఅద్దె ముందుగానే యిచ్చివేసినాడు.

భీమ—రండి. మనకు మంచిదినాలు వస్తూవున్నవి. ఆయన యెక్కడ వున్నాడు? ఆయనకు నేను మర్యాద చెయ్యవలెను.

సర—ఆగదిలో. (అని చూపుచున్నది.)

భ్రీమ—అతిథిసత్కారం చెయ్యడానికి యజమానులు మీరు వచ్చినారు గనుక యిఖ మేము లోపలికి వెళుతాము. (అని భ్రీమరాంబయు సరస్వతియు వెళ్ళుచున్నారు.)

భీమ—ఇక నేను నిర్విచారంగా వుండవచ్చును. మా యింటికి కాపురానికి వచ్చినాయన నాకు సహాయంగా వుంటాడు. (విస్తరివంక చూచి) అప్పుడే వంటయిందా! మువ్వంకాయకూడా వున్నది. నాకు

యిప్పుడు మనస్సులో విచారంపోయిందిగనుకయీఅన్నమూకూరలూ విస్తరీకూడా మింగి వెయ్యవలెనని వున్నది. నాకు యివేళ యెక్కడ వద్దించింది. నేను లోపలికిపోయి సాగా అంగరకా తీసివేసి యిప్పుడే వస్తాను. (అని వెళ్లుచున్నాడు)

[పెంటయ్య ప్రవేశించుచున్నాడు.]

పెంట—ఇప్పటికి నాప్రాణాలు కుదుటపడ్డవి. ఇప్పుడు ఖులా సాగా భోజనం చెయ్యవచ్చును. (అని పీటమీద కూరుచున్నాడు.)

[బట్టలు తీసివేసి భీమరాజు మరల ప్రవేశించుచున్నాడు]

భీమ—నాపట్టుపంచె కనపడ్డదికాదు. పోనీ. నాకు యిష్టమయిన మువ్వంకాయ వున్నది కనుక యీబట్టలతోనే భోజనం చేస్తాను. (అని విస్తరివద్దకు వెళ్లుచున్నాడు; అప్పుడు వారిద్దఱును ఒకరినొకరానవాలు పట్టుచున్నారు)

పెంట—(భయముతో) ఎవరు?

భీమ—(భయముతో) ఏమి?

పెంట—ఇదుగో ఖూనీచేసేవాడు.

భీమ—ఇదుగో నరహత్యచేసేవాడు. (వెనుకకు వచ్చి తనలో) వీడు యెలాగో నాయిల్లు కనుక్కొని యిక్కడికే వచ్చినాడు.

పెంట—(తనలో) నేను యెక్కడెక్కడికి వెళ్లినదీ యితడు వేగులవాళ్లను పెట్టి కనుక్కున్నాడు.

భీమ—నన్ను హింసించడానికి నీవు మాయింటికే వచ్చినావా?

పెంట—నీయిల్లా? ఈయిల్లు నాది.

భీమ—ఈయిల్లు నీదా? (తనలో) ఈకిరాతుడు నాయింట్లో ప్రవేశించి, నాపట్టుబట్ట కట్టుకుని, నామువ్వంకాయలు మింగివెయ్యడానికి తయారుగా వున్నాడు. నామనస్సులో వక్క దురూహాకూడా

పుడుతూ వున్నది. ఈదురాత్ముడు నన్ను కడతేర్చి నాపెళ్లాన్ని వివాహమాడవలెనని తలుచుకుని వుంటాడు. (బిగ్గరగా) నీవు నాభార్య నుచూచినావా? ఈయింటావిడెను చూచి వుంటావు.

పెంట—ఆవిడె నీభార్యా? అటువంటి చక్కని పడుచు చిన్న దాన్ని నీవంటి ముసలివాడికి యిచ్చి పెళ్లి చేసినారా? పాపం! ఆచిన్న దాని దురదృష్టం. నీవు వుండేస్థలం నీవు చెప్పిన మంగళవారపుపేట కానేకాదా?

భీమ—నీవు లక్ష్మివారపుపేట సత్రములో వున్నట్టు కనపడదు.

పెంట—నీపేరు భావరాజుకాదా?

భీమ—భావరాజు భీమరాజు.

పెంట—(తనలో) ఇఖ యితని సంగతి తెలిసిపోయింది. యితను వట్టి పిరికివాడు. భయంచేత రాత్రి పేరు చెప్పకుండా యింటి పేరు మాత్రం చెప్పినాడు. వున్న స్థలంకూడా అబద్ధపుదోటు చెప్పినాడు. అందుచేత నేను ధైర్యంగావుండి మహాశూరుఃన్నె అయినట్టు కనపర్చ వచ్చును. (బిగ్గరగా) అయ్యా! నావిషయంలో మీరు తప్పు అభి ప్రాయం పడుతూ వున్నారు. నేను వ్రాసియిచ్చినట్టు నేను లక్ష్మి వారపుపేటసత్రములోనే వున్నాను. నీవు పిరికివాడవన్న సంగతి రాత్రే కనిపెట్టి నీతోకూడా మనిషిని పంపి యెక్కడవుంటావో కనుక్కొని యి క్కడకు వచ్చినాను. ఇఖ నిన్ను నేను రాత్రీపగలూ మధ్యాహ్నమూ యెప్పుడూ వదిలిపెట్టను.

భీమ—అయ్యా! నేను కొత్తగా పెళ్ళిచేసుకున్నాను.

పెంట—నీభార్యయందు నాకుండే గౌరవంచేత ఆసంగతి యే దో విధంగా యిప్పుడే పరిష్కారం చేసుకుందాము. (చేయి పట్టుకొని లాక్కుచు) ఇదుగో యీగదిలోకి వెళుదాము రా.

భీమ—అయ్యా ? నిర్దోషినిచంపి నరహత్యాపాపం కట్టుకోవడం మీావంటియోగ్యులకు తగునా ?

పెంట—(తనలో) ఇఖ నేను యితణ్ని మనసువచ్చినట్టు ఆడించ వచ్చును. (బిగ్గరగా) నీకు యెవరైనా స్నేహితుడులేడా ? నీకు బదులుగా అతణ్ని పంపు.

భీమ—స్నేహితుడా ? (తనలో) ఇది బాగా వున్నది. ఇప్పుడు నాప్రాణాలు దక్కినవి. వీరభద్రరాజు యిదివరదాకా మాకుటుంబం నిమిత్తం తన ప్రాణాలు విడుస్తానంటూ వుండేవాడు. దాని నిజం యిప్పుడు తెలుస్తుంది. (బిగ్గరగా) వున్నాడు. అతనికి యిప్పుడే వుత్తరం వ్రాస్తాను. (అని కాగితమును కలమును పుచ్చుకొనుచున్నాఁడు.)

పెంట—(తనలో) ఇతడు నిజంగానే వ్రాస్తూవున్నాడు. ఇతనికి యిప్పుడు ధైర్యం వచ్చినట్టున్నది. ఇప్పుడేదీనికి తగినప్రతిక్రియ చెయ్యవలెను. (అని ఆలోచించుచున్నాఁడు.)

భీమ — (తనలో) ఇఖ నాకు భయం లేదు. (అని వ్రాయుచున్నాఁడు.)

పెంట—(కాగితమును కలమును పుచ్చుకొని యిట్లు వ్రాయుచున్నాఁడు.)—"ఓస్నేహితుఁడా ! నీవు కామించిన చిన్నదాని తండ్రే నాశత్రువు. కాబట్టి నీవు నాతరపున వుండడం బాగా వుండదు. అందుచేత నాకు సహాయుణ్నిగా మరియెవరినైనా వెంటనేసంపాదించవలెను. ఇది మహా మహాముఖ్యమయినకార్యం. నాగౌరవం ముఖ్యంగా కాపాడవలెను.— విధేయుడు. పెం—

తాజాకలం—నీవు నాకు బదులుగా పోట్లాడవలెనన్నసంగతి నీకు బాగా తెలుసును గదా ? దిట్టంగా పోట్లాడడానికి చేతనయిన వాణ్ని సంపాదించవలెను."

భీమ—(ఉత్తరము మడచి పైపేరువ్రాసి) ఈవుత్తరం తీసుకుని వెళ్ళేవారు యెవరు ?

[పాలచెంబు చేతబట్టుకొని యొకగొల్లవాఁడు ప్రవేశించుచున్నాఁడు.]

గొల్ల—అయ్యా! మీకు పాలు పంపించినారు.

భీమ—పాలు యిలా తీసుకునిరా. (అని దూరముగా తీసికొని వెళ్లి గొల్లవానితో రహస్యముగా) ఈవుత్తరం తీసుకునివెళ్లి వెంటనే వీరభద్రరాజుకు యిచ్చి రా.

గొల్ల—(పుచ్చుకొని) చిత్తము. (అని నడుచుచున్నాఁడు.)

పెంట — (గొల్లవానితో వీధిగుమ్మముదాక నడిచి నీవు యీవుత్త్తరం మంగళవారపుపేట సత్రంలో వున్న వీరభద్రరాజుగారికి యివ్వవలెను. ఈపని చేసినందుకు నీకు రెండణాలు యిస్తాను. (అని యుత్తరమును సొమ్మును చేతిలో పెట్టుచున్నాఁడు.)

గొల్ల— యిప్పుడే యిస్తాను. (అని వెళ్ళుచున్నాఁడు.)

భీమ—(ముందుకును వెనుకకును నడుచుచు తనలో) ఈవ్యవహారంలో యేదో చిత్రం జరుగుతుంది (పెంటయ్యతో) ఇప్పటి స్థితిని బట్టి చూస్తే యిఃక మనం యిద్దరమూ వకయింట్లో వుండడం పొసగదు. ఈమాటలసూచన మీకు తెలిసిందా ?

పెంట—నాకు సూచనలూ గీచనలూ తెలియవు. నేనుముందుగా అద్దెయిచ్చివేసినాను. నెలదినములదాకా యిది నాయిల్లు. నేను యిక్కడనుంచి కదలను. ఇక్కడనేవుండి నాకూరలూ నాఅన్నమూ నేను యిక్కడనే తింటాను. (అని విస్తరిముందు పీటమీఁద కూర్చున్నాఁడు)

భీమ—నీకూరలూ నీఅన్నమూనా? నీచర్యచూస్తే నావొళ్ళు మండుతూ వున్నది.నీవు నాయిల్లు వదలివెళ్లనంటూ వున్నావుగా! నేనే

యిల్లు విడిచి లేచి పోవలెనుకాబోలును.

[దీపముపట్టుకొని భ్రమరాంబ ప్రవేశించుచున్నది]

భ్రమ—ఈగడబిడంతా యేమిటి?

భీమ—నీవు।నాకు అడ్డం రావద్దు నాహంతకుణ్నినిన్నూ వదలి వేసి నేను వెళ్లిపోతాను. (అని వెలుపలికి వెళ్ళుచున్నాఁడు.)

పెంట—(వంకాయతో అన్నము తినుచున్నాఁడు)

భ్రమ—(దగ్గరకువెళ్ళి) ఏమయ్యా! మీరు నాభర్తగారిని హత్యచేస్తారా? నాకు యీపసుపు, కుంకమూకూడా లేకుండా చేస్తారా? సరస్వతీ! సరస్వతీ! (అని యేడ్చుచున్నది)

పెంట—చేస్తేయేమి? ఈముసలిమొగుడు పోతే నీకు కావలిస్తే యింతకంటె మంచిమొగుడే వస్తాడు.

[సరస్వతి పరుగెత్తుకొని వచ్చుచున్నది.]

సర.—పిన్నీ యేమిటి?

భ్రమ—నాకు యేమీా తెలియదు. ఇక్కడ యేదో ఖూనీ జరగపోతుంది.

సర—ఖూనీ జరుగుతుందా?

భ్రమ—నాభర్తగారు నాకంటె ముసలివారయితే అయినారు. నాకు ఆయనయందే యిష్టము. మీరు ఆయనజోలికివెళ్లవలెనంటే ముందుగా నన్ను చంపి మరీఆయనిమీాదికి వెళ్లండి.

పెంట—ఆలాగయితే ఆయన బ్రతికిపోయినాడు.

[వీరభద్రరాజు తొందరగా ప్రవేశించుచున్నాఁడు.]

భ్రమ—వీరభద్రా! నీకు యిక్కడ జరిగేసంగతంతా తెలిసినట్లయితే—

వీర—నాకంతా తెలుసును. (పెంటయ్యతో రహస్యముగా)

మీారు పంపించినమనిషి నాకు దోవలో కన పడ్డాడు.

పెంట—నావుత్తరం చదువుకొన్నారా ?

భ్రమ—నేను వుండగా నాభర్తగారికి యేమీా అపాయంరా నియ్యను. ఆయనపోట్లాడవలసివుంటే ఆయనకు బదులుగా నేను పోట్లాడుతాను.

పెంట—నిన్ను ప్రతినిధినిగా నేను వప్పుకోను. నేను తుపాకులకయినా కత్తులకయినా వోపగలనుగాని ఆడవాళ్లగోళ్లతో వోపలేను.

భ్రమ—నేను యిప్పుడు వెళ్ళి యీచుట్టుపట్ల వాళ్ల నందరిని పిలుచుకునివస్తాను.

వీర—అమ్మా నీవుయేమీాతొందరపడక యీవ్యవహారమంతా నాకువదలిపెట్టు. ఇందులో నీభర్తగారికి అపాయంరాదు. నామాట నమ్ము.

భ్రమ—వీరభద్రా! నేను అంతకూ నిన్నేనమ్మినాను. వెధవరికంమాట తలచుకుంటే నావళ్ళు వణుకుతూ వున్నది. (అని వెళ్ళుచున్నది)

సర—ఓయీా! మా కుటుంబముయొక్క గౌరవమంతా నీ చేతులో వున్నది. మానాన్నగారికి యేమీా అపాయం రానీయకు. (అని వెళ్లుచున్నాడు.)

పెంట—నీవు మంచిసమయానికి వుట్టిపడ్డావు. నాచీటి నీకు అందిందా?

వీర—మీామనిషి నాకు దోవలో కనపడ్డాడు. భీమరాజుగారు కూడా అతనిచేతికే వుత్తరం యిచ్చి పంపినారు. ఆయన నన్ను తనకు సహాయుణ్నిగా వుండవలెనని కోరినారు.

పెంట—అలాగైతే మరీమంచిది. యీావ్యవహారం సులభంగా

పరిష్కారమవుతుంది.

వీర—అవుతుంది. సరస్వతియందు నాకు యెంత ప్రేమవున్నా మీయందుకూడా నాకు విశేషగౌరవం కలిగింది. ఆగౌరవం కనపర్చడానికి ఇప్పుడు సమయం వచ్చింది.

పెంట—ఇది నీయోగ్యతకు తగివున్నది.

వీర—మీకు సహాయుణ్ని సంపాదించినాను.

పెంట—సంతోషంగా వున్నది.

వీర—అతను మహాపౌరుషశాలి. భీమరాజుగారు క్షమార్పణ కోరి మీరుయిద్దరూ సమాధానపడుతామన్నా పడనిచ్చేవాడుకాడు. మీరు వోడిపోయినా మీస్థానమందు నిలిచి పగ తీర్చుకుంటాడు.

పెంట—నావుత్తరంలో తాజాకలం నీవు చదువలేదాయేమిటి?

వీర—భీమరాజుగారు బహుకోపధారులు మీరు భయపడగూడదు. మీరు ధైర్యంగా నిలువవలెను. యుద్ధంలో మీ ఆయుధము లేమిటి?

పెంట—నా తాజాకలం నీస్నేహితుడికి చూపించవలెను.

వీర—తెలిసింది. ఆయుధాలు తుపాకీలు. వొకరికొకరికి పది హేనుబారలదూరము.

పెంట—అదంతానాకేమీ తెలియదు. మీలోమీరే చూచుకోవలెను.

వీర—ఇప్పుడీఅపాయం తప్పించుకోవడానికి వున్నసాధనమంతా మీధైర్యంలో వున్నది. ఆయనయెదుట మీరు భయంకరంగా కనపడవలెను.

పెంట—ఆయనయెదుట యిదివరకే వుండవలసినదానికంటె యెక్కువభీకరంగా కనపడ్డాను.

వీర — ఈవ్యవహారమంతా నాకు విడిచిపెట్టండి.

వెంట — విడిచిపెట్టినాను. నాజరూరులేకపోతే నీవన్నట్టు తుపాకులేఆయుధాలు. దూరముగా పదిహేనుబారలే నావుత్తరంలో వున్న తాజాకలం మీారతనికి వినిపించి వుండవలసినది. (అని లోపలికి వెళ్ళుచున్నాడు)

వీర — ఇప్పటికి వకరిని దారికితెచ్చినాను. ఇఖ రెండోవారిని కూడా స్వాధీనం చేసుకోవలెను.

భీమ — (తలుపులోనుండి తల లోపలికిపెట్టి) వీరభద్రా!

వీర — భీమరాజుగారా?

భీమ — నీకోసమే నేను ఇక్కడ కాసుకుని వున్నాను. నాకేసి చూడకుండానే నీవు తురుగ్గిన లోపలదూరినావు. అతణ్ని చూచినావా?

వీర — అత నాగదిలోనే వున్నాడు. మెల్లగా మాట్లాడండి. మీారు మహావీరుడితో యుద్ధము చేయవలెను. అతను దయాదాక్షిణ్యములు లేనివాడు.

భీమ — ఆక్రూరుణ్ని మొదటినుంచీ నేను ఆలాగే అనుకున్నాను. వాడుక్రూరరాక్షసుడు.

వీర — మీారు ధైర్యంగా వుండవలెను. అటువంటివాడియెదుట మీా ధైర్యముయెంతమాత్రమూ కనపరచకూడదు. యెంతసాహసం గలవాడూకూడా ధైర్యంగలవాడికి వెనుకతీస్తాడు. మీాకు యిందులో యేదయినా ప్రాణాపాయమే వచ్చేటట్టయితే మీాకుటుంబాన్ని నేను సంరక్షణచేస్తాను. భయపడకండి. మీావుత్తరంచూస్తే నాకు చాలాజాలివేసింది. మీారే వోడిపోవడం తటస్థమయితే మిమ్మలిని నేను యెప్పుడూ తలచుకుంటూవుంటాను.

భీమ — నావుత్తరం నీవు తిన్నగా చదవలేదు.

వీర—చదివినాను. ఈసంగతి వెల్లడయ్యేటట్టయితే లోకానికి మీరు పిరికివారనేటట్టు కనపడనిచ్చి మీగౌరవవానికి భంగంకలిగేటట్టు చేస్తాననుకున్నారా యేమిటి?

భీమ—అందులో నాపిరికితనంయేమిటి? నాతరఫున నిన్ను పోట్లాడమని కోరలేదా ?

వీర—దానికీ అంతేఅర్థము.

భీమ—అందులో యేమీలేదు. వకరిపక్షంగా వకరు యుద్ధం చెయ్యడం సర్వసాధారణంగా జరుగుతూనేవుంటుంది. అందులోపౌరుషహాని యేమీవుండదు.

వీర—వుండకపోవచ్చును. యీ వ్యవహారం మీలో మీరే చక్కపెట్టుకోవలెను. ఇందులో మీకు యేమీ అపాయం లేకుండా నేనొకవుపాయం ఆలోచించినాను.

భీమ—అదియేమిటో చెప్పు. అది బాగావున్నట్టయితే నేను కూడా ధైర్యంలోఆతనికి తీసిపోయేవాణ్ని కానట్టు కనపరుస్తాను. నేను ఆలోచించినవుపాయం మహాసూక్ష్మమయింది.

భీమ—ఆలాగయితే వేగిరంచెప్పు.

వీర—మీయిద్దరికీకూడా నేనే సహాయుణ్నిగా వుండి మీయిద్దరితుపాకీలలోనూకూడా నేనే మందు కూరుతాను.

భీమ—మందు కూరుతావా ?

వీర—వట్టి మందు కూరుతాను. గుండ్లు వెయ్యను.

భీమ—నేనూ ఆలాగే అనుకున్నాను.

వీర—మీరు యిప్పుడే యీగదిలోనే పోట్లాడవలెను.

భీమ—నీవు కూడా దగ్గిర వుండవలెను. నాకు తుపాకి చూస్తే భయం వేస్తుంది.

వీర — మీరు చూడ నక్కరలేదు. అప్పుడు నే నీగదిలో దీపాలు తీసివేస్తాను.

భీమ—అలాగయితే చీకటిలో కుమ్ములాటా ?

వీర—అతను ఆగదిలో వున్నాడు. నేను వెళ్ళి ముందరి యేర్పాటులన్నీ చేస్తాను. (అని వెళ్ళుచున్నాఁడు.)

భీమ—నాగుండెలు కొట్టుకుంటూ వున్నవి. అయినా కానీ నాకు యేమీ అపాయం రాదని నిశ్చయంగా తెలుసును కనుక నేను మాటలలో కావలసినంత శూరత్వం కనపరుస్తాను. అగ్నిహోత్రంలో మిడుత దూకడానికి వస్తూ వున్నది.

[పెంటయ్యతో వీరభద్రరాజు ప్రవేశించుచున్నాఁడు]

పెంట—(రహస్యముగా) నాకేమీ అపాయం రాదని మీరు దృఢంగా చెప్పగలరా ?

వీర—కావలసినంత దృఢంగా చెప్పగలను.

భీమ—(పెంటయ్యమొగమువంక చూచుచు తనలో) వీడి మొఖం దెయ్యపు ముఖంలాగు వూరుకున్నది.

వీర—నాయనలారా ! ఇది మహా గొప్పకార్యంగాని సాధారణమయింది కాదు. ధైర్యశాలులలో నెల్లా ధైర్యశాలులైన మహా శూరు లిద్దరున్ను నాయెదుట నిలుచున్నారు. నాకు బహు సంతోషంగా వున్నది. (పెంటయ్యను చూపుచు భీమరాజుతో) అయ్యా ! ఈయన నిన్నరాత్రి నాటకపుపాకలో మీతలగుడ్డమీద కూర్చుని మీకవమానం కలుగచేసినాడు కాబట్టి మీయుద్ధం కాచుకోవడానికి సిద్ధంగా వున్నాడు.

పెంట—అవును సిద్ధంగా వున్నాను.

భీమ—నీవు నన్ను అవమానపరచడం నన్ను వక్కణ్నే అవ

మానపరచడం కాదు. పెద్దమనుష్యుల కందరికీ అవమానం కలుగజేసినావు. అందుచేత నీమీద అందరూ పగతీర్చుకోవలెను.

పెంట — నేను పగతీర్చుకుంటాను.

వీర — అంతా సిద్ధమయిందా ?

భీమ — (భయముతో) అంతా.

పెంట — (గద్గదస్వరముతో) అంతా.

వీర — (ఇద్దరిమీద చెఱియొక చేయియు వైచి) లోకంలో పౌరుషశాలులంటే మీరిద్దరే పౌరుషశాలులు.

పెంట — (ధైర్యము తెచ్చుకొని) తుపాకులా ?

భీమ — తుపాకీలే.

పెంట — బారుచేసినవేనా ?

భీమ — బారుచేసినవే.

పెంట — మందువేసేనా ?

భీమ — మందువేసే.

పెంట — ఇంకా —

భీమ — అన్నీని —

పెంట — దీపాలు లేకుండానేనా ?

భీమ — దీపాలులేకుండానే.

పెంట — నేను సిద్ధంగా వున్నాను.

భీమ — నే నంతకు మునుపే వున్నాను.

వీర — (రెండు తుపాకులు చూపి) ఇవిగో మీఆయుధాలు.

ఇద్దఱు — (ఉలికిపడి కొంతసే పనుమానించి, తుదకు చెఱియొక తుపాకియు పుచ్చుకొనుచున్నారు.)

భీమ — వీరభద్రా! నీచెయ్యి నారొమ్ముమీద పెట్టి నాగుం

డెలు కొట్టుకుంటూ వున్నవేమో చూడు.

వీర—(ఇద్దరి బొమ్మలమీదను చేయివేసి) లోపల అసలే గుండెలు లేనట్లు మహానెమ్మదిగా వున్నది. మీరు యిద్దరూ గుండెలు తీసిన బంట్లు. నేను మూడుమాట్లు చప్పట్లు చరుస్తాను. మూడోమాటు చరవగానే కాల్చండి. నేను యిప్పుడు దీపాలు దీసుకు వెళుతాను.

పెంట—కాలుస్తాము.

భీమ—కాలుస్తాము.

వీర — ఇప్పుడు మీయిద్దరి కోరికప్రకారమూ తలుపులు వేస్తాను. (అని వేయుచున్నాఁడు.)

భీమ—నాకోరికప్రకారము. (తనలో) ఇందులో యేదోకొంటె తనం వున్నది. నాజాగ్రతమీద నేను వుంటాను.

పెంట—(తనలో) అతను చీకటి కావలెనంటూ వున్నాడు. అతని కేదో లోపల దురుద్దేశం వున్నది.

వీర—(దీపములు చేతితో పట్టుకొని) ఇఖ మీరు చెప్పవలసింది యేమీ లేదుగదా?

పెంట—లేదు.

భీమ—లేదు?

వీర—ఇఖ నేను వెళుతాను. (అని వెళ్ళఁబోవుచున్నాఁడు.)

భీమ—(మరల పిలిచి తుపాకిచూపి వీరభద్రరాజుతో రహస్యముగా) అందులో యేమీ భయం లేదుగదా?

వీర—భయంలేదు.

పెంట—(వీరభద్రరాజుతో రహస్యముగా) అపాయకరంకాదుగదా?

వీర—కాదు (అని వెళ్లుచున్నాఁడు.)

భీమ—(కొంచెము తాళి) నేను చీకటిలో వుండలేను. నాకు చిన్నప్పుడుసమేతూ చీకటంటే భయం. అనేక క్రూరమైన నేరాలు చీకటిలోనే చెయ్యబడుతవి. అదుగో! అతనుకదులుతూవున్నట్టున్నాడు.

పెంట—(కిటికివద్దకుఁ బోయి) ఈచీకటిలో పెట్టి నన్ను మోసం చెయ్యవలెనంటే నేను తప్పించుకోలేనా? (కిటికితలుపుదీసి) అతను దగ్గిరకువచ్చినాడంటే, ఒక్కదూకుదూకి కిటికీలోనుంచి అవతలపడి క్షణంలో ప్రాణాలు దక్కించుకుంటాను. నాకు ఫర్వాలేదు.

భీమ—(ఆలకించి) అతను కిటికీతలుపు తీసినాడు. అతనికి తప్ప కుండా ఖూనీచెయ్యడపు వుద్దేశం వున్నది. ఖూనీచేసి ఆకిటికీలోనుంచి పారిపోవడానికి చూస్తూవున్నాడు. (కిటికీతలుపుతీసి) అతను దగ్గరకు వచ్చినాడంటే నేను యీ కిటికీలోనుంచి దూకి యిరుగుపొరుగువారి నందరినీ కేకలువేస్తాను.

వీర—(వెలుపలినుండి రెండుసారులు చేతులు చరచుచున్నాఁడు)

పెంట & భీమ—(ఇద్దరును భయముచేత వడకుచు, ఎవ్వరయిన సమీపమునకు వచ్చినపక్షమున వెలుపలికి దుముకవలెనని చెరియొక కిటికీలోను కూరుచున్నారు.)

వీర—(మూడవసారి చప్పటలు చఱిచి లోపలికి వెళ్ళి యొక తుపాకీ ఆకాశమున పేల్చుచున్నాఁడు.)

పెంట—అతను మొట్టమొదట తుపాకీకాల్చినాడు.

భీమ—మొదట అతనే తుపాకీ కాల్చినాడు.

(ఇద్దరును చెరియొక కిటికీలోనుండియు వెలుపలికి దుముకుచున్నారు)

[భ్రమరాంబయు సరస్వతియు చప్పుడు విని పరుగెత్తుకొని వచ్చుచున్నారు. దీపములుపట్టుకొని వీరభద్రరాజు మరలప్రవేశించుచున్నాఁడు]

భ్రమ—ఖూనీ. ఖూనీ.

సర—పోలీసువారు. పోలీసువారు.

వీర—భ్రమరాంబా! సరస్వతీ! వూరుకోండి. యెవరికీ యేహానీ జరగలేదు.

భ్రమ—నాభర్తగా రెకడ్క వున్నారు? ప్రాణేశ్వరా! యెక్కడ వున్నావు?

భీమ—(కిటికీలోనుండి తొంగి చూచుచు) ఇదుగో యిక్కడ వున్నాను.

భ్రమ— (అంతట చూచుచు) ఇక్కడ యెక్కడ?

భీమ—తోటకూరమడిలో.

వీర—పెంటయ్యగారు యెక్కడ వున్నారు?

పెంట—(రెండవకిటికిలో నుండి తలదూర్చి) నేను యిక్కడ వున్నాను.

సర—(అంతటను జూచి) యెక్కడ?

పెంట — ఇక్కడ చేమంతిమడిలో.

భ్రమ—మీరుయిద్దరూ అక్కడ యేమిచేస్తూ వున్నారు?

భీమ—యుద్ధము.

పెంట — ఘోరయుద్ధము.

వీర—మీయుద్ధము తోటకూరమడిలోనూ చేమంతిమడిలోనూనా? లోపలికి రండి.

[భీమరాజును పెంటయ్యయు లోపలికి వచ్చుచున్నారు.]

భీమ— మీరు రావడంచప్పుడు మేము విన్నాము.

పెంట — మేము మీరు పోలీసువారనుకున్నాము.

భీమ—అందుచేతనే మేము అవతలికి దూకినాము.

పెంట—అంతేకాకుండా—అంతేకాకుండా.—

వీర—యేమయితే యేమిలెండి. మీరుయిద్దరూ మీగౌర వాలు నిలుపుకున్నారు. మీరు యిద్దరూ నేడు రణశూరు లనిపించు కున్నారు.

భీమ—(పెంటయ్యతో) అయ్యా! మీవల్ల గౌరవం కలిగితే నాకు బహుసంతోషంగా వుంటుంది.

పెంట—అది మీకు యిదివరకే కలిగినది.

భీమ—మీమీద నేను తుపాకికాల్చను.

పెంట—అనగా రెండోమాటా? [మీరు.

భీమ—రెండో మాటేమిటి? యిప్పుడు తుపాకి కాల్చిన వారు

పెంట—మీరు.

భీమ—కాదు. మీరే.

పెంట—గుండు నాచెవివద్దనుంచి రంయ్యిమని పోయింది.

భీమ—మీగుండు నాతలవెండ్రుకలను దూసుకునిపోయింది.

వీర—అయ్యలారా! వ్యవహారం పరిష్కారమయింది గనుక యిక మన కావిషయమయి వాదం అక్కర లేదు.

పెంట—అది బాగా వున్నది. భీమరాజుగారూ! మీ చెయ్యి యిలాగుయివ్వండి.

భీమ—సంతోషంతో యిస్తాను. అయ్యా! మరిచిపోయినాను. మీ పేరేమిటి?

వీర—పెం—

పెంట—చెప్పకు చెప్పకు. (అని వీరభద్రరాజునోరు మూయు చున్నాడు.)

[ఒక సేవకుడు ప్రవేశించుచున్నాడు]

సేవ—అయ్యా! వీర భద్రరాజుగారికి వుత్తరం తెచ్చినాను.

వీర—నాకా? (అని పుచ్చుకొని విప్పి చూచి లోపల నున్న యొకయుత్తరము పెంటయ్య కిచ్చుచున్నాఁడు.)

పెంట—ఈవుత్తరం యెవరు వ్రాసింది?

వీర—మీకు మీపెత్తల్లి వ్రాసింది.

పెంట—చివరకు జవాబు వచ్చింది. నాచేతులు వణకుతూ వున్నవి. (అని విప్పి చదువుచున్నాఁడు.)—"ఓప్రియ పుత్రుఁడా! నీ వంతదీనత్వముతో చేసిన ప్రార్థనను నేను నిరాకరించలేదు. మీ పెత్తండ్రిగారు యిచ్చినఆస్తి నాకు అవశ్యంలేదు గనుక, అది నీవే స్వేచ్ఛగా అనుభవించు. ఇక నీయిష్టం వచ్చినట్లుగా నీ పేరు మార్చుకోవచ్చును. ఇట్లు నీపెత్తల్లి శ్యామలాంబ."—నాకు బహు సంతోషంగా వున్నది. నేడు మహా సుదినం. (అని గంతులు వేయుచు) భీమ రాజుగారూ? భ్రమరాంబగారూ! నేటికి నేను చరితార్థుణ్ని అయినాను. నామీద దయవుంచండి. మిత్రుఁడా! ఇక యీయిల్లు నీకు విడిచిపెట్టి తక్షణం వెళ్ళిపోతాను.

వీర—వెళ్ళిపోతారుగాని ముందు మీపేరేమిటి?

పెంట—నేను యిదివరకు యేమీ ఆలోచించుకోలేదు. ఇప్పుడు మన అందరి బుద్ధీ వుపయోగించి ఆలోచింతాము. ముందుగా నన్నాలోచించ నియ్యండి.

భీమ—రామయ్య.

భ్రమ—సోమయ్య.

సర—భీమయ్య.

వీర—కామయ్య.

పెంట—ఇవన్నీ సర్వసాధారణమయిన పేర్లు. వీటిలో వకటీ పనికిరాదు. ఎందులోనూ తొందరపడకూడదు. రేపురాత్రి మళ్ళీ మన

మంతా యిక్కడచేరి సావకాశంగా ఆలోచింతాము. అయినా కానీ నేను యిప్పుడే వెళ్ళిపోతూ వున్నాను. గనుక వెనుకనుంచి నా పేరు మీకు టపాద్వారా తెలియచేస్తాను. మిమ్మలి నందరినీ వదిలిపెట్టి వెళ్ళవలసి వచ్చినందుకు నాకు చాలా విచారంగా వున్నది.

(అని వెళ్ళఁబోవుచున్నాఁడు.)

భీమ—మాలోపలి యిల్లుకూడా చూచి వెళుదురు గాని వక్కసారి లోపలికి రండి.

(అందఱును వెళ్ళుచున్నారు.)

# కలిపురుష శనైశ్చర విలాసము.

ప్రథమరంగము — భూలోకము.

[కలిపురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కలి — నేను కృతార్థుణ్ని అయినాను. ఇప్పుడు భూలోకంలో నారాజ్యం స్థిరంగా స్థాపించినాను. ధర్మదేవతయొక్క మూడుకాళ్ళు విరుగకొట్టినాను. ధర్మదేవత వొంటికాలుతో కుంటుకుంటూ చావకుండా బ్రతకకుండా వున్నది. ఇంచుమించుగా జను లందరూ నాకు భక్తులయినారు. దేవుణ్ని ఆరాధించడం మానివేసి నేను యేర్పరచిన బొమ్మలపూజ చేస్తూ ప్రజలు మూఢు లవుతూ వున్నారు; సత్యం వదలిపెట్టి అనృతవాదు లవుతూ వున్నారు. ఇంట తిని యింటివాసాలు లెక్కపెట్టినట్టుగా కృతఘ్ను లవుతూ వున్నారు. అయినా కానీ యింకా కొందఱు ధర్మాన్నీ సత్యాన్నీ జ్ఞానాన్నీ వదిలిపెట్టలేక పీకులాడుతూ వున్నారు. అపరిమితంగా వున్న నాదాసులసహాయంచేత వాళ్లనుకూడా రూపుమాపివేస్తే నామనోరథం పూర్ణంగా సఫల మవుతుంది. అయినా కానీ వాళ్ళకు యింకా కొంతకాలం గ్రహచారం బాగా వున్నట్టున్నది. భూమిమీదవున్న నాకు సహాయంగా ఆకాశంమీద వున్నశనికూడా కలిస్తే నేను అందరినీ వక్కనిముషములో స్వాధీనం చేసుకుంటాను. అందుకోసం ముందుగా శనిని ధ్యానిస్తాను.—

శ్లో. చాపాసనో గృధ్రరథ స్సునీలః ప్రత్యఙ్ముఖః కాశ్యపతిః ప్రతీచ్యాం
సశూలచాపేషు వరప్రదశ్చ సౌరాష్ట్రదేశే ప్రభవశ్చ సౌరీ
నీలద్యుతి ర్నీలవపుః కిరీటీ గృధ్రస్థిత శ్చాపకరోధనుష్మాన్
చతుర్భుజస్సూర్యసుతః ప్రసాంతస్సచాస్తు మహ్యాంవరమందగామీ.

[అం... శనైశ్చరుఁడు ప్రత్యక్షమగుచున్నాఁడు.]

శని—ఓరీ! కలీ! నీభక్తికి మెచ్చినాము. నీకు వరప్రదానము చేసి కార్యసిద్ధి సమకూర్చడానికి మేముకూడా యీభూలోకంలో నివాసం చేస్తాము.

కలి—స్వామీ ! మీఅనుగ్రహంవల్ల నేనుధన్యుణ్ని అయినాను.

శని—ఓరీ ! నీకు మావల్ల యేమి కావలెను? నీవు బహు సమర్థుడవు. నీసామర్థ్యానికి సంతోషించి నీవు మమ్ము వేడుకోక పూర్వం కూడా నీకు మేము సహాయం చేస్తూనే వున్నాము. నల మహారాజంతటివాణ్ని సమస్త బాధలూ పెట్టి, భార్యతో వియోగం కూడా కలుగచేసిన నీకు సామాన్యులయిన యీలోకంవాళ్ళు యెంత? గుడి మింగేవాడికి గుళ్ళో దేవుడు వట్రవడియంకదా ?

కలి—స్వామీ ! ఇదంతా తమప్రసాదంవల్ల జరిగిందేకాని నాసామర్థ్యంవల్లకాదు. దేవుడంటే జ్ఞాపకం వచ్చింది. నేను జనులను దేవుణ్ని యెంతకొలవకుండాచేసినా మానక కొంతమంది మానసికంగా దేవుణ్ని వుపాసనచేస్తూ సత్యశౌచాదులు మంచివని బోధిస్తూ కొంతమందిని తమమార్గంలోకి దింపుతూ వున్నారు. ఇది చెడగొట్టడానికి యేమివుపాయం?

శని—వక్కవుపాయంయేమిటి ? లక్షవుపాయా లున్నవి. సత్యానికివక్కటేమార్గంకాని అబద్ధానికి అన్నిమార్గాలే. నిజంచెప్ప వలెనంటే వంకాయను వంకాయ అని వక్కటే చెప్పవలెనుగాని అసత్యాలాడవలెనంటే బీరకాయ బెండకాయ అని లోకంలో పేర్ల న్నీ లక్షచెప్పవచ్చును. మొట్టమొదట మంచివాళ్లనందరినీ చెడ్డవాళ్లని లక్షవిధాల అపవాదాలు వేతాము. వాళ్ళు చేసే మంచిప్రయత్నాల కన్నింటికీ దురుద్దేశాలు కల్పించి ప్రకటింతాము. మాయో

పాయాలచేత వాళ్ళమంచిపేరు చెడగొట్టి అపకీర్తి వచ్చేటట్లుచేతాము. లోకంలో మనకంటెమంచివాళ్ళు లేరనీ, మనమొక్కళ్లమే కష్టపడి లోకోపకారం చేస్తూవున్నామనీ అబద్ధా లాడినమ్మింతాము. మనదాసులనందరిని యీపనికి ప్రేరేపింతాము. మనప్రయత్నం ముందర యీలోకంలో దేవుడిప్రయత్నం యేమీ సాగదు.

కలి—అ దంతాబాగానే వున్నదికాని దేవుడిమీది విశ్వాసం పోగొట్టడం యేలాగు?

శని—దానికి రెండు మంచిమార్గాలున్నవి. అసలు దేవుడే లేడనిబోధించి నమ్మించడం వకటి. ఆత్మ లేదనిబోధించి నమ్మించడం యింకొకటి. యీరెండువిధాలచేతనూ జనులను నాస్తికులను చేస్తే మన అభీష్టం పూర్ణంగా సఫల మవుతుంది. అప్పుడు మనమే దేవుళ్ళం కావచ్చును.

కలి—ఈయుగంలో మనమే దేవుళ్ళము. జనులు మనదాసులయి మనమాట నమ్మినట్టు దేవునిమాట నమ్మరు. మనకు అంతరాత్మలు నిజంగానే లేవు. కాబట్టి యెవరికీ అంతరాత్మలు లేనేలేవని బోధింతాము.

శని—ఆలాగే బోధింతాము. మనంకూడా జనులలో చేరితేనే తప్ప మనకోరిక సఫలం కాదుగనుక మనం మనుష్యవేషాలు వేసుకుని వాళ్లల్లో చేరుదాము. మన భక్తులసంఖ్య విస్తారముగాయున్నదిగనుక వాళ్లల్లో నాయకులను తీసుకుని రేపురాత్రి నీవు మాయింటికి రా. చెయ్యవలసినపను లన్నీ అప్పుడు రహస్యంగా ఆలోచింతాము.

కలి—చిత్తము. (ఇద్దరూ వెళ్ళుచున్నారు.)

ద్వితీయరంగము—శనైశ్చరుని గృహము.

[శనైశ్చరుఁడును మద్యప్రియుఁడును, దాంభికుఁడును,ప్రవేశించుచున్నారు.]

శని—భక్తాగ్రేసరులలో నాయకులను తీసుకుని మాయింటికి యీరాత్రిరావలసిందని నిన్న నే కలిగాడితో చెప్పినా, వాడు యింకా వచ్చినాడుకాడు. దేవలోకం విడిచి భూలోకానికి రావడంచేత నాకు యేమీ తోచకుండావున్నది. ఈపాడులోకంలో వేడుకగా పొద్దుపుచ్చుడానికి అప్సరస్త్రీలైన లేరు.

మద్య—యీలోకంలో అప్సరస్త్రీలు లేకపోయినా ఆలోపం లేకుండా వూహూరా కావలసినంతమంది అప్సరస్త్రీలను మించే వేశ్యాస్త్రీలున్నారు. వాళ్ళు లేకుండా యీలోకంలో దేవతలకు యెవరికీ వుత్సవాలైనా జరగవు. తమరూ దేవతలలోవారేగనుక యేలినవారు యీరాత్రి రంభనుమించే వక భోగస్త్రీతో వినోదంగా కాలం గడపవచ్చును. అటువంటిదాన్ని వకదాన్ని నేను యిదివరకే ప్రభువు వారిదర్శనానికి రావడానికి యేర్పాటు చేసినాను. అది యీపాటికి యిల్లు బయలుదేరి వుంటుంది.

శని—నీవు భక్తాగ్రేసరుడవు. నీభక్తికి మెచ్చినాము.

దాంభి—(తనలో) రంభనుమించేవేశ్యాస్త్రీఅంటూవున్నాడు. అది నాప్రియురాలై వుంటుంది. ; అదే కాకపోతే యీవూళ్ళోవున్న వేశ్యాకాంతలలో రంభను మించేది మరియెవతె వుంటుంది. అందుచేత నేను యీకార్యానిక విఘ్నాలు పెడుతాను. దేవతలకు దివ్యజ్ఞానం వుంటుందిగనుక నామనస్సులో ఆలోచన యీయనకు తెలిసి నన్ను శపిస్తాడేమో! అయినా జడియవలసినపనిలేదు. దేవతలు భక్తులు యేమి తప్పితంచేసినా క్షమిస్తారు. (బిగ్గరగా) స్వామీ! నేను శ్రోత్రియుణ్ని గనుక వక్కవిన్నపం చేసుకుంటాను. వేశ్యాసంభోగంవల్ల

తమకు వ్యభిచారదోషం వస్తుందేమోనని దాసుడు భయపడుతూ వున్నాడు.

శని—ఆభయంతో పని లేదు. దేవతలకు వ్యభిచారదోషం లేదు. దేవతలకు స్వభార్యలు వుండరు గనుక పరస్త్రీసాంగత్యమువల్ల వారికి దోషం లేదు.

దాంభి—దాసుడిది యింకొక్క మనవి వున్నది. దేవవేశ్యల వద్దవుంటవో లేవోగాని మావేశ్యలవద్ద బూచులుంటవి. వాళ్లతో సుఖానికి పోతే “ అర్థగడియభోగమూఆరునెలలురోగమూ” అన్నట్టు సుఖజాడ్యాలు పట్టుకుంటవి. జాగ్రత.

శని—మాకాభయంలేదు. దేవతలమైనమావి శిలాకఠినదేహాలుగనుక మాశరీరాలకు రోగాలు సోకవు. అమృతపానంచేత మాకన్నీ నివారణమవుతవి. అమృతపానంచేత చావు లేనప్పుడు రోగాలు యెక్కడనుంచి వస్తవి?

దాంభి—మీరు యివన్నీ వదల్చుకున్నా మాతృభూతాలను వదల్చుకోలేరు. “ విటులపాలిటి యమదూత వేశ్యమాత ” అని మాలో కవులుకూడా వర్ణించివున్నారు. దేవతలుగనుక మీకీవిషయంలో అనుభవంలేదు. మాలో పూర్వం వక పరమభాగవతాగ్రేసరుడు తన్ను మాతృభూతం పట్టుకొనేటప్పటికి యేమహామంత్రంచేతనూ వదల్చుకోలేక దేవలోకంలో లేకుండా యీలోకంలో వాళ్లను సృష్టించినందుకు బ్రహ్మదేవుణ్ని యీవిధంగా తిట్టినాడు—

గీ. తనకునేమిత్రివ్వి తలకెత్తిరమరులీ।యుర్విమనుజులేమియొసఁగరైరి।
నింగి వారసతుల నిర్మాతృకలఁజేసి।పుడమి మాతృభూతముల సృజించె.

శని—దేవతల మగుటచేత మమ్ము భూతాలు సోకవు. మేము అమృతపానంచెయ్యడంచేత నీవుచెప్పిన మాతృభూతాలు వెయ్యిపట్టు

కున్నా మమ్ము చంపలేవు. మద్యప్రియా! నీ వేమంటావు ?

మద్య—దేవరవారు చెప్పింది సత్యం. వెనుకచేసిన అమృతపానానికితోడు యిప్పుడు అధరామృతపానంకూడా దొరుకుతుందిగనుక యిక బొత్తిగానే భయంలేదు. ఈరెండుపానాలూ చాలకపోతే సురాపానముకూడా చెయ్యవచ్చును. అది కడుపులో పడితే స్వర్గసుఖమంతా భూలోకంలోనే కలుగుతుంది. దానితల్లి కడుపు చల్లగా కల్లమ్మవారు వెయ్యేళ్ళు వర్ధిల్లవలెను. కల్లుముంతకు నేను వెయ్యినమస్కారాలు చేస్తాను. (దాంభికునితో నేకాంతముగా) ఒరే! నోటికాడికల్లు పడగొడితే పాపం వస్తుందిసుమా. అడ్డు చెప్పబోకు.

దాంభి—(తనలో) ఈశనిగాడిచేత సురాపానం చేయిస్తే ఆమయికంలో వేశ్యమాట మరిచిపోతే యిప్పటికి నాశని వదలుతుంది. నేను ప్రోత్సాహం చేస్తాను. (బిగ్గరగా) సుర దివ్యమైనది. భూలోకంలో వున్న దివ్యమయిన వస్తువల్లా కల్లే. అందుచేతనే మాపెద్దలు దానికి దివ్యులతో సమానంగా "సుర" అని పేరుపెట్టినారు.

శని—దానియందంత సుగుణ మున్నదా? మనుష్యులు యజ్ఞాలలో దేవతలకు సమర్పించేసోమరసం నేనుపానంచేసినాను. అది అమృతంకంటెనూ బాగా వుంటుంది. అంతరుచిగా వుటుందా?

దాంభి—వెధవరసం సోమరసం యేమిటి ? మధురసం తాగితే మీరు మళ్లీవదలిపెట్టరు. మీరు వెళ్ళేటప్పుడు ముంతెడుకల్లు తీసుకుని వెళ్ళి కాస్త కాస్త దేవతలకు చవిచూపిస్తే రేపటినుంచి దేవతలంతా కల్లంగళ్ళకాడనే వుంటారు. సోమరసమే మెచ్చుకునేవారు మధురసం రుచిమరిగితే మళ్ళీ వదలిపెట్టుతారా? నేను వెనుక యజ్ఞం చేసినప్పుడు సోమిదేవితో గలిసి సోమరసం కొంచెంపానంచేసి చప్పగా తేడిసినట్టే వుంటేటప్పటికి తుపుక్కున అధ్వర్యుడిమొఖంమీద వుమ్మేసి

నాను. తరువాత శాక్తేయంలో ప్రవేశించి కల్లు వక్కసారి చవిచూచినతరువాత అప్పటినుంచీ మళ్ళీవదలడంలేదు. దానిమహిమ మహాదొడ్డది. మీారు సేవించవలెను.

శని—ఆలాగయితే దేవతానివేదనకు తీసుకురండి.

మద్య—అయ్యా! నేనుకృతార్థుణ్ని అయినాను. నేను తాగగా మిగిలింది కల్లుముంతలో సగం వున్నది. అది దేవతానివేదన చేసుకుంటాను. అది యెంగిలిదని దేవరవారు సందేహపడవలసినపని లేదు. మూడువిధాలపానాలలో దేనికీ వుచ్ఛిష్టంలేదు. కావలిస్తే దానికి ప్రమాణపద్యం చదువుతాను.

క. పొగచుట్టకు సతిమోవికి
నగణితముగ మద్యమునకు నమృతంబునకుఁ
దగ నుచ్ఛిష్టము లేదని।
ఖగవాహనుతోడఁ గాలకంఠుఁడు పలికెఁ.

(అని కల్లుముంత చేతికిచ్చుచు) ఓసురాదేవీ! అమ్మవారూ! తల్లీ! నీవీదేవుడిహృదయంలో చొచ్చి నీమహిమ చూపించి భక్తుడికి వరాలు యిచ్చేటట్టు చెయ్యవలెను. నీకు మొక్కుతాను. నేను కోరేవరమల్లా నన్ను యీదేవుడు కల్లుసముద్రంకాడ పడవెయ్యవలెను. నేను యెన్ని దేశాలు తిరిగినా పురాణాలలోనేకాని కల్లుసముద్రం యెక్కడా కనపడకుండా వున్నది. నాకు కల్లుసముద్రం యెవడుచూపితే నాపాలిటి కతడే దేవుడు.

శని—(పుచ్చుకొని కల్లుతాగి) రుచి దివ్యంగా వున్నది.

మద్య—కొంచెంసేపు తాళితే తలకెక్కి మరీ దివ్యంగావుంటుంది. సురయొక్క మహిమ సురలకైనా దురవగాహమే. అది తాగితే వెయ్యేళ్ళు తపస్సుచేసినయోగులకయినా సాధ్యంకాని అద్వైతసిద్ధి

వక్కనిముషంలో అవుతుంది. అప్పుడు ద్వంద్వాలు యేమీ వుండవు. బ్రహ్మానందం కలుగుతుంది. మురికికాలువలు హంసతూలికాతల్పాలవుతవి. బట్టవిప్పివేసుకున్నా కట్టుకున్నా వక్కటేలాగు వుంటుంది. బట్ట విడిపోయి దిగంబరినై నేను మొన్న మురికికాల్వలో పడి వీధిపక్కను సురాపానమహిమచేత బ్రహ్మానందం అనుభవిస్తూ వుంటే ఆనందపరవశుడనై వున్న నాకు మాబంధువులు వచ్చి బ్రహ్మరథంపట్టి యింటికి తీసుకునివెళ్ళి బిందెడునీళ్ళు నెత్తిమీద అభిషేకం చేసినారు.

దాంభి—సురాపానంలో యిటువంటిసిద్ధులుయింకా యెన్నెన్నో వున్నవి. అప్పుడు సరస్వతీదేవి తన చిన్ననాటి తడబాటుపలుకులతో జిహ్వాగ్రమందు నటిస్తూ వుంటుంది. కొందఱు మూఢులు సురాపానం పాపమంటారుగాని పాపమేఅయితే తాగినవాళ్ళను బ్రాహ్మలు యెందుకు కులంలో వెలివెయ్యరని ఆలోచించరు.

శని—(నాలుక తడబడ) ఆరెరెర్రేర్రె. బ్రాబ్రాబ్రోగంది.

మద్య—అదుగో! అదుగో! దేవుణ్ని కల్లమ్మవారు పూనింది. సురాదేవి ఆవేశించడంచేత యిప్పుడిప్పుడే వాక్కు వస్తూ వున్నది. ఓయీ! దాంభికా? చుట్ట తీసుకుని రా. ధూపంవేసి యీదివ్యజ్ఞానంలో వుండగానే మనం యీదేవుణ్ని అడిగి పురాణాలలో వుండే మనసంశయాలన్నీ తీర్చుకుందాము.

దాంభి — సందేహాలు తీర్చుకోవడానికి యిదే సమయం, స్వామీ! యిప్పటివాళ్ళు భూమి తిరుగుతూ వున్న దంటారు. అది నిజమేనా?

శని—అరెర్రెర్రే. అంతా నిజం. భూమి తిరుగుతూ వున్నది. ఇల్లు తిరుగుతూ వున్నది. సమస్తమూ తిరుగుతూ వున్నది. నాదేహం కూడా తిరుగుతూ వున్నది. బోగంది. బోగంది. (అని మీఁద పడఁ

బోవుచున్నాఁడు.)

డాంభి—(తనలో) ఇతడు మత్తుగొనివున్నా మరిచిపోకుండా బోగంది బోగంది అని పలవరిస్తూ వున్నాడు. ఇతనివాలకం చూస్తే మొగవాళ్ళమీదకూడా పడేటట్టు వున్నది. బోగంది ఆదోవను వస్తూ వున్న దని వీధిలోకి పంపుతాను. (బిగ్గరగా) స్వామీ! బోగంది. వీధి దోవను వస్తూ వున్నది. ఆలా విజయం చెయ్యండి.

[అప్పుడు పరదోషారోపకుని, అసత్యుని, స్తుతిపాఠకుని వెంటఁబెట్టుకొని కలి ప్రవేశించుచున్నాఁడు.]

కలి—అసత్యా! మనం యిప్పుడు యెవ్వరూ చూడకుండా చీకట్లో వచ్చినాము. అదుగో శనైశ్చరులవారు మన కెదురుగా వస్తూ వున్నారు.

శని—(కలిని గాఢముగా కౌఁగిలించుకొని) ఆసాసాసీ! ఒక్క ముద్దు పెట్టు. (అని ముద్దు పెట్టుకొని) అరెరెరే! ఈమర్త్యలోకంలో ఆడవాళ్ళకుకూడా మీసాలు వస్తవి!

కలి—(పెడమొగము చేసి కన్నులు మూసికొని) అయ్యో! కల్లుకంపు కొడుతూ వున్నది. దేవా! కరవకండి కరకండి. నేను మీ భక్తుణ్ని.

శని—బోగందాన్నికూడా భక్తు డంటారా? ఈలోకంలో బోగంవాళ్ళవి గుడ్డికళ్ళు.

మద్య—గుడ్డికళ్ళు కావు. మనుష్యులు గనుక యిష్టంవుంటే కళ్ళు మూసుకుంటారు.

కలి—దేవా! మనం వకరిని వకరు పట్టుకుంటే కార్యం లేదు. మనం యిద్దరమూ చేరి యితరులను పట్టుకోవలెను. నేను మీసేవకుణ్ని కలిగాణ్ని. నన్ను కరవకండి. గిల్లకండి.

శని— ఇవి దంతక్షతనఖక్షతాలు. మనుష్యలోకంలో రసికత్వం లేదా ? ఓప్రియురాలా !

కలి — నేను మగవాణ్ని. కలిగాణ్ని. ఆడదాన్నికాను.

శని—ఆడదికాకపోతే నాకక్కరలేదు. ఛీఛీ! (అనితోయుచు) ఎవడవురా? కలిగాడవా ? కలిదోషహారమయిన శ్లోకం చదివి కలిని వదల్చుకుంటాను.

శ్లో. కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనం.

కలి—స్వామి! దాసుణ్ని తమ శెలవుప్రకారం వచ్చినాను. నాయెడల ప్రసన్నులు కావలెను.

దాంభి—స్వామివారిని సురాదేవి కొంచెంకొంచెంగావదలిపోతూవున్నది. ఓకలీ! దేవతలు స్తోత్రంచేస్తేనేకాని ప్రసన్నులు కారు. స్తుతిచెయ్యి.

శని — స్తుతిపాఠకా! శనిస్తోత్రం చేస్తాము పట్టు—

శ్లో. ఇంద్రనీలద్యుతి శ్శూలీ వరదో గృధ్రవాహనః
బాణబాణాసనధరః కర్తవ్యో ఽ ర్కసుత స్సదా.

శని—(ప్రసన్నుడై) ఓయీ! కలీ! నీవా; రమ్ము రమ్ము. మనసభికులందరూ వచ్చినారా ?

కలి—మీవద్దనున్న యిద్దరూ కాక నాతో ముగ్గురు వచ్చి పంచమహాపాతకునివలె నాయకత్వానికి సరిపోయినారు. ఈసభకు యేమి పేరు పెడుదాము?

శని — ఈసభకు ఆత్మస్తుతి పరనిందాసమాజ మని పేరు పెడుదాము.

పర—ఈ పేరు మేమందరమూ ఆమోదించినాము.

కలి—ఇక సభావుద్దేశములు నిశ్చయించవలెను.

శని—నేను అగ్రాసనాధిపతినయి నిశ్చయాలు వ్రాస్తాను. చూడండి—

౧. సత్యసంధుల నందరినీ అసత్యవాదులని ప్రకటించి, అనేక మాయోపాయాలు పన్ని పామరులను నమ్మించవలెను.

౨. ఏకపత్నీవ్రతస్థులను జారులని చాటించవలెను.

౩. సభికులందరూ శనైశ్చరునీ కలినీమాత్రమే సమస్తస్థలముల యందున్ను స్తుతిస్తూ వుండవలెను.

౪. మంచివాళ్ళకు దాంభికులనిన్నీ, అసత్యవాదులనిన్నీ పాపాత్ము లనిన్నీ, వంచకులనిన్నీ, క్రూరులనిన్నీ, నిఘంటువులలో వున్న పాడుపే ర్లన్నీ పెట్టి వెల్లడించవలెను.

౫. సమాజముయొక్క యీముఖ్యోద్దేశములన్నీ నెరవేర్చడానికి శనిగారు అగ్రాసనాధ్యక్షులుగాను, కలిగారు కార్యదర్శులుగాను, వుండవలెను.

స్తుతి—వీటికి మేమందరమూ ఆమోదించినాము. కేవలము దేవతలకు తప్ప ఆలోచించకుండా యిటువంటి నిశ్చయాలుచెయ్యడం శక్యంకాదు. ముప్ఫయిమూడు కోట్లదేవతలలోను మీరే అగ్ర గణ్యులు.

అస—ఈస్తుతిపాఠకుడు చెప్పినదంతాసత్యము.

పర—అసత్యవాది సత్యంచెప్పినాడు. మనప్రభులవంటి బుద్ధి మంతులున్ను, ఈశ్వరోపాసకులవంటిబుద్ధిహీనులున్నూ లోకంలోలేరు.

కలి—పరదోషారోపకుడప్పుడే పనికారంభించినాడు. మనం దిగ్విజయం చేస్తాము. మనంచేసుకున్న అయిదునిశ్చయాలున్ను పంచ రత్నాలవలె వున్నవి. ఇప్పుడు రాత్రిరెండుజాము లయిందిగనుక

పనికారంభించడానికి యిది మంచిముహూర్తము. జారచోరులకు కన్నులపండు వైనచీకటికూడా మనోహరంగా వున్నది. మనను యెవరూ తెలుసుకోలేరు. ఊరిమీదపోయి పడదాముకండి. మనం భూమిమీద దేవుడిరాజ్యం రూపుమాపి మనరాజ్యం స్థాపించవలెను.

శని— మీఅభీష్టం సిద్ధించేటట్లుగా ఆశీర్వదించినాము.పొండి.

మద్య—మనకు దేవతావరం లభించినది. యిక వెళుదాము రండి. (అందరు నిష్క్రమించుచున్నారు)

---

తృతీయరంగము—కలిపురుషమందరము.

[కలిపురుషుఁడును, శనైశ్చరుఁడును, పరదోషారోపకుఁడును, అసత్యుఁడును, స్తుతిపాఠకుఁడును ప్రవేశించుచున్నారు.]

శని—ఓకలీ! నీవుమనసభావుద్దేశాలుయెంతవరకునెరవేర్చినావు?

కలి— అభినవబృహస్పతు లయిన యీమంత్రుల మంత్రిబలం చేత యెంతపని అయినా చేసినాను. అసత్యుడూ మొదలయినవారిని వూరిమీదికి పంపించి చెడిపోతూవున్న యీలోకాన్ని వుద్ధరించడానికి మనం యిద్దరమూ యీవూళ్ళో అవతరించినామనిన్నీ, మనం చేసే లోకోపకారకార్యం సహించ లేక వోర్వలేనివాళ్ళు మనను నానాబాధలూ పెడుతూవున్నా యీకలియుగంలో మనమిద్దరంమాత్రమే సత్యానికి నిలిచి దేహాలకాసపడక తంటాలు పడుతూ వున్నామనిన్ని, అందరూ నడుము కట్టుకునిలిచి మనకు తోడుపడి మనశత్రువులమీద ధ్వజమెత్తవలెననిన్నీ, యింటింటా తెలివిమాలిన పిల్లలవద్దా మూఢులయిన పెద్దవాళ్లవద్దా ఘోషపెట్టించి వాళ్లకు మనశత్రువులమీద ద్వేషంకలిగేటట్లు చేసినాను.

శని—ఇంతేనా ఇంకాయేమయినాచేసినావా? మనంచెయ్య

వలసిన పని కొండతవుండగా వొక్క యీవూళ్లో కాస్తపని చేస్తే యేమవుతుంది? మనకీర్తి లోకానికంతా వ్యాపించవలెను.

కలి—ఆలాగయితే మన అసత్యుడూ మొదలయినవాళ్లను వుపన్యాసాలు చెయ్యడానికి వూళ్లమీాదికికూడా పంపుదునా?

శని—యేడిసినట్టేవున్నది. నీకు పని చేతకాదు యేమీాచేత కాదు. ఈవిషయంలో నీవు యింకా వోనమాలకాడనే వున్నావు. ఇక నీశిష్యులమాట చెప్పవలసినదేలేదు. నేను పాఠశాలపెట్టి మిమ్మల నందరిని తరిబీతుచేస్తేనేకాని మీారు యీలోకంలో గుడ్డిగవ్వకయినా పనికిరారు. లోకంలో లక్షవూళ్ళు వుంటూవుండగా వీళ్ళు నాలుగు వూళ్లకువెళ్లి పనిచేస్తేయేమవుతుంది? మనంయిక్కడవుండే న్యూస్ పేపర్లకు వ్రాసి లోకమంతా పని చేయవలెను.

కలి—ఈవుపాయం దివ్యంగా వున్నది. ఇది యిదివరకు నా బుద్ధికి తట్టినదికాదు.

శని—వూరికే ఆలోచిస్తే కార్యంలేదు. పనికి పూనవలెను. న్యూస్ పేపర్లకు పంపడానికి చటుక్కున నాలుగువుత్తరాలు వ్రాయి. వక్కరు వ్రాసినట్టు తెలియకుండా కిందదస్కతులు వేరేవేరే చేయించవలెను.

కలి—“ మహారాజశ్రీ — పత్రికాధిపతిగారికి అయ్యా! ఈలోకరక్షణార్థమయి మావూళ్ళో శనైశ్చరుడున్ను, కలిపురుషుడున్ను, యిద్దరు దివ్యపురుషులు అవతరించినారు. వీరు అజ్ఞానాంధకారములో మునిగివున్న జనులకన్నులు విప్పి జ్ఞానసూర్యోదయం కలుగచేస్తూవున్నారు ఈపుణ్యపురుషులమూలంగా బాలురమనస్సులలో మూఢత్వతమస్సు పోయి జ్ఞానజ్యోతి దేదీప్యమానంగా వెలుగుతూ వున్నది”—దీనిమీాద యెవరిదస్కతు చేయించను?

శని—"సత్యవాది" అనేపేరుతో అసత్యుడిదస్కతు చేయించి యీవేళే టపాలో వేయించు. పయిమాసానికి యింకొకవుత్తరం వ్రాయించు.

కలి—ఇదుగో వ్రాస్తూవున్నాను.—"మ॥పత్రికాధిపతిగారికి, మీపత్రికలో కలిపురుషశనైశ్చరుల విషయంలో సత్యవాదిగారు వ్రాసినది చదివి సంతోషించినాను. ఆమహాపురుషులు లోకాన్ని వుద్ధరించడానికి పాటుపడుతూవుంటే ఈర్ష్యాగ్రస్తులయిన దుష్టులు పాపానికి భయపడక వారికి హాని చెయ్యడానికి చూస్తూవున్నారు. ఆశుంఠలు చేసే దుష్ప్రయత్నాలు యెప్పటికీ కొనసాగవు. అగ్నిహోత్రాలు చేటతోనూస్తే అణిగిపోతవా? మహానుభావులకు అపకారం తలచడంచేత తమదౌర్జన్యం లోకానికి వెల్లడించుకోనడమే కాని వాని వల్ల యేమీ ప్రయోజనం వుండదు. కొందరు బుద్ధిహీనులు విఘ్నాలుచెయ్యకపోతే యీపాటికి కలిపురుషుడున్ను నైశ్చరుడున్ను మావూరికేకాకుండా లోకానికంతా కొండంత వుపకారం చేసి వుందురు. దేశంయొక్క పుణ్యంచేత మనుష్యలోకంలో అవతరించిన యీదివ్యపురుషులకు లోకమంతా తోడుపడవలెను"—దీనిలో యెవరిచేత దస్కతు చేయించవలెను?

శని—"గుణగ్రహణపారీణుడు" అనేపేరుతో పరదోషారోపకుడిచేత దస్కతు చేయించు. ఆపయిమాసానికి యింకొకవుత్తరం తయారు చెయ్యి.

కలి—చిత్తము—"మ—హా—రాశ్రీ—పత్రికాధిపతిగారికి. సత్యవాదిగారున్ను గుణగ్రహణపారీణుడుగారున్ను వ్రాసినవుత్తరాలు చదివి ఈపట్టణంలో అశేషజనము సంతోషించినారు. అందులో చెప్పబడిన పురుషులను వర్ణించడానికి నాచేత కాదు. సరికదా వెయ్యి

నోళ్ళుగల శేషుడికయినా అలవి కాదు. వారిద్దరూ కేవలమూ లోకరక్ష
ణార్థమయి మనుష్యలోకంలో అవతరించిన శివకేశవులు. వారికీర్తి
యిదివరకే మూడులోకాలనూ దాటి పోయినది. వారివద్దనున్న సుగు
ణాలు దేవుడివద్దనైనా లేవు. వారి పరోపకారచింత చూడగా వృద్ధి
రించడానికి బ్రహ్మసృష్టిలోనున్న లోకాలు యేమూలకూ చాలవని
తోస్తూవున్నది. ఇదిస్తోత్రంకాదు. వున్ననిజంలో నేను సహస్రాంశమ
యినా చెప్పలేదు"—ఇది యెవరిపేరుతో పంపించవలెను?

శని—"స్తోత్రపరాఙ్ముఖుడు" అనేపేరుతో స్తుతిపాఠకునిచేత
దస్కతు చేయించు. యింకొకవుత్తరంవ్రాస్తే సీతాకాలమంతా సరిపో
తవి. ఇంకొక్కటి వేగిరం వ్రాయి.

కలి—దేవరవారి శెలవుప్రకారం చేస్తాను.—"మ-రా-శ్రీ"—
పత్రికాధిపతిగారికి సత్యవాదిగారున్ను గుణగ్రహణ పారీణుడుగారున్ను
స్తోత్రపరాఙ్ముఖుడుగారున్ను మీపత్రికలో కురిపించిన వాక్యామృత
రసవర్షమువల్ల పరగుణ సుధాబిందులేశము చేత తృప్తిపొందే నాకే ఆవ
గింజంతయినా తృప్తి కలిగినదికాదు. ఆమహానుభావుల విషయంలో
నేనుకూడా కొన్నిమాటలు చెప్పి కొంచెంతృప్తినొందుదమంటే అసూ
యాపరులు నిత్యసత్యవ్రతుణ్ని అయిననన్ను స్తోత్రపాఠకునిగా తలుస్తా
రేమోనని భయం వేస్తూవున్నది. నావినయమూ, నాసత్యప్రియ
త్వమూ, నాసదాచారసంపన్నతా, నానిష్ఠాగరిష్ఠత్వమూ, నామహాకులీ
నతా, నాగుణగ్రహణైకపారీణత్వమూ, తెలిసినవారు యెవ్వరూ
నావిషయంలో అన్యథాభావనచెయ్యరుగాని యేమీ తెలియనిపామరు
లకయినా అటువంటిమాట పుట్టించడానికి యెందు కవకాశము యివ్వ
వలెనని సంకోచంచేత నామనస్సంతోషమునుకూడా మానుకుంటూ
వున్నాను. లోకోపకారార్థమై కలి మహాపురుషులున్ను శనైశ్చరచక్రి

వర్తిగారున్ను యీలోకం వున్నంతకాలమూ శాశ్వతంగా వర్ధిల్లుదురు గాక!—"ఇది ఎవరి సంతకంతో పంపించను?

శని—"వినయాలంకారుడు" అనేపేరుతో దాంభికుని చేవ్రాలుచేయించి పంపించు. ఈవృత్తాంతాలు యిప్పటిమనచాతుర్మాస్యవ్రతానికి చాలునుగాని మనశిష్యులైన అసత్యుడు మొదలైనవాళ్ళకు కొన్ని నీతులు నేర్పవలెను. వాళ్ళను యిలాగు రమ్మను.

కలి—అసత్యా! స్వామివారేదో వుపదేశిస్తారు. శ్రద్ధతో విను.

అస—మహాప్రసాదము.

శని—మనశత్రువులను గురించి యెవరివిషయమై యేలాగు ప్రవాదములు వెయ్యవలెనో కొంచెము చెప్తాను విను. ముందుగా మనశత్రువులలో యెవరిపేరైనా వకరిపేరు చెప్పు.

అస—హరిశ్చంద్రుడు.

శని—"హరిశ్చంద్రుడు ఆడితప్పనివాడని వాడుకేకాని అది యెంతమాత్రమూ నిజముకాదు. అతడు మొన్న నాతో గంటలో నాలుగబద్ధా లాడినాడు. పదిహేనురోజులకిందట దాంభికునితో నిము షములో మూడుఅబద్ధాలాడినాడు. నెలకిందట పరదోషారోపకుడితో వక్కక్షణంలో రెండబద్ధాలాడినాడు. వశిష్ఠుడు ఆయన పురోహితుడు గనుక ఆతనిమాట నమ్మకూడదు. విశ్వామిత్రుడు విరోధిఅంటారేమో అతడూ రాజఋషే. గనుక ఆతని మాటలూ నమ్మకూడదు. పురాణాలలో వ్రాసినవాళ్ళందరూకూడా ఋషులేగనుక వాళ్ళయెవళ్ల మాటలూ మొదలే నమ్మరాదు. ఇదంతా వట్టి బూటకము. హరిశ్చంద్రుడు అసత్యవాది అని స్థాపించడానికి మాకలిమహారాజుగారివద్దనూ, శనైశ్చరమహారాజుగారివద్దనూ కావలసినన్ని అమోఘనిదర్శనాలు వున్నవి. లోకంలో వారు యిద్దరే సత్యసంధులు"—అనియీమోస్తరు

గా చెప్పవలెను. ఇవి జ్ఞాపకం వుండవేమో కాగితంమీద వ్రాసుకుని పాఠం చెయ్యి, దాంభికా! నీవు వకరిపేరు చెప్పు.

దాంభి—దధీచి.

శని—“దధీచి దానానికి ప్రసిద్ధేకాని జనులు నిజానిజాలు కనుక్కోలేరు. దధీచి అంతటి లుబ్ధుడు లోకంలో మరియెవడూ లేడు. అతడు యెవ్వరికి వక్కదమ్మిడీయిచ్చినపాపాన్ని పోలేదు. ఇంద్రునకు వెన్నెముక యిచ్చినా రంటారు. అది కేవలంమాయ; వట్టిగారిడీ; శుద్ధఇంద్రజాలము. కనికట్టుచేత వెన్నెముకలాగు కనపడ్డదేకాని నిజంకాదు. దధీచి పరమలోభి అనిచెప్పి వెయ్యిప్రమాణాలు చెయ్యగలను”—నేను యిప్పుడు చెప్పినసంగతులు మరచిపోక, నీకు చదువురాదు గనుక వేదపాఠకులలాగు సంతచెప్పుకో. పరదోషారోపకా! నీ వెవరిపేరయినా చెప్పు.

పర—వేదవ్యాసుడు.

శని—“వేదవ్యాసుడు విద్యానిధి అన్నమాట కల్ల. పల్లెదానికి పుట్టినవాడికి చదువు యెక్కడనుంచి వస్తుంది? నేను నిన్న పరీక్షచేస్తే సుమతీశతకములో వక్కపద్యానికి అర్థం చెప్పలేకపోయినాడు. తెలియనివాళ్ళు వ్యాసుడికి యేమో పాండిత్యం వున్నదనుకుంటారు. అతడు వట్టిశుంఠ. అతనికి పాండిత్యం వున్నదో లేదో మహావిద్వాంసుణ్నయిన నాకు తెలియవలెనుగాని యితరులకు యేమి తెలుస్తుంది? అతనికి ఓ అంటే నా రాదని శాస్త్రప్రమాణాలతో కావలిస్తే నేను సిద్ధాంతం చేస్తాను. స్వంతంగా వ్రాసుకున్నవి గనుక పురాణాలలో వూరికే తాను సర్వజ్ఞుడైనట్టు ఆత్మస్తుతి చేసుకున్నాడు.”—ఈవాద మంతా తర్కప్రకరణాలు వల్లించినట్లు వల్లనవెయ్యి.

మద్య—మీరు సెలవిచ్చినమాటలలో నాకు వక్కసంశయం

వున్నది. వ్యాసుడికి అక్షరజ్ఞానం: లేకపోతే పురాణాలు యెట్లా చేసినా డంటే యేమి చెప్పను ?

శని — ఇటువంటి కుశ్శంకలు యెప్పుడూ చెయ్యకు. నీవు మద్యప్రియుడవు గనుక తాగుబోతుమాటలు మాటాడుతూ వున్నావు. నేను నీప్రశ్నలకు వుత్తరం చెప్పను. శిష్యులకు యెప్పుడూ గురువు చెప్పేమాటలయందు భక్తివిశ్వాసాలు వుండవలెను. గురువు నిప్పు చల్లగా వుంటుందంటే తక్షణం వేదవాక్యంలాగునమ్మవలెను. సంశయం పడితే గురుధిక్కారమహాపాతకం వస్తుంది. ఆపాపం వెయ్యిజన్మాలు యెత్తినా, వెయ్యితపస్సులు చేసినా విముక్తి పొందక పిల్లిబ్రహ్మత్యలాగు పట్టుకుంటుంది. నీవు యింకా మా శిష్యానుశిష్యులకు శుశ్రూష చేసి గురుజనవిశ్వాసరహస్యం నేర్చుకుంటేనేకాని మాకు శిష్యుడవయి మా వుపదేశం పొందడానికి తగవు. మీరందరూకూడా పోయి మా దాసాను దాసులవద్ద కొంతకాలం పరిచర్య చేసి గురుభక్తివిశ్వాసాలు నేర్చుకొని మా విద్యాదానానికి అర్హత సంపాదించుకొని మళ్ళీ రండి. పొండి.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

---

చతుర్థ రంగము—కలిపురుషనిగ్రహము.

[కలిపురుషుఁడును, శనైశ్చరుఁడును ప్రవేశించుచున్నారు.]

కలి—ఓ శనైశ్చరచక్రవర్తీ! మనం యెంతగా పనిచేస్తూవున్నా మనపని పూర్ణంగా సాగడం లేదు. మన కంగబలం తక్కువగా వున్నది. మూడులోకాలికి మనం యిద్దరం యెంతపని చెయ్యగలము ? లోకానికి వొక్కడొక్కడుచొప్పున చూచినా, అధమం మూడులోకాలికీ ముగ్గు రయినా వుండవలెను. దేవుడికి విరోధి మహాబలవంతుడైన సైతాను వొకడు వున్నాడు, అతణ్ణికూడా మనలో చేర్చుకుంటే మనం

త్రిమూర్తుల మవుతాము. అప్పుడు మూడులోకాలూకూడా మనని తేరి చూడలేవు. అతణ్ని మనలో చేర్చుకోవడంకూడా కష్టం లేదు. మొన్న మీరు ఆస్వాదించినపానపాత్ర వకటి ముందు పెట్టి దానిలో కాస్తసుర పోస్తూవుంటే అతడు మనను విడువడు.

శని—సైతాను మ్లేచ్ఛుడు. మ్లేచ్ఛసంపర్కం యెవ్వరికీన్నీ కూడదు. అందులోనూ దేవతలమయినమాకు బొత్తిగానే పనికిరాదు.

శ్లో. సభాయాం స్పర్శనేనైవ మ్లేచ్ఛేన సహ సంవిశేత్
కుర్యాత్స్నానం సచేలం తు దిన మేక మభోజనం. ౨౬.

మ్లేచ్ఛుణ్ని సభలో ముట్టుకొన్నా కూడావున్నా సచేలస్నానం చేసి ఉనమల్లా వుపవాసం చెయ్యవలసిం దని దేవలస్మృతి విధిస్తూవుండగా దేవతలలో వెలిఅయ్యేటట్లుగా నేను మ్లేచ్ఛసంపర్కానికి వప్పుకొంటా ననుకొన్నావా? వప్పుకోను. నీవు అశక్తుడవు గనుక యితరులసహాయం లేకుండా యేమీ చెయ్యలేవు. నేను ఆకాశంమీద వుండి నాశక్తిచేత మూడులోకాలు కాదుగదా పధ్నాలుగులోకాలనుకూడా అల్లాడిస్తూ వున్నాను. శనిగ్రహమంటే సామాన్యమనుకొన్నావా యేమి? నీవు పూర్వం వక్క నలమహారాజును లోబరుచుకోలేక అతనికి లోబడడం చేతనే నీ అశక్తి దుర్జనత్వమంతా బయలపడ్డది.

కలి—నాసామర్థ్య మెరుగకుండా నిష్కారణంగా నన్ను మీరు దూషిస్తూవున్నారు. నన్ను దూషించినతరువాత మిమ్మలినిమాత్రం నేను వదలిపెడుతా నను కొన్నారా యేమిటి? చిన్నప్పుడు సవితితల్లి చేత తిట్టుతిని కాలు యీడ్చుకొనిపోయి భూమిమీద మోపలేక బయలుపట్టుకొని తిరిగేవాడికి నీకుమాత్రం నాకంటె యెక్కువశక్తి యేలాగు వస్తుంది ? గుర్రం ముక్కులోనించి వూడిపడ్డ దేవవైద్యులు అశ్వినీదేవతలు నీకు సోదరులువున్నా నీకుంటికాలు యిప్పటికీ కుదరలేదు.

నీవు తిన్నగా నడవలేకపోవడంచేతనే కాదా నీకు శనైశ్చరుడని పేరు వచ్చింది? అమ్మపుట్టిల్లు మేనమామవద్ద చెప్పినట్టు నీమర్మంఅంతా యెరిగిన నావద్ద నీగొప్ప చెప్పుకోకు.

శని—నాపుట్టింటికీ నావంశానికీ యెవరెరిగినా యేమీలోపం లేదు. నాతండ్రి లోకాన్నంతా వెలిగించే సూర్యభగవానులు. అతడు ప్రాతఃకాలమున బ్రహ్మస్వరూపుడున్ను, మధ్యాహ్నమున శివస్వరూపుడున్ను, సాయంకాలము విష్ణుస్వరూపుడున్ను అవుతాడు. అతని తేజస్సు యేమనుకున్నావు?

కలి—అంత తేజస్సుకలవాడు కావడంచేతనే నీతల్లి మొగుణ్ని విడిచి ఆడగుర్రమై పారిపోయేటప్పటికి, నీమాతామహుడు విశ్వకర్మ నీతండ్రిని చిక్కంలోపెట్టి తేజస్సంతా దిగచెక్కి పారవేసినాడు.

శని—నాతండ్రిని తరిమెన పట్టినప్పుడు రాలిన పొడుంకూడా వూరికేపోలేదు. ఆపొడుం పెట్టి మాతాత విష్ణుదేవుడికి చక్రమున్ను శివుడికి శూలమున్ను యిందునికి వజ్రాయుధమున్ను చేసి యిచ్చినాడు.

కలి—ఈపుక్కిటి పురాణాలన్నీ నాకు తెలుసును. వకపురాణంలో దధీచి వెన్నెముకతో వజ్రాయుధం చేసినారనివున్నది. వకపురాణంలో చెప్పినట్టు మీతండ్రిని తరిమెనపట్టి రాలినపొడుంతో వజ్రాయుధంచేసినమాట నిజమా? యింకోపురాణంలో చెప్పినట్టు దధీచి వెన్నెముకతో వజ్రాయుధంచేసినమాట నిజమా?

శని—(తనలో) యింటిగుట్టు తెలిసిన వీడిలో విరోధం పెట్టుకోరాదు. మంచిమాటలు చెప్పి వీణ్ని సమాధానంచేస్తాను. (బిగ్గరగా) వోకలీ! నీమనస్సు కనిపెట్టడానికి యీమాటలన్నీ వేళాకోళానికన్నానే కాని నిజంగా నీవు శక్తిహీనుడవని నాతాత్పర్యం కాదు. నీవంటిశక్తి

మంతుడు లోకంలో మరియెవడూ లేడు. నేను కిందవుండి భూలోకంవా రిలో మెలగుతూవుంటే నాశక్తిచూపించలేను కాబట్టి నేనుపయినివుండి మిమ్మలినివిడిచినీశతృవులనుపట్టుకుని నీకు సహాయం చేస్తూ వుంటాను. నీవు సైతానును నీతో చేర్చుకొని మీరు యిద్దరూ యిక్కడ పనిచేస్తూ వుండండి. నేను గ్రహమండలంలోనికి పోయిపస్తాను. నేను పైని శుభ దృష్టితో చూస్తూవుంటే కింద నీవు దిగ్విజయం చేస్తావు.

కలి—(తనలో) ఈశని నన్ను పట్టుకోవడంచేత యెంతనిచేసినా పేరు బయలికి రాకుండా వున్నది. వీడు నన్నువదలిపోతే నాకు యెవరూ పోటీలేకుండా నేనే యీలోకంలో యేకచ్ఛత్రాధిపతి నవుతాను. ఈశని నన్ను వదలకుండా యిక్కడవుండడంకంటెపయినివుండి నామేలు కోరుతూ వుండడమే మంచిది. నాచేతికింద వుండి పనిచెయ్యడానికి నాకు సయితాను వక్కడుచాలును. (బిగ్గరగా) స్వామీ! మీరు భూలోకంలో చాలాకాలం వున్నారు. మీరు యీపాటి మీలోకానికి విజయం చేసి మీదాసుణ్ని సౌమ్యదృష్టితో చూస్తూవుండండి. మీరు పయిని వున్న బలంచేత నేను యీలోకమంతా దిగ్విజయం చేస్తాను.

శని—మంచిది నీవు నీపనికి పో. మేము అంతర్ధాన మవుతాము.

(ఇద్దఱును పోవుచున్నారు.(

# వేశ్యాప్రియప్రహసనము.

## ఉపోద్ఘాతము.

---

ఒకానొక పూరాణవచన ప్రబంధకారుఁడు తన గ్రంథపీఠికయం దీక్రింది కథను వ్రాసియున్నాఁడు:—

పూర్వ మొకచిత్రకారుఁడు వేడుకకొఱ కేదయిన విచిత్రపటము నొకదానినూహించి వ్రాయవలెనని యెంచి యాలోచించి వీరభటుని వలెఁ గూరుచుండిన పండ్లులేని యొక ముసలిభల్లూకమును, దానిసరసను ముక్కునకు సులోచనములు తగిలించుకొని గువ్వలాగునఁ గూరుచుండి వృత్తాంతపత్రికను చదువుకొనుచున్నట్లొక గుడ్లగూబను, వాని ప్రక్కను తూలికను చేత ధరించి చిత్తరువు వ్రాయఁగూరుచున్న యొకకోతి యెదుట తలకు కిరీటము పెట్టుకొని కూరుచుండి తన ప్రతిరూపమును వ్రాయించుకొనుచున్న ట్లొకగాడిదను ఒకచిత్రఫలకము నందు రంగులతో లిఖించి యందఱికిని జూపెను. అచ్చటివారందఱును వినోదముచూచి చిత్రకారునిగ్రాఁత నేర్పున కద్భుతపడి మెచ్చుకొని కొంతసేపానందించి, ఆచిత్రపటమునుగూర్చియే ప్రసంగించుచు నింటికిఁ బోవుచుండఁగా త్రోవలో నొకకలహప్రియుఁడు పూర్వము దండులో కొలువుచేసి యుపకారవేతనము నొంది వచ్చినయొకవృద్ధభటునివంకఁ జూచి 'అయ్యా! మీరు గ్రహింపఁగలిగినారో, లేదో కాని యాచిత్రకారుఁడు మిమ్ము పరిహాసించుటకే యాభల్లూకమును వ్రాసినాఁడు

నుండీ!' అని పలికెను. ''ఎవ్వని పరిహాసించుటకు గుడ్లగూబనువ్రాసి యుంచును!'' అని మరియొకఁడడిగెను. సులోచనములు పెట్టుకొని యా గుంపులలోనున్న యొకవృద్ధపండితుని చేతితోఁ జూపి కలహప్రియుఁడు ''ఆగుడ్లగూబను నిస్సందేహముగా నీయన నెగతాళి చేయుటకే వ్రాసి నాఁడు.'' అని చెప్పెను. ''ఎవరినుద్దేశించి యాగాడిదను వ్రాసెను?'' అని యింకొకఁ డడిగెను. ఆవిషయములో సందేహమే లేదు. తలకు కుళ్ళాయి వేసికొన్న యీచిన్నవాని నాక్షేపించుట కది వ్రాసినాఁడు. చూచినారా? తానే బొమ్మలు వేయఁగలుగుదునన్న గర్వముచేత ఆదు ర్మార్గుఁ డీచిన్నవాని నెట్లుగాడిదను చేసినాఁడో! అంతపనిచేసిన యాక్రూ రుని నూరక పోనియ్యఁగూడదు.'' అని యుత్తరముచెప్పి కలహప్రియుఁ డాముగ్గురిని కలహమునకు పురికొల్పెను. అవునవు నని యప్పు డా ముగ్గురును తలయూచి ఒండొరులతో కలియఁబలుకుకొని చిత్రకారు నికి బుద్ధి చెప్పవలెనని మహారోషముతో బయలుదేరి వాని యింటికిఁ బోయి ''ఓరిఅల్లుఁడా! పండ్లువూడినవని నన్ను వెక్కిరించుచున్నావురా? ఈచేతితో నీపండ్లూడఁగొట్టి నీకిప్పుడు బుద్ధి చెప్పెదను చూడు' అని యొకఁడును, 'ఓరి చండాలుఁడా! నేను గుడ్లగూబనఁటరా? ఇటువంటి వ్రాఁత లెప్పుడును వ్రాయకుండ నీగుడ్లూడఁబెరికెదను చూడు' అని యొకఁడును, 'ఓరి బుద్ధిహీనుఁడా! నేను గాడిదనఁటరా? ఎడమకాలితో నిన్నిప్పు డందఱిముందఱను గాడిద తన్నిన ట్లెట్లుతన్నెదనో చూడు, అని యొకఁడును, కయ్యమునకుఁ గాలుద్రువ్వుచుఁ బోయి కాట్లకుక్కల లాగున వానిమీఁదఁబడిరి. తాను వారిలో నెవ్వరిని ఉద్దేశించ లేదని చూచిత్రకారుఁ డెంతమొఱ్ఱపెట్టినను వానిమాట లెవ్వరును చెవిని బెట్టక ''నన్నుద్దేశించనిపక్షమున బోసినోరేలపెట్టితివని యొకఁడును, నన్నుద్దేశించని పక్షమున ముక్కద్దమేల పెట్టితివని యింకొకఁడును,

నన్ను ద్దేశించని పక్షమునకుళ్ళాయి యేల పెట్టితివని వేళాకోళమును, తగవు లాడ మొదలు పెట్టిరి. చిత్రకారుఁడావలికు వారిను ద్దేశించకపోయినను, ఆకలహవార్త యూరంతటను శీఘ్రముగా వ్యాపించినందున నాఁడు మొదలుకొని పురజనులందఱును ఆముసలిబంటును ఎలుగుగొడ్డనియు, ఆవృద్ధవిద్వాంసుని గుడ్లగూబయనియు, ఆపడుచు విద్యార్థిని గాడిద యనియు, పిలువ మొదలుపెట్టిరి.

పయినిజెప్పిన ప్రబంధకర్త యీకథనువ్రాసి సంధ్యాడిన వారును, సులోచనములు పెట్టుకొనువారును, కుళ్ళాయి ధరించుకొను వారును లోకములో తాముమాత్రమే కాక యితరు లనేకు లుందురు గాన, పుస్తకములలో వ్రాయఁబడిన దానిని దేనిని తమ్ముఁగూర్చియే యని భ్రమపడవలదని తన చదువరులకు హితోపదేశము చేసెను. ఆగ్రంథకర్త చూపినమార్గము నవలంబించి యిప్పుడు నేనును నాప్రహసనములు చదివెడువారి నందఱిని వానియందలి పాత్రములయందు వర్ణింపఁబడిన గుణములు కొన్ని తమయం దుండుటనుబట్టి తమ్ము ద్దేశించియే యవి వ్రాయఁబడిన వని బహుజనసామాన్యములైన గుణములను తమ యొక్కరియందే యారోపించుకొని కోపగించుకోక, అట్టి గుణము లధిక జనసామాన్యములగుట తెలిసికొని యానందింపఁ బ్రయత్నింతురని ప్రార్థించుచున్నాను.

——0——

౧. రంగము—దంభాచార్యులవారిగృహము.

[దంభాచార్యులును, మాయాచార్యులును ప్రవేశించుచున్నారు.]

దంభా—నేను ఇందాకా అడిగినదానికి మీరు తగినసమాధానం చెప్పినారు కారు. మన అమ్మాయిపెళ్ళికి భోగంమేళం పెట్టుమన్నారా? వద్దన్నారా?

మాయా—వద్దనడం కూడానా? యే అప్పో సప్పో చేసి తప్పకుండా పెట్టండి. భోగంమేళమే లేకపోతే ఇఖ పెళ్ళి యేమిటి?

దంభా—మొన్న మీరు వివేకాచార్యులతో మనయింట్లో పెళ్ళికి భోగంమేళం లేకుండా చేస్తామన్నారటే!

మాయా—వూరికే ముఖప్రీతికోసం అన్నాను. అవన్నీ మాయమాటలు. వాళ్లపక్షంవాళ్లతో నేను అలాగే అంటాను. వాళ్లతో అన్నమాటలు మీరు పాటిగా పట్టబోకండి.

దంభా—బహుబాగా చెప్పినారు. ఇప్పుడు మీహృదయం నాకు బాగా తెలిసింది. మొన్న మావాడు చెప్పేటప్పటికి అలాగంటి లోకవిరుద్ధమయిన మాట మీరు యెలాగు అన్నారా అని నాకు అత్యద్భుతమైనది. అది సరేకాని భోగంమేళానికి మనకు డబ్బు యెక్కడనుంచి వస్తుంది?

మాయా—ఎక్కడనుంచో వకచోటనుంచి వస్తుంది. మీరు ఆవిషయంలో అనుమానించకండి. మీకు వున్నమాన్యం అమ్మివేసి భోగంమేళం పెట్టండి. డబ్బు వుంటే మాన్యం యెప్పుడైనా వస్తుంది కాని తరువాత లక్షవరహాలు యిచ్చినా గణికాప్రాణనాథరావుగారి మేళంవంటిమేళం రమ్మంటే రాదు.

దంభా—మాన్యం ఇదివరకేఅమ్మివేసినాను. ఇఖయెవరూఅప్పు-

మాయా—ఆమాటలు నాతో చెప్పకండి. అప్పు యివ్వకపోతే

మీభార్యావంటను వున్నగుల్లలు తెగనమ్మి మేళం పెట్టండి. ఇప్పుడు మేళం పెట్టకపోతే మీపరువు పోతుంది. మీరు మహాభాగ్యవంతు లనిన్నీ, దానకర్ణు లనిన్నీ, వేశ్యాజనసత్కారవిద్యలో మహామహో పాధ్యాయు లనిన్నీ, గణికాప్రాణనాధరావుగారితో మనవి చేసినాను. ఆయన యిప్పుడే మీదర్శనానికి వస్తా మన్నారు. మనం వెయ్యిమందిని మోసంచేసిఅయినా నూరుకళ్లలాడిఅయినా డబ్బు తెచ్చి బోగం మేళం పెట్టవలెను గాని బోగంవాళ్లవిషయంలో పెద్దమనిషితో ఆడిన మాట తిరగరాదు. అందులోనూ యిది ఆయన స్వంతమేళము.

దంభా—నా పెళ్ళాముకు బొందున ప్రస్తె తప్ప మరి యేమీ లేదు. గణికాప్రాణనాధరావుగారు వూరికే మేళం పంపించరా?

మాయా — అలాగంటికోరిక మనవంటి పరువుగలవాళ్ళు యెప్పుడూ కోరరాదు. ఆయన వస్తూవున్నారు మెల్లిగా మాట్లాడండి. అరుగుమీద చిరుగుచాప వేసినారు. మంచిచాప లేదా యేమిటి?

[గణికా ప్రాణనాధరావుగారు ప్రవేశించుచున్నారు.]

దంభా—(లేచి) దయచెయ్యండి.

మాయా — (దంభాచార్యులతో రహస్యముగా). చిరుగు కనపడుతూ వున్నది. కప్పుకున్నబట్ట తీసి పయిని వేసికోండి. (బిగ్గరగా) గణికా ప్రాణనాధరావుగారు దయచెయ్యడంచేత మాయిల్లు పావనం అయింది. దంభాచార్యులుగారికీ మీకు ఇదివరకు యెప్పుడూ పరిచయం లేదు. దయచెయ్యండి.

దంభా—ఓరీ! భీమయ్యా! పెద్దమనుష్యులు వచ్చినారు. వేగి రము తివాసీ తీసుకు రా ఏమిరా పలకవు?

గణి—అక్కఱలేదులెండి. నేను చాపమీదనే కూర్చుంటాను. మనలో మనకు మర్యాద లేమిటి? (అని కూరుచున్నాఁడు.)

[లోపలినుండి చిన్నమ్మ ప్రవేశించు చున్నది.]

చిన్న — నాన్నగారూ ! మీరు యెవని పిలిచినారు ?

దంభా—(తనలో) ఏ పేరుతో పిలిచినానో మరిచిపోయినాను. చివర 'అయ్య' అన్నమాట జ్ఞాపకం వున్నది. ఆపేరు సోమయ్య కాబోలును ! (బిగ్గరగా) మరియెవరినీ కాదు. తివాసీ తేవడానికి సోమయ్యను పిలిచినాను. ఈయన చాపమీదనే కూర్చున్నారు. అక్కరలేదు లే.

చిన్న — నాన్నగారూ ! సోమయ్య యెవరు ?

దంభా—అది మన కొత్తనవుకరు పేరు. నీకు తెలియదులే వూరుకో . పెళ్ళికి యెదిగినపిల్లలు పెద్దమనుష్యులయెదుట మాట్లాడ రాదు. నీవు మాట్లాడబోకు. (తనలో) మళ్ళి యింకొకటిచెపితే తంటా వస్తుంది. ఈమాటు నవుకరుపేరు తిన్నగా జ్ఞాపకం వుంచుకోవలెను. మొదటిఅక్షరం 'సో' రెండోఅక్షరం 'మ' చివరిది 'అయ్య' సోమయ్య-జ్ఞాపకం వున్నది.

గణి—ఇప్పుడు మీరు వివాహం చెయ్యబోయేది యీచిన్న దానికేనా ?

దంభా— అవునండి. దీనికే. లేకలేక పుట్టడంచేత దీనికి యేమీ నగలు చేయించిపెట్టక యేభాగ్యసినిగా వుంచినాము.

చిన్న— నగలు అమ్మకే లేవు—

దంభా—అమ్మాయీ ! వూరుకో అమ్మవంటెని పెట్టుకోకపోతే నగలు లేవనుకున్నావా యేమిటి ? భోషాణంలో వున్నవన్నీ నగలు గాక యేమనుకున్నావు? అమ్మాయీ! నీవు వేగిరం వెళ్ళి రామయ్యను యీలాగు పంపించు (తనలో) ఇప్పుడు నేను చెప్పినదేనా పేరు ! మొదటిఅక్షరం మరిచిపోయినాను. మధ్యాక్షరం 'మ' బాగా జ్ఞాపకం

వున్నది. కామయ్య గాబోలును! (బిగ్గరగా) తెల్లబోయి అలాచూస్తా
వేమి? నీవు యేమీ మాట్లాడక లోపలికి వెళ్ళి వేగిరం కామయ్యను
పంపించు వెళ్ళు. మాట్లాడకు.

గణి—(తనలో) వీరియింట్లో 'భీమయ్య' 'సోమయ్య'
'రామయ్య' 'కామయ్య' నలుగురునవుకర్లు వున్నారు. ఈయన
నిశ్చయంగా భాగ్యవంతుడయి వుంటాడు. (బిగ్గరగా) అమ్మాయి పెళ్ళికి
యెన్ని భోగంమేళాలు పెడుతారు?

మాయా—తమమేళం వున్నతరువాత యేమేళమూ యెందుకు?
తక్కినవన్నీ దివిటీకింది దీపాలు. తమమేళానికి వేయిన్నూటపదహార్లు
గౌరవంచేస్తే వెయ్యిమేళాలు వున్నట్టుంటుంది.

దంభా — (మాయాచార్లుతో రహస్యముగా) అంతసొమ్ము
మనం యెక్కడనుంచి తెస్తాము? (బిగ్గరగా) వెయ్యేన్ని నూటపదహార్లు
కాదుగదా లక్షవరహాలు యిచ్చినా, అదంతా సార్థకవ్యయం.

మాయా—దంభాచార్లుతో (రహస్యముగా) అనడంతోటే
ఇచ్చినామా యేమిటి? వట్టిమాటకు ఆలాగే యిస్తాననండి. పెద్దమొత్తం
ఇస్తామంటే గౌరవంగా వుంటుంది. (బిగ్గరగా) అందుకు సందేహం
యేమిటి? ఆచార్లగారి వుదారసాహసానికి ఎన్ని లక్షలవరహాలు యిచ్చి
నా యిచ్చినవారే.

గణి—మీయింట్లో పెళ్ళి యింకా యెన్నిదినములు వున్నది?

దంభా—ఎన్నోదినములు లేదు. రేపు విదియనాటికి సరిగ్గా
నెలదినములు వుంటుంది.

గణి—మీయింట్లో పెళ్ళికితప్పకుండా మామేళాన్నే పంపుతాను.
మీరు మరి యేమేళాన్నీ కుదుర్చుకోకండి. విఠేంద్రిరావుగారి లోపల
పయివారం వివాహం జరుగుతుందట. నేను అక్కడికి వక్కమాటు

పోయి వస్తాను. నేను వకటి రెండు రోజులలో మావూరికి వెళితేనే కాని సమయానికి మేళం సిద్ధం గాదు. మళ్ళీ సాయంకాలం వచ్చి నేను దర్శనం చేస్తాను.

దంభా—కొంచెంసేపు దయచెయ్యండి. తాంబూలం పుచ్చుకొని మరీవెళ్ళుదురుగాని.(తనలో) నవుకర్ల పేరేమో మళ్ళీమరిచి పోయినాను. మధ్య 'మా' జ్ఞాపకం వున్నది. ఇతనికి పేరంతా జ్ఞాపకం వున్నదేమో అడిగి చూతాము. (మాయాచార్లతో రహస్యముగా) మనం యిందాకా పిల్చిన నవుకర్ల పేరేమిటి? నీకు బాగా జ్ఞాపకం వుంటుంది. మధ్య అక్షరం 'మా'

మాయా—(దంభాచార్యులతో రహస్యంగా) నాకు బాగా జ్ఞాపకం వున్నది. మధ్యాక్షరం 'మా' అయితే అది వేమయ్యో, శ్యామయ్యో, అయివుంటుంది. ఈరెండూ కాకపోతే తప్పకుండా మామయ్య అయివుంటుంది.

దంభా—(తనలో) అన్ని పేర్లతోనూ పిలుస్తాను. అందులో యేదోవకటి అవుతుంది. (బిగ్గరగా) వేమయ్యా! శ్యామయ్యా! మామయ్యా!పంతులుగారికి తాంబూలం పళ్ళెంతో తీసుకురండి. ఏమివొక్కరూ పలుకరేమి? అయ్యా! పంతులుగారూ! యింట్లోయెందరు నవుకర్లు వున్నా మాయింటిది అందరికీ అన్ని పనులూ చెప్పి వక్కసారిగా అవతలికి పంపివేస్తుంది. తీరా పెద్దమనుష్యులువెళ్ళబోయేటప్పుడు తాంబూలం తేవడానికి పిలిస్తేసమయానికి వక్కనవుకరూ లేకపోయినాడు గదా!

గణి—తాంబూలానికేమి? నేను మళ్ళీవచ్చినప్పుడు యీ తాంబూలమూ ఆతాంబూలమూకూడా పుచ్చుకుంటానులెండి. మీనవుకర్ల పేర్లు బహుచిత్రంగా వున్నవి. అందరిపేర్లలోనూ మధ్య మకారము వున్నది.

మాయా — మా అనగా లక్ష్మి అర్థము. యజమానులు కోటీశ్వరులని చూపించడానికి లక్ష్మీప్రదమయిన మకారము వీరి నవుక ర్లందరూ తమ పేరులో మధ్య వుంచుకుంటారు.

గణి—నేను సెలవు పుచ్చుకుందునా?

దంభా—తమరు తాంబూలం పుచ్చుకోకుండా వెళ్ళడం ధర్మం గాదు. మీరు విజయం చేసేముందే వూళ్ళోకి వెళ్లిననవుకరు తిరిగీ వచ్చేదాకా కొంచెంసేపు తాళి తాంబూలం పుచ్చుకుని నన్ను గౌరవించి మరీ దయచెయ్యండి.

గణి — అతను వచ్చేటప్పటికి మళ్ళీ వస్తాను. మీయింట్లో తాంబూలం పుచ్చుకోకుండా వెళ్లను. వక్కమాటు సెల వియ్యండి.

(అని వెళ్ళుచున్నాడు.)

దంభా—ఈగణికాప్రాణనాధరావుగారు బ్రాహ్మణులుకదా! ఈయనకు భోగంమేళం యెక్కడిదండీ?

మాయా — ఇప్పుడు మేళంలో గజ్జకట్టే మీనాక్షీతల్లిని యీయన వుంచుకొన్నాడు. ఆ అభిమానంచేత మీనాక్షికి విద్య చెప్పించి, అది యెక్కడకు మేళానికి వెళ్ళినా యీయనకూడా వూ రూరూ తిరుగుతూ వుంటాడు.

దంభా—అలాగయితే మనకు డబ్బు లేకుండా యీమేళం వస్తుందేమో చూడండి. మీరు మాయవేషం వేసి ముఖస్తుతుల కారంభిస్తే యెంతటివారూ మీవలలో పడుతారు.

మాయా — ముందు మేళం రానివ్వండి. తరువాత డబ్బు విషయంలో యేదో మాయవేషం వేతాము. మీరూ ఆలోచించండి. నేను యిప్పుడు యీపనిమీదనే వెళ్లి వస్తాను.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

౭. రంగము—దంభాచార్యులవారి పడమటిల్లు.

[దంభాచార్యులును, భార్య చారుమతియు, కూతురు చిన్నమ్మయు ప్రవేశించుచున్నారు.]

దంభా—ఓసీ! అమ్మాయిపెళ్ళి దగ్గిరకు వస్తూవున్నది. ఐదు రోజులూ యెలాగు గౌరవంగా వెళుతవో అని నాకు బెంగగా వున్నది.

చారు—మీరు యేమీ బెంగపెట్టుకోవలసిన పనిలేదు. యీ పెళ్లికోసం మీరు మాయాచార్లమాటలు విని బడాయికోసం లేనిపోని అప్పులు చెయ్యకండి. ఏమిటి మాయాచార్లూ మీరూ యిందాకా మహా మాట్లాడుతూ వున్నారు?

దంభా—మరియేమీ లేదు. ఈపెళ్లి విషయమే మాట్లాడినాము. మనం పెళ్లికి యేమిఖర్చులుచేస్తే నలుగురిలోనూ గౌరవంగావుంటుందా అని ఆలోచించినాము. అప్పు చెయ్యకపోతే వియ్యాలవారికి నాలుగు రోజులూ యింతపప్పూ అన్నం పెట్టడాని కయినా నావద్ద యేమీ లేదు. అప్పు యిచ్చేవారుకూడా యిప్పుడు యెవరూ కనపడడం లేదు.

చారు—ఇచ్చేవారు వున్నా మనం యిఖముందు అప్పుచెయ్యక క్లుప్తంగా వాడుకుందాము. నిన్నసాయంకాలం నేను పుట్టింటికి వెళ్లి నప్పుడు నా వదినెగార్లు యిద్దరూ తమ వంటినిండా నగలు పెట్టుకుని కూర్చుని నేను మోడులాగు నగలు లేకుండా వుండడం చూచి హాస్యాని కన్నట్టుగా అన్నగారు పెట్టిన నగలన్నీ మేమేమయినా తెమ్మనిపోతా మనా దాచి వచ్చినావని నన్ను ఆక్షేపించేటప్పటికి, నేను మారుమాట చెప్పక వూరుకున్నా దగ్గిర కూర్చున్నమాఅమ్మకు చిన్నతనంగా వుండి కోపంచేత లేచిపోయినట్టుగా చివాలున లోపలికి లేచిపోయి తనపెట్టె తీసి మారుయూపాయలు వొళ్ళోపోసుకుని నన్ను సాగనంపడానికి వచ్చి నప్పుడు వీధిలో నాతోకూడా దూరంగా వచ్చి వెనుక తిరిగి చూచి

కోడళ్ళు చూడకుండా, యేమైనా చిల్లరనగలు చేయించుకుని వంటినిపెట్టుకోవలసినదని ఆనూరురూపాయలూ రహస్యంగా నాచేతిలో పెట్టిపోయింది. అవి మీకు యిస్తాను. అప్పు చెయ్యకుండా వాటితో పెళ్లిఖర్చులు సరిపెట్టండి.

దంభా—ఈరూపాయలు సమయానికి దేవుడు పంపించినాడు. మంచివారికి దేవుడు సహాయం చేయక మానడు. నీ స్నేహితురాలిని సత్యవతిని అడిగి మరి పదహారురూపాయలు చేబదులు తెచ్చినావంటే యీనూటపదహారురూపాయలూ సధ్యా యిప్పుడు భోగంమేళానికి సరిపోతవి. మరి యేఖర్చు చేసుకోకపోయినా యింతకంటె యిచ్చుకోలే మని గణికాప్రాణనాధరావుగారిని బతిమాలుకొని యధాశక్తిని యీరూపాయలు ఆయనచేతిలో పెట్టి భోగంమేళం పెడితే మనపరువు కొంత నిలుస్తుంది.

చారు—నామాట విని యీపెళ్ళికి మీరు భోగంమేళం మానివేసివెయ్యండి. భోగంమేళం పెడితే మనకు లేనిపరువు రానూ రాదు. పెట్టకపోతే వున్నపరువు పోనూ పోదు.

దంభా—అలాకాదు. పెళ్ళిలో భోగంమేళం పెడితే యెక్కువ గౌరవంవుంటుంది. చదువురాకపోవడంచేత మగవాళ్లకు వుండేపరువూ మర్యాదా నీవు గ్రహించలేవు. భోగంమేళం లేకపోతే వూళ్ళోపెద్ద మనుష్యులు యెవరయినా మనవీధిగుమ్మం తొక్కి చూస్తారనుకున్నావా? ఆపెద్దమనుష్యులు మేళంలేకపోతే దేవుడిగుళ్ళోకే వెళ్లరు. మన యింటి కెక్కడవస్తారు?

చారు—మనయందు నిజంగా ప్రేమవున్నవారు భోగమేళం వున్నా మనయింటికి తాంబూలానికి వస్తారు; లేకపోయినా వస్తారు. అలాకాకుండా భోగంమేళంకోసమేవచ్చే పెద్దమనుష్యులను మనయింటికి

రాకుండా వాళ్ల యిళ్లకే వెళ్లనియ్యండి. నేను యెంత చదువుకోక పోయినా చదువుకున్న వాళ్లతో సహవాసం చెయ్యడంచేత నాకూ కొంచెం మంచీ చెడ్డా తెలుసును. చదువుకున్న సత్యవతికూడా యెప్పుడూ భోగంమేళం పెట్టడం మంచిది కాదని నాతో చెప్తూనే వుంటుంది.

దంభా—సత్యవతితో సహవాసం వచ్చినతరువాతనే నీకు కూడా యిటువంటి దుర్బుద్ధులు పుడుతూవున్నవి. నీవు యిదివరకే చాలా చెడిపోయినావు. ఆడవాళ్ళు నాలుగుముక్కలు నేర్వడంతోటే పరువూ మర్యాదా అన్నీ మరచిపోయి, పెడయుక్తులు పన్నుతారు. చదువు నేర్చినఆడదానితోనూ, వంటనేర్చినమగవాడితోనూ యెవ్వరూ పోపలేరు.

చారు—అందుచేత మీ యిష్టప్రకారం నేను చదువురాని దానినే మీకు భార్యనైనాను గాదూ?

దంభా—నీకు చదువురాకపోయినా చదువుకొన్నవాళ్ల సహవాసం చెయ్యడంచేత నీవు వాళ్లను మించిపోయినావు. ఈప్రకారంగా మాటకు యెదురుమాటాడి మొగుడితో వాదంచెయ్యమనికూడా నీకు సత్యవతే నేర్పిందా?

చారు—ఏబుద్ధిఅయినా యెవరికివారికి స్వతహాగా పుట్టవలెను గాని యితరులు నేర్పితే యేమాత్రం నిలుస్తుంది? సత్యవతి యెప్పుడూ మొగుడికి యెదురుచెప్పక ఐకమత్యంతో వుండవలెననే బోధిస్తుంది గాని పోట్లాడుమని బోధించదు. సత్యవతి, మొగుడు యెంతఅన్యోన్యంగావుండి ప్రతివిషయములోనూ యేకవాక్యంగావుంటారో చూచినారా? ఆదంపతులను చూస్తే నాకు ముచ్చట అవుతుంది.

దంభా—సత్యవతికి మడీమయిలా స్నానమూసంధ్యాలేని ఇంగ్లీ

షు చదువుకొన్న మొగుడు దొరికినాడు గనుక ఇద్దరికీ కలిసిపోయింది. వాళ్ళకు యిద్దరికీకూడా సిగ్గూ బిడియమూ పరువూ ప్రతిష్ఠా యేమీ లేదు. వాళ్లు మొగుడూ పెళ్ళామూ పట్టపగలు మాట్లాడుతారని వూళ్ళో నలుగురూ చాటున వాళ్లను ఛీ అంటూవున్నారు. మొండికెత్తిన వాళ్లను యెవరు యేమిచేస్తారు?

చారు—వాళ్ల సంగతి మనకెందుకుగాని మీరుమాత్రం పెళ్ళికి వృధాఖర్చు భోగంవాళ్లను మాన్పించండి.

దంభా—నీవునామాటకు అడ్డంచెప్పకు. భోగంవాళ్ళు రావడం వధూవరులకు బహు శ్రేయస్కరం. నల్లపూసలకు త్రిగంటు భోగంది గుచ్చితేనేకాని పిల్లదానికి అయిదోతనం వుండదని పెద్దలు చెప్పే మాటలు నీవు విన్నావా? లేదా? వక్కకు త్రిగంటు గుచ్చడంచేతనే అంతశ్రేయస్సు వుంటే అయిదురోజులూ పెళ్లియింట్లో వుండి ఆడుతూ వుంటే యెంత శ్రేయస్కరమో నీకేమి తెలుసును?

చారు—నిరుటిసంవత్సరం మనుగుడుపులో మొగుడుపోయిన చెల్లమ్మకు త్రికంటుభోగందే గుచ్చిందిసుమండీ.

దంభా—వూరికే యిటువంటిపిచ్చిపేలాపనలు పేలక నోరు మూసుకో. పెద్దమనిషి గణికాప్రాణనాధరావుగారితో వెయ్యిన్నినూట పదహార్లిచ్చి వారిమేళం వుంచుతానని యెన్నోగొప్పలు చెప్పినాను. పెద్దమనిషికి మాట యిచ్చి తప్పిపోతే యీఅయిదురోజులలోను తల యెత్తుకుని తిరుగడానికి శక్యమవుతుందీ?

చారు—భోగంవాళ్ళను మానివేసి, యీఅయిదురోజులూ యెలాగో వకలాగు కొంచెం తలవంచుకొని తిరిగితే తరువాత అప్పులు లేకుండా యెల్లకాలమూ తలయెత్తుకుని తిరుగనచ్చును. ఇతరులతో లేనిగొప్పలు యెందుకు చెప్పవలెను?

చిన్నమ్మ—అమ్మా! ఇందాకా నాన్నగారు 'సోమయ్యా భీమయ్యా' అని లోపల యెందరో నవుకర్లువున్నట్టు వాళ్లయెదట యెన్నో పేర్లు పెట్టి పిలిచినారు.

దంభ— అమ్మాయీ! వేలెడంత లేవు. నీవుకూడా అమ్మతో చేరినావా?

చిన్న—నాన్నగారూ! కోపపడకండి. నేనువాళ్ల యెదుట యేమీ అనకూడదని వూరుకున్నానుగాని వూరికే అబద్ధాలాడవచ్చునా?

దంభా—పాడుస్కూళ్లకు పంపించడంచేత యింతలేసివాళ్లకు మతి చెడిపోతూ వున్నది. గుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినట్టు నీవు నాకు బుద్ధులు చెప్పవస్తూ వున్నావు. రేపటినుంచి బడికి పోకుండా నీకు చదువు ఘూనిపిస్తాను వుండు.

చారు—అమ్మాయీ! నీ వేమీ మాటాడకు. ఇంట్లో పెద్ద నవుకరును నేను వుండగా వేరే నవుకర్లు యెందుకు? యేమికావలెనో చెపితే నేను తీసుకుని వస్తునుగాదూ?

దంభా—(తనలో) ఇది తానే నవుకరు నంటూ వున్నది. ఇది బాగా వున్నది. గణికాప్రాణనాథరావుగారు వచ్చి చూచినప్పుడు నగలు లేకుండా వున్నదీన్ని నాభార్య అంటే గొప్పగా వుండదు. మా యింట్లో నవుకరని చెప్తాను. (బిగ్గరగా) గణికాప్రాణనాథరావుగారికి తాంబూలం తెమ్మనడానికి గౌరవంగా వుంటుందని వట్టిపేర్లు పెట్టి నౌకర్లను పిలిచినాను. ఆయన యిప్పుడు మళ్లీ వస్తారు. తాంబూలం కావలెను. అమ్మాయీ! నీవు యిప్పుడు సత్యవతిగారి యింటికి వెళ్లి అమ్మ యిమ్మన్నదని పండుతమలపాకులూ పోకచెక్కలూ తీసుకునిరా.

చిన్న—అమ్మా! అడిగి తీసుకుని రానా?

చారు— తీసుకుని రా.

దంభా—నీకు అమ్మమాటేకాని నామాట పనికిరా దేమి?

చిన్న—వెళుతూ వున్నాను.

(అని వెళ్ళు చున్నది.)

దంభా—ఓసీ!ఓసీ!పెద్దమనిషి యింటికివచ్చినప్పుడు యెవరైనా యెదటవుండి కాస్త చెప్పినపని చేస్తూవుంటేనేకాని బాగా వుండదు. నీవు పరుగెత్తుకొనివెళ్ళి లోపల దూరక కాస్తసేపు సిగ్గు విడిచి యెదట వుండి ఆపనీ యీపనీ చేస్తూవుండు.

చారు—నేను వుండలేను. నాకు పెద్దమనిషియెదుట వుండి మాట్లాడడానికి సిగ్గువేస్తుంది సుమండి.

దంభా—ఏమిసిగ్గు? కాస్తసేపు సిగ్గు వదిలివెయ్యి. సిగ్గు లేకుండా మొగవాళ్ళు, ఆడవాళ్ళూ కలిసి మాట్లాడుతూ వుంటే కుటుంబాలు మంచిస్థితికి వస్తవనీ, మొగవాళ్ళు మోటమాటలు మాటాడకుండా జాగ్రతగా వుంటారనీ సత్యవతి చెపుతూవుంటుం దని చెప్తుతూవుంటావు గదా? అవన్నీ వట్టిమాటలేనా? ఈవిషయంలో నీకు మీగురువుగారి వుపదేశం యేమీ పనికిరాలేదు.

చారు—మీరు యింతకుముందే కాదూ నేను సత్యవతి సహవాసంచేసి చెడిపోతూవున్నా నని నన్ను యెత్తిపొడిచినారు! ఇప్పుడు మళ్ళీ సత్యవతి చెప్పినట్లు చెయ్యమంటా రేమి?

దంభా—ఒక్కసత్యవతిమాత్రమే కాకుండా నేనుకూడా చెయ్యమంటూ వున్నాను గనుక యివేళకు నేను చెప్పినట్టువిను.

చారు—అలాగేవింటాను. భర్తగారి ఆజ్ఞఅయిన తరువాత యేమి చెయ్యమన్నా చెయ్యకతప్పుతుందా? యెవరోవస్తూ వున్నారు.

దంభా—మరియెవరూ కాదు. గణికా ప్రాణనాథరావుగారే. నీవు లోపలికి వెళ్లక యెదటనిలువబడి నేను చెప్పినపనల్లా చేస్తూవుండు.

[గణికాప్రాణనాథరావుగారు ప్రవేశించుచున్నారు.]

గణి—ఆచార్లగారూ! మీనవుకర్లు యెవరైనా వచ్చినారా? ఇంకావకడూ రానేలేదా?

దంభా—వాళ్ళు దొంగముండాకొడుకులు. ఏమిపనిమీదపోతే అదేపోకగా పోతారు. ఇంకావకడూ రాలేదు. మీకుయిప్పుడువుప చారానికి యేమీలోపం రాదులెండి. (గణికాప్రాణనాథరావుతో రహస్యముగా) ఆనిలుచున్నమనిషి మా ఆడనవుకరు. దానిచేత మీరు కావలసినపని చేయించుకో వచ్చును.

గణి—అమ్మా! నీవు యెక్కడకైనా వెళ్ళి చుట్ట కాల్చుకోవ డానికి కాస్త నిప్పు తీసుకునిరా. ఈచుట్టలు నాకోసం ఇప్పుడేప్రత్యేకంగా చుట్టినవికావడంచేత యింకా తడిగావున్నవి. వకసారి యెండలో పెట్టిరా (అని చేతికియ్యబోవుచున్నాడు.)

చారు (తనలో) ఇతడు వట్టి మోటపశువులాగు వున్నాడు. ఇతనికి చెప్పవచ్చినపనీ చెప్పరానిపనీ తెలియదు. (అని మాటాడక నిలుచున్నది.)

గణి—ఆచార్లగారూ! మీనవుకరుకు చెవుడాయేమిటి? మాట వినుపించుకోదు. మీరుమంచినవుకరునే సంపాదించినారు. వెయ్యివర హాలుయిచ్చి కొన్నారాయేమిటి? వోలితక్కువని గుడ్డిదాన్ని పెళ్ళాడితే కుండలన్నీ పగలగొట్టిందట!

దంభా — అయిదువందల రూపాయలు కర్చుపెట్టి తెచ్చు కున్నాను. వోలితక్కువలేదు. ఇదిచెప్పినపనల్లా చేసేదేకాని కొంచెం మెల్లగా చేస్తుంది. (రహస్యముగా) ఆడదికావడంచేత చుట్టముట్టుకోవ డానికి సంశయిస్తూవున్నట్టున్నది.

గణి—ఆహాహాహా! మహాదొడ్డనవుకరు! చుట్టముట్టుకోవడానికే

యింత సందేహిస్తూవున్న మనిషి భోజనమయినతరువాత మనయెంగిలి విస్తళ్ళయినా తీసివేస్తుంతా? అవీ మనమే తీసుకోవలెనా?

చారు—(తనలో) ఇతనికి కులస్త్రీలవిషయమయి యెలాగు మాట్లాడవలెనో తెలియదు. ఇంకొకమాటుఇలామాట్లాడితే నేనులోపలికి వెళ్ళిపోతాను. (బిగ్గరగా) ఈయనకు మంచితీర్థము కావలెనేమో కనుక్కోండి.

గణి—చుట్టతాగినతరువాత పుక్కిలించి వెయ్యడానికి కావలెను గాని యీలోపుగా అక్కరలేదు. అయ్యా! ఆచార్లుగారూ! మీకు బోగంమేళంఅవశ్యంగా కావలెను గాదూ! మీరుయిచ్చేకట్నం ఇందాకా చెప్పినలక్షవరహాలేనా యీలోపుగా ఇంకా యేమయినా యెక్కువ చేసినారా? మీయింట్లోమహాలక్ష్మి వూరికే కిందపడి దొర్లుతూవున్నప్పుడు యెంతకర్చు చేసినా మీకు లక్ష్యం లేదు.

దంభా—(తనలో)విశేంద్రరావునాదగ్గరడబ్బులేదని యితనితో చెప్పినట్లున్నది. (బిగ్గరగా) డబ్బుకేమి? కోటివరహాలు యిచ్చినా నిలువదు. మాటవకట్టే శాశ్వతంగా వుంటుంది.

చారు—మాయింట్లో పెళ్ళికిబోగంమేళంపెట్టము. బోగంమేళం పెట్టడం మావియ్యాలవారికి యిష్టంలేదు.

గణి—ఆచార్లుగారూ! ఈవిడమాటలుచూస్తే మీకేయీవిడే యజమానురాలుగా కనపడుతూవున్నది గాని మీరు యీవిడెకు యజమానుడుగా వున్నట్టు కనపడదు. యీవిడే మిమ్మలిని ఆజ్ఞాపిస్తూవున్నదే.

దంభా—చిన్నప్పటినుంచీమాయింట్లో వుండడాన్నిబట్టి చనువు చేత తోచినదల్లా అంటూవుంటుంది. మీకు దీనిమాటలు పాటిగా పట్టవలసిన పని లేదు.

[కమలపాకులను పోకచెక్కలను చేతబట్టుకొని చిన్నమ్మ ప్రవేశించుచున్నది.]

చిన్న—అమ్మా! సత్యవతి వెండిపళ్ళెకూడా కావలెనేమో అడిగి రమ్మన్నది. వాళ్ళయింట్లో పండాకులు లేవట. పచ్చిఆకులు యిచ్చినది.

చారు—యీఆకులుచాలునులే. మనయింట్లో యిత్తడిపళ్ళెం లో పెట్టి తాంబూలంయిస్తాను. బడివేళ అవుతూ వున్నది. నీవు వెళ్ళి పాఠాలు చదువుకో.

గణి—(తనలో) యీచిన్నది "అమ్మా!" అనిపిలుస్తూవున్నది. ఈవిడ నిజంగా యీచిన్నదానితల్లి కాదుగదా? (బిగ్గరగా)అమ్మాయీ! యీవిడె నీకేమయినా చుట్టమా?

చిన్న—ఈమె మాఅమ్మ. ఈయన మానాన్నగారు.

గణి—అమ్మా! నీవు యింటి యజమానురాలవని యెరగక యీయనమాటలు నమ్మి పనికత్తెవనుకొని చెప్పరానిపనులు చెప్పి నాను. క్షమించవలెను.

చారు—చెప్పితే యేమీతప్పులేదు. నేను ఆయనకు నిజంగా పనికత్తెనే.

దంభా—పెట్టెనిండా పెట్టెడునగలూ బట్టలూవున్నా వకట్టీ పెట్టుకోకుండా ఇలాగంటిబీదవేషం వేసినందుకు బుద్ధివచ్చేటట్టు చెయ్య వలెనని యీయనతో నీవు మాయింటిపనికత్తెవని చెప్పినాను.

చారు—బట్టలూనగలూ పెట్టెనిండా బూజుపడుతూవున్నవి—

గణి—చాలును. మీయింటిగుట్టంతా విటేందర్రావుగారి యింట్లో నాకు తెలిసింది. దంభాచార్లగారూ! మీయింట్లో పెళ్ళికి మామేళాన్ని వూరికేనే పంపుతాను. యీవూళ్ళో పనికిమాలినవాళ్లు కొందరు భోగంమేళాలువుండకూడదని వాదాలుచేసిమీటింగులుచేస్తూ

వున్నారట. మనంకూడా మీటింగులుచేసి వాళ్లకు గర్వప్రాయశ్చిత్తం చేతాము.

దంభా—మీరు తలుచుకుంటే తప్పకుండా చెయ్యవచ్చును. ప్రపంచం పుట్టినప్పటినుంచీ వున్నపూర్వాచారం ఇప్పుడు నలుగురు పక్షీగాళ్ళు చేరి పొమ్మంటే పోతుందండీ! మనం వాళ్ళమీటింగులకు వెళ్ళి మనలోమనం వేరేమీటింగులు చేసి వాళ్ళప్రియత్నం మొలక లోనే తుంచివెయ్యవలెను.

గణి—ఆపని యెంతసేపు? నిముషంలో చేతాము. నేను పక్క చుట్ట తాగివచ్చి యీవిషయంలో గట్టిఆలోచన చేస్తాను. మీరుకూడా యీలోపుగా మీపని చక్కపెట్టుకొనండి.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

3 రంగము—వివేంద్రరావుగారి చావడి.

[వివేంద్రరావుగారును, గణికాప్రాణనాధరావుగారును, మాయాచార్యులు గారును ప్రవేశించుచున్నారు.]

వివే— మీరు చెప్పిన ఆలోచన అనుకూలంగా వున్నది. అలాచెయ్యవలెను.

గణి—అనుకూలంగా వుండని ఆలోచన యెప్పుడూ చెప్పను. వేశ్యలు లేకపోతే సంగీతం పడిపోతుందని మీరు గట్టిగా వాదించ వలెను.

వివే—మీామనసు వచ్చినంతగట్టిగా వాదిస్తాను. సభలోనావా దంతో యింటిమీాద పెంకులు యెగిరిపోవలెను. నేను యింతమంది భోగంవాళ్ళనూ గుడిసేటివాళ్ళనూ ఆదరించడమేకాని వొక్కనాడూ వాళ్ళపాటమాత్రం విని యెరగను సుమండీ. మీాతోడు నిజం చెపుతాను.

గణి—మీరు చెప్పినదానికి సందేహంకూడానా? సంగీతం వుండవలెనని వాదించడానికి పాట తెలియనూ అక్కరలేదు; పాట విననూ అక్కర లేదు. ఇంతమంది పెద్దమనుష్యులు పెళ్ళిళ్లలో తాంబూలానికి వస్తారుగదా వాళ్లలో వకడైనా పాట తెలిసినవాడు వుంటాడండీ? వాళ్లి మొఖం భోగంవాళ్ళుమాత్రం యేమి పాటపాడి యేడుస్తారు? వాళ్లకు పాటలకన్న ముఖాలు బాగావుంటవి. అందుచేత చాలామంది వాళ్లముఖాలు చూడడానికే వస్తారు. కొంతమంది వూరికే లాంఛనానికి వచ్చి వాళ్ళు పాడినంతసేపూ తమలో యేమో మాట్లాడుకుంటూ వుంటారు.

విశే—మీరు చెప్పినది సత్యం. సంగీతం యెరగనివాణ్ని నేను సంగీతంకోసం భోగంమేళంవుండవలెనంటే మనప్రతిపక్షులు ఆక్షేపించరుగదా? వాళ్ళు మహాచెడ్డవాళ్ళు.

గణి—వాళ్ల మొఖం వాళ్ళు ఆక్షేపించేది యేమిటి? వాళ్లు నోరుమెత్తేటప్పటికి పదిమందిచేత చప్పట్లు కొట్టించి సభలో అల్లరి చేయించనూ? సంగీతం వచ్చినవాళ్ళు భోగంవాళ్లను ఆదరిస్తే అందులో సారస్యమే లేదు. సంగీతరూపంగా ప్రతిఫలం అపేక్షించకుండా సత్కరిస్తేనే గౌరవం యెక్కువగా వుంటుంది. మనం అనుకున్నపనికి మీరుకూడా మద్దతు చెయ్యవలెను.

విశే—ఆపనికి నేను తగినంతమద్దతు చేస్తాను. బడిపిల్లలలో కొందరు పోకిరీలు వున్నారు. పెద్దమనుష్యులం మనం చాటునవుండి వాళ్లను కాస్త ప్రోత్సాహం చేస్తే సభలో వాళ్ళు మనం వాగమన్నట్లు వాగుతారు. వాళ్లతో మేళనాయకులను యిద్దరిని యిక్కడకు వచ్చేటట్టు నేను యిదివరకే బందోబస్తు చేసినాను. భోగంవాళ్ళు లేకపోతే సంసార్లందరూ చెడిపోతారని మనం ముఖ్యంగా వాదించవలెను.

గణ—ఆవాదం మానివేస్తామా? భోగంవాళ్ల కులం వుద్ధరించడానికి వెయ్యియుక్తులు పన్నుతాను. మాయాచార్లుగారూ! మీరు మాట్లాడకుండా మౌనం ధరించినా రేమి?

మాయా—నేనూ వూరికే కూరుచోలేదు. మా యోపాయాలే ఆలోచిస్తాను. భోగంమేళాలు పెళ్ళిళ్లకు పెట్టకపోతే పూర్వాచారానికి విరుద్ధమనిన్నీ, శిష్టాచారవిరుద్ధంగా నడుచుకుంటే పాపంవస్తుందనిన్నీ, నేను శ్రుతిస్మృతిప్రమాణాలతో అమోఘమైనవాదం చేస్తాను.

విశే—అందులో వేశ్యలను పిలువకపోతే హిందూమతానికే భంగం వస్తుం దనికూడా మరిచిపోకుండా చెప్పవలెను సుమండీ.

గణ—మీకు శక్తిపూజేకాని హిందూమత మంటే అభిమానం లేదుగదా, ఈవాదం చేస్తారా?

విశే—నమ్మకం యేమిటి? నాకు దేనిలోనూ నమ్మకం లేదు. లేకపోయినా ఆవేళకు అన్నిటిలోనూ నమ్మకం వున్నట్టు నటిస్తాను. అరుగో నేను రమ్మన్నయిద్దరుకుర్రవాళ్లూ వస్తూ వున్నారు. వాళ్లను యిక్కడ కూర్చోబెట్టి, మన ప్రతిపక్షులను లేవిడికొట్టించడంవిషయమయి ఆలోచించడానికి లోపలికి వెళ్లి మళ్ళీ వత్తాము.

గణ—అది రహస్యకార్యం గనుక ఆలాచే లోపలికి వెళ్దాము.

[గిరిరావును, రాజరత్నమును ప్రవేశించుచున్నారు.]

విశే—అబ్బాయీ! రండి మాయాచార్లగారికి దొడ్లో యేదో మందువేరు కావలెనట. చూపించి యిప్పుడే వస్తాము. మీరు యింతలో మాట్లాడుకుంటూ వుండండి.

గిరి—చిత్తము. వెళ్లి రండి.

(ముగ్గురును వెళ్ళుచున్నారు.

రాజ—నీవు యిందాకా అడిగింది చెప్పుతాను విను. వైశ్య

మాసంలో మాచెల్లెలిపెళ్లికి. మానాయనగారు పువ్వులవాళ్ల మేళం పిలిపించినప్పుడు సమస్తాభరణభూషితురాలయి రాత్రి దీపాలవెలుగున గేదెకంఠం కీరవాణి గజ్జెకట్టేటప్పటికి దానిమొఖం చూడగానే నా వొళ్లంతా చెమట దిగబోసి బట్టలన్నీ తడిసి ముద్ద అయినవి.

గిరి—మండు వేసవి కాలంలో నీకు వేరే స్నానం అక్కరలేకుండా వొళ్లంతా చల్లపడి హాయిగా వుండి వుండవచ్చును.

రాజ—చల్లపడా లేదు యేమీా లేదు. నాకు తాపంమాత్రం యెక్కువయింది.

గిరి—వొళ్ళు తడి_స్తే తాపం యెలా యెక్కువవుతుంది ?

రాజ—యెండవల్ల కలిగినపయితాపం చల్లారినా లోపల మొటకరించిన కామాగ్ని రగులుకుని మండడం మొదలు పెట్టడంచేత.

గిరి—ఆ కామాగ్నిని తరువాత యెలా చల్లార్చుకొన్నావు ?

రాజ—యెలాగా! నిజం చెప్పనా?. ప్రాణస్నేహితుడవు గనుక నీతో చెప్పుతాను. మరి యెవరితోనూ చెప్పకేమి. మన శృంగార ప్రబంధాలలో కవులు వర్ణించే అధరసుధారసపానం-చెప్పడానికి నాకు సిగ్గు వేస్తూన్నది.

గిరి—అంతసిగ్గుగా వుంటే చెప్పకు. నాకు బోధపడ్డది. కామ జ్వరానికి అధరామృతం వొక్కటే అమోఘమయినదివ్యౌషధం. బహు ధనసాధ్యమయినఅధరసుధ విద్యార్థివి నీకు యెట్లా సాధ్యమయింది ? నీపాలిటికి ధన్వంతరిలాగు కీరవాణే అడ్డపడి మీానాన్నగారు దయచేసిన సంభావననుపట్టి ధర్మార్థంగా మందిచ్చి నీప్రాణాలు నిలువబెట్టింది కాబోలును ! తరువాత వయిద్యకట్నమయినా యెలా తెచ్చుకోగలిగి నావు ?

రాజ—తరువాత నేను వైద్యం చేయించుకున్నసంగతి నీకు యేలాగు తెలిసింది ? ఆఖర్చు మాతండ్రిగారే పెట్టినారు.

గిరి—వైద్యకట్నం మంటే కీరవాణికి చెల్లించవలసినకట్నమని నా అభిప్రాయం.

రాజ—సరిసరి! నీఅర్థం తెలిసింది బుద్ధి వుంటే మార్గాలు దేవుడే తోపిస్తాడు. కీరవాణిమేళం చాలించి వెళ్లగానే నేను యింట్లోకి వెళ్ళేటప్పటికి నాకంటియెదుట గదిగూట్లో తెల్లగా వెండిగిన్నె వకటి కనపడ్డది.

గిరి—ఆగిన్నె యెత్తుకొనిపోయి దాని కిచ్చినావా యేమిటి?

రాజ—అబ్బే. నేను ఇంగ్లీషు చదువుకుంటూ ఆలాగంటిదొంగ పని యెప్పుడయినా చేస్తాననుకున్నావా యేమిటి? ఆగిన్నె అక్కడ అట్టేవుంటే యెవరైనా యెత్తుకుపోతా రని మెల్లగా తీసి జేబులో వేసికొని జాగ్రత్తచేసినాను.

గిరి—ఆగిన్నె తరువాత మీవాళ్లకు యిచ్చి వుందువు.

రాజ—యిచ్చేవుందునుగాని యింతలో వకతమాషా జరిగింది. ఆగిన్నె చేతపట్టుకొని నేను తిన్నగా కీరవాణియింటికి వెళుతూవుండగా దోవలో వకబీదవాడు తనవద్దవున్న పదిహేనురూపాయలూ కంసాలి యింటికి తీసికొనిపోయి వాటితో వెండిగిన్నె అవుతుందా అని అడుగుతూ వున్నాడు. కంసాలి యిరువదిరూపాయలకు తక్కువఅయితే కాదంటూ వున్నాడు. ఆమాట విని బీదవాడు మిగిలినరూపాయలు తెచ్చుకోలేక దుఃఖపడుతూ వుంటే, జాలిగుండెకలవాణ్ని కావడంచేత ఆబీదవాడి దుఃఖం చూచి మనసు కరగినవాణ్నయి వాణ్ని చేసైగచేసి నేను దూరంగా పిలుచుకొని పోయి, అటువంటిబీదవాడికి చేసిన దే వుత్తమ దానమని యెంచి వాడివద్దవున్న పదిహేనురూపాయలూ పుచ్చుకొని యెవరితోనూ చెప్పవద్దని చెప్పి యిరవైయెదురూపాయలగిన్నె వాడికి దానం చేసినాను.

గిరి — సొమ్ము పుచ్చుకొని గిన్నె యిస్తే, అందులో దానం యేమున్నది ?

రాజ — నీవు వట్టిమందమతివి. నీవు ధర్మసూక్ష్మం యేమీ గ్రహించ లేవు. పదిహేనురూపాయలు పుచ్చుకొని యిరవయిఅయిదు రూపాయలగిన్నె యిస్తే తక్కిన పదిరూపాయలూ దానమవుతవా మరి యేసుయినా అవుతవా ? నేను చేసినదానం యిప్పుడు నీకు బోధ పడ్డదా ?

గిరి — ఈదానంసంగతి తరువాతనయినా మీ వాళ్లతో చెప్పినావా ?

రాజ—ఎందుకు చెపుతాను? ఎప్పుడూ చెప్పలేదు. నీవు యింత చదువు చదువుకున్నా నీకు యింకా గుప్తదానప్రభావము బోధపడనే లేదు. చేసినదానం చెప్పుకుంటే పుణ్యం పోతుందని యీసంగతి యిప్పుడు ప్రాణమిత్రుడ వైననీవక్కడితో తప్ప మరి యెవ్వరితోనూ చెప్పలేదు. నీవుకూడా యీరహస్యము యెవ్వరితోనూ చెప్పకుండా దాస్తే యీపుణ్యంలో సగం నీకుకూడా వస్తుంది.

గిరి—తక్కినరూపాయలైనా మీవాళ్లకు యిచ్చినావా ? అదీ లేదా ?

రాజ—యెందుకు యిస్తాను? రూపాయలు మావాళ్ల చేతులలో పెడితే యింటికోసం పాడుకర్చు చేస్తారని నేనారూపాయలు దేవ తార్పణం చేసినాను.

గిరి —భోగానికని దేవుడిగుళ్లో దేవుడికి సమర్పించినావా ?

రాజ—ఏమన్నావూ ? భోగ— లేదు. రాతిదేవుడికి యిస్తే పుణ్యం లేదని ప్రాణంతో వున్న దేవతకే సమర్పించినాను.

గిరి—మనలో ప్రాణంతో వున్న దేవతకూడా వుంటుందా ?

రాజ—నీవు పూరి కేహించువు ననడమే కాని వేదశాస్త్రవాసన నీకు అణుమాత్రమూ లేదు. ఇన్నియేళ్ళు వచ్చినా మనవేదంలో "మాతృదేవోభవ" అని వున్నవాక్యం నీవు వినలేదుగదా? వేద విశ్వాసం కలవాణ్ని గనుక నేను తిన్నగా ఆరూపాయలు కీరవాణీ ఆలయానికి తీసుకొనిపోయి దానితల్లి అయినమాతృదేవతకు సమర్పణ చేసినాను. అందువల్ల నాకు పుణ్యమూ పురుషార్థముకూడా కలిసి వచ్చింది. "ఏకక్రియా ద్వ్యర్థకరీ" అని చెప్పినపండితు డెంతటి బుద్ధి మంతుడు.

గిరి—నీతాత్పర్యం యిప్పటికి నాకు పూర్తిగా బోధపడ్డది. సరి సరి! ఆముడుపు చెల్లించి వృద్ధదేవతానుగ్రహం పొందడంవల్ల, నీకు కామాగ్నితాపం చల్లారడానికి వరం లభించినది. అయితే ఇలాగంటి పని చెయ్యడం దొంగతనం కాదూ?

రాజ—నీచదువు యేడిసినట్లే వున్నది. యెంతచదువుకొన్నా నీకు వివేకం రాలేదు. తనసొత్తుకు తనకు దొంగతనం యేమిటి? కొడుకును నేనుపుట్టగానే నాతండ్రిఆస్తిలో నాకు సగంభాగంవుంటుంది. నాతండ్రీ నేనూ సమానభాగం కలవాళ్లం కావడంచేత నాతండ్రి ఖర్చు పెడితే యెంతో నేను ఖర్చుపెట్టినా అంతే. నీవు యిప్పుడు దొంగ తనంగా చేసినానంటూ వున్నావుగాని నాకు స్వతంత్రం వచ్చినతరువాత నా ఆస్తి అంతా కీరవాణికి దొరతనంగానే దానం చేస్తాను చూడు.

గిరి—మహాదొడ్డపని చేస్తావు. తరువాత యింట్లో మీవాళ్ళు గిన్నె వెతుక్కొని విచారపడ్డారా?

రాజ—విచారం యెందుకుపడుతారు? పెళ్ళిళ్లలో యేవైనా రెండూ మూడూ వస్తువులు పోవడం ఆచారం గనుక యేదీ పెద్ద వస్తువు పోకుండా దీనితో సరిపోయిందని సంతోషమే పడ్డారు. నా

యీచిన్న కార్యంవల్ల యెంతమందికి సంతోషం కలిగిందో చూచినావా?

గిరి—యెవరికి సంతోషం కలిగినా నీభార్యకుమాత్రం తప్పకుండా దుఃఖమే కలిగి వుంటుంది. మనక్లాసులో కుర్రవాళ్ళు కొందరు నీవు చెప్పినట్టుచెయ్యడం భార్యాద్రోహం అంటారు యేమిటిరా ?

రాజ—యేడిసినారులే. వాళ్ళమొఖం! కుర్రవాళ్ళకుయేమి తెలుసును? వాళ్ళు వివేకరావుయొక్క దుర్బోధవల్ల మంచీచెడ్డా తెలియక చెడిపోతూవున్నారు. మనం కోరితెచ్చుకొన్న భార్యలవిషయంలో చేస్తే యింకాకొంత భార్యాద్రోహం అనవచ్చునుగాని మనయిష్టం అడగకుండా మనచిన్నతనంతో మనతల్లిదండ్రులు పెళ్ళిచేసినప్పుడు యేమిచేసినా ద్రోహం లేదు. అయినా నాభార్యకు విద్యరాదు; మా యింట్లో దానితో నేను పగలు మాట్లాడడానికయినా వల్లకాదు. అంతేకాకుండా అది మహా అనాకారి.

గిరి—అనాకారివిగాక నీవుమాత్రం మహా చక్కనిచుక్కలాగు వున్నావా యేమిటి? నీవు నాకిచ్చిన నీఫొటోగ్రాపుచూడుమని నాస్నేహితుడిచేతికిస్తే, అతను చూచి దానికి వెనకవైపున తోకకూడా తగిలించిన పక్షానికి ఆంజనేయవిగ్రహంకింద అమ్మవచ్చు నని చెప్పినాడు. ఆయన చెప్పినట్టు నీకుతోకకూడావుండి శ్రీరాములవారికాలంలో వుండినట్టయితే నీవు రామసేనాధిపత్యం పొంది వుందువు. నీకిప్పుడయినా ఆలోపంలేదు. మనవూళ్ళోవుండే మర్కటసేనకంతా యిప్పుడూ నీవే నాయకుడవు. ఓరీ!నీవు స్త్రీలకు విద్యకూడదంటావే మళ్ళీ నీపెళ్ళాం చదువుకున్నదికాదని లోపంయెంచుతావేమి?

రాజ—విద్యలంటే సంగీతవిద్యలని నాయభిప్రాయం. నాపెళ్ళాముకు పాడడము యేమీ చేతకాదు. కీరవాణి యెలా పాడుతుందనుకున్నావు?

గిరి—నీవు చెప్పనక్కరలేదు. దానిపాట నేను విన్నాను. ఈ వూళ్ళోకల్లాబాగా పాటపాడేది మామనోరంజనికూతురు వొక్కత్తే. మాకీరవాణిపాటపాడితే మృగాలుకూడా వినడానికి వస్తవి. మాకీరవాణికి యింటిపేరు గేదెకంఠంవారు అనివుండడంకంటె గాడిదకంఠంవారు అనివుంటే యెక్కువ సార్థకంగా వుంటుంది. మొన్న పెళ్ళివారియింట్లో పాటకారంభించి మాకీరవాణి కంఠంయెత్తేటప్పటికల్లా తమచుట్టము అనుకొని వీధులో గడ్డిమేస్తూవున్న చాకలిగుర్రాలు రెండు తమమేత మానుకొని లోపలికి పరుగెత్తుకొని వచ్చినవి.

రాజ—మా మనోరంజని కూతురుమాత్రం దానికంటె బాగా పాడుతుందేమి? చాకలిగుర్రాలుకూడా పాట గ్రహించగలవేమో యెవరెరుగుదురు? "వేత్తి గానరసం ఫణి" అన్నట్టు పాములే పాట గ్రహిస్తూవుంటే చాకిగుర్రాలుమాత్రం యెందుకు గ్రహించలేవు?

గిరి—అవి గ్రహించినట్టు మరియెవరూ గ్రహించలేరు. పాట బాగా గ్రహించడానికే దేవుడు వాటికి పెద్దచెవులు పెట్టినాడు. చాకిగుర్రమని వాటిపేరులోనే గుర్రమనేపదం వున్నది. గుర్రానికిగంధర్వ నామము లోకప్రసిద్ధం. గంధర్వశబ్దమునకు పాటపాడువాడన్నఅర్థము నీకూ తెలుసును. గాంధర్వమనగా పాట. నీవు వినవలెనంటే కీరవాణి యింటికి వెళ్ళడానికి బదులుగా నాతోకూడా చాకిరేవుకాడికి వస్తే డబ్బులేకుండా నిత్యమూ కావలసినంత గాడిదగాంధర్వము నీచెవుల బడేటట్టు చేస్తాను.

రాజ—భోగందన్న గౌరవమయినా లేకుండా నీవు మాకీరవాణిని బహుఆక్షేపిస్తూవున్నావు. ఇదివరదాకా భోగంవాళ్ళు వుండడం మంచిదని రేపుమీటింగులో వాదిస్తానని బహుజంభాలు కొడుతూ వున్నావు. తీరాసమయం వచ్చేటప్పటికి సభలో నోరెత్తక దగాచేస్తా

వారేమిటి? అలాచేస్తే మనకందరికీ బహుచిన్నతనం సుమా. అదుగో విశేంద్రరావుగారు మొదలైన మూర్తిత్రయమూ వస్తూవున్నారు. యీపాటి మనప్రసంగం చాలింతాము.

[విశేంద్రరావుగారును, గణికాప్రాణనాథరావుగారును, మాయాచార్లుగారును మరల ప్రవేశించుచున్నారు.]

విశే—అబ్బాయీ! మీరు రనుకుంటూవున్న చివరమాటలు మేము విన్నాము. మీరు వాళ్లసభలో జంకులేకుండా మాట్లాడకపోతే చిన్నవాళ్ళకు మీకుమాత్రమేకాక మిమ్మలిని నమ్ముకునివున్న పెద్ద మనుష్యులకు మాకుకూడా చిన్నతనంగా వుంటుంది. మీరు రేపు యెలా మాట్లాడుతారో వాళ్లు తలవంచుకునేటట్టు చెయ్యవలెను.

రాజ—చిత్తము. మీప్రాపు వుంటే మేము యెంతపనైనా చేస్తాము.

గణి—మీకు యేమీ భయంలేదు. మేమంతా మీపక్షమే వుంటాము. మేమే అన్నమాట యేమిటి? వాళ్లవాళ్లు యెవళ్ళో విరోధులు కొందరుతప్ప వూరంతా మనపక్షం. ఏదీ మీరు యెలా మాట్లాడుతారో రేపు చూతాము కాదూ! మీమాటలు విని వాళ్లు తలవంచుకుని యింటికి లేచిపోవలెను. ఇప్పుడు పాడవుతూవున్న హిందూ మతాన్ని మీరు వుద్ధరించవలెను. వొకవేళ మీరు పొద్దుస్నే కీరవాణియింట్లో తరవాణిఅన్నమూ తినివచ్చినా మొఖాన్ని విభూది మాత్రం బాగాపెట్టుకోవలెను. సదాచారంగనుక రాత్రి భోగంవాళ్ల యిళ్లల్లో కొంచెం సురాపానం చేసినా తాళాలతోనూ మద్దెళ్లతోనూ భక్తిమాత్రం బాగాకనపర్చవలెను. మీకు కర్తవ్యమంతా విశేంద్రరావుగారు వుపదేశిస్తారు. మనం యిక్కడ మీటుకావడం రహస్యం గనుక యెవరైనా అడిగితే మీరు విశేంద్రరావుగారి యింటికి వెళ్లనే

లేదనండి. మేము వెళ్ళి వస్తాము. (అని వెళ్ళు చున్నారు.)

విశే—అబ్బాయీ! మీరు లోపలికి రండి. రేపటియుద్ధానికి మిమ్మలిని తయారు చేస్తాను. (అందఱును నిష్క్రమించు చున్నారు.)

౮ రంగము-సభామందిరము,

[గిరిరావును. రాజరత్నమును ప్రవేశించుచున్నారు.]

గిరి—ఓరీ! రాజరత్నమూ మనంయిద్దరముమాత్రమే వచ్చినాము. ఇంకాయెవ్వరూ సభికులు రాలేదు.

రాజ—మనం ముందుగా వచ్చినాము. సభికులు రావడానికి కావలసినంతవేళ వున్నది. విశేంద్రరావుగారు వ్రాసియిచ్చిన వుపన్యాసం బాగావల్లనవేసినావా? తడుముకోకుండా సభలో మంచినీళ్ళ ప్రాయంగా యేకరువు పెట్టవలెను.

గిరి—ఆవిషయంలో యేమీ ఫర్వాలేదు. కుర్రవాళ్ళను మనని ముందుకుతోసి తీరా సమయం వచ్చేటప్పటికి వారు తాము యేమీయెరగనట్టు తటస్థంగా వూరుకుంటారేమో నని నాకు భయంగా వున్నది.

రాజ—పెద్దమనుష్యులు వారు యెప్పుడూ మనవిషయంలో మోసం చెయ్యరు. వారిలోవిశేంద్రరావుగారు బహుసమర్థులు, వారు మనవిషయంలో యెంతపనైనా చేస్తారు. మనమీద గిట్టనివాళ్ళు యేమయినా కేజు గీజు తీసుకునివస్తే మాయాచార్లగారు యెంతపనైనా చేస్తారు. ఆయనకోర్టులో జడ్జీముందువాదించడమే కాకుండా పయికి నీతివాక్యాలు చెప్తుతూనే లోపల మాయోపాయాలు పన్ని యెంతవాణ్నీ నిముషంలో పడతోస్తారు.

గిరి—ఆయనవద్ద అంతసామర్థ్యం వున్నదా?

రాజ—నీవు యెరగవుగాని యెంతసామర్థ్యమయినా వున్నది. మొన్న బుచ్చిరాజుగారి ఫోర్జరీ కేజులో సాక్షులను తరిబీతుచేసి అబద్ధం నిజంగా కనపడేటట్టు చేసినారు. ఆయనశక్తికి జడ్జీగారుకూడా హాశ్చర్య పడ్డారు.

గిరి—ఆయన సాక్షులను అంత బాగా తరిబీదు చేస్తారేమి?

రాజ—తరిబీతేమిటి? స్కూలుమేష్టరు విద్యార్థులకు బోధించే దానికంటెనూ యెక్కువపని చేస్తారు. ఆయన మొన్న వక్క కేసులో పల్లెటూరునుంచి వచ్చినసాక్షికి బోధచేసేటప్పటికి సాక్ష్యమంతా వాకిట్లో పంజరంలోవున్న చిలుకకుకూడా వచ్చింది. ఇక మనుష్యులకు రావడంలో హాశ్చర్య మేమివున్నది?

గిరి— గొప్పసామర్థ్యమే.

రాజ—ఇదేమిసామర్థ్యం? ఇంకావున్నది. సాక్షులవిషయంలో తాను యింతపని చేసినా తనయెదట పార్టీతరపు ప్లీడరు సాక్షులకు బోధ చేస్తూవున్నాడని వదంతి వేసి విశేంద్రరావుగారిసహాయంచేత వూరందరిని నమ్మించినాడు. వక్కటాకీని పలికించి నిజం అబద్ధంగానూ అబద్ధం నిజంగానూ కొత్తసృష్టి చేయించడానికి ఆయనవద్ద కావలసి నంత జట్టు వున్నది.

గిరి—గణికాప్రాణనాధరావుగారు యెటువంటివారు?

రాజ—ఆయన వేశ్యాభిమానంచేత పని మానుకొని యింట్లో కూర్చుండి వూరూరూ తిరుగుతూవున్నారు. ఈవిషయంలో ఆయన యెంతపనిఅయినా చేస్తారు. వేశ్యలకుయెంత జనవశ్యంవున్నదో వేశ్యల మూలంగా ఆయనకు అంతజనవశ్యం వున్నది. అగ్నిహోత్రుడికి వాయుదేవుడు సహాయమయినట్టు ఈయనకిప్పుడు విశేంద్రరావుగారు కూడా సహాయులయినారు. ఈమూర్తిత్రయమూ చేరడంచేత శత్రు

వుల కుతంత్రాలనన్నిటినీ నిముషంలో భస్మంచేసి ముగ్గురూ మూడు లోకాలు జయిస్తారు. ఈరోజున వికేంద్రరావుగారు మనప్రతిపక్షులను లేవిడీ కొట్టించడానికి యెంతమందిని తమతో తీసుకువస్తారో చూడు.

గిరి—అందరినీ మొగవాళ్ళనేనా ? భోగంవాళ్ళనుకూడా తీసుకునివస్తారా ?

రాజ—సభలో వేశ్యాపక్షం వాదంచెయ్యడానికి కీరవాణి తల్లిగారుకూడావస్తారు. ఆమెయొక్క వాక్చమత్కారం నీవే చూస్తావు.

గిరి—ఏమీా ! చెప్పవూ ? ఈరోజుసభకు మీాముండతల్లికూడా వస్తుందేమిః ?

రాజ—నీవు బొత్తిగా పరువూమర్యాదాయెరగకుండా మాట్లాడుతూవున్నావుసుమా జాగ్రత ! భోగమమ్మవారన్నగౌరవ మయినా లేకుండా, ఆజగన్మోహినిని ముండఅంటావా ? ఇది యెంతతప్పమాట! ఇటువంటి మాటలంటే నేను సహించలేను. నాకు మహాకోపం వస్తూవున్నది. కావలిస్తే నన్ను "గాడిదా" అనిపిలువు నేను పడుతాను. అంతేకాని భోగమమ్మవార్లనుమాత్రం నాయెదుట యెప్పుడూ—

గిరి—ఈపాటి నీచదువు చాలించు. అరుగో వివేకరావుగారూ మొదలయినవారు వస్తూవున్నారు. మెల్లగామాట్లాడు. అరుగో సభకు గుంపులుగుంపులుగా చాలామంది వస్తూవున్నారు.

[వివేకరావుగారును, సత్యప్రియాచార్యులుగారును, నయభూషణరావుపంతులుగారును, బహుజనులతో ప్రవేశించుచున్నారు ]

వివే—చాలామంది వచ్చినారు. మనమీాపాటి పని ఆరంభించవచ్చును. వికేంద్రరావుగారున్ను గణికాప్రాణనాథరావుగారున్ను పెద్దమూకను వెంటబెట్టుకుని వస్తూవున్నారు.

రాజ—ఇంకాకొంచెంసేపు ఆగండి. మాయాచార్యులుగారు

రావలెను.

సత్య—మనం యెవరికోసమూ ఆగనక్కరలేదు. ఇష్టంవున్న వారు సమయానికేవస్తారు.

నయ—ఇవేళ యెప్పుడూ యేమీటింగుకూ రానివారందరూ వస్తూవున్నారు. యేదో విశేషం వున్నది.

వివే—నయభూషణరావుపంతులుగారూ! చెవులో మాట. (రహస్యముగా) విశేంద్రరావుగారు మీటింగులో అల్లరిచేయించడానికి యెవ్వరినో మూకను పోగుచేస్తూవున్నారని తోటలో తెలిసి పోలీసు యినస్పెక్టరుగారికి వర్తమానం పంపించినాను. ఇద్దరు ముగ్గురు కనిష్టేబిల్సును తీసుకుని త్వరగా దయచెయ్యమని మీరుకూడా యెవరి చేతనైనా కబురు పంపించండి.

నయ—(రహస్యముగా) అలాగా? నాకీసంగతి తెలియనే లేదు. మావాణ్ణి పంపిస్తాను.

వివే—మీటింగు ఆరంభింతాము. నేను సత్యప్రియాచార్యులు గారిని అగ్రాసనాసీనులుగా ప్రొపోజు చేస్తూవున్నాను.

నయ—నేను శకండు చేస్తూవున్నాను.

రాజ—మాయాచార్లుగారు ఛైర్మానుగా వుంటే బాగుంటుంది.

నయ — అబ్బాయీ! విద్యార్థివి నీకు యింకా యేమీ తెలియదు వూరుకో. మాయాచార్లుగారు యింకా రాలేదు. ఆయన వస్తారో లేదో తెలియదు.

విశే—తప్పకుండా వస్తారు.

వివే—వస్తేవస్తారు. సత్యప్రియాచార్యులుగారిని అగ్రాసనా సీనులనుగా చెయ్యడం అయిపోయింది. పని కారంభింతాము. భోగం వాళ్లను వివాహాది శుభకార్యములలోనూ, వుత్సవాలలోనూ పిలిచి

గౌరవించడంచేత చాలా అనర్థాలు కలుగుతూ వున్నవి.

రాజ—లేవు లేవు.

వివే—అలాఅయితే వ్యభిచారం మంచిదనా నీ అభిప్రాయము? భోగంవాళ్ళకులవృత్తి వ్యభిచారం—

రాజ—వ్యభిచారం మంచి దని నేనూ అనను. వ్యభిచార మంటే నాకు మీకంటెనూ యెక్కువకోపమే, నేను మొన్నరాత్రి భోజనం చేసి తాంబూలం వేసుకుంటూ కీరవాణియింటికి యిట్టే వెళ్లేటప్పటికి అక్కడ స్కూలుపిల్లవాడొకడు నాకంట బడ్డాడు. చూడడంతోటే నాకు మహాకోపం వచ్చి తిట్టి కొట్టి నాస్నేహితుడని అయినా చూడకుండా తక్షణం వాణ్ణి అక్కడనుంచి తరిమివేసినాను. ఇప్పటిపిల్లవాళ్ళకు బొత్తిగా నీతి లేదు.

నయ—నీతిమంతులు తమ రక్కడకు రాత్రివేళ యెందుకు దయచేసినారు?

రాజ—యెందుకా? యెందుకో మరిచిపోయినాను, జ్ఞాపకం చేసుకుంటాను, ఆలోచించి చెప్పుతాను. ఎందుకు వెళ్ళినానా? భోగం వాళ్లయింటికి యెవరయినా బుద్ధితక్కువ పిల్లవాళ్ళు వెళుతారేమో మందలింతామని వెళ్లినాను. గిరిరావూ! నేను వెళ్లింది అందుకే కాదూ? (రహస్యముగా) మొద్దులాగు వూరుకుంటావేమి? అవునని చెప్పు.

గిరి—(రహస్యముగా) నేను అబద్ధం చెప్పను.

రాజ—(రహస్యముగా) చెపితే తప్పులేదు. నీకు చుట్టలు కొనుక్కోవడానికి డబ్బు యిస్తానులే చెప్పు.

గిరి—(రహస్యముగా) ఏమిచ్చినా చెప్పను.

రాజ—మాజట్టులో కొత్తవాళ్ళను చేర్చుకోకూడదు. చేర్చు

కుంటే చెప్పినమాట వినక సమయానికి రసాభాసం చేస్తారు. నీకంటె పెద్దవాణ్ని నేను వూరికే రోజూ లక్షఅబద్ధాలు ఆడుతూ వుంటే నీవు డబ్బు యిస్తానంటూవున్నా కానీ వొక్కఅబద్ధ మాడడానికి సందేహిస్తా వేమి?

వివే—ఓ సభాసదులారా! చూచినారా? విద్యార్థులుకూడా భోగంవాళ్ల యిళ్లకు వెళుతూ వున్నారని యీచిన్నవాడు చెపుతూ వున్నాడు. ఇది సంసారులయిళ్ళకు భోగంవాళ్లను పిలిపించడంవల్ల వచ్చినఅనర్థం. ఈయనర్థం మనం యింతటితోనైనా తొలగించడానికి ప్రయత్నం చెయ్యవలెను. ఆరంభమయినతరువాత వ్యభిచారం తాను వొంటిగా వుండదు. దొంగతనమున్ను తాగుబోతుతనమున్ను కూడా దానికి యెప్పుడూ తోడుగా వుంటవి.

రాజ—తాగుబోతుతన మంటే జ్ఞాపకం వచ్చింది. శ్రీరామ నవమినాటిరాత్రి కీరవాణి దేవుడిగుళ్ళో గజ్జెకట్టి ఆట చాలించి యింటికి వెళ్లబోయేటప్పుడు పోయి, రహస్యంగా గరుడవాహనం చాటున దాచుకున్న సారాబుడ్డి చూచుకునేటప్పటికి వట్టిబుడ్డి వున్నది. యేలాగు చూచినాడో కాని మొన్న నేను తఱిమివేసినపిల్లవాడే మెల్లిగా పోయి యెవ్వరూ చూడకుండా దాన్ని యిట్టే తాగివేసినాడు. అక్కడికీ నాకు వెయ్యికళ్ళు వున్నవి గనుక వాడు లేవడంతోటే కనిపెట్టి నేను వెంట వెళ్లేటప్పటికల్లా నోట్లో పోసుకొని నన్నుచూచి తెల్లపోయినాడు. ఏమిరా యీలా చేసినావంటే యీబుడ్డి నీదని యెరగ నన్నాడు. మరి వకరిదైతేమాత్రము తాగవచ్చునా అంటే, మంచినీళ్లనుకుని తాగినా నన్నాడు. అబద్ధాలుకూడా ఆడుతావురా అంటే నీవు రోజూ కీరవాణి యింట్లో తాగుతూవున్న సంగతి అందరితోనూ చెపుతానని పది మందిలోనూ కేకలు వెయ్యడాని కారంభించినాడు. అటువంటి తెంపరి

వాడితో పోట్లాడితే నాకే పరువుతక్కువని నేను నోరుమూసుకొని వూరుకున్నాను. నేను ఔషధానికని రహస్యంగా కీరవాణియింట్లో కాస్త బ్రాందీ పుచ్చుకుంటూవున్నందుకు వాడు యెంతదౌర్జన్యం చెయ్యడానికి సిద్ధమయినాడో చూచినారా? నేను యిందాకా పొరపాటుగా చెప్పినాను. నేను కీరవాణియింటికి రాత్రిళ్లు సంగీతం వినడానికి వెళుతూ వుంటాను. భోగంవారివృత్తి పడగొట్టడానికి యిలాగు బ్రహ్మప్రయత్నం చెయ్యడంకంటె మీరు తాగుబోతుతనం మానిపించడానికి కృషిచేస్తే బాగా వుంటుంది.

వెంకయ్య—నీతివృక్షానికి వేరుపురుగులలాగు మీరుయిద్దరూ చేరి మావిద్యార్థుల కందరికీ అపఖ్యాతి తెస్తూ వున్నారు. మీవంటి పనికిమాలినవాళ్లు వూళ్లో వకరిద్దరు వుంటే యెరగనివాళ్లు తక్కినవాళ్లందరూ యిలాగంటివాళ్లే అనుకుంటారు. సభలలోకివచ్చి యిటువంటి పేలాపనలు పేలకుండా మిమ్మలిని చితకకొడితే—

రాజ—నోరు మూసుకో. యింకా యిలా వాగుతూవున్నావంటే యింటికి వెళ్లేటప్పుడు దోవలో నిన్ను నిజంగానే చితకపొడిపిస్తాను. విద్యార్థులలో విద్యార్థులకే కట్టు లేదు. వొకడు యేటికితీస్తే వొకడు కాటికితీస్తూ యతి అంటే ప్రతి అంటాడు. అదుగో మన మాయాచార్లగారు పోలీసుయినస్పెక్టరుగారినీ కనిస్టేబిలను వెంట బెట్టుకుని వస్తూ వున్నారు. ఈవేళ యేదోవిశేషం జరుగుతుంది.

[మాయాచార్యులుగారును, పోలీసుఇన్‌స్పెక్టరుగారు మొదలయినవారును ప్రవేశించుచున్నారు.]

విశే—మాయాచార్లుగారు! దయచెయ్యండి. (రహస్యముగా గిరిరావును గోక్కి) అబ్బాయీ! యిక ఫర్వాలేదు. నీవు చెప్పదలచుకొన్నది నిర్భయముగా చెప్పు.

గిరి — (రహస్యముగా) ఎలాగు ఆరంభించవలెను? నేను వల్లించుకొన్నదాని మొదలు మరిచి పోయినాను. మొదలు వస్తేనే కాని చివరంటా జ్ఞాపకం రాదు. వక్కమాటు జేబులో కాగితం తీసి చూచుకుందునా?

విశే—(రహస్యముగా) కాగితం పయికి తియ్యబోకు. నాదస్తూరీ యెవరయినా ఆనవాలుపడితే తంటావస్తుంది. మొదలుపోతే పోయింది లే. అందులో యేమీ లేదు. వాళ్లను తిట్టడం ప్రధానమయింది. అక్కడనుంచి ఆరంభించు.

గిరి — (రహస్యముగా) పోలీసుఇనస్పెక్టరును చూస్తే నాకు భయం వేస్తూ వున్నది.

విశే—(రహస్యముగా) నీ కేమీ భయంలేదు. ఆయనను మన మాయాచార్లుగారే వెంటబెట్టుకునివచ్చినారు. ఆయన మనకే సహాయం చేస్తాడు. ఆయనకు నిన్ను ఇంట్రొడ్యూసు చేస్తాను. బాగా మాట్లాడు. (బిగ్గరగా) అయ్యా! ఇనస్పెక్టరుగారు దయచేసినారా? సంతోషంగా వున్నది. ఈచిన్నవాణ్ని యెరుగుదురా? ఇతడు బహుబుద్ధిమంతుడు. ఈదినం సభలో వుపన్యాసం చెయ్యడానికి వచ్చినాడు.

ఇన—ఇతను యెవరో జ్ఞాపకం లేదు. పేరు చెపితే యితని పేరు పోలీసుక్రిమినల్‌రిజిష్టరీలో వుంటే చూచి జ్ఞాపకం చేసుకుంటాను.

గిరి—నా పేరు గిరిరావు. నన్ను మీరు మరిచిపోయినారు. నేను మిమ్మలిని మరిచిపోయినాను. మిమ్మల్ని నేను యిదివరకు యెప్పుడూ దర్శనం చెయ్యలేదు.

ఇన—అసలు నీవు నన్ను యెప్పుడూ చూడనిదే మరిచిపోవడం యెట్లా తటస్థమయింది!

గిరి— అవును. నేను మిమ్మలిని వొక్కమాటూ చూడనిదే

మరిచిపోయినాను. యెలాగుమరిచిపోయినానో యిప్పుడు చెప్పలేను. నా లెక్చరయినతరువాత సావకాశంగా జ్ఞాపకం చేసుకోవలెను.

వివే— ఓ సభాసదులారా! యిప్పుడు వూరికే కాలహరణ మవుతూ వున్నది. మన మిప్పుడు చెయ్యవలసినపని చిత్తగించండి. వివాహాదులలో వేశ్యలను మనయిళ్లకు రప్పించడంవల్ల కలుగుతూ వున్న నష్టము లెన్నో వున్నవి. వాటినన్నిటినీ బుద్ధిమంతులయినమీకు వివరించి చెప్పవలసినపని లేదు. అందులో మనపిల్లవాళ్లు చెడిపోవడానికి మూలంగా వున్న రెండుమూడు నష్టాలు—

గిరి—పిల్లవాళ్లకు యేమీ నష్టాలు లేవు. పిల్లవాళ్లు బోగం వాళ్లవల్ల యెంతమాత్రమూ చెడిపోవడం లేదు. పిల్లవాళ్లసంగతి మా పిల్లవాళ్ళకు తెలియవలెనుగాని గడ్డాలూ మీసాలూ నెరసినముసలి వాళ్లకు మీకు యేమి తెలుస్తుంది? బోగంవృత్తి మంచిది కాదనేవాళ్లు వట్టి పౌరుషహీనులు; వాళ్లవద్ద మగతనం లేదు; రసికత్వం లేదు; సంగీతసారస్యం లేదు. సంగీతమందు రుచిలేనివాళ్ళు నరహంతలైన కూౄరకిరాతులని మహాకవి అయిన షేక్స్పియరు చెప్పినాడు. పిల్ల వాళ్లకు బోగంవాళ్ళు అవశ్యంగా వుండవలెను. ఇప్పుడు సాధారణంగా పిల్లవాళ్లకు కలుగుతూవుండేవీర్యనష్టవ్యాధులకు బోగంవాళ్ళు అవశ్యం గాకావలెనని డాక్టర్లుకూడా చెపుతూ వున్నారు. ఇదంతా నావుపన్యాసంలో వున్నది ముందుగా నావుపన్యాసం వింటే మరి యెవరివుపన్యాసాలూ అక్కరలేకుండా యీమీటింగుతోనే పని లేకుండా పోతుంది. కాబట్టి సభవారు ముందుగా నావుపన్యాసం వినవలెను.

వెం—పెద్దలంతా వుంటూ వుండగా కుర్రవాళ్లం ముందుగా మనవుపన్యాసా లేమిటి? యీపాటి కూర్చో. అనుభవశాలులైనవారు చెప్పింది విన్నతరువాత మనం చెప్పవలసింది యేమైనా వుంటే

సత్య—అబ్బాయీ! యీసభ పిల్లవాళ్ళు మాట్లాడడంకోసం వుద్దేశించినది కాదు. కాస్తసేపు వూరుకోండి. పెద్దలందరూ చెప్పవలసింది చెప్పడ మయినతరువాత అవకాశంవుంటే మీకు తోచింది మీరు చెప్పుదురుగాని యిప్పుడు కూర్చోండి.

గిరి—పబ్లీకుమీటింగులో పెద్దలేమిటి? పిన్నలేమిటి? యెవళ్ళు బాగాచెపితే వాళ్ళే పెద్దలు. మాకుపెద్దలతోనూ గిద్దలతోనూపనిలేదు. ముందుగా మేము చెప్పేదే వినవలెను. మేమిప్పుడు చెప్పకపోతే యీ పెద్దలనేవాళ్ళంతా యేవేవో ముందుగా నోటికి వచ్చినట్లు మతిమాలిన మాటలు కొన్ని చెప్పి కాలం వృథాగా పాడుచేసి తరువాత మేము చెప్పేవి వినడానికి టైములేదంటారు?

సత్య—అబ్బాయీ! కూర్చో. ఇలా మృదువుతప్పినమాటలు మాటాడుతూవుంటే పిల్లవాళ్ళను అసలే మాట్లాడనియ్యను.

గిరి—నేను కూర్చోను. నాకు వొకరి ఆజ్ఞయేమి? నన్ను మాట్లాడనియ్యడానికీ మాట్లాడనియ్యకపోవడానికీ యెవరికి అధికారం వున్నది? నేను యిప్పుడు ముందుగా వుపన్యాసం చేస్తాను. యెవరు అడ్డం వస్తారో చూతాముగాదూ?

సత్య—ఇనస్పెక్టరుగారూ! మీరు కొంచెం యీపిల్లవాళ్ళు అల్లరి చెయ్యకుండా మీటింగు సాగేటట్లు చెయ్యవలెను.

గిరి—మాటలు బాగారానియ్యండి. అల్లరీ గిల్లరీ అంటూవుంటారు. ఈమాటు అటువంటిమాట మళ్ళీ అంటే యేమిచేస్తానో—

ఇన—ఓయీ కనిస్టేబిల్ నీవు యీపిల్లవాణ్ని చెయ్యిపట్టుకొని అవతలికి పంపించివెయ్యి. పిల్లవాళ్ళు యెవరయినా అల్లరిచేసినారంటే మిమ్మలినందరినీ వీధిలోకి గెంటించి వేస్తాను. జాగ్రత! వూరికే కూర్చుని వినండి.

గిరి——(తనలో) మనవాడనుకున్న పోలీసుయినస్పెక్టరే వాళ్లల్లో చేరినాడే! నేను నోరుకసి తీరేటట్టుగా వుపన్యాసం చెయ్యడానికి వల్లకానట్టువున్నది. అయినాకానీ ప్రయత్నం చేసిచూస్తాను. (బిగ్గరగా) నాజోలికిమెవరూ రాకూడదు. న్యాయంచెయ్యడానికి యేర్పడ్డ పోలీసు వాళ్లే యిలా అన్యాయం——

ఇన్——చూస్తావేమి? ఆపిల్లవాణ్ని వీధులోకి యీడ్చుకొనిపో. వీధులోకూడా అల్లరిచేస్తే స్టేషనుకు తీసుకొనిపోయి నేను వచ్చిన దాకా కొట్లో పెట్టు.

కని——చిత్తము. (అని గిరిరావును తీసికొని పోవుచున్నాఁడు.)

విటే——పబ్లికుమీటింగులో స్వేచ్ఛగా మాట్లాడడానికి అందరికీ స్వతంత్రం వుంటుంది. ఇలాచెయ్యడం యెంతమాత్రమూ ధర్మంకాదు. నేనీసంగతి వెంటనే పోలీసు సూపరింటెండెంటుగారికి తెలియచేస్తాను. ఇటువంటి దౌర్జన్యం జరిగిన యీమీటింగులో పెద్దమనిషి అయిన వాడు యెవడూ వుండగూడదు. గణికాప్రాణనాధరావుగారూ! రండి. మనము లేచిపోదాము. (అని కోపముతో సభ విడిచి పోవుచున్నాఁడు)

గణి——(తనలో) నేనుకూడా వెళితే యెదురుచెప్పేవాళ్ళు యెవరూ లేకుండా వాళ్ళదే రామరాజ్యం అవుతుంది. కీరవాణితల్లి యింకా రాకుండా వున్నది. అది వచ్చి వీళ్ళపదిమందిలోనూ దులిపి వదిలిపెడితే వీళ్ళమొఖాలకు సిగ్గు వస్తుంది.

(తెరలో)మావంటిఆడవాళ్ళకూట్లోమన్ను పొయ్యడంధర్మంకాదు.

నయ——ఎవరిదో స్త్రీకంఠం వినబడుతూ వున్నది. అదుగో సగం నెరిసినతలకు నల్లరంగు వేసుకొని పడుచువేషంతో కీరవాణితల్లి మూసలిది సభలోకే వస్తూవున్నది.

విపే——స్వాభావికమయిన అందం తగ్గడంతోటే పరులను

మోసం చెయ్యడానికి కృత్రిమవేషం వేసుకోవలసివస్తుంది. అది యిక్కడికి యెందుకువస్తూవున్నదో !

[కీరవాణి తల్లి ప్రవేశించుచున్నది.]

కీర—అయ్యలారా ! మీరు నేటికాలానికి మహోద్యోగపని తల పెట్టినారు. వినాశకాలానికి విపరీతబుద్ధులు పుడుతవి. ఆడవాళ్ళకూట్లో దుమ్ముపోసి వాళ్ళవుసురు పోసుకుంటే మీకు జయంకాదు. మీపెద్దలు దేవతాకన్యలని మా కులంవారిని పూజచేసి మాకు మాన్యాలు దయ చేసినారు. తమకూతుళ్ల పెళ్ళిళ్లలో మంగళసూత్రం మేము తాకుతేనే కాని పవిత్రం కాదని భావించేవారు. అట్టిమహాత్ములకడుపునపుట్టి ప్రపంచంపుట్టినప్పటినుంచీ వున్నటువంటిన్నీ మీపాలింటి కులదేవత లనుగా భావించి పూజించవలసినటువంటిన్నీ మావంటిగంధర్వకన్యలను మళ్ళా మాన్యాలుయిచ్చి ఆదరించడానికి బదులుగా కూడు పడగొట్టి మూలచ్ఛేదం చెయ్యడానికి దీక్ష పట్టడంవల్ల మీకు మహాప్రతిష్ఠ వస్తూవున్నది.

సత్య—ఈసభ పురుషులకోసం వుద్దేశించవడ్డదిగాని భోగం వాళ్లువచ్చి దూషించడంకోసంగాదు. అమ్మా ! నీవు వెళ్ళిపో.

కీర—వెళ్ళిపోవడానికి నేను పిలువకుండా రాలేదు. పెద్దమనుష్యులు రమ్మంటేనే వచ్చినాను.

గణి—పెద్దమనుష్యులు రమ్మనడం యెందుకు ? నీఅంతట నీవే రావచ్చును. ఆపెద్దమనుష్యులపేర్లు యిక్కడ చెప్పక నీవు చెప్పవలసిం దేమిటో సభవారితో నిర్భయంగా మనవి చేసుకో.

సత్య—ఇనస్పెక్టరుగారూ ! తమరు దాన్ని మాట్లాడకుండా బందోబస్తు చెయ్యవలెను.

రాజ—"దాన్ని" అని అగౌరవంగా మాట్లాడుతూ—

ఇన్ — ఓజవాన్ ! ఆభోగందాన్ని యీపిల్లవాణ్ణికూడా అవతలికి పంపించివెయ్యి.

మాయా — నేను యిందులో మధ్యస్థుణ్ణి. యిందులో వాక్కన్యాయం వున్నది. మనం భోగంవృత్తికి భంగం కలుగచెయ్యడానికి ప్రయత్నం చేస్తూ వున్నాము. గనుక వాళ్లు చెప్పేదికూడా విని మరీ తీర్పు చెప్పడంన్యాయంకాని యేకకక్షి విమర్శమీద తీర్మానం చెయ్యడం న్యాయం కాదు. కాబట్టి కీరవాణితల్లి చెప్పేదంతా వినడం నా అభిమతం. తరువాత సభవారియిష్టం. నేను న్యాయంకోసం చెప్తుతూ వున్నానుగాని యిందులో నాకు యేమీ సంబంధం లేదు.

సత్య—ఇది న్యాయసభ కాదు. ఇక్కడ ప్లీడరీవాదాలతోనూ సాక్ష్యాలతోనూ కక్షిదార్ల వివాదాలతోనూ సాక్ష్యాలతోనూ యేమీ పనిలేదు. జారవృత్తిలో వున్నవారిని మనయిళ్లకు పిలవడంవల్ల నష్టాలు కలుగుతూవున్నవని తెలుసుకుని మనం బాగుపడడానికి తగినసాధనాలు ఆలోచించుకోవడానికి చేరినసభగాని యిది భోగంవాళ్లతో వాదం చెయ్యడానికి యేర్పడ్డసభ కాదు.

కీర—మీరు యింగ్లీషు చదువుకుని పెద్దవుద్యోగాలు సంపాదించి డబ్బుకోసం లోభించి యిటువంటిఅకార్యకరణానికి పూనుకుంటే మీరు అపకీర్తిపాలయి పోతారు. మాకులం నేను పుట్టినదా? బ్రహ్మదేవుడు—

సత్య — అయ్యా! ఇనస్పెక్టరుగారూ! మీరు ఆమనిషిని వూరుకుండేటట్టు చెయ్యవలెను.

ఇన్ — నీవు మీయింటికి వెళ్ళిపో. నీవు యిక్కడ వుంటే మర్యాద దక్కదు.

కీర—నేను సభచేస్తారు రమ్మంటే వచ్చినానుగాని లేకపోతే

రాకనే పోదును. మీరు యిటువంటిసభలు లక్ష చేసినా మాయింటికి వచ్చేమహారాజులు మాయింటికి రాకనూపోరు; వారు మాకు యిచ్చేవి యివ్వకనూ పోరు. ఈ యింగ్లీషు చదువుకున్నమహారాజులే కొందరు మీరు యిందరు యిన్నివుపన్యాసాలు చేస్తూ వున్నా తమపెళ్ళాలను వదలిపెట్టి చీకటిపడగానే ముసుగు వేసుకుని మాయిళ్ళల్లో దూరి కానుకలు సమర్పించి మాకు దాసు లయి సేవ చేస్తూ వున్నారు. మీ అరణ్యరోదనం వినేవారు యెవరు? (అని సభ విడిచి పోవుచున్నది.)

గణి—బహుబాగా చెప్పినది. ఆమె లోకమాతగాని వేశ్య మాత కాదు. ఇటువంటిసభలో వుంటే సిగ్గుమాలినవాళ్లు వుంటారు గాని మానవంతుడు వుండడు. (అని దానివెంటఁ బోవుచున్నాఁడు.)

వివే—వేశ్యాప్రియులు యిద్దరూ లేచిపోయినారు. యిక మన సభ సాగవచ్చును.

మాయా — కానియ్యండి. అంతా వాళ్ల పక్షంగానే వుంటే బాగావుండదని పయికి రెండుమాట లన్నానుకాని హృదయంలో నేనూ మీలో చేరినవాణ్నే సుమండీ. నన్ను మీరు వేరేవిధంగా భావించకూడదు. ప్లీడరీవృత్తీ భోగంవృత్తీ వొక్కమోస్తరుది. వేశ్య విటులవద్ద యెన్నిటక్కులు కనపరుస్తుందో ప్లీడరుకూడా డబ్బు లాగడానికి పార్టీలవద్ద అన్నిటక్కులు కనపరచవలెను. ఇది వుద్యోగ ధర్మం.

వివే— మీరు చెప్పినది నిజం. మీరు ముందు ప్లీడరవుతారనే మీపెద్దలు మీకు మాయాచార్లగారని సార్థకనామం పెట్టినారు. ప్రొద్దుపోతూ వున్నది. మనం మీటింగు వేగిరం ముగించవలెను. సభలలో వేశ్యలు పాడేపాటలూ పట్టేఅభినయాలూ, అన్నీ పడుచు వాళ్లను సన్మార్గాన్నుంచి తొలగించడానికి అనుకూలమయినవిగానే

వుంటవి. ఇప్పు డాబోగంది చెప్పిపోయినట్టు యింగ్లీషు చదువుకొన్న వాళ్ళుకూడా చీకటి పడ్డతరువాత వేశ్యల యింటిబంటు లవుతూవున్నా రన్నప్పుడు, ఆనష్టాలు నేను ప్రత్యేకించి మీకు చెప్పవలసినపనే లేదు. వేశ్యలవల్ల ధననష్టం కలుగుతుంది. వివాహాలలో మేళాలకింద వేలకొద్ది ఖర్చుచేసి కూటిపేదలయినవారిని మీ రెందరిని చూడడం లేదు? తమ పెద్ద లార్జించినభూములుకూడా వేశ్యలకు వ్రాసి యిచ్చి జోగు లయిన వారిని మీరు యెందరిని చూడడం లేదు? ధననష్టమేకాకుండా వేశ్యా ప్రియులకు దేహముకూడా పాడవుతూ వున్నది. సుఖరోగములవల్ల బాధపడుతూ వున్నవారిని మీ రెందరినో నిత్యమూ చూస్తూవుంటారు గదా! ఇందువల్ల అనేకులనడత పాడవుతూ వున్నది. పెద్దలను చూచి వాళ్ల పిల్లలుకూడా పాడవుతూ వున్నారు. అనేకులు నీతిమాలినవా రయి తమ భార్యలకుమాత్రమే కాక యీశ్వరునికికూడా ద్రోహము చేసినవా రవుతూ వున్నారు. ధనాశ చూపి వేశ్యలను ప్రోత్సాహం చెయ్యడం, వివాహమాడి పతివ్రతలు కాదగినవేశ్యలను జారిణులనుగా చెయ్యడమనాటచేత వేశ్యలకుకూడా ద్రోహమే. వేశ్యావృత్తి లేకపోతే సంగీతం చెడిపోతుం దని కొందరంటారు. వేశ్యావృత్తివల్లనే సంగీతం చెడిపోతూ వున్నది. జారిణులవద్ద సంగీతం వుండడంచేత కులస్త్రీ లది నీచంగా యెంచి సంగీతం నేర్చుకోకపోవడంవల్ల పురుషులు సంగీతాని కాశపడి వేశ్యలయింటికి పోతూ వుండడమూ వేశ్యలు సంగీతాన్ని పురుషులను తమవలలలో పడవేసుకోవడానికి సాధనంగాచేసుకోవడమూ తటస్థమవుతూ వున్నది. సర్వజనాదరణీయమయినసంగీతం వేశ్యలపాలు కాక యీవల బడితే సంసారస్త్రీలు దానిని తమపాలు చేసుకొని భర్తలను సంతోషపెట్టి గృహములు స్వర్గతుల్యములుగా చెయ్యడానికి దాన్ని వుపయోగిస్తారు. కాబట్టి వివాహాదిశుభకార్యాలలో బోగం

మేళాలను పిలిపించడం మానివేసి పురుషులచేత పాడించడానికి యీ సభవారు రిజల్యూషన్ చెయ్యవలె నని నేను ప్రొపోజు చేస్తూ వున్నాను.

నయ—నేను శకండు చేస్తూ వున్నాను.

సత్య—అందరూ ఆమోదించినారా?

మాయా—సభవారందరూ ఆమోదించినారు.

సత్య—సభవారందరూ యేకవాక్యంగా ఆమోదించినారని రిజల్యూషన్ వ్రాసినాను. ఇంకా చెయ్యవలసినపనేమున్నది ?

నయ—ఈసభవారిలో యెవ్వరున్ను శుభకార్యాలలో తమ యిళ్ళకు భోగంవాళ్లను పిలవకుండా వుండడానికిన్ని భోగంమేళం వున్నచోటికి తాము వెళ్లకుండా వుండడానికిన్ని మనబాలికలకు విద్య తోపాటు సంగీతంకూడా చెప్పించడానికిన్ని రిజల్యూషను చెయ్యవలె నని నేను ప్రొపోజుచేస్తూవున్నారు.

ఇన్—నేను శకండుచేస్తూవున్నాను.

సత్య—సభవారందరూ దీని కామోదించినారా?

మాయా—ఆమోదించినారు.

సత్య—ఈనిర్ణయంకూడా యేకవాక్యంగా నిశ్చయింపబడ్డట్టు వ్రాసినాను. ఇప్పటికే చాలాప్రొద్దుపోతూవున్నది గనుక మీరు యేర్పరచుకొన్న యీశ్లాఘ్య విషయమయి నేను విస్తరించి చెప్పతలు చుకోలేదు. మీరు యీగ్రామములోనేకాకుండా యితరగ్రామముల లోకూడా సభలు చేసి వేశ్యావృత్తివల్లకలిగేనష్టాలు జనులకు బోధపరి చిన్ని, వుపన్యాసాలుచేసిన్ని, చిన్నగ్రంథములు ప్రచురపరచిన్ని, వృత్తాంతపత్రికలకు వ్రాసిన్ని, సాధ్యమయినంతవరకు యీదురాచా రమును మాన్పించడానికి ప్రయత్నం చేస్తారని నమ్ముతూవున్నాను. ఈశ్వరుడు మీకు మంచిబుద్ధిని పుట్టించి మీకు తోడగునుగాక ? ఇంత

టితో సభ చాలింతాము.

వివే.—అగ్నిసనాసీనులుగారికి సభవారివందనములు సమర్పిస్తూవున్నాను.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

౫. రంగము—దంభాచార్యులవారియిల్లు.

[దంభాచార్యులును, మాయాచార్యులును, చారుమతియు, ప్రవేశించుచున్నారు]

దంభా—ఆడదానిమాట విని గణికాప్రాణనాథరావుగారికి మాట యిచ్చి యెలాతప్పిపోనండీ? మాయాచార్ల బావగారూ! ఇందులో మీరు న్యాయం సెలవియ్యండి. పెద్దమనిషి భోగంమేళంకూడా వూరికే పంపిస్తానన్నాడుగదా!

చారు—మేళం వూరికే రావడంతోటే మహావైకుంఠం వచ్చి మనవొళ్ళో పడ్డదాయేమిటి? అన్నయ్యా! చూచినారా? మీ బావగారు పెళ్ళికొడుకు లేకపోయినాసరే భోగంమేళంవుంటే చాలునంటారు. జ్ఞానాచార్యులుగారు పెళ్ళిలో భోగంమేళం పెట్టకపోయితే తమకుమారుడికి చిన్నమ్మను చేసుకోమని రూఢిగా వర్తమానం పంపించినారు. తీరా కుదిరినసంబంధం చెడిపోతే మళ్ళీమంచిసంబంధం రాదు. జ్ఞానాచార్లగారికొమారుడు బి.యే. పరీక్షకు చదువుకుంటూ వున్నాడు. మంచిబుద్ధిమంతుడు, పిల్లదానిరూపమున్నూ చదువున్నూ బుద్ధిన్నీ చూచి పిల్లవాడు తాను మనఅమ్మాయినేకాని మరియెవరినీ పెళ్ళిచేసుకోనంటే జ్ఞానాచార్లుగారు మన సంబంధానికి వొప్పుకున్నారుగాని మనకు మాన్యాలూ మడులూ వున్నవనీ మనం కట్నాలూ కానుకలూ పెడతామనీ ఆశపడి మనసంబంధం కోరలేదు. భాగ్యవంతులు వారికి కట్నాలిచ్చి పిల్లనిస్తామని లక్షమంది తిరుగుతూవున్నారు. గణి

కా ప్రాణనాథరావుగా రేమోభోగంమేళము పెట్టడానికి వియ్యాల వారు వొప్పుకోకపోయినట్టయితే,వారిసంబంధం చేసుకోవద్దని యీాయ నతో చెప్పినారట! ఆయనమాటలు పట్టుకొని మీావెఱ్ఱిబావగారు మంచిదని తలవూచినారట! ఈవింతచూచినారా? మీారు కాస్తకూకలు వెయ్యండి.

మాయా—బావగారూ! ఆడవాళ్ళకు అంతయిష్టంగావున్నది గనుక సిద్ధమయినసంబంధం వదులుకోవడం మంచిదికాదు. మేళంలేక పోతే.మానేనుగాని మీాపిల్లను తప్పకుండా జ్ఞానాచార్లుగారికుమారుడికే యివ్వండి. చిన్నవాడు బహుబుద్ధిమంతుడు.

దంభా—పిల్లవాడేమిబుద్ధిమంతుడు? ఇదంతా పిల్లవాడిమూ లంగానే వచ్చింది. పిల్లవాడు పట్టుపట్టకపోతే మేజువాణీకి జ్ఞానాచార్యులుగారు యెలాగయినా వప్పుకొందురు. మొన్న జరిగినమీాటింగులో వివేకరావుగారి దుర్బోధచేత తాను యికముందు భోగంమేళం చూడ నని ఆచిన్నవాడేమో కాగితంమీాద దస్కతుచేసివచ్చినాడట! మనం పెద్దమనుష్యులం యింతమంది వుండగా యెవరిమాటాలక్ష్యం లేకుండా మనకళ్లముందర పుట్టినమొన్నటిపిల్లవాడు పంతంపడితే పిల్లవాడికి బుద్ధిచెప్పి అదమాయించక వాడిపంతం నెగ్గించి పెద్దమనిషి. గనుకా ప్రాణనాథరావుగారి మాట బోటుచెయ్యడం మీాకుగూడా ధర్మమనే తోచిందా?

మాయా—ధర్మానికేమి! అన్నీధర్మాలే. మనం ముందుకార్యం చెడకుండావుండేసాధనం చూసుకోవలెను. గనుకాప్రాణనాథరావుగారి మాటా చెల్లించినట్టున్ను పిల్లవాడిమాటా చెల్లించినట్టున్నూవుండే వుపాయం నేను వొకటిఆలోచించినాను. అలా చేస్తే వుభయులున్ను సమాధానపడుతారు. పెళ్లిలో మేళంమాన్పించి పిల్లవాడిమనసు సమా

ఫాసపెట్టండి. పెళ్లిఅయినతరువాతవూరికేపంపించినన్నాళ్ళు ప్రతిరోజూ మీాయింట్లో మేళంపెట్టి గణికాప్రాణనాథవుగారిమనసు సమాధానం పెట్టండి.

చారు—అన్నయ్యచెప్పినఆలోచన బాగా వున్నది.

దంభా — నాకు బాగానేవున్నట్టున్నది. ఏదో ముక్కుబద్ద లయ్యేటట్టు మహాచెడ్డపరిమళం వస్తూవున్నది. అరుగో గణికాప్రాణ నాథరావుగారున్ను విటేంద్రరావుగారున్ను దయచేస్తూవున్నారు.

మాయా—వారిరాక తెలియపరచడానికి వారివద్దనుంచి యీా పరిమళం గ్రహించి ముందుగా వాయుదేవుడు దూతగా వచ్చినాడు. ఈసువాసనయొక్క మోస్తరు చూస్తే యిది యెక్కడిదో పశ్చిమ ఖండంనుంచి సీసాలలో దిగుమతీఅయిన అమూల్యపరిమళంగా తోస్తూ వున్నదిగాని మనదేశపుదిగా తోచడం లేదు.

దంభా—వారు వచ్చినారు వూరుకోండి.

[గణికాప్రాణనాథరావుగారును, విటేంద్రరావుగారును ప్రవేశించుచున్నారు.]

దంభా — అయ్యా! తమరు యింతరాత్రివేళ దయచేసినా రేమి? దయచెయ్యండి.

గణి—ఇంతకుముందే తృప్తిగా పెరుమాళ్లసేవ చేసినాము.

మాయా—(తనలో) పానోత్సవం చేసినారు కాబోలును. ఈ సంగతి మీారు చెప్పనక్కరలేకుండా మీాసువాసనే చెపుతూవున్నది. (బిగ్గరగా) పెరుమాళ్ళసేవ చేసినా రేమి?

గణి—అహహాహా! మీా రెవరూ? మంజువాణిగారా! మేము పెరుమాళ్ళసేవ చేసినా మంచితెలివితో వున్నాము. ఆహాహాహాహా!

విటే—గణికాప్రాణనాథరావుగారు పరియాచక మాడుతూ వున్నారు. మాతో యిన్నిమాటలూ చెప్పి తీరా సభలోకి భోయి వాళ్ల

పక్షం చేరడంచేత మీకు మగతనం లేదని మిమ్మల్ని ఆడదాన్నిగా కట్టి పరిహాసం చేసినారు. గణికాప్రాణనాథరావుగారూ! మాయాచార్ల గారిని మీరు బాగా పరిహాసం చేసినారు.

గణి—ఆహాహాహాహా! మీ రెవరు? ఓహోహో! కీరవాణి తల్లిగారా? మీ మీసాలు చూడఢంతోటే ఆనవాలు పట్టినాను.

విశే—(తనలో) ఈయనకు యిల్లు బయలు దేరినప్పుడు యింత మత్తు లేదు. ఇంతలోనే స్పృహ తప్పిపోయినది. వొళ్ళు తూలుతూ వున్నది. కళ్ళు తిరుగుతూ వున్నవి. ఈయనను కొంచెంసేపు వూరు కుండేటట్టు చేసి నేను మాట్లాడుతాను. (బిగ్గరగా) మాయాచార్లుగారు మొదటిపార్టీలో చేరడంచేతనూ దంభాచార్లగారు భోగంమేళంలేకుండా పెళ్ళి చెయ్యడానికి వొప్పుకోవడంచేతనూ కోపావేశంచేత వొళ్ళు తెలియక యీయన యేవేవో అంటూ వున్నారు. గణికాప్రాణనాథ రావుగారూ! మీరు కొంచెంసేపు శాంతించండి. మీరు చెప్పమన్న మాట లన్నీ నేను వీరితో మనవి చేస్తాను.

గణి—ఆహాహాహాహా! అవును. మాతండ్రిగారు నాకంటె చిన్నవారు. ఎవరు కాదంటారో కాదనండి.

విశే—గణికాప్రాణనాథరావుగారు బహు బుద్ధిమంతులు. తండ్రిగారు యేళ్ళచేత పెద్దలయినా బుద్ధిచేత తమకంటె చిన్న లేనని యీయన అభిప్రాయము. ఈయనమాటలలో నెంత గూఢార్థ మున్నదో చిత్తగించినారా? సాధారణులకడుపునకూడా గొప్పవారు వుడుతారు. ఈయనతండ్రిగారికి భోగంవాళ్ళంటే యిష్టం లేదట! అందుచేత యేళ్ళు గడిచినా, ఈయనను చిన్నవా డనే చెప్పవలెను. అయ్యా! దంభాచార్లగారూ నే నొక్కమాట చెపుతాను వినండి. మాయాచార్లుగారు శత్రుపార్టిలో చేరిపోయినారు గనుక శత్రుపక్షం

వారిమాటా ఆడవాళ్ళమాటా మీరు యెంతమాత్రమూవినక పెళ్లిలో భోగంమేళం తప్పకుండా పెట్టి గణికాప్రాణనాధరావుగారితో చేసిన శపథం నిలుపుకోండి. పెద్దమనుష్యులతో అన్నమాట తిరుగరాదు. ముష్టిసంబంధం యీసంబంధం తప్పిపోతే నేను రేపు యీపాటికి మీ చిన్నదానికి యింతకంటె మంచిసంబంధం తీసుకువస్తాను. సందేహించకండి. ధైర్యంతెచ్చుకోండి. ధైర్యం పురుషలక్షణం. మీరు ఇందులో మాట తప్పిపోతే గణికాప్రాణనాధరావుగారు మిమ్మలినికూడా ఆడదానికింద కట్టివేస్తారు.

గణి—ఆహాహాహాహా! శ్రీకృష్ణులవారి చెల్లెలు రంభ వస్తుందట. నేను కైలాసానికి వెళుతాను. (అని వీధిలోకిపరుగెత్తుచున్నాడు.)

విటే—అయ్యో! దంభాచార్లుగారూ! మీరు మాట తప్పిపోవడంచేత యీయనకు యెటువంటిఅవస్థ పట్టినదో చూచినారా? మీరు పెళ్ళిలో భోగంమేళం పెడతామని ఖరారు చేస్తేనేకాని యీయనమనస్సు కుదుట పడదు. ఆడవాళ్లమాట విని మీరు మరి వాకలాగు చేస్తే నరహత్యాదోషం వచ్చి మిమ్మల్ని చుట్టుకుంటుంది. గణికాప్రాణనాధరావుగారు మీమీదకోపంవచ్చి మీతో చెప్పకుండా పరుగెత్తుతూ వున్నారు. నేనుకూడా యిప్పుడు ఆయనతో వెళ్ళి మెల్లిగా తెల్లవారేలోగా కోపం పోగొట్టి వృదయాన్ని మేము యిద్దరమూ మళ్లీ వస్తాము. (అని వెళ్లుచున్నాడు.)

మాయా—ఈతాగుబోతులువదిలిపోయినారు. తప్పతాగివాళ్లు తెలియక మనమీద పడి కొట్టకుండా వీధిలోకి పారిపోయినారు. మనం బ్రతికినాము. దంభాచార్లుగారూ! యీపెద్దమనుష్యులను యెప్పుడూ మనయింటికి రానియ్యకండి. యెంతతాగినా విటేంద్రరావుమాత్రము తెలివిగానే వున్నాడు.

దంభా—ఆయన యెప్పుడూ తెలివిగలిగేవుంటాడు. బంధువులు మీరు యింతగా చెపుతూ వున్నారు గనుక పెళ్ళిలో భోగంమేళం మానివేస్తాను. గనికాప్రాణనాథరావుగారు వూరికే పంపిస్తే తరువాత గృహప్రవేశానికి మేళం పెట్టి వూళ్ళో పెద్దమనుష్యుల నలుగురినీ తాంబూలానికి పిలుస్తాను. ప్రొద్దుపోతూ వున్నది. వెళ్ళి పడుకుందాము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

ఉ ప సం హా ర ము.

---

నే నీప్రహసనముయొక్క యుపోద్ఘాతమునందు నాప్రహసనములు చదివెడివారినందఱిని వానియందలి పాత్రములయందు వర్ణింపఁబడినగుణములు కొన్ని తమయం దుండుటనుబట్టి తమ్ముద్దేశించియే యవివ్రాయఁబడినవని యెంచుకోవలదని ప్రార్థించినను, అ, ఇ, ఉ, ఋ, అను దుష్టచతుష్టయ మొకచోటఁజేరి రహస్యముగాఁ దమలోఁదా మిట్లనుకొని రని తాను చాటుననుండి విన్నదానిని హాస్యప్రియుఁడిట్లు వినిపించుచున్నాఁడు—

అ—వేశ్యాప్రియప్రహసనమంటే యేమిటి?

ఇ—వేశ్యలయం దిష్టము గలవారిని గురించినప్రహసన మని వాళ్ళఅభిప్రాయము.

ఉ—వాళ్లఅభిప్రాయం యేడిసినట్టేవున్నది. నేను వాళ్ళ కేతగిలేటట్టు దీనికి అర్థం చేస్తాను చూడు. వేశ్యాప్రియప్రహసన మంటే, వేశ్యలకు అప్రియమయిన ప్రహసనమని వొకఅర్థము.

ఋ—యీఅర్థాల కేమిగాని అందులోవున్న పాత్రలు యెవరిని గురించి వుద్దేశించబడినవో, బుద్ధిమంతులు మీరు వూహించండి.

అ— గణికాప్రాణనాథరావనినన్నుద్దేశించి వ్రాసి వుంటారు.

ఋ— అందుకు సందేహ మేమి! ఆ పేరులో మొదటిఅక్షరము లోనే గామీద అకారము పెట్టినారు కనిపెట్టినావు కావా?

ఇ—ఆలాగయితే వీరేంద్రరావంటే నేనయివుంటాను. మొదట విలో ఇకారము వున్నది.

ఋ—బాగావూహచేసినావు. వాళ్ళెయెంతతంత్రం చేసినారో కనిపెట్టినావా? అన్నీ మొదటిఅక్షరాలే పెడితే మనం తెలుసుకుపోతామని, ఉకారము దంభాచార్యులలో నాలుగో అక్షరంలో పెట్టినారు.

ఉ—ఓహో! యిప్పుడు బోధపడ్డది. దంభాచార్యులంటే నేనని వాళ్ల వుద్దేశముసుమా!

అ—నాకు యిప్పుడిప్పుడు వొక్కొక్కసంగతే బోధపడుతూ వున్నది. గణికాప్రాణనాథరావు వేశ్యాభిమానంచేత పని మానుకుని యింట్లోకూర్చున్నాడని వ్రాసినారు. ఈసంగతి యిప్పుడు నేను సంవత్సరమునుంచి సెలవుపుచ్చుకుని ఇంట్లోవుండడం మనసులో వుంచుకొని వ్రాసినారు.

ఋ— అదివక్కటే కాదు. మీరు పయికి వొప్పుకోరుగాని మీరు యెప్పుడూ బోగంవాళ్లతో ప్రొద్దుపుచ్చుతూ వుండడం ముఖ్యంగా మనసులోవుంచుకుని మిమ్మల్ని ఆక్షేపించడానికి—

ఇ—వూరుకోండి. హాస్యప్రియుడు పొంచుండి మనమాటలు వింటూవున్నాడు. మనం లోపలికి పోయి మాట్లాడుకుందాము రండి.

(నలుగురును లేచిపోవుచున్నారు.)

# కౌతుకవర్ధని.

## ప్రథమాంకము.

౧. ప్రదేశము—నృసింహారావుపంతులవారి గృహము.

[నృసింహారావు పంతులుగారు కూరుచుండియుండఁగా ఆయన స్నేహితుఁడగు సుబ్బారావు పంతులుగారు ప్రవేశించుచున్నారు.]

నృసిం—ఏమండీ సుబ్బారావు పంతులుగారూ! మీరు నాలుగు రోజులనుంచి బొత్తిగా దర్శనమియ్యడమే మానివేసినారు.

సుబ్బ—జరూరుగా కాకినాడ వెళ్లవలసిన పనివుండి మీతో మాట్లాడిననాటిసాయంకాలమే పడవమీఁద వెళ్ళి యీరోజు భోజనపు వేళకు మళ్ళీ వచ్చినాను. నేను వూళ్ళోవుంటే మీదర్శనం చెయ్యకుండా వుంటానా ?

నృసి—వూళ్ళోవిశేషా లేమండి ? మీరు వెళ్లిన యీనాలుగు దినములనుంచీ నాకు వూళ్ళోవిశేషా లేమీ తెలియడమే లేదు.

సుబ్బ—మీ రెరుగనివిశేషా లేమున్నవి ? భీమరాజుగారు సకుటంబముగా కాశీయాత్రవెళ్ళినసంగతి మీరు విన్నారుకాదా ?

నృసి—ఆయనభార్యా పుట్టింటకాడ యీవుదయాన్న వుండగా నేను చూచినాను. ఆయనమామగారు మనయింటియెదుటనే కాపురం వున్నారు. వారి ఆడంగులు నిత్యమూ మాయింటికి వస్తూ పోతూ వుంటారు. ఆయన సకుటంబముగా యాత్రకు వెళ్లినారని చెప్పుతూ వున్నారు. మీరు పొరబాటుగా విన్నట్టున్నారు.

సుబ్బ—సరిసరి. మీరింకా పెరటిదోవనే వున్నారు. భార్య అంటే యేభార్య అనుకున్నారు ? ఆయన దివాణంవారితోకూడా

యాత్రికు విజయంచేసినారు.

నృసి—దివాణం యేమిటి? నేనీమాట కొత్తగా విన్నాను.

సుబ్బ—మీరింకా విననేలేదా? భీమరాజుగారు కొత్తగా వుంచుకొన్న బోగందాని యింటికి దివాణం అని పేరుపెట్టినారు.

నృసి—ఆ పేరు బహుచక్కగా కుదిరినది. ఆజ్ఞపెట్టేవారులేక అంతకంతకు యీవూరు బహుచెడిపోతూవున్నది. ప్రతివాడికీ కట్టుకున్న పెళ్ళాన్ని వదిలిపెట్టి ముండను వుంచుకోవడపు రోగంవొకటి పట్టుకున్నది. వూళ్ళో పెద్దమనుష్యులమని తిరిగేతలగలవారు నలుగురే యీలాగు హద్దుచెడి ప్రవర్తిస్తూవుంటే, యిక చిల్లరచేష్టలు చేసే వారిని అదమాయించేవారు యెవరువుంటారు?

సుబ్బ—అదమాయించే దినాలు చాలాకాలంకిందనే వెళ్లిపోయినవి. పూర్వము నాచిన్నతనంలో యీవూళ్ళో ముండను వుంచుకొన్నవాడు వకడో యిద్దరో వుండేవారు. వుద్యోగస్థులలోనల్లా వక్క నరసయ్యనాయుడు వుండేవాడు. అతఁడయినా యిప్పటిలాగు యింత హద్దుచెడి తిరిగేవాడుకాడు. వూరు మాటుమడినతరువాత రాత్రి పది గంటలకు రహస్యంగా రెండవకంటివా డెరుగకుండా ముసుగువేసికొని బోగందానియింటికివెళ్ళి వీధిలో యెవ్వరూ లేకుండా చూచి లోపల ప్రవేశించి మళ్ళీ తెల్లవారిగట్ట చీకటివుండగానే యింటికివచ్చి చేరేవాడు. అక్కడికే అతణ్ని అందరూ వేళాకోళం చేసేవారు. బంధువులు యెవ్వరూ అతనియింటికి వెళ్లేవారుకారు. నలుగురులోకి వెళ్లడానికి సిగ్గుచాటుగావుండి అతఁడు సభలోకి యెక్కడికి తాంబూలానికి సమేతం వెళ్లేవాడుకాడు.

నృసి—ఈకాలంలో ఆసిగ్గూ, గిగ్గూ అన్నీ వదలి పోయినవి. పూర్వకాలములో బోగందాన్ని వుంచుకోవడం అంటే తలవంపులుగా

యెంచబడేది ; యిప్పుడు భోగందాన్ని వుంచుకోవడమే ప్రతిష్ఠగాను వుంచుకోకపోవడం అప్రతిష్ఠగాను యెంచబడుతూ వున్నది. అప్పుడు భోగంవాళ్ళు తమ్ము వుంచుకొనేవాళ్ళు లేకతంటాలుపడుతూవుండేవారు; ఇప్పుడు వుంచుకునేవాళ్ళు భోగంవాళ్ళు చాలక తంటాలుతడుతూ వున్నారు. ఆకాలములో భోగంవాళ్ల యింటికి వెళ్లితే యెవరైనా చూచిపోతారేమోనని సిగ్గుచేత రహస్యముగా వెళ్లేవారు ; ఈకాలములో అందరూ చూస్తేగౌరవమని బాహాటముగా పట్టపగలే పదిమందిని వెంటబెట్టుకొని మరీవేశ్యలయింటికి వెళుతూవున్నారు. కులంవారు యెవ్వరూ కూకలువేసేవారు లేక స్థితిచెడిపోతూవున్నది.

సుబ్బ—ఇప్పుడేమైనాఅంటే కులంవారినే కూకలు వేస్తారు. పెద్దవుద్యోగాలలోవుండేవారు నలుగురూ ముండలను వుంచుకోవడంచేత కులంవారికి వారిని వెళ్లి అనుసరించకుండా జరగదు; తెల్లవారి లేస్తే వారిని అనుసరిస్తూ వారియిళ్ళచుట్టూ తిరుగుతూ వారివల్ల జీవనంచేసేవారు వారి నేప్రకారముగా మందలించ గలుగుదురు? పెద్ద మనుష్యులన్నవారే ఆప్రకారంగా వ్యభిచరిస్తూవుండడంచేత పోకిరీలు బొత్తిగా హద్దుమీరి విచ్చలవిడిగా తిరుగుతూవున్నారు. ఆపెద్దమనుష్యుల అనుగ్రహం సంపాదించుకోవలెననే వారందరూ భోగంవాళ్ళచేత సిఫారసులు చేయించుకుంటేనేకాని వారిఅనుగ్రహంరాదు.

నృసి—ఇంకొకటి చూచినారు కారా? ఇప్పు డీవూళ్లో భోగంవాళ్లను వుంచుకొన్నవాళ్లందరూ చేరి వుంచుకోనివాళ్లను నపుంసకులని పరిహాసం చెయ్యడానికి మొదలుపెడుతూ వున్నారు.

సుబ్బ—యీవూళ్లో వాళ్లుమాత్రమే కాకుండా యీజిల్లాలో వున్నభోగంవాళ్లందరూ వచ్చి యీవూళ్లో కాపురంవున్నా చాలక లోకంలో వుండేఆడవాళ్లందరూ భోగంవాళ్లయితే బాగావుండు నని

కొందఱుమహానుభావు లనుకొంటూ వున్నారు.

నృసి—ఇంత గొప్పఆలోచన తోచినవా డెంతటిబుద్ధిమంతుడో కాని యీకోరిక లోకములో వుండేసముద్రాలలో నీళ్లన్నీ కల్లయితే బాగావుండు నని కోరిన త్రాగుబోతుకోరికకంటెనూ బాగా వున్నది.

సుబ్బ—కులంవారు యేమీ చెయ్యకపోతే పోనీ. మతాచార్యులైనా యిలాకాపుచ్చుకొని యీదురాచారం మాన్పడానికి యేమైనా పనిచేస్తే బాగుండును.

నృసి—ఇప్పు డామతాచార్యులమాట వినేవా రెవరు? ఆమతాచార్యులుకూడా యీపెద్దమనుష్యులను ఆశ్రయిస్తేనేకాని వారికి భిక్షలు జరగవు. ఆమతాచార్యుల కీసంగతి తెలిస్తే వాళ్లవద్ద డబ్బు పుచ్చుకొని పాదపూజ సమర్పించినావు కా వని ముండలు లేనివాళ్లకే వెలివేస్తారు.

సుబ్బ—నా కిప్పుడు వెళ్లవలసినపని వున్నది. ఇంకొకసారి మన స్నేహితుల మందఱమూ ఆలోచించుకొని యిందులో యేమిపని చెయ్యవలెనో విచారింతాము.

నృసి—మంచిది. రేపటిఆదివారమునాడు మనమందఱమూ కూడి తప్పకుండా యేదో వకటి ఆలోచిస్తేనేకాని పట్నంసంగతి బొత్తిగా బాగావున్నది కాదు.

సుబ్బ—తప్పకుండా ఆలాగే చేతాము.

(అని నిష్క్రమించుచున్నారు.)

౨. ప్రదేశము—నాగభూషణరావుపంతులుగారి గృహము.

[నాగభూషణరావుగారును, గంగాధరశాస్త్రులుగారును, రామసోమయాజులుగారును ప్రవేశించుచున్నారు.]

నాగ—యీవూళ్లో సుబ్బారావుపంతులున్నూ నృసింహారావు పంతులున్నూ మహాదుర్మార్గులు. మనము అక్రమపుపనులు చేస్తూ వున్నామని రేపు వూళ్లో యేమో సభచేయించవలెనని వాళ్లు అందరి యిళ్లచుట్టూ తిరుగుతూ వున్నారట. మీకేమైనా తెలిసిందా?

గంగా—యేడిసినారు లెండి. వాళ్ళు సభచేస్తే యీవూళ్లో వెళ్లేవారు యెవరున్నారు? ఆలాంటిపోఖిరీ లందరూ పదిమందిజట్టు వున్నారు. వెళితే వాళ్ళు పదిమందీ నృసింహారావుయింటికి వెళుతారు.

రామ—ఇందువల్ల వాళ్ల వోర్వలేనితనం వక్కటే కనుపడుతుందిగాని వాళ్లు మన నేమిచెయ్యగలరు? మనము ముండల నుంచుకుంటే వాళ్లసొమ్మేమైనా పడిపోయిందా యేమిటి? యిప్పుడు పెద్దమనిషితరహా బొత్తిగా పోతూవున్నది. ఇటువంటిపోఖిరీవాళ్లను అణిచివెయ్యడానికిని మన మేమయినా చేస్తేనేకాని బొత్తిగా బాగావున్నది కాదు. యిదివరదాకా మనము చూచి చూడనట్టు వూరుకుంటూవుంటే వాళ్ళాడినఆటలల్లా సాగివస్తూ వున్నవి.

గంగా—అవును. మనము వూరుకోరాదు. నాకు ఇంగ్లీషు రాదు గనుక ఆక్టులు యేమీ తెలియవు. రామసోమయాజులుగారూ! మీరు పెద్దకోర్టుప్లీడరులు మనము; వాళ్లను యేమైనా చెయ్యడానికి లాలో ఆధారం వున్నదేమో చూడండి.

రామ—వాళ్లు సభ చెయ్యనియ్యండి చెపుతాను. పినాల్ కోడ్డు కమెంటరీ చూచి డిఫేమేషన్ కింద ఫిర్యాదు తెత్తాము. నేను ముందుగా తహశ్శీలుదారుగారితో మాట్లాడి బందోబస్తు చేస్తాను.

గంగా—డిఫేమేషన్ అంటే యేమీ తెలిసిందిగాదు. తెనుగున స్పష్టముగా చెప్పండి.

రామ—డిఫేమేషన్ అంటేనా? మీకు తెనుగు కావలెను!

నాగ—కొంచెం ఇంగ్లీషు వచ్చును గనుక నేను చెప్తాను వినండి. డిఫేమేషన్ అంటే మానసనష్టము.

గంగా — సరిసరి తెలిసింది. మీరు చేసిన ఆలోచన బహు బాగా వున్నది. నాకింతకంటె మరి వక ఆలోచన తోస్తూవున్నది. వాళ్లిద్దరున్నూ స్కూలులో చదువుకొని బొత్తిగా సంధ్యాస్నానం మానివేసినారు. శంకరాచార్యులవారికి వ్రాసి వాళ్లకు అంటుపత్రిక తెప్పిస్తే—

రామ—అది బాగా వుండదు. ఇప్పుడు నేనుమాత్రము సంధ్య వారుస్తూవున్నానా యేమిటి? సంధ్య యేమిటి? నాన్సెన్సు!

గంగా—మీరు ఇంగ్లీషులో యెంతపడితులైనా ఆలాగున అనవద్దు. బ్రాహ్మలము గనుక నిజముగా సంధ్య వార్చకపోయినా పైకి వారుస్తూవున్నామని చెప్పవలెను.

నాగ— మీరు చెప్పినట్టు డిఫేమేటరీఛార్జే బాగా వున్నది. మొన్న పలివెలనుంచి బత్తులవాళ్లయింట్లో పెళ్లికి వచ్చినమేళంలో పద్దాలుగేళ్ళకుఱ్ఱది మహాబాగా వున్నదండీ. మనలో యెవరైనా దానికి కన్నెరికము చేస్తే మహాబాగా వుండునండి.

రామ—నేనీసంగతి యిదివరకే ఆలోచించినాను. వాళ్ళు దాన్ని యావజ్జీవం నెలకురెండురూపాయలుచొప్పున యిచ్చివుంచుకుంటామని పత్రికవ్రాసియిస్తేఅంగీకరిస్తామనిఅంటూవున్నారు. ప్రస్తుతములో అయిదువందలరూపాయలమట్టుకు ఖర్చుకు కావలెను. ఒకజమీందారీ వ్యాజ్యంలో వెయ్యిరూపాయిలఫీజు రావలసివున్నది. ఆసొమ్ము వస్తే

వుత్సవం వైభవంగా జరిగించి మాన స్నేహితులను పదిమందినీ పిలిచి మీయెదుటనే పీటలమీద కూర్చోవలెనని వున్నది.

గంగా—మీరదృష్టవంతులు. మీకోరిక తప్పకుండా ఫలిస్తుంది. జమీందారీవ్యాజ్యంకాకపోతే మీరు వూళ్లో యేషావుకారువద్దనైనా బదులు తెప్పించగలరు. యేకోమటిమీదనైనా వకబరాతం వ్రాసి నాచేతికివ్వండి. మీచీటీపట్టుకొనివెళ్ళి వకనిముషంలో సొమ్ముతీసుకొనివచ్చి పీటలమీద కూర్చున్నప్పుడు దానిపైటమీదకి నూరురూపాయల బనారసుఖండువా మీకు యాభైరూపాయల పట్టురెక్కచాపూ నాలుగు ఘడియలలో తీసుకునిరాకపోతే నాపేరు మారుపేరు పెట్టండి. ఛీ! వెధవబ్రతుకు, అటువంటివాళ్ళ బ్రతుకెందుకండీ? బ్రతికివున్న నాలుగురోజులూ యింతఖులాసాగా బ్రతకవలెను.

రామ—చేతిలో సొమ్ముహాజరువుంటే యీసాయంత్రం శుభముహూర్తంపెట్టించి యీమధ్యాహ్నమే మీకు విందులుచేయింతును. రెండు నెలలనుంచి ఖాయిలాగావున్నందున కోర్టుకు వెళ్ళకపోవడంచేత పార్టీలఫీజుయేమీ చేతులో పడలేదు. ఖాయిలా కుదుర్చుకోవడముకు యిదివరకే బదులుచేసి అక్కడక్కడ సొమ్ము తెప్పించాను, మరి యాభైరూపాయలు పోయినా మంచివైద్యుడిదగ్గిర అవుషధం పుచ్చుకోవడం మంచిదని యీవైద్యుణ్ని యేలూరునుంచి పిలిపించాను. యితడువుండగానే మీవంట యేమైనా జీర్ణించినపాతజాడ్యములున్నవేమో రహితంచేయించుకోండి. దిక్కుమాలినముండాకొడుకు వెనుక యీవూళ్లో వకడిదగ్గర మందు పుచ్చుకుంటే పాదరసం పెట్టినాడు. అందువల్ల కాళ్ళుపడి నిరుటి సంవత్సరము నాలుగుమాసములు మహాశ్రమపడ్డాను.

గంగా—మీరువుంచినదానివద్ద జాడ్యములు లేవని పాడుకే!

రామ—దానిదగ్గర లేవండీ మొన్న కొత్తగా ముండ పేటనుంచి మేళం వస్తే పొరబాటున దానివద్దకి—

గంగా—సరిసరి తెలిసింది. అముండ నేను యెరిగినదే. నేను పదహారేళ్ళువచ్చినది మొదలుకొని యిప్పటికి రెండువందలముండలను జూచినానన్నా నమ్మవలెను. నాకు యెప్పుడూ గొప్పరోగాలు యేమీ తగలలేదుగాని వక్కసారిమాత్రం యేదో చిత్రమయిన కోస్తాజాడ్యంతగిలి చచ్చేవాడినే బ్రతికినాను. నాలుగురోజులు నన్ను కింద పడవేశారు. నాగభూషణరావుగారూ! మీఅన్నగారు యీజాడ్యాలమూలంచేతనే కాదా చచ్చిపోయినారు

నాగ—అందరూ చస్తారండీ! ఆయువు మూడినవాడు యెవడో వకడు చస్తాడు. మనమంతా యింతకాలమునుంచి యీవ్యాపారములో సంచరిస్తూ వున్నాము. యెప్పుడైనా చచ్చినామా? మనం వక్క విషయములోమాత్రం జాగ్రతగా వుండవలెను. చూచినముండతో నల్లా దేవుళ్ళాడడం మాని యెప్పుడూ వక్కదాన్ని వుంచుకుంటూ వుంటే నూరేళ్లయినా ఫర్వా లేదు.

గంగా—మీరు వక్కదాన్నే వుంచుకున్నారు గదా మొన్న మీ కెందుకు రోగం వచ్చిన దండి?

నాగ — బొత్తిగా రోగాలు రావనా? అప్పుడప్పుడు వస్తూ వున్నాకాని ప్రాణభయం యెప్పుడూ వుండదు. నేను వుంచుకున్నది మహాపతివ్రత సుమండీ. నేను వక్కదినం లేకపోతే, అది యింట్లో తిన్నగా అన్నం తినదు. నేను పైగా దర్యాప్తు చేసినాను. నాతో యీసంగతి దానితల్లే పదిసారులు రహస్యంగా చెప్పింది. దానికి పరపురుషు డంటే గడ్డిపరకతో సమానం. రోగములు శరీరతత్వం పడక పోటంతట అవే పుడుతవి.

గంగ—మీరు వుంచుకొన్నది వక్క_త్తే కాదండీ! మనవూళ్లో భోగంవాళ్ళందరూ అదేమో_స్తరువాళ్లు. మొ_త్తంమీద భోగంవాళ్లందరూ పతివ్రితలే. ఇప్పుడు నేను వుంచుకొన్నది పరపురుషుడి మొఖంవంకనైనా చూడదు. మన అదృష్టంచేత మనకు యిటువంటివాళ్లు తట_స్తమయినారేకాని మరివకటి కాదు.

రామ—మీరు వుంచుకున్నవాళ్లు యింకా వూళ్ళోకి మేళానికైనా వెళుతారుగాని నేను వుంచుకున్నది యెప్పుడూ వీధిగుమ్మం బొ_త్తిగా తొక్కిచూడదు. నేను వుంచుకున్నరెండేళ్లనుంచీ దీన్ని యెక్కడా గజ్జెకట్టడం మానిపించివేశాను. నాలుగురూపాయలుజీతం యిచ్చి ప్రత్యేకం వకమనిషినికూడా దానిగుమ్మంకాడ కావలి వుంచాను. భోగరాజుగారు వుంచుకొన్నదేమో లోపాయికారీని మరి వకణ్ని వుంచుకొని వాడికి సొమ్మంతాదోచిపెడుతూవుం దని వింటాను.

గంగా—ఈసంగతి ఆనిక నిమ్మళంగా మాటాడుకొందాము గాని మనము మొట్టమొదట అనుకొన్నవిషయం బాగాఆలోచించి వేగిరం యేదో వకటి చెయ్యవలెను. లేకపోతే వాళ్ళు మరీ హద్దుమీరి రేపు మీరు కన్నెరికంచే_స్తే బొ_త్తిగానే అల్లరి చేస్తారు.

రామ—చూడండి. వాళ్లరోగం నేను వారంరోజులలోగా కుదురుస్తాను. మన మిప్పుడు మాటాడినసంగతి యెవరికీ తెలియనియ్యకండి. కోర్టువేళ అయినది యిప్పటికి లేతామా?

(అందఱును వెళ్ళుచున్నారు.)

---

3. ప్రవేశము—ఒక వేశ్యాగృహము.

[వేశ్యయగు మంజువాణియు దానితల్లియగు సారసాక్షియుఁ బ్రవేశించుచున్నారు.]

సార—వేశ్య విటునిమీద తనకెంతప్రేమవున్నా కానీతల్లిమాట

మీాదరాదు. ఇది కులధర్మము నేను నీకు కన్నతల్లినా అంటావేమో. దినమునకు పదిమంది మొగుళ్ళవులచేతనూ సదా యేవో సుఖజాడ్యములు వంటివి జీర్ణించి వుంటవిగనుకనూ బోగమువాళ్ళకు సంతాన మెలాకలుగుతుంది ? నిన్ను నేను పెంచుకున్నట్టే నాతల్లి నన్నున్నూ పెంచుకున్నది. కాబట్టి మనకులములో తల్లి అంటే పెంపుడుతల్లి అనే అర్థము. డబ్బుయిస్తాడా ? నగలుపెడతాడా ? నీవా బ్రాహ్మణచిన్నవాణ్ని మనయింటికి రానియ్యకు.

మంజు — నీవు యెన్ని అన్నా కానీ యీవిషయములో మాత్రము నేను నీమాట వినను. ఆరామయ్యగారిమీాద నాకు వలపువున్నది. లక్ష రూపాయలు పోయినా నేను ఆయనను విడిచిపెట్టను. ఆయనకుయిచ్చే వల్లా నెలకు రెండువరాలేకదా ? అంతకు పదిరెట్లసొమ్ము గణించి నీ చేతులో పెట్టడంలేదా ?

సార — నీకుచిన్నతనం. యింకా బాగా తెలియదు. నెలకుముప్ఫయిరూపాయలిచ్చి నిన్ను గంగాధరశాస్త్రుర్లు వుంచుకున్నాడుగదా ? ఆయన కీసంగతి తెలిస్తే బాగా వుంటుందా? నామాట విని యీబీద బ్రాహ్మడితో రేపటినుంచి మాయింటికి రావద్దనిచెప్పు.

మంజు — యింతకాలమునుంచి రామయ్యగారు మనయింటికి వస్తూవున్నారుగదా ? గంగాధరశాస్త్రిగారికి యెప్పుడైనా నామీాద యేవిధమయిన అనుమానమయినా కలిగిందా ? రామయ్యగారు శాస్త్ర్లుగారివద్ద తిరుగుతూ నాకూ ఆయనకూ మధ్య రాయబారాలు తెస్తూవుండడంచేత రామయ్యవంటి నమ్మకమైన మనిషి వుండబట్టే తనకు మర్యాద దక్కుతూవున్నదని ఆయన అందరివద్దా చెప్పుకుని సంతోషిస్తున్నారు. డబ్బుకోసంతప్ప నిజంచేత శాస్త్రుర్లుగారిమీాద నాకు యేమీా ప్రేమలేకపోయినా, ఆయనవద్ద నున్నప్పుడు లేనిమోహం

తెచ్చిపెట్టుకుని, ఆయన లేకపోతే నాకు ప్రపంచమే లేదన్నట్టుగా నటిస్తూ వుండడంచేత కట్టుకొన్న భార్యకైనా యింతప్రేమా యింతవిశ్వాసమూ వుండదని నావిషయమయి ఆయన అందరితోనూ శ్లాఘించి చెప్పుతూవుంటారు.

సార — ఇది అంతా నీప్రయోజకత్వ మనుకొన్నావా యేమి? నీబాగుకోసమై నేనెన్నివిధములుగానైనా తంటాలుపడి యీకాడికి తెచ్చినాను. ఆయన యెక్కడికైనా వూరికి వెళ్ళి రాగానే నీవారోజులలో మరింత స్వేచ్ఛగాను ఖులాసాగాను వున్నప్పటికీ మీరు వెళ్లిన రెండురోజులబట్టీ మాచిన్నది మీకోసం బెంగపెట్టుకుని తిన్నగా అన్నంతినలేదు. మంచిబట్టకట్టుకోలేదు. మంచంమీదనుంచి లేవలేదని చెప్పేదానిని. నీకోసం వస్తూ పోతూ వుండేవాళ్లచేతకూడా అలాగే చెప్పించే దానిని.

మంజు — నీ తరిబీతుచేత నేనున్ను తదనుగుణంగానే మాటలు చెప్పడంచేత యిప్పుడుపూర్తిగా ఆయనకు నామీద నమ్మకము కుదిరిపోయింది. మొట్టమొదట మనయింటికి యెవరైనా నాకోసంవచ్చినప్పుడు కంటబడుతూ వుంటే సందేహపడి కొన్నాళ్లు వకమనిషిని కావలివుంచినారు. వాణ్ని వకటి రెండుమాట్లు నావద్దకు రానియ్యడంచేత, నావంటిపతివ్రత లోకములో లేదనిన్ని నామీద యేదైనా దోషం యెంచితే పుచ్చిపురుగులు పడిపోతారనిన్ని వాడుచెప్పేవాడు. ఇప్పుడు అటువంటి అపనమ్మకం యేమీ లేదుకాని నిజం తెలియక నేను రోగిష్టిదాన్నికదా అని విచారిస్తూవుంటారు. ఆయన వైద్యుణ్ని పిలిపించి అవుషధం యిప్పించడంతోనే లోపలికివెళ్లి వేసుకుంటానని చెప్పి మాత్ర అవతల పారవేసి వస్తూవుంటాను.

సార — ఈవుపాయంమాత్రము మొదట నీకెవ్వరునేర్పినారు?

నేను చెప్పి పెట్టబట్టి నెలకు పదిహేనురోజులు తలనొప్పి అని తలకు పట్టు వేసుకొని ఆయన వచ్చేటప్పటికి బాధపడుతూ కూర్చుండి ఆయన కొంచెమునేపు విచారపడి యింటికివెళ్ళగానే పట్టు కడిగివేసికొని తెల్ల వారినదాకా సరసునితో ఖులాసాగావుంటావు. నీవు యెంతసంపాదించినా పయిగా నెలకు యాభైరూపాయలకంటె యెక్కువసంపాదించ లేదు. నాకాలంలో నేను వుంచుకొన్న నాయుడుయిచ్చేదిగాక యేనెలలోనూ నూరురూపాయలకు తక్కువలేకుండా సంపాదించేదానను. శాస్త్రుల్లుగారు కోర్టుకు వెళ్ళినతరువాత నీ వింకా పగలు సంపాదించడం తక్కువ.

మంజు—అదంతా నీవు శాస్త్రుల్లుగారివద్ద నేతీస్తావు. నేనెప్పుడూ ఆయనసంతోషంచేత చేతిలో పెట్టితేనేతప్పవక్కడబ్బుయిమ్మనిఅడగను. నీవే పిల్లదానికి చీరెలులేవనీ,రవికలులేవనీ పొరుగువాళ్ళుపెట్టుకొన్న నగలుచూచి ముచ్చటపడుతూవున్నదనీ చెప్పి యిచ్చేజీతంగాక కావలసినంతడబ్బు పయిగా లాగుతావు.

సార—ఇదేమిచూచినావు ? నాకాలములో నేను యెన్నివిధాలనో డబ్బులాగేదాన్ని. విటులకు పోటీలుపెట్టి సంపాదించేదానిని. భాగ్యవంతులబిడ్డలను రహస్యంగా రానిస్తూ, వాళ్ళనుమాయింటికి రాకుండాచేస్తానని తలిదండ్రులవద్దకూడా డబ్బు సంపాదించేదానిని, అదుగో యెవ్వరో తలుపుగుద్దుతూవున్నారు. నేనుచెప్పిన సంగతి బాగాఆలోచించుకో.

(అని వెళ్ళుచున్నది.)

# ద్వితీయాంకము.

—:(o):—

౧. ప్రదేశము—నృసింహారావుపంతులుగారి కచేరీచావిడి.

[నృసింహారావుపంతులుగారును, సుబ్బారావుపంతులుగారును, బసవరాజుగారును ప్రవేశించుచున్నారు.]

నృసి—మనము యీరోజున మూడుగంటలకు సభచేస్తామని వ్రాస్తే అందరూ వస్తామని నాలుగుగంటలన్నర అయినా యింకా యెవ్వరూ వచ్చినారు కారు.

సుబ్బా—ఇఖనూ రారు బోగంవాళ్లను ఆడిస్తామంటే చీట్లు వ్రాయకపోయినా ఘంటకు ముందుగానే వచ్చి కూర్చుని వుందురు.

బస — అలా కాదు. మనవాళ్లు మూడుగంటలకంటే సాధారణముగా అయిదుఘంటలకు కాని రారు. ఎవరు రాకపోయినా వీరభద్రుడుగారూ మొదలయిన మనస్నేహితులయినా ముఖ్యముగా వస్తారు.

నృసి—మన హిందువులలో ఇదియొక దురాచారం విస్తారంగా వున్నది. యెప్పుడూ వేళకు రారు. పగలు రెండుఘంటలకంటే అయిదు ఘంటలకు వస్తారు.

సుబ్బా—అట్లా వచ్చినా కొంచెం బాగానే వుంటుంది. వస్తామని చెప్పి బొత్తిగానే రానివారికంటె నయం కాదా?

బస—అదుగో వీరభద్రుడుగారు మఱికొందరుస్నేహితులతో వస్తూవున్నారు.

[కొంతమందితో వీరభద్రుడుగారు ప్రవేశించుచున్నారు.]

నృసిం— ఏమండీ వీరభద్రుడుగారూ! యిటువంటిసంగతులలో ముఖ్యముగా శ్రద్ధపుచ్చుకొనేవారు మీరే యిలాగున ఆలస్యంగావస్తే

మరి యెవరు వేళకు వస్తారండీ?

వీర — నేను యింటికాడ తొందరపని వుండగా చూచుకుంటూ వుండి యెవరయినా వచ్చినారేమో చూచి రమ్మని మావాణ్ని రెండు మాట్లు పంపినాను. వాడు వచ్చి యెవరూ రాలేదని చెప్పడంచేత కొంచెం ఆలస్యంగా వచ్చినాను.

సుబ్బా — ఇప్పుడే అయిదుగంటలు దాటిపోయింది. యిక నెవరూ వచ్చేటట్టు కనపడదు. మనం అనుకున్నసంగతి యీవున్న వారితోనే ఆలోచించుదామా?

వీర — ఆలోచించవచ్చును. వారితరఫున మాటాడడమునకు బుచ్చిరాజుగారు వచ్చినారు. తక్కినవారు రానిలోపం వుండదు.

బుచ్చి — నేనున్నా యేమి జరుగుతుందో తమాషా చూతామనే వచ్చినాను. మీరు సభలో చెప్పబొయ్యేహంశ మేమిటో సెలవియ్యండి.

సుబ్బా — మనవూళ్లో పెద్ద లందరూ వుపేక్షచేసి వూరుకోవడంచేత వ్యభిచారం అంతకంతకు యెక్కువవుతూ వున్నది.

బుచ్చి — పెద్దలు వూరుకోక వురి పెట్టుకుంటారా? డబ్బున్న వాళ్లు మనసువచ్చినట్లు భోగందాన్ని వుంచుకొని సుఖపడుతారు. వాళ్ళడబ్బు వాళ్లు పాడుచేసుకుంటూ వున్నారుగాని మిమ్మలి నేమీ తెమ్మనడం లేదు. డబ్బున్నవాళ్ళు ముండలను వుంచుకుంటే మధ్య మీకూ నాకూ యేమి పట్టింది?

వీర — మీరు కొంచెం ఆలోచించి మరీమాట్లాడండి. ఇతరులు పాడవుతూ వుంటే చూస్తూ వూరుకోవడం మానవధర్మం కాదు. వాళ్లను చూచి —

బుచ్చి — ధర్మం కాకపోతే భూభారం అంతా యిప్పుడు మీరు

తీరుస్తారా ?

వీర—తీర్చగలిగినా తీర్చలేకపోయినా సాధ్యమయినంతమట్టుకు ప్రయత్నం చెయ్యడం మన కందరకూ విధి. వకరుచెడి తిరుగుతూ వున్నప్పుడు మనం చూస్తూ వూరుకుంటే వాళ్లను చూచి రేపు మన వాళ్లుకూడా ఆపనిలోనే ప్రవేశించి చెడిపోతారు. అప్పుడు ఆనష్టము కంతకూ మనమే కారణం అవుతాము. మరివకరు చేస్తూ వున్నప్పుడు మీా కిది తప్పితంగా తోచకపోయినా, రేపు మీాకుమారుడు పెద్దవాడయి మీాకోడలిని వదిలిపెట్టి భోగందాన్ని వుంచుకొని యింట్లోడబ్బంతా పాడుచేస్తూ వుంటే అది తప్పితం అవునో కాదో మీాకు బాగా తెలుస్తుంది.

బుచ్చి—తెలిసి మనము యేమిచేస్తాము? భోగంవాళ్ళనూ గుడిసేటివాళ్ళనూ అందరినీ మనము వ్యభిచారం మాని పెళ్ళి చేసుకోమంటే వాళ్ళు చేసుకుంటూరా? ఆడవాళ్ళనే మానపలేకపోతే మనము మగవాళ్లను యెక్కడ మాన్పకలుగుతాము ?

వీర—నేను చెప్పినదాన్ని తిన్నగా వినండి. మీాచిన్నతనంలో మగవాళ్ళల్లోనైనా యింతవ్యభిచారం వుండేదా ? ఎవడైనా వకడు ఆకాలంలో ముండను వుంచుకుంటే పెద్దమనుష్యులు యెవరూ వాణ్ణి మర్యాద చెయ్యకపోవడంచేత భయం కలిగి తక్కినవాళ్ళందరూ నీతి గలిగి వుండేవారు. యిప్పుడు పెద్దమనుష్యులు చూచి హర్షించి వూరుకోవడంచేతనే కాదా ప్రతివాడున్ను విచ్చలవిడిగా భార్యలను వదిలిపెట్టి ముండలను వుంచుకుంటూ వున్నారు ?

బుచ్చి—యెవళ్ళూ వుంచుకోనక్కరలేకపోతే లోకంలో భోగం వాళ్లను బ్రహ్మదేవుడు యెందుకు పుట్టించినాడు? అందరూ వ్యభిచారం మానితే వాళ్లగతి యేమి కావలసివుంటుంది ? యిప్పుడు సంసారులే

భోగంవాళ్లకంటె యెక్కువగా జారత్వం చేస్తూవున్నారు. వాళ్ళను యెవరు యేమంటూ వున్నారు? ఆడవాళ్లనే యేమీ చెయ్యలేకుండా వూరుకుంటూ వుండగా మగవాళ్లను ఆజ్ఞపెడితే సాగుతుందా?

వీర—ఆడవాళ్ళు వ్యభిచరిస్తేమాత్రము చూస్తూ యెవరు వూరుకోమన్నారు? ఆలాటివాళ్ళను నలుగురిని యింట్లోనుంచి వెళ్ళ కొడితే తక్కినవాళ్ళకు బుద్ధి వచ్చి తిన్నగా వుంటారు. మనమతంలో ఆలాగంటిపని లేకపోవడంచేతనే ప్రతీఆడదీ స్వేచ్ఛగా తిరుగుతూ వున్నది.

బుచ్చి— ఆడవాళ్ళుచేసేదిరహస్య కృత్యం.అది పబ్లికులోకి తీసుకొనివస్తేసంసారాలు కూలి పోవా? మన మాలాగంటిపనులలోకి దిగితే పాపం వస్తుంది.

వీర—పోనీ బహిరంగంగా తిరిగే మగవాళ్ళమాట ముందు ఆలోచించరాదా? వకణ్ణి యిద్దరిని కులంలో వెలివేస్తే తక్కినవాళ్ళందరూ వక్కదెబ్బను భోగంవాళ్లను విడిచిపెడుతారు.

బుచ్చి—మగవాళ్ళకు తప్పితంలేదు.అయినాకానీ నేను మీతో బాగా వాదించలేను. వచ్చేవారం మావాళ్ళందరినీ తీసుకొనివస్తాను. అప్పుడు భోగంవాళ్లను వుంచుకోవడం మంచిదా కాదా అని వాదం చేతాము. ఎవరు గెల్చేదీ మీాకప్పుడు విశదం అవుతుంది. ఇప్పుడు చీకటి పడుతూవున్నది. ఈపాటి యింటికివెళుదాము. సభ మర్తబుచెయ్యండి.

(అందఱును వెళ్ళుచున్నారు.)

౨. ప్రవేశము—నృసింహారావు పంతులుగారి కచేరీసావిడి.

[గతవారము వచ్చినవారును వెంకన్నగారు మొదలయిన మతికొందఱును ప్రవేశించుచున్నారు]

నృసి—ఏమండీ బుచ్చిరాజుగారూ! మీరు కిందటిసారి మీ స్నేహితులనందరినీ వాదించడముకు తీసుకునివస్తామన్నారు. యిప్పు డందరూ వచ్చినారా?

బుచ్చి—తొందరపని వుండడంచేత వారెవరూ వచ్చినారు కారు. గంగాధరశాస్త్రుల్లుగారు భోజనం చెయ్యడంతోనే రహస్యస్థల మునకు శయనింప బోయినారట. నాగభూషణరావుగారును రామసో మయాజులుగారును తామిటువంటిసభలకు రామన్నారు. సుబ్బయ్య సోమయాజిగారు వెయ్యిమందిచేరి వెయ్యిసభలు చేసుకొన్నా తమ కేమీ లక్ష్యములేదన్నారు. ఒక వెంకన్నగారుమాత్రము వచ్చినారు.

వెంక—బోగందాన్ని వుంచుకోవడంవల్ల యేమిదోషంవున్నదో ముందుగా నాకు చెప్పండి.

వీర—బోగందాన్ని వుంచుకోవడంవల్ల అన్నీ దోషాలే. చిన్న ప్పటినుంచీ తల్లిదండ్రులు పెంచినదేహం పాడవుతుంది; పెద్దలుచెప్పిన ధర్మము లన్నీ నేలపా లవుతవి; పూర్వులు సంపాదించిపెట్టిన ధనమం తాపోతుంది; మంచివారు మనను విడిచిపెట్టగా దుర్మార్గులతో సహ వాసమబ్బుతుంది; భార్యలును బిడ్డలును దుఃఖిస్తారు; యోగ్యులు నిం దిస్తారు; నరకము మనకోసము యెదురుచూస్తూ వుంటుంది; జూదము, పానము, అసత్యము మొదలయిన దుష్కార్యముల కన్నిటికిని లోబడ వలసి వస్తుంది.

వెంక—యివన్నీ విచారిస్తే లోకంలో మనము సుఖపడేది యెట్లాగు?

వీర—వేశ్యాసంభోగంవల్ల మీరేమో సుఖపడుతూవున్నామని భ్రమపడుతూవున్నారు. మీరనుభవించేదల్లా దుఃఖమేకాని సుఖమెంతమాత్రమూ కాదు. తాగి కిందపడి దొర్లుతూవున్నప్పుడు సుఖముగానే కనపడినను తరువాత దేహము నొప్పిచేసి దుఃఖ మని తెలిసేలాగుననే జారత్వం చేసేవాళ్ళకున్ను ప్రస్తుతకాలంలో యెట్లావున్నా తరువాత వయసుచెల్లి బాధపడేటప్పుడు మొదట పడ్డదంతా దుఃఖమేనన్నసంగతి తెలుస్తుంది.

వెంక—ఈలోకంలో బ్రతికేదే నాలుగుదినాలు. ముసలితనం వచ్చినదాకా బ్రతుకుతామో లేదో యెవరు చూచినారు? బ్రతికిన నాలుగురోజులూ సుఖమనుభవించి మరీచత్తాము.

వీర—ముందుసంగతి విచారించకుండా అప్పటికి తోచినట్లల్లా చెయ్యడం బుద్ధిమంతుల లక్షణం కాదు. మన మేపని చేసినా ముందు దానివలన సుఖం కలుగుతుందో లేదో చూచుకొని మరీచేస్తూవుండవలెను. అట్లాకాకపోతే అప్పుడు డబ్బువస్తుందనేసంతోషముచేత దొంగతనాలుకూడా చెయ్యవలసి వస్తుంది. రోగముకు మందువేస్తే వెగటుగావుంటుందని మానుకొని తరువాత బాధపడవలసివుంటుంది.

వెంక—మీరుచెప్పినవానివలె యిందులో యేమైన వెంటనే నష్టం కలుగుతుందా?

వీర—ఒక్కదినము సంభోగ మపేక్షించి మననరసింహముపడ్డ పాట్లు మీరు చూడలేదా? కాళ్ళుపడి ఆరునెలలు తీసుకుని చివరకు చచ్చినవాడే బ్రతికినాడు.

వెంక—అవును. ఆతడు బ్రతకడం తల్లికడుపున మళ్ళీపుట్టడం కాని మరివకటికాదు. అతని తల్లికడుపుచల్లగా నూరురూపాయలు పుచ్చుకొన్నా దెప్పన్నకు కుదరనిరోగమే కుదిర్చినాడు. స్థిరంగా పక్క-

దాన్ని వుంచుకొని దానితో వుంటే యీలాటివెప్పుడూ తటస్థించవు.

వీర — వక్క దానితోటే వుండేటట్టయితే వక్కభార్యతోనే వుండరాదా? వకవేళ మగవాడు ఆలాగవున్నా డబ్బుకోసం అంగహీనునికైనా తన శరీరాన్ని అమ్మడానికి సిద్ధముగావుండి మాయలూ మంత్రములూ పన్ని బహుకుటుంబములను కూల్చద్రోయుటకయి భూమిమీద అవతరించిన భోగంది వకడితో వుంటుందా?

వెంక — మీరు భోగంవాళ్లను మహాదూషిస్తూ వున్నారు. ఎవ్వరూ వుంచుకోకపోతే భూమిలో భోగంకులం వుంటుందా?

వీర — వుండకపోతే ఏమినష్టం? వాళ్లు లేకపోతే మన మంతా సుఖపడుతాము. వ్యభిచారమునిమిత్తమై ప్రత్యేకంగా వకజాతిలేకుండా చేయుటకయి మన మంతా త్రికరణశుద్ధిగా యీశ్వరుణ్ని ప్రార్థించవలెను.

వెంక — మీరు మొట్టమొదటికే భోగంవాళ్లకులానికి పేటన పెడుతూ వున్నారా? వాళ్లు లేకపోతే సంగీతం యేలాగువృద్ధిఅవుతుంది? దేవుడిఉత్సవాలలోను పెళ్ళిళ్లలోను ఆడేవారు యెవరు వుంటారు?

వీర — కావలిస్తే మగవాళ్లచేత పాడించరాదా? సంగీతం డబ్బుకు పడుచుకునే లంజెలపాలు కాబట్టే దానిగౌరవ మంతా పోయింది. వాళ్ళు పాడేబూతుకూతలకంటే హరికీర్తనలు పాడిస్తే బాగా వుండదా? దేవుడిదగ్గర—

వెంక — ఆహాహా! హరికీర్తనలు పాడిస్తే వివాహాలు యెఖ బాగానే శోభిస్తవి. యెఖ తాంబూలాలకు పిలిచినపెద్దమనుష్యులు బాగానే వస్తారు.

వీర — యేమి? ఆలా నవ్వుతా రేమి? పతివ్రతాధర్మము చెప్పవలసినవివాహములలో లంజలచేత బూతుపాటలు పాడిస్తేనేకాని

భగవద్విషయమైనగానము చేయిస్తే బాగా వుండదా?

వెంక — ముగవాళ్ళుపాడితే సంగీతము యేమిశోభగానైనా వుంటుంది. వ్యభిచారానికంటే మీ రేమైనా దోషం వుంటుందని చెపితే కొంచెం బాగావుంటుందిగాని పాటపాడించడంకూడా కూడదంటే నలుగురూ నవ్వుతారు. బోగంవాళ్ళు పాడితే యేమినష్టం వుంటుంది?

వీర — మీ కిప్పు డాలాగే కనపడుతుంది. చిన్నప్పటినుంచీ వుగ్గుపాలతో పురుషులను తమవలలో పడవేసేవుపాయాలే నేర్చుకుని మాయచేసి చేతిడబ్బెల్లను దోచుకొని పరులను పాడుచేయుటకే ప్రతిజ్ఞ పట్టి కంకణముకట్టుకొని కూర్చున్న వెలయాండ్రవల్ల నష్టంకలుగుతుందా అని వేరే అడగనక్కర లేదు. నిజానికి వాళ్లు ఆడడం గాదు; తమ అభినయముచేతను దీపముచెలుతురున తళుక్కు మను మోహినీవేషము చేతను లోబఱచుకొని వాళ్లే చూడవచ్చినవారిని తమ చూపులచేత ఆడిస్తారు. అలా చూడవచ్చినప్పుడే మోసపోయి చెడిపోయినవా రెంత మంది వున్నారుకారు? వాళ్లు వ్యభిచరించేవాళ్లు కాకపోతే పాటవల్ల నష్టం లేదు. స్త్రీలే కావలెనంటే సంసారస్త్రీలచేత మంచిగానము చేయించరాదా?

వెంక — వాళ్ళసంగీతం విన్నవా ళ్ళంతా చెడిపోతారా?

వీర — అంతా చెడిపోకపోయినా చాలామంది చెడిపోతారు. సంసారము త్యజించి అడవులలో కందమూలాదులు తినేఋషులు సహితము స్త్రీలవలలోపడి వారికి దాసు లయి తిరుగుతూవుండేవారని చెప్పుతూవుండగా పప్పూ పులుసూ తిని సంసారములో పడి కొట్టు కుంటూవుండే యితరులకు కామము జయించడానికి శక్య మవుతుందా? ఎంతమంచివాడికైనా మొదట చెడ్డదిగా తోచినప్పటికీ పదిసారులు

వెళ్ళి వరుసగా భోగంవాళ్లను చూస్తూ వుండడంచేత మనసు చలించి రాగా రాగా మంచిదా చెడ్డదా అనే సందేహము కలుగుతుంది. తరువాత మంచిదనే తోస్తుంది. అటుతరువాత సరిగా ఆపనిలో ప్రవేశించుటకే బుద్ధి పుడుతుంది. అప్పుడు మనసు కొంచెం బాధించినా, వారు చెయ్యలేదా వీరు చెయ్యలేదా అని దృష్టాంతములు తెచ్చుకొని సమాధానపరుచుకొని మొదట ఆవృత్తిలో ప్రవేశించినతరువాత క్రమ క్రమముగా భోగంవాళ్లకు యింటిబంటులే అవుతారు. ఏమండీ! లక్ష్మీనరసింహముగారూ! నేను చెప్పినది నిజమా? అబద్ధమా?

లక్ష్మీ—మీరు చెప్పిం దంతా వాస్తవము. నాకు చిన్నతన మయినా స్వల్పానుభవంలోనే యిలా చెడిపోయినవాళ్ళను వందమందిని చూచినాను. శుభకార్యములలోకూడా భోగంవాళ్లచేత పాడించడం ఆడించడం బొత్తిగా మానివెయ్యవలెను. అటువంటిసమయములలో మనబంధువులలోనిస్త్రీలే పాటలు పాడితే యెంతబాగా వుంటుంది? ఈభోగంవాళ్లను వుంచుకునేవాళ్లను వకరిని చూచి వకరు పాడవుతూ వున్నారు. మన మందరమూ చేరి వీళ్ళల్లో కొందరిని కులంలోనుంచి వెలివేస్తే అందరూ బాగుపడుతారు. కుంటివాడికీ గుడ్డివాడికీవకడబ్బు యివ్వనివాళ్ళుసమేతం యెంతమంది నెలకు యిరవయ్యేసిరూపాయ లిచ్చి భోగంవాళ్లకు చదువుచెప్పిస్తూవున్నారో చూడండి. యేమండీ బుచ్చిరాజుగారూ! మీ రీవేళ మౌనము ధరించినారు!

బుచ్చి—గుడ్లు వచ్చి పిల్లను వెక్కిరించినట్టు నేటికాలానికి మీ రందరూ యింగ్లీషు చదువుకొని మమ్ము వేళాకోళం చెయ్యడం ఆరంభించినారు. చెయ్యండి. కలియుగం అయిదువేలసంవత్సరాలు కావచ్చినది. ఇక వర్ణసంకర మవుతుంది. మీవంటిమహానుభావులు యిలాలు చేరినతరువాత యెన్నివింత లయినా పుడతవి.

వెంక — దేవతలకాలంనుంచీ వున్నబోగంవాళ్ళనే మీరు వద్దంటూ వున్నారు. యిఖ మీతో మాట్లాడవలసినది లేదు. మీ మనస్సు వచ్చినట్టు చెయ్యండి, చీకటిపడుతూ వున్నది. వెళ్ళిపోదాము లెండి.

(అందఱు వెళ్ళు చున్నారు.)

---

3. ప్రదేశము— నృసింహారావు పంతులుగారి సావిడి.

[నృసింహారావు పంతులుగారు కూరుచుండియుండఁగా వెంకన్నగారు ప్రవేశించుచున్నారు.]

నృసిం—ఏమండీ వెంకన్నగారూ! యీరోజున వుదయాన్నే యీలాగు దయచేసినారు!

వెంక—కొంచెం కోర్టువ్యవహారం వుండగా మీకు వకాల్తునామా యివ్వవలెనని వచ్చినాను.

నృసిం—ఆవ్యవహారస్వభావం యేమిటి?

వెంక — నాతమ్ముడి భార్యా మనోవర్తికి నామీద వ్యాజ్యం వేసినది. అది నాతమ్ముడిభార్యాకాదని అయినా వాదించవలెను. లేదా నాతమ్ముడూ నేనూ విభక్తులముగనుక నేను మనోవర్తి యివ్వవలసిన జరూరులేదనైనా వాదించవలెను.

నృసిం—మీరు మళ్ళీపండితులు ఈలా అబద్ధ మాడవచ్చునటయ్యా?

వెంక—"వారిజాక్షులందు వైవాహికము లందు। ప్రాణవిత్తమాన భంగమందు। చకితగోకులాగ్రజన్మరక్షణమందు। బొంకవచ్చునఘము పొందదధిప!" అని శాస్త్రం వున్నది. ఇది స్త్రీలవిషయం గనుక అబద్ధం ఆడవచ్చును; అంతేకాకుండా యిందులో విత్తభంగం

కూడా కలుగుతుందిగనుక అసత్యం పలుకవచ్చును. ఇందులో యింకొక ధర్మసూక్ష్మంకూడా వున్నది. నేను బ్రాహ్మణ్ని. అగ్రజన్మరక్షణమందు కూడా బొంకవచ్చునని యున్నది. యీమూడువిధములచేతనూ యిందులో వెయ్యిఅబద్ధా లాడినా పుణ్యం వస్తుందిగాని పాపం యెంతమాత్రమూరాదు.

నృసిం—మీామఅదలు యెన్నేళ్లది ?

వెంక—దానికి పదహారేళ్ళు వుంటవి. మీారు వయస్సు అడిగితే జ్ఞాపకం వచ్చినది. అది వ్యభిచరించి చెడి తిరుగుతూ వున్నదిగనుక మనోవృత్తి యివ్వవలసిన పని లేదని వాదిస్తే బాగావుంటుందా ?

నృసిం—వెంకన్నగారూ ! మీారు శాస్త్రం చదువుకొన్నందుకు వూరికేపోయిందికాదు. మీారు అసమానములైన వూహలు వూహిస్తూవున్నారే.

వెంక—ఇందులో నేను చేసిన వూహయేమున్నది! నేను చెప్పినదంతా శాస్త్రం, శిష్టులకందరికీ పురాణాలు పరమప్రమాణాలు. యిప్పటివాళ్ళు యింగ్లీషు చదువుకొని నాస్తికులయి పురాణములు ప్రమాణములు కావంటారు. వీళ్ళముఖం చూస్తే పాపం వస్తుంది. నిన్నటిసభలో చూచినారుకారా ?

నృసిం—నిన్నటిమీాటింగులో యేమిఅక్రమం జరిగింది ?

వెంక—అంతా అక్రమమే అక్రమంగాక కొంతక్రమం యేడిసిందాయేమిటి ? మీారు యింగ్లీషురానివారుగనుక మనవిచేస్తూవున్నాను. కృతయుగంనాటినుంచీ వస్తూవున్న సదాచారం యిప్పుడు మానవలెనట ! పూర్వము పురూరవుడు ఊర్వశిని వుంచుకోలేదూ ! మనుష్యులమాటయేమిటి ? దేవతలందరూ రంభ మేనక మొదలయినవాళ్ళను వుంచుకోలేదా ? యజ్ఞాలు మొదలయిన పుణ్యకార్యాలు

చేసి స్వర్గానికి వెళ్ళినా అక్కడా రంభా మొదలయిన దేవవేశ్యలతో సంభోగమేనా మరియేమైనా వున్నదా? యేమీ తెలియక నాలుగు యెంగిలి యింగిలీషుముక్కలు చదువుకోవడంతోటే వా ళ్లెరుగక పూర్వాచారాన్ని పెద్దలినీ దూషిస్తారు.

నృసిం—పూర్వాచారం మంచిదో కాదో ఆలోచించనక్కర లేదండీ!

వెంక—మీకుకూడా యిటువంటిబుద్ధే పుట్టిందండీ! ఇది కలి యుగం యెవ్వరేమిచేస్తారు? యిఖశాస్త్రిలు చేసిన పూర్వపువాళ్లంతా వట్టిబుద్ధిహీనులు! అనాదిగా జరుగుతూవున్న ఆచారాన్ని మాన్పడా నికి నాలుగువచ్చీరాని యింగిలీషు ముక్కలు చదువుకోవడంతోటే మనముమహాబుద్ధిమంతులము! ‹‹యధారాజాతధాప్రిజా''అన్నాడండి. గోవుమాసం తినేవారు ప్రభుత్వానికి వచ్చినతరువాత యిఖ యెలా అవుతుందండీ? ఇప్పుడు బొత్తిగా సిఖులుపోయినవికదాండి? సహగ మనం చెయ్యనియ్యరు గదాండి? అమ్మవారని ఆలోచించకుండా గోదావరిని కట్టివేసినారుగదాండి? దేవతులనే యీలా చేసే వాళ్లకు మనుష్యులంటే లక్ష్యమే లేదు. బ్రాహ్మణుల మాన్యాలకు పన్నులు కట్టినారు. ‹‹కలౌ పంచ సహస్రాణి జాయతే వర్ణసంకరః'' అన్నమాట నిజం అయినది. అందరికంటే బ్రాహ్మణులయెక్కు వేమంటారు; గుళ్లో దేవుళ్ళను రాళ్లంటారు; దయ్యాలు లేవంటారు. పురాణాలలో చెప్పిన కల్లుసముద్రాలూ నేతిసముద్రాలూ అబద్ధ మంటారు; సూర్యుడూ చంద్రుడూ అచేతనములంటారు; వాటికి పెళ్ళాలూ బిడ్డలూ వుండ రంటారు; నదులలో స్నానంచేస్తే పాపాలు పోవంటారు; వకటేమిటి? యింగ్లీషుచదువుకున్నవాళ్లకు సర్వం నాస్తి. అటువంటి నాస్తికులను పట్టుకొని శిక్షించేవారు లేరు. పూర్వంవలె ధాతిగానుగులలో పెట్టి

ఆడించేరాజు లుంటే వీళ్ళు యిట్లా అంటారండీ?

నృసిం—పురాణాలలో చెప్పినసంగతులన్నీ నిజమేనండీ?

వెంక—నిజంగాక యీమంత్రాలూతంత్రాలూ అబద్ధమనుకు న్నారాయేమిటి? అన్నీ నిజం. ఇంగ్లీషువారు వూరికే ధనం పాడుచేస్తూ వున్నారుగాని యీకాలవలు తవ్వించడం మానివేసి బ్రాహ్మణులకు డబ్బిచ్చి వరుణమంత్రాలు చదివించి సహస్రఘటాభిషేకాలు చేయించ మనండి. వర్షాలు యెలాకురుసి పంటలు పండుతవో చూతాము. ఈ సేనలన్నిటినీ తీసివేసి బ్రాహ్మలచేత మహామంత్రాలు జపంచేయిస్తే శత్రువులంతా వక్కదెబ్బలో నశించిపోరండీ? భూకంపాలు మొదల యినవి వస్తే తక్కినపనులన్నీ మానివేసి గ్రహశాంతులు చేయ్య వలెను.

నృసిం—గవర్నమెంటువారు వట్టి పిచ్చివాళ్లుగాని మీవంటి పెద్దలఆలోచన పుచ్చుకోవలసినది.

వెంక—నాఆలోచన పుచ్చుకుంటేనా, యింతమంది దేవుళ్ళు వుండరనే యీనాస్తికు లందరినీ వక్కసారి జయిలులో పడవేయిస్తును. ఇప్పటివాళ్లకు గురుశుశ్రూష బొత్తిగా లేదు. నేను మాగురువుగారి వద్ద చదువుకొనేటప్పుడు దొడ్డి తవ్వి సంవత్సరానికి కావలసినకూరలు పండించేవాడిని; యిద్దరుకూలివాళ్లు మొయ్యలేనిమూటలను పొలంలో నుంచి పట్టుకొనివచ్చి యింటికాడ వప్పగించేవాణ్ని; మఱ్ఱిఆకులు కోసి తెచ్చి విస్తళ్ళు కుట్టేవాణ్ని; యిట్లోపనులన్నీ నేనే చేసేవాణ్ని; అయన అనుగ్రహం వచ్చి తీఱుబడిగా వున్నప్పుడు రెండుముక్కలు చెప్పేవాడు; వొక్కొక్కనాడు అదీ లేదు. అలా కష్టపడి యిరవయి యేళ్ళు వ్యాకరణం చదువుకొన్నాను. అలా కష్టపడడంచేత మావిద్యలు ఫలిస్తవిగాని యిప్పటివాళ్లచదువులు ఫలిస్తవండీ? యింగ్లీషు చదువు

కొన్నవాళ్ళు వట్టి దురాచారులు; నదిలో బురదనీళ్లని నూతినీళ్లల్లో మునుగుతారు; స్నానము చెయ్యడం వంటిశుభ్రింకోసమట! వట్టి దుర్వినీతులు గుడ్డివాళ్లకూ కుంటివాళ్లకూ దానంచేస్తే పుణ్యం వస్తుందట! ప్రాచీనసదాచారములను దూషిస్తారు; యీ బోగంవాళ్లను వుంచుకోవడం యెంతకాలంనుంచి వస్తూవున్నసదాచారము? మీరు కూడా యిందులో ప్రవేశించడం బాగావున్నది కాదు. వీరభద్రుడు మొదలయినవారు వట్టి దుర్వాదములో దిగుతారు; తదనుగుణంగా శ్రుతుల కపార్థాలు చేస్తారు; స్మృతులకు తమ యిష్టానుసారముగా అర్థం చేస్తారు; శ్రుతిస్మృతులలో వ్యభిచారం కూడదంటే దానికి బోగంవాళ్లనుకూడా వుంచుకోరాదని అర్థమట; అట్టివారు కలి పురుషులు. యీ నవనాగరికులమాటలు నమ్మి మోసపోయి యీ సదాచారములను మీరు మాన్పపూనుకుంటే నిందలపాలయిపోతారు. ఇలా చెడిపోతారంటే వాళ్ళు మావంటిసాధువులను నిందిస్తారు. మీరిందులో ప్రవేశించవద్దు. మీ శ్రేయస్సు కోరి చెప్పినాను. బాగా ఆలోచించుకోండి. నావ్యాజ్యంలో వకాల్తునామామాట యేమి చేసినారు?

నృసిం—నేను మీవ్యాజ్యంలో వకాల్తునామా పుచ్చుకోను. మరివకప్లీడరు కియ్యండి. నేను అబద్ధపువాదం చెయ్యను.

వెంక—యీమాట మొదటనే చెపితే యిదివఱకే వెళ్లిపోదునే. బ్రాహ్మణకార్యం ఫీజు లేకుండా చేస్తారేమోనని ఆశపడి వచ్చినాను.

(అని కోపముతో వెళ్ళిపోవుచున్నాడు.)

# తృ తీ యాం క ము.

౧. ప్రివేశము—నృసింహారావుపంతులుగారి సావిడి.

[నృసింహారావుపంతులుగారును, సుబ్బారావుపంతులుగారును ప్రివేశించుచున్నారు.]

నృసిం—సుబ్బారావుగారూ! ఒకచిత్రిము జరిగింది విన్నారా

సుబ్బా—ఏమిచిత్రిము?

నృసిం—నెలదినములనుంచి మనబాపిరాజుగారు నెలకు యిరవై రూపాయలుజీతం చేసి భోగందాన్ని వుంచినారట!

సుబ్బా—ఆఁ! ఇది మహాఆశ్చర్యంగా వున్నదే! నిజంగానే ఆయన భోగందాన్ని వుంచుకొన్నారా? ఊరికే మీరు వేళాకోళాని కన్నారా?

నృసిం—వేళాకోళానికి కాదు. నిజమే చెప్తూవున్నాను. నేనున్ను నిన్నరాత్రి విని మొట్టమొదట నమ్మలేదు. తరువాత వాకబు చేస్తే నిజమని రూఢిగా తెలిసింది.

సుబ్బా—ఆయన యెప్పుడూ పరస్త్రీలవంక మొగం యెత్తి ఐనా చూచేవాడు కాడే.

నృసిం—అవును. ఆయన అలాటివాడే. మొట్టమొదట నేను పనికి సిఫారసు చెయ్యడానికి సబుజడ్జీగారియింటికి తీసుకునివెళతానంటే అక్కడ యెప్పుడూ భోగంవాళ్ళు వుంటారని వకపట్టాన వచ్చినాడు కాడు. తరువాత మెడలువిరిచి వకరోజు బలవంతముగా తీసుకు వెళ్ళినాను.

సుబ్బా—అప్పుడేమి జరిగింది?

నృసిం—సావిట్లో భోగంవాళ్ళు కూర్చున్నపక్కకు దూరంగా

వకమూలను కూర్చున్నాడు. వాళ్ళు పాడుతూవున్నంతసేపూ వాళ్ల మొగంవంకనైనా చూడక తలవంచుకొని కూరుచున్నాఁడు.

సుబ్బా — తరువాత రోజూ ఆయనదర్శనానికి వెళుతూ వచ్చేవారా?

నృసిం—వీధిలో నిలుచుని కనుక్కుని భోగంవాళ్ళు లోపల లేరని కబురు తెలిసినతరువాత మరీ లోపలికి వెళ్లేవారు. ఆయన వెళ్ళిన తరువాత భోగంవాళ్లు వస్తే మధ్య లేచిపోతే బాగుండదని విధిలేక ముళ్లల్లో కూర్చున్నట్టు కూర్చుండేవాడు.

సుబ్బా—అటువంటివాడు ముండను యేలాగు వుంచుకున్నాడండీ? ఇది మహాఆశ్చర్యంగా వున్నది.

నృసిం—చెపుతానువినండి. యివతలకు వచ్చినతరువాత అక్కడభోగంవాళ్ళు వుంటారని వెళ్లడానికి సిగ్గవుతూవున్నదని నాతో వూరికే చెపుతూవుండేవాడు. ఇలాకొన్నాళ్ళు జరిగినతరువాత పాట వింటేయేమని తలయెత్తకనే మెల్లిగా చెవివొగ్గి పాట విన మొదలుపెట్టినాడు. తరువాత కొంచెందగ్గిరగా కూర్చుంటేనేకాని పాట తిన్నగా వినపడదని కొంచెంకొంచెంగా యివతలకు జరగడం ఆరంభించినాడు.

సుబ్బా—పాటమాత్రము వింటూవుంటే యిబ్బంది లేదు. మనంమాత్రం తాంబూలానికి వెళ్ళినప్పుడు వినడం లేదా?

నృసిం—అలాకొన్నాళ్లు జరిగినతరువాత మొగంవంక చూస్తే యేమని యెవరూచూడనప్పుడు నేత్రాభినయం చూడడానికి వాళ్ల మొగంవంకచూస్తూ యెవరయినా చూచినప్పుడు చూపుమళ్ళించుకుంటూ వుండేవాఁడు. ఈప్రకారం కొన్నాళ్ళు జరిగినతరువాత మఱి వకరు చూస్తూవున్నా కానీ అందరూ చూడడంలేదా అని పాడేదాని అభినయం బాగాచూడ మొదలుపెట్టినాఁడు. క్రమక్రమముగా సంగీత

మందలి అభిరుచి అధికమై సబుజడ్జీగారియింటికి తరుచుగా వెళ్లడం సాగించినాడు.

సుబ్బా — చూచినారా తఱుచుగా చూస్తూవుండడంచేత యెలాగంటిమార్పు కలిగిందో !

నృసిం—అదియేమిమార్పు ? చూడగా చూడగా అభినయమందు దృష్టిలేక దానిమొగం చూడవలెననే చూడమొదలుపెట్టినాడు ; కాని ప్రథమమందు ఆలాచూడడం అన్యాయమని తోచి బుద్ధి మళ్ళించుకుంటూ వుండేవాడుగాని రాగారాగా మాటిపోయి వూరికే మొగంచూస్తే యేమిదోషం అని అందం చూచి ఆశ్చర్యపోవడముకు ఆరంభించినాడు.

సుబ్బా—అంతవఱకువచ్చినప్పుడు చెడిపోవడముకు సందేహం లేదు.

నృసిం—అలంకరించుకొనివచ్చి దీపమువెలుతురున పాడుతూ వుంటే దానిమొగం అంతకంతకు మరింత అందముగా కనుపడుతూ వుండేది. తరువాత దానిపొందు యెంతసుఖముగా వుంటుందో అని బుద్ధిపుట్టిందట. యీసంగతంతా నాతో అతను వెనుకచెప్పి తనబుద్ధి మళ్ళించుకున్నాననిన్నీ వాళ్లయింటికిమాత్రము యెప్పుడూ వెళ్లననిన్నీ చేతిలో చెయ్యి వేసినాఁడు. ఇంతలో అతనికి సబుజడ్జీగారు కోర్టులో ప్లీడరుపని వేయించినారు.

సుబ్బా—పని అయినతరువాత యేమయినది ?

నృసిం—పని అయినతరువాత సబుజడ్జీగారి అనుగ్రహంచేత డబ్బుకూడా దొరకడం ఆరంభించినది. భోగందానితో సంభోగం దోషమనితోచినా, మాటాడడంలో యేమీ దోషంలేదని ఆపాడేదానితో సరసాలాడడం ఆరంభించినాడు. ఇలాగు సరసాలెక్కువ కావడంతోటే

తక్కినవారు తెలుసుకొని కారువా పట్టించినప్పుడు దానిచేత ఆయనకు గంధం పూయించడం ఆరంభించినారు. ఆస్పర్శసుఖంవల్ల స్వర్గం దొరికినట్టు సంతోషించి వక్కమాటు యెలాగైనా దానిపొందు పడయవలెనని రాత్రి దానియింటికి సగందూరం వెళ్ళి పాప మని తోచి మళ్ళీ వచ్చినాడని ఆయన స్నేహితుడేనాతో చెప్పినాడు.

సుబ్బా—తరువాత యేమయింది?

నృసిం—ఇట్లా కొంతకాల మాభోగముదాని మొగము చూచినప్పుడెల్లా ఆశ పీడింపగా, పాపమని మనసుబోధించి నివారింపగా, తుదకు కామబాధకు లోబడి పాపభీతివిడిచి చొరవచేసి వకసారి దాని యింటికి వెళ్లినాడట. అటుతరువాత అతణ్ని మనసు బహువిధాల చీవాట్లు పెట్టి బాధింపగా పదిదినము లేమీతోచకుండా వుండి దాని ముఖం తఱుచుగా చూస్తూ వుండడంచేతనూ దాని మాయమాటలు పలుమాఱు వింటూవుండడంచేతనూ దానివలలోబడి నెలదినముల నుంచి దాన్ని బహిరంగంగానే వుంచుకొన్నాడట.

సుబ్బా—బాపిరాజుగారిని ఆయనబంధువులు యెవరూ కూకలు వేసినారుకారా?

నృసిం—మొట్టమొదట కొన్నాళ్ళు బంధువులకు మొగం కన పర్చకుండా తప్పించుకొని తిరుగుతూ వుండేవాడు. తరువాత కనపడి వారుచెప్పిన బుద్ధి విని మాటాడక వూరుకుండేవాడట! ఇప్పుడిప్పుడ భోగందాన్ని వుంచుకుంటే యేమిదోషం? నేను మాననని తెగించి స్పష్టంగా చెవుతూవున్నాడట.

సుబ్బా—వాళ్ళవలలో పడ్డతరువాత మళ్ళడం కష్టం. ఇక చెడిపోతాడు.

నృసిం—ఇక చెడిపోవడంయేమిటి! యిదివఱకే చెడిపోయి

నాడు. డబ్బంతా దానికి దోచిపెడుతూవున్నాడు. ఈనెల్లాళ్ళలోను రెండువేందల రూపాయలు పాడుచేసినాడు. పెళ్ళాముమెడలోవున్న పట్టెడ కొట్టి తీసుకొనిపోయి తాకట్టుపెట్టినాడు. తండ్రిగారు సంపాదించిన వెండిచెంబులజోడు నిన్నవుదయాన్ని అమ్మివేసినాడు.

సుబ్బా—ఆరంభంగనుక వళ్ళూ పయీ తెలియకుండా డబ్బు పాఅవేస్తూవున్నాడు. దానితల్లి మహాచెడ్డముండ.

నృసిం—చెడ్డముండ యేమిటి? ఇదివరకు యెందరు లక్షాధికారులను బిక్షాధికారులను చేసి ముష్టిచెంబు చేతికిచ్చి గుమ్మంవద్దకు రాకుండా తరిమివేసింది? బాపిరాజుగారు బుద్ధిమంతులూ చదువుకున్నవారూ అని సంతోషిస్తూవుంటే తుద కీప్రకారం దిగింది.

సుబ్బా—ఇక ముం దేమవుతుందో? యింతటితోనైనా బుద్ధి తెచ్చుకుని మళ్లుకోవడం వుత్తమం.

నృసిం—ఇక మళ్ళడం అబద్ధం. ఇదివఱ కీవృత్తిలో ప్రవేశించిన వారి నందరినీ చూడడం లేదా యేమిటి? వీరియొక్క వేమిటి? రెండు రోజులు పోయినతరువాత యిల్లూ వాకిలీకూడా అమ్ముకొని సమస్త పాడుపనులకూ లోబడి యిల్లూ వళ్లూ గుల్ల చేసుకుంటూ యెప్పుడో వకప్పుడు రోగాలచేత దేహం విడుస్తాడు. తరువాత పెళ్ళాము తిండి టికాణా లేకుండా ఫలానివాడిపెళ్ళాము నని ముష్టి యెత్తుకొని బ్రకుతుంది.

సుబ్బా—పోనియ్యండి. వకసారి బాపిరాజుగారిని మనయింటికి పిలిపించి మొగము వాచేటట్టుగా రహస్యంగా చివాట్లుపెట్టి మళ్లించడానికి ప్రయత్నం చేతాము. వినకపోతే అతనికర్మము మన మేమి చేస్తాము? నాకు పని వున్నది వెళ్ళి వస్తాను. (అని వెళ్ళుచున్నాడు)

౨. పరిచ్ఛేదము—పట్టణమందిరము.

[పెన్షన్డ్ మునసభగు భీమరావుపంతులుగారును, నృసింహారావుపంతులుగారును, రామసోమయాజులుగారును మఱికొందఱును ప్రవేశించుచున్నారు.]

భీమ — ఏమండీ! ఈరోజున మూడుగంటలకే సభ అని వర్తమానం పంపినా యింకా అందరూవచ్చినారుకారేమండీ? ఇంతేనా యింకా యెవరైన వచ్చేవా రున్నారా?

నృసిం— తమరు సభ చేయిస్తామంటే రానివా రెవరైనా వుంటారా? అందరూ వస్తారు. మీసభ చెయ్యడంవుద్దేశ మేమో నాకు తెలియదు.

భీమ—మీ రీమధ్య బోగంవాళ్ళవిషయంలో కాదా వూళ్లో చాలా గడబిడ చేస్తూ వచ్చినారు; ఆవిషయములో నేను మీ అందరి కంటె యెక్కువఅనుభవం గలవాడిని గనుక నాకు తోచినసంగతి చెప్ప డానికి మిమ్మలినందఱినీ పిలిపించినాను.

నృసిం—తమరు మాప్రయత్నానికి అనుకూలంగా చెప్తారా ప్రతికూలంగా చెపుతారా?

రామ—తప్పకుండా వారు మాపక్షంగానే వాదిస్తారు. వారు మీకు ప్రతికూలంగా గాకపోతే అనుకూలంగా చెపుతారా? లోకానుభవం గలవా రందరూ మాపక్షంగానే మాటాడుతారు.

భీమ — నేను యేపక్షంగా మాట్లాడేదీ అందరూ వచ్చిన తరువాతగాని చెప్పను. ఈలోగా మరివకసంగతి యేదైనా మాటాడు కొందాము.

రామ—మీరు పింఛన్పుచ్చుకొని అప్పుడే రెండేళ్లుకావచ్చినది కాబోలును. మీరు మునసఫీ మహాబాగా చేశారు.

భీమ— ఈ జనవరితో రెండేళ్ళమీదమూడుమాసములయినది

పనిలో వున్నప్పు డేమీా తెలిసింది గాదు. మునసఫీ చేసేకాలంలో నేను నెలకు ఫదివేలు సంపాదించేవాణ్ని. పని మానుకునేవరకు పూర్వం సంపాదించినది వక్కగుడ్డిగవ్వ లేదు. ఇప్పు డింకా నాకు రెండువేల రూపాయలరుణా లున్నవి.

రామ — ఎంతసంపాదించినాకానీ మీా రెవరినీ రొష్టుపెట్టి పుచ్చుకునేవారు కారు.

భీమ—నిర్బంధపరిస్తేనేకాని యెప్పుడూ డబ్బు యివ్వరు. ప్లీడర్లందరితోనూ స్నేహంగా వుండి వాళ్ళు యేమి అల్లరిచేసినా మాటాడేవాణ్ని కాను. అందుచేత వక్కమోస్తరుగా అంతకాలం సాగివచ్చినది.

రామ —. శివిల్ కోర్టుకు యెదుట మీాకచేరీ వుంటూవున్నా యేమీాలక్ష్యం లేకుండా అంతకాలము సాగిరావడం చూస్తే మీారు బహుజాగ్రత్తగా పనిచేసినట్టు కనపడుతుంది.

భీమ—జాగ్రత యేమిటి? నేను సాధ్యమయినంతవరకు న్యాయమయినపక్షమునసే డబ్బు పుచ్చుకుని జడ్జిమెంటు హైకోర్టుకువెళ్లినా తిరిగిపోకుండా వుండేటట్టు వ్రాసేవాణ్ని. చిల్లరగా పుచ్చుకున్నంత లాభము మరి యెందులోనూ లేదు. ఇచ్చేవాడికీ కష్టంగా వుండదు. పుచ్చుకునేవాడికీ కావలసినంతడబ్బు వస్తుంది. నేను పిటీషనువక్కంటికి రూపాయీ అర్ధా పావలా చొప్పున పుచ్చుకున్నా ఫక్తు పిటీషన్లలో రోజుకు ముప్ఫయిరూపాయలకు తక్కువలేకుండా కళ్లచూచేవాణ్ని. నేను లంచం పుచ్చుకుంటూ నని హైకోర్టుజడ్జీలకు తెలుసును. శివిల్ జడ్జీకి తెలుసును. అయినా నేను యెప్పుడూ దొరికేవాణ్ని కాను. నాలుగు, మూడు లంచం యిచ్చేవాళ్ళు ఫిర్యాదు చేసుకోరు. ఫిర్యాదు చేసుకున్నా రుజువుపర్చడం మహాకష్టం. ఎదురు ఫిర్యాదుచేసినవాడికే శిక్ష అవుతుంది.

వృసిం—అరుగో మనవారంతా వస్తూవున్నారు.

[పదిపంద్రెండుగురు పెద్దమనుష్యులు ప్రవేశించుచున్నారు.]

రామ—అందరున్నూ వచ్చినారు. వేగిరం యీమీటింగు విషయం చెప్పివెయ్యండి మళ్ళీ చీకటిపడుతుంది.

భీమ—(లేచి నిలుచుండి) నాయందు దయచేసి పెద్దమనుష్యులంతా దయచేసి వున్నారు. మీరు చేసేసభవిషయమై రెండుమాటలు మనవిచేసుకుంటాను. ఈవిషయంలో నాకు వున్నఅనుభవం మీలో యెవరికీ లేదు. నేను మునసబీ చేసేకాలంలో ఒక్కొక్కనెలలో యిరవై వేలరూపాయిలు సంపాదించానన్నా నమ్మవలెను. అంతడబ్బు సంపాదించినా యింకా సంపాదించవలెననే వుండేది. నాడబ్బంతా ముండలక్రింద ఖర్చుపెట్టేవాణ్ణి. అప్పుడు యెవరుచెప్పినా వినక భోగందాన్ని చూస్తే నాకు స్వర్గం దొరికినట్టు వుండేది. అప్పుడు వాళ్ళ మాయలోబడి లోకం తెలిసేదేకాదు. దానికి ఫలం డబ్బంతాపోయి రుణాలపాలయి వుండడమే కాకుండా రోగాలచేత వళ్ళంతా పాడు చేసుకుని యిప్పటికీ బాధపడుతూ వున్నాను. ఈబాధ చూస్తే వొక్కొక్కప్పుడు దేహంవిడిస్తే బాగావుంటుందని తోస్తుంది. నిర్దోషులయిననాకొడుకులు నాదోషంచేత వచ్చినజాడ్యాలచేత ముగ్గురు వరుసగా పోయినారు. నాభార్య బ్రతికివున్నంతకాలమూ జాడ్యాలచేత బాధపడుతూనే వుండేది. ఇప్పుడు నేను యీలోకం వదిలిపెట్టడానికి సిద్ధంగా వున్నాను. వెళ్లేటప్పుడు పాపం వొకటితప్ప వెంటవచ్చేది మరి యేదీ కనపడడం లేదు. కాస్త దేహంలో జబ్బువచ్చినప్పుడల్లా మరణం జ్ఞాపకంవచ్చి నేను పడేబాధ యింతంతని చెప్ప శక్యముగాదు. కాబట్టి మీరు నాబుద్ధి విని భోగంవాళ్ళసహవాసం మానివేస్తారని వేడ్కొలి కోరుచున్నాను. అందువల్ల మీకు ఇహపరములు రెంతూ కలవు.

నృసిం—వారు బహుబాగా చెప్పినారు. వారు పెద్దలు గనుక అందరూ ఆప్రకారం నడుచుకుంటే సర్వోత్తమముగా వుంటుంది.

రామ—మేము చేసేపని అక్రమమైనదని మాకూ తెలుసును. అయితే పడుచుతనంలో వుండడంచేతనూ అలవాటుపడడంచేతనూ వకపట్టాన మానలేకుండా వున్నాము. మీరు మీఅనుభవంచేత సమస్తకష్టములనూ తెలుసుకొని మాకు హితం చెప్పుతూ వున్నారు గనుక సాధ్యమయినంతశీఘ్రంగా మావృత్తినుంచి మళ్ళుకుంటాము.

భీమ—మీ కీబుద్ధి స్థిరంగా వుండేటట్టు చేయవలె నని నా యిష్టదైవమును నిత్యమూ ప్రార్థిస్తూ వుంటాను.

(అని సభ చాలించుచున్నారు.)

సంపూర్ణము.

# వినోదతరంగిణి

## ప్రథమాంకము.

౧. ప్రదేశము—సోమయాజులుగారియిల్లు.

[సోమయాజులుగారు ప్రవేశించుచున్నారు.]

సోమ—(తనలో) వార్ధకదశలో వివాహము చేసికొన్నవారికి పాట్లెక్కడను యీలాగుననే యుండును. "అలు కాదది వ్రాలి"న్న సామెత నాకిప్పుడనుభవమునకు వచ్చినది. అయ్యో! అంతమంది వద్దనుచుండగా వినక బుద్ధి గడ్డితిని వివాహమాడినపాపఫల మనుభవింపక తీఱునా? పెద్దభార్య పోయినతరువాత నాలుగేండ్లదాక ఎవ్వరును పిల్లనియ్యనందున పాలలోఁబడ్డ బల్లిలాగున పరితపించి, తుదకు యజ్ఞము నిమిత్తము యాచించి ఆర్జించిన సొమ్ములోనుండి మిగుల్చుకొన్న ఆరువందలరూపాయలును పిల్లదానితండ్రిమొగమున తగులబెట్టి ముందెంతో సుఖపడవలె నని కొండంత ఆశతో ఆఱుసంవత్సరములపిల్లను కట్టుకొన్నాను. క్రొత్తగా గృహప్రవేశమునకు తీసికొనివచ్చినప్పుడు నన్నును ఆచిన్నదానిని చూచి, యెఱుగనివారందఱును నాకది మనుమరాలనుకొనిరేకాని యెవ్వరును భార్యయని తెలిసికోజాలకపోయిరి. పెండ్లిఅయినదిమొదలుకొని పిల్లది యెదిగి యెప్పుడుకాపురమునకు వచ్చునా, ఆమహాభాగ్య మంతయు నేనెప్పుడు చూచుకొందునా, అని నోటిలో వ్రేలుపెట్టుకొని గుటకలు మ్రింగుచు దినమొకకల్పముగా గడుపుచు నేను త్వరపడినకొలదిని పిల్లది యీడేరుటవెనుక కేపోవుచువచ్చెను. కడపట చిన్నది పెద్దదయి యింతకాలమునకు నాతపము ఫలించెనుగదాయని సంతోషపడెడు దినములు వచ్చునప్ప

టికి దైవము నామేలును చూచి ఓర్వలేక యింటికి నాతో కాపురము చేయవచ్చెడులోపలనే దానిని నాపాలిటియమదూతనుగా మార్చివేసినాడు. అప్పటినుండియు దానికి నాపొడగనబడిన, త్రాచుపామును చూచినట్లుండును. ఈగ్రహచారమునకుతోడు నాకు చంద్రయ్యయను కపటశిష్యుడొకడుకూడ దాపురమయినాడు. వానినిచూచినప్పుడెల్ల దానికి ప్రాణము లేచివచ్చును. అత డింట నున్నంతసేపును కలకల లాడుచు నవ్వుచు ప్రేలుచు స్వర్గములో నున్నట్టుండును; ఆదుర్మార్గుని మాయింటికి రావద్దన్న ఉన్నగోడుకూడ చెడునేమోయని మానుష మునకు నిలిచి నేనెఱిగియు ఎఱుగనట్టు నటించుచున్నాను. నన్ను చూచినతోడనే దాని కేడుపుమొగముపడి యెక్కడలేని చిరాకును వచ్చి నన్ను చండాలుని జూచినట్లు చూచును. రాత్రి నాతో గది లోనున్న నాలుగుగడియలును మొగము ముడుచుకొని ప్రాణములు బిగబట్టుకొని మాటాడక యమలోకములో ఉన్నట్టుండును. వశ్యౌషధము ఇచ్చెదనని యొకవేరు చేతిలోబెట్టి మొన్నటిబైరాగివాడు నిష్కారణముగా నాలుగురూపాయలు ఎత్తుకొని పోయినాడేగాని, మంచుగుణము కొంచెమయిన అగపడి అది నాతో మొగమిచ్చి మాటాడుటయయినను లేకపోయెను! అదిగో సోమిదేవి చీపురుగట్ట పట్టుకొని చావడిలోనికి వచ్చుచున్నది.

[సోమిదేవి ప్రవేశించుచున్నది.]

సోమ—ఓసీ! ఓసీ ఒకసారి దగ్గరకు వచ్చి చెవిలో మాట చెప్పెదను విని పో.

సోమి—సరి! సరి! మీనోటికసత్తమానము "ఓసీ! ఓసీ!" అన్నమాటకు విసుగులేదు. మీకు నాతో ఏమిరహస్యము వచ్చినది? పనిగదుపోయినముండవలె మీకు రాత్రింబగళ్ళు పనిపాటలు లేక

యిల్లుపట్టుకుని వదలరు. మహారాజువలె వీధిలోకి పోయి యేదైన పని చూచుకోరాదా? మీరింటలేకపోయిన, ఇంతలో పెండ్లాము నెవ్వరును ఎత్తుకొని పాటిపోరులెండి.

సోమ—ఏమే? నీకు నాతో మాటాడుటే బంగారముగా నున్నది? నేనెంతో నీమీదిప్రేమచేత దేవతార్చనకని యింటింట దిరిగి నిత్యమును మంచిపువ్వులుతెచ్చియిచ్చినను, ప్రతిదినమును ఇంటిముంజూరు పెండెలో పెట్టుటేకాని యొక్కనాడయినను ముచ్చటదీఱ నేను చూచుచుండగా కొప్పులో ముడుచుకోవు. విలువచీర లిచ్చినను మాఱునాటికే చింపివేయుదువుకాని ఒక్కరాత్రియైనను పడకగదిలోనికి కట్టుకొనిరావు. నన్నుచూడగానే దయ్యముపట్టినదానివలె తల విరియబోసికొని చింపిరితలతో బూచివలె గనబడుదువు.

సోమి—చాలు! చాలు! ఈపాటికి నీచదువు చాలించు. నీ కెప్పుడును నన్నాడిపోసికొనుటతోనే సరిపోవును. ఆలిని ఒల్లనివానికి ఈలకూరలో ఉప్పుఎక్కువయినదఁట!—దైవమా! ఇంట నాకీపో రెప్పుడు విఱుగడచేసెదవో—

సోమ—ఓసీ! కోపపడకే. ఎవ్వరో లోపలికి వచ్చుచున్నారు. వాకిటిలో చెప్పులచప్పుడగుచున్నది. ఉత్తప్పుడు లేకపోయిన మానె గాని, ఇతరు లింటికివచ్చినప్పుడయిన, బిగ్గరగా మాటాడక నాయెడల ఇంతభక్తిచూపి పతిపూజచేయుచున్నట్టు పయికయిన నటించుచురావే.

సోమి—(మొగమున నెటికలు విఱిచి) భక్తికాదు. నీమొగమున పెద్దముద్దులు పెట్టవలెను. ఎవ్వరోవచ్చుచున్నారుగాని లేకపోయిన పక్షమున చేతిలోనున్న యీచీపురుగట్ట పుచ్చుకొని నాకసితీఱ పెద్ద పూజచేసి వదలిపెట్టుదును.

(అని లోపలికి వెళ్ళుచున్నది.)

[అవధానులు ప్రవేశించుచున్నాఁడు.]

అవ— సోమయాజులుగారూ ! లోపల మీరేమో పనిమీద ఉన్నట్టున్నారు. ఒక్కసారి నడవలోకి వచ్చెదరా ?

సోమ— వచ్చుచున్నాను. (అని వెళ్ళుచున్నాఁడు.)

అవ— సోమయాజులుగారూ ! ఈదినము ప్రొద్దున మనవీధిలో జరిగిన విపరీతము చూచినారా ?

సోమ— నాయనా ! ఏమివిపరీతము ? నే నేపాపకర్మము నెఱుగను. తెలివిమాలిన మనసోమిదేవి యేమైన—

అవ— కాదు కాదు. ఎవ్వరో పిల్లనుగని చంపివేసి రాత్రివేళ మనగుమ్మమున కెదురుగా వీధిలో పాఱవేసినారు.

సోమ— (తొందరపడి) నాయనా ! అంతచేటుకాల మెవరికి వచ్చినది ? ఎవరు—ఎవరు పాఱవేసినారు ?

అవ— మీరెఱుగరా ? (మెల్లగా) భీమారావుపంతులుగారి మఱదలేమో కని పాఱవేసినదని యిరుగుపొరుగుల అమ్మలక్కలు చెప్పుకొనుచున్నారు. వెనుక మీరేకదా ప్రతిదినము పంతులుగారు సభకు వెళ్లినతరువాత మధ్యాహ్న మక్కడికిపోయి వేదాంతము చెప్పుచు వచ్చితిరి.

సోమ— వెనుక నేనే చెప్పుచువచ్చితినిగాని, ఈవడుమ నావలె వట్టిమాటలచేతనే కాకుండా అనుభవముచేతకూడా నుపదేశించిన వేదాంతమును చెప్పగల పడుచుశాస్త్రియొకడు ప్రవేశించినందున పది నెలలనుండి నాకుద్వాసమయినది. ముండలు తిండి తిని తిన్నగా ఉండ లేక కండకావరమున కన్నుగానక యిలాగున కానిపనులు చేయుదురు.

అవ— అదియంతయు మీయుపదేశమునుబట్టియే కాని మఱి యొకందుచేతగాదు. అయినను అట్టిపనులకు లోఁబడుటలో స్త్రీలలోప

మేదియు లేదు. మూడేండ్లముండలు మగడుపోయినతరువాత, ఏదో విధమున కోరికతీర్చుకోక ఉప్పును పులుసును తిను దేహములతో ఎంత కాలము తిన్నగా ఉండగలరు ? అన్ని సౌఖ్యములను అనుభవించి అఱువదియేండ్లుదాటి సన్యస్తము తెలిసిన మీవంటిపెద్దలుసహితము పెండ్లి చేసికొని సుఖపడ గోరుచుండగా నడివయసులోనున్న బాలవిధవలు కామబాధకు లోబడుట ఆశ్చర్యమా ?

సోమ — ఆముండలసంగతి మన కెందుకుగాని, ప్రసంగము తీసికొని వచ్చినావు గనుక నీతో నే నొకరహస్యము చెప్పెదను. నే నెంత ముసలితనంలో పెండ్లియాడినను, మన సోమిదేవివంటిపతివ్రత మఱియొకతె లేదు సుమీ. అబద్ధ మాడరాదు. దాని అడకువయు, పతిభక్తియు, ఏమిచెప్పను ? మంచిగుణములన్నవి దానిని చూచి మఱియొకస్త్రీ నేర్చుకొనవలెను.

అవ — అవును. మీరు చెప్పకపోయిన, ఆమెగుణములు పొరుగున నున్నవాడను నాకు తెలియవా ? ఇప్పుడు చంద్రియ్య వచ్చి మీవద్ద వేదమును చదువుకొనుచున్నాడా ?

సోమ — చదువు మానివేసినాడుగాని; యిప్పుడుసహితము మాయింటికి దినమునకు నాలుగుపర్యాయములు వచ్చి చూచి పోక మానడు. వానికి నాయెడల పరమవిశ్వాసము, నేను లేకపోయినను ఎప్పుడును మాయిల్లు వదలడు; వా డందఱిశిష్యులవంటివాడు కాడు; పరమయోగ్యుడు.

అవ—అవునవును. అతడు చీకటికైన భయపడక రాత్రులు గూడ మనయింటివద్ద నే తఱుచుగా నుండగా జూచుచున్నాను. మొన్న రాత్రి మీరు గడియసేపు తలుపుదగ్గఱ కేకలువేసినప్పుడు లేచివచ్చి తలుపుదీసిన దతడే.

సోమ—ఒక మొన్న రాత్రియే కాదు. సోమిదేవి యింట ఒక్కతెయు ఉండలేదని నేను లేనప్పుడు రాత్రియు పగలునుకూడ దానికి సహాయముగా మాయింటనే ఉండి నేను వచ్చినతోడనే వెళ్లి పోవుచుండును. మనగ్రామములో దొంగలభయము విస్తారము గనుక, ఇంటిభద్రముకొఱకు తలుపులు వేసికొని మఱి లోపల కూరుచుందురు. ఇంతజాగ్రత్తగా నున్నను, నాలుగుదినములక్రిందట మా పడకగదిలో తాళముపెట్టెలో నున్న నూఱురూపాయలశాలువు పోయినది సుమీ. ఇల్లు తెఱచుగా వచ్చుచుండు నని వానియొద్దను గాని మాయింటిదాని యొద్దను గాని ఒక్కదుర్గుణము లేదుసుమీ! నీపాదములసాక్షి నామాట నమ్ము. ఒకరినొకరు కన్నెత్తి చూడనైన జూడరు.

అవ—ఆసంగతి అంతయు నే నెఱుగుదును. మీరు వేఱే సెల వియ్యనక్కర లేదు.

సోమ—దాని కేమిగాని మొన్నటిసంగతి యేమి చేసినావు?

అవ— మొన్నటిదినము మనమందరమును జేరి ఆలోచించి స్త్రీలతో రహస్యము చెప్పగూడ దని సిద్ధాంతము చేసికొన్ననాఁడే నే నింటికి వెళ్ళినతరువాత, మీ యందఱిమాట ప్రకారముగా భోజనము నకు లేవక మంచముమీఁద ముసుగు పెట్టుకొని పరుండి మనసులో లేని విచారమును పైకి నటించ మొదలుపెట్టితిని.

సోమ—నీభార్య భోజనమునకు లేవవలసిన దని తొందరపెట్ట లేదా?

అవ — నూరుసారులు వచ్చి పిలిచి తొందరపెట్టినది. నేను మొగము చిన్నపుచ్చుకొని యెంతసేపటికిని లేవకుండుట చూచి నా కేమో ఆపద వచ్చిన దని ఊహించి కారణమును తనతో చెప్పు మని నన్ను వేయివిధముల నిర్బంధపెట్టినది.

సోమ—నీ వేమి చెప్పినావు.

అవ—ఎంతసేపటికిని చెప్పక చాలాసేపు తంటాలుపెట్టి, నా విచారకారణమును మఱియెవ్వరితోను జెప్పవని నామీదను, బంధువుల మీదను, దేవునిమీదను లక్షప్రమాణములు చేయించి తుదకు నేను కడుపుతో నున్నానని చెవిలో రహస్యముగా చెప్పితిని.

సోమ—అంత విరుద్ధమయినసంగతి నమ్మినదా?

అవ—మాఱుమాటాడక ఒక్కనిముషములో నమ్మినది.

(తెరలో)

'నీభార్య ముండామోసినదయ్యా!' అని చెప్పినతోడనే విరుద్ధమనుకోక చదువుకొన్న సోమయాజులుగారే నమ్మి యేడువ మొదలుపెట్టినప్పుడు, చదువు లేక మూఢురాండ్రైన మనస్త్రీలు ఇంతకంటె విరుద్ధమైన సంగతిని చెప్పినను నమ్ముదురు.

సోమ—అదిగో సుబ్బారావుగారి కుమారుడు గోడచాటునుండి మన మనుకొనుచున్నమాట లన్నియు విన్నాడు.

అవ—ఇంగ్లీషుబడియందు చదువుకొనుకుఱ్ఱవాండ్రు మనవంటి వారి నెప్పుడును ఎగతాళి చేయుచుందురు. చదువు లేనప్పుడే పట్టపగ్గములులేని స్త్రీలు, చదువుకూడ ఉన్నయెడల బొత్తిగానే నెత్తెక్కి మగలను వేపుకొని తినరా?

సోమ — అదిగో! ఎవరోబంట్రోతు వచ్చి నిన్ను పిలుచుచున్నాడు.

[బంట్రోతు ప్రవేశించుచున్నాడు.]

బంట్రో—ఎవరయ్యా? అవధానులుగారా! తహశ్శీలుదారుగారు మాయింటికి వచ్చి మిమ్ము పిలుచుకుని రమ్మన్నారు. వేగిరము రండి.

అవ—సోమయాజులుగారూ! వెళ్లుదము. మీరుకూడ రండి.

(అందఱు వెళ్ళుచున్నారు.)

---

౨. ప్రదేశము—అవధానులుగారి చావిడి.

[తహశీలుదారుగారును, గుమాస్తాయును కూరుచుండి యుండఁగా, అవధానులును సోమయాజులును, బంట్రోతును ప్రవేశించుచున్నారు.]

తహ—ఏమయ్యా? అవధానులుగారూ! రాత్రి ప్రసవమయి అప్పుడే ఊరివెంబడిని పెత్తనములకు బయలు దేఱినావు?

అవ—(తొందరపడి) అయ్యా! అయ్యా! ఏమిటండి? ఏమిటండి?

తహ—(నవ్వుచు) మీకు మంత్రసాని యెవరు? రాత్రి పిల్లను గన్నందుకు, కాయముపెట్టి మిమ్ము లంకణములు కట్టలేదా? మీకు పురిటినీళ్ళెప్పుడు?

అవ—(నిశ్చేష్టితుఁడయి) అయ్యా! చిత్తము. (అని తెల్లపోయి చూచుచున్నాఁడు.)

తహ—(చిఱునవ్వునవ్వి) మీరేమో గడిచినరాత్రి శిశువును గని చంపి వీధిలో పాఱవేసినారని మాగుమాస్తాగారు సెలవిచ్చుచున్నారు. ప్రొద్దున మీగుమ్మమువద్దనున్న శిశువును మీరు బలవంతముగా చంపినారా? లేక దానంతట అదే చచ్చినదా?

అవ—(వజవజ వణఁకుచు) నేనేపాపకర్మము నెఱుఁగను. ఎవ్వరో గిట్టనివారు మాయింటికి కానిస్టేబులును ప్రొద్దున— (అని తడఁబడుచున్నాఁడు.)

తహ—నీవీలాగున వడకుచు తడబాటుబడుచుండుట చూడగా నీవు నేరముచేసినట్టే కనబడుచున్నావు.

గుమా—అవధానులుగారూ! మీకు వచ్చినభయము లేదు. నిజము ఒప్పుకోండి.

అవ — నేను కాదు. భీమారావుగారి మఱదలు—

గుమా—(చేయెత్తి యదలించి) ఈపాటి చాలించు.

సోమ—(మెల్లగా) నీపుణ్యమాయెను. ఊరకుండవయ్యా! తహాశ్శీలుదారుగారు చెడవారు. పెద్దమనుష్యులకు నిష్కారణముగా అవమానము—

తహ — అవధానులూ! ఏమో చెప్పవచ్చి ఊరుకున్నా వేమయ్యా!

అవ—అయ్యా! మ రేమియు లేదు.

తహ—ఏమియు లేకపోవుటయేమి? ఈశిశుహత్యావిషయమయి నీవెఱుగని దేమియు లేదు. తిన్నగా చెప్పకపోయినపక్షమున శిక్షయగు నుజుమీ. భీమారావుగారి మఱదలని యేమో చెప్ప మొదలుపెట్టినావు. ఆసంగతి పూర్తిగా చెప్పు.

సోమ—(చెప్పవలదని చేసైగ చేయుచున్నాఁడు.)

అవ—(కొంచె మాలోచించి) భీమారావుపంతులుగారి మఱదలు బుద్ధిమంతురాలని చెప్పబోయి తమరశ్రద్ధగా నున్నారని చెప్పక ఊరకున్నాను.

తహ—నేను నిన్ను శిశువుసంగతి అడుగుచుండగా మధ్య ఆసంగతి యెందుకు తెచ్చినావు?

గుమా—అయ్యా! ఇతడు పరమ ఛాందసుడు. ఈపని నిజముగా ఇతడుచేసినదే కాని మఱియొకటి కాదు. తనమీఁదివాదు తప్పించుకొనుటకు లేనిపోనిదేదో పన్నబోయినాడు. పురుషుల కప్పుడప్పుడు సంతానము కలుగుటకూడ కలదు—ఏమయ్యా! సోమయాజులుగారూ! మొన్న మీరు పురాణముచెప్పునప్పుడుగూడ మాంధాతకో, మఱియెవ్వరికో పుత్రుఁడుపుట్టినాడని చదువలేదా?

సోమ—అవును చదివినాను—

తహ—సోమయాజులూ! నాముందఱ ఇటువంటిపిచ్చిమాటలు చెప్పక ఊరకుండవయ్యా—ఏమయ్యా? అవధానులూ! మాటాడక మొద్దులాగున నిలువబడి యూరకున్నావు?

అవ—భీమారావుపంతులుగారి మఱదలే కనిపాఱవేసినది.—

గుమా—పెద్దమనుష్యులవిషయమై యిటువంటి కారుకూతలు కూయకు.

తహ—ఆబ్రాహ్మణుడు నిజముచెప్పబోవుచుండగా మధ్య మీా రడ్డము వచ్చెద రేమి?

గుమా—ఈబ్రాహ్మణుడు బిడ్డనుకన్నమాటే వాస్తవము.—

తహ—(కోపదృష్టితో) సరి! సరి! మీాకీప్రపంచజ్ఞానమే లేదు. నేనేమో నవ్వులాటకన్నమాటనే నిజమని నిలువదీయ జూచెద రేమి?

గుమా—మీారు విస్తారము చదువుకొని పరీక్ష లిచ్చినారన్న మాటయే కాని, ఇటువంటివిషయములలో మీాకు అనుభవము చాలదు. ఇదివరకు నాకు సర్కారులో ముప్పదినాలుగు సంవత్సరములు సార్వీ యైనది. నేను పనిలో ప్రవేశించునప్పటికి మీారొకవేళ పుట్టినారో లేదో ఏలాగునను మీాకంటె ఎక్కువ అనుభవము గలవాడను; నా మాటయందు తమరు కొంచెము విశ్వాస ముంచవలెను.

తహ—ఈసంగతిలో మీారిక మాటాడకండి. మగవానికి పిల్ల పుట్టినదన్న, ఎవ్వరైనను నవ్వుకొనిపోయెదరు.

గుమా—నామాటయందు మీాకు నమ్మకము లేనియెడల, ఈ విషయమై గ్రామములో అందఱును ఏమిచెప్పుకొనుచున్నారో యీా బంట్రోతు నడిగి చూడండి.

బంట్రో—గ్రామమున నశేషజనమును ఈబ్రాహ్మణుడే బిడ్డను కన్నాడని వింతగా చెప్పుకొనుచున్నారు మహాప్రభూ!

తహ—అవధానులూ! ఊరిలో ఇంతమంది యుండగా, ఈ యపవాదము నీమీఁదికి వచ్చిన దేమయ్యా?

అవ — మొన్న మేమందఱమును మాటాడుకొనునప్పుడు స్త్రీలతో రహస్యము చెప్పకూడదని మాలో నొకరనగా దానినిజము పరీక్షించవలెనను ఉద్దేశముతో ఎవరితోను జెప్పనని ఒట్టుపెట్టించుకొని మహారహస్యమని నేను కడుపుతోనున్నట్టు నాభార్యతో జెప్పినాను. నాపెద్దకడుపు మీకందఱకును గనబడుచునే యున్నదికదా. ఇంతకంటె నేమియు నేనెఱుగను.

తహ—ఆహా! తెలిసినది. చదువులేని మూఢస్త్రీలు నిజమయినరహస్యమును చెప్పినను దాచలేరు. నీవన్నమాటను రహస్యముగా నీభార్య యెవరితోనో చెప్పి యుండును. ఆమాట ఆనోటినుండి ఆనోటిమీఁదుగా పోయి తుదకు నీవునరిగా పిల్లనుగన్నట్టె మారినది. ఇప్పుడు మావద్దకు వచ్చినప్పటికి, ఈచచ్చినపిల్ల నీవు కన్నదేయయినది.

అవ—చిత్రము. చిత్రము.

తహ—మీరు స్త్రీలకు పునర్వివాహములు కూడ వందురు. అవి లేకపోబట్టియే కదా యిట్టిఘోరకృత్యములు నిత్యమును మన స్త్రీలలో జరుగుచున్నవి. ఎంతో శ్రోత్రియులమని చెప్పుకొనుచు, మీవంటి సోమయాజులపేళ్ళవారే యిటువంటి ఱంకుముండలచేత లక్షవత్తులవ్రతములు మొదలయినవి చేయించి సంకోచింపక హస్తోదకములు పుచ్చుకొని ముందుగా భోజనమునకు సిద్ధపడుదురు. మీవంటి ముసలివాండ్రు సహితము మూడేండ్లపిల్లలను పెండ్లి చేసికొనుచుండగా, వయసులో నున్నప్పుడు సహితము పెండ్లి చేసికొనకుండుటకు స్త్రీల గ్రహచార మేమి కాలినది?

సోమ—పూర్వజన్మమునందు చేసికొన్న పాపముచేత స్త్రీలు

విధవ లగుదురు. చేసికొన్న దెవ్వరికిని అనుభవింపక తీఱదు.

తహ—ఇట్టిస్త్రీలు పూర్వజన్మమునం దెవ్వరో, ఏమిపాపము చేయుటచేత వారి కిప్పు డీయవస్థ తటస్థించినదో మీ కేమయిన తెలియునా ?

సోమ—నాకు తెలియదు.

తహ—అది తెలియకపోయిన మానెగాని, పూర్వజన్మమున మీ రెవ్వరో, ఇప్పుడు మీకీజన్మ మెందుకు వచ్చినదో మీసంగతియైన మీకు తెలియునా ?

సోమ—అది అంతకుమునుపే తెలియదు.

తహ—ఈబాలవిధవ లందఱును పూర్వజన్మమునందు మీవంటి శుద్ధశ్రోత్రియులే అయియుందురు. సందేహము లేదు. పునర్వివాహము కూడ దని పూర్వజన్మమునందు స్త్రీలను క్షోభపెట్టిన పాపఫలము ఈ జన్మమునం దీరీతిగా అనుభవించుచున్నారు. అప్పటి పూర్వసువాసినులే యిప్పటి మీరూపములతో అవతరించి స్త్రీపునర్వివాహములు కూడ వని మీరు పూర్వజన్మమునందు తమ్ము పెట్టినబాధకై మరల కసితీర్చుకొను చున్నారు.

సోమ—తమ రీలాగున సెల వియ్యకూడదు.

తహ—ఊరకే నవ్వుల కన్నాను. ఈజన్మమున మనదోషము చేతనే స్త్రీలు దుఃఖము ననుభవించుచుండుట ప్రత్యక్షముగా గనబడు చుండగా, నీవు పూర్వజన్మపాప మనెద వేమయ్యా ?

సోమ—తమవద్ద నే నేమి మాటాడగలను ?

తహ—సోమయాజులుగారూ! మేము భీమారావుపంతులుగారి మఱదలిసంగతి విచారణ చేయవలెను. మీరు ముందుగా వెళ్ళి మేము వచ్చెడిలోగా కూరుచుండుట కయి వీధియరుగుమీద చాప

వేయించగలరా?

గుమా—(తనలో) ఈవేళ నిష్కారణముగా పెద్దమనుష్యుల కొంప మునిగినది.

సోమ—చిత్తము. (అని వెళ్ళుచున్నాఁడు.)

తహ — సోమయాజులు వ్యభిచారమువల్ల దోషము లేదని మిట్ట వేదాంతములు బోధించి, భీమారావుపంతులుగారి మఱదలివద్ద వెనుక నేమో నాలుగువందలరూపాయలసొమ్ము కాజేసినాడట!

గుమా — అవును. ఆవేదాంతమే యిప్పుడీయనభార్యకు చక్కగా అక్కఱకు వచ్చినది.

తహ—ఇప్పటికే మిక్కిలి ప్రొద్దెక్కినది. మనము వెళ్ళుదము రండి. (అందఱును వెళ్ళుచున్నారు.)

3. ప్రదేశము—సోమయాజులుగారి యిల్లు.

[సోమయాజులును, భార్యయు ప్రవేశించుచున్నారు.]

సోమ— ఏమే తలుపువద్ద ఎంతసేపు పిలిచినను పలికినావుకావు? కేకలు వేసివేసి గొంతుక బద్దలై పోయినది.

సోమి—నేను లోపల ఏమో పనిసందడిలో ఉన్నాను. మీ పిలుపు నాకు వినబడలేదు.

సోమ—తహశ్శీలుదారుగారు మనయింటికి వచ్చెద మన్నారు మే మింతకుమునుపు ఇక్కడ వేసికొని కూరుచున్న పెద్దచాపయేమైనదే?

భార్య—ఏమో యేమయినదో నా కేమి తెలియును? నాకు మీ చాప కనిపెట్టుకొని ఉండుట తప్ప వేరేపని లేదా?

సోమ—నేను తలుపువద్ద పిలుచుచున్నప్పుడు బుఱ్ఱున చాప చుట్టినట్టు చప్పుడయినందున, చాప చుట్టి లోపల పెట్టినావేమో అని

అడిగినాను.

భార్య—అన్ని చప్పుడులును మీకు వినబడును. ఆగదిలో చాప లేదు. తలుపు తీయకుండి. మీరు వీధితలుపు తీసి వెళ్లినప్పుడు, చాప యెవ రెత్తుకొనిపోయినారో! మఱి యెవరియింటికయిన వెళ్ళి యొక చాప తీసికొని రారాదా?

సోమ—(ఆగదితలుపు తీసి) అదిగో మూల చాపచుట్ట కన బడుచున్నది.

భార్య—మీకాచాప పనికిరాదు.సుబ్బారావుగారి యింటికి వెళ్ళి మంచిచాప తెచ్చుకొండి.

సోమ—(చాపచుట్ట చేతితో పట్టుకొని లాగుచు) ఏమే చాప చుట్ట యెంతలాగినను రాక బరువుగా గనబడుచున్నది.

భార్య—(అడ్డము వచ్చి చాపచుట్ట పట్టుకొని) ముసలివారయి నారు. చాపయెత్తుటకయినను మీచేతిలో సత్తువ లేదు. నాకీచాపతో పని యున్నది. మఱియొకచాప తెచ్చుకొండి.

సోమ—(పయినుండి చాపచుట్టలో తొంగిచూచి) యీచాప చుట్టలో ఎవడో కూర్చున్నాడు—ఓరిదొంగగాడిదకొడుకా! లోపల కూర్చున్నా వేమి? పైకి లేచి రారా.

భార్య—ఊరికే లేనిపోని యల్లరి చేయకుండి. నాకు కొంచెము తలనొప్పివచ్చి యీవైద్యుని పిలిపించినాను.

సోమ—ఓరి కుక్కలకొడుకా? ఏమి రాచాపచుట్టలో నుండి యింకను లేచిరావు?

వైద్యుడు—(లేచి వచ్చి) మాటలు మిగులబోకు. నీభార్యకు వైద్యము—

సోమ—లంజెకొడుకా! వైద్యమునిమిత్తము వచ్చినగాడిద

కొడుక వయినపక్షమున చాపచుట్టలో దూరవలసిన పని నీకేమివచ్చి నదిరా?

భార్య — తలనొప్పిచేత బాధపడుచుండగా ఉపకారమునకయి మం దియ్యవచ్చిన పెద్దమనుష్యుని బతిమాలుకోవలసినది పోగా నిష్కా-రణముగా తిట్టమొదలుపెట్టినారేమి? మీరనలే అనుమానపు మనుష్యులని చాపచుట్టలో—

సోమ—తాళు. ఎవరో నన్ను వీధిగుమ్మములో కేకలు వేయుచున్నారు. (వైద్యునివంక(జూచి) పెద్దమనుష్యులురాబట్టి యిప్పటికి బ్రతికిపోయినావు వెళ్ళు—వచ్చేవచ్చె. కేకలువేయకుండి. (అని చాప పట్టుకొని వీధియరుగువద్దకు పరుగెత్తుచున్నా(డు.)

[తహస్సీలుదారు మొదలగువారు ప్రవేశించుచున్నారు.]

తహ—మేము వచ్చునప్పటికి చాపలు వేయించి సిద్ధముగా ఉండుమని ముందుగానే మిమ్ము పంపినను, మేము వచ్చినతరువాతను కూడ చాప తెచ్చుట కింతయాలస్యము చేసినారేమయ్యా?

సోమ —చిత్తము. చిత్తము. లోపల మాసోమిదేవికి కొంచెము జబ్బుగానుండి వైద్యునికొఱకువెళ్ళి తీసికొనివచ్చినాను.అందు చేత కొంచె మాలస్యమయినది. క్షమించవలెను. (అని చేతిలోనిచాప చుట్ట విప్పి అరుగుమీద వేయుచున్నా(డు.)

తహ—(చాపమీ(ద కూరుచుండి) గుమాస్తాగారూ! కూరుచుండుండి. అవధానులూ! నీవుకూడ కూరుచుండు. సోమయాజులు గారూ! నిలువబడినారేమి? కూరుచుండరాదా? (అందఱును కూరుచున్నారు)

గుమా—భీమారావుపంతులుగారిని పిలుచుకొనిరాబోయిన బంట్రోతు ఇంకను రాలేదు.

తహ—వైద్యుడుగారూ! ఆలాగు తలనిండ ముసుగువేసుకొని దొంగవానివలె తలవంచుకొని పాఱిపోవుచున్నావేమయ్యా! ఒకసారి యీలాగున రండి.

వైద్య—చిత్తము. (అని వచ్చి కూరుచున్నాఁడు.)

తహ—సోమయాజులుగారియింటి కేమిపనిమీఁద వచ్చినారు?

వైద్య—కొంచెము సోమయాజులుగారితో మాటాడవలసినపనియుండగావచ్చి ఆయన యింటలేనందున వచ్చినదాఁకా కనిపెట్టుకొనియుండి మాటాడి వెళ్ళిపోవుచున్నాను.

తహ—దానికేమికాని యీవీధినిజరిగినశిశుహత్యవిషయమయి మీ కేమయిన తెలియునా?

వైద్య—నాకెంతమాత్రము తెలియదు.

సోమ—ఈయనకు తెలియని దేమియు లేదు.కడుపుదిగబడుటకీయనే మందిచ్చినాఁడు.

వైద్య—ఈయన పురాణము చెప్పుచున్నప్పుడు వెనుక నొకసారి భీమారావుపంతులుగారిమరదలకి మందియ్యవలసినదని నన్ను బహువిధముల బతిమాలుకొన్నాఁడుగాని నేను ఆపని కొప్పుకోలేదు.

[బంట్రౌతు ప్రవేశించుచున్నాఁడు.]

తహ—ఏమోయి నీవొక్కఁడవే వచ్చినావు?

బంట్రో—భీమారావుపంతులుగారు బసలో లేరు. ఆయన మఱదలిగారి కేమో పదిదినములనుండి జబ్బుగానుండి మంచముపట్టినదట!

తహ—మనమిప్పుడు వెళ్ళి భోజనముచేసి తిరిగి వత్తము. బంట్రౌతు! మధ్యాహ్నము పీరినందఱిని మాయింటివద్ద హాజరుపెట్టు.

బంట్రో—చిత్తము.మహాప్రభూ! (అందఱు వెళ్ళుచున్నారు.)

౮. పరిచ్ఛేదము—తహాశ్శీలుదారుగారి పడకగది.

[తహాశ్శీలుదారుగారును, భార్యయు ప్రవేశించుచున్నారు.]

తహ—నీవు మఱి యేమాట చెప్పినను విందునుగాని, ఈమాట మాత్రము వినను. ఇటువంటిమాట లెప్పుడును నాతో చెప్పబోకు.

భార్య—ఈవిషయములో మీరు నామాట వినక తప్పదు. భీమారావుపంతులుగారు సోమయాజులచేత నావద్దకు నూఱు కాసులను పంపినారు. వేయిరూపాయ లెంతకాలము సంపాదించిన వచ్చును? మీవద్ద పదియేనురూపాయలు జీతములోనున్న గుమాస్తా నాలుగు వేలరూపాయలు పెట్టి మేడ కట్టినాడు. ఆయనకోడలు మొన్న పెట్టుకొని వచ్చిననగలు చూచిన నా కెంతో ముచ్చటైనది. నాకు నూఱువరహాల గుల్లలైన లేవు. మీరు తెచ్చెడిజీతము బువ్వకును గుడ్డలకును సరిపోవు చున్నది. మొన్న మొన్న చిన్నయుద్యోగములలో ప్రవేశించినవా రందఱు మనసువచ్చినట్లు సంపాదించి భార్యలకును బిడ్డలకును దేహము నిండ నగలు దిగవేయుచున్నారు. మీ రింతకాలమునుండి పనిచేయు చున్నప్రయోజన మేమి? నాకు పెట్టుకొన మంచిసొమ్ము లేదు; పిల్లవానిమెడకు బంగారపుకంటెయైనను లేదు. మీకు రేపు కొంచెము కాలిలో ముల్లు గుచ్చుకొన్నయెడల, తరువాత నాబ్రతుకును పిల్లల బ్రతుకును ఏమి కావలెను?

తహ—(తనలో) అయ్యో! నే నిటువంటియక్రమమున కెట్లు లోబడుదును? ఈరాక్షసి నెట్లు సన్మార్గమునకు దింపగలుగుదును! (బిగ్గరగా) నీ వెన్ని చెప్పినను రాజకార్యవిషయములలో నీమాట వినను. మనకు ధనము శాశ్వతము కాదు: దేహములు శాశ్వతములు కావు నిత్యమయినపరలోకసుఖమును విచారించుకోవలెను.

భార్య—మీరు నామాట విననిపక్షమున, నే నీరాత్రి నూతిలో

పడి చచ్చెదను.

తహ—చావడిలోని కెవ్వరో వచ్చినారు, నీవు లోపలికి పో.

భార్య—నామాట వినకపోయిన నే నన్నంతపనిని చేసి తీఱెడి దానను జుండీ. (అని వెళ్ళుచున్నది.)

తహ — (తనలో) స్త్రీలు విద్యలేని హేతువుచేత యుక్తాయుక్తములు తెలియక పశుతుల్యురాం డ్రైనందున గదా పురుషుల కిటువంటిమనోవ్యథలు సంభవించుచున్నవి. నేను దానిమాట వినని యెడల, తప్పక చెప్పినంతపనియు జేయును. దాని నెట్లు విడిచిపెట్టి ఊరకుండగలను? ప్రత్యక్షముగా పాపకార్యమున కెట్లు ఒడిగట్టనేర్తును? నా కేమిచేయుటకును పాలుపోకున్నది. పూర్వము మానాయనగారు బ్రతికి యున్నప్పుడు సహితము లంచములు పుచ్చుకొమ్మని ఆయన యెన్నివిధముల నిర్బంధపెట్టినను లోబడక తప్పించుకొని వచ్చినాను.

[భీమారావుపంతులుగారును, గుమాస్తాగారును ప్రవేశించుచున్నారు.]

భీమా—(కాళ్ళమీఁద పడి) మీ రేలాగుననైనను రక్షించి మామానము నిలువబెట్టవలెను. ప్రస్తుతవ్యవహారములో మా కేమైన అవమానము తటస్థించినయెడల మాకుటుంబ మంతయు ఏకకాలము నందు కట్టకట్టుకొని గోదావరిలో దిగవలసినదేగాని యిక మేము ప్రజలలో తలయెత్తుకొని బ్రతుకవలసినవారము కాము.

తహ—మీరు కాళ్ళు వదలుండి. నేను మీవ్యవహారములో న్యాయము చేయుటకు సందేహము లేదు.

గుమా—అలాగున కాదు. తము రిందులో వారిని రక్షించెద మని అభయహస్త మియ్యవలెను.

తహ—మంచిది వెళ్ళిరండి.

గుమా — భీమారావుపంతులుగారూ! తహశ్శీలుదారుగారి

వాక్యము రామవాక్యము. హరిహరాదు లట్టిట్లయినను, వారినోటి నుండి వచ్చినమాటకు తిరుగు లేదు. సెలవు పుచ్చుకొని రండి.

(అందఱు వెళ్ళుచున్నారు.)

౫. ప్రదేశము—సోమయాజులుగారి యిల్లు.

[సోమయాజులును, అవధానులును ప్రవేశించుచున్నారు.]

అవ—భీమారావుపంతులుగారిమఱదలివ్యవహారములో ఏమో ఉపద్రవము వచ్చుననుకొన్నాము. తుద కేమియు లేకుండ ఇట్టే తేలిపోయినదే.

సోమ—ఇందులో మంచియిల్లాలు తహశ్శీలుదారుగారి భార్య వారిని రక్షించినది. పెద్దమనుష్యులవిషయములో మఱియొకవిధముగా జరిగించినపక్షమున నూతిలో పడెద నని ఆమె గట్టిపట్టు పట్టబట్టిగాని, లేనియెడల నిస్సందేహముగా పంతులుగారిమఱద లీపాటి కారాగృహము ప్రవేశించినదే.

అవ—ఇందులో నీ వేమో పంతులుగారి పక్షమున లంచము పట్టుకొనివెళ్ళి తహశ్శీలుదారుగారిభార్య కిచ్చినా వని గ్రామములో ప్రవాదము గలిగినది వాస్తవ మేమైన నున్నదా?

సోమ—అది నిజమే. మేమీపనిని పంతులుగారును నేనును గుమస్తాగారునుతప్ప బ్రహ్మకు తెలియకుండ మహారహస్యముగా జేసినాము. అప్పుడే అందఱికిని ఏలాగున తెలిసినదయ్యా?

అవ—(ఆశ్చర్యపడి) ఈవిధవవ్యవహారములో తహశ్శీలుదారుగారు లంచము పుచ్చుకున్నారయ్యా? ఏమి యీయాశ్చర్యము, రవ్వంత సహాయముచేసినపక్షమున పదివేలరూపాయల నిచ్చెదమన్న సిరంవారి వ్యవహారములోనే గుడ్డిగవ్వ పుచ్చుకోక వెనుక శిక్ష వేసినారే.

సోమ—అవును. అప్పుడలాగుననే చేసినారుకాని మేమిందులో గొప్పయంత్రము చేసినాము. కన్నుచెదరునట్లుగా ఒక్కసారి నూఱు కాసులు తీసికొనివెళ్ళి తహశ్శీలుదారుగారిభార్యచేతిలో పోసి, మాకు మీరుతప్ప వేఱే దిక్కులేదని రెండుకాళ్ళునుపట్టుకొన్నాము. కార్యము చేయకపోయినయెడల నూతిలోనో గోతిలోనోపడి చచ్చెదనని భార్య పట్టుపట్టి కూరుచున్నతరువాత, ఎంతమంచివాఁడును లోబడక యేమి చేయగలఁడు ?

అవ—శిక్ష కాకపోయిన మానెగాని, గ్రామములోని మన సభాపతు లందఱును పంతులుగారిని బహిష్కారము వేసెద మన్నారు. ఆసంగతి యేమైనది ?

సోమ—డబ్బుగలవారి కెప్పుడును ఏవెలుతురులును రావు. నలుగురు సభాపతులును నాలుగుపదులు పుచ్చుకొని రేపటిదినము జరుగు కాశీసంతర్పణలో భోజనములకు సిద్ధ మయినారు. రెండేండ్లక్రిందట ఎవరినో తీసికొని లేచిపోయి రెండునెల లావలనుండి మరల రాగా భీమారావుపంతులుగా రింటపెట్టుకొన్నప్పు డేమిచేసినారు ? అప్పుడు మీరందఱునుజేరి కులములో జేర్చుకొన్నారా లేదా ? ఆతరువాతనే కాదా యీయమె కాశీయాత్రవెళ్ళినది. అప్పటినుండియు సంతర్పణ జరగ లేదట ! రేపు సంతర్పణ జరిగించి, ఆమెయే బ్రాహ్మణులచేతులలో హస్తోదకము, వడ్డించునట !

అవ—మన బ్రాహ్మణ్యము బొత్తిగా చెడిపోవుచున్నది. ఇప్పు డన్నిటికిని డబ్బు ప్రధానము. ఈపాడువ్యవహారము మన కెందుకు ? వెళ్ళిపోదము లెండి.

(అని యిద్దఱును లేచి వెళ్ళుచున్నారు.)

సంపూర్ణము.

# హాస్యసంజీవని

## ప్రథమభాగము.

### ఆచారము.

[చేదస్తపు చెలమమ్మా, ఆచారపు అన్నమ్మా ప్రవేశించుచున్నారు]

చెల—అన్నమ్మతల్లీ ! యీకాలపువాళ్ళకు బొత్తిగా ఆచామన్నమాట లేదు. మరీ నాకోడలు కాపురానికి వచ్చినతరువాత యింట్లో వట్టిమాలకూడు కలుస్తూవున్నది. యిక మనవంటివాళ్ళం బ్రతకకూడదు. యేమైనాఅంటే యెదురుకెదురు నాకే చాదస్త మంటారు.

అన్న—చెలమమ్మా ! చెపితే నమ్ముతావో లేదోకాని అరవై యేళ్ళుదాటినా మాయింటిఆయన యిప్పటికి ఆచారమన్న మాట యెరగడు. నేనుమాత్రం యేలాగేలాగో కొంచెం అచారం నిలుపుకుంటూ వున్నాను. మావీధిలోనుంచి ముట్టువాళ్ళు వెళితే రెండువందలు తిట్టి మాయింట్లో కుండలన్నీ తీసి పారవేస్తాను. సగంముప్పాతికవాళ్ళు నా నోటికి వెఱచి వాళ్ళు చాకిరేవుకు అవతలవీధినుంచి చుట్టు తిరిగిపోతారు. పుప్పుమొదలుకొని సమస్తవస్తువులూ రోజూ కడిగి శుద్ధిచేస్తాను. మావారు వీధిలోనుంచి వచ్చేటప్పటికి యెదురుగుండా చెంబెడు నీళ్ళుకలుపుకునివెళ్లి మీదపోసి శుద్ధిఅయినతరువాత మరీ లోపలికి రానిస్తాను. మొన్నశీతాకాలంలో రాత్రిచలివేళ మీద పేడనీళ్ళు పోసినా నని కోపం వచ్చి నామొగుడు మూడునెలలు యింటికి రాక

లేచిపోయినాడు. పోనీపొమ్మని వూరుకున్నాను. మనకు గోమయం చేస్తేనేకాని యేదీ శుద్ధికాదుగదా ?

చెల—నీవు అదృష్టవంతురాలవుగనుక వొక్కమోస్తరుగా ఆచారం జరుపుకుంటూవున్నావు. నాకు నీలాగుజరగదు. అక్కడికీ నేను రోజుకు రెండువందలస్నానాలు చేస్తాను. యివేళమట్టుకు యిప్పటికి పదిస్నానాలు చేసినాను. తెల్లవారిలేచి దొడ్లోకివెళ్లినప్పుడు కాలికింద యేమోమెత్తగా తగిలి అదియేమిగుడ్డోఅని తలనిండా స్నానముచేసినాను. తరువాత మాకోడలు దగ్గిరనుంచి వెళ్ళినప్పుడు పైటకొంగుతగిలినట్టు అనుమానం కలిగి మళ్ళీ స్నానము చేసినాను. గోదావరికివెళ్ళి స్నానంచేసి బిందెయెత్తుకునివస్తూ బట్టలువుతుక్కునేవాళ్ళనీళ్ళు పడ్డట్టు తోచి మళ్ళీవెళ్లిమునిగినాను. తీరా వడ్డుకువచ్చేటప్పుడు నీళ్లలో కాలికేదో ఆకు తగిలి అంటతప్పేలాలు తోమేవాళ్ళు వేసినఅంటాకని నీళ్లు పారపోసి వెళ్లి మళ్ళీస్నానము చేసినాను. తరువాత బిందెత్తుకొని సఘం దూరం వచ్చేటప్పటికి యిరవైగజాలదూరములో మాలవాడు కనబడి నీళ్ళు నడివీధిలో పారపోసి వాణ్నినాలుగుతిట్టి వాడిజీవానికి వుసూరుమంటూ మళ్ళీ వెనుకకు గోదావరికి వెళ్లి స్నానముచేసి నీళ్ళు తెచ్చుకున్నాను. యింటికివచ్చినతరువాత పొయ్యిమీద యెసరుపెట్టి దాసీది తోమితెచ్చిన గరిట తోలుచుకోబోయి దానిని మసి వదలనందున నూతిదగ్గిర మళ్ళీ స్నానంచేసినాను. ఆ అంట్లతప్పేలాలలో వకటి తీసుకునివెళ్లి మాకోడలు లోపలపెట్టినందున, యింట్లోవస్తువులన్నీ తడుపుకొనేటప్పటికి జామయినది. తీరా వంటచేసుకుంటూవుండగా బల్లిమీద పడి వకమాటున్ను, శూద్రివాళ్ళమాట వినబడి వకమాటున్నూ రెండుస్నానాలు చేసినాను. యీలోగా అన్నంచిమిడిపోయింది. వేగిరం మునిగివచ్చి అన్నంతప్పేలాదింపి, ఆపొయిమీద కూరవేసి గంజివార్చు

కున్నాను. ప్రొద్దుటినుంచీ మడికట్టుకొని కూర్చున్నందున కడుపుబ్బి అవతలకు పోవలసివచ్చి ఆఖరుస్నానము చేసినాను. ఎన్నిస్నానా లయి నవో లెక్క పెట్టినావా ?

అన్న—చాలాస్నానాలు చేసినావు. నేను నీకంటె పదిరెట్లు స్నానాలు చేశాను. మాయింట్లో కుక్క వచ్చి అప్పుడప్పుడు యేమైనా ముట్టుకొనిపోతూ వుంటుంది. అప్పుడు వస్తువులన్నీ దూరముగా పారవేసి యిల్లు శుద్ధిచేసి గోమయం పూసుకొని నాలుగుస్నానాలు చేస్తాను.

చెల—నేను మును పెప్పుడయినా మా దొడ్లోకి గాడిదె వస్తే రాయి పుచ్చుకొని కొట్టి వూరకుండేదాన్ని. నీవు మొన్న చెప్పినప్పటి నుంచీ వక వేళ పరాకున మునపటిఅలవాటుచొప్పున రాయి విసిరినా వెంటనే పోయి స్నానం చేస్తాను. నీవు మునుపు రోజూ గోమయం తినే దానవు యిప్పుడు తింటూ వున్నావా ?

అన్న — పెద్దదాని నయినాను. మునపటిలాగు తినలేను. అక్కడికీ మూడుపూటలూ కలిపి వుసిరికాయంతవుండ కళ్ళుమూసుకొని మింగుతాను. గోమయం యెంత తింటే అంత పుణ్యము. గోవు అల్పాచమానం చేస్తూవుండగా వెళ్లి తోకతో నెత్తిమీాద చల్లుకొని పంచితం మూడుపుడిసిళ్ళు లోపలికి పుచ్చుకుంటే మరీ పుణ్యము. ఆలాగు విడవ కుండా ఆరునెలలు ప్రతిరోజూ పుచ్చుకుంటే బొందెతో స్వర్గం వస్తు దట. ఆలా యెవరికీ లభించదు. మొన్న నేతివారింటికి పొద్దున్నే పేడకు వెళ్లేటప్పటికి వారి వెల్లావు అల్పాచమానం చేస్తూవున్నది. పంచితం నెత్తిమీాద చల్లుకోవలె నని వెనుకకు వెళ్ళి తోక పట్టుకునే టప్పటికి మొఖంమీాద వక్కతన్ను తన్నింది. దానితో వెనక్కు పడి వక్కబొట్టయినా మీాద చల్లుకోకుండానే యింటికి వచ్చినాను.

చెల—నీవు మూడుదినాలబట్టీ మొగానికి సున్నపుపట్టు వేస్తూ వున్నావు. అందుచేతనేనా ?

అన్న—అవు నందుచేతనే. అప్పుడు నెత్తురువచ్చి గాయమైనది. తడిబట్ట కట్టుకుంటే గాయం చీంపోస్తుంది. పట్టుబట్ట కట్టుకో మని మావారు మూడురోజులబట్టీ పోరుతూ వున్నారు. రోజూ వుతికి ఆరవెయ్యకుండా పట్టుబట్ట మడికి పనికివస్తుం దేమో నీ కేమైనా తెలియునా ?

చెల—పనికివస్తుం దని పెద్దలు చెప్పుతారు. భోజనము చేసి విడిచినతరువాత దర్భాసనంలో కడితే దానికి యెన్నాళ్లయినా మయిల లేదు సుమా. మా అబ్బాయి పట్టుబట్ట నేను ఆరు నెలలకు వకపర్యాయం వుతుకుతాను. అప్పుడు దానిలోనుంచి నాలుగుకుంచాలమురికి పోయి జిడ్డు నీళ్ళల్లో తేరుతుంది.

అన్న—మడిబట్ట అంటే జ్ఞాపకం వచ్చింది. దక్షిణాదివాళ్లకు బొత్తుగా మడి లేదు. ఆదేశములో శుద్ధఅనాచారం. మొన్న మా యింటికి వక దక్షిణాదిబ్రాహ్మడు భోజనానికి వచ్చినాడు. తెల్లగా పువ్వులాగు చాకలిది వుతికితెచ్చినబట్ట కట్టుకొని వూరంతా తిరిగివచ్చి ఆబట్టతో వి స్తరిదగ్గిర కూర్చున్నాడు. యి దేమంటే తాను కట్టుకున్న తరువాత విడువలేదు, తనది మడిబట్టే అంటాడు. వాడి కేమి చేటు కాలం వచ్చిందోకాని పొద్దున్నే గోదావరివొండునీళ్ళలో ముంచి తెచ్చుకున్న నాపంచె చూచి కావలిస్తే నీది మయిలబట్ట అన్నాడు.

చెల—నీళ్లు లేకపోయినాకానీ వక్కసారి బురదలో అయినా ముంచి పిడిచి ఆరవేస్తే మడిబట్ట అవుతుంది. ఆదేశపువాళ్లకు మడంటే యేమిటో, మయిలంటే యేమిటో తెలియదు.

అన్న — వుండు, నీతో మాట్లాడుతూ పరాకున గోడమీద

చెయివేస్తే బల్లితోక కాలుల్నును చేతికి తగిలింది. అదుగో గోడమీద మాలబల్లి పాకుతూ వున్నది. నేను వెళ్ళి స్నానం చెయ్యవలెను. నాలుక యిగిరిపోతూ వున్నది. స్నానం చేస్తేనేగాని నోట్లో మంచినీళ్ల చుక్క పోసుకో వల్ల కాదు.

చెల — నీవు నన్ను తగలలేదు గదా నేనుకూడా స్నానం చెయ్యవలెను.

అన్న—నేను దూరంగానే వున్నానుకాని, అయినా యెందు కయినా మంచిది. గోదావరిలో వక్కమునక లేసి నీసం దేహం తీర్చుకుని మరీ వస్తా. (అని ఇద్దఱును వెళ్ళుచున్నారు.)

## అ పా త్ర దా న ము.

ప్రదేశము—రాజవీధి.

[వెంకటావధానులు ప్రవేశించుచున్నాఁడు.

వెంక—(తనలో) భోజనమునకు తడుముకోనక్కరలేకుండా పదిఘంటలకల్లా వాది రెండుకూరలతో వంట చేయిస్తూ వున్నాడు గదా? సాక్ష్యం యివ్వడానికయి పుచ్చుకొన్న నాలుగురూపాయిల లోనూ నక్కచిల్లిగవ్వ కర్చుపెట్టను. రాత్రి వెళ్లినమ్ముండ ప్రతిమాటు పావలాకుతక్కువ పుచ్చుకోదు. దానిదగ్గర సంకటాలువున్న వేమోనని భయంగా వున్నది. అయినాకానీ ఫర్వాలేదు. అధమం యీరాత్రికి కావలసిన నాలుగణాలయినా యీపూట యీవూళ్ళో సంపాదించవలెను. ఇవాళ సాక్ష్యం అయితే రేపుసాయంకాలానికి మావూళ్ళో కుశలంగా వుంటాను. ఆవచ్చేచిన్నవాణ్ని యీయిల్లు యెవరిదో అడుగుతాను.

[ఒక చిన్నవాఁడు పరివేశించుచున్నాఁడు.]

వెం.క—అబ్బాయీ! ఈయిల్లు యెవరిది?

చిన్న—కోర్టునాజరు రామదాసుపంతులుగారిది.

వెంక—వారి యింటిపేరు యెవరు?

చిన్న—వాడేర్వువారు.

వెంక—ఆయనతండ్రిపేరు యెవరు?

చిన్న — భీమరాజుగారు కాబోలును. నేను బజారుకు వెళ్ళ వలెను. (అని వెళ్ళుచున్నాఁడు.)

వెంక—(లోపలికి వెళ్లి) అయ్యా! రామదాసుపంతులుగారండి. నేను చదువుకొన్నబ్రాహ్మణ్ణి, తమ దర్శనంనిమిత్తం వచ్చినాను.

రామ— (లోపలినుండి వచ్చి) మీ దేవూ రయ్యా?

వెంక—మాది పడమట కృష్ణాతీరమండి, నేను జటాంతమూ వేదం అధ్యయనం చేసినానండి. మాతండ్రిగారు చయనంచేసినారు.

రామ—మీరు యీగ్రామం యెందుకు వచ్చినారు?

వెంక — కాశీయాత్రకు వెళ్లవలెనని బయలుదేరి వస్తూ వుండగా మధ్య యేలూరు దాటినతరువాత దొంగలు కొట్టి నాదగ్గిర వున్నఝారీచెంబూ నాలుగుబట్టలూ పదిరూపాయల దొక్కమూ దోచుకొనిపోయినారండి. నేను యిప్పుడు కట్టుగుడ్డలతో యీగ్రామం వచ్చినాను. చేతిలోకి చెంబు లేదండి. తమకీర్తి జగద్విఖ్యాంతమయిన దండి. మీరు దానకర్ణులు. తమరిని చూస్తే నా దరిద్రవిమోచనం అవుతుందని చంద్రుడికోసమయి చకోరపక్షులు వెతుక్కుంటూ వచ్చినట్టు నేను మావూరు బయలుదేరినప్పటినుంచీ దోవపొడుగునా మిమ్మే స్మరించుకుంటూ వచ్చినాను. తమరు బహుదొడ్డబ్రాహ్మలు.

రామ—మీరు యిప్పుడు యేమంటాను?

వెంక — చెంబుమాత్రము మీరు కొనిపెట్టవలెను. కాశీ రామేశ్వరములదాకా రామదాసుపంతులుగారు చెంబు కొనిపెట్టినా రని చెప్పుకుంటాను. తమపేరు శాశ్వతంగా వుంటుంది. అయ్యా! తమకు వాడ్రేవు భీమరాజుపంతులుగా రేమవుతారండీ?

రామ—వారు మాతండ్రిగారు.

వెంక—ఆలాచెప్పండి, భీమరాజుపంతులుగారంటే లోకప్రసిద్ధి. ఇన్ని దేశములు తిరిగినానుకాని, ఆయనవంటి దాతను నేను మరి యెక్కడా చూడలేదు. మొదటినుంచీ మీవంశమే అటువంటిది.

రామ—మాఅన్నగారు మీజిల్లాలో తహశ్శీలుదారీ చేసినారు. మీ రాయన నెరుగుదురా?

వెంక—ఏతాలూకా కండీ?

రామ—గుడివాడతాలూకాకు.

వెంక—వారి నామధేయం?

రామ—వెంకటచలంగారు.

వెంక—ఓహోహో! వాడ్రేవు వెంకటాచలంపంతులుగారు మీ అన్నగా రండీ? వారి నెరుగకపోవలెనూ! వారు నిరతాన్న ప్రదాతలు. మాజిల్లాలో అంతటా వారిపేరు వినికిడిపోసినది. ఆయనకు చదువుకొన్న బ్రాహ్మణ్ని అని నాయందు పరమభక్తి. ఆయనది కేవలం ఈశ్వరావతారం.

రామ—ఓయి బంట్రోతు వీధిలో యెవ్వరో కేకలు వేస్తూ వున్నారు చూడు.

బంట్రో—ఇద్దరుగుడ్డివాళ్లండి, ముష్టి పెట్టుమని కేకలు వేస్తూ వున్నారు.

రామ—గుడ్డిదేకోడుకులను అరవకుండా అవతలికి కొట్టు.

ఈవూరు గుడ్డివాళ్లతోను కుంటివాళ్లతోను నిండిపోయింది. తెల్లవారి లేస్తే ముష్టిముష్టి అని నిలువనివ్వకుండా వున్నారు.

బంట్రో--అందులో వకడు బహుముసలివాడండి. కప్పుకోడానికి బట్టసమేతూ లేదండి. చలిచేత వణుకుతూ వున్నాడు.

రాను — ముసలవాడూ లేదు గిసలివాడూ లేదు. వాళ్లను అవతలికి గెంటి యీరూపాయి మార్చి యీబ్రాహ్మడికి పావలా యిచ్చి తక్కిన మూడుపావలాలూ పట్టుకొని రా.

వెంక—మరివకర్రిద్రవ్యం కలియకుండా చెంబుకు కావలసినది తమరు దయచేయించవలెను. వక్కరూపాయపావలాఅయితే సరిపోతుంది.

రాను — ఏమిటో మాకుతోచింది మేమిచ్చినాము. తక్కినది మరివకచోట యాచించండి.

వెంక--"యాచ్నా మోఘా వరమధిగుణేనాఽధమే లబ్ధకామా" అన్నాడండి. లేదనిపించుకొన్నా నేను తమవంటి పుణ్యపురుషులను యాచిస్తానుగాని లక్షవచ్చినా నీచులను యాచించనండి. తమరైతే గొప్పధర్మాత్ములే. మీసొమ్ము నాకింతే ప్రాప్తమున్నది.

రాను—ఈబ్రాహ్మడి కింకో రెండణాలుకూడా యియ్యి.

బంట్రో—చిత్తము. (ఇద్దఱును వెళ్ళుచున్నారు.)

వెంక— (వీధిలో) ఈగచ్చపుగుల యిల్లెవరిదోయి ?

బంట్రో— జోస్యుల-భీమయ్యగారిది.

వెంక— ఆయన కేమిపని ?

బంట్రో— ఏమీ పనిలేదు డబ్బుగలవాడు. జూదమూరోజుకు నాలుగురూపాయలు గెలుస్తాడు. నెలకు యిరవైరూపాయలు జీతంయిచ్చి ముండను వుంచినాడు.

వెంక—ఆరూపాయి యీలాగియ్యి. తక్కిన పదణాలూ నేను యిస్తాను. (అని బొడ్డుకొంగుమూటదీసి చిల్లరయిచ్చి రూపాయిపుచ్చుకొని బంట్రోతును పంపి వేయుచున్నాఁడు.)

వెంక—(లోపలికి వెళ్ళి సాపట్లో కూరుచున్న యొకనల్లని మనుష్యుఁజూచి) తమరేనా భీమయ్యగారు? తమదర్శనంచేసి కృతార్థుణ్ణి అయినాను. ఇదివరదాకా తమఖ్యాతి వింటూరావడమే కాని యెప్పుడూ దర్శనంమాత్రం చెయ్యలేదు. యిప్పుడు తమ మూర్తిని చూస్తే నేను విన్నదానికీ యిప్పుడు చూచినదానికీ సరిపోయినది. వుంటారు లోకములో మహానుభావులు! మీరు చూడబోతే యింత వున్నారు. మీకీర్తిచూడబోతే మూడులోకములూ నిండినదేమండీ!

భీమ—శాస్త్రుల్లుగారూ! మీ దేవూరండీ?

వెంక—పడమట కృష్ణాతీరమండి. కాశీయాత్ర వెళ్ళుచూ వచ్చినానండి. దారిలో దొంగలు కొట్టినారండి. మహారాజులు తమరు వకవస్త్రం దయచేయిస్తారని తమకీర్తి విని వచ్చినాను. నెలకు రెండు వందలరూపాయలు తెచ్చుకునే వుద్యోగస్థులుకూడా దాతృత్వంలో మీలో సహస్రాంశమైనా పోలరు.

భీమ—మీరు చేతిలో డబ్బులేనిసమయంలో వచ్చినారు. నిన్న వచ్చినట్టయితే నేనే మంచిపంచెలచాపు కొనిపెడుదును. అయినాకానీ యీరూపాయపుచ్చుకొని వకసైనుపంచె కొనుక్కోండి.

వెంక—చిత్తము. చిత్తము. నాకు ఇదేపదివేలు. రామదాసు పంతులు నాజరీచేస్తూవున్నాడన్నమాటేకానీ వక్కపావలా యిచ్చేటప్పటికి పెద్దలు దిగివచ్చినారు. లోకములో దానకర్ణులన్నమాట తమకే చెల్లింది.

భీమ—శాస్త్రుల్లుగారూ! నమస్కారము.

వెంక—బహుధనకనక వస్తువాహన సమృద్ధి రస్తు. అష్టపుత్రి బహుధనమస్తు. (అని వీధిలోకి వెళ్ళి తనలో) కోర్టువేళ కావచ్చినది. వేగిరం వెళ్ళవలెను. యీపూట రూపాయిఆరుఅణాలు దొరికినవి. ఎప్పుడూ నేను బోగందానితో వెళ్ళలేదు. ఈరాత్రి యీరూపాయి యిచ్చి బోగందానియింటికి వెళుతాను. పట్నవాసాలలో బోగం వాళ్ళు బహుఅందముగా వుంటారు. యింకొకసాక్ష్యందొరికితే బాగా వుండును. మరినాలుగురూపాయీలు సంపాదిస్తును.

(అని వెళ్ళుచున్నాఁడు.)

---

## గురుశుశ్రూష.

---

[వెంకన్నశాస్త్రిల శిష్యులగు శివయ్యాయు, శంకరయ్యాయు ప్రవేశించుచున్నారు.]

శివ—ఏమిరా? శంకరయ్యా! మన కీముండాకొడుకు చెప్పే చదువూలేదు వల్ల కాడూ లేదు. పనిచెయ్యలేక చచ్చిపోతూవున్నాము. పొద్దున్నే లేచి వంగచెట్లకు నీళ్ళు తోడిపొయ్యమంటాడు. నిన్న నేను పొయ్యలేనంటే అడ్డమయినతిట్లూ తిట్టినాడు. నీపనినయం నీకంతగా పని చెప్పడు.

శంక—నాలాగుచేస్తే నీకు చెప్పకపోను. నీవు రాకమునుపు నన్నూ యిలాగే రోజూ వంగచెట్లకు నీళ్ళుపొయ్యమని చంపేవాడు. వాళ్ళమండి వకరోజు యింట్లో యెవరూలేకుండాచూచి చెట్లన్నీ పీకి పారవేసి యేమీయెరగనట్లు వూరుకున్నాను. ఆపని యెవరో దుర్మార్గులు చేసినారని నాలుగుతిట్టి వూరుకున్నాడు. తరువాత యేలాగో రెండునెలలకు నేనే ఆపని చేసినానని తెలిసి, అప్పటినుంచీ నాకు యిట్టు

వంటిపనులు చెప్పడం మానివేసినాడు.

శివ—మూవ్వాళ్ళో శాస్త్రుల్లువద్ద రఘువంశం మూడేళ్ళు చదువుకొన్నాను. వక్కముక్కా తెలిసిందికాదు. ఆశాస్త్రుల్లు యెప్పుడూ పని చేయించుకోవడమేకాని పాఠమే చెప్పేవాడు కాడు. ఈవూరు వచ్చి మూడునెల లయినది. ఈమూడునెలలనుంచీ చదివినా మేఘసందేశంలో పదిశ్లోకము లయినా అయినవి కావు. ఆఅయినవాటికైనా అర్థం తెలియడం లేదు. 'వపక్రీడా' అంటే 'ఉద్ఘాతక్రీడ' లంటాడు. నాకు దీనికీ దానికీకూడా అర్థం తెలియక మొన్న మనగురువుగారి నడిగితే కుశ్శంకలు చేస్తావని చెడతిట్టినాడు.

శంక—అది మనగురువుకే తెలియదు. నెల్లాళ్ళక్రిందట నేను యిలాగంటిప్రశ్నే అడిగేటప్పటికి గురుధిక్కారం చేసినావని నన్నూ అలాగే తిట్టినాడు. శుద్ధతెలివితక్కువవాణ్ణి అని అందరితోనూ చెప్పడము మొదలుపెట్టినాడు. తరువాత నేను సంగతి తెలిసి యేమీ చెప్పినా తలవూచి మహాబాగా తెలిసిందని సంతోషించడం మొదలు పెట్టినాను. అప్పటినుంచీ లోకంలో నావంటిబుద్ధిమంతుడు లేడని అందరితోనూ చెప్పి పొగుడుతూ వున్నాడు.

శివ—యిక ముందు నేనూ ఆలాగే చేస్తాను. బట్టలు వుతుకు మంటే రోజూ రెండుబట్టలు చింపుతాను. నీళ్లు తోడుమంటే చెంబు నూతిలో పడవేస్తాను. అక్కడితో రోగం కుదురుతుంది. అదుగో గురువుగారు వస్తూ వున్నారు. పాఠం చదువుతూ వున్నట్లు కనబడ వలెను. వడిగ్గా కేకలు వెయ్యి.

[వెంకన్నశాస్త్రి ప్రవేశించుచున్నాడు.]

వెంక—ఏమిరా శిష్యుల్లారా? వంగచెట్లల్లో కలుపు తియ్యమన్నాను తీసినారట్రా?

శంక—తియ్యలేదు. ఆనికె చల్లబాటువేళ శివయ్య తీస్తాడని నేను వూరుకున్నాను.

శివ — శంకరయ్య సాయంకాలం తియ్యవచ్చునంటే వూరుకున్నాను.

వెంక—ఓరి గాడిదెల్లారా! ఇప్పుడు బొత్తిగా గురుశుశ్రూష పోయినది. కుట్టముండాకొడుకులంతా బొత్తిగా పాడవుతూవున్నారు. స్కూళ్లల్లో చదువుకునేవాళ్లను చూచి మీకూ చేటుకాలం వస్తూవున్నది. గురుశుశ్రూషవల్ల యెంతఫలం వున్నది? మాకాలంలో నేను యెంతశుశ్రూష చేసి విద్య సంపాదించినాను? నేను మాగురువుగారి దొడ్డి తవ్వి కూరలువేసి నిత్యం నీళ్ళు పోసేవాణ్ని; పొలంలోకి వెళ్ళి పశువులకు గడ్డి తెచ్చేవాణ్ని; ఆయనతోకూడా వూరంతా తిరిగి పొత్తరలు యింటికి జేరవేసేవాణ్ని; పడుకున్నప్పుడు కాళ్లు గుద్దేవాణ్ని; పదిహేనురోజులకు వక్కశ్లోకమయినా చదువుకోవడానకు తీరుబడి లేకుండా పని చేసేవాణ్ని.

శంక—మీరు బలంగలవారు గనుక మీరు ఆలాగు చేసేవారు. మే మిప్పు డంతపని చెయ్యలేమండి. మేమూ మా చేతనైనంతపని చేస్తూనేవున్నాము. అదుగో రామారావు వస్తూవున్నాడు. అతను స్కూలుతో ఆరునెలలనుంచి సంస్కృతము చదువుకుంటూ వున్నాడు. అతనికి మాకంటె పదిరెట్లు యెక్కువ వచ్చినది. మూడేళ్లబట్టి చదువుకుంటూవున్నా మాకు అర్థమూరాదు యేమీరాదు.

వెంక—మీకు చదువు మెల్లిగా వచ్చినా గురుశుశ్రూషాఫలం యెక్కడికిపోతుంది? దానిప్రభావం మీరు యెరుగరు. దత్తాత్రేయునకు పరిచర్య చేసి కార్తవీర్యార్జునుడు సర్వైశ్వర్యధుర్యుడయిన చక్రవర్తి అయినాడు.

[రామారావు ప్రవేశించుచున్నాడు.]

శంక—పూర్వం వాళ్ళేమయినారో కాని యిప్పుడు మీదగ్గిర పదేళ్లనుంచి చదువుకుంటూ వున్నశిష్యులు ముష్టి యెత్తుకుంటూనే వున్నారు. చదువు లేక వట్టిగాడిదలుకూడా అవుతూ వున్నారు. వాళ్ల తరువాత నాలుగువెనుకలు స్కూల్లో ప్రవేశించినవాళ్ళు పండితు లయి గొప్పవుద్యోగాలు చేస్తూ వున్నారు.

రామా—శాస్త్రుల్లుగారూ! మోచేటిపద్దంనోము చేసి లక్ష్మీదేవి ఐశ్వర్యవంతురాలున్నూ సువాసినీయున్నూ అయినది కాదండీ?

వెంక—మీకు గురుశుశ్రూష లేకపోవడంచేత యిటువంటి విపరీతబుద్ధులు పడుతూ వున్నవి. కల్లుసముద్రాలు లేవంటారు. నేతి సముద్రాలు లేవంటారు. ఇంగ్లీషు చదువుకునేవాళ్ళందరూ రౌరవాది నరకాలలో పడిపోతారు. గురుశుశ్రూషాప్రభావం చెప్పుతాను విను. దానివల్ల విద్యార్థులు అహంకారవిరహితులును, విజితేంద్రియులును, అవుచారు; లోకానుభవము తెలిసి వివేకవిలసితు లవుచారు; స్వామ్యా తారతమ్యజ్ఞానము పొసంగును; స్థైరణ మెసంగును; అవిమృశ్యకారిత యడంగును; దీర్ఘదర్శిత సెలంగును; వర్థిష్ణువులగుబుద్ధిమంతులు దానినే యాసింతురు; దానివలన సత్ప్రవర్తనము కలుగును; విద్యార్థులు జగన్నుతులగుదురు; వేయేల? గురుశుశ్రూషవలన సమస్తైశ్వర్యములును గలుగును.

రామా—శాస్త్రుల్లుగారూ! మీరు ఫలశ్రుతి బహుబాగా చదివినారండి. మొన్న మా పురోహితుడు మాఅమ్మమ్మ లక్షవత్తుల నోము చేసుకొన్నప్పుడు దానివలన సమస్తసంపదలూ కలుగుతవనిన్నీ ఆయురారోగ్య పుత్రపౌత్ర ధనకనక వస్తువాహన సమృద్ధి కలుగుతుం దనిన్నీ వేయిజన్మాలలో చేసినపాప మంతా పోతుం దనిన్నీ స్వర్గంలో

సేవత లంతా వుపచారం చేస్తూవుంటా రనిన్నీ కల్పం మీలాగే చదివినాడు. పుణ్యం వస్తుందని డబ్బు లాగడానికి వుపాయం కనిపెట్టి నారు. గురువులున్నూ యిలాగే శిష్యులచేత చాకిరీ చేయించుకోవడానికి యిది వొకవేషం వేసినారు.

వెంక—ఇంగ్లీషుబళ్ళలో చదువుకునేవాళ్ళంతా వట్టిశుంఠలు; వాళ్ళకు పిన్న లేదు. పెద్ద లేదు. మహానుభావులు చెప్పినదాన్ని వేళాకోళం చేస్తారు. డబ్బిచ్చి చదువుకోవడంచేత మీరు చదువుకొన్న ఫలం లేదు. మీకు చదువువచ్చినాకానీ వినయాదిసద్గుణములు పట్టుపడవు. జీతముపుచ్చుకొనుటచేత నుపాధ్యాయులు సేవకులగుచున్నారు; వేతనమిచ్చుచుండుటచేత విద్యార్థులు ప్రభువు లగుచున్నారు.

శంక—ఆలాగయితే విద్యార్థులు ఉపాధ్యాయులను కొట్టడానికి బదులుగా ఉపాధ్యాయులే విద్యార్థులను కొట్టుచున్నారేమండీ ?

వెంక— గాడిదెకొడుకా ! నీకుకూడా పొయ్యేకాలం వచ్చినది. ఈలాగంటి కుశ్శంకలు—

రామా—మీ వినయాదిసద్గుణములు గురుశుశ్రూషవల్లనే వచ్చినవికావండీ !

వెంక—అబ్బాయీ, లేచి పో. నిన్నుచూస్తే నాకు వళ్ళు మహా మండుతుంది. మీనాయనగారినిచూచి వూరుకున్నానుగాని లేకపోతే...

రామా—కొంచెంశాంతించండి. మీశుశ్రూషవల్ల మీశిష్యులకుకూడా సద్గుణము లలవడినవి. మీరు దోవలో వస్తూవస్తూ యెవళ్లదొడ్లోనో వీధిలోనుంచి నారింజకాయలు కోయిస్తే మీశిష్యులకు శృంగారకట్టెలో పూజ జరిగిందట.

శంక—ఎవరియింట్లోనో కాదు మనవుప్పువారియింట్లోనే. మా శివయ్య గోడయెక్కేటప్పటికి లోపలినుంచి తిట్లారంభించడముతోనే

మాగురువుగారూ నేనూ సందులోనుంచి కనబడకుండా పారిపోయి నాము. ఇంతలో లోపలినుంచి వచ్చిపట్టుకొని దొంగతనం చేసినావని యీశివయ్యనే మెత్తగా పిండిపెట్టి సాగనంపినారు.

వెంక — ఓరిగాడిదెకొడుకా! గురుతిరస్కారము చేస్తూవున్నావు. యికయెందుకూ అక్కరకురాకుండా మన్నుకొట్టుకుపోచావు. రామా రావూ! మీతండ్రిగారివద్దకు పద. (అని లేచుచున్నాఁడు.)

రామా — (లేచి నడుచుచు) మీరు చెప్పినట్లు మీవిద్యార్థి యొన్నటినుంచీ జగన్నుతు డయినాడు. (అని వెళ్ళుచున్నాఁడు.)

వెంక — (కొంతదూరము వెళ్లి) ఆ నికవచ్చి మీతండ్రిగారితో నీ ఆకతాయితనమంతా మనవిచేసి కొట్టిస్తానువుండు. గురుశుశ్రూష లేకుండా నీవు చదువుకొన్న చదువెందుకూ పనికిరాదు. అవక్రీతచరిత్రం చూడు. (అని మరల వెనుకకు వెళ్లిపోవుచున్నాఁడు.)

---

## పెళ్ళి వెళ్ళినతరువాత పెద్దపెళ్ళి.

---

### ౧. రంగము — వీధియరుగు.

[రామారావుగారును నారాయణరావుగారును వీధిఅరుగుమీద కూరుచుండి యుండఁగా పురుషోత్తమరావుగారి కొమారుఁడు మాధవరావుగారు దారిని పరుగెత్తుకొని వెళ్ళుచు ప్రవేశించుచున్నారు.]

రామ — ఏమండీ! మాధవరావుగారూ! స్నేహితులము యింతమందిపిలుస్తూవుండఁగా నే మాట వినుపించుకోకుండా పరుగెత్తు తూవున్నారు. మామీద యింతదయతప్పడం ధర్మమా?

మాధ — మాతండ్రిగారికి వంట్లో జబ్బుగా వుండడంచేత వెంక టాచార్లుగారి యింటికి వెళ్ళి అవుషధంపుచ్చుకుని పరుగెత్తుకొని వెళ్తూ

వున్నాను. ఇప్పుడు మాట్లాడడానికి నాకు సావకాశం లేదు. మళ్లీ వచ్చి మీతో మాట్లాడుతాను. క్షమించండి.

రామా—వక్కమాట వినిపొండి. మీతండ్రిగారు మొన్ననే కాదటండీ పెళ్ళిచేసుకునివచ్చినారు. అప్పుడే జబ్బేమిటండి?

మాధ—"అమ్మగారు గృహప్రవేశమూ అయ్యగారు స్మశాన ప్రవేశమూ" అన్నసామెత నిజంగా వున్నది. ఈచమురుకాళ్ళపెద్దమ్మ యేముహూర్తాన్ని పెళ్ళాముయిందోకాని మంగళస్నానాలయినరాత్రి మంగళసూత్రధారణం చేసేటప్పుడే మాతండ్రిగారికి చలీజ్వరమూ వచ్చినది. ఆనాలుగురోజులూ మళ్ళీ జ్వరం రాకపోవడముచేత పెళ్ళిలో మాత్రం యేమీయిబ్బందిలేకుండా యధావిధిగా జరిగిపోయిండి.

రామా—మనుగుడు పయిందా? యింకా అవశిష్టం వున్నదా?

మాధ—మనుగుడుపులోనే లంఖణాలన్నట్టు ఆభాగ్యంలోనే విరోచనాలు పట్టుకున్నవి. అక్కడివైద్యుడు లంఖణంకట్టడంచేత మరీ నిస్త్రాణ యెక్కువయితే యిక్కడ మంచివైద్యుడు మనవెంకటాచార్లు గారు వున్నారని సవారీభోయీలనుచేసి రాత్రికిరాత్రి యీవూరు తీసుకునివచ్చినాను.

రామా—మనుగుడుపులో యిదీ అదీతింటే పెద్దలుగనుక అజీర్తి చేసివుండును.

నారా—విరోచనాలమీద లంఖణం యెంతమాత్రమూ కట్ట కూడదు. ఆవైద్యుడు వట్టి తెలివితక్కువవాడుగా కనబడుతూవున్నాడు.

మాధ—మాతండ్రిగారు అట్టే పెద్దవారు కారు. ఆయన పెళ్ళి చేసుకోవడానికి తగినవయస్సులోనే వున్నారు. మనఅందరికంటెనూ ఆయనే దృఢంగా వున్నారు.

నారా—ఆయనకు అరవైయేళ్లు దాటినవండీ!

మాధ—యెక్కడిదండీ? మొన్న టిభాద్రపదమాసానికి యాభై నాలుగుసంవత్సరములు దాటినవి. మీదటికి పింఛను పుచ్చుకొని యింటికాడ కాలిమీద కాలు వేసికొని కూర్చుండి భార్యతో సుఖపడవలెనని యత్నిస్తూ వున్నారు.

నారా—కొత్తపెళ్లికూతురు యెవరిచిన్న దండీ?

మాధ—యెవరిచిన్నదైతే నేమి? కస్తూరివారి చిన్నది.

నారా—ఆచిన్నదాన్ని నేను యెరుగుదును. చిన్నదానికి పది సంవత్సరము లుంటవి; బహులక్షణవతి.

మాధ—చక్కదనం వుంటే నేమి గుణంమాత్రం మంచిది కాదు. పెళ్లిరోజుననే నా కీమగడు వద్దని యెక్కడలేనిఅల్లరి చేసి పక పట్టాన పీటమీద కూర్చున్నదే కాదు. అన్నగారు వచ్చి నాలుగుకొట్టి బలవంతంగా పీటమీద కూర్చోపెట్టినాడు.

నారా—అలాగైతే మొగుడితో బాగానే సంసారం చేస్తుంది.

మాధ—దాని సంసారంయిల్లు బంగారంగాను మాతండ్రిగారికి యిప్పుడు నిమ్మళంగా వుంటేనేతప్ప మరివకవిధంగా అయితే తరువాత మనోవర్తికోసం మాప్రాణాలమీద కూర్చుంటుంది. కాపురానికి వచ్చినతరువాత సవితిబిడ్డలను మమ్మల్ని తిన్నగా చూస్తుం దండీ?

నారా—మీకు వయ స్సెంతండీ?

మాధ—నాకు యిప్పుడు యిరవైయేడోసంవత్సరము.

రామా—కావలిస్తే ముండను వుంచుకోవచ్చును. పెద్దతనంలో పెళ్ళి చేసుకోవద్దని మీతండ్రిగారితో ఘట్టిగా చెప్పలేకపోయినారా?

మాధ—ఆయనకు మాతల్లిగారు జీవించివున్నప్పటినుంచీవక ముండ వున్నది. యెంతమందిముండలు వున్నా చేసుకున్నపెళ్ళాము వంటిదికాదని ఆయన భ్రమపడ్డారు. ఆయన మాతల్లిగారు పోయి

నపదమూడోనాడే వివాహం చేసుకోవలెనంటే మా నిర్బంధంచేతనే యీడాదివరకూ మానివేసినారు.

నారా— ఇంత పెద్దవాళ్లకు తల్లిదండ్రులు పిల్ల నేలాగు యిస్తా రండీ ?

రామా— డిప్టీకలెక్టరీ చేస్తూవుంటే డబ్బు కాశపడి చచ్చిన శవానికి పిల్ల నిమ్మంటే లక్షమంది ఇస్తారు.

మాధ — మాటలసందడిని చాలా సేపయినది. మాతండ్రిగారికి వేగిరం అవుషధం యివ్వవలెను. నేను వెళ్లుతాను. మీరు వక్క పర్యాయం వచ్చి మాతండ్రిగారిని చూచిపోరా ?

రామా — మేమూ లోపలికి వెళ్లి మంచిబట్టలు కట్టుకుని వస్తాము. మీరు నడుస్తూ వుండండి.

మాధ— చిత్తము. సెలవుపుచ్చుకుంటాను.(అని వెళ్ళుచున్నాడు)

నారా — ఇఖ వెంకటాచార్లచేతిలో పడ్డతరువాత "నాచేతి మాత్రా వైకుంఠయాత్రా" అన్నట్టు! యీఘటం నెగ్గేది కాదు. మనము వెళుదాము రండి. (అని వెళ్ళుచున్నారు.)

---

౨. రంగము— పురుషోత్తమరావుగారి యిల్లు.

[వైద్యుడు వేంకటార్యులును, సిద్ధాంతి శివయ్యాయు, బంధువులు వరదరాజును, కనకరాజును ప్రవేశించుచున్నారు.]

వర— యెట్లావున్నదని చెప్పను? పూర్ణంగా వాయువుచేసుకుని వున్నది. వైద్యలోపం యెంతమాత్రమూ లేదు. వైద్యుడు చేతనయిన పని అవుషధం యివ్వగలడుగాని ఆయుర్దాయం పోయగలడా ? యింతకూ కొత్తగా పెళ్ళిచేసుకొన్న పెళ్ళాముయొక్క అదృష్టం యేలాగు వున్నదీ తెలియదు.

కన—అవిడ అయిదోతనం తిన్నగా వుంటే మీ వైద్యం రాకనే పోను. ముసలివాణ్ని లంఖణాలుకట్టి నిష్కారణంగా పాడుచేసినారు.

వెంక—అబ్బాయీ! నీవుచిన్నవాడవు నీకుయేమీ తెలియదు. వూరుకో. లంఖణాలలో యెంతగుణం వున్నదనుకొన్నావు యేమిటి? "లంఖణం పరమౌషధం" అన్నశాస్త్రికారు డంత వెర్రివాడేనా? నేను చెప్పినప్రకారం విని మధ్య లంఖణం చెడగొట్టకుండా వున్నట్టయితే నాలుగులంఖణాలతో రోగం నిశ్శేష మయిపోయేది. మధ్య డ్రెస్సరుని వకణ్ని తీసుకునివస్తే వాడు గోధుంజావ పోయించి రంగమంతా చెడగొట్టినాడు. తీరా చెడిపోయినతరువాత యెన్నిలంఖణాలు కడితే యేమి వున్నది? యెన్నిమందులు వేస్తే యేమి వున్నది?

కన—డ్రెస్సరు అవుషధం యిచ్చినది వక్కపూటే కాదూ?

వెంక—చెడగొట్టడానికి వక్కపూట కాదుగదా వక్కనిముషం చాలును. యిందులో నావైద్యలోపం పిసరంత లేదు. డబ్బుకు వెనుకాముందూ చూడక దివ్యౌషధాలుకుప్పలు పగలగొట్టిపోసినాను. వాతరాక్షసం, వాతవిధ్వంసి, వాతాంతకరసం, వాతమూషిక మార్జాలం, వాతపన్నగగారుడం; ప్రళయాగ్నిరసం మొదలయినకాకచేసేలఅవుషధాలన్నీ పోసినాను. చివరకు చింతామణికూడా వేసినాను.

కన—ఈఔషధాలపేర్లన్నీ యెప్పుడు వల్లించినా వయ్యా! నీదగ్గిర డబ్బు లేదుగదా వైద్యశాస్త్రం చదువుకోనిదీ యీఅవుషధాలన్నీ యెట్లా చేసినావు?

వర—పెద్దల్ని ఆక్షేపించరాదు. వూరుకో. ఆయన యేఔషధాలూ లేకపోతే వూళ్లో అందరికీ యెలాఅవుధం యిస్తూవున్నాడు? వైద్యుడియందు గురివుంటే ఆయన మన్నునలిపి చేతిలోపెడితే యెటువంటిరోగాలూ నిముషంలో కుదురుతవి.

కన—ఈయనను మాన్పించి డాక్టరుచేత ఔషధం యిప్పించి నట్టయితే వ్యాధి నిమ్మళించేది.

వర—ఆవైద్యం తెల్లవాళ్ళకేకాని డాక్టరువైద్యం నల్లవాళ్ళకు యెంతమాత్రమూ పనికిరాదు. వాళ్లు మాంసమూ రొట్టే తింటారు గనుక వాళ్ళతత్వాలకూ మనతత్వాలకూ చాలా భేదం వుంటుంది. మనతత్వాలమీద నల్లవైద్యమే బాగానడుస్తుంది.

వెంక—"తురకబ్బెరాతురకకూ 'డన్నట్టులౌక్యులందరూ పోగయి యింత శిష్టుగావున్న బ్రాహ్మడికి అవసానకాలమందు మాలనీళ్లు నోట్లో పోయించడానికి మాధవరావుగారిని డాకుదొరకోసం పంపించినారు. డాక్టరు డాక్టరనడమేకాని, వాళ్లకు నాడిచూడడమైనా తెలుసునండీ?

కన—అన్నీ నీకే బాగా తెలుసును. మీరందరూ ఆశ వదలుకున్న మీపెత్తండ్రికుమారుడికి మొన్ననేకాదూ డాక్టరు కుదిర్చినాడు?

వెంక—వాళ్ళు రణవైద్యంలో ఘట్టివాళ్లు. అంతేకాని మరివకదానిలో పనికిరారు. వైద్యంమాట వల్లకాదుగాను మాలనీళ్లు తాగి బ్రాహ్మణీకమూ మతమూ పోగొట్టుకోమండీ? డాక్టరువస్తే ముందుగా పొక్కపాలాస్త్రి వేసి ప్రాణం వుండగానే చంపివేస్తాడు.

శివ—ఈవైద్యాలవల్ల యేమీకార్యంలేదు. ఇప్పుడు పురుషోత్తమరావుగారికి శనిచాలదు; నవగ్రహజపంచేస్తే అంతానిమ్మళిస్తుంది. నేను పోది నాలుగు రోజులనుంచి జపాలు చేయుస్తూవున్నాను. గుళ్లోకి అభిషేకాలనిమిత్తం బ్రాహ్మలు వెళ్ళినారు. అభిషేకం చేసివచ్చి తీర్థం లోపలికి యిస్తే కాస్తసేపటికి అంతా నిమ్మళంగా వుంటుంది.

వర—పంతులుగారికి కీళ్లన్నీ నొప్పులుగా నున్నవి. నాకుచూస్తే పక్షవాతలక్షణంగా కనబడుతూ వున్నది. అయినాకానీ బుద్ధిమం

తులు మీరుకూడా ఆలోచించవచ్చును.

శివ—నాకూ ఆసందేహమే తోచి భూతవైద్యుణ్ని పిలిపించి విభూతి పెట్టించినాము. తెల్లవారిగట్ల ఆడవాళ్ళు సోదికి వెళ్ళితే పేరంటాలుగుడివద్ద మాలదికూడా పెద్దపెళ్లాము పట్టినదనీ విరోధులు ప్రయోగంచేసినారనికూడా చెప్పినది. ఈనవగ్రహజపాలు అన్నింటికీ మంచివే. గ్రహశాంతికయి బ్రాహ్మణసంతర్పణమాత్రం బాగా జరగవలెను.

వర—ఆగండి. లోపలనుంచి కామావధానులుగారు యేమిటో కేకలు వేస్తూవున్నారు—ఏమండోయి కామావధానులుగారు.

కామా—(లోపలనుంచి) మాధవరావుగారు యింకా రాలేదుగదా? ఈపాటిపంతులుగారికి ప్రాయశ్చిత్తం చేస్తే బాగా వుంటుంది. దక్షిణ యివ్వడానికి మాధరావుగారు లేరు. యేమిబుద్ధి?

వర—యింతలో కేఫర్వాలేదు.కొమారుడువచ్చినదాకాఆగండి.

కామా—యింకాయేమి ఆగమంటారు? యిఖ డాక్టరు జరూరులేదు. కనిపెట్టుకొని వుండక తక్షణం బయలుదేరి రమ్మని వర్తమానం పంపించండి. మంచంమీద ప్రాణాలు పోకుండా మనము పంతులుగారిని భూశయనం చెయ్యవలెను. మాధవరావుగారు మంచిసమయానికి లేకపోయినారుగదా? నాకు యిప్పుడు వుత్క్రమణగోదానం వస్తుంది. ప్రాణోత్క్రమణసమయం వచ్చింది.

వర—అబ్బాయీ! మనంయేదోవక వంకపెట్టుకుని వెళ్ళిపోదామురా. అట్టేవుంటే పీనుగును మొయ్యమంటారు.

కన—యిటువంటిఆపద వచ్చినప్పుడే సహాయం చెయ్యకపోతే మనబంధుత్వంయెందుకు తగలబెట్టనా? నేనురాను. కావలిస్తే మీరవెళ్లండి.

కాపగా — వేగిరం లోపలికి రావలెను. పంతులుగారికి ఆఖరు మొగుపులు వచ్చినవి. ప్రాణాలు పోయినట్టున్నవి.

వర — నేను మాధవరావుకోసం వెళ్ళుతాను. మీరు తదంగం కానిస్తూ వుండండి. నక్షత్రం మంచిదేమో చూడండి. కాకపోతే యిల్లు వదలిపెట్టవలసి వస్తుంది. జరూరుంటే ఆయనను పంచపాళీలో పెట్టండి.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

ఉన్మత్తప్రలాపము.

---

[చెన్నపురిలోని యున్మత్తవైద్యశాలలో పిచ్చిపంతులుగారును, నెట్టిశాస్త్రుల్లుగారును సంభాషించుచుండఁగా వివేకాచార్యులుగారు ప్రవేశించుచున్నారు.]

పంతు.— శాస్త్రుల్లూ ! అదుగో ఆచార్లు వస్తూవున్నాడు. వాడి మొఖం మండ ; వాడిల్లు వల్లకాడుగాను.

శాస్త్రు— (మెల్లగా) ఆచార్లు వంటిగా వస్తూవున్నాడు. మనం యిద్దరంవున్నాము కొడదామా ?

ఆచా— యేమోయి పంతులూ ! దారిపట్టుకుపోయేవాణ్ని నిష్కారణంగా ఆలా తిడుతూ వున్నావు. అమావాస్యకూ పౌర్ణమికీ పిచ్చి యెక్కువవుతూ వుంటుంది. ఇవాళ పౌర్ణమిగనుకనా ఆలా వాగుతూ వున్నావు ?

పంతు— మీవంటి వృత్తముపురుషులగ్రహచారంచేత మన దేశానికి మ్లేచ్ఛప్రభుత్వం వచ్చి బొత్తిగా వర్ణసంకరం అవుతూ వున్నది; యెక్కడ చూచినా వట్టి మాలకూడు జరుగుతూ వున్నది. ఇప్పుడు వెనుకటికాల మయితేనా నీవంటిదుర్మార్గుల నందరినీ యిలాగంటి

"ఆర్యగర్హితమయిన" పనులు చేస్తూవున్నందుకు వక్కదెబ్బను తలలు బద్దలుకొట్టి చంపివెయ్యమూ?

ఆచా — ఆత్మస్తుతి పరనిందా మహాబాగా చేసుకుంటూ వున్నావు. ఎన్నాళ్లు వాగుతావో వాగు—నీనోరు నొప్పిపెట్టి నీవే వూరుకుంటావు. నీవంటిపిచ్చివాళ్ల నేమాటలకు నాకు యెంతమాత్రమూ విచారం లేదు. పిచ్చివాడవు కావడంచేత నీవు యెన్నితిట్లు తిట్టినా కోపం రావడానికి బదులుగా నిన్ను చూస్తే నాకు జాలి వేస్తూవున్నది.

పంతు—ఇటువంటి వేలాపన పేలుతూవుంటే నాకు పిచ్చియెత్తి వళ్ళుతెలియక యేమయినా చేసిపోతాను లేచిపో. నాకు నిజంగా పిచ్చి యెత్తినట్టయితే యీపాటి నీతలకాయ రెండుచక్కలుచేసి నాఅక్కస్సంతా తీర్చుకోనూ?

ఆచా—వెఱ్ఱి వెయ్యివిధాలన్నాడు. నీకు పిచ్చివేరే యెత్తనక్కర లేదు. ఇదివరకే కావలసినంతవున్నది. మరీపిచ్చయెక్కువైనవాళ్ళు కనపడ్డ వాళ్ళనందరినీ కొడుతారు. నీవంటి సాధారణపుపిచ్చవాళ్ళు తిట్లతో మాత్రం సరిపెడుతారు. పర్వదినాలలో పిచ్చ ముదురుతుంది కాబట్టి నీవు నెలకు వకపర్యాయం పౌర్ణమిపౌర్ణమికీ అందరినీ తిడుతూవుంటావు. నీపిచ్చ యెప్పుడు కుదిరి మంచివాళ్ళలో పడుతావా అని భగవంతుణ్ని యెప్పుడూ ప్రార్థిస్తూవుంటాను.

పంతు—యేడుస్తూవుంటావు. ఇప్పుడు కానికాలాలు వచ్చినవి. యేమీ నోరెత్త వల్లకాదు. మాలప్రభుత్వం కావడంచేత అన్నీ నిర్బంధాలే. అడ్డమయినవాళ్ళూ చదువుకోవడమే; అడ్డమైనవాళ్ళూ వుద్యోగాలు చెయ్యడమే; యెవరినీ కాస్త తిట్టవల్లకాదు; కొట్టవల్లకాదు; యీపాడుకలికాలం యెప్పుడు పోతుందో.

శాస్త్రి—ఒక్క మగవాళ్ళకేకాకుండా యెన్నడూ యెఱుగము,

ఆడవాళ్ళకుకూడా చదువు వచ్చిందయ్యా! ఆడముండల చదువుమూలాన్ని యెక్కడా నిలవడానికి వల్లకాకుండావచ్చింది. గేరల్‌స్కూలులోచదువుకుందట. దానిచదువు చట్టుబండలుగాను మూడేళ్లముండ నాపెళ్ళాము పేడ ముట్టుకుంటే అసహ్యం అని నన్ను యెదిరిస్తుంది. గోమయం యెంతశుచిఅయినవస్తువు? నాబ్రతుకుపెట్టుకుని మొన్న అమావాశ్యనాడు దానిచేత మూడుపేడవుండలు మింగించలేకపోయినాను.

అహా—ఓయిపిచ్చిబ్రాహ్మడా! నీకు అమావాశ్యనాడు పిచ్చి యెత్తుతుందా యేమిటి? అసహ్యం లేకుండా పేడముద్దలు మింగమనడం యేమిటయ్యా?

శాస్త్రి— అమావాశ్య పితృదినంగనుక శుచిగా వుంటేనే కాని బ్రాహ్మడికి పెట్టడానికి పనికిరాదని కాస్తగోమయం వంటికి రాసుకొని శాస్త్రార్థం కాస్తలేసి గోమయంవుండలు నోట్లో వేసుకొని తలనిండా స్నానం చెయ్యమన్నాను. ఫదేళ్లముండ మాన్యమూ యిల్లు అమ్మి వెయ్యిరూపాయలు పొయిలో పోసి కొనుక్కొన్నందుకు మొగుడు మాట వినక్కరలేదూ? ఫదేళ్లముండ అరవయియేళ్ళు వచ్చిన నామాటే వినకపోతే యిక యెవరిమాట వింటుంది?

పంతు— ఇప్పటి ఆడవాళ్ళు మొగుడిమాట వినేవాళ్ళు గినే వాళ్ళుకారు. ముందున్నది ముసుళ్ళపండుగని నీపాట్లు ముందున్నవి. నీపెళ్ళాం యెదిగి కాపురానికి వచ్చినతరువాత నాజ్యోతిషం నిజ మయిందని అప్పుడు తలుచుకుంటావు. ఆడముండలకు చదువు వచ్చినతరువాత వాళ్ళు లొంగుతారటయ్యా? యీచదువు మనపుట్టి ముంచివేస్తూ వున్నది. యేమీకాకపోతే మనము యేనాడయినా యీవెధవముండల పెళ్ళిళ్ళు వినీ కనీ యెరుగుదుమయ్యా? కలిమహాత్మ్యంచేత యీ

విపరీతాలన్నీ పుడుతూ వున్నవి. "కలౌ పంచసహస్రాణి జాయతే వర్ణసంకరః" అన్నాడు. ఇక కొన్నాళ్ళలో అంతా వర్ణసంకర మయి పోతుంది.

శాస్త్రి—మీరు విధవపెళ్లిళ్ళంటే నావళ్ళువణుకెత్తుతూవున్నది. యెరక్కపోయి ముదిసి ముప్పున చదువుకున్న ముండను కట్టుకున్నాను. ముండామొయ్యడంతోటే అది మళ్ళీ యెక్కడ పెళ్ళిచేసుకుంటుందో! ఓభగవంతుడా? అది విధవావివాహం చేసికోవడం నాకళ్ల పడకుండా చేస్తా.

ఆచా—శాస్త్రుల్లూ! నీవు బ్రతికివుండగా నీపెళ్ళాం మెట్లాముండామోస్తుందయ్యా? వెర్రివాడివలె వున్నావు. అరవైయేళ్ళు దాటిన తరువాత మాన్యాలూ మళ్ళా తెగనమ్మి యిది యెందుకువచ్చిన పెళ్లయ్యా? కాటికి కాళ్లుచాచుకొని నీవు యింకా చిన్నపెళ్లాముతో కాపురం చేసి సుఖపడుదామనే పెళ్లి చేసుకున్నావా? నీవన్నట్టు నీ పెళ్లాం మళ్ళీపెళ్ళిచేసుకుంటే నీవంటిముసలిముండాకొడుకుల కందరికీ చిన్నపిల్లలను వివాహమాడి వాళ్ళకొంప తియ్యకుండా వక్కమాటు బుద్ధి వస్తుంది.

శాస్త్రి— నేను కర్మచెడిపోతుందని గృహస్థధర్మానికి పెళ్ళిచేసుకున్నానుగాని సౌఖ్యంకోసం చేసుకున్నానండీ? నామూడోపెళ్ళాము బ్రతికివున్నప్పుడే నాకు సంసారసుఖం అక్కరలేకపోయింది. పెద్దవాణ్ణి యినాను గనుక యజ్ఞంచేస్తే స్వర్గసుఖం కలుగుతుందని అపత్నీకుణ్ణి కాకుండా వుండడానికి పెళ్ళి చేసుకున్నాను.

ఆచా— నీవు యజ్ఞం చేసి చస్తావో లేదోకాని నీతదనంతరము మళ్లీ పెళ్ళి చేసికోకుండా వుంటే నీపెళ్ళాంమాత్రం నరమేధయాగాలు చాలా చేస్తుంది. యజ్ఞఫలం అప్పుడు నీకు పూర్ణంగా లభిస్తుంది.

పంతు—మళ్ళీ పెళ్ళి చేసుకున్న వాళ్లు కులభ్రష్టు లయి యెందుకూ పనికిరాకుండా పోతారు. మొన్న పెళ్ళిచేసుకున్న వాళ్ళతో గలిసి భోజనం చేసినంతమాత్రంచేతనే వకపెద్దమనిషియింటిమీద పిడుగు పడ్డది. పెళ్ళి చేసుకున్న వాడియింట్లో ముసలిముండ చచ్చిపోయింది. ఇటువంటి దుష్కార్యాలలో ప్రవేశిస్తే యేకీడూ మూడకుండా వూరికే పోతుందా యేమిటి? సజ్జనఘోష తగలక మానదు.

ఆచా—శాబాస్! నీ వన్న పలుకులు మెచ్చతగి వున్నవి. నీ వన్నమాటలు దొరతనంవారికి తెలిస్తే నీకు చాలా బహుమానం చేస్తారు. ఇది రాణీగారు వింటే నీకాళ్లకు గట్టిలోహంతో అందెలూ గొలుసులు వేసి గవర్నమెంటువారు కట్టించినదివ్యభవనాలలో కాపురం వుంచి సర్కారుజీతాలమీద వుండేభటులనుకావలియిచ్చియెల్లకాలమూ అన్నవస్త్రాలు దొరతనంవారిఖర్చుమీదనే యిస్తూ వూరు దాటి వెళ్ల నక్కరలేకుండా నిన్ను బహుఆదరణ చేస్తారు. యీ మహారాజ యోగం నీకు యెప్పుడో తప్పకుండా పడుతుంది. భోజనము చేసినవారి యింటిమీద పిడుగుపడితే అపాయం లేకుండా పోయిందిగాని,సర్కారు లెఖ్ఖలు చూస్తే యీయేడు పిడుగుపడి హిందూదేశంలో నలభై తొమ్మండుగురు కాలం చేసినారు. వాళ్ళంతా విధవావివాహాలు కూడదనేవాళ్లేనట. అదంతా యెందుకు యీపట్నంలోనే వక్క వారందినాలలో విధవావివాహాలు వద్దనేవాళ్లు బహురోగాలచేత బాధపడి రెండువందలమంది చచ్చినారు. ఆడవాళ్ళవుసురు కొట్టకుండా వూరికే పోతుం దనుకున్నారా?

పంతు—నీతో మాట్లాడితే పాపం వస్తుంది. మీ కందరికీ యిట్లాగంటిదుర్బుద్ధులు పుడుతూ వున్నవి గనుకనే యిప్పు డంతా అల్పాయుష్షు ముండాకొడుకులు పుడుతూ వున్నారు. ఈదుర్మార్గ

ప్రభుత్వం మూలాన్నిగాని లేకపోతే నిన్ను నిలివెడుగోయ్యి తీసి పాతి వేస్తును. రావయ్యా శాస్త్రుర్లూ లోపలికి వెళుదాము.

ఆచా—యెన్ని నిర్బంధాలు వున్నా యెంతభయం వున్నా పిచ్చ వాళ్లు గనుక నోటికివచ్చినట్టు వాగడానికి మీకేమీ అభ్యంతరం లేదు. పిచ్చవాళ్లతో వాదం చేసి ఘంటసేపు వ్యర్థంగా పోగొట్టినాను. మీరు యెన్ని కారుకూతలు కూస్తూవున్నా అయ్యేవేవో కానే అవుతవి. నేను వెళ్లిపోతాను. (అని అందఱును నిష్క్రమించుచున్నారు.)

---

గ్రహణములు.

---

[పంతయ్యాపంతులును, సింగయ్యాసిద్ధాంతియు ప్రవేశించు చున్నారు.]

సింగ—పంతులూ! ఏమిషయ్యా పేపరు చదువుచూవున్నావు?

పంత—పయి అమావాస్యనాడు సూర్యగ్రహణ మటండి.

సింగ — యేడిశారులే. నేను పంచాంగం గుణించినాను. యెక్కడా గ్రహణం రాలేదు. పేపర్లల్లో అన్నీ అబద్ధాలే వేస్తారు. వాళ్ల మొఖం తెల్లవాళ్ళకు చాలూమూలం తెలియదు. యేదియెల్లా పోయినా బ్రాహ్మణీకం నిలపడానికి గ్రహణాలు వక్కటి దాఖలాగా వుంచూ వున్నవి.

పంత—వక్క బ్రాహ్మలేకాని తెల్లవాళ్ళు గ్రహణాలుయెప్పుడు వస్తవో చెప్పడం లేదా? ఇందులో మీఆధిక్యం యేమిటి?

సింగ — బ్రాహ్మలు చెప్పినట్లు వాళ్ళు వెయ్యేళ్లు తల్లక్రిందయినా చెప్పలేరు. బ్రాహ్మలవద్దనే మర్మం గ్రహించివాళ్లూ యిప్పుడిప్పుడు కొద్దిగా తంటాలుపడుచూ వున్నారు. బ్రాహ్మలు డబ్బుకోసం కక్కుర్తిపడి మనశాస్త్రాలన్నీ వాళ్లకు చెప్పి పాడుచేస్తూ వున్నారు.

రహస్యంగావుంచుతే శాస్త్రంకాని అందరికీ తెలిస్తే శాస్త్రంయేమిషీ! శాస్త్రాలనగా మంత్రాలనగా అందరికీ తెలిస్తే పాటి తప్పిపోచవి. దానికేంగాని తెల్లవాళ్లు గ్రిహణాలకు యేమికారణం అంచారయ్యా?

పంత—సూర్యుడికీ భూమికీ మధ్య చంద్రుడు అడ్డంవస్తే సూర్య గ్రిహణం పడుతుం దంటారు. సూర్యుడికీ చంద్రుడికీ మధ్య భూమి వుండి భూమినీడ చంద్రుడిమీద పడితే చంద్రగ్రిహణం పడుతుం దంటారు.

సింగ — రామరామరామా! యెంత అబద్ధాలు వ్రాసినా రయ్యా? వాళ్ళకు వక్కటీ తెలియదు. అన్నివిషయాలలోనూ యిలాగే శాస్త్రజ్ఞానం లేక యుక్తులు తెచ్చి సంకరంచేసి పాడుచేస్తూ వున్నారు. నాకు వెయ్యిరూపాయలు యిస్తే గ్రిహణాలసంగతి సమర్థంగా చెప్పి సంశయం వదిలిస్తునే. ఖజానాలో అన్నిరూపాయలు వున్నవి. నిష్కారణంగా కాలవలకిందనూ రోడ్లకిందనూ పెట్టి పాడుచెయ్యకపోతే సద్బ్రాహ్మణ్ని నాకు వెయ్యిరూపాయలు యిచ్చి యిల్లుకట్టించి యిస్తే వాళ్లకు యెంతపుణ్యం వుంచుంది? ఉద్యోగస్తులంతా వూరికే లంచాలు కాచెయ్యడమేకాని యిటువంటిసత్పాత్రిదానం వక్కటీ వాళ్లచేత చేయించరు. ఇప్పుడు బొత్తిగా బ్రాహ్మణభక్తి పోయింది. మాణిక్యంవంటికర్మభూమంతా కిరస్తానీమయము మయి పోయింది.

పంత — రేపు నాకు వుద్యోగం అయితే కలక్టరుగారితో చెప్పి మీకు మాన్యం యిప్పిస్తానుగాని గ్రిహణాలసంగతి యేమిటో నాకు సమర్థకంగా చెప్పండి.

సింగ—నాకు యెక్కడనో దూరంగావుండే మాన్యం పనికి రాదు. నామాన్యానికి తూర్పువైపున వున్న గమళ్లవాడిమాన్యం వాణ్ని వెళ్ళగొట్టివేసి నాకుయిప్పించండి.అలాయిప్పిస్తానని నాచేతులో

చెప్పివెయ్యండి. మీకుతప్పకుండా మీదటికి శిరస్తాదారీఅవుచుంది. ఇదిమెంతకలికాలంఅయినా బ్రాహ్మణవాక్యం పూరకేపోదు. అందు లోనూ తపశ్శాలినిగనుక నావాక్యం అమోఘంగా పట్టుకుంచుంది. వాడిజీవనం చెడగొట్టడంవల్ల మీకు యేమీపాపం లేదుసుమండీ? వాడికేమి తట్టుగాలా? గమళ్ళముండాకొడుకు మాన్యంలేకపోతే కల్లు గీచుకొని బ్రతుకుచాడు. అప్పుడు వాణ్ని కులవృత్తిలో ప్రవేశపెట్టి వర్ణాశ్రమధర్మం నిలవపెట్టినపుణ్యంకూడా మీకు వస్తుంది. యేదైనా కానీ బ్రాహ్మణపూజతో సమాన మయినపుణ్యం మరివకటి లేదు. దేవు డైనాకానీ బ్రాహ్మణవాక్యంఅంటే శిరసావహిస్తాడు. శ్రీకృష్ణమూర్తి వారిని చూడలేదా? బ్రాహ్మణులను తిరస్కరిస్తేనేకాదా ఇంద్ర ద్యుమ్నమహారాజు యేనుగై పుట్టినాడు. నృగమహారాజు తూసరవిల్లి అయిపోయినాడు.

పంత—ఆగొడ వంతా యెందుకు? గ్రహణాలసంగతి సెల విస్తురూ.

సింగ—పూర్వం సముద్రమథనకాలమందు గాడిదకొడుకు రాహువుగాడు దేవతలలో కూర్చుండి అమృతం తాగినాడు. ఆసంగతి సూర్యుడూ చంద్రుడూవెళ్లి చెప్పేటప్పటికి శ్రీవిష్ణుమూర్తివారు చక్రం ధరించి వాడితల రెండువక్కలు చేసివేసినారు. చూచినారా శ్రీమన్నా రాయణమూర్తికికూడా దేవతాపక్షపాతం యేలాగున్నదో? మేమూ భూదేవతలం, మాయందుకూడా అందరికీ ఆపక్షపాతం వుండవలెను. బ్రాహ్మణపక్షపాతికి యెప్పుడూ సర్వశ్రేయస్సులూ కలుగుచవి. బ్రాహ్మ ణాశీర్వాదప్రభావం వర్ణించడానికి బ్రహ్మకయినా తనచేతకాదన్నాడు.

పంత—మధ్యమధ్య మీవ్యాఖ్యానం చాలించి కథకానిస్తురూ.

సింగ—మీరు చిన్నలుగనుక బ్రాహ్మణప్రభావం తిన్నగా

తెలియదని కొంచెం సూచన చేసినాను. భూసురమహాత్మ్యం పూర్ణంగా చెప్పడానికి బ్రహ్మదేవుడిచేతనే కానప్పుడు నాతరమవుచుండా? నాతాత తర మవుచుండా? జగన్మోహినీ అవతారం ధరించినశ్రీహరి శిరస్సుకొట్టివేసినా అమృతం తాగడంచేత వాడు చావక అవుకుక్రోషం కడుపులో వుంచుకొని పర్వదినాలలో సూర్యుణ్ణీ చంద్రుణ్ణీ మింగి సకల బాధలూ పెడుతూ వుంచాడు. ఆమాలముండాకొడుకుమూలంగా ఆమహానుభావులకు యెంతఆపద వచ్చిందండీ? ఆలోకారాధ్యులకు మయిలపోకినప్పుడు మనం తప్పకుండా స్నానం చెయ్యవలెను. ఆసమయంలో పట్టుస్నానమూ విడుపుస్నానమూ చేసి బ్రాహ్మలకు దానాలూ ధర్మాలూచేస్తేఆపుణ్యం యింతాఅంతాఅని చెప్ప నలవికాదు. మహానుభావు లయినవారు దశవిధదానాలూచేసి లక్షలకొద్ది సంభావన యిచ్చి పుణ్యముసంపాదించుకొంచారు. ఇప్పుడు యిస్కూళ్లల్లో చదువుకునే మోటముండాకొడుకులు జుట్టయినాతడపకుండా వడ్డున కూర్చుండి స్నానాలుసేసేవాళ్ళను మీందిమిక్కిలి వెక్కిరిస్తారయ్యా!

పంత—ఈప్రసంగాలు మానివేసి కథ సాంగం కానిస్తురూ!

సింగ— ఇంకాయేమివున్నది? పట్టడంకారణం అంతే. గ్రహణం పట్టడంతోటే తెలుసుకుని బ్రాహ్మలు స్నానం చేసి మంత్రాలు ప్రయోగిస్తే అవి వజ్రాయుధాలై తగిలి ఆపాపగ్రహం నిలవలేక పాడిలి విడిచి పారిపోతుంది. ఈకర్మభూమిలో అంటే బ్రాహ్మలకు తెలిసి మంత్రాలు జపిస్తే రాహువూ కేతువూపారిపోచారుగాని వర్ణాశ్రమధర్మాలు లేని మ్లేచ్ఛదేశములలో సూర్యచంద్రులకు యిటువంటిఆపద వస్తే యెలా నివారణ అవుచుందో!

పంత—ఆఫ్రికాదేశంలో సిద్దీలు గ్రహణం పట్టినప్పుడు పాము కరచిందని పెద్దకేకలు వేసి కొమ్ములువూది డప్పులు వాయించి భూమీ

ఆకాశమూ కోలాహలధ్వని యిచ్చేటట్టు గందరగోళం చేసి గ్రహణం విడిచినతరువాత తమచప్పుడుకు ఝడిసి ఆపాము సూర్యుణ్ణీ చంద్రుణ్ణీ విడిచి పారిపోయిందని సంతోషిస్తారట !

సింగ — అది నిజమేకాబోలును. కర్మబాహ్యులయినందున వాళ్లకు మంత్రాలులేక ఆవిధంగా జడిపించి రాహుగ్రహాన్ని పారదోలుచారు. వాళ్ళూ కొంతపుణ్యాత్ములే. యెవళ్ళూ యేవిధంగాను పూనుకోకపోతే దుష్టగ్రహంవల్ల మహాత్ముల కటువంటిబాధ వచ్చినప్పుడు యేమిదిక్కు ? ఆవేళకు భగవంతుడు యెవరినో వకరిని ఆధారం చూపిస్తాడు.

పంత — చీనా దేశములోకూడా ఘోరసర్పం వచ్చిపట్టుకున్నదని భేరీలు వాయించి గంటలు కొట్టి దాన్ని బెదరకొట్టడానికై పెద్దధ్వని చేస్తారట.

సింగ — ఇంకా యేమిషయ్యా ! ఇప్పుడు నిజం బోధపడ్డదా ? చీనావాళ్లూఅందరూకూడా పాము కరిస్తే గ్రహణం పడుచుందని వప్పుకుంచూవున్నారా ? ఆపాముపేరే రాహువు. ఇంతమందికి ఇలా తెలుస్తూవుండగా యీతెల్లవాళ్లకు యీమూర్ఖత్వం యేమిషయ్యా ? వాళ్ల ముఖం భూమినీడయేమిషి ? చంద్రుడు అడ్డంరావడం యేమిషి ? శ్వేతముఖులకు స్వతహాగా తెలివీలేదు మావంటిబుద్ధిమంతులు చెపితే వినే నేర్పూ లేదు. అయ్యో ! మాటలసందడిని మరిచిపోయినాను. సంభావన మించిపోచుంది. గమల్లతాతయ్యగాడి యింట్లో యివాళ శోభనం. త్వరగా వెళ్లవలెను.

(అని లేచిపోవుచున్నాడు)

## యోగ్యాయోగ్య విచారము.

[పరాంకుశరావుగారు కూర్చుండి యుండఁగా సోమేశ్వరశాస్త్రిలుగారు ప్రవేశించుచున్నారు.]

పరాం—ఏమండి శాస్త్రిలగారు ప్రొద్దున్నే దయచేసినారు?

సోమే—తమతో వక్కహాంశం మనవిచేసుకుంచాను. కోపం రాదుగదా?

పరాం—యేమిటో చెప్పండి.

సోమే—మీతమ్ముఁడు భ్రష్టయిపోవుచున్నాఁడు. మీ రేమీ కనుక్కోవడం లేదుగదా? మీరు మాకు ప్రభువులు గనుక మీ శ్రేయస్సును కోరి చెప్పుచాను. మీవాఁడు పోఖిరీలసహవాసం కూడి పరమపోఖిరీ అయిపోయినాఁడు. మీరు తక్షణం శ్రద్ధచేస్తేనే కాని నిష్కారణంగా చెడిపోచాఁడు.

పరాం — మావాఁడు పోఖిరీ అని యెవరూ చెప్పఁగా నే నెప్పుడూ వినలేదే? వాఁడు యెప్పుడయినా ముండయింటికి వెళుతూ వుండగా మీరు చూచినారా? వాఁడు దీపాలు పెట్టినతరువాత చదువేమో వాడేమోకాని యెప్పుడూ గుమ్మం దాటి వీధులో అడుగు పెట్టఁడు. మీరు మరి యెవరిని చూచి మావా డనుకొన్నారో!

సోమే — మీపాదాలతోడు! తప్పకుండా మీవాఁడే నండి. ముండలతో వెళితేనేకాని పోఖిరీ కాకూడదా యేమిషి? మీభావగారి కొమారుడు ఇంట్లోడ బ్బంతా తీసుకుని పోయి ముండలకు పెడుచాఁడు. వాఁడు యెంతపెద్దమనిషండీ? మీవాణ్ణన్నట్టు అతగాణ్ణి పోఖిరీ అంటే జిహ్వపుచ్చి పురుగులు పడవూ? అతనిబిళ్లగోచి యేమి? ప్రాత స్స్నానాలు యేమి? విభూతిపింజిక ట్లేమి? బ్రాహ్మణభక్తి యేమి? అత

నంతశిష్టు యీవూళ్ళో మరి యెవ్వరైనా వున్నారండీ? నేను కనబడితే యెప్పుడూ దణ్ణం పెట్టకుండా వుండడు. మీరు నామాట నమ్మండి; నమ్మకపోండి. మీవాడు తప్పకుండా పోఖరీ. మీరు చెప్పించేమాల చదువు కొంప తీస్తూవున్నది.

పరాం—మీమాటలు నాకు తెలియడం లేదు. మావాణ్ణి మీరు యేమిచూచి పోఖరీ అంటూవున్నారో స్పష్టంగా చెప్పండి.

సోమే—యేమి చూచినానా? అన్నీ చూచినాను. మీవాడు మొఖాన్ని విభూతి పెట్టడు; జారుగోచీ పెడుచాడు; మొన్న బూడ్సుల జోడు తొడుక్కొని మొఖాన్న బొట్టు లేకుండా పట్టపగలు వీధిలో నుంచి వెళుచూవుంటే నేను కళ్ళారా చూచినాను. పోఖరీతనానికి బూటుసులు తొడుక్కోవడముకంటెనూ ఇంకా యేమి కావలెనండీ!

పరాం—మీరు చూచిందంతా ఇంతేనా మరి యేమయినా వున్నదా? ఇందులో నాకు జబ్బు యేమీ కనబడడం లేదు.

సోమే—నేను ఇవి గాక లక్ష చూచినాను. చెప్పమంటే చెప్తుచాను. మీవాడు బ్రాహ్మలకు దణ్ణం పెట్టడు; గుళ్లోకి వెళ్ళడు; స్కూల్లోకి వెళ్ళివచ్చి బట్టలు తడిపి స్నానం చెయ్యడు సరిగదా జంధ్యాలైనా తడపడు; వరద వచ్చినప్పుడు గోదావరిలో స్నానం చెయ్యమంటే బురదనీళ్ళంచాడు; గోమయం శుచి కాదంచాడు. మీరు వెయ్యనండి లక్షనండి మీవాడు తప్పకుండా చెడిపోచూవున్నాడు. మీరు వుపేక్షచేస్తే బ్రాహ్మణీకం భ్రష్టయిపోతుంది. వర్ణాశ్రమధర్మాలు సమూలం నశిస్తవి.

పరాం—ఇప్పుడు నన్ను యేమి చెయ్యమంటారయ్యా?

సోమే — నా ఆలోచన అడుగుచూవున్నారు గనుక మీకు ఇహ పరసాధనమైనటువంటిన్ని బ్రాహ్మణీకం నిలిచేటటువంటినీ

వర్ణాశ్రమధర్మాలు చెడకుండా వుండేపటువంటివన్నీ పరమార్థం చెపుతాను. నేను చెప్పినట్టు చేస్తానని చేతులో చెయ్యి వెయ్యవలెను. ఇదంతా మీబాగుకోసమూ మీచిన్నవాడిబాగుకోసమూ కాని మరివకటి కాదు సుమండీ! నామాట నమ్మండి. ముఖ్యంగా మీరు నా మాటయందు పూజ్జితం వుంచి తక్షణం మీవాడికి మాలచదువు మానిపించి నమకచమకాలూ మంత్రపుష్పమూ చెప్పించండి. జునపాలు గోరిగివేయించుకొని ఖాయిలా వచ్చినా కానీ మానకుండా ప్రొద్దున్నే స్నానం చేసి మొఖంనిండా విభూతి పెట్టుకుని, బ్రాహ్మడు కనపడ్డప్పుడల్లా దణ్ణం పెడితేనేకాని భోజనం పెట్టమనీ ఇంట్లోకైనా రానియ్యమనీ మీరు గట్టిగా చెప్పండి. మీపెద్దలు దేవబ్రాహ్మణభక్తి కలవారని బహుప్రతిష్ఠ సంపాదించినారు. మీవాడిమూలంగా పూర్వులకందరికి అప్రతిష్ఠ వస్తూవున్నది. కులంబోయిన తరువాత అవతల వుద్యోగం యెందుకండీ? కులాచారధర్మం తిన్నగా వుంటే తిండికి లేకపోతే ముష్టి యెత్తుకోవచ్చును. దాన్లో యేమీ లోపం లేదు.

పరాం—మావాడియందు మీరు కనిపెట్టినలోపాలు ఇంతేనా మరి యేమైనా వున్నవా? ఈమాత్రానికి వాడిచదువు చెడకొట్టడం నాకు యిష్టం లేదు.

సోమే—మీరుకాగా ఇలాగు సంశయిస్తున్నారుగాని గుళ్ళో గోపాలస్వామివారిని రాతిబొమ్మ అన్నాడని గోపాలరావుగారితో చెపితే నామాటప్రకారం తక్షణం కొమారుణ్ణి ఇంగ్లీషుబడి మానిపించి ఇంట్లో మూడుపూటలూ వేదం చెపిస్తూవున్నారు. మీవాడిదగ్గిర నేను చూచింది పెద్దలోపం వకటి చెపుతాను. ఇంగ్లీషు మానిపించి వేస్తారా?

పరాం—అది యేమిటో చెప్పండి.

సోమే—నిన్నగాక మొన్న నేను బహిర్భూమికి వెళ్ళివస్తూవుం డగా యెడ్లబండివకటి శూద్రకుఱ్ఱవాడి కాలిమీదనుంచి పోవడానికి సిద్ధమయ్యేటప్పటికి నేను వద్దని కేకలువేస్తూవున్నా నామాట లక్ష్యం చెయ్యక మైలబడి శూద్రకుఱ్ఱవాణ్ని ముట్టుకొని ఇవతలకు తీసుకు వచ్చినాడు. ఆలాగు శూద్రవాణ్ని ముట్టుకుని బట్టలు ఇంట్లో కలిసితే ఇంకా బ్రాహ్మణీకం యేమియేడిసింది ? మాలకూడంతా కలిసిపోచూ వున్నది. నేను వెనుక వకపర్యాయం వకశూద్రకుఱ్ఱవాడు చెట్టుమీద నుంచి పడి రక్తప్రవాహాలుకట్టి యేడుస్తూవుంటే బట్ట మయిలపడిపో చుండని కర్రైనా చేతికసరాయిచ్చి లేవతీసినానుకాను. ప్రాణం పోయినాకానీ వర్ణాశ్రమధర్మాలు అప్రకారంగా నడపవలెను.

పరాం—మావాడు చేసినపని నాకు సంతోషంగానే వున్నది కాని కోపపడడానికి యిందులో నాకు హేతువేమో కనబడడంలేదు.

సోమే—ఇంగ్లీషుచదువువచ్చి వర్ణసంకరమైపోచూవున్నది. మీరు ఇంగ్లీషుచదివినవారే. సంగతి తెలిసివుండిన్నీ మీతో ఇలాగం టివి చెప్పడం నాదేబుద్ధితక్కువ. కలౌ పంచసహస్రాణి జాయతే వర్ణ సంకరః అన్నాడు ఇఖ తప్పదు. వర్ణసంకరం కావడానికి బ్రాహ్మణజన్మం యెత్తినవాడు శూద్రవాణ్ని ముట్టుకోవడంకంటె ఇంకా యేమికా వలెను ? నేను చెప్పినమాటలు మీకు యేమీ రుచించడం లేదు. ఇదంతా కలికాలమహత్యం.

పరాం—శాస్త్రుల్లుగారూ ! కోపంచెయ్యకండి. మావాడిదగ్గిర నిజమయినతప్పిదం మేమయినావుంటే శలవివ్వండి. శిక్షిస్తాను.

సోమే—ఆలాగైతే చెపుతాను శిక్షించండి. మొన్న యీ మధ్య వకజటాంతస్వాధ్యాయిఅయిన బ్రాహ్మణుడు డబ్బుకు అవసరం వచ్చి మీవాడు చదువుకుంచూవున్నవారి యింట్లోవున్న వస్తువొకటి

వారితో చెప్పకుండా తీసుకువచ్చి తాకట్టుపెట్టుకుంటే మీవాడు సాక్ష్యంపలికి శిక్షవేయించినాడు. అసె దొంగతనమష! గొప్పతప్పిద మష! బ్రాహ్మణవిషయంలో అబద్ధమాడితే బహుపుణ్యాం వస్తుందని యెంతమంది చెప్పినా వినక కచేరిలో నిజం చెప్పివేసినాడు. ఆబ్రాహ్మడు మీవాడిమూలంగా జయిలులో యెంతక్లేశపడ్డాడు. ఆబ్రాహ్మడి వుసురంతా మీవాణ్ని చుట్టుకొని రౌరవాదినరకాలలో పడిపోడూ? బ్రాహ్మణ్ని యేడిపిస్తే బాగుపడతాడండీ? పూర్వము మనరాజులు ధర్మపరిపాలనం చేసేకాలంలో బ్రాహ్మడు యెంతతప్పిదం చేసినా పూజించే వారుగాని శిక్షించేవారుకారు. ఇప్పడంతా కలిమయం. అయిపోయింది. వాడు యెలాగంటె బ్రాహ్మడోకాని ఆశిక్షవేసినఅధికారి బ్రాహ్మడేనష! కులాభిమానం లేకపోయినతరువాత వాడుబ్రాహ్మడుకాడు పరమఛండాలుడు.

పరాం — తప్పిదం చేసినవాడికి శిక్షవేస్తే దూషించడం న్యాయంకాదు.

సోమే—ఆగండి. మీకుకూడా ఆలాగే తోచినతరువాత ఇక మీతో మాటాడడం భావ్యంకాదు. వెళ్ళిపోతాను.

(అని వెళ్ళుచున్నాడు.)

---

వర్షము.

---

[గణపతిరావు కూరుచుండి చదువుకొనుచుండగా శంకరశాస్త్రిగారు ప్రవేశించుచున్నారు.]

గణ—శాస్త్రుల్లుగారూ! నమస్కారమండి.

శంక— దీర్ఘాయుష్యమస్తు! వంశాభివృద్ధిరస్తు! రాజద్వారే

రాజభజనే సర్వదా ఉగ్విజయమస్తు!

గణ—అప్పుడే ఆశీర్వచనమంతా అయిపోయిందండీ? ఇఖ మీాకు మరేమీారావండీ?

శంక—ఈయింగ్లీషుచదువుకునేవాళ్లకు మమ్మల్నిచూస్తే వేళా కోళంగా వుంటుంది.

గణ—వేళాకోళం కాదండీ మీారు తాతగారవుతారుగనుక హాస్యానికన్నాను. కోపం వుంచకండి.

శంక—చిన్నవాడవు నీవొకమాటఅన్నా కానీ నాకుకోపం లేదు నాయనా! నీవుచదుకునే పుస్తకంపేరు యేమంచారు!

గణ—దీనిపేరు "ఫిజికల్ జాగ్రఫీ" అంటారు.

శంక—అందులో యేమివుంచవి?

గణ—అందులోనా? భూమినిగురించీ వాయువునుగురించీ సముద్రాన్నిగురించీ అనేకసంగతులు వుంటవి.

శంక—నీవు యిప్పుడు చదివేభాగం దేన్నిగురించి?

గణ—వర్షాన్నిగురించీమేఘాల్నిగురించీ చదువుతూవున్నాను. అదిమాకు యీవాళ పాఠం.

శంక—వర్షం యెందుకువస్తుందని చెప్పుతాడు? ఇంగ్లీషుపుస్త కాలప్రకారం మేఘంఅంటే యేమిటి?

గణ—సూర్యకిరణముల వేడిమిచేత సముద్రములోనూ నదుల లోనూ మడుగులలోనూ వుండేనీరు ఆవిరిరూపంగా పయికిలేచి వక చోటకూడుకొని పైనిగాలిలో మేఘంగాయేర్పడి బరువు యెక్కువయి నప్పుడు నీరు కిందపడుతుంది. దాన్నే వర్షమంటారు.

శంక — అంతేనేకాని మేఘాలకు ప్రాణం వుండడమూ ఇంద్రుడికి వాహనాలు కావడమూ అంతా అబద్ధమే అంచారా?

గణ—నిస్సందేహంగా అబద్ధమే. మేఘాలకు యేమిటి? ప్రాణం వుండడం యేమిటి? వాటిలో పొగా ఆవిరీ గాలీ తప్ప మరి యేమీా వుండదు.

శంక—నీవు చెప్పినది యెంతమాత్రమూ నమ్మతగి వుండలేదు. మేఘాలకు తప్పకుండా ప్రాణం వుంటుంది. పూర్వం యక్షుడి పెళ్ళాం దగ్గిరకు రాయభారంకూడా పట్టుకువెళ్ళినవి. మేఘాలు సముద్రంలోకి వెళ్ళి నీళ్ళు తాగుచూవుండగా అనేకులు చూచినారు. అలా నీళ్ళు తాగివచ్చి అల్పాచమానం చేస్తే ఆనీరు వర్షరూపంగా భూమిమీాద పడుచుండి. అందుచేతనే వర్షపునీరుకు భూమిమీాద పడితేనేకాని శుద్ధి లేదు.

గణ—మేఘాలు సముద్రంలోకి వెళ్లి నీళ్ళు తాగుతూవుండగా మీారెప్పుడైనా చూచినారా? పామరులు చెప్పవలసినమాట పండితులై వుండిన్నీ మీారుకూడా విశ్వసిస్తారేమి? మేఘము లేమిటి? నీళ్ళు తాగడం యేమిటి?

శంక—అయ్యయ్యో! నామాట నమ్మకపోతే నేను యేమి చెప్పను? మేఘములు వచ్చి సముద్రములోనే కాకుండా దాహం వేసినప్పుడు కోయవాళ్లకుండలలోకూడా కొండలమీాదికి వచ్చి నీళ్ళు తాగి పోచవి. కోయవాళ్లు పొంచివుండి నీళ్ళు తాగడానికి కుండలల్లో దూరి నీళ్ళు కతుకుతూవున్నప్పుడు చటుక్కున మూతవేసి కుండకింద మంటపెట్టి మేఘాలను వండుకుని తించారు. ఈసంగతి మామేనమామ చూచినాడు.

గణ—ఆయనను అడిగితే ఆయనకూడా తన మేనమామ చూచినాడని చెప్పుతాడు. ఈలాగంటిపిచ్చికథ లన్నీ అంధపరంపరగా వ్యాపించి మూఢులు నమ్ముతారు. యెవరూ యేమీా చూచినవా

రుండరు. కోయవాళ్ల మాట యెందుకు? మీరు యెవరూ యింట్లో లేనప్పుడు మీ బిందెలలో మంచినీళ్ళు మాయింట్లో పోసుకుని ఆనీళ్ళు మేఘములు తాగిపోయిన వనీ మా మేనమామ చూచినా డనీ మా దొడ్లో వాళ్ళు మేఘాన్ని వండుకుతిన్నా రనీ నేను చెపితే మీరు నమ్ముతారా?

శంక—మీరు లక్ష చెప్పండి. వెయ్యి చెప్పండి. మేఘాలు జంతువులు కావడానికి సందేహం లేదు. యెండ కాకచేత నీళ్ళు పయికి వెళ్లి కింద పడుతూ వుండడమే వర్ష మయితే రోజూ వర్షం కురుస్తూనే వుండును. మేఘాలకు యజమానులు వున్నారు. వాళ్ల సెల వైతేకాని అవి వర్షం కురియవు.

గణ—మీరు చెప్పినప్రకారం అల్పాచమానం చెయ్యడానికి కూడా యజమానులు శలవు కావలెనా యేమిటి? అలాగయితే మహా గొప్పయజమానులు దొరికినారు.

శంక—నేనూ అనేకశాస్త్రాలు చదివినముండా కొడుకును. నా మాట బొత్తిగా తీసివెయ్యకండి. కావలిస్తే మీకు కావలసినన్ని శాస్త్రప్రమాణాలుకనపరుస్తాను. మేఘాలకు వరుణదేవుడూ ఇంద్రుడూ యిద్దరు యజమానులు. వారిసెలవై తేనేకాని వర్షం కురియదు. అందు చేతనే కొన్ని దేశాలలో వర్షం కురియక క్షామం పడుచుంది. పూర్వం ద్వాదశవర్ష క్షామాలు యెందుకు వచ్చేవి?

గణ — జనుల తెలివితక్కువచేత వచ్చేవి. ఆనకట్టులు కట్టి కాలవలు త్రవ్వించి దేశమంతా నీరు ప్రవహించేటట్టు చేస్తే ద్వాదశ వర్షక్షామాలూ గీమాలూ కూడా హాడిలి పారిపోతవి. ఇప్పు డీకాలవలు త్రవ్వించినతరువాత ద్వాదశవర్షక్షామాలు యెప్పుడైనా రాగా మీరు చూచినారా?

శంక— అబ్బాయీ! చిన్నవాడవు నీ కేమీ తెలియదు. పూర్వ కాలపువారిని పెద్దలను అలా తిరస్కరించరాదు. వారు సర్వజ్ఞులు. యేమీ లేకపోతే వారు నిష్కారణంగా దేవత లున్నారని చెప్పరు. వర్షాలు లేనప్పుడు వారు వరుణమంత్రాలు చదివి వక్కనిమిషంలో వర్షాలు కురిపించేవారు. దేవత లందరూ వారికి ప్రత్యక్షం. వర్షాలు లేనప్పుడు జను లందరూ వెళ్ళి బ్రాహ్మలకాళ్ళు పట్టుకుని వారిని సంతోషపరిస్తే తమ మంత్రశక్తిచేత వర్షం కురిపించి లోకాని కంతటికీ సంతోషం కలుగచేసేవారు. బ్రాహ్మలవద్ద అలాగంటిమహాత్యము వున్నది. గనుకనే అందరూ వారిని భూదేవత లని పూజ చేస్తారు.

గణ—అదంతా బ్రాహ్మలు తమఆధిక్యం నిలువడానికి పన్నిన పన్నుగడ. ఆ దేవతలు బ్రాహ్మలకు యెంతప్రత్యక్షమో శూద్రులకూ అంతే ప్రత్యక్షము. బ్రాహ్మలుకోరితే వర్షం కురిసేటట్టయితే శూద్రులు కోరినా వర్షం కురుస్తుంది.

శంక—అబ్బాయీ! బ్రాహ్మణదూషణ నీకు శ్రేయస్కరం కాదు. బ్రాహ్మలయందు తప్పకుండా గొప్పమహాత్యం వున్నది. ఇప్పుడుకూడా బ్రాహ్మలకు డబ్బు యిచ్చి వారిచేత వరుణమంత్రాలు చదివించి సహస్రఘటాభిషేకాలు చేయిస్తే యెలా వర్షాలు కురుస్తవో చూచినావా? నిరుడుసంవత్సరము పెన్నేటిగ్రామంలో కాపు లంతా పోగయి నూరురూపాయలు చందాలు వేసుకొని బ్రాహ్మలచేత సహస్ర ఘటాభిషేకం చేయిస్తే అదివరకు వక్కచుక్క పడనిది మూడురోజుల కల్లా వర్షం కురిసింది.

గణ—ఇదంతా బ్రాహ్మలు జనులను తెలివితక్కువవాళ్ళను చేసి వాళ్ళడబ్బు కడతేర్చడానికి పన్నినయంత్రంకాని అంతకంటె వేరే యేమీ లేదు. ఆ వెయ్యికుండలనీళ్ళూ గుళ్ళో పోయించడంకంటె తమ

పొలాలలో పోయించుకుంటే పొలాలలో కొంతభాగ మయినా తడిసి పోను. ఆ నూరురూపాయలూ ఖర్చుపెడితే శుభ్రంగా వక మోట నుయ్యి వచ్చును. ఆ నూరురూపాయలూ కూలివాళ్లకు యిచ్చి నీళ్ళు తోడించి పోయించినా బహుభాగా పొలాలు పండేవి. మూఢులు గనుక వాళ్లు నిష్కారణంగా నూరురూపాయలు బ్రాహ్మలపాల్ట పెట్టి పాడుచేసినారు. నిరుటిసంవత్సరం మనవూళ్ళో సహస్రఘటాభిషేకం చేస్తే పయినుంచి వక్కచుక్కనీరు పడ్డదికాదు. వీధులుమాత్రం రొచ్చు పడి పదిరోజులు నడవడానికి వల్ల అయింది కాదు.

శంక—మంత్రప్రభావం కాకపోతే రెండోవూళ్ళో కురవడానికి కారణంయేమిటి ! నాకు తోచక అడుగుచాను చెప్పండి.

గణ— మంత్రప్రభావం అయితే యీవూళ్ళో కురవకపోవడానికి కారణంయేమిటో మీరుచెప్పండి చూతాము. ఈసహస్రఘటాభిషేకాలు వేసవికాలంలో వర్షాలుకురిసేముందు చేస్తారు. వాటంతటవి వర్షాలు కురిస్తే బ్రాహ్మలు అవి తమమహత్యంవల్లనే అంటారు. కురియకపోతే కన్నంలో దొంగను తేలుకుట్టినట్లు మాట్లాడక వూరుకుంటారు.తరువాత వర్షాలు కురిసినా కురియకపోయినా ముందుగా బ్రాహ్మలకు సంభావనలూ సంతర్పణలూ తప్పవు. ఇదిఅంతా పట్టపగలు అందరూ మేలుకుండగా చేసేమోసము.

శంక— అబ్బాయీ! యీప్రసంగం ఇఖచాలించు. అంతకంతకు బ్రాహ్మణదూషణ యెక్కువ అవుచూవున్నది. బ్రహ్మద్వేషం ముదిరినతరువాత ఇఖవాడితో మాట్లాడరాదు. ఇప్పుడు ఇంగ్లీషుచదువువచ్చి యీమాలచదువుమూలంగా శాస్త్రాలూ ఆచారాలూ మన్నుకొట్టుకొని అంతా భ్రష్టమయిపోచూవున్నది. ఇంగ్లీషుచదువుకున్నవాళ్ళు వట్టి కిరస్తానీముండావాళ్ళు. అన్నింటికీ కుశ్శంకలుచేసి

లోకమంతా మాలకూడుచేసి పాడుచేస్తూవున్నారు. రామ రామ రామ రామా! ఇఖయీమాటలు వింటే పాపం వస్తుంది?

(అని చెవులుమూసికొని లేచిపోవుచున్నాడు.)

---

## హిందూమహాజనుల మతసభ.

—o—

[శైవులు, వైష్ణవులు, మాధ్వులు, స్మార్తులు మొదలైన హిందూబ్రాహ్మణ మహాజనులు సభ చేరియుండఁగా లౌకికవ్యవహారములోనున్న యొకశాస్త్రులవారు ప్రసంగించుచున్నారు.]

శాస్త్రు—ఇంతమంది యిన్ని తెగలవారు వకచోట యీప్రకారంగా సమావేశంకావడఁ చూస్తే హిందువులలోవుండే ఐకమత్యము మరియెవరిలోకూడా లేనట్టు స్పష్టమవుతూ వున్నది. ఇటువంటి ఐకమత్యం మనలో వున్నదికనుక మధ్యమధ్య యెన్నిఅవాంతరాలు వచ్చినా ప్రభుత్వాలు యెన్నిమారినా మనవేదచోదితమయినమతం యెన్ని మ్లేచ్ఛమతాలవారు పాడుచెయ్యడానికి ప్రయత్నము చేసినప్పటికిన్నీ మేరువుపర్వతమువలె సుస్థిరంగావుండి యెంతమాత్రం చెడకుండా నేటివరకూ అవిచ్ఛిన్నంగా సాగుతూవున్నది. అయితే యిప్పుడు పాదరీలవల్లనూ, కిరస్తానీమతబోధవల్లనూ మిషనేరీస్కూళ్లల్లోచెప్పే మాలచదువువల్లనూ మనమతం పాతుకదిలేస్థితివచ్చేటట్టుకనబడుతూ వున్నది. ఇప్పుడు మనం వెంటనే జాగ్రత్తపడి పునాది బలపరిస్తేనేకాని అంతా చెడిపోతుంది. ఇదివరకు యెక్కడనో యెవరో కిరస్తానీమతంలో కలిసినారని చెప్పుకోవడమేకాని ఇప్పుడాగ్రహచారం ప్రత్యక్ష్యంగా మనకే సంభవించినది. వారముదినములలోపుగా యెప్పుడూలేనిది మనవూళ్లో వొక వైష్ణవుచిన్నవాడున్ను వైదికపుచిన్నవాడున్ను

కూడా కిరస్తానీమతంలో కలిసిపోయినారు. ఈవారమురోజులనుంచీ వూరంతా అల్లకల్లోలంగా వున్నది. ఇప్పుడు మనం ఇక్కడ సభచేరి నది ముందు మనం చెయ్యవలసిన పనియేమిటో ఆలోచించడానికయి వున్నది. గనుక బుద్ధిమంతులు వారివారికి తోచినదాన్ని చెపుతారని కోరుతాను. రామచంద్రరావుపంతులుగారు లౌక్యమందూ వైదికమందుకూడా నిధులు. వారు మొదట చెపితే బాగావుంటుంది.

రామా—మనమతం మనకుర్రవాళ్ళకు బాగా తెలియకపోవడంచేత వాళ్ళు అన్యమతంలో ప్రవేశించడం తటస్థమవుతూవున్నది. మనం దేవాలయాలలోనో మరి యేబహిరంగస్థలములోనో వారానికి రెండుసార్లు పిల్లలందరూ పోగయ్యేటట్టు చేసి కొంతమందిపండితులచేత వాళ్ళకు మనమతం బోధ చేయిస్తూ వుండవలెను. నేను చెప్పినది బాగా వున్నదా ?

మహాజనులు—బహుబాగావున్నది. తప్పకుండా రేపటినుంచీ ఆలాగు చెయ్యవలసినదే. అయితే యీమతబోధ యేదేవాలయంలో చేస్తేబాగావుంటుంది? పండితుల్ని యెవరిని పెడుదాము ?

వ్యాసరాయాచార్యులు—ఈవేదశాస్త్రపాఠశాల ఆంజనేయ స్వామివారి కోవెలలోపెట్టి ముఖ్యప్రాణాచార్యులుగారిని పండితుల్నిగా యేర్పరిస్తే బాగావుంటుంది.

రామానుజాచార్యులు—కాదు. కాదు. శ్రీకేశవస్వామివారి ఆలయంలో తిరుమంటపంమీద పాఠశాల పెట్టించి శ్రీవేదాంతదేశికాచార్యులవారిని పండితులనుగా నియమిస్తే బహుదివ్యంగా వుంటుంది.

బసవయ్యఅయ్యవార్లు—శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామివారిగుళ్లో పాఠశాలవుంపించి వీరభద్రయ్యవార్లంగారిని పండితులనుగా పెడితే సరీబాగావుంటుంది.

రామా—ఆగుళ్ళో పెడితే మాపిల్లలను మేము పంపము.

బస — మీగుళ్ళో పెడితే మాపిల్లలను మే మంతకుమునుపే పంపము.

పరబ్రహ్మసోమయాజులు — మాకు శివకేశవులు యిద్దరూ సమానమే. పాఠశాల వకరోజు శివాలయంలోనూ వకరోజు విష్ణాలయములోనూ వుంచి హరిశాస్త్రులవారిని పండితులనుగా పెట్టండి. యెవరికీ యిబ్బంది లేకుండా వుంచుంది.

రామా—స్మార్తపండితుణ్ని వేస్తే మాకు పనికిరాదు.

వ్యాస—మా కంతకుమునుపే పనికిరాదు.

బస—మాకు బొత్తిగానే పనికిరాదు.

రామా—మాకు వైష్ణవపండితుడే వుండవలెను.

వ్యాస—మాకు మార్ధ్వపండితుడే వుండవలెను.

బస—మాకు శైవపండితుడే వుండవలెను.

వెంకటాద్రిప్రపంతులు — మీరూ మీరూ యేమీ లేనిదే ముందుగానే యెందుకు దెబ్బలాడుతారు? వక స్మార్తపండితుణ్నీ, వక వైష్ణవపండితుణ్నీ, వక లింగధారిపండితుణ్నీ, వక మార్ధ్వపండితుణ్నీ వేసి అన్నిమతాలూకూడా చెప్పింతాము. మీలో మీరు తగువులాడకండి. స్థలవిషయమయి యేమీ తగాదా రాకుండా దేవాలయాలలో మానివేసి పాఠశాల కొత్వాలుసావిట్లో పెట్టింతాము. ఇక మత విషయంలో యేమి ముందుగా చెప్పవలెనో ఆలోచించండి.

రామా — ఆలోచించేది యేమిటి? ముందుగా మనదేవుడు యెలాగంటివాడో పిల్లవాళ్లకుబోధించవలెను. ప్రతిరోజూ శ్రీస్వామి వారికోవెలలోకి బాలకులు తప్పకుండా వెళ్ళేటట్టు చేసి మనం చేసే బోధకున్నూ వాళ్ళుచూచే దివ్యమంగళవిగ్రహానికిన్ని సరిపడేటట్టుగా

దేవుడు చతుర్భుజుడనిన్నీ లక్ష్మీసమేతుడనిన్నీ శంఖచక్రవిరాజితుడనిన్నీ ముఖమునందు తిరుచూర్ణనామ—

రంగాచార్యులు—మీరు చెప్పేదాన్లో చివర స్పష్టంగా లేదు. నామం సంగతినిగురించి చెప్పేటప్పుడు ముక్కుమీద కిందపాదం వుండవలెనో లేదో ఆసంగతి యీసభవారిముందరనే స్పష్టంగా పరిష్కరించండి.

రామా— ముక్కుమీద పాదం తప్పకుండా వుండవలెను.

రంగా—ముక్కుమీద పాదం సుతరామూ పనికిరాదు. పాదం వుంటే వాడిమొఖమే చూడకూడదు.

రామా — పాదం లేకపోతే తక్కిన వెన్నివున్నా యేమీ ప్రయోజనం లేదు. ఏమండి ఆచార్లవారందరూ మామాట చొరకుండా ఆలా కేకలువేస్తారు?

రంగా—మీవాళ్ళు కేకలువేస్తే మావాళ్ళుమాత్రం వూరుకుంటారా? ఇందులోమాత్రం అంతపౌరుషం చచ్చినవారు యెవరు?

వెంక — మీ వడఘులి తెంఘులి ఖజ్జాలు కాలిపోను. ఇక్కడ దొమ్ములాడకండయ్యా.

బస —వారి తగాదామాట అవతలవుంచి ముందుగా మేము చెప్పేది వినవలెను. రామానుజాచార్లు చెప్పేదానికి మే మసల్లే వప్పుకోము. దేవుడు త్రినేత్రుడనిన్నీ పార్వతీసమేతుడనిన్నీ త్రిశూలఖట్వాంగవిరాజితుడనిన్నీ విభూతిధారి అనిన్నీ బోధించవలెను.

రామా — ఆలా చెపితే పాఠశాల సాగనేసాగదు. విభూతిరుద్రాక్షలు ధరించి లింగం కట్టుకున్నవాణ్ని చూస్తే సచేలస్నానం చేసి చాంద్రాయణవ్రతం చెయ్యవలెను.

బస — తిరుమణి తులసిపూసలు ధరించి చక్రాంకితాలయిన

వాణ్ని చూస్తే భూప్రదక్షిణం చేసివచ్చి పాపం పోవడానికి సందమూ మహేశ్వరులకు భోజనం పెట్టవలెను.

వ్యాస—చక్రాంకితాలమాట యెత్తితే మీకూ మాకూ బాగా జరగదు. జాగ్రత్త. దేవుడిముఖానికి అంగారంపెట్టి పంచముద్రలూ వుంచవలెను.

పర—దేవుడికి యేచిహ్నాలూ వద్దు. స్మార్తాచారాలు తెలిసి నిత్యమూ పిల్లవాళ్ళు స్నానసంధ్యాద్యనుష్ఠానాలు చెయ్యడానికి శ్రుతిస్మృతులూ వాటి భాష్యాలూ చెప్పించి జీవేశ్వరులకు భేదం లేదన్న అద్వైతసిద్ధాంతం బోధిస్తే సరిపోతుంది.

వ్యాస — అద్వైతసిద్ధాంతం మాలో యెవరికీ పనికిరాదు స్మార్తులముఖం చూస్తే సచేలస్నానం చెయ్యవలెను.

రామా—స్మార్తులముఖం చూస్తే చాంద్రాయణం చెయ్యవలెను.

బస—స్మార్తులముఖం చూస్తే భూప్రదక్షిణం చెయ్యవలెను.

వెంక—మీరు నిష్కారణంగా స్మార్తులను యెందుకు దూషిస్తారు వశం వచ్చినపని చూచుకోవలెను. ఈప్రకారంగా మీరందరూ దొమ్మిగా మాట్లాడక మీలో పెద్దలు యెవరో వారిని మాట్లాడమనండి.

రామా—మాలో ఆమూల కూరుచున్న గండభేరుండాచార్యులవారు భాగవతాగ్రేసరులు.

వెంక—వారు ముఖానికి విసనకర్ర అడ్డంపెట్టుకున్నారేమి?

రామా — వారు స్మార్తులముఖమున్ను శైవులముఖమున్ను చూడరు. అందుకోసం అడ్డంపెట్టుకున్నారు.

బస — మాలో చిక్కయ్య అయ్యవార్లంగారు కేవలమూ

ప్రమథగణాలలోనివారు, యీసభకు వైష్ణవులు వస్తారని వారు ఇక్కడకు విజయం చేయలేదు.

రంగా—యేడవలేకపోయినాడు.

బస—మీఆచార్లు మొత్తుకోలేక పోయినాడు.

రంగా—మీశైవులు శక్తిపూజపేరుపెట్టి తాగుతారు.

బస—మీవైష్ణవులు రామానుజకూటమని పేరుపెట్టి తాగడమేకాకుండా మాంసంకూడా తింటారు.

రంగా—(లేచి) అరి గాడిదెకొడుకా! మావైష్ణవులను దూషిస్తావురా?

బస—(లేచి) ఆరిలంజెకొడుకా! మాశైవులనుదూషిస్తావురా?

రంగా—వైష్ణమతమందు అభిమానంవున్నవాళ్లంతా లెండి. యెవరుగెలుస్తారో చూతాము.

బస—శైవమతమందు అభిమానమున్నవాళ్ళంతా సన్నంకట్టుకుని నిలుచోండి. యెవరుగెలిచేదీ కనబడుతుంది.

పర—హరిశాస్తుర్లుగారు మాలో బ్రహ్మణ్యులు.

వెంక—వూరుకోవయ్యా! బ్రహ్మణ్యులూ లేదు గిహ్మణ్యులూ లేదు. వూరుకోకుంటే యిప్పుడు మేజస్ట్రీటు జరుగుతుంది. ఆచార్లుగారూ! మీరు యింటికి వెళ్లండి. అయ్యవార్లంగారూ! మీయింటికి విజయంచెయ్యండి. ఈసారి చాలించి మరివకసారి మళ్ళీసభ చేతాము.

(అని బతిమాలుకొని అందరినీ యిళ్లకు పంపివేస్తున్నారు)

---

# శ కు న ము లు.

——:o:——

[పాపయ్యపంతులవారును, కామయ్యశాస్త్రిలవారును
ప్రవేశించుచున్నారు.]

కామ— పాపయ్యపంతులుగారూ! మీకు గొప్ప ఆపద సంభ వించినది. ఈదొర వట్టి కిరాతుడు. నూరురూపాయలపని నిష్కారణంగా పోయింది. జాతివాడిస్వభావం యెరిగినవారు మీరు రెండు దినాలు ముందుగానే బయలుదేరక పోయినారండీ?

పాప—ఆడవాళ్ళను తీసుకొని మంచీచెడ్డా విచారించకుండా దూరభారం యెలాగుబయలుదేరనండీ! అమావాస్యకుముందేబయలు దేరుదామంటే దోవలో అమావాస్యవస్తే మంచిదికాదని పెద్దలు చెప్పినారు.

కామ—అమావాస్య వెళ్ళినవిదియనాడు బైలుదేరినా రెండు రోజులు ముందుగానే వస్తురు.

పాప—అమావాస్య వెళ్ళినపాడ్యమి ప్రయాణానికి బొత్తిగానే మంచిదికాదు. విదియనాడు బయలుదేరుదామంటే ఆరోజు శుక్రవారమయినది. అక్కడికీ మొండిచొరవ చేసి బయలుదేరుదామని ఆలోచిస్తూవుంటే తుసుక్కుమని లోపల యెవరో తుమ్మినారు. అటువంటి అపశకునమయినతరువాత యేదియేమయినా ప్రయాణం చెయ్యకూడదని నాటికి మానివేసినాను.

కామ— పోనీ తదియనాడు తెల్లవారుగట్ట బయలుదేరక పోయినారా?

పాప—అన్నీ యెరిగినవారు మీరూ ఆలాగే సెలవిస్తారేమి? పిల్లలను తీసుకొని శనివారంవుదయాన్న దుర్ముహూర్తంపూట యెలా

బయలుదేరను? ఆమధ్యాహ్నం వర్షం వచ్చినది. వర్షం వెళ్ళినతరువాత రాత్రిప్రయాణంనిమిత్తమయి బండికోసం వర్తమానం పంపించ పోతూవుంటే గుడ్లగూబ కూసింది. అందుకోసం ప్రయాణము మానినాను. ఆమరునాడు చవితి ప్రయాణానికి మంచిదికాదని మీరెరింగినదేకదా!

కామ—మీరు పంచమినాడు హృదయాన్న బయలుదేరినారు కాబోలును. అలాగయినా యిక్కడకు మూడురోజులకిందనే రావలసినదే.

పాప—ఆరోజునా బయలుదేరలేదు. ఆరోజు హృదయాన్న నక్షత్రం మంచిదయినదికాదు. అదికాకుండా వర్షంకూడా వచ్చినది. మధ్యాహ్నం బయలుదేరుదామంటే భోజనం చేసి పచారుచేస్తూవుండగా మాలబల్లి మీదపడితే జ్యోతిష్కుణ్ని పిలిపించి స్నానం చేసి దీపం పెట్టుకొని శాంతీ గింతీ చేసుకునేటప్పటికి దీపాలవేళయింది. రాత్రి భోజనాలు చేసి బయలుదేరుదామంటే పెద్దలందరూ చుక్కయెదురు వెళ్ళకూడదన్నారు.

కామ—మరునాడు షష్టిగనుక ఆరోజునా బయలుదేరలేదనుకుంటాను.

పాప—వట్టి షష్ఠిమాత్రంఅయితే యెలాగయినా బయలుదేరుదును. ఆవేళ పిడుగువలె మంగళవారంకూడా వచ్చినది. ఈరెంటికీతోడు ఆదినం వట్టిపాడునక్షత్రం.

కామ—ఇఖసప్తమినాడు బయలుదేరినారు. అక్కడికి బండీ బాగానడిచినది. మీరు నిన్న భోజనానికే ఇక్కడకు దయచేసినారు.

పాప—సప్తమీబుధవారం ప్రయాణానికి బహు అనుకూలమయినదినం అయినప్పటికీ ఆదినం హృదయం బయలుదేరడానికి సంధ

ర్భపడ్డదికాదు. అప్పుడు నిర్గమనంమాత్రం వుంచినాము. ఆదినం మా చిన్నకుఱ్ఱవాడు పుట్టినదినం. ఆదినం పండుగచేసుకొని భోజనాలుచేసి బయలుదేరితేకాని వల్లకాదని ఆడవాళ్ళు పట్టుపట్టినారు. ఆవుదయాన్నే బయలుదేరితే దొంగలమట్టి మధ్యాహ్నమే దాటిపోదుము. భోజనాలు కాగానే బయలుదేరుదామని బళ్ళుకట్టించి తీరా యెక్కబోయేటప్పటికి వెధవముండ యెదురుగుండావచ్చి మళ్ళీలోపలికి పోయి అరఘంటసేపు ఆగినాము. అప్పుడు బయలుదేరినా దీపాలు పెట్టకముందే దొంగలమట్టి దాటుదుము. మళ్ళీ వీధిగుమ్మంలోకి వచ్చేటప్పటికి వంటబ్రాహ్మణు యెదురుగుండావచ్చినాడు. అందుచేత మళ్ళీ లోపలకువెళ్ళి కొంతసేపు ఆగినాము. ఇక యిలాగుచేస్తూవుంటే కార్యములేదని వీధులో యెవరూ నడవకుండా జాగ్రతపెట్టి పొరుగింట్లోనుంచి వకముత్తయిదువ యెదురుగుండావచ్చేటట్టు బందోబస్తుచేసి చటుక్కున బండియెక్కి బయలుదేరినాము. యెంతమంచిశకునంచూచి బయలుదేరినా ఆవెధవముండ యెదురుగావచ్చినవేళ యెటువంటిదోకాని మాఅనుభవం మాకు వెంటనే అయింది. రాత్రి పదిఘంటలకు మేము దొంగలమట్టివద్దకు జడుస్తూనే వచ్చినాము. మేము ఝడిసినట్టుగానే యెట్లాగ్రహించినారో కాని దొంగలు సమయానికి వచ్చి నగలన్నీ యెత్తుకొనిపోయినారు. మేము మంచిశకునం చూచుకుని బయలుదేరడంచేత ప్రాణాలకు మాత్రం అపాయం లేకుండా బ్రతికి బయలపడ్డాము.

కామ—దానిముండామోసినసొమ్ము మీరు సొమ్ము కేమీ విచారపడవలసినపని లేదు. ప్రాణాలు బాగుంటే సొమ్ము మరివకనాటికి గణించుకోవచ్చును. కెలవుదినాలు అతిక్రమించి వచ్చినారని దొరముండాకొడుకు అక్రమంగా పని తీసివెయ్యడంచేత యెల్లకాలమూ జరిగేజీవనానికి భంగం వచ్చినదని నాకు బహువిచారంగా వున్నది.

ఇదంతా అనుభవించేవాళ్ళము మా దురదృష్టంగాని తమకేమి మహా రాజులే. ఇదివరకు గడించుకొన్నవానితోనే జీవం చేస్తారు.

పాప—నాకు యేలినాటిశని వున్నదని జ్యోతిష్కులు చెపుతూ వచ్చినారు. ఇదీ దానిఫలం. . మొన్న నేను జాతకం చూపిస్తే మా వూళ్ళో జ్యోతిష్కుడు మీకు సంవత్సరంలో ధననష్టం వస్తుందని చెప్పినాడు. అదంతా దాఖలా యిస్తూవున్నది. ఇఖముందు జరగవలసిన సంగతి ఆలోచించవలెను. అడుగో మాఅబ్బాయీ స్కూలులోనుంచి వచ్చినాడు. వాడు శకునాలూ గికునాలూ లక్ష్యంచెయ్యక బయిలుదేరుమని నాతో చెడపోరినాడు.

[సుబ్బారావు ప్రవేశించుచున్నాడు.]

కామ—చిన్నవాడు ఈసంగతులన్నీ ఆయనకేమి తెలుసునండీ? అందులోనూ యిస్కూళ్ళల్లో చదువుకునేవాళ్లకు బొత్తిగా దేవుడూ దెయ్యమూ వారమూ వర్జ్యమూ యేమీ అక్కరలేదండి. వాళ్ళకూ కాలం వచ్చి సంసారం మీదపడితే అప్పుడు అన్నీ తెలుస్తవి.

సుబ్బా—ఇక మాకు యెన్నిసంసారాలు మీదపడ్డా ఇప్పుడు తెలిసినదానికంటె యీవిషయంలో యెక్కువగా తెలియదు.

పాప—కుర్రవాడు వాడితో నేమిగాని ముందు చెయ్యవలసిన పని యేమిటో బాగా ఆలోచించి సెలవియ్యండి.

కామ—చెయ్యవలసినపని యేమున్నది? శని చాలదు గనుక మీరు నవగ్రహజపం చేయించి బ్రాహ్మణులచేత గ్రహశాంతి చేయించవలెను. దానినిమిత్తమయి దశవిధదానాలూ హోమాలూ చేయించవలసి వుంటవి. అటుతరువాత మీశక్తికొలది రెండువందలకో మూడువందలకో బ్రాహ్మలకు సంతర్పణ చేసి మీకు తోచినమాత్రం సంభావన యివ్వవచ్చును.

సుబ్బా—నాన్నగారూ! మీరు ఇఖ ఇలాగంటి పాడుఖర్చు యేమీ చెయ్యకండి. బ్రాహ్మలు యెలాగయినా మీచేత షదిడబ్బులు ఖర్చుపెట్టించి దిట్టంగా భోజనాలు చేసి దక్షిణలు పుచ్చుకొని యెలాగయినా తమరు బాగుపడడానికి చూస్తారు. నామాటలు విని మీరు జపాలూ తపాలూ మానివేసి దొర అనుగ్రహం సంపాదించడానికి చూడండి. మీరు లంచాలు పుచ్చుకుని బ్రాహ్మలకు సంతర్పణలూ సమారాధనలూ చేస్తారని వినడంచేత మీమీద వున్నకోపంచేత దొర యిలాగున చేసినాడేకాని లేకపోతే యిలాగు చేసేవాడుకాడు. ఇక్కడ దొరకు అనుగ్రహం రాకపోతే యీబ్రాహ్మలకు పెట్టేసొమ్ము పెట్టి చెన్నపట్నం వెళ్ళి అప్పీలు చేసుకుంటే తప్పకుండా కార్యమవుతుంది. మీరు వారాలూ వర్జ్యాలూ యీచాదస్తమంతా మాని నేను చెప్పినప్రకారం విదియనాడే బయలుదేరివున్నట్టయితే యీ చిక్కులన్నీ లేకుండా మహారాజువలె మీపనిలో మీరు తిన్నగా వుండి వుందురు.

పాప—యేమో యిఖ జరిగిపోయినదానికి విచారిస్తే కార్యం లేదు. ముందుసంగతి చూచుకోవలెను. మనం జ్యోతిషం బొత్తిగా కొట్టివెయ్యరాదు. మనసొమ్ము కొంత బ్రాహ్మలహృదయంలో పడితేనేకాని మనం యేఅప్పీలుచేసినా కార్యం వుండదు. నవగ్రహ జపాలు పక్క యీపనికోసమే కాకుండా అనేకవిధాల మంచివి. ఈవాళ మొదలుకొని ముందుగా సూర్యనమస్కారాలు చేయింతాము.

కామ — పాపయ్యపంతులువారు కేవలమూ బ్రహ్మణ్యులు. వారికి తెలియని దేమీ లేదు. బ్రాహ్మలకు యెంతయిస్తే భగవంతుడు అంత సంతోషిస్తాడు. భగవంతుడు సంతోషిస్తే సమస్తకార్యాలకూ

విజయం కలుగుతుంది. అబ్బాయీ! నీకింకా మంచీ చెడ్డా తెలియదు పూరుకో.

సుబ్బా—మీ కన్నీ తెలుసును. ఇదివరకు బ్రాహ్మణులకు పెడుతూవచ్చినఫలం నేటికి కన్పించబడ్డది. నేనుచెపితే వింటారుగనుకనా? మీ మనసువచ్చినట్లు చెయ్యండి. (అని వెళ్లుచున్నాడు.)

---

## దురాచారదూషణము.

---

[విశ్వేశ్వరరావుగారును, గరళకంఠశాస్త్రిలవారును ప్రవేశించుచున్నారు,]

విశ్వే—శాస్త్రుల్లగారూ! వూళ్ళో విశేషాలు యేమిటి?

గర—విశేషాల కేమివున్నవండి? అంతా కలికాలం వచ్చినది. ఈయింగ్లీషు చదువుకున్నవారిమూలంగా అంతా వర్ణసంకర మవుతూ వున్నది. బాగా ఆలోచిస్తే యిదంతా వాళ్ల వాళ్ల బుద్ధిజాడ్యంలో వున్నదిగానండి యింగ్లీషుచదువులోనూ యేమీలేదండి. ఇంగ్లీషులో తమకంటె యెక్కువపాండిత్యంగలవారూ యెక్కువపరీక్ష యిచ్చిన వారూ యెవ్వరున్నారు? తమ బ్రాహ్మణపక్షపాతమూ మతాభిమానమూచూస్తే నాకు యెంతో ముచ్చటవుతుంది. యిది తమముందర ముఖస్తుతికోసం అనేమాట కాద్సుసుమండీ? నేను యిది నిజంగా త్రికరణశుద్ధిగా చెప్పేమాట.

విశ్వే—అవునండి. ఇప్పుడన్నీ పాడుదినాలు వచ్చినవి పూర్వపు రాజుల కాలమయితే మనమెంతైనా చేతుము. మనం లోపల యేమిచేసినా యీవర్ణసంకరం చేసేవాళ్ళను బహిరంగముగా యేమీ చెయ్యడానికి వల్లపడదు. అందుచేతనే లోపల నాకు వాళ్ళమీద

గొంతుకకాడికి కోపం వున్నా పయికి యేమీ యెరుగనివాడివలె నటిస్తాను.

గర — మీరు అవశ్యం వాళ్లకలాగు కనపడవలసినదే. అలా వుంటేనేకాని వాళ్లమర్మాలూ రహస్యాలూ ఆలోచనలూ తెలుసుకొని వాళ్లను సాధించడానికి వల్లపడదు. సమస్తతంత్రములూ తమకంటె యెవరికీ యెక్కువ తెలియవు. మిత్రభేదం వుంటేనేకాని కార్యం కానేరదు. రాజనీతిలో విష్ణుశర్మ మిత్రభేదమును యెంతబలముగా చెప్పినాడు? పంచతంత్రంలో కరటకదమనకులు వృషభందగ్గర మంచి మాటలు చెప్పి మిత్రభేదం చేసి దాన్ని యెలాగు చంపినారు? చిరంజీవి అనే కాకి గుడ్లగూబలతో. స్నేహంచేసి వాటినన్నిటినీ యేలాగు నాశనం చేసినది? ఇలాగంటి కథలు పుస్తకాలలో వింటూవుండడమేకాని అటువంటిశక్తి మీవద్ద తప్ప మరి యెక్కడా చూడలేదు. వాటివలెనే మీరు మీకార్యం సాధించి చివరకు జయభేరీ వేస్తారు.

• విశ్వే. — దైవానుగ్రహమువల్ల మనకృషి నెరవేరవలెను కాదండి. మన ఆచార్లవాళ్ళకయినా బుద్ధి లేదు. మనదగ్గిరకు వచ్చినప్పుడు తలకాయ ఆడించి పోయినా అవతలకు వెళ్ళినతరువాత వాళ్ళూ మనం చెప్పినట్లల్లా చెయ్యరు. పాడుముండాకొడుకులు దొరికేడబ్బు పోతుందేమో అని జడుస్తారు. మెట్టుమీదమాట మనలో యెవళ్ళకూ కట్టు లేదండి. నిజంగా వీళ్లల్లో కట్టయినా వున్నట్టయితే నేను చేసేకృషికి యెంతపని అయినా జరుగును.

గర — అవునండి మనవాళ్ళల్లోనే కట్టు వుంటే వాళ్ళాడినట్లల్లా సాగుతుందండీ? ఇంకా మీమతంలో కొంచెం కట్టు వున్నదండి. చూచినారా మొన్న మనవాళ్ళు యెంత విరుద్ధమైనకార్యం జరిగించినారో? అతిబాల్యవివాహాలుకూడ వని శాస్త్రానికిన్నీ శిష్టాచారానికిన్నీ

కేవలం విరుద్ధంగా వాదం చేస్తూవున్నందుకు పురుషోత్తమరావుగారి యింటికి యెవరూ వెళ్లకూడదని కట్టుచేసుకున్నామా అండి? అటువంటి స్థితిలో మన శిరస్తాదారుగారూ మొదలయినవారంతా అతణ్ని వెంట వేసుకుని వెళ్ళి చెరుకుతోటలో కలిసి చెరుకుపానకం పుచ్చుకున్నారట. యిటువంటిఅకార్యకరణం జరిగినతరువాత వాళ్లను వెలి వెయ్యకుండా వుంటే యింకా మతం యేమిటండీ. మీరు యిందులో గట్టిశ్రద్ధ చెయ్యవలెను.

విశ్వే—మీ స్మార్తులలో మీరున్ను జంబుకశాస్త్రుర్లగారున్ను కలిసి పని చెయ్యండి.ఆచెరుకుపానకం తాగినవాళ్లలో మా మతంవాడు కూడా వకడు వున్నాడట. అతగాడివిషయంలో నేను తగినంతపని చేస్తాను.మీరు యింటికి వెళ్లేటప్పుడు మరిచిపోకుండా లోకాచార్యులు గారిని మాయింటికి పంపించి మరీ వెళ్ళండి. అతగాడు వకమాటు నన్ను యెంతమాట అన్నాడనుకొన్నారు? ఆమాట విన్నప్పటినుంచీ అతని మీద నాకు క్రోపం వేధిస్తూ వున్నది. మొన్న మేముయిద్దరమూ వకచోట కలుసుకున్నప్పుడు “పంతులుగారు యెక్కడా దర్శనంలే” దన్నాడు, దర్శనంకోసం నేను తనయింటిచుట్టూ తిరుగుతూవుంటాననుకొన్నాడా?

గర—ఆయనకు చిన్నతనంకూడానండి. అదృష్టవశంచేత నెలకు నాలుగువందలు సంపాదిస్తూవున్నాడన్నమాటేకానండి లోకానుభవం యెంతమాత్రమూ లేదు. అనవచ్చినమాటా అనరానిమాటా తెలియదు. తమగౌరవం చూడకుండా తమరిని అటువంటిమాట అనడం కేవలం తప్పితం.

విశ్వే—నన్ను అతగాడు మర్యాద యెరుగకుండా చిన్నతనపు మాటలు అనడం యీవక్కమాటే కాదండి. చాలామాట్లు ఆలాగే

చేసినాడు. యీమధ్య యెవరితోటో నేను భోగందానితో వెళ్ళి రోగాలు తగిలించుకొన్నానని ప్రశంస చేసినాడట! నేను మగవాణ్ని గనుక మహారాజువలె నాడబ్బు నేను ఖర్చుచేసుకుని మనసువచ్చిన వాళ్లతో తిరుగుతాను. తనకుమల్లె అతిబాల్యవివాహాలు కూడవనే వాళ్లతోనూ వేదశాస్త్రాలు పౌరుషేయము లనేవారితోనూ స్నేహం చేసి కులహాని వచ్చేకార్యం యేమీ చెయ్యలేదు గదా? ఇప్పటివాళ్ళకు నవుకర్లను తిన్నగా వుంచుకుని వాళ్లచేత పని పుచ్చుకోవడం తెలియదు. నేను వక్కనవుకరును వుంచుకుంటే ముందుగానే రెండు పనులకు అక్కరకువచ్చేటట్టు ఆలోచిస్తాను.

గర—అవునండి. తమకూ వారికీ సాపత్యం యెక్కడండి? ఇప్పుడు మనం చెయ్యవలసిన కార్యం ముందుగా ఆలోచించవలెను. బుద్ధియందు తమరు బృహస్పతిని మించినవారు. తమకూ కచేరీకి వేళవుతూ వున్నది. వేగిరం సెలవియ్యండి. తమబుద్ధికి అసాధ్యం యేమీలేదు.

విశ్వే — మీరు స్మార్తుల నలుగురి యిళ్ళకూవెళ్ళి మొన్న తోటలోకి వెళ్ళినవాళ్ళయిళ్లకు యెవళ్ళూ తాంబూలానికీ భోజనానికీ వెళ్లకుండానున్ను పిలవకుండానున్ను బందోబస్తు చెయ్యండి. తన శిరస్తాదారీ యిక్కడ యేమైనా పనికివస్తుందేమో చూతాము.

గర—ఆయన శిరస్తాదారీ డాబూదర్పమూ యేమీలేదు. మూలనున్న ముసలిముండ లేవదు. డబ్బుపుచ్చుకోవడం చేతగాక మేమేమో లంచాలు పుచ్చుకోమనీ బహునిష్టాపరులమనీ సిగ్గులేకుండా చెప్పుకుంటారు. అప్రయోజకులంతా మడికట్టుకునే కూర్చుంటారు. ఈయన వచ్చి శిరస్తాదారీవఖరే చంపివేసినాడు. వుద్యోగం వున్నదని నలుగురికి వుపకారంచెయ్యనా అపకారంచెయ్యనా యేమీలేదు.

వెనుక కొండ్రలావు పంతులుగారు శిరస్తాదారీ చేసినప్పుడు గర్భాలలో పిండాలు అదిరిపోయేవి. వక్కకేక వేస్తే వూళ్ళోవాళ్లంతా గడగడవడకి బట్టలలో అల్పాచమానం చేసుకునేవారు. తెల్లవారేటప్పటికి గుమ్మంకాడ కూరలకావిళ్ళయితేనేమి కర్రలకావిళ్ళయితేనేమి పెరుగుకావిళ్ళయితేనేమి నూరుకావిళ్ళు వుండేవి. ఆయన నెలకు పదివేలు సంపాదించినా సంపాదించేవాడు. ఆవుద్యోగం తమకయితే తమదీఆలాగంటి హోరే. నిమిషంలో దొరను జేబులో వేసుకోరా? ఆలాగంటి అధికారం పట్టినప్పుడు మీపేరు చెపితే యెవరైనా చెరువులోనీళ్ళు తాగుతారండీ? మీరు బాగుపడ్డా మావంటివారిని పదిమందిని బాగుచేసినా ఆహోదా మీకేరావలెను.

విశ్వే—ఆవుద్యోగం నాకయితేనా యిలాగు శాస్త్రవిరుద్ధంగా నడిచేవాళ్లనందరినీ యేదోవక వంకపెట్టి పట్టితెప్పించి కొట్లోపెట్టించి వొక్కొక్కణ్ణే డజనబాజీ వేయించనూ? నాకు నాలుగేళ్ళు శిరస్తాదారీకానియ్యండి. నేను పశువులను కట్టివెయ్యడానికికూడా బంగారప్పు గొలుసులు చేయిస్తానోలేదో మీరే చూస్తారు—అరుగో గౌరీపతిగారు వస్తూవున్నారు. మీరు విజయం చెయ్యండి.

[గౌరీపతిగారు ప్రవేశించుచున్నారు.]

గర—నమోనమః నేను సెలవు పుచ్చుకుంటానండి.

గౌరీ—నేను రావడంతోనే మీరు వెళుతూవున్నారేమండీ?

గర—అయ్యా! మాయింట్లో శుభకార్యాలు వున్నవండి. బజారుకు వెళ్లవలెను. తరువాత తమబసవద్దకు వచ్చి దర్శనం చేసుకుంటాను. ఇందులో తమసహాయము లేకుండా శుభకార్యాలు కావండి. ఆశ్రితుణ్ణి మరిచిపోకండి. (అని వెళ్ళుచున్నాడు.)

విశ్వే—నాలుగుముక్కలు చదువుకున్నా డన్నమాటేకాని

యీ బ్రాహ్మడు వట్టిచేదస్తుడండి.

గౌరీ— వక్కచాదస్తుడుమాత్రమేకాకుండా దుర్మార్గుడుకూడానండి.

విశ్వే—మాకుక్కను చూచినారా ? దీనికి ఘుడియకువకమాటు వేలుపడుతూవుంటవండీ.

గౌరీ—మీరు కుక్కను ముట్టుకుంటూవుంటే యీశాస్తుర్లు వూరుకుంటాడండీ ?

విశ్వే — కుక్కను ముట్టుకుంటే శాస్త్రప్రకారం తప్పు లేదనిన్నీ కాశీలో కాలభైరవుడంటే మహామడి అనిన్నీ అక్కడ కుక్క ముట్టుకుంటే యెవరయినా అన్నం పారవేస్తే కళ్లు పోతవనిన్నీ తెలియనివాళ్ళు కుక్కను ముట్టుకోరాదంటారనీ బహుశ్లాఘించినాడు.

గౌరీ—ఈయనే మొన్న కుక్కను పెంచినవాళ్ల మొగం చూస్తే పాపం వస్తుందని అచ్యుతరావుగారియింటివద్ద శ్లోకం చదివినాడు.

విశ్వే—యిలాగంటి ఛాందసునిమాట మనం పాటిపట్టరాదు. నాకు యిలాగంటిపిచ్చి యేమీలేదు. యీలాగంటి వేదజడులమాట లక్ష్యంచెయ్యకుండామనంపనిచేస్తేనేకాని మన దేశంబాగుపడదండి.మీరు చెరుకుతోటలోకివెళ్ళినప్పుడు నన్ను పిలుచుకునివెళ్ళినారు కారుగదా?

గౌరీ—శిరస్తాదారుగారు మీవద్దకు మనిషినిపంపిస్తే చీట్లపేక ఆడుతూ కూర్చుని వుపద్రవమయినకడుపునొప్పి వచ్చిందని చీటివ్రాసి పంపించినారట కాదూ ?

విశ్వే—కాదండికాదండి. నాకు నిజంగా నేకడుపునొప్పి వచ్చిందండి. చీట్లపేక యెందుకాడుతూవున్నానంటే—జ్ఞాపకం చేసుకుంటూను—యెందుకాండి—నిద్ర రాకుండాను.

గౌరీ—భోజనం చెయ్యకముందు వుదయాన్న నిద్రపోతేనేమి! మీకు కడుపునొప్పివుంటే అసలు నిద్రవస్తుందండీ ?

విశ్వే—మీతోడు నామాట నమ్మండి. యెందుచేతనోకాని వైద్యుడు హృదయాన్న కూడా నిద్రపోవద్దన్నాడు. వకవేళ వైద్యుడు మరియేదైనా చెపితే నేనే ఆలాగుఅనుకున్నానేమో! మీకుఅసందేహం వుంటే రేపు మళ్ళీ పిలవండి. చెరుకుపానకంకాదు మీతోకలిసి భోజనం కూడా చేస్తాను.

గౌరీ—వెనుక తాంబూలానికి పిలిస్తే రాలేదుగాని యిప్పుడు భోజనానికి వస్తారు.

విశ్వే—నాకయితే నిజంగా రావలెననే వున్నదికానండి మా అన్నగారిభయంచేత రాలేకపోయినాను. మీరు నన్నుక్షమించవలెను యీరాత్రి మాలోపల నెల్లూరునుంచి వచ్చినభోగంవాళ్ళచేత పాట పాడిస్తాముగాని తమరు దయచేస్తారా? అందులో పసుచుకురది బహు బాగా పాడుతుందండీ.

గౌరీ — మీరు సంగీతంలో సరసులు. దాన్ని గ్రహిస్తారు. అందులో నాకేమీ అభిరుచి లేదండి. మీకు యింకా భోజనానికి వేళ కాలేదండీ?

విశ్వే—అయింది. తమరు మాట్లాడుతూవుంటే కూర్చున్నాను.

గౌరీ—అలాగయితే సెలవు పుచ్చుకుంటాను.

(ఇద్దఱును వెళ్ళుచున్నారు.)

---

## న వ నా గ రి కు లు.

---

[నరసింగరావుగారును, రామారావుగారును ప్రవేశించుచున్నారు.]

నర—రామారావు! ఎక్కడా జాడలేదు. యింగ్లీషు చదువు కొనివాళ్ళంతా బొత్తిగా శూపరిస్టిషన్‌లో మునిగిపోయినారు. వాళ్లకు

బొత్తిగా జ్ఞానం లేదు. నీవు తరుచుగా మాసహవాసం చేస్తూవుంటావు గనుక నీకు శూపరిస్టిషన్ అంత లేదు.

రామా — మీరు శూపరిస్టిషన్ అని తరుచుగా అంటూ వుంటారు. ఆమాట కర్థ మేమిటండీ ?

నర—శూపరిస్టిషన్అంటే మూఢభక్తి. పిచ్చినమ్మకము. అని దాని అర్థము. దానిచేతనే మనవాళ్ళంతా లేనిపోనిచాదస్తం పెట్టుకుని దేహం చెడకొట్టుకుని అనేకవిధాల నష్టములు పొందుతారు.

రామా—మీకుమాత్రం ఆశూపరిస్టిషన్ లేదా? మీరు వొళ్లు చెడకొట్టుకోవడం లేదా ?

నర — నీ వనేమాట నాకు తెలిసింది. నావిషయంలో అది శూపరిస్టిషన్లో చేరినదికాదు. వాళ్లయిష్టం లేకుండా చిన్నతనంలో తల్లిదండ్రులు చేసిన మ్యారియేజి బైండింగు కాదు. నాకు యిష్టంలేని దాన్ని తీసుకునివచ్చి నాతండ్రి నాకు కట్టిపెడితే నేను వప్పుకోవడం ధర్మం కాదు. దాన్ని యేలేవాడు నాతండ్రా నేనా? అందుచేత నేను దాన్ని విడిచిపెట్టి భోగందాన్ని వుంచుకుంటే అందులో యేమిన్ని తప్పిదం లేదు. వయస్సు వచ్చినతరువాత సంభోగం లేకుండా వుంటే అనేకరోగాలు పుడుత వని అనేకమందిడాక్టర్లు చెప్పినారు. నేనిప్పుడు దేహం కాపాడుకోవడంనిమిత్తమే వేశ్యను వుంచుకున్నానుగాని మరి వకటి కాదు.

రామా — నేను యెంత యింగ్లీషు చదువుకోకపోయినా భగవంతుడు దయచేసినజ్ఞానం నాకూ కొంత వున్నది. మీయిష్టం లేకపోతే మొట్టమొదట మీతండ్రిగారు పెళ్ళిచేసేటప్పుడే వద్దని గట్టిగా పట్టుపట్టి యెందుకు వివాహం చేసుకోవడం మానలేకపోయినారు ! మీరు సమాధానపడి వివాహం చేసుకోవడంచేత చేసుకున్నభార్య

కురూపి అయినా మూర్ఖురాలయినా మరి యెటువంటిలోపంగలది అయినా యేలడం విధాయకం. అలా యేలకపోతే తండ్రిగారు చేసినా రన్నతప్పితాన్ని బట్టి నిర్దోషురాలయినభార్యను నిష్కారణంగా శ్రమ పెట్టడం పాపం గాదా? మీరు మొట్టమొదటనే వివాహం కాకపోతే ఆచిన్నది తన్ను సుఖపెట్టేవాణ్ని మరి యెవరినైనా పెళ్ళిచేసుకొనునే.

నర—నాన్సెన్సు నీవు రీజన్ లేకుండా మాట్లాడుతూ వున్నావు. ఇంగ్లీషు రాకపోవడంచేత మంచీ చెడ్డా యెరగవు. అదంతా నీకంటె నాకు బాగా తెలుసును. నాహెల్తుకోసమూ ప్లెజర్కోసమూ నేను భోగందాన్ని వుంచుకుంటే దాని కేమయినా నేను అన్నానికీ బట్టకూ లోపం చేస్తూ వున్నానా?

రామా—అన్నానికీ బట్టకూ కాకపోతే స్త్రీలకు ముఖ్యంగా కావలసినదానికేమో దానికి లోపం జేస్తూ వున్నారు. మీరు చెప్పిన ప్లెజర్ మీవక్కరికేకాని స్త్రీల కక్కరలేదా? తండ్రిమాత్రం కూతురి అనుమతి పుచ్చుకుని మరీ పెళ్ళి చేస్తూ వున్నాడా? నా అనుమతిమీద వివాహం చెయ్యలేదు గనుక బలవంతముగా కట్టిపెట్టినవాణ్ని వదిలిపెట్టి నాయిష్టంవచ్చినవాడితో సుఖపడుతానని భార్య అంటే మనకు యెట్లా వుంటుంది? లోకంలో అందరూ చక్కనివాళ్లే వుండరు. భార్య చక్కనిదైతే పురుషుడు కురూపి అవుతాడు. మగడు చక్కనివాడైతే భార్య కురూపి అవుతుంది? యెవరికేది తటస్థమైతే దానితో తృప్తి పొంది వుండవలెను.

నర—నీవు మహాఅధికప్రసంగం చేస్తూవున్నావు. మావంటి రిఫైన్డు జెంటిల్మెన్తో వాదం చెయ్యడానికి నీవు తగవని ఇదివరకే చెప్పినాను. నీవు మాటివరకవిషయం మాట్లాడు.

రామా—ఇంగిలీషు చదువుకున్న మీనాగరికతకూ ఇంగిలీషు

చదువుకోని; మావంటివాళ్ళ అనాగరికతకూ నాకు యేమీ భేదం కనపడడం లేదు. నాకు తెలియక అడుగుతాను. ప్రవర్తనలో యేమి వ్యత్యాసం వున్నదో చెప్పండి. మీతో నాకు వున్న స్నేహాన్ని పట్టి చనువుచేత అడుగుతూవున్నాను. మనసులో కోపం వుంచుకోకండేమీ?

నర — పిచ్చివాడా! తెలియనివాళ్లు పిచ్చప్రశ్నలు వేస్తేనావంటి తెలిసినవాళ్లకు కోపంవస్తుందనుకున్నావా యేమిటి? అడిగినావుగనుక మాకూ మీకు వుండే భేదం చెపుతానువిను. మీరు పుణ్యంవస్తుందని నదులలోనూ చెరువులలోనూ బురదనీళ్లలోనూ మునుగుతారు. మేము శుభ్రమైన నీళ్లలోనేకాని స్నానము చెయ్యము. మీరు దేవుళ్లని రాళ్లకూ కర్రలకూ మొక్కుతారు. మేము వక్కదేవుణ్ని ధ్యానము చేస్తాము. మీరు శూద్రులు మొదలయినవాళ్ళు ముట్టుకుంటే మయిలపడుతామని దూరంగా తొలుగుతారు. మేము శుచిగావుంటే యెవరినైనా ముట్టుకుంటాము. మీరు చేదస్త్రంచేత ఇవి తినగూడదనీ అవి తినగూడదనీ మానుతారు. మేము దేహారోగ్యానికి అనుకూలమయినవన్నీ పుచ్చుకుంటాము. మీరు నోములూవ్రతాలూ వుపవాసాలుచేస్తారు. మేము అవన్నీ పిచ్చిఅని మానివేస్తాము. మీరు చెప్పులుతొడుక్కొని బిళ్లగోచీలు పెడుతారు. మేము బూట్సూ కోట్లూ మొదలయినవి వేసుకొని దొర్లవలె వుంటాము. ఇలాగంటి వ్యత్యాసాలు మీకూమాకూ లక్షవున్నవి.

రామా — మీకు వున్న నాగరికతఅంతా బూట్సులలోనూ కోట్లలోనేకాని మనసులోనూ నడతలోనూ యేమీకనబడదు. మీరు యేవిపడితేఅవి పుచ్చుకుంటామనిచెప్పి చెడతాగుతారు. రహస్యంగా మాంసం తింటారు. మళ్లీపైకి పదిమందిలోనూ అవియేమీ వప్పుకోక మాలాగువున్నట్లే నటిస్తారు. ఇన్నికబుర్లుచెప్పేవాళ్ళు మీరు తద్ది

నాలు మానివేసినారా? కార్యాలు వచ్చినప్పుడు విగ్రహాలను పూజించడం మానివేసినారా? శూద్రులను ముట్టుకుంటామని పబ్లికుగా వాళ్లతోకలిసి భోజనం చేస్తూవున్నారా? పయికి దొంగమాటలు యెన్నైనా చెప్తారు.

నర—కాలంవస్తే క్రమంగా అన్నీచేస్తాము. ఇప్పుడు మేము చెప్పేమోస్తరుగా అన్నివిషయాలలోనూ చేస్తే చాలానష్టాలు వస్తవి! ఇంగ్లీషు చదువుకున్నవాళ్ళు తాగుతారని నీవు మహాఆక్షేపణచేస్తూవున్నావు. తాగడం జబ్బు అనుకున్నావాయేమి? మితంగా తాగితే దేహానికి బహుమంచిది; అన్నం జీర్ణమవుతుంది; వంట్లో ఖుషాసాగావుంటుంది. మేము తాగితే ఫమలూ నుంస్లూ ఖర్చుపెట్టి సీమసారాలు తాగుతాముకాని దేశవాళీసారాలు తాగము.

రామా—మీరుకూడా అన్నీ మీరు చెప్పినట్టు చెయ్యానికాడికి మమ్మలిని ఆక్షేపించడం యెందుకు? యేదీసారా తాగుతానని పబ్లిగావచ్చి చెప్పండి. మీప్రజ్ఞ చూతాము. మీరు చెప్పేమాటలలో మీకు నమ్మకంవుంటే యేదీ మీవెధవచెల్లెలికి మళ్ళీపెళ్ళిచెయ్యండిచూతాము. లేకపోతే మీరెండోచెల్లెలికి సమర్తాడినదాకా పెళ్ళిచెయ్యకుండా అట్టేవుంచండి. చెప్పే శ్రీరంగనీతులన్నీ కనబడితవి. చేసేవి మాఘస్నానాలూ దూరేవి దొమ్మరగుడిసెలూ అన్నట్టు కదిలిస్తే అందరిలోపాలూ బయలుపడతవి. దొర్లమెప్పుకోసం వాళ్ళముందర మీరు మనసువచ్చినట్లల్లా తాగుతారు. అంతకంటే మీకూ మాకూ యేమీభేదం కనబడడంలేదు.

నర—ఆలాకాదు. మేము రీజన్‌లేనిది యేమీ చెయ్యము. మేము యెల్లప్పుడూ సమిష్టిమీద ప్రపంచంయొక్క యావత్సుఖం ఆలోచిస్తూవుంటామేకాని ప్రత్యేకంగా వక్కరిసుఖం చూడము.

ప్రపంచములో జనసంఖ్య యెక్కువఅయితే కాటకాలు సంభవిస్తవి. అందుచేత విధవావివాహాలలో మేము యిలాకా పుచ్ఛుకోము. బాల్య వివాహాములు మాన్పవలసినదేకాని ఇప్పటికాలంలో సాగవు. యేవీ వెయ్యికుటుంబాలిని వక్కమాటుగా నాతోరానీ నేను నాచెల్లెలికి సమర్తాడినతరువాత వివాహం చేస్తానోలేదో చూస్తువుగాని.

రామా——మీంమట్టుకు మీరు రాకపోతే వెయ్యిమంది యెలా గువస్తారు? అందరూకూడా మీలాగే ఆలోచిస్తారు. మొట్టమొదట వక్కడు దోవతొక్కి చూపిస్తే తరువాత వకరినిచూచి వకరు అందరూ ఆదోవనే నడుస్తారు. కార్యంలేనిమాటలతో యేమిప్రయోజనము? లక్షమంది నాతోవస్తే జాతివదలిపెడతానని నేనూఅంటాను. అదీ లేదు ఇదీలేదు. యెందులోవున్నా చెప్పినప్రకారం నడుచుకునేవారు యెవరో వారిని నేను మెచ్చుకుంటాను. చెప్పినదివకటీ చేసేదివకటి గాను వుండేదొంగలు యెందులోవున్నా కార్యంలేదు. మీవద్ద వక్క సీసాకాయలనాగరికతతప్పమరియేమీ కనబడడంలేదు. ఇంగిలీషుచదువు కున్నవాళ్లల్లో తాగకుండావుండేవాళ్లకు సారా వుపయోగం మీకు తెలిసినట్టు తెలియదాయేమిటి?

నర——వాళ్లకు తెలియనే తెలియదు. తెలిస్తే వాళ్ల కన్విక్షన్ ప్రకారం యెందుకు నడుచుకోరు?

రామా——మీరు యేమో ఇంగిలీషుమాటలు మహావేస్తుం టారు. వాటిఅర్థం నాకు తెలియదు. మీరన్న కన్విక్షనంతా పనికి మాలిన తాగడంలోనూ తినడంలోనూ కనబరచకపోతే లోకోపకా రమయిన కార్యాలలో యెందులోనయినా కనబరచరాదా? మీరు తాగడంలో యెన్నిలాభాలుచెప్పినా ఇలాగే మాటలు చెప్పి మంచి వయస్సులో బాగుపడేకాలంలో అకాలమరణం పొందేవాళ్లను నేను

తాగుబోతులలో నూటికి తొంభయితొమ్మందుగురిని చూస్తూ వున్నాను.

నర — మితంగా తాగకపోతే అలాగంటివి వస్తవి. నేను వుద్యోగం సంపాదించిన మూణ్ణెళ్లనుంచీ కొంచెంగానో గొప్పగానో బ్రాంగీ మొదలయినవి పుచ్చుకుంటూనే వున్నానుగదా ! నేను యింకా చావకపోవడంయేమి ?

రామా — నాకూ అదే ఆశ్చర్యముగా వున్నది. పీత్వా ఆరంభించినతరువాత మీస్నేహితుడు నాలుగేళ్ళదాకా బ్రతికినాడు. మొట్టమొదట మితంగా తాగుతా మని ఆరంభించినవా రంతా కొన్నాళ్ళలో మితంమాట మరచిపోతారు. మీ మొట్టమొదటి మితానికీ ఇప్పటిమితానికీ చాలా భేదం వున్నది.

నర—అవును. తప్పకుండా భేదం వున్నది. మనుష్యులకుక్రమంగా అభివృద్ధి పొందుతూవుండడం సహజగుణం. అదంతా ఇప్పుడు నీకు ఎక్స్ప్లయిన్ చెయ్యడముకు నాకు అవకాశం లేదు. కచేరీవేళ అయింది. మళ్ళీ రా చెపుతాను.

రామా—మీరు చెప్పబోయేఅభివృద్ధికీ మీకూకూడా పదివేల నమస్కారాలు. నాకు మీరు యేమీ చెప్పనక్కరలేదు. ఆఅభివృద్ధి లేకపోతేనే నేను పదికాలాలపాటు సుఖంగా బ్రతుకుతాను.

(అని వెళ్లిపోవుచున్నాడు.)

---

# లోకోత్తరవివాహము.

---

౧. రంగము—కరుణాకరశాస్త్రిగారి వీధియరుగు.

[కరుణాకరశాస్త్రిగారును, కుక్షింభర సోమయాజులు గారును ప్రవేశించుచున్నారు.]

కరు—సోమయాజులుగారూ! మన ముసలయ్య తాతగారికి ఆస్తి యేమాత్రం వుంచుండయ్యా?

కుక్షిం—అంతా యాభై వేలరూపాయలఆస్తికి పయిగావుంచుం దని చెప్పుకుంచారు. మాన్యాలమీదనే సాలుకు వెయ్యిరూపాయలు వస్తవవు.

కరు—ఇంతఆస్తి యెలా సంపాదించినాడయా?

కుక్షిం—ఈయన ముప్ఫయియేళ్ళు యేకాధ్వర్యంగా అముల్దారీ చేసినాడు. ఆకాలంలో అందరికీ కొయ్యపుస్తైలు కట్టించి తాలూకా అంతా దోచుకున్నాడు. ఇప్పటికి పింఛన్ పుచ్చుకొనే ముప్ఫయియేళ్ళయినది. వెనుక పోయినయిద్దరుభార్యాలూ పాడు చేశారుగాని లేకపోతే లక్షరూపాయలఆస్తి పైగా వుండును.

కరు—ఈయనకు అన్నీ యెన్ని పెళ్ళిళ్ళు అయినవి?

కుక్షిం—అయిదుపెళ్ళిళ్ళు అయినవి. ఈమహానుభావురాలు అయిదోపెళ్ళాము. ఈవిడె అందరకూ ధర్మసత్రం వేసింది.

కరు—యెక్కడనో వొక్కొక్కపతివ్రత తప్ప ముసలిమగనిని చేసుకున్నవాళ్లంతా యీలాగే వుంచారు. యీాయనకు వక్కభార్యా వల్లనూ సంతానము లేదుగదా?

కుక్షిం—ఈయన పడుచుతనంలో పెళ్ళాన్ని వదిలివేసి పోఖరీగా తిరిగి అనేకజాడ్యాలు తగిలించుకొన్నాడట. ప్రథమభార్యా యీ

విచారంచేతనే చచ్చిపోయిందని మానాయనగారు చెప్పుచూవచ్చేవారు. రెండో భార్యను నేను యెరుగుదును. ఆవిడ బహుపెద్దమనిషి. ఆమెకు సంతానం కలిగించి కాదని పింఛను పుచ్చుకొన్నతరువాతనే మూడో పెళ్లి చేసుకున్నాడు. ఆమె బహుప్రసిద్ధురాలు. ఆమెకాలంలో వీరి యిల్లు వెనుక యీయన అమల్‌దారీ చేసినకాలంలో వుండేటట్టు ఆమె ఆశ్రితులతోను వుమేజువారులతోను నిండి వుండేది. ఆమె దానగుణం చేత యిల్లంతా యితరులకు దోచిపెట్టింది. పోచూపోచూ వక్క-కొడుకునుమాత్రము కని మరీ పోయింది. ఆమె పోయినసంవత్సరములోనే రెండో భార్యకూడా పోయింది. తరువాత యీయన నాలుగో పెళ్లి చేసుకున్నాడు. ఆమెకూడా బహుప్రసిద్ధురాలే. అయితే అందులో ఆమె కొంచెం పతివ్రత. వక్కవంటబ్రాహ్మణ్ణో చాకలవాణ్ణో యింట్లో వుండేవాణ్ణే యెవ్వరినో వక్కరినే నమ్ముకొని వాళ్లనే అందినంతమట్టుకు పెట్టి బాగుచేసింది. యీయనకొడుకూ కోడలూ పెద్దవాళ్లయి ఆమెతో పడక పోట్లాడి లేచిపోయి మేనమామగారి యింటివద్ద వుండి యిద్దరూకూడా మరిడీజాడ్యంచేత కాలం చేసినారు. తరువాత ఈ అయిదోఆవిడచరిత్ర రెండేళ్లబట్టి మీరు చూస్తూనే వున్నారు గదా?

కరు—ఈమె విస్తారం ఖాయిలాగా వున్నట్టున్నది. యీమె యింతటితో సెలవుపుచ్చుకుంటేనే బాగుండును. ముసలయ్యతాతగారు యీసారయినా మంచిదాన్ని పెళ్లిఆడుచారు.

కుక్షిం—శతవృద్ధు యింకా ఆయనకు యెవ్వరు పిల్ల నిస్తారు?

కరు—యేమహానుభావు లయినా యిస్తారు. సహస్రమాసజీవి ఆయనకు పిల్లనివ్వడమే యివ్వడము. అటువంటివాడు అల్లుడు కావడం భాగ్యం యెంతపుణ్యంచేస్తే వస్తుంది? అదిగాక యెవరికయినా డబ్బు

చేదా యేమిపి? డబ్బుచూస్తే కొండమీది దేవుడు దిగివస్తాడు. అంతగా యెవరూ పిల్ల నియ్యకపోతే మా అమ్మాయిని యిచ్చి ఆకన్యాదాన ఫలము నేను దక్కించుకుంచాను. కన్య నిచ్చి డబ్బు పుచ్చుకుంటే పాపం వున్నదికాని సాలంకారకన్యాదానం చేస్తే వెయ్యియజ్ఞాలు చేసినఫలం వస్తుం దని శాస్త్రాలు చెప్పుచూ వున్నవి.

కుక్షిం—మీరు వూరికే వేళాకోళానికి అంచూవున్నారుగాని లేక లేకపుట్టిన వక్కచిన్నదాన్ని మీకుమాత్రం యిస్తారా?

కరు—ఇస్తే యేమి తప్పా? నాప్రతిజ్ఞ వినండి. పంతం వచ్చిం దంటే నాతో సమానమయినసాహసంగలవాడు మరివకడు లేడు. నేనే గనుక పిల్ల నియ్యకపోతే నా చెవులవి కుండలాలు గావు; నేను చదువు కొన్నది శాస్త్రము కాదు.

కుక్షిం—ఇస్తే తప్పిదమనికాదు. అటువంటివారికి కన్యాదా నము చెయ్యడమే కేవలమూ పరమార్థం. తమవంటిపండితులయిన మహానుభావుల కేవరికోతప్ప యీకలికాలంలో పరమార్థచింత లేదు. మీరు చిన్నదాన్ని యిదివరకే యెవరికో యివ్వడానికి నిశ్చయించినట్టు విన్నానే.

కరు—ఇంకాపరిధానం కాలేదు. "దత్తా మపి హరేత్పూర్వా చ్ఛ్రేయాం శ్చేద్వర అవ్రజేత్." అని మంచివరుడు దొరికినట్టయితే యిచ్చినదానినైనా మళ్ళీపుచ్చుకొమ్మని యాజ్ఞవల్క్యులవారు ధర్మశా స్త్రంలో సెలవిచ్చినారు. మొన్న దశమినాడే వివాహము కావలసినది. యింతలో ముసలయ్యతాతగారి భార్యా ఖాయిలామాట విని యిది యేదీ తేలిందాకా నిలుపుదామని మాయింట్లో మయిలవచ్చినదనిబొంకి రెణ్ణాళ్ళు వట్టిదే మయిలబొట్టు పెట్టినాను. వివాహకార్యంలో అబద్ధ మాడితే దోషంలేదు. నూరుకల్లలాడి వక్కయిల్లు నిలువబెట్టుమ

న్నాను. అంతేకాకుండా శ్రీమద్భాగవతంలో "వారిజాక్షులందు వైవాహికములందు ప్రాణవిత్తమానభంగమందు చకితగోకులాగ్ర జన్మరక్షణమందు బొంకవచ్చు నఘముపొందదధిప" అని శుకాచార్యులవారు వివాహకార్యంలో అబద్ధమాడవచ్చునని మొదటనే స్పష్టంగా చెప్పివున్నాను. "ప్రాణహానివచ్చుచో బరిణయమున" నని పంచమవేదమయిన శ్రీమహాభారతంలో వేదవ్యాసులవారుకూడా బొంకితే పాపములేదని ఆనతిచ్చినారు. అంతగా వాళ్ళు చిక్కులుపెట్టి బాధిస్తే వాళ్లవద్ద పుచ్చుకొన్న సొమ్ము గిరగిరతిప్పి వాళ్లమొఖంమీద పారవేస్తాను. మాపెత్తండ్రిగారి కుమారుడు యిప్పటి శంకరాచార్యులవారు తనకూతురువిషయంలో అలాగే చేసినారు.

కుక్షిం—మీ దివ్యసంకల్పంవల్ల ఆచిన్నది జీవించదు. నేడోరేపో అన్నట్టువున్నది. మీకర్మిష్ఠతయేమి? మీతపః ప్రభావమేమి? మీశిష్టత్వమేమి? సిద్ధసంకల్పులు మీవంటి బ్రాహ్మణ్యుల కోరిక పూరికేపోతుందా? మీకుభాగ్యంవచ్చినతరువాత బంధువుణ్ణి బీదవాణ్ణి నన్ను వక్కకంటజూచి కనిపెడుతూ వుండవలెనుసుమండీ!

కరు—అది మీరు నాతో చెప్పవలెనా? ముసలయ్యతాతగారికి పళ్ళువూడిపోయినవి. ఇంద్రియపటుత్వము పోయినది. చెవులు తిన్నగా వినబడవు. చూపు తిన్నగా కనబడదు. తలవణుకుచ్చూవున్నది. నెత్తియేకులబుట్టలాగు అయినది. భర్తృహరిచెప్పినట్టు అన్నీ ముసలివైనవిగాని వక్కఆశమాత్రం ముసలితనంపొందకుండా రోజురోజు పడుచుదవుచూవున్నది. ముసలయ్యగారు అథాత్తుగా యేవేళనో గుటుక్కుమనకుండా యీముండపోయిన పదమూడో నాడయినా ముడిపడితే ఆస్తి అంతా మనకే దక్కుతుంది. ఆవిడకు వైద్యం యెవరు చేస్తున్నారూ? అది నేను విచారిస్తాను లెండి. మయిల పడి

రోజులు లేకుండావుంటే బాగా వుండును. అయిదో పెళ్ళానికి వక్క-
రోజుతో సరిఅని కారిక తీసుకొనివస్తే పనికివస్తుందా? యీలోగా
కర్మలు చేసేటప్పుడు స్నానాలలో ప్రాణం యెక్కడపోతుందో.

కుక్షిం — ఇవన్నీ సరేకాని బుద్ధివచ్చినపిల్ల మీ కొమార్తె
వప్పుకుంచుందా?

కరు — వప్పుకోక యేమిచేస్తుంది? కుశ్శంకలు చేసి అడ్డాలు
పెట్టిపోతుందేమో అనే మాపిల్లను నేను గరల్సుస్కూలుకు పంపినాను
కాను. వప్పుకోవడానికీ వప్పుకోకపోవడానికీ దానికి స్వతంత్రం
యెక్కడిది? “నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి” అని మనుస్మృతిలో వున్నది.
మీరు వినలేదా? “పితా రక్షతి కౌమారే” అన్నాడు గనుక తండ్రి
శవానికి కట్టిపెట్టినా కూతురు చచ్చినట్లు వప్పుకోవలెను. దానికిమాత్రం
డబ్బు చేదా యేమిటి? కాస్తప్రాణమూ గుటుక్కుమన్నతరువాత
డబ్బుపెట్టుకుని హాయిగా సీమరాణివలె సమస్తసుఖాలూ అనుభవించ
వచ్చును. దాని సుఖానికి తల్లిదండ్రులము మేముమాత్రం అడ్డం
పెడచావ్యా యేమిటి? యెవరు వచ్చినా చూచీచూడనట్లు వూరుకుండి
యెప్పుడయినా యిబ్బంది వస్తే పాపపరిహారార్థం శిశుయజ్ఞం చేసి కులం
చెడకుండామాత్రం చూస్తాము. ఈకలియుగంలో నరమేధయాగాలు
యెందుకు లేకుండా చేసినారయ్యా?

కుక్షిం — మీరు సెలవిచ్చినట్టు అమంత్రకంగా రహస్యముగా
జరుగుతవని సమంత్రకముగా మానివేసినారు. ఇదీ మతంలో చేరినదే.
ఈశిశుమేధం చేస్తేనే కులంలో ప్రతిష్ట; చెయ్యకపోతే కులం చెడిపో
తుంది. కులకట్టుపాటు ఆలాగువుండవలెను.

కరు — సోమయాజులుగారూ! మీరు సోమం చేసినారుగదా?
అశ్వమేధాంతమూ శ్రౌతము చేయిస్తారుగదా? యీనరమేధయా

గము క్రియ మీా కెక్కడనయినా వచ్చినదా ?

కుక్షిం—ఈక్రియ నాకు రాలేదు. ఇది ఆయుర్వేదములో కాబోలును వున్నది. వైద్యశాస్త్రం తెలిసినవారి నడిగితే తెలుస్తుంది. ఈయాగాలలో వారే అధ్వర్యులు. హోతలు మొదలయినవారంతా స్త్రీలు. ఇందులో స్త్రీలయాజమాన్యం విస్తారం.

కరు— ఆమాట అవసరం వచ్చినప్పుడు విచారింతాముకాని ముసలయ్యతాతగారిభార్యాసంగతిమాత్రం విచారిస్తూ వుండవలెను.

కుక్షిం—అది విచారింపనక్కరలేదు. ఆచిన్నది పోయినట్టే యెంచుకొని మీాప్రయత్నంలో మీారు వుండండి. ఆవిడ రేపోమాపో స్వర్గానికి వెళ్ళి భర్తకోసం ప్రతినిమిషమూ యెదురుచూస్తూవుంచుంది! ఆయనకూ వుబ్బసపుదగ్గు. జాతివైద్యం మంచిదికాదని తెనుగు వైద్యం చేస్తూవున్నారు. 'నాచేతిమాత్రా వైకుంఠయాత్రా' అన్నట్టు యీా వైకుంఠవైద్యునిచేతులో పడ్డవారు యెవ్వరూ స్వర్గలోకసుఖానికి వెళ్ళకుండా యీాపాడులోకంలో చిరకాలం కష్టం అనుభవిస్తూవుండరు. కొన్నాళ్ళు హెచ్చుతగ్గుగా యీాదంపతులను యిద్దరనూ ఈయనే మాట దక్కించుకుంచారు.

కరు—ఆలాగయితే మీారేలాగయినా బతిమాలుకొని మూాడు ముళ్ళు పడేవరకూ ముసలాయనకుమాత్రం అవుషధం యివ్వకుండా జాగ్రత పెట్టండి. సప్తపది అయినతరువాత కావలిస్తే కావలసినన్ని మందులు యివ్వవచ్చును. సప్తపదితో వివాహం పూర్తిఅయి ఆస్తి వస్తుంది కాదండీ?

కుక్షిం—మీా కాతొందర యేమి? నాగవల్లి అయినదాకా కూడా మందు యివ్వకుండా ఆపుదాము. తరువాత గృహప్రవేశ మహోత్సవమూ దినవారమహోత్సవమూ వక్కసారే కావచ్చును.

ఖర్చులో ఖర్చు కలిసి వస్తుంది.

కరు — మీ నోటివాక్యాన అంతటిభాగ్యం పట్టవలెనుగాదూ? యీ ముసలిముండాకొడుకు తనచేతిమీదుగా యెందరినో భార్యలను చంపినాడు. ఇంకా తీసుకుంటూ యిలాగే బ్రతుకుచాడేమో!

కుక్షిం — ఈసారి బ్రతుకకుండా నాది పూచీ. మీకన్యాదాన ఫలం పూరికే పోదు. డబ్బు పుచ్చుకోకుండా కన్యాదానం చేస్తే యీ మాత్రంఫలం కలుగకపోతే ఇఖ మనశాస్త్రాలన్నీ వట్టివే కావలెను. మీరుకూడా యింట్లోనే వుంచారు గనుక ఇఖ ఆయనదినాలు వేళ్ళ మీద లెక్కపెట్టవలసినదే.

కరు — పెళ్ళిలోమాత్రం విస్తారంఖర్చు కాకుండా చూడండి. పయిన చెప్పిన యిబ్బంది యేమీ రాకుండా దేవాలయములో ముడి పెట్టి వక్కపూటలో పెళ్ళికానిస్తే అంతా ఫదిరూపాయలలో అవుచుంది; అవతల యేమయినా ఫర్వాలేదు.

కుక్షిం — అలాగే చూతాము. ఇప్పుడు పని వున్నది. నేను వెళ్ళి మళ్ళీ వస్తాను.

కరు — చిత్తము. వెళ్ళి రండి. కార్యమయినదాకా ఇది బ్రహ్మ ఖేద్యంగా వుండవలెను సుమండీ.

(అని యిద్దఱును వెళ్ళుచున్నారు.)

---

౨. రంగము — ముసలయ్యగారి గది.

[ముసలయ్యగారు యేడ్చుచుండఁగా కుక్షింభరసోమయాజులుగారు ప్రవేశించుచున్నారు.]

కుక్షిం — పోయినదానికోసం మీరు యేడిస్తే కార్యం లేదు. బహుపెద్ద లయినారు. గట్టిగా యేడిస్తే మీకెక్కడ శోష వస్తుందో.

మొగవాళ్ళు మీ రన్నివిధాలా అదృష్టమంతులే. అనుభవించవలసిన యోగం లేక అదే మన్ను కొట్టుకొని లేచిపోయిందికాని యిష్టంవుంటే భాగ్యవంతులు మీకు రేపే యీపాటికి యింతకంటె మంచిపెళ్ళాము వస్తుంది.

ముస — లోకానికి కొంచెం పయికి యేడవకపోతే బాగా వుండదు. ముందుగా మీమనసు తెలియక యేడవకపోతే మీ రేమనుకుంటారో అని పయికి కంటతడి పెట్టినట్టు నటించినానుకాని యీముండ పోవడం మనసులో నాకు సంతోషంగానే వున్నది. పయికి చెప్పుకుంటే అప్రతిష్ఠ; యీముండ నన్ను గర్భాధానంనాడయినా పయిని చెయ్యి వెయ్యనిచ్చినది కాదు. నాకు అసలే దీని వెనుకటిదానికాలంనాడే కామం పోయింది. అ[illegible]ప్పటికి వెనుక అనుభవించి అలవాటుపడి వున్నవాసనచేత యె[illegible]తిమాతా[illegible] కొంచెం భ్రమపుట్టి మీద చెయ్యి వెయ్యబోతే ముసలి[illegible]లో పడ్డవారు [illegible]ని కాట్లకుక్కలాగు కరవవచ్చేది. అస లది తిన్నగా [illegible]కంలో చిరకాలం లోకే వచ్చేదికాదు. యెప్పుడయినా తప్పిదా[illegible]త్తగా యీదంపతులను [illegible]సి మళ్ళీ బయిట తలుపు గొళ్ళెము పెట్టిపోయే[illegible]రు. [illegible]బ్బుకొనివచ్చి అల్పాచమానానికి వెళ్ళడానికి వల్ల[illegible]రేలాగయినా బతికించుకోడుకును లోపల వక్కణ్ణే చీకట్లో చచ్చిపోయేవాణ్ణి మాత్రం అవుతల్లడిచేసుకోరాదు.

కుక్షిం — అలా కాదు. నేను మీ[illegible]లోవాణ్ణి. నాతో చెపితే యేమీ రహస్యభంగం వుండదు.

ముస — అందుచేతనే యిదంతా నీతో చెప్పినాను. దీనికి కడుపు వచ్చినప్పుడు నాకు మరీ అసహ్యం వేసినది. వకరోజు వళ్ళు మండి కడుపు దింపుకొమ్మని అల్లరిచేశా మన్నంతకోపంకూడా వచ్చినది. మళ్ళీ కడుపు దించుకుంటే కాళ్ళమీద పడుతుం దని నాలో నేనే వస్తా

యించుకొని వూరుకున్నాను. ఆకడుపుపుణ్యంగా వకరోజు రాత్రి వచ్చి నామీద చెయ్యివేసి కౌగిలించుకొని పడుకుంది. నాకక్కడికే బ్రహ్మానంద మయినది. నాసత్యంగా చెపుతాను. జన్మానికల్లా శివరాత్రి యింతకుతప్ప నేను దానిమీద యెప్పుడైనా చెయ్యివేసినపాపాన్ని పోతే మాతృద్రోహం చేసినట్టు.

కుక్షిం—సరిసరి! మీరు వట్టుపెట్టుకోకపోతేమాత్రం మీమాట నేను నమ్మనాయేమిటి? మీరు చెప్పినవన్నీ వేదవాక్యాలు.

ముస—తరువాత వృద్ధాప్యంలో మంచిపుత్రుడైనా పుడుతాడని ఆశపుట్టి మీవంటివారినందరినీ విందుకు పిలిచి మహావైభవంతో పుత్రోత్సవం చెయ్యవలెననుకుంటూవుండగా ఆరోనెలనే కడుపు దిగబడిపోయింది. నిరుడు యీకడుపు రాకమునుపు దీనిమనసులో మరివక దుర్బుద్ధికూడా వుండేది. యెందుకదంతా యిప్పుడు?

కుక్షిం— సందేహించకండి. అది యేమిటో నాతో సెలవియ్యండి. నేను రహస్యం యెవరికైనా వెల్లడిచేస్తాననుకున్నారా యేమిటి?

ముస—నేను శీఘ్రం చచ్చిపోతే యీడబ్బు పట్టుకొనిపోయి మళ్లీయెవరినైనా పడుచువాణ్ని పెళ్లిచేసుకోవలెనని దానిమనసులో వుండేది. విధవావివాహాలు చెయ్యడం బాగా వున్నదని వకనాడు అది అనడంచేత నేను దానిమనసులో అభిప్రాయం కనిపెట్టినాను.

కుక్షిం—బుద్ధిమంతులు అంతమాత్రం మీరు కనిపెట్టలేరూ! అసలు మీరు ఆవలిస్తే పేగులు లెఖ్ఖపెట్టేవారు. మీబుద్ధికి బృహస్పతికూడా చాలడని నాయభిప్రాయము. యెంతబుద్ధిమంతుడూ కాకపోతే బృహస్పతి లేచిపోయినభార్యను కడుపుతోవున్నదాన్ని తెచ్చి యింట్లో పెట్టుకొని అంతసహనం వహించగలడా?

ముస—ఆడవాళ్లు మహాచెడ్డవాళ్ళు. యెంతచెడ్డవాళ్ళూకాక

పోతే ,,తలతడివి బాసచేసిన జలజాక్షుల నమ్మరాదు సారంగధరా"
అన్నమాట వూరికే పుట్టిందీ ? వాళ్లకున్నంతకామము లోకములో
యెవరికీలేదు. అందుచేతనే శాస్త్రకారుడు ,,సాహసం షడ్గుణంచైవ
కామంచాష్టగుణం భవేత్ "అని చెప్పినాడు. స్త్రీలనుకోసి వుప్పుపాతర
లో వూరవేసినా పాపం లేదు. వాళ్లను చిన్నప్పుడే తలగొరిగించి ముసు
గువేసి మూల కూర్చుండబెట్టి తిన్నగా తిండిపెట్టక బ్రతికివున్నంత
కాలమూ మాడ్చి చంపవలెను. ఆలాచేసినా వీళ్ల కామంపోక అడ్డమయిన
అకార్యాలూ చేస్తూ వున్నారు. ఇప్పుడు స్త్రీపునర్వివాహసమాజా
లంటూ మనపాలిటికి మృత్యుదేవతలువలె వకటి పోగయినవి. చిన్న
పిల్లలను చేసుకొన్న నావంటిముసలివాళ్ళ కందరికీ వాటిపేరు చెపితే
వళ్ళు దడయెత్తుతుంది. ఆడముండలకు రెండోపెళ్ళి యేకాలంలోనైనా
వున్నదటయ్యా ! యిప్పు డీమాలపభుత్వంమూలంగా అన్నీ విడ్డూ
రాలు పుడుతూ వున్నవి. మహాకలి ప్రవేశించింది. యిఖ వర్ణాశ్రమ
ధర్మాలు నిలిచేయోగం లేదు. వెధవముండలపాలింటికి మనస్వాముల
వార్లున్ను పండితులున్నూ చేరి యిలాగు పనిచేస్తూవుండబట్టికాని లేక
పోతే వాళ్లందరూ వక్కదెబ్బను పెళ్ళిచేసుకోరా ?

కుక్షిం—తమరు ముందు కార్యంసంగతి చూడవలెను.

ముస—ఏది వివాహకార్యంసంగతాయేమిటి ? యెవరయినా
నాకు యిప్పుడు పిల్లనిస్తారా? శాస్త్రుల్లగారి కూతురట! యెవరో యీ
మధ్య ఘదేశ్శపిల్ల మనయింటికి వచ్చినది. ఆపిల్లను మనకిస్తే మహా
బాగావుండును.

కుక్షిం—ఆవిషయం నేను కృషిచేస్తాను. మీకు పెళ్ళికూతురిని
సంపాదించడపుపూచీ నాది.

ముస—యేదోవకపిల్లకాదు. నేను యిప్పుడు చెప్పినపిల్లే బహు

బాగావుంటుంది. కామం వుడిగినవాడికి నీకు పెళ్ళియెందుకంటారేమో వినండి. “ధర్మప్రజాసంపత్యర్థం” అని వివాహములో సంకల్పం చెప్తారు. కొందరు దానికర్థము ధర్మసంతానమునిమిత్తమంటారు, కొందరు ధర్మము నిమిత్తమూ సంతానము నిమిత్తముకూడా నంటారు అందులో యెలాగయినా ధర్మం ముఖ్యము. వెధవవివాహాలు కామం నిమిత్తం చేసుకునేవివాహాలు,వివాహాలే కావు.

కుక్షిం—అవును మీరు కేవలమూ ధర్మమునిమిత్తమే వివాహమాడబోవుతున్నారు. వివాహం కర్మలు నిలవడానికికాని కామం కోసముకాదు. మీపూర్వజన్మపుణ్యంవల్లనో చేసుకున్నదానిపతివ్రతామహత్యంవల్లనో కలిగితే సంతానమూ కలుగవచ్చును.

ముస—అవును కలిగితే కలుగనూవచ్చును. ముసలవాళ్ళకు పడుచుతనంవచ్చేమందు యేమయినావున్నదేమో మన వైద్యుణ్ని అడుగవలెను.

కుక్షిం—అటువంటిమందులు గోసాయిలవద్ద వుంటవి. పూర్వం యయాతికివచ్చినట్టు మీకు ముసలితనంపోయి యెప్పుడయినా పడుచుతనం రావచ్చునేమో ? మీఅదృష్టం యెవరు చూచినారు ?

ముస—మనవూరికి గోసాయీలు వచ్చినప్పుడల్లా నాతో చెప్తూవుండండి. ఏపుట్టలో యేపామున్నదో యెవరు చూచినారు? అందరినీ అనుసరిస్తూవుంటే యేమహానుభావుడయినా అనుగ్రహం వచ్చి పడుచుతనంవచ్చేమందో మంత్రమో వుపదేశం చేస్తాడు. లేకుంటే యోగం నేర్చుకొని యెల్లకాలమూ బ్రతికే సదుపాయము ఆలోచింతునా ?

కుక్షిం—అది సర్వోత్తమమయినది. రోజూ వూపిరి బిగపట్టడం అభ్యాసం చేస్తే యెల్లకాలమూ బ్రతుకవచ్చును.

ముస—తరువాత యేమిచేసినా ముందుగా పెళ్ళిచేసుకుంటే యెందుకయినామంచిదే. నాలుగు కొట్టినా తిట్టినా స్వతంత్రంగా చేసుకున్న పెళ్ళామువంటిది వకటీకాదు. పెళ్ళామని వకటీవుంటే ముసలివాడికి కాళ్ళు పడుతుంది. చేతులు పడుతుంది. ఇందులో కర్మలు నిలవడం మరీముఖ్యము.

కుక్షిం—అలాగయితే మళ్ళీ పెళ్లి అయినతరువాత అవుపోసనమూ అగ్నిహోత్రాలూ వైశ్వదేవమూ వుంచండి.

ముస—అబ్బో! అన్ని నేను వుంచలేను. లౌక్యాగ్నిహోత్రాలు నాకు యెప్పుడూ వున్నవి. ఈవుబ్బసపుదగ్గుమూలంగా రాత్రీ పగలూ మరీ అవిచ్ఛిన్నముగా జరుగుతూ వున్నవి. యీచిల్లరవన్నీ మానివేసి చేస్తే నాకు వక్కయజ్ఞం చెయ్యవలెనని వున్నది. యజ్ఞంచేస్తే రంభాసంభోగం కలుగుతుందట కాదూ? నాకు రంభను వెళ్లి కౌగిలించుకోవలెనని మహాఆపేక్ష వున్నది. నేనైతే భోగంవాళ్లను చాలామందిని వుంచుకొన్నానుకాని వాళ్లు యెవళ్ళూ చక్కదనానికి రంభకు చాలరట! యజ్ఞం చేస్తే వక్కరంభేనా యింకా అక్కడ వున్నవాళ్ళు యెవళ్ళయినాకూడా వస్తారా?

కుక్షిం—యజ్ఞంచేస్తే రంభా, మేనకా, ఊర్వసీ మొదలైన అప్సరస్త్రీలందరూకూడా వస్తారు.

ముస—ఊర్వసికూడా తప్పకుండా వస్తుందిగదా! ముసలివాణ్ణి అని వకవేళ రాదేమో! తీరా స్వర్గానికి వెళ్లినతరువాత అప్పుడు రాకపోతే నేనేమిచెయ్యను?

కుక్షిం—మీరు అధైర్యపడకండి. మీరు యింకా నూరేళ్ళు బ్రతికివెళ్లినా యజ్ఞంచేస్తే వాళ్ళు మీరు యెప్పుడువస్తారా అని యెదురు చూస్తూవుంటారు. మనశాస్త్రాలు అలాగు చెపుతూ వున్నవి. అవి

యెన్నటికీ అబద్ధాలు కావు.

మున—ఆలాగయితే మనశాస్త్రులు బహుమంచిశాస్త్రాలు. వాటితో సమాన మయినవి జగత్తులో లేవు. నాకు తప్పకుండా నేను చెప్పినపిల్లను యీమధ్యాహ్నం వివాహంచేయించండి. వెంటనే యజ్ఞం చేసివేస్తే యీలోకంలో భార్యతో సుఖం లేకపోయినా స్వర్గలోకంలో అయినా రంభతో సుఖపడుతాను. రంభ నాతో కుదురుగావుంటుందా? యింతలో యజ్ఞం చేసినవాడు మరి యెవడైనా వచ్చినాడని పరుగెత్తుతుందా? పోనీ దానిముఖం చూస్తేనే చాలును. నిముషాలమీద పెళ్లి కానియ్యండి.

కుక్షిం—శవం యింకా యింటినుంచి కదలలేదాయెను. మయిల పదిరోజులూ వెళ్ళకుండా పెళ్లి యేలాగవుతుంది? పదమూడోరోజుదాకా వోపిక చెయ్యండి.

మున—అయ్యో ముండా! బ్రతికి చచ్చికూడా నన్నేడిపిస్తూవున్నావు? చచ్చేముండ మయిలలేకుండానయినా చావరాదా? నేను వుత్తరక్రియలు మానివేస్తే మయిల రాకుండా వుంటుందా?

కుక్షిం—అలా మానివెయ్యడం శాస్త్రవిరుద్ధం. మీరు మయిల పట్టి కర్మ ఆచరించవలెను.

మున—మయిల పట్టవలెననీ కర్మ చెయ్యవలెననీ కూడా మీరు యిందాకా చెప్పినశాస్త్రములోనే వున్నదా?

కుక్షిం—ఆ శాస్త్రంలోనే వున్నది.

మున—ఆలాగయితే మనవి వట్టి వెధవశాస్త్రులు. ఆశాస్త్రులు చేసినవాళ్ళందరూ కేవలమూ బుద్ధిహీనులు? వాటి నన్నిటినీ కట్టకట్టి వకక్కమాటు తగలపెట్టించండి. శాస్త్రములు యేమిటి? ముసలముండా కొడుకును పెళ్ళిచేసుకోకుండా పెళ్ళాము పోయినతరువాత పదిరోజులు

ఆగమనడం యేమిటి? నేను యీలోగా పోతే సాయుజ్యమూ రంభా సంభోగమూ అన్నీ మన్ను కొట్టుకొని పోవలసిన దేనా?

కుత్సిం—మీరు సిద్ధసంకల్పులు. అన్నీ మీయిష్టప్రకారమే జరుగుతవి. యోగుల కీకర్మకాండ యేమీ అక్కరలేదుకాని సంసారంలో వుండేవారికి యీలోకంకోసం అన్నీ కావలెను.

ముస—అలాగయితే నేను యికను సంసారం విడిచి వైరాగ్యం అవలంబించి యిప్పుడే యోగి నవుతాను. నా కీలోకంతో సంబంధం లేదు. ఈమధ్యాహ్నం పెళ్ళి చేయించండి. గడ్డమూ గోళ్ళూ వక్కసారిగా పెరిగి తల జడలు కట్టిపోతే వక్కసారిగా యోగి నయిపోదును.

కుత్సిం—శవం దాటిపోయినతరువాత ఆప్రయత్నం చేతాము కాని ముందుగా శవము కదిలేవుపాయం చూడండి. బంధువులందరూ యీసంగతి కనిపెట్టి ముందుగానే ముఖాలు చాటువేసినారు. పది రూపాయలు ఖర్చుచేసి పీనుగును బయలుదేరదీసి దహనంచేసి వస్తేనే కాని భోజనాలుకూడా లేవు.

ముస — నాకు పెళ్ళికి ముఖ్యంగా ఆశాస్త్రులుగారి కూతురే కావలెనుసుమా. ఆపిల్ల కుమయిలవచ్చి మొన్న దశమినాడు ముహూర్తం తప్పిపోవడం మనఅదృష్టం. ఆశాస్త్రుల్లు వెయ్యేళ్ళు తలక్రిందుగా తపస్సు చేసినా మనవంటిఅల్లుణ్ని సంపాదించలేడు. ఆచిన్నదాన్ని వివాహమాడితే తండ్రిమంచిపండితుడు గనుక వకవేళ నే నేమయిపోయినా కూతురికి మళ్లీ పెళ్ళి చెయ్యడు. అతడికి కొంచెం వేదంముక్కలు వచ్చి అర్థం తెలియకుండా వుంటే మరీ బాగావుండును.

కుత్సిం.—నాకు వెయ్యిరూపాయలు యిస్తే ఆపిల్లను మాట్లాడి తప్పకుండా యిప్పిస్తాను.

ముస—అలాగే యిస్తాను. నీకూ నాకూ యిదే ఖరారు. నీవు

వావాకులకోసం వెళ్లేటప్పుడు పిల్లదానితండ్రితో మాట్లాడి మరీ వెళ్లా.
(ఇద్దఱును వెళ్ళుచున్నారు.)

---

## రో గ చి కి త్స.

---

[సోమసుందరశాస్త్రి మొదలయినవారు కూరుచుండియుండ, శంకరరావుగారు ప్రవేశించుచున్నారు.]

శంక—ఏమండీ మీఅబ్బాయికి వంట్లో యేలాగువున్నదండీ? నేను చెప్పిన వైద్యుణ్ని పిలిపించినారుకాదుగదా?

సోమ—అబ్బాయికిఅంతకంతకు జబ్బు యెక్కువవుతూవున్నది గాని యెంతమాత్రమూ నిమ్మళంలేదు. మనవాళ్ళకుజాతివైద్యం పడ దండీ. అందుచేతనే మీరు చెప్పిన డ్యాక్టరును పిలిపించలేదు.

శంక—జాతివైద్యంకాకపోతే నల్లవైద్యమయినా యెవరిచేత చేయిస్తూవున్నారు? అందులోనయినా కొంచెము మంచివాణ్ని విచారించవలెను.

సోమ—ఇంకా యెవరిచేతనూ మందువేయించడంలేదు. మొట్టమొదట మూడురోజులు జ్వరం కాస్తే వూళ్ళో అమ్మవారు వున్నదిగనుక వకవేళ అమ్మవారు వస్తుందేమో వయిద్యం చేయిస్తే జబ్బుచేస్తుందని లోపలికి మందు యివ్వలేదు. మూడోరోజురాత్రి మాయింట్లో ముసలమ్మ చెయ్యిచూచి భూతనాడి ఆడుతూవున్నదని స్పష్టంగా చెప్పినది. యిఖ ఆవిడె ఆలాగున చెప్పినతరువాత మనము వైద్యప్రయత్నం తలపెట్టడం మంచిదికాదని మానివేసినాను. ఆవిడ యెనభయియేళ్ళుదాటిన మనిషి. చేతినాడెం ఆవిడకు తెలిసినట్టు మఱి యెవరికీ తెలియదు. ఆవిడ చెప్పినమాట అబద్ధమయివుండదు. ఆవిడకు

పదిమందికొడుకులూ కూతుళ్ళూపుట్టి అంతా కాలంచేసినారు. అంత మందికి ఖాయిలాలు వచ్చి ఆమె దగ్గిరవుంటూ చూస్తూవచ్చినప్పుడు మనం తప్పకుండా నమ్మవలసినదే.

శంక—మీరు భూతవైద్యం చేయిస్తూవున్నారా యేమిటి ?

సోమ—యేమిటో అటువంటిదే చేయిస్తూవున్నాను. మన కేమూరి సాంబన్న మంత్రించి విభూతి లోపలికియిచ్చి యింత వంటి నిండా పూసినాడు. ఆరాత్రి మాపిల్లవాఁడు మరీయెక్కువ కేకలువేసి తెల్లవారినదాకా పలవరిస్తూనేవచ్చినాడు. మంచంమీదపడి యిటూ అటూ వూరికే దొర్లినాడు. మంత్రపువిభూతికాఁడంచేత తాపంపెట్టి లోపలిభూతం అలాగున ఆవేదనపడ్డదని మేము అనుకున్నాము. అటు తరువాత సాంబన్నవచ్చి చెయ్యిచూచి అతనూ ఆలాగే చెప్పినాఁడు. మేమనుకొన్నదానికీ అతడు చెప్పినదానికీసరిపోయి దాఖలాయిచ్చినది.

శంక—మీఅబ్బాయి కేమిటి ? సాంబన్నగాడివైద్యంయేమిటి? వాడు నిరుటిదాకా మాఅన్నయ్యగారియింట్లో వంటచేస్తూ పరమ శుంఠగా వున్నాడు.

సోమ—అయ్యో! ఆలాఅనవద్దు. యేపుట్టలో ఏ పామున్నదో యెవరికి తెలుస్తుంది ? సాంబన్న మీయింట్లో వెండిచెంబుయెత్తుకొని పారిపోయి జయిలులోనుంచి విడుదల అయినతరువాత మళయాళం వెళ్ళి ఆరునెలలు అక్కడవుండి అనేకమంత్రాలు నేర్చుకొన్నాడు. యీవూళ్ళో వాడుయెంతమందికి భూతవైద్యంచేస్తూవున్నాడనుకొన్నా రేమిటి ? అనేకమందికి కుదిరిందని మంచినమ్మకమయినవాళ్ళు చెప్పి నారు. వాడిదగ్గర యేమీ సామర్థ్యం లేకపోతే ఆలాగు గడ్డం పెంచి కుంకం పెట్టుకుని చేతులో వేపబెత్తముతో పాంకోళ్ళు తొడుక్కొని వీధులో నిర్భయముగా తిరగగలడఁడీ ? నేను వక్కమాట అడుగుతాను.

దానికి సమాధానం చెప్పిండి. వాడిది వట్టివేషం అయినట్టయితే మన చుట్టుపట్ల ఇంతమందిమంత్రిగాళ్లున్నారుగదా వాళ్ళందరూ చూస్తూ సహించి వూరుకుంటారా ? సాంబన్నదగ్గిర మంచిమహిమవున్నందుకు వాడు విభూతిపెడితే తెల్లవారినదాకా మావాడు మంచముమీద పడి దొర్లి కొట్టుకోవడమే గొప్పదాఖలా.

శంక—మీకు ఇదే దాఖలా ? ఇంతకంటె వేరేయేదైనా కన బడ్డదా మొత్తంమీద మంత్రాలని వేషంవేసుకున్నవాళ్ళంతా పెద్ద దొంగలు.

సోమ— హరిహరీ ! ఆలాగంటిమాట అనకండీ చాలాపాపం వస్తుంది. ఈసాంబన్న వెంకప్పసోమయాజులుగారి భార్యకు గ్రహం సోకి యెన్నివిధాలా వదలిపోనప్పుడు మూడునాళ్ళలో కుదిర్చినాడు. అప్పటినుంచే సాంబయ్యను సోమయాజులుగారు అరమరా అభ్యంత రమూ లేకుండా లోపలికి రానిస్తూ ప్రాణంతో సమానంగా చూచు కుంటూవున్నారు. అతనిదగ్గర యేమీమహత్యం కనబడకపోతే య జ్ఞాలూక్రతువులూచేసి డెబ్బదియేళ్ళుదాటిన ముసలిముండాకొడుకు యితణ్ని యెందుకుగౌరవంచేస్తాడు? సాంబన్న వైద్యముచేసినతరువాత వళ్ళుశుభ్రంగా కుదిరి సోమయాజులుగారిభార్యా కడుపుతోవున్నదని కూడావిన్నాను. పెద్దతనంలో వివాహము చేసుకున్నా ,అదృష్టం మంచిది గనుక సోమయాజులుగారికి కొడుకో కూతురో పుడుతారు.

శంక—సరిసరి! ఇదా! దీనిపూర్వోత్తరమంతా నీకంటే నాకు బాగా తెలుసును. మా యింటియెదుటనే కాదూ వెంకప్పసోమ యాజులుగారియిల్లు. ఆయనపెళ్ళాముకు యిరువైయేళ్ళలోపువయస్సు. మొగుడు డెబ్బైయేళ్ళు దాటిన ముసలిముండాకొడుకు. అందుచేత యిద్దరికీ కలియక వూరికే తగువులాడుతూ వుండేవారు. ముసలిముం

డాకొడుకుకు, ఫూరికేఅనుమానం, చెట్టులాగునలభయియేళ్ళకొడుకు వుండగా మళ్ళీ పెళ్ళిచేసుకోవడానికి ముసలివాడు వెంకప్పసోమయాజులికి యేమిపొయ్యేకాలము ? మాఅన్నగారి యింట్లో వంటబ్రాహ్మడుగావున్నప్పుడే యీసాంబయ్యగాడు మెల్లిగా ఆసోమిదేవమ్మను అంటుకున్నాడు. యీమధ్య వెంకప్పసోమయాజులుచెల్లెలు యింట్లో వుండి పైఆట ఆడడానికి ఆవిడకు సందుదొరకకపోతే వసినెగారిని వెళ్ళగొట్టడానికి సెల్లాళ్ళఆదయ్యం పట్టింది. ఆవిడనుపట్టుకున్నవి బ్రతికినదయ్యాలేకాని చచ్చినదయ్యాలుకావు. వారియింట్లో సాంబయ్యా దయ్యంవదల్చడమంతా యిదేను.

సోమ—పోనీ యెవరియింట్లో యేమయితే మన కేమి ? మంటి పిల్లి అయినా యెలుకను పట్టడం ప్రధానం. ఇతని మంత్రప్రభావంచేత మన పిల్లవాడివళ్లు నిమ్మళిస్తే మనకంతే చాలును.

శంక — అవుషధం యిప్పించకపోతే యేలానిమ్మళిస్తుంది ? మీరు యీవెర్రిభ్రమలు మాని ఇఖనైనా మంచివైద్యుణ్ణి పిలిపించి మందు వేయించండి. యీభూతవైద్యాలతో యేమీ కార్యము లేదు.

సోమ—ఆరంభించినతరువాత నాలుగురోజులు చూచి గుణం లేకపోతే మరివక చికిత్స చెయ్యవలెనుగాని మనము తొందరపడితే కార్యం లేదు. వక్క మాముసలమ్మమాటే నమ్మివుండక కూనలమ్మ గుడికాడ మాలది యేమి చెప్పుతుందో అని సోదికి పంపించినాను. అది కూడా ఫదిరోజులక్రిందట తలంటి నీళ్లుపోసుకుని వీథులోనుంచి వెళుతూ వుండగా రావిచెట్టుమీదను వున్నకామినీగ్రహం మోహించి పట్టిందని చెప్పింది. ఆమాలది చెప్పినమాట బహుదాఖలా. మొన్న మా యింటికి ముష్టికి వచ్చినయెరకలదాన్ని శకునం అడిగినా కొంచెం భేదంగా చెప్పినదిగాని మెట్టుమీద గ్రహము సోకినదనే చెప్పినది.

అదీ దాఖలాగా చెప్పేమనిషేను. ఈగ్రిహాలుకూడా తమపేర్లు తిన్నగా చెప్పవు. వకరితో వకలాగునా మరివకరితో మరివకలాగునా చెపుతవి. చూచినారుకారా కృానలమ్మగుడికాడ కామినీగ్రిహ మని చెపితే మెరకలనునిషి బ్రహ్మరాక్షసి అని చెప్పినది. యీరెండిట్లో యేదయినా చికిత్స వకటేను. అందుచేతనే మొన్నరాత్రి పిల్లవాణ్ని స్నానం చేయించి ముగ్గులో కూర్చుండబెట్టి మంత్రాలు చెప్పి యెంతో తంతు చేసినారు. దెయ్యము వదిలిపోవడంచేత గాబోలును మావాడు శోష వచ్చి కూర్చోలేక వెనుకకు పడిపోయినాడు.

శంక—ఇప్పుడు మీవాడికి దెయ్యమూ లేదు భూతమూలేదు. ఇంతటితోనయినా ఆప్రయత్నం మానివేసి వెంటనే వైద్యపుసంగతి చూడండి.

సోమ— మొన్నటిరాత్రి కోడిపిల్లనుదిగదుడుపుపెట్టి భూతాన్ని సీసాలో దింపి పాతిపెట్టించి మారణహోమం చేయించడంతోటే అన్నీ వదిలిపోయినవి. ఇప్పుడు మావాడి కా గ్రిహబాధ యేమీలేదు. ఇది ప్రయోగలక్షణంగా కనుపడుతూవున్నదని వకస్నేహితుడు చెప్పే టప్పటికి దానికోసము వీరహనుమంతము జపం చేయించి విభూతి పెట్టిస్తూవున్నాను. ఇప్పుడాఅనుమానం నాకు యేమీ లేదు. కాని యీమధ్య మరివకటి వచ్చినది. పేరంటాలు గుడికాడిది సోది యేమి చెప్పుతుందో అని అడిగి చూచేటప్పటికి అది వెంకటేశ్వరులు పూని బాధిస్తూవున్నాడని కొత్తసంగతి చెప్పినది. ఇదేమిటిరా వకటిపోతే వకటి వచ్చినదని విచారిస్తుండగా ఇంట్లో మామేనత్తకు ఆవహించి వెంకటేశ్వరులు తానని బయులపడ్డాడు. ఆమట్టుగా తల్లి తనవంటివి రెండువస్తువులు ముడుపుకట్టి చిన్నవాడివళ్లు కుదిరి బాగావుంటే కుటుంబసహితంగా తిరుపతికొండమీదికి వెళ్లి వేణియుస్తాననీ, నిలువు

దోపు యిస్తాననీ మొ్రిక్కుకొన్నది. వేంకటేశ్వరులకు ఆబోతును అచ్చుపోసి విడుస్తానని నేనుకూడా మొ్రొక్కుకున్నాను.

శంక — మీరు యెంతసేపు చెప్పినా గ్రహాలూ దేవతలూ ప్రయోగాలే చెపుతారుగాని అవుషధంమాట తలపెట్టరు. పది రూపాయలసొమ్ము పోతేపోయింది. మీరు తక్షణం వెళ్ళి వైద్యుణ్ని తీసుకువచ్చి మందు వేయిస్తురూ.

సోమ — మీమాటలు చూస్తే నేనేమో డబ్బుకు వెనుకా ముందూ చూస్తువున్నానని మీకభిప్రాయ మయినట్టు కనపడుతూ వున్నది. దానిముండామోసినడబ్బు ప్రాణంకంటె డబ్బెక్కువండీ? పిల్లవాడు తిన్నగా వుంటే సర్వస్వాపారమూ దేవుడికి దోపుయిమ్మన్నా యిస్తాను. నామనస్సులో పిల్లవాడివళ్ళు కుదిరినతరువాత వెయ్యి రూపాయలు పెట్టి తిరుపతిలో దేవుడిగుడికి దక్షిణపుగుమ్మానికి వెండి రేకు తాపడం చేయించవలెనని సంకల్పించుకొన్నాను. ఫక్తు సాంబన్నకు యాభయిరూపాయలు యిచ్చినాను. యిప్పుడు జపాల కిందనూ హోమాలకిందనూ యెంతో అవుతూ వున్నవి. రేపు గ్రహ శాంతినిమిత్తమై సంతర్పణకు యెంతలేదన్నా నూరురూపాయ లవుతవి. సూర్యనమస్కారాలు చేసేబ్రాహ్మలకు యెంతో యిస్తున్నాను. సిద్ధాంతిగారే జాతకం చూచి శనిగ్రహం చాలదని చెప్పేవరకు నవ గ్రహజపాలుకూడా నిన్న ఆరంభించి చేయిస్తున్నాను. అందుచేత రాత్రి పిల్లవాడు కదలమెదలకుండా మంచముమీద నెమ్మదిగా పరున్నాడు. ఇందులో ఆద్యంతాలు వకసంచీకి దాటుతుందిగాని అంత కులోపు కాదు.

శంక — మీరు యెంతఖర్చు చేసినా క్రమమయినమోస్తరుగా వినియోగించడం లేదు.

సోమ — తాళండి. లోపల యేమో కేకలు వేస్తున్నారు. యే మయ్యా? వెంకయ్యా! ఆగందరగోళం యేమిటి?

వెంక — ఇంకా యేమి వున్నది? అబ్బాయికి యెక్కిళ్లు పుట్టినవి. వెర్రిచూపు చూస్తున్నాడు. చేతులోనాడి పైకి లాక్కుపోతూవున్నది. కాళ్ళూ చేతులూ చల్లబడినవి.

సోమ — వెంకయ్యా! నీవు చటుక్కున పరుగెత్తి రుద్రయ్య గారిని తీసుకునిరా. చింతామణి అయినా, అమృతమైనా, వేయింతాము. మన ప్రయత్నలోపం యేమీ లేదు. చేతనైనట్లల్లా తంటాలు పడ్డాము. డబ్బుకు వెనుకా ముందూ చూడక రూపాయ చిల్లిగవ్వగా ఖర్చు చేసినాము. దైవం తిన్నగా చూడకపోతే మనప్రయత్నాలు యేమీ అక్కరకు రావు. ఆయువు లేకపోయినతరువాత వెయ్యిమందివైద్యులు వచ్చిమాత్రం ప్రాణాలు పొయ్యగలరా? నీవు వైద్యుడికోసం వేగిరం పరుగెత్తు. నేను లోపలికి వెళుతాను. (అని వెళ్ళుచున్నాడు.)

శంక — పాపం పిల్లవాణ్ని నిష్కారణం మందు వెయ్యక బలవంత ముగా చంపివేసినారు. ఈభూతవైద్యులనూ వీళ్లనూపట్టుకొని నరహత్య చేసినందుకుశిక్షచేస్తే బాగావుండును. పెళ్లి అయి ఆరునెలలు కాలేదు. ఆచిన్నదాన్ని చూస్తే నాకు బహువిచారంగా వున్నది. లోకంలో అనే కులుమూఢత్వంచేత రోగాలువచ్చినప్పుడుమందువేయించక దయ్యాలనీ భూతాలనీ యేడుస్తూ స్నానాలు చేయించీ తడిబట్టలు కట్టించీ దెబ్బలు కొట్టించీ తిండిపెట్టక మాడ్చీ ముంతపొగలు వేసి బ్రతికేవాళ్లనుకూడా చంపివేస్తారు. ఈహిందూ దేశానికి యీమూఢత్వం యెప్పుడు వదలి పోతుందో జనులు దేహారోగ్యవిధులు తెలుసుకొని చేదస్తం వదలి యె ప్పుడుబాగుపడతారో, ముఖనేనువెళ్లిపోతాను. (అని వెళ్ళుచున్నాడు)

## మూఢభార్య—మంచిమగఁడు.

[సోమంచి సోమయ్యగారును, కామమ్మగారును ప్రవేశించుచున్నారు.]

సోమ—యేమే యీవాళ తొమ్మిదిగంటలకల్లా వంట కావలె నని చెపితే యింకా మడికట్టుకున్నావేకావు. తహశ్శీలుదారుగారు సరిగ్గా పదిగంటలకల్లా కచేరీకి వస్తామన్నారు.

కామ—ఆయన పదిగంటలకు వస్తే మీరు భోంచెయ్యకుండా కచేరీకి వెళ్ళి యేకంగా సాయంకాలం వచ్చి తినండి. మీరు వట్టిమాల కూడు యింట్లో కలుపుతూ వున్నారు. ఆచారం లేదు వ్యవహారం లేదు. మడి లేదు మయిల లేదు. తెల్లవారేటప్పటికి కుంభం విస్తట్లో పొయ్య మంటారు. మడీ మయిలా లేకుండా పట్నవాసాలలో పెరిగినవాళ్ళు చేసేటట్టుగా చిన్నప్పటినుంచీ పల్లెటూరిలో ఇంత ఆచారవ్యవహారాలు గల యింట్లో పెరిగిన నేను పట్టుబట్ట కట్టుకొని వంట చెయ్యమంటే చెయ్యను. మాతండ్రిగారు మావూళ్ళో అపరాహ్నం తిరిగితేనేకాని భోజనానికి వచ్చేవారేకారు. చద్దికూడుతిన్నట్లు మీకు సూర్యోదయానికి వంటచేసిపెట్టమంటే యేలా అమురుతుంది ?

సోమ — నేను యెంతమొత్తుకున్నా నీవు వకరోజు రెండు ఝాములకూ, వకరోజు వంటిఘంటకూ, వకరోజు అన్నం చిమిడిచీ, వకరోజు అన్నం వుడకనియ్యకా పెడుతూ వున్నావుగాని వేళపట్టున జిహ్వకు రుచిగా ఇంతఅన్నము పెట్టవు గదా ? వేళకు భోజనం లేక పోవడంచేత నెల్లాళ్ళకిందట యెంతో ఖాయిలా పడి చచ్చిబ్రతికినాను వేళకు కచేరీకి రావని నీ వంటమూలంగా రోజూ తహశ్శీల్దారుగారు అందరిముందరా నన్ను చీవాట్లు పెడితే నాకు సిగ్గు వేస్తూవున్నది వైద్యుడుకూడా వేళకు భోజనం చెయ్యకపోతే మళ్ళీ జబ్బుచేస్తుంద

చెప్పుతూ వున్నాడు.

కామ— మీకు యేలాగయితేనేమి వెధవవైద్యుడు దొరికినాడు. నాలుగు ఇంగ్లీషుముక్కలు నేర్చుకుని కులం చెరపడానికి మాలనీళ్లన్నీ సీసాలో పోసి యిస్తాడు. మీ కామాత్రం వివేకం లేదు. వాడుయిచ్చిన దల్లా తాగి కులభ్రష్టులయి పోతూవున్నారు. ప్రాణంపోయినా మా పల్లెటూళ్లోవాళ్లెవళ్లయినా జాతిమందులు పుచ్చుకుంటారేమో చూడండి. వాడిపిండాకుడువైద్యం వేళకు భోజనం లేకపోతే రోగం వస్తుందట! యీరోగాలు వచ్చేవాళ్లందరికీ వేళకు భోజనాలు లేక పోవడంచేతనే వస్తున్నవా యేమిటి? రోగం రావలసినకారణార్థంవుంటే యేలాగూవస్తుంది. మందూ మాకూ అక్కరలేకుండా లేతలో నాలుగు లంఖణాలుచేస్తే వక్కదెబ్బను పదిరోజులనాటికి వళ్ళు నిమ్మళంగా వుంటును. డబ్బుఖర్చుకూడా అక్కరలేకుండా కుదురును. మీరు గోదావరిలో పోసినట్టు పాతికరూపాయలు వాడిచేతిలో పోసినారు. అన్నిరూపాయలూ పుచ్చుకుని ఆముండాకొడుకు వక్కలంఖణమైనా కట్టకుండా యీనీళ్ళూ ఆనీళ్లూ లోపల పోసి గోధుంజావ పెట్టించినాడు. వాడు నిజమైనవైద్యుడైతే జబ్బుచేసినప్పుడు యెన్నడైనా గోధుంజావ యిప్పిస్తాడా? గోధుంజావ యెంతజలుబు యేమిటి? మీరు నాఅయిదో తనం చల్లగా వుండబట్టి బ్రతికినారుకాని వాడివైద్యంచేత బ్రతకలేదు. ఆవైద్యం వద్దు మానమంటే ఇప్పటికి మీరు నామాట వినరు.

సోమ— ఆవైద్యంమాట యిప్పుడెందుకు. ముందు వంటమాట చూస్తూ.

కామ— మీరు వూరికే అన్నం వుడికిందికాదనీ అన్నం చిముడుతుందనీ వంకలుపెడుతారు. కచేరీ కచేరీ అని వూరికే తొందరపడితే అన్నం యేలావుడుకుతుంది? అన్నం వుడుకుతూవుండగా మయిలగుడ్డ

కాలికి తగిలినా పాలవుట్టి నెత్తికి తగిలినట్టు అనుమానమయినా నూతి దగ్గిరకు వెళ్ళి స్నానంచేసేటప్పటికి కొంచెంఆలస్యం అయి, కొంచెం అన్నం చిముడుతుంది. పట్నవాసపువాళ్లవలె అనాచారపుకూడు పెట్టడం నాచేత కాదు.

సోమ—పోనీ వెనుకటిమాట కేమి యిప్పుడు కచేరీకి పొద్దు యెక్కుతూ వున్నది. వేగిరం మడికట్టుకుందూ. నిన్న రాత్రి వచ్చేటప్పుడు రేపు తప్పకుండా పదిఘంటలకే రావలసినదని మరీమరీ చెప్పడమే కాకుండా రేపు వేళకురాకపోతే జునుమానా వేస్తామని కూడా తహశ్శీలుదారుగారు సెలవిచ్చినారు.

కామ—ఆయన కేమి యెన్నైనా చెప్తాడు. ఇంటికాడ స్నానసంధ్యాద్యనుష్ఠానాలన్నీ తగలబడిపోతూన్నవా యేమిటి ? అమావాస్యనాడైనా స్నానమూ చట్టుబండలూ యేమీలేదు. ముట్టు ముండలాగు తెల్లవారేటప్పటికి పొట్టకింతతిని కచేరీలోవచ్చి కూర్చుంటాడు. భార్యాకూడా ఆయనకు తగినదే దొరికింది. మడికట్టుకుని కాస్త కేశవా నారాయణా అనుకోమని అయినా చెప్పదు. ఆవిడ గరల్సుస్కూలులో చదువుకున్నదట. ఆవిడకూ వేదాంతమే. యీ ఆచారాలు యేమిటి. మడి యేమిటి. అంతా చాదస్తం అంటుంది. ఆమాత్రంవేదాంతం మాకు తెలియదు. నేను చెవినిల్లుకట్టుకొని పోరుతూవుండబట్టిగాని లేకపోతే మీరుకూడా యీపాటి సంధ్యావందనం ముక్కలు నాలుగూ మరిచిపోయేవారే. యెంతసేపు? నేను సుబ్బమ్మగారియింటికివెళ్ళి కొత్తపేడ తెచ్చి వంటయిల్లు అలుక్కుని పొయిశుద్ధి చేసి గోదావరికి పోయి స్నానంచేసి వచ్చి పొయిలో నిప్పువేసుకొని వంటచేస్తాను. మీరు యీలోపుగా స్నానం చేసి తడిబట్టతో సంధ్యావందనమూ బ్రహ్మయజ్ఞమూ పితృతర్పణమూ దేవతార్చనా చేసు

కుంటూవుండండి. దాసీముండ మనయింట్లో నిన్నటిపేడా యీవాళ పేడా కలిపివేసింది. అవి శుద్ధికి పనికి రావు. బచ్చలపాదును మడిబట్ట ఆరకడితే దానిమీద కాకి రెట్టవేసి మీబట్టా నాబట్టా అన్నీ మయిలపడిపోయినవి. అవి అన్నీ యిప్పుడు పట్టుకుని వెళ్ళి తడిపి వుతికి తడిబట్ట కట్టుకుని వంట చెయ్యవలెను. నాకు తడిబట్ట అంటే లక్ష్యములేదు. మీరు వక్కరోజు బట్ట ఆరకపోతే యెంతో గందరగోళంచేస్తారు.

సోమ — తడిబట్ట వంటికి చాలాజబ్బు. దానిమూలముగా రోగాలు వస్తవి.

కామ — చాల్లెండి యీపాటి. ఇప్పుడు తడిబట్ట కట్టుకుంటే రోగాలు వస్తవిఅంటూవున్నారు. రేపు సంధ్యావందనంచేస్తేకూడా రోగాలు వస్తవిఅంటారు. మీకు పట్టిమాలకూడు తింటే యేరోగాలు రావు. ఆచారవ్యవహారాలు లేకపోతే యీబ్రాహ్మణీకంయెందుకు? మెళ్లో జంధ్యాలుయెందుకు? తీసి కుక్కమెళ్ళో వెయ్యరాదూ? మా అమ్మకు యెంతఆచారము! యెంతనిష్ఠ! రోజూ షదిస్నానాలుచేసి యెప్పుడూ తడిబట్టతోనే వుండేది. ఇప్పటికీ ఆవిడెకు యాభయియేళ్ళు వచ్చినవి. యేరోగాలూలేవు. మీరు ఘంటసేపు తడిబట్ట కట్టుకుంటే అన్నిరోగాలూ వస్తవి.

సోమ — యీమాటలతో ప్రొద్దుపుచ్చక యిఖనయినా గోదావరికి వెళ్ళి స్నానం చేసి వచ్చి వేగిరం మడి కట్టుకుని వంటచేస్తూ. ఇవాళ మాకచేరి పరీక్షచెయ్యడానికి దొరగారు వస్తారు.

కామ — వంటఅంటే వూరికే మాటలుచెప్పినట్టే అనుకున్నారాయేమిటి? దాసీది యింకా ఘంటకుగాని అంట్లుతోమి తీసుకురాదు. తీరా తెచ్చినతరువాత యిత్తడిసిబ్బికి మసి వదలకపోయినా వంటతప్పే

లొకు అంటువున్నా మళ్ళీవెళ్ళి స్నానం చేసి రావలెను. గోదావరిలో స్నానంచేసి వస్తూవుంటే బట్టలువుతికేవాళ్ల నీళ్ళుమీదపడతవి. కాస్త సేపు ఆగమంటే వాళ్ళు ఆగరు. అదేమంటే వాళ్ళంతా ఖజ్జాకు వచ్చి కాట్లకుక్కల్లాగు మీదపడుతారు. యెదురుకెదురు నాకే చాదస్తమని అడ్డమయినమాటలూ అంటారు. మీరు కాస్తకల్పించుకొనివచ్చి వక్కమాటు మీకేమిపొయ్యేకాలంవచ్చిందర్రా అని ఖజ్జాఆడరుగదా? మీరు వక్కమాటు కూకలువేస్తే వాళ్ళు నన్ను యెందుకు వేళాకోళాలు చేస్తారు? మీరు లోకువచెయ్యబట్టే నేను అడ్డమయినవాళ్లకూ లోకువయినాను. ‹‹మగడు వల్లనిదాన్ని మారివల్ల''దన్న సామెత వూరకేపుట్టినదా? యీబట్టలు వుతికేవాళ్లమూలంగా వక్కరోజున గోదావరిలో ఫదేసి స్నానాలు చేస్తాను. అన్నీ తప్పించుకొని బిందె యెత్తుకొని తీరా వీధులోకి వచ్చేటప్పటికి వాళ్లయిల్లు వల్లకాడుగాను వీధులుతుడిచేవాళ్లు యేసందులోనుంచో కావిడి యెత్తుకొని యెదురుగా వస్తారు. వాళ్లప్రాణాలకు వుసూరుమని బిందెడునీళ్ళూ అక్కడ పారపోసి చచ్చినట్టు మళ్ళీ వెళ్ళి చీడీలన్నీదిగి నీళ్ళుముంచుకొని బరువుతో తిరపతికొండయెక్కినట్టు పయికెక్కి రావలెను. మీరు తాలూకాలో హేడ్డుగుమాస్తాపని చేస్తూవున్నారన్నమాటేకాని ఆమాలముండాకొడుకులిని కాస్త కూకలువేసి బ్రాహ్మలు నీళ్ళుతెచ్చుకునే వీధులలో ప్రొద్దున్న తిరుగవద్దని పెంటలు తుడిచేవాళ్లను ఆజ్ఞపెట్టలేరుగదా? రేమిహేడ్డుగుమాస్తాపని చేస్తూవున్నారోకాని మీకు మూలనున్న ముసలిముండ లేవదు. బొందున పుస్తెతప్ప ఫదివరహాలగుల్ల లయినా చేయించి పెట్టరు. లంచాలుపుచ్చుకుంటే తప్పట! మీరూ మీతహశ్శీలుదారుగారేకాని మీవెనుకటివారికి మీమాత్రం తెలియ లేదా యేమిటి? వారు దోసిళ్ళాది సంపాదించేవారని అంతా చెప్పు

కుంటే వినడానికి ముచ్చట వేస్తుంది. మీరు యిద్దరూ వుద్యోగానికి వచ్చి వుద్యోగం వఖరంతా చంపివేసినారని తక్కిన గుమాస్తాలపెళ్ళా లందరూ చెప్పుకుంటారు.

సోమ—నీకు యింకా నగలు యెందుకు? వున్ననగ లయినా యెప్పుడయినా పెట్టుకొని యేడుస్తావాయేమిటి? నీచేదస్తంచేత యెప్పుడుచూచినా స్నానాలలోనూ ఆచారాలలోనూ మునిగి బూచి లాగు తల విరబోసుకొనికూర్చుంటావు. చక్కగా తలదువ్వుకొని కొప్పు పెట్టుకొని నాలుగునగలూ వంట పెట్టుకొని మంచిచీర కట్టుకొని వుండగా చూడవలె నని నాకెంతో మనసు వేస్తుంది.

కామ—మీకన్నీ మనసువేస్తవి. ఆచారవ్యవహారాలు అక్కరలేకపోతే మీరు వెళ్ళి కిరస్తానీలో కలవండి. నేను పూర్వజన్మమందు చేసుకున్న పాపంచేత పట్నవాసంలో పడ్డాను. రామరామా! అంతా వర్ణసంకరంవచ్చింది. మీకు దేవుడూలేదు,దయ్యమూలేదు. గోమయం పేరుచెపితే అసహ్యించుకుంటారు. నోములూ వుపవాసాలూ అక్కర లేదంటారు. దేవుడుగుళ్ళల్లో దేవుళ్లను రాతిబొమ్మ లంటారు. జాగ రాలు చేస్తే వళ్ళుజబ్బుచేస్తుందంటారు. మంచిరోజూ చెడ్డరోజూ విచా రించరు. శకునాలూ సోదులూ అబద్ధమంటారు. రోగం వస్తే అమ్మ వారు కాదంటారు. బ్రాహ్మణీకం యేమీ అక్కరలేకుండా తెల్లవారే టప్పటికి మింగి కూర్చోమంటారు. నేనుకాగా మీరు పెట్టినపాట్లన్నీ పడి యేమాలకూడు యింట్లోకలుపుతూవున్నా అన్నిటినీ సహించి వూరు కుంటూవున్నానుకాని మీరు చేసేఅనాచారానికి మరివక పెండ్లాము వచ్చినట్టయితే యీపాటి గోదావరిలోనో నూతిలోనోపడి చచ్చిపోను. కచేరీకి వెళ్ళినగుడ్డలతో యిల్లంతాతిరిగి బిందెలలో నీళ్లుకూడా ముట్టు కుంటారు. మీకు ఆచారం వంటను పుట్టుకురావలెనుగాని ఆడదాన్ని

నేను యెన్నిటికని మొత్తుకోను ?

సోమ—నీవు యీవాళ వంట చేస్తావా లేదా ? అప్పుడే పది ఘంటలు కావస్తూవున్నది. ఈరోజు రాత్రి యెనిమిదిఘంటలుదాకా మళ్ళీ యింటికి రావడానికి వల్లకాదు. నీవు వంట చెయ్యకపోతే భోజనం చెయ్యకుండా కచేరీకి వెళుతాను.

కామ—అన్నిటికీ నన్ను యీలాగు యేడిపిస్తూవున్నారేమి ? యీవేళ శుక్రవారము గదా నేను తలనిండా స్నానం చేసి శుక్రవారాల నోముకథ చెప్పుకొని అక్షింతలు వేసుకోకుండా యేలాగు ముందర మీకు వడ్డిస్తాను? ఆకథ నాకు రాదు! వెంకాయమ్మగారి యింటికి వెళ్లి ఆవిడకు తీరుబడి అయినదాకా వుండి కథ చెప్పించుకురావలెను. మళ్లీ నేను ఆలస్యంగా వెళితే యీలోపుగా ఆవిడ భోజనం చేసి కూర్చుంటే యిల్లిల్లూ తిరిగి తంటాలుపడలేను. మిమ్మల్ని యెప్పుడు చేసుకున్నానో నానోములూ వ్రతాలూ అప్పుడే భగ్గున ఆహుతి కొనిపోయినవి. మీకు పుణ్యమూ పురుషార్థమూ అక్కరలేదు. పందితిన్నట్టు కడుపు కింతతింటే చాలును.

సోమ—కోపపడబోకుము. నేను భోజనంచెయ్యకుండా నే కచేరీకి వెళతాను. వేళ అయినది. నీనోములూ వ్రతాలూ అన్నీ అయిన తరువాతనే మెల్లిగా వంట చెయ్యి? కొంచెం అక్షింతలు తీస్తావా. మొగాన్ని బొట్టుపెట్టుకొని వెళుతాను.

కామ — వెళ్లండి. తిండి తినకుండా వెళ్లి నన్ను సాధిస్తారా యేమిటి? మీకు యెప్పుడు కడుపులో కాలితే అప్పుడే వచ్చి భోజనం చేస్తారు. ఓరి దిక్కుమాలిన దేవుడా! నీయిల్లు వల్లకాడుగాను. నాకు పేగిరం చావు పెట్టవుగదా. నాకు వల్లకాటిసంసారం వచ్చింది. వక్కమాటు చస్తే యీబాధ వీరగడై పోను. నన్ను నలుగురినోళ్ళలోనూ

పెట్టి అల్లరిచెయ్యడానికి యిలా చేస్తూవున్నారు.

సోమ—ఆట్టే విసుక్కోకు. నేను వెళ్ళిపోతూ వున్నాను. నీ యిష్టం వచ్చినప్పుడు వంట చెయ్యి. (అని వెళ్ళుచున్నాఁడు.)

---

శి శు పో ష ణ ము.

——:(o):——

[రావూరి రామయ్యపంతులుగారు, భార్యయైన కనకమ్మ సహితముగా ప్రవేశించుచున్నారు.]

రామ — ఓసి పాడురండా? నీ కేమి చేటుకాలం వచ్చిందే! పిల్లవాణ్ని అలా కొట్టి యేడిపిస్తూవున్నావూ?

కన—మీకు అస్తమానమూ నన్ను ఆడిపోసుకోవడంతోనే సరిపోతుంది. అల్లరిచేస్తే పిల్లవాణ్ని కాస్త ఆఁ అని అదమాయించడానికి వల్లకాదు. యేమైనా అంటే పెద్దపులిలాగు మీదపడుతారు. నే నన్నిటికీ దాడలు దగ్గరగా నొక్కుకుని సగంచచ్చి పడివుంటాను. అక్కడికీ నాకు వుండరాములు లేకుండా వున్నవి. నేను లోకంలోవాళ్ల పెళ్ళాలవంటిదాని నైతే మీరు నన్ను వక్కనిమిషం బ్రతకనియ్యక పోదురు.

రామ—పిల్లవాడు నిజంగా అల్లరి చేసినప్పుడు యేమైనాశిక్ష చేస్తే నేనుమాత్రం యెందు కంటాను? ఇప్పుడు వాడు యేమినేరం చేసినాడని చెళ్లూ చెళ్లూ అయిదువేళ్ళూ అంటుకునేలాగు వాడివీపు మీద ఆలా చరిచినావు? వాడు చేసినతప్పిదంఅల్లా అమ్మ తలమీద నీళ్లు పోసిందని చెప్పడమేనా మరి యేమైనా వున్నదా!

కన — అది చాలదూ. యింకా యేమితప్పిదం కావలెను! ఆడవాళ్ళకు మొగవాళ్లతో చెప్పకూడని రహస్యాలు యెన్నైనా

వుంటవి. వేలెడు వెధవ లేడు యిప్పటినుంచీ గడుగ్గాయతనం నేర్చుకుని రహస్యాలన్నీ యిలాగు చెపుతూవుంటే ముందు వీడు యేమి అక్కరకు వస్తాడు ? మీకు నామీద కోపం రావడానికి వూరికే అమ్మతలమీద చన్నీళ్లు పోసిందని చెప్పడమేనా యెందుకు పోసినానో యేమయినా చెప్పినాడా ?

రామ—యెందుకు పోసినావో యిప్పుడు నీవు చెపుదూ. నేను విని సంతోషిస్తాను.

కన—నామాటలంటే మీకు వేళాకోళాలూ వెక్కిరింతలూను. వాళ్ళు చేసేఅల్లరిపనులు కనపడవు. నేను యేమయినా అంటే నానోరు అందరికీ కనపడుతుంది. వాడు పనికట్టుకువెళ్ళి దొడ్లో దాసీదాని కొడుకును ముట్టుకున్నాడు. తలనిండా నీళ్ళు పొయ్యకుండా బ్రాహ్మణ జన్మం యెత్తినతరువాత వాణ్ణి శూద్రకూడు యెలా తిననియ్యను ? అది కాకుండా వాడామట్టుగా వచ్చి పరుపూ మంచమూ ముట్టుకుని బట్టలన్నీ మయిలపడవేసినట్టయితే అవి అన్నీ తడిపి ఆరవెయ్యలేక చావవలెను. పాతాళలోకంలో వున్నవి. నూతిలోనుంచి చాదెడునీళ్లు పయికి పెల్లగిలి వచ్చేటప్పటికి పేగులు తెగిపోతవి. ఆడవాళ్లకు వుండే కష్టాలు మగవాళ్లకు యేమి తెలుస్తవి ?

రామ—నీకు యెన్నివిధాలబోధించినా చాదస్తం ఆవగింజం తయినా వదలలేదు. చిన్నపిల్లవాడు శూద్రవాణ్ణి ముట్టుకుంటే యింట్లోబట్టలన్నీ తడిపి ఆరవెయ్యావలెనా ? నీవు రోజుకు మూడు సార్లు తడుపుతూవుంటావుగనుకనే చీకిపోయి బట్టలన్నీ మూణ్ణాలకే మళ్ళీ చిరిగిపోతూవుంటవి. నీవు యింటికి జ్యేష్ఠాదేవివి పోగయినావు.

కన— మీరు నెయ్యిలనండి లక్షలనండి. మీకుమల్లే మయిలకూడు నానోటికి పోదు. మీరుచిన్నప్పటినుంచీ మాలబళ్లల్లో చదు

వుకుని కిరస్తానీవాళ్లతో సహవాసం చేస్తూవున్నాను గనుక మయిలా మడీ ఆచారమూ వ్యవహారమూ అక్కరలేకుండా అడ్డమయినవాళ్లనూ ముట్టుకున్న బట్టలతో వచ్చి స్నానమయినా చెయ్యకుండా పట్టుబట్ట చుట్టపెట్టుకొని మయిలకూడు తినడం మీకు అలవాటుఅయినది. అటువంటి యెంగిలిమెతుకులు నాకు లోపలికి పోవు. అందుచేతనే నేను మీవిస్తట్లో కూర్చోక వేరేవిస్తరి వేసుకుని తిని మీయెంగిలివిస్తరి తీసివేసి తలనిండా స్నానము చేస్తాను.

రామ — పెద్దదానవు నీవుయెన్నిస్నానాలు వేసినా ఫర్వాలేదు. మూడేండ్లకుర్రవాణ్ని రోజూ చన్నీళ్ళల్లో మూడేసిస్నానాలు చేయిస్తూవుంటే వాడికి రొంపపట్టి మొసమొసలాడుతూవున్నాడు. చలివాడివంటికి మీర్జా తొడగమంటే తొడగక యెప్పుడూ మోడులాగు వుంచుతావు.

కన — వాడికి పదేళ్ళు పయిని పడ్డవిగనుక మీర్జా వంటిని వుంచుదునా ? చంటిపిల్లవాడు నన్ను ఘడియఘడియకూ ముట్టుకునే వాడికి మీర్జా యెలాగుతొడగను ? నన్ను వూరికే రవ్వపెట్టడమే కాని మీరు మంచీ చెడ్డా యెరుగరు. వాడు నిముషనిముషానికీ నన్ను వచ్చి ముట్టుకుంటూవుంటే మడిగట్టుకుని వంటచేసేదాన్ని నేను యెన్ని స్నానాలుచెయ్యను ? నేను స్నానాలంటే ఝుడియనుగాని నూతులో నీళ్ళు తోడడంఅంటే భయపడుతాను. తిన్నగా తిరుగుతూవున్నంత మట్టుకేగాని తరువాత నాకు రోగం వస్తే నన్నుచూచేవారు యెవరు ? నేను యెంతచదువుకోనిదాన్నిఅయినా తెలియక అడుగుతానుగాని యెక్కడనైనా స్నానాలు చేస్తేనూ తడిబట్టలు కట్టుకుంటేనూ రోగాలు వస్తవండీ ? అవి రావలసినయోగంవుంటే యేలాగూవస్తవి. రోజూ యీస్నానాలు చేసేవాళ్లందరికీ రోగాలు రావడం లేదేమి ?

రామ — చాలులే. యీ పాటివూరుకో. నీకు పిల్లలను పెంచడం యెంతమాత్రమూ తెలియదు. ఆదమరిచి నిద్రపోతాడని పిల్లవాడికి సల్లులకుపోసే వేడినీళ్ళు పోస్తావు. వద్దంటే వినవు. అందుచేత వాడికి వళ్ళంతా గజ్జీ చిడుమూ పట్టకొనివచ్చింది. అదేకాకుండా యెక్క-డివో మురికివి పాతబట్టలు తెచ్చి పక్క-వేసి నులకమంచముమీద పిల్లవాణ్ని పరుండబెడుతావు. ఆమంచానికితోడు దానికింద కుంపటికూడా పెట్టి పొగపెట్టడంచేత కిందికి వేలాడుతూవున్న నులకచేరులు అంటుకొని పిల్లవాడి కాలుకాలి వుండు యిప్పటికీ తిన్నగా మానలేదు.

కన — పిల్లవాడికాలుకాలడంకూడా నాతప్పిదమేనా? దైవం చేసినదానికి నేను యేమిచెయ్యను? మంచంకింద కుంపటి లోకంలో అందరూ పెడుతూవున్నారా నేను వక్క-దాన్నే పెడుతూవున్నానా? పిల్లవాడైనతరువాత కాలూ కాలక చెయ్యీకాలక యెలావుంటుంది? పిల్లవాడికి వేడినీళ్ళుపొయ్యడంచేత గజ్జిపడుతుందంటారు. యీవిరుద్ధంయెక్క-డయినా వున్నదా? పిల్లలకు చమురురాసి వేణ్నీళ్ళు పొయ్యకపోతే జలుబుచేసుకొనిరాదా? లోకంలో అందరివలె నేను కూడా అంతవేణ్నీళ్ళు పోసినట్లయితే మీరు నన్ను మింగివేస్తారు. మొన్న సుబ్బమ్మగారియింట్లో యేడాదికుర్రవాడికి నీళ్ళుపొయ్యమంటే నావంటిదాన్ని వేడిచేత చెంబు పట్టుకోలేకపోయినాను. అటుతరువాత పిల్లవాడు ఝాముసేపటిదాకా హాయిగా నిద్రపోయి మళ్ళీలేచి నాడేకాదు. పిల్లవాళ్లకు. వేడినీళ్ళు యెంతఆరోగ్య మనుకున్నారు యేమిటి? వంటికి యెంతవేణ్నీళ్ళుపోస్తే అంతమంచిది. ఆడపనికీ మగపనికీ మీరు అన్నింటికీ మధ్య అడ్డంవచ్చి పిల్లవాణ్ని చెడగొడుతూ వున్నారు. పిల్లవాళ్ళకు అన్నమూనీళ్ళేబలము. ఎన్నిమాట్లు అన్నం పెడితే అంతమంచిది. మీకు యీలాంటివి యేమీ తెలియవు. పిల్లలను

పెంచడం ఆడవాళ్ళకంటె మగవాళ్ళకు మీకు యెక్కువ తెలుస్తుందా యేమిటి? ఆడదానిచేతిఅర్థమూ మగవాడిచేతిబిడ్డా నిలవదనిచెప్పిన శాస్త్రకారుడు అంతవెఱ్ఱివాడేనా? మీకు యేమీ తెలియకపోవడం చేతనే పిల్లవాడిపక్కకు చిన్నగుడ్డలువేసినానని ఆక్షేపిస్తూవున్నారు. పక్కలో వుచ్చపోసేవాళ్లకు మురికిబట్టలూ పీలికలూకాకపోతే వుతికిన తెల్లమడతలు పక్కవేసుకుంటూరా?

రామ——నీవు అన్నమంటే జ్ఞాపకం వచ్చినది. వాడికిరోజూ కూరికూరి యేడుస్తూవుండగా నోటికి మిరపకాయరాసి యెక్కువ అన్నంపెడుతావు. అందుచేత వాడికి వ్రూదరపొట్ట పెరిగినది.

కన——నేను అన్నం యెక్కువపెట్టడంచేత వ్రూదరపొట్టకాలేదు. మీరు జాతివైద్యంనమ్మి వుగ్గు ప్రతిరోజూ పెట్టనియ్యకపోవడంచేతనూ చిన్నప్పటినుంచీ అన్నం పెట్టనియ్యక పాలల్లో నీళ్ళు కలిపి పోయించడంచేతనూ యీవ్రూదరపొట్ట వచ్చింది. జగత్తులో అందరూ ఆరునెలలు వచ్చినప్పటినుంచీ పిల్లలకు అన్నంపెట్టేస్తూవుంటే యీపాలుపోయించడపుగ్రహచారం మనవక్కరియింట్లోనే వచ్చినది. మీరు జోక్యంకలుగజేసుకోక పిల్లవాణ్ని నేను పెంచినట్లల్లా పెంచనిస్తే యీగజ్జీ వ్రూదరపొట్టా యేమయినా వుండునా?

రామ——నీవు పిల్లను పెంచడం మహాబాగా వున్నది. మన నవుకరు వాడిచేతికిచ్చి సాయంకాలం గాలిలో తిప్పడానికి పంపుమంటే పంపవు. నాన్నతో వున్నది లేదనిచెప్పుమనీ, లేనిదివున్నదనిచెప్పుమనీ అబద్ధాలు నేర్పుతూవున్నావు. బూచివాడు వస్తాడనీ యెత్తుకుపోతాడనీ బెదిరించడంచేత భయపడి వాడు నిద్రలోకూడా వులికులికిపడుతూ వున్నాడు. “నీ అమ్మ నీ అమ్మ” అని పెద్దకు వాడికి అందరిసీ తిట్టడం నేర్పుతూవున్నావు. వాడు తిడితే వురికే సంతోషిస్తావు. దీపాన్ని

జేజె అని చెప్పి దణ్ణం పెట్టిస్తూవుండడంచేత నీమూలంగా మొన్న వాడు నిష్కారణంగా చేతులు తెగకాల్చుకున్నాడు. నేరంచేసినప్పుడూ చెయ్యనప్పుడూకూడా వాణ్ని వూరికే కొట్టి తిడుతావు. చూడు. నారాయణరావుపంతులుగారి భార్య పిల్లను యెలాపెంచుతూవున్నదో.

కన—ఆవిడపేరు నాదగ్గర చెప్పకండి. నాకు తలకాయ నొప్పి వేస్తుంది. ఆవిడపెంపుకు మీరు సంతోషపడవలెను. వాళ్ళకుతోచదు. మావంటి తెలిసినవాళ్ళు చెపితే వినరు. అన్నీ తమకే తెలుసు నని గర్వం కూడాను. పండువంటికుఱ్ఱవాణ్ని గాలిలోతిప్పకమ్మా దిష్టితగులుతుంది పిట్టలు పారుత వని చెపితే నామాట లక్ష్యం చేసినది కాదు. నామాట విననందుకు తరువాత అనుభవించేటప్పుడే తెలుస్తుంది. నేనంత తెలియకనే మీరు యెన్నివిధాలచెప్పినా పిల్లవాణ్ని గాలిలోతిప్పకుండా జాగ్రత పెడుతూవున్నానా యేమిటి? పిల్లవాడు అప్పటినుంచి వక్క మోస్తరుగా పట్టినపట్టు విడువకుండా యేడుస్తూవున్నాడు. మీరు వక్కపర్యాయం యెత్తుకొనివెళ్లి సముదాయించండి. నేను లోపల పని: చేసుకోవడానికి వెళుతాను. (అని వెళ్ళుచున్నది.)

---

## కు లా భి మా న ము.

---

పరిచ్ఛేదము—పాపయ్యనాయఁడుగారి లోపలిసావిడి.

[పాపయ్యనాయఁడుగారును, వీరయ్యనాయఁడుగారును ప్రవేశించుచున్నారు.]

వీర—ఏమండి నాయుడుగారూ! అంతా బాగుండగా మనోళ్ల కర్మమే కాలిందా యేమిటి? బ్రాహ్మలలో యెవరు గొప్పవుద్యోగాల లోకి వచ్చినా వాళ్లు తమవారినేగాని మనవారిని యెవరినీ ఆఫీసులో చేరనియ్యరు. ఇంత పెద్దవుద్యోగంలో వున్నప్పుడు మీరుమాత్రం

మనవాళ్లను నలుగురినీ ఆఫీసులో చేర్చి బాగుచెయ్యరా దండీ?

పాప—నాకు ఆలాగే చెయ్యవలెనని వున్నది. అయితే మన వాళ్లలో ప్యాసు అయినవాళ్ళు విస్తారంమంది లేరు. ప్యాసయినవా ళ్లయితేగాని దొరలు అంగీకరించరు. అయినా నాచేతనైనంత ప్రయత్నం చేస్తాను. నిజానికి మనశూద్రులకంటె బ్రాహ్మణులలో యెక్కువమంది పరీక్షలు ప్యాసవుతారు. వాళ్ళు విస్తారం పాటు పడుతారు. వాళ్లకు తెలివికూడా వున్నది. మనవాళ్ళకు నాలుగు రూపాయలపని కావడముతోటే తాగడం మొదలుపెట్టి తిన్నగా పని చెయ్యరు. ఏమైనా అంటే తిరగబడి మనతాళమే పట్టడానికి చూస్తారు. మంచిచెడ్డలు బొత్తిగా యెరగరు. తరువాత వీళ్లకు యెందుకు పనియిచ్చినామా అని పస్తాయించవలసివస్తూ వుంటుంది. ఏలాగయినప్పటికీ కులాభిమానం వుండడం విధాయకం గనుక యేలాగయినా యిఖముందు ఖాలీలు వచ్చినప్పుడు పట్టుపట్టి మన వాళ్లకే యిప్పించి వాళ్లను పైకి లెగదియ్యవలెననే వున్నది. గోవింద రావుపంతులుగారికాలంలో యెక్కడచూచినా బెండకాయబొట్లవా రినేకాని మరివకరిని ఆఫీసులోకి రానియ్యలేదు. పద్మనాభయ్యగారి హయాంలో ఆఫీసులో అందరూ నోట్లో మూరెడేసిచుట్టలూ వారూ నియోగప్రభువులే చేరినారు. వీరభద్రయ్యగారి దినాలలో తద్దిన బ్రాహ్మణార్థాలు మానివేసిన వైదీకస్వాములందరూ వుద్యోగాలలోనే ప్రవేశించినారు. ఖాదల్‌సాహేబుగారి కాలంలో ఆఫీసంతా సాహేబుల మయమయింది. మొన్న అప్పలాచార్లగారి రోజులలో ఆఫీసునిండా పంగనామాలవారే కనబడేవారు. ఇప్పుడు మనకాలం వచ్చింది గనుక యేతంటాలు పడిఅయినా మనవాళ్ళను పదిమందిని బాగుచెయ్యడం విధి.

వెంకయ్యనాయకుగారు — పాపయ్యా! మీరు మాట్లాడే మాటలు విని లోపలినుంచి లేచివచ్చినాను. మనవాళ్ళను యెలాగయినా వృద్ధిలోకి తీసుకురావలసిన దేకాని యితరులకుమాత్రం నిష్కారణంగా హాని చెయ్యరాదు. పద్మనాభయ్యగారి కాలంలో నియోగినని చెప్పు కోనివాడిది పాపం. సమర్పించుకోవలసిన సంతర్పుణ్యంకూడా మహా తక్కువగానే వుండేది.

పాప—మన కులంవాళ్ళవద్ద అటువంటిదానికి నేను యేమీ ఆశపడను. నేను వూరికే వుపకారానికే పనులు చెప్పిస్తాను. అయితే ప్యాను కానివాళ్ళకు పనివేస్తే న్యూస్పేపర్లవాళ్లు వూరుకోరు. వాళ్ల పుట్టి అంతా మునిగిపోయినట్టు యేడుస్తారు. నాకు పేపర్లయిబ్బంది వక్కటి బాధిస్తూన్నది. యెట్లాగయినా యీవూళ్ళో పేపరు పడిపోయే టట్టు చేస్తామంటే నలుగురూ కలిసి రారు. అక్కడికీ నాశాయశక్తులా తంటాలుపడి నాతో కార్యంవున్నవాళ్ళు యెవళ్లూ చందాలు వెయ్య కుండా చేస్తూ వున్నాను. వెంకయ్యమామగారు నిలుచునే వున్నారు. యిలా వచ్చి కూర్చోండి.

వెంక—అక్కరలేదు. మళ్ళీ లోపలికి వెళుతాను. నాయనా యిప్పుడు అనుకున్న వెర్రిపనిమాత్రం నీవు యెన్నటికీ తలపెట్టకు. నీవు తిన్నగా న్యాయంగా నడుచుకుంటే న్యూస్పేపర్లకు యేమీ భయపడ నక్కరలేదు. పేపరు వుంటే నిన్ను యేమిచేసింది? దాన్ని చెడగొట్ట డానికి నీవు లేనిపోనివెర్రివేషాలలో దిగితే మొదలికే మోసం వచ్చి నీవే చెడిపోతావు. మనవాళ్లల్లో నీవు వక్కడవు కాస్త మంచిపనిలో వుండడంచేత సీమాలంగా మాకుకూడా గౌరవంగా వుంటూవున్నది. వీళ్లమాటా వాళ్ళమాటా విని లేనిపోనివిరోధం తెచ్చుకుని ఆవున్న కాస్తగౌరవమూ చెడగొట్టకు.

పాప—యీంగ్లాళ్లో స్కూలుకుర్రవాళ్ళు మహాపొగకిరెక్కి వున్నారు. వాళ్ళు యెంతటివారినీ లక్ష్యం చెయ్యరు. తహశ్శీలుదార్లు కూడా నాదగ్గిర జరుస్తూవుంటే వీళ్ళు భయమూ భక్తీలేకుండా నాముందర పెంకిజవాబు సవాళ్లువేస్తారు. స్కూళ్లలో ప్యాసయిన వాళ్ళు యెవళ్లు అర్జీలు పంపించుకొన్నా ధొరదగ్గరకు వెళ్లకుండా దర ఖాస్తులు తొక్కిపెట్టి వక్కడికీ పనికాకుండా చేస్తాను.

వెంక—నాయనా ! అంత ఘోరం యెప్పుడూ చెయ్యవద్దు. అలాచెయ్యడంవల్ల యెప్పుడో మనకే ముప్పు వస్తుంది. ఈకాలపు కుర్రవాళ్ళు కుర్రవాళ్ళుకారు. నీకంటే నాకంటేకూడా యెక్కువ ఇంగ్లీషు చదువుకున్నారు. వాళ్లకు అయిష్టం పుడితే పేపర్లలో యేకి ధొరలకు మనమీద అసూయత పుట్టిస్తారు. వాళ్లజోలికి నీవు యెప్పు డూపోకు. సాధ్యమయినంతమట్టుకు నీవు పక్షపాతంలేకుండా నడుచు కుంటేనేకాని పల్లెటూళ్లలోని కరణాలూ రహితులూ వూరుకున్నట్టు పట్నవాసాలలోవాళ్లు ఝుడిసి వూరుకోరు.

పాప—అందుచేతనే వాళ్లపేరు చెపితే నాకు వళ్లుమండు కొని వస్తూవుంటుంది. జమీందార్లుసమేతు నన్ను గౌరవంచేస్తూవుంటే వేలిడేసి ముండావాళ్లకు వీళ్ళకు యింతపొగరుబోతుతనంయేమి ? పెద్ద మనుష్యులను లక్ష్యంచెయ్యనందుకు వీళ్ల గర్వం అణచాలనండి. అందు లోనూ బ్రాహ్మణకుర్రవాళ్ళను బొత్తిగానమ్మరాదు. వాళ్ళుకొంపలు తీస్తారు.

వెంక—అది వట్టివెఱ్ఱిమాట. దుర్మార్గులు అన్నిజాతులలోనూ వుంటారు. చదువుకున్నవాళ్లలో యేజాతిలోనయినా దుర్మార్గులు తక్కువగానేవుంటారు. చదువుకున్నవాళ్ళు నక్కవినయాలు కనపరుస్తూ వంగివుండరని తెలివితక్కువవాళ్లను తెచ్చిపెడితే వాళ్లు వంగివంగి సలా

ముజేస్తూవున్నా లోపల తడిగుడ్డతో గొంతుకలు కోసి హాని చేస్తారు. నేనునీకంటె పెద్దవాణ్ని కనుక నామాట విను. మనము యింతమంచిస్థితి లో నున్నప్పుడు జాతిమతభేదం విచారించకుండా యోగ్యతవున్నప్పుడు అందరినీసమానముగా చూడవలసినదే కాని వకరియందు కార్పణ్యము వహించి వారికి అపకారం చెయ్యడానికి చూడడం యిహానికీ పరానికీ కూడా మంచిదికాదు. మనఘటాలు శాశ్వతాలుకావు. మనం న్యా యంగా ప్రవర్తించకపోయినట్టయితే మనకుకొంచెంకాలునోచ్చినప్పుడు అందరూ తలోరాయి వేస్తారు. మనం వుపకారంచేసినవాళ్లకుకూడా అపకారం కలుగుతుంది. చూచినావుకావా గోవిందరావుపంతులకు బదిలీ కావడంతోనే పద్మనాభయ్యగారు వచ్చి ఆఫీసులో వేపారిపురుగు లేకుండా యెలాయేరివేసినాడో! ఆతరువాత వచ్చిన ఖాదర్‌సాహేబు నియోగులందరినీ మెల్లిగాసాగనంపి గడ్డాలసాహేబులనందరినీ ఆఫీసు లో దూర్చినాడు. అటుపిమ్మట వచ్చినమన శేషాచలంనాయుడు కొం దఱు మనవాళ్ళనుచేర్చినా రంగాచార్లు వచ్చి మనవాళ్ళను గయబతుకు పంపి హుజూరంతా స్వాములమయం చేసినాడు. అటుతరువాత వచ్చిన నరసయ్యసెట్టి కోమట్లల్లో యెవ్వరూ ప్యాసయినవాళ్ళు లేకపోయినా తనభావమరిదినీ యింట్లోవంటచేసేవాణ్నీ చేర్చి పనులు యిచ్చినాడు. ఇప్పుడు నీవు వచ్చినావు. నీవు అందరినీ స్వజనాన్ని చేరిస్తే నీతరువాత వచ్చినవాడు వాళ్లందరికీ షువరాలు చేస్తాడు. ఇప్పుడు కాలమంతా మారిపోయింది. ఆకాశరామన్నఅర్జీలు కూడా పడుతవి.

పాప—అందుకోసం యిప్పుడు యేమంటారు? మనవాళ్ళకు ఝువళ్లూ పనులు యివ్వకుండా మానుమంటారా యేమిటి?

వెంక—రామరామ. నేను ఆలావక్కనాటికి అనను. ప్యాసయి వుండి మనవాళ్లు తగినవాళ్ళయినయెడల వాళ్ళకే తప్పకుండా యివ్వ

వలసినది. వకరిఅన్నం అన్యాయంగా, తీసివేసిమాత్రం ప్రత్యేకంగా మనవాళ్ళకు యివ్వకూడదు. పక్షపాతం చెయ్యకుండా మంచిపరీక్షలు ప్యాసయి తగినవాళ్ళు వున్నప్పుడు యితరులకుకూడా అన్యాయం లేకుండా పనులు చెప్పిస్తూ వుండవలెను. ఆలాగయితే మనకు యెవళ్ళూ అపకారం చెయ్యడానికి చూడరు. పయిని భగవంతుడూ సంతోషిస్తాడు. మీతండ్రిగారు బంట్రోతుపనిలోవుండి మిమ్మలిని పోషించడానికే యెంతో కష్టపడినారు. ఆయన పోయినతరువాత మీతల్లిగారు వారినీ వీరినీకాళ్ళుపట్టుకుని చందాలు వేయించి మీకు చదువు చెప్పించినది. ఆమెదైవభక్తివల్లనూ మంచితనమువల్లనూ మీరింత ముందరికివచ్చి నేటికాలానికి గొప్పస్థితిలోకి వచ్చినారు. అంతమాత్రంచేత మీవెనుకటిస్థితి మరిచిపోయి విర్రవీగరాదు. పరులయినాకానీ యోగ్యులయితే వాళ్ళను ఆదరించి చేతనయిన సహాయం చెయ్యి. అయోగ్యులు మనవాళ్ళయినా వాళ్ళను చేరనియ్యకు. పెద్దవాణ్ణి గనుక నీక్షేమం కోరి చెపుతూవున్నాను. నామాట తోసివెయ్యకు.

పాప — సరిసరి ! అంతమాట సెలవియ్యకండి. మీరంటేనాకు గురుస్థానము. సాధ్యమయినంతమట్టుకు మీరు చెప్పినట్టే నడుచుకోవడానికిప్రయత్నంచేస్తాను. యేలాగయినా బాపనవాళ్ళను పైకిరాకుండా అణిచివెయ్యవలెను. నాకు ఆఫీసువేళ అయింది. భోజనానికి లేస్తాను. తమరు దయచెయ్యండి. (అని వెళ్ళుచున్నాడు.)

# వసూళ్ళు.

[శ్రీ వేశ్వరరావుగారు, వరదారావుగారు, మొదలయినవారు కూరుచుండి యుండగా హనుమంతరావుపంతులుగారు ప్రవేశించుచున్నారు.]

వర — ఏమండి హనుమంతరావుపంతులుగారు నాలుగుఘంటలకే మీాటింగని యిప్పుడు దయచేసినారు? యిక్కడ మిమ్మలిని యెవరూ వసూళ్లువెయ్యమని పట్టుకోరు లెండి. కొంచెం పెందరాళేనే దయచెయ్యవచ్చునే.

హను — నేను మొన్న మీాయింటికి రాకపోవడం భోగంవాళ్లకు వసూలు వెయ్యబడుతుందని అనుకున్నారా యేమిటి? యిష్టం వుంటే నేను రాకపోయినాకానీ రెండురూపాయలు పంపించలేనూ?

వర — ఏదీ పంపించరాదూ? వూరికే కబుర్లు చెప్పడమేకాని మీారు డబ్బు వదలరు. డబ్బుకూ ప్రాణానికీ లంకె. మీారు నిజంగా మాయింట్లో వసూలు వెయ్యబడుతుందనే రావడం మానివేసినారు.

హను — పోనీ అలాగే అనుకోండి. నేను వచ్చి వెయ్యకపోతే మాత్రం మీారు నన్ను యేమైనా కొడతారా యేమిటి? నేను రాకపోయినా మీారు బంట్రోతు నిచ్చి భాగవతులను మాయింటికి పంపించినారే.

వర — పంపించినాకానీ మీారివ్వలేదుగదా! మీారు రాకపోయినా మీారు వక్కరూపాయ యివ్వకపోరన్నధైర్యంచేత మీాపేరు పెట్టి వసూలు చదివించినాను. అంతమందిలో మీాపేరున వసూలు చదివించినతరువాత యివ్వకపోతే చిన్నతనం కాదూ?

హను — నాకు యేమీా చిన్నతనం లేదు. నేను వెళ్ళకపోయినతరువాత వట్టి అపాత్రవ్యయం యెందుకు చెయ్యవలెను? నేను వసూళ్లు

మంచివి కావని మానివేసినానుకాని డబ్బులక్ష్యంచేత కాదు.

వర — మీరు చేసేవన్నీ సత్పాత్రవ్యయాలూ ఇదిమాత్రం అపాత్రవ్యయమూనా యేమిటి? స్నేహితులిని సంతోషపెట్టడానికయినా మీరు యివ్వవచ్చును. నెలకు రెండువందలరూపాయలు ఆదాయం వచ్చే మీరే యివ్వకపోతే ఇతరులు యిస్తారండీ? మిమ్మలిని చూచే తక్కినవాళ్ళుకూడా బంటోత్రును పంపిస్తే మొకం చాటువేసి ఇంట్లో వుండిన్నీ లేదనిపించి వూరికే తిప్పుతూ వున్నారు.

హను — షదిరూపాయలూ షదిహేనురూపాయలూ జీతాలు పుచ్చుకొని కుటుంబసంరక్షణ చేసుకోవడమే కష్టంగా వుండేవాళ్ళు మీరు నెలకు నాలుగుమాట్లు మీయింటివద్ద భాగవతాలూ మేజు వాణీలు కట్టించుకొని తేపతేపకూ రూపాయీ రెండురూపాయలూ తెమ్మంటే యెన్నిమాట్లూ తిప్పక యెలాగు యివ్వగలరండీ? యీ విషయంలో మీమూలంగా మీ తాబేదార్లకు బహుబాధగా వున్నది. మొన్న మీగుమస్తా వకడు మీరాడించినభాగవతపువాళ్ళకు రూపాయ యిచ్చుకోలేక యివ్వకపోతే మీ రేమయినా అపాయం చేసిపోతా రని యేడుస్తూ పెళ్ళాం చామంతిపువ్వు తాకట్టుపెట్టి అమ్మవారికి ముడుపు చెల్లించినట్టు చెల్లించినాడు. చిన్నజీతగాళ్లు యెంతక్షోభ పడుతారో వందలకొద్దిజీతాలు పుచ్చుకొనేవాళ్లకు మీకు యేమి తెలుస్తుంది? మీకంత చూడవలెనని సరదా వుంటే స్థితిగలవాళ్ళు సొమ్ము మీరే యిచ్చి ఆడించుకొని షదిమందిస్నేహితులనూ వూరికే పిలిచి సంతోషపెట్టరాదూ?

వర — స్నేహితు లందరికోసం కాకపోతే ఇది నావకడికోసమే ఆడించుకొన్నా ననుకొన్నారా యేమిటి?

హను — యేస్నేహితులనిమిత్తమయినా మీరు తాబేదార్లకు

చీట్లు వ్రాసి అందరినీ పిలిపించి వాళ్లచేత వసూళ్ళు వేయించడమూ వాళ్ళు రాకపోయినా వాళ్ల పేర్లు జాబితా వ్రాసి వసూలు చెయ్యడానికి మీ బంట్రోతును జతయిచ్చి పంపడమూ, మీకు భావ్యమైనపని కాదు. ఇన్నిపరీక్షలు ప్యాసై ధొరలదగ్గిర గొప్పగా తిరుగుతూవుండే వారు మీరే యీలాగు చేస్తూవుండగా తక్కిన పూర్వకాలపు వుద్యోగస్థులు చేశారంటే హాశ్చర్య మేమి వున్నది! మీరు గవర్న మెంటువుద్యోగస్థులు గదా అన్నిరూల్సూ యెరిగివుండిన్నీ యిలాగంటి అక్రమములు చేస్తూవుంటే మీకు యెప్పుడయినా మాటరాదండీ?

వర — మొన్నటిభాగవతం నేను ఆడించినాను అనుకుంటూ వున్నారా యేమిటి? రాణీగారు పుట్టినదినమని రాజభక్తి కనపర్చడం నిమిత్తమయి పద్మనాభంగారు భాగవతం ఆడించతలచి వారియింటి కాడ స్థలం లేకపోవడంచేత మాయింటికాడ ఆడించినారు. చూచినారు కాహూ చీట్లలో యెవరు దస్కతు చేసినారో!

హను—చాలు చాలు యీపాటి యీదొంగవేషాలు చాలిం చండి. వూళ్ళో అందరూ మీరు ఆడించినా రనుకుంటూవున్నారా? పద్మనాభంగారు ఆడించినా రనుకుంటూవున్నారా?

వర—వాళ్ళు యేమనుకుంటే యేమి? చీట్లు వ్రాసి ఆడించినది పద్మనాభంగారు. ఆయనకు సహాయం కావలెనంటే నలుగురు బంట్రోతులను నేను యిచ్చినాను.

హను — మీవేషాలన్నీ నాకు తెలుసును. మొన్న వచ్చి యిచ్చినవాళ్లందరూ మిమ్మలిని జూచి యిచ్చినారుకాని పద్మనాభం గారిమొగం చూచి వక్కరూ యివ్వలేదు. మంత్రసానిదగ్గిర మర్మం దాస్తారా యేమిటి? తల్లిపుట్టిల్లు మేనమామవద్ద దాచినట్లు మీరు భాగవతులను పిలిపించి మాయింటికాడ రేపుఆడిస్తామని చెప్పడమూ

పద్మనాభంగారిచేత చీట్లు వ్రాయించడమూ మన స్నేహితులను నలుగురినీ తప్పకుండా రమ్మని పిలవడమూ అన్నీ యెరిగిన నాదగ్గిర కూడా మీరు యిలాగు మర్మం పెడుతూ వున్నారు. పూర్వపువాళ్ళంతా మంచివాళ్లు కారని ఆక్షేపిస్తూ మేమే మేమో ఇంగ్లీషు చదువుకున్నవారమూ న్యాయముగా ప్రవర్తించేవారమూ అని చెప్పుకునే మనమే యితరులంతా నవ్వేటట్టుగా మనం చెయ్యరానిపనిని వకరి పేరు పెట్టి చెయ్యడమూ మన తాబేదార్లచేత వాళ్లకు చందాలు వేయించడమూ యేమి న్యాయము? ఇదేనా మన నాగరికతాలక్షణము?

వర—మీరు మహాఆక్షేపిస్తూ వున్నారు. అది వకరికి వుపకారం చెయ్యడంగాని లంచాలు పుచ్చుకోవడం కాదులెండి. ఇందులో తప్పితం యేమివున్నది?

హను—తప్పితం యేమీ లేకపోయినట్టయితే చీట్లు మీ పేరు పెట్టి యెందుకు వ్రాయించినారుకారు? నామతానికి యింతకంటె లంచమే బాగా కనుపడుతూ వున్నది. అక్రమమయినా తనకు యేదైనా వుపకారం కలిగితే లంచంయిచ్చేవాడు సంతోషిస్తూయిస్తాడు. ఆలంచాలు పార్టీలదగ్గిరనేకాని గుమాస్తాలదగ్గిర పుచ్చుకోవడం వుండదు. ఈలంచం మన పయిఅధికారిగనుక యెప్పుడు యేవంకబెట్టి యెందులోనొక్కుతాడో అనేభయంచేత వచ్చేపదిరూపాయిలు తిన్నగా మాసగ్రాసానికయినా చాలక తంటాలుపడే గుమాస్తాలు యేడుస్తూ విధిలేక యిస్తారు. ఇంతకంటె యీలంచానికీ ఆలంచానికీ నాకు అంతగా భేదం కనపడడంలేదు. మీరు తాబేదార్లజోలికి పోక స్నేహితులకు పన్నుకడుతూవున్నారు. దానితో తృప్తిపొంది వూరుకోరాదా?

వర—ఇది పన్నువంటిదా? దీనిలో స్నేహితులను యెవరయినా యిస్తేనేకాని వల్లపడదని నిర్బంధపెడుతూ వున్నానా? వక్క

రిచ్చుకోవడం కష్టంగా వుంటుందిగనుక స్నేహితులు నలుగురూచేరి చందాలు వేసుకొని యెవరికీ ఆయాసం లేకుండా వేడుక చూడడం వంటిదికాదా ?

హను—ఇందులోనూ కావలసినంత నిర్బంధంవున్నది. సర్కారుపన్ను అయినా రూపాయకు తక్కువవుంటుంది కాని, యెంతబీదవాడయినా మీపన్ను రూపాయకు తక్కువ వుండదు. నిర్బంధంలేకపోతే ముందుగా చీటిలోనే రూపాయకు తక్కువకాకుండా యిచ్చేవారే రావలసినది కాని తక్కినవారు రానక్కరలేదని స్పష్టంగావ్రాస్తే యెంతబాగావుండును! మహోదయవున్నట్టుగా వినోదంచూడడానికి స్నేహితులను పిలిచినట్టుగాపిలిచి తీరా రావడంతోటే తప్పించుకపోవడానికి వల్లకాకుండా పద్దువెయ్యడానికి కాగితం చేతికిచ్చి భాగవతపువాళ్లచేత మీపేర్లుచెప్పి నూటపదహార్లు వట్టిదే పొలంకేకలు వేయించీ యివ్వకుండాపోతే నలుగురిలోనూ చిన్నతనంగావుండేటట్టు చెయ్యడముకంటె నిర్బంధమే నయము. మీయింట్లో వేడుక చేయిస్తే యిష్టంవున్నా లేకపోయినా మీతాబేదార్లు పదిమందీవచ్చి చచ్చినట్టు రూపాయిరూపాయీ సమర్పించి పోవలెను. ఒక్కవాళ్ళయింట్లో యెవరియింట్లోనయినా యీ వేడుకే జరిగితే మీరు వారియింటికి వెళ్ళడమే పరువు తక్కువని వూరుకుంటే చచ్చినట్టు సొమ్మంతా వాళ్లే యిచ్చుకోవలెను. ఈవేడుకంతా మీకు డబ్బుఖర్చుకాకుండా, పేరు మీకు దక్కడానికి వచ్చింది. నిజంగా వేడుకయితే యిదివరకు యీవూళ్ళో జరుగుతూ వున్నప్రకారం టిక్కెట్లుపద్ధతి పెడితే యెంతబాగావుంటుంది. అప్పుడిష్టంవున్నవారు డబ్బిచ్చి చూస్తారు. తక్కినవారు మానుతారు. మీరు మహాపెద్దలంతా బయలుదేరి యీ మంచిపద్ధతి చెడగొడుతూ వున్నారు.

పర — పోనియ్యండి పంతులుగారు వచ్చినారు. లెక్చరు ఆరంభం అవుతుంది. యీపాటి యీప్రసంగం చాలించండి.

(అని చాలించుచున్నారు.)

---

## నాడుల భేదము—విద్వత్సభ.

---

[పరమేశ్వరయ్యగారిసావిడిలో వాసుదేవసోమయాజులుగారును భాను మూర్తిదీక్షితులుగారును, సోమనాథశాస్త్రిగారును, కామావధా నులుగారును ప్రవేశించుచున్నారు.]

పర—ఏమండీ సోమయాజులుగారూ! మీరు యేలాగైనా యీవిషయంలో సహాయం చెయ్యవలెను. మాఅమ్మాయిని తనకొమారుడికి చేసుకోవడానికి నారాయణమూర్తిగారినికూడావప్పించినాను. మీరు శాస్త్ర అభ్యంతరంలేదని అందరూ సెలవిస్తే రేపు చైత్రమాసంలో వివాహకార్యం అయిపోతుంది.

వాసు—ఇందులో నేనువక్కణ్ణే స్వతంత్రుణ్ణిగాను. పెద్దలు భానుమూర్తిదీక్షితులుగారు వున్నారు. ఇక శాస్త్రుల్లుగారు సరేసరి. అవతల కర్మజ్యేష్ఠులు కామావధానులుగారు వున్నారు. వారందరూ వప్పుకుంటే నాఅడ్డం యేమీలేదండి. నేను యెప్పుడూ మీసెలవుకు బద్ధుణ్నే—ఏమండీ దీక్షితులుగారు! మీరు సెలవియ్యండి.

భాను—నేను మీకంటె యెక్కువవాణ్నా యేమిటి? మీకందరికీ సమ్మతమయితే నాకూ సమ్మతమేను—ఏమండి సోమనాథశాస్త్రిగారూ! మీరు మాట్లాడక వూరుకున్నారు?

సోమ—నామాటకేమి? శాస్త్రంలోవున్నది నేను కనపరుస్తాను. ముందుగా మీఅందరి అభిప్రాయాలూ చెప్పండి.

కామా—అదుగో సోమనాథశాస్త్రిగారు శాస్త్రంచదివిన వారుగనుక వక్కముక్క అడ్డంవేసినారు. ఆయనయెలాగూ లవుక్యం యెరిగినవారు. యెంతయుక్తిగామాట్లాడినారో చూడండి. మనమంద రమూశుద్ధవైదీకం చేసినాము. ఆయనమనస్సులో అభిప్రాయం యెవరికైనా తెలిసిందేమో చెప్పండి.

పర—శాస్త్రుర్లుగారూ! మనశాఖవారు మీరే అడ్డంపెడుతూ వున్నారుయేమిటి?

సోమ—రామరామా! నేను యేమీ అడ్డం చెప్పలేదు. శాస్త్రంలో వున్నమాటలుయేమిటో నన్ను అడిగితే నేను చెపుతా నన్నాను. మీరు మీపిల్లదాన్ని మీ మనసువచ్చినవారికి వివాహం చెయ్యండి. నా అభ్యంతరం లేదు.

కామ—అప్పనయ్యా శాస్త్రిగారూ! ఇదివరకు యెన్నడైనా ములికినాటివారికీ వెలినాటివారికీ సంబంధాలు వున్నవషయ్యా?

సోమ—ఇదివరకు యెప్పుడూ లేకపోతే ఇప్పుడుంచవి. ఇచ్చే ములికినాటివారికి అభ్యంతరం లేకపోతే పుచ్చుకోవడానికి వెలినాటి వారికి యేమిఅభ్యంతరం వుంటుంది?

భాను—యేమి అలాగు అంటూవున్నావు? నీవు ములికినాటి వాడవుగనుకనా అభిమానంచేత వెలినాటివారికంటె ములికినాటివారు మహాయెక్కువఅని మమ్మలిని మహాత్రృణీకరించినావు! ఇప్పుడు విచా రించే ప్రభువు వుంటే వెలినాడు యెక్కువో ములికినాడు యెక్కువో వక్కనిముషంలో తేలుతుంది.

సోమ—విచారించేవారుంటే నాకూసంతోషమే. నిజం బయ లుపడకమానదు.

పర—ఇందులో యెవరూయెక్కువకారు. ఉభయులూ సమా

నులేవ్వూరుకోండి.

సోమ—ఆలాగంటే నేను యెందుకు వప్పుకుంచాను ? మురికి నాటివారు తప్పకుండా శ్రేష్ఠులు. వెలినాటివాళ్లు వెలివాళ్ళు. వాళ్లతో సంబంధం చెయ్యడంమాట అటుండగా అసలు పంక్తిభోజనాలే చెయ్యరాదు. గుట్టుగా వూరుకుంటేనేతప్ప కదిలిస్తే అందరిలోపాలూ పైకి వస్తవి.

భాను—నీపాండిత్యం యేడిసినట్టేవున్నది. ఇన్నాళ్ళూ చదువుకుని వెలిశబ్దానికి ఇదా నీవుచేసిన అర్థం ? వెలిఅంటే తెలుపు అర్థము. అనగా స్వచ్ఛమైనవారని తాత్పర్యము. ఈదేశములో స్వచ్ఛమైన బ్రాహ్మణులు యెవరైనావుంటే వెలినాటివారేకాని మరివకరు కారు. మీ మురికినాటివాళ్ళు యెందుకూపనికిరాని నిర్భాగ్యులు. వాళ్లుపాపాత్ములు. అందుచేతనే వాళ్ళను నల్లనిమురికితో పోల్చినారు. సంస్కృతములో పంకంఅంటారు. పంకం అనగా పాపంఅర్థం. అందుచేత మురికినాటివాళ్ళు వట్టి పాపాత్ములు. వాళ్ళతో పంక్తిభోజనాలు చెయ్యరాదు.

సోమ— ఛీఛీ ! శాస్త్రం తెలిసినవాణ్ని నేనువుంచూవుండగానే నాముందర పదాలికి ఇటువంటి అపార్థాలు చేస్తూవున్నావు ! యెవరైనా సరసుడైన ప్రభువుండి సభ చేయించినట్టయితే శబ్దార్థవిచారముచేసి నిన్ను చెప్పుతీసుకుని కొట్టింతును.

భాను—శాస్త్రజ్ఞనని కుండలాలు వేసుకుని తిరగడంతోటే సరి అనుకున్నావాయేమిటి ? మేమంతా వూరుకుంచూవుంటే నీఆటలు సాగుతూవున్నవి. నిజంగా నేనే శబ్దార్థవిచారం చెయ్యడానికి ఆరంభిస్తే నీవూ నీగురువూకూడా కుండలాలూ శాలూలజోడూ విడిచిపెట్టి తోకతెంచుకొని పారిపోవలెను. నీవు లుచ్ఛావుగనుక నాతో అర్థవి

చారం చెయ్యలేక కారుకూతలు కూస్తూవున్నావు.

పర—దీక్షితులుగారూ! మీకు నమస్కారం చేస్తాను. నా మాట విని కోపం చెయ్యక శాంతించండి. శాస్త్రుల్లుగారూ! మీరు కూడా కొంతశాంతం అవలంబించవలెను. వీరిలో ములికినాటివారి యెక్కువాలేదు. వెలినాటివారితక్కువాలేదు. నాడు అంటే దేశమని అర్థము. వేగినాటివారూ, వెలినాటివారూ, ములికినాటివారూ, కాసరనాటివారూ, వీరంతా వేరువేరు దేశాలలోవుండే బ్రాహ్మలేకాని అంతకంటె వేరే యేమీభేదం లేదు. ఇప్పుడు పల్నాడుఅంటే వేగల్నాడుఅంటే తాలూకాలపేర్లు చూడడంలేదాయేమిటి? వెలినాడంటే తెల్లనేలగల తాలూకావారనీ, ములికినాడంటే బురదనేలగల తాలూకావారనీ, మొట్టమొదట అర్థమైవుంటుంది. పూర్వం యీనాళ్ల భేదాలులేకుండా వకరిలోవకరు వివాహాలు చేసుకునేవారు. అటుతరువాత యితర దేశాలవారితో సంబంధాలుచేస్తే తల్లిదండ్రులు తమకూతుళ్లను తరుచుగా చూస్తూవుండరని ఇతర దేశాలవారితో యిచ్చిపుచ్చుకోవడాలు మానివేసినారు. ఇప్పటికిమల్లే అప్పుడు రోడ్లు మొదలైనవి లేకపోవడంవల్లనూ దోవలో దొంగలభయమూ ఘాతుకమృగముల భయమూ విస్తారంగా వుండడంవల్లనూ పూర్వకాలాలలో దూరదేశాలవారితో సంబంధాలు చేసేవారుకారు. అంతేకాకుండా పూర్వం యేదేశాన్నుంచో వకకంసాలి బ్రాహ్మణ్ణిఅని పేరుపెట్టుకొనివచ్చి యేలేశ్వరపు వుపాధ్యాయులకూతురిని పెళ్లి ఆడినట్టున్నూ, అటుతరువాత నిజంతెలిసి వాణ్ని వెళ్లకొట్టివేసి యిఖముందు వకదేశంవారితో వకదేశంవారు సంబంధాలు చెయ్యకూడదని కట్టు యేర్పచినట్టున్నూ, అప్పటినుంచే యీనాడిభేదాలు యేర్పడినట్టున్నూ, పెద్దలు చెప్తారు. ఇప్పుడు అటువంటి యిబ్బందులు యేమీలేవు. దూరదేశాలలో వుం

డకుండా మనమంతా యిప్పుడు వక్కదేశంలో వుండడంచేత అంద రమూ వక్కనాడువారమే అయినాము. అందుచేత మనం తప్పకుండా సంబంధాలు చేసుకోవడం ఆరంభించవలసినదే.

సోమ— ఏయిబ్బందులు లేకున్నా లౌకికప్రయుక్తులు యెన్ని చెప్పినా శిష్టాచారం మీరడానికి నేను యెంతమాత్రమూ వప్పుకోను. యీవివాహం చేయిస్తే నేను మీయిద్దరినీకూడా స్వాములవారికి వ్రాసి వెలి వేయిస్తాను. పూర్వాచారం మీరడానికి యెవరితర మవుతుంది? మన పూర్వులు బుద్ధితక్కువవాళ్ళున్నూ మనం మహాబుద్ధిమంతుల మున్నూ అయినామూ?

పర—ఏమండి శాస్త్రుర్లుగారూ! మీరు ఆలాగు సెలవిస్తారు? యీనాములభేదం శాస్త్రాలలో యెక్కడైనా వున్న దండీ?

సోమ—లేకపోతే మానేను శిష్టాచారం ముఖ్యమని వున్నది.

భాను—అవును శిష్టాచారం మీరడానికి నేనూ వప్పుకోను. మురికినాటివారిపిల్లదాన్ని మావాడు యెట్లా చేసుకుంటాడో చూతాం కాదూ? నిజంగా పెళ్ళి చేసుకుంటే వారియింటికి వక్కడు భోజనానికి వెళ్ళడు. స్వాములవారికి వ్రాసి బహిష్కారపత్రిక తెప్పించకపోతే నేను బ్రాహ్మణ్ణే కాను.

పర — మీరు కోపం మాని బాగా విచారించండి. యీ సంబంధాలులేకపోవడంచేత చాలానష్టాలు వున్నవి. ఇప్పుడు నామట్టుకు చూడండి. నేను రెండువందల రూపాయలు జీతం తెచ్చుకుంటూ వున్నాను. నాకు పదివేలరూపాయలస్థితి వున్నది. మా అమ్మాయి గరల్సుస్కూలులో చదువుకుని మంచిబహుమానాలు పొందినది. మంచి చక్కనిది. యెంతదూరం విచారించినా మా మురికినాటివాళ్ళలో అంతా బ్రాహ్మణార్థాలు చేసేవాళ్ళేకాని వక్కడూ నాలుగుముక్కలు

యింగ్లీషు చదివినవాడూ పరీక్ష ప్యాసయినవాడూ శాస్త్ర స్థితికలవాడు కనపడడు. నారాయణమూర్తిగారికీ నాకూ ప్రాణస్నేహము. ఆయన కౌమారుడికి యెక్కడా మంచిసంబంధం దొరకక తంటాలుపడుతూ వున్నాడు. కౌమారుడు చక్కనివాడు. ఇంగ్లీషు చదువుకుని రెండు పరీక్షలు ప్యాసయినాడు. తండ్రికి నూరురూపాయలపని. ఆపిల్లవాడికీన్నీ మాచిన్నదానికీన్నీ వకరిని వకరు వివాహం చేసుకోవలెనని యెంతో అభిలాష వున్నది. యిలాగంటిస్థితిలో యీసంబంధమయితే యెంత బాగా వుంటుంది? యిందులో యెవరికి నష్టం వున్నది?

సోమ—నష్టంలేకపోతేమాత్రం కులం చెరుపుకుంటారయ్యా? మాలచదువు యింగ్లీషు యిప్పుడు వచ్చినది. యివ్వాలెనంటే మీ చిన్నదాన్ని మాపిల్లవాడి కియ్యరాదు? వాడు బ్రహ్మచర్యం చేస్తూ వేదం చదువుకుంచూ వున్నాడు.

భాను — తనకొడుక్కంత మంచిసంబంధం కావలిస్తే నారాయణమూర్తిగారు నా రెండోకూతురిని చేసుకోరాదూ? దానిది యెంత శ్రోత్రియసంప్రదాయం! యెంత ఆచారవ్యవహారాలు తెలిసిన పిల్ల! అది చిన్నతనమైనా రోజూ అయిదుస్నానాలు చేస్తూ తల్లి కంటెనూ ఆచారంగలది అనిపించుకుంచూ వున్నది. దాని మేనమామ యజ్ఞం చేసినాడు. నేను ఆధానం చేసినాను.

పర—ఈసంగతి తరువాత చూచుకుందాముకాని మీరు యీ సంబంధం వప్పుకుంటే సభవారికి మంచికట్నము యిచ్చుకుంటాను. మీరు అందరూ చక్కగా ఆలోచించుకొని రేపు వచ్చి యేదోజవాబు చెప్పండి. కచేరీవేళ అయింది వెళ్ళుతాను. (అని వెళ్ళుచున్నాడు.)

వాసు — వోరీ మీదెబ్బలాటలు మాని మన కందరికీ తలో ఫదిరూపాయలసొమ్ము చేతులో పడుతుంది. వప్పుకుందాము పట్టండి.

సోమ—నాకు రెండువందలరూపాయలు యిస్తే నేను వప్పుకుంచాను.

భాను—నాకు అయిదువందలరూపాయలు యిస్తే నేను వప్పుకుంచాను.

సోమ—నీ యెక్కువ యేమిటి? నీకు అయిదువందలు యిస్తే నాకూ అయిదువందలు కావలెను.

భాను—నాకు యెక్కువ లేకపోతే నేను వప్పుకోనే వప్పుకోను. నేను వెళ్ళిపోచాను. (అని లేవఁగా అందఱును నడుచుచున్నారు.)

---

# హాస్యసంజీవిని

ద్వితీయభాగము.

## వేశ్యావిషయసంవాదము.

[వేశ్యాప్రియరావుగారును, విరాగాచార్యులుగాను ప్రవేశించుచున్నారు.]

వేశ్యా—ఏమయ్యా విరాగాచార్యులూ! యీవూళ్ళోవాళ్ల స్థితి అంతా బొత్తిగా వెర్రిలో పడిపోతూవున్నది. ఎవళ్ళోభోగము వృత్తి అక్కరలేదన్నారట! అటువంటి విపరీతం పుడుతూవుంటే పెద్ద మనుష్యులు మీవంటివాళ్లంతావుండి వాళ్లకు తగినబుద్ధి చెప్పకుండా వూరుకోవడం మీకు న్యాయమనే తోచినదా?

విరా—వేశ్యలను వుద్ధరించడానికి మీవంటి మహాపెద్దలంతా కయ్యానికి కత్తికట్టుకొని నిలవబడుతూవుండగా మావంటి బక్కవాళ్ళు యేమిచెయ్యగలరు? యెవరికిబుద్ధిచెప్పినా యేకార్యము సాధించినా మీవంటి అసహాయశూరులు చెయ్యవలెనుగాని మాచేత యేమీ కాదు.

వేశ్యా—కర్రలుపుచ్చుకొని దెబ్బలాడమంటేం మీచేతగాదు గాని లోకోపకారంగా నోట్లోవున్నవి నాలుగుమాటలూ అని యీ మాత్రపు వాక్సహాయం చెయ్యలేరటయ్యా! పూర్వాచారం నిలవ బెట్టడానికే అక్కరకురాకపోతే అవతల మీచదువంతాయెందుకు? తగలబెట్టనా?

విరా—మాపెద్దల బుద్ధితక్కువచేత నాకు నాలుగుముక్కలు చదువుచెప్పించినారు. ఆనాలుగుముక్కలూ కడుపులో పడడంచేత

నాకుకూడా వేశ్యావృత్తి మంచిదికాదనే తోస్తూవున్నది.

వేశ్యా—యేమిటీ? నీకుకూడా ఆదుర్బుద్ధిపుట్టినదీ ? ఇదంతా కలియుగమహాత్యం. వినాశకాలే విపరీతబుద్ధి అన్నట్టు చెడిపోయేకాలానికి మీకందరికీ యిటువంటి విపరీతపుప్రూహాలు పుడుతూవున్నవి. యీ వెధవ యింగ్లీషుదొరతనం కాకపోతేనా—

విరా—ఏమయ్యా ఆలా పళ్ళుకొరికివేస్తూవున్నావు ? నన్ను కొడతావా యేమిటి ?

వేశ్యా—నేను కొట్టేస్థితిలోవుంటే బోగంవారికి వ్యతిరేకంగా యిటువంటి అవ్యక్తపుప్రసంగం యెందుకుచేస్తారు ? బోగంవృత్తి మంచిది కాదనేవాళ్ళనుచూస్తే నావళ్ళు భగ్గున మండుకొనిపోతుంది. ఆసౌఖ్యం వాళ్ళకు యేమితెలుస్తుంది ? నపుంసకుడికి రంభతో యేమి ప్రయోజనము? ఇదంతా కాలమహాత్యం. యీపాపిష్టికాలంలో యేమి చెయ్యడానికీ వల్లకాదు. యీ యింగ్లీషుప్రభుత్వంలేక మునుపటిదినాలయి యీకాళ్ళనొప్పులు లేకపోయినట్టయితే కర్రపుచ్చుకొని యీ వాదాలు చేసేవాళ్ళందరినీ పడగొడుదును. దిక్కుమాలినవైద్యుడు పవాయిరోగానికి మందుయిమ్మంటే రసం పెట్టడంచేత కాళ్లు పడిపోయినవి. వంటినిండా కంతులుకూడా బయలుదేరుతూవున్నవి. యెవళ్లనునమ్మినా వైద్యంచేసేగాడిదకొడుకులనుమాత్రం యెంతమాత్రమూ నమ్మరాదు. ఉస్స్రిరామ రామా ! యెంతబాధగా వున్నదీ !

విరా—అవును. తమరుచెప్పినట్టు తమవంటి అనుభవశాలులకుగాని ఆసౌఖ్యం తెలియదు. మీరు అనుభవించే లోపలిసుఖం యేమీ తెలియక వూరికే పయిస్థితిచూస్తే మావంటివాళ్ళకు భయం వేస్తుంది. మీరు కాళ్ళనొప్పులచేత కాబోలును బాధపడుతూవున్నారు.

వేశ్యా—వెధవనొప్పులు నాకు యీనొప్పులు లక్ష్యమటయ్యా! పచ్చసెగచేత లోపల కొంచెం పోట్లుపొడిచేటప్పటికి చుఱ్ఱుమని రామ రామా అన్నాను. సెగరోగంఅంటారుగాని అది వంటికి మెరుగు తెస్తుంది. నేను బోగం రత్నంయింటికి వెళుదామని మెల్లిగాలేచి కర్ర పుచ్చుకొని వీధిలోకిబయలుదేరివచ్చినాను. బండగాడిదకొడుకు యింకా వచ్చినాడుకాడు. దానిమొగంచూస్తే యీనొప్పులూ గిప్పులూ అన్నీ వక్కనిముషంలో మంత్రించినట్టు మాయమయిపోతవి. బోగంవాళ్ల సౌఖ్యంఅంటే అనుభవిస్తూవున్న మాకు తెలియాలిగాని మీకు యేమి తెలుస్తుంది ? ఇది మాటలతో చెపితే బోధపడేదికాదు.

విరా—అవును. తమరు సెలవిచ్చినమాట సత్యము. వక్కసెగ మాత్రమేకాదు. అన్నిరోగాలూకూడా వంటిని జీర్ణిస్తే బహుమంచివి. వాటివల్ల భగవద్భక్తికూడా కుదురుతుంది. చురుకుచురుకున ఇప్పుడు పోట్లుపొడవబట్టిగాని లేకపోతే మీరు లక్షవరహాలిచ్చినా రామరామా అనేవారా ? చిలుమువదలితే చీడ వదలుతుందని చిన్నతనంలో మీవలెనే వేశ్యలతోతిరిగేవారనేకులు పెద్దతనం వచ్చినతరువాత డబ్బు వూడి పరమభాగవతోత్తములై తులసిపూసలతావళాలు వంటినిండా వేసుకుని హరిభజనచేసుకుంటూ వుండడం నేను కళ్లారా చూచినాను.

వేశ్య—మీరు చెప్పేమాటలు మమ్మలిని వేళాకోళాలు చేస్తూ వున్నట్టున్నవి. అదుగో మాఅబ్బాయి వస్తూవున్నాడు. వాడు కావలిస్తే మీకు కావలసినన్నిసమాధానాలు చెప్పుతాడు. నేను వీణ్ని పెంచుకున్నాకానీ, యీకాలపువాళ్లకుమల్లే విపరీతబుద్ధులు లేక మంచి వాడు దొరికినాడు. వీడు ఫస్టుఆర్ట్సు ప్యాసయినాడు, పట్టమంటే నాలుగుముక్కలు రాని స్కూలువెధవలకుమల్లే వీడు బోగంవాళ్ళు మంచివాళ్ళు కారని యెప్పుడయినా అంటాడేమో చూడండి. యెందుకు

వెధవచదువు? గుణం ప్రధానంకాని చదువు ప్రధానం కాదు. మా రత్నానికి వీడంటే ప్రాణము. దాని వదినెగారికూతురికి వీడిచేత కన్నెఱికం చేయించి జమీందారీపెళ్ళిలాగు వైభవం జరిగించు మని పోరుతూ వున్నది. నేనే చేతులో డబ్బులేక వెనుకా ముందూ తటపటా యిస్తూ వున్నాను. యీవూళ్ళో డబ్బుగలముండా కొడుకులు ఇంతమంది వున్నారు. వక్కలంజెకొడుకయినా వెయ్యిరూపాయలు బదులుయివ్వ మంటే ఇవ్వకుండా వున్నాడు. వాళ్లకు ఆస్తి చూపించవలెనట. వెయ్యిరూపాయలు ఇటువంటి సత్పాత్రలో పడితే వాళ్లకు దండుగ వస్తుందా యేమిటి?

విరా—లోకంలో యెవరికీ ఆమాత్రంవివేకం లేదండి. మీకు సంతానం లేక పెంచుకోవలసిన అదృష్టం పట్టడంకూడా భోగందాన్ని వుంచుకోవడంవల్ల కలిగినఫలమే కాబోలును.

వేశ్యా—చెప్పినమాట మీరు గ్రహించలేరు. మీదగ్గిర యే మయినారసికత్వం వుంటే భోగంవాళ్లలో వుండేసారం మీకు తెలుసును. యేమీ తెలియనివాడితో మాట్లాడుతూ వుండడానికి నాకు వోపిక లేదు. నోరుకూడా నొప్పిపెడుతుంది. అదుగో బండి వస్తూవున్నది. అది నాకోసం యెదురుచూస్తూ వుంటుంది. వేగిరంవెళ్లవలెను. మీకు యేమయినాసందేహాలు వుంటే మాఅబ్బాయి తీరుస్తాడు. వోరీ శంకరయ్యా! యుక్తులు నాలుగుచెప్పి యీఆచార్లను నోరుయెత్తకుండా చేసి పంపివెయ్యి. భోగంవాళ్లను వుంచుకోవడంచేత నాకు సంతానం కలగలేదని యెత్తిపొడిచినాడు. కుయుక్తులు చెప్పి ఇలాగంటివాళ్ళను నోరు యెత్తకుండా చెయ్యడానికి స్కూళ్లలో చదువుకునేవాళ్లే సరి.

శంక—మంచిది మీరు వెళ్లండి. రత్నం మీకోసం కనిపెట్టుకు వుంటుంది. అది నావిషయమయి మీతో చెప్పినసంగతి బాగా

ఆలోచించవలెను సుమండీ. మనకు డబ్బు వచ్చినప్పుడు కార్యం రాదు. మీకు యెక్కడా ఋణం పుట్టకపోతే అమ్మమెడలో కాసులపేరు యేదో మాయోపాయం చేసి పుచ్చుకోలేరూ? స్త్రీలవిషయంలో అబద్ధం ఆడితే దోషం లేదని శుక్రాచార్యులవారు "వారిజాక్షులందు వైవాహికములందు ......బొంకవచ్చు నఘము పొందదధిప" అని శ్రీమద్భాగవతంలో సెలవిచ్చి వున్నారు. తరువాత మాట్లాడుదాము మీరు పోయి రండి.—ఏమయ్యా! విరాగాచార్యులూ! భోగంవాళ్లను వుంచుకోవడం తప్పని మా నాయనగారితో వాదం చేసి ఆయనకు సంతానం కలుగలేదని ఆక్షేపించినావుటయ్యా? భోగంవాళ్లను వుంచుకోవడంవల్ల లక్షలాభాలు వున్నవి. అందులో ఇది వకటి. అందరికీ సంతానం కలిగి జనం అభివృద్ధి అవుతూ వుంటే యీభూమిమీద పండే పంట వాళ్ళతిండికి చాలక కరువులు వచ్చి అందరూ చావవలసివస్తుంది లేకపోతే దొంగతనాలు మొదలైనవి వృద్ధిఅయి తిండికోసం వకళ్ళ తలకాయలు వకళ్ళు బద్దలుకొట్టుకుంటారు. భోగంవాళ్లను వుంచుకోవడంచేత పెళ్ళానికి సంతానం కలుగక జనంతక్కువై పోయి యిటువంటి గొప్పఆపదలు నివారణం అవుతవి.

విరా—నీవు చెప్పినయుక్తి బహుబాగా వున్నది. నీవు కష్టపడి చదువుకొని పరీక్షలు ప్యాసైనందుకు నీబుద్ధిని బహుబాగా వుపయోగిస్తూవున్నావు. మన దేశంలో వున్నభూమిఅంతా సాగుబడిచేసినట్టయితే. ఇక మూడింతలుజనం వృద్ధిఅయినా మన దేశంలోపంట మనకు సరిపోయి ఇతర దేశాలకుగూడా యెగుమతీ చెయ్యవచ్చును. మీరు లోకోపకారం నిమిత్తం యీకార్యం చేస్తూవున్నామంటారుగాని చేసుకున్న భార్యలు పడేక్షోభకు మీరు యేమిసమాధానం చెపుతారు?

శంక—ఆముండలు పోరవలేక యేడిస్తే మనము యేమి చేయ

గిలము? పరులకు సుఖం కలిగిపోతుందని యేడిచేవాళ్ళు యెప్పుడూ దుఃఖపడుతూనే వుంటారు. అది వాళ్ల గ్రహచారం.

విరా — అంతేకాని పెళ్ళి చేసుకున్న భార్యలను సుఖపెట్టడం మనకు ధర్మం కాదు?

శంక—మనకు యెంతమాత్రమూ ధర్మం కాదు. మనయిష్టం పుచ్చుకోకుండా పెద్దవాళ్ళు స్వతంత్రించి తమయిష్టం వచ్చినవాళ్లను మనకు కట్టిపెడుతూ వుంటే ఆముండలసుఖంకోసం తంటాలుపడడం మనకు ధర్మమా? పెద్దపిల్లలను తీసుకునివచ్చి మనతో మాట్లాడిస్తే మనం ఇష్టం వుంటే చేసుకుంటాము లేకుంటే మానుతాము. నా పెళ్ళాము అనాకారికదా నేను పయిగానైనా సుఖం అనుభవించకుండా పెళ్ళిఆడినానని ఆముండతో యెల్లకాలమూ యేడుస్తూ కూర్చోనా?

విరా—నీవు పెళ్ళినాటికి చిన్నవాడవా చితకవాడవా? ఇరవై యేళ్ళు పైకి వచ్చి అనాకారిగా వున్నట్టు తోస్తే పెళ్ళినాడే నాకు యీ పెళ్ళాము యెందుకు వద్దన్నావుకావు? అప్పుడేమో మహాయిష్టం వున్నవాడివలె తలవూచి పెళ్ళిఆడి తీరా ఇప్పుడు తల్లినీ తండ్రినీ బంధువులనూ అందరినీ వదిలిపెట్టి అన్నిటికిన్నీ నిన్నే నమ్ముకునివచ్చిన ధర్మపత్నికి ద్రోహం తలచి యిలా తిరగడం పాపం కాదా? పెళ్ళి కాలంలో అగ్నిహోత్రసన్నిధానమందు చేసినప్రమాణాలన్నీ వ్యర్థమేనా?

శంక—ప్రమాణాలు యెవరు చేసినారు? మా పౌరోహితుడు సంస్కృతములో యేమి చదివినాడో యేమి యేడిసినాడో నాకేమి తెలుసును? నాకు తెలియనిదేమో మీలోమీరు చదువుకుని దాని ప్రకారం నన్ను నడవమంటే నేను యెందుకునడుస్తాను? భోగంజాతి యేర్పరిచిన మనపూర్వు లందరూ బుద్ధిహీను లనుకున్నారా యేమిటి?

మన పూర్వులంతటిబుద్ధిమంతులు యెవరూ లేరని యూరోపులోవుండే గొప్పపండితులుకూడా వప్పుకుంటూ వున్నారు. యెవళ్లకూ అక్కరకు రాకపోతే మనవాళ్ళు భోగంవాళ్లను యెందుకు చేసినారు ?

విరా—మీవంటి మహానుభావులు ముందుపుడతారని తెలిసే చేశారుకాబోలును. వాళ్లను మీవంటి గృహస్థులనిమిత్తమేనా బ్రహ్మచారులనిమిత్తమూ సన్యాసులనిమిత్తమూకూడా చేసినారా ?

శం—అందరినిమిత్తమూకూడా చేసినారు. బ్రహ్మచర్యం చెయ్యడం బహుకష్టం. చిన్నతనంలో స్త్రీసంభోగం లేకపోతే వాళ్లకు ఇంద్రియనష్టం కలిగి చాలా బాధచేస్తుంది. పెళ్ళాలుయెదిగి కాపురానికివచ్చేదాకా పెళ్ళిఅయినవాళ్లకుకూడా కావలెను. వకవేళ భార్యలు కాపురానికి వచ్చినాకానీ వాళ్ళు అనాకారులైనా, కడుపుతోవున్నా, పుట్టింటికివెళ్ళినా, రోగాలువచ్చినా, మగవాడికి భోగంవాళ్ళు అవశ్యంగా వుండవలెను. సంభోగంలేకపోతే పురుషులు వేగిరం చచ్చిపోతారు. అందుచేత చాదస్తం లేకపోతే సన్యాసులకుకూడా భోగంవాళ్ళు వుండడం జరూరే అనుకుంటాను.

విరా—ఇక్కడితో పూర్ణంగా కుదిరింది. ఇఖ లోకమంతా భోగంవాళ్ళతో వున్నది. పెళ్ళివిషయంలో నీవు చెప్పిన సబబులన్నీ నీపెళ్ళానికికూడా పనికివస్తవి. నీవుమాత్రం మహా అందగాడవా యేమిటి ? నల్లగా కోతిలాగువున్నావు. నీపెళ్ళాము నీకంటె పదిరెట్లు చక్కగా వుంటుంది. నీవు చెప్పిన సబబుచేత నీవు అనాకారివిఅని నీ పెళ్ళాం మరివకణ్ని చూచుకోవచ్చును. నీవుకూడా అప్పుడప్పుడు వూరికివెళుతూవుంటావు ; నీకూ ఖాయిలాలు వస్తూవుంటవి. నీవంటి వాళ్ళు యింకా లక్షలు వుంటారు. మీపూర్వులకంటెకూడా మీరు బుద్ధిమంతులయి మొగవాళ్ళల్లోకూడా భోగంజాతి యేర్పరిస్తే యెవ

రికి అక్రమం లేకుండా కుదురుతుంది. మొగుళ్ళు అనాకారులుగా వున్నా, వూరికివెళ్ళినా, ఖాయిలాపడ్డా, ఇష్టంలేకపోయినా, మీవలెనే మీభార్యలుకూడా వాళ్లను వుంచుకుంటూ వుంటారు. నాయనా! యీవుపకారం నీవు కట్టుకుందూ.

శంక—నీవు మోటప్రసంగం చేస్తూవున్నావు. నీతోమాటలాండ కూడదు. మొగుళ్లు యేమిచేసినా ఆడముండలు ఇంట్లో చచ్చినట్టు పడివుండ వలెను. బ్రహ్మదేవుడు వాళ్ళనొసట అలా వ్రాసి పెట్టినాడు. ఇఖ నీతో మాట్లాడను ఫో. (అని పోవుచున్నాడు.)

## స్వర్గలోకసుఖము.

—:(o):—

రంగము—రంభమందిరము.

[బడేసాహేబుగారును, నరసింహసోమయాజులుగారును, సుబ్బరాయ చయనులు గారును, కామరాజు వాజపేయయాజులుగారును ప్రవేశించుచున్నారు.]

నర—బడేసాహేబుగారూ! సలాముండీ. తమరు లోపలకు వెళ్లకుండా మాతోకూడా వీధిసావిట్లోనే అట్టే వున్నారేమండి? యిలా చాపమీద దయచేస్తారా మేము కూర్చుంటాము.

బడే—అరే భాంచోత్! మాజోలి నీకు యెందుకువోయి? మాకు కావలిస్తే యీగాడిదలిని జుట్టుపిలక పట్టుకుని యీడ్చివేసి మేముకూర్చుంటాము. సాహేబు దగ్గరగావస్తే మయిలపడుతా నన్నందుకు మొన్న సోమయాజులు గాడిదకొడుకును యెలా తన్నినానో జ్ఞాపకంవుంచుకోండి. యజ్ఞాలుచేసిన బేపనవాళ్లకు మీకు బుద్ధిలేదు. లోపల సాహేబు వుండగా రంభతో యెలా వెళుతామనుకున్నావోయి?

నర—చిత్తము చిత్తము. లోపల సాహేబుగారు వున్నది

మాకు తెలియదండి. ఆయనకు మాభాష తెలిసిందిగాదు గనుక ఆవేషం చూచి మేము దొరగా రనుకున్నామండి.

బడే—భాంచోత్! మిమ్మల్ని పట్టుకుని బూట్సుకాళ్లతో తన్నితే దొరగా రనుకోవడమూ గిరవారనుకోవడమూ అన్నీ వదులు తవి. యీజిప్టుయుద్ధంలో చచ్చినవాడికి మీభాష యెలా తెలుస్తుం దోయి? భాంచోత్! మీకు లోపలమాట వినబడకుండా మహాగడబిడ చేస్తూవున్నారు. మీరు చచ్చినట్టు నోరుమూసుకొని కూర్చోకపోతే మొన్న సోమయాజులను తన్నినట్టు మిమ్మలినందరినీ యెలాగు తన్ను తానో చూడండి తన్నినతరువాత కావలిస్తే మీఅబ్బతో చెప్పుకోండి.

నర—మహాప్రభో! మేము మాట్లాడమండి. మీకు దణ్ణం పెడ తాము. మాజోలికి రాకండి. మాకు రంభాఅక్కరలేదు. యేమీ అక్కర లేదుమీసెలవైతే వెళ్ళిపోతాము.

బడే—పోతేపొండి పోకపోతే గంగలోదిగండి. మీరు వెయ్యేళ్లు యిక్కడ తల్లక్రిందుగా తపస్సుచేసినా మీకిప్పుడు రంభ రాదు. ఆఫ ఘన్ యుద్ధములో మాతో చచ్చినవాళ్ళు ఇరవైవేలమంది సాహేబు లున్నారు. ఈజిప్టుయుద్ధంలో చచ్చినవాళ్లకు ఇంకా వంతురాకుండా పదివేలమంది దిగబడి వున్నారు. ఇంకాసౌఢానుయుద్ధములో చచ్చిన తురకలు యెంతమందో యిప్పుడు వస్తూవున్నారు. మీగ్రహచారం వీధులోబడి యేడుస్తూవుండవలసినదే. యేమిటోయి మీరు యేదో నములుతూ తాగుతూవున్నారు.

నర—చిత్తము. తమకుకూడా సమర్పించుకుంటాము. ఇది యజ్ఞాలలో పురోడాశమండి. ఇది సోమరస మండి.

(అని యిచ్చుచున్నారు.)

బడే—(పుచ్చుకొని నోట్లో వేసుకొని తుప్పున మొగముమీద

నమ్మి వేసి) భాంచోత్. ఇది యేమిటోయి చప్పనిది పెట్టినావు. మాది మాడు మీకుపోస్తాము. యెంతరుసిగావుంటుందో. (అని బ్రాహ్మణులు మొఱ్ఱ పెట్టుచుండఁగా వారినోళ్ళలో బలవంతముగా మాంసము పెట్టి కల్లునీళ్లు పోయుచున్నాఁడు.)

నర — మహాప్రభో! చాలును చాలు నండి. అదుగో యెవరో తలుపు తీసినారు.

బడే — మీరాసాహేబు వచ్చినాడు. మేము రంభదగ్గిరకి యెల్లాలె. (అని పోవుచున్నాఁడు.)

నర — ఆ రంభ పుణ్యంగా చయనులూమనము యీవాళ దెబ్బలు తినకుండా యీ తురకముండాకొడుకు చేతులోనుంచి తప్పించుకుని బ్రితికినాము. మననోట్లో మాంసం పెట్టినందుకు మనం ప్రాయశ్చిత్తం చేయించుకోవలెను. దీనికి. యేమిప్రాయశ్చిత్తం వున్నదో చెప్పు.

సుబ్ర — నేను శ్రౌతం చదువుకున్నానుగాని శాస్త్రం చదువుకో లేదు. అందుచేత నాకు రోజూ ప్రాయశ్చిత్తాలు చేసుకోవడమేకాని దేనికి యేమి ప్రాయశ్చిత్తం వున్నదో తెలియదు. మన వాజపేయ సోమయాజులుగారికి యేమైనా తెలుసునేమో.

కామ — లౌక్యంలో తిరిగినవాణ్ని కనుక నాకైతే ప్రాయశ్చిత్తాలసంగతి బాగా తెలియదుకాని యుక్తిచేత నాకు తోచింది నేను చెపుతాను. మాంసం తిన్నందుకు ప్రాయశ్చిత్తమే అక్కరలేదు. నేను భోగందాన్ని వుంచుకొని దానియింట్లో మాంసం తింటూవచ్చి నందుకు భూలోకంలో వున్నప్పుడు వక్కరోజూ నేను ప్రాయశ్చిత్తం చేయించుకో లేదు. కుండలాలు వేసుకుని శాస్త్రిలన్నీ పారజదివిన మహాబ్రాహ్మలు తిరిగినపండితులు వచ్చి నాపంక్తిని భోజనం చేసేవారు. నాసంగతి వాళ్ళకు బాగా తెలిసినప్పటికీ వక్కళ్ళూ ప్రాయశ్చిత్తము

కావలెనని చెప్పలేదు. అంతే కాకుండా మనం యజ్ఞాలలో మేక మాంసము తిని సోమపానము చెయ్యలేదా? వాటికి లేనిప్రాయశ్చిత్తము వీటికి యెందుకు?

సుబ్ర—వాటి కక్కరలేకపోతే తురకవాడు ముట్టుకున్నందు కయినా ప్రాయశ్చిత్తం వుండవలెనా అక్కరలేదా?

కామ—దానికీ అక్కర లేదు. ఇప్పుడు యుద్ధాలమూలంగా వీరస్వర్గానికి వచ్చి రంభతో సంభోగానికి వచ్చేవాళ్ళంతా తురకవాళ్ళే. మనం యెన్నిమాట్లని ప్రాయశ్చిత్తాలు చేసుకుంటాము? ఆమోటు ముండాకొడుకులు తాకవద్దంటే మానుతారా?

నర—నీవు యింకా తురకవాళ్ళంటూవున్నావు. ఆఫ్ఘన్ యుద్ధములో చచ్చి వీరస్వర్గానికి వచ్చినాడట! మాలవాడు వచ్చి రంభతో సంభోగం చేసి వెళ్లేటప్పుడు మమ్మలినందరినీ రాచుకుని మరీ పోయినాడు.

సుబ్ర—వెధవస్వర్గము. ఇది స్వర్గమన్నమాటేకాని ఇక్కడంతా వర్ణసంకరం. వావీ వరసా యేమీ లేదు. ఆ మాలవాడు వెళ్లడంతోటే రంభవద్దకు నేనూ వెళ్లినాను. అందరమూ యజ్ఞాలు చెయ్యడంచేత మాతండ్రిగారూ నేనూ మా భావమరిదీగూడ వక్కముండతోనే యేడవవలసివచ్చింది. ఆ రంభముండ ముసలివాడని మా తండ్రిగారిని వక్కతోపు తోసేటప్పటికి ముసలిబ్రాహ్మడు కింతపడి పోయినాడు. నేను ఆయనచెవులు మూసి వుపచారం చేస్తూవుంటే మోటముండావాడు మా భావమరిది వచ్చి అస్తమానమూ మీరే యిక్కడ వుంటే మేము వెళ్లవద్దా అని గుబికీ గుబికీ నావీపుమీద ఘటి గుద్దులు గుద్దినాడు. అన్నికష్టాలూ పడి తీరా కాస్త రంభాసంభోగం లభించవచ్చేవరకు తుండ్లలాగు తురకముండావాళ్లు వచ్చి మమ్మలిని

నాలుగుతన్ని జుట్టుపట్టుకొని అవతలకు యీడ్చి పడలాగివేసినారు. మా భావమరిదిగాడికి మహాచెడ్డరోగాలు అంటుకున్నవి. వాడు అప్పటి నుంచీ ఆవతిన్న పసరంలాగు కిందపడి కొట్టుకుంటూ వూరంతా దొర్లి పుచ్చకాయలాగు దొర్లుతూ వున్నాడు. గాడిదకొడుకు నన్ను కొట్టి నందుకు వాడికి శాస్తి కావలసినదే.

నర — మీరు యిక్కడనవుయ్యా పగ సాధించుకోవడం? కాస్త వెళ్ళి వైద్యుణ్ని తీసుకుని రాలేకపోయినారా?

సుబ్ర — ఇంతమందికి వైద్యం చెయ్యడానికి ఇక్కడ అశ్వినీ దేవతలు ఇద్దరే వైద్యులున్నారు. ఇంతమందికి వాళ్ళు యెక్కడ చేస్తారు? వాళ్లఖర్మం వాళ్ళదని యేవో నోట్లో నాలుగుసీళ్ళు పోసి వూరుకుంచారు.

కామ — రంభదగ్గిర రోగాలుకూడా వున్నవవుయ్యా? నేను యింతవరకూ రంభ అంటే యేమో అనుకుంటూ వున్నాను.

సుబ్ర—పదినుంది యెక్కడకు వెళితే అక్కడల్లా రోగాలు వుడుచవి. ఇక్కడ వున్నరోగాలవంటివి భూలోకంలో యెక్కడా లేవు.

కామ—ఆలాగైతే నాకీవెధవరంభాసంభోగం అక్కరనేలేదు. మావూళ్ళో నేను వుంచుకొన్నబోగందికూడా ఇక్కడకే వచ్చిందని విన్నాను. అది స్వర్గంలో వున్నదో నరకంలో వున్నదో తెలిస్తే దాని దగ్గరకే వెళ్ళిపోచాను.

సుబ్ర — అది తప్పకుండా నరకంలోనే వుంచుంది, బ్రతికి వున్నంతకాలమూ యెంతమందికొంపలో కూలతోసినదానికి స్వర్గం యెలాగు వస్తుంది?

కామ—ఆలాగునఅనకూడదు. అది యెన్నో నరమేధయాగాలు చేసినదేను. దానికిమాత్రం స్వర్గం యెందుకు యివ్వరు? దానికిముందు

నాకు మహావిశ్వాసం. మేము యిద్దరమూ భూలోకంలో వున్నప్పుడు మాయింటిల్లిపాదికీ దానిచేత బియ్యంకొలిపించి యిప్పించేవాణ్ని. మా యింట్లో అదిపెట్టింది బిక్షము. నేను దానిదగ్గిరకు వెళ్ళక మానను. ఆయిందుప్రుడుమాత్రము నాకు రంభ అక్కరలేదు దాన్ని యిమ్మంటే యివ్వడా? (అని వెళ్లుచున్నాడు.)

---

## చంద్రగ్రహణము—తేలుమందు.

---

ప్రదేశము—సీతారామపురము.

[జనవంచకాచార్యులుగారును, మతిహీనరావుపంతులుగారును, వివేకభూషణుడుగారును ప్రవేశించుచున్నారు.]

వివే—ఏమయ్యా మతిహీనరావుగారూ! అలాకాగాలు పెడుతూవున్నారు?

మతి—మరియేమీలేదండి. యీజనవంచకాచార్లగారిని తేలు మంత్రం వుపదేశించమని నాలుగునెలలనుంచి అనుసరిస్తూ వున్నాను. నావద్ద నాలుగురూపాయలు పుచ్చుకొని గ్రహణం రానిమ్మని యిప్పటిదాకా జరిపినాడు. నిన్నరాత్రి తీరావుపదేశంచేస్తానని వూరిబయిటి చెరువులోకి తీసుకునివెళ్ళి కంఠంలోతు నీళ్లలో దింపినాడు.—ఉస్సి! అబ్బబ్బా! గుండెలలోకి పోట్లుపొడుస్తూవున్నది. చెయ్యి బద్దలువేసుకు పోతూవున్నది.

వివే—ఆకాలినిండా నెత్తురేమిటయ్యా?

మతి—అదేనండి. మనవిచెయ్యబోతూవున్నాను. గ్రహణ సమయంలో స్నానం చేసి కంఠంలోతునీళ్ళల్లో నిలుచుండి మంత్రం వుపదేశం అవుతూవుండగా దిక్కుమాలినజెలగలు వచ్చి కాళ్ళన్నీ పీకి

నెత్తురుకొల్లుచేసినవి. ఆబాధకయినా వోర్చుకున్నానుకానండి యిప్పుడీ తేలుబాధ సహించలేకుండా వున్నాను.

వివే—నీకు యీ తేలుబాధ యెలాతటస్థమయినది?

మతి—మంత్రం వుపదేశం అయినతరువాత దిసమొలతో వెళ్ళి పుట్టమీదవున్న జిల్లేడుచెట్టు పెల్లగించి దానివేరుగంధం వ్రాస్తే యెటువంటి తేలు కుట్టినా పోతుందని మెల్లిగా వెళ్ళి పెల్లగించడానికి చెరువుగట్టుమీద వున్న జిల్లేడుచెట్టుమొదట్లో చెయ్యి పెట్టేటప్పటికి నా ప్రాణాని కాపాపిష్టతేలు యెక్కడనుంచి వచ్చినదోకాని చటుక్కున చిటికినవేలంటపొడిచింది. రాత్రినుంచి దానితో బాధపడుతూ వున్నాను. ఇప్పటికి చెయ్యంతా వెయ్యిగొడ్డళ్ళతో నరికినట్టు బద్దలు వేసుకుని పోతూవున్నది.

వివే—మీగురువుగారు మంత్రం వెయ్యలేదా?

మతి—కావలసినన్నిమంత్రాలు వేసినారు. యెన్నోవేళ్ళరగిదీసి రాసినారు. యేమీకార్యంలేకపోయింది. నీపురాకృతకర్మం అనుభవించక తీరదంటారు. ఏమయ్యాఅంటే యీమంత్రం వెయ్యడంచేతనే బ్రతికినావుకాని లేకపోతే అటువంటి పుట్టతేలు కుట్టినందుకు తక్షణం చావవలసినదేనని చెప్పినారు. ఆయన బహుదొడ్డవాడు. మంచిమంత్రవేత్త. ఆయన వుండబట్టే బ్రతికినాను. రాత్రి రెండుఝాములవేళ చెరువుగట్టుమీద రొమ్ముగరిసిలపడి పడిపోతే బుజాలమీద వేసి నన్ను మోసుకువచ్చి యింట్లో పడవేసినాడు.

వివే—మీరు తేలుమంత్రం వుపదేశం అయినారుగనుక మీకు తేలు ప్రత్యక్షమయి వరం యిచ్చినది. మీరువెనుకకూడా యీ ఆచార్యులగారివద్ద యేదోమంత్రంవుపదేశమయినట్టున్నారే. అప్పుడూ యీలాగే ఫలం వెంటనే అనుభవమయినట్టున్నది. వీరు వుపదేశించే

మంత్రాల కెప్పుడూ సద్యోఫలం కలుగుతుంది కాబోలును.

మతి—యేడిచేవాణ్ని మీరు నన్ను మరింత యేడిపించకండి. నేను వెనుక స్త్రీవశ్యానికి వుపదేశమయిన మంత్రంమాట కాబోలును మీరు సెలవిస్తూవున్నారు. అప్పుడు వుపదేశమయిన మంత్రం జపించి మంత్రోదకం—గారి భార్యమీద వీధులో వెళుతూవుండగా చల్లేటప్పటికి ఆవిడ నన్ను పట్టుకుని చెడతిట్టినది. మాటలకేమి గాలికి పోతవని నాదారిని నేను వెళుతూవుంటే లోపలినుంచి బడితెలలాగు నలుగురుమొగవాళ్లువచ్చి నన్ను సున్నంలోకి ఎముకలేకుండా చితుకపొడిచినారు. ఆసంగతి తలుచుకుంటే నాకు దుఃఖంవస్తూవున్నది. మీరా మాట తలపెట్టకండి.

వివే—మీరామంత్రం మళ్ళీ యెవరిమీదా ప్రయోగించలేదని తో స్తుంది.

మతి—పోనిస్తురూ దిక్కుమాలినమంత్రం దానిమాట చెప్పకండి. మంత్రం రహస్యముగా వుంచవలెనుగనుక మళ్ళీ దాన్ని పయికితియ్యలేదు. మంత్రాలలో గొప్పమహత్యం వున్నది. వుపదేశమయిన వాళ్ళు తిన్నగా పునశ్చరణచెయ్యకపోతే ఫలం కనుపడదు. అదంతా మనలోపమేకాని మంత్రముయొక్క లోపము యేమీలేదు.

వివే—ఇదంతా మోసం చేసి తెలివితక్కువవాళ్ళవద్ద డబ్బు కడతేర్చడానికి వంచకులు పన్నినపన్నుగడకాని తేలుకూ పాముకూ మంత్రాలు యేమిటి? యీవృథాశ్రమకంటె మందులకోసం ప్రయత్నంచేస్తే చాలా లాభం వుంటుంది. చంద్రుడికి భూమినీడ అడ్డంవచ్చి గ్రహణంపడితే యీవెఱ్ఱిస్నానాలూ జపాలూ యేమిటి?

జన—మీకు గ్రహణంసంగతి బహుబాగా తెలుసును! రాహువూ కేతువూ పట్టడమూ శాస్త్రాలూ బ్రాహ్మణీకమూ అన్నీ

మన్ను కొట్టుకునిపోయినవి. మీరు యిప్పుడు చదువుకున్న మాలకూతలనుబట్టి గ్రహణమంటే భూమినీడ అడ్డం రావడం కాడికి వచ్చింది. మీవంటి నాస్తికులు యెటువంటి దుర్బోధలుచేసినా ప్రజలు మావంటి శిష్టులైనమంత్రవేత్తల మాటవిని దానధర్మాలు చెయ్యక మానరు. మీరు వూరికే మంత్రాలను పరిహాసం చేస్తూవుంటే తెలియనివాళ్ళతోటి యేమిటని వూరుకున్నాను. నామంత్రంయొక్క ఫలం కావలిస్తే కాలుతీసి కాలుపెట్టేటప్పటికి నెత్తురు కక్కుకుని చచ్చేటట్టు చేస్తాను. ఎందుకు? కానికాలాలు వచ్చినవి. ఈమాటలు చెప్పరాదు. వెళ్ళిపోతాను.

మతి—నాకు తేలుబాధ బహుమిక్కుటంగా వున్నది. నేనూ వెళ్ళిపోతాను.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

## నారద సందర్శనము.

[నృసింహశాస్త్రుల్లవారును, పరబ్రహ్మసోమయాజులుగారును, నారదులవారును కూరుచుండఁగా విశ్వస్తవల్లభాచార్యులుగారు ప్రవేశించుచున్నారు.]

నృసిం।— ఆచార్యులుగారూ దయచెయ్యండి. ఈభూమిమీందికి నారదులవారు విజయంచేసినారు చూచినారా?

విశ్వ—వీరేనా నారదులవారు? ఆహా! యేమి వీరి బ్రహ్మతేజస్సు! పూసినవిభూతిచేత దేహ మెంత ధవళముగా నున్నది! ఓ బ్రహ్మమానసపుత్రా! నీకు నమస్కారము. మీ రెక్కడనుండి విజయంచేసినారు?

పర—మేము బ్రహ్మలోకమునుండి స్వర్గాదిలోకములకు విజయం

చేసి మన పితృదేవతల ప్రార్థనప్రకారం మనతో వారియాజ్ఞను చెప్పడానికి వచ్చినారు.

విశ్వ—ఇప్పుడు ఇంగ్లీషు చదువుకున్నవాళ్ళు స్వర్గాదిలోకాల నుంచి మహాత్ములు వచ్చేవారంటే మనను పరిహాసం చేస్తారు. వారికందరికీ బుద్ధివచ్చేటట్టుగా కలహాశనులవారు మనకు ప్రత్యక్షమైనారు గదా? మహాత్ము లాకాశగమనముచేత తమవద్దకు వచ్చి మాట్లాడి పోతారని దివ్యజ్ఞానసమాజమువా రన్నమాట లబద్ధ మనేవారిని యీలాగు యీవ్వకొని రా. వీరిని ప్రత్యక్షంగా చూపించి వాళ్ళనోరడుతాము. వకవేళ వాళ్ళు చూచినాకానీ నమ్మరేమో! ఈయన కృతయుగంనాటివాడు గదా గడ్డం నెరియలే దంటే మన మేమి చెపుతాము?

నృసిం — దేవత లెప్పుడూ త్రిదశులు. వాళ్ళు ముప్ఫయి యేళ్లకు మించినవారుగా వుండరు గనుక గడ్డములు నెరియవు.

విశ్వ — స్వామీ! తమరు బ్రహ్మమానసికపుత్రులు గదా? బ్రహ్మకు నాలుగుముఖాలూ యేప్రకారంగా వుంటవో ఆన తిచ్చెదరా?

నార—అవి నాలుగూ వకదానితరువాతవకటి వరసగా వుంటవి; కాదు కాదు నాలుగూ నాలుగువైపులకు వుంటవి; అలా కాదు మూడు ముందువైపునా వకటి వెనుకవైపునా వుంటుంది; మరిచిపోయినాను జ్ఞాపకం చేసుకోనీ. రెండు వకవైపునా రెండు రెండోవైపునా వుంటవి. ఈచెప్పినవిధాలలో యెలాగు వుంటవో నిశ్చయంగా చెప్పలేను. ఈమాటు బ్రహ్మనడిగివచ్చి చెపుతాను.

పర—స్వామీ! తమ కంతశ్రమ యెందుకు? దివ్యదృష్టిచేత చూచి చెప్పరాదా?

నార—అంతర్దృష్టిచేత చూచినాము. వకతల పయికీ వకతల

కిందికీ వకతల ముందుకూ వకతల వెనుకకూ వకతల మూలకూ వెరసి నాలుగుతలలూ నాలుగునాలుగు లష్టదిక్కులకూ తిరిగి వుంటవి.

విశ్వ — ఇవి తమరు దివ్యమానప్రకారం చెప్తుతూ వున్నారు కాబోలును. నా కేమీ అర్థము కాలేదు.

నృసిం — మనము బాహ్యార్థము విచారించరాదు. వారు చెప్పే మాటల కన్నిటికి లోపల గూఢార్థము వేదాంతార్థము వుంటుంది.

విశ్వ—రహస్యార్థం పోనిచ్చి, స్వామీ! తమరు భూలోకమునకు వచ్చినప్రయోజనము సెల విచ్చెదరా?

నార—మీ పితృదేవత లందరూ మీతో వక్కసంగతి చెప్పు మన్నారు. మృతులయొక్కభార్య లందరూ తరువాత స్వర్గలోకానికి వచ్చి భర్తలతో స్వర్గసుఖం అనుభవిస్తా రన్నసంగతి శాస్త్రాలనుబట్టి మీకు తెలిసేవున్నది కదా? మీరు వాళ్ళకందరికీ తలవెంట్రుకలు తీసివేయించడముచేత మాకు స్వర్గంలో బోడిభార్యలు వస్తూవున్నారు. ఈబాధ లేకుండా చెయ్యమని మీతో చెప్పుమన్నారు.

విశ్వ—అంతేనా? యింకా యేమయినా చెప్పుమన్నారా?

నార—"మీరు మా పేరు చెప్పి బ్రాహ్మలకుపెట్టేది యేదిన్నీ మాకు ముట్టడం లేదు. మేము దానధర్మాలకూ నిత్యకృత్యాలకూ డబ్బు లేక చాలాయిబ్బంది పడుతూ వున్నాము. ఘడియఘడియకూ మళ్ళీ స్వర్గాన్నుంచి వచ్చేవారు యెవరూ వుండరు గనుక ఇప్పుడే మీ వద్ద నున్నడబ్బంతా యీనారదుడిచేతి కిచ్చి పితృఋణవిముక్తులు కావలసినది." అని చెప్పుమన్నారు.

విశ్వ—నాకు పని వున్నది. నేను మళ్లీ వచ్చి దర్శనం చేసు కుంటాను.

పర—నా కగ్నిహోత్రాల వేళ అయింది పోతాను.

నృసిం — శిష్యులు నాకోసం కనిపెట్టుకుని వుంచారు. నేను పోవలెను.

(అని యందఱును విష్క్రమింపఁగా నారదులవా
రంతర్ధాన మగుచున్నారు.)

---

## యజ్ఞప్రయత్నము.

(భార్యాభర్తసంవాదము.)

ప్రదేశము — వేంకటదీక్షితులుగారి శయనగృహము.

[వెంకటదీక్షితులుగారును, భార్యా లక్ష్మిదేవియు ప్రవేశించుచున్నారు.]

వెంక — అవునే! యింటిదానా! రేపు అమావాస్యవెళ్ళిన విదియనాడు బయలుదేరి యాగభిక్షకోసం వక్కసారి దేశసంచారం చేసివస్తునా?

లక్ష్మి — దేశసంచారం కాదుకదా మీరు గ్రామసంచారమైనా చెయ్యరు. రాత్రీ పగలూకూడా మీరు పెళ్లామును యెవరూ యెత్తుకుపోకుండా కనిపెట్టుకుని కూరుచుంచారు. మీకుకాగా నేటికాలానికి అరవయ్యోపడిని పడుచుపెళ్ళాము దొరికింది. ఇంట్లో నన్నుయెవ్వరూ యెత్తుకుపోరులెండి. రోజూ నాలుగుఘడియలు వీధిలోకి వెళ్లి నలుగురు పెద్దమనుష్యులనూ చూచివస్తూవుండండి. నేను కాపురానికి రాకముపు అక్కడా అక్కడా తిరిగి నాలుగుడబ్బులసొమ్ము యేరుకువచ్చేవారు. ఇప్పు డదీపోయింది.

వెంక — నీవు యింట్లో వక్కర్తెవూ వుండిపోచావనే భయం చేత యెక్కడకూ వెళ్లడం మానుకున్నాను; నీపెళ్ళినిమిత్తం ఖర్చుచేసిన వెయ్యిరూపాయలమాటా తలుచుకుంటే నాగుండెలు బద్దలయి

పోచూవుంచవి. నేను యిందులో యేమీ అబద్ధం ఆడడంలేదుగదా? వొక్క సీతండిరికే యెనిమిదివందలరూపాయలు రొఖ్ఖం యిచ్చిన సంగతి నీవే యెరుగుదువు. మూడుఝాములదాకా భోజనం లేకుండా మాడి దొడ్డిసంభావనలో దెబ్బలుతిని డబ్బుడబ్బుకాడినుంచి గణించిన యేడువందలరూపాయలూ పోగా మూడువందలరూపాయలు ఋణం కూడా అయింది. ఆబాధ తీర్చుకోవడానికే ఇప్పుడు యాగభిక్ష తల పెట్టుకున్నాను. యజ్ఞంపేరుచెపితే యెంతకఠినుడయినా రూపాయో అర్ధో యివ్వకమానడు.

లక్ష్మి—అది బాగానేవున్నది. సంవత్సరముయినాసరే! రెండు సంవత్సరాలైనాసరే తిరిగి నాలుగువేలరూపాయలు కళ్ళపడ్డదాకా మళ్ళీ యింటికి రాకండి. నాకోసం మీరు తొందరపడి రావద్దు. మీరు యింట్లో లేరన్న లోపం లేకుండా నేను సంసారం గుట్టుగా జరుపు కుంచాను.

వెంక—నేను అంతకాలం నిన్ను వదలివుండలేను. వూరు బయలుదేరినతరువాత నాప్రాణాలన్నీ నీమీదనే వుంచవి. మనకు రెండు వేలరూపాయలు దొరికితే చాలును. వెయ్యిరూపాయలు యజ్ఞానికి ఖర్చుఅయినా పయిగా వెయ్యిరూపాయలుమనకు మిగులుచవి.

లక్ష్మి—మీరు నిజంగా యజ్ఞంకూడా చేస్తారా? నేను వూరికే యజ్ఞం పేరుచెప్పి సొమ్ము సంపాదించి నాకు నగలుచేయించి పెడచారనుకొంచూవున్నాను. అలాగైతేముష్టిరూపాయలు వెయ్యిరూపాయలు యేమిచాలుచవి? ఆవెయ్యిరూపాయలూపెట్టి నాకు నగలే కొంచారా? అప్పులే తీరుస్తారా? యిల్లేకడుతారా? నామాట విని యజ్ఞం చెయ్యకండి. పూర్వం మల్లిఖార్జునదీక్షితులుగారు యజ్ఞం చేస్తానని డబ్బు పోగుచేసి ఇల్లు కట్టించుకుంటే యెవరేంచేసినాడు?

మనమూ అలాగే డబ్బుతో సుఖంగా వుందాము.

వెంక.—అలాకాదు. యజ్ఞంచేస్తేనే చాలాలాభంవున్నది. నలుగురూ సోమయాజులుగారని నాకు గౌరవం చేస్తారు. సంభావనకుపోతే డబ్బుయిచ్చేచోట రెండుడబ్బులు యిస్తారు. సోమిదేవమ్మ అంటే నీకూ యెంతో గొప్పగా వుంచుంది.

లక్ష్మి—ఆగొప్పాగిప్పా నాకు అక్కరలేదు. చక్కగా తలదువ్వుకొని కొప్పుపెట్టుకొని ఖులాసాగా వుండకుండా, అగ్నిహోత్రాలకని రోజూ స్నానాలు చేయించి కళ్ళు పోయేటట్టుగా పొగదగ్గిరకూర్చోపెట్టి మూసివాయినం ముత్తయిదులాగు వుండమంటే నేనువుండేదాన్ని కానుసుమండీ. యిప్పుడే చెప్పుచూవున్నాను.

వెంక—అన్నంతించానా గడ్డితించానా ? నీసుఖం నేనుమాత్రం యెరుగనూ ? యజ్ఞం అయినతరువాత అగ్నిహోత్రాలు మరునాడేమానివేతాము. నీసవితికాలంలో ఆధానం చేసినానుకదా. అగ్నిహోత్రాలు వుంచి దానికేమయినా వత్తుడు కలుగచేసినానేమో యీయిరుగుపొరుగువారినందరినీ అడుగు. నిన్ను వక్కరోజు స్నానం చెయ్యమనను.

లక్ష్మి—అది సరేకాని యజ్ఞంలో మూడుదినాలుమాత్రం నేను వుపవాసాలు వుండి మాడగలనా? నేను ప్రతిరోజూ మూడుపూటలూ అన్నం తినడానికి వప్పుకుంచేనేకాని మీరు యజ్ఞంమాట తలపెట్ట వల్ల కాదు.

వెంక—నీకురాత్రిళ్లు అన్నం రహస్యంగా తెప్పించి పెట్టిస్తాను. పగలుమాత్రం యెలాగైనా మూడునోజులు వోపిక పెట్టివుండు. పగలు అందరూ వుంచారు. వారు చూస్తూవుండగా అన్నంతించే బాగా వుండదు. కావలిస్తే పగలు నీమనస్సువచ్చినన్ని పళ్ళూ పాలూ

పుచ్చుకో.

లక్ష్మి—నాకు అలా పనికిరాదు. నేను చద్దిఅన్నం తినకుండా వక్కదినం వుండలేను. మహామహా అమావాస్యనాడుసమేతు చద్ది అన్నం తినకుండా రెండుజాములదాకా వుండమంటే వుండకపోతే, నాకు పొద్దున్నే రహస్యంగా చద్దిఅన్నం పెట్టించి మరీబ్రాహ్మడికి పెట్టుకునేవారు మీకు తెలియదా? యజ్ఞశాలలోకి తరవాణికుండ తెచ్చుకోనిస్తేనేకాని నేను యజ్ఞానికే రాను.

వెంక — నీవు తరవాణికుండమాత్రం తీసుకునిరాకు. నేను యెలాగో తంటాలుపడి నాలుగుఘడియలతెల్లవారిగట్టే నీకు పెరుగూ అన్నమూ దొరికేలాగు చేస్తాను. ఆమూడురోజులూమాత్రం శ్రమపడు.

లక్ష్మి—తెల్లవారిగట్ట చలిలో చద్దిమెతుకులు నాకు గొంతుక లోకి పోచవా యేమిషి? నేనుమాత్రం అమ్మా అయ్యా కడుపునపుట్టి మనుష్యజన్మ యెత్తలేదూ? నాకు సౌఖ్యం లేకపోయినతరువాత వెధవ యజ్ఞం నాకెందుకు?

వెంక—నిన్ను గడ్డం పట్టుకొని బతిమాలుకుంచాను. నామాట విను. ఈమూడురోజులూ శ్రమపడితే నీకు నూరువరహాలనగలు కొని పెట్టి కావలసినన్నిచీరెలూ రవికెలూ యిప్పిస్తాను. యజ్ఞం చేస్తే పరలోకమందుకూడా చాలాఫలం వుంచుంది. నీవు అక్కడ యెంతో సుఖం అనుభవిస్తావు.

లక్ష్మి — యజ్ఞం చేస్తే స్వర్గంలో యేమిసుఖం వస్తుందో ముందుగా నాతో చెప్పండి. ఆలోచించుకొంచాను.

వెంక—అన్నిసుఖాలూ వస్తవి. రంభాసంభోగం వస్తుంది.

లక్ష్మి—రంభ ఆడదా? మగవాడా?

వెంక—రంభ ఆడది. దాన్నిచూస్తే పురుషులు పరవశులయి

పోచారు. దానిచక్కతనం వర్ణించడానికి బ్రహ్మకయినా శక్యం కాదు, వెయ్యేళ్ళు తపస్సుచేసినా లభించని దానిపొందు మూడురోజులలో యజ్ఞంచేస్తే చులాగ్గా దొరుకుచుంది.

లక్ష్మి — ఈసోది చాలించండి. ఈసౌఖ్యమంతా మీకు దొరుకుతుందిగాని నాకు యేమి వున్నది? నాకు వచ్చేలాభం యేమయినా వుంచుందేమో చెప్పండి. అక్కడ రంభవలెనే చక్కగావుండే పురుషుడు యెవరయినా వుంచాడేమో చెప్పండి. తప్పకుండావుంచాడు. బ్రహ్మదేవుడు సోమయాజులుగారికి రంభను సృష్టించి, సోమిదేవికి మాత్రం అన్యాయం చేస్తాడా యేమిటి ?

వెంక—ఆసినీకోరిక కాలిపోనూ! నీకు యెంతదుర్బుద్ధిపుట్టినదే! నీమనస్సులో యెంత దురూహ వున్నదే! నీకుమాత్రం లేకపోవడం యేమి? నీకు మహారాజులాగు చేసుకున్నభర్తతో వెయ్యికల్పాలు సుఖం కలుగుచుంది. నీపుణ్యంచేత జన్మజన్మాలకూ నీకు యీభర్తే లభిస్తాడు.

లక్ష్మి—వెధవసుఖం నాకు ఆసుఖం అక్కరలేదు. గాడిదకొడుకు బ్రహ్మదేవుడుకూడా ఆడవాళ్లకు యింత అన్యాయం చేస్తాడని నేను కలలోనూ అనుకోలేదు. ఈలాగు పక్షపాతం చేసినతరువాత వాడిదేవత్వం యేమిటి వెధవదేవత్వం? స్వర్గానికి వెళ్లినా వడేకులు తప్పవన్నట్లు, అక్కడికి వెళ్లినా ముసలికంపు కొడుచూ మొఖంనిండా విభూతిపట్టెలూ తానూ బ్రహ్మరాక్షసివలె నాకు యీ ముదిమగడేనా? యీ వక్కజన్మాన్ని చాలక యింకా జన్మజన్మాలకూకూడా నాకు యీ మగడే కావలెనా యేమిటి? నేను యేజన్మానో చేసుకున్నపాపంచేత నాకు యిప్పుడు యిలాగంటి ముసలిమగడు తటస్థించినాడు. నాకు యజ్ఞమూ వద్దు. యింకోజన్మాన్ని నాకు యీమగడు రానూవద్దు.

నీ యజ్ఞానికీ నీకూ వెయ్యినమస్కారాలు. నన్ను ముందుజన్మంలో నైనా కొంచెం సుఖపడనియ్యి. నాలుగురోజులు యీయిల్లు విడిచి వెళ్లి యిప్పుడు నన్ను కాస్త సుఖపడనియ్యరాదూ! దిక్కుమాలిన యజ్ఞం చేసి ముందుకూడా నేను సుఖపడకుండా చెయ్యడానికా మీా ప్రయత్నం! చాలుచాలు తెలిసిపోయింది. మీారు ఇఖ లక్షరూపాయలు యిచ్చినా నేను యజ్ఞంలోకే రాను. కావలిస్తే యజ్ఞానికని తిరిగి పెయ్యో రెండువేలో తీసుకురండి. మానమిద్దరమూా సుఖంగా వుందాము.

వెంక—ఓసి ఘాతుకురాలా! నీమనసు తెలిసినతరువాతకూడా నేను యిల్లు కదులుతానుషే? నాకు యజ్ఞమూా వద్దు యేమీా వద్దు. వృషవాస్తాలైనా మూడుచూా గుమ్మం కదలకుండా యింట్లోనే కనిపెట్టుకుని వుంచానుగాని నిన్ను వక్కనిముషం వంటిగా వదిలి వుండను.

లక్ష్మి—ఆసంగతి నేనూ యెరుగుదును. నాఅదృష్టం తిన్నగా వుండి దైవం వదిలిస్తే వదలాలిగాని, అందాకా మీారు నన్ను వదలరు. పిశాచం పట్టుకున్నా నాలుగుఘడియలు వదిలి వుంచుందిగాని మీా కదీలేదు. దైవం నన్ను యెప్పుడు తిన్నగాచూాస్తాడో, నేను సుఖపడే యోగం యెప్పుడువున్నదోకాని, మీామూాలంగా నేను బాధపడలేక చచ్చిపోతూా వున్నాను. యజ్ఞాలని పేరుచెప్పి యిప్పుడు వూరికే నోరెరుగనిమేకలను చంపుచారుకాని, పూర్వంవలె నరమేధయాగాలు వున్నా బాగా వుండును. యేమహారాజుకాళ్ళయినా పట్టుకుని, ముసలితనంలో పడుచుపెళ్ళాలిని కట్టుకుని హింసపెట్టినపాపం రాకుండా ముసలివాళ్ళను యాగపశువులనుగా సమర్పించి పుణ్యలోకాలు కలిగే సదుపాయం చేస్తును.

వెంక—ఓసి పాపాత్మురాలా! యెంతఘాత తలుచుకున్నావే? యిలాగంటిదానవు నన్ను యెలాగైనా విషంపెట్టి చంపివేస్తావు. ఇఖ

నీతో యింట్లో వుండకూడదు. బ్రతికివుంటే బలుసుకూర యేరుకుని తినవచ్చును. నేను యీసంగతి రాజుగారితో మనవిచేసి నీకు శిక్ష వేయిస్తాను చూడు. (అని వీధిలోకి పరుగెత్తుచున్నాడు.)

లక్ష్మి—(తనలో) ఈభయంచేతనైనా యీవాళ వీధిలోనికి పోయినాడు. ఇఖ సాయంకాలముదాకా యింటికి రాడు. తలదువ్వుకొని కొప్పు పెట్టుకొని యీరోజున నాలుగుఘడియలు కాస్తసుఖం అనుభవిస్తాను. (అని నిష్క్రమించుచున్నది.)

---

## జ మీ దా రీ ధ ర్మ ఖ ర్చు.

పరిదేశము— జమీన్దారు వెంకటనివాంగరాయనింగారి యాస్థానము.

[దివాన్ తస్కరాచార్యులుగారును, గుమస్తా జంబుకరావుగారు ను పరివేశించుచున్నారు ]

తస్క— ఏమయ్యా! గుమాస్తాగారూ! లెఖలన్నీ సిద్ధంగా వున్నవా? శ్రీరాజావారు యిప్పుడు తనిఖీచేస్తామన్నారు.

జంబు—రాజాగారుచేసే తనిఖీకి మనం భయపడనక్కర లేదండి యెలాగువున్నా దస్కతుచేస్తారు.

తస్క—అయితే మనం యీనెలలో ధర్మఖర్చుకింద అంతా యెంతఖర్చుపెట్టినామో జ్ఞాపకంవున్నదా?

జంబు—యెంతో లేదండి. చాలాపద్దులున్నవి. ఇందాకా వేరే కాగితంమీద బేరీజువేసిచూస్తే అరవైయేడువేల రూపాయల పదిహేడణాల పద్దెనిమిది పైసలు అయిందండి!

తస్క—మీరు అణాలూ పైసలూకూడా తెప్పించినారు యెలావచ్చిందయ్యా?

జంబు—ఆలావేస్తేనేకాని లెఖ్ఖలు చూచేవారికి నిజమైనవని నమ్మకంవుండదండి నాకు సంస్థానంలో ముప్ఫయియేళ్ల సర్వీసు వున్నది గనుక యెంతమాత్రమున్నూ సందేహపడడానికి అవకాశంలేకుండా అణాలూ పైసలూ సెంట్లుకూడా వేసి లెక్కలు నిరాక్షేపంగా వుంచుతాను.

తస్క—అణాలూ పైసలూయేమిటని శ్రీరాజావా రడిగితే యేమిచెప్తావు ?

జంబు—మనం ధర్మఖర్చుకింద వేసేటప్పుడు దాల్లో కొంచెమయినా ధర్మఖర్చు వుండవలెను. ఆఅణాలు పైసలూ ముష్టివాళ్ళకు యీనెలలో యిచ్చినధర్మం అని చెపుతాను.

తస్క—ముష్టివాళ్ళకు యీనెలలో అంతఖర్చుఅయిందిటయ్యా చాలానేలఅయింది. ఇది సంవత్సరంలో అయినఖర్చు కాదుకదా ? పోనియ్యండి. అయినదేమో అవనేలఅయిందికాని ఇఖముందైనా విస్తారంఖర్చుకాకుండా జాగ్రత్తపెట్టండి. అయితే మొన్న నాయుడుగారికి మేజస్ట్రీటు కేసులో యిచ్చినపద్దు చిఠ్ఠాలో తగిలిందా ?

జంబు—తగిలిందండి. ఆలాగంటిఖర్చు నేను యెప్పుడైనా మరిచిపోతానా ? ఇందులో నాకు కొంచెం అన్యాయం జరిగింది. ప్రభువువారి తరువాత మాకు తమరే ప్రభువులుగనుక మనవి చేసుకుంటాను. వెనుకటిదివానులు మాకు నూటికి పదిరూపాయలు యిప్పించడం మామూలండి. తమ రయిదేసిరూపాయల చొప్పుననే దయచేయించినారు.

తస్క—ఇందులో తగాదాపెట్టకయ్యా. చిన్నపద్దు. ఇందులో మాకుమాత్రం యేమివున్నది ? మాకంతా ఇందులో మూడువేలేనా యింకా యేమైనా వున్నదా ? పెద్దపద్దువచ్చినప్పుడు మీరుకోరినప్రె

కార్యమే జరిగిస్తాములెండి

జంబు—చిత్తము చిత్తము. ఇందులో తమఅనుగ్రహం కావలెనుకానండి ముష్టిసొమ్ము నాకు సొమ్ము పావనం కాదండి. రేపు నా కొడుకుకు పెళ్ళిచేసుకుంటానంటే ప్రభువువారితో మనవిచేసి తమరే రెండువేలు పారవేయిస్తారు.

తస్క—సరేకాని ఇందులో మేజస్ట్రేటునాయుడుగారికి ముట్టిందియెంతా? మీరు సొమ్ము పదిలంగా పంపించినారా? పంపించిన సొమ్ముమాత్రమే చిఠ్ఠాలో వెయ్యలేదుకదా?

జంబు—లేదండి. అలావెయ్యడానికి నేనంత తెలివితక్కువవాణ్ణా? నాయుడుగారికి పంపించింది రెండువేల రూపాయలు. అయ్యా! చిఠ్ఠాలో వేసింది అయిదువేలరూపాయలు. సరేకాని నాయుడుగారు నూటికి రూపాయచొప్పున ఇచ్చినకమీషను ఇరవైరూపాయలూ నాకు వెళుతుందా? సొమ్ముపట్టించుకొనిపోయిన భుజంగరావుపంతులుకు వెళుతుందాండి? పంతులాసొమ్ము తనకేవస్తుందికాని దానిలో నాకేమీ ఇలాకా లేదని సొమ్ముహరించి కావలిస్తే తమతో చెప్పుకోమన్నాడండి.

తస్క—పోనిస్తూ. ఇరవైరూపాయలు వాడినే పుచ్చుకోనిస్తూ. వాడికి యెప్పుడూ దొరకవుగదా?

జంబు—తమరు అలా సెలవియ్య కూడదండి. సొమ్ముకోసం కాదు కానండి, వకసారి మనం వదిలిపెడితే ఇదేమామూలై రేపు సొమ్ముపట్టించుకునివెళ్లే మరివకడుకూడా తనకేరావలెనంటాడు. ఇది యెప్పుడూ హుజూర్‌గుమాస్తాకే రావడం మామూలండి. అదుగో శ్రీరాజావారు విజయం చేస్తూవున్నారు. తమరు లేచి నిలువవలెనండి.

[క్రిందిచూపులు చూచుచు, ఒకచేతితో మీసము వడివేయుచు, రెండవచేతితో బొజ్జనిమురుకొనుచు, శ్రీరాజావారు ప్రవేశించుచున్నారు]

రాజా—(కూరుచుండి) దివాంజీగారూ! లెఖలు సిద్ధంచేసినారా?

తస్క—మహాప్రభో! సిద్ధంచేసినానండి. యేలినవారు చిత్తగించి దస్కతు చెయ్యవలెనండి.

రాజా—మీరు చూచారోలేదోకాని ఇందాకా మన దోర పుంజు బహుబాగా పోట్లాడింది సుమండీ.

తస్క—దివ్యంగా పోట్లాడుతుం దండి. యెలాగా పోట్లాడకపోతే యేలినవారు దాన్ని మెచ్చుకుంటూరా? ఇన్ని పుంజులు వున్నవి కదాండి. దివాణంలో వక్క జబ్బుపుంజును కనపరచమనండి. నేను లక్ష రూపాయలు పందెం వేస్తాను. ఇన్ని జమీందారీసంస్థానాలు వున్నవి కానండి యేసంస్థానంలోనూ ఇటువంటి మంచిపుంజులు లేవండి. కోడి పంద్యాలసరదా అంటే తమదేకానండి మరివకరిది కాదు.

రాజా—మన జిల్లాకలక్టరుగారికి పెళ్ళాలు యెంతమందండీ?

తస్క—వక్కర్తేనండి.

రాజా—మరి మన చెన్నపట్నంగవర్నరుగారికో?

తస్క — ఆయనకూ వక్కతేనని వింటాను. వాళ్లశాస్త్ర ప్రకారం విస్తారంమందిని చేసుకోరాదటండి. వాళ్ళకు యెంతఐశ్వర్యం వున్నా అనుభవించడం వాళ్లచేత కాదండి! అంతరాజ్యం చేతికింద వున్నందుకు అనుభవించడానికి పదిమందిపెళ్ళాలు లేకపోతే, ఆసామ్యంతా యెందుకండి?

రాజా—మీరన్నమాట నిజమే. బాగా ఆలోచించిచూస్తే మనశాస్త్రాలే బహుమంచివిగా కనపడుతూ వున్నవి. చూచినారా

మనశాస్త్రిలు యెంతమందిపెళ్ళాలినయినా చేసుకోవడానికి అంగీక రిస్తవి కదా? శ్రీకృష్ణమూర్తివారివలె పదహారువేలు కాకపోయినా పదహారుగురినయినా పెళ్ళాడవలె నని వున్నది.

తస్క—తమకోరిక అమోఘంగా సిద్ధిస్తుంది. సిద్ధసంకల్పులు యేలినవారు తలుచుకోవడమూ కాకపోవడమూ కూడానాండి? పదహారుగురింటికి ఇఖ యేడుగురే కదాండి తక్కువ? వారు పై సంవత్స రాదిలోగా పూర్తి అవుతారు.

రాజా — యేపీ వక్కసారి లెఖ్ఖలు తీసుకురండి. జూదం ఆడుకోవలెను. అవతల రాజబంధువు లంతా కనిపెట్టుకు వుంటూరు. జూదం రాజులకు ధర్మమే కాదండీ?

తస్క—చిత్తము. అది రాజులకు వుత్తమధర్మ మండి. అందు చేతనే పూర్వం ధర్మరాజులవారు, నలమహారాజుగారు, మొదలైన చక్రవర్తు లంతా ఆడేవారు. తమదీ వారి ప్రభేనండి.

రాజా—ఈసంవత్సరం సర్కారు పేష్కషు పోగా మనసంస్థానం మీాద యెంతలాభం వచ్చిందండీ? క్రిందటినెలలో మీారు చెప్పినారు కాని పరాకుపడ్డాము.

తస్క—తమకు అలాగు పరాకుపడడమే ధర్మమండి. అది మహారాజచిహ్నాము. అందుచేతనే వేత్రిహస్తులు సంస్థానాలలో బహు పరా కని హెచ్చరిక చేస్తారు. మనసంస్థానంమీాద సర్కారుపేష్కషు పోగా అయిదులక్షల డెబ్బయిమూడువేల నాలుగువందల రూపాయలు వచ్చినవండి. ఇదుగో మొత్తం తమరు చిత్తగించవచ్చును.

రాజా—అక్కరలేదు. మనధర్మఖర్చులు యేవో వేగిరం చదవండి.

తస్క—చిత్తము. పదకొండో తారీఖున ధర్మఖర్చు పదివేలు.

రాజా—ఇది యేబాప తండీ ?

తస్క—గోపాలయ్యమీాద మనం తీసుకువచ్చిన రెండుమూాడు క్రిమినల్ కేసులలోనూ ముద్దాయీకి శిక్ష వేయించడం నిమిత్తమై డిప్టీకలెక్టరుగారికి ఇచ్చిన వండి.

రాజా — ఇందులో యెంతఖర్చుపెట్టినా ఖర్చుపెట్టవలసిందే. మరి పదివేలు ఖర్చుచేసి అయినా వాడికి శిక్ష వేయించండి. వాడు మనవూళ్లో కాపురంచేస్తూ మనతో సమానంగా మేడ కట్టించుకొని తీసివెయ్యమంటే తీసివెయ్యడూ? కోర్టులోకూడా వ్యాజ్యాలు వేయించి వాడిపొగరు అణచండి. సాక్షులకూ, గుమాస్తాలకూ, ప్లీడర్లకూ మీా మనసువచ్చినట్టు ఖర్చుపెట్టండి.

తస్క—చిత్తము. వాడిల్లు అమ్మించి జయిలులోకి పంపించి యేలినవారివద్ద మొఖాసా పొందుతాను.

రాజా—ఈడిప్టీకలెక్టరుకూ తహశ్శీలుదారుకూ యేటా జీతాలు మామూాలు వున్నవి కదా? అది కాకుండా కేజు వచ్చినప్పుడల్లా మళ్ళీ యింతసొమ్ము పుచ్చుకుంటాడా ?

తస్క — ఇంతా మరింత పుచ్చుకుంటాడాండి ? నేనుగనుక ఇక్కడికే చాలా తగ్గించినాను. డిప్టీకలెక్టరుగారికీ సబుమేజస్ట్రీటుగారికీ ఆఫీసులోవారికీ యేటా ఇచ్చేమామూళ్ళు వున్నా కేజు వచ్చినప్పుడు వేరే ఇవ్వక తప్పదండి. తరువాతపద్దు చిత్తగిస్తారా ?

రాజా—యేదో చదవండి.

తస్క — పదమూాడో తారీఖున ధర్మఖర్చు మూాడువేల రూపాయలు.

రాజా—ఇది యేమి టండీ ?

తస్క—దివాణందాసీలూ లంపతాలూ తాగికొట్టుకొన్నప్పుడు

సబు మేజిస్ట్రీటుగారికి తెలిసి పోలీసువారిని కేజు చెయ్యమంటే పైకి రాకుండా వుండడానికి చేసినదండి.

రాజా — సరే ఇది అవశ్యకమైనఖర్చే. మన దివాణంలో దాసీలకూ ఖాసాలకూ అవమానం వస్తే మనకు వచ్చినట్టే. వాళ్లను తప్పించడానికి యేమివ్యయపెట్టినా పెట్టవచ్చును. పోలీసుఇన్స్పెక్టరుకూ స్టేషనుఆఫీసరులకూ యీసంవత్సరం మామూళ్ళు పంపించివేసినారు కాదా? వాళ్ళతో మాత్రం యెప్పుడూ విరోధం పెట్టుకోకూడదు. తరువాతపద్దు చదవండి.

తస్క — పోలీసువారి మామూళ్ళు వెనుకనే పంపించివేసినానండి. అది కాకుండా యీ కేజులో ఫక్తు ఫదివందలరూపాయలు వారికే యిచ్చినానండి. తరువాతపద్దు పద్ధాలుగో తారీఖున ధర్మఖర్చు రెండు వేలరూపాయ లండి.

రాజా — ఇది యేమిటి?

తస్క — పంటకాలవలోకి నీరు వదిలిపెట్టడానికి డెల్టాసూపరింటెండెంటుగారికండి.

రాజా — సరే తరువాత?

తస్క — పదిహేనో తారీఖున ధర్మఖర్చు వెయ్యిరూపాయలు.

రాజా — ఇదో?

తస్క — మనం నీలాద్రిరావుగారిమీద తెచ్చిన పదహారో నెంబరు అసలువ్యాజ్యంలో కోర్టు శిరస్తాదారుగారికి ఇచ్చినదండి.

రాజా — సరే. రహితులమీద మనం తెచ్చిన వ్యాజ్యాలలో యేమీ ఖర్చుపడలేదా? అవి ప్రధానమైనవి. అందులో యెంతసొమ్మయినా ఖర్చుపెట్టి రహితుగాడిదకొడుకులను సాధించండి.

తస్క — ఆపదు ముందు వున్నదండి. ఇరవైమూడో తారీఖున

ధర్మఖర్చు పదివేలు.

రాజా.—సరే పద్దులన్నీ సరిగానేవుంటవి. మేము చూడనక్కరలేదు. మనకు ఈసంవత్సరంలో వచ్చిన ఆదాయంకాక యేమయినా ఋణంఅయిందేమో చూడండి.

తస్క — లక్షాయేభయివేలరూపాయలుమాత్రం క్రొత్తగా ఋణమయిందడండి. ఖర్చు తగ్గించడానికి యేలినవారి సెలవుప్రకారం ఆస్థానంలోవున్న పండితులనందరినీ కిందటినెలలోనే తీసివేసినానండి. పెద్దబాటలోవున్న రాచూరిసత్రం తీసివేయించి పాత్రసామాను దివాణంలోకి తెప్పించినాను. సెలవైతే గరల్సుస్కూలు తీసివేయించడానికి వుత్తరవు చేయిస్తానండి.

రాజా.—ఆడవాళ్ళకు చదు వెందుకు? అది తప్పకుండా తీసివెయ్యవలసిందే; కాని కలెక్టరుదొరగారు సిఫారసుచేసి పెట్టించడంచేత యీవని కొంచెం ఆలోచించి మరీచెయ్యవలెను. ఇందులో మ్యాష్టరులకు యెన్నినెలలజీతాలు బాకీవున్నవి?

తస్క.—ఈబాలికాపాఠశాలలోనూ సంస్థానంస్కూలులోనూ కూడా మాష్టర్లకు ఆరునెలలజీతాలు బాకీ వున్నవి. మనవాళ్లకు ఇంగ్లీ షెందుకు? ఈరెండుస్కూళ్ళూ సెలవయితే తీసివేయిస్తానండి.

రాజా.—ముందునెలలో ఆలోచింతాము. ఒరే! వెంకా! పాచికలు తీసుకురా వక్కఆట వేతాము.

(అని లేచి వెళ్ళుచున్నారు.)

# హిందూ వివాహములు.

పరిదేశము—పాలుదొరగారి ఇల్లు.

[పాలుదొరగారును, మీరాసాహేబుగారును ప్రవేశించుచున్నారు.]

మీరా—దొరగారికీ సలాం. తమరు యేమిటో చాలా సేపటి నుంచి తలయెత్తకుండా వ్రాస్తూవున్నారు.

పాలు—సలాం—హిందూ వివాహాలనుగురించి లెక్చెరు మాసొసయిటీలో చదవడానికి వ్రాస్తున్నాము. ఆలెక్చెరు యీసాయంకాలానికి కావలెనుగనుక, మీరు వచ్చినదిచూడకుండా వ్రాసుకుంటూవున్నాము. పార్డనుచెయ్యండి. ఈసబ్జక్టుమీద మనం డిస్కస్సు చేతాము. మీలో వివాహం అనగా యేమిటి?

మీరా—పెళ్ళిచేసుకున్నవాడూ పెళ్ళిచేసుకున్నదీ బ్రతికివున్నంతకాలమూ వకరినివకరు మీరి తిరగకుండా వుండడానికి చేసుకునే ఖరారు?

పాలు—సరే మీరన్నట్టుగా అది వివాహంచేసుకునేవారు యిద్దరూ యావజ్జీవమూ వకరిని మీరి వకరు తిరుగకుండానూ వకరి కష్టసుఖములకు వకరుఅవుతూ యిద్దరూ కలిసి వక్కరుగా వుండేటట్టుగానూ చేసుకున్న కంట్రాక్టు. అయితే కంట్రాక్టుకుయేమి ముఖ్యంగా వుండవలెనో మీరు చెప్పగలరా?

మీరా—చేసుకునేవాళ్ళు యిద్దరూ సమ్మతిపడవలెను. ఆలా సమ్మతిలేకుండా బలవంతపెట్టిచేస్తే యేఖరారూ చెల్లదు.

పాలు—వివాహంనాటికి ఆలాగంటిసమ్మతి యివ్వడానికి శక్తి కలిగివుండడానికి వారు యుక్తవయస్సు వచ్చినవారుగా కూడా వుండ సక్కరలేదా?

మీరా—తప్పకుండా వుండవలెను. అలాలేకపోతే వివాహాలే కావు. ఖాంచోత్. బ్రాహ్మలలో చేసేపెళ్ళిళ్ళు యేమి పెళ్ళిళ్ళండీ? వాటికంటె బొమ్మలపెళ్ళిళ్ళయినా మంచివే. పాలుదాగే పసిపిల్లలనూ బట్టవిప్పివేసుకుతిరిగే పసిబాలుణ్ని పల్లకీలో పెట్టి ఢుంయి ఢుంయిమని బాజాలతో వూరేగించి పెళ్ళిఅంటారు.

పాలు—ఆపిల్లల కప్పుడు పెళ్ళిఅంటే యేమో తెలియదు. బ్రాహ్మణపెళ్ళిళ్ళు పురోహితుల డబ్బులాభానికేకాని వధూవరుల క్షేమానికికాదు. పురోహితులు తమకూఅర్థం తెలియకుండా యేమేమో మంత్రాలుచదివి డబ్బు పుచ్చుకొని ఆపసిపిల్లలిని పొగవద్ద కూర్చోపెట్టి నాలుగుమాట్లు యిటూఅటూతిప్పి అది పెళ్ళిఅంటారు. వూళ్ళో వాళ్ళు అంతాపోగయి గారెలూబూరెలూ తిని బట్టలుకట్టుకుని కుర్రివాళ్ళకొంపలు తీస్తారు. బొమ్మలపెళ్ళిళ్ళుచేస్తే యెవళ్ళకీ నష్టం లేదు. యీ పెళ్ళిళ్లు పెద్దవాళ్ళు ముచ్చటకోసం చేస్తే, తరువాత పిల్లవాడికయినా పిల్లదానికైనా మసూచికం వచ్చి కాళ్లు పోయినా కళ్ళు పోయినా బాలరోగాలచేత యేదైనా ప్రాణభయం వచ్చినా తరువాత యిద్దరూ యేడుస్తారు. పిల్లవాడు చస్తే పిల్లది వక్కరోజయినా సుఖం యెరగక పెద్దదైనతరువాత నానాబాధలూ పడుతూ రంకుతనము మొదలైన పాపాలకు లోబడి యెల్లకాలమూ పెళ్ళిచేసినవాళ్ళ జీవానికి వుసూరుమని యేడుస్తూవుంటుంది.

మీరా— హిందువులు తమపెళ్ళిళ్లలో బిడ్డలను కోతులలాగూ చతుష్పాదజంతువులలాగూ చూస్తారు. పూర్వం బరోడామహారాజుగారైన మల్హారిరావుగాయకవారుగారు పావురాలకు అయిదురోజులూ పెళ్ళి చేసి, బ్రాహ్మలచేత మంత్రాలు చెప్పించి, సంభావనలు యిచ్చి, విందులు చేయించి, వేలకొద్ది రూపాయలు ఖర్చుపెట్టి గొప్పవుత్సవం

చేసినారు. పెళ్ళి అయిన మూడోనాడే మొగపావురాన్ని పిల్లి యెత్తుకు పోయినది. ఆపెళ్ళిళ్ళకి యీపిల్లలపెళ్ళిళ్ళకి యేమీ భేదం లేదు.

పాలు — వక్క మల్లారిరావుగాయకవారు మాత్రమే కాదు ఇలాగంటి పిచ్చిపెళ్ళిళ్లు చేసింది. నవద్వీపపురాజయిన యీశ్వరచంద్రుడనే ఆయన కోతులకు యధావిధిగా మంత్రాలతో పెళ్ళి చేయించి లక్షరూపాయలు ఖర్చుపెట్టినసంగతి మీరు న్యూస్పేపర్లలో చదువలేదా?

మీరా—చదివినాను. వారు వివాహాలు చేసిన కోతులకూ పావురాలకూ వున్నవివేకమైనా యిటువంటిమహారాజులకు వున్నట్టు కనపడదు. ఇదంతా బ్రాహ్మలు డబ్బులాగడానికి ప్రజలను మూఢులను చేసి పన్నినయంత్రము. ఇలాగంటి పాడువివాహాలు హిందువులలో శానా వున్నవి. వుత్తరహిందూస్థానములో డబ్బువున్న విధవలు వుంటే వాళ్ళవద్ద డబ్బు లాగడానికి వెధవలయిళ్ళల్లో వుండే తులిసిమొక్కను బ్రాహ్మడికి యిచ్చి వివాహంచేయించి, అది మొదలుకుని ఆబ్రాహ్మలను అల్లుళ్లలాగు చూపిస్తూ ఆడబ్బంతా వాళ్లకు కట్టిపెట్టిస్తారు.

పాలు—ఇలా చెయ్యడం మొగవాళ్లకుమాత్రమే కాకుండా విస్తారండబ్బు యిచ్చుకోలేని కులీనబ్రాహ్మలు స్త్రీలకుకూడా చేస్తారు. వివాహం కాకమునుపే బ్రాహ్మణస్త్రీ సమర్తాడితే కులంవాళ్ళు గంగలో దిగవలెనని దాన్ని తప్పించుకోవడానికి వారు తమకొమార్తెను అరిటిచెట్లకూ సాలిగ్రామాలకూ యిచ్చి వివాహం చేసి ఆపద తప్పించుకుంటారు.

మీరా—హిందువుల అభిప్రాయప్రకారం అరిటిచెట్లు ఆడవో మొగవో నాకు తెలియకుండా వున్నది. ఆడవాళ్లకు కదళీవివాహాలు చేసినట్టే మొగవాళ్లకుకూడా మూడోపెళ్ళికి అరిటిచెట్టునే వివాహం

చేస్తారు. అరిటిచెట్టుకు వివాహం చేస్తే దోషం పోయేటట్టయితే, బ్రాహ్మలు చిన్నపిల్లలగొంతుకలు కొయ్యడంకంటె ముందుగా అరిటి చెట్లకు వివాహం చేసి తరువాత రజస్వల లైనతరువాత వారి యిష్టం వచ్చినవాళ్ళకు వివాహం చేసుకునేటట్టు చెయ్యరాదా?

పాలు—చేస్తే బాగానే వుండును. నాకు యీవుపాయం తోచ లేదు. ఈసంగతి నేను యీరోజు లెక్చరులో వ్రాస్తాను. మీరుకూడా వస్తారుకాదా? ఈదేశంలో యింకా యెన్ని చిత్రమైనవివాహాలు వున్న వనుకున్నారు? భోగంవాళ్ళను దేవుడిగుళ్ళలో వుండేరాతిదేవతలకు వివాహం చేసి వాళ్లను కన్నవాడితోనూ రంకుతనం చెయ్యడానికి వూరిమీద వదిలిపెడుతారు. వ్యభిచారం వీళ్లకు కులవృత్తి కావడంచేత వయస్సులో వుండేసంసారులు వీళ్ళవలలో పడి మాణిక్యంవంటి పెళ్లాలను వదిలిపెట్టి యిల్లూ వళ్ళూ గుల్ల చేసుకుని నిష్కారణంగా పాడవుతారు. ఆలోచిస్తే యిటువంటి పాడువివాహాలు యెన్నయినా వున్నవి. రావి చెట్లకూ వేపచెట్లకూ వివాహాలు చెయ్యడం మీరు మొన్న చూచి నారుగదా? ఇవన్నీ నాలెక్చరులో వ్రాస్తాను. తరువాత విందురుగాని యిప్పుడు నాకు లెక్చెరు వ్రాసుకోవడానికి సెలవు యిస్తారా?

మీరా—సలాం. మీపని చూచుకోండి. రేపువుదయం వచ్చి మీతో మాట్లాడవలసినసంగతి మాట్లాడుతాను.

(అని వెళ్ళుచున్నాడు.)

# వినాయకచతుర్థి.

[వెంకటాద్రిపంతులుగారును, రామనాథరావుగారును, శేషాచార్యులుగారును ప్రవేశించుచున్నారు.]

రామ—ఏమండీ పంతులుగారూ నిన్న వినాయకుడిచవితి గదా మీరు విఘ్నేశ్వరపూజ చేసుకున్నారా?

వెంక—ఏమిటో యిటూ అటూ చేసినాము. కానికాలాలు వచ్చినవి. యిప్పుడు దేవుళ్ళమహిమా విస్తారంగా కనపడడం లేదు.

రామ — మీకు యేమివిఘ్నాలు పోవలెనని పూజచేసినారయ్యా? మీ లంచాలకు విఘ్నం లేకుండా మెల్లకాలమూ అవిచ్ఛిన్నంగా సాగిరావడానికి చేసినారా?

వెంక—ఓర్వలేనిముండాకొడుకులకుమల్లే మీరూ లంచాలు లంచాలు అంటారు. కార్యంచేసి వాళ్ళు సంతోషించి నాలుగుడబ్బులు యిస్తే పుచ్చుకుంటే యేమిదోషము? ఇదియేమి కన్నాలు వెయ్యడమా? రండావివాహాలు చేసుకోవడమా? ఏమి అకార్యకరణము? మనం స్వతంత్రంగా చేసేటప్పుడు పుచ్చుకుంటే తప్పితంగాని పయిని పనిచేసేవాడు దొర అయినప్పుడు వాకసహాయం చేసి లాభం పొందితే యేమి తప్పు? పుచ్చుకోవడం చేతగాని అప్రయోజకపు ముండాకొడుకులు ప్రయోజకులను చూచి వోర్వలేక కళ్ళల్లో నిప్పులు పోసుకుంటారు.

రామ—విస్తారం కోపంచెయ్యకండి. కొత్తరకంవాళ్ళముందర లంచాలు పుచ్చుకునేవాళ్ళను దూషిస్తూ మీరూ శ్రీరంగసీతులే సెలవిస్తారే! మనలోమాట అడుగుతానుగాని కోపం చెయ్యక మీరు స్వతంత్రపుపనిలో వున్నప్పుడుమాత్రము లంచాలు మానివేసి మహామడిగట్టుకొనివున్నారా?

వెంక—పక్క జమీందార్ల దగ్గిరతప్ప నేను యెక్కడా పక్క దమ్మిడీ పుచ్చుకోలేదు. ఆజమీందార్ల వద్దనైనా మూడు వేలూ నాలుగు వేలూ అయిదు వేలూ లాటుగా కొట్టివేస్తూవచ్చినానుగాని చిల్లర యెంగిలిపద్దులకెప్పుడూ ఆశ పడలేదు. పెట్టెలనిండా ధనం మూలుగుతూవఖ్ఖకొవ్వివున్నారు. వాళ్ళవద్ద పదివేలులాగితే వాళ్ళఅయిశ్వర్యానికేమయినా లోటువస్తుందా యేమిటి? అదియేమోకాని యిప్పటికారు యింగ్లీషుచదువుకున్న వాళ్ళు వుద్యోగస్థులు ప్రయోజకులయి సంపాదించి పెళ్ళాలకు నగలు పెట్టుకున్నా బిడ్డలకు నగలుపెట్టుకున్నా మంచియిల్లుకట్టుకున్నా చూచి వోర్వలేరండి. మేమూ ఇంగ్లీషుచదువుకున్న వాళ్లమేకదాండి? మాకాలపువాళ్ళల్లో యిటువంటి వోర్వలేనితనమూ కితూరీకోరుతనమూ యేమీలేవండి. వాళ్ల వోర్వలేనితనంచూచే దైవం యిప్పటివాళ్లకు యెంతగొప్పవుద్యోగాలుచేసినా అప్పులలోమునిగి యేడుస్తూవుండేటట్టు చేస్తూవున్నాడు. కాస్తలేసి వాళ్ళూ బియ్యేలు ప్యాసై వుద్యోగాలలోకి వచ్చి వుద్యోగాలవఖరే చెడగొట్టివేస్తూ వున్నారు. వీళ్లను చూస్తే మూలనున్న ముసలముండ లేవదు. మావంటివాళ్లం కొందరం వుండబట్టి యీవుద్యోగాలకయినా కొంతమట్టుకు పూర్వపురస్మి గౌరవమూ నిలుపుతూవున్నాముకాని మాతరువాతవచ్చేవాళ్ళ కాలంలోఅదీ పోతుంది.

రామ—అందుచేతనే మీరు సాధ్యమైనంతవరకు పెద్దపరీక్షల నిచ్చినవారిని దరికి చేరకుండా తరిమివేస్తూ మీభంధువులకే వుద్యోగాలు యిప్పిస్తూ వున్నారు. ఇంకావంరుగువిశేషాలు యేమైనావుంటే సెలవియ్యండి.

వెంక—విశేషాలు యేమి వున్నవి? రాత్రి కుర్రముండాకొడుకులు యెవళ్ళోకాని మాయింటిమీద బెడ్డలు వేసినారండీ.

రామ—వినాయకుడిచవితినాటిరాత్రి యిళ్లమీద రాళ్ళు వేసి యెన్నితిట్లుతింటే అంతపుణ్యమట! చూచినారా యీమూర్ఖత?

వెంక—మనం అలాదూషించరాదు. ఏమీ పుణ్యం లేకపోతే మనపెద్దలు యిటువంటి ఆచారం అంగీకరించరు. మేమూ మాచిన్న తనంలో దీపాలు పెట్టగానే వడినిండా రాళ్ళుకట్టుకుని బయలుదేరి వీధివీధి తిరిగి ప్రతియింటిమీదా రాళ్ళువేసి చెడతిట్లుతినేవాళ్లము. ఆరాత్రి తిన్నతిట్లన్నీ అన్ని ఆశీర్వచనాలేకాని అవి తిట్లుకావు.

రామ—మీరు యేమిచెప్పినా రాళ్ళు వెయ్యడం చాలాతప్పితం. వొకానొకప్పుడు రాళ్లు పిల్లలకూ ఆడవాళ్లకు తగిలి చాలాఅపాయం చేస్తవి; ఇళ్లమీద పెంకులన్నీ చితికి పోతవి. ఈదురాచారం యెలాగైనా మానిపించవలసిందే.

వెంక—పోనియ్యండి. దీనిమాట యెలాగువున్నా గుమ్మాల ముందర పల్లేరుకాయలు వెయ్యడంలోమాత్రం యేమీ హాని లేదు. మేము మూడునాలుగురోజులకు పండుగ వస్తుందనగానే బయలుదేరి డొంకలన్నీ తిరిగి వొకొక్కడు రెండేసిగంపలు మూడేసిగంపలు పల్లేరుకాయలు పోగుచేసి గుమ్మాలవద్ద పోసేవాళ్లము. ఇంట్లో పడుకున్నవాళ్లు తెల్లవారిగట్ల చీకట్లో అల్పాచమానానికి లేచివచ్చి యెరక్క కాలువేసి కసుక్కున గుచ్చుకున్నప్పుడు నొప్పిపెట్టి మూలుగుతూ వుంటే యెంతతమాషాగావుండేదనుకున్నారు? మేము యెవళ్లగుమ్మాలవద్ద మానినా భోగంవాళ్ల యిళ్లముందుమాత్రము తప్పకుండా కావలసినన్ని పల్లేరుకాయలు పోసి వచ్చేవాళ్లము. ఇది మంచిపని అంటారా కాదంటారా?

రామ—మొదట మీరుచెప్పినదెంతమంచిపనో ఇదీఅంతే మంచిపని. ఇతరులు ముళ్లుగుచ్చుకుని బాధపడి యేడుస్తూవుంటే మీకు

వినోదంగా వుంటుందండీ? ఇతరులను యేడిపించి లంచాలు పుచ్చుకుని తాము సంతోషిస్తూవుండేవాళ్లకు యిదీ అలాగే వుంటుంది—ఏమండీ శేషాచార్లుగారూ! బెల్లంకొట్టినరాయిలాగు మీరు మాట్లాడక వూరుకుంటారేమి?

శేష—పంతులుగారు అక్రమమైనమాట చెపుతారా? వారెప్పుడూ మంచిదే సెలవిస్తారు. మీరు చెప్పినమాటా బొత్తిగా కొట్టి వెయ్యరాదు. అదీ కొంచెం ఆలోచించవలసిందే.

రామ—మీరు పంతులుగారి తాబేదార్లయినందుకు తగినట్టుగానే చెప్పినారు. పంతులుగారూ? మీరు శిష్యుణ్ని బహుబాగా తరబీతుచేసినారండీ. నిన్నరాత్రి మబ్బువేసింది. చంద్రుడు కనపడ్డాడో లేదో కనిపెట్టినారా?

వెంక—నిన్నరాత్రి నేను దీపాలు పెట్టకముందే భోంచేసి గదిలో ప్రవేశించి చంద్రుడు కనపడిపోతాడేమో అనేభయంచేత అల్పాచమానానికైనా యివతలకు వచ్చినానుకాను. నేనైతే మధ్యాహ్నమే భాగవతం చదివించి అక్షింతలు వేసుకున్నానుగాని యెందుకైనా మంచిదని గదిలోనుంచి కదలలేదు. పాలముంతలో చంద్రుడు కనపడి స్వామివారంతటివారికీకూడా నీలాపనింద వచ్చినప్పుడు మనకు యెక్కడ తప్పుతుంది? వారంటే సమర్థులుగనుక యెన్నో తంటాలు పడి వచ్చిన నిందను పోగొట్టుకున్నారుగాని మేము యెక్కడపోగొట్టుకోగలము? యేమీలేకుండా లంచాలు పుచ్చుకుంటామని యీవచ్చిన నిందలే చాలును. చంద్రుణ్నిచూచికూడా యింకా లేనిపోనినిందలు యెందుకు? నాకు తెలియక అడుగుతాను కానండి లంచాలుయిచ్చిన వాళ్ళూ పుచ్చుకున్నవాళ్ళూవుండగా మధ్య వీళ్ళుయేడవడం యెందుకండీ? వాళ్లు యిలాగు యేడవడంవల్ల వాళ్ళకళ్ళ పెత్యపునీళ్ళు పోతవే

కాని మాకు యేమీ లోపం రాదు.

రామ — మీమీద యేదైనా కేజు వచ్చి రుజువుపడేదాకా మీరు మహారాజులవలె వుంటారు. పూర్వం శిరస్తాదారీలు చేసినవాళ్లూ తహశ్శీలుదారీలు చేసినవాళ్ళూ యెంతమంది జయిలులోకి వెళ్లినారు కారు? దొంగతనాలు కొన్ని బయలుపడకుండా దాగి దొంగలుభాగ్యం అనుభవిస్తూవున్నట్టే లంచాలు పుచ్చుకునేవాళ్ళూ కొందరు ధనవంతులై గర్వపడుతూ వుంటారు.

వెంక—మీరు దొంగతనంతో పోలుస్తూ వున్నారు. వుద్యోగ ధర్మాన్నిపట్టి సంపాదించుకొనేదానికీ దొంగతనానికీ సాపత్య మండీ? మీరు స్నేహితులు గనుక వూరుకున్నానుకానండి మరివకరు యీమాట అంటే యేమి చేస్తునో.

రామ—మీరు యేమి చేయించడానికైన సమర్థులు అధికారం చేతిలో వున్నది. మామీద దొంగఛార్జీ తీసుకురమ్మన్నా తీసుకువస్తారు. మీరు యిలాగంటి కపటోపాయాలచేతయవరినైనావంచించవలెనుగాని రుజుమార్గంగా యెవరినీ యేమీ చెయ్యలేరు. దొంగతనానికీ దీనికీ కొంచెంభేదం వున్నది డబ్బు హరించడము దీనికీ దానికీ సమమేకాని వాళ్ళు రాత్రిళ్లు యజమానులు యెరగకుండా యేమరించి యెత్తుకుపోతారు; వీళ్ళు పట్టపగలు సొమ్ముగలవాళ్లచేతనే సొమ్ము తెప్పించి వొళ్ళో వేసుకుంటారు. ఆదొంగలినైనా తప్పించుకోవడానికి వీలు వున్నదికాని యీపగటిదొంగలనుంచి తప్పించుకోవడానికి వీలు లేదు. దొంగతనంతో పోల్చడానికి మీకు సరిపోకపోతే బందెపోటుదొంగతనంతో పోల్చవచ్చును. అప్పుడు దానికీ దీనికీ ఆట్టే భేదం వుండదు. అదీ యివ్వకపోతే అపాయం చేస్తామని బెదరించి పుచ్చుకోవడమే యిదీ యివ్వకపోతే హానిచేస్తామని బెదరించి పుచ్చుకోవడమే. నా

మాటలు వింటే మీకు కోపం వస్తూవున్నట్టు మీ ముఖచర్యవల్ల కనపడుతూ వున్నది. ఎంతస్నేహితుడైనా వుద్యోగస్థుణ్ని చూస్తే జడుస్తూ వుండవలెను. మీరు రాత్రి చంద్రుణ్ని చూడకుండానూ, అక్షింతలు వేసుకునీ విఘ్నేశ్వరుడికి వుదరంపూజా మొదలైనవి చేసి వుండ్రాళ్ళు పోసిన్నీ మీరు జాగ్రతపడ్డారు గనుక ఆమహానుభావుని బానకడుపున్నూ, చేటచెవులున్నూ, వంకరతొండమున్నూ, వంటి కొమ్మున్నూ, యెలకవాహనమున్నూ, మీకు యేలపాయమూ రాకుండా రక్షించునుగాక! నేను సెలవు పుచ్చుకుంటాను.

వెంక — మంచిది వెళ్ళిరండి. మన మనుకున్నమాటలు వేపరు వాళ్లతో చెప్పేరు సుమండీ. (అని వెళ్లుచున్నారు.)

---

## అంత్యపుష్కరమాహాత్మ్యము.

---

[అప్పావధానులుగారును, రామసోమయాజులుగారును, భీమరాజుపంతులుగారును ప్రవేశించుచున్నారు.]

అప్పా — ఏమండి పంతులుగారు స్నానానికి విజయంచేసినారా? దయచెయ్యండి పుణ్యకాలం మించిపోతుంది.

భీమ — స్నానానికి తొందర లేదు లెండి. మీరు మీదస్తు చేసుకుంటూ వుండండి. మాఆడంగులబండివచ్చినతరువాత మేము వస్తాము.

అప్పా — రామసోమయాజులుగారూ? మీరు దయచేస్తారా పుష్కరమహత్యం చూచినారా గోదావరి యెలాగు పుష్కరంగా వచ్చిందో.

రామ — నేను పంతులుగారితోనే వస్తాను. వెనకాల మా బంధువులుకూడా వస్తూ వున్నారు. వారు వచ్చిందాకా నేను రాను.

అప్పా—అలాగైతే నేను సెలవు పుచ్చుకొని, యీ రేవులో మీ వుభయులకోసమూ కనిపెట్టుకొని వుంటాను. నన్ను పిలవడం మరిచిపోయేరు సుమండీ? (అని వెళ్లుచున్నాడు.)

భీమ—మీరు బంధువు లంటే జ్ఞాపకం వచ్చింది. ఈబంధువుల బాధ పడలేక యీవూరు విడిచి లేచిపోదా మని బుద్ధిపుడుతూ వున్నది. నాకు తాలూకాకచేరీలో నెలకు పదియేనురూపాయలుజీతం వస్తుంది. మహాదొరికితే పైగా పది దొరికేను పదిహేను దొరికేనుకాని అంతకంటె యెక్కువ దొరకవు. మాది పదిమందిగలకుటుంబము. మాకు వచ్చేది యీపట్నవాసంలో తిన్నగా తిండికే చాలదు. అటువంటి స్థితిలో రోజూ నలుగురూ అయిదుగురూ కోర్టుసాక్ష్యాలనిమిత్తం వచ్చి బంధువుల మని యింటిమీద వచ్చి కూర్చుంటారు. వాళ్లకు తెలియవలెనుకాని మొఖమాటం లేకుండా వచ్చినవాళ్ళను యెలాగు పొమ్మనను? వాళ్ల బంధుత్వం కాల! యెలాగంటె బంధువులో నాకు తెలియదు. వొకడు మా మేనమామగారి సవితితల్లికి వక వేలువిడిచిన పినతల్లి మనమడిని అంటాడు. ఇంకొకడు మా సవతి ముత్తవతల్లి మేనమామగారి పెంపుడుకొడుకు మునిమనమడికి తోడల్లు న్నంటాడు. ఇలాగు పదితరాలనుంచి బంధుత్వాలు తెలుసుకొనివచ్చే గాడిదెకొడుకులు తాము వంటరిగానైనా రాకుండా తమతోకూడా దొంగసాక్ష్యాలకు వచ్చేవాళ్లను నలుగురిని యింటిమీద తెచ్చి కూర్చోపెడుతారు. మేము ఋణమో భణమో చేసి డబ్బు తేవడం వక యెత్తూ ఆడవాళ్ళ చాకిరీ చెయ్యడం వక యెత్తుగావున్నది. మాఆడవాళ్ళు వీళ్లందరికీ వంట చేసిపెట్టలేకనూ స్నానాలు చెయ్యలేకనూ చచ్చిపోతూవున్నారు. మీరు వైదీకులుగనుక అదృష్టమంతులు. మీకు యిటువంటి చుట్టాల బాధ లేదు. వకనాడు యెవరైనా నలుగురు చుట్టాలు వచ్చినా వాళ్లను

తీసుకుని మీరుకూడా యేసత్రములో నైనా బయలుదేరుతారు;
మీలోనైనా లౌక్యంలో వున్న వారికి యీ బాధకాలుగాని మీకు
లేవు.

రామ—మీరు పయిని వుండి ఆలాగే అనుకుంచారు. బంధు
వులతో మేము పడేపాట్లు దేముడికి యెరికె. ముద్దెలవచ్చి రోలుతో
మొట్టు పెట్టుకున్నట్టు మాదుఃఖము మేము యెవరితో మొట్టు పెట్టు
కోము? మీ రన్నట్టు ఇప్పు డాసత్రాలూ విశేషంగా లేవు. జమీందా
రులుకూడా సత్రాలు యెత్తివేస్తూవున్నారు. వున్న రెండుమూడు
సత్రాలలో నైనా ఆవేళకు మూడుఝాములకు అరదేశికీ పరదేశికీ
వక్కమాటు నాలుగుమెతుకులు వేస్తారేకాని గ్రామంలో వారికి
యెవరూ పెట్టరు. మాయిళ్ళకు మీకంటె యెక్కువబంధువులు వస్తారు.
మీబంధువులైనా యేపట్టు గుడ్డకట్టుకునివుండి నాలుగుమెతుకులు విస్త
ట్లో వేసినా తిని లేచిపోతారుగాని మావాళ్ళు స్వహస్తపాలకులమనీ
వైశ్వదేవపరులమనీ శ్రోత్రియులమని ఆహితాగ్నులమనీ సకలమైన
యాతనలూ పెడుతారు. వొకొక్కడు వచ్చి గోముఖంలో చెయ్యి
దూర్చుకొని దర్భాసనంమీద ముక్కుమూసుకుని కూర్చున్నాడంటే
యింట్లో వున్నవాళ్లందరూ మూడుఝాముల దాకా మెతుకులు
దొరకక మాడి చావడమే కాకుండా ఆడవాళ్ళు పొద్దున్ననగా
మడికట్టుకుని పొయికాడ కూర్చుండి యీలోగా కడుపుబ్బుకునివచ్చి
పదిస్నానాలు చేస్తారు, మావాళ్ళచాదస్తం కాలిపోను మీలోమల్లె
మాలోకంఠస్నానాలు పనికిరావు. ఇంతమందిని చూస్తారుగదా
మావైదీకంలో వున్నవారిలో చక్కగా తలదువ్వుకుని కొప్పుపెట్టుకుని
వున్న ముత్తైదును మీరు యెప్పుడైనా చూచినారేమో చెప్పండి.
పట్నమంటే మాయిళ్లకువచ్చినంతమంది బంధువులు మీయిండ్లకు

రానేరాను. రాచకార్యమో యేదో వుంటేనేకాని మీయిళ్లకు చుట్టా లురారుకాని మాయిళ్లకై తేనో కోర్టుసాక్ష్యాలకే. కాకుండా యీవూ ళ్లోయెవళ్లయింట్లో యేశుభకార్యమైనా అశుభకార్యమైనా పదామడల నుంచి సంభావనల నిమిత్తం బ్రాహ్మలు పరుగెత్తుకునివచ్చి తిండికి బంధువులయిళ్లమీద కూర్చుంటారు. ఈపట్నవాసంలో యేగొల్ల వాళ్ల యింట్లోనో యేకోమటి వాళ్లయింట్లోనో ప్రతిరోజూయేదైనా శుభకార్యమో అశుభకార్యమో అవ్వతూనే వుంటుంది. అదంతా యెందుకుకానండి యీపుష్కరాలలో డబ్బునిమిత్తంవచ్చి తమ డబ్బు మూటకట్టుకుంచూ యెంతమంది బంధువులున్నారో మా యింటికి వచ్చి మీరు నక్కపర్యాయం చిత్తగించండి. మాయింటో యిప్పుడు కాలుపెట్టడానికి యెడములేదు. వీరు యీపన్నెండురోజులూ వుండే వారేకాని యీలోపుగా వదిలిపోరు.

భీమ—మీకంతబాధగా వుంటే వెళ్ళిపొమ్మని వారితో మొఖ మాటం లేకుండా చెప్పివెయ్యరాదా?

రామ—మీరు మాత్రం యెందుకుచెప్పరాదు?

భీమ—అవును మనంచెప్పడం బహుకష్టం. వకరియింటిమీద పడితినేవాళ్లు వాళ్ళకు జ్ఞానంవుండవలెనుగాని మనం యెట్లాగుచెప్పము?

రామ—ఋణాలుచేసి పెట్టలేక బాధపడుతూవుండేవాళ్ళం మనమే కాస్తచెప్పలేకపోతే డబ్బుఖర్చు అక్కరలేకుండా తేరగా సుఖభోజనం చేస్తూవుండేవాళ్ళకు లేచిపోవడానికి వాళ్లకేమిపట్టింది; మొఖమాటం మనను విడవకుండా వున్నంతవరకు మనం యిలాయేడు స్తూవుండవలసిందే.

భీమ—అరుగో మావాళ్లువస్తూవున్నారు. ఇఖ మనం స్నానా నకు వెళుదాము.

రామ—ఆడంగులువున్నారు. మీరు బహుజాగ్రత్తగా నీటిలో దిగవలెను సుమండీ. నిన్న ఒకతూర్పుబ్రాహ్మడు పాపం నిష్కారణంగా స్నానం చెయ్యబోయి యిట్టేచచ్చిపోయినాడు. పలుగుముండావాళ్ళు మూక సందట్లో తోసివేస్తారు. సంభావననిమిత్తమై బ్రాహ్మలు మీదపడ్డప్పుడూ అప్పుడూ మీరు పరాకుగా వుండకూడదు.

భీమ—పాపం. ఆబ్రాహ్మడివిషయంలో మోక్షానికి వస్తే మొసలి యెత్తుకుపోయిందన్నసామెత నిజం అయింది. ఆయనకు ముప్ఫయియేళ్ళువున్నవట! పాపం భార్యకూడా దగ్గిర వుండి మునిగిపోతూ వుండగా చూస్తూనేయున్నదట' మనవాళ్ళు యిటువంటి యాత్రిలు పుణ్యమని చెప్పడమేకాని నాకుచూస్తే నాలుగుడబ్బులు వదలడమూ బాధపడడమూతప్ప మరియేమీ పుణ్యం కనపడదు. ఈపుష్కరాలకు యెవరైనా గొప్పవారు వచ్చినారండీ?

రామ—నాకు యెవరూ కనపడలేదండి. మరిడీఅమ్మవారు గొప్పామె వస్తుందని చెప్పినారుకానండి ఆమెవచ్చినజాడ ఇంకా తెలియలేదు. వస్తేమాత్రిం యీవచ్చినవాళ్ళను చాలామందిని తీసుకుపోకుండాపోదు. ఆమె ప్రత్యక్షముక్తిదేవత. వేళకు తిండిలేకుండా యేచెట్టుకిందనో పచ్చిపులుసూ మెతుకులూ తిని. వానలలో తడిసి, ముక్తికోరి బహుదూరాన్నుంచి వచ్చినవారిని అనేకమందిని ఆమె స్వర్గానికి పంపించకుండా మానదు.

భీమ—ఆమె యీమాటు యిక్కడకు వచ్చేటట్టు కనపడలేదు. ఇప్పుడు కృష్ణపుష్కరాలు ఆరంభమట? అక్కడకు విజయంచేస్తుందని విన్నాను. ఇంతకూ ఆమెచిత్తము. ఇంతమంది రావడంచేత మనవూళ్ళో ఇప్పుడు పేడబొమ్మలకూ చెడిపోయిన పాతమిఠాయికీ, పండీపండని అరటికాయలకూ, అమ్ముడుపోకుండా నిలవవున్న పాతరవికల

గుడ్డలకూ, గొప్పమృత్యువువచ్చినది. వ్రాళ్ళవ్రాళ్లు మంచివచ్చిన తుప్ప తలముత్తైదులు పై వస్తువులను వేటినిజూచినా బ్రతుకనియ్యాడం లేదు.

రామ — తమరు విన్నారేమో యీపుష్కరమహాత్యం నాకు కాస్త సెలవిస్తారూ.

భీమ — నేను యేమహాత్మ్యమూ వినలేదు. ప్రత్యక్షంగా కనపడే మహాత్యం చెప్తాను కావలిస్తే వినండి. మనవూళ్ళో వోఘ్రాలుమూకలు మూకలుగా వచ్చి మురికిగుడ్డలతో మునగడంచేత గోదావరి జిడ్డుతేరి నల్లగా యమునానది అవుతూ వున్నది; నీరు కాసులు పట్టే బ్రాహ్మణులకు ధనలాభం కలుగుతూ వున్నది; మ్యునిసిపల్ వారికి కావలసినంత పెంట భాగ్యం కలుగుతూ వున్నది; వీధు లన్నిటికీ చిన్నకాలువలతో ముక్కు మూసుకోవలసిన పరిమళం యెక్కువవుతూ వున్నది; బళ్ళు విస్తారం వస్తూ పోతూ వుండడంచేత టోలుకంట్రాక్టర్లకు సంతోషం యెక్కువవుతూ వున్నది; బజారులో వస్తువులు ప్రియం కావడంచేత పేదలకు సంతోషం తక్కువవుతూ వున్నది. ఇదే నాకు తెలిసిన పుష్కర మహాత్యం. మీకొమారుడికి వుద్యోగం అయినప్పటినుంచీ మీరు సంభావనకు వెళ్ళడం లేదు కాబోలును.

రామ — వెళితే మావాడికి కోపంగా వుంటుందని మానివేసినాను. అదుగో అప్పావధానులు మళ్ళీ వస్తూ వున్నాడు, స్నానానికి వెళుదాము రండి. మీవాళ్లూ వచ్చినారు. (అని వెళ్ళుచున్నారు.)

జమాబందీ. ౧.

---

[కరణము రామయ్యగారును, కాపులదొరయ్యయు, మునిస్వామియు, వీరాస్వామియు ప్రవేశించుచున్నారు.]

కర—దొరయ్యా! నీవు గ్రామానికి మునసపువు అయివుండీ తవ్వల తాతయ్యగాడివద్ద నాలుగురూపాయలు వసూలు చెయ్యలేక పోయినావు గదా?

దొర—బండముండాకొడుకు యివ్వకపోతే నేనేమి సెయ్య నండీ? అన్నీ యిప్పుడే వచ్చినవి. అవతలగ్రామంలో దస్తుచేసి డెల్టా స్వ్యాపరింటెండెంటుమొఖాన్ని పోస్తేనేకాని పొలాలలోకి చుక్క నీరు రాదు. ఇవతల జమాబందీఖర్చులకు దస్తు చెయ్యవలెను. గోరు చుట్టుమీద రోకటిపోటు పడ్డట్టు సర్కారుకిస్తీకూడా యిప్పుడే వచ్చింది.

కర—వీరాస్వామీ! నీవు డెల్టాసూపరింటెండెంటుగారివద్దకు పోయి యిప్పుడు జమాబందీతొందరవచ్చింది, యీతొందర అణిగిందాకా నెలదినాలు వోపిక చేస్తే సొమ్ము దాఖలుచేసుకుంటాము, యీలోపుగా నీరు వదిలిపెట్టుమని అడగలేకపోయినావోయి!

వీరా—యెవరివద్దనైనా పనికివస్తుందికాని ఆమహారాజువద్ద ఆపప్పుడుకదు. చిల్లిగవ్వ తక్కువకాకుండా సొమ్ము అక్కడపెట్టి మరీ మాటాడమంటాడు. నిరుడుసంవత్సరం మామూలులో వక్కరూపాయి తక్కువవచ్చిందని నేను మళ్లీ వూరికి వచ్చి పట్టుకువెళ్లి యిచ్చిందాకా చేలు యెండిపోయినా గిద్దెడు నీరు వదిలిపెట్టినాడు కాదు. పొలాలు యెండిపోయి రహితులందరూ గొల్లున గోలపెట్టినారు. ఎవరికి కొంత యెనకాముందయినా తిరపతియెంకటేశ్వర్లుముడుపు పది ముందుగా చెల్లించుకోక తప్పదు. మనని యిలా యేడిపించి సొమ్ము పుచ్చు

కుంటూరా అండి. ఆల్లా యిలాగే పయివాళ్ళకు లంచాలు పొయ్యాల నంట సుమండీ?

కర — మనం వాళ్ళకు యెలాలోకువో పైవాళ్ళకు వాళ్లా ఆలాగే లోకువ. ఇప్పుడు హుజూరున యెవరో మేనేజరు వున్నాడట. అతడు డెప్టాసూపరెండెంట్లూ మొదలయినవాళ్ల వద్ద లంచాలు మహా దోచుకుంటూవున్నాడట! అన్నవేళకు లంచంసొమ్ము దాఖలుచెయ్య లేకపోతే మొన్న వక డెప్టాసూపరెండెంటును తీసివేయించి రెండు వందలరూపాయలు పుచ్చుకుని ఆపని మరివకడికి వేయించినాడు. రెండు నెలలయినా గాలేదు. ఇంతలోకే యేదో తప్పితం వచ్చిం దని యీ కొత్తవాణ్ణికూడా తీయించివేసి మూడువందలు దొబ్బి మరివకరికి వేయించినాడు. శ్రీరంగరంగా హుజూరులో మరీ అన్యాయంగా వున్నది.

ముని — డెప్టాసూపరెండెంట్లకు అలా కావలసినదే. మొన్న నేను పాడికి మా పెద్దఆవును తోలిపెట్టినాను కానని మా దొడ్డిడు పశువులనూ కాలువగట్టు తొక్కినవని వంకపెట్టి యీనెలలో మూడు మాట్లు బందెలదొడ్లో పెట్టించినాడు. నాకు యాభయిరూపాయలు వదలినవి. యీపాట్లు పడలేక నిన్నవుదయాన్ని మా ఆవును తోలించి వేసినాము. ఆవును పంపించేటప్పుడు నాపెళ్ళాము పెద్దపెట్టున యేడ్చింది. నిరుడీదినాలలో దాన్ని నూరురూపాయలు పెట్టి కొన్నాను. పూటకు దూడకుపోగా మూడుసేర్లపాలు యిస్తుంది. ఈవుద్యోగస్థులమూలంగా మంచివస్తువ యేదీ కొనుక్కోరాదు.

కర — దానితల్లి శిఖకోసిన ఆవు. అదే పోయిందిగాని ముందుగా యీ జమాబందీమాట చూతూ. ఈగండం గడిచి పిండం బయలపడితే తరువాత అన్నీ మెల్లిగా చూచుకోవచ్చును. జమాబందీఖర్చులు

నాలుగువందలూ నేట రేపటిలో మనగ్రామంమీద వసూలయ్యేసాధనం చూడు. నీపెత్తందారీ చూతాము.

ముని — మరేమీ పర్వా లేదు. యెలాగో వకలాగు వసూలవుతవి. నాది పూచీ. వూరిమీద వూరుపడ్డా కరణంమీద కాసు పడదు. మెట్టుమీద మీకు యిందులో వందరూపాయలు మిగులుతవి గాని వక్కదమ్మిడీ చేతిది తగలదు.

కర — అలాగైతే తరువాత మెల్లిగా రాబట్టుకోవచ్చునుగాని మోతుబరీరహితులు మీరు తలాఫదిరూపాయలూ మళ్ళీ వేసుకుని రేపు నాచేతి కివ్వండి.

వీరా — ఈజమాబందీ యెప్పుడు విరగడవుతుందో కాని గ్రామంలో బహులల్లరిగా వున్నది. బంట్రోతువాళ్లు వూరిమీద పడి యీడిగవాళ్ళఇళ్లలోనూ చాకలవాళ్ల యిళ్లలోనూ దూరి కోడి పిట్టలనూ కూరగాయలనూ బలవంతంగా కొట్టి లాక్కుపోతూవున్నారు. వూరంతా గోలయెత్తి లబ్బున మొత్తుకుంటూ వున్నారు. పాకల నిమిత్తమూ పందిళ్లనిమిత్తమూ మనవూళ్ళో తాటిచెట్లన్నీ మోళ్లయిపోయినవి. పుల్లలకింద సఖంతుమ్మచెట్లు పోయినవి. పదిహేను రూపాయల గుమాస్తాకాడినుంచి ప్రతివారియింటివద్దా పందిరి వెయ్యవలెను; ప్రతివారియింటికీ తోరణాలే కట్టవలెను. వూరువూరునుంచీ యిలాగు ప్రతిరోజూ ప్రతియింటికీ పెరుగుకావిళ్ళూ పాలకావిళ్లూ కర్రలకావిళ్లూ కూరలకావిళ్లూ వెళతవికదా! ఇవన్నీ యేమిచేస్తారండీ?

కర — యేమి చేస్తారా? తమకు కావలసినవి పోగా మిగిలినవి బసదిగిన యింటివాళ్ళకు యిచ్చివేస్తారు. పుల్లలు మొదలైనవి మళ్ళీ జమాబందీ వచ్చిందాకా యేటికియేడాదీ నరిపోతవి. అందుచేతనే పరదేశబ్రాహ్మడు వస్తే బసయివ్వనిముండాకొడుకు లందరూ మాయింట్లో

దిగవలసింది మాయింట్లో దిగవలసిన దని వుద్యోగస్థులను యెదురు గుండా వెళ్లి తీసుకువచ్చి ఇళ్లల్లో దింపుకుంటారు. యేమిలాభం లేక పోతే వారిముఖం కంచిగరుడసేవా యేమిటి వూరికే బసలు యెందుకు యిస్తారు?

వీరా—వుద్యోగస్థులు వెచ్చాలనిమిత్తం కోమట్లకు వ్రాసే చీట్లు బహుచిత్రంగావుంటవి. యెవరి కావస్తువులు కావలెనో యెక్కడా పేరు వుండదు. యెవరి కీచీట్లు వ్రాసినారో ఆకోమటిపేరు వుండదు. సరిగదా కింద కావలసినవారిదస్కతైనా వుండదు. కరణంగారూ! కోమట్లు మనను దగాచేసి దొంగచీట్లు వ్రాసి మనవద్ద సొమ్ము పుచ్చుకున్నా పుచ్చుకోవచ్చును. అడుగున దస్కతా వల్లకాడా? పట్టుకోవడానికి యేమి ఆధారము?

కర—గుండెలు వున్నవీ? కోమటివాడు వక్కనాటికి ఆలాగంటి దగా చెయ్యడు. పట్నవాసపుకోమట్లయితే చేస్తారేమోకాని పల్లెటూరి కోమట్లు చెయ్యలేరు.

ముని—అయ్యా కరణంగారూ! వుద్యోగస్థులు మనవంతివేదాని కంటే మూడురెట్లు భోజనం చేస్తారు సుమండీ! మనం పద్దులు చూస్తే వక్కొక్కరికి రోజుకు మూడు సేర్లుబియ్యమూ సేరు సేరునెయ్యా అవుతుంది. సప్లయిలన్నీ మనంచేస్తాము కదా ఈరోజులలో సర్కారువారు వుద్యోగస్థులకు జీతాలు యిస్తారా యివ్వరా?

కర — సర్కారువారు యెప్పటికిమల్లేనే జీతాలు యిస్తారు. ఆజీతాలుమాత్రమే కాకుండా మనం యిచ్చేమామూళ్ళూ అన్నీ కలిపి పదిహేనురూపాయల గుమాస్తాలు సమేతూ జమాబందీ అయి ఇంటికి వెళ్లేటప్పుడు నాలుగేసివందలు అయిదేసివందలు పట్టుకు వెళుతారు. వుద్యోగస్థులూ భోజనాలు మనలాగే చేస్తారుకాని

యెక్కువ తెప్పించిం దంతా తమనిని ఆశ్రియించుకని వున్నవారికి ఇస్తారు.

ముని—ఈ జమాబందీలో అంతా శిరస్తాదారుగారికి యేమి దొరుకుతుం దండీ ?

కర—మన శిరస్తాదారుగారికా ? యెంత దొరుకుతుందో నాకు తెలియదుకాని తహశ్శీలుదారుగారిద్వారా మామూళ్ళు వుంటవి. ఈ తాలూకాలో అంతా నాలుగువేలరూపాయలు మామూళ్ళు వుండవచ్చును. వీరికి యిచ్చేది కాకుండా తహశ్శీలుదారు పెద్దహజూరు వారికికూడా వేరే యివ్వవలెను. అంతదూరం యెందుకు ? వుపనయనం చేసుకుంటారనీ, ఇల్లుకట్టించుకుంటారనీ, యజ్ఞాలుచేస్తారనీ, సత్రాలూ చలివేంద్రిలూ పెట్టిస్తారనీ, వీరు సిఫారసుచేసే బ్రాహ్మలకు యివ్వడానికి షక్తు గ్రామాలమీద వసూలుచేసేసొమ్ము యెంత వుంటుందో చూడు. మొన్న కాశీసంతర్పణ చేస్తానన్న బ్రాహ్మడు వక్క మనతాలూకాలో నుంచి యెనిమిదివందలరూపాయలు పట్టుకునిపోయినాడు. శిరస్తాదారు గారు పంపించినబోగందానికి యేతాలూకాలోనూ వెయ్యిన్నీనూట పదహార్లకు తక్కువ యివ్వలేదు.

వీరా—శిఫారసులుమాత్రమే కాదండీ. యీవుద్యోగస్థులు కూడా ఇళ్ళు కట్టించుకుంటామనీ కొమాళ్ళకూ కొమార్తెలకూ పెళ్ళిళ్ళు చేసుకుంటామని చాలాసొమ్ము వసూలు చేస్తారు.

కర—అది సరే. వారియింట్లో కార్యము లయినప్పుడు వక్క డబ్బుతో కుదరదు. వూళ్ళల్లో వున్నమంచివస్తువు లన్నీ వారియిళ్ళకే వెళుతవి. మొన్న శిరస్తాదారుగారు పదివేలరూపాయలఇల్లు కట్టించుకున్నారుగదా వారికి వక్కదమ్మిడీ చేతిది తగిలిందీ ? నీకు జ్ఞాపకం లేదూ. మనవూళ్లో వున్నచేవతాడిచెట్లన్నీ కొట్టించి నీవే కాదూ

తరువులు వేయించి వెట్టివాళ్లచేత పంపించినారు. మనవూళ్లో దానయ్య గాడు వేయించిన ఇటుకామమంతా రాత్రికి రాత్రి అక్కడకు వెళ్లలేదూ? గొప్పవుద్యోగస్థులఇంట్లో శుభకార్యాలు అయితే పంపించిన వస్తువులలో మిగిలినవి అమ్మివేస్తే యెంతోసొమ్ము వస్తుంది.

పీరా—అరుగో శిరస్తాదారుగారు వస్తూవున్నారు. దొరగారి ఢేరాదగ్గిర వడిగ్గా మాట్లాడుతూ వున్నారని బంట్రోతులను పెట్టి కొట్టించిపోతారు పారిపోదాము రండి. (అని లేచిపోవుచున్నారు.)

---

జమాబందీ. ౨.

[తహశ్శీలుదారుగారును, తాలూకాగుమాస్తాయును, ప్రవేశించుచున్నారు.]

తహ—ఏమండీగుమాస్తాగారూ! మీరుచెప్పినమాటనిజమేనా?

గుమా—నిజమేనండి. కలెక్టరుదొరగారు మీమీద మండిపడుతూ వున్నారని ఇవాళ వుదయాన్న శిరస్తాదారుగారి ఇంటికి వెళితే చెప్పినారు. మీరు తహశ్శీలుదారీపనికి పనికిరారనిన్నీ పైకి వ్రాస్తామనిన్నీ దొరగారేమో సెలవిచ్చినారట?

తహ—నిష్కారణంగా నామీద దొరగారికి యీప్రకారంగా ఆగ్రహం రావడానికి కారణమేమండీ? నేను వక్కదమ్మిడీ లంచం పుచ్చుకోను. శిస్తులో యెక్కడా అరియర్సు లేదు. చురుకుగా పని చేస్తాను. అందరికంటెనూ యెక్కువపరీక్షలు యిచ్చినాను.

గుమా—మీరు యెక్కువ పరీక్షలు ఇవ్వడమూ లంచాలు పుచ్చుకోకపోవడమూ యీరెండేనండి ధొరగారి ఆగ్రహానికి కారణమయింది. మీరు పరీక్షలు యివ్వకపోతే అందరుతహశ్శీలుదార్లవలెనే లంచాలు పుచ్చుకుని హుజూరువారికి లంచాలు యిస్తూ

వుందురు. అందువల్ల మీరూ బాగుపడుదురు. వారూ సంతోషిస్తురు. మీకు దొరగారివద్ద క్యార్రక్టరూ వచ్చును. మీరు నిన్న బొట్లేరు వాడికి మామూలు నాలుగురూపాయలూ యిచ్చివేసినట్టయితే వాడు దొరగారితో యేమీ చెప్పకుండా వుండును.

తహ—నాకువచ్చే నూటడెబ్బయిఅయిదు రూపాయలతోను ప్రతివాడికీ లంచాలు యెక్కడయివ్వను? నాజీతం మాయింట్లో భోజ నానికే సరిపోతుంది. వాడు యీతాలూకాలో యెక్కడాదొరకని సువాసనగలసబ్బు దొరసానిగారికి కావలె నంటాడు. అసాధ్యమయిన కోరికలు కోరితే యెక్కడ తేగలము? యెంతమంచివస్తువులు తెచ్చినా మంచివికావంటాడు. పుచ్చుకొన్నవస్తువులకు సొమ్ము యివ్వడు.

గుమా—యెవరిమామూళ్ళు వాళ్ళకు యివ్వకపోతే అన్నీ ఇలాగంటి తంటాలే వస్తవి. బొట్లేరువాడు మనంయిచ్చినప్రశస్తమైన సన్నబియ్యం యెక్కడనోదాచి యెక్కడివో ముతకవిచేబియ్యం వండి పెట్టి దొరగారితో తహశ్శీలుదారు ఇలాగంటి పాడుబియ్యం పంపిం చినాడని చెప్పినాడట. మీరుపంపించినసబ్బుబిళ్ళలు చూపక దాచి తహశ్శీలుదార్ యీవూళ్ళో సబ్బుదొరకదన్నాడని దొరసానిగారితో చెప్పినాడట.

తహ—దొరలు నిజంక నుక్కోకుండా ఇలాగంటివాళ్ల చెప్పేడు మాటలు వింటారండీ?

గుమా—అందరూ యేకమై చెపుతూవుంటే యెంతమంచివా డైనా వింటాడు. దొరగారు తిండితిని ఢేరాలో పక్కడూ కనిపెట్టుకు కూర్చుంటే నిన్నటిదినం గుమాస్తాలు రెండుఘంటలకు కచేరీకి ఆల స్యంగా వెళ్లినారు. యెందుచేత ఇంతఆలస్యంగా వచ్చినారంటే మేము సొమ్ముపంపినా తహశ్శీలుదారు బియ్యంమొదలైనవి వేళకు సప్లయి

చెయ్యక అరఘంటముందు వట్టి చేబియ్యంపంపించినాడనిన్నీ, కనిపెట్టు కుని వుండివుండి ఆ అన్నముతినడానికి నల్లకాక పారవేసి దొరగారు కోపపడుతారేమో అని వేగిరం పరుగెత్తుకుని వచ్చినామనిన్నీ అందరూ వక్కటట్టుగా చెప్పినారు. అలా చెప్పినతరువాత యెంతశాంతుడి కయినా యెలాకోపం రాకుండా వుంటుంది ?

తహ—డబ్బులేకుండా నాజీతంలోది పెట్టుకొని అన్నిసప్లయిలూ వేళకు జరిపిస్తూవున్నానుగదా, అలాఅబద్ధాలు చెప్పడానికి ఈగుమాస్తాలకు యేమిపొయ్యేకాలం వచ్చింది ?

గుమా—సప్లయిలు యెన్నిచేసినా మామూళ్ళు యివ్వక పోతే వాళ్లకు కోపం వుండకమానదు. వాళ్ళు సదా హుజూరునవుండే వాళ్ళు. యెప్పుడైనా సమయంచూచి దొరగారితో యేదైనా ఫితూరీ చేస్తారు. యెంతన్యాయంగా వెళ్లేవారికీ వొకానొకప్పుడు సన్నిధాన వస్తులు చెప్పేమాటలు నమ్మక తప్పదు.

తహ—నేను యీసంగతులన్నీ దొరగారితో స్వయంగా చెప్పుదామని పొద్దున్న వెళితే ఘంటసేపు ఇవతల చింతచెట్టుకింద కూర్చున్నా సమయంకాక చక్కావచ్చినాను. ఢలాయతుతో యెన్ని మాట్లు చెప్పినా వెళ్లిచూచి ధొరగారు పనిమీద వున్నారు. సమయం కాదని చెపుతూవచ్చినాడు. వున్నసంగతి మనవిచేసుకోవడానికి దొర గారికి సమయంకూడా కాకపోతే యెట్లా యెత్తుకోను ?

గుమా—డలాయితువాళ్ల మామూళ్లు పారవేసినట్టయితే పొద్దున్న వెళ్లగానే మీకు ధొరవారిదర్శనమై వుండును. మామూలు యివ్వకుండా వున్నట్టయితే మీరువెళ్లి ఢేరాముందు వెయ్యేళ్ళు కని పెట్టుకునివున్నా మీదర్శనం దొరగారికికాదు, దొరగారిదర్శనం మీకు కాదు. ఆఫీసులో చూస్తే శిరస్తాదారుగారు దగ్గిర వుంటారుగనుక

అప్పుడు మీసంగతి యేమీ మనవిచేసుకోవడానికి వల్లపడదు. అడిగే వాడికి చెప్పేవాడు లోకువ ; గనుక మీరు యెంత లోపంలేకుండా పనిచేస్తూవున్నా శిరస్తాదారుగారు పట్టుకోవలెనంటే లోపాలు దొరక కుండా మానవు. శిరస్తాదారుగారికి మీమీద కోపమే. పైకి మంచి మాటలు చెపుతూవున్నా సమయందొరికితే మిమ్మలిని యెందులో నైనా పట్టుకొని గట్టిగా నొక్కివెయ్యవలెనని చూస్తూవున్నాడు. నిరుటిసంవత్సరం ఆయనపంపించిన బోగందానికి మీరు యేమీముట్ట చెప్పకుండా పంపించివేసినారట !

తహ.—నిష్కారణంగా ఇంతమంది హానిచెయ్యడానికి చూస్తూ వుంటే వకణ్ని నేను యేమిచెయ్యను ; నాపని అయినా పోవడానికి వప్పుకుంటానుగాని నాజన్మంలో నేను లంచాలుమాత్రం పుచ్చుకోను. బాధతప్పించుకోవడానికినాకుయేమీ వుపాయము తోచకుండావున్నది.

గుమా.—లంచాలుపుచ్చుకోవడం తప్ప రెండవసాధనం యేమీ లేదు. మీరు లంచాలు పుచ్చుకుంటేనేతప్ప మీసంవత్సరజీతము ఖర్చు చేసినా యీవుద్యోగస్థులను సంతోషపెట్టలేరు. హుజూరువాళ్ళకు మీరు స్వతంగానైనా ఇచ్చుకోవలెను. లేదా తాలూకామీదనైనా దస్తుచేసి ఇవ్వవలెను. ఆరెండూ మీచేత కావు. మీరు ఇఖ వాళ్లను యెలాగుమెప్పించగలుగుతారు? మీవలెనే నేను మడికట్టుకునికూర్చుం టానని బెట్టుచెయ్యబోతే వకతహశ్శీలుదారుకి ఇట్లే బరతరఫుఅయింది.

తహ.—యేమీకారణం లేకుండా పైవాళ్లుమాత్రం వూరికే బరతరఫు చేస్తారా ?

గుమా.—వెతికేవాళ్లకు అన్నీకారణాలే కనపడతవి. మీలాగే ఆయన జమాబందీలో మామూళ్లు యివ్వకపోయేటప్పటికి ఆకోపం మనసులో వుంచుకొని, అక్కడనుంచి ప్రతివిషయంలోనూ చివాట్లు

పెడుతూ హుకుములు వ్రాసి తాలూకాశిరస్తాదారుద్వారా ఇళ్లు కట్టుకోవడానికి బలవంతపెట్టి ఇటుక పుచ్చుకొన్నాడని దొంగఫిర్యాదు తెప్పించి బరతరఫు చేయించినారు. లంచాలు పుచ్చుకోని తహశ్శీలుదారుణ్ని చూస్తే తాబేదార్లకు ఇష్టంగా వుండదు. పైవాడు పుచ్చుకునేవాడు వుంటేనే కిందవాళ్లకూ దొరుకుతూ వుంటుంది. ప్రజలకుకూడా లంచాలు పుచ్చుకునేవాడు వుండడమే ఇష్టము. ఆలాంటి వాడు వుంటే సర్కారుకు నష్టంవచ్చినా లంచాలు యిచ్చి తాము లాభం పొందుతూ వుంటారు.

తహ — పోనియ్యండి. ఆలా లంచాలు పుచ్చుకొని బాగుపడుట కంటె ముష్టియెత్తుకోవడం వుత్తమం. యీ ఛేరాలూ యీ హడావడీ చూస్తే వుద్యోగస్థుల లంచాలజమాబందీలాగు కనపడుతూ వున్నది గాని సర్కారుశిస్తుజమాబందీలాగు కనపడడం లేదు. ఇది యేమి దురన్యాయమో నాకు తెలియకుండా వున్నది.

గుమా — మీకు యింకా అనుభవంలోకి రాలేదు గనుక నీతులు యెన్నైనా చెపుతారు. ఈతహశ్శీలుదారీ కాస్తా పోయినతరువాత యెవరూ మీముఖం చూచేవారు వుండరు. బాగా ఆలోచించుకోండి. నేను ఇప్పుడు చెప్పినతహశ్శీలుదారుగారున్ను మించిపోయినతరువాత చాలా పశ్చాత్తాపపడినారు. తరువాత విచారించినకార్యము లేదు. మీకూ మాకూ బంధుత్వం కలిసివున్నది గనుక మీక్షేమం గోరి ఇంతగా మనవిచేసినాను. సెలవైతే నేను యీసాయంకాలము శిరస్తాదారుగారితో మాట్లాడి అన్నీ చక్కపెట్టుకుని వస్తాను.

తహ — తరువాత ఆలోచించి చెపుతాను లెండి. ఇప్పుడు భోజనపువేళ అయింది వెళుతాను.

(అని వెళ్ళుచున్నాడు.)

## గొట్టాలమ్మ సభ

[మాదిగ మల్లిగాడును, గమళ్ళ గాలిగాడును, పూజారి పూర్ణయ్యాయు, కాపు కామయ్యాయు ప్రవేశించుచున్నారు.]

కామ—ఓరే మల్లిగా! వూళ్ళో అమ్మవారిజాడ్యాలు ఇలాగ వున్నప్పుడు మనం అమ్మవారిని నడివీధిలో నిలపనక్కరలేదుట్రా?

మల్లి—బాబూ! తప్పకుండా నిలపాలండి. మాకు డప్పులపని లేకపోవడంచేత కల్లునీళ్ళకి లేక చచ్చిపోతూవున్నాము. మా మాదిగ వాళ్లనందరినీ పోగుచేస్తాను. తప్పకుండా వుత్సవం చేయించండి. యీ మూలంగానైనా మాకు నాలుగుడబ్బులసొమ్ము దొరుకుతుంది.

గాలి—అవునండి తప్పకుండా చెయ్యవలసిందే. మాదిగవాళ్లకు మాత్రమే కాదు మాకూ నాలుగుడబ్బులసొమ్ము దొరుకుతుంది. ఇప్పుడు మనవూళ్ళో యెంతమంది కల్లు తాగేవాళ్ళు వున్నా యీ వుత్సవదినాలలోవలె యెప్పుడూ ఖర్చు కాదు. కావలిస్తే మావాళ్ళ నందరినీ పోగుచేసి వుత్సవానికి కావలసినంతసరంజాం చేయిస్తాను. ఇచ్చుకోమంటే తలా రెండణాలూ చందా యిచ్చుకుంటాము.

కామ—ఇఖ నంతా కుదిరింది. పూర్ణయ్యా! నీ వేమంటావు?

పూర్ణ—నేననేది యేమున్నది? మీచిత్తము నాలుగుడబ్బుల సొమ్ము దొరికేటప్పుడు నాకూ సంతోషమే. ఈయేడు వేటపోతులూ బియ్యమూ చాలా దొరుకుతవి.

కామ—అందుకు సందేహ మేమి? వెయ్యివేటపోతులూ పది వేల కోడిపిట్టలూ తెగకపోతే నన్ను యీపేరున పిలువవద్దు. పాపిష్టి దేవుడు మాంసం నిలవ వుండకుండా చేసినాడుకాని లేకపోతే యేటికి యేడాదీ యీమాంసం మనకందరికీ పుష్కరంగా సరిపోను.

పూర్ణ—కామయ్యగారూ! ఇందులో ఇంకొకటి యున్నది. బ్రాహ్మలూ కోమట్లూ నరికించే వేటపోతులుమాత్ర మేమనకుదక్కుతవి గాని శూద్రులవి వక్కతలమాత్రం యిచ్చి తక్కినభాగం వాళ్లే పట్టుకు వెళుతారు. అది లేకుండా చేస్తారూ.

కామ—ఇప్పుడు మనం ఆప్రయత్నం చెయ్యకూడదు. ముందు ఆసంగతి ఆలోచింతాము. బ్రాహ్మలు యిచ్చే మేకపోతులే మనకు నెత్తికి నేలకూకూడా చాలును. అంతగా చాలకపోతే తరువాత మన గణాచారిగాడిచేత మేకపోతులను ఇంటికిపట్టుకుపోతే రోగాలుయెక్కువ చేసి పూరందరినీ చంపుకొనిపోతా ననిపింతాము. అమ్మవారు యిలా గన్నదంటే అందరూ మేకపోతులను మనకు ఇచ్చేపోతారు.

మల్లి—నేను ఇప్పుడే చెప్పుతూవున్నాను. తెగిన మేకపోతుల తలకాయలన్నీ మా మాదిగవాళ్లవే సుమండీ. తరువాత లేదనేరు.

కామ—సరే మామూలు యెలాగో ఆలాగే జరగవచ్చును. పూర్ణయ్యా! ఇప్పుడే చెపుతూవున్నాను. దొరికే బియ్యంలోనూ దక్షిణలలోనూ సగం మాదీ సగం మీదీ సుమా. తగువులుపెడితే పనికిరాదు.

పూర్ణ—అలాకాదు. కష్టపడేవాళ్ళము మేముగనుక రెండు వంతులు మాకిచ్చి వకవంతు మీరు పుచ్చుకోండి.

కామ—అలా వల్లపడదు. మాకు సఖంవంతు యిస్తేనే వుత్స వం జరుగుతుంది లేకపోతే జరగనేజరగదు. నన్ను కలుపుకోకుండా మీరు పాకలు వేయిస్తురూ మరునాటికి తగులడతవోలేదో మీరే చూస్తారు.

పూర్ణ—మీ యిష్టంవచ్చినట్టే మీరు పుచ్చుకోండి. బాజా వాళ్లకూ డప్పులవాళ్ళకూ అయ్యేఖర్చుపోగా మిగిలేదాల్లో సుమండీ

మీకు సఖం యివ్వడం. ఆనికి అంతలోనూ సఖం తెమ్మంటారు.

కామ—ఆలా తెమ్మనడానికి నేనుమాత్రం న్యాయం యెరగని వాణ్నా ? అన్నిఖర్చులూపోగా మిగిలిన దానిలోనే చెరిసగము పుచ్చుకుందాము. అవునుగాని నీవు గరగలను యెత్తుకొని వీధులలో తిరిగే టప్పుడు అమ్మవారు యేమిచెప్పినదని చెపుతావు ?

పూర్ణ—అదీ మీరే సెలవియ్యవలెను.

కామ—మంచిది ఆలోచించి చెపుతానువుండు. సర్కారు వాళ్ల మాటవిని వేపరొట్టలు కట్టకుండా గంధకమూ తారూ పొగలు వెయ్యడంచేత నాకు కోపంవచ్చి ఇలాగు చంపుతూవున్నానని ముఖ్యంగా చెప్పవలెను. తరువాత నాకు జాతరలూ వుత్సవాలూ చెయ్యడం మానివేసినారు. ఇప్పుడైనా బుద్ధిగలిగి నాకు జాతరలు చేయించకపోతే శవాలను బళ్లతో తోలేటట్టు చేయిస్తానన్న దని చెప్పు. మరిచిపోకుండా యీరెండున్నూ ముఖ్యంగా చెప్పవలెను. అలా చెప్పకపోతే యింగ్లీషుచదువుకున్నవాళ్ల మాటలు నమ్మి దొడ్లు శుభ్రంచేసుకోవడమూ గోడలకు వెల్ల వేసుకోవడమూ నీళ్ళుకాచి వడకట్టి తాగడమూ తారూ గంధకమూ పొగలు వెయ్యడమూ ముఖ్యంగా చూసుకుంటారుకాని మనకు బియ్యాలు ఇవ్వడమూ చలిమిడీ నానుపప్పూ నైవేద్యాలు పెట్టడమూ వేటపోతులను యివ్వడమూ ముఖ్యంగా చూడరు.

పూర్ణ—అది సరేకాని యీగంధకపుపొగవల్లనూ వాటివల్లనూ యేమయినా కార్యం వున్నదీ ?

కామ—కార్యంవున్నదీ లేకపోయినదీ అదంతా మనకెందుకు? మనకు నాలుగుడబ్బులసొమ్ము దొరికేపని మనం చూచుకుందాము. మనకు బలులు యిచ్చేవారికందరికీ రోగాలు రాకుండాను వచ్చిన

వాళ్ళు చావకుండానూ మానుతూవున్నవా? యేమిచేసినా చచ్చే వాళ్ళు యెలాగూచస్తారు. బ్రతికేవాళ్లు యెలాగూ బ్రతుకుతారు. గాలిలోనూ నీళ్ళలోనూ యేమివున్నది? యీగోదావరీ యీ గాలీ ప్రపంచం పుట్టినప్పటినుంచీ వున్నవిగాని బ్రహ్మదేవుడు వీటిని కొత్తగా పుట్టించినాడాయేమిటి?

పూర్ణ — పోనియ్యండి. ఆయుర్దాయం వుంటే యెలాగూ బ్రతుకుతారు. ఆసంగతి మన కెందుకుగాని అమ్మవారు మూకుట్లో యేమిపడవేసిందని అడుగుతారు. యేమి చెప్పమన్నారు?

కామ—.యేమి చెప్పమన్నావా? పసుపూ కుంకమూ పడ వేసిందని చెప్పు. ఇఖ నాకు తిన్నగా సేవచేయిస్తే మీపసుపూ కుంక మూచల్లగా వుంచుతానని అమ్మవారి అభిప్రాయం అని అర్థం నీవు విప్పి చెపుతూవుండు.

పూర్ణ—అలాగే చెపుతానుగాని ఫదిమంది గణాచార్లనూ శివశక్తులనూ పోగుచేస్తారా?

కామ—ఇప్పుడు అంతమంది రారు. యెవళ్ళయినా డబ్బు యిచ్చి రోజుకూలికి తీసుకునిరావలెను. వాళ్ళయినా మునుపటిలాగు అల్లరి చెయ్యడానికి వల్లకాదు. వాళ్ళయింటికాడ గంతులువేస్తే పిల్లవాడు జడుసుకున్నాడని కిందటిమాటు వక తురకసాహేబు వక శివశక్తిని చావతన్నినాడు. అప్పటినుంచీ భయంచేత యెవళ్ళూరారు. వక్క తురకసాహేబేకాదు మనవాడుకూడా వక గణాచారి తన్నేమో తిట్టినాడని కోపంచేత తిన్నగా బజారునకు పరుగెత్తి పేపబెత్తం కొను క్కొని వీభూతి పూసుకొని వేపమండలు చేతితోపట్టుకొని తన పగ తీరేటట్టుగా పడకొట్టినాడు. మామూలుగావచ్చే ఆముండలుమాత్రం యిద్దరువస్తారు.

పూర్ణ—వాళ్లేచాలునులెండి. వాళ్లకు కాసిన్ని కళ్లనీళ్ళు పోయిస్తే కొంచెం తూలుతూ నడుస్తారు. వళ్ళు తెలిసివుంటే యెవర యినా కొట్టిపోతారేమో అనే భయంచేత వాళ్ళయినా ఆ కాస్త అల్లరీ చెయ్యరు. ఇప్పుడన్నీ కానికాలాలు వచ్చినవి.

కామ—అవును. ఇప్పుడు కాలం మంచిదికాదు. మనం వెళ దాముదండి. రేపు వూళ్ళో నలుగురితోను చెప్పి మీటింగుచేయించి అమ్మవారివుత్సవంనిమిత్తం చందాలు చేయింతాము. మనవూళ్ళో అధమం అయిదువందలయినా చందాకాకపోతవా ?

(అని మాటాడుకొనుచు వెళ్ళుచున్నారు.)

---

## బహుభార్యాత్వము.

---

[తిమ్మజగపతి మహారాజులుంగారును, మంత్రి యుగంధరుడుగారును, శాలకమహారాజుగారును, ప్రవేశించుచున్నారు.]

యుగం — శాలకమహారాజుగారూ! మీబావగారు బహు భూతదయాళుత్వము గలవారు సుమండీ!

శాల—అందుకు సందేహ మేమి? చెవులు వొక్కమాటుగా కోస్తే నొప్పియెత్తుతుందని నిత్యమూ కాస్తకాస్త చొప్పున దగ్గిర వుండి మన వేటకుక్క చెవులు ఆరునెలలు కోయించినారు.

తిమ్మ—మనం ఆలాగు చేసినా, అది చెడఅరిచే దేమండీ! దాని యేడుపుచేత నాకు రాత్రికూడా నిద్రపట్టేదేకాదు.

శాల—అది వట్టికృతఘ్నపుకుక్క. దేవరవారు చెవులంత మెల్లగా కోయించినందుకు దానికి మీాయం దెంతవిశ్వాస ముండ వలసినది? కుక్కకు విశ్వాసం వుంటుం దంటారుగాని దానివద్ద నాకు

లేశమూ కనపడ లేదు. మీది మిక్కిలి యిల్లూ వాకలీ యెగిరిపోయేటట్టు రాత్రి పగలూ చెడఅరిచి మిమ్మల్ని చెడఅల్లరి పెట్టేది. అది రాజాస్థానంలో వుండతగ్గది కాదు. అందుచేతనే అది చెవులు పుచ్చి పురుగులు పడి మరీ చచ్చింది.

తిమ్మ—భావగారూ! మీకు లోపల యేమో పని వున్నది కాబోలునే వక్కసారి విజయంచెయ్యరా?

శాల—నాకు లోపల పని లేదు, ఇక్కడనే పని వున్నది. మీ మంత్రిగారూ మీరూ చేస్తూవున్న ఆలోచన మంతా నాకు తెలిసే వచ్చినాను. నేను వుంటే మీకడ్డం యేమిటి? మీకు నేనుకూడా సహాయం చేస్తాను. మాట్లాడుకోండి.

తిమ్మ—ఆలాగా? తమరుకూడా మాలో చేరినవారేనా? మీ చెల్లెలిగారిమూలంగా మీకు యిష్టం వుండదేమో అనుకున్నాము.

శాల—కొత్తచెల్లెళ్ళు వస్తూవుంటే నాకుమాత్రం యెందుకు యిష్టం లేకపోతుంది? వొక్కొక్కచెల్లెలు వచ్చినకొద్దీ అన్నయ్యా అని పిలిచేవారు యెక్కువయి నాకూ సంతోషంగానే వుంటుంది.

తిమ్మ—ఇప్పుడు వచ్చేచెల్లెలు వకవేళ మీకంట పడదేమో! అప్పుడు మీకోరిక విఫలం అవుతుందే!

శాల—ఓహో! మీ భూతదయమాట మరిచిపోయినానే. మా కొత్తచెల్లెలిగారినికూడా ఇల్లంతా తిరిగి అలసిపోకుండానూ, సూర్యుడిముఖం చూచి యెండలో జడుసుకోకుండానూ, గది దాటి యివతలకు రాకుండా సుఖపెడుతారు కాబోలును. యీ వున్న భార్యలు చాలక మీకు యిప్పుడు మళ్ళీ వివాహం యెందుకో తెలియక అడుగుతాను సెలవిస్తారా?

యుగం—మీరలాగు ప్రశ్న వేయకూడదు. మహారాజులకు యెం

తమందిభార్యలు వుండినా వుండవచ్చును. శ్రీకృష్ణమూర్తివారికి పదహారు వేలు గోపికాస్త్రీలూ యెనమండుగురు పట్టపుదేవులూ వున్నమాట మీారు యెరగరా? సమస్తమూ తెలిసినవారు పామరులవలె మీారూ యిలాగే సెలవిస్తారేమి? మన ఆస్థానంలోనిపండితులూజ్యోతిష్కులూ బ్రాహ్మణులూ అందరూ యేకవాక్యంగా వివాహం కావలసిందనే సెలవిస్తూవున్నారు. బ్రాహ్మణవాక్యం వూరికే పోదు.

శాల—మీారూ బ్రాహ్మణులూ చెప్పడాని కేమి? బిడ్డలు లేకపోయినా రాజుగారికి వివాహాలమీాదనే వివాహాలు అవుతూవుంటే మీాకు ఫదివరహాలసొమ్ము దొరుకుతూ వుంటుంది. కాబట్టి మంత్రులూ బ్రాహ్మణులూ యెప్పుడూ నిత్యకళ్యాణమూ పచ్చతోరణమూ కోరుతూ వుంటారు. అది లేకపోతే మీాకు యేమీా లేదు. బ్రాహ్మణ వాక్యం అమోఘంగా అవుతుందని నాకూ తెలుసును. తెలిసే మళ్ళీ యీావెర్రిలో పడుతూ వున్నాను. మీారు సిద్ధసంకల్పులు. మీారు సంకల్పించుకొన్నతరువాత బ్రాహ్మణవాక్యానికైనా తిరుగువుంటుంది గాని మీాసంకల్పానికి తిరుగు వుండదు.

యుగం—ఇప్పుడు మహారాజుగారికి వున్నవారల్లా యిద్దఱు మహాదేవులేనా అంతకంటె యెక్కువ వున్నారా? వంశం నిలవడానికి వారిలో వక్కరికైనా సంతానం లేదుకదా? జాతకం చూచినజ్యోతిష్కులందరూ యీాయేడు రాజుగారికి తప్పకుండా కళ్యాణయోగం వున్నదని సెలవిస్తూ వున్నారు. దైవసంకల్పం తప్పిపోదు.

శాల—జాతకాలూ గ్రహాలూ జ్యోతిష్కులచేతులో వున్నవి; జ్యోతిష్కులు మీాచేతిలో వున్నారు. ఒక్కకళ్యాణం కాదు చేసుకునే వాడు వెఱ్ఱివాడయితే యెన్నికళ్యాణాలైనా అవుతవి. భావగారుపరుస గనుక నేను పరియాచకాని కంటూవున్నాను సుమండీ. ఈసంతానం

లేనితోపము మహారాజులంగారిదో మహారాణులంగారిదో తెలుసు నిర్ణయించినారు? వఖవేళ మహారాజులంగారిదైనా ఫర్వాలేదు. వచ్చే ఆవిడ పతివ్రతాశిరోమణి అయితే, ఆమె పతివ్రతామహాత్మ్యంవల్లనైనా సంతానం కలుగవచ్చును.

తిమ్మ—భావగారూ! హాస్యం పేరుపెట్టి నన్ను అంతమాట అనడం రాచకులంలో మీకు భావ్యమేనా?

శాల—అయ్యయ్యో! పెద్దల్ని మిమ్మలిని అలా అనకూడదు. మీశూరత్వం యెరగక అన్నాను. క్షమించండి. మీరు విన్నారో లేదోకాని ఆడమళయాళం అని యెక్కడనో వున్నదట! అక్కడంతా ఆడవాళ్ల అధికారం. ఆడవాళ్ళు వుద్యోగాలు చేస్తూవుంటే మగవాళ్ళు యింట్లో వంటచేసి పెడుతూవుంటారట. అక్కడ మొగవాళ్లకు యెక్కడలేని ఘోషా వున్నదట! ఆ దేశంలో మహారాణీకి సంతానం లేకపోతే ఖయిదీలలాగు కొట్టువక్కంటికి వొక్కొక్కడు వుండేలాగున యేటా యేటా వొక్కొక్క మహారాజును పెండ్లాడి మహా ఘోషాలో వుంచుతుందట! ఆడమళయాళం అంటే దక్షిణాన్ని మన వాళ్లు చూచే యీమళయాళం కాదుసుండీ.

తిమ్మ—ఆసి దానిసిగకొయ్యనూ! ఆడముండ మహారాజునే అంతబాధ పెడుతుందండీ? అక్కడ బిడ్డలు ఆడవాళ్లకే పుడుతారా? మగవాళ్లకు పుడుతారా?

శాల—ఆడవాళ్ళకే పుడుతారటగాని పెంచడమూ పాలుపోయడమూ అంతా మగవాళ్లు చెయ్యవలెను. అంతఃపురాలలో రాణిగారి భర్తలయిన మహారాజుల నందరినీ తలావక కొట్లోనూ పెట్టి తాళంవేసి యివతలకురాకుండా గుమ్మాలవద్ద మగ నవుకర్లను కావలి వుంచుతారు. వీధిలోవెళ్లే ఆడవాళ్ళు కనపడిపోతారని యీమహారా

జులువుండే చీకటిగదులకు కిటికీలుకూడా పెట్టించరు. ఆమహారాజులను కలలోనూ మేడలమీదికి యెక్కనియ్యరు. ఈప్రకారంగా వొక్కొక్క మహారాణి భర్తలని పేరుచెప్పి నాలుగేసివందలనూ అయిదేసివంద లనూ చక్కనిమగవాళ్లను ఖయిదులో వుంచుతుంది. ఈఘోషా చూచి మీరు ఆశ్చర్యపడుతూవున్నారుగాని మనదేశంలో ఆడవాళ్లను మనం యీలాగు ఘోషాలో వుంచడంలేదూ? ఇక్కడ మీరాణీలకు సంభవించిన శిక్షే అక్కడ రాజులకు సంభవించినది. ఇందులో హాశ్చర్యం యేమివున్నది. అధికారబలమూ మరివకటా? యెవరికి అధి కారంవుంటే యెవరుమానుతారు? భావగారూ! మీకు వున్న అధికారం రాణీగార్లకుండి మీరు వాళ్లకు దాసులుకండి. రేపీపాటికి సంతానం లేదనే హేతువుచేత పీరివంటిమంత్రిగార్ల ఆలోచనప్రకారం మీలాగే వొక్కొక్కళ్ళు యెనమండుగురేసి భర్తలను కట్టుకోవడానికి ప్రయత్నం చేస్తారోలేదో చూతాము.

తిమ్మ—మంత్రిగారూ! ఇదివరదాకా యేమో అనుకున్నాను. భావగారు నన్నే ఆక్షేపణ చేస్తూవున్నారు. నాకు ఇఖ పెళ్ళీవద్దు యేమీవద్దు. మారాజకులంలోవుండే పౌరషమున్ను అభిమానమున్నూ పీరు ఆలోచించకుండా మాటాడుతూవున్నారు.

శాల—అయ్యో! పౌరుషం వచ్చి రాజుగారు పెళ్ళి మానివేసి నారు. యేమిబుద్ధి శిక్షార్హులైన వక్కరాచకూతురికి పెళ్లిలేక పోవడంమూలంగా కారాగృహవాస శిక్ష తప్పిపోయింది. అయ్యో జ్యోతిష్కులారా గ్రహాలలారా! రాజుగారి పౌరుషం మూలంగా మీశాస్త్రిలూ మీగతులూకూడా తప్పిపోతూవున్నవిగదా?

తిమ్మ—మాకు రోషం వస్తూవున్నది. ఫిరంగీకత్తి తీసుకుని రావయ్యా! మాపౌరుషం కనపరుస్తాము.

మంత్రి—చిత్తము. (అని లేచుచున్నాఁడు.)

శాల—నన్ను పొడుస్తారేమో! నేను పారిపోతాను.

(అని పాఱిపోవుచున్నాఁడు.)

తిమ్మ—మంత్రిగారూ! మీా కాకత్తి కనపడదేమో! కనపడితే వొక్కపోటుతో భావగారిప్రాణాలు పుచ్చుకొని మేము పొడుచుకుందుముసుమా?

మంత్రి—యేలినవారి సెలవైతే మఱివకకత్తి తీసుకునివస్తాను.

తిమ్మ—సామాన్యపుకత్తితో పొడుచుకోవడంపౌరుషంకాదు. పొడుచుకుంటే వజ్రాలుచెక్కిన మనకత్తితోనే పొడుచుకోవలెను. అది యెక్కడపెట్టినానో మఱిచిపోయినానుగదా! అది యెంతవెతికినా కనపడదు.

మంత్రి—అవును కనపడదండి.

తిమ్మ—ఆలాగయితే మాపౌరుషం లోకానికి వెల్లడిచెయ్యడానికి అవకాశం తప్పిపోయింది.

మంత్రి—అవును తప్పిపోయిందండి.

తిమ్మ—ఇటువంటి అవకాశం మళ్ళీ యెప్పుడూ రాదు.

మంత్రి—అవును రాదండి.

తిమ్మ—మాకు యిప్పుడు ఆలోచనయేమీా తోచకుండా వున్నది.

మంత్రి—అవును నాకూ తోచకుండా వున్నదండి.

తిమ్మ—వంటిమీాద వక్కపోటు పడకుండా మనశూరత్వమూ సాహసమూ లోకానికి వెల్లడికావలెను.

మంత్రి—అవును వెల్లడి కావలెనండి.

తిమ్మ—ఆలాగయితే యిప్పుడు మీారు తిన్నగా మాభావ

గారిదగ్గరకు పరుగెత్తుకుని వెళ్లి మీరు బతిమాలుకుంటేనేతప్ప రాజు గారు పొడుచుకుంటారని చెప్పి తక్షణం తీసుకునిరావలెను.

మంత్రి—తప్పకుండా తీసుకునివస్తానండి.

తిమ్మ—మీరు అభయహస్తం యిస్తే లోపలినుంచి కత్తి తీసుకునివచ్చి పొడుచుకోవడానికి సిద్ధంగా వున్నట్టుంటాను.

మంత్రి—మీ రలా వుండవచ్చును.

తిమ్మ—కత్తి యీగదిలోనే వుంది. మీరు భావగారిని తప్ప కుండా తీసుకుని వస్తారుగదా?

మంత్రి—తప్పకుండా తీసుకునివస్తాను.

తిమ్మ— ముఖ్యంగా?

మంత్రి—ముఖ్యంగా తీసుకువస్తాను.

తిమ్మ—అవశ్యంగా?

మంత్రి— అవశ్యంగా.

తిమ్మ—అలాగయితే భావగారు చేయిపట్టుకునేలోగా గుండెల మీద వక్కపోటు పొడుచుకుంటాను. పోటు తగలకుండా వుండడానికి కనపడకుండా అంగీలో ఇనుపరేకు అమర్చుకుంటూ మాపనిమీద మేము వుంటాము. మీరు మీ పనిమీద పొండి.

మంత్రి—చిత్తము.

(అని యిద్దఱును చెఱియొకత్రోవను పోవుచున్నారు.)

# హిందూ మత సభ.

---

[నంబి నరసింహాచార్యులుగారును, ఆరాధ్యుల అయ్యావార్లంగారును, పుష్పాల పాపిరెడ్డిగారును, సోమయాజుల సూరయ్యశాస్త్రిగారును, ధరణిప్రగడ ధర్మరాజుగారును, విశ్వల విశ్వనాథశాస్త్రిగారును, ఇతరసభికులును ప్రవేశించుచున్నారు.]

నర—మనకందరికీ హిందూమతమందు అభిమానం వుండవలెను. ఇవాళ వేదశాస్త్రాలకు విరోధంగా ధర్మరాజుగారు యేదో నాస్తిక వుపన్యాసం చేస్తారట. మానం ఆయనను యెలాగైనా అవమానపర్చవలెను.

అయ్యా—నరిసింహాచార్లుగారు చెప్పింది బాగావున్నది. మతాభిమానం వున్నవాళ్ళందరూ ఆయనను చప్పట్లుగొట్టి పంపివెయ్యవలెను.

పాపి—అయ్యావార్లంగారి సెలవుప్రకారం మనపూర్వీకుల మతం కాపాడడానికి నేను యెంతపనిఅయినా చేస్తాను.

సూర—ధర్మశాస్త్ర ప్రమాణాలు చూపి నేను యీరోజున దిగ్విజయంచేసి భూమిమీద మళ్ళీ హిందూమతం నిలువపెడుతాను.

ధర్మ—సూరయ్యశాస్త్రిగారూ! నన్ను యీరోజున మత విషయం కొంచెం వుపన్యసించవలసిందని మనవారు కోరినారు. తమరు దయచేసి కొంచెం మాట్లాడడం చాలించి నామనవి కొంచెం వింటారా?

సూర—కానియ్యండి.

ధర్మ—ఓసభికులారా! ఈలోకములో సత్యముతో సరియైన ధర్మ మింకొకటిలేదు. సత్యముకంటె శ్రేష్ఠమయిన దేదియులేదు. అసత్యమునకంటె తీవ్రతరమయిన దింకొకటిలేదు. అహింస, సత్యము,

దొంగిలింపకుండుట, శౌచము, ఇంద్రియనిగ్రహము, ఇవి సర్వవర్ణములవారును అనుష్ఠింపదగిన ధర్మములు. ఇతడు బంధుడు, ఇతడు కాడు, అనుగణన క్షుద్రమనస్కుల కుండునుగాని యీశ్వరభక్తిగల యుదారచరితులకు లోకమంతయు కుటుంబమే. కాయక్లేశము చేతగాని తీర్థసేవవలనగాని పుణ్యప్రదము కలుగదు. అది మనోజయము వలన గలుగును.—

పాపి— మాకీ నాస్తికబోధలు పనికిరావు. మాకు మాహిందూమతమే కావలెను. మాకు వేదశాస్త్రాలు ప్రమాణాలు.

అయ్య— మహాబ్రాహ్మలం మేమంతావుండగా శూద్రవాడవు నీవు మాట్లాడుతావేమి?

పాపి—నేను మీ హిందూమతం నిలువబెట్టడానికే మాట్లాడుతూవున్నాను.

అయ్య—అదుగో మళ్ళీమాట్లాడుతావు? బ్రాహ్మలువుండగా సభలో శూద్రవాడు నోరెత్తడం బ్రాహ్మణులకు అవమానం. నేను నీశ్రేయస్సుకోసమే చెపుతూవున్నాను. దానివల్ల నీకే పాపం వస్తుంది.

పాపి— శూద్రవాడు శూద్రవాడు అంటూవున్నారు. మాటలు జాగ్రత్తగా రానియ్యండి.

అయ్య—శూద్రవాడనక నిన్ను యేమండి అని మన్నించవలెనా? నీవు బ్రాహ్మలలో వచ్చికూర్చోవడానికే తగవు. మాట్లాడక దూరంగా పో. ఏదీశాస్త్రుల్లగారూ దర్మశాస్త్రవచనం చదవండి.

సూర—మనుస్మృతి యెనిమిదో అధ్యాయములో—

శ్లో॥ సహాసన మభిప్రేప్సు రుత్కృష్టస్యాపకృష్టజః।
కట్యాంకృతాంకో నిర్వాస్యః స్ఫిచంవాస్యావకర్తయేత్ ॥ ౨౮౧॥

‹‹తక్కువకులంవాడు అగ్రకులంవారితోకూడా కూర్చోవడానికి

కోరితే వాణ్ని తుంటిమీద వాతవేసి పంపించిఅయినా వెయ్యవలెను! లేదా పిఱ్ఱలుకోసిఅయినా వెయ్యవలెను" అని వున్నది.

పాపి—అందులో శూద్రుడన్నమాటలేదు.

శూర—ఓరి పరమనాస్తికుడా! ధర్మశాస్త్రాలకుకూడా వంకలుపెడుచూవున్నావురా? వ్యాఖ్యానంలో కుల్లూకభట్టాచార్యులు "బ్రాహ్మణేన సహాసనోపవిష్టః శూద్రః కట్యాం తప్తలోహకృతచిహ్నోవదేశో నిర్వాసనీయః స్ఫిచంవాస్య యథానమ్రియతే తథాఛేదయేత్" అని వ్రాసినమాట నీవెరుగవు.

పాపి—అది వేదం చదువుకొన్న బ్రాహ్మణుల విషయం.

శూర — బ్రాహ్మణులు వేదం చదువుకోనూ అక్కర లేదు; కర్మలు చెయ్యనూఅక్కరలేదు. వారు జన్మచేతనే మహాపవిత్రులు. నీకు బ్రాహ్మణప్రభావం తెలియదు. చెపుచాను విను. శాతాతప ధర్మశాస్త్రం షష్ఠాధ్యాయంలో—

"శ్లో॥ జన్మనైవమహాభాగో బ్రాహ్మణో నామ జాయతే।
మాతాసా సర్వభూతానాం వర్ణ శ్రేష్ఠః పితాగురుః॥9॥

బ్రాహ్మణు డనుపేరుచే పుట్టినవాడు జన్మచేతనే మహాభాగుఁడు. ఆవర్ణ శ్రేష్ఠుడు సమస్తభూతములకున్ను తల్లి దండ్రి గురువు.

"శ్లో॥ దేవతాదివ్యభూతేషు క్వచిత్క్వచి త్ప్రతిష్ఠితా।
బ్రాహ్మణా దేవతాస్సర్వాః తస్మాత్సంపూజయేత్సదా॥10॥

ఒక్కొక దేవత వొక్కొక్కదివ్యస్థలమునందు ప్రతిష్ఠ చేయబడి వున్నది. అన్ని దేవతలున్ను బ్రాహ్మణులే కాబట్టి వారిని సదా పూజింపవలెను. అని చెప్పివున్నది. భూదేవతలప్రభావం నీకు యిప్పుడయినా తెలిసిందా? బ్రాహ్మలకోపం విష్ణుదేవుని చక్రముకంటెనూ తీవ్రమయింది. వారికి కోపం తెప్పించక వూరుకో, అందుకు నేను కావలిస్తే ప్రమాణవచనం

చదువుచాను విను. శంఖలిఖితధర్మశాస్త్రములో—

శ్లో॥ మన్యుప్రహరణావిప్రా శ్చక్రప్రహరణోహరిః।
చక్రాత్తీవ్రతరో మన్యు స్తస్మాద్విప్రా న్నకోపయేత్ ॥౨౫॥

బ్రాహ్మణులు కోప మాయుధంగా గలవారు; విష్ణు చక్రాయుధుడు. బ్రాహ్మణకోపము చక్రముకంటెనూ తీక్ష్ణతరమయినది గనుక బ్రాహ్మణులను కోపింప చేయకూడదు."

పాపి—(తనలో) శాస్త్రప్రమాణం వప్పుకోవడంచేత నేను యిక నోరెత్తడానికి వల్లకాదు.

నర—ఈశాస్త్రుర్లగారు యీరోజుసభలో బ్రాహ్మణ్యంపోకుండా నిలువబెట్టినారు.

అయ్య—శాస్త్రుర్లగారు శాస్త్రవచనాలు కురిపించి శూద్రవాణ్ని నోరెత్తకుండా తలవంచుకునేటట్టు చేసినారు. ఇకవాడికి స్వధర్మం చెప్పి బ్రాహ్మణవిశ్వాసం కలిగేటట్టు చేస్తే లోకానికి మహోపకారంగా వుంటుంది.

సూర—అదీ చేస్తాను చూడండి. ఓ రెడ్డీ! నీశ్రేయస్సు కోరి చెపుతూ వున్నాను. బ్రాహ్మణ సేవ చేసుకోవడం మీా కులధర్మం. ఆపని మీాకు బ్రహ్మదేవుడు విధించినాడు. మీారు బ్రాహ్మణసేవ చేసుకుంచూ, వారియెంగిలి తించూ, వారు యిచ్చినచిరుగుబట్టలు కట్టుకుంచూ, బ్రతికితే మీాకు యెంతో పుణ్యము. నీవు శాస్త్రవిశ్వాసం గలవాడవు గనుక చెపుచూ వున్నాను. హిందూమతం యిప్పుడు నీకు పూర్ణంగా బోధపడిందా? కావలిస్తే ప్రమాణవచనాలుకూడా వుదాహరిస్తాను. మనుస్మృతి అష్టమాధ్యాయములో—

శ్లో॥ శూద్రస్తు కారయే ద్దాస్యం క్రీత మక్రీత మేవ వా।
దాస్యాయైవహిసృష్టోసౌ బ్రాహ్మణస్య స్వయంభువా॥౪౧౩॥

కొనబడినవాడయినా కాకపోయినా శూద్రుడు దాస్యము చేయవలెను అతఁడు బ్రాహ్మణుని దాస్యమునిమిత్తమే బ్రహ్మదేవుడిచేత సృజింపఁబడినాడు." దశమాధ్యాయములో—

శ్లో॥ ఉచ్ఛిష్ట మన్నం దాతవ్యం జీర్ణాని వసనాని చ।
పులాకాంశ్చైవధాన్యానాం జీర్ణాశ్చైవ పరిచ్ఛదాః॥౧౨౫॥

(శూద్రునకు) ఎంగిలియన్నమును, చినిగినబట్టలును, పొల్లుధాన్యమును, జీర్ణములయినదుప్పటులును ఇయ్యవలెను."

పాపి—(తనలో) ఇప్పుడు నాకు స్వమతం కొంత బోధపడినది. అయినాకానీ మొదట అన్నాను గనుక మతాభిమానం వున్నట్టు నేను యింకా సంస్కారం కావలె ననేవారితో పోట్లాడుతాను.

ధర్మ— శాస్త్రుర్లుగారూ! మీమాటలు కొంచెం చాలించి వక్కనిమమం నావుపన్యాసం సాగనిస్తారా?

అయ్య—మీ నాస్తికవాదం మేము వినము.

నర—మీ బౌద్ధమతం మా కక్కరలేదు.

పాపి — లేవిడి! మాకు హిందూమతం తప్ప మరి యేమీ అక్కరలేదు.

నర — ఈ పాపిరెడ్డికి యిప్పుడు బ్రాహ్మణులయందు భక్తి విశ్వాసాలు కుదిరినవి. ఇతను మాశిష్యుడు. ఇదంతా రామానుజుల వారి అనుగ్రహం. శ్రీమతే రామానుజాయనమః. బ్రాహ్మణులలో వైష్ణవులు మూడులోకాలినీ క్షణంలో పవిత్రం చెయ్యగలరు.

శ్లో॥ యే కంఠలగ్నతులసీనళినాక్షమాలాః।
యే బాహుమూలపరిచిహ్నితశంఖచక్రాః।
యే వా లలాటఫలకే లసదూర్ధ్వపుండ్రాః।
వైష్ణవా భువన మాశు పవిత్రయంతి॥

ఎవ్వరుకంఠమునందు తులసితావళములను తామరపూసలతావళములను ధరింతురో, యెవరు బాహుమూలములయందు శంఖచక్రాంకములను చేసికొందురో, యెవరులలాటములయందుపట్టెనామములను పెట్టుకొందురో,ఆవైష్ణవులు లోకమును నిమిషములో పవిత్రము చేయుదురు."

అయ్యా—చాలుచాలించు. ఇది కేవల తామసవచనము! కలలోనూ విష్ణునామము స్మరించకూడదు. విష్ణుదర్శనముచేయగూడదు.

శ్లో॥ విష్ణుదర్శనమాత్రేణ శివద్రోహః ప్రజాయతే।

శివద్రోహా న్నసందేహో నరకం యాతి దారుణమ్।

తస్మాచ్ఛ విష్ణునామాపి నవ్యక్తం కదాచన &c.,

విష్ణుదర్శనమాత్రమునసనే శివద్రోహము కలుగుచున్నది. శివద్రోహమువలన దారుణమయిన నరకమును పొందుచున్నాడు. కాబట్టి విష్ణునామము నొకప్పుడును చెప్పగూడదు. తులసికంటె బిల్వపత్రము శ్రేష్ఠమయినది.

శ్లో॥ సర్వకామప్రదంబిల్వం దారిద్రస్య ప్రణాశనం।

బిల్వపత్రా త్పరం నాస్తి యేన తుష్యతి శంకరః॥

మారేడు సమస్తాభీష్టముల నిచ్చును. దారిద్ర్యమును పోగొట్టును. దేని చేత శంకరుడు తుష్టినొందుచున్నాడో అటువంటి మారేడుపత్రికంటె శ్రేష్టమయిన దేదియు లేదు. కాబట్టి బ్రాహ్మణులలో శైవులే పరమ శ్రేష్ఠులు.

సూర—మీరిద్దరును శ్రేష్ఠులుకారు. మిమ్ము చూచిన బట్టలతో స్నానముచేయవలెను. "లింగిణం చక్రిణందృష్ట్వా సచేల స్నానమాచరేత్" అని వుండడంచేత లింగం కట్టుకున్నవాణ్ని చూచినా చక్రాంకితం అయినవాణ్ని చూచినా సచేలస్నానం చెయ్యవలెను. స్మార్తులు సర్వశ్రేష్ఠులుబ్రాహ్మణులలోకెస్మార్తులేకానితరులుకారు.

నర—(తనలో) ఇతణ్ని వదలిపెడితే శ్లోకాలు మహాచదువు తాడు. ఇతనితో మనం సభలో వాదం పెట్టుకోరాదు. (బిగ్గరగా) శాస్త్రుర్లుగారూ! మనం వచ్చినపని మరిచిపోయి వేరేవాదంలోకి దిగి నాము. హిందూమతం పునరుద్ధారణం చెయ్యడానికి మనమందరమూ యిక్కడకి వచ్చినాము. మనం ముందుగా ఆపని చెయ్యవలెను. మీారు యిప్పుడు చదివిన ధర్మశాస్త్రాలు యేవేదంలోవో చెప్పి ప్రతివాదుల నోరడచండి.

సూర—అవి వేదంలోవికావు. ధర్మశాస్త్రాలనగా స్మృతులు.

నర—అవునవును. నాకు తెలిసింది ధర్మశాస్త్రాలు శ్రీమద్భాగవతంలో భగవద్గీతలలో శ్రీకృష్ణులవారు ప్రహ్లాదుడికి సెలవిచ్చిన పాశురాలు.

అయ్య—కావుకావు. భాగవతంలోవుంటే అవి ప్రమాణం యెట్లా అవుతవి? ధర్మశాస్త్రాలన్నీ బసవపురాణంలో విభూతి మహత్వ ఘట్టములో పార్వతీ పరమేశ్వరులు ప్రమథగణాలకు సెలవిచ్చినారు.

సూర—శాస్త్రప్రశంస చాలును వూరుకోండి. కలిమహిమ చేతనూ మాలచదువుచేతనూ యిప్పుడు యిటువంటి కిరస్తానీమతాలూ కిరస్తానీబోధలూ ప్రబలుచూవున్నవి. ఈమాలబళ్లలోకి వెళ్లేవాళ్ళం దరినీ వెలివేసి వాళ్లకు పెద్దపెద్ద ప్రాయశ్చిత్తాలు పెట్టవలెను. దిక్కుమాలిన యింగ్లీషుమూలంగా యిటువంటి నాస్తికవుపన్యాసాలన్నీ వస్తూవున్నవి. ఒక్కళ్లకీ శాస్త్రవిశ్వాసం లేదు.

విశ్వ—మీాకుమాత్రం శాస్త్రవిశ్వాసం మహావున్నది. మీారెంత శాస్త్రప్రకారం నడుచుకుంటూవున్నారో మేమూ అదేప్రకారం నడుచుకుంటూవున్నాము. మాకు ప్రాయశ్చిత్తాలు కావలిస్తే మీాకూ కావలెను.

నర—ఈనాస్తికు డెవరయ్యా?

సూర—ఇతను ఇంగ్లీషుబళ్లో సంస్కృతం చదువుకున్నాడవ. పుస్తకాలుచూచి యీాయనకూడా రెండు ధర్మశాస్త్రపుముక్కలు నేర్చుకున్నాడు. ఈయనకు నేనే తగినవాణ్ని. ఇలారా? విశ్వనాధ శాస్త్రీ! మాకు యెందుకు ప్రాయశ్చిత్తం కావలెనో చెప్పు.

విశ్వ—మీా కెందుకు ప్రాయశ్చిత్తం కావలెనా? మొన్న మీా బంధువుల యింట్లో వకావిడె సాహేబును తీసుకొని లేచిపోయి కడుపుతూవుండి మళ్లీవస్తే మీారంతా డబ్బుపుచ్చుకొని ఆవిడెను మళ్ళీ కులంలో యెందుకుకలుపుకున్నారు?

సూర—అదా? దానిపూర్వోత్తరం నీకు తెలియదు. దానికి వేరే ధర్మశాస్త్రం వున్నది. ధర్మశాస్త్రంలేనిదే మేము యేపనీ చేయించము. దేవలస్మృతిలో—

"శ్లో॥ గృహీతా స్త్రీ బలా దేవ మ్లేచ్ఛై ర్గర్భీ కృతా యది।
గుర్వ్యా న శుద్ధి మిచ్ఛంతి త్రిరాత్రేణ విశుద్ధ్యతి॥ ౩౬॥

బలవంతముగా మ్లేచ్ఛులచేత తీసుకొనిపోబడి స్త్రీ గర్భవతిఅయినపక్షమున, అటువంటిస్త్రీలు శుద్ధిని కోరరు. ఆ స్త్రీ మూాడురాత్రిలలో శుద్ధురా లగుచున్నది." అని చెప్పబడివున్నది. ఆస్త్రీని తురకసాహేబు యెన్నిసారులు యింటిచుట్టూతిరిగి యెంతబలవంతపెట్టి వకరాత్రి దొంగతనంగా తీసుకువెళ్ళినాడో ఆసంగతి నీకేమయినా తెలుసునా? ధర్మశాస్త్రాన్నిబట్టి మూాడురాత్రిలు వుంచి మరీ మేము ప్రాయశ్చిత్తం లేకుండా కలుపుకున్నాము. ధర్మశాస్త్రరహస్యాలు తెలియకుండా ఇటువంటి తెలిసీ తెలియనిప్రశ్నలు యెప్పుడూ వెయ్యకు.

శ్లో॥ సువర్ణదానం గోదానం భూమిదానం గవాదికమ్।
విప్రేభ్యస్సంప్రయచ్ఛేత ప్రాయశ్చిత్తీ విశుద్ధ్యతి ॥౨౦॥

అనడంచేత బ్రాహ్మడికి దానాదులు చెయ్యకుండా ప్రాయశ్చిత్తము చేయించుకొన్నవాడికి శుద్ధిలేదుగనుక మేము పబ్బు పుచ్చుకొన్నాము.

విశ్వ—(తనలో)ఇటువంటివాళ్ళను ధర్మశాస్త్రాలలో యేమైనా అవకతవకప్రశ్నలు వెయ్యవలెను. అప్పుడు మనం అడిగేప్రశ్నలకూ వీళ్ళుచెప్పే వుత్తరాలికీ సరిపోతుంది. (బిగ్గరగా) ఈరోజున మేమందరమూ చూస్తూవుండగా మీరు బరెంకిపుడకతో మొఖం కడుక్కున్నారుగదా? హారీతస్మృతిలో—

॥శ్లో॥ కరంజం ఖాదిరంవాపి కదంబం కురవం తథా।
సప్తపర్ణ ప్రశిపర్ణి జంబు నింబ తథైవచ।
అపామార్గంచ బిల్వంచ అర్కం చౌదుంబరం తథా।
ఏతే ప్రశస్తాః కథితా దంతధావనకర్మణి॥

అని దంతధావనమునకు గానుగ, కదిర, కడిమి, గోరెంట, అరటి, నెల్లి, నేరేడు, వేప, ఉత్తరేణి, మారేడు, జిల్లేడు, అత్తి పుల్లలు ప్రశస్తము లని చెపుతూ వుండగా ధర్మశాస్త్రం మీరి బరెంకిపుడకతో నెందుకు పళ్లు తోముకున్నారు?

సూర—(తనలో) వీళ్లడిగేప్రశ్నలకల్లా చేసిందిలేదని అబద్ధాలాడితే సరిపోతుంది. నిజం చెప్పి వీళ్ళు వేసేప్రశ్నలకు నిలువలేము. (బిగ్గరగా) పయిధర్మశాస్త్రంలో పయిపుడకలు ప్రశస్తము లని చెప్పబడినవేకాని మరి యేవీ కూడ వని చెప్పకపోవడంచేత బరెంకిపుడకతో తోముకున్నాను.

విశ్వ—అలాగయితే యీవేళ నవమితిథిగదా ధర్మశాస్త్రంలో-

శ్లో॥ ప్రతిప త్పర్వషష్ఠీషు నవమ్యాం చైవ సత్తమాః।
దంతానాం కాష్ఠసంయోగా ద్దహం త్యాసప్తమం కులమ్॥

అని పాడ్యమినాడు, షష్ఠినాడు, నవమినాడు, పుడకతో దంతధావనము

చేసినట్టయితే ఏడవతరమువరకును కులమును దహించు నని చెప్పబడి వుండగా ఇంత పాపకార్యం యెందుకు చేసినారో చెప్పండి,

సూర — (తనలో) పుస్తకాలు అచ్చుపడడంచేత వీళ్లతో అసాధ్యంగా వున్నది. ఇదివరకు ఒప్పుకున్నాను గనుక యిప్పుడు లేదనడానికి వల్లకాదు. ఇంకో మోస్తరు అబద్ధం ఆడుచాను. (బిగ్గరగా) ఆదోషం పోవడానికి నేను పంచగవ్యం పుచ్చుకొని ప్రాయశ్చిత్తం చేయించుకొన్నాను.

విశ్వ—యెవరియింటికీ వెళ్లకుండా మీకు యీవేళ పంచగవ్యం యెట్లా దొరికింది?

సూర — మాయింట్లో తెల్లఆవును నీవు యెప్పుడూ చూడలేదా యేమిటి? అది నెల్లాళ్ళకిందనే వట్టిపోయినా పంచగవ్యానికి కావలసినవిమాత్రం యిస్తూ వున్నది.

విశ్వ— అలాగయితే మీప్రాయశ్చిత్తం అంతా వృథా అయిపోయింది.

శ్లో॥ గోమూత్రం తామ్రవర్ణాయా శ్శ్వేతాయా శ్చైవగోమయం।
పయః కాంచనవర్ణాయాః నీలికాయాం శ్చ గో ర్దధి।
ఘృతం వై కృష్ణవర్ణాయాః విభ క్తిర్వర్ణగోచరా।
ఉదకం సర్వవర్ణంతు తస్య వర్ణస్య గృహ్యాతే॥౫౧॥

అని దేవలస్మృతిలో యెర్రావుమూత్రమును, తెల్లావుగోమయమును, పచ్చఆవుపాలును, నీలిఆవుపెరుగును, నల్లఆవునెయ్యియు పంచగవ్యానికి విధించి వుండగా అన్నీ వక్క తెల్లఆవువాటితోనే చేస్తే మీకు ప్రాయశ్చిత్తసిద్ధి యేలాగు అయింది?

సూర—(తనలో) దీనికి యేమివుత్తరం చెప్పను? అదుగో యెవరో ముసలామె బక్కచిక్కి యేడుస్తూ కుంటుకుంటూ వస్తూ

వున్నది. ఈమిష పెట్టి దీనికి జవాబు చెప్పకుండా తప్పించుకుంటాను. (బిగ్గరగా) ఈ నాస్తికవాదాలమూలంగా దయాధర్మమూ అన్నీ చెడి పోతూవున్నవి. కాస్సేపు వూరుకో పాపం యేదో ఆపత్తు పొంది యేడుస్తూవున్నయీావిడ సంగతి విచారించి ఆపన్నివారణం చెయ్య వలెను. అమ్మా! నీవు యెవరు?

[పయివేషముతో జీర్ణహిందూమతకాంత ప్రవేశించు చున్నది.]

హిందూ—నాయనా! నేను మీతల్లిని మీరందరూచేరి నా బిడ్డలమని చెప్పి బూటకాలతో మీపొట్ట పోసుకుంటూ నాసంగతి చూడక నన్ను మాడ్చివేసి, సత్యశమాదులైననాఅవయవా లన్నిటినీ విరిచివేసి, మీలో మీశుష్కకలహాలతో నన్ను చంపివేస్తూ వున్నారు. మీ అనాదరణవల్లనూ దుర్నయంవల్లనూ శిథిలమయిననాఅవయవము లను బాగుచేసి నన్ను తిన్నగా నడిపించవలెనని యీధర్మరాజువంటివా రెవరైనా శాస్త్రప్రయత్నం చేస్తే పనిసాగకుండా అడ్డం వచ్చి శాస్త్రా లని మీరు ద్వేషంచేతనూ స్వప్రయోజనపరత్వముచేతనూ కల్పించిన శ్లోకాలనే విషంపూసినశస్త్రాలతో నాకు మరింతవేదన కలుగచేస్తూ వున్నారు. ఈసంగతి యెదుట బడి మీతో మొరపెట్టుకుంటే యే మయినాకార్యం వుంటుందేమో అనే అడియాశచేత మీరు మీలోపల నుంచి గెంటివేసినా పుత్రవాత్సల్యం విడువలేక మీకోసం యింత దూరం కుంటుకుంటూ నడిచివచ్చినాను. ఇందాకా మీరు నాస్తిక వాక్యాలని యెగతాళిచేసిన యీధర్మరాజువాక్యాలన్నీ నా నిజ మయినఅంగములు. మీరు చదివినవన్నీ నాఅవయవములు పెరుగ కుండా మీ రడ్డుపెట్టిన కొయ్యకాళ్లూ కొయ్యచేతులూ కాని నా నిజ మయినఅవయవాలు కావు.

ఈలోకముల్లో సత్యముతో సరియైనధర్మ మింకొకటి లేదన

యతఁడు చెప్పినది.

శ్లో॥ నాస్తి సత్యసమో ధర్మో న సత్యా ద్విద్యతే పరమ్।
న హి తీవ్రతరం కించి దనృతా దిహ విద్యతే॥

అను భారతాదిపర్వములోని వ్యాసవచనము. అహింస సత్యమిత్యాది వాక్యము

శ్లో॥ అహింసా సత్య మస్తేయం శౌచ మింద్రియనిగ్రహః।
ఏతత్సామాజికం ధర్మం చాతుర్వర్ణ్యేఽబ్రవీన్మనిః॥

మనుస్మృతిలో దశమాధ్యాయమునందుఁ జెప్పఁబడినది. ఇతఁడు బంధుఁడు మొదలుగాఁ గలవాక్యము.

శ్లో॥ అయంబంధు రయంన్నేతి గణనా క్షుద్రచేతసామ్।
ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్॥

యోగవాసిష్ఠములోనిది. కాయక్లేశ మాదిగాగల వాక్యము.

శ్లో॥ న కాయక్లేశ వైధుర్యం నతీర్థాయతనాశ్రయః।
కేవలం తన్మనోమాత్ర జయేనాసాద్యతే పదమ్॥

వసిష్ఠ—

నర—ఓఓఓ. (అని కేకలు వేయుచున్నాఁడు.)

అయ్య—కావుకేవు. (అని అఱచుచున్నాఁడు.)

సూర—తప్, తిప్, (అని చప్పటలు చఱచు చున్నాఁడు.)

హిందూ—ఓ బిడ్డలారా! నిష్కారణంగా అల్లరిచెయ్యకండి. మీరు బొమ్మలాటలు మరిగి టంగుటంగున గంటలువాయించుకుంటూ యెప్పుడూ బొమ్మలమీదనే ధ్యానంగా వుండడంచేత పెద్దదాన్ని నాబుద్ధివినక పోవడమే కాకుండా యెదుటవున్న పురాణపురుషుడయిన మీతండ్రినికూడా భక్తితో కన్నెత్తిచూడడమయినా మానివేసినారు. గడ్డాలూ మీసాలూ. నెరిసిన నాముసలిపిల్లలారా! బొమ్మలపెళ్ళి

కోసమూ గుజ్జనకూళ్లకోసమూ మీలో మీరు తగువులాడే మీకు వయస్సు ముదరడంచేత యిఖబుద్ధిరాకపోయినా, యింకా మీమార్గంలో ప్రవేశించకుండా పూగులాడుతూవున్న యీపసిబిడ్డలనైనా మీవెంటబెట్టుకుని తిరుగుతూ మాతృపితృభక్తిలేకుండా చెరపక వదిలి వెయ్యండి. చిరుతిండికోసమై తల్లి మెడలో పుస్తెలు తెంపుకొని పరుగెత్తే అల్లరిపిల్లవాళ్ళవలెనే మీరున్నూ కుర్రతనంచేత పూర్వంవ్యాసాదులయిన మీఅన్నలు నాకుపెట్టిన సత్యాది అలంకారముల నన్నిటినీన్నీ నాదేహం నొచ్చేటట్టు బలవంతంగా తెంపివేసి, నన్ను విరూపినిగా చేసి వాటికి కట్టివున్న తాళ్ళతోనూ తంకరలతోనూ ఆడుకుంటూ, బాలభోగాలు అనుభవిస్తూ, బ్రతికివున్నంతకాలమూ తల్లికి తిన్నగా అన్నమూ బట్టా పెట్టక చచ్చినతరువాత శ్రాద్ధాలపేరుచెప్పి పిండివంటలు చేసుకొనే బుద్ధిమంతులలాగే మీరు నాగతి చూడకుండా నా పేరుచెప్పుకొని వుత్సవాలూ భోగాలూచేసుకుని తింటూవున్నారు. మీ అజ్ఞానదశకు తోడుగా దురాచారభూతంకూడా మిమ్మలిని సోకివుండడంచేత, మీరు వొళ్ళు తెలియక వికారపుచేష్టలు చేస్తూవున్నారు. మీరు తత్త్వవిచారమంత్రంచేత కొంచెం తెలివితెచ్చుకొని మాతృపోషణం ధర్మమని తెలుసుకొని శల్యావశిష్టంగావున్న నన్ను కన్నెత్తి చూచి నాసత్యాది అవయవములను దృఢపరిస్తే నేనుతిరిగీబలపడి మీకు వుపచారంచేసి చిరకాలం మిమ్మలిని సుఖపెడుతాను. అందువల్ల మీకు కీర్తికూడా—

నర—ఈముసలిది మనతల్లిఅయితే గుజ్జనకూళ్ళు వండుకుని ఆడుకొమ్మని బొమ్మలను యివ్వకుండా చవిలేని విషప్రాయమైన సత్యాదిగుళికలను మింగమంటుందా? ఈముదిపిశాచంమాట వినక దీన్ని దూరంగా తరిమివెయ్యండి.

అయ్య—"స్త్రీబుద్ధిః ప్రళయంకరీ" అన్నారుగనుక దీనిబోధ వినబడకుండా చెవులు మూసుకోండి.

సూర—చదువునేర్చిన ఆడదానితోనూ వంటనేర్చిన మగవాడితోనూ వోపరాదుగనుక యీరాకాసిని కాళ్లూ చేతులూ విరుగకొట్టి మూల పడవెయ్యండి. ఇక్కడవుంటే యీముసలిభూతం మనను వదలదు. వేగిరం పారిపోదాము రండి.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

—:o:—

## యోగాభ్యాసము.

ప్రథమరంగము.

[యోగి, అపయోగి, మహాయోగి, అతియోగి, ప్రవేశించుచున్నారు.]

అపయోగి—స్వామీ! కన్నులుమూసికొని ఋషీశ్వరునివలె దివ్యచక్షుస్సుచేత మీరు మూడులోకాలమహాత్మ్యాలూ మహాచూస్తూ వున్నారు. మీశిష్యుణ్ణి అయిననాకు మీరు చూచినదానిలో లవలేశం కటాక్షించి నన్ను కృతార్థుణ్ణి చేస్తారా?

అతియోగి—ఓరీ! శిష్యా! నీవు యింకా యోగాభ్యాసంలో మొదటి అవస్థలోనే వున్నావు. నీవు యింకా జ్ఞానబోధకు అర్హుడవు కావు. నిజమయినలోకాలు యేడయివుండగా మూడులోకాలు అనుకునే మూఢుడికి నీకు యేమిజ్ఞానోపదేశం చెయ్యను? లోకాలు యేడని తెలుసుకోవడం యోగాభ్యాసానికల్లా మూలాధారము. అది తెలిస్తేనేకాని మనం యెత్తబోయే జన్మపరంపరను గురించికూడా తెలియదు.

అవ—స్వామీ! లోకాలసంగతి నాకు అనుగ్రహించి మీ శిష్య ప్రశిష్యుణ్ని అయిన నన్ను ధన్యుణ్ని చెయ్యండి.

అతి—మన పరిణామసిద్ధాంతానుసారముగా మనుష్యుడు నిర్వాణాన్ని పొందడానికి ముందుగా యేడులోకాలలో అవతరించవలెను. అందులో వకటి భూలోకము, యింకొకటి బుధలోకము, మరివకటి అంగారకలోకము. ఆపయివి నాలుగు సూక్ష్మాతి సూక్ష్మములయిన లోకాలు. అవి నీకు చెప్పినాకానీ యిప్పుడు తెలియవు.

అవ—తెలియనివి పోనిచ్చి తెలిసేవి అనుగ్రహించండి.

అతి—ఇప్పుడు యేడులోకాలను గురించి చెప్పినానుగదా? ఈయేడుసంఖ్య మహాప్రధానమయినది. శాస్త్రానికి మూలకారణము. నీవు బాగా జ్ఞాపకం వుంచుకోవలెను. ఏడులోకాలే, యేడుగ్రహాలు, ఏడులోకాలూ, ఏడుద్వీపాలూ, ఏడుసముద్రాలూ, ఏడువారాలూ, నీకు తెలిసినవేకదా? యీ సప్తసంఖ్యలోనే సృష్టిరహస్యమంతా గూఢంగా దాగివున్నది.

అవ—అలాగయితే గూఢార్థము నాకు విప్పి సెలవియ్యండి.

అతి—ఈయేడులోకాలలోను వొక్కొక్కలోకంలో యేడేసి జాతు లున్నవి. యేడేసిజాతులలోను వొక్కొక్కజాతిలో యేడేసి వుపజాతులు వున్నవి. అన్నీ వుపజాతులు యెన్నో తెలిసినవా?

అవ—తెలియలేదు.

యోగి — ప్రథమావస్థలో వున్నవాడవు నీకు యెట్లా బోధపడుతుంది? ద్వితీయావస్థలో వున్నాను గనుక నాకు నిమిషంలో బోధపడ్డది. యేడేళ్లు నలభయితొమ్మిదిజాతులు నలభయితొమ్మిదియేళ్లు మూడువందల నలభయిమూడు వుపజాతులు.

అతి — నీవు గ్రహించినావు. స్త్రీ లయినా పురుషు లయినా

మనుష్యజన్మం యెత్తినవా రందరూ యీమూడువందల నలభయిమూ డవస్థలనూ వొక్కొక్కరు రెండేసిసార్లు పొందవలెను.

యోగి—అలాగయితే ప్రతిమనుష్యుడూ యీయేడు లోకాల లోనూ ఆరువందల యెనభయిఆరు జన్మాలు యెత్తవలెను.

అతి—అంతేకాదు. యిందులో యింకా వకసూక్ష్మం వున్నది.

మహా — ఈసూక్ష్మం యోగాభ్యాసంలో తృతీయావస్థలో వున్న నాకు బోధపడవలెనుగాని యీయోగికికూడా బోధపడదు. ఆసూక్ష్మం సెలవియ్యండి.

అతి—లోకచక్రముయొక్క భ్రమణమునుబట్టి యీపరిణామము యేడు అవృత్తులు జరగగా ప్రతిమనుష్యుడికిన్ని నిర్వాణానికి వెళ్లడానికి ముందు ఆరువందల యెనభయిఆరు యేళ్లు నాలుగువేల యెనిమిదివందల రెండు జన్మాలు యెత్తవలెను.

యోగి—అబ్బో! చాలాజన్మాలు యెత్తవలెను.

అతి—నీవు యీజన్మాలకే యింత ఆశ్చర్యపడుతూ వున్నావు గాని జన్మజన్మానికి మధ్య వుండేకాలవ్యవధి వింటే మరీ ఆశ్చర్య పడుతావు.

యోగి—సెలవియ్యండి. నేను ఆశ్చర్యపరవశుణ్ని అవుతాను. యిదివరకు విన్నదానివల్లనే అవయోగికి ఆశ్చర్యమహాసముద్రంలో మునగడంచేత నోట మాట రాకుండావున్నది.

మహా—ఈహాశ్చర్య మంతా ప్రథమ ద్వితీయఅవస్థలో వున్న మీకుగాని చరమావస్థలు దాటి ఆరూఢుడనయి వున్న నాకు యేమి చెప్పినా ఆశ్చర్యం లేదు.

అతి—పని చేసినతరువాత విశ్రాంతికావలె నన్నమాట యీ లోకంలో మీకు ప్రతిదినమూ అనుభవములో వున్నదేకదా! వక్క

జన్మంలో కష్టపడ్డతరువాత మళ్ళీ జన్మం యెత్తడానికి మధ్య యెనిమిది వేలయేళ్ళు విశ్రాంతి కావలెను. పైనిచెప్పిన నాలుగువేల యెనిమిది వందలరెండు జన్మాలనూవిశ్రాంతికాలమయినయెనిమిదివేలచేత గుణిస్తే మధ్యజన్మాలలో జీవించేకాలంగాక నిర్వాణం పొందడానికిమూడు కోట్ల యెనభయినాలుగులక్షల పదహారువేల సంవత్సరాలుకావలెను.

మహా—మధ్యజన్మాలలో జీవించేకాలం యెంతో సెలవియ్యవలెను.

అతి—ఆకాలాన్ని గురించి మహాత్ములయితే స్పష్టంగా చెప్పలేదుగాని అంతా యేడుకోట్లసంవత్సరాలు కావలెనని చెప్పినట్టు జ్ఞాపకం.

యోగి—ఇటువంటి అద్భుతాలకు గ్రంథప్రమాణం వుంటేనే గాని నమ్మడానికి శక్యం కాదు.

అతి—మహాత్ములు చెప్పినదానికి ప్రమాణం యెందుకు? వారు ప్రమాణాతీతులు.

మహా—తెలివిమాలినప్రశ్నలు వెయ్యక వూరుకో. మహాత్ముల మాటలకంటెనూ వే రేమి ప్రమాణం కావలెను?

యోగి—అసలు యీసంగతులు చెప్పినమహాత్ములు యెవరు?

మహా—వారిదాకా యెందుకు? నీప్రశ్నకు వుత్తరం నేను చెప్పుతాను విను. వీరు దివ్యజ్ఞానంచేత కొత్తగా సృష్టింపబడినారు. వీ రందరూ అదివరకు మరుగుపడివుండి యిప్పుడు దివ్యజ్ఞానంచేత బయలపడ్డారు.

యోగి—ఈసంగతులు యేమహాత్ముడు చెప్పినాడు?

అతి — ఏమహాత్ముడా? కుంట్‌హూమీలాల్‌సింగుగారు చెప్పినారు.

యోగి—ఆయన చెప్పినందుకు నిదర్శనం యేమిటి?

అవ—గ్రంధనిదర్శనం లేనిదీ మేము నమ్మము.

అతి—నేను మీకు కావలసిన గ్రంధనిదర్శనంకూడా కనపరుస్తాను వోపిక చెయ్యి. ఈసత్యములన్నీ కూట్ హూమీగారు సెలవిచ్చినట్టు మెస్టరు సిన్నెట్టుదొరవారు హూణభాషలో రచియించిన గుప్తశాస్త్రములో వున్నవి.

మహా—గుప్తశాస్త్ర మంటే యీమందజ్ఞానులకు తెలియదు. అకల్టుసయిన్సు.

యోగి—కూట్ హూమీ యీ భరతఖండపుమహాత్ము డేనా?

మహా—అవును. ఆయన పంజాబుదేశస్థుడు. చిన్నతనంలో వక బంధువుడియొక్క సహాయంచేత యూరోపుఖండముకు వెళ్లి పశ్చిమవిద్య నేర్చుకునివచ్చి తరువాత ప్రాచ్యశాస్త్రాలలోకూడా మహాపండితుడయినాడు. అది టిబిటీయదేశపు పేరు. నీవు ప్రమాణం వుంటేనేకాని యేదీ నమ్మవు గనుక చెపుతాను విను. ఈరహస్యం సిన్నెట్టుదొరగారు తమ అకల్టుసైన్సులో ౧౫౭వ పేజీలో వ్రాసి వున్నాడు.

అతి—నేను యింతకంటెనూ ప్రబలప్రమాణం చూపుతాను చూడు. మేడమ్ బ్లావట్ స్కీదొరసానిగారు "ఐసిస్ అన్వీల్డు" అను తమ మహాగ్రంథముయొక్క రెండవవాల్యూము ౬౧౯వ పేజీలో కూట్ హూమీగారు కాశ్మీరదేశస్థుడని వ్రాసి వున్నారు. ఆమహాగ్రంథముయొక్క రెండవవాల్యూములోనే ౬౩౧వ పేజీలో అతడుకచ్ఛిదేశస్థుని కుమారు డయినట్టు వయిదొరసానిగారే తమ దివ్యజ్ఞానంచేత లిఖించియున్నారు.

యోగి—మీరు యిద్దరూ వకరు పంజాబుదేశస్థుడనీ వకరు కాశ్మీరదేశస్థుడనీ వేరేవేరేవిధంగా చెపుతూవున్నారే!

మహా—ఇలాగంటి పనికిమాలినప్రశ్నలు యెప్పుడూ అడుగ బోకు. "ఋషీణాం మతయ శ్చ భిన్నాః" అన్నాడు గనుక ఋషుల మతాలు వెయ్యివిధాలుగా వుంటవి. ఆ దేవరహస్యాలు దివ్యజ్ఞానం కలవారికేకాని మనవంటి నరమాత్రులకు తెలియవు. మనంకూడా అనేకఅవతారాలు యెత్తుతూ యోగాభ్యాసం చేస్తూవుంటే యేదో వకజన్మంలో యీరహస్యాలు గ్రహించేకాలం వస్తుంది.

యోగి—ఆలాగయితే నాకు యిప్పుడే యోగవిద్యోపదేశం చెయ్యండి. యోగంయొక్క నాలుగవస్థలలోనూ యేమేమి తెలుస్తవో సెలవియ్యండి.

అతి—యోగి ప్రథమదశలో యోగముయొక్క ప్రథమాంగము లను నేర్చుకొని యింద్రియములను వశపర్చుకోవడానికి కృషిచేస్తాడు. రెండవదశలో సంపూర్ణజ్ఞానమును పొందుతాడు. మూడవదశలో యింద్రియనిగ్రహం చేసి చతుర్వర్గములను భూతములను జయిస్తాడు. అప్పుడా యోగిని నిప్పు కాల్చలేదు; నీళ్ళు ముంచలేవు: మట్టి కప్పివెయ్య లేదు; విషవాయువు చంపలేదు. అప్పుడతడు మహాశక్తిసంపన్ను డయి పరిమితజ్ఞానదాయకములయినయింద్రియముల సహాయ మక్కర లేకుండానే దూరశ్రవణ దూరదర్శనాది శక్తులను పొంది సమస్త లోకములలోనూ జరిగేచర్యలు యిక్కడనుంచే చూడగలుగును; అనంతకోటిబ్రహ్మాండములలోనూ పుట్టేశబ్దాలన్నీ వినగలుగును; మహాసూక్ష్మరూపముతో భూమిలో మధ్యకు దూరగలుగును; అతి లఘువయి ధ్యానశక్తిచేత యీ దేహముతో లేచి వాయువులో తేలి ఆకాశగమనము చెయ్యగలుగును; భూమిలో నిలువెడులోతున పాతి పెట్టినా చావక సమాధిచేత యిష్టమున్నంతకాలము బ్రతికి స్వేచ్ఛ మరణమును పొందగలుగును; కాళ్ళు తడికాకుండా నీళ్ళమీద నడవ

గలుగును. పశ్చిమఖండశాస్త్రజ్ఞులగర్వ మంతా అణిగేలాగు యోగ మహిమచేత యిటువంటి అద్భుతాలను అపరిమితంగా చెయ్యగలుగును. నాలుగోదశలో కేవలం నిర్వాణమే వస్తుంది.

అవ — మాకు వీటి కన్నిటికీ హిందూశాస్త్రాలలోనుంచి ప్రమాణాలు కావలెను. మీరు మహానిర్వాణ మని బౌద్ధశాస్త్రాలు వుపయోగిస్తూ వున్నారు.

మహా—బౌద్ధులకూ హిందువులకూ భేదము లేదు. బుద్ధదేవుడే తరువాత శంకరాచార్యావతార మెత్తినాడు. ఈమహారహస్యమును మెస్టరు సిన్నెట్టుదొరవారు "ఈసాటరిక్ బుద్ధియిజమ్" అను తమ పవిత్రగ్రంథముయొక్క ౧౮౫వ పేజీలో విశదపరచి యున్నారు.

అవ — మాకు యీప్రమాణాలు బాగా తెలియడంలేదు. ఈసారి వచ్చేటప్పుడు ప్రమాణగ్రంథాలు తెలిసినపండితుణ్ణి వకణ్ణి వెంటబెట్టుకుని వస్తాను. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

ద్వితీయరంగము.

[యోగియు, అవయోగియు, వియోగియు ప్రవేశించుచున్నారు.]

వియో— ఏమయ్యా యోగిగారూ! మహాయోగిగారున్ను, అతియోగిగారున్ను యింకా రాలేదు.

యోగి—వారు కొంచెం ఆలస్యంగా దయచేస్తారు. అతియోగి గారు రాత్రి చలిమంట వేసుకుంటూవుంటే కొరకంచు కాలిమీద పడి అతియోగిగారికాలు కొంచెం కాలి బొబ్బయెక్కింది. కాలినచోట గొబ్బరినూనె రాతా మని సీసాకోసం యిట్టే గూట్లో చెయ్యిపెట్టే టప్పటికి మృత్యుదేవతలాగు యెక్కడనుంచివచ్చిందోకాని యెర్రతేలు వకటి మహాయోగిగారి నడింవేలు అంటకుట్టింది. ఆవిషం గుండెలలోకి

యెక్కి కిందా మీాదా నిలవక ఆయన బాధపడుతూవుంటే చన్నీళ్ళు పోస్తే విషం దిగుతుందని యెవరో చెప్పడంచేత మహాయోగిగారు తోడడానికి వెళ్ళి చీకట్లో తొందరచేత గుభిల్లున నూతిలో కూలి నాలుగుగుక్కలు నీళ్ళు తాగి వుక్కిరిబిక్కి రయినారు. అప్పుడు మే మంతా చేరి ఆయనను పయికితీసి వొళ్ళంతా కాచి నీళ్లు కక్కించి, మహాయోగిగారికి తేలుమంత్రంవేసి జాముసేపట్లో విషం దిగేటట్లు చేసినాము. ఇప్పటికీ ఆయనకు కుట్టినచోట మంట పోలేదు. ఈ యిబ్బందులు రావడంచేతగాని లేకపోతే వారు యీపాటికే సభకు విజయంచేసి వుందురు.

అవ—వారు యోగంయొక్క మూడునాలుగవస్థలు పొందినవా రంటిరే. వారికి నిప్పు కాలదుకాదా? విషం యెక్కదుకాదా? వారిని నీళ్లు ముంచవుకాదా? ఏడులోకాలసంగతిన్నీ చూడగలిగిన మహా యోగులకు వారికి గూట్లో తేలున్నూ దొడ్లోనుయ్యిన్నీ కనబడ్డవి కావేమి?

యోగి—వూరుకో. పెద్దలవిషయంలో యిటువంటిప్రశ్నలు వెయ్యరాదు. అపచారం వస్తుంది. వారప్పుడు యోగంపట్టి సమా ధిలోవుండకపోవడంచేత అవియేమీా కనబడ్డవికావు. అదుగో మహా యోగిగారున్ను అతియోగిగారున్ను దయచేస్తూవున్నారు.

[అతియోగిగారును, మహాయోగిగారును ప్రవేశించుచున్నారు.]

అతి—రాత్రి నూతులో పడడంచేత కాలు నొప్పియెత్తినా మీాకోసం కుంటుకుంటూ నడిచివచ్చినాను.

మహా—రాత్రి తేలుకుట్టినబాధ యింకా పోకపోయినా మీా కోసం మూలుగుకుంటూ నడిచివచ్చినాను.

యోగి—పరోపకారపారీణులుగనుక మీారు శ్రమకయినా వోర్చు

కొని లోకహితార్థం యింతదూరం విజయంచేసినారు.

అతి—మేము వేగిరం వెళ్లిపోవలెను. వేగిరంవేగిరం అడిగి మీసంశయాలన్నీ తీర్చుకోండి.

అవ—యోగంవల్ల మీరుచెప్పిన దూరదర్శన దూరశ్రవణాది శక్తులు యెప్పుడైనా యెవరికయినా కలిగినవా ?

అతి— మహాయోగులైన మనపూర్వపురుషులకందరికీ కలిగినవి. అలాకలిగిన జ్ఞానంచేతనే వారు పురాణాలు మొదలైన గ్రంథాలు చేసినారు.

అవ—ఇప్పటివారికి తెలియని సంగతులు వారికి యేమి తెలిసి వ్రాసినారో సెలవియ్యండి.

అతి—వొక్క టేమిటి? అన్నీ యిప్పటివారికి తెలియనిసంగతులే. కల్లుసముద్రాలు ఇప్పటివారి కెవరికి తెలుసును ? నేతిసముద్రాలుయిప్పటివారి కెవరికి తెలుసును ? పెరుగుసముద్రాలు ఇప్పటివారి కెవరికి తెలుసును? భూమిని పాము మోస్తూవున్నసంగతి యిప్పటివారి కెవరికితెలుసును? ఆపాముకు వెయ్యితలకాయ లున్నసంగతి యెవరికి తెలుసును? అగస్త్యుడు సముద్రం తాగివేసినమాట యెవరికి తెలుసును ? హిరాణ్యాక్షుడు భూమి చంకకింద పెట్టుకొని పారిపోయిన మాట యెవరికి తెలుసును ? మధుకైటభులమెదడుతో భూమినిచేసిన మాట యెవరికి తెలుసును? నదులకూ పర్వతాలకూ బిడ్డలుపుట్టిన మాట యెవరికి తెలుసును? కావలిస్తే ఇలాగంటివి గుక్కతిప్పకుండా లక్షసంగతులు యేకరువుపెట్టగలను. ఇప్పటివాళ్లకు తెలియనివి ఇవన్నీ మనపూర్వులకు యోగమహిమచేతనే తెలిసినవి.

అవ—యెక్కడనైనా యేళ్లకూ రాళ్లకూ బిడ్డలు పుడతవండీ?

అతి—తప్పకుండాపుడతవి. శుక్తిమతీనదికిన్నీ కోలాహలపర్వ

తానికిన్నీ గిరిక పుట్టలేదా?

వియోగి—పుట్టినది. యేటికిన్నీ గట్టుకున్నూ గిరిక పుట్టడం నేను ప్రత్యక్షంగా చూచినాను. నేను చూచిన గిరిక వెనుకటివలె కోలాహలపర్వతంవచ్చి శుక్తిమతీనదిమీాద పడితే నదికిపుట్టలేదుగాని నదే వచ్చి కొండమీాద పడేటప్పటికి కొండకేపుట్టినది.

అతి—చూచినావా? ఇంగ్లీషుశాస్త్రం చదువుకున్న మీావాడు కూడా ప్రత్యక్షనిదర్శనం కనబడడంచేత మన పూర్వులు చెప్పిన సత్యం వప్పుకుంటూవున్నాడు. మనపూర్వులు యెంతదివ్యజ్ఞానం కల వారో ఇప్పుడైనా బోధపడినదా? కాస్తభేదానికి ఫర్వాలేదు. గిరిక పర్వతానికి పుట్టినా నదికిపుట్టినా రెండూ వకటే.

అవ—నది ఆడదిగనుక పిల్ల పుట్టవచ్చునుగాని మగవాడైన పర్వతానికి యెలా పిల్ల పుడుతుంది?

మహా—పురాణాలలో మగవాళ్ళకుకూడా పిల్లలు పుడుతారు వేనుడికి పృథుచక్రవర్తిపుట్టినాడు. ప్రద్యుమ్నుడు కడుపుతో వుండి పురూరవశ్చక్రివర్తిని కన్నాడు. యౌవనాశ్వుడు గర్భము ధరించి మాంధాతను గన్నాడు.

అతి—వియోగిగారూ! మీారు ప్రత్యక్షంగా చూచిన గిరికా జననమహాత్యం చెప్పి యీఅపయోగిసంశయం పోగొట్టండి. ఇంగ్లీషు చదువుకొన్నవాడు చెపితేనేగాని యీఅవయోగికి నమ్మకంలేదు.

వియో—చెప్పుతాను వినండి. నేను వర్షాకాలంలో వక్కరోజు పాండవులవారి మెట్టమీాద కూర్చుండి వుండగా రాత్రికురిసిన వర్షం చేత పొంగి యేటేరు పరుగెత్తుకొనివచ్చి ఆకొండమీాద పడ్డది. ఆయే రున్నూ కొండానున్నూ కలియడంచేత నీళ్ళన్నీ కొండకలుగులలోకి పోయేటప్పటికి నేను చూస్తూవుండగా నాముందువున్న గుహాగర్భము

లోనుంచి గిరిక కిచకిచలాడుతూ పయికి వచ్చినది.

మహా—ఇది కలియుగంలో అత్యద్భుతమైన సంగతి. పురాణా లలో చెప్పిన పూర్వకాలమహిమలు మనదేశంలో ఇంకా పోలేదు.

అతి—ఆగిరికావృత్తాంతము సవిస్తరముగా చెప్పండి.

విరో—ఆగిరిక కిచకిచలాడుతూపాకి నాముందరికి వచ్చేటప్ప టికి కరుస్తుందేమోనని భయపడి నేను వెనుకకు జరిగినాను. ఇంతలో గిరిక చటుక్కున మరివకకన్నంలోదూరి మాయమైపోయింది.

అవ—గిరికఅంటే యేమిటి?

విరో—నీవు నిఘంటువు యేమీ చదవలేదా? గిరిక అంటే చిట్టెలుక. ఇప్పుడు తెలిసిందా?

అవ—సరిసరి! ఇప్పుడు తెలిసినది. మీరుచెప్పినదంతా నీళ్ళు కొండకలుగులో దూరేటప్పటికి కన్నంలోనుంచి యెలుక పయికి వచ్చిందనా?

విరో—మరియేమనుకున్నావు?

మహా—ఈయన మనను వేళాకోళం చేస్తూవున్నాడు. మనం యీాయనతో మాట్లాడగూడదు.

విరో—మీరు నాతో మాట్లాడినాసరే మాట్లాడకపోయినా సరే. నాకు యేమీ లోపం లేదు. మీరు మాట్లాడడంచేత నావంటికి బంగారం యేమీ అంటుకోలేదు. అంటుకుంటే వకవేళ మీాచాదస్తం కూడా నాకు కొంచెం అంటుకోవచ్చును. యోగుల మని మీరు యెన్ని వేషాలు వేసినా మీకోసం సృష్టిధర్మాలు యిప్పుడు కొత్తగా మారవు. ఏమహాయోగిని తీసుకొనివచ్చి లోతునీళ్ళలో పడవేసినా బుడుంగుమని లోపలికి మునిగి గుటుక్కుమంటాడుగాని యీాతరాక పోతే పైకి తేలడు. మీాలోవున్నమహాయోగిని యెవరినయినా నావ

ద్దకు తీసుకురండి. కర్రి మొర్రిగా కాల్చి వాతవేసి నిప్పు కాలుతుందో లేదో చూపిస్తాను. ఏలోకంలో యేసంగతి తెలిసినా శ్రమచేసి దేశాలుతిరిగి శోధనచేస్తే తెలుస్తుందిగాని యింట్లో కూర్చుండి ముక్కుమూసుకుని యోగంపడితే తెలియదు. సత్యగ్రహణానికి వక్కపరిశోధన సాధనముగాని ఆకాశపంచాంగాలూ, దివ్యజ్ఞానాలూ, యోగనిష్ఠలూ సాధనాలుకావు. మీయోగంవల్లనూ, గాలిలోవ్రాసిన వ్రాతలవల్లనూ తెలిసేవి మీవిభూతిమహాత్మ్యాలూ రుద్రాక్షమహాత్మ్యాలూ తులసిమహిమలూ క్షేత్రమహిమలూ మొదలయిన పుక్కిటి పురాణాలుమాత్రమే. సత్యమయిన జ్ఞానము శోధనచెయ్యానికి లేశమూ మంత్రాలతో రాదు.

అతి—ఈయన నాస్తికవాదాలు చేస్తూవున్నాడు. యుక్తిరహితమయిన యీవాదాలు మనం వినరాదు. లేచిపోదాము రండి.

మహా—లేచిపోదాముగండి. ఈబౌద్ధులకు తర్కాలు యెన్ని వినిపించినా, ఆర్యమహాజనులలో శాస్త్రవిశ్వాసం పోదు.

(అందఱును పోవుచున్నారు.)

---

## బహిష్కారపత్రికలు.

---

[రామచంద్రశాస్త్రియు, గోపాలశాస్త్రియు ప్రవేశించుచున్నారు.]

గోపా—ఓరీ! రామచంద్రశాస్త్రీ! నిన్న నీవేమో మాశాస్త్రావధానులవద్ద మహాకూసినావట. నేను దగ్గిర వున్నట్టుంటే డొక్కబద్దలచేస్తును జాగ్రతగా మసులుకో.

రామ—మాటలు మిగుల రానియ్యకు. యీవూరికి నీవు శాస్త్రవేనా పభాపతివి మరియెవ్వరైనా వున్నారా?

గోపా—యెవకున్రుంటేయేమి ? నామట్టుకు నేనే సభాపతిని. నీకు శక్తివుంటే నీవుకూడా యేరుకోరాదా ? నాకు దొరికిపోయిందని యేడుస్తారేమి !

రామ—మన పెద్దలనాటినుంచీ వచ్చే ఆచారం విచారించవలెనా ? అక్కరలేదా ? గ్రామంలో యేమయినా దొరికితే సభాపతులు నలుగురూ పంచుకోవలెనా ? నీవుపక్కడవే కడతేర్చవలెనా ?

గోపా.—నామనసు, నాకు దొరికింది నేను పుచ్చుకుంటాను. నీకు దొరికినదాల్లో నాకూ యేమీభాగం యివ్వవద్దు. ఆచారం యేమిటి వెధవ ఆచారం. నీతమ్ముడికి యింగ్లీషు చెప్పిస్తూ వున్నావు కదా. యీఆచారం మీయింట యెప్పుడయినావున్నదా ? నీవు రహస్యంగా చుట్టలు కాలుస్తావుకదా. వైదీకంలో మీతండ్రి కాల్చేవాడా? ఆవేషాలు మాదగ్గిర పనికిరావు. డబ్బుదొబ్బడానికి మీకు యీవూళ్ళో సభాపత్యం యెవరుయిచ్చినారు ?

రామ—నీకుమాత్రం యెవరు యిచ్చినారు ?

గోపా—నాకు నాచేతులు యిచ్చినవి. నేను వివాహాలలో తోరణాలు తెంపిన్నీ, స్తంభాలు వూడపెరికిన్నీ, పెనుగులాడి చేతులు బత్తలుచేసి, డబ్బుపుచ్చుకునిన్నీ, పిడిగుద్దులు గుద్దిన్నీ, నా మగతనం చేత నేను సంపాదించినాను. నాకు యిందులో అయినా పాండిత్యం వున్నదికాని వెధవవు నీకదీలేదు. ఈపాండిత్యమూలేక చదువూలేక పోయినప్పుడు నీకీశాస్త్రీపేరు యెందుకురా ?

రామ—ఆట్టే పేలకు నలుగురూ ఛీఛీఅంటారు. నేనూ చిన్నప్పుడు రఘువంశం నాలుగుసర్గలు చదువుకున్నాను. శాస్తుర్లుకావడానికి అదిచాలదా ? చదువులేకపోయినా శాస్తుర్లన్న పేరయినా పెట్టుకోకపోతే వయివాళ్లు యెవరుగౌరవంచేస్తారు ? యెవరో సిద్ధమనా

ష్యులు వస్తూవున్నారు. మనం యిద్దరమూ ఘర్షణపడకూడదు. మనకు యీవూళ్ళో పెద్దప్రవణ వస్తూవున్నది. ఇది పాతికలూ యాభైలూ వచ్చేపద్దు. సభాపతులందరమూ యేకముకావలెను.

గోపా—ఆలాగేఅవుదాముకాని రాత్రి మీయింట్లో నీపెళ్ళాముకున్నూ నీకున్నూ మహాయుద్ధము జరుగుతూవున్నదే.

రామ—ఆముండమాట నాతో చెప్పకు. దానిపేరు చెపితే నావళ్ళు మండుకువస్తూవున్నది.

గోపా—ఆలా నీవంటినిండా సింహాచలంకొండమీది పంచధారలవలె మొఖంమీదనూ చేతులమీదనూ వీపుమీదనూ అయిదేసి యెఱ్ఱనీటిధారలు కనపడుతూవుండగా నీవళ్ళుమండకుండా యేలా వుంటుంది? రాత్రినీకు దంతక్షతాలూ నఖక్షతాలూ మహాకలిగినవి. జరిగినది ఘంటసేపయినా మీది భారతయుద్ధమును మించిపోయినది. మీరు కచాకచీనీ, నఖానఖీనీ దంతాదంతీనీ, ఘోరయుద్ధం చేసినారు. మీామతయుద్ధం అయినతరువాత చివరకు శిలాయుద్ధమూ వృక్షయుద్ధమూకూడా జరిగినట్టున్నదే! వృక్షయుద్ధముకాదు. చీపురుకట్టయుద్ధముకాదోలును. ఇంతసేపు యుద్ధముజరిగినా నీభార్యసింహనాదములూ జయధ్వనులూ వినబడుతూవచ్చినవికాని నీగొంతుక యెక్కడా వినబడదేమిరా! చివరకు నీభార్యకే విజయం కలిగినట్లున్నది. నీరోదనధ్వనిచూచి మేము ఆలాగు అనుకున్నాముకాని మాకు నిజం తెలియదు. చివరకు విజయం యెవరికి కలిగిందో చెపుదూ.

రామ—ఆపాడుముండమాట పోనిచ్చి మనకు దొరికేడబ్బుమాట మాటాడుదూ.

గోపా—ఓరి నీభార్య మహిషాసురమర్దనిని మించిపోయినదిరా! ఓరీ! మీయిద్దరికీ అర్ధరాత్రివేళ కలహం యెందుకు వచ్చింది? నీవు

మీా యింటియెదటి బోడిముండతో వెళుతావనేనా ?

రామ—అంతా తెలిసినతరువాత నన్నెందుకు బాధిస్తావు ? మన డబ్బుమాట మాటాడుదూ.

గోపా—నిరుడు దానికి కడుపువచ్చినప్పుడు నీవే కాదుటూ మందు యిచ్చినావు.

రామ—ఉస్సి. ఆమాటలు చాలించి మనకు వచ్చేడబ్బుమాట చూచుకుందూ.

గోపా—రామచంద్రగా ! డబ్బు యేమిటో చెప్పు. నాకు రాత్రికి ముండకూ చుట్టలకూ కావలెను. వారే నేను యిప్పుడు శాక్తేయంకూడా చేస్తూవున్నాను సుమా.

రామ—ఆసంగతి నీనోరు వాసనచూచినా నీపేలాపనచూచినా నీవు చెప్పకుండానే తెలిసింది. దానిలో యేమితప్పితం వున్నదికాని నిన్న రాత్రి మనవూళ్లో వక వెధవపెళ్ళి జరిగింది సుమా !

గోపా — ఏమి ? జరిగితే యేమి ? నీవు చేసేపనికంటే అదే మంచిది.

రామ—నీవు వక్కడవు యిలాగు అంటూవున్నావుకాని మన సభాపతులలో మరి యెవరూ ఇలాగు అనరు. ఇలాగు వెధవముండను పెండ్లి చేసుకొని కులానికి వెలియై నింద పడకపోతే మహారాజులాగు వొక వెధవముండను వుంచుకుని అది పసుచుతనంలో వున్నన్నాళ్ళు దానిదగ్గిర డబ్బు లాగుతూ సుఖంగా వుండరాదూ ?

గోపా—వకవేళ దానికి కడుపు వస్తేనో ?

రామ—వస్తే నేమి ? కడుపు దింపుకున్నా పోతుంది పిల్లనుకని చంపి పారవేసినా పోతుంది. ఈరెండుపనులలో యేది చేసినా కులం పోదు. వకవేళ తెలివితక్కువచేత యీా రెండుపనులూ జరగడానికి

వీలు లేకపోతే ఆవెధవముండ కులంలోనుంచి చెడిపోతుందికాని మన కేమీ అపాయము లేకుండా మనం నిర్భయంగా వుండవచ్చును. అంతగా కావలిస్తే మనకు మరివక వెధవముండ దొరుకుతుంది.

గోపా—రాత్రి నీపెళ్ళాంవల్ల నీకు తటస్థించినప్రాయశ్చిత్తం చూస్తే నావంటివాడు యెప్పుడూ వెధవముండపేరు తలపెట్టడు. వాళ్లు పెళ్లిచేసుకుంటే మన కెందుకు పోనిస్తూ.

రామ—ఆలా కాదు. యీ విధవముండలు అందరూ పెళ్ళి చేసుకుంటే నోములూ వ్రతాలూ చేసి మనకు డబ్బు యెవరు ఇస్తారు? మొన్న కడుపు దింపుకోవడానికి కాశీయాత్ర వెళ్ళిన కాంతమ్మ కాశీ సంతర్పణ చెయ్యబట్టేనా మన కందరకూ సంభావనలు దొరకడమే కాకుండా రెండువందలమంది బ్రాహ్మలకు పిసెబూరెలతో అన్నం దొరికింది? మొన్న తురకవాణ్ని తీసుకుని అవతలివీధిలో వుండి మళ్ళీ యింటికి వచ్చిన చేబియ్యంవారి సీతమ్మ సంతర్పణ చేసినట్టు లక్షవత్తుల నోము పట్టి వెయ్యిబ్రాహ్మణ్యానికి యీవూళ్ళో యేముగముండాకొడు కయినా యెప్పుడయినా చేసినాడా? వక్కనోములూ వ్రతాలే కాకుండా వెలివేస్తామని, స్వాములవారికి వ్రాసి బహిష్కారపత్రికలు తెప్పిస్తామనీ బెదిరించడంచేతకూడా యెంత లేదన్నా మనకు యేటా గ్రామం మీద తలావందరూపాలూ రాకుండా మానవు. మనకు జీవనానికి భంగంవచ్చేపనిలో నీవు అడ్డం చెప్పరాదు.

గోపా— మరి నన్ను యేమి చెయ్యమంటావు?

రామ—వివాహం జరుగుతూ వున్నప్పుడు ఆవీధినినడిచినవారినీ లోపలికి వెళ్ళి తొంగిచూచినవారినీ దూరంగా నిలుచుండి బాజాలు విన్నవారినీ అందరినీ నేను జాబితా వ్రాసినాను. మనం అందరమూ దస్కతులు చేసి కావలిస్తే వూళ్ళోవాళ్ళ పేర్లుకూడా వక పందుమునిఖి

వాంకరటింకరకూరాలతో మనమే అనుగున యెక్కించి స్వాములవారి దగ్గరకు పంపిస్తే అందరికీ ఆంతూపత్రికలు వస్తవి. అప్పుడు మనం వొక్కొక్కడిదగ్గిర ఫదేసీ ఇరవయ్యేసీ పుచ్చుకుని ప్రాయశ్చిత్తాలు చేయింతాము.

గోపా—నీ ఆలోచన బాగా వున్నది. నీవుకూడా అక్కడకు వెళ్ళినావే మరి నీమాటో?

రామ—నాకు అక్కరలేదు. నేను వూరికే జాబితా వ్రాయడానికి వెళ్ళినాను. అది కాకుండా మనకు యెవరయినా వకటీ రెండూ చేతులో పెడితే ఇతరసభాపతులకు తెలియకుండానే వాళ్ళపేర్లు జాబితాలోనుంచి తీసివేతాము.

గోపా—నీవు జాబితాలో వ్రాసినవారంతా ఆవీధిని వెళ్ళినవారేనా?

రామ—కొందరు ఆరాత్రి వెళ్ళినవారూ వుంటారు; కొందరు వెళ్ళనివారూ వుంటారు. నేను జాబితాలోమాత్రం డబ్బు దొరుకుతుందని తోచినవాళ్ళనే ఆలోచించి యెక్కించినాను. ఆరాత్రి కాకపోతే మానెను ఆజాబితాలో పడ్డవాళ్ళు యెప్పుడయినా ఆవీధిని వెళ్లేవుంటారు. అందుచేత మనకు అనృతదోషం లేదు. వకవేళ అది అబద్ధమయినా ఫర్వాలేదు. "ప్రాణవిత్తమానభంగమందు బొంకవచ్చు" నని శుక్రాచార్యులు చెప్పినాడు గనుక, మనకు విత్తభంగం వచ్చేటప్పుడు తప్పకుండా బొంకవచ్చును.

గోపా—నీవు చెప్పినసీతులూ సబబులూ యేడిసినట్టే వున్నవి కాని వచ్చేడబ్బులో నాకు సఖంభాగం ఇస్తారా లేదా? నాకు సఖం భాగం ఇచ్చి తక్కినసఖమూ మీరందరూ చేరి పంచుకోవలెను. అలాగయితేనే నేనిందులో దిగుతాను.

రామ—అంరరితోటిపాటు నీకు వకభాగం ఇస్తాముకాని నీకు ప్రత్యేకంగా సఖ మివ్వము. నీవు రాకపోతే నీవు లేకుండానే మేమే స్వాములవారికి వ్రాసి వెలిపత్రికలు తెప్పిస్తాము.

గోపా — యేడిసినారు. యేదీ నాకు తెలియకుండా యీ గ్రామంలో యెవరుమహాజరుపంపిస్తారో పంపించమను. వాళ్లొక్కళ్ళన్నే పట్టుకుని డొక్క బద్దలుచేయిస్తాను. నాదస్కతు లేకుండా ఆంకు పత్రిక పంపించడానికి ఆస్వాములవారుమాత్రం అంత గుడ్డివాడా? ఏదీ నాకు సఖంభాగం యివ్వమని యింకొకమాటు అను. నిన్న రాత్రి నీపెళ్ళాం కొట్టినది అబద్ధమూ ఇప్పుడు నేను కొట్టినది నిబద్ధీ చేస్తాను. ఏమీ నోరు మెదప వేమి?

రామ—నీకు సఖంభాగం యిస్తాము.

గోపా—భేషు నేను పెద్దసభాపతినా మఱివకటా? నాపేరు చెపితే తక్కినసభాపతుల కంఠంలకీ గర్భనిర్భేదం. వారే యీజాబితా అంతా నీవు రాత్రి యెక్కడ కూర్చుండి తయారు చేసినావురా?

రామ—రాత్రిసంగ తంతా నీవుచూచే మళ్ళీ నన్ను అడుగుతా వేమి?

గోపా—ఓహోహో తెలిసినది. నిన్నరాత్రి అంతా మీావిధవ భార్యాగారి యింటికాడ వుండి ఇంటికి పోకుండా వున్నందుకా నీభార్య నిన్ను కొట్టినది. రాత్రి ఘుంటసేపు నీవాళ్ళు రణభేరిలాగున మోగిందిరా.

రామ—మరి యెందుకూ కాదుకాని మొన్న యీసంగతి తెస్తే నాభార్య తానుకూడా విధవావివాహం చేసుకుంటా ననడంచేత ఈవివాహాలవాళ్లమీాద నాకు మరీ కోపం వచ్చింది. అందుచేతనే నేను యింతకష్టతో పనిచేస్తూ వున్నాను.

గోపా—వోరీ తెలియక అడుగుతానుగాని నీవు బ్రతికివుండగా

నీభార్య విధవావివాహం యెలాగు చేసుకుంటా నన్నదిరా నీవు బ్రతికి వున్నా చచ్చినవాడితోటే సమానంగా కట్టివేసిందా యేమిటి?

రామ—నాకు దైవం యిచ్చినఆయువు తిన్నగా వున్నదికాని నాభార్యాకు విసుగు వచ్చి మరికాస్తసేపు వూరుకోకపోయినట్టయితే దానికోరికే సిద్ధించును. నేను మళ్ళీ సభాపతినై హిందూధర్మాలు నిలవపెట్టడానికోసం గాబోలును భగవంతుడు నాకు ఆదశ పట్టకుండా చేసినాడు.

గోపా— అంతఃపత్రికలకోసం ప్రయత్నం చేస్తూవుంటే యీ మాటు నీభార్యా నిన్ను పశువునుగా పట్టి యజ్ఞం చేస్తుందేమో! నిన్నటిరాత్రి దెబ్బలకు తాళినా రేపటిదెబ్బలకు తాళలేవు. నీకిది అలవాటయిపోయి నీవళ్ళు కాయలుకాసి నీది వజ్రదేహం అయినది కాబోలును.

రామ — నాభార్యవిషయమయి భయపడవలసినపని లేదు. దాన్ని నేను సమాధానం చేసినాను. యీ వచ్చేసొమ్ము పెట్టి దానికి నగలు చేయించిపెడతానని చెప్పితే గ్రామంలో నాకు తెలియనిపేర్లు అదే చెప్పి వ్రాయించినది. దానికి అప్పుడప్పుడు కోపము వచ్చి చేసుకున్న మొగుణ్ని గనుక స్వతంత్రంగా రెండు కొట్టినాఅది నాయాజ్ఞ మీరదు సుమా.

గోపా — నేను చెప్పినట్టు వింటూవున్నంతకాలము నేనూ మీరను. నామాటకు యెదురుచెప్పితేమాత్రం మూతిపళ్లు వూడేలాగు తన్నుతాను. నాకు పని వున్నది. అవతల సంభావన మించిపోతుంది వెళ్ళవలెను. (అనివెళ్లిపోవుచున్నారు.)

# బాలభార్య వృద్ధభర్తృసంవాదము.

[సర్వశాస్త్రిలును, భార్యా సోమిదేవియు ప్రవేశించుచున్నారు.]

సర్వ—ఏమే నాకోసం వచ్చిన పెద్దమనిషిమీద పేడనీళ్ళు అలా చల్లినావు? నిన్ను యేమైనా అంటే బ్రహ్మరాక్షసిలాగు మీదపడుతావని అప్పు డేమీ అనక ఆయనను మంచిమాటలతో సమాధానం చేసి పంపివచ్చినాను.

సోమి—వాకట్లో పెద్దమనిషి వున్నమాట నాతో ముందు చెప్పి యేడవలేకపోయిందా? వాకట్లో మీరువక్కరే వున్నారనుకుని గోడచాటునుంచి చటుక్కున పోసినాను.

సర్వ—ఆఅభిషేకం నాకుమాత్రం చెయ్యవలెనా? పొద్దున్నే లేచి నీరుకావిధోవతి కట్టుకున్నాను. అదంతా పేన్నీళ్లతో డాగులు పడ్డది.

సోమి—చాలుచాలు అట్టేవాగక యీపాటికి వూరుకోండి. ఎప్పుడూ మీరు నన్ను ఆడిపోసుకోవడంతోటే సరిపోతుంది. నా చెల్లెలిని యిచ్చిన ముసలిబ్రహ్మయ్యకిచ్చి నన్ను వివాహంచేసినా నేను సుఖపడిపోదును. నాకంటె మూడేళ్ళుచిన్నది. అది అప్పుడే నాలుగేళ్ళ కిందటనే ముండామోసి సుఖంగా వున్నది. నన్ను మొట్టమొదట నా తండ్రి ఆయనకే యిస్తా నన్నాడు. యమకింకరుడులాగు నీవు మధ్య అడ్డంవచ్చి నూరురూపాయలు యెక్కువ యిస్తాననడంచేత నాతండ్రి ముండాకొడుకు నాగ్రహచారం కాలి నీకు కట్టిపెట్టినాడు. నీవుమాత్రం నామరిదిగారికంటె చిన్నవాడవా యేమిటి? అది మహారాజులాగు నెత్తి నిండా ముసుగువేసుకుని స్వేచ్ఛగా వుండగా నీకోత పడుతూవుండడానికి దిక్కుమాలినబ్రహ్మదేవుడు పునిస్త్రీతనం నానొసటనే వ్రాయవలెనా.

సర్వ—యేమి నన్ను చావమంచావషే!

సోమి—నేను మిమ్మలిని యెందుకుచావుమంచాను? యెల్లకాలమూ పెళ్ళాన్ని యేడిపిస్తూవుందురుకాని ముసలితొక్కులాగు వెయ్యేళ్లుబ్రితకండి. నేను ముండామొయ్యవలెననుకొన్నాను గాని మిమ్మలిని చావమనలేదు. ఆలా అనడానికి వైదీకప్పుయింటపుట్టి నేనంత అవివేకం గలదాన్నా?

సర్వ—నీవు వివేకంగలదానవే. నీవు ముండామొయ్యడంఅంటే నేను చావడంఅని అర్థమవునా కాదా?

సోమి—ఆమాట నేనెందుకంఛాను! నా కాఅర్థాలూ గిర్థాలూ తెలియవు. మీరు పండితులు. యేఅర్థంచేసుకున్నా మీరేచేసుకోండి. పెద్దబ్రాహ్మలు మీనోటిమాటయినా శీఘ్రంగా ఫలించవలెనుగాదా.

సర్వ—నాబరువు నీవేమి మోసుకున్నావు? నేనేమి నిన్ను ఆజ్ఞపెడుతానా? అదమాయిస్తానా? నీవు యేపోకిళ్ళపోయినా కళ్ళుపెట్టుకుని చూస్తూవుంచాను. కాస్తయెప్పుడయినా నోరు యెత్తితే రాకాసిలాగు మీదపడి కొడచావు. నీదెబ్బలచేతనే నాకు యెప్పుడో వచ్చేయోగం వున్నది.

సోమి—ఆదెబ్బలు వుండబట్టే కాస్తయినా చెప్పినట్టు వస్తూ వున్నారుకాని లేకపోతే బొత్తిగానే మీరిపోదురు. దెబ్బలమూలంగా చస్తూవున్నానంచారుకాని నిజానికి నాదెబ్బలమూలంగా వళ్ళుగట్టిపడి యింతకాలం బ్రితికినారు. ముసలితనంవచ్చి మతిపోయి ప్రతిదానికీ చిట్టుబుస్సుమంచూవుంటే యింటికి కావలసినది కొంచెం అదమాయించనక్కరలేదూ! యేమయినా వంటిమీద వక్కదెబ్బవేస్తే నన్ను నలుగురినోళ్ళల్లోనూ పెట్టి రవ్వపెడుతారుకాని నిజం చెప్పండి. ముసలిప్రాణం యెక్కడపోచుందోఅని అక్కడికీ నేను గట్టిగా కొట్టను.

చెయ్యి వంటిమీద పడడంతోటే పసిపిల్లవాడిలాగు యేడుస్తూవుంటే నేను యెక్కడ మొత్తుకోను. మీరు కళ్ళారా చూస్తూవున్నానంచారు గాని మీకు కళ్ళువుంటే పోకిళ్ళుపోచూవున్నానంచారా? ఇటువంటి మతిమాలిన మాటలు యెప్పుడూ అనకుండా నెత్తిమీద వక్కచరుపు చరుతునా?

సర్వ—అయ్యో!, అయ్యో! నీవు మహాదొడ్డయిల్లాలవు. నన్ను కొట్టకే కొట్టకే బతిమాలుకుంచాను.

సోమి — నేను యెంతదొడ్డయిల్లాలనయితేనేమి? లేనిపోనివాడు మొగుణ్ని కొట్టేదాన్ని అని నాకు పేరుతెచ్చినారు. మీమూలంగా నాదొడ్డతనమంతా బూడిదలోపోసిన పన్నీరయిపోయింది.

సర్వ—అను అను. యెన్నిఅంచావో అను. నీకు బిడ్డా పాపా లేదు గనుక కొట్టీ తిట్టీ నీబిడ్డలముచ్చటంతా నామీద తీర్చుకుంచూ వున్నావు. అంతేకాని పెద్దవాణ్ని ఆదరించి వేళకుమాత్రం పట్టెడన్నం పెట్టవు.

సోమి —యిదేనన్నుఅల్లరిపెట్టడం. బిడ్డాపాపా లేరని మహామెత్తిపోతుస్తూవుంచారు. అది యెవరితప్పితం? కాటికి కాళ్ళుచాచుకున్నవాణ్ని చేసుకుంటే బిడ్డలు పుట్టక యేమవుచారు? నావెనుక చచ్చిపోయిన నీమూడో పెళ్ళాంవలె తిరిగితే నెంతమంది బిడ్డలయినా నేనూకందును. అలాక నేదాన్నయికే నాకు వీడు బ్రతికివున్నా రని విచారం యెందుకు? దీపాలుపెడితే శవంలాగు మంచంమీద పడి నిద్ర పోచారు. తలుపు యివతల గొళ్ళెం పెట్టి నామనసు వచ్చినట్లే నేను తిరుగుదును.

సర్వ—ఇప్పుడుమాత్రం యెప్పుడయినా మంచముమీద ముచ్చటకయినా పడుకుంచూవున్నావా? ముసలిప్రాణ మని నడుము

నొచ్చినా కాళ్ళునొచ్చినా యెప్పుడయినా కాస్తనడుముమీద చెయ్యి వెయ్యడం వున్నదా? కాళ్లుపిసకడంవున్నదా?

సోమి—కాళ్ళుకాదు గొంతుక పిసుకవలెను. మీనొప్పులు యెన్నిచేతులువేసినా అలాగువుండేవే. అవి రెండుమోపుల కట్టెలతో గాని పోవు. దిక్కుమాలిన ముసలికంపు కొడుతూవుంటే మీగదిలో యెలాపడుకోను?

సర్వ—నీవు పడుకోకపోతే మానినావుకాని నన్నుమాత్రం తిట్టబోకు. నాముసలికంపు నీకూ వద్దు; నీపడుచుకంపు నాకూ వద్దు. జిహ్వకు యింపుగా వేళకుమాత్రం భోజనం పెడుదూ!

సోమి—ఆ పెడచాను. యీ ముసలిఅబ్బాయికి మూడువేళలా పిండివంటలుకూడా చేసి పెడచాను.

సర్వ—మనవాళ్ళయింట్లో యివాళ వాళ్ళఅబ్బాయికి పుట్టింటికలు తీయిస్తారట! నీవు చెయ్యకపోయినా రెండుబూరెలు వాళ్ల యింట్లోవయినా తెచ్చిపెడుదూ వోసే!

సోమి—వూరుకోండి మీమాటలుచూస్తేనాకు వళ్ళుమండుకు వస్తూవున్నది. వాళ్ళయింట్లోకాదు. మనయింట్లో నాకు పుట్టింటికలు తీయించేరోజున మీకు గారెలు వండించి పెడుతాను. తిందురుగాని లెండి. నావంటి నిర్భాగ్యురాలికి ఆమాత్రంభాగ్యంకూడానా? మీతో మొండివాదానికి కూర్చుంటే లోపల అన్నం చిమిడిపోతుంది పోవలెను.

(అని నిష్క్రమించుచున్నది.)

# హాస్యసంజీవని

## తృతీయ భాగము.

### కన్యాశుల్కము.

[కామావధానులును, రామశాస్త్రియు ప్రవేశించుచున్నారు.]

రామ—వొరే కామావధానులూ ! శంకరాచార్లు మనవూరి నుంచి వెళ్ళిపోయినాడుట్రా?

కామా—రాత్రి వెళ్లిపోయినాడు. ఇక మనం సంబంధాన్ని గురించి స్వేచ్ఛగా మాట్లాడుకోవచ్చును.

రామ—వుంటేమాత్రిం భయమేమిటి? నీకుగాని నాకు అలా గంటెభయాలూగియాలూ లేవు. యీవూళ్ళో యింతమందిదగ్గర స్వాము లవారు యిండ్లవంతు రూపాయలూ అర్థలూ పుచ్చుకున్నాడుగాని నావద్ద కొత్తకాసయినా పుచ్చుకోగలిగినాడా ?

కామా—నీవెక్కడ? వుద్దండపిండానవు. రెండుమాట్లుఖూనీలు చేసి తప్పించుకొని జయిలులోపడి యెవ్వరికీ వక్కడబ్బు యివ్వ కుండా వచ్చినావు. స్వాములవారికిమాత్రిం యిస్తావా ? నీవు జయిలు లోనుంచి వచ్చినతరువాత మనిషివి బాగావున్నావుసుమా.

రామ—మనుగుడుపు పెండ్లికొడుకువలె వున్నాను. ఇకనీవు పిల్లనియ్యడమే అవశిష్టము. జయిలులో పడితేపడ్డానుకాని వొంతా భత్తులవారియింట్లో కన్నంవేసిన బాపతు వక్కదమ్మిడీఅయినా యెవరికీ దక్కనియ్యలేదుసుమా. పోలీసువారు యెన్నివిధాల బాధపెట్టికొట్టినా దానిస్థలంచెప్పక సొమ్మంతా నేనే దక్కించుకొన్నాను.

కామా—నీవు యింటికరూపాయ యిచ్చినావుకావని యీమధ్య

స్వాములవారు యేమో నిన్ను వెలివేస్తారని చెప్పుకొన్నారు. అది యేమయింది ?

రామా—వెలీలేదు గిలీలేదు. వెలివెయ్యడానికి నాగరాజుగారికిమల్లే నేను బ్రాహ్మణీకానికి హానివచ్చేకార్యం యేమీచెయ్యలేదు. నన్ను డబ్బు గట్టిగా అడిగితే నేను యేసందులోనో పెట్టి చావగొడతానని తెలిసి స్వాములవారు నన్ను డబ్బు అడగడం మానివేసి నన్ను పిలిచి మంచిమాటలు చెప్పి భిక్షలయినప్పుడల్లా పిండివంటలతో తమపంక్తినే నాకు కూడా భోజనం పెట్టించినారు. నీవెలిమాట యేమయినది ?

కామా—నీకు లేనప్పుడు నాకుమాత్రం వెలియేమిటి ? యీ వూళ్లో వోర్వలేని లౌక్యపుముండాకొడుకుల కుట్రచేత కన్యావిక్రయం చేసినందులకు వెలి వేస్తానని బెదిరించినాడుగాని నేను భిక్షచేసి యిరవైరూపాయలు పాదపూజ సమర్పించడంతోనే అన్నీపోయినవి. పూర్వాశ్రమంలో అయిదేసివందలరూపాయలు పుచ్చుకొని యిద్దరు కూతుళ్లను అమ్ముకున్న ముండాకొడుకు స్వాములవారికిమాత్రం కష్టసుఖాలు తెలియవా ? నేను అయిదారుగురు పిల్లలను అమ్ముకుని శాస్త్రసొమ్ము చేసుకున్నానని వోర్వలేని గాడిదకొడుకులకు కన్నెర్రగా వున్నది. నేను కష్టపడి కనుక్కున్న నాపిల్లలను అమ్ముకున్నాను వూళ్ళోవాళ్ళపిల్లలను అమ్ముకోలేదుగదా ?

రామ—నిన్ను వెలివేస్తానన్నదియెందుకూ ? పిల్లలను అమ్మినందుకా ? నీకూతురోచిన్నదాన్ని రజస్వలఅయిందాకా పెళ్ళిచెయ్యకుండా వుంచినందుకా ?

కామా—పిల్లది రజస్వల అయిందో లేదో యెవరుచూచినారు ! నేను మూడునుట్లు యింట్లోకలుపుకుని పిల్లది రజస్వల కానే

లేదన్నాను. దానితో సరిపోయింది. ఇదివరకు తెలియక పిల్లదాన్ని చాలాకాలం వుంచితే డబ్బు యెక్కువవస్తుందని దాన్ని పత్భాలుగో యేడు వచ్చినదాకా వుంచినానుగాని యిఖ నెవ్వరినీ ఆలావుంచను. సమర్తాడినపిల్లను పెళ్ళిచెయ్యకుండా యింట్లోవుంచుకున్నావని స్వాములవారికి వ్రాస్తామని అడ్డమయిన గాడిదకొడుకులూ బెదరించడం మొదలుపెడితే వాళ్ళపోరు పడలేక మునుపు వకరు యిస్తామన్న సొమ్ముకన్న వందరూపాయలు తక్కువకే పిల్లను వకముసలిముండాకొడుకుకు కట్టిపెట్టినాను. ఆవకదానితోనూ నాకు బుద్ధివచ్చి యిప్పుడు యెనిమిదేళ్ళు దాటకమునుపే వచ్చినంతడబ్బు రాబట్టుకొని తక్కిన వాళ్ళకు పెళ్ళిళ్ళు చేస్తూవున్నాను.

రామ—ఈకబుర్లకేమిగాని సోమిని నాకివ్వడంమాట యేమి చేసినావు? దానికి నాలుగేళ్ళు వెళ్లవస్తూవున్నవి కాబోలును.

కామా—దాన్ని నీకుయివ్వడానికి వల్లపడదు. ఇదివరకే దాన్ని యీవూళ్ళో పూటకూళ్ళుపెట్టే రెండుచింతల వెంకయ్యగాడికి యివ్వడానికి నిశ్చయించి ఆరువందలరూపాయలు పుచ్చుకున్నాను.

రామ—అయితేయేమి? ఆ ఆరువందల రూపాయలూ నావద్ద పుచ్చుకొని పిల్లదాన్ని నాకే ఇయ్యి! నీకు యీసొమ్మూ ఆసొమ్మూ కూడా దక్కుతుంది. అంతగావస్తే వాడు సొమ్మేయివ్వలేదను. పెళ్ళికార్యంలో అబద్ధంఆడితే దోషంలేదు. యేభైయేళ్ళ గుడ్డివెధవకు వాడికేమిటి పెళ్ళియేమిటి? కావలిస్తే నన్ను సాక్ష్యంవేసుకో వాడుసొమ్ము యివ్వలేదని కోర్టులలో అప్రమాణాలుచేసి వెయ్యితప్పుసాక్ష్యాలు పలుకుతాను. యీవాంశంలో నాకువున్న పాండిత్యం నీకులేదు.

కామా—యీసారి అలా చెయ్యడానికి వల్లకాదు. వాడితో నాకు వేరేపని వున్నది. మొన్న పనికిమాలిన మగగాడిదకొడుకు

పుట్టినాడుకాని అదికూడా ఆడ దయినట్టయితే యీ ఆరువందల రూపాయలూ పుచ్చుకొని దాన్ని నీకు యిస్తును. నిష్కారణంగా ఆరువందలరూపాయలుసిద్ధాన్నం పడిపోయింది. యిఖముం దెప్పుడైనా మగపిల్లవాణ్ని కన్నట్టయితే డొక్క బద్దలచేస్తానని మా యింటి దానితో గట్టిగా చెప్పినాను. ఆభయంచేత యిఖ యెప్పుడూ మగ పిల్లవాణ్ని కనదన్న ధైర్యం నాకు వున్నది.

రామ—నాపని వట్టిదే చేసినావా!

కామా— యేమయినావుపాయంఆలోచిస్తాను వుండు. పూర్వం శిఖండిని ఆడదాన్ని మొగవాణ్ని చేసినట్టుగా యీమగవాణ్ని ఆడదాన్ని చేసేవారు యీకాలంలో యెవరైనావున్నారేమో చూడు. నాలుగువందలరూపాయలు నాచేతిలో పోస్తివా నీవన్నదానిలో రెండువందలు తగ్గించి యీమట్టుగా కిఫాయతుగా వీణ్ని నీకిచ్చి వేస్తాను. ఇది సరేనా?

రాము—నేనామాసిక లన్నీ పడలేను. మళ్ళీ ఆడపిల్ల పుట్టే యోగం యేమైనా వుంటే చెప్పు. మీపిల్లవాడికి రెండేళ్ళు వెళతవి కాదూ?

కామా — నాపెళ్ళాముముండ రెండేళ్లకు పక్కమాటుగాని పిల్లను కనకుండా వున్నది. యీటాయీటా పిల్లఅనుకనేపిల్లలను యిద్దరు ముగ్గురిని తెచ్చి నాకు వివాహం చేస్తూ. మొట్టమొదట పుట్టినపిల్లను యేమీ పుచ్చుకోకుండా నీకిచ్చి పెళ్లిచేస్తాను. ఇదే ఖరారు. అలా చెయ్యి.

రామ—యీమాటల కేమికాని నీపెళ్ళానికి యిప్పుడు నెల తప్పిందేమో చెప్పు.

కామా—రెండునెలలు వెళ్ళి మూడో నెల చొరబడ్డదని చెప్పు

కుంచుకొని వున్నారు. ఆకడుపులో వున్నపిల్లకు యేమి యిస్తావో చెప్పు. యిప్పుడే బేరము పరిష్కరించుకుందాము. ఆరువందలరూపాయలు యిస్తానని నీవు యిప్పుడన్నమాట తిరిగిపోకూడదు సుమా.

రామ — ఆరువందలరూపాయలు నేను పెద్దపిల్లకు యిస్తానన్నానుకాని కడుపులోవున్నదానికి యిస్తాననలేదు. దీనికయితే మూడువందలరూపాయలకంటె యెక్కువ యివ్వను.

కామా — సాహసం యెవరికయినా వుండవలెను. అలాగే వప్పుకుంటాను. మూడువందలరూపాయలూ తెచ్చి యీసాయంత్రంలోగా నాచేతిలో పొయ్యి. బజారులో వుప్పూ చింతపండూవలె దీనికి అరువు బేరము లేదు. రొక్కము గుమ్మరించవలెను.

రామ — తరువాత మగవాడు పుడితేనో?

కామా — మూడువందలరూపాయలు తక్కువ చేసినప్పుడు ఆలాభనష్టాలన్నీ నీవే. మగపిల్లవాడుపుట్టినా, కడుపుదిగబడిపోయినా పుట్టినబిడ్డ చచ్చినా, నాకు యిచ్చినదానిలోనుంచి నీకు చిల్లిగవ్వ మజరా రాదు.

రామ — అలాగయితే యింకొక వందరూపాయలు తగ్గించు.

కామా — ఇందులో బేరము లేదని మొదట చెప్పినాను. మళ్ళీ మాట్లాడితే వందరూపాయలు పెంచుతానుకాని తగ్గించను. బజారులో అమ్మేమాంసానికి సేరింతని నిర్ణయమయినఖరీదు వున్నదికాని దీని కటువంటివెల నిర్ణయము లేదు. అవసరముకొద్దీ వెల హెచ్చవుతుంది. అదుగో నాగరాజు యిలాగు వస్తూవున్నాడు. అతను యీమాటలు వినగూడదు. అతడు బాల్యవివాహాలు కన్యాశుల్కాలు కూడదని వాదిస్తూ వుంటాడు. అందుచేత అతనికి తగినప్రాయశ్చిత్తం చేయించవలెనని మనవాళ్లందరూ ఆలోచించి స్వాములవారితో చెపితే ఆయన

నాగరాజుగారికి తనకూతురిని పన్నెండేళ్ళు వచ్చినదాకా వివాహం చెయ్యకుండా అట్టేపుంచినందుకు అంతఃపత్రిక పంపిస్తానని చెప్పినారు. ఆచిన్నది యింకా రజస్వల కాలేదుగాని మనవాళ్లంతా రజస్వల అయిందని అల్లరి చేస్తూవున్నారు.

[నాగరాజుగారు ప్రవేశించుచున్నారు.]

నాగ—ఏమి కామావధానులు! ఏమో ఆలోచిస్తూ వున్నావు. యింకా కూతుళ్లను అమ్ముకోవడానికా యేమి?

కామా—అమ్ముకుంటే యేమి? నేను కష్టపడి కనుక్కున్న కుమార్తెలను నామనసు వచ్చినట్లు చేసుకుంటాను.

నాగ—అలాగే చేస్తూవున్నావు. అయిదువందలరూపాయలకు అమ్ముకున్న నీపెద్దకూతురు ముండామోసి మూల కూర్చుంది. రెండో కూతురి మొగుడు దానికి ముత్తాతలాగు వుండడంచేత అందరూ ఆలాగంటారని సిగ్గుపడి ఆముండాకొడుకును మూల కూర్చోపెట్టి స్వేచ్ఛగా తిరుగుతూ వున్నది. మూడోకూతురికి తినడానికి అన్నము లేక "అష్టదరిద్రమయ్యగారియిల్లూ, అంతకంటెనూ దరిద్రమత్తగారిల్లూ" అన్నట్టయినది. "అమ్మగారు గృహప్రవేశము, అయ్యగారు స్మశాన ప్రవేశమూ" అన్నట్టు నాలుగోకూతురు కాపురానికి వెళ్ళగానే మొగుడు స్వర్గానికి వెళ్లినాడు. అయిదోకూతురు జ్వరం వచ్చి చావడంచేత పెళ్ళామూ డబ్బూకూడా పోయిందని ముసలిముండాకొడుకు మంచంపట్టి యేడుస్తూ వున్నాడు. ఆరోకూతురికి మసూచకంలో కళ్లు పోవడంచేత వుపచారం చెయ్యలేనని మొగుడుముండాకొడుకు కాశీ లేచిపోయినాడు. రేపు యేడోకూతురుని అమ్ముకోవడానికి సిద్ధంగా వున్నావు. యీ కసాయివ్యాపారం యింకా యెంతకాలము చేస్తావు?

కామా—ఇది కసాయివ్యాపారమా? పిల్లను పెళ్ళిచెయ్యకుండా

అట్టేవుంచి నీకుమల్లే నేను బ్రాహ్మణ్యహాని వచ్చేపని యేమీ చెయ్యడం లేదు. "వర్ణానాం బ్రాహ్మణో గురుః" అన్న న్యాయంనేను నిలుపుతూ వున్నాను.

నాగ—నీదానికంటె కసాయివ్యాపారమే మంచిది. కసాయి వాడు మేకమాంస మమ్ముతాడు. నీవు నరమాంస మమ్ముతూ వున్నావు. వాడు జంతువుచచ్చినతరువాత మాంసముతీసి అమ్ముతాడు; నీవు మనిషి బ్రతికివుండగానే మాంస మమ్ముతూ వున్నావు. వాడు యెక్కడనో పుట్టినపశుమాంసము విక్రయిస్తాడు; నీవు కడుపునపుట్టిన శిశుమాంసము విక్రయిస్తూ వున్నావు. నీవ్యాపారముకంటె వాడిదే మంచిది. గుండు భీమిసెట్టి దివాలాతీసి నీ వన్యాయంగా సంపాదించిన సొమ్మంతా హరించి మంచిపని చేసినాడు? నీవు తినడానికి అన్నం లేక పాపం పండి పురుగులుపడి మరీ చస్తావు.

కామా—నీవు బ్రాహ్మణదూషణ చేస్తూ వున్నావు. నేను యిప్పుడు స్వాములవారివద్దకువెళ్ళి నీకు ఆంక్షపత్రిక తీసికొని రాకపోతే నేను బ్రాహ్మణ్ణి కాను. రారా రామశాస్త్రీ! వెళుదాము.

(అందరును నిష్క్రమించు చున్నారు.)

---

# వినాయకచతుర్థి.

రంగము—కొత్తపేటయిల్లు.

[దంభవ్రతుఁడు విఘ్నేశ్వరపూజ కారంభించుచుండఁగా, బిడాలవ్రతుఁడును బకవ్రతుఁడును ప్రవేశించుచున్నారు.]

బిడా—ఓరీ దంభవ్రతా ! రాత్రి ఝాముపొద్దయినా పోందే అప్పుడే పూజ కారంభించినా వేమిరా ? నీలాపనింద రాకుండా వుండడానికి అక్షింతలు. వేసుకున్నావా ?

దంభ—నీవు అక్షింతలు తెస్తావని యెంతసేపటికీ రాకపోతే యిప్పుడే పూజకు కూర్చున్నాను.

బిడా—నీకోసమే అక్షింతలు వేగిరం తెచ్చినాను. అక్షింతలు వేసుకోకుండా నీకు యింతలోనే పూజకు యేమితొందర వచ్చింది ? నీకు వినాయకుడిమీద మహాభక్తి యేడిసిందా యేమిటి ?

దంభ—ఈపూజ వుండ్రాళ్లమీద భక్తిచేతగాని వినాయకుడిమీద భక్తిచేత గాదు. మధ్యాహ్నం నాకోసం దాచినవుండ్రాళ్లు పెట్టుమంటే మాఅవ్వ విఘ్నేశ్వరపూజ చేసుకుని నైవేద్యం పెడితేనే కాని పెట్టనన్నది. అందుచేత పూజ అయితే వేగిరం తినవచ్చునని, అయిగో వుండ్రాళ్ళు పళ్లెంలో ముందుగా వినాయకుడిముందు పెట్టించి మరీ పూజకు కూర్చున్నాను.

బక—అదుగో నీభక్తికి మెచ్చి వినాయకుడివాహనం వినాయకుడికంటె ముందుగా ప్రత్యక్ష మయింది. గోడమూల చూడు. మూషకవాహనదర్శన మవుతూ వున్నది.



[అప్పుడు మూషకస్వామి ప్రవేశించుచున్నాఁడు.]

దంభ—(చూచి చేయి విసరికొట్టుచు) పోపో!—నీవు చూచి చెప్పబట్టిగాని లేకపోతే యీపాడుయెలుక యీపాటి నానోట గడ్డకొట్టి యీడ్చుకొనిపోయి వకకుడుం తనపొట్టను పెట్టుకునేదే?

బక—యెలక అనకు! విఘ్నేశ్వరుడి వాహనం అను. నీవు రోజూలాగు యివేళ యెలుకా గిలకా అన్నావంటే పాపం వస్తుంది సుమా. నీలాపనిందానివారణంలో "మోదకాదులొసంగ ముదితుఁడగుచుఁ దా గొన్ని భక్షించి తన వాహనమునకుఁ గొన్ని భక్ష్యము లిడి" అని విఘ్నేశ్వరుడుకూడా తన వాహనానికి వుండ్రాళ్ళు పెట్టినట్టు వుండడంచేత యీరోజు మనం అవశ్యంగా మూషకవాహనానికి కుడుములు పెట్టవలెను. మన ఆడవాళ్ళుకూడా మూషకవాహనం నిమిత్తం యింటిమీద వుండ్రాళ్ళు గిరవాటు వెయ్యడం నీవు చూడడం లేదా?

దంభ — పాడుపొస్తకంలే. అందులోనైనా వుండ్రాళ్ళు విఘ్నేశ్వరుడు పెట్టినట్టు వున్నదికాని యింటివాళ్ళు పెట్టినట్టుగా లేదు. అనేకకారణాలచేత నేను దీనికి కుడుములో కాస్తముక్కయినా పెట్టను. అందులో మొదటికారణం యీవున్న మూడువుండ్రాళ్లూ నాకే కావలెను. రెండోకారణం విఘ్నేశ్వరుడు రాకుండా అతణ్ని దోవలో నెక్కడనో పడవేసి తాను వొంటిగా రావడం. మూడోకారణం నేను

పెట్టినదాకా వుండకుండా తనంతట తానే దొంగతనంగా యెత్తుకు పోవడానికి ప్రయత్నం చెయ్యడం. కావలిస్తే మధ్యాహ్నం నైవేద్యం పెట్టినవాటిలో రెండుముక్కలు తన వాహానానికి విఘ్నేశ్వరుడే పెట్టు కుంటాడుగాని నేను పెట్టను.

బక—నీవు రీజన్సు మహాచెప్తూవున్నావు. ఆకస్నంవంక చూస్తూవున్నావా ?

దంభ—ఓసీ దీనిసిగకోయ్యా! ఆ ర్యాట్ మళ్ళీవస్తూందిరా. ఓరీ బిడాలవ్రతా! నీవు సంస్కృతక్లాసులో చదువుకుంటూవున్నావు గదా? నీవు విఘ్నేశ్వరపూజ బ్రీఫుగా చేయిస్తూ. లేకపోతే ర్యాట్ వచ్చి వుండ్రింముక్క తనమాత్తులో వేసుకుపోతుంది. కర్రతేగా ర్యాట్టును కొడదాము.

బిడా—నాన్సెన్సు! మడికట్టుకుని ర్యాటూ, క్లాసూ, బ్రీఫూ, షూ*, అని యింగ్లీషుమాట లనవచ్చునా?

దంభ—యిందాకా బకవ్రతుడు యెలుకంటే కోపపడ్డాడు. గనుక ర్యాటన్నాను. తెలుగుమాటలంటే మాఅవ్వ అర్థం తెలిసి కోపపడుతుందేమో అని బ్రీఫుగా అన్నాను. క్షమించి వేగిరం చేయి స్తూనీకు దక్షిణ యిస్తాను.

బక—మినిట్టులో చేయిస్తాను. దక్షిణ టూకాపర్సు. టూకా పన్సు యిచ్చినావంటే యీరాత్రి చుట్టలకు వేరే వెతుక్కోనక్కర లేదు. పూజ చేయిస్తాను పట్టు—

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.

పూజచెయ్యి—లంబోదరాయనమః ఉదరంపూజయామి. స్థూలకంఠా యనమః కంఠంపూజయామి. శూర్పకర్ణాయనమః కర్ణౌపూజయామి.

గజాననాయ దూర్వాయుగ్మం సమర్పయామి. లంబోదరాయ బదరీ పత్రిం సమర్పయామి. ఏకదంతాయ చూతపత్రిం సమర్పయామి.

దంభ—అర్థం తెలియకుండా పూజచేస్తే యేమిప్రయోజనంరా?

బక—నీకు తెలియకపోతే అర్థంకూడా చెపుతాను విను—పెద్దబొజ్జవాడికి నమస్కారమః పొట్టపూజ చేస్తూన్నాను. బానకడుపు వానికి రేగాకులు సమర్పిస్తున్నాను. ఒంటిపంటివానికి మామిడాకులు సమర్పిస్తూ—

(తెరలో—ఆగు, ఆగు, నీకు బుద్ధివచ్చేటట్టు చేస్తాను.)

బిడా—అడుగో నురోయి విఘ్నేశ్వరుడే వస్తూవున్నాడు.



[విఘ్నేశ్వరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విఘ్నే—నాది బానకడుపయితే మీాకేమి? వంటిపన్నయితే మీాకేమి? స్కూళ్లలో చదువుకోవడముచేత వాళ్ళుపొగరెక్కి యిలా అక్షేపిస్తారురా?

దంభ—స్వామీా! మీాకు పూజచేస్తూవున్నాము.

విఘ్నే—భక్తివుంటే నన్ను పొగడవలెనుగాని నాపొట్టకూ వంటికీ పూజయేమిరావీాకు? పనికిరాని గడ్డిపరకలూ, రేగాకులూ,

మామిడాకులూ యిస్తాననడం పూజటరా? యిదివరదాకా నేను ప్రత్యక్ష్యం కాకపోవడంచేత మీరు నేను లేనప్పుడు చాటున యేమి కూసినా సరిపోయింది గాని నా మొగంయెదుటకూడా యిలా దూషణ చేస్తూవుంటే నేను సహించి వూరుకుంటా ననుకున్నారురా?

దంభ — (తనలో) వున్నమాటంటే వులుకు వేసుకువస్తుంది. (బిగ్గరగా) స్వామీ! క్షమించవలెను. ఇకముందు మీరు యెలాగు పూజచెయ్యమంటే అలాగు పూజ చేస్తాము.

విఘ్న—భక్తితో అర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజచెయ్యవలెను. ఏదీ? నీభక్తి చూతాము. కైలాసాన్నుంచి నడిచివచ్చి అలసియున్నాము. ఆవుండ్రాళ్ళు ముందుగా ఆరగించి తరువాత సావకాశంగా నీకు పూజావిధానం వుపదేశం చేస్తాము. ఆవుండ్రాళ్లు నాముందుపెట్టి దణ్ణంపెట్టి దూరంగా నిలుచుండి భక్తి కనపర్చు.

దంభ—యిందులోవొక్కవుండ్రాయి పాయింపోతేయివ్వను. మాదేశంలో వున్నఆచారమంతా కుడుములు దేవ్రుడికి నైవేద్యము పెట్టి మేము తినడమేకాని దేవ్రుడు యెక్కడా తినడంలేదు. మాకు లేకుండా దేవ్రుళ్లేతినడం ఆరంభిస్తే వొక్కదేవుణ్ని యెవరైనా యింటికి రానిస్తారా?

విఘ్న—నాకు నైవేద్యం పెట్టినవి నాకు రావలెను. మీరు మంచిమాటలతో యివ్వకపోతే నేను బలవంతముగా పుచ్చుకుంటాను. దివ్యజ్ఞానుల వుపదేశంవల్ల మీకు నిజమయినభక్తి కుదిరిందంటే వచ్చి నానుగాని లేకపోతే నేను యీభూలోకానికి రాకనేపోదును. వొకరు లేదంటే వొకరినిచూచివకరు అందరూ లేదంటారు. కాబట్టి యిక్కడ నేను వుండ్రాళ్ళుతినకుండా వెళ్ళను.

దంభ—జాగ్రత్త! యిందులో వొక్కవుండ్రాయి ముట్టుకున్నా

వంటే దేవుడవూ గీవుడవూ అని చూడక యీాకర్రితో కాలు విరగేస్తాను. బకవర్రితా! బిడాలవర్రితా! మీారుకూడా సహాయం రండి. యెలా పుచ్చుకుంటాడో చూతాము.

విఘ్నే—మీారందరూ చేరి యింటికి పిలిచి దౌర్జన్యం చేసేటట్టు వున్నది. మా అన్నగారినికూడా పిల్చుకునివస్తాను. మేము యిద్దరమూ చేరి మిమ్మలిని యేమిచేస్తామో చూడండి.

(అని నిష్క్రమించుచున్నాడు.)

దంభ — వీడి కెవరో అన్నగారుకూడా వున్నాడటోయి! యెందరు వచ్చి నాలుక పెరుక్కున్నా మనం వక్కవుండ్రంముక్క యివ్వకూడదు. మనం ముగ్గురమూ యిప్పుడు యేకమై దెబ్బలాడ వలెను.

బిడా—మీా యింటికి వచ్చినవాడు మాయింటికి రాకమానడు. మాటలధోరణినిబట్టి చూస్తే అందరియిళ్ళకూ వెళ్లేటట్టే వున్నది. మాయింటికాడ నీవు వచ్చి సహాయం చేసేమాట వుంటే ఇప్పుడు మీా యింటికాడ మేమూ సహాయం చేస్తాము. అన్నగా రెవరురా?

బక—కుమారస్వామి కాబోలును! దంభవర్రితా! బిడాలవర్రితు డడిగినదానికి వుత్తరం చెప్పవేమి?

దంభ—తప్పకుండావచ్చి సహాయంచేస్తాను. మనంముగ్గురమూ మూాడుయిళ్లకాడా త్రిమూర్తులలాగు పోరాడవలెను. ఆమూాలకర్రలు చెరివకటి పుచ్చుకొని సిద్ధంగా వుండండి.

బిడా—అదుగో నెమలి నెక్కి యెవడో వస్తూా వున్నాడు.

దంభ—వాడే అన్నగారు. నేను యీావుండ్రాళ్ళను రక్షిస్తూా వుంటాను. మీారు వీరభటులవలె ఆవచ్చేయిద్దరితోనూ ద్వంద్వయుద్ధం చెయ్యండి.

[కుమారస్వామితో మరల విఘ్నేశ్వరుడు ప్రవేశించుచున్నాడు.]



కుమా——ఆవుండ్రాళ్ళు మాకు యిచ్చి మీరు దూరంగాపొండి.

బిడా——మీరు దగ్గరకు వచ్చినారంటే కర్రిలు పూవీపుమీద విరుగుతవి జాగ్రత్త!

కుమా——అన్నా! నీచేతులో వకకర్రవున్నా మనం నిరాయుధుల మై వచ్చినాము. దేవతలం మనం మనుష్యులతో యుద్ధంచేసి వోడిపోతే అవమానం. దూరప్రయాణం చేసి అలసివున్నమనం యీ తుద్బాధతో యుద్ధం చెయ్యలేము. యీ కపటవేషగాళ్ళను విడిచిపెట్టి నిజమయిన భక్తులవద్దకు వెళ్ళి కడుపునిండా కుడుములు తిని యిక్కడకు సమీపంగా వున్నపాతాళలోకానికి పోయి నాగులను వీళ్ళమీదికి ప్రేరేపింతాముర్రా.

విఘ్నే——మనం వట్టికడుపుతో కాలినడకను పోలేము. వాహనాలమీద వెళితే నామెలుకను నాగులు భక్షించడానికి చూస్తవి. నీ నెమలిని చూస్తే దాక్కుంటవి. వాటిని మనం కలుసుకోవడం యెలాగు?

కుమా——నేను వుపాయం చెపుతాను రా. ఇప్పుడు నారదుడు భూలోకానికి వచ్చినాడు. అతనితో మాట్లాడి శేషు లాలకించేటట్టుగా పాటపాడించి నాగకుమారులను ఆకర్షింతాము.

(అని యుద్ధమును నిష్క్రమించుచున్నారు.

దంభ—వీళ్ళపీడ వదిలిపోయింది. ఇక నేను వుండ్రంముక్కలు తినవచ్చునా?

బక—వ్రతకల్పం చెప్పనిదీ తినరాదు. వొక్కనిముషంవుండు. కల్పం మహాముక్తసరుగా చెప్తాను.—శ్లో. ఆసీత్పురా చంద్ర వంశే రాజా ధర్మ ఇతి శ్రుతః। స్వరాజ్యే దైవయోగేన జ్ఞాతిభిః కుటిలైర్హృతే॥ పూర్వకాలమునందు ధర్మరాజులవారు తనరాజ్యమును కుటిలులైనజ్ఞాతులు హరించగా సూతాశ్రమంలో వున్నమునులవద్దకు పోయి—

దంభ—ఏవ్రతం చేస్తే రాజ్యం మళ్ళీ వస్తుందని అడిగినాడు. త్వరగా వేగిరం కానీ.

బక—శ్లో. వ్రతం సంపత్కరంన్యాణాం సర్వసౌఖ్యప్రవర్ధనం। శృణుధ్వం పాండవా స్సర్వే వ్రతానా ముత్తమంవ్రతం. ఆసూతుల వారు పాండవుల నందరినీ వినుమని సంపత్కరమయినటువంటిన్నీ సౌఖ్యవృద్ధిప్రదమయినటువంటిన్నీ వ్రతా లన్నింటిలోనూ వుత్తమ మయినటువంటిన్నీ—

దంభ — వూరికే చాదస్తం చెయ్యకు. ఆవ్రతం చెయ్య మన్నాడు. అది చేసి ధర్మరాజు జయం పొందినాడు. అంతేనా, మరి యేమైనా వున్నదా? సంస్కృతంక్లాసులో చదువుకుంటూవుండడంచేత నీకు చాదస్తం అంతకంతకు బలిసిపోతూ వున్నది. మనం వూరికే వ్రతకల్పంతో కూర్చుంటే యీమధ్య యీవుండ్రంముక్కలు రెండూ మొలక యెత్తుకొనిపోతుంది.

బక—అయిపోయింది. తొందరపడబోకు. ఫలశ్రుతిమాత్రం చెప్పి ముగిస్తాను—శ్లో. ఏతద్వ్రతంహరిశ్చాపి దమయంతీ పురాకరోత్। కృష్ణోజాంబవతీమాదాచ్ఛమంతకమణింతథా। దమయంతీ నలంచైవ

ప్రీతస్యాస్య ప్రభావతః॥ శక్రేణపూజితః పూర్వం వృత్రాసుర వధే తధా! రామదేవేన తద్వచ్చ సీతాయా మార్గణేపురా ! భగీరథేనతద్వచ్చ గంగా మానయతా పురా॥ ఈవ్రతం పూర్వం కృష్ణమూర్తివారు చేసి జాంబవతిని శమంతకమణినీకూడా పొందినారు. దమయంతి చేసి నలమహారాజును పొందినది. వృత్రాసురుణ్ని చంపడానికి ముందు దేవేంద్రుడున్ను, సీతాదేవిని వెతకడానికి ముందు శ్రీరాములవారున్ను గంగను భూలోకానికి తేవడానికి ముందు భగీరథుడున్ను—

దంభ—అందరూ చేసినారు. చాలులేస్తూ.

బక—అలాగయితే వేగిరం తిను. మనంవెళ్ళి యిళ్ళమీద రాళ్లు వెయ్యవలెను. గుమ్మాలకాడ పల్లేరుకాయలూ, ఇళ్ళమీద రాళ్లూ వేసి ఇవాళ తిట్లు తింటే యెంతో పుణ్యం.

దంభ—ఓరే ? ఇందాకా అడగడం మరిచిపోయినాను. విఘ్నేశ్వరుడికి యేనుగుతలకాయ యెలావచ్చిందీ ?

బక—వొక్కవిధంగా వచ్చిందనుకున్నావా యేమిటి ? అనేక పురాణాలనుబట్టి అనేకవిధాలగా వచ్చింది. వొక్కపురాణాన్నిబట్టి పార్వతీదేవి అసలు నలుగుపిండిలో చేసేటప్పుడే యేనుగుతలకాయ చేసింది. ఇంకోపురాణాన్నిబట్టి దక్షాధ్వరధ్వంసంలో వీరభద్రుడు తల నరికితే యేనుగుతలకాయ అతికించినారు. మరోపురాణాన్నిబట్టి శివుడే తలనరికి తాను తెచ్చిన గజాసురుడితల అతికించినాడు. వేరేపురాణాన్నిబట్టి-

దంభ—ఇన్నివిధాలగా చెప్తూవుంటే యిందులో యేది నిజం ?

బక—దేని కదే నిజం. ఏదిచదువుతూవుంటే దాన్నేనమ్మవలెను. జ్యోతిషం దాఖలాచూడడానికి పార్వతీదేవి దినములతో

స్నానం చేస్తూవున్నప్పుడు లోపలికి వెళ్ళనియ్యకుండా వుండడంచేత శివుడు తలనరికినాడనీ, పార్వతీదేవి జ్యోతిషానికి శాపంపెట్టినదనీ జ్యోతిష్కులు చెప్పుతారు ; గజాసురుణ్ని చంపివచ్చినప్పుడు లోపలికి వెళ్ళనియ్యకపోతే తలనరికి పడుకోగూడదని వుత్తరతలాపిగా పరున్న యేనుగుతలనరికి తెచ్చి అతికించినారని శాకునికులు చెప్పుతారు.

దంభ—ఇవన్నీ సరేకాని చంద్రుడికి శాపం యెలావచ్చిందీ ?

బక—వకపురాణాన్నిబట్టి హ్రస్వరూపుడయిన తన్నుచూచి నవ్వితే విఘ్నేశ్వరుడే శాపంపెట్టినాడు. మరివకపురాణాన్నిబట్టి వినాయకుడు పొట్టనిండా కుడుములుతిని వెళుతూవుంటే చూచి నవ్వడంచేత రాజదృష్టితగిలి పొట్టబద్దలైతే పార్వతీదేవి శాపంపెట్టింది. ఇంకొకపురాణాన్నిబట్టి విఘ్నేశ్వరుడు కడుపునిండాతిని వచ్చి పార్వతీపరమేశ్వరులకు సాష్టాంగనమస్కారం చెయ్యబోతే బానపొట్ట భూమిమీద మోసి కాళ్ళూచేతులూ నేలకందకపోవడంచేత శివుని శిరస్సులోవున్న చంద్రుడునవ్వితే శాపం వచ్చింది.

దంభ—వొకదానికి వొకటి సందర్భించకుండా వుంటే యిటువంటిసంగతులన్నీ నీవు నమ్ముతావట్రా ?

బక—నమ్మేదేమిటి ? నమ్మినట్టు నటించవలెను. లోపల నమ్మకపోయినా పయికినమ్మినట్టు నటించి నమ్మమనేవాళ్ళను తిడుతూ లోకాచారప్రకారం నడుస్తూవుంటే జనులందరూ మనని దేశాభిమానంగలవాళ్ళమని పొగడి గౌరవంచేస్తారు. విఘ్నేశ్వరుడు హాస్యరసాధిపతిగనుక యిదంతా హాస్యంలాగు తమాషాగా వుంటుంది.

బిడా—అలాగయితే మనమందరమూ ప్రతియేటా విఘ్నేశ్వరపూజచేసి భోగంమేళాలతో వుత్సవాలు చేస్తూ దేశాభిమానులమని పేరుపొందుదాము. హాస్యరసాధిపతిని కొలవడంచేత వివేకుల

దృష్టిలో హాస్యపాత్రులం కాముగదా! హారే! నేను విఘ్నేశ్వరపూజ చేసినా నిరుడు నాపరీక్ష తప్పిపోయిందేమిరా ?

దంభ—నీది వొక్కడిదే పోయిందా యేమిటి ? నీక్లాసులో పరీక్షలో తప్పిపోయిన వాళ్లందరూమాత్రము విఘ్నేశ్వరపూజచెయ్య లేదాయేమిటి? బాగా చదివితే సరి యీసారి ప్యాసవుతావు.

బిడా—పండుగ సెలవులలో నల్లా యీ వుత్సవాలకోసం తిరగ డంతో సరిపోతూవుండడంచేత నాకు చదువుకోవడానికి తీరుబడీ లేకుం డా వున్నది. యీసంవత్సరమూ పరీక్ష పోయేటట్టే వున్నది.

బక—.యెవరయినా వినిపోతారు వూరుకో. అతని భోజనమ యింది వీధులోకి వెళ్లవలెను. నీకు నిరాపనింద రాకుండా యీఅక్షిం తలు నెత్తిమీద వేసుకో. భాగవతం దశమస్కంధంలో శ్రీకృష్ణుల వారు జాంబవంతునిదగ్గరనుంచి శమంతకమణి తీసుకుని సత్రాజిత్తు నకు యిచ్చిన కథపట్టు అయినదాకా వుండి మరీ యీఅక్షింతలు తీసు కొని వచ్చినాను. నీవు యిదివరకు చంద్రుణ్ని చూడలేదుగదా ?

బిడా—లేదు. శ్రీకృష్ణమూర్తికి చంద్రుడు పాలచెంబులోనా కనపడినది ?

దంభ—అవును. నాభోజనమయింది. వెళుదాము రండి.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

# అతి బాల్య వివాహము.

## ప్రథమాంకము.

౧. ప్రదేశము:—పంతయ్యపంతులుగారియిల్లు.

[పంతయ్యపంతులుగారును, సీతయ్య సిద్ధాంతిగారును కూరుచుండి మాటాడుకొనుచుండఁగా భుజంగరావుగారు ప్రవేశించుచున్నారు.]

పంత—భుజంగరావుగారు ! దయచెయ్యండి. (అని కొంచెము లేచి తివాసీ చూపుచున్నాఁడు.)

భుజం—మీరు దయచెయ్యండి. నేను కూర్చుంటాను. స్నేహితులమూ దగ్గిర బంధువులమూ కూడా అయిన మనలోమనకు వచ్చినప్పుడల్లా యిటువంటి మర్యాద లేమిటండీ? (అని కూర్చున్నాఁడు.)

పంత — ఈ సిద్ధాంతిగారు బహు ఘట్టివారు సుమండీ. మీకొమార్తె వివాహానికి యీయనచేతనే ముహూర్తం పెట్టించవలెను.

భుజం—నాకొమార్తెవివాహాని కప్పుడే తొందరయేమి? యిక నాలుగేళ్లమీదటిమాట. అప్పుడు చూచుకొందాము.

పంత—మీరు ఆలాసెల విస్తారేమి? మీఅమ్మాయి మాపెద్ద కుఱ్ఱదానికంటె నాలుగేళ్ళు పెద్దః. మా అమ్మాయికి రేపు మాఘ బహుళంలో పెళ్ళి తలపెట్టినాము.

భుజం—నాలుగేళ్ళు వెళ్ళలేదు. మీచిన్నదానికప్పుడే వివాహమేమిటండీ?

పంత—అవును. పెళ్ళిపనులు చెయ్యడానికి వ్యవధానము లేదు గనుక మొదట యీమాఘమాసములో వివాహం చెయ్యతలచుకోనే లేదండి. సిద్ధాంతిగారు పయి సంవత్సరము చైత్ర వైశాఖ మాసములలో ముహూర్తాలు లేవంటూవున్నారు.—ఏమండి సిద్ధాంతిగారూ!

శేపు చైత్రమాసంలోగాని వైశాఖమాసంలోగాని పెళ్ళిముహూర్తా లున్నవండీ?

సీత—లేవండి. ఈమాఘబహుళ పంచమీ బుధవారమునా డుంచినదే దివ్యముహూర్తమండి.

భుజం—ఏమయ్యా మాయింటి యెదుట వున్న కోమటి కన్న య్యగారిలోపల చైత్రశుద్ధమందు మీరే వివాహముహూర్తం పెట్టి నారటే! చైత్రవైశాఖాలలో ముహూర్తాలు లేవంటారేమి?

సీత—(కొంచె మాలోచించి, ముహూర్తాల కేమండి? యేవో వొకమోస్తరు ముహూర్తాలు యెప్పుడూ వుంటవండి. చైత్రవైశా ఖాలలోవున్న ముహూర్తాలు తమవంటి గొప్పవారి యిళ్లల్లో పెట్ట దగ్గవికావు. అవెల్లాకోమటివాళ్ళకూ గొల్లవాళ్లకూ తగివుంటవి. రేపటి మాఘమాసములో పెట్టినది మహామంచిముహూర్తమండి. ఆలాగంటి ముహూర్తము మరినాలుగేళ్లదాకా రాదండి. కన్నయ్యసెట్టి పెళ్ళా నికి మాఘమాసంలో ప్రసవదినములు వస్తవంటేను కక్కూర్తిపక్షంలో చైత్రమాసముహూర్తం పెట్టినాను.

పంత—మన కటువంటి కక్కూర్తిపక్షం యెందుకు? మాఘ మాసంలోనే చేతాము. డబ్బుగలవాడికి రేపు పెళ్ళి తలపెట్టుకుంటే యీబస్తీలో సమస్తవస్తువులూ అదునుకు దొరుకుతవి. వక్కఅప్ప డాలూ వడియాలుమాత్రం పెట్టించుకోవలెను.

భుజం — చైత్రవైశాఖమాసాలలో ముహూర్తాలు వున్నా మీచిన్నదాని వివాహం అప్పుడు చెయ్యడంసమేతు నాకు యిష్టం లేదు. అధమపక్షం పిల్లదానికి పదిపన్నెండేళ్ళు వచ్చేవఱ కయినా అట్టేవుండవలెనని నా తాత్పర్యం.

పంత—మీయింగ్లీషు చదువుకున్నవారి కందరికీ యేమోకాని

యిటువంటి బుద్ధులే నండీ. స్కూలులో చదువుకునే పదేళ్ల పిల్లకాయ నవ్వుతూ యిటువంటిమాటలే చెప్పుతాడు. మీరు ముద్దూ ముచ్చట బాగా యెరగరు. చిన్నపిల్లలకు పెళ్ళిచేస్తే వుండేసొగసు పెద్దపిల్లలకు చేస్తేవుండదు. కొంచెము జ్ఞానం వచ్చినతరువాత పెళ్లికూతురు పల్లకీలో సిగ్గుచేత తలకాయ వంచుకుని కూర్చుంటే యేమిసొగసుగా వుందండీ? అజ్ఞానదశలో వివాహంచేస్తే యేమీ తెలియక ఖులాసాగా పెళ్లికొడుకూ పెళ్ళికూతురూ నవ్వుతూ పేలుతూ సిగ్గుయెరుగక ఆడుకుంటూవున్నట్టుంటే చూడడానికి బహుముచ్చటగావుంటుంది. చక్కగాచిన్నపిల్లనూ పిల్లవాడినీ పెళ్లిపల్లకీలోపెట్టి వూరేగిస్తే బొమ్మల పెళ్ళిలాగు బహుఅందంగా వుంటుంది.

భుజం—బొమ్మలపెళ్లివలె వివాహం వట్టివేడుకకార్యం గాదు.

దంపతులు—

పం:త—ఆహాహా! పెళ్ళి వేడుకకార్యం కాదంటూవున్నారే. యింకా యేముంది? మనము చేసేశుభకార్యములలో యింతకంటే వేడుకకార్యం యేమివుంటుందండీ?

భుజం—ముందుగా నేనవ్వేక నామాట కడతేరా విని మరీ నవ్వండి. వేడుకకార్యం కాదంటే కేవలంతమాషాకోసంచేసేదికాదని నాఅభిప్రాయం. పెళ్ళివుద్దేశ్యం వధూవరులు యావజ్జీవం సుఖపడడానికిగాని బాజాభజంత్రీలుచూచి మనం సంతోషించడానికే కాదు. కాబట్టి కార్యగౌరవమునుబట్టి సంగతి బాగాఆలోచించవలెను. నే నేమో అమంగళవాక్యాలు పలుకుతూవున్నానని కోపపడవద్దు. నేను మీమాటకాదు లోకసామాన్యంమాట చెపుతాను. కీడెంచి మేలెంచమని సామెతవున్నది. గనుక, ముందుగా మనము చెడ్డనే చూచుకోవలెను. సాధారణంగా లోకంలో పిల్లలకు పదిపన్నెండేళ్లలోగానే

మారకం విస్తారంగా వుంటుంది. మనం యెంతచిన్నతనంలో వివాహం చేసినా వధూవరులకు యుక్తవయస్సువచ్చేవఱకూ యేలాగూ వాళ్ళు సుఖం అనుభవించడానికి వల్లలేదు. కాబట్టి పిల్లదానివివాహం అయిదేళ్లప్పుడుచేసినా పన్నెండేళ్లప్పుడుచేసినా ఫలానికి వకటేఅవుతుంది. మరీచిన్నతనంలో వివాహం చెయ్యడంచేతమాత్రం బహు నష్టాలు వున్నవి. అందులో పెళ్లికొమకు కేమైనా యిబ్బంది తటస్థించినయెడల చిన్నది యావజ్జీవమూ దుఃఖపడవలసివచ్చును. పిల్లదాని కేమైనా తటస్థించినయెడల భర్తకు సుఖం కలుగకపోవడమే కాకుండా మొట్టమొదట పెళ్లికైనసొమ్మంతా వ్యర్థమైపోతుంది. మనము నాలుగేళ్లుచూచి మరీవివాహంచేస్తే, మొట్టమొదట యిస్తామనుకొన్న వరుడు కాలంచేసినా చిన్నదాని కేమీ యిబ్బంది లేదు; వృథాకర్చున్ను కాదు. ఇస్తామన్నపిల్ల కాలంచేస్తే, పెళ్లికొమారుడివారికీఆలాగే వ్యర్థవ్యయమున్ను లేనిపోని దుఃఖమున్నుకూడా తప్పిపోతవి. మీకు దగ్గిరబంధువుణ్ని స్నేహితుణ్నికూడా గనుక, మీక్షేమమున్ను పిల్లదానిక్షేమమున్నుకూడా కోరి హితం చెప్తూవున్నాను. నామాటవిని పిల్లదానికి పదిసంవత్సరములు వచ్చినమీదట మరీవివాహం తలపెట్టండి.

పంత—అవును మీరుసెలవిచ్చినమాటలు బాగానేకనపడుతూ వున్నవి. కాని మాఘమాసంలో మాపిల్లవాడికుపనయనం తలపెట్టినాము. వాడికి యేడేళ్ళు వచ్చినవి. వడుగుయీడు దాటిపోయినది గనుక వేగిరం వుపనయనం చెయ్యక తప్పదు. కార్యంలోకార్యం చేసివేస్తే ఖర్చు తక్కువవుతుం దని నాయభిప్రాయము.

భుజం — యేవుపనయనంలో చేసినా డబ్బుఖర్చు తప్పదు. మహా కూడివస్తే యాభైరూపాయలు కూడివస్తవి; నూరురూపాయలు కూడివస్తవి. వేడుకకు విలువ లేదు. ఇంతడబ్బు ఖర్చు చేస్తేనేకాని

పెళ్ళి కాదని నియమం లేదు. పదిరూపాయలతో చేసినా పెళ్ళే అవుతుంది; పదివేలరూపాయలతో చేసినా పెళ్ళే అవుతుంది. పిల్లదానికి పదేళ్ళు వచ్చినప్పుడు మీరంత చేతిలో డబ్బు లేకపోతే స్వల్పంలోనే చెయ్యవచ్చును.

పంత — అదీ కాదండీ. మాతండ్రిగారు పెద్దలయినారు. మనమరాలి పెండ్లి కార్యం చూడవలెనని వారు బహుముచ్చట పడుతూ వున్నారు. వారు—

భుజం—ఆసంగతికూడా ఆలోచింతాము. మీతండ్రిగారు పెద్దలయినారు వారు చూడవలెననేకదా మీరు మీ పిల్లదానిపెళ్ళికి తొందరపడుతూ వున్నారు? కాటికి కాళ్ళు చాచుకొని మతిమాలివున్న వగ్గుతండ్రియొక్క వేడుక యెక్కువా? మీగర్భవాసాన్న పుట్టి యీ లోకంలో యావజ్జీవమూ సుఖపడవలసిన మూడేళ్ల పసికూనయొక్క సౌఖ్యం యెక్కువా? పిల్లదానిసుఖము విచారించకుండా తన వేడుక కోసం మనమరాలిని పెళ్ళిచెయ్యమనే యీముసలాయన తాను స్వర్గంలోకూర్చుండి తరువాత దైవికంగా పిల్లదానికి వైధవ్యంతటస్థించి పెద్దవాళ్ళ జీవానికి వుసూరుమంటూ యావజ్జీవమూ దుఃఖపడుతూవుంటే తానేమైనా వచ్చి అడ్డపడుతాడా? ఆయనకు బొమ్మలపెళ్లి శ్లంత వేడుకైతే నిజమయినబొమ్మలనే రెంటిని పల్లకీలోపెట్టి బాజాభజంత్రీలతో వూరేగించి ఆయనవేడుక తీర్చ—

పంత—పోనియ్యండి యీసంగతి మరివకప్పుడు సావకాశంగా మాట్లాడుదాము. లోపల యెందుకో పిలుస్తూ వున్నారు. వెళ్లవలెను.

(అని లేవఁగా నందఱును లేచి వెళ్ళుచున్నారు.)

---

# మ్యునిసిపల్ నాటకము.

## ప్రథమాంకము.

—:o:—

౧. ప్రథమరంగము—బుచ్చయ్యపంతులుగారి చావడి.

[కమీషనరులు బుచ్చయ్యపంతులుగారును, గున్నయ్యనాయుడుగారును, సోమిసెట్టిగారును, ఖాదర్‌సాహేబుగారును ప్రవేశించుచున్నారు.]

బుచ్చ—నాయుడుగారూ! ఇప్పుడు మన మునిసిపాలిటీస్థితి యేమీ బాగావున్నది కాదు. అంతా కొత్తకొత్తవాళ్లు అప్రయోజకులు కమీషనరుహోదాకు వచ్చినారు. వాళ్ళకు నాలుగుడబ్బులు యేరుకోవడమూ చేతకాదు; యేరుకునేవాళ్ళను చూస్తే వోర్వనూ లేరు.

గున్న—అవునయ్యా వీళ్ళమూలంగా మనవుద్యోగం వఖరంతా చచ్చిపోతూ వున్నది. అక్కడికీ మన ప్రయోజకత్వంచేత యెలాగో నెలకు నాలుగురాళ్ళు వాళ్ళు యెంతయేడుస్తున్నా మనవంటివాళ్ళం తంటాలుపడుతూ వున్నాముకాని పెద్దమనుష్యులుగా వుండేవాళ్ళకు చిల్లిగవ్వ దొరకడం లేదు.

సోమి—ఇది మహాఅన్యాయంగా వున్నది. మన మందరమూ చేరి యేదో వకవిధంగా ఆలోచించి యీకొత్తగా వచ్చినవాళ్ళను వదల్చుకుంటేనేకాని మన మర్యాద దక్కదు. పూర్వకాలంలో యెంత లేదన్నా అయిదారుగురు దీనివల్ల జీవనం చేస్తూవుండేవారు. కొద్దిగానో గొప్పగానో లాభంపొందని కమీషనరులు అప్పుడు వక్కరూ లేరు. నామట్టుకు నాకు యావరేజిమీద నెలకు ముప్పయిరూపాయలు కళ్ల పడేవి.

ఖా—భంచోత్! మీకీ యేమిదారికేదోకాని మాకీ పావలా

బేడాకంటె యెప్పుడూ యెక్కువా చేతులో పెట్టలేదు. అప్పుడూ మీారే అంతా దోచుకుదొబ్బేవారు.

బుచ్చ—సాహేబుగారూ! మనలోమనం దొమ్ములాడడం న్యాయంకాదు. మనం యెంతతిన్నా తిన్నవాళ్ళమే. మన మందరమూ యేకముగావుంటే అప్పుడు విస్తారం దొరకకపోయినాఇఖ దొరుకుతుంది.

ఖాద—ఛాంఛోత్! నేను యేమిా అన్నానయ్యా? నాకీ నెలకీ పదియూపాయలు ఇస్తానని దస్తావేజు వ్రాసియియ్యి నేను యెందులో దస్కత్ చెయ్యమంటే అందులో చేస్తాను.

బుచ్చ—సరిసరి! ఇందులో దస్తావేజులూ దస్కతుచెయ్యడమూ కూడానా? కాస్త కాగితంముక్క మన విరోధులచేతులో పడితే వాళ్ళు మనకొంప తీసివేస్తారు. వాళ్ళు యెప్పుడు సమయం దొరుకుతుందా అని చూస్తూవున్నారు. వాళ్లు యెన్నివిధాల తంటాలుపడినా మన ప్రయోజకత్వంచేత మనము దొరకకుండా వున్నాము.

సున్న—అవునవును. మీారు చెప్పినది బహుబాగా వున్నది. అన్నతరువాత లేదనవచ్చును గనుక మనం వెయ్యిమాటలు చెప్పవచ్చునుగాని కాగితంమిాద వక్కఅక్షరం యెక్కించరాదు. అది వాళ్ల చేతులో చిక్కింది అంటే తరువాత దస్తావేజు ఆయి గొంతుక పట్టుకుంటుంది.

ఖాద—సరిసరి లేవయ్యా! మీారందరూ యేకమయి డబ్బుదొబ్బడం మొదలుపెట్టి మానెత్తికి పేడరాయడానికీ యేపాల్ యేస్తూవున్నారు. దస్తావేజు లేకపోతే యెలా నమ్మకం కుదురుతుందయ్యా? కావలిస్తే దస్తూరీమాత్రం లేదనరాదూ! మిా దస్తూరీని నాకు దస్తావేజు వ్రాసి యివ్వండి; మిాకంతగా మాటవచ్చేమాట వుంటే యీాదస్తూరీ మిాది కాదని ప్రమాణంచేసి వాఙ్మూలం యిస్తానో లేదో చూస్తురు

గాని. మాటంటే ఖరార్ వక్క మోస్తరుగా వుండవలెను. యెందు కయ్యా నీకీ ఈభయం? మొన్న హేడ్డుగుమస్తాగారికి మాట వస్తుం దంటే మన మందరమూ ప్రత్యక్ష్యంగా యెరిగినదానిలో దస్తూరీ అతనిది కాదని వక్కతాకీని పలకలేదూ? అప్పుడు నిజం చెప్పినవాళ్ల మాటే అబద్ధమయిపోయిందా లేదా? ఇందులోనూ అంతే అవుతుంది వ్రాసి యివ్వండి.

బుచ్చ——మీకు వెయ్యిసలాములు పెడతాను. మీరు మాలోకి కలిసివచ్చినా సరే రాకపోయినా సరే. నేను కాగితంముక్క మీద మాత్రము వక్క అక్షరం వ్రాసి యివ్వను. కలిసివస్తే మీకే లాభం.

ఖాద——మీరు డబ్బు యిప్పిస్తామని యింతగా నాకే చెపుతూ వున్నారు. గనుక మీతో చేరుతూ వున్నాను. ఇప్పుడు యీ అరుగుల విషయంలో నాకీ యేమి యిస్తార్?

గున్న——ఇప్పుడు యీకొత్తవాళ్ళు అడ్డం రాకపోతే మనకు ఇందులో పాతికరూపాయలకు తక్కువలేకుండా వస్తవి. ఇందులో మన ప్రయోజకత్వం కనపరిచి మనపంతం నెగ్గించుకోవలెను.

ఖాద——వక్క దెబ్బను నెగ్గించుకుంటాము. సర్కారుస్థలము కలుపుకున్నారన్నా ఫదిగజాలవీధి వున్నప్పుడు అందులో నాలుగు గజాలస్థలము పోతే యెవరికీ యిబ్బంది లేదని వాదింతాము. యెందు కయ్యా అంత వెడల్పువీధి? అక్కడికీ వీధి ఆరుగజాల వెడల్పు వుంటుంది గదా? యేదీ మనవూళ్ళో నాలుగు గజాల వెడల్పుబండి వక్కటి చూపించు. వీధి సన్నమయితే బళ్లు వెళ్లడానికి వల్లకాదని చెప్పేవాళ్ల వాదం మొత్తుకున్నట్టే వున్నది.

బుచ్చ——ఆవీధులలో పరీక్ష చేసేవాళ్ళు వుంటే వరుసగా రెండు బళ్ళు నేను నడిపిస్తాను. నేను నడిపించలేకపోతే ఫదిరూపాయలు

గునహో యిస్తానుగాని నడిపిస్తే వీధివెడల్పు చాలదనేకమీాషనర్లు యెవ
రయినా నాకు రెండురూపాయలు యిస్తారేమో కనుక్కోండి. సాహేబు
గారూ! యిందులో మనమంతా పక్కాటాకీని పలుకవలెను సుమండీ!
యేమయ్యా మనవాళ్లు యేడుగురు వుండగా మనం నలుగురంమాత్రమే
ఇక్కడ కనుపడుతూ వున్నాము. వాళ్ళు రాలేదేమి?

సోమి—వాళ్లపూచీ నాది. వాళ్లను యెలాగు పలికించమంటే
అలాగు నేను పలికిస్తాను. వాళ్ళతో యేమి చెప్పమన్నారో చెప్పండి.
మనవిరోధులంతా యెప్పుడూ మీాటింగుకు రారు. మన మందరమూ
మీాటింగుకు వెళితే రేపు మెజారిటీ మనదే అవుతుంది.

గున్న—భేష్. అలాగయితే మనకు విజయం అయినట్టే.
పంతులుగారూ! వీధిఅరుగులవిషయమయి యాభయిరూపాయలకు
తక్కువ వల్లపడదని ఖండితంగా యీరాత్రే బేర మాడుకొని సొమ్ము
చేతులో పడవేయించుకోండి. రేపు మీాటింగులోనుంచి వచ్చేటప్పుడు
యీదారినే వచ్చి అందరమూ సొమ్ము పంచుకొందాము.

సోమి—అప్పుడే తొందరపడకండి. రేపు మీాటింగులోనుంచి
వచ్చి తరువాత అప్పుడు కార్యం అయిందనుకోవలెనుగాని అందాకా
కాదు. మునుపటికాలాలలో అయినట్టయితే మనవంటివాళ్లము మాట్లా
డుకోవడంతోటే కార్యమయినట్టే. ఇప్పుడు తీరా నెగ్గినదాకా సందే
హామే. మునుపటికాలంలో మేము యెందరికో వుపకారాలు చేసి
వాళ్ళనూ బాగుచేసినాము. మేమూ బాగుపడినాము. వెనుక మా
యిల్లు కట్టించుకున్నాము కదా పక్కాదమ్మిడీ అయినా మనచేతిది ఖర్చు
అయిందిటండీ? తలావక తాచుపామూ చంపినారని కూలివాళ్ళ కందరికీ
పావలా పావలా యిప్పిస్తే వాళ్లూ సంతోషపడేవారు మనకార్యమూ
అయ్యేది. మ్యునిసిపల్ సొమ్ములోనుండి పదిరూపాయలు ఇప్పిస్తే

యిందులో మొవడితాతసొమ్ము పడిపోయింది! వక్క వీధిని తూము కట్టించవలసివస్తే వెయ్యియిటుకలకు నాలుగువేలయిటుకలు లెఖ్ఖలో వేసి బజాకులో అమ్మేదానికంటె రెండురెట్లు మెక్కువఖరీదు పుచ్చుకొని తెల్లవాళ్లేటప్పటికి వక్కొక్కయింటిగోడలు లేవతీయించేవాణ్ని. మునుపు ఇటుకగోడ గజానికి మొనిమిదిరూపాయలు ధరవేస్తే ఇప్పుడు రెండురూపాయలకాడికి దిగింది. యేమీ లాభము లేదు. ఆకాలంలో ఇటుకలుకూడా చాలా చవక. దొరలు ధర్మాత్ములు గనుక వాళ్ళకు యీామాయలూ మర్మాలూ యేమీ తెలిసేవి కావు.

బుచ్చి—మీారు వెనుక దీపాలు పెట్టించేవారుగదా అందులో యేమాత్రం మిగిలేదండీ?

సోమి—అందులో దీపంవక్కంటికి ఫక్తు నాకు సూపాయ పైగా మిగిలేది. ఇదికాకుండా యెనమండుగురు నవుకర్లు యెప్పుడూ మనయింట్లో పని చేస్తూవుండేవారు. కమీాషనర్లకందరికీ దీపాలలోకి చమురు ఇందులనుంచే సప్లయిచేసేవాళ్లము.

గున్న—వెనుకటిమాట లెందుకుగాని మొన్న వాళ్ళస్థలానికి ఆవరణపుగోడసంగతి యేమైనది? అందులో మనకు యాభయిరూపాయలు దొరుకుతవా?

సోమి—అంతమట్టుకు దొరకవచ్చును. మనకు యేమైనా పెద్ద మొత్తాలు దొరికితే ఇటువంటివాటిలోనే. మనవూళ్ళో ఖాలీస్థలాలు చాలావున్నవి. మనకు యేమయినా షదిరూపాయలసొమ్ము చేతిలో పడితే వాళ్లచేత మాస్థలానికి గోడపెట్టించుకోవడానికి సెలవు ఇప్పించుమని పిటీషన్ పెట్టించి, దాని వెనుక పీఠీనిమేముమెరుగుదుము. అస్థలం వాడిదేగనుక సెలవు యివ్వవచ్చునని మనం వ్రాస్తే ఆప్రకారం జరుగుతుంది.

ఖాద—ఇప్పుడు తాటాకులఇళ్ళకు సెలవిచ్చినందుకు ఇంటి వక్కంటికి యెంతవస్తూవున్నదండీ? అందులో నాకు యేమీభాగం రావడంలేదు.

గున్న—తాటాకుఇళ్ళని పేరేకాని ఇంటివక్కంటికి పావలా కంటె యెవళ్లూ యెక్కువ ఇవ్వడంలేదు. మీరోడ్డుకంట్రాక్టులో యేమి దొరుకుతూవున్నదండీ?

బుచ్చి—ఇప్పుడు రేట్లు తక్కువైనవిగనుక కంట్రాక్టుదారులు నూటికి పదిరూపాయలకంటె యెక్కువ ఇవ్వడం లేదు. ఆపదిరూపాయలూకూడా దొరకకుండా యీకొత్తకమీషనరులు పనులన్నీ తను లోవారిచేతనే చేయించడానికి రిజొల్యూషనులు చేయిస్తూవున్నారు. యేమైనాఅంటే మన చేత పని కాదంటారు. అక్కడికీ మేనేజరు మన వాడుగనుక వాళ్ళు మీటింగులోకి రానప్పుడు వకటీ అరా రోడ్లమర మ్మతులు మనమీద పెడుతూవుంటాడు. అదుగో వెంకటారావు వస్తూ వున్నాడు. అతడు మన శతృపక్షంలోవాడుగనుక మనం యీసంగతి ఇప్పుడు మాట్లాడుకోకూడదు. రేపు మళ్ళీ ఇక్కడనే మీటవుదాము.

(అని వెళ్ళుచున్నారు.)

---

౨ ద్వితీయరంగము—మ్యునిసిపల్ సభ.

[వైసు ప్రెసిడెంటుగారును, మదనయ్యగారు, నాగభూషణరావుగారు, బుచ్చయ్య పంతులుగారు, గున్నయ్యనాయుడుగారు, సోమిసెట్టిగారు, ఖాదర్‌సాహేబు గారు మొదలయిన కమీషనరులును, ప్రవేశించుచున్నారు.]

బుచ్చ—మేనేజరుగారూ! కామిసెట్టివీధిఅరుగులఅర్జీముందుగా తియ్యండి.

మేనే—అదేపయినివున్నదికాని, దానిలో యింకా కొంచెం

తగాదాగావున్నది. పయిమీాటింగుకు నిలుపుచెయ్యవలెను.

మద — యీామీాటింగులోనే ఫరిష్కారం కానియ్యండి. ఆ యింట్లో వెనుక నేను కాపురం వుండేవాణ్ని. ఆసంగతి నాకు బాగా తెలుసును.

గున్న — ఆలాగైతే తియ్యండి. మేమందరముకూడా యెరుగుదుము. అందరూ యెరిగినవారు వున్నప్పుడే ఇది ఫరిష్కారం కావలెను.

మేనే—ఇందులో దస్తావేజులూ అవీ చూడవలెను. తొందర పడతారేమి వుండండి.

బుచ్చ—(సోమిసెట్టిగారితో రహస్యముగా) ఇందులో మేనేజరుగారిచేతిలో పడేది ఇంకాపడలేదు. అందుచేతనే యీాఅభ్యంతరం. అంతా ఆముండాకొడుకు ఇచ్చేది నిన్ననే యెందుకు ఇచ్చినాడుకాడు?

సోమి—(రహస్యముగా) వాడు నిన్ననే యిస్తానని సొమ్ము తీసుకునివెళ్లినాడుకాని జేరం సొసాయించిందికాదు. ఆయన ఫదిరూపాయలకు వప్పుకోలేదు.

మద—దస్తావేజులసంగతి నాకు తెలుసును తియ్యండి.

సోమి—నాకూ తెలుసును తియ్యండి.

నాగ—అందరు తెలుసునని చెపుతూవుంటే మీాకేమి అభ్యంతరం? కాగితాలు తియ్యండి.

మేనే—చిత్తము. తమకందరికీ అభ్యంతరం లేకపోతే ఆలాగే తీస్తాను. అవునోయి నీస్థలంయొక్క వెడల్పు యెంత?

కా—ఫదిగజాలండి.

బుచ్చ — నీకుబాగాజ్ఞాపకంవున్నదో లేదో జ్ఞాపకంలేదనిచెప్పు.

సోమి—ఏమోయి వూరుకుంటావు! దస్తావేజు చూచి మనవి చెయ్యవలెనని చెప్పు.

మద—నేను మొరుగుదును వెడల్పు ఫదిగజాలే. అతను కమీషనర్లవారిసెలవు పొందకుండానే వీధిలో స్థలం నాలుగుగజాలవరకూ ఆక్రమించుకొని అరుగులు పెట్టినాడు. అవి తీసివేయించవలెను.

కా—అయ్యా! నేను డివిజన్ కమీషనర్ల సెలవుప్రకారమే అరుగులు వేసుకున్నాను. వారు స్థలం హద్దుచూపించి ఇండార్సుమెంటు వెనుకనుంచి పంపిస్తాము వేసుకోవచ్చునని సెలవిచ్చినారు.

బుచ్చ—అవును మేము మొరుగుదుము గనుక గున్నయ్యనాయుడుగారూ నేనూ వెళ్ళి కఱ్ఱలు పాతించి హద్దు చూపించినాము. ఇతడు అరుగులు హద్దులోనే వేసుకున్నాడు గాని వక్కంచిఅయినా అవతలికి రానియ్యలేదు.

ఖాద— అవునయ్యా అది మేము మొరుగుదుము. అతడు యేమీ సర్కారుస్థలం ఆక్రమించుకోలేదు. రాజాగారి వీధి మేము మొరుగమటయ్యా?

మద—అది రాజాగారి వీధికాదండి నబాబుగారి వీధండోయి. మీరు యేదో మరోయింటిమాట అనుకుంటూవున్నారు.

ఖాద—అదేఅది. యేవీధయితేనేమి? మేము నబాబుగారి వీధీమొరుగుదుము. అన్నివీధులూ మొరుగుదుము. మేము తురకలమై వుండి నబాబువారివీధే మెరగమండీ?

సోమి—యేవీధయినా అతను స్థలం ఆక్రమించుకోలేదు. ఏమయ్యానాయుడుగారు మీరు మెరిగినవారు ఇందులో మాట్లాడక వూరుకుంటారేమి?

గున్న—నేను వెళ్ళి స్వయంగా చూచి ఫరిష్కరించినవాణ్ణే. నాఅభిప్రాయం మరివకలాగు వుంటుందా?

మద—ఆయింట్లో కాపురంవున్నవాణ్ణి నాకంటె మీకందరికీ

మహారెక్కువ తెలుసునా యేమిటి? అసలు ఆస్థలం మొట్టమొదట బచ్చువారికి అమ్మిందిఎవరు మేముకాదూ? ఆబచ్చువారిదగ్గిరనుంచి ఇతనుకొన్నాడు. రిజిష్టరీదస్తావేజు తెప్పించి చూచి యేదీఇప్పుడు వెడల్పు కొలిపించండి. నాలుగు గజాలు యెక్కు వున్నదో లేదో కనుపడుతుంది.

బుచ్చ—అప్పటిగజాలు బహుపెద్దవండి. ఆ ఫదిగజాలు యీ వర్ధాలుగుగజాలూ వకటేనండి. యేమోయి కామిసెట్టీ కాదుటోయి?

మద— ఏమండీ మీరు ఆలాగుసెలవిస్తారు? ఏదీ పెద్దమనిషి కామిసెట్టి కన్యకామ్మవారిమొగం చూచి ఆమాట అనుమనండి.

బుచ్చి—ఆలాగై తే ఆకొలతలో వీధిఅరుగులు పడలేదు. ఆ నాలుగుగజాలు వీధిఅరుగులకొలత.

మద—యేమిమాటయ్యా? మునుపాపక్కను అరుగులుండేవటయ్యా? అక్కడ గుమ్మమే లేదు.

సోమి—అరుగులుండేవికాని యీమధ్య రోడ్డు యెత్తుయెక్కువ కాడంచేత పూడిపోయినవి. మదనయ్యగారూ! మీరుయెవరూ పుట్టక మునుపటినుంచీ నేను ఆస్థలం యెరుగుదును. అక్కడ అరుగులు పూర్వము వుండేవి.

గున్న—అదుగో హదుగో యెరిగినవా రాయన అలాసెలవిస్తూ వుంటే మనమందరమూ వప్పుకొని వూరుకోవలెను.

నాగ—అసలుదస్తావేజులోవున్నదానికంటె నాలుగుగజాలు స్థలం యెక్కువ కనుపడుతూవుంటే యెలాగు వూరుకోము.

మద—వకవిషయంలో వూరుకుంటే అందరూకూడా వీధులన్నీ ఆక్రమించుకొంటారు.

బుచ్చి—(మదనయ్యగారితో రహస్యముగా) వాడు సత్కారు

వీధి ఆక్రమించుకున్నాడుగాని యెవరిస్థలమూ అక్రమంగా ఆక్రమిం చుకోలేదుగదా ? ఇందులో మీకు యేమినష్టం వున్నది ? బీదవాడు పెట్టుకున్న గోడా అరుగులూ తీసివెయ్యకుండా అనుగ్రహించి కాస్త తలవూపుదురూ మీకు బీదవాడికి వుపకారం చేసినపుణ్యం వస్తుంది.

ఖాద—ఇందులో సర్కారుస్థలం కాస్తకలుపుకుంటేమాత్రము యెవరికి యిబ్బంది వున్న దయ్యా? వీధి కావలసినంతా యెడల్పా వుండాది. అరుగుల్ వేసుకోలని ఆర్డర్ యేసీయెయ్యండి.

నైసు—(ఇంగ్లీషులో) కమీషనర్లు యేమిటంటూవున్నారు ?

నాగ—(ఇంగ్లీషులో) స్థలంకలుపుకున్నట్టు స్పష్టంగా కనప డుతూవున్నది. అరుగులు తీసివెయ్యవలసినదని వుత్తరువు చెయ్య వచ్చును.

మేనే—అరుగులు వారముదినములలోగా తీసివెయ్యవలసిన దనీ తీసివెయ్యకపోతే ప్రాసిక్యూషన్ చేస్తామనీధొరగారు రిజల్యూషన్ ప్యాసు చేసినారు.

ఖాద—ఇది కేవలం అన్యాయం. వాడినోట్లో మన్నువేస్తే మీకేమి వస్తుందయ్యా ?

బుచ్చి—కామిసెట్టీ ! మేము యేమిచెప్పినా కార్యం లేకపో యినది. నాలుగునెలలు వూరుకుని యీసంగతి వుదహరించకుండా మళ్ళీ పిటీషన్ యిచ్చుకో. యీకమీషనర్లు రానిసమయం చూచి అప్పుడు మేము నీపక్షంగా వుత్తరవుచేస్తాము. ఇంతమాత్రంచేత నీవు ఇప్పుడు అరుగులు తీసివెయ్యనక్కరలేదులే.

కామ—చిత్తము మహాప్రభో ! ఎలాగురక్షించినా యేలినవారు రక్షించవలెను. తమరు నాకు యీవుపకారం చేస్తే తమ వుత్తరవు ప్రకారం యేమిదాఖలుచేసుకోమంటే అది దాఖలు చేసుకుంటానండి.

బుచ్చ—అట్టే మాట్లాడక వెళ్లిపోవోయి. మేము దాఖలు చేసుకోమనకపోతే నీకు తెలియదూ! అప్పీలుపిటీషన్ దాఖలుచేసుకో పో పో.

నాగ—మేనేజరుగారూ! తరువాతసబ్జక్టు యేమిటో తియ్యండి.

మేనే—ఇందులో యేమీ లేదండి. పల్లపువీధిని వకడు తన స్థలానికి ఆవరణపుగోడ పెట్టుకోవడానికి సెల వడిగినాడు. డివిజనల్ కమీషన ర్లాప్రకారం పెట్టుకోవడానికి అభ్యంతరం లేదని వ్రాసినారు. ఆప్రకారం సెలవు యివ్వవచ్చును.

బుచ్చ—(గున్నయ్యనాయుడుగారితో రహస్యముగా)ఇందులో మేనేజరుగారిచెయ్యి తడి అయింది. ఇది యేప్రకారంగా సద్ది చెపుతూ వున్నాడో చూచినారా?

నాగ—అలాగైతే వుత్తరువు వెయ్యవచ్చును.

మద—కాదు కాదండి. ఇటువంటివాటిలోనే చాలా దగాలు వుంటవండి. ఆస్థలం యొక్కడిదో నాతో చెప్పండి.

గున్న—అది నాడివిజనులోదండి. అదుగో పల్లపువీధులో ధర్మసావడికి యెదురుగుండావున్న ఖాలీస్థలం. అది వాళ్ల హక్కు. గోడలు పెట్టుకోవడానికి శెలవు యివ్వవచ్చును.

మద—సరెసరి! అదా? దానిని గురించి నాకు బాగా తెలుసును. ఆస్థలం వాళ్ళభుక్తంలో యెన్నడూ లేదు. వెనుక రిచ్చర్డుదొరగారి హయాములో ఇటువంటిఅర్జీలేవస్తే వల్లకాదని సెలవిచ్చినారు. మేనేజరు గారూ! ఆవెనుకటిరిజల్యూషన్ తియ్యండి.

మేనే—ఏదో యెప్పటిదో పాతపురాణం యెలాకనపడుతుంది. దానికి పనిచేసుకుని నెల్లాళ్ళో రెండునెలలో వెతకవలెను. ఇలాగంటి స్థలాలు మనవూళ్ళో లక్ష వున్నవి. అది యేస్థలాన్నిగురించో. దీన్ని

గురించి ఇదివరకు యెప్పుడూ అర్జీ వచ్చినట్టు నాకు జ్ఞాపకం లేదు.

మద—కాదు కాదండి. దీన్ని గురించే. నాకు బాగా జ్ఞాపకం వున్నది.

మేనే — మీకు యెలాగు జ్ఞాపకం వున్నదోకాని పొరపడి వుంటారు.

గున్న—అవునండీ. మీారనుకున్నది యేదో మరివకటికాని యిది కాదు. దీవిషయంలో యెప్పుడూ యెవరూ అర్జీ యిచ్చుకోలేదు. యీావిషయంలో విమర్శించినవాణ్ని నాకు బాగా తెలుసును. యెంత విమర్శ చెయ్యకపోతే అర్జీలమీాద నేను అల్లాటప్పాగా వుత్తరవు యిస్తానండీ? నేను కళ్ళు యేమైనా వుంటే అట్టుపుట్టు ఆనవాళ్లతో పెల్లగించి వదిలిపెడుతాను. ఈయింటివాళ్ళు బహూపెద్దమనుష్యులు. వాళ్లు తమ స్తలం కాకపోతే అక్రమంగా వచ్చేవారు కారు.

మద—వెనక తగాదావచ్చినది యీాచోటే నండి. దీనికిచుట్టూ ఆవరణపుగోడ యెప్పుడూ లేదు. పశువులను తోలుకువెళ్లేవాళ్ళు పశువులను దానిలోవున్న రావిచెట్టుకింద తోలుతూ వుండడం నేను యిరవయినంవత్సరములనుంచి యెరుగుదును. వారి యింటిదస్తావేజు తెప్పించి చూడండి. అందులో యీాస్థలము లేదు.

సోమి—అవును. స్థలం మీారు చెప్పినదేకాని దస్తావేజులో లేక పోయినంతమాత్రంచేత హక్కు వాళ్ళది కాదనడానికి వీలు లేదు. తప్పకుండా హక్కు వాళ్ళదే.

మేనే — అవునండి. యెవరూ తగాదాచేసేవారు లేనప్పుడు మనం గోడ పెట్టుకోవడానికి సెలవు యివ్వడానికి అభ్యంతరం యేమి వున్నది? మరి యెవరిహక్కయినా అయితే వాళ్లే వ్యాజ్యంవేసి పుచ్చుకుంటారు. సర్కారుస్థల మయితే రివిన్యూసైడున కలక్టరుగారే ఆటంక

పెడుతారు. మీరు సెలవు యివ్వండి.

మద—అలా వల్లకాదు.

గున్న—వల్లకాకపోవడానికి గవర్నమెంటువారు యేర్పరిచిన కమీషనరులము మేము అక్రమం చేసేవాళ్లమా యేమిటి? యిందులో మామాట సాగకపోతే మాకు అవమానంగా వుంటుంది.

ఖాద — అవును బాగా పోట్లాడవయ్యా. ఇందులో మన తక్కువ యేమిటి? వాళ్లయెక్కువ యేమిటి? కావలిస్తే గవర్నమెంటు దాకా వెళుదాము.

బుచ్చ — మనకేం భయమేమిటి తప్పకుండా వెళుదాము. యిందులో మనం వదిలిపెట్టి వూరుకోకూడదు. బాగా పోట్లాడవయ్యా.

సోమి—పోట్లాడడం యెందుకు? మెజారిటీ మనమే వున్నాము. వోట్సు పుచ్చుకుంటే తెలుస్తుంది. యిందులో తప్పకుండా డివిజన్ కమీషనర్ల యిష్టప్రకారం జరగవలెను.

మద — మీరు యెంతమందివున్నా యిందులో న్యాయం చూడవలెనుగాని సంఖ్య చూడకూడదు.

గున్న—మీరు మహాన్యాయం చూస్తూ వున్నారు. మహా మహాకోర్టులలో లంచాలు పుచ్చుకుని వుపకారం చేస్తారు. అంతా మహా మడికట్టుకుని కూర్చున్నారా యేమిటి?

ఖాద—యెవళ్లకయినా యేమయినా వొరికిపోతుందనివోర్వలేని మురిడాకొడుకులు ప్రతీదానిలోనూ అడ్డం వస్తారు.

మద—మాటలు తిన్నగా రానీ. నీలాగు గడ్డితినేగాడిదెలు వుంటే—

ఖాద—అదుగో అదుగో మిగలమాటలు రానిస్తూ వున్నావు. నౌరగారు వింటూవున్నారు. నేను మేజస్ట్రీటులో ఫిర్యాదు చేస్తాను.

మీా రంతా సాక్షులయ్యా!

బుచ్చ—చెయ్యండి. యిలాగంటివాళ్లకు వక్కమాటు శిక్ష అయితే యిక యెప్పుడూ మనకు అడ్డం రాకుండా వుంటారు.

వైసు—(ఇంగ్లీషుతో) కమీాషనర్లు పోట్లాడుతూ వున్నారు. నేను వెళ్ళిపోతాను.

మేనే—(ఇంగ్లీషుతో) దీనిమీాద గోడలు పెట్టుకోవచ్చునని వుత్తరవు వేసి వెళ్ళండి.

నాగ — (ఇంగ్లీషుతో) వారు అలాగు చెప్తూవుండగా యిప్పుడు వెయ్యవల్లకాదు.

వైసు—(ఇంగ్లీషుతో) నేను వెళ్ళిపోతాను.

(అని వెళ్ళుచున్నాఁడు.)

---

3. తృతీయరంగము—సోమిసెట్టిగారి యిల్లు.

[ఖాదర్ సాహేబుగారును, బుచ్చయ్యపంతులుగారును, గున్నయ్యనాయుఁడు గారును, సోమిసెట్టిగారును, కామిసెట్టియు ప్రవేశించుచున్నారు.]

బుచ్చ—ఏమోయి కామిసెట్టీ! మేనేజరుగారియింటికి వెళ్ళి రాత్రి ఫరిష్కారం చేసుకున్నావా?

కామి — ఏమిఫరిష్కారమండీ? ఆయనకు దాహం మహా విశేషంగా వున్నది. అంతదాహం నేను తీర్చలేనండి.

బుచ్చ—నీవు యెంతయితే యిచ్చుకుంటావు?

కామి—నేను పదిహేనురూపాయలకు వక్కగవ్వ యెక్కువ యిచ్చుకోలేనండి. ౹ఆయనవక్కడికే అయితే ఇంకా ఫదిరూపాయలు ఇచ్చుకోమన్నా ఇచ్చుకుంటాను. ఇందులో మీాకు యాభైరూపాయలు ఇచ్చుకోవలెనాండి? శానిటరీయినస్పెక్టరుగారికికూడా యేమయినా

ఇచ్చుకోవలె నని మీారే సెలవిచ్చినారాండి! ఇంకా యెంతమందికి యేమి యిచ్చుకోవలెనో! ఆయనవక్కడూ ముప్ఫయిరూపాయలు వాళ్ళో పొయ్యమంటే ఎట్లా పొయ్యగల నండీ?

బుచ్చ—సమయం వచ్చినప్పుడు తప్పుతుందీ? ఇవాళ వచ్చిన ఖర్చు రేపురాదు. నీకు కొట్టుఅరుగులు కావలసివున్నట్టయితే ఇల్లో వాకలో తాకట్టుపెట్టి నాలుగురూపాయలు హెచ్చుతగ్గుగా సొసా యించుకో. ఆయనచేతులో మంత్రిపుష్పం పడకపోతే రిజల్యూషన్ ప్రకారం హుకుం వ్రాయించి రేపు యీపాటికి అరుగులు తవ్వించి వేస్తాడు. స్వాములవారికి చెల్లించవలసినముడుపు చెల్లించినట్టయితే ఇది పడవేసిపెట్టి యేదో వకవిధంగా హుకుములు వ్రాస్తూ ఆరునెలలు జరుపుతాడు. యీలోగా నీవు యెప్పుడయినా మళ్ళీ అర్జీపెట్టుకుంటే వోర్వలేని కమీషనరులు లేనికాలములో మేము నలుగురమూ వున్నప్పుడు పెట్టి అరుగులు పెట్టుకోవలసిన దని దానిమీాద గీటు పెట్టించివేస్తాడు. అంతకూ వల్లకాకపోతే అరుగులు తీయించివెయ్య వలసిన దని హుకుం వ్రాసి దొరగారి సంతకం చేయించి శానిటరీ ఇన్స్పెక్టరుకు పంపించినట్టు ఆఫీసుబుక్కులో యింటరుచేసి పంపించ కుండా వూరుకుంటాడు. నీవు నాలుగురూపాయలు శానిటరీఇన్స్పెక్టరు చేతులోకూడా పెడితే యెవ్వరూ ఆసంగతి కదిపేవారే లేరు. ఈ పోట్లాడినకమీషనరు లంతా అరుగులు తీసివేసినారో లేదో అని మళ్లీ వచ్చి చూస్తా రనుకున్నావా యేమిటి? అందులో ఇంతశ్రద్ధ యెవరికి? అపాయింటుగులోకి వచ్చి నాలుగుముక్కలూ వాగి చక్కాపోతారు. తరువాత యేమి జరిగిందో యేమిటో మళ్ళీ దానిజోలి తలపెట్టరు. కార్య మంతా మాలో వున్నది. మేనేజరూ మేమూ శానిటరీ యినస్పెక్టరూ యేకమై ఇదివరకు ఇటువంటి రిజల్యూషనులు లక్ష

అమలు జరగకుండా ఆపివేసినాము. యెవడు కనుక్కున్నాడు? మా చేతుల్లో పడకపోతేమాత్రం వక్కపని సాగదు. మేము ప్రతివీధీ తిరిగి ఇటువంటికుళ్ళు యేమయినా వుంటే పయికి యెక్కతీసి మమ్మ సమాధానం చేసుకోకపోతే మూడుచెరువులనీళ్ళు తాగించి మరీ వదిలి పెడుతాము. యేమి మా యీభయిరూపాయలూ తెచ్చినావా?

కామి—కార్య మైతే ఇచ్చుకోక యేమిచేస్తానండీ? మీాకూ మేనేజరుగారికీ కట్నం సమర్పించుకుంటే ఇఖ నేమీా యెవరికీ ఇవ్వ నక్కరలేదుగదండీ?

బుచ్చ—ఇది మహానైవేద్యం. ఇది యిచ్చుకుంటే ఇఖ చిల్లర దేవతలకు రూపాయూ అర్థా ఇచ్చుకోవలసినదేకాని ఇంత పెద్దమొత్తం యేదీ వుండదు. ఆవీధిని పనిచూసే బంట్రోతువాళ్ళచేతిలో చేరివక అర్థా పెడుదూ. దానితో సరిపోతుంది.

కామి—అంతేనాండి? ఇఖ శానిటరీయిన్‌స్పెక్టరుగారికి యేమీా ముట్టచెప్పనక్కరలేదు గద?

బుచ్చ—యేది తప్పినా శానిటరీఇన్‌స్పెక్టరుగారిది తప్పదు. అది తండ్రితద్దినంవంటిది. నీయింట్లో భోజనం మానుకొని అయినా వెంకటేశ్వరులముడుపు అది చెల్లించవలెను.

కామి—ఆయనకువెనుకఅరుగులు కట్టించుకునేటప్పుడు ఆటంక పెడితే రెండురూపాయలు ఇచ్చినానండి.

బుచ్చ—అది అవసరనైవేద్యం. అప్పటికి సరిపోయింది. ఇప్పుడు ఇచ్చేది మహానైవేద్యం. ఇది ఇచ్చుకుంటే ఇఖ యీఅరుగులనిమిత్తం మళ్ళీ ఇచ్చుకో నక్కరలేదు.

కామి—ఇంతమంది దేవతలకు ఇన్నిమాట్లు యిచ్చుకోవలసివస్తే మాావంటి బీదవాళ్లము యీపట్నవాసాలలో బ్రతకగలమండీ?

బుచ్చ—డబ్బునోట్లో దేవుడున్నాడు. యేమిసమర్పించుకోక పోతే దేవతలకుమాత్రం నీమీద అనుగ్రహం యెలావస్తుంది? దేవతా ప్రసాదం కావలిస్తే మీదుకట్టింది తీసుకువచ్చి చెల్లించి ఆపద తప్పించుకోవలెను. నీవు యెరుగవుకాని కొన్ని దేవతలకు నిలువుదోపు కూడా ఇవ్వవలసి వస్తుంది. ఆవువంటిదిన మేతూకడుపునిండా మేతమేస్తేనే కాని చేపదు. మేతలేకుండా యీకామధేనువులుమాత్రం పొడపొడిదణ్ణాలతో వరాలు కురిపిస్తవనుకున్నావా? ముందుగా మాకనుకున్నది మొక్కుచెల్లించుకో.

కామి—యే దేవతయినా కార్యమయినతరువాత మొక్కుచెల్లించుమంటుంది గాని ముందుగానే చెల్లించమనదు. కార్యమైతేనే కాని నేను యేమీ యిచ్చుకోలేను.

బుచ్చి—కామిసెట్టీ! చెవులోమాటోయి. (రహస్యముగా) మేనేజరుగారితో చెప్పి ఆయనచేత నాలుగురూపాయలు మాన్పించి నీకు చాలాకిఫాయతు చేయిస్తాను. శానిటరీ యిన్‌స్పెక్టరుగారికికూడా ఇవ్వ డంతా ఇచ్చుకోనక్కరలేకుండా సగంమాత్రమే ఇప్పుడు ఇచ్చుకునేటట్టు సిఫారసు చేస్తాను. మా యాభయిరూపాయిలుమాత్రం ముందుగా తెచ్చుకో. ఇక మాట్లాడకు తక్షణం వెళ్ళిపో.

కామి—చిత్తము. (అని వెళ్ళుచున్నాడు.)

ఖాద—యేమిటయ్యా? మే మింత సేపటినుంచీ కూకుండాము. ఖాంచోత్ మాచేతిలో వక్కపైసా పడలేదు.

గున్న—తొందరపడకయ్యా! పంతులుగారు అందువిషయమే కాదూ తంటాలు పడుతూవున్నారు. సొమ్ము చేతులో పడడంతోటే వక్కదమ్మిడీ మిగుల్చుకోకుండా యెవరిది వారికి పంచిపెడతారు.

ఖాద—ఖాంచోత్ మీహిందువుల్కి మాకీ నమ్మం. డబ్బా

సేతిలోపడితే దగాసేస్తార్. ముందుగా నావంతు నాకీ ఫైసల్ సెయ్యండి.

సోమి—సొమ్ము రానిదే ముందుగా యెవరయినా పెట్టెలో డబ్బు తెచ్చియిస్తారటయ్యా? రానియ్యండి.

ఖాద—అదంతా మాకీ తెల్దు. ముందుగా మా సేతిలో డబ్బు యేసి మాట్లాడండి.

బుచ్చి—మీ చేతులో వెయ్యడానికి ఇప్పుడు యెవరి తాతముల్లె దాచిపెట్టినారు? సొమ్ము వస్తే అందరమూ పంచుకుందాము.

ఖాద—భాంచోత్ మీరంతా యేకమయి నాసొమ్ము యెగబెట్టడానికి యేపాల్ యేస్తూవుండార్. ఈయన చెవులో యేదో గుసగుసలాడి సొమ్ము ఇదివరకేలాగియేసినాడు. నాపన్నెండు రూపాయలనరా అక్కడపెట్టి మాటాడండి.

బుచ్చి—నేను యేమీ పుచ్చుకోలేదు. కావలిస్తే నాబట్టలు సోదాచూడు.

ఖాద—మాకీ యేమీ ఖబుర్లతో జరూర్ లేదు. మీహిందువులు గారడీసేసి సొమ్ము మాయంసేసివేస్తార్. నావంతుసొమ్ము అక్కడపెట్టి కదలండి.

సోమి—సాహేబుగారూ! కొంచెం వోపిక చెయ్యండి. ఖోదాతోడు. మీసొమ్ముకు నేను పూచీపడతాను. తక్కిన సంగతులు ముందుగా కానియ్యండి.

బుచ్చి—మేనేజరుగారు ముసద్దీపేచీ యేలాపెట్టినారో చూచినారా! మనం యింతమందీ యేకమైనా కార్యంలేక వక్కమాటతో అడ్డి వూరుకున్నది.

గున్న—ఆయనసామర్థ్యం మరివకరికిరాదు. నాలుగుమోస్తర్లు దస్తూరీ వ్రాస్తాడు. ప్రత్యేకంగా తాను వ్రాసింది తనదస్తూరీ కా

దని సాధించి తనతప్పితం ఇతరులమీద తోసివేసేశక్తి యీయనవద్దనే వున్నది. మనం వక్కఘడియ యీయనవద్ద మాట్లాడితే యింటికి వెళ్ళినతరువాత తలలు మార్చినాడేమో అని అద్దంపెట్టి మన ముఖాలు చూచుకోవలెను.

సోమి—అటువంటి మాయోపాయాలూ ఇంద్రజాల మహేంద్రజాలాలూ వున్నవి కనుకనే యెంతలేదన్నా యీవరేజీమీద రోజుకు నాలుగయిదురూపాయలకు తక్కువలేకుండా చేరుతాడు. ముందుగా దక్షిణ ఆయనచేతిలో పడితేనేకాని వక్కపిటీషన్ మీటింగులోకి రాదు.

బుచ్చి—యీసంగతులు మనకు కొత్తయేమిటి కాని మనం మాట్లాడుకోవలసినసంగతులు మాట్లాడుకుందాము. కామిసెట్టిలరుగుల విషయంలో అనుకూలంగానే జరుగుతుంది. మొన్నటి స్థలానికి ఆవరణపుగోడవిషయంలోకూడా మన కనుకూలంగా జరిగితే బాగుండును. అదీ పెద్దపద్దే.

గున్న—అందులో మేనేజరుగారుకూడా మనపక్షమే. మనకు తప్పకుండా విజయం కలుగుతుంది. డివిజనల్ కమీషనర్లు సిఫారసుచేసి మెజారటీ మనదైనప్పుడు మరివకలాగు యెలాగు జరుగుతుంది ?

సోమి—తప్పకుండా అందులో మనకార్యం అవుతుంది. యెందరు యేడిస్తేయేమి ? సిద్ధసంకల్పులు మీరు తలపెట్టిన కార్యం కాకపోవడంకూడానా ? మనం టోలు కంట్రాక్టరుకు యెనిమిదివందలరూపాయలూ రిమీషన్ ఇప్పించడంలో మన యెవరెవరిశక్తి కనపడవలెను. ఇందులో మనం యీవుపకారం చేస్తే రెండువందల రూపాయలు వక్కసారి ఘుళ్ళుమని చేతిలో పడతవి. మేనేజరు యిదివరకే పెద్దమొత్తం మాట్లాడుకొన్నాడు. మనంకూడా అందులో చేరక

పోతే యేదోవకవిధంగా గీటు పెట్టించి గళగ్రాహిఅంతా మేనేజరే మింగివేస్తాడు.

ఖాద—భాంచోత్. ఆడూయీాడూ మింగియేస్తార్ అనిచెప్తూ అంతా మీారే మింగియేస్తూ వున్నారు. అరే మీాకీ యీాసర్కామూాడు నాల్గువందాల్ వచ్చాయి. నాకీ వక్కరూపాయీా యిచ్చారులేదు. నా వంతూ నా సేతులో పడావెయ్యండి. తరువాతా మాటలూ ఆడుకోం దురుగాని.

బుచ్చ — వుండవయ్యా మేమూా సొమ్ము వచ్చేవుపాయమే ఆలోచిస్తూ వున్నాము. మనకు యేమీా దొరకకుండా చెయ్యడానికి మదనయ్య ఇప్పుడు మహాపని చేస్తూవున్నాడు. ముందుగా మనం అతనితాళం పట్టించవలెను.

గున్న—అద్దె అదెంతసేపు? మన మందరమూా యేకమయితే నాలుగునెలలలో మనకు విరోధులుగా వుండేకమీాషనర్ల నందరినీ యేరిపారవేస్తాము. మదనయ్య లంచాలు పుచ్చుకుంటూవున్నాడనీ కంట్రాక్టుదార్ల వద్దకడి తేరుస్తూవున్నాడనీ మన వైసుప్రెసిడెంటు మెస్టరు లేజీధొరగారితో నేను చెప్పి నిప్పంటిస్తాను. మీా రందరూాఖూడా సమయం వచ్చినప్పుడు తలావకపుడకా వెయ్యవలెను. నేను ఇదివరకే మార్కెట్టుఇనస్పెక్టరుగారిచేత మనవిరోధు లందరిమీాదా బాదులు బాదించినాను. సమయం వస్తే అవిఅన్నీ యెలా పనిచేస్తవో మీారే చూస్తారు. మనము అన్నిపక్కలనుంచీ బారులు చేస్తే వక్కసారి అవి అన్నీ ఫిరంగీగుళ్ళలాగు తగులుకోవూా? చూడు నాఘాక కనుపరుస్తాను. వాళ్లను వొక్కొక్కళ్ళనే కమీాషనర్ హోదాలోనుంచి తీసివేయించక పోతే నాపేరు గున్నయ్యనాయుడు కాదు.

(అని మీాసము మెలివేయుచున్నాడు.)

బుచ్చ — మీకంటె ముందర్తిగానే నేను మేనేజరుగారిచేత వాళ్లమీద ఫ్రాదర పెట్టించినాను. అంతా లోపల పొగ రాజుతూ వున్నది. యెప్పుడో గభీలు మని మండి పయికి లేస్తుంది. మన వైపు ప్రెసిడెంటు శుద్ధబుద్ధావతారముగాని లేకపోతే యీపాటికి వాళ్ళను చీమలిని నూడ్చివేసినట్టు నూడ్చివెయ్యడూ ?

సోమి — మనం యెంతప్రయత్నం చేసినా ఇంకా వాళ్ళదినాలు బాగావుండడంచేత వాళ్ళఆటలు సాగుతూ వున్నవి. ఇంకా యెన్ని దినాలు సాగుతవో చూతాము కాదూ ?

ఖాద — ఆళ్ళదినాలూ లేవు యీాళ్ళ దినాలూ లేవు. ఇప్పుడు నా దినాలు భాగాలేవు. నాకీ యీరాత్రికీ ఫదిరూపాయలు వుండాలె. మీాలో యెవరయినా ఇచ్చుకోకపోతే మీాఆబురీ దక్కనియ్యను.

బుచ్చ — ముందుగా ఇవ్వడానికి మాదగ్గిర సొమ్ము లేదు.

ఖాద — భాంచోత్ మాకీ రూపాయలూ యియ్యకపోతే నేను ఇప్పుడు పోయి మదనయ్యగారితో యావత్తుకట్రా మనవిచేసి మీామీాద సాక్ష్యం పలికి మిమ్మల్ని వక్కొక్కడినే బొక్కలోకి తోయిస్తాను. (అని లేచి వెళ్ళుచున్నాడు.)

బుచ్చ — సాహేబు వెళ్ళిపోతూవున్నాడు. పట్టుకోవయ్యా. పట్టుకోవయ్యా.

(అని అందఱును వెనుక వెళ్ళుచున్నారు.)

# ద్వితీయాంకము.

---

ప్రథమరంగము—ధర్మసావిడి.

[పోలిసెట్టియు, రామిశెట్టియు, గురయ్యనాయుడును, భీమలింగమును, కూరుచుండియుండఁగా వంకాయలచంద్రమ్మ పరివేశించుచున్నది.]

పోలి—రామిసెట్టిగారూ! మీరు నాలుగురోజులనుంచి దుకాణం వదిలిపెట్టి మహాతిరుగుతూవున్నారు. మీవ్యవహారం ఫరిష్కారం అయినదా?

రామి—తడిమన్నంతా పొడిమన్నయ్యేటట్టుగా యీ నాలుగురోజులనుంచీ మేనేజరుగారి ఇంటిచుట్టూ తిరగగా తిరగగా వక్కశతమానంతో నేటిదినం ఫరిష్కారమయింది. మేము ఫదిమందీ ఫది ఫదులు వేసుకుని నూరురూపాయలమూటా యీవుదయాన్న పట్టుకుని వెళ్ళి సమర్పించడంతోటే మాపేర్లు లీష్టులోనుంచి తీసివేసినారు.

పోలి—యీ మునిసిపాలిటి బహుఅక్రమంగా వున్నది. అన్యాయంగా ప్రజలసొమ్ము దోచుకుంటూవున్నారు. నేను ముందటియేడు బోలెడుసొమ్ము మేనేజరుచేతులో పోసినాను. ఆసంవత్సరం కాస్తపన్ను తగ్గించినట్టే తగ్గించి నిరుడు సంవత్సరం మళ్ళీ హెచ్చుచేసి జాబితాలో వ్రాసి నోటీసు పంపించినారు. అందుమీద నేను మదనయ్యగారివద్దకి వెళ్ళి యీఅన్యాయం యేమిటని మొత్తుకుంటే నీవు వొక్కదమ్మిడీ యెవ్వరికీ యివ్వనక్కరలేదు. అప్పీలు చేసుకోమని సెలవిచ్చినారు. అందుమీద నేను అప్పీలు చేసుకుంటే నాఅదృష్టంచేత మంచికమీషనర్లు నలుగురూ రావడంచేత హెచ్చుచేసినసొమ్ము కొట్టివేసి యెప్పటిపన్నే ఖాయం చేసినారు. యిలా ప్రయివేటుగా వీళ్ళకూ వాళ్ళకూ దర్శించుకోవడంకంటె పబ్లీకుగా అప్పీలు చేసుకుంటే మన అదృష్టం

బాగావుంటే పన్ను కొట్టుబడేపోతుంది. మేనేజరూ యిద్దరు కమీషనర్లూ చేరి యీజాబితాలు వూరికే తయారుచేసి ఫదిమందివర్తకులను పిలిపించి యిచ్చిన వాళ్ల పేర్లు తీసివేసి ఇవ్వనివాళ్ల పేర్లు మీటింగులో పెడుతారు.

రామి — అవును. ఆమాట నిజమేకాని అంతధైర్యం యెవరికీ వుండదు. వంకాయలపాపిసెట్టివద్ద పాతికరూపాయలులంచంపుచ్చుకుని పన్ను యెంతో తక్కువ కట్టినారు. ఫదిసంవత్సరాలనుంచి వక్కమోస్తరుగా సాగివస్తూ వున్నదా లేదా? రెండేళ్లకూ మూడేళ్లకూ వక్కమాటు పన్ను మళ్ళీ యెక్కువ కడతామని బెదిరిస్తూవస్తే నాలుగూ అయిదూ వాళ్ల మొగాన్ని పారవేసి నోరణుస్తూ వుంటాడు. అతనికి పోయినవల్లా మహాపోతే నూరురూపాయలకంటె యెక్కువ వుండవు. వచ్చినకిఫాయతు చూడబోతే యెంతలేదన్నా యీఫదేళ్ళల్లోనూ మూడునాలుగువందలరూపాయలకు తక్కువ వుండవు. ముసద్దీలతో కక్షకట్టడంకంటె వాళ్ల చేతులో నాలుగుడబ్బులసొమ్ము పెడితే యెందెందులకూ మంచిది. వాళ్లు తలచుకుంటే యెప్పుడయినా కాస్తవుపకారం చేస్తారు. వాళ్ళమామూలు వాళ్ల చేతులో పడకపోతే కార్పణ్యం మనసులో వుంచుకుని యెందులోనైనా పట్టుకొని నొక్కుతారు. మొన్న మాభావమరిది మామూలు నాలుగురూపాయలు ఇచ్చినాడుకాడని శానిటరీఇనస్పెక్టరు గుమ్మముముందర పెంట వున్నదని ఛార్జిషీటుచేసి రెండునెలలలో ఫదిరూపాయలు జులుమానా వేయించినాడు? అటుతరువాత పిచ్చతవ్వతో కొలిచినాడని ఫిర్యాదు చేసి యాభయిరూపాయలు వదిలిల్చినాడు. అతనిచేతిలో మొట్టమొదటనే నాలుగురూపాయలూ పెట్టినట్టయితే యీదండుగలన్నీ తప్పేవేనా? తరువాత చచ్చినట్లు ఫదిరూపాయలు సమర్పించినాడు.

పోలి—మనం తిన్నగా వుంటే యెవరికీ ఝడియనక్కరలేదు. మనదగ్గిర పిచ్చితవ్వాలు యెందుకు వుంచుకోవలెను? తరువాత కచేరీ చుట్టూ యెందుకు తిరగవలెను? మనం న్యాయంగా వుండి యెక్కువ పన్ను కట్టినప్పుడు అప్పీలు చేసుకుని మన లెక్కలు దాఖలుచేస్తే పన్ను తీసివెయ్యక యేమి చేస్తారు?

రామి—న్యాయంగా ప్రవర్తిస్తే వర్తకమే సాగదు. ప్రతిదానిలోనూ కొంచెంఅబద్ధం వుండవలెను. మొన్న న్యాయమైనలెఖ్ఖలు దాఖలుచేసి తనకు అక్రమంగాకట్టినపన్ను యాభైరూపాయలూ మాఫు చెయ్యవలసిన దని నరసయ్య అర్జీ యిచ్చుకుంటే అందరూ యెరిగివున్న సంగతిలో కమీషనర్లందరూ చేరి అప్పీలు కొట్టివేసి పన్ను ఖాయం చేసినారు. అందులో యెంత అన్యాయం జరిగింది! మొట్టమొదట మేనేజరుకూ వాళ్లకూ పదిరూపాయలు పారవెయ్యవలెను. న్యాయంగా నెళ్ళుతా నని భీష్మించుకుని కూర్చోవడంచేత యీఅనర్థం అంతా పొసగింది. అందుమీదట మొన్న బుచ్చయ్యపంతులుగారు కోర్టుకి వచ్చి రెండురూపాయల ఖరీదుచేసే ధోవతులచాపు వారికే యివ్వమంటే ఆయనకు యివ్వకపోవడంచేత అప్పీలుకూడా తువర మైనది. బుచ్చయ్యపంతులుగారు లెఖ్ఖలు దొంగలెఖ్ఖలనేటప్పటికి వారి పరివారమంతా వక్కతాకీని అవి దొంగలెఖ్ఖలనివేశారు. అంతటితో న్యాయంగా చెప్పేకమీషనర్లు యేమి చెప్పినా కార్యం లేక మెజారిటీ చెప్పినట్టు అయినది. ఏమయ్యా? గురయ్యనాయుడుగారూ! మీ అభిప్రాయం యేమిటి?

గుర—నేనూ మీ అభిప్రాయంలోనే యేకీభవిస్తాను. మీరన్నీ అనుభవంచేత చెప్పినమాటలుగాని మరివకటి కావు. మనం యేలాగో వోలాగు మంచితనంగా వుద్యోగస్థులను సమాధానపరచు

కోకపోతే వాళ్ళు పెట్టేతంటాలు మనం పడలేము. మాకు యాభయి రూపాయలుపన్ను అధికంగా కట్టినట్టు మీ కందరికీ తెలుసును. మా దగ్గిర సరియయినలెక్కలుకూడా వున్నవి. అయితే లౌక్యబాధకాలూ చిక్కులూ వుండడంచేత మేమాలెక్కలు పబ్లీకులోకి తీసుకునివచ్చి కనపరచడానికి వల్లకాదు. మేము చేసేది సారావ్యవహారం. అందులో అనేకమంది బ్రాహ్మలు ప్రతిదినమూ మావద్ద బ్రాందీ జిన్నూ మొదలయినసారాలు బుడ్లాది పట్టుకువెళుతూ వుంటారు. వక్కమాటు బుడ్లుగా కొనుక్కోలేని బీదబ్రాహ్మలు కొట్లోకే వచ్చి గ్లాసుచొప్పున కొనుక్కుని అక్కడనే తాగిపోతారు. వారిపేర్లన్నీ మాచిత్తాలో తగిలి వుంటవి. వక్కసారి ఆబుక్కు బయలపెడితే మరునాటినుంచీ మా వ్యవహారమంతా తొంగుంటుంది. మొదట మావాడు తెలివితక్కువ పనిచేసినాడు. పన్నుకట్టేటప్పుడు వాళ్ళడిగినట్టు యాభయిరూపాయలూ ఆముగ్గురి నలుగురి కమీషనర్లకూ యిచ్చినట్టయితే యేమాసికలూ అక్కరలేకుండా యీ యాభయిరూపాయలపన్నూ అప్పుడే తగ్గిపోవును.

పోలి—బ్రాహ్మలు తాగగాలేనిది లెక్కలు చూపిస్తే మహా యెక్కువతప్పితం వచ్చినదా యేమిటి? మనకు కొంచెంనష్టం వచ్చినా న్యాయానికి కట్టుపడి వుండవలెను. కొన్నివేళల్లో తప్పిపోయినా సాధారణముగా న్యాయమే అక్కరకు వస్తుంది.

భీమ—ఆలాగు అనరాదు. యీప్రపంచంలో సాధారణంగా అన్యాయమే అక్కరకు వస్తుంది. యీవూళ్ళో మునిసిపల్ కమీషనర్ కందుల సోమిసెట్టిదగ్గిర వున్నడబ్బు న్యాయంగా ప్రవర్తించే మీదగ్గిర వున్నదేమో చెప్పండి. లోకంలో డబ్బువుంటేనే అన్నిగౌరవాలూను.

పోలి—వెధవడబ్బు అటువంటిడబ్బు లేకపోతే యేమిటి? గుణం ప్రధానముగాని డబ్బు ప్రధానం కాదు. డబ్బుమాట పట్టవస్తే మన

వ్రాళ్ళో భోగం చంద్రిముఖదగ్గిర కావలసినంతడబ్బు వున్నది.

భీమ— నేనుచెప్పినది వక్కడబ్బుమాటే కాదు. యెందులోనూ బంగారానికి టంకంపోడి వేసినట్టుగా యెంత నిజమయినా మధ్య నాలుగుఅబద్ధాలు వేస్తేనేకాని అతకదు. న్యాయంగా పోతే అన్నీ తంటాలే వస్తవి. అందరితోనూ విరోధాలే వస్తవి. కేవలం సత్యంతో కూర్చోక కొంచెం లౌక్యంకూడా చూడవలెను. మనపట్టీలజాబితాలు అందరికీ నిజమయినవి కనుపరుస్తామా? మనం దగ్గిర వుంచుకునేది వకటీ, యితరులకు చూపించడానికి తయారుచేయించేది వకటీని. మనచిత్రాలలో కూడా అమ్మినది వున్నట్టుగా వేసి కొనవచ్చినవారికల్లా పద్దులు చూపిస్తూవుంటే మనకు యేమయినాలాభం వస్తుందీ? మనం రూపాయికి రూపాయిపావలా వేసి కొత్తగా వచ్చినవారికి రూపాయబేడకాడికి యిచ్చి అయినా యెంతోలాభం చేసినట్టు కనుపరచవలెను. మళ్ళీ మ్యునిసిపల్‌వారు యెక్కువపన్ను కట్టకుండా మనం దినానికి యాభయి రూపాయలసరుకు అమ్మితే యిరవైరూపాయలసొమ్మే అమ్మినట్టు పయికి కనపరిచి మనలోపాయికారీ లెఖ్ఖలలో తక్కినది వేసుకుని రహస్యంగా వుంచుకోవలెను. ఇటువంటిరహస్యాలన్నీ వర్తకులం మనము మనలో వుంచుకోవలసినవేగాని పబ్లికులో చెప్పదగినవి కావు.

పోలి— మనం ఇన్నిదగాలుచేసి ఇన్నితంటాలు పడినాగానీ మనలో వక్కడిదగ్గిరా పట్టుమంటే పదివేలరూపాయలు లేవు. దొరలు చూడు కంపినీలుపెట్టి న్యాయంగా వ్యవహరిస్తే వకటి రెండు సంవత్సరాలలో లక్షలకొద్దిసొమ్ము యెలా సంపాదిస్తారో! మీరు యెన్ని మాటలు చెప్పినా యెప్పుడూ చిట్టచివరకు న్యాయమే అక్కరకువస్తుందని నానమ్మకము. యేమి చంద్రిమ్మా! అట్టే నిలుచున్నావు. నీ కూరగాయలవ్యవహారంలో లాభం బాగా వస్తూవున్నదా!

చంద్ర—యేమిలాభమండి బాబూ! అడ్డమయినగాడిదకొడుకులూవచ్చి మమ్మల్ని బెదరించి కాయాగట్రా లాక్కుపోతూవుంటే మాకు అమ్మకానికి యేమివుంటుంది? లాభంయేమివుంటుంది? యేమిటో పూర్వమునుంచీ చేస్తూవున్నవృత్తికావడంచేత విడవలేక యీడ్చుకుని వస్తూవున్నాను. దిక్కుమాలినంత పన్నువున్నది. పన్నే చెల్లకపుస్తే పుడకా తాకట్టుపెట్టి సర్కారుకు బాకీలేకుండా చెల్లిస్తూవున్నాము.

పోలి—నీవు యెప్పుడూ పుచ్చువంకాయలూ చచ్చుబీరకాయలూ కుళ్ళుఅరటిపళ్లూ దుకాణంలో వుంచుతావుగాని మంచివి నీ దుకాణంమీద యెప్పడూ కనపడవు.

చంద్ర—మంచిపళ్లూ కాయలూ గుమాస్తాలు ఇనస్పెక్టర్లు బంట్రోతులు ఫదిమందివచ్చి గంపదింపడంతోటే పట్టుకుపోతూవుంటే అమ్మడానికి చచ్చువీ కుళ్ళువీగాక మంచివి యెలాగువుంటవండి బాబూ!

పోలి—అలాకాదు. కూరలూ పళ్లూ నీవు మంచివితెస్తే మ్యునిసిపల్ వుద్యోగస్థులు అడిగిపోతారని నీవు యెప్పుడూ గంపలో పనికిమాలినవే పెడతావు.

చంద్ర—రామ రామా! అలాచేస్తే పాపంరాదూ బాబూ! మేనేజరుగారు యిప్పుడు ఫదిరూపాయలు తెచ్చుకుంటేనేకాని పన్ను యెక్కువచేయిస్తామంటూవున్నారు. యెవరికయినా అర్జీ యిచ్చుకుంటే కార్యం వుంటుందీబాబూ?

పోలి—నీవు వక్కత్తెవు అర్జీయిచ్చుకోవడంకాదు. ఫదిమంది చేరి మహజరుచేస్తే కార్యంవుంటుంది. రామిసెట్టిగారూ! యిటువంటి అక్రమాలు జరుగుతూ వున్నప్పుడు మీరంతరూచేరి మహజరువిషయమయి యేమయినా ఆలోచించరాదూ?

రామి—వుద్యోగస్థులమీద మహజరు యిచ్చి మనం యీ వూళ్ళో రెండురోజులు కొంపకట్టుకుని కాపురం చెయ్యలేము. అదుగో మేనేజరుగారు ఆఫీసుకు వెళ్ళడానికి వస్తూవున్నారు. మనంఅందరమూ యిక్కడ గుంపుచేరి వుంటే యేదో గూడుపుఠాణీ చేస్తూవున్నామని కొంప తీసివేస్తాడు. ఆయన అసాధ్యుడు. వెళ్ళిపోదాముదండి.

(అని అందఱును వెళ్ళుచున్నారు.)

---

ద్వితీయరంగము—మ్యునిసిపల్ ఆఫీసు.

[మొదటికుర్చీలో సుబ్రహ్మణ్యముగారును, రెండవకుర్చీలో వెంకయ్యనాయుడు గారును, మూడవకుర్చీలో అచ్చయ్యశాస్త్రిగారును పరివేశించుచున్నారు.]

సుబ్ర—వెంకయ్యనాయుడుగారూ! మేనేజరుగారు పన్నెండు ఘంటలయినది యింకా ఆఫీసుకు రాలేదు ఆయన భోజనంచేసి పరుండి వకనిద్రతీసి నిక్కి నీలిగి తను మనసువచ్చినప్పుడు ఆఫీసుకు వస్తాడు. మనను ప్రొద్దున్నా మధ్యాహ్నమూకూడా వచ్చి పని చెయ్యమని తోమి వేపుకుతింటూవున్నాడు.

వెంక—అవును డబ్బాదస్కమూ వస్తే దోబ్బడము ఆయనా, అడ్డమయిన వెట్టిచాకిరీ చెయ్యడము మనమూను. దొర గుడ్డివాడు గనుక ఆయన ఆడినదల్లాఆటా పాడినదల్లా పాట అయి దినాలు సాగి వస్తూవున్నవి.

అచ్చ—మునుపు తాను ఫదులు పుచ్చుకున్నా నూరులువు చ్చుకున్నా అడపాదడపా మనచేతులోకూడా రెండు రూపాయలు పెట్టేవాడు. యిప్పుడవీ యెగపెట్టినాడు.

సుబ్ర—మొన్న టోలుకంట్రాక్టరుకు నాలుగువందలరూపా యలు రిమీషన్ యిప్పించినప్పుడు బెత్తులలాగు నూరురూపాయలు

వొక్కసారి వొళ్ళో పోసుక్కొన్నాడుగదా? అందులో సుబ్రహ్మణ్య ముగారూ కూర కొనుక్కోమని వక్కపావలాడబ్బులు చేతులో పెట్టిన పాపాన్ని పోయినాడుటయ్యా? బిళ్ళగుడుములలాగు రూపాయలు చూస్తే నాకన్ను చెదిరిపోయింది.

వెంక—ఆయన యెంతవచ్చినా గళగ్రాహిగా మింగివేస్తూ వుంటే మనము చాటున గుటకలు మింగుతూ కూర్చుంటాము. యేమి ప్రయోజనము? మీకు మగతనం వుంటే యేది మాకుకూడా భాగము యివ్వవలసినది; యివ్వకపోతే మీరు లంచాలు పుచ్చుకుంటూవున్న సంగతి కమీషనర్లనోటీసులోకి తెస్తామని మీలో యెవరయినా ఘట్టిగా అడగరాదూ? అసలు మీకు అడగడానికి నోట్లో నాలుక లేదు. పయికిరావడానికి చేతగాక మీరు మూలముసుగులో కూర్చుండి గుసగుసలాడుతారు.

సుబ్ర—మనం కమీషనర్లతో చెప్పుకోవడానికి అసలు కమీషనర్లకు వకటి దిక్కువున్నదీ? కొందరు కమీషనర్లను తీసివేయిస్తామని బెదరించి యిది చెయ్యలేదనీ అది చెయ్యలేదనీ ధోరతో చెప్పి చివాట్లు పెట్టిస్తాడు. యిఖకొందరు కమీషనర్లూ ఈయనా మమేకమే. వారితో కలిసి వందలకు వందలు కొట్టివేస్తూవున్నాడు. యెక్కడ సబుకమిటీవచ్చినా యీ కమీషనర్లే వుంటారు. యెక్కడ యేమరమ్మతూ యేకొత్తపనులూవచ్చినా యీకమీషనరులే వుంటారు. వెయ్యి యెందుకు? డబ్బువచ్చేది యేమయినావుంటే యీకమీషనర్లు వుండకుండా వుండరు. కమీషనరులే యీప్రకారంగా పావలాకాడినుంచి లంచాలు పుచ్చుకుని అక్రమాలు చేస్తూవుంటే యిఖ ప్రజలకు యేమి న్యాయం దొరుకుతుంది?

అచ్చ—యిటువంటి కమీషనర్లను వెయ్యడం గవర్నమెంటు

వారిది తప్పితం. కమీషనర్లలో యిలాగంటి యేడుపు వుండబట్టే మేనేజరు నిర్భయంగా యిలాగు జుట్టువిరబోసుకుని తిరుగుతూవున్నాడు. కమీషనర్లు శుద్ధంగావుంటే మేనేజరు యీప్రకారంగా ప్రతిదానిలోనూ విచ్చలవిడిగా పుచ్చుకోవడానికి గుండెలు వుంటవండీ? మెజారిటీకి యీలంచగొండి కమీషనరులే విస్తారంగా వున్నారు. వారు భోరున వర్షం కురుస్తూవున్నా మీటింగుకు రావడం మానరు. యింగ్లీషువచ్చిన యిద్దరుముగ్గురు కమీషనర్లకుమాత్రం యీయన కొంచెంవిధేయతగా వుండి పయికి మహాభృత్యుడులాగు నటిస్తాడు. వారప్పుడప్పుడు మీటింగులోకి వచ్చి తమకు తోచింది యేమిటో చెప్పిపోవడం తప్ప యెందులోనూ జోక్యం కలుగజేసుకోక యేది యెలాగయినా సరే వూరుకుంటారు.

సుబ్ర—వెంకయ్యనాయుడుగారూ! పూర్వం పిటీషన్ యెండార్సుమెంట్లమీద వచ్చేమామూలు మీకు వదిలిపెట్టేవారు కాదండీ?

వెంక—అది యెంతండీ? నెలకు నాలుగురూపాయ లయినా తిన్నగా వచ్చేవి కావు. జరూరయినపిటీషన్ వుంటే పావలా మామూలు యిచ్చి యిండార్సుమెంటు వేగిరం పట్టుకువెళుతారు. శలవు యివ్వవల్లకాదని వేసినఆర్డరులకు యెంతకాలం వుంచినా వచ్చి యిండార్సుమెంట్లు పట్టుకువెళ్లరు. ఆబిచ్చపురూపాయలు నాలుగూకూడా యీజాదినుంచి నాకు యివ్వకుండా ఆమహానుభావుడే కాజేస్తూ వున్నాడు. ఆమహద్భాగ్యమంతా ఆయననే బావుకుని పెద్దకాపురం చెయ్యనియ్యండి. నేను అంతటితో చెడిపోను. నాఅదృష్టం బాగా వుంటే బేడబేడకాడినుంచీ ఆయనే చెయ్యి చాపుతూవున్నా నేను యేఛాటునో నాలుగురూపాయలు యేరుకోలేకపోను.

అచ్చ—మీరంటే మొదటినుంచీ వున్నారు. యేమూలంగా

వయినా నాలుగువాళ్ళు లాగులాడుతారు. యెందుకూ పనికిరాకుండా వున్న పట్టినిరర్థకుణ్ణి నేనువక్కణ్ణి కనుపడుతూ వున్నాను. పోనియ్యండి. నాకు దైవం యిచ్చినది యీఘనిరాళ్లే చాలును. మేనేజరుగారికి బాగా దొరికేది యెందులో నండీ ?

సుబ్ర—వకదానిలో యేమిటి? అన్నింటిలోనూ దొరుకుతుంది. రోడ్డుకంట్రాక్టులో సగానికి సగంలాభం వున్నది. అందులో కమీషనర్లు సగమూ యీయన సగమూ కడితేరుస్తారు. యిటుకగోడలు పత్రయి వేటుగా చేయిస్తే గజానికి రెండురూపాయలకంటె యెక్కువ కావు. యిప్పుడు వీరు నాలుగురూపాయలరేటు వేసి సఖం కాజేస్తూవున్నారు. కంట్రాక్టర్లకందరికీ లోపాయకారీని యీకమీషనర్లతోనూ మేనేజరుతోనూ భాగం వుంటుంది గనుక అంతా కట్టుకట్టి రేట్లు తగ్గించరు. యెవరయినా తగ్గిస్తామని వస్తే వాణ్ణి నానాచిక్కులూ పెట్టి సొమ్ము యివ్వక పని బాగాలేదని నాలుగుమాట్లు పెట్టినగోడలు తీయించీ వేసినరోడ్డు తవ్వించీ దండుగ తెప్పించి యెప్పుడూ పోటీకి రాకుండా హడిలిపోయేటట్టు చేస్తారు. యీవిధమయినరశ్మి రోడ్లమరమ్మతులోనూ చెరువులూ కాలవలూ బాగుచేయించడములోనూ గట్లు పోయించడంలోనూ యీ బాపతుపను లన్నిటిలోనూ వుంటుంది. కొత్తగా స్థలాలు యివ్వడంలో మరీలాభం వుంటుంది. ఖాలీగా వున్నసర్కారుస్థలాలు తమ వని యెవరిచేతనో పిటీషను పెట్టించి వాటికిచుట్టూ గోడ పెట్టుకోవడానికి సెలవు యివ్వవచ్చునని తనకు యిష్టులైన యిద్దరుకమీషనర్లచేత వ్రాయించి యేసందడిలోనో ధొరచేత దానిమీద గీటుపెట్టించి పదులూ యిరవయిలూ పుచ్చుకుంటారు. కొందరికి యెంతోకాలంనుంచి పన్ను కట్టకుండానే అట్టేవుంచి లోపాయకారీని యేమో పుచ్చుకుని దొంగను తేలుకుట్టినట్టు యేమీ యెరగనివారివలె వూరు

కుంటారు. పన్నులు యివ్వనివారిని యేమైనా పుచ్చుకుని యేళ్లకొద్ది ప్రొసిక్యూషన్ చెయ్యకుండా వూరుకుండి యెప్పుడో రానిబాకీలకింద చేర్చి కొట్టివేయిస్తారు. అప్పీళ్ళలో వీరందరూ చేరి లంచాలు పుచ్చుకొని పన్ను తగ్గిస్తారు. వకదానిలో యేమిటి? ఆఖరుకు చచ్చు స్కూలు మేష్టర్లవద్ద రిజల్టు గ్రాంటులోకూడా నూటికి పదిరూపాయలు చొప్పున కమీషన్ పుచ్చుకోనిదీ సొమ్ము యివ్వరు. దీపాలకంట్రాక్టరువద్ద నెలకు యింతని మామూలు పుచ్చుకోవడమే కాకుండా యింటికి కావలసిన చమురంతా వాడిదగ్గిర పుచ్చుకుంటారు. యిఖ కమీషనర్లతో సంబంధము లేకుండా యీయన స్వంతంగా కడితేర్చేవి యిటికామలూ పెంకామలూ పెళ్ళిపందిళ్ళూ మొదలయినవాటి బాపతు కావలసినంత వుంటుంది. యెన్నిపందిళ్ళు వేసినారో యెన్ని యిటుకామూలు కాల్చినారో యెంతసొమ్ము వచ్చినదో కనుక్కునేవారు యెవరు? ఈయన దయతలచి చిద్దాను యెంత జమకడితే అంత.

అచ్చ — యీ అన్నిబాపతులూ నెలకు నూరురూపాయలు గిడతవండీ?

సుబ్ర — ఆ: నూరురూపాయలు మేనేజరుగారికి ముట్టవచ్చును.

వెంక — యెక్కడ నూరురూపాయ లండీ? నూటయాభయికి యెక్కువముడుతవి గాని తక్కువ ముట్టవు. యీ బాపతులన్నీ నా చేతికియిస్తే నూటయాభయికాడికి యివ్వడానికి నేను నాలుగు సంవత్సరాలికి కంట్రాక్టు వ్రాయిస్తాను. అదుగో బడేసాహేబు మేనేజరుగారి పెట్టె తీసుకుని వస్తూవున్నాడు. మనం నోరెత్తుకుంటే వెళ్ళి ఆయనతో రిపోర్టు చేస్తాడు. దస్త్రాలు విప్పి యిఖ మీరు పని చూచుకుంటూ వుండండి.

---

తృతీయరంగము—లక్ష్మీనారాయణగారి యిల్లు

[కమీషనర్లు లక్ష్మీనారాయణగారును, బుచ్చయ్యపంతులుగారును, గున్నయ్యా

నాయుడుగారును, ఖాదర్‌సాహేబుగారును, మేనేజరుగారును

ప్రవేశించుచున్నారు.]

లక్ష్మీ—ఏమండీ మేనేజరుగారూ! మొన్న పడమటిరోడ్డులో కొట్టించిన యెండుచెట్ల కఱ్ఱలన్నీ మీలోపల వేయించుకోవడమేనా మాకు యేమయినా నాలుగు కావిళ్లకఱ్ఱలు పంపించడం వున్నదా?

మేనే— ముష్టికఱ్ఱలు అవి యేమికఱ్ఱలండీ? అన్నీ బాడిదె చెక్కలూ మఱ్ఱికఱ్ఱలూ రావికఱ్ఱలూను. వూరికే పొగరావడమేకాని యేమీమండవు. అవి బంట్రోతువాళ్ళు తలానాలుగుమోపులూ పట్టించుకుని వెళ్ళినారు మీరు కావలిస్తే పల్లపువీధిలోవున్న రెండు చింతచెట్లూ కొట్టించుకొనిపొండి. యిందులో శానిటరీ యినస్పెక్టరుకు పదిమోపులకఱ్ఱలు పంపిస్తేనేకాని వూరుకుండడు.

లక్ష్మీ—దానిముండా మోసినకఱ్ఱలు ఆలాగే పంపింతాము. రేపు దీపాలకంట్రాక్టరుతాలూకు పదిమంది చాకలవాళ్లనూ పిలిపించి సాయంత్రానికల్లా రెండుచెట్లూ కొట్టించివేసి పలచని పేళ్ళుగా చూచి పదికావిళ్లచెక్కలు మాయింట్లో వేయించి వీరికందరికీ తలా నాలుగుకావిళ్ళూ పంపించండి. కఱ్ఱలు జాయాపోకుండా డివిజన్ బంట్రోతులను నలుగురినీ దగ్గిర వుండి కొట్టించుమని వుత్తరవు చేయించండి.

మేనే—వాళ్లంతా మహా పొగరెక్కి వున్నారు. మనమాటంటే బొత్తిగా లక్ష్యం లేదు. మనం యేదయినాపని చెపితే యీపనీ ఆపనీ వున్నదని వూరికే సాకులు చెపుతారు.

లక్ష్మీ—వాళ్ళకు వెయ్యిపనులు వున్నా అవి అన్నీ కట్టివేసి

ముందుగా యీపని చెయ్యమని గట్టిగా తాఖీదు చెయ్యండి. కమీషనర్లు పనికంటె తక్కినపనులు యెక్కువండీ? వాళ్లు మనం చెప్పినపని చెయ్యకపోతే నాతో చెప్పండి. వాళ్ళు తమ నవుకరీలో తిన్నగా పని జెయ్యడం లేదని రిపోర్టు పెట్టి వాళ్లను వక్కసారి తీయించి వేస్తాను. అక్కడితో వాళ్లరోగం కుదిరి యిలాగంటితిరుగబాటు చెయ్యకుండా అందరికీ బుద్ధి వస్తుంది.

మేనే— అలాగంటిపని చెయ్యడానికి మీలో చేరిక వుండవలెను. మళ్ళీ వాళ్ళు వచ్చి నాలుగురోజులు మీ యింటిచుట్టూ తిరిగి కాళ్ళూ కడుపులూ పట్టుకోనడంతోటే మొఖమాటపడుతారు. యేదీ యిప్పుడు గంగులమీద రిపోర్టు పెట్టి రేపటిమీటింగులో అతనిపని తీయించి వెయ్యండి మీశక్తి చూతాము.

లక్ష్మి—దానిమాట తరువాత చూచుకుందాముగాని ముందుగా మనం వచ్చినపని కానియ్యండి.

మేనే—మీ రందరూ నాకు యెందుకు వర్తమానం పంపించి నారో సెలవియ్యండి.

లక్ష్మి—చల్లకి వచ్చి ముంత దాచడం యెందుకు? బుచ్చయ్య పంతులుగారూ! మొఖమాటము మాని మీ రంతా నాతో సెలవిచ్చిన సంగతి మేనేజరుగారితో చెప్పండి.

బుచ్చ—మీరే చెప్పండి.

లక్ష్మి—యెవరు చెప్పినా వకటే మీరే సెలవియ్యండి.

బుచ్చ — అలా కాదు మా అందరితరపునా మీరే సెల వియ్యండి. మే మందరమూ మిమ్మలిని కోరినాము.

లక్ష్మి—అలాగయితే వినండి. యిప్పుడు మనకువచ్చినలాభంలో నాలుగోవంతు మేనేజరుగారున్ను మూడువంతులు తక్కినకమీషన

ర్లున్నూ పుచ్చుకుంటూ వుండడంచేత నగటుమీద మేనేజరుగారికి యెక్కువా కమీషనర్లకు తక్కువా ముడుతూవుందని వీరంతా చెపుతూ వున్నారు. యేకమీషనరు చేయించేపనిలో వారి వారి కొక్కరికే ముడుతూ వుండడమూ మీకందరికమీషనర్ల దానిలోనూ కూడా నాలుగోభాగము వుండడమూచేత మీకు మా అందరికంటెనూ మేధా యెక్కువవుంది అనడానికి సందేహం లేదు. కమీషనర్లకంటె మ్యునిసిపల్ నవుకర్లకు యెక్కువముట్టడం నాకూ న్యాయంగా కనపడడం లేదు. మేనేజరుగారూ! మీపక్షంగా మాట్లాడుకోక యిందులో యిప్పుడు జరుగుతూవున్నపద్ధతి న్యాయంగా వున్నదేమో మీరే సెలవియ్యండి.

మేనే—అయితే యిప్పుడు మీ రనేమాట యేమిటో స్పష్టంగా సెలవియ్యండి. మీ రనేమాటకు నాకు అర్థం కావడం లేదు.

లక్ష్మి—మే మనేది మరి యేమీ లేదు. మీకు యెక్కువగా ముడుతూ వున్నది గనుక నాలుగోవంతు మానివేసి ప్రతిదానిలోనూ మీరు యెనిమిదోవంతు పుచ్చుకోవడం న్యాయమని మా అభిప్రాయము.

మేనే—యెవరిపుణ్యం బాగా వుంటే వారికి యెక్కువ దొరుకుతుంది. అందుకు మనం యేమి చేస్తాము? మీకు యెక్కువదొరికితే మీరు పుచ్చుకోండి. నాకు భాగం లేకుండా మీకు దొరికేటాపతులు యెన్నివున్నవి? ధొరదగ్గిర సముజాయిషీ చెప్పి అన్నీ ప్యాసుచేయించడం డ్యూటీ నాది గనుక నాకు యెక్కువ దొరకడం న్యాయమే. అందులో యేమయినా అవకతవక జరిగితే తంటా ధొరకు వస్తుందా మీలో యెవరికయినా వస్తుందా? ధొరకు మాటవచ్చినప్పుడు యిలా యెందుకు చేసినా వని ధొర నన్ను అడుగుతాడా మిమ్మల్ని అడుగుతాడా? జవాబుదారీపని అంతా నాది. యిందులో మీ రేమీ ఆశ పడకండి

నేను ధొరతో తిన్నగా సరిది చెప్పకపోతే మీకు వకదమ్మిడీ దొరకదు.

లక్ష్మి—అవి యేమి మాటలయ్యా! మాకు దొరక్కపోతే మీకుమాత్రం దొరుకుతుందా యేమిటి? ఆ బెదిరింపులన్నీ కట్టిపెట్టండి. నిజం దాచివేసి మీరు యిచ్చేతప్పసముజాయషీ అంతా మీడబ్బు కోసం యిస్తారుగాని మామీద దయచేత యివ్వరు. మ్యునిసిపల్ నవుకర్ల జీతాలలోనూ యిటుకామలలోనూ పెంకామలలోనూ సున్నపుబట్టీలలోనూ యింకా యిటువంటి లక్షబాపతులలో మీరు మాకు యేమీ యివ్వడం లేకుండా అంతా కడతేర్చడంలేదూ?

మేనే — బిచ్చపుసొమ్ము అదెంత? మహాదొరికితే పది రూపాయలు దొరుకుతవి, యిరవయిరూపాయలు దొరుకుతవి. మీకు మల్లే వందలూ నూర్లూ కడితేర్చడం లేదుగదా? నూకాలమ్మ చెరువు బాగుచేయిస్తామని నూరురూపాయలు పుచ్చుకొని దానిలో వక్కదమ్మిడీ ఖర్చుపెట్టక అంతా కడితేర్చివేసినారు గదా? మీరు చేసినదల్లా మీగోడలు పెట్టించుకోవడానికి యెక్కడా మన్ను దొరకక యీ మిష మీద చెరువులో గొయ్యిపెట్టించి మీకు కావలసినమన్ను తవ్వించుకొని పోయినారు. సత్రిపుయింటికి వెల్ల వేయించడానికి నూరురూపాయలు వాళ్ళో పోయించుకున్నారు గదా? అందులో యిరవయిరూపాయల కంటె యెక్కువ ఖర్చుపెట్టినారేమో చెప్పండి. రహదారీబంగాళా తిరగవేయించడానికి నూటయాభయిరూపాయలు శాంక్షన్ చేయించి పుచ్చుకున్నారు గదా. అందులో మీరు యెన్నోవంతు ఖర్చుపెట్టినారు? క్రమప్రకారంగా రేట్లు వేసి యిష్టేమెంటు పుచ్చుకొని పని జరిగిన తరువాత పని తెలిసినవారిని యెవరినయినా తనిఖీ చెయ్యమంటే మీ మీాపస అంతా బయుల పడుతుంది. యిటువంటి రంకులు మీావి లక్ష నాకు తెలుసును. మర్మమంతా నాచేతులో వున్నప్పుడు నావద్ద గడుసు

తనపుమాటలు చెప్పకండి. పిటీషనర్లూ మీరూ యేకమయి సర్కారు స్థలాలూ బేవారసుస్థలాలూ దొబ్బివేసినవి యెన్ని వున్నవి? అవన్నీ పయికి కెక్కరిస్తే మీరందరూ వక్కసారి అగ్రిహారప్రవేశం కావలసి వస్తుంది. తాబేదారుగా వుండి ధొర చెప్పినపనల్లా చేసేవాడికి యిందులో నాకు యేమిజవాబుదారీ వుంటుంది? పోతే మీరుపోతారు వారుపోతారుగాని నాకు యేమీ పర్వా లేదు. యెక్కడనైనా పిల్ల గండమూ తల్లిగండమూ వుంటుందిగాని మంత్రసానిగండము యెక్కడా వుండదు.

లక్ష్మి — పోనియ్యండి. మేనేజరుగారూ వూరుకోండి. మీ అభిప్రాయం యెలాగు వుంటుందో అని మేము వూరికే పరియాచకాని కన్నాముగాని మీవద్ద మేము సొమ్ము యెక్కువ పుచ్చుకోవడాని కనలేదు. మీరు యిలాగు అనక అలాగే యెనిమిదోవంతే నాకిచ్చి తక్కినదంతా మీరే పుచ్చుకోమంటేమాత్రము మేము పుచ్చుకుంటామండీ? మీరు మా అభిప్రాయం కనిపెట్టడానికయినా వప్పుకుని మాట దక్కించుకున్నారు కారుగద? వూరికే కాలహరణ మవుతూ వున్నది. ముందు జరుగవలసినమాట చెప్పండి.

మేనే—అది యే విషయమో మీరే చెప్పండి.

లక్ష్మి—సంవత్సరం ఆఖరు గనుక యిప్పుడు యిళ్ళపన్నులూ వృత్తిపన్నులూ లయిసెన్సుపన్నులూ కొత్తగా కట్టడానికి వున్నవి. రివైజు చెయ్యడానికి సమయం వచ్చింది. యిందులో మనకు బోలెడు సొమ్ము దొరుకుతుంది. తరువాత అప్పీళ్ళల్లో కావలసినంతసొమ్ము వస్తుంది. రిమీషనర్ల జాబితా తయారు చేయించడంలో కావలసినంత సొమ్ము రాబట్టవచ్చును. యింకా యెన్నెన్నో వున్నవి. మేము యిప్పుడు వూరికే మీమనసు కనిపెడదామని వేళాకోళాని కన్న

మాటలు నిజంగా పట్టుకోని వూరుకుంటే మీకూ మాకూకూడా నష్టం వస్తుంది. కాబట్టి మనమంతా చురుకుగా పని చెయ్యవలెను.

మేనే—ఇప్పుడు నేను ధొరగారియింటికి వెళ్లి జరూరుగా సముజాయిషీ యివ్వవలసిన పని వున్నది. యీసంగతులు తరువాత నిమ్మళంగా మాట్లాడుకోవచ్చునులెండి. నాకు కష్టం మహాయెక్కువగా వున్నది. కష్టానికి తగిన రాబడిలేదు. యిందులో మీరు నాకు సఖం వంతు వదిలిపెడితేనేకాని సరిపడదు. మీరే ఆలోచించండి. నేను యిప్పుడు వెళుతాను.

(అని వెళ్ళుచున్నాఁడు.)

---

## తృతీయాంకము.

---

ప్రథమరంగము—గోవిందరాజులుగారియిల్లు.

[శానిటరీ ఇనస్పెక్టరును, బంట్రోతు మల్లయ్యాయును, ఒవర్సీయరు రంగయ్యాయు, గోవిందరాజుగారును ప్రవేశించుచున్నారు.]

శాని—గోవిందరాజుగారూ! మీరు సర్కారు వుత్తరవు లేకుండా అరుగులూ గోడా కట్టించుకుంటూవున్నారు. పని ఆపుచేయించండి.

గోవిం—లేదండీ. ఇదుగో నేను యిండార్సుమెంటు పుచ్చుకొని మరీ పని ఆరంభం చేసినాను. ఈ యిండార్సుమెంటుకోసం పదిరోజులు మేనేజరు యింటిచుట్టూ తిరిగి అనుసరించి యెక్కడకూ టికాణా లేకపోతే ఇలాగంటితంటాలు వచ్చిపోతవనే రెండురూపాయలు సమర్పించి మేనేజరుగారిని పంపించి ధొరగారిచేత వెంటనే ఆర్డరు వేయించి నిషుషాలమీద వ్రాయించి ఇండార్సుమెంటు పట్టుకుని మరీవచ్చి

నాను. కావలిస్తే ఇంఢార్సుమెంటు చూడండి.

శాని—చూడనక్కరలేదు. దానిలో మీాస్థలంలో గోడా అరుగులూ పెట్టించుకోమని వుంటుందికాని అంతకంటె మరేమీా వుండదు. మీారు సర్కారుస్థలం ఆక్రమించుకున్నారు. పని నిలుపు చేయించండి. మల్లయ్యా! కూలివాళ్ళను పని మానివెయ్యమనిచెప్పు.

గోవిం—లేదండీ మేము సర్కారుస్థలం వక్క అంగుళమయినా కలుపుకోలేదు. యివిగో యింకా మాపాతహద్దులు కనపడుతూనేవున్నవి చూడండి వీధివిశాలంగా వుండవలెనని మా స్తలమే అరగజం వదిలిపెట్టి అరుగులు లోపలికి జరుపుకొని పెట్టిస్తూవున్నాము. మాకు యివతలపక్కనూ అవతలపక్కనూవున్న అరుగులు యెంత ముందుకువున్నవో చూడండి.

శాని—మాకు అదంతా తెలియదు. మీాఅరుగులు మునుపు యింకా లోపలికి వుండేవి. మీారు చూపించే పాతఆనవాళ్ళు మీారు యెప్పుడో మట్టివేసి పెంచినవికాని నిజమయినవికావు.

గోవిం—స్పష్టంగా కనడుతూవున్న గోడముక్కలు నిజమయినవికావు! యేఆనవాళ్లూలేనిదీ అందరిస్థలముకంటెనూ ముందుకు జరుపుకొని నెల్లాళ్లక్రిందట వీధిమీాదికి తోసుకువచ్చేలాగు పెట్టుకున్న ఆకొత్తఅరుగులు సర్కారుస్థలం కలియకుండా కట్టుకున్న నిజమయినవా? మాదానిలో నిజమయినదానికి యింత తంటాలు పెడుతూవున్నారు. నిజమయిన ఆక్రమణం యిలాగు స్పష్టంగా కనపడుతూ వుంటే యీావెంకటావుగారి అరుగులవిషయంలో యేమీా తగాదా పెట్టక మీారు యెందుకు వూరుకున్నారండీ?

శాని—యిటువంటి బేజరూరుసవాళ్ళు వెయ్యక యితరుల మాట వదిలిపెట్టి మీామాట మీారు చూసుకోండి. వెంకట్రావుగారు

సర్కారుస్థలం యేమీ కలుపుకోలేదు. బాగా యెరుగుదుము. మీరు మళ్ళీ మాట్లాడక తక్షణం పని ఆపుచేయించండి. తరువాతమాట చూచుకుందాము.

గోవిం—ఆరుగురు మేస్త్రుల్లూ యిరువదిమంది కూలివాళ్లూ యింతమంది పనిచేస్తూవుంటే యీపని మానిపించి యీరోజుకూలి ఆరురూపాయలూ దండుగపెట్టుకుని వూరుకోనండీ? న్యాయం బహు బాగావున్నది!

శాని—యెవరికోసం వూరుకుంటారు? సర్కారుస్థలం ఆక్రమించుకున్నందుకు దక్కిస్తూ వూరుకోవలెను. ఆరురూపాయలుకాక పోతే షదిరూపాయలూ దండుగ వస్తుంది. యిందుకు యెవరు జవాబు దారీ చేస్తారు? మీరు పని ఆపకపోయినట్టయితే తిరుగుబాటు నేరం కింద శిక్షఅవుతుంది సుమండీ. ముందుగాచెప్పినాను జాగ్రత్త.

గోవిం—మీరు నామనవి చిత్తగించి కావలిస్తే చుట్టుపట్ల వారిని విచారించి న్యాయం దయచేయించవలెను. యిప్పుడు పని నిలుపయితే నాకు చాలా దండుగవస్తుంది. వర్షాకాలం దగ్గిరకు వచ్చింది. వక్కసారి వర్షం కురిసిందంటే యీ చేయించిన పనంతా వ్యర్థమయి పోతుంది. మీరు యెలాగయినా కటాక్షించవలెను.

శాని—కటాక్షించడం గిటాక్షించడం నాకు యేమీ తెలియదు. సర్కారుసొమ్ము తింటూవున్నందుకు మేము న్యాయంగా పని చేయవలెను. మీస్థలంవిషయమయి మాకంటె చుట్టుపట్లవాళ్ళకు మహా యెక్కువ తెలుసునా యేమిటి? యీ వూళ్ళో స్థలాలవిషయమయి మాకు తెలిసినట్టు మరియెవరికీ తెలియదు. రంగయ్యా! మనకు మాటలతో ప్రయోజనంయేమి? వీరిపేర్లు వ్రాసుకో తరువాత మేజస్ట్రీటువద్ద ప్రాసిక్యూటుచేతాము. మీరు మామాటవినకుండా నిర్లక్ష్యం

చేసి అరుగులు పెట్టినట్టయితే మీకు జునుమానా పడడమేకాకుండా అరుగులూ గోడా తవ్వించి పడగొట్టివేయిస్తాము సుమండీ. (అని పది బారలునడచి 'మల్లయ్యా' అని పిలుచుచున్నాడు.)

మల్ల—చిత్తము. వస్తూవున్నానండి.—గోవిందరాజుగారూ! ఆయన రిపోర్టుచేస్తే మీకు చెడ్డతంటా వస్తుంది. ఆయనతోకూడా వెళ్ళి మాట్లాడుకుని నాలుగురూపాయలసొమ్ము చేతులో పెడితే యేతంటా లేకుండా సరిపోతుంది. అలా చెయ్యండి.

గోవిం—అయ్యా! ఇనస్పెక్టరుగారు! నేను వస్తూనేవున్నాను మనవండి. వక్కనిమిషం దయచెయ్యవలెను.

(అని పరుగెత్తుచున్నాడు.)

శాని—ఏమయ్యా ఇంతలోకే మళ్లీ యేమి మనవి వచ్చింది? మాకు అవతల చాలాపని వున్నది. వెళ్లవలెను. వేగిరం చెప్పివెయ్యండి.

గోవిం—తమకు యేమైనా ఇచ్చుకుంటాను. అభ్యంతరం చెప్పక పని జరిగించుకోవడానికి సెలవిప్పించండి.

శాని — ఇంత గందరగోళం జరిగించకపోతే చాటుకు పిలిచి ఆమాట మొట్టమొదట నాతో చెప్పరాకపోయిందీ? న్యాయమైతే మాత్రము మాతో మాట్లాడి మమ్మలిని సమాధానపరచకపోతే పని సాగుతుందీ? మేనేజరు తానుమాత్రం దొబ్బి మాకు యేమీ లేకుండా చెయ్యవలె ననుకొన్నాడూ? అతను మిమ్మలిని బుట్టలో పెడితే మేము లోకమందరినీ బుట్టలో పెట్టినవాళ్లము. తెల్లవారి లేస్తే మాకు యిదే పని. మీరు మమ్మల్ని మోసం చెయ్యగలరండీ? యేకమీషనర్సు శాంక్షన్ యిచ్చినా యేమి చేసినా వారితో యేమీ లేదు. పని అంతా మాతో వున్నది. మాచేతులో పడేది పడకపోతే దిగ్గజాలు తమస్థలం వదిలిపెట్టినా కిందా మీదా పెట్టి యేవో చిక్కులు పెట్టి పని జరగకుండా

ఆటంకపెడుతాము. మాచేతులో పడేది పడ్డట్టయితే నాలుగుగజాలు వీధి కలుపుకున్నా చూచీచూడనట్టు వూరుకుంటాము. కమీషనర్లకు అర్జీ అయినా లేకుండా వూళ్ళో యెన్నిస్థలాలు మేము అరుగులు పెట్టుకోవడానికి ఇచ్చివేసినాము. యెవరైనా తగాదాకువస్తే యీ అరుగులు పూర్వమే వున్నవి అంటాము. మీపొరుగువాడు వెంకట్రావు గారికి అరుగులకింద రెండుగజాలస్థలం ఇంటిపొడుగునా నేనుయిచ్చినాను. యెవరు యేమిచేసినారు? ఇక్కడికే చాలాపొద్దు యెక్కింది. జాప్యం చెయ్యక ఇందులో మీరు యేమి యిస్తారో చటపట చెప్పివెయ్యండి.

గోవిం—నాలుగురూపాయలు ఇస్తాను. తమరు మళ్ళీ యేమీ సెలవియ్యక పుచ్చుకోవలెను.

శాని—ఇందులో పదిరూపాయలకు తక్కువ పుచ్చుకోవలసినది కాదు. అయినాకానీ మీరూ మేమూ పక్కవూళ్ళో వున్నాము. తెల్లవారిలేస్తే అనేకపనులు వస్తూవుంటవి గనుక అందుకే పుచ్చుకున్నాను. మరిగత్తె ఇందులో నేను మీకు చేసినలాభంమాట. యెప్పుడూ మరిచిపోకూడదు సుమండీ?

గోవిం—చిత్తము. నేను యెప్పుడూ అలా మరిచిపోయేవాణ్ని కాను. సెలవు పుచ్చుకుంటాను.

శాని—మంచిది. వెళ్ళి రూపాయలు మల్లయ్యచేత పంపించి మీపని మీరు యథాప్రకారం జరిగించుకుంటూ వుండండి. బంట్రోతుల మామూలుమాట అందరికీ తెలిసిందే. నలుగురికీ నాలుగుపావలాలు రూపాయకూడా మల్లయ్యచేతికివ్వండి పొండి.—మల్లయ్యా! పంతులు గారితో వెళ్లి మళ్ళీ మమ్మల్ని వీధిచివరను వేగిరం కలుసుకో.

మల్ల—చిత్తము. (అని రూపాయలు పుచ్చుకొని వచ్చి కలిసికొనుచున్నాడు.)

శాని — మల్లయ్యా! వూళ్ళో యేవీధిని యెవరు గోడలూ అరుగులూ పెట్టుకుంటూవున్నా తక్షణం వచ్చి మాకు రిపోర్టు చెయ్యి. మనకు యేమయినావిశేషంగా లాభిస్తే ఇందులోనే. ప్రతివీధీ ప్రతిగల్లీ తప్పకుండా తిరిగి యెక్కడ యెవరు కాస్తగోడ కదిపినా తక్షణం మా జాహిరులోకి తీసుకురావలసిన దని బంట్రోతు లందరితోనూ చెప్పు. ఇప్పుడు చాలా యెండ యెక్కింది. మేము రాలేము. నీవు సోమవారపు పేటలోకి వెళ్ళి పెళ్ళిపందిరిగలకలు తప్పకుండ ఆటంకపెట్టు. పెళ్ళి పందిళ్లకు యిండార్సుమెంట్లు పెళ్ళి అయిన కొన్నిదినాలకు కాని సాధారణంగా కావు. వారు రూపాయి చేతిలో పడవేసినట్టయితే అభ్యంతరం పెట్టక పందిరి వేసుకోనిచ్చి రూపాయి మా ఇంటికి తీసుకుని వచ్చి యియ్యి.

మల్ల—చిత్తము. బుచ్చయ్యఅరుగులు తీయించివెయ్యవలసిన దని కమీషనర్లు వుత్తరువు చేసినా రట. నాలుగురూపాయలూ యిచ్చుకొన్నా యింతే అయిందని మహాయేడుస్తూ వున్నాడు. నిన్న తమదర్శనానికి వస్తే బసలో లేకపోయినారట.

శాని—అతనితో ఫర్వాలేదని చెప్పు. కమీషనర్లు వుత్తరువు యిస్తే అమలు జరిగించేవాళ్లము మేముకాని వాళ్ళు కాదు. వూళ్ళో యిలాగంటివి లక్ష అమలు జరిగించకుండా మేము వదిలిపెట్టినాము. నీవు వెంటనే మాయింటికి రావలెను సుమా! మావాళ్లో పందిరి వెయ్యవలెను.

మల్ల—వైసుప్రెసిడెంటుగారు నిన్నసాయంకాలంవచ్చి పడమటి వీధి చూచి అది మహాకశ్మలంగా వున్నది యీరోజున నన్ను దగ్గిర వుండి తుడిపించ మన్నారు. ఆపని చేయించవద్దండీ?

శాని — పెధవపని అందులో దొరికేదీ పెట్టేదీ యేమైనా

వున్నదా? మాట్లాడక కూరుకో. ఇంతట్లో ధొరగారు మళ్ళీ వచ్చి ఆవీధి చూడరు. వకవేళ చూచినా వకమాటు తుడిపించినా వీధివాళ్లు మళ్లా ఖచారా చేసినారని చెప్పవచ్చును వూరుకో. పాదుతీగెలు పడిపోతూ వున్నవి. మాపందిరి బహుజరూరు. పంది రయ్యేటప్పటికి మధ్యాహ్నం గడ్డి పోగుచేసేవేళ అవుతుంది. నిన్నటిమోపు మహాచిన్నదిగా వున్నది. వక్క ఆవుకే సరిపోయింది కాదు. యీరోజున నీవు స్వంతంగా వెళ్ళి వచ్చిగడ్డిమోపులవాళ్ల చేత తలామరికాస్తా వేయించి పెద్దమోపు కట్టించి పట్టించుకొని రా. వాళ్ళు తిన్నగా వెయ్యకపోతే వీధిలో పెట్టి అమ్ముతూవున్నారని రేపు వాళ్ల నందరినీ ప్రోసిక్యూటు చేతాము. నీవు వెళ్ళి రా. భోజనపువేళ అయింది. మేము యింటికి వెళుతాము. వారముదినముల డయిలీ అక్టే వున్నది. యేదో వకటికల్పించి పూర్తి చేసి రేపటిమీటింగుకు తయారు చెయ్యవలెను.

(అని వెళ్ళుచున్నాఁడు.)

---

ద్వితీయరంగము—గోవిందరాజుగారి సావిడి.

[కామిసెట్టియు, గోవిందరాజుగారును, వెంకటాద్రిజును, గంగయ్యనాయుఁడును, వ్యాఘ్రాద్రిపుధానులుగారును, భీమారావుపంతులుగారును, మరికొందఱును ప్రవేశించుచున్నారు.]

కామి—గోవిందరాజుగారూ! యీరోజు మీటింగులో చెయ్య వలసినపని యేమిటి?

గోవిం — మరి యేమీ లేదు. మ్యునిసిపల్ కమీషనర్లను యేర్పరచుకునే అధికారం జనులకు యిప్పించవలసిందని పన్నులు చెల్లించేవా రందరూ దస్కతులు చేసి గవర్నమెంటుకు మనగ్రామం నుంచి మహజ్జరు పంపించడానికి. ఈమ్యునిసిపాలిటీలో జరుగుతూవున్న

అక్రిమాలన్నీ మీరు చూస్తూవున్నారు గదా?

కామి — తప్పకుండా మహజరు పంపించవలెను. ఇప్పుడు కమీషనర్లు మషా వోచుకుంటూ వున్నారు. నావద్ద—

భీమా—అలాగంటిసంగతులు పదిమందిలోనూ చెప్పకు తంటా వస్తుంది. మనం యీ యిరవయిమందితోనేనా మీటింగు చెయ్యడం?

గోవిం—మామనుష్యులను అందరియిళ్లకూ తిప్పినాను. యెంతో మంది వస్తామని నాతో చెప్పినవాళ్లే రాలేదు. ఇటువంటివిషయంలో మనవాళ్లకు శ్రద్ధ లేదు.

గంగ—నాకు తెలియక అడుగుతాను చెప్పండి. యేర్పరుచుకునే అధికారం గవర్నమెంటువారు ప్రజలకు యిస్తే దానివల్ల మనకు వలికే సైకుంఠం యేమిటి?

గోవిం—మదనయ్యగారూ నాగభూషణరావుగారూ మొదలయినవారివంటి మంచికమీషనర్లను మనం యేర్పర్చుకోవచ్చును. అటువంటివారు వస్తే అక్రిమాలు యేమీ జరగక అందరికీ న్యాయం దొరుకుతుంది.

వ్యాఘ్రా—అటువంటివారు కమీషనర్లయితే ప్రజలకేమీ లాభం వుండదు. వాళ్ళకు దేవబ్రాహ్మణభక్తి లేదు. నేను మొన్న యిల్లు కట్టుకుంటూ వీధిఅరుగులకోసం వీధిలోది సర్కారుస్థలం రెండు గజాలు యిప్పించమని బతిమాలుకుంటే తమపుట్టి మునిగిపోయినట్టు వేదం చదువుకున్న బ్రాహ్మణ్ని అని అయినా చూడక వల్లపడదన్నారు.

గోవిం—వీధిలో స్థలాలు కలుపుకుంటే వీధి యిరుకయి బళ్ళు వెళ్లడానికి యిబ్బంది కాదటయ్యా!

వ్యాఘ్రా—ఏమీ యిబ్బంది లేదు. వూళ్ళో మావీధికంటె యిరుకుసందులు లేవూ? మావీధిలో రెండుబళ్లు అవ్యాహతంగా వెళ్ళ

జానికి స్థలం వున్నది. నాకు రెండుగజాలుస్థలం యిచ్చినా వక్కబండీ నిరభ్యంతరంగా వెళ్లవచ్చును. సర్కారుస్థలంగాని వాళ్ళతాతలు సంపాదించినది యేమయినా భూదానం చేస్తారా యేమిటి?

గోవిం—సర్కారుస్థల మయితేమాత్రం యుక్తాయుక్త మక్కర లేదండీ?

వ్యాఘ్రా — వాళ్ళ యుక్తాయుక్తాలు యేడిసినట్టే వున్నవి. బ్రాహ్మడికి భూమి యివ్వడంకంటెనూ యుక్తం యేమి వున్నది? అడిగితే నాలుగురూపాయలు వాళ్ళముఖాన్న పారవెయ్యడానికికూడా నేను సిద్ధపడినాను. వాళ్ళు నాలుగుడబ్బులసొమ్ము తిని అయినా పరోపకారం చెయ్యడం యెరగరు. వాళ్ళు వట్టి కర్కోటకులు. వాళ్ళు మాట దక్కించుకున్నారు కారుగాని నేను వెళ్ళి బుచ్చయ్యపంతులుగారితో మనవిచేసుకుంటే ఆమహారాజు నాదగ్గ యేమీ పుచ్చుకోకుండానే గున్నయ్యనాయుడుగారితోనూ సోమిసెట్టిగారితోనూ చెప్పి ఆకిరాతులు వూళ్ళో లేనప్పుడు నాపిటీషన్ మీటింగులో పెట్టించి అరుగులకు శాంక్షన్ యిప్పించినారు. ఎందుకయినా జనుల కష్టనిష్ఠూరాలు తెలిసిన బుచ్చయ్యపంతులుగారివంటి కమీషనర్లు వుంటేనే లాభం వున్నదిగాని దయాదాక్షిణ్యాలు లేని నాగభూషణరావుగారు మొదలయినవారివంటి కర్కోటకులు కమీషనర్లుగా వుంటే ప్రజలకు యేమీ సదుపాయం లేదు.

గోవిం—మీ రంటే లాభంపొందినారు గనుక యిలా అంటూ వున్నారుగాని వీధిలో యిటునుంచి వకబండి అటునుంచి వకబండీ వస్తే యెటు వెళ్ళడానికి వల్లకాక యెంత యిబ్బంది కలుగుతుంది?

వ్యాఘ్రా—బ్రాహ్మణవీధులోనుంచి అసలే బళ్లు రానియ్య కూడదు. యీ దిక్కుమాలిన బళ్ళరహదారీ మూలంగా కొన్న

కట్టించుకున్న మా వీధిఅరుగులన్నీ వారానికి రెండుసార్లు పడిపోతూ వున్నవి. మెత్తుకోలేక చస్తూ వున్నాము మునుపు మావీధిని బళ్లను గాని మాలవాళ్లనుగాని నడవనిచ్చేవాళ్ళమయ్యా? మీరు మహా అక్రమాలు అంటారుగాని ఆకమీషనర్లు చేసేఅక్రమాలు యేమిటో నాతో చెప్పండి. యెవరివృత్తి యెవరు మానుతారు? లంచం పంచం తినడం వుద్యోగధర్మ మవునా కాదా?

గోవిం—ఇప్పుడు జరుగుతూవున్న అక్రమాలు లక్షలూ కోట్లూ వున్నవి. రోడ్లు మరమ్మతు చెయ్యడానికి సొమ్ము ఖర్చువ్రాసి తిన్నగా బాగుచేయించకుండా అదంతా లోపాయికారీని కంట్రాక్టరులూ తామూ కడితేరుస్తారు. వీధులలో లాంతర్లు వెలిగించడానికి యెంతో చమురు ఖర్చువ్రాయించి లాంతర్లలో తగినంతచమురు పోయించక తమ యిళ్లవద్దదీపాలలో పోయించుకుంటారు. వీధులలో దీపాలు చమురు లేక పెట్టడంతోటే ఆరిపోయి వీధంతా చీకటిగా వుంటుంది. బీదవాళ్ళు తాటాకుగుడిసెలు వేసుకోవడానికి సెలవియ్యక తంటాలు పెట్టి వాళ్లను యేడిపించి వాళ్లవద్ద రూపాయీ అర్థా పుచ్చుకుంటారు. లేనిపోనివాళ్లకు వృత్తిపన్నులు—

గంగ—మీమాటకు అడ్డం వస్తాను ముందుగా నాప్రశ్నకు జవాబు చెప్పండి. ఈఅక్రమాలన్నీ మనం యేర్పరుచుకున్నవాళ్లే చేస్తే అప్పుడు యేంచేస్తారు?

గోవిం—మనం యేర్పరుచుకున్నవాళ్ళు వక్కసారి అక్రమం చేస్తే రెండోసారి వాళ్ళను మనం మళ్ళీ యేర్పరుచుకోము. ఆభయం చేత వారు జాగ్రతగా ప్రవర్తిస్తారు.

గంగ—మీరు నూరనండి వెయ్యనండి. లంచాలు పుచ్చుకునే కమీషనర్లు వుంటేనే మనకు లాభం. వాళ్లు నాలుగుడబ్బులు తిన్నా

వుపకారం చేసి మరీ తింటారు. ఏమీ తినకపోతే వూరికే వూరంతా తిరిగి కమీషనరుగా వెట్టిపని చెయ్యడం వారికి కంచిగరుడసేవా యేమిటి?

వ్యాఘ్రా—మీరు బహుబాగా అడిగినారు. మీతో నేను పూర్తిగా యేకీభవిస్తాను. లంచాలు పుచ్చుకునేవాళ్ళు వుండడమే యెందెందులకూ మంచిది. యిల్లు కట్టుకుని వూళ్లో కాపురం చేసేటప్పుడు యే లోపాలయినా వుంటవి! యేవుపకారమయినా కావలసివస్తుంది.

వెంక—శాస్త్రులుగారు బహుతెలిసినవారు. ఆయన చెప్పినట్టే మేము నడుచుకుంటాము. మీటింగుఅక్కరలేదు. వెళ్ళుదాముపదండి.

గోవిం—ఏర్పరచుకునే అధికారం మనచేతులో వుంటే ఆ లంచాలు పుచ్చుకునే కమీషనర్లయినా మనంచెప్పినట్టు వింటారు. మహజరు తప్పకుండా పంపించవలెను.

వ్యాఘ్రా—మదనయ్యగారినీ నాగభూషణరావుగారినీ యెప్పుడూ కోరకుండా వుండేటట్టయితే నేను మహజరులో దస్కతు చేస్తాను.

భీమ—మహజరు తయారుచేయించండి. రేపు మళ్ళీవస్తాము.

(అందరును లేచిపోవుచున్నారు.)

---

# కామరూపమంత్రము

## ప్రథమాంకము.

### ప్రథమరంగము—జంబుకేశ్వరవర్మగృహము.

[జంబుకేశ్వరవర్మయు, రాజగర్జ్ఞుడును ప్రవేశించుచున్నారు.]

జంబు—నీ వెనుకటిప్రయత్నమును పూర్ణముగా నదలిపెట్టితి విగదా?

రాజ—మొదలంట విడిచినాను.

జంబు—నీవు నీ తల్లిగర్భములో నుండగానే మనబ్రహ్మాసిద్ధాంతి నాకు పుత్రుడు కలుగునని చెప్పినాడు. ఆయన మహా తపశ్శాలి. ఆయన యన్నమాట యమోఘమునుమా!

రాజ—ఆయన తపోమహిమ నాకు తెలియదా? ఆయన చెప్పినజ్యోతిషమును బట్టియే నేను మీ:కిటువంటిపుత్రుడను పుట్టినాను.

జంబు—తల్లిపోయిన బిడ్డను నిన్ను బహుకష్టపడి పెంచినాను. నీవు నీ వెఱ్ఱియాలోచనను విడిచిపెట్టబట్టిగాని లేకపోయినయెడల నీ మాతామహార్జిత మైనధనము నపహరించవలెనని నోళ్ళు తెఱచికొని యున్న నీతాతజ్ఞాతు లింతకు ముందే యానందభరితులై పొంగుచుం దురుసుమా. ఇంతవఱకును వారి కన్నులను గప్పుట కప్పుటకాదు గాని యిప్పుడు నీసహాయముచేత నిశ్చయముగా వారినోళ్ళలో మన్ను వేసినాను. ధనములో నెంతమహిమ యున్నదనుకున్నావు? "ధనమూల మిదంజగ" త్తన్న వాక్యము నీవు వినలేదా?

రాజ—విన్నాను. మీరన్నది నిజమేకాని సుఖప్రదముగాని

ధనమువలన బ్రయోజన మేమి ? ధనమువలన గలుగవలసిన ప్రయోజ నమంతయు సుఖమేకదా ? సుఖమునకు భంగము కలిగించునది యగా నేని అట్టిధనమును విడుచుటయే ధర్మము.

జంబు—నీవింకను ధనముకంటె సుఖమే యెక్కువనుచున్నావు. నీ వెనుకటికోరిక నీమనస్సులో మొదలంట నశింపలేదని తోచుచున్నది.

రాజ—నిజము చెప్పుచున్నాను. ఇప్పు డాప్రయత్నము నా మనస్సులో లేనేలేదు. ఇప్పుడు నేను పూర్ణముగా శ్రోత్రదారికి వచ్చినాను.

జంబు—ఈమాట నీ నోటినుండివిని నాచెవులు చల్లపడినవి. ధనముతో సమానమయినది లోకములో నేదియు లేదు. వేయిసుఖ ములు పోయినను ధనమును పోగొట్టుకోరాదు. నిత్యమును కన్నుల పండువుగా ధనమును చూచుచుండుసుఖమును మించిన సుఖము మఱియేమున్నది? సంచులలో గల్లుగల్లుమని రూపాయలమోత వినుచుండుట చెవులపండువు కాదా? మన క్షత్రియకులమున బుట్టిన వారికి మనకింతయున్నది చాలదా యని ధనవిషయమున తృప్తియుం డరాదు. ‹‹అసంతుష్టా ద్విజా నష్టా స్సంతుష్టా ఇవ పార్థివా'' అనిచెప్పిన పూర్వులు వెఱ్ఱివా రనుకొన్నావా?

రాజ—వారు వెఱ్ఱివా రనుకోలేదుగాని నేనుమాత్రము నా యభిప్రాయమును సుఖముకంటె ధన మెక్కువ యన్నయుద్దేశముతో మార్చుకోలేను.

జంబు—మఱి యేల మార్చుకొన్నావు?

రాజ— నాసుఖమునకంటెను జనకాజ్ఞ నా కెక్కువయినది. యావజ్జీవమును కష్టముల కైన నోర్వవలెనుగాని యవిలంఘనీయమైన తండ్రియాజ్ఞను మీఱరాదన్న పితృభక్తిచేత మానుకొన్నాను.

జంబు—నీవన్నది పరిహాసపుమాట కాదుగదా ?

రాజ—నామాటయందు దంతనమ్మకము లేనియెడల, మీరాయి ష్టమువచ్చినట్లు భావించుకొనుడు.

జంబు—పితృాజ్ఞాపరిపాలనమునందు శ్రీరాములను మించిన బిడ్డను గనుటచే నే నిప్పుడు కృతార్థుడయినాను. నీకు కన్యల నిచ్చెదమని యెందఱో తిరుగుచున్నను నామనస్సులోని భయముచేత—

రాజ—గతమును గూర్చి విచారించిన ప్రయోజనము లేదు. ముందు జరుగవలసిన పని చూడుడు. సత్రములో దిగియున్న యోగిని మీరాహ్వానము చేసినారా ?

జంబు—ఆయన తపస్సంపన్నుడేకదా ?

రాజ — మహాతపస్సంపన్నుడు. ఆయన బ్రహ్మతేజమును మీరు చూడలేదా ? తపశ్శక్తిచేతనే కాకపోయినపక్షమున, మేలిమి బంగారు నపహసించెడు పసిమిచాయ యాయన కాయమున కెట్లు వచ్చినది ? గడ్డమంతయు తెల్లపడినను దేహమున నొక్క ముడుత యైనను లేకపోవుటనుబట్టియైనను మీరామహాత్ముని తపోమహిమను కనిపెట్టలేదా ? ఆయన మహా మంత్రసిద్ధుడు.

జంబు—అంతటి మంత్రసిద్ధుడా ? ఈకలియుగములో మంత్ర మహిమలు ప్రత్యక్షముగా కనబడునా ?

రాజ—ఇటువంటి మహానుభావులవద్ద మాత్రము కనబడును. పుత్రులులేనివారికి పుత్రులను కలిగించెడి మహామంత్ర మాయనవద్ద నున్నది. మనుష్యులను కామరూపములను జేయు దివ్యమంత్ర మాయనకు సిద్ధించినట్లు నేను రహస్యముగా దెలిసికొన్నాను. ఇది పరమరహస్యము. నాకుతప్ప నన్యులకు తెలియదు. నేను కొన్నిదినము లాయనవెంటనుండి స్వీయమంత్రశక్తిచేత నామహామహుడు నిజ

రూపమును మార్చుకోగలుగుట నేను మాయోపాయముచేత కని పెట్టినాను.

జంబు—ఆ మంత్రి మొక్కటి నీయందు ప్రయోగించిన—

రాజు—వేయిమాట లెందుకు? ఆయనను దెచ్చి మనయింట నుంచి నన్ను శిష్యునిగా నుంచితిరా శుశ్రూషచేత నే నాయనను మెప్పించి పూర్వము దూర్వాసునివలన సంతానమంత్రమును కుంతీదేవి గ్రహించినట్లుగా కామరూపమంత్రమును సమర్మముగా నుపదేశము పొందెదను. అప్పుడుగాని నాశక్తి మీకు దెలియదు.

జంబు—మంత్రప్రభావముచేత స్త్రీలు పురుషులును పురుషులు స్త్రీలును అగుదురా?

రాజు—స్త్రీలను పురుషులనుగాను పురుషులను స్త్రీలనుగాను మార్చుట యేమివింత? ఆయన తలచుకొన్న పక్షమున మీరు చూచుచుండగానే జనులనందఱిని గాడిదలనుగా మార్చగలడు.

జంబు—ఆయద్భుతము నేను చూడవలెను.

రాజు—ఇప్పుడేపోయి ప్రార్థించి మీరాయోగిని మనగృహమునకు తోడ్కొనిరండు. ఆయద్భుతమును మీ రల్పకాలములోనే చూడగలరు. పొండు.

జంబు—నీవు లోపలికిగది యోగిజనులుండుటకు తగినట్లు చేయుచుండుము. నే నింతలో పోయి యోగీంద్రుని ప్రార్థించి తోడుకొని వచ్చెదను.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

---

ద్వితీయరంగము—జంబుకేశ్వరవర్మ గృహములోని గది.

[చిదానంద యోగీశ్వరుఁడును, రాజరత్నమును ప్రవేశించుచున్నారు.]

చిదా—ఓ రాజకులరత్నమా! నీతండ్రి నిత్యమును కామరూపమంత్రమని పలవరించుచున్నాడు. ఇన్నినాళ్ళనుండి శుశ్రూష చేయుచున్నావు గదా? నా కామరూపమంత్రమహిమను నీవు కనిపెట్టినావా?

రాజ—మీ మహిమను ముందుగా నే యెఱిగియుండబట్టి నేను కనిపెట్టగలిగితినిగాని మీ కామరూపమహిమ నెవ్వరు కనిపెట్టగలరు? మీ మహిమ లితరులకు దురూహ్యములు. కుసుమకోమలమైన మీ లేతదేహమున చామరమునుబోలిన యీ మసలిగడ్డ మెప్పు డెట్లు మొలచినదో యెవ్వరికి గోచర మగును? ఇట్లు కొన్నిదినములు గాక మీకు నిరంతరసేవచేయు భాగ్యము సంభవించినప్పుడుగదా నేను కృతార్థతబొందుదును!—ఎవ్వరిదో యడుగుల చప్పుడువలె నున్నది! (ఆలకించి) లేదు లేదు. మనస్సులో శంకించుచున్నప్పు డూరక యిట్టి భ్రమ కలుగును,—నిన్న మీ రుపదేశించినమంత్రమును నేను చక్కగా గ్రహించినాను. మన మంత్రరహస్య మెవ్వరికిని దెలియగూడదు. ఇక దానిని ప్రయోగించవలెను. దాని సిద్ధివిషయమున నాకు సందేహములేదు.

[జంబుకేశ్వరవర్మ ప్రవేశించుచున్నాఁడు.]

జంబు—(తనలో) ఈఋషీశ్వరుడు మన రాజరత్నమునకు మంత్రోపదేశము చేసినమాట చెవినిబడి నేను చరితార్థుడ నయినాను. అయినను నేనిది విననట్టు నటించెదను. రాజరత్నము మనస్సు నిజముగానే తిరిగినది. నే నిక నారాయణవర్మవిషయమున భయపడవలసిన పని లేదు. (అడుగుకొనుచు సమీపించి) స్వామీ! దేవరకు పరిచర్య

చక్కఁగా జరుగుచున్నదా ?

చిదా—(తనలో) ఇప్పుడు వినబడ్డది యితని అడుగులచప్పుడే. సందేహము లేదు. ఇతఁడు మా సంభాషణమును వినియుండునుగాని యర్థమును గ్రహింపఁగలిగి యుండఁడు. (ప్రకాశముగా) ఇటువంటి యపూర్వ పరిచర్యాసుఖమును మే మిదివఱ కేశిష్యులవలనను బొంది యుండలేదు. ఈ యవ్యాజసపర్యకు మాహృదయ మానందించినది. నీమనోరథము శీఘ్రముగానే సఫలము కాఁగలదు.

జంబు—ఓ మహానుభావా ! సఫలమయినదనియే సెలవిండు. మంత్రోపదేశము చేసితి రన్నశుభవార్త నేను పొంచుండి యిప్పుడు మా రాజరత్నమునోటినుండి విని కృతార్థుడ నయినాను. నేను జేసిన యీయపచారమును మన్నింపవలెను. నారాయణవర్మ బాధ విముక్తి చేసి నన్ను బ్రతికించినారు.

చిదా—మీ రాజరత్నమునకు వివాహమహోత్సవము నడుచువఱకును నారాయణవర్మబాధ విముక్తి యయిన దని సంతోషింపఁగూడదు. మేము మాశిష్యునకు జేయవలసినయుపదేశమును జేసితిమి. సమర్మముగా నుపదేశించిన మా మంత్రప్రభావముచేత సమస్తమును శస్తమగును. ఇటువంటి మంత్రరాజము కరగత మయినప్పుడు పురుషులు స్త్రీలుగా మాఱినను స్త్రీలు పురుషులుగా మాఱినను కడకు మీరాదిగా జనులందఱును గాడిదలుగా మాఱినను నెవ్వరును నాశ్చర్యపడవలసినపని లేదు. ముందీకన్నులనే నీవెన్నెన్నో వింతలుచూడఁగలవు.

జంబు—రాజరత్నముయొక్క మాతామహధనమునకు భంగము రాదుగదా ?

చిదా—రాదు. మే మన్నమాట వరదానమనుకో. నేటి కాఱు నెలలలోపల నీకోడలే స్త్రీవియ్యంకునిజ్ఞాతులకు తృప్తికరముగా జెప్పి

సందేహనివారణ చేసి నిర్వివాదముగా మీరాజరత్నము పుత్రపౌత్ర పారంపర్యముగా ననుభవించునట్లు చేయగలదు. మామాట నమ్మము ధనము చెందనర్హులైనవారి కేల చెందకుండును ?

జంబు—(ఆశ్చర్యముతో) ఆఱు నెలలలోపలనే నాకు కోడలు వచ్చునా ?

చిదా—మేము యోగదృష్టిచేత సర్వమును జూచినాము. నేటికి నాలవదినము రాత్రి కనకాభరణభూషితురాలయి యొక రాచకన్నియ మీయింటికి రాగలదు. ఆమెను కులగోత్రనామము లడుగక తక్షణమే మీరాజరత్నమునకు వివాహము చేయుము. నీ వీలోపలనే వివాహ సన్నాహమును జేసికొన సంసిద్ధుడవయి యుండుము. ఈ మూడు దినములను మీరాజరత్నము మే ముపదేశించినమహామంత్రమును దినమునకు వేయేసిమాఱులు పునశ్చరణము చేయుచుండవలెను. అది సంవత్సరమునకుగాని సిద్ధి పొందదు. మీయింటికి వచ్చెడుచిన్నదానిని స్త్రీరూపమున వచ్చిన రాజరత్నముపాలిటి భాగ్యదేవతనుగా భావింప వలెనుగాని సామాన్యమానవభామినిగా భావింపగూడదు. మేము రేపు రాత్రి యంతర్హితులమయి పోయి మా యోగమహిమచేత నెడబాయ కుండి మీరాజరత్నము పుత్రసంపదలతో వర్ధిల్లునట్లు కటాక్షించు చుండెదము. మే ముపదేశించినమంత్రము నిర్విఘ్నముగా ఫలించును గాక !

జంబు — ఇవి యాశీర్వచనములు గాక మాకు నిజమయిన వరములే.

చిదా—మా మంత్రముయొక్క ప్రయోగోపసంహారక్రమమును మే మింకొక్కసారి రాజరత్నమునకు నే నుపదేశింపవలెను. నీ వించుక తడవు దూరముగా నుండవలెను. రేపటిలో మా యుపదేశములు

కాగానే మేము తపస్సమాధినిమిత్తము హిమాద్రికి బోయెదము.

జంబు—చిత్తము. (అందఱు నిష్క్రమించుచున్నారు)

---

తృతీయరంగము—నీళ్ళరేవు.

[రంగమ్మ, వెంకమ్మ, సుందరమ్మ మొదలయినవారు ప్రవేశించుచున్నారు.]

రంగ—వెంకమ్మా! వెంకమ్మా! వూళ్ళోవింతలు విన్నావా? అందరూ చెడచెప్పుకుంటూ వున్నారే.

వెంక—ఏమి వింతలే? కాలమహిమ యేమోకాని యిప్పుడు మహావిడ్డూరాలు పుడుతూ వున్నవి సుమా.

రంగ—నే నన్నది జంబుకేశ్వరవర్మగారి యింట్లోమాటే.

వెంక — నే నన్నదీ అదేనే. ఆడదానికి మీసాలు రావడం యేమిటే? యెక్కడైనా యింతవిరుద్ధం వుంటుందా? అంతా అబద్ధమే. ఇది వట్టికల్పన.

రంగ—మన కేం తెలుసునే అంతా నిజమనే చెప్పుకుంటూ వున్నారు.

సుంద—నిజం కాకపోతే వూరికే అబద్ధాలు పుట్టవు. మీరు విన్నది సందేహం లేకుండా నిజమైనమాట. దగ్గిరగా రండి. నేను రహస్యం చెపుతాను. (అని రహస్యముగా) నేను వాళ్ళ యింటి దాసీదాన్ని కనుక్కున్నానరా. అది జంబుకేశ్వరవర్మగారి కోడలికి మీసాలు రావడం తాను కళ్ళారా చూచినాననీ, రాణివాసం అవడం చేత మొగవాళ్ళకి యెవరికీ తెలియదనీ, నిన్న నాతో ప్రమాణం చేసి చెప్పింది.

వెంక—ఇటువంటి విపరీతాలు యెక్కడనయినా వుంటవిటమ్మా? నేను నమ్మను.

రంగ—ఆడవాళ్లకుకూడా అక్కడక్కడ మీసాలు రావడం కలదు. మా మేనత్త కొకావిడకు కొంచెం నూగునూగుగా వచ్చినవి.

వెంక—రాజరత్నము పెళ్ళాము మహా అదృష్టవంతురాలట. నాలుగు నెలలకిందట! రాజరత్నము తల్లి పినతాతమనమలు వచ్చి రాజరత్నము మగవాడే కాడనీ, అతని మాతామహుని ఆస్తిని తమకు రావలెననీ తగాదా పెట్టినారట. అప్పుడావిన్నది తగిననిదర్శనంచూపి దౌహిత్రం మొగుడుకి వచ్చేటట్టుచేసి వాళ్లను పంపించివేసిందట. వాళ్లు సిగ్గుపడి నోరెత్తకుండా లేచిపోయినారట.

సుంద—మీరు మాట తెచ్చినారు గనుక నేను మీతో యింకా రహస్యంకూడా చెపుతాను. రాజరత్నమునకు కడుపు మెత్తయి యేడు మాసాలగర్భంలాగు వున్నదట! ఇదేంవిరుద్ధమే! ఆడవాళ్లకు మీసాలు రావడమైనా విన్నానుగాని మొగవాళ్లకు కడుపు రావడం నేను యెక్కడా వినలేదో.

రంగ—ఓసి మెల్లిగా మాట్లాడవే. అవతల జపం చేసుకుంటూ వున్న శాస్త్రుర్లుగారు వినిపోతారు. వింటే అప్రతిష్ట.

(అని చేతితో నోరు మూసికొనుచున్నవి.)

శాస్త్రి—అందఱును విన్నదాని కింత రహస్య మేమి? మీరు విన్నదానిలో విరుద్ధ మేమియు లేదు. మగవాండ్రకును కడుపు రావచ్చును. పూర్వము మాంధాత తండ్రికి యువనాశ్వునికి కడుపు రాలేదా? పురూరవశ్చక్రవర్తి తండ్రికి సుద్యుమ్నునికి కడుపు రాలేదా మంత్రప్రభావమువల్ల కలుగవచ్చును. ఈమధ్య నెవరో యోగి వా రింటికి వచ్చినాడట! ఆయోగి మంత్రమహిమచేతనే యీఅద్భుతా లన్నియు పుట్టినవి. బ్రాహ్మణప్రభావమంటే సామాన్యమనుకొన్నారా యేమిటి? ఈమధ్య తపశ్శాలులు తక్కువయి మహిమలు కొంత

కాలమునుండి కనపడకుండ నున్నవి.

వెంక — ఏమిమహిమలో కాని నాబుద్ధికి బోధపడకుండావున్నవి. రాజరత్న మాడదీ, పెళ్ళాము మగవాడూ కాదుగదా? ఆచిన్నది యెవరాడపడుచో యెవరికీ తెలియదట.

రంగ—అంతవిరుద్ధం వుంటుందే?

శాస్త్రి—ఉండవచ్చును. అది విరుద్ధమే కాదు. మంత్రమహిమ చేత నెంతలేసివింతలైనను పుట్టవచ్చును. పూర్వము శిఖండి ఆడది మగవాడు కాలేదా? యక్షుడు మగవాడు ఆడది కాలేదా? ఇదంతా ఆయోగిప్రభావమయి యుండును. నేను పోయి దీని నిజమంతయు మధ్యాహ్నమువిూద జంబుకేశ్వరవర్మగారినే అడిగి తెలుసుకొనెదను.

సుంద — ఈ వెఱ్ఱిబ్రాహ్మడు కొంపతీసి అక్కడ మనపేర్లు చెప్తాడేమో?

మంగ—నీళ్లకు వచ్చి చాలాసేపయింది. అత్తగారు కోపపడు తుంది. యింటికి వేగిరం వెళుదాము రండే.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

చతుర్థరంగము—జంబుకేశ్వరవర్మ గృహము.

[శాస్త్రియు, జంబుకేశ్వరవర్మయు ప్రవేశించుచున్నారు.]

జంబు—మీరు విన్నదంతయు సర్వాబద్ధము. ఆడదానికేమి? మీసా లేమి? పోవయ్యా.

శాస్త్రి—ఒకవేళ నిజమే కావచ్చును. జనవాక్య మెప్పుడును అబద్ధము కాదు. యోగియొక్కమహాత్వముచేత నీకొడుకును కోడలును రూపాలు మార్చుకొన్నారని పురాణపండితులు చేసిన సంశయనివా రణమునుబట్టి యీగ్రామములో అందఱును ఏకవాక్యముగా సిద్ధాంతము

చేసికొన్నారు. ఆలోపలినుండి వచ్చువా రెవరు?

[నారాయణవర్మయు, రాజరత్నమును ప్రవేశించుచున్నారు.]

నారా—నేను నీయల్లుడను నారాయణవర్మను. ఈమె నాభార్య రాజరత్నము. మీయింటనుండి నీకూతురికి మంత్రోపదేశము చేసి వివాహము చేయించిన యోగిని నేనే. తరువాత నాలవనాటిరాత్రి రాచకన్నియవేషము వేసికొనివచ్చి నీకూతురిని వివాహము చేసికొన్నదియు నేనే నా కామరూపమంత్రమహిమ యిప్పుడు బోధపడినదా? తెలియకపోయినపక్షమున, నీకొడుకును కూతురినిగా మార్చినదానిని బట్టియైనను నా కామరూపమంత్రమహిమ నీ కిప్పుడు బోధపడకపోదు. దౌహిత్రుడని చెప్పి నీ వియ్యంకునిసొత్తు జ్ఞాతులకు చెందకుండ నపహరింపవలెనన్న దురుద్దేశముతో కూతురు కొడుకని బొంకి నీ వింతకాలము లోకమును మోసపుచ్చినావు. రాజరత్నమునకు కొడుకు పుట్టినతరువాతనైనను నిజము గ్రహింతురని చెప్పి నేనప్పుడు జ్ఞాతులను బంపివేసినాను. ఎవరి కేవి రావలెనో వారి కవే వచ్చినవిగాని మగవానికి కడుపును రాలేదు; ఆడదానికి మీసములును రాలేదు. మే మిద్దఱమును సహాధ్యాయులమయి యున్నప్పుడు నీకొమార్తెకు నామీద గలిగినవలపుచేత గుట్టు బయలుబడి మే మిద్దఱమును దంపతులము కాజూడగా నీ వనేకవిధముల విఘ్నములు కలిగించి కార్యవిఘాతము చేయ జూచినావు. నీ వప్పుడు ద్వేషించిన నారాయణవర్మనే నేను. నేను యోగినయి యుండినప్పుడు నిన్నును సర్వజనులనుగూడ గాడిదలనుగా జేయగలశక్తి నాయొద్ద నున్నదని నీతో జెప్పి యున్నాను. నా మంత్రమహిమను తెలిసికొలేకపోవుటచేత నిన్నును నమ్మరాని విరుద్ధాంశములను నమ్మించుటచేత జనులను గాడిదలనుగా జేసినానా? లేదా? ఇక మీ రిట్టికామరూపములనుమంత్రములనునమ్మకుందురుగాక!

జంబు — (విస్మయముతో) నాకు కోడలు రాగానే విఫల ప్రయత్నుడయి నారాయణవర్మ చింతచేత గ్రామమువిడిచి లేచిపోయినా డని యెల్లవారును చెప్పుకోగా విని నమ్మి యేమఱి యున్నాను. వీడు నాయింటనే ప్రవేశించి నాకొంప తీసినాడా! ఎంతమోసము చేసినాడు!

నారా—ఇది మోసము కాదు. ముందయినను నీవు బుద్ధికలిగి యుండుటకు చేసినహితోపదేశము.

జంబు—రాజరత్నమా! ఇంతకాలము కొడుకునువలె పెంచి నీకు చదువు చెప్పించినందునకు తుదకు నీవు తండ్రికే పంగనామాలు పెట్టినావు! ఉపాధ్యాయులవద్ద నీవు మంచిచదువే చదివినావు. ఆడ దానికి చదువు చెప్పించరాదని పెద్దలు చెప్పినమాట—

రాజ—చదువులో నేమున్నది? చదువుకొట్టియే నేను సద సద్వివేకముగలదాన నయి యీశ్వరభక్తి గలిగి—

జంబు—(మఱింత విభ్రాంతుఁడయి) చాలు; చాలు. ఈపాటి నీచదువు చాలించు. నీ వన్న పితృభక్తి యిదేనా?

రాజ—నీయెడల నాకు భక్తి లేకపోలేదు. నీ కేయుపచారము చేయుమన్నను నీయాజ్ఞను శిరసా వహించి యిప్పుడును చేసెదను. అయినను నే నన్యాయ ప్రవర్తనమునకు జొచ్చి యితరులను మోస ముచేసి పితృాజ్ఞయని తండ్రులకెల్లను దండ్రియు న్యాయాధిపతులకెల్ల న్యాయాధిపతియునగు నీశ్వరునియెడల నపరాధము చేయజాలను. ఈ నారాయణవర్మ సొత్తును, ఇచ్చినయెడల నీ సొత్తును, మా సుఖజీవన మునకు జాలును. ఏసొత్తు రాకపోయినను మేము మాకష్టార్జితవిత్త ముతో సుఖపడుదుము. నామాతామహవిత్తము జ్ఞాతులకే పోనిమ్ము. ఇంకొకమాటవినుము—

జంబు — నా కన్నకూతురినోటినుండి యిటువంటిమాటలు

నేను వినజాలను. ఓ శాస్త్రీ ! నీవు మాంధాతకథలను శిఖండికథలను జెప్పి, మంత్రప్రభావముచేత నా కొడుకును కోడలును తాపసునా రయిరని యెల్లవారికిని జెప్పుము. చేత జిక్కినసొత్తును నేను విడువను. ఆవల నన్నెవ్వరేమి చేసెదరో చూతము. నీతో నింకొక రహస్యము చెప్పెదను నావెంట రా.

(అని యూవలి కీడ్చుకొని పోవుచున్నాఁడు.)

---

## లు లా య శా స్త్రి.

---

౧. రంగము—భోజనగృహము.

[కరణము వేంకటరావుపంతులుగారును, శంకరశాస్త్రిగారును, భోజనములు చేయుచు పరివేశించుచున్నారు.]

శంక—(జుఱ్ఱుచు) పంతులుగారూ! పెరుగు దివ్యంగా వున్నది. ఇది ఆవు పెరుగేనా ?

వెంక—ఆవుపెరు గింతగట్టిగా వుండదు. ఇది బఱ్ఱె పెరుగు. శాస్త్రం చదువుకున్నవారు యింతమాత్రం తెలుసుకోలేకపోయినారు గదా ?

శంక—(తనలో) ఇతడు నన్ను అల్లాటప్పా శాస్త్రికింద కట్టి వేసినాడు. విస్తరిదగ్గరనుంచి లేచేలోగా నాపాండిత్యము ఈయనకు కనపరచవలెను. (పయివంక చూచి) అటకమీద గుమ్మడికాయలు చాలావున్నవి. ఈయన కర్థం తెలియకుండా కూష్మాండా లెక్కడి వని అడుగుదామా? వద్దువద్దు. ఈయన కీమాట కర్థం తెలియకపో యినా, నేను అటకవంక చూడడాన్ని పట్టి గ్రహిస్తాడు. ఏదయినా గూఢమైనప్రశ్న వెయ్యవలెను. (ఆలోచించి) ఇన్ని గుమ్మడికాయలు

వుండడాన్నిబట్టి యీాయనకు పొలమూ వ్యవసాయమూ చాలావుండి వుంటుంది. ఎన్నికాళ్ళపశువు లున్న వని అడుగుదామా? ఇలాగడిగితే తెలిసిపోతుంది. ఎన్ని వృషభా లున్న వని అడుగుచాను. వద్దు. ఆమాటా తెలిసేదే. ఎన్నిపోతు లున్నవని సంస్కృతపదాలతో అడుగుచాను. దున్నపోతులకు సంస్కృతం యేమిటీ? మహిషము. మహిషమంటే తెలిసిపోచుంది. ఇంతకంటె పెద్దమాట వెయ్యవలెను. ఏదీ నిఘంటు? దిక్కుమాలిననిఘంటు సమయానికి స్మరణకు రాదు. ఈశ్వరానుగ్రహంవల్ల జ్ఞాపకం వచ్చింది. నేను నాపాలిట దైవమున్నాడు. "లులాయో మహిషో వాహద్విష త్కాసర సైరిభాః" ఇత్యమరః లులాయమన్నపదం దివ్యమైనది. (ప్రకాశంగా) కరణంగారూ! మీావద్ద లులాయాలు చాలావున్నట్టున్న వే?

వెంక — (తనలో) యీాయన యేదో మహాకవిప్రయోగం చేసినాడు. లులాయమన్నది వ్యాసఘట్టంలాగు వున్న దే? ఎంత ఆలోచించినా అర్థము కావడములేదు. అర్థం అడిగితే మనపాండిత్యానికి భంగం వస్తుంది. బుద్ధిబలముచేత యెలాగయినా అడగకుండా అర్థం నాఅంతట నేనే కనిపెట్టవలెను. (ఆలోచించి) ఓహోహో! ఆ పదమున కర్థ మిప్పుడు బోధపడినది. నియోగిబిడ్డ నీమాత్రము గ్రహించలేకపోతే యిక నాబుద్ధివిశేష మేమున్నది? ఈయన అటకవంక చాలా సేపు చూచి నన్నీప్రశ్న అడిగినాడు. లులాయా లనగా గుమ్మడికాయలు. ఈవిషయమయి నేనాలోచించినట్టు కనపడకూడదు. (ప్రకాశముగా) శాస్త్రుర్లుగారూ! ఏమిటీ అడిగినారు? నా కుమారుడిపెళ్ళివిషయమయి ఆలోచిస్తూ తిన్నగా వినలేదు.

శంక — మీావద్ద లులాయాలు చాలావున్నట్టున్న వే అన్నాను.

వెంక — లులాయాలా? ఎన్నోలేవండి. ఈవున్నవి మాకు

సంవత్సరంపొడుగునా కూరకే చాలవు. మావాడిపెళ్ళికూడా వస్తూ వున్నది.

శంక—(తనలో) ఇంతకఠినమైనపదం ప్రయోగించినా, ఈయన యర్థం యిట్టే గ్రహించినాడే. నియోగులు తెలుగుకవిత్వం చెప్పే వారుగనుక వీరికి నిఘంటులు ముఖస్తంగా వచ్చి వుంటవి. అయ్యో! నేడు నాకు గొడ్డుమాంసం తినేవాళ్ళయింట్లో భోజనం తటస్థమయినదే. దీని కేమి ప్రాయశ్చిత్తం వున్నదో? ఈసంగతి యెవరితోనూ చెప్పను. వీరింట్లో భోజనం చెయ్యలేదని వక్క అబద్ధం ఆడితే అన్నీ తీరిపో తవి. విస్తరి విడిచిపెట్టి లేచిపోతాను.

(అని లేచుచున్నాఁడు.)

వెంక—ఆకాస్త అన్నం తిని మరీ లేచి పోవయ్యా. కరువు కాలంలో అన్నం పారవెయ్యరాదు.

శంక—నాకు కడుపునొప్పి వచ్చిందండి వేగిరం పోవలెను.

(అని లేచి పరుగెత్తుచున్నాఁడు.)

---

౨. రంగము—మేజస్ట్రీటుకోర్టు.

[మేజస్ట్రీటుదగ్గర ఫిర్యాదీ వెంకటరావుపంతులును సాక్షులును ముద్దాయీ శంకరశాస్త్రియు నిలుచున్నారు.]

మేజ—ఏమయ్యా? శాస్త్రీ! ఇతడు నీమీద తెచ్చినఅప్రతిష్ఠ నేరం పూర్తిగా రుజువుపడ్డది. నీ వితడు గొడ్డుమాంసం తినేవాడని ప్రచురం చేసినావా? లేదా?

శంక—నేను యెవ్వరితోనూ చెప్పలేదండి. ఇతడు తాను దున్నపోతులను కూరకోసం తెప్పించుకొన్నానని నాతో చెప్పితే యెరక్కపోయి ఆమాట నేను రహస్యంగా నాభార్యతో అన్నాను.

అంతకంటె నేను మరి యేపాపమూ యెరగను. ఆసంగతి యెలాగో వూరంతా వ్యాపించింది. పాపం యెప్పుడూ దాగదండి

వెంక — నేనా ? నేనా ? నేను దున్నపోతులను కూరకోసం తెప్పించినా నని నీతో చెప్పినానుటయ్యా ?

శంక — ఆహా. నీవే నీవే. అక్షరాలా నీవే చెప్పినావు. నేను మీావద్ద ఉలాయాలు చాలా వున్నట్టున్నవే అంటే, అవి కూరకే చాల వని నీ వప్పు డనలేదూ ? అనలేదని బిడ్డలుకలవాడవు రామాయణం నెత్తిమీాద పెట్టుకుని యేదీ ప్రమాణం చెయ్యి.

వెంక — ఆహా ! హాహా ! నీపాండిత్యం యేడిసినట్లే వున్నది. ఉలాయా లంటే గుమ్మడికాయలు కావటయ్యా ?

శంక — నీపాండిత్యం మొత్తుకున్నట్లే వున్నది. ఉలాయాలంటే దున్నపోతులు. ఎవరిని పిలిచి అడుగుతారో అడిగి నాఅర్థం కాదనిపించండి.

మేజ — ఏమయ్యా ? మీారిద్దరూ పబ్లీకులో అలా వివాదపడుతూవున్నారు ? కంటెంప్టాఫుకోర్టుకింద శిక్షిస్తాము సుమండీ. ఓశాస్త్రి ! కోర్టువా రడిగినదానికి జవాబు చెప్పు. ఆమాట యేమిటీ ? ఉలా—?

శంక — ఉలాయ మండి. నేను ఉలాయమంటే యీామహానుభావుడు గుమ్మడికాయ అని అర్థం చేసుకున్నాడట.

మేజ — ఈమాట యెప్పుడూ విన్నట్టు లేదే ! ఇది తెలుగు మాటేనా ? ఇది యింగ్లీషుమాటలాగు వున్నది. డిక్షనేరీ చూడవలెను. స్పెల్లింగు యెట్లాగయ్యా ?

శంక — ఇది సంస్కృతపుమాటండి. స్పెల్లింగు మూాడణాలండి. మొన్న మా పిల్లవాడికి కావలిస్తే బజారులో మూాడణాలకే కొనియిచ్చినానండి.

మేజ—సంస్కృతంమాటా ? అలాగుచెప్పు. అందుచేతనే యీమాట నాకు యింగ్లీషుడిక్షనేరీలో యెక్కడా చూచినట్టు జ్ఞాపకం రాలేదు. అంత పెద్దమాట యెందుకు వుపయోగించినావయ్యా ? మనం మాట్లాడుకోవడం వకరిమాటల అర్థం వకరికి తెలియడానికా ? మరి యెందుకైనానా ?

శంక—మాది పండితసాంప్రదాయం గనుక పాండిత్యం కనపడ డానికి శాస్త్ర మారుమూలమాట ప్రయోగించినానండి. పామరులు వుపయోగించే సామాన్యపుమాటలే వుపయోగిస్తే మాపాండిత్యమూ మా ఆధిక్యమూ యేమిటండి ?

మేజ—ఏదీ ఆమాట ? ులాయమా ? నాకు చూస్తే నీవే బుద్ధిలేని ులాయంలాగు కనపడుతూ వున్నావే. నీపే రేవరూ ? శంక రశాస్త్రీ? శంకరశాస్త్రి అనడంకంటె నేటినుంచి నిన్ను ులాయశాస్త్రి అంటేనే బాగావుండేటట్టు కనపడుతూవున్నది.

ఒకప్లీడరు—ులాయశాస్త్రి అంటే అర్థం యేమిటి ?

ఇంకొకప్లీడరు—దున్నపోతుశాస్త్రి అని అర్థము.

వేరొకప్లీడరు—ఆహాహాహాహా ! దున్నపోతుశాస్త్రి ? కేజు చూడవచ్చిన యీకుర్రవాళ్ళు నవ్వుపట్టలేక వీధిలోకి యెలా పరుగె త్తుతూవున్నారో.

శంక—అయ్యా ! అయ్యా ! మేజస్ట్రీటుగారూ ! తమరు చిత్త గించవలెను. వీధిలో కుర్రముండాకొడుకులు "దున్నపోతుశాస్త్రి" "దున్నపోతుశాస్త్రి" అని యెలా అరుస్తూవున్నారో చూడండి. తమరు శాస్త్ర మందలిస్తేనేకాని వాళ్ళనోళ్ళు మూత పడవు. తమ రిప్పుడు శిక్షించకపోతే రేపటినుంచి నన్ను బొత్తిగానే అల్లరిపిల్లకాయలు వీధిలో గేలిచేసి వదిలిపెడుతారు.

మేజ—బంట్రోతే ! ఆ అరచేవాళ్ళను పట్టుకొని యిలా కోర్టు వారియెదుటకు యీడ్చుకొని రా.

బంట్రోతు—చిత్తము మహాప్రభూ !

మేజ—నీవు చూపిన పాండిత్యానికి తగిన బిరుదుపేరు నీకు శాశ్వతంగా లభించింది. ఇంతమందినోళ్ళల్లో పడ్డతరువాత యిక నీకది తీసివేసుకుందామన్నా పోయేది కాదు. అవునుగాని నీవు రహస్యంగా నీభార్యతో చెప్పినమాట వూరిమీద యెలాపడ్డదయ్యా !

శంక—దానమ్మకడుపుకాల ! ఆడవాళ్ళతో చెప్పినమాట దాగ దండి. దానికి పూర్వం ధర్మరాజువారిశాపం వున్నదండి. అది దాని చెలికత్తె వక్కత్తెతో చెపితే ఆనోటినోట ఆనోట వూరంతా పాక్కి వీధి వీధినీ పాకిందండి.

మేజ—ఇదంతా భ్రమచేత వచ్చిందిగాని మరివకటి కాదు. ఇందులో దురుద్దేశం కనపడనందున కేజు కొట్టివేసినాము. ఓ శాస్త్రీ ! ఇకముందు నీవు యెప్పుడూ యిటువంటి పెద్దమాటలు వుపయోగించ బోకు. ఇప్పుడయినదానితో బుద్ధి తెచ్చుకో. నిన్ను విడుదల చేసినాము పో.

శంక—చిత్తము. చిత్తము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

# పూర్వాచారము.

[పూర్వాచారదీక్షితులును, నవనాగరికశాస్త్రియు, మొదలైనసభికు లందఱు నిండియుండఁగా నుపన్యాసకు లయిన యవివేకాచార్యులవా రుపన్యాసము నారంభించుచున్నారు.]

అవి.—ఓ విద్వన్మహాజనులారా! నేను లోకోపకారమైన మహా విషయమును గూర్చి యుపన్యసింపబోవుచున్నాను. మీ రందఱును శాస్త్రసమ్మతమైన నా యుపన్యాసమును సావధానముగా విని, పాఠశాలలో శూద్రులను జదువకుండ జేయుడని దొరతనమువారికి సంఘ విజ్ఞాపనము పంపవలెను. శూద్రులు చదువుకొనుటచేత బొత్తిగా తెలుగుమీఱిపోయి బ్రాహ్మణభక్తిలేక స్వధర్మమును విడిచి యధోగతి పాలయి చెడిపోవుచున్నారు. బ్రాహ్మణసేవయేకదా శూద్రులకు కుల ధర్మము? అది యొక్కటి లేకపోయినపక్షమున, ఎన్నిగుణసంపదలు కలిగినను అవి యన్నియు వ్యర్థములు. స్వధర్మ మయినబ్రాహ్మణ సేవను పరిత్యజించుటవలన, శూద్రుల కిహలోకహానియు పరలోక హానియు సంభవించును. ఇదియంతయు నేనుశూద్రులునిష్కారణముగా స్వధర్మమును గౌరవింపక చెడిపోవుచున్నారే యన్నజాలిచేత వారి క్షేమముకొఱకు చెప్పుచున్నానే కాని స్వప్రయోజనపరత్వముచేత గాదు. స్వధర్మత్యాగము మహాపాతకము. స్వధర్మమును విడిచి సంప దలతో తులదూగుటకంటె స్వధర్మమునం దుండి తిండికి లేక మరణము నొందుట శ్రేయస్కరము.

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

అని శ్రీకృష్ణులవారు భగవద్గీతలలో తృతీయాధ్యాయమున సెలవిచ్చి

**ఆదిమగృహస్థుఁడు** సం. వి. అ. పుం.

శివుఁడు.

వ. కొండొక కాలంబునకు నయ్యాదిమ గృహస్థుని తేజం బాపరమ గృహిణి నిమిత్తంబుగా రేతోధాతు రూపంబునం బ్రసన్నుండై యమ్మహేశ్వరు మానస వృత్తింజేసి యగ్నియందు నిలిచియుండు.
అను. 3-142

**ఆదిమధనుర్ధరుఁడు** సం. వి. సమ. అ. పుం.

శివుఁడు,

వ. అట్టి పరమేశ్వరుండు నీకు వరదుండై సన్నిధిసేసె...అయ్యంధకాసురభంజనకరంబునం గడింది పగ అడంగుదు రయ్యాదిమ ధనుర్ధరుం డివ్విధంబున వైరివధం బాపాదింప నీకు గెలుపుగొనుట సుకరంబయ్యె.
ద్రోణ. 5-423

**ఆదిమము** సం. విశ. (అ. ఆ. అ.)

1. మొదలుగాఁగలది.

సీ. అగ్నిహోత్రాదిమ యజ్ఞ వాజపేయ ఫలము లోలి నాయన కగు.
అను. 3-330

2 మొదటిది.

అయ్యాదిమ రథికుండు.
కర్ణ. 1-292

**ఆదిమరథికుఁడు** సం. వి. అ. పుం.

శివుఁడు.

వ (త్రిపురాసుర సంహార కాలమున) అత్తేరాపురంబుల కదరిన నయ్యాదిమరథికుండు.
కర్ణ. 1-292

**ఆదివిష్ణుఁడు** సం. వి. ఉ. పుం.

శ్రీమన్నారాయణుఁడు.

ఉ ప్రభవిష్ణుఁడగు నాదివిష్ణుఁడుగదా యీకృష్ణుండు.
ఉద్యో. 3-302

**ఆదిష్టుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

ఆదేశింపఁబడినవాఁడు, ఆజ్ఞాపింపఁబడినవాఁడు.

సీ వాసవాదిష్టుఁడై వసుధకు నేతెంచి, పేర్మితో నవ్విశ్వకర్మపుత్రకుఁడు నిర్మించె.
ఆది. 6-20

**ఆదీపము** సం. విశ. (అ. ఆ. అ.)

ప్రజ్వరిల్లునది, ప్రకాశించునది.

మాలిని. మోహ వ్యతికర తిమిర ప్రధ్వంసనాదీపరూపా.

ద్రోణ. 4-337

**ఆదృతము** సం. విశ. (అ. ఆ. అ.)

ఆదరింపఁబడినది, మన్నింపఁబడినది.

క. పరిధాన ప్రాపరణీకరణాదృత పీతవసనగజచర్మ.

ద్రోణ. 3-309

(ఇచ్చట ఉపయోగింపఁబడినది యను నర్థము స్ఫురింపఁజేయును.)

ఉ. సర్వలో, కాదృత దివ్యబోధ మహిమాతిశయం బుదయింపఁ జేయుచున్. శాంతి. 2-68

**ఆదేశము** సం. వి. అ. పుం.

ఆజ్ఞ, పంపు.

వ. తత్ప్రసాదంబునఁ గుండలంబులు వడసి తదాదేశంబున వత్తురంగంబు నెక్కి. ఆది. 1-117

**ఆదేశించు** సం. స. క్రి.

1. చెప్పు.

వ. ఒక్కనాఁ డశరీరవాణి వీఁడు (సైంధవుఁడు) సంగ్రామంబున నేమతి తల దునుమంబడునని యాదేశించిన. ద్రోణ. 4-328

(అమర కన్యకలు అర్జునునితో) తే నీ పరాక్రమ బలమున నిఖల ధరణి, రాజ్యాధారంబు నీ ధర్మరాజు వాల్చు, రఘుకులాధీశ్వరుం డైన రాముకీర్తి, యట్ల నీ కీర్తి త్రిజగంబులందుఁ బర్వు.

క. అనియాదేశించి దేవకన్యకలు వోయిన అర. 4-99-100

(యముఁడు సావిత్రితో) చ ...ఆ,య్యనిమిషకోటి కెల్లను నిజాన్వయ మౌళి విభూషణుండగున్.

వ. అని యాదేశించి యాతం డంతర్హితుండయ్యె. అర. 2-250;251

వ. దుర్యోధనుండు జనియించినప్పుడు మును లిప్పాపాత్ముండు నిఖిల

క్షత్రియ క్షయ హేతువగునని యాదేశించిరిగాదే యనిన నర్థమం డతని కిట్లనియె.

తే. అమ్మహాత్ములు సెప్పినయట్ల యయ్యె శల్య. 1-358, 359

2. ఆజ్ఞాపించు.

వ. ఆ జగత్కర్త బలిష్ఠ భూతంబులకు దుర్బల భూతంబులు భక్ష్యం బగుంగాక యనియు నాదేశించె. సౌప్తి. 2-114

**ఆద్య** సం. వి. (అ. ఆ. అ.)

మొదటివి.

క. ప్రకృతులు పెక్కన్నింటికి నకృత యనం బనిన యదియ యాద్య అను. 1-311

**ఆద్యంతము** సం. వి. అ. న.

మొదటినుండి చివర వఱకుఁ గలది.

క. ఆద్యంతంబును నీయనవద్యకథ వినంగఁ గనిన వారికి. స్వర్గ. 86

**ఆద్యతిథి** సం. వి. ఇ. పుం. స్త్రీ.

ప్రతిపత్తిథి-శుక్ల పక్షమునందును కృష్ణ పక్షమునందును పాడ్యమితిథి. అను 4-202

**ఆద్యపురుషుఁడు** సం. వి. అ. పుం.

బ్రహ్మ.

క. ఆద్యపురుషోపలాలిత, నుద్ద్యోతిత రోచిరుద్గమోగ్రం బరిసి, ర్వైద్యము దివ్యజనన మన,పద్యంబని కార్ముకైకవరము గుమారా. విరా. 4-121

**ఆద్యము** సం. విణ. (అ. ఆ. అ.)

1. మొదటిది.

క. విను కర్షకులును వణిజులు, ననఘా గోరక్షకులు ధరాధీశునకున్, ధన మొడఁ గూడెడు చోటుల, ననేక విధములకు నెల్ల నాద్యస్థలముల్. శాంతి. 2-391; అను. 3-162

2. మొదట గలది.

క. కామ క్రోధాద్యములగు, నీ మానస వికృతులుడిపి శాంతి. 4-80

3. మొదలుగాఁ గలది.

క. అమృతం బచ్యుత మమలం, బమేయ మవ్యయ మనంత మవ్వేలుఁగు
యమా,ద్యముల నడవడిన చి,త్తము శమాతిరేకమునఁ బొంద
సంవేద్య మగున్ శాంతి. 4-201

**ఆద్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. మొట్ట మొదటివాఁడు.

క. గుణములకు నాదియై ని,ర్గుణమ్ములకు నాద్యుఁడగు నరూపుని లక్ష్మి
ప్రణయపరము కళా సూక్ష్ముని, బ్రణుతింతుఁ బ్రసన్నుఁగాఁ బరము
సర్వగతున్. శాంతి. 4-232 ఆది. 1-2

2. సనాతనుఁడు

చ. అనంతు నాద్య విష్ణుని... శాంతి. 5-406

**ఆధానము** సం. వి. అ. న.

1. ఉత్పాదనము, కలిగించుట

వ. గర్భాధాన వేళయందును, పిండావస్థయందును, ప్రసూతి
మాత్రంబున బాల్యంబునను యౌవనంబునం బ్రౌఢత్వ సమయం
బునను వార్ధకంబునం గర్మానురూపంబగు వాళంబు శరీరంబునకు
సంప్రాప్తంబగు. స్త్రీ. 1-85

వ. అశుభ నిరాసనంబును, శుభాధానంబును బొనర్చుచు.
శాంతి. 2-285 శాం. 4-100

2. పుట్టినది, కలిగినది.

క. శ్రీ నిత్యత్వ ప్రమదా,ధానకుతూహల నిరూఢశా,స్త్రవ్యా
స్వర్గ. 76

3. ఉంచుట, కలగించుట

క. శ్రీ ధర్మ కామ హృదయ స,మాధాన ధానకారకాంఘ్రిసరోజా
మౌస. 1

**ఆధాయి** సం. విణ. (న్. నీ. న్.)

కలిగించువాఁడు.

భరతవంశ మహిమాధాయీ మౌస. 1-74

**ఆధారభూతము** సం. విశ. (అ. ఆ. అ..)

ఆధారముగా నైనది.

క. ప్రకృతి యనఁ బురుషుఁ డనగా, వికృతు లనం బరఁగుచున్న వీనికి నెల్లన్, సకలాత్మక నీ విభవము, యకృత్రిమాధారభూత మై యుండు శివా. ద్రోణ 2-366

**ఆధారము** సం. వి. అ. పుం.

1. అదరువు, ప్రాపు, ఆశ్రయము

సీ. ఆత్మయోధుల కెల్ల నాధారమగునట్టి, తనకు నస్త్రంబు లాధార మయ్యె. భీష్మ. 1-47; శాంతి 4-329

వ. అప్పర్వతంబు దెచ్చి సముద్రంబులో వైచి దాని క్రింద నాధా రంబుగాఁ గూర్మరాజు నియమించి యోక్త్రంబుగా వాసుకి నమర్చి ఆది. 2-11

2. ఆలవాలము, పాదు.

సీ. విమ మోహబీజ సంజనితంబు గామద్రుమంబు ప్రమాదజలంబు దనకుఁ బరిషేచనంబుగఁ బెరుఁగు నజ్ఞాన స్థిరాధార కలిత మై అను. 5-199

**ఆధారుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

ఆధార మైనవాఁడు

మానసేజ్యాధారా. శల్య 2-421

**ఆధి** సం. వి. ఇ. పుం.

మనోవ్యథ (మనస్సునకు సంబంధించిన రోగము)

క. ...శరీరము లాధివ్యాధి జరాసమన్వితము లగుటఁ జేటు సహజం బరయన్. ఉద్యో. 2-92

**ఆధిక్యము** సం. వి. అ. న.

అతిశయము, హెచ్చు, ఎక్కుడు.

మ. ...సంకీర్ణంబులై యుర్వి నిల్చి గుణాధిక్యముఁ బొందు బీజములుఁ బోలెం గౌరవుల్. ద్రోణ. 1-49

వ. కుకుందు మొదలుగాఁగల యే మేవురమును వేదవిషయ ప్రఖ్యాతి

వెల్లవారికఁటె నెక్కుడు గావలయు మమ్మంతలోలె నొల్ల వాద
రాధిక్యంబున భరంపడి సవిశేషంబుగా నధ్యయనంబు సేయకుండుట
మాకు వరంబు. శాంతి. 6-297

**అధిపత్యము** సం. వి. అ. న.

1. ప్రభుత్వము, దొరతనము.

(శ్రీకృష్ణునితో కర్ణుడు) తే. ధర్మతనయుండు దాను నా తమ్ముఁ
డగుట, యెఱిఁగెనేనియు సామ్రాజ్యమేల పూను, నట్టి ధార్మికుఁ
డాధిపత్యంబుఁజేయ, వలవదే శాశ్వతంబుగ వసుధయెల్ల.
ఉద్యో. 4-44

2. నాయకత్వము.

సీ. ...ఎవ్వరును ద్రోణుఁ, -తే- డనిన గాదన రాతండ యర్హుఁ
డాధిపత్యమునకు నాచార్యుండు బ్రాహ్మణుండు, వివిధరణ కోవి
దుఁడు వయోవృద్ధుఁ డధిక బలుఁడు శూరుండు గట్టుము పట్ట
మతని. ద్రోణ. 1-62

**అధిరాజ్యము** సం. వి. అ. న.

అధిరాజత్వము. ఆధిపత్యము, దొరతనము.

అ. బ్రహ్మచర్యమునకుఁ బరమాయు పుపవాసములకుఁ జిత్తశుద్ధి
ఫలజలంబు, లాహరించి యునికి కాధిరాజ్యము పత్త్రి భక్షతకు
దివంబు ఫలము లధిప. అను. 1-148

**అధివ్యాధులు** సం. వి. సమ. బహు.

మనోరుగ్ణతయు శరీరరుగ్ణతయు.

వ. అవ్విరించి వచనంబుల తెలుఁగున నాధివ్యాధులు గాత్రహానిం
జేయ నా మృత్యుదేవత ప్రాణహారిణి యగుటం బ్రాణంబులు
దేహంబులం బాసి. ద్రోణ. 1-175

**అధూర్తరయసుఁడు** సం. వి. స్. పుం.

అధూర్తరజసుని పుత్రుఁడు, గయుఁడు.

వీనితండ్రి అమూర్తయుం డని ఆంధ్ర భారత ప్రతుల యందు
(అర. 2-818) గలదు అక్కడనే మూలమున అధూర్త రజసుఁడని గలదు

(చూ. అమూ_ర్తరయుఁడు) కొన్ని వ్రాఁతప్రతులయందును ముద్రణ ప్రతులయందును అధూ_ర్తరయః ప్రియపుత్రుఁడు అని (అర. 2-318) కలదు. 'అధూర్తరజః' శబ్దమే 'అధూ_ర్తరయః' గా వాడఁబడినట్లును 'అమూ_ర్తరయః' శబ్దము య_క్తముగానట్లును తోఁచెడివి అర. 2-318లో 'అమూ_ర్తరయః' శబ్దమిచ్చిన ప్రతులు గూడ ఇక్కడ అధూర్తరయ శబ్దమిచ్చినవి.

వ. తొల్లియాధూ_ర్తరయసుండై_ప గయిందు చూ, అర. 3-178

**ఆధ్యేయుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ధ్యానింపఁ బడువాఁడు.

క. చింతాసాగరమగ్న, భ్రాంత జనాధ్యేయ పరమభ_క్తి విధేయా. స్త్రీ 2-185

**ఆన** వై. (సం. ఆజ్ఞా, ప్రా. ఆణా)

ఒట్టు, తోడు

తే. వానిఁ దెగఁజూడవై_తేని వాయుపుత్ర, నీవు గనుఁగొన నురివై_న నీరవై_న, నగ్నివై_న విషంబునవై_ నేను, మేను దొఱఁగుదు నెట్టు నీయాన సుమ్ము. విరా. 2-229

ఆ. గురుని యలవుఁ జలము నెరవును గలఁచి నీ, యాన గాండివంబు వాన దివ్య శరములాన యెల్లి సై_ంధవుతల యెల్లభంగిఁ దునిమి వై_తుఁ బగలు దలఁక. ద్రోణ. 2-311

చ. అనవుడు నమ్మహీపతికి నర్జునుఁ డిట్లను నేఁడు కర్ణునే, ననిఁ బడ వై_తు నీ యడుగులాన. కర్ణ. 3-111

**ఆనంత్యము** సం. వి. అ. న.

అంతములేమి, తుదిలేమి. నాశములేమి, మేరలేమి, అమృతత్వము, మోక్షము.

క. దాని నెఱింగి గృహంబున, మానితమగు చదువునందు మనసు గొలుప కెం,దేనిఁ జని చదువుదురు శ్రుతు, లానంత్యమునకు దపస్వు లగుదురు విప్రుల్. అను. 2-160

**ఆనందనము** సం. విశే. (అ. ఈ. అ.)

ఆనందింపఁజేయునది, సంతోషము గలిగించునది.

క. దుందుభినిస్వనములు వా, నందన మృదు మధుర గీతనాదములుం

దెవిం బొందె. అను. 1-360

సీ. ఆనందనములగు గానములను. అశ్వ 4-179

**ఆనందము** సం. వి. అ. పుం.

1. సంతోషము, సుఖము.

తే. నామనంబు నానందమగ్నముగం జేయ నెలమి సన్నిధిసేసె సర్వేశ్వ

రుండు. విరా 1-12

వ. శబ్దస్పర్శరూపరసగంధ వక్తవ్య కర్తవ్య గంతవ్య విసర్గానందంబులు

హావిస్సులు. అశ్వ. 2-18

2. అవ్యయానందము.

శా. ...మహానంత చిత్సత్యానంద విభు స్వభావమహితా.

ఉద్యో. 2-332

3 అవ్యయసుఖము.

తే ఘ్రాణజిహ్వలు మహి నుదకము వ దృక్కు, త్వక్కు దేజంబునందును

వాయువునను, శ్రోత్ర మాకాశమునం గ్రమసూత్రితముగం, బొంద

జేసి గోవింద యానందమిమ్ము శాంతి. 4-242

**ఆనందించు** సం. అ. క్రి.

సంతోషించు.

వ. ఇవ్విధంబున సుహృజ్జన హృదయంబు లానందింప ధర్మనందనుండు.

శాంతి 1-375

స. క్రి.

1. ఆనందింపంజేయు, సంతోషపెట్టు.

సీ. రోదసీ కుహరంబు రుచిరాంశు తతిం జేసి యర్కుండు వెలింగించు

నట్టు లమృత, సందోహ నిష్యంద చంద్రికం జేసి, శీతాంశుం డానం

దించునట్లు. సభా. 2-6

2. అభినందించు, పొగడు.

సీ. ...నా వివేకంబున కానందింపం గవిన యంగన యొట్టు నిలువునం

ౘగాఁగకుండు. విరా. 2-335

**ఆనందితము** సం. విశే. (అ. ఆ. అ.)

సంతోషించినది.

క. ఆనందిత మాగధ సుగీత వాదంబుల ద్రోణ. 3-6

**ఆనకదుందుభి** సం. వి. ఇ. పుం.

1. వసుదేవుఁడు, కృష్ణుని తండ్రి.

ఉ. ఆనకదుందుభిప్రభృతి యాదవులు. ఆది. 8-217

(ఇతని జన్మకాలమున దేవతలచేత ఆనకములును, దుందుభులును వాయింపఁబడినవి. "అస్య జన్మకాలే దేవతాభి రానకాః దుందుభయశ్చ వాదితా ఇత్యానక దుందుభిః" అని అమరకోశము)

ఇ. ఈ. స్త్రీ.

పెద్ద ఢక్క.

వ. శంఖానకదుందుభిప్రభృతి మంగళ తూర్యంబులు గంభీర నాదంబులం జెలంగె. శాంతి. 1-375

**ఆనత** సం. విశే. (అ. ఆ. అ.)

నమస్కరించినది.

చ. కనుఁగవ నశ్రుధార లొలుకం జరణానతయైన రాముఁ డిట్లను. ఉద్యో. 4-395

**ఆనతి** వై. (సం. ఆజ్ఞప్తి. ప్రా. ఆణత్తి.)

ఆజ్ఞ, సెలవు.

క. దేవర యానతిఁ బాండవు, లేవురు ద్రౌపదియు మున్నయెడ మే మరయంగా వెడలి వారు సనిన మృషావివినంబులకుఁ దొలుత నరిగితిమి వెసన్. విరా. 3-80

మోక్షము తెరు వానతి యీవే దయామయా. శాంతి. 4-261

**ఆనతిచ్చు; ఆనతియిచ్చు** స. క్రి.

1. సెలవిచ్చు (గొప్పవారు తక్కువ వారికి) చెప్పు.

క. ...వీ, తలఁపెయ్యది యానతిమ్ము ధరణీనాథా. విరా. 1-224

తే. ...కార్యనిశ్చయంబు ధర్మతనూభవుం డానతిచ్చు, వాఁడు మన
మెల్లఁ గావించువార మదియు. విరా. 5-365

తే. ఎలమి నిట్లని యానతి యిచ్చె వాఁడు. విరా. 1-10

2. ఆజ్ఞ యొసఁగు, ఆజ్ఞాపించు.

తే. అమృతమయమగు నల్లపద్మాకరమున, వాదు కాకాసనంబు కాణ
ములు నున్న, యవి దృఢవ్రతులార మీ రచటి కరిగి, వానిఁ దెం
డిచ్చటికి నని యానతిచ్చె. ద్రోణ. 2-368

క. బరవసము మైఁ ద్రిగర్తేశ్వరుఁ డిట్లను టుచిత మింక జననాయ
కుఁ డెప్పుడుసున నానతి యిచ్చెను, దొర లేమని రట్లు చేయఁ దుదిఁ
గార్య మగున్. విరా. 3-122

ఆనతుఁడు సం. విణ. (అ. ఆ. అ.)

1. వంగినవాఁడు.

వ. ...అతం డంజలిపుటంబు ఫాలంబున మోపి యానతుం డయ్యెఁ.
స్త్రీ. 1-176

2. నమస్కరించినవాఁడు.

ఉ. వానికి నమ్మహీశ్వరుఁడు వత్సలుఁడై పొడసూపి యాప్తితం బైన
ది వేఁడు మన్న నతఁ డానతుఁడై పరమేశ. అర. 6-255

3. అణఁగఁబడినవాఁడు, లోఁబఱుపఁబడినవాఁడు.

ఉ. ఆనత వైరి యిట్టు లను హంసము వారలతోడ. శాంతి. 5-560

ఆననము సం. వి. అ. న.

మోము, మొగము.

వ. కౌమ్మనామాత్యు నాననం బాలోకించి తదనుమతి వడసి యిట్లంటి.
అను. 1-19

ఆనమత్ సం. శత్రు.

మ్రొక్కుచున్న (దీనికి తెనుఁగున ప్రత్యేక ప్రయోగములేదు)

తరలము. ...నిరంతరా, నమదశేష నృపాల మౌళి పినద్ధ ముగ్ధమణి
ప్రశాక్రమ సమర్చిత విస్ఫుర త్పదకాంతి నిర్జిత పంకజా
అర. 7-475

**ఆనయనము** సం. వి. అ. పుం.

తోడి తెచ్చుట, తీసికొని వచ్చుట.

ఉ. ...భూమి దే,వానయనాది కృత్యపరులైన జనంబుల గారవించు చున్. విరా. 5-584

వ. అభిషేచనిక ద్రవ్యానయనంబునకుం దగువారిం బనిచి. శాంతి. 1-371

**ఆనయము** సం. వి. అ. పుం.

ఆనయనము, తీసికొని వచ్చుట.

చ. ...సురాపగానయ సమర్థ తపోగుణయుక్తు నుత్తమున్. అర. 3-74

**ఆనయించు** సం. స. క్రి.

తెప్పించు

ఉ. రాజులఁ బిల్వఁబంపుము ధరాసుర సంఘము నామతింపు పే, రోట నుదాత్త యజ్ఞగృహ యూథతతుల్ నమకట్టఁ బంపు వి,భ్రాజిత భక్ష్యభోజ్య విధి భవ్య పదార్థము లానయింపు మ,వ్యాజవిభూతిమై నమరవల్లభు చాఙ్పునఁ జేయు జన్నమున్. అర. 6-70

**ఆనర్తకము** సం. వి. అ. పుం.

దేశ విశేషము, ఈ పేరుతోఁగొన్ని దీవులు గలవు. వాని యన్నింటికి ముఖ్య పట్టణమైనది ద్వారక- సౌరాష్ట్ర మని సూ. అ. ని.

వ. ఇంద్రప్రస్థ పురంబున కభిముఖుండై యానర్తక దేశంబులకుం జని యందు ముందఱ ముకుంద ప్రేషితులయిన దాశార్హ వీరులతో నగరద్వారణ్యంబులు గడచుచు, ఆది. 6-209

**ఆనవాలు** దే. వి.

అభిజ్ఞానము, గుఱుతు.

గీ. అద్దేవి గని యతం డట్లచెప్పిన ముని,వల్లభ వాశానవాలు రెమ్మై, నృపు పాల ననియె నన్నెలఁత యుదంకుండు, సమరెంచి విభు నభిజ్ఞాన మడిగె. అశ్వ. 3-95; అశ్వ. 3-93

**ఆనీతము** సం. విణ. (అ. అ. అ.)

తేఁబడినది, తీసికొని రాఁబడినది.

వ. తత్కాలోపగత సముచిత పరిజనానీత జలంబుల ముఖప్రక్షాళ నంబు సేసికొనిరి. కర్ణ. 3-109; అను. 5-51

**ఆను** దే. స. క్రి.

1. త్రాగు.

క. వాసిత రాజన్మదిరా రసమానఁగ నాస్వాదయంబున వేడ్క యొసక మెసఁగెడుఁ దరుణీ.

విరా. 2-33; విరా. 2-306; విరా. 2-93

ఉత్సాహ వృత్తము. ...మధురధార లెల్ల ప్రొద్దునుఁదొరఁగుచుండ నతఁడు వాని దోహలమున నానుచుం, బొరయ డెప్డుఁ దృప్తి. స్త్రీ. 1-43; శాంతి 5-131

2. అతిక్రమించు, క్రమ్ము.

ఉ. వైదిక బ్రహ్మచారి జనవత్సల నీమదిఁ బట్టుకొన్న యున్మాదము హీనమానవు మనంబునఁ బుట్టిన వెట్టివోలె నస్వాదులఁ దీర్చు టొప్పదు నిజానుజ వర్గము మీఁదగల్గు నత్యాదర సాంద్రసార కరుణామృత మానఁగ నిమ్ము నెమ్మదిన్. శాంతి. 1-101

ఉ. తేరుల యొప్పు ప్రోదు పడఁదేఁకువ లేని పదాతికోటి మున్గ రుధిరంబులో మునుఁగనానిన యేనికసిందు. ద్రోణ. 1-273

3. తిను, భుజించు.

ప. జక్కవలు గలసిపొలసి నవి రేఁగి చెంంగుచు రేయింటి యాఁకటి పెల్లున గొదగొని కమిచి చంచువులం దిగిచి త్రుంచి యానుచు. విరా. 2-240

వ. ఇవ్విధంబున వివిధ విశారాననంబులు బహుభంగిక కరపాదంబులు గలుగు నపరిమిత క్రవ్యాదులు గవిసి మేదోమాంస మస్తిష్క మజ్జంబు లానుచుం జవియైన వానిఁ బుత్త్రమిత్త్ర కళత్రాదుల కొసంగుచు. సౌప్తి. 1-202

శ్లో. మేదోమజ్జాస్థిరక్తానాం వసానాం చ భృశాశినాః
పరమాంసాని ఖాదంతః క్రవ్యాదా మాంసజీవనః.
సం. భా. సౌప్తి. 8-139; ఆది. 5-188

4. విను, ఆలకించు.

క. శివనారాయణ యచ్యుత, భవదీయములైన మధుర భాషణములు
నా, చెవులానిన నమృత రస,ప్లవనంబును బోలెఁ బ్రమదభరితుఁడ
నైతిన్. శాంతి. 2-118

5. చుంబించు, ముద్దాడు.

సీ. అంగుళంబుల నల్ల నలకలు గబళించి, కెమ్మోవి యాని మొక్కింతుఁ
గాయ్యు విరా. 2-310

6. ఆస్వాదించు, అనుభవము.

క. సంతోషామృతము నాని సంశుద్ధుఁడగున్. శాంతి 5-419

లోచనము లమృతం బానినమాడ్కి సమ్మదంబునఁ దేలన్.
ఉద్యో. 3-254

**అనుకూల్యము** సం. వి. అ. న.

అనుకూలముగా నుండుట, తగియుండుట, ఒద్దిక, సాహాయ్యము.

క. అనలం బించుకయైనఁ బవనుచే వెలుఁగొందు మాడ్కి వర్ధనముం
బొందును సత్కార్యాచరణంబున దైవము నానుకూల్యము గురు
ప్రవరా. అను. 1-188; అను. 1-137

వ. దైవానుకూల్యంబు లేక మానుషం బెంతయయ్యు నేమిసేయు.
ఆది. 8—12

**అనుగము** దే. వి.

పొటకాయ.

ఆ. (శ్రాద్ధమునకు) మునగ యుల్లి యడవి మునగ దుర్మాంసము, లాను
గమ్మ మలినమైన యుప్పు,కటియ జీలకఱ్ఱ, కటివేము కురుజ
యింగువ ప్రవర్జనీయ కోటియగుట. అను. 3-189

**అనువు** సం. వి. ఉ. పుం.

యయాతికి శర్మిష్ఠయందుఁబుట్టిన ముగ్గురు కొడుకులలో రెండవవాడు.
ఆది. 3-94

**అనుశాసనికపర్వము** సం. వి. న్. న.

మహాభారతమునందలి పదుమూఁడవ పర్వము.

చూ. మహాభారతము. అను. 1-389

**అనృశంస్యము** సం. వి. అ. న.

అక్రూరభావము, నిష్ఠురత్వములేమి, కపటములేమి, మోసములేమి.

వ. (భీష్ముఁడు శరీరంబు విడుచు సమయంబున) అందఱఁ గౌఁగిలించు కొని యానృశంస్యంబును సత్యంబును నిత్యంబులుగాఁ బాటించి బ్రదుకుం డని చెప్పి. అను. 5-468

**అన్వీక్షికి** సం. వి. ఈ. స్త్రీ.

పర్యాలోచన ప్రయోజనముగాఁగలది, రాజు విద్య.

వ. అన్వీక్షికీ త్రయీవార్తా దండనీతులను రాజవిద్యలయందును బ్రవీణులగు పహాయులతోడం గూడి. శాంతి. 1-182

**ఆపగ** సం. వి. ఆ. స్త్రీ.

1. నది, ఏఱు

తే. అనిన ధృతరాష్ట్రుఁ డాపగాతనయు భక్తి, ననునయించి రాధేయునిఁ గినిసి ప్రియము దోఁపఁదా నిట్టులనియె. ఉద్యో. 1-255

2. ఒక తీర్థము, ఆదియు నది.

వ దాని తూర్పున (మానుష తీర్థంబునకుఁ దూర్పున) నొక్క యిరవున నాపగయను మహానదిం బితృతర్పణంబు సేసి పితృదేవోద్దేశంబున నొక్క బ్రాహ్మణునకుం గుడువం బెట్టినఁ గోటిబ్రాహ్మణులు గుడిచిన ఫలంబగుఁ బితృదేవతలు తృప్తియు నొందుదురు. అర. 2-263

**ఆపగా తనయుఁడు** సం. వి. అ. పుం.

భీష్ముఁడు. చూ. ఆపగ.

**ఆపగేయుఁడు** సం. వి. అ. పుం.

భీష్ముఁడు.

చ. అనుటయు నాపగేయుఁడు. శాంతి. 2-168

**ఆపణము** సం. వి. అ. పుం.

అంగడి, దుకాణము.

క. ...నిర్వృతి పణ్యాపణ పదారవింద విశాసా. విరా. 2-364

**ఆపతనము** సం. వి. అ. న.

ప్రాప్తి, సంభవము.

స్రగ్ధర. ...వదనోత్కీర్ణ కీలాల ధారావంక ప్రాగ్భార మగ్నాప తన విఘటిత ప్రాణులై యాహవోర్విన్. అర. 7-91

**ఆపత్తు** సం. వి. ద్. స్త్రీ.

విపత్తు, ఇడుమ

ఉ. ...ఘోరసంసారదురామయాపదవసాయక. శ్రీవ్య. 2-408

**ఆపద** సం. వి. ద్. అ. స్త్రీ.

1. ఆపత్తు, విపత్తు, కష్టము

క. ఒకనాఁ డేమును వాపదలకు విడుమరఁగాంచి విప్రులం జుట్టలఁ బెట్టుకొని సుఖముండఁ బడయుదు, మొకో. విరా. 1-49

క. శిఖచోరాది ముఖ్య విషయాపదకున్. శాంతి 4-34

2. కోపంబును లోభంబును, నేపారి మనంబు గలఁప నెప్పుడుఁ జింతా, లాపంబునొందు సధనుం, డాపదగా కవ్విధము సుఖావహ మగునే. శాంతి. 4-35

**ఆపద్ధర్మము** సం. వి. అ. పుం.

ఆపదయందు అవలంబింపఁ దగిన ధర్మము.

సీ. కాయంబు వికృతులఁ గాల పర్యయముల వచ్చు నాపద్ధర్మ వర్తనములు. అను. 5-216 శాంతి. 1-335

**ఆపన్నుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఆపదయందున్నవాఁడు, విపత్తునొందిన వాఁడు

తే. ...ఆపన్నుఁడ, వైన నిన్నుఁ, జూచి దుఃఖోపహార మనస్కుండనైతి. అర. 1-147

**ఆపస్తంబసూత్రము** సం. వి. అ. న.

ఆపస్తంబ మహర్షి చెప్పిన నియమనశాస్త్రము.

సీ. ఆపస్తంబ సూత్ర పవిత్ర శీలుఁడు. విరా. 1-10

**ఆపస్తంబసూత్రుఁడు** సం. వి. అ. పుం.

అపస్తంబ మహర్షి చెప్పిన నియమావళి ననుసరించి ప్రవర్తించువాఁడు. (నన్నయభట్టు-తిక్కన మొ.)

సీ. పౌత్రు నాపస్తంబసూత్రు ముద్గల గోత్రజాతు సద్విమతావదాత చరితు. ఆది. 1-9; విరా. 1-10

**ఆపస్తంబుఁడు** సం. వి. అ. పుం.

యజుర్వేద విహితకర్మములను సూత్రముగఁజేసిన యొక మహర్షి. విరా. 1-10; ఆది. 1-9

**ఆపాతము** సం. వి. అ. పుం.

హఠాత్తుగాఁ బైఁబడుట (బాణములు మొ.)

శా. ఆయోధ్యధులన్ బాణజాలాపాతంబునఁ దూలనేసి. ద్రోణ. 3-229

2. పడునట్లు వేయుట.

వ. దూరాపాత విశిఖంబుల జయద్రథు రథ్యంబులం బడనేసిన. అర. 6-248

**ఆపాతనము** సం. వి. అ. న.

అపాతము, పడునట్లు వేయుట.

(జమదగ్ని) ఒక్కబయుల నయ్యంపపొది నిలువ వైపించుకొని దూరాపాతం బాచరింప నక్కుసుమకోమలి పని యమ్ములేటికొని వచ్చి యిచ్చుచుండు. అను. 3-255

**ఆపాదకము** సం. విశ. (అ. దికా అ.)

కలిగించునది.

క. జూదమునఁ గయ్యమున నీ,కేదురితంబులు నితాంతహృదయ క్లేశాపాదకములు వాటిల్లె న,నాదృతములు సేయు వాని నన్నిటి ననఘా. స్వర్గ. 1-9

**ఆపాదనము** సం. వి. అ. న.

ఉత్పాదనము, కలిగించుట.

క. వేదములు డాంభికత్వా, పాదనములుగాఁగ యతులు పలుకుదురవి
స,ర్వాదరణీయంబులు నీ,కాదర పాత్రముగావొ యని పలుకఁ టయున్. శాంతి. 5-308; కర్ణ. 1-245; అను. 2-476; మౌస 9

**ఆపాదమస్తకము** సం. సమ. అవ్య. అ. న.
పాదమునుండి తలవఱకు.

క. ఆపాద మస్తకము త,ద్రూపము వీక్షించుచుం గుతూహల మడరన్. విరా. 1-311

**ఆపాది** సం. విశే. (ఇ. ఇ. ఇ.)
కలిగించునది.

మ. ...పోరనిమిషస్తోమాద్భుతాపాదియై. కర్ణ. 1-86

మానిని. అమరగణ విరోధి వ్యాపదాపాదికోపా. మౌస. 226

**ఆపాదించు** సం. స. క్రి.

1. కలిగించు, కలుగఁజేయు, సమకూర్చు.

క. నా పలుకు నమ్ము మర్జునుఁ, డాసాపాత్మకుని నెల్లి యనిఁ జంపి ముదం,బాపాదించుం గులమున, కీపెంపున కెలమివొందుఁ డీవును నతఁడున్. ద్రోణ. 2-880

క. పాపక్షయమున బోధం, బాపాదింపఁబడి మెఱుఁగుటద్దము కరణిం, బూపునకు వచ్చుఁ దనుఁడా,నా పురుషుఁడు గాంచు పరికిపై తన్మయుతన్. శాంతి. 4-187; అను. 5-354; ద్రోణ. 8-96

2. ఒనరించు, చేయు.

వ. కవలు నీకు చక్రరక్షకులుగా లోకసామాన్యంబులైన చాప కృపాణ గదాదులగు నాయుధంబుల విరోధివధం బాపాదించి వేవేగ విరాటు విడిపింపుము. విరా. 3-207

వ. నీ వాపాదించిన పాపంబులకెల్ల మూలంబైన కర్ణునరదంబు ధరణిం గ్రుంగిన. శల్య. 2-323; అర. 3-14.

**ఆపాదితము** సం. విశే. (అ. ఆ. అ.)
సమకూర్పఁబడినది.

ఉ. ...నృపపుంగవ నీవు ననేక భూసురా,పాదిత సర్వయాగమున
భస్మము సేయుము. ఆది 1-124

**ఆపానము** సం. వి. అ. న.

కల్లు సారాయముల దుకాణము,

వ. ప్రేతపత్యముఖూతోజ్ఞితంబైన యాపాన భూభాగంబు నతిక
రించు కురుక్షేత్రంబు దఱియు సమయంబున శాంతి, 2-64

**ఆపుఁడు** సం. వి. అ. పుం.

ఒక అగ్ని. చూ. అను 4-168

**ఆపూరణుఁడు** సం. వి. అ. పుం.

కద్రువ కొడుకు ఆది. 2—4

**ఆపూరితము** సం. విశ. (అ. ఆ. అ.)

నిండింపఁబడినది, మిక్కిలి నిండింపఁబడినది.

భువనమంతయు నాదాపూరితముఁ జేసె. శాంతి. 6-306

**ఆపోవు** దే. అ. క్రి. (ఆదట + పోవు అని శ. ర.)

తృప్తి నొందు.

క. కోపము నుబ్బును గర్వము, నాపోవక యునికియును దురభిమాన
ము ని,ర్వ్యాపారత్వము నను నివి, కాపురుష గుణంబు లంద్రు
కౌరవనాథా. ఉద్యో. 2-82

వ. ఇట్లు సిద్ధ స్వరూపదీపితుండైన యతని నాపోవక చూచుచు
శంకరుండు, శల్య. 2-185

క. శ్రీపతి గడు నెయ్యంబున, నాపోవక పార్థు నొద్ద నా రాత్రి
ప్రియా, లాపములఁ దగిలియుండెను, దీపమణుల్ వెలుఁగ భువన
దీపుఁడు దానన్, ఆది. 8-172

**ఆపోశనముగొను** మి. స. క్రి. (√ ఆపోశనము)

ఆక్రమించు, వశపఱచుకొను.

వ. పరదేశం బాపోశనంబు గొనం దమకించు తన బలంబు గజిబిజి

యుడిపికొని. విరా. 3-181

(ఆపోశనము = భోజనాదియందును భోజనాంతమందును పుడిసిట జలము పోసికొని మంత్రపూర్వకముగాఁ బుచ్చుకొనుట, అట్లు పుచ్చుకొను జలము)

**ఆప్తచరుఁడు** సం. వి. అ. పుం.

ఆప్తుడైన గూఢచారి (గూఢచారులలో దనకు విశ్వాస పాత్రుడైన వాఁడు)

వ. తద్వృత్తాంతంబతయుఁ గుంతి తన యాప్తచరుతవలన విని శిథిలీకృత సంతాపయయి యుండె. అర. 7-355

**ఆప్తత** సం. వి. ఆ. స్త్రీ.

హితము

సీ. అతనిఁ దొలఁగి మదాప్తత మెఱయు పెక్కాడంగనేటికి. అశ్వ. 1-38

**ఆప్తము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రాప్తము, పొందఁ బడినది.

తే. ఆప్తసర్వవిధైశ్వరుఁడు. స్వర్గ. 1-30

**ఆప్తి** సం. వి. ఇ. స్త్రీ.

1. పొందుట

చ. పరమపదాప్తి హేతువగు భారత సంహిత- స్వర్గ. 1-94

2. యథార్థమును జెప్పుట

తే. నీవిపేకఁబు నాప్తియు నెఱపి తీవు, తల్లిదండ్రుల మాడ్కిహితంబు సెప్పి, తేను నా రాక తెలఁగెల్ల నేర్పడంగఁ, జెప్ప విని యేమి సెప్పఁ జేయువాఁడ. ఉద్యో. 3-286

శ్లో. ధర్మార్థయుక్తం తథ్యం చ యథాశక్త్యయ్యుపపద్యతే
తథా వచనమక్తోఽస్మి త్వయైత త్పితృమాతృవత్.
సం. భా. ఉద్యో. 92-2

వ. నాయాప్తియును గార్యవివేకంబు కలిమియు నమ్మి మదీయోపదేశంబు నాదరింపుము. శాంతి. 2-366

ఆప్తుఁడు సం. విశే. (అ. ఆ. అ.)

1. కావలసినవాఁడు, ముఖ్యుడు.

క. తానెంత యాప్తుఁడైన మహీనాయకు సొమ్ము పాము సొమ్ములుగా లో, మానిన భయమునఁ గోరయక, మానినఁగా కేల కలుగు మానము బ్రదుకున్. విరా. 1-186

2. సుహృదయుఁడు, హితుఁడు, స్నేహితుఁడు.

వ. సేనజితుండను రాజు పుత్రశోకార్తుండయి యున్నయెడఁ దదాప్తుండగు విప్రుం డతని కిట్లనియె. శాంతి. 4-7

తే దుష్కృతంబులఁ జొరనీక తొలఁగఁ దివుతు,రాప్త జనములు దగ వశ్యులైనవారి, నందుఁ బుణ్యంబు దొలఁగని యతఁడు దొలఁగుఁ, దొలఁగ నేరఁడు భాగ్యంబు దొలఁగువాఁడు. సౌప్తి. 1-79

3. విశ్వసింపఁదగినవాఁడు.

చ. జనకుఁడుఁ బోలె నర్మిలిఁ బ్రజం బరికించుచు షష్ఠభాగముం, గొనునది వారిచేత నరిఁ గోటి విధంబుల నాప్తదతులం, గని నవ గోకులాకరనగ ప్రముఖార్థకరంబు లారయం, బనుచుచు నన్నిటన్ ధరణిపాలుఁడు గన్నిడి యున్నఁ బెంపగున్. శాంతి. 2-288

4. మేలు గోరినవాఁడు.

మ. జనకుండున్ గురు భీష్ములుం దగిన కర్జం బాప్తులై నీకుఁ బ్రీతి నెఱింగించు తెఱంగుగాదు. ఉద్యో. 3-372

5. పొందినవాఁడు.

క. ఈగతి యెఱింగి చేసిన, యాగము సోమాప్తుఁజేయు నప్పురుషుని. శాంతి. 2-348

ఆప్యాయనము సం. విశే. (అ. ఆ. అ.)

1. ప్రీతి గలిగించునది, తనివి కలిగించునది.

వ. అంతకుమున్న సాత్యకియుఁ గృతస్నానుండై యాప్యాయన మధుపానంబున నెలమిం బొందె. ద్రోణ. 3-307

వి. అ. న.

2. తృప్తి, ప్రీతి.

క. ఖర కిరణ తాపమున నుర్వీతర దవదాహమున శోషితములై న
వనాంతరతరుతతి శాప్యాయన కరమైన వర్షాగమంబు గడు బెనఁ
గయ్యెన్. అర. 4-184

**ఆప్యాయిత** సం. విణ. (అ. ఆ. అ.)

తృప్తి నొందింపఁబడినది, సంతుష్టి పొందింపబడినది.

వ. భీముండు జాత సస్యయైన వసుధ తోయసంప్రాప్తి నాప్యాయిత
యైనట్లు జ్ఞాత చర్యుండైన తన పతిం బడసి పరమ సంతుష్ట హృద
యయై చంద్రుతోఁ గూడిన రాత్రియుం బోలెఁ బతిం గూడి
యొప్పుచున్న దమయంతిం జూచి సంతసిల్లి. అర. 2-220

**ఆప్యాయితము** సం. విణ. (అ. ఆ. అ.)

బలియఁ జేయఁబడినది.

వ. చంద్రుం డా తీర్థంబునకుఁ జని తదీయ జలస్నానంబున నాప్యా
యిత శరీరుండై. శల్య. 2-158

**ఆప్యాయితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

తృప్తి నొందింపఁబడినవాఁడు, సంతోష పెట్టఁబడినవాఁడు.

వ. ...సర్వ యజ్ఞంబులను మానవులు మానవీయంబులుగా నడప
మీకెల్లను నయ్యాగంబుల భాగంబులు గలిగి తద్భాగంబుల
నాప్యాయితులై యుపబృంహణంబు నొందువారలు.
శాంతి. ౯-410

**ఆప్లావితము** సం. విణ. (అ. ఆ. అ.)

అంతటను తడుపఁబడినది.

వ, అనిన నతండు గన్నీరొలుక నన్నపాదంబులపైఁబడిన నప్పాండ
వాగ్రజుండును బాష్పాప్లావితముఖుండగుచు నతనిమీఁద వ్రాలఁగె.
కర్ణ. 8-109

**ఆప్లుతము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆర్ద్రీభూతము, తడుపఁబడినది.

చ. తుతమున ముక్కునం జెవులఁ గన్నుల నొల్కెడు రక్తమంగ మా,
ప్లుతముగఁ జేయఁగా నతఁడు బోరగిలం బడియెన్ ధరం....
కల్య. 1-285

**ఆబద్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

బాగుగాఁ గట్టఁబడినది, కూర్పఁబడినది.

వ. ...ఆబద్ధ మరకత వజ్ర వైడూర్య పద్మరాగ ప్రవాళ ప్రభావ
ప్రకర వ్యతికర విరచితాపూర్వ సురచాప చారుగౌరవంబై -
ప్రేక్షాగ రంబున నున్న. ఆది. 6-4

**ఆబాలగోపాలము** సం. సమ. అవ్య. అ. న.

బాలుని మొదలు గోపాలుని వఱకు (చిన్నవాని నుండి పెద్దవాని వఱకు)

సీ. క్షత్రియాధమ నీచ కలదు లోకంబున నాబాలగోపాలమైన వాక్య,
మతికుటిలుండు సంగతుండు గాఁడేమిటఁ, జెలికిఁ గీడొనరించుఁ
జెట్టవలుకు కర్ణ. 2-47

**ఆబాలవృద్ధము** సం. సమ. అవ్య. అ. న.

బాలుని మొదలు వృద్ధుని వఱకు (ఎల్లరు)

వ. అనుచు నతికుతూహలంబున నవలోకింప నాబాలవృద్ధంబగు పౌర
లోకంబు. ఉద్యో. 3-176; శాంతి. 1-354

సీ. పౌరజనంబు లాబాలవృద్ధంబుగా వచ్చి రక్కురువంశవరులఁ గూడ.
మహా. 20

**ఆబ్దికము** సం. విణ. (అ. ఈ. అ.)

సంవత్సరమునకు నగునది.

క. హీననరుఁగట్ల గుత్తము, నేమఁగును మనుష్యవధ మనేకాబ్దిక శి,
జూనిరతి ప్రభృతి సుకర్మానుష్ఠానములఁగాని. అను. 3-299

**ఆభము** సం. విణ. (అ. ఆ. అ.)

ఇది సమాసోత్తరముగా నుండి 'సదృశము' అను నర్థము నిచ్చును.

తే. ...ధర్మపరత్వంబు వాసవాభవైభవము నయ్యెడుమ నీకు.
అను. 2-287

**ఆభరణము** సం. వి. అ. న.

భూషణము, తొడవు.

క. వనమాలికా భుజంగాభరణా. విరా. 1-88

**ఆభాసితము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశింపబడినది, ప్రకాశించినది.

క. ఈ సర్వము దేహాత్మాభాసిత మిది దేహియైన పరమాత్ముని వి, వ్యాసమునకుఁగా నొదవి యుపాసించుం గరణరూపమై యా కర్తన్. శాంతి. 4-274

**ఆభిచారికము** సం. విణ. (అ. ఈ. అ.)

అభిచారమునకు శత్రుమారణ వశీకరణాదులకు సాధనమైనది(మంత్రాది)

క. అరుణంబులును సకంటక, తరుభవములుఁ గటుకగంధ ధామములు నొనర్తురు శాత్రవాభిచారిక, కరణమున నధర్వమాంత్రికతఁ గుసుమంబుల్. అను. 4-7

**ఆభిజాత్యము** సం. వి. అ. న.

1. కులీనత, గొప్ప వంశమునఁ బుట్టుట.

వ. అని చెప్పి యిది మరుత్తుని యాభిజాత్యంబును దదీయ విత్త విశేషంబును నెఱింగించుట యవ్విత్తం బతనికి దొరకొనిన తెఱంగును నెఱింగించెద. అశ్వ. 1-82, ఆది, 7-60

2. మనోజ్ఞము, సౌందర్యము.

సీ. ...కన్యారత్నమయిన యా దమయంతి, యత్యంత కాంతి రూపాభిజాత్య. అర. 2-9

**అభిజితము** సం. వి. అ. న.

అభిజిత్తు సంబంధమైన కాలము. ముప్పది ముహూర్తములుగల దినములో ఎనిమిదవ ముహూర్తము అభిజిత్తు అనఁబడును. సూర్యోదయానంతరము సుమారు 6 గంటల కిది ప్రారంభమగును. సూర్యుఁడాకాశమున నట్టనడి యొత్తునమందు సమయము.

ఉ. శాత్రవజైత్రతేజమున సర్వదిశల్ వెలుగంగ నైంద్ర నక్షత్ర

యతుడుగా శశి ప్రకాశ జయోన్నతమైన యష్టమిన్ మిత్ర
ముఖ గ్రహప్రతతి మేలుగ నాభిజితోదయంబునఁ, బుత్రుఁడు
ధర్మువంశమునఁ బుట్టె నతిస్థిరధర్మమూర్తియై ఆది. 5-94.

శ్లో. ఐంద్రే చంద్రసమాయుక్తే ముహూర్తేఽభిజితేఽష్టమే,
దివా మధ్యగతే సూర్యే తిథౌ పూర్ణేఽతిపూజితే.
సమృద్ధయశసం కుంతీ సుషావ ప్రవరం సుతమ్.
సం. భా. ఆది. 123. 6, 7 శ్లో.

**అభిజితోదయము** సం. సమ. వి. అ. పుం.

అభిజిత్కాలము పుట్టుట, అభిజిత్తు సమయము. చూ. అభిజితము.

**అభిషేచనికము** సం. విణ. (అ. ఈ. అ.)

పట్టాభిషేకమున కుపయోగించునది (పదార్థము)

వ. రాజ్యాభిషేక శోభనం బనుభవింపు మని పలికి యాభిషేచనిక
ద్రవ్యానయనంబునకుం దగువారిం బనిచి. శాంతి. 1-371.

**అభీరము** సం. వి. అ. పుం.

ఒక దేశము.

వ. సింహళాభీర శూరసేన కేకయ ప్రముఖులు మెడయును.
ద్రోణ. 1-222

వ. పాంచాల పాండ్య బర్బర...పుళింద పుండ్రక పాండ్యాభీర సౌవీర
సౌరాష్ట్ర...జనపదంబులు. భీష్మ. 1-40

ఇచ్చట పాండ్య శబ్దము రెండుసార్లు కనఁబడుచున్నది. సంస్కృతము నందలి యీ ఘట్టమున నిచ్చినవానికి వీనికిఁ గొన్ని భేదములు గనఁబడు చున్నవి. అక్కడ 'పాండ్య' శబ్దము గానరాదు. ఇది పుష్కరారణ్యము నందలి యొక దేశము. సం.మున. 'పాంచాల పాండ్య బర్బర' అన్నచోట పాండ్య శబ్దము వదలఁబడినది. 'పాండ్య' ఉన్నట్లు పాఠాంతరము గూడ నీయలేదు. సం.ము. పాఠమే సరియైనదిగాఁ గన్పించుచున్నది.

**అభీరుఁడు** సం. వి. అ. పుం.

పుష్కరారణ్యవాసి, గొల్లవాఁడు, చెంబడివాఁడు

మూలమునందలి పాఠమునకు ఈ పాఠమునకు ఇంచుక భేదము.

గన్పించుచున్నది, అందు 'శూద్రాభీర' అనియు వారు సరస్వతీ నది ప్రాంతము వారనియుఁ దెలియుచున్నది.

"పునశ్చ పరివృత్యాథ పుష్కరారణ్యవాసినః
గణానుత్సవసంకేతాన్ వ్యజయత్పురుషర్షభః
సింధుకూలాశ్రితా యేచ గ్రామణీయా మహాబలాః
శూద్రాభీరగణాశ్చైవ యేచాశ్రిత్య సరస్వతీమ్
వర్తయంతి చ యే మత్స్యైర్యేచ పర్వతవాసినః

సంభా. సభా. 32-8, 9, 10 శ్లో.

ఈ 'శూద్రాభీర' శబ్దమే సంస్కృత భారతమున భీష్మపర్వమునందును గనఁబడుచున్నది.

శ్లో. శూద్రాభీరాశ్చ దరదాః కాశ్మీరాపత్తిభిస్సహ,
ఖశీరాశ్చాంతచారాశ్చ సహవాగిరిగహ్వరాః

సంభా. భీష్మ. 67 శ్లో.

ఏమైనను ఈ "ఆభీరులు" అడవులయందు నదీ ప్రాంతముల పల్లెలలో నుండు వారనియు నాలవజాతికిఁ జెందిన వారనియు ఈ పల్లెల కన్నింటికి వారిలో నొకఁడు ప్రభువుగా నుండి స్వతంత్రుఁడై (రామాయణమునందు గుహునివలె) పరిపాలించుచుండుననియు నదిని దాట వేయు పని గూడ వీరిదే యైయుండుననియు నూహింపనగును.

వ. ఇట్లు రౌద్రాకారంబున మాద్రేయుండు మహాసేనాన్వితుం డయి యరిగి మహాసేన రక్షితంబైన మహితకవిషయంబున దత్తత మయూరకాది శూద్రులతోఁ గయ్యంబుచేసి కురు మాళవ బర్బర కర్బర శైరీషక దాశార్ణదేశంబుల రాజుల జయించి పుష్కరారణ్య నివాసులైన యాభీర గణంబులను సరస్వతీ సింధు కూలాశ్రితులైన గ్రామణీయులను బంచనదామరపర్వత నివాసులను వశగతులం జేసికొని. సభా. 1-266

**ఆభీలత** సం. వి. అ. (స్త్రీ).

భయంకరత్వము.

క. ...పాండవజ్వలనం బాభీలత మండం దొడరిన. విరా. 1-119

**ఆభీలత్వము** సం. వి. అ. న.

భయంకరత్వము, వెఱపు గొల్పువది.

శా. లీలం గేలనమర్చి మత్తగజకేళీ సుందరోల్లాస మాభీలత్వం బల రింపఁ ద్రిప్పి. కర్ణ. 8-210; భీష్మ. 1-56

**ఆభీలము** సం. విశే. (అ. ఆ. అ.)

భయంకరము, వెఱపు గొలుపునది.

తే. ...ఆభీల భుజగ చండమూర్తి శమితరు చక్రవర్తి. విరా. 1-162

**ఆభీలుఁడు** సం. విశే. (అ. ఆ. అ)

భయంకరుఁడు

క. శస్త్రప్రకార నిపుణుఁ, డస్త్రవిదుఁడు దూరపాత నాభీలుఁడు.

విరా. 5-6

**ఆభోగము** సం. వి. అ. పుం.

చక్కని సుఖాద్యనుభవము.

క. యోగీంద్ర చిత్త కమలాభోగ మధుపవిభుఁడు ప్రకృతి పురుషాత్ముఁడు. ద్రోణ. 5-428

2. వైశాల్యము.

సీ. పర్వతాభోగనిభంబునైన మేనిపెంపును గల దాని. మౌస. 78

3. ప్రాంత ప్రదేశము.

క. గిరిశిఖరాభోగ బృహత్ఖరభుజగ శరీర వేష్టిత శరీరుండై.

అర. 4-116

**అభ్యంతరము** సం. విశే. (అ. ఈ. అ.)

లోపలిది. హృదయ సంబంధమైనది.

సీ. అభ్యంతరము బాహ్యము ననఁగా కాచ మిరుదెఱఁగై యుండు.

అను. 5-181

**ఆమంత్రణము** సం. వి. అ. న.

ప్రయాణాదులయందు బంధువులు లోనగువారి యనుజ్ఞ పొందుట, వీడుకొనుట, వీడ్కోలు.

వ. అనిన విని దుర్యోధనుండు దాని కియ్యకొని సవినయంబుగా బల దేవుని వీడ్కొని వాసుదేవు నామంత్రణంబు సేసి కృతవర్మ పాలి కిం జనె. ఉద్యో. 1-84; స్త్రీ. 1-117; శాంతి. 6-618.

వ. అప్పుడు దేవు దీవించి యామంత్రణంబు సేసి. అను. 1-381

**ఆమంత్రణముసేయు** మి. స. క్రి.

వీడ్కొను.

వ. ధృతరాష్ట్ర విదురుల నామంత్రణంబు సేసి యద్దేవముని యంతర్ధా నంబు నొందె. చూ. ఆమంత్రణము. ఉద్యో. 2-106

**ఆమంత్రించు** సం. స. క్రి.

పోయి వచ్చెదనని చెప్పి యనుజ్ఞ తీసికొను, వీడ్కొను.

వ. అంత నవద్యూతపరాజితులయిన పాండవులు దమరాజ్యోపభోగం బులు విడిచి...వనంబునకుం బోవ సమకట్టి భీష్మ ధృతరాష్ట్ర విదుర కృప ద్రోణాచార్యుల నామంత్రించిన. సభా. 2-260

**ఆమంత్రితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఆమంత్రణము చేయబడినది. వీడుకొలుపఁబడినది.

సీ ...ధృతరాష్ట్ర మేదినీపతి తపస్విగణము సవినయంబుగా నిజస్థాన యానమునకు నామంత్రితముగఁ జేసి. ఆశ్ర. 2-130

**ఆమంత్రితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఆమంత్రణము చేయబడినవాఁడు, వీడుకొల్పఁబడిన వాఁడు.

వ. ఇవ్విధంబునం బాండునందనులందఱును గోవిందునకు వలయు మాటలు చెప్పి యతని గౌఁగిలించుకొని యథోచిత ప్రకారంబున వీడుకొని వలగొని మగిడిరి. తక్కిన వారలు నర్హంబులగు తెఱంగుల నామంత్రితులై మరలిరి. ఉద్యో 3-145

వ. ...భవదీయ కృపావిశేషంబునకుం గృతార్థుండ నైతినని యతని నామంత్రితుం జేసిన. ఆశ్ర. 2-183; శాంతి. 1-222

2. వీడుకొనఁబడినవాఁడు.

క. వేగిన నామంత్రితుఁడై, యా గుణనిధి వీడుకొలిపి యతఁడు

ప్రయాణో,ద్యోగంబు సమీచీనవి,ధాగరిమ ప్రౌఢవృత్తి దగ
నొనరించెన్. శాంతి. 6–662; అను. 1–269

**ఆమడ** దే. వి.

యోజనము, నాలుగు కోసుల దూరము.

వ ...అచటికి రెండామడయగు సరస్వతి పొంతం బయలికి బలంబులం
గొని చని. శల్య. 1–74

శ్లో. తతో వాహాన్ సమాశ్వాస్య సర్వే యుద్ధాభినందినః
ఉపద్వియోజనే గత్వా ప్రత్యతిష్ఠంత కౌరవాః.
సం. భా. శల్య. 5–50

సీ. ...ఈ,ప్రోలికి నామడనేల నల్ల, యమునానది గహ్వరమున
బకుండను రక్కసుం డుండు. అర. 6–264

(ఇక్కడ మూలములో)

శ్లో. సమీపే నగరస్యాస్య బకో వసతి రాక్షసః సం.భా. ఆది. 160–3

(ఆమడ ఇప్పటి లెక్క ప్రకారము సుమారు 8 మైళ్లు లేక 13 కిలో
మీటర్లుండ ను)

**ఆమతించు** వై. స. క్రి.

1- ఆమంత్రణము చేయు, నియంత్రణమొనరించు – పితృకార్యమునందు
భోక్తగా నియమించు.

క. వినుము సపిండీ కరణ,మ్మును నేకోద్దిష్టమునను భోజనవిధివ,ర్జన
మొప్పు నామతింపక, చన దామెతఁగురువఁబోవ. అను. 4–122

శ్లో. అనిమంత్రితో న గచ్ఛేత యజ్ఞం గచ్ఛేత దర్శకః
అనర్చితే హ్యనాయుష్యం గమనం తత్ర భారత.
సం. భా. అను. 105. 143, 144

2. పిలుచు, ఆహ్వానించు.

ఉ. రాజులఁ బిల్వఁబంపుము ధరాసుర సంఘము నామతింపు.
అర. 6–70

**ఆమ్రద్రవ్యము** సం. వి. అ. న.

పచ్చి వస్తువు-అగ్నిదగ్ధముగాని పదార్థము.

క. ఆమద్రవ్యము మణియును, గామయు శుచులగుట గాదె రామా
రత్నా, రామత దగవగు దుష్కృల,మ్మై మెచ్చుమి దోఁచెనేని ననిరి
మునీంద్రుల్. శాంతి. 4-434

**ఆమము** సం. విణ. (అ. ఆ. అ.)

పచ్చది, వండనిది, అగ్నిదగ్ధముగానిది.

చూ. ఆమద్రవ్యము.

**ఆమయము** సం. వి. అ. పుం.

రోగము. తెవులు.

కం. ...లోకామయ నిర్వారణ నిపుణ హరిహరనాథా. విరా. 3-1

**ఆమర్దితము** సం. వి. అ. న.

మర్దింపఁబడినది, నలఁపఁబడినది.

ఆ. అతని కరతల ద్వయామర్దితంబులై, కందియును మహాసుగంధ
కుసుమ,తతులు దొంటి యట్ల తమ కంపు విడువక,యుండు నతని
తేజ మున్నతంబు. అర. 2-196

**ఆమర్శము** సం. వి. అ. పుం.

చక్కఁగా స్పృశించుట.

క. .. సంకల్పామర్శ రహితమగు చేతోముద్రం దాల్తు నేను దుది
యది నీకున్. శాంతి. 4-45

**ఆమలకము** సం. వి. అ. పుం.

ఉసిరిక కాయ.

క. అతనికెల్ల ధర్మముఁ, గరస్థ లామలక సన్నికాశం బధిపా.
శాంతి. 1-337; 4-446

**ఆమిషము** సం. వి. అ. పుం. న.

1. ఆశగొలుపు వస్తువు, లోభనీయ వస్తువు, వాంఛితార్థము.

చ. .. భూజనుల నేలుట మేలని పల్కెదార్తికా,స్పదమని రార్యు
లామిషముపైఁ బగు లిమ్మహియెల్ల నేలినం, దుది నరకం బొకండ.
శాంతి 1-128

ఉ. అసదృశలీలఁ బొల్చు రథికావళి మీఁదఁ ననంగ వెట్టినే, మసలక

యామిషంబు గొని మార్గము పట్టిన తుచ్ఛసైన్యమున్.
విరా. 4-57

(ఇచ్చట మూలమునందును 'ఆమిషము' అనియే గలదు)

క. దుర్మతు లామిషగతమగు, కర్మము వాటించి బంధకలితులగుదురు.
శాంతి. 1-125

2. మాంసము.

ఉ. డక్కెను రాజ్యమంచు నకటా యిటు దమ్ముని భాగమీక నీ, వెక్కటి
మ్రింగఁజూచె దది యెట్లగుఁగున్ విను మీను లోలతన్, గ్రక్కున
నామిషంబు చవి గాలము మ్రింగిన చాడ్పుసూవె. ఉద్యో. 2-52

3. ఆహారము, భక్ష్యము.

వ. అమ్మహాజగరం బామిషార్థియై భీము౦ బట్టికొని.

ఆ ఎదురఁబడిన వాని వదలక శార్దూల, శరభ సామజాది సత్త్వతతులఁ
బట్టి తినుచుమన్నయట్టి నాకిప్పుడు, భక్ష్యమైతి వీవు పాండుపుత్ర.
అర. 4-106, 111

4. ఆహుతి, అగ్నిహోత్రమునందు వేల్చు పదార్థము.

క. హోమవిధులఁ దన్మాంసము, లామిషములుగాఁగ నొసఁగి.
అను. 5-72

**అముక్తము** సం. విశే. (అ. ఆ. అ.)

ధరింపఁబడినది.

సీ. అయ్యగ్ని సంభవు నాయతోన్నత బాహు, నాముక్త కవచుఁ
దేజో మహిష్ఠు. అర. 5-221, 414; అర. 7-108

**ఆముష్మికము** సం. విశే. (అ. ఈ. అ.)

పరలోకమందుఁ గలుగునది.

వ. ఎయ్యది యాచరించి పురుషుం డైహికాముష్మిక సుఖంబులం-
బొందు ననిన మందాకినీనందనుం డతని కిట్లనియె.
శాంతి. 3-42, 310

**ఆమెత** వై. వి.

పితృకార్యమునందలి భోజనము.

క. వినుము సపిండీకరణ,మ్మున వేకోద్దిష్టమునను భోజనవిధి వ్యర్థన
మొప్పు నామతింపక, చన దామెతఁ గుదువఁటోక సజ్జనవిముఖా.
అను. 4-122

**ఆమోదము** సం. వి. అ. పుం.

1. దూరముగా వ్యాపించెడు పరిమళము, పరిమళము.

తే. శ్రుతి శిరోభాగములఁ దన సుభగచరణ, సరసిజామోదమును
గూర్చు చతురుఁ డితఁడె. ఉద్యో. 3-175

2. సంతోషము, ఆనందము.

క. యమనియమా ద్యష్టాంగ, క్రమాత్యసన విర్మథితవికారసుచేతః,
కమలామోద మయాత్మా. శాంతి. 2-444

**ఆమోదితము** సం. విణ. (అ. ఆ. అ.)

సంతోష పెట్టఁబడినది.

క. ...సంపత్త్యామోదిత భక్తలోక హరిహరనాథా. స్త్రీ. 2-1

**ఆమ్నాయము** సం. వి. అ. పుం.

1, వేదము.

శా. ...భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్.
విరా. 1-3

2. సమూహము.

ఉ. ఆయత కీర్తితో వివిధ యాగములన్ సురధారుణీ సురా,మ్నా
యము నాహితాహుతి సమంచిత దక్షిణ లిచ్చి తన్పుచుఁ.
ఆది. 1-39

3. వంశము.

మ. అమితౌజుం డగువానిఁ జూచి కృతవీర్యామ్నాయజ క్షత్రియా,
ధము లెల్లన్ హృతదర్పులై. ఆది. 7-185

క. ...పాపమతివై భరతా,మ్నాయులగు పాండవేయుల, శ్రీ
యిమ్మెయిఁగొనిన నిమ్నుఁ జీ యనరె యొరుల్. సభా. 2-185

**ఆమ్రము** సం. వి. అ. పుం.

మామిడిచెట్టు, చూతము.

వ. అశ్వత్థమధూకామ్రబిల్వాది భూరుహశోభితంబైన నిజపూర్వాశ్రమంబు గన్గొని. శల్య. 2-218

**ఆమ్రేడితము** సం. విశ. (అ. ఆ. అ.)

పెక్కుమాఱులు పలుకఁబడినది, అధికము చేయఁబడినది.

ఉ. ...సజ్జనామ్రేడిత కీర్తి నిమ్మునిని సమిత్రసుషూదను వాశ్రయించె దన్. అర. 4-358

**ఆయతత్వము** సం. వి. అ. న.

దొన్నత్యము

క. ...ఓహో చాలు భూనభోమధ్యవ్యాపితమయ్యె శవద్దేహాయతత్వ ముపసంహరింపు మనవుడుఁ గపియున్. అర. 3-344

**ఆయతనము** సం. వి. అ. న.

శాల.

వ. యజ్ఞాయతనంబున నానాదేశగతులైన రాజులకు సన్నివేశంబులు సేయించి. సభా. 1-281

2. ఇల్లు, గృహము.

క. ధృతరాష్ట్రి నగ్నిహోత్రాయతనంబున నఱచె వఱకు లగ్నులు శాంతద్యుతులయ్యెన్. సభా. 2-251

3. స్థానము, ఆశ్రయము, ఉనికి పట్టు.

క. ఈ యాఱుసు మంచి తెరువులై యుండు నహింసయున్న దైయెదింటికిఁ బవిత్రాయతనము. అను. 4-279

వ. ఆ సంయమ చతురునిచే సర్వాయతన సన్నిరుద్ధంబై యాత్మమూర్ధంబు భేదించి. అను. 6-468; శాంతి. 2-50; అను. 3-254

**ఆయతము** సం. విశ. (అ. ఆ. అ.)

1. విస్తృతము, విరివియైనది.

సీ. పాయు తొలంగు మం చాయతవేత్రహస్తులమొత్త మేలొకో తోడు రాదు. విరా. 1-186

2. విశాలము.

చ. కమలాయతాక్షి. విరా. 1-247; సభా. 1-18

నా మీఁదన్. శాంతి. 2-70

**ఇతరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రాకృత పురుషుఁడు, పామరుఁడు.

క. నీ యవినయంబు పెంపున, నీ యాపద సంభవించె నింక వగచినం, బాయునె యితరుల క్రియ శో,కాయత్తుఁడ వగుట నీకు నర్హమె యధిపా. ద్రోణ. 4-22

శ్లో. ఆత్మాపరాధాత్సంభూతం వ్యసనం భరతర్షభ, ప్రాప్యప్రాకృత వద్వీర మా త్వం శోచితు మర్హసి. సం. భా. ద్రోణ. 114-47

చ. వ్రతము ధరించి నిష్ఠ నుపవాస విధిం గొలుతున్ సముద్రు నా, కితఁడు ప్రియంబుతోడఁ దెరు విచ్చుట యంతన కల్గనేని మే,లిత రునిఁ గావనుం దలఁచెనేని యమానుష రోష వేష దీ,పిత శరవహ్ని నిజ్జలముఁ బీల్చెదఁ ద్రేల్చెద నొక్క వ్రేల్మిడిన్. అర. 7-47

2. అన్యుఁడు, వేఱైనవాఁడు.

ఆ. సుకృతు లమరలోక సురుచిర వాసులు నిట, దిగి చిరాయువులును నగుదు రితరు, లతిచిరముగ నరకగతు లయి తుది నాయు,వల్ప మగు మనుష్యు లగుట గలుగు. అను. 5-184

**ఇతరేతరము** సం. విణ. (అ. ఆ. అ.)

అన్యోన్యము, ఒండొకటి, పరస్పరము.

క. ఇతరేతర శరకృత శోణిత ధారలు నిగుడు.

భీష్మ. 8-208; ద్రోణ. 4-262; శల్య. 2-291; శాంతి. 6-454

**ఇతవు** వై. విణ. (సం. హితవు)

హితమైనది, ప్రియము.

క. పితృబూజనమని యెవ్వరి, కితవుగఁ జేయుదురు దీని నెఱిఁగింపు మనా. అను. 5-206

చ. ...ఇట్టివా, రితవులు తండ్రికిన్ సుతుల కేమననేర్తుము పెద్ద రాజులన్. (ఇతవులు = హితులు) ఉద్యో. 4-240

**ఇతిహాసము** సం. వి. అ. పుం.

1. పూర్వచరిత్రప్రతిపాదక గ్రంథము (భారతాది)

సీ. ఐతిహాసికు లితిహాస మనియు. ఆది. 1-31

వ. తొల్లింటి యితిహాసంబు సెప్పెద వినుము. ఉద్యో. 1-117

2. పూర్వరాజుల వృత్తాంతము.

వ. తొల్లి యిట్లు పుత్త్రమరణ శోకాతురుండైన యకంపనుం డను రాజు నారదమునిచేత మృత్యుప్రకారంబు దెల్లంబుగా విని యుపశమిత శోకుండయ్యె నని విందు మయ్యితిహాసంబు తెలం గెఱింగించెద. ద్రోణ. 2-158; కర్ణ. 1-295

3. పూర్వకథ - కథ.

వ. ...కౌశికుం డను నొక్క విప్రుండు...సత్యవిభాగ విధిజ్ఞుండు గామిం జేసి తన కసత్యంబు వాటిల్లు నను శంక (జనులు) నీ గుల్మంబులా గహనంబు సొచ్చిరని చూపి చెప్పిన నత్తెక్కులికాండ్రు వారలం జంపి ధనమ్ముగొని రమ్మని తద్వచన దోషంబున నరక ప్రాప్తుం డయ్యె నను నితిహాసంబు విందుము. కర్ణ. 3-78; స్త్రీ. 1-51

**ఇది** దే. సర్వ.

(ఈ + ది = ఈది, ఇద్ది, ఇది- అనునవి రూపాంతరములు- 'ఈది' ప్రస్తుతము భాషలో లేదు. క-త-ఇదు.)

1. (i) 'ఈ' అను దానికి మహత్వర్థమునందు (స్త్రీ వాచకమగునపుడు) ప్రథమైకవచనమున వచ్చు రూపము.

చ. ఇది గడుముద్దరాలు పనులేమియుఁ జేయఁగనేరదు. విరా. 1-108

క. ...సాధ్వి యిది మలిమస వృత్తంబున పొంతఁబోవ దెన్నఁడు. విరా. 1-106

చ. ఇది మునికన్యయేని మఱి యేలొకో. ఆది. 4-30

(ii) అమహదర్థంబునందు (తిర్యగ్జడములను దెలుపునపుడు) ప్రథమైక వచనమున వచ్చు రూపము.

సీ. ...ఇది హోమధేను వత్సంబు. కర్ణ. 2-90

సీ. ...ఈ ధవ్యసారమేయ, మిది యట రావలదే. మహా. 1-52

వ. ...కిటంబుం జూపి యిది దొలుఁచుచుండ మీ నిదుర సెడుటకుం జాలక కదలకుండితి ననియె. శాంతి. 1-22

వ. ...ఇది యెవ్వరి యాశ్రమంబు. కల్కి. 2-218

(iii) ద్వితీయాది విభక్తులలో ఏకవచనమున స్త్రీ తిర్యగ్జడ వాచకంబులకు రెండిఁటికిని 'దీని' అనురూపము వచ్చును.

సీ దీని జన్మంబున - దీని నామాకృతి - దీని వల్లభుఁడు. విరా 2-80

క. ముని యశ్వముఁజూచి కరం, బనురాగముఁబొంది మేధ్య మగు నిది దీనిన్, వినుత విధానమున విడుతము. అశ్వ. 3-220

వ. .. ద్విజశ్రేష్ఠుండు దీని (చరువు) వలనం బుట్టు.
శాంతి. 2-69; విరా. 1-160

(iv) ద్వితీయాది బహువచనంబులందు తిర్యగ్జడ వాచకంబులకు 'వీని' అనురూపము వచ్చును.

తే. మద్దన మిదియని వీనిలోన నొకటి యందు నంగీకార మొలయదు.
అశ్వ. 2-98

2 దగ్గఱగా నున్నదానిని దెలుపును.

చ. ఇది గడు ముద్దరాలు పను లేమియుఁ జేయఁగ నేరదు.
విరా. 1-108

క. ఇది కర్మభూమి భో,గాస్పదము. శాంతి 4-110

చ. ఇది శతవృద్ధ మా జనని. విరా. 1-179

వ. వారలకందఱకు నిది ప్రాప్త కాలంబై యున్నయది.
ఉద్యో. 3-235

సీ. ఇది యాదిగా నతు లెన్నండుఁ బరపురుషార్థినుల్ గాఁ జనదు.
(ఇది- ఈ కాలము) ఆది. 5-85

3. ఈ విషయము.

వ. ఇది యనన్య సామాన్యాకారంబగు పరమ ధర్మ ప్రకారంబు.
ఆది. 1-29; భీష్మ. 3-79

4. ఈ జరుగునది.

సీ. ఇది పదుమూఁడగు నేఁడు మాకజ్ఞాత, వాసంబు సలుపంగవలయు. విరా. 1-47

5. ఈ చెప్పఁబడినది. ఈ రచింపఁబడినది.

వ. ఇది శ్రీమదుభయకవిమిత్ర...తిక్కన సోమయాజి ప్రణీతంబు. విరా. 1-336

వ. ఇది జామదగ్న్యకోపంబు తెలుంగు. కర్ణ. 2-89

6. ఈ విషయములో, దీనిలో.

ఉ. ఉల్లము దల్లడిల్లఁ దన వృద్ధత ఘర్మజలంబు దాల్చుచున్, డిల్ల
పడంగ వాకిటి గడింది విచారము పుట్టె నందుఁ బో,నొల్ల ననంగ
రా దచటి కూరక పోవనురాదు నేర్పు సం,ధిల్లఁగ దీని కావికొను
దీనుస మెట్టిది యొక్కొ దైవమా. విరా. 2-91

7. ఈ వచ్చినది.

వ. ...మందమందసంభాషణంబుల సంబోధించు పాంచాలి పాణి
స్పర్శనంబున మేలుకని యిది యెవ్వ రనవుడు నే నను నమ్మానిని
యెలుం గెఱింగి భీమసేనుండు. విరా. 2-167

8. పాదపూరణముగా నుపయోగింపఁబడును.

ఉ. కౌరవసేనఁ జూచి వడకం దొడఁగెన్ మదిలోన మేను నీ,వూరక
పోవుచుక్కి యిది యొప్పునె. విరా. 2-186

ఇదిగాక దే. అవ్య.

ఇదియును గాక-ఇది కాకుండ.

ఉ. దానఁ గొలంది లే దభిమతం బిదిగాకయుఁ గల్గెనేనియుం బాని
యొనర్తు నన్నుఁ గురుపుంగవుఁ డెంతయుఁ బొంగి. ఉద్యో. 1-98

సీ. అన విని గాంగేయుఁడు...వైరుం నిర్జింపు, మిదిగాకయును వల
మెద్దియైన, నడుగుము నీకుఁగా నని సేయు టొక్కటి, దక్కంగ
వావుడు ధర్మసుతుఁడు. భీష్మ. 1-157

**ఇదిగో** దే అవ్య.

ఈ కనఁబడునదే.

మ. ప్రమదాపాది పయఃప్రపూర్ణ మిదిగో పద్మాకరం బంచు. ఆది. 6-172

('ఇదియో' అని ఆనందపాఠము 'ఇదియే'-అని అకాడమీ సం. ము. పాఠము. 'ఇదిగో' అనునది పాఠాంతరముగా సం. ము)

**ఇది యది యనక**

అనవసరపు మాటలాడక.

క. ఎదిరికి హితమును బ్రియమును, మది కింపును గాఁగఁ బలుకు మాటలు పెక్కై, యొదవినను లెస్స యటుగా, కిది యది యన కూరకునికి యెంతయు నొప్పున్. ఉద్యో. 2-59

**ఇదియో** దే. అవ్య. (ఇది + ఓ)

ఇదిగో (చూ. ఇదిగో)

**ఇదె** దే అవ్య. (ఇది + ఎ)

ఇదిగో.

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రింకెట్లొక్కొ. విరా. 3-27

సీ. ...ధృతరాష్ట్రుని యాశ్రమంబు, సెలఁగివవా రదె యిదె యంచుఁ బేర్కొని, చూపి చెప్పిన. ఆశ్ర. 2-31

తే అంతకుం డిదె యదె తోఁచెవనఁగ నధిప. మౌస 1-17

క. ఇదె పోయెదఁ గౌరవ్యులఁ, బవనికి రాఁబలికి సంధి వాటించెద. (ఇదె = శీఘ్రముగా) ఉద్యో. 3-69

**ఇద్దఱు** దే. సర్వ.

(రెండు శబ్దములకు మహన్మహత్యర్థక బహువచన రూపము)

ఇరువురు.

క. ...అయ్యిద్దఱు నెత్తుటఁ దోఁగి కడున్ వఱలిరి కల్పాంత నవ దివాకరుల క్రియన్. ద్రోణ. 4-216

సీ. భార్యలిద్దఱు గలరు. అను. 6-287

మ. ...ఇద్ధబుచ్ ధుఅబలాటోపంబుమై. విరా. 2-343

క. ...ఇద్ధఅ దిక్కుల సైన్యములును దలపడియె వడిన్.

భీష్మ. 1—289; కర్ణ. 3-258

ఇద్ధము సం. విణ. (అ. ఆ. అ.)

1. దీప్తము, కాంతివంతము.

ఆ. ...ఉటికి మంటలోన మల్లంబు తెలివొంద, యింతయేని గుంద కిద్ధ మూర్తిఁ, దేజరిల్లనున్న ధీరవర్యునకుఁ బ్రత్యక్షమయ్యె శివుఁడు దయదలిర్ప, సౌప్తి. 1—125

2. ప్రజ్వలించునది.

ఆ. ఇద్ధమైన యగ్ని యింధన సంపద, నతిశయిల్లు నట్లు.

శాంతి. 5-580

3. ప్రసిద్ధము.

తే. ధ్యానయోగ నిశ్చలమదు నంతరంగ,మెడల విడుచు గుణంబుల నిద్ధకాంత,మైన నిర్గుణ వస్తువునందుఁ గలయుఁ, బరమపద మది దానికిఁ బరము లేదు. శాంతి. 4-184

4. అప్రతిహతము, అనివార్యము.

మాలిని: ఇద్ధమాయా విలాసా. ఉద్యో. 1-385

మ. ...జాకుదగ్నిఁ గలికాస్త్రిం బిద్ధతేజంబునన్, దొరసప్తార్చికి.

కర్ణ. 3-29

5. సత్యమైనది.

ఉ. ...ఇద్ధలో,ధాంగసమాశ్రితాపదుదయజ్వలనప్రశమప్రవర్తక.

కల్కి. 1-408

ఇధ్మము సం. వి. అ. న.

వంట చెఱకు.

క. అతం డిధ్మ ముండు నటవీస్థలికిం జనినయెడ. అను. 1-69

ఇధ్మవాహుఁడు సం. వి. అ. పుం.

తేజస్వి యను ఋషి, అగస్త్యుని మనుమఁడు, దృఢస్యుని కొడుకు.

వ. వానికిం (దృఢస్యునకు) దేజస్వి యను ఋషిపుట్టి పారంబైన యిధ్మభారంబు నహించుటం జేసి యిధ్మవాహుం డనం బరఁగె.
అర. 2—358

**ఇనబింబము** సం. వి. అ. పుం. న.

సూర్యమండలము.

క. అని పలికిన యవసరమున, నినబింబములోన నుండి యిది నిజ మిబ్బంగిన నెగదవన్న మేలగు,నను వాక్యము వెదలెఁ గర్ణుఁ డాకర్ణింపన్.
ఉద్యో. 4-60

**ఇనసుతుఁడు** సం. వి. అ. పుం.

కర్ణుఁడు.

క. ఇనసుతుఁ డిట్టు లను.
విరా. 4-216

**ఇను** దే. సర్వ. (వృత్తియందే దీనికిఁ బ్రయోగము)

రెండు.

క. ...కర్ణుం, డినుమూ ఁటోక శరము దొడుగునే పరులు నగన్.
కర్ణ. 3-317

**ఇనుఁడు** సం. వి. అ. పుం.

సూర్యుఁడు.

క. ఇనుఁడు తనకడకు నేతెంచిన రాగముఁబొందుటది యుచితమనఁగాఁ గెంపున మెఱసి పశ్చిమాశాంగన జన సంభావనముల గౌరవ మందెన్.
విరా. 2-318

**ఇనుచు** దే. స. క్రి.

పూను.

క. ...ఆర్యజనుల మహిమ హితవచనముల్, వీనుల వినుచుచు ధర్మ ము,లైనవి సేయంగఁ దప్పు కగుఁ దత్ఫలముల్.
శాంతి. 4-79

(ఊనుచు — అని పాఠాం)

**ఇనుపగుండియ** దే. వి.

ఇనుముతోఁ జేయఁబడిన గుండె- (ఇనుము ఎంత గట్టిగానుండునో అంత గట్టిగా నుండు గుండియ అని భావము.)

తే. ...ఇనుప, గుండియకుఁ జేటు పాటింకఁ బుండరీక,నయన
ప్రే 2-49

**ఇనుపొడుపు** వి.

సూర్యోదయము.

క. ఇనుపొడుపునఁ జెడని తమము నెందును గలదే. అను. 2-855

**ఇనుమడి** దే. విణ. (ఇను+మడుఁగులు)

ఇమ్మడి, ఇబ్బడి, రెట్టి, రెట్టింపు.

సీ. చెలువంపు వెమ్మొమ్మ నెలమినొం పినుమడి,గా నల్ల నవ్వినఁగాదె యుంటి. విరా. 2-46; ఉద్యో. 4-414; భీష్మ. 1-27

**ఇనుమడించు** దే. అ. క్రి.

ఇమ్మడియగు, రెట్టింపగు, ఇంతనంతలు చేయు.

తే. తగు నినుమడింపఁ జూచు న త్తన్విఁ బోరిఁబోరిఁ గీచకుండు.
విరా. 2-250

తే ఇమ్మహీపతి సమ్మదం బినుమడించె. అను. 1-294

సీ. కర్ణభూషణ మౌక్తిక ప్రకాదోలన మీఁతణ దీప్తుల నినుమడింప
విరా. 4-30

**ఇనుమడుఁగు** దే. వి.

రెట్టి, రెండింతలు.

క తన యెప్పటి రూపముఁజే, కొని దీనికి నినుమడుంగగుం బ్రతి బలముం, గనినప్పుడు నా రూపం, బనుపమముగ ననిన హనుమ కనిలజుఁ డనియెన్. అర. 8-845

**ఇనుమాఱు** దే. వి.

రెండు పర్యాయములు, రెండుమాఱులు

క. కర్ణుం, డినుమాఱొక శరము దొడుగునే పరులు నగన్.
కర్ణ 8-817

**ఇనుము** దే. వి.

ఒక లోహము, కాలాయసము.

క. ఇనుమును రాగియుఁ దగరం,బును వెండియుఁ బసిఁడియుం బ్రభూ

తములై పేర్చిన సిరిఁజేయఁగ నొప్పెదు, ఖను లెడనెడఁ జెక్కు
కలవు కౌరవనాథా. భీష్మ. 1-86; కర్ణ. 1-263; భీష్మ. 3-419

**ఇన్నాళ్లు; ఇన్నాళ్లులు** దే. వి. బహు. (ఇన్ని + నాళ్లు)
ఇన్ని దినములు.

తే. పెండ్లికని పిల్వఁబంచినఁ బ్రియముతోడ, నేఁగుదెంచితి మిన్నాళ్ల
నెల్లయొప్పి, దములఁ జూచితి మియ్యెడఁ దడవుఁగాఁగ, నిలువఁ
దీఱదు పోయి రావలయు మాకు. ఉద్యో. 1-42

వ. ...ఇన్నాళ్లు గాంగేయుఁ డెబ్బంగుల సంగరంబు సేసె.
భీష్మ. 1-64

శా. ...నారల యుపేక్షంగాక యిన్నాళ్లు తే,లా వైరం బడగింపనీ
వయిన లీలన్ గెల్తు కౌంతేయులన్. కర్ణ. 1-58

**ఇన్ని** దే. సర్వ. బ. భా.

1. ఇఁతశబ్దముయొక్క అమహదర్థక బహువచన రూపము. అధిక
సంఖ్యను దెలుపును.

తే. ఇన్ని తెఱఁగుల శ్రమము సేయింతుఁ జతుర,తా విహీనులైన
పాత్రములనైన, విరా. 1-242

వ. ... ఇన్ని సైన్యంబులు నొక్కలావున వర్తించు చందఁబు సూచి
కొనవలయు. ఉద్యో. 4-142

2. ఇవి యన్ని.

క. ... ఇమ్మెఁ, బూని వ్రతంబులు సలిపెదు, వానికి నిన్నియును
నిట్లు వలయునె చెప్పుమా. విరా. 1-205

క. ఇదె దేహం బిదె యర్థం, బిదె నా పరిజనసమూహ మిన్నిటిలో
నెయ్యదిన మాకిష్టము దానిన, ముద మొదవఁగ నిత్తు గొనుఁ
డమోఘం బనినన్. ఆది. 5-148

ఇన్నిట. ఉద్యో. 3-108; ఇన్నింట. శాంతి 5-168; శాంతి. 6-456
ఇన్నిటి. ఉద్యో 2-194; ఇన్నిటిని. శాంతి. 6-405; అను. 4-219;
ఇన్నిటికంటెన్. అను. 2-234; ఇన్నిటిలోన్. ఆది. 5-242; ఇన్నిటి
లోనన్. అర. 2-70.

**ఇన్నూఱు; ఇన్నూఱులు** దే. సర్వ. బొ. (√ఇను)

రెండు వందలు.

వ ఇన్నూఱు రథంబులు మూ తేసుంగులు. శల్య. 1-328

తే తనకు నిన్నూఱు కాని లే ననియె వారులు. ఉద్యో. 3-314

క. నన్నూఱులు మున్నూఱులు, నిన్నూఱును నూఱులును.
శాంతి. 5-50; ఉద్యో. 3-317

**ఇన్పువల** దే. వి. సమ.

ఇనుముతోఁ జేయఁబడిన చిక్కము.

చ. ...ఇన్పువలలో నమృతంబు సురక్షిత స్థితిన్

క. ఉండు ననిన. అను. 1-316, 217

**ఇన్మాఱు** దే. సర్వ. వి.

రెండుసార్లు.

సీ. ఇన్మాఱు తిర్యగ్విధమున, వాస్యంబు దొడిసి. అను. 3-284

**ఇన్ము** దే. వి.

ఇనుము. చూ ఇన్పువల. అను. 1-216, 217

**ఇపుడు** దే. ఏక.

ఇప్పుడు, ఈ సమయము.

క. విగత భయవాసయోగ్యం,బుగ నొక్కెడ నెప్పుఁ డిపుడ పోవఁగ వలయున్. విరా. 1-68

ఆ. ...తద నుగ్రహంబువడయ వలయు ననఘయిపుడు.
ఉద్యో. 4-359

**ఇప్పించు** దే. స. క్రి. ప్రే.

ఇచ్చునట్లు చేయు.

వ. ...గోపాలురకుం గట్ట నిప్పించి కంకు నాలోకించి నెత్తం బొక పలుక యాడుదమే యని యుబ్బుమై మాటగాఁ బలికిన.
విరా. 5-244

వ. ...వీని కర్ఘ్యం బిప్పించి తదియుమ్ముం గాక. సభా. 2-42

వ. ...అమరులెల్లఁ బితామహుఁ బ్రార్థించి నాకు నవ్యయత్వంబును

సకల భయమోచనంబుమంగా వరం బిప్పించి రైనము.
ఆది. 2-129

(వరంబిచ్చిరై నను- అని ఆనందవారి పాఠము- ఇప్పించిరి- అకాడమి సం.ము పాఠము)

**ఇప్పించుకొను** దే. స. క్రి.

1. ఇచ్చునటులఁజేసికొను.

వ. ...మదీయ ధర్మపత్ని యకుండలంబులు దొడుగ నవసరంబై యున్నయది మద్వచనంబున వాని నిప్పించుకొమ్మనిన. ఆది. 1-95

2. కలిగించుకొను, పొందు.

ఆ. అతని నాశ్రయించి యవ్వేర విప్పించు,కొనిన మేలు వొందు ననియె భార్గవుండు. శాంతి. 3-185

**ఇప్డు** దే. ఏక.

ఇప్పుడు, ఇపుడు.

శా. ...మత్పతు, ల్గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్, వెసం గిట్టి గం,ధర్వుల్ మావమఁ బ్రాణముం గొనుట తథ్యంబు.
విరా. 2-55

**ఇప్పుడు** దే. వి. ఏక.

(ఇది ద్వితీయాది విభక్తులతోఁగూడియు నుండును. దీని రూపాంతరము లగు 'ఇపుడ, ఇప్డు' అను వానికి ద్వితీయావిభక్తి రూపములు లేవు.)
ఈ సమయము.

చ. ఇది శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ బొందె.
విరా. 1-179

ఉ. ...నీ,వెల్ల నెఱుంగు దిప్పు డెడ యిచ్చుట యుక్తము నాకుఁ గూడఁగన్. ఉద్యో. 1-135

ఉ. ఇప్పటి భంగి నొక్కరుడు నేఁగెడు దానికి నోర్వ నెమ్మెయిన్.
విరా. 1-148

వ. ఎల్లభంగుల నిప్పటి కిదియె కార్యంబు. విరా. 3-117

మ. ...నీ చిత్తంబు పోరాటకుం, జొరదే నిప్పటికిం దొలంగి చని
శల్య. 2-44

క. ...ఇప్పటి నీ,యునికియును జూచి శాకు నమ్మల మయ్యెన్. శాంతి. 4-390

వ. ...ఇప్పటియట్ల యెల్లవుడుమ గోవులవలన భక్తి. అను. 3-76

క. ...ఇప్పటి వచనున్, గడవఁబడుట ద్రాటఁ దప్పు కరణియచుమ్మీ. కర్ణ. 3-278

వ. ...విన నిప్పుడుం జెప్పెద. ఉద్యో. 2-89

ఉ. ...ఆనంద మరల్పఁగాక విరోధి నిప్పుడున్. విరా. 4-194

క. ...సౌగంధిక,ములుగొని యిప్పుడును దర్పమున. అర. 4-25

**ఇభపురము** సం. వి. అ. న.

హస్తినాపురము.

క. ...ఇభపురమున మాట పుట్ట దెట్లివు వినన్. ఉద్యో. 1-79

**ఇభము** సం. వి. అ. పుం.

ఏనుఁగు.

సీ. ఉభయ పార్శ్వముల నిభఘట లేలకో చనుదేవు. విరా. 1-186

**ఇమి** అవ.

సీ. త్రుచ్చిమియును అంకు నెచ్చోటనైన భూమి లోపల లేదు. శాంతి. 2-341

మగటమి శల్య. 2-125; పోడిమి శల్య. 2-148.

**ఇమ్మడి** దే. విణ. (√ఇను)

1. రెట్టింపు, ద్విగుణితము.

సీ. ...అగ్గోవిందు సందర్శనంబున నుత్సవోన్మత్త భావ, మిమ్మడియై ప్రమోదమ్మునం దేలిరి. అశ్వ. 3-119

2. రెండవవాఁడు, సరిసమానుఁడు.

క. అమ్మేటి మగఁడు తనచా,పమ్మూఁతగసిల్చి నో లి పదపడి తెలి వు ల్లమ్ముఁన వోలసిన నౌరా, యిమ్మడియని పొగడెఁ గొడుకు నెంతయుఁ బ్రీతిన్. అశ్వ. 4-60

(ఇమ్మడి = తనకు రెండవవాఁడు, తనతో సరిసమానమైనవాఁడు)

**ఇమ్ము** దే. వి. (ఇంబు)

1. **అనుకూల్యము, వీలు.**

ఉ. ఎప్డు సంక్రందనసూతి దగ్గఱియెఁ గయ్యము సేయుట కప్పు డిమ్మునన్. విరా. 4-184; విరా. 4-93

ఉ. లోకవిరుద్ధవృత్తి చపలుం డతఁ డిమ్మెఱుఁగండ యేమియున్. శల్య. 2-370

వ. ...గరుడుండు గగనంబునం బఱచి తనకు మూఁద నిమ్మగు ప్రదేశం బెందును గానక. ఆది. 2-78

క. తన కిమ్మగు నంతకు దుర్జను,డిష్టుఁడ పోలె నుండి సర్పము పోలెం, దన కిమ్ముగుడును గఱచును, ఘనదారుణ కర్మగరళ దంష్ట్రల చేతన్. ఆది. 6-112

2. **ఉపాయము.**

క. నెమ్మి గలవారి నొల్లరు, త మ్మొల్లనివారి వెనుకఁ దగులు దుర ధికత్వ మ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు, రిమ్మెఱుఁగని యట్టివార లిభపుర నాథా. ఉద్యో. 2-84

3. **స్థానము, చోటు.**

తే. పెరిగి పాండవాంబుధి వెల్లివిరిసినపుడు, నిలువ నిమ్మగు దీవిగా నిన్నుఁ దలఁచి, యుండ నత్యంత తుచ్ఛ శిఖండి వల్వ,లాక్రమంబున మునిఁగితే యకట తండ్రి. భీష్మ. 1-58

4. **పదిలము, క్షేమము.**

వ. అయ్యమోఘవీర్యం బొక్క యజీర్ణ పర్ణపుటంబున నిమ్ముగా సంగ్రహించి యొక్క దేగయఱుతం గట్టి... ఆది. 8-28

సీ. ...పెఱ ధన మెల్లను నిధియుఁగా, నిమ్మైన నెలవున నిడుచునుండి అశ్వ. 1-15

క. రథి కిమ్ముగానియెడ సా,రథి ధృతిమెయిఁ గానవలయు. అర. 1-178

**విశే.**

1. **అనుకూలమైనది, వీలైనది.**

ఉ. ఇమ్మదిరాటి దప్పె మన కిం నడుమన్ విడియంగ నొండు లో,
టిమ్మను గాదు. విరా. 1-164

ఇ. ఎత్తికొని చనంగ నిమ్ముగునట్లుగా, మెదలుచున్న ప్రయ్యలఃమి
రెంటిఁ, గూడఁబట్టె వనియుఁ గూడి యొండొంటితోఁ, బక్కనంటి
రెండు నొక్కఁడయ్యె. సభా. 1-147

2. మనోహరము.

క. ఏనవపర్వం, బిదివా మద్యోగపర్వ మిమ్ముగు సభలన్ ఆది. 1-43

మానిని. ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల నిమ్ముగు తావుల తొంపములన్.
ఆది. 4-20

3. ఇంపైనది, ఇష్టమైనది, అభీప్సితము.

క. మన యింట నిచ్చటచ్చోటన కెచ్చటనైన నీ బృహన్నల మెలఁ
గం, బనియెడు మానిసి తనమన,మున కిమ్ముగునట్టి చరితమున
వర్తించున్. విరా. 1-264

క. ...రాజు మాటలకుం దేలని వెరవుతోడ నా పూజ్యుని దన
కిమ్మైన యెడకుఁ బనిచెఁ గుమారా. శాంతి. 3-264

శ్లో. సైవముక్త్వా శకునికా బ్రహ్మదత్తం నరాధిపమ్, రాజానం
సమనుజ్ఞాప్య జగా మాభీప్సితాం దిశమ్. సం.భా. 139-112 శ్లో.

ఇమ్ముగ ద్రు. (ఇమ్ము+కన్)

1 బాగుగా, చక్కఁగా.

వ. ...గర్భంబు లిమ్ముగా రక్షింపం బనిచిన. ఆది. 2-4

ఉ. ఇమ్ముగ నాత్మరక్ష విధించు విధంబున మంత్ర రక్షయ,త్నమ్మునఁ
జేయఁగా వలయు. ఆది. 6-110; ఆది. 5-248

2. ప్రసిద్ధిగా.

క. ఇమ్ముగ సరస్వతీ తీరమ్మునఁ బండ్రెండు వత్సరమ్ములు విధి
మార్గమ్మున సద్గుణ సముదాయ మ్మొసఁగఁగ జేసె సత్త్రియా
గము నిష్ఠన్. ఆది 4-8

3. స్పష్టముగా, తెల్లముగా.

తే. వృక్ష శాఖాగ్రమున నున్న పక్షిశిరము, దెల్లముగఁ జూచితే మహీవల్లభుండ, యనిన నిమ్ముగఁ జూచితి. ఆది. 5-249

4. రుచ్యముగా.

వ ...సూపకారుండు వధ్యస్థానంబునకుం జని మనుష్యమాంసంబు దెచ్చి యిమ్ముగా వండిపెట్టిన. ఆది. 7-114

**ఇమ్ముల** (ఇమ్ము శబ్దము యొక్క ద్వితీయా బహువచనాంత రూపము)

సంతోషము, సుఖము, ప్రీతి (అగునట్లుగా)

ఉ. .. ధర్మితమాత్రవుఁ డందు నాఁటిరే, యిమ్ములఁ జల్చి వేగుటయు నీప్సిత కార్యము సేయఁగా విచారమ్మున నున్నచో.

విరా. 1-58; ద్రో. 2-285; సౌప్తి. 1-9

క. కులమునకు సకల లోకంబులకు నపాయంబుసేయు పురుషాధము నిమ్ముల దూషించి జగంబును, గులమును రక్షించు టయుదె కువలయనాథా. ఆది. 5-111

క. కులపాంసనులయి యహితంబులు సేయుచునుండు చుట్టములఁ దొలఁగక యిమ్ముల నుండు వాఁడ పుణ్యుఁడు, వెలయఁగ గ్రామస్థితైక వృక్షముపోలెన్. ఆది. 6-181

శ్లో. జ్ఞాతయో యస్య నైవస్యు, ర్విషమాః కులపాంసనాః ।
న జీవేత్ సుఖం లోకే గ్రామ ద్రుమ ఇవైకజః ॥

సం. భా. ఆది. 151-81,82

**ఇయ్య**[1] ఈయ.

వ. అట్లు గుటం జేసి యాఁగొల్చి విప్రున కియ్యకున్కి యొప్పదు. అను. 1-275

**ఇయ్య**[2] అవ్య.

అంగీకారమును దెల్పును

మధ్యా:- ఒకర నాసుతునకు భార్యవగుమన్న నొడఁబడి యియ్య

యనియె. ఆది. 4-141

క. చక్కనగు మనిన రక్కసుఁ, డక్కజముగఁ జెరి ? యియ్య యగు
నిప్పుడు నీ, యుక్కున బీరముఁ జూపెద ఆది. 6-208

**ఇయ్యకొను** ఈయకొను, స. క్రి. (√ఇయ్య)

1. అంగీకరించు, సమ్మతించు, ఒప్పుకొను.

తే. అవిర విది పోలు నని యియ్యకొని యజాతవైరి. విరా. 1-91

ఉ. ముందడియట్ల యింకఁ బదు మూఁడు దినంబుల మాత్రకున్ భవ,
న్మందిరవాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ.
విరా. 8-62

క. అక్కడి బంధులఁ బంపుచు, నిక్కడి బాంధవుల నచ్చ టియ్యకొనుచు నం, దెక్కడి పెంపాందెదను.
భీష్మ. 1-184

2. మెచ్చు.

తే. ఏమి కారణమున మెచ్చి తేకతమున, మెచ్చవైతి దానవుల నీ
మెచ్చు చొప్పు, మాకు నెఱిఁగింపు మనిన న మ్మానవీయ,వాక్య
యిట్లని చెప్పె న వ్యాసపుత్రుడు.

క. నానాధ్యయనాతిథిస,మ్మానాది శిష్ట గుణ సమగ్రత కలిమిన్,
దానవుల నియ్యకొంటిని, వాని విడిచి గర్వులగుట వారి విడిచితిన్.
శాంతి. 6-8,9

అ. క్రి.

అంగీకరించు, సమ్మతించు.

ఉ. ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగ రేము. విరా. 6-7

ఆ పాడుతు నెట్లుఁ బాండుపుత్రులతోఁ గయ్య, మేము నీవు దీని కియ్య
కొనుము. శల్య. 1-69; విరా. 1-160

**ఇయ్యకొలుపు** దే. స. క్రి. (√ఇయ్యకొను)

1 అంగీకరింపఁజేయు, సమ్మతింపఁజేయు, ఒప్పించు.

గీ. సముచితమగు మాటలఁ జక్కఁబడక, తక్కెనే నుక్కవుం దగు
ధార్తరాష్ట్రు, గ్రూరతరముల నే నియ్యకొలువుజాలద, నవని

కౌంతేయులకు నిచ్చునట్లు గాఁగ. ఉద్యో. 1-27

వ. ... అజాతశత్రుండు నీవు కరినగరంబున కరిగి కౌరవులతోడం దగిన మాటలాడి తెఱంగుసేయ వలయు నని ప్రార్థించి యతని నియ్యకొలిపి యిట్లనియె. ఉద్యో. 3-3

2 లోబఱచు, లొంగునట్లుఁ జేయు.

ఉ. కాలకేయ కులముఁ గాలుని ప్రోలికి,ననిచె నఖిల నృపుల ననికి నియ్య,కొలిపెఁ గ్రీడి జగము గొనియాడనేఁ కో,దండ చండపటిమ తమునఁగాదె. కర్ణ. 1-211

సీ. కళ్యాలఁ బదిలంబుగాని గుఱ్ఱంబులఁ గ్రొత్తముట్టున కియ్యకొలుపు వెరవు. విరా. 1-95

**ఇయ్యకోలు** దే. వి. (√ఇయ్యకొను)

ఇయ్యకొనుట, అంగీకారము, సమ్మతి

చ. పెనఁకువ నాక యెం మన పెద్దల కెవ్వరి కియ్యకోలు గాదు. ఉద్యో. 2-246

**ఇయ్యన**

ఈయన.

క. అయ్యై కర్మంబుల దెస, నెయ్యం బెసలారఁ గలిగి నియమని రూఢుం, డియ్యన యన సుకృతంబుల, నయ్యెడు సౌఖ్యంబు విహామునందు బరమునన్ -తే- అనుభవించు. అను. 3-306, 307

**ఇరవు** దే. వి.

1 స్థానము, తగిన చోటు.

క. శరణాగతుండ భక్తుఁడఁ, బరమపదవి నొసెదను శుభంబుగ నన్నుం, బరికించి యేది మే లయ్యిరవు దొరకొనంగఁ దలఁపవే కమలాక్షా. శాంతి. 2-54

క. ...ధాత్రీదైవత సమ్మానము, వేదేశమునందుఁ గలుగు నిర వది నిలువన్. శాంతి. 5-455

క. శిరమును నాభియు హృదయము, నురమును గర్ణములుఁ బార్శ్వ యుగళము నాత్మాదరణీయ స్థానము లయ్యిరవుల గను యోగి

యాత్మ నిభపురనాథా. శాంతి. 5—589

2. సంపూర్తి, సంపూర్ణము.

క. పరమంబగు వైవస్వతు, చరితం బతిభక్తి వినినఁ జదివినను మహా, దురితంబు లడఁగు జనులకు, నిరవుగ సిద్ధించు ననఘ యిహ పర సుఖముల్. అర. 4-284

క. శరణం బని వచ్చిన భీకర శత్రుని నయినఁ బ్రీతి గావఁగవలయుం, గరుణాపరుల తెఱం గిది, యిరవుగ సరిగావు దీని కే ధర్మంబుల్. అర. 5-418

3. కుదుర, పోయి.

క. తురగంబులపై వాశ్వకు, లరదంబుల మీఁద రథికు లప్పుడు నిద్రం, బొరసిరి కొందఱు భూస్థలి, నిరవుగ సుఖనిద్ర చేసి రిట్లున్నంతన్. (ఇరవుగ = కుదురుగ, పోయిగా) ద్రోణ. 5-274

**ఇరవొందు** దే. అ. క్రి. (ఇరవు + ఒందు)

ప్రీతినొందు, సంతోషించు.

సీ. ...బిరుదైన యొద్దు భూసురున కిచ్చి -అ- నరుఁడు ధేనుదశక మిర వొందఁ నిచ్చిన, ఫలము వదయు మఱియు వలువు లొసఁగి, చంద్ర లోకమునకు సంప్రీతుఁడై చనుఁ, గనక మిచ్చి నాకమునకు నరుగు. అర. 4—212

**ఇరావంతుఁడు** సం. వి. తే. పుం.

అర్జునునకు ఉలూచియను నాగకన్యయందుఁ బుట్టినవాఁడు.

జననము చూ. ఆది. 8-128 మొ. 184 వఱకు.

భీష్ముని యెనిమిదవనాఁటి యుద్ధమున నితఁడు అలంబుసునితో యుద్ధము చేసి మరణించెను. చూ వివరము. భీష్మ. 8-86 మొ. 105 వ.

**ఇరు** దే. సర్వ. (ఇను)

రెండు.

(హల్లు పరంబగునపుడు 'రెండు' అను దానికి వృత్తియందు వికల్పముగా వచ్చు ఆదేశము. 'ఇరుగురు - ఇరువురు' అను వానిలోఁ దక్క విడిగా దీనికిఁ బ్రయోగము లేదు.)

వ అని యిత్తెఱంగున నయ్యిరువుర వాండ్రారులకు నప్పగించి పుచ్చిన యనంతరంబ నకులుండు. విరా. 1-265

క. ఇరుదెసల నున్న కవలం, న్నరపతి దురవస్థ చూచి. కర్ణ. 2-885

**ఇరుగడ** దే. వి.

రెండు ప్రక్కలు.

సీ ఏమంగు జెక్కి చెక్కుమంగు లిరుగడ,రాఁ బురవీథులఁ గ్రాలఁ గలదె. విరా. 5-203

**ఇరుగాలు** దే. వి.

రెండు కాళ్లు.

వ. వాని వంచేయు మరంబును నిరుగాలం ద్రొక్కి. ద్రోణ 4-267

వ. ...ఉరంబును మెడయు నిరుగాలం ద్రొక్కిన. సౌప్తి. 1-158

**ఇరుగెలను** దే. వి.

రెండు ప్రక్కలు.

చ. ధరణిపు చక్కఁగట్టిదురు దక్కి పిఱుందును గాని యట్లుగా, నిరుగెలనం దగం గొలిచి. విరా. 1-129

**ఇరుగేలు** దే. వి.

రెండు చేతులు

క ఖండనమున నిరుగేలను, గాండీవము దివియ నేర్పు గలిగిన నందు, ద్దండమగు సవ్యకరము ప్రచండతఁ బరఁగుదువు సవ్యసాచి యనంగన్. విరా. 4-146

**ఇరుచేయి** దే. వి.

రెండు చేతులు.

తే. శిరము గ్రోఁకంగఁ దగ దిరుచేత. అను. 4-102

సీ. ...ఇరుచేయి చెత్తి -తే- యలఁత నాక్రందనములు హాహారవములు,తో నొనర్చువారును. మౌస. 161

**ఇరుతేరు; ఇరుదేరు** దే. వి.

రెండు రథములు.

చ. ...వడిం ద్రిగర్తవాతులు విరుదేరుఁ దద్రథముతోఁ గదియించి తదీయ సారథిన్, బలువిడిఁ గూల్చి. విరా. 8-199

(ఇరుతేరు – అని పాఠాంతరము)

**ఇరుదెఱఁగు** దే. వి.

రెండు విధములు.

సీ. అభ్యంతరంబు బాహ్యము ననఁగా దొంచ మిరు దెఱఁగై యుండు. అను. 5-181

**ఇరుదెస** దే. వి.

రెండు ప్రక్కలు, రెండు వైపులు.

సీ. వైనేయుఁడు భీమసేనుఁడు నిరుదెసఁ, రా నర్జునుఁడు. ద్రోణ. 1-291

**ఇరుపీనుఁగు** దే. వి.

రెండు పీనుఁగులు, పీనుగుల జంట.

చ. మగధమహీశుఁ డేచి యభిమన్యునిపైఁ గఱిఁగొల్పఁ బజ్జవోఁ, బగు నొక వారణంబు దొడి యారఁ దుదిప్రాఁత ఫాలకంఠ సం,భిగము గాఁగ నేయ నది దీనత మ్రొగ్గఁ నన్ను దక్కఁ దుఱంగ వె మాగ ధుం దునిమె భూస్థలి నయ్యిరు పీనుఁగుం బడన్. భీష్మ. 2-209

**ఇరుప్రొద్దు** దే. వి.

సీ. ఇరుప్రొద్దు గుడుచుచు నెడనెడఁ గుడువకయుండి వారిందు సరోపవాసి. శాంతి. 4-868

**ఇరుమూఁడు** దే. సం.

రెండు మూఁడులు, ఆఱు.

చ. అమర తరంగిణీ తనయుఁ డర్జునసంయమ మూతుఁ గెరుసం,దము నిరుమూఁడు దూపులఁ బడం గడు బెట్టిద మేసి. భీష్మ. 1-273

క. ...అతఁ డది యిరుమూఁడ,మ్ముల దునియలు సేయుడు. కర్ణ. 8-160

**ఇరుమెయి** దే. వి.

రెండు ప్రక్కలు.

వ. .. ఇరుమెయిన్ గెలిచిన కుంతీసుతకాదులును.

భీష్మ. 1-267; విరా. 8-161

**ఇరుమేను** దే. వి.

రెండు శరీరములు.

తే. ఆతిమి సాత్యకి గృతవర్మఁ దాఁకి నడఁచు, నేచి మార్కొన నిరు
మేను పూచి యొప్పె, మిగుల మోదుగు మ్రాఁకుల పగిదిగాఁగ,
నడరె మార్కొన్న రెండు వాలంపగములు. భీష్మ. 1-251

క. హరుఁడు వినోదార్థంబుగా, నిరుమేనయి రణమొనర్చె.

ద్రోణ 5-295

**ఇరువంద్రు** దే. సం.

ఇరువది మంది.

వ. ప్రముక్కడిమూఁడు యిరువది నాలుగువేలు ముమ్మాట యిరు
వంద్రుఁ దెగిరి. స్త్రీ 2-167

**ఇరువది** దే. సం. (ఇరు+పది)

రెండు పదులు, ఇరువయి, ఇరువై, ఇర్వది.

క. ...నాకేశ సుతున్, ధనురాచార్యుం డిరువది. సునిశిత బాణము ల
నేసె. విరా. 5-124; భీష్మ. 2-298

ఇరువదారు కర్ణ. 2-248; ఇరువది నాలుగు శాంతి 3-?;
ఇరువదివాల్గు అను. 4-178; ఇరువదిమూఁడు ద్రోణ. 5-395;
ఇరువదియేను భీష్మ. 3-76; ఇరువదియేవురు ద్రోణ. 8-277;
ఇరువది యొక్కటి అను. 2-802, ఇరువదిరెండు ఉద్యో. 4-820;
ఇరువదెనిమిది ద్రోణ 8-196; ఇరువదేవేసి ద్రోణ. 8-78.

**ఇరువఱియ** దే. వి.

రెండు చెక్కలు.

క. గురుసుతుఁడు క్రోధము మావాఁగు. బంగవనమున నప్పు డా ద్రుపద
నందను మే, నిరువఱియఁగాఁగ నేసెను.

శాంతి. 1-182; కర్ణ 1-95.

**ఇరువాఁగు; ఇరువాఁగులు** దే. వి.

ఉభయ సైన్యములు.

వ. ఇ ట్లిరువాఁగును నరవాయి గొనక పెనంగుచుండ. విరా. 3-170

క. ఇరువాఁగులుఁ బోరిరిఁ బొర్చె — విరా. 3-198

**ఇరువు** దే. వి.

1. ఇల్లు.

క. కునకంబు రజస్వలయగు, వనిత పతితుఁ డంత్యజాతివాఁ డాత్రేయ
పట్టునకే డిరువులఁ జేరక, చనఁజేయుట మగ్గడించి సంభావించెన్.
అను. 3-190

2. ప్రక్క, పార్శ్వము.

క. మరణ జరా రోగము లన్గిరి యెడిరువులను లే వటం గుమ్మలతా,
తరువులఁ గుసుమ ఫలంబులు, గర మొప్పుచునుండు పెల్లకాలము
లందున్. — అశ్వ. 1-59

శ్లో. న జరా క్షుత్పిపాసే వా న మృత్యుర్న భయం నృప,
తస్య శైలస్య పార్శ్వేషు సర్వేషు జయతాంవర. — అశ్వ. 3-10

**ఇరువురు** దే. సర్వ. బహు. (ఇర్వురు)

(రెండు అను దానికి మహన్మహతీవర్తక బహువచన రూపము)

ఇద్దఱు.

తే. వీర లిరువురు మామ్యలు (ద్రోణాచార్య కృపాచార్యులు)
విరా. 5-10

వ. ...ఇత్తెఱఁగున నయ్యిరువురు వొండొరులకు నవ్వగించి పుచ్చిన
(ఉత్తర, బృహన్నల) — విరా. 1-255

క. విను శంఖుండును లిఖితుం, డన నిరువురు విప్రవర్యు లన్నయుఁ
దమ్ముండును గలరు. (ఇచట విశేషణముగాఁ బ్రయోగము)
శాం. 1-159

వ. అయ్యిరువుర శరనికరంబు లంబరంబు గప్పె. — ద్రోణ. 1-159

ధర్మపత్ను లయ్యిరువురుఁ దనయట్ల. — ఆది. 5-68

**ఇరువేయి** దే. సర్వ.

క. ఇరువే యుద్భట రథములఁ బోరి గొలుటయు. ద్రోణ. 1-214

క. ...పొడిచేసెన్, వాయుసుతుఁడు రథముల నిరు వేయిటి రథి రథ్య సూత వితతంబులుగాన్. విరా. 3-212

**ఇరుసు** దే. వి.

బండియొక్క అక్షము.

క. అని పలికి యిరుసు లంతటఁ, సునిశిత బాణమ్ము లేయుచుం దఱిమిన. ద్రోణ 5-75

**ఇర్లవారము** దే. వి. (ఇరులవారము)

చీఁకటుల గుంపు.

ఉ ...ఇర్లవారమును భానుఁడు దోఁచి సముజ్జ్వలాత్మతేజమ్మున రూపుమాపు క్రియ. కల్కి 2-86

**ఇర్వురు** దే. సర్వ. బహు. (ఇరువురు)

ఇద్దఱు.

వ. .. దైత్యులు సుందోపసుందు లన నిర్వురు గలరు. ఆము. 4-425

చూ. ఇరువురు.

**ఇఱుకటము** దే. విశే. (ఇఱుకటము)

ఇఱుకైనది.

తే ఎత్తినప్పుడు విడియుచో నిఱుకటంపుఁ, జెరువునందు నడపువెడి తిరుగఁబడిన, యట్టియెడ నిద్రపోయెడు నవసరమున, గాత్రవుల బెట్టు పైఁబడి చంపవలయు. పా ప్తి. 1-25

వ. ...క్రంతల నిఱుకటంపుఁదోట్ల మానవకోట్లు పిమ్మంగు తిట్టలగుచుండ. పా ప్తి. 1-197

వి.

ఇఱుకు చోటు.

వ. ఇవ్విధంబున నరదంబుల యిఱుకటంబు గడచి యొడఁగలుగ నిలిచి. విరా. 5-318

శ్లో. తస్థౌ విముక్తో రథబృంద మధ్యాత్. సం. భా. విరా. 66-18

ఈ రథబృందంబుల యిఱుకటంబు వెడలి నిలుతము విరా. 5-311

(ఇఱుకటము అని సూ. అ. ని.)

**ఇఱి** దే. విశే. (√ఇఱియు)

బిగువు, సందులేనిది. (ఇది వృత్తియందే కనఁబడుచున్నది)

ఉ. అరథికోత్తముం దధిక హర్షముఁ బొందుచు నమ్మహీశ్వరున్,
గారవ మొప్పఁ గ్రుచ్చి యిఱికౌఁగిటఁ జేర్చె. కళా. 2-416

**ఇఱికికొను** దే. స. క్రి.

ఇఱికించి పట్టుకొను, ఇముడ్చు.

క. చఱచి యొకచేతఁ గూర్మముఁ, బెఱచేత గజముఁ బట్టి వెరచి ఖగేంద్రుండు, డిఱికికొని గగనవీథిఁ, బఱచె వియచ్చర విమాన పంక్తులు దూలన్. ఆది. 2-69

వ. గజకచ్ఛపంబులం గరంబుల నిఱికికొని గరుడుండు గగనంబునం బఱచి. ఆది. 2-78

**ఇఱికౌఁగిలి** దే. వి.

బిగికౌఁగిలి, గాఢాలింగనము

ఉ. అరథికోత్తముం దధిక హర్షముఁ బొందుచు నమ్మహీశ్వరున్
గారవ మొప్పఁ గ్రుచ్చి యిఱికౌఁగిటఁ జేర్చె. కళా. 2-416

**ఇఱియు** దే. అ. క్రి.

1. బిగియు, గట్టిగా నదుముకొను

సీ. ...అర్భామిని వగచుచు హాసని నెత్తి కౌఁగౌఁగిట నిఱియఁ జేర్చె
అ. ప్ర. 2-34

క. పెద్దయునుం బ్రోద్దిఱియఁ గౌఁగిటఁ జేర్చెద మా. 1-163

సీ. ...కుచము లురంబునఁ గుదియించి క్రమమున, నిఱిసిన కౌఁగిట
నింపొనర్చు విరా. 2-810

**ఇఱుకటము** దే. వి. (√ఇఱుకు)

ఇఱుకు చోటు.

(ఇఱుకటము అని ముద్రిత ప్రతులన్నియు- చూ. అ. ని. లో ఇఱు
కటము అని ఇఱుకటములోని చివరి రెండుదాహరణము లీయఁబడినవి.
చూ. ఇఱుకటము.)

**ఇఱుకు** దే. స. క్రి.

బిగియఁబట్టు, రెంటి సందున ఒత్తిపట్టు.

క. వెరవునఁ దత్తమవుం దన, చరణంబుల నిఱికి యొత్తి చాపుడిపి
బలస్ఫురణంబు మెఱయ వీఁపున, ధరియించుచు వచ్చెఁ బక్షి
తతులు మతింపన్. చూ. ఇఱికికొను. కర్ణ. 2-80

**ఇఱ్ఱి** దే. వి.

మగలేఁడి.

క. మనసిజరాగంబునఁ బెనఁగిన యిఱ్ఱిని లేఁడిఁ జూచి కృతహస్తుఁడు
పెల్లున యేనమ్ముల నారెంటిని ద్రెళ్లఁగ నేసెఁ గడుఁ గఠిన
హృదయుండై. ఆది. 5-49

**ఇల**[1] సం. వి. ఆ. స్త్రీ.

భూమి.

సీ. దీనివల్లభుఁ డనఁగా నిల నేలగు నొప్పెసఁగ వర్తిల్లు వాఁడెవ్వఁ
డొక్కొ. విరా. 2-80

క. ఈ యాఖ్యానము విని భూనాయక దెవ్వఁ డిలాజనంబుల
నతుల, న్యాయంబునఁ బాలించు శాంతి. 3-122; శాంతి. 4-204

**ఇల**[2] సం. వి. ఆ. స్త్రీ.

వైవస్వత మనువు కూఁతురు చంద్రుని పుత్రుఁడైన బుధునకు భార్య.
పురూరవుని తల్లి. ఆది. 8-69

**ఇలాతలము** సం. వి. అ. పుం. న.

భూప్రదేశము.

వ. ...అతండు పదియడుగుల కొలంది నిలాతలంబు చిక్కం ద్రొక్కి
యూడిగిలఁబడి నిలువం బట్టె. భీష్మ. 2-159

**ఇలావృత వర్షము** సం. వి. అ. పుం. న.

నీలశైల దక్షిణదేశము, ప్రపంచము యొక్క 9 భాగములలో నిది

రొక్కటి. 1) కురు, 2) హిరణ్మయ, 3) రమ్యక, 4) ఇలావృత, 5) హరి, 6) కేతుమాల, 7) భద్రాశ్వ, 8) కిన్నర, 9) భారత. భీష్మ. 1–25

**ఇలాసురుఁడు** సం. వి. అ. పుం.

బ్రాహ్మణుఁడు.

ఉ. ...దీనిచే, రాజు లిలాసురుల్ మఱి యరాతుల గెల్తురు విన్న యంతటన్. స్వర్గ. 89

**ఇలిలుఁడు** సం. వి. అ. పుం.

దుష్యంతుని తండ్రి

వ. అ త్రసునకుఁ గాళిందియను దానికి లిలుండు పుట్టె వానికి రథం తరి యను దానికి దుష్యంతుండు పుట్టె. ఆది. 4–5

సంస్కృత భారతమున నితనికి ఇలిలుఁడు, ఈలినుఁడు, ఇలినుఁడు అని మూఁడు పేరులు గనఁబడుచున్నవి.

"రాజా భాతాజగామేహ దుష్యంత ఇలితాత్మజః" ఆది. 94–54

"ఈలినో జనయామాస దుష్యంత ప్రభృతీన్నృపాన్" ఆది. 88–16

"రాజర్షి స్తస్య పుత్రో౽ హ మిలినస్య మహాత్మనః" ఆది. 92–11

**ఇలు** దే. వి.

ఇల్లు (చూ. ఇల్లు) గృహము.

ఉ. రాజగృహంబుకంటె నభిరామముగా నిలుగట్టఁగూడదు. విరా. 1–128

క. లక్కయిలు గాలిపద మొదు, లక్కట మాతల్లి ఉద్యో. 3–186

సీ ...లక్క యి ల్గాలిచి. ఉద్యో. 3–366

**ఇలుగు** దే. అ. క్రి. (√నిలుగు)

చచ్చు.

క. బలవిక్రమ ఘములగు దొగ, లిలిగిన మనపేర మేదినీశ్వర విమత, మ్నులు సెడిన ట్లున్నది. కల్య. 1–51

**ఇలువడి** దే. వి.

1. కులీనత, మంచి కులమునఁ బుట్టుట.

చ. వలమఁ గులంబు లేవి పరిశారము గోటియు నేల నేర్పు వ,గ్గలికయు
శక్తి పెంపు మదిఁగల్గి సుహృజ్జన మిత్రమా బలం, బిలువడి గల్గినేని
నిలయెల్లను నేలఁగఁజాలు. శాంతి 3-108

3. మంచి నడత.

సీ. ...ఇలువడి ఘటశుద్ధి గలిగిన కాంతలందు -తే- నిల్తు వల్లభ ప్రతి
కూల నిష్ఠురాత్మ, నన్యమందిరగామిని నధిక నిద్రయైన మానినిఁ
దొలఁగుదు. అను. 1-285

ఇలువరుస; ఇల్వరుస దే. వి.

ఇంటి వంతు.

సీ. ఇందుల శాఁపుల నందఱఁ దొల్లి యిల్వరుస ద్రిమ్మంగుచున్న.
ఆది. 6-264

వ. పెద్ద శాలంబునకు నీయిలు వరుస నేఁడు మాకు వచ్చెఁ.
ఆది. 6-269

ఇలువాడు దే. క్రి.

ఇంటిని ఇంటిలోని వస్తువులను శుభ్రపఱచి గృహాలంకారాదులు చేసి
గృహశౌచమును గాపాడు.

క. లలన యిలువాడి నాథుఁడు వలచిన చవివంటకములు వండి యిడి
తనుఁ, గలయఁ దలంచిన మెయికొని, యెలమిం గైసేసి
హృదయ మీవలయు శివా. అను. 5-290

శ్లో. మంగళం గృహ శౌచం చ సర్వోపకరణాని చ, సర్వకాల మవే
క్షేత కారయంతీ చ కుర్వతీ. సం భా. అను. 250-8 (నిర్ణ)

సీ. ఇలు వాడి తలవాకి లెప్పుడు నెఱుఁగక. అను. 4-358

(సం.ము పాఠము ఈ సంఖ్యలో 'ఇలువడిఁదలవాకి లెప్పుడు నెఱుఁగక'
అని యున్నది. అను. 5-290 లో మాత్రము 'ఇలువాడి' యనియే
యున్నది. అను. 4-358 లో 'ఇలువడి'కి పాఠాంతరముగా 'ఇలువాసి,
ఇలువాడి' అని కలవు. 'ఇలువాడి' అను దానిని పుటయడుగున పాఠాం
తరములు చెప్పినట్లు ఇలు+పాడి యగునని చెప్పిరి. రెండు తావుల
'ఇలువాడి' యను పాఠమే యుక్తముగాఁ దోఁచుచున్నది. మొదటి

దాని మూలమును దానిని బలః అచుచున్నది. వాడు = ఉపయోగించు; ఇలువాడు = ఇంటిని ఉపయోగించు- అనగా ఇంటిని ఉపయోగించుకొను స్థితిలోనుంచు- గృహశౌచమును గావాడు అను నర్థము స్ఫురించును. సూ. ని. ఇలువాడి శబ్దముగాని 'ఇలువడి' క్రియ పై ప్రయోగములు గాని ఇచ్చి యుండలేదు. అనంద వారిలోని 'ఇలువాడిఁ దంవాకి లెవ్వఁడు' పాఠవ నందలి అర్థబిందువు 'వాడి' పాడియని స్ఫురింపఁజేయుటకేమో.)

**ఇల్లడ** దే. వి. (ఇల్లడము)

న్యాసము - జాగ్రత్తగాఁ గాపాడి మఱలఁ గోరినప్పుడు ఒప్పగించు పద్ధతిని ఒకరియొద్ద దాఁచిన ధనాదికము. ఇల్లడపెట్టిన వస్తువు వంటివాఁడు.

సీ. ఇల్లడ యిమ్మహామతావు నిడితి మీఁద. అ. క. 1-98

శ్లో. ఏష న్యాసో మయా దత్తః సర్వేషాం వో యుధిష్ఠిరః
భవంతోఽస్య చ వీరస్య న్యాసభూతాః కృతా మయా.
సం. భా. అ. శ. 10-15

సీ. ...తగు వడువునకు నీ, నిల్లడ బ్రహ్మచే నిడఁగఁబడిన యిక్కన్య. ఆది. 6-243

**ఇల్లడపెట్టు** దే. స. క్రి. (ఇల్లడవెట్టు)

జాగ్రత్తగాఁ గాపాడి మఱలఁ గోరినప్పుడు ఒప్పగింపుమని దాఁపనిచ్చు.

ఉ. ...కుంతి సహదేవుని నిల్లడవెట్టి వాకు. విరా. 2-211

తే. నమ్మి యిల్లడవెట్టిన పొమ్ముగొనిన, మీమలోనగు నీచవు హోము లందుఁ బుట్టు. అను. 4-267

**ఇల్లడము** దే. వి.

ఇల్లడ, చూ. ఇల్లడ.

ఉ. మీ, శేతికి నిచ్చి యిల్లడము పేసెక విన్నరవాతు. కర్ణ. 2-202

(ఇది పాఠాంతరము - చూ. అరువు)

**ఇల్లడయిడు** దే. స. క్రి.

1. సంరక్షణమునకై కొనుపఁగు.

క. ...పాండుజనపతి నెమ్మిన్, గ. కొడుకుల నిందఱ నిల్లడ,యిడి పరలోకమునకు నరిగె నెడసేయక యిప్పుడ వీరలఁ గురువృద్ధుం, డడరం గొని పోవవలయు గజపురమునకున్. ఆది. 5-149

2. ఒకనిపై రక్షణ భారము వైచి తిరిగి యప్పగించుటకై యప్పగించు.

చ. (శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతో) పడయక యేఁగి నీకబల పర్వము లొప్పఁగ వాని డాసి కవ్వడియును నేను భీముఁడు నవశ్యముఁ బోర బృహద్రథాత్మజుం, గడిఁదికిఁ బున్ జయింతుము జగన్నుత నెమ్మది నమ్ముమదేని యిల్లడయిడు భీము నర్జును నలంఘ్య బలాఢ్యుల నావశంబునన్. సభా. 1-168

శ్లో. యది భీమబలం వేత్సి యది తే ప్రత్యయో మయి, భీమసేనార్జునౌ శీఘ్రం న్యాసభూతౌ ప్రయచ్ఛ మే. సభా. 20-7

ఇల్లడసొమ్ము దే. వి.

జాగ్రత్తగాఁ గాపాడి తిరిగి యప్పగించుటకై దాఁచి యుంచిన ద్రవ్యము

ఆ. కడఁగి యిల్లడ సొమ్ము లడఁచి కొంద్రు. అర. 4-294

ఇల్లాలు దే. వి.

భార్య, గృహిణి.

వ. ...కామలోలత్వంబున బోయత యిల్లాలుగా బోయలం గలసి. శాంతి. 8-480

వ. పరానురక్తచిత్త యగు మగువ నిల్లాలింజేయు వారుం గలరె. ఉద్యో. 4-308

ఇల్లు దే. వి. బొ. (బహు) ఇండులు, ఇండ్లు, ఇండ్లులు

ఇది హల్లుపరమగునపుడు వైకల్పికముగా 'ఇలు, ఇల్' అను రూపముల నొందును.

1. గృహము, ఉనికిపట్టు.

ఉ. ఎండకు వానకోర్చి తన యిల్లు ప్రవాసముఁ బోటు వాక. విరా. 1-186

ఆ. మగువములకు పెల్ల బొచ్చి విల్లు. శాంతి. 1-386

సీ. పాడిల్లను బోలెనై యున్నది. ద్రోణ. 2-887

ఉ. రాజ గృహంబులంచు నభిరామముగా నిలుగట్టఁగూడ దే యోజ. విరా. 1-128
చూ. ఇలు.

సీ. వారణావతంబున లక్కయిల్ గావించి. ఆది. 8-14

ఉ. ...ఇట్లు వంటయిల్, కుందెలు సొచ్చె. ఆది. 6-186

తే. ...దుర్మర్షణునియును దుర్ముఖునియు, నిండ్లు గవలకు సంప్రీతి
నిచ్చె నృపతి. శాంతి. 1-896

చ. ...ఇట్లు దమయిండుల నుండినయట్లు మెచ్చరే, మఱి శయనింతు
రే కదుఁ బ్రమాదముచేసిరి బుద్ధిహీనులై. ఆది 6-194

2. వంశము, కుటుంబము.

మ. భవదీయాత్మజు నాత్మజుండు కురుభూభారోద్వహుండయ్యె యా,
దవ వంశోత్తరుఁడైన వజ్రునకు నింద్రప్రస్థ రాజ్యంబు గౌరవ
దీప్తంబుగ నిచ్చెవాఁడ సుచరిత్రా రక్షణీయంబులై,నవి యీ
యిండులు రెండు నీవు దృఢధైర్యం బొప్ప రక్షింపుమా.
మహా. 1-11

సీ. ...భరతాన్వయంబు,నందు నా యిల్ల యిల్లుగా నతిశయిల్లి.
విరా. 8-216

సీ. ఇట్టి క్రూరుల యింటికిచ్చిన మనవారి నందుఁగాక. ఉద్యో.3-258

**ఇల్లురువు** దే. వి.

ఇల్లడము. చూ. ఇల్లడ.

క. తన చేతికి నిచ్చిన వస్తునికాయము నిల్లురువున చొప్పున మగుడం,
గొన వచ్చి భార్య పతి దెస్మని నప్పుడ యిచ్చు టొప్పునకపట
వృత్తిన్. అను. 5-298

**ఇల్వరుస** దే. వి.

చూ. ఇలువరుస.

**ఇల్వలుఁడు** సం. వి. అ. పుం.

ఒక రాక్షసుఁడు, వాతాపి యన్న. చూ. అర. 2-318 మొ. 846 వ.

**ఇవల; ఇవుల** దే. వి. బొ. అనౌ. ఇవ్వల, ఈవల

కొన్నియెడల అన్యార్థకముగాను కొన్నియెడల ఉన్మార్థ్యముగాను ప్రయోగములు గలవు. చూ. ఇవుల.

1. ఇవతలి విభాగము.

అ. ఇవుల మూఁటి కవల నవుల యమ్మూఁటికి, నివలఁ దేజరిల్లు దివిజ నగము. భీష్మ. 1-21; అశ్వ. 1-68

2. ఇవతలి కాలము.

తే. ఇవుల నేఁడు దరంబుల నవల నేఁడు, దరములను విశ్వవర్గంబు నరుఁడు గంగ, నాడి కుచిఁ జేయు. అను. 2-11

(ఇవల అనియుఁ గొన్నింట)

**ఇవి** దే. సర్వ. బహు.

ఇది శబ్దము యొక్క అమహదర్థక బహువచన రూపము. ద్వితీయావిభక్తుల యందు 'వీని' అను రూపము వచ్చును.

క. ఇవి దుస్ససేను ప్రేళ్లం నవిలి నగము ప్రెద్విపోయి చిక్కినయవి. చూ. ఇది. ఉద్యో. 3-16

**ఇవురంబాఱు; ఇవురఁబాఱు** దే. అ. క్రి.

సీ. గగనంబుతో రాయు కెరటులు గల జలం బివురఁబాఱిన మహార్ణవంబు కరణి. ద్రోణ. 2.126

క. ...బెడిదమైన యెడ దనుకఁగ నివురం,బాఱెను మనువు. శాంతి. 8-192

**ఇవురు** దే. అ. క్రి.

1 ఇంకు.

క నానాస్త్రశస్త్రచయ బడ, బానలముం గవియఁజేసి యత్యుగ్రత నే, వాళ్లన యపాండవ, సేనాసాగరము నివురఁజేయుదు నధిపా. ఉద్యో. 4-416

2. వట్టు. ఎండు, కుష్కించు.

సీ. కల్పాంత వాయుసఖ స్ఫురణంబున నివిరిపోయిన మహార్ణవము

కరణి. శల్య. 2-899

ఆ. ఇంద్రియములనెల్ల నివురుగంగఁ జేయుచు, నదరు శోకవహ్ని యాఱ నేర, దింద్రపదవి నేరె నేనియు. భీష్మ. 1—198

3. చెడు, నశించు.

క. అధ్వరంబుకంటె నధికంబు దపము దపంబు కంటె మేటి ప్రశ్నదనము, నివురఁ జేంగా దహించియు సత్యవాక్యంబు దమము నియయుఁ గాని యరయ. శాంతి. 3-848

4. అడఁగు, లీనమగు.

గీ. ఇంద్రియంబులు మనమునం దివురఁ జేసి, మనసు దిగిచి. శా. శి. 6-117

ఇవుల దే. వి. ఔ. అనౌ.

చూ. ఇవల.

ఇషిక(ము) సం. వి. అ. స్త్రీ.

శాకము, తెల్లు, వీరణ తృణము, ఎవురుగడ్డి, ముంజదర్భ మొక్కలోని మొవ్వు.

వ. అగ్గురు నందనుండు...బ్రహ్మశిరోనామకం బగు దివ్యాస్త్రంబు దలంచి యొక్క యిషికంబు పుచ్చుకొని యందయ్యస్త్రంబు నావహించి. సౌప్తి. 2—60

ఆ. అతఁడు ముంజగర్భమగు నిషిక నివర్ప్యవంబుగాఁగఁ గనుఁగొనంగ వలయుఁ, దనువు మఱి మాత్మ దదిషిక నిష్కర్ష, విధము సుమ్ము యోగవిదుని వెరవు. అశ్వ. 1-207

వ. అ రుద్రుండు రౌద్రాకారంబున నయ్యక్షంబు వెనుకొని వావయుం గవిసిన వొక్క యిషిక పరశు రూపంబుగా నభిమంత్రించి యతనిపయిం బ్రయోగించిన. శాంతి. 6-441

ఇషికాస్త్రము సం. వి. అ. వ.

మంత్రచోదితమైన అస్త్రము, ఆవహింపఁబడిన ఇషికము.

వ. ...అగ్గురు నందనుండు.. బ్రహ్మశిరోనామకంబగు దివ్యాస్త్రంబు

దలంచి యొక్క యిషీకంబు పుచ్చికొని యందయ్యస్త్రంబు పావ
హించి యపాండవం బయ్యెడ మని దారుణ భాషణంబులతోడ
రోషప్రదీప్తుండగుచుఁ బ్రయోగించిన. సౌప్తి. 2-60

క. (కుంతి శ్రీకృష్ణునితో) గతి నీవె నాకు మత్సంతతికిని నీ యల్లుఁ
గట్టి తనయుఁడు పుట్టెన్, మృతుఁడై క్రూరుఁడగు గురుసుతుని
యిషీకాస్త్రవహ్ని జూఁడిన కతనన్. అశ్వ. 3-169

**ఇషువు** సం. వి. ఉ. పుం. స్త్రీ.

బాణము.

ఉ. (మారుతి) చొచ్చి పితామహుం గని యిషుప్రచయంబునఁ గప్పె.
భీష్మ. 2-277

**ఇష్టదాయి** సం. విశే. (న్. నీ. న్.)

వరము లిచ్చువాఁడు.

తే. ....విష్ణుఁ, డిష్టదాయి ప్రసన్నుఁ డయ్యెడును నాకు.
శాంతి. 4-222

**ఇష్టము** సం. విశే. (అ. ఆ. అ.)

1. అభిమతమైనది, ప్రియమైనది.

వ. ...అట్టివి దైవకృతంబులు గావున నిష్టానిష్ట ప్రాప్తులకుం గార
ణంబులు గని కానలేవు. శాంతి. 1-217

వ. (శల్యుఁడు దుర్యోధనునితో)....నీ కెయ్యది యిష్టంబు గోరు
మిచ్చెద ననిన. ఉద్యో. 1-94; విరా. 5-359

2. సమ్మతమైనది

క. (భీష్ముఁడు ద్రుపదు పంచిన భూదేవునితో) నీ వాక్యము విప్ర
స్వాభావికమై యిట్లు శ్రుతికిఁ బరుషంబై నన్, భావింపఁగార్యమున
యం, దే విధమున సభకు నింత యిష్టం బగునే. ఉద్యో. 1-248

వి. అ. న.

కోరిక, వరము.

సీ. ...ఇచ్చెద నిష్ట మడుగు మనిన. శాంతి. 4-188

ఉ. పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. విరా. 1-1

**ఇష్టాకృతము** సం. వి. అ. న.

బ్రహ్మచేసిన వేయి సంవత్సరముల సత్రయాగము.

వ. ప్రజాపతి సహస్ర వార్షికంబైన యిష్టాకృతంబను సత్రయాగంబుఁ జేసె. అర. 3-221

**ఇష్టి** సం. వి. ఇ. స్త్రీ.

యాగభేదము.

సీ. అగ్నిహోత్రము నిష్టి యజనములును, గలవార లగుదురుగాక యన్నెల వొల్ల నని యాడె భూపతి. అను. 4-70

వ. ధృతరాష్ట్రుఁడు పాద్యమిచ్చెఁడు రేపకడ ఋత్విక్సమేతుండై యిష్టి నడపి అశ్ర. 1-187; అశ్ర. 2-165

**ఇష్టుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

హితుఁడు, మిత్రుఁడు, ఆప్తుఁడు.

వ. ...వారలు మొదలుగాఁ గల యిష్టజనంబులు పరివేష్టింప ఉద్యో. 8-245; ఉద్యో. 8-8

ఉ. ...నారాయణు నట్లు దాను పరామర సంశ పితూపసుంద నారాయణ భట్టు వాఙ్మయ ధురంధరుఁ డుం డు నిష్టుగన్. ఆది. 1-24

**ఇసిరో** దే. అవ్య. ఇస్సిరో, ఇస్సిరా.

పరిగింపుము. సిగ్గు తెలుపుము.

చ. ...కిరీటిచే నటుక కాంతర నొంచిన సోమదత్తాంగము గల ద్రుంచవే మఱచితా యిసిరో యిది పోరిపాడిరో. మౌస. 1-44; అను. 2-200

**ఇసీ** దే. అవ్య. ఇస్సీ.

పరిగింపును నిందను దెలుపును.

చ. తలఁకెడు వానికిన్ మగఁడ తానని నన్నిడికించువాఁ డిసీ, పలుకకు భీతున ట్లొదుఁగఁ జాలునె కూరుఁడు విన్న నచ్చిరే, కలనికి వచ్చితిన్. విరా. 5-25; శాంతి. 1-117

**ఇసుక** దే. వి. ఏక.

ఇసుము, సికత, వాలుక.

సీ. .. భూషణ,స్తోమాస్థి చయముల తమురు లిసుక గాఁగ.
ద్రోణ. 2-128; కల్య. 1-180

**ఇసుమంత** దే. వి.

1. ఇసుక రేణువు పరిమితి.

సీ. తెరు అంపమున నిడ్డ వసిగఁ గొన్నిటి నిసు,మంతలుగా మఱుమాడి యాడి
విరా. 5-85

2. మిక్కిలి కొంచెము.

చ. ...ద్గురుం, డనియెడు కొంతబుద్ధి నిసుమంతయుఁ బుట్టదు వీని గాల్పనే.
శాంతి. 1-861

**ఇసుము** దే. వి. ఏక.

ఇసుక.

సీ. ఇసుము చల్లుచు నమరేంద్ర పుత్రుఁడు వోయె. సభా. 2-301

**ఇస్సిరొ** దే. అవ్య. ఇస్సిరో, ఇసిరో

ఏవగింపును నిందను దెలుపును.

తే. ...నివాళ్లు నొకనిఁ బొడిచి రిస్సిరొ పెక్కండ్రు ప్రోడ లిదియు మగటిమియె.
స్త్రీ. 2-76

**ఇస్సిరో** దే. అవ్య. ఇస్సిరొ, ఇసిరొ

ఏవగింపును నిందను దెలుపును.

శా. రారా జిస్సిరో చచ్చుచో, గాంభీర్యంబును ధైర్యమున్ విడిచి దోర్గర్వంబు వెండయ్యెనే.
కల్య. 1-58; మౌస. 42

**ఇస్సీ** దే. అవ్య. ఇస్సీ

ఏవగింపును నిందను దెలుపును.

క. (భీముఁడు కీచకునితో) అనవుడు మనమున నిస్సీ,యని యుచిత నిగూఢ భంగులగు భూషణముల్, దనప్రియ వినిపించుట కిట్లని

యెన్ మృదురీతి భీమఁ డాతని తోడన్.
విరా. 3-336; ద్రోణ 5-288

**ఇహము** సం. అవ్య.

1. ఈ లోకము.

క. విను విప్రశరీరము సుఖ,మునకే బహునియమ దుఃఖముల నిహ-
మునఁ జెం,దను నిత్యసౌఖ్యముం బర,మునఁ బొందను బుట్టెఁగాక
బోధప్రవణా. శాంతి. 6-231; ఉద్యో. 2-94

2. ఐహిక సుఖము.

క. అని యతఁడు శౌరితో ని,ట్లను నిహముం బరము గలుగునట్టి
విధము నీ,వనఘా చెప్పితి నాకుం.
ఉద్యో. 3-328, ద్రోణ. 4-248; శల్య. 2-56; ఉద్యో. 3-35

**ఇహలోకము** సం. వి. అ. పుం.

ఈ లోకము, భూలోకము.

తే. పాడి గలిగిన నిహలోక ఫలము లెల్లఁ, జేరుటయకాదు కీర్తియుఁ
జెందుఁ బరము. ఉద్యో. 2-67

**ఇహాముత్రఫలము** సం. వి. అ. న.

ఐహికాముష్మిక ఫలము, ఇహపరములందలి కర్మఫలము.

క. (కర్ణుఁడు కుంతితో) క్షత్రియ సంస్కారమునకుఁ, బాత్రముగా
నీవు నన్నుఁ బాటింప నిహా,ముత్ర ఫలములకు నీకేఁ, బుత్త్రిక
నగ నిచ్చు టింకఁ బొసఁగునె చెపుమా. ఉద్యో. 4-62

**ఇళ** సం. వి. ఆ. స్త్రీ.

ఇళ అను పేరుగల నాడి — ఇడ.

ఉ. శౌచము బ్రహ్మచర్యమును శాంతియు నభ్యసనంబు సై యిళం,
బూచుచు నంతరాత్మవెడ బొంచిన విఘ్నవిశేషమున్ ధృతిం,
ద్రోచుచు భక్తియుక్తిఁ గురుండు ప్రమోదమయుండు గాఁగ
దృగ్గోచరతం జరింపఁగ నకుంఠిత మోక్షసుఖంబు వొప్పడున్.
అను. 5-225

# ఈ

ఈ[1] దే. ఇది యొక్క ప్రాతిపదికము

నిర్దేశార్థకము దగ్గఱనున్న దానిని నిర్దేశించును.

(దీనికి వృత్తియందే ప్రయోగము గలదు)

వ. ...ఈ శాపఫలంబు భవదజ్ఞాతవాస వత్సరంబున ననుభవించి.

విరా 1-8; విరా. 2-78

ఈ[2]

ఇగ్ ధాతువునకు వ్యతిరేకార్థక తుమున్నర్థక ప్రత్యయములు పరమగునపుడు ఆదేశముగా వచ్చునది.

తే. అ సుయోధను మక్కున వాఁడిగలుగఁ, బుసమి నీకీఁడు.

ఉద్యో 3-41

తే. శోకములకు, భయములకు బుద్ధి నెడయీఁడు సంధితుండు.

శాం.తి. 1-188

చ. అ...నీక కంతను యొ...యముం ...గించి తీవ

ఉద్యో 1-378

వ ఇవ్విధంబున ...ఁడు వడిన దెసలు ...బులు మసలనీక పురికొల్పకొని.

ద్రోణ. 2-83

చ అగ్రహాముం జొరనీకు చిత్తమున్.

శల్య. 1-54

క. అన జులకు నడ్డపడి యేమిని జేయఁగ నీమిఁ జూచి మెచ్చిరింగాక.

ఉద్యో. 3-18; శాంతి. 6-87

క. ...కౌంతేయులకుం, గల పాలీఁ దగుఁ దోడ్తో.

ద్రోణ 4-247

క. బొబలు నీతియుఁ గర్ణుఁడు,జాబలము...గూడి తనకు సామ్రాజ్యం బీఁగా బలసి వెలయువాఁడై.

కర్ణ. 1-222

క. పీఁచెయ్యె నమచు నల్లన, యాతని శయనమున శరిగి యతఁ డెడ

యీఁగా,నా తల్పంబున నొకదెసఁ, బ్రీతహృదయయై శయించెఁ బృథ్వీనాథా. అను. 2-18

**ఈ** అవ్య.

1. సంప్రార్థనంబున మధ్యమ పురుష 'ము,ఁడు' వర్ణకంబులకు విశేషణ అనుప్రయుక్తమగునది.

చ. అని యుచితంబుగాఁ బలికి యంగన హస్తముఁబట్టి తత్కరంబున గదియించి నీ గురవుఁ బొల్తి తగం గొనియాడు మెట్లు సెప్పె నటుల భక్తిమై నడపు పెంపెసలారఁగఁ గూడు గూర చందన కుసుమాదులన్ నడపి తప్పక యారసి గారవింపుమీ. విరా. 1-252

క. గురునట్టివారు పదివేవురు గాచిన నెల్లి సైంధవునిఁ బగలిటిలోఁ, బొరిగొనకట్లుగ నరునకు, వరమిఁడి వేల్పులార వారని కరుణన్. ద్రోణ. 2-346

2. ప్రశ్నించునపుడు (కిమర్థమగు) 'ఏ' అను శబ్దమునకు అనుప్రయుక్తమై అర్థవిశేషమును దెలుపును.

క. ఓడితిమె మేము రణమునఁ, గ్రీడికిఁ గ్రేడించిరాక గెలుపే యతఁ డేఁడి డాఁగిపోయెనొకో మా, తోడి బవర మిట్లు దాను దొలఁగినఁ దెగునే. ద్రోణ. 1-374

**ఈఁక** దే. వి.

ఈఁకె, పక్షి ఱెక్కలోని భాగము.

ఉ. తమ్ముఁడ నీవు నాకొలఁది తథ్యమెఱుంగక నాకు నీచభావమ్మగు భంగిఁ జేసితివి వాసవ యియ్యదితి ప్రసూత వంశమ్మఖిలమ్ముఁ దాల్తు నొక సన్నపు టీఁకన. ఉద్యో. 8-298

ఆ. పడుచు లీఁక లూడ్చవట్టి యాడెడునట్టి; పులుఁగు చందమయ్యెఁ దలఁప నాయవస్థ. కర్ణ. 1-84

**ఈఁగ** దే. వి.

మక్షిక.

ఆ. ఈఁగ కాలియంత యేనియు వీసరపోవకుండ ధర్మమునను నడచి శాంతి. 2-885

**ఈఁగకాలియంత** దే. జాతి.

ఈఁగ కాలి పరిమితి, మిక్కిలి కొంచెము, సూక్ష్మాతిసూక్ష్మము.

ఆ ఈఁగ కాలియంత యేనియుఁ బాపంబు, వీరివలనఁ గనుట వినుట గలుగ, దొక్కవాఁడు సట్టియుత్తములకు విధి, పాడిమాలి యిట్టి పాటు దెచ్చె. స్వర్గా. 26; శాంతి. 2-335

**ఈఁగఁగరాని యప్పు** దే. సమ.

తీర్చుటకు శక్యముగాని ఋణము.

ఉ. ...పాండవిభు కోడలు దవ్వుల నున్న నన్న 'గో,విందుఁడ కావు, మంచుఁ బలవించుట యీఁగఁగరాని యప్పుఁబో,లెం దల పోయ వ్రేఁగయి చలింపక యున్నది యెప్పుడున్ మదిన్. ఉద్యో. 2-129

**ఈఁగికొను** దే. స. క్రి.

1. (అవమానము మొ.) పోఁగొట్టుకొను.

వ. .. కయ్యంబు కర్జంబుగాదటె భంగంబు నీఁగికొనం దగదటె. ఉద్యో. 3-99

2 తొలఁగించుకొను.

వ. అత్తపస్వివర్యుండు దపోవిశేషంబున దోషంబు నీఁగికొని. శాంతి 3-308

**ఈఁగు** దే. స. క్రి.

1. తొలఁగించు, పోఁగొట్టు

చ. జలజదళాక్షి కీచకునిఁ జంపుట కిమ్మెయి మట్టఁబల్కఁగా, వల యునె యేను జూడనని వారణ నిన్నుఁ బరాభవించి వాఁ,డిల మన కింక నాంధ్రకును నెవ్వరు భంగము నీఁగఁజాలువారు విరా. 2-281

2 తీర్చు, పోఁగొట్టు (ఋణము, పగ మొదలగు వానిని)

ఉ ...నా,నా విధవై భవంబులు మనంబుల వాంఛలకుం దగంగ నీ,కే విధి నీఁగువాఁడ ఋణమెయ్యది యేనియు వేఁడు డిచ్చెదన్. విరా. 3-282; ఉద్యో. 2-129; ఉద్యో. 3-9

శా. ఏ నూతేండ్లకుఁ బుట్టు నా యనుజుఁ డింకియున్న యుండ్రంబు నై,శై
నన్ ధైర్యము గల్గి శాపము ప్రయత్నానక్తిమై వాఁడు ద,ర్పా
నూనుండు బలాభిరాముఁడు మదీయన్యాప్తిమన్మూర్తి సీ. కానం
దంబుగ నీఁగు దాన్యము త్రిలోకాశ్చర్య సంపాదియై.
అను. 1—175

ఈఁగు దే. స. క్రి.

వెనుదీయు, వెనుకకుఁ దగ్గు.

ఉ. ఒండొరుఁ బట్టుచుం దిగుచు చొండొరుఁ బాయుచు వ్రేయుచున్
మహో,ద్దండత నొండొరుం దెరలఁ దాఁకుచు నీ,గుచు లోఁగుచుం
జలం,బొండొరు మీఱ నొండొరుల యుద్ధతి సైఁపగ వీఁకఁ బోరి
రా,ఖండల భానుసూను లవిఖండిత చండభుజా ప్రతాండతన్.
ఆర. 6-883

ఈఁత దే. వి.

ఈఁదుట

వ. గాంధారిఁ గాంతినిం గాంచి యీతఁకాఁడు తీరంబు గనిన చం
దంబుఁ బొంది.
అశ్వ. 4-167

ఈఁతకాఁడు దే.

చూ. ఈఁత.

ఈఁదీఱు దే. స. క్రి.

ఇచ్చుటకు వలనుపడు.

తే. తొంటి చవి గని యిప్పుడుఁ దోఁచి పాండు,సుతులు రాజ్యంబు
సేయంగఁ జూచు కలుచ,నాకు నీఁ దీఱునే యిం,క,నాఁటి చూఱ
లెక్కడివి ద్రోణభీష్ము లీ దిక్కు సుమ్ము.
ఉద్యో. 8-362

ఈఁదు దే అ. క్రి.

1 ఈఁతకొట్టు.

తే ప్రళయకాల సముద్రము భంగిఁ బొంగి, కడు భయంకరుఁడగు
భీముఁ గడవసీఁద, వశమె నా పుత్రులకు విధివశము వొందె, యెదిరిఁ
ద మ్మైను నెఱుఁగరు ముదముకతన.

ఉద్యో. 2-190; ఉద్యో. 4-65; భీష్మ. 1-54

2. తరించు, దాటు

చ. ...నిన్నుఁ దెప్పగాఁ,గొని పలుమాఱు నాపదలకున్ భయమొం
దక దుఃఖవార్ధి లీఁ, దినమున నెల్ల నిక్కొఁటఁత దీర్చి సుఖాత్ములం
జేయు పావనీ. ఉద్యో. 8-68

**ఈక్షణము** సం. వి. అ. న.

1. చూచుట, చూపు.

ఉ. ...పరస్పర వక్త్రవిలోకన క్రియా,వ్యాజమునం దదీక్షణ నివా
రితులై రతి మత్సరంబునన్. ఆది. 5-285; విరా. 4-26

2. కన్ను.

మదిరేక్షణ యంతటిలోఁ దలంచె. అర. 5-11

**ఈక్షణశ్రోత్రము** సం. వి. అ. పుం.

కన్నులే చెవులుగాఁ గలది, సర్పము.

ఉ. ...ఈక్షణ, శ్రోత్రవిభుండు తక్షకుఁడు. ఆది. 1-107

**ఈక్షణశ్రోత్రవిభుఁడు** సం. సమ. వి. ఉ. పుం.

సర్పరాజు, తక్షకుఁడు. ఆది. 1-107

**ఈక్షించు** సం. స. క్రి.

చూచు.

ఆ. అత్తపస్వి యీక్షించుచుండఁ గృద్దెఱచె నిట్లు మనుడఁదెలివివొంది.
ఆను. 2-450

**ఈగి** దే. వి. (√ఇచ్చు)

ఇచ్చుట, దానము, త్యాగము.

ఉ. ధర్మసుతుండు.....యీగియుఁ బ్రియంబును నాయెడ నాఁడు
నాఁటికిం, బేర్మివహించుచుండ నడపెం దనతమ్ములలోని వానిఁ
గాన్. విరా. 1-267

సీ. నీ యీగి నేను భూనాయకుఁ డగు టొల్ల. శల్య. 2-74

**ఈడంబోవు; ఈడఁబోవు** దే. అ. క్రి.

1. వెనుదీయు, వెనుకకుఁబోవు.

వ. ...అయ్యవనీకాంతుండు పోరింప శార్దూల కుండాలాదులతోడ నీడంబోక పెనంగి రంగంబునకుం దెచ్చి మెచ్చించుచుండు.
విరా. 2-20

క. ఇ చకయు నీడఁబోవక, కాంచనపుంఖ ప్రకాండ కాంతిస్ఫాయ, త్పంచాశద్బాణంబులు, నించె నతఁడు మత్స్యమేదినీపతిమేనన్.
విరా. 8-189

2 పాఱిపోవు.

వ. ఇవ్విధంబున రాధేయుం డోడిపాఱిన నీకంబోవు మన సైనికులం గనుఁగొని కురువిభుండు.
ద్రోణ. 5-115

శ్లో. ద్రవతస్తాన్ సమాలోక్య రాజా దుర్యోధనస్స్వయమ్.
సం. భా. ద్రోణ 159-68

8. ఓర్చు, సహించు.

క. కీడాడిన మేలాడుదుఁ, దాడన మొనరించిరేని దరహాసముతో, నీడంబోదును క్రోధో,త్పీడ వారయఁ దెప్పుడును మదీయ హృదయమున్.
శాంతి. 5-548

శ్లో. ఆక్రుశ్యమానో న వదామి కించిత్, క్షమామ్యహమ్ తాడ్యమానశ్చ నిత్యమ్.
సం. భా. శాంతి. 289-12

**ఈడఁబోవిడుచు** దే. స. క్రి.

పూర్తిగాఁ ద్యజించు.

ఆ. అనుడు నతఁడు కర్మ మఖిలంబు నీడఁ బో,విడుచు టొప్ప దండ్రు వేదవిదులు, దాని నాదరింపఁ దగదొకో సంయమి, ప్రవర సందియంబు వాసవలయు.

వ అనిశం గర్మంబు విడువమియు విడుచుటయుం గలిగియుండుఁ దదీయ యోగ్యతా విశేషంబు లెఱింగించెద. శాంతి. 5-184,185

**ఈడవిడుచు** దే. స. క్రి.

పూర్తిగాఁ ద్యజించు, మొదలంట విడుచు.

తే. ధనము చేటున విసివి నామనము నిన్ను, నీడవిడిచె నోకామమ యేను శాంతి సత్య క్షమా భూతదయలఁ జెంది, నాఁడ లోఖాదు లొందవు నన్ను నింక.

తే కామసుఖ దివ్యసుఖములు కాంత దొఱఁగు, మేలి పోడకాంకం
బునఁ బోలలేవు, గాన కామము నిను శత్రుకరణిఁ జంపి, బ్రహ్మ
పురమున నుండెద రాజుఁబోలె శాంతి. 4-51, 52

సీ బ్రీవ, గ్రేచ్ఛ యెవ్వనిచేత నీడ వడవఁబడు. అశ్వ 1-208

**ఈడిగిలంబడు** దే. అ. క్రి.

ముందునకు రాదని వెనుకకు లాగుచుఁ జదికిలఁబడు.

వ అర్జును డు రయంబున రథంబు డిగ్గనుఱికి పఱచి పురుషోత్తము
పిఱింది దెసం గ్రుచ్చిపట్టిన నతండు దీర్ఘబాహుండగు నతని నాయత
శాఖం బగు విపుల శాఖంగొనిపోవు మహావాతంబునుం బోలెఁ గొని
పోవ నాతండు పదియడుగుల కొలంది నిలాతలంబు చిక్కం
ద్రొక్కి యీడిగిలంబడి నిలువంబట్టి యిట్లనియె.

భీష్మ. 2-159

**ఈడితము** సం. విణ. (అ. ఆ. అ.)

పొగడఁబడినది.

క. సురపతి విభవము మేరువు, హిరణ్యము ను గిన్న రేశుఁ డీడిత సంప,
ద్గురుతయు నొసఁగిరి రథకరి, తురగభటావళులు దలఁపుతో నొడఁ
గూడెన్ శాంతి. 2-212

క. వేడుక నాలుం గొడుకును, గోడలు నీవును బ్రభూతగుణ యెక్కు
ము సంక్రీడ మెయి నివ్విమానము, నీడితగతి బ్రహ్మసభకు నేఁగఁగ
వలయున్. అశ్వ. 4-250

**ఈడు** దే. విణ.

1. సమానము, సాటి.

తే ఎందు గలుగునె యర్జును నీడువాఁడు.

విరా 2-204; విరా. 5-60; అను. 2-106; విరా. 2-66

2. అనుగుణము, తగినది.

ఉ. ...ఎవ్వరున్, ధర్మజుపాటి గారనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడవైన యట్టి
నీ, పేర్మికి నీడె దుర్ధశల పెల్లునకున్ దురపిల్లు టారయన్.

విరా. 1-51; ఉద్యో. 1-164; విరా. 2-30; విరా. 2-192

**ఈడుచు; ఈడ్చు** దే. స. క్రి.

లాగు, తిగుచు.

ఉ. ...తేరితోడ నఱపినుఁగునీడిచి కొంచుఁ బాఱె. ద్రోణ. 2-74

సీ. ఒక్కత యిలు వొచ్చి యువిదల నీడిచికొని పోవ. మౌస. 25

ఉ. ...ఏవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే. ఉద్యో. 3-110

**ఈడ్యము** సం. విణ. (అ. ఆ. అ.)

పొగడఁదగినది.

ఉ. ...గంధవతియందుఁ బరాశరసంయమీశ్వరుం, డే పురుషోత్తముం బడసి యీడ్యతమోన్నతి నొందె లోకశి,క్షాపరు భారతాధ్యయన కారకుఁ గొల్చెద నమ్మహాత్మునిన్. శాంతి. 6-514

(వావిళ్లవారి ప్రతి పాఠము ఈడ్వము — పాఠాంతరము ఈడ్యము)

**ఈడ్వము** సం. విణ. (అ. ఆ. అ.)

పొగడఁదగినది. చూ. ఈడ్యము.

(కొన్ని ప్రతులలో ఇది పాఠాంతరము - ఈడ్యము పాఠము)

**ఈతండు; ఈతఁడు** దే. సర్వ. ఏక.

ఇతఁడు, ఈ పురుషుఁడు, ఈయన.

ఉ. ...మహానుభావుఁ డీ,తం డొక మర్త్యుఁ జేరి యనుదాత్తత నెమ్మెయిఁ గొల్చువాఁడొకో. విరా. 1-85

ఉ. ...ఇట్టి యీతఁ డె,ట్లొకొ యొరు నాశ్రయించు విధి యోపదె యెవ్వరి నెట్లు సేయఁగన్. విరా. 1-98

**ఈతల** దే. వి. బొ.

ఇవతల (ఈవలి కాలము, పిమ్మట)

ఉ. ...ఈ, యాతత సేనయం దతని వారసి కానకయున్న వీరి ని,ట్లే తలడించి యా కడుపు నెయ్యఁగఁ బోదముగాక వేల్మిడిన్. విరా. 4-247

**ఈదృక్కు** సం. విణ. శ.

ఇట్టిది (రూపాం. ఈదృశము)

క. ఆది పురుషుఁడ వగుటను, వేదంబులు సెప్పు నవియు వెలిచుఁ బలు
కఁగా, నీదృక్ప్రకారుఁ డని దా, మోదర నీ పెంపెఱుంగ నొరులకు
కలవియె శాంతి. 1-390

**ఈదృశము** సం. విశే. (అ. ఈ. అ.)

ఇట్టిది, ఇటువంటిది.

వ. అని పూని యీదృశంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం
బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషంబగుటంజేసి.
విరా. 1-81; భీష్మ. 1-208; శాంతి. 4-288

**ఈనడుమ** దే.

ఈ మధ్యప్రదేశమునందు.

ఉ. ఇమ్మదిరాక్షి డస్సె మన కీ నడుమన్ విడియంగ నొందుచో,
టిమ్ముగ గాదు. విరా. 1—154

**ఈను** దే. అ. క్రి. స. క్రి.

1. (తిర్యగ్జంతువులు) ప్రసవించు.

సీ. మానుషిక్షీరంబు నీనిన పదినాళ్లలోని ధేనువుల పాలును నవేయ
ములు. శాంతి. 1-322

క. ఎవ్వఁడు నచరాచరగురుఁ, డెవ్వని నాభిసరోజ మీనె విధాతన్.
శాంతి. 4-218

సీ. కుక్కలెల్లను బిల్లల నీను. మౌస. 1-19

2. కలిగించు.

సీ. రథ సమాగమన సంరావంబు మేరుగహ్వరములఁ బ్రతిరవోత్క
రము నీన. మహా. 43

సీ. ఎవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి మానితసంపద లీనుచుండు.
విరా. 2-191

**ఈప్సితము** సం. విశే. (అ. ఆ. అ.)

పొందుట కిష్టమైనది.

ఉ. ....ధర్మాత్మనూభవుఁ డందు నాఁటిరే, యిమ్ములఁ జిప్పి వేగుటయు
నీప్సితకార్యము సేయఁగా విచా, రమ్మున నున్నచో. విరా. 1-58

వి. అ. న.

కోరిక, అభీష్టము.

క. అతఁ డతనితోడ భవదీప్సిత మెయ్యది నాకు నేల చెప్ప వనుఁడు.
ద్రోణ. 2-190

**ఈము**

ఇచ్చు ధాతువుయొక్క వ్యతిరేకార్థకోత్తమ పురుష బహువచన రూపము

తే. వినుము గాండీవమను నొకవిల్లు దాటి, పొడవు గలిగియుఁ గృష్ణుండు వూని తోడు, గూడుకొని వచ్చుటయు నెఱుంగుదము వీని, కెల్ల శంకించి భూమిపా లీముగాని.
ఉద్యో. 4-198

**ఈయన** దే. సర్వ. ఏక. (ఈ+అన)

ఈతఁడు.

క. ఈయనతో రణ మిప్పుడు, సేయఁగ మది గోల్పదు. భీష్మ. 2-251

**ఈయమ** దే. సర్వ. ఏక. (ఈ+అమ)

ఈమె.

క. అని మఱియుఁ బెక్కుభంగులఁ, దనుఁ బ్రార్థింపంగ ద్రుపదతనయ కఁ జిత్తంబున నింకఁ బెద్ద పెనఁగం, జన దీయమతోడ నను విచారము పుట్టెన్.
విరా. 2-100

**ఈరణము** సం. విణ. (అ. ఆ. అ.)

పురికొలుపునది.

క. తంత్రీపాలుం, డొక్కఁడ పాలియించె నీరణోత్సాహమునన్.
విరా. 3-280

**ఈరసము** వై. వి. (సం. ఈర్ష్యా)

1. ఓర్వలేకపోవుట, అసహనము.

గీ. బుద్ధిమంతుల వలన దుర్బుద్ధు లధికు,వలన హీనులు రూపసివలనఁ గొనటి,వా రసూయలు సేయుదు రీరసమున, నింత యెఱుఁగంగ వలవదే యీవు కొడుక.
శాంతి. 3-70

2. ద్వేషము, పగ.

క. పెక్కండ్రతోడ నీరస, మొక్కటఁ దొడరిన కొనక తఱిగియున్న పగ.

తుగో, నుక్కాడి బంధుభావముఁ, దక్కటి పగలు యొకవలయుఁ
దా నెఱపంగన్. శాంతి. 3-25.

క. ఆరాజకుమారుల మతి,నీరసము జనించునట్టు లెక్కుడి జనకుఁ దేరిక-
నేనియుఁ బుట్టిన, వారిం దోఁబుట్టువులుగ వల్వం జనునే.
అను. 1-296; ఉద్యో. 3-333.

3. కోపము.

ఉ. ....సారథి...హితం బెఱిఁగించుట వీతిగాన నీ, వీరసమెత్తినోఁ
బలికి తేనియుఁ జెప్పుదు సూతనందనా. కర్ణ. 2-52.

4. చలము, పట్టుదల, మాత్సర్యము.

సీ. ...అమ్మేది,నీశ్వరునితోఁ గర్జుఁ డిట్టు లనియె, నాకుఁ గృత్యంబు
లనేకముల్ గలిగె ము, న్నాధనంజయునకు నట్లు కాన, యీరసం
బున మాకు నిద్దఱ కొండొరు విడువక పెనఁగఁ జొప్పడదు యింకఁ
...దలపడి పోరుదు మలవుఁ జలము మల్లసిల్ల. కర్ణ. 1-229.

ఈరసమెత్తు అ. క్రి.

1. అసూయ వహించు, ఈర్ష్యపట్టు.

ఉ. వేరిమి ధర్మజుం బరిభవించిన ద్రోహులు వధ్యు లన్ను నె,వ్వారికిఁ
బోలదే సుజనవత్సల నీవిటు లంట వారు మ, మ్మీరసమెత్తి కిడ్డ
అచి యింతలుపేసినదాన నీ మదిం, గూరిన వొవ్వసొంపునను
గోపము పెంపునఁ గాదె యీరయన్. ఉద్యో 3-74.

2. కోపించు, ద్వేషము పూను.

ఆ. గురుఁడవై సమగ్రకోదండ విద్యామ,హత్త్వ మిచ్చినాఁడ వలుగఁ
దగునె, కారణంబు లేక యీరసమెత్తి యి,ట్లనినఁ బకురాముఁ
డాగ్రహమున. ఉద్యో. 4-306.

3. పట్టుదల పట్టు, చలము వహించు.

ఉ. ...దు,ర్వారత నీ పదంబుగొను వాంఛ నవశ్యముఁగాన యింత
లో, నీరసమెత్తి వాని వధియింపుము చెచ్చెర విక్రమోన్నతిన్.
అర. 5-218.

**ఈఱెలుఁగు** దే. వి.

హీనస్వరము, అల్పస్వరము

క. కారణ మెయ్యదియగునో, వీరల దురవస్థ కనుచు వెలుఁగం
దెడు నా. ధూరమణుఁడు సభయును విన, సీఱెలుఁగు నలంకఁ బల్కి-
రిట్లని గోపుల్. విరా. 3—185

**ఈరితము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రేరేపఁబడినది.

ఉ. ...ఇద్దఱ భూరిభుజారవంబు న,య్యిద్దఱ ముష్టిఘాత జనితేరిత
దారుణ నిస్వనంబు ఆది. 6-297

**ఈరు¹** దే. విణ.

అల్పము, హీనము.

ఈఱెలుఁగు. విరా. 3—185

**ఈరు²** సర్వ.

రెండు శబ్దమునకు వృత్తిలో అజాది సంఖ్యావాచకము పరంబగునపుడు
ఆదేశముగా వచ్చునది.

ఈరేడు. విరా. 4-219; కర్ణ. 2-168

ఈరైదు. శల్య. 1-226

**ఈరు³** సర్వ.

'ఈవు'నకు బహువచన రూపము.

క. ...విపన్నుల, యెడఁ గృపసేయుటయు తెప్ప యీరలుగకుఁడీ.
విరా. 5-128

**ఈరు⁴** క్రి.

ఇచ్చు ధాతువునకు మహన్మహత్యర్థకమున వచ్చు వ్యతిరేకార్థక బహు
వచన రూపము.

ఉ. ...తండ్రి పా, లీరని తెంపుసేసి పయినెత్తిన నెత్తిరిగాక.
ఉద్యో. 1-341; అశ్వ. 2-188

**ఈరువు** దే. వి.

ఎఱచి, మాంసము.

ఆ. నీవుఁ గొడుకు వారి నెటి లేక పటిచితి, రదియ చాలు నుచితమైన పాలు, పంచి యిందు పిల్లివట్టిన యూరువు, పేసియున్న నేల చెల్ల నేర్పు. ఉద్యో. 2-25

(క. వాల యూరు వెఱచి నంజుడు, పొలసన నివి పరఁగు మాంసమునకు మహేశా. అం. సం. ౧. 18- పిల్లి తననోటఁ గఱచిన మాంసమును చావునకైనను తెగించునుగాని తినువఱకు వదలదు. అట్లే దుర్యోధనుఁడు మొండిపట్టు పట్టియున్నాఁడని భావము.)

ఈరేడు సర్వ. (√ఈరు$^2$)

పదునాల్గు.

తే. ఏను విల్లందుకొన్న నీరేడు భువనములును వడవడ వడఁకు. విరా. 4-219; కర్ణ. 2-168

ఈరైదు సర్వ. (√ఈరు$^2$)

పది.

మ. ...ధర్మసుతుఁ డీరైదమ్ము లమ్మేద్ర నాయకులై. శల్య. 1-226

ఈర్ష్య సం. వి. అ. స్త్రీ.

అసూయ, ఓర్వలేమి.

క. చెలులం జుట్టలు సంబంధులు ఋత్విజులును బురోహితులుఁ దగు పాత్రంబులు హింసాక్రోధేర్ష్యాదులు లేని జనంబులైన దురిత విదూరా. అను. 2—162

2. ఈసు, స్పర్ధ, ద్వేషము.

వ. ...లోభంబును గ్రోధంబును నీర్ష్యయు నసూయయు జంతువుల శరీరంబుల వికృతిం బొందింపవలయు. ద్రోణ. 2-175

ఈఱతాఱు దే. విణ.

1. తాఱుమాఱైనది, వక్రము.

తే. వంకరైన తలంపెల్ల వసుమతీశ, యరయ మృత్యుపదంబగు నార్జవాన్వితంబు బ్రహ్మపదంబింత తథ్యమేల, యీఱతాఱు తలంపులు విడువుఱు. అశ్వ. 1-108

2. పరుషము, కఠినము.

తే. చేఱుకోలల బ్రేటుల నీఱతాఱ, యదలువుల వాహనంబులు
నెదరిపఱచె. ద్రోణ. 3-43

**ఈఱతాఱలు** దే. విణ.

తాఱుమాత్రైనది, వక్రము.

తే. బహు విధంబులఁ బలుకు నాపలుకులెల్ల, జీఁదకనువడి తన పెడ
చెవులఁబెట్టి, యీఱతాఱలు మఱుమాట లిచ్చి యపహసించె
దుర్యోధనుఁడు వేయుఁ జెప్పనేల. ఉద్యో. 4-76

**ఈఱమి** దే. వి.

తీఁగెలు, ఆకులు మొదలగు వాని గుంపు.

వ. ...అమ్మడువునఱుత నొక్కపఱవు గల పొద యీఱమిందూటి
పొంచియుండితి. కల్య. 2-46

**ఈలకఱచు; ఈలగఱచు** దే. అ. క్రి.

ప్రాణములు బిగఁబట్టు.

క. పొదవునకు నెగసి యెప్పటి, పదమటిదెస నిగిడి పెలుచఁబఱచినఁ
గూడం, గడు రయమునఁ జని యంచం, గడవంగా కీల కఱచి
కాకము పాఱున్. కర్ణ 2-68

వ నిలువందగు నెలవగుట నసము డింపక యీలగఱచుకొనియున్న
వాఁడ. ద్రోణ. 2-104

**ఈలుకఱచు; ఈలుగఱచు**

పాఠాంతరములు. చూ. ఈలకఱచు.

**ఈలువు**

పాఠాంతరము. చూ. ఈరువు

**ఈలువు** దే. వి.

పాతివ్రత్యము. చూ. ఈలువుటాలు.

**ఈలువుటాలు** దే. వి. బొ. (ఈలువు + ఆలు)

పతివ్రత, సాధ్వి.

సీ. అమరుల యీలువు టాంద్రను జెఱవట్టితి. ఆర. 7-61

ఈల్గు దే. అ. క్రి.

చచ్చు, మరణించు.

క. సుతుఁడీల్గిన మద్రమహీ,పతి శోకక్రోధవేగ భరితాత్మకుఁడై. శల్య. 1-166

ఉ. అమ్మెయి సూతుఁ డీల్గుటయు నగ్గలికన్. ద్రోణ. 1-180

ఈవి దే. వి. (√ఇచ్చు)

ఇచ్చుట, దానము, ఈగి.

ఉ. ఎందు నపాత్రపుటీవి యొప్పునే. కర్ణ. 2-38

ఈవు దే. సర్వ.

నీవు.

('నీవు'లో ఆద్యక్షరము లోపించిన రూపము)

చ ...పా,మెసనిన తోలు వాయుక్రియ నీవు దొలంగుదు పాపపుంజ ముల్. శాంతి. 5-189; విరా. 4-38

ఈశానుఁడు సం. వి. అ. పుం.

1. శివుఁడు.

వ. తనకు నరణ్యంబున నయ్యీశానుఁ డిచ్చిన వరంబును.

ద్రోణ. 2-376

క. ఈ,శానుఁడు నభవుఁడు నమృతుఁడు,నైన శివుని నీవు గొలువు మర్జున యెపుడున్. శాంతి. 6-456

2 నారాయణుఁడు. (ఈశనశీలుఁడు - ఈశనము = ఐశ్వర్యము)

ఆ. ...ఆత్మవేద్య నీశాను న,వ్యయుఁ దపఃఫలాత్ము నాశ్రయింతు.

వ. అని మఱియు ననేక ప్రకారంబుల నప్పరమ ముని యప్పుడు భావంబున నెలకొన్న నారాయణుం బ్రస్తుతించి.

శాంతి. 6-415; 416

ఈశుఁడు సం. వి. అ. పుం.

1. ప్రభువు, రాజు.

తే. మేదినీశుండు హర్ష, నిర్భరాత్మకుఁడై. విరా. 3-152

2. శివుఁడు.

(శివుఁడు పార్వతితో) క. ఈశుఁడ, సనాతనుఁడ, నవ్యయుండ, సత్యా
త్ముండన్. అను. 5-265; భీష్మ. 3-79

3. ఉష్మపులలో నొకఁడు.

వ. దేవతలయందుఁ గొంద ఱుష్మపు లయిన మహాభాగులం బితృత్వ
నిర్దేశంబున నేర్పరించె నవ్విరించి వివరించిన నామంబులు సెప్పెద
వినుము బలుండు...శవుం డీశుండు...ప్రజుండు. అను. 3-192

**ఈశ్వరి** సం. వి. ఈ. స్త్రీ.

1. ప్రభ్విణి.

ఈ విశ్వంబునకు నీశ్వరివి. ద్రోణ 2-175

2. పార్వతి.

ఈశ్వరుం డీశ్వరితో నిట్లనియె. అను. 5-110

**ఈశ్వరము** సం. వి. అ. న.

ఒక తత్త్వము.

వ. శ్రుతిపురుష సమ్మతాష్టతత్త్వం బనియు బ్రహ్మం బనియు నిర్దే
శించి -తే- అన్ని తత్త్వంబులకు సమ్మతార్థ తత్త్వమెక్కు డది
యీశ్వరంబు ననీశ్వరంబు, సత్యపాకంబు నతిరహస్యంబు దానిఁ
గనిన మృత్యుజాలము చిక్కఁ గడవవచ్చు. అను. 4-188

**ఈశ్వరుఁడు** సం. విణ. (అ. ఆ. అ. స్త్రీ లింగమున ఈకారాంత
ము)

1. ప్రభువు, రాజు.

క. విరటు బలంబు త్రిగర్తేశ్వరు బలముం జెంది నార్చి వడిఁ దాఁకె.
విరా. 3-158

వి. అ. పుం.

1. శంకరుఁడు.

ఉ. ఖాండవమేర్చె దేవతలు గానని యీశ్వరుఁ గాంచె. విరా. 1-85

వ. అని యెఱింగించి యీశ్వరుం డీశ్వరితో నిట్లనియె. అను. 5-110

2. భర్త, మగఁడు.

వ. ...ఆ లక్ష్మీశ్వరుండు దన దివ్యరూపంబు సూపె భీష్మ. 1-210

3 అంతర్యామి, భగవంతుఁడు, నారాయణుఁడు.

తే అచలు సూక్ష్ము వరేణ్యు సహస్రశీర్షు, నభయకారి నశీర్షు నారాయణుని సనాతముని యోగమూర్తి లోకాతిరిక్తు, ధ్రువుని నీశ్వరు హరి భక్తితోడఁ గొలుతు శాంతి 4-217

4 దండదేవుని పేరు.

ఆ. పురుషుఁ డీశ్వరుఁడు జీవుండు ప్రాణుఁ డక్షయుఁడు సత్త్వమనఁగ నేచు పేరు లష్టమంబు ప్రజాపతి యనఁ బరఁగు దండదేవు పేరు. శాంతి. 3-114

5. ఉష్మపులలో నొకఁడు.

వ. దేవతలయందుఁ గొంద ఱుష్మపులయిన మహాభాగులం బితృత్వ నిర్దేశంబున నేర్పరించె నవ్విరించిన నామంబులు సెప్పెద వినుము బలుఁడు...సప్త యీశ్వరుండు...వరి వీరలు భాగార్హులు. అను 3-192

6. క్రోధగణాంశభవుఁడు.

వ. ...క్రోధవశగణంబు వలన మద్రక...మతి మదీశ్వరాదు లనేకులు పుట్టిరి. ఆది 3-80

ఈసు వై. వి. (సం. ఈర్ష్య)

1. ఓర్వలేమి, అసహనము.

చ. ...విను చెప్పెద మీసు గలంక పోలితం, బనుచు ని మత్సరంబు గల యట్టి మనంబునఁ బుట్టు. శాంతి. 5-241

2. కోపము.

క. దుర్జనతుఁడవగు నీయెడ నీసున నాటు వలుకవలసె సూత తనూజా. ఉద్యో. 4-247; శాంతి 1-18

వ అంతఁ బంక్తివదనుండు నిబిడజ్వాలంబగు శూలంబు రాఘవు మీఁదం బ్రయోగించిన నతఁడును దానిఁ దునియలుసేసిన నీసునం

జెదిరి సురవైరి మఱియునుం దరతరంబ తోమరంబులు శరంబు లుం బఱఁగించి. అర. 7-149

శ్లో తతః క్రుద్ధస్య సర్వాణి దశగ్రీవశ్శితాన్ శరాన్.
సం. భా. అర. 289-22

3. ద్వేషము. పగ.

సీ. ...శల్యుఁ డతిరథుండు -అ- వాసుదేవునితోడి యీసువా డల్లర విడిచె. ఉద్యో. 4-221; శాంతి. 1-18

శ్లో. స్పర్ధతే వాసుదేవేన నిత్యం యో వై రణే రణే.
సం. భా. ఉద్యో 164-27

క. వాసవుఁడును నవ్విభునెడ, నీను గలిగి తన్ను మిగుల నీనని తచ్చిం, తాసక్తుండై మంత్రి ని,వాసమునకుఁ జనియెఁ బూరువంశప్రవరా ...చ...విరోధము దక్కి యధ్వరం,బున కిటువచ్చి దైవత విభుండు. అశ్వ. 1-84-95

4. మాత్సర్యము, చలము.

తే. అనిన గాంధారి కిట్లను జనవిభుండు, నీతనూజుండు దుర్మాని నీతిబాహ్యుఁ డుద్ధతుం డీసు మానినా బుద్ధి వినఁడు, వీఁడు సెకుఁ గాని బ్రదుకంగలేఁడు సుమ్ము.
ఉద్యో. 2-828; ద్రోణ. 8—68; అశ్వ. 1-14

5. నింద.

క. అనయము నీసు వొనర్చిన, విని యతనికి నిట్టులనియె వృత్రుఁడు విజయంబునకు నయి తపము సేయనె. శాంతి. 5-408

6. దుగ్ధ, విచారము.

క. ఈ రెంటియందు నరసియు, పారం బిది గాథసార సహితం బిదివా, నేరవలయు నదియను గా,కేరూపం బయ్యోనేని నీసేమిటికిన్.
ఉద్యో. 1-357

ఈహ సం. వి. అ. స్త్రీ.
కోరిక, వాంఛ.

క. ...గా ధాహంకార మమత్వము, లిహఁబెమపఁ బ్రక్ళతిఁబురుషుఁడే
నను చుండున్.　　　　శాంతి. 6-154; అశ్వ. 1-199

**ఈహితము** సం. విణ. (అ. ఆ. అ.)

కోరఁబడినది.

ఉ. మీయెడ చింతవాయఁగ సమీహితబుద్ధి యొసర్పఁగోరి.
　　　　అ|శ. 2—82

క. ఈహిత విధానముల లో, కాహిత దుస్స్వహసతేజుఁ డయి వాఁడు.
　　　　సభా 1-154

# ఉ

**ఉ**[1]

1. హలంత సంస్కృత శబ్దములు తత్సమములగునపు డంతాగమముగా వచ్చు వర్ణము— వాక్-వాకు, దిక్-దిక్కు

   క. వాకును మనసును గాయము, నేకాయనవృత్తి శౌచమెదలని తపముం, జేకొనునది.　　　　శాంతి. 4-888

   వ. యోగ్యస్థల నిరూపణంబునకు దిక్కులుం బరికించి. విరా. 1-161

2. మహద్వాచకములగు బల్లిదాదుల యొక్కయు పెక్కు పుంలింగ మహద్వాచక తత్సమ శబ్దముల యొక్కయు తుది అకారమున కాదేశముగా వచ్చును: బల్లిదుఁడు, రాముఁడు.

   తే. పరశురాముని గెలిచిన బల్లిదుండు, భీష్ముఁడు.　ఉద్యో. 2-209

   క. విరటుఁడుఁ బాంచాలుఁడును, హరియును, రాముండు వారి యనుజ తనూజుల్.　　　　ఉద్యో. 1-5

3 నామముల తుది ఇకారమునకు బహువచనము పరంబగునపుడు అదే శముగా వచ్చును: హరులు, విరులు.

ఆ. హరుల హేషితములు ననుకూల వాయు సంచారములును.
విరా. 4-183

తే. వేఁడి నిట్టూరుపో యన వెడలెఁ బ్రొత్త తావి మూతులు విచ్చు
నెత్తమ్మి విరుల. విరా. 2-286

4 ఇకారాంతములగు తెలుఁగు శబ్దముల యుపోత్తమేత్వమునకు బహు వచనమున ఆదేశముగా వచ్చును. (ఉపోత్తము = రెండి కెక్కువైన వానిలోఁ గడపటి దానికి ముందున్న యక్షరము) ములికి, ములుకులు.

ఆ. ఎలుకు నమ్ము నలక యేసిన ములుకులు. అర. 1-314

(పందిరులు - వాకిళులు మొదలగు కొన్నిటికి రావు)

ఆ. ఏను వేఁదు అగుడు వాని నివ్వేదులు, పట్టఁ జదురు గలదె శాంతి
దొలఁగి. యొంటికంబ మొగ్గ నింటివాకిళులు దొమ్మిదియు
నెఱయ మూసి నిదురవోదు శాంతి. 4-17

5 ప్రేరణార్థమున వచ్చు 'చు', 'పు' వర్ణములు పరమగునపుడు ధాతువులలోని ఇకారమున కాదేశముగా వచ్చును: తెలియు, తెలుపు.

క. మఱచినఁ దలఁపింపఁగనగు, నెఱుఁగని నాఁడెల్ల పాట నెఱిఁగింప
నగున్, మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని, కఱటిం దెలుపంగఁ గమల
గర్భుని వశమే. ఆది. 4-71

6. కృత్ప్రత్యయములు పరమగునపుడు కొన్ని యువర్ణాంత ధాతువుల తుది ఇకారమునకు ఆదేశముగా వచ్చును. కినియు-కినుక, కినుపు; బలియు-బలుపు; ముదియు-ముదుక, ముదుకఁడు.

క. ఒదవెడు కినుకం గడు బెట్టిదముగఁ బెరఁగిరి. విరా. 2-348

క. అరుల కినుపడఁచి బ్రదుకవలయు. ద్రోణ. 4-248

ఆ. ముష్టిబలుపు నెఱయ ముక్కున వాతను, నెత్తురొలుక మల్లు నెత్తి
వైచె. (బలువు అని పాఠాం) విరా. 2-17

చ ముదుకఁడనైన నాదు బలముం బలమున్. ఉద్యో. 4-246

ఉ² అవ్య. ద్రు.

(ఉదంతేతరములకు పరమగునపుడు దీనికి నిత్యముగా యడాగమము వచ్చును. ఒకానొకచో నిందలి ద్రుతము మాత్రము మిగిలి ఉకార లోపము జరుగును. 'ను' సముచ్చయార్థకమనియు, ఉకారేతరములమీఁద 'యు' వర్ణపూర్వకముగా వచ్చుననియు ఆ 'యు' వర్ణము ఒకానొకచో లోపించుననియు పూర్వలాక్షణికుల మతము సూ. ఆ ని)

1. అపిశబ్దార్థమును దెలుపును.

(క) సముచ్చయార్థమును దెలుపును.

మ. ఇవి యేనున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ గా,యవు భూదేవకులాభితర్పణ మహీయఃప్రీతియున్ భారత, శ్రవణాసక్తియుఁ బార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహో,త్సవమున్ సంతత దానశీలతయు శశ్వత్సాధు సాంగత్యమున్.

ఆది. 1-12

మ. ...భూ,వర మున్నిట్టివి నూడరున్ వినరు నెవ్వారుం ద్రిలోకంబులన్.

ద్రోణ. 3-162

(గ) విరోధమును దెలుపును (కూడ, సయితము, అయినప్పటికి, మున్నగు వాని యర్థముల నిచ్చును.)

క. ఎట్టి విశిష్ట కులంబునఁ,బుట్టియు సదసద్వివేకములు గల్గియు మున్, గట్టిన కర్మఫలంబులు. నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్.

ఆది. 5-58

సీ. ...వారలిగినఁ జెడుదు రయ్యమరులైన, నట్టివిపుల బారికగపడి యుండియు నేమియుఁగారైతి రీవుఁ బాండు -గీ- తనయులంద ఱు నీ కూర్మితమ్ములఁడును. (అగపడియుండియు = అగ్గమైయుండి కూడ)

స్త్రీ. 2-155

2. కిమర్థకమగు ఏ, ఎవఁడు, ఎప్పుడు మున్నగు పదములకును, ఒకఁడు మున్నగు కొన్ని పదములకును అనుప్రయుక్తమై సర్వార్థమునిచ్చును. (అప్పుడు వ్యతిరేకార్థక క్రియలతోడనే సంబంధించి యుండును.)

ఉ. ...చిచ్చొడిం,గట్టిన యట్లు...దీనికి నాఁడు నెన్నఁడున్, బుట్టదు.

ఉద్యో. 3-118

క. పాండవుల వలని కీడ్కొ,క్కండును లే దధిప నీదుకొడుకులు ధర,ణీ
మండలమంతయు గ్రమింగిరి, పాండునృపతి భాగమునకుఁ బాపిరి
వారిన్. స్త్రీ. 1-88

3. అనంతర్యము ను దెలుపును.

చ. అనుటయుఁ జిన్నినవ్వు నగి యంబుజనాభుఁడు పల్కె నెన్నఁడున్.
విని నివి భీముపాలఁ గడ వింతలు వింటిమి మాటలు. ఉద్యో 3-52

4 వాక్యాలంకారముగా నుపయోగింపఁబడును.

సీ. విషయ భోగాభిలషణ మింతియు నాకు వదలక పెరుఁగుచున్న
దయుఁ గాన ఆది. 8-95

ఉ₃ ప్ర.

కొన్ని ధాతువులపై వచ్చు కృత్ప్రత్యయము.

ఒప్పు + ఉ = ఒప్పు; పలుకు + ఉ = పలుకు.

తే. తాను దోఁచ్చిన కతన మత్స్యక్షితికి,నింట నిమ్మెయిఁ గ్రొత్త
యొప్పెసక మెసఁగ, నమ్మహాదేవి యున్నెడ కల్లనల్లఁ దాండు
రాజతనూభవపత్ని యరిగె. విరా. 1-308

క. అనవుడు నప్పలుకులు విని విరా. 1-55

ఉంకించు దే. స. క్రి.

యత్నించు, పూను.

(ద్రౌపది) సీ లలి మల్లసిల్లుచు లలితలోచనదీప్తు లదర మంకించిన
వాఁగి యాఁగి. విరా. 3-55

తే. (దుర్యోధనుఁడు) రక్తసంసిక్తమైన ధరాతలమున, వార్తిఁ బొర
లుచు నూర్పు లందంద సంద,డింప జీవంబు వెడల మంకింపఁ జేష్ట,
లొయ్యనొయ్యన యడఁగంగమున్న యధిపు. శాంతి. 1-213

ఉంకువ దే. వి.

కన్యార్థము మామకుఁగాని కన్యకకుఁగాని యిచ్చు ద్రవ్యము, కన్యా
శుల్కము, ఓలి.

సీ. అతని కీనొల్ల కప్పతి దన కూఁతున, కుంకువగాఁ జెప్పె నొక్క కర్జ

-తే- మసితమై తెలుపారెడు హారులు వేయి. అన. 1-104

వ. (గాధి)...అచ్చెరువును సంతోషంబును శాపభయంబును ముప్పిరి గొనం దన పుత్రికి నుంకువగా నియ్యకొని. అను 1-106

**ఉంకువు** దే. వి.

ఉంకువ, కన్యార్థము మామకుఁగాని, భర్తకుఁగాని కన్యకకుఁగాని యిచ్చు ద్రవ్యాదికము, కన్యాశుల్కము, ఓలి.

వ. అపత్యార్థియై యిక్ష్వాకుండును నయ్యుంకువునకు భార్యయగుట పుత్రజన్మావధిగా నొడివి యశ్వంబుల నొసంగి కన్యకం బరిగ్రహించి. ఉద్యో. 8-316

తే. ఈలతాంగికి నుంకు వి ట్లిఁగనోపు,దేని. ఆది. 8-144

సీ. ఇట్టి గుణములు యిక్కన్య కుంకు వి,ట్లినోపుదేని. అర. 182

(చివరి రెండును 'ఉంకువ' అని న ప. ప్రకోశము. రెండవదియైన ఆది. 8-144 'ఉంకువ' గా సూ. అ. ని. మొదటి యుదాహరణమైన 'ఉంకువు' ఆంధ్ర, ఆకాడమి, సం.ము మొ. వానియందుఁ బాఠములుగా నుండఁగాఁ బాఠాంతరము గూడ లేకుండ నుండఁగా సూ. అ. ని. 'ఉంకువు' పద మేలకో ఈయలేదు.)

**ఉంగిడి** దే. వి.

పశువులకుఁ గణువు వేయని తొన్న మొదలగునవి తినిన వచ్చు కంఠరోగము

వ. ఉంగిడి యదురుఁ ద్రిక్క యనువానికి నాపేరు చెప్పినం జాలు. విరా. 1-286

**ఉంచు** దే. స. క్రి. (√ఉండు)

ఉండునట్లు చేయు, ఉనుచు, ఉన్ను.

1. కూర్చుండఁబెట్టు.

చ. ...రత్నరుచిర కాంచనాసనమునం దగ నుంచి. శాంతి. 6-266; అర. 1-355

2. దాఁచిపెట్టు.

ఉ. వైరి వినాశన క్రియకు వాసవుఁ డిచ్చిననుంచియున్న యా,ఘో-

రవు శక్తి. చూ. ఉనుచు. ద్రోణ. 5-229

**ఉంఛవృత్తి** సం. వి. ఇ. స్త్రీ.

క్షేత్రాది స్థానములందు రాలిన గింజలను ఏఱుకొని తిని బ్రదుకుట.

సీ. ...ఒక మహాద్విజుఁ డుంఛ వృత్తిమై నుండు. అశ్వ. 4-220

వ. ...కురుక్షేత్రంబున వసియించి యుంఛవృత్తి పరాయణుండై అర. 6-115

సం. విణ. (ఇ)।

ఉంఛముచే బ్రదుకువాఁడు (ఉంఛము = క్షేత్రాది స్థానములయందు రాలిన గింజలను జీవనార్థమై ఏఱికొనుట.)

వ. ...తత్సమీపంబున నొక్క కుష్ఠశవంబు నవలోకించి యిది యుంచవృత్తియైన మానవు కళేబరంబు గావలయు ననుచు. విరా. 1-180

**ఉంట** దే. వి. (√ఉండు)

ఉండుట.

ఉ. ఐంటుతనంబు మాటలకుఁ దాఱకు పాండునృపాలు పాలు గై, కొంటయు చాలు నన్ను నృపకుంజరు పల్కుల కడ్డమాడరా, కుంట యెఱుంగవే మును. ఉద్యో. 3-59

**ఉండి** అవ్య. (√ఉండు)

1. ఉండు ధాతువునకు క్త్వార్థకరూపము.

వ అయ్యింతి యింత నేవు నీ చేరువ నుండి యిప్పుడెట మెలఁగె విరా. 2-61

2. అపాదానార్థమందు (ఎడఁబాటును దెలుపునప్పుడు) వచ్చిన 'వలన' కున, దానికి వికల్పముగా నాదేశమగు ద్వితీయాసప్తములకును అను ప్రయుక్తమగును.

ఆ. విష్ణువలనఁ ద్రిపుర విజయి మౌళివలన, నుండి హిమనగమున నొలసె గంగ. అను. 2-118

క. ...వనజాయత నేత్ర కడకు వచ్చెను గగనంబున నుండి కమల మిత్త్రుఁడు, తన తీవ్ర కరత్వ మడిగి తరుణద్యుతితోన్. ఆది. 5-20

3. ప్రభృతి (మొదలుకొని) అను నర్థమును దెలుపును.

వ. పాండునందనులు పుట్టినంత నుండి నేఁడు దుదిగా నీయెడ ధర్మ విరోధం బాచరింపరు. (పుట్టినంత నుండి = పుట్టినది మొదలు)
శల్య. 2-228; విరా. 5-118; ఉద్యో. 1-81

**ఉండు** దే. అ. క్రి..

ఉందురు, ఉంద్రు, ఉంటివి, ఉండిరి, ఉన్నను, ఉన్నది, ఉన్నె, ఉన్నే మొదలగు రూపము లాయాభావుల గ్రహించునది.

(ఇది సంస్కృతమునందలి 'భూ' ధాతువు వంటిది.)

1. సత్తను (స్థితిని) తెలుపును.

క. ...కడవఁ బోవక యుండం, బోవలయు నడ్డపడియెదు, దీవస మెదఁగలిగెనేని దేవర కడకున్. విరా. 3-137

వ. .. పరమ బ్రహ్మణ్యులైన పాండవులును బ్రాహ్మణ సమూహం బులో నుండి పాంచాలరాజు సమృద్ధినిం జూచి సంతసిల్లిరి.
ఆది. 7-166; సభా. 1-81

2. కలుగు, సంభవించు.

ఉ. కావున నన్నదానమునఁ గాకెటులుండు మహాప్రమోదము.
అను. 4-358

3. ప్రవర్తిల్లు.

తరలము :- నేను భార్యయు దారుణాటవిఁ గామభోగరతి నుండితి మిష్టచారిమృగవ్రజంబుల పొత్తునన్. ఆది. 5-51

వ. పురుషుని వలన నివియెల్లనుం గలుగుఁ బురుషుం డింతకు నధిష్ఠాతయై యుండు. శాంతి. 6-41; సభా. 1-81

4. కాలము గడపు.

ఉ. మత్పాద నిరంతరస్మరణ తత్పరభావము కల్మివాత్మ నమ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచు నుండుదెప్పుడున్.
విరా. 1-1

5. నివసించు.

తే. అధిప ధర్మజుపాల మున్నప్పు డతని వేడుకకుఁ దగఁ బెనఁగుడు. విరా. 2-13

6. జీవించు.

క. దేవతలకైన నొక్కొక, చో వలయున కాదె శత్రుసూదన విధి కాలావాప్తికి మును దమప్రభావము లడంచి యుడుగఁబడి యుండఁగన్. విరా. 1-68

తే. ఇంద్రులెందఱువో రింద్రువేల బ్రహ్మలుండుదురె తఱితోఁదెగుచున్నవారుగాక. శాంతి. 4-486; ఆది. 4-221; భీష్మ. 1-195

7. పరుండు.

వ. ఇట్లు పొచ్చి తలియంబని మధ్య ప్రదేశంబున విరాటనందన లీలా పర్యంకం బరసికని దాని కనతిదూరంబునం బాంచాలి నొసరిల మనిచి తా నాతల్పంబున నుండె నంతం గీచకుండు. విరా. 2-328

శ్లో. శయానం శయనే తత్ర సూతపుత్రః పరామృశత్.

సం. భా. విరా. 22-484

8. కూర్చుండు.

ఉ (అర్జునుఁడు)...ఆ,ఖండలుఁడున్న గద్దియ సగంబున నుండె. విరా. 1—85

9. ఆఁగు, నిలుచు.

వ. ఇక్కాశ్యపుండైన కణ్వమహామునీంద్రునకు నమస్కరించి వచ్చెద నా వచ్చునంతకు నందఱు నిచ్చోటన యుండునది యని. ఆది. 4—24

చ. వలయు నమాత్యులం దగినవారల నుండఁగ బంచి ధారుణీతల విభుఁడొక్కరుండ చని. ఆది 4-25

10. తప్పు, తొలఁగు, మాను.

ఉ. ...అట్లగుటఁ జేటు పురంబున వారికెప్పుడుం, గాకెటులుండు నిట్టి యవగాఢపుఁబొత్తు మునంగవచ్చునే. విరా. 3-82

11. కనఁబడు, తోఁచు.

సీ. రథఘోషమునఁ బ్రతిరవ మిచ్చు నద్రులు, భయమున వాపోవు భంగి నుండ. విరా. 3-156

12. ఊరకుండు.

సీ. ...వీఁడు విజయుఁ -ఆ- డొక్కొ యనుచు సంశయోపేత చిత్తులై యుండియుండ నోప రొక్కవాఁడు. ఆది. 3—185

13. తలఁచు, అనుకొను.

వ. ...ధనువునకు బాణంబులకు వైకల్యంబు వాటిల్లినయెడం బర వీర ప్రహరణంబులనకు నాత్మత్రాణంబునకుం గృపాణంబు మేలని యుండుదు నా తలంపెట్టిదియో తెలిసికొనవలయు. శాంతి.3-441

14 శేషించు, మిగులు

క. నిన్న యలి నచ్చిపోయిరి, వున్నయలియు నేఁడు దీర్చి యుడిపెద నీ గర్వోన్నతి యుంకెటు వోయెదు. ఉద్యో. 4-341; అను. 1-82

15. తగు, ఒప్పు, తనరు.

వ. .. తొల్లి జాజాలియను మునికిఁ దులాధారుండను వణిగ్వరునితో సంవాదంబు గలిగె నది యితిహాసరూపంబునఁ జెల్లు నేతద్విషయం బయి యుండు దానిం జెప్పెద నాకర్ణింపుము. శాంతి. 5-228

వ. ...అది భవత్ప్రశ్నంబునకు నుత్తరంబై యుండు. శాంతి. 5-346

16. కొన్ని ధాతుజన్యములగు అవ్యయములకు అనుప్రయుక్తమగును.

ఉ. ఇంతకుఁబోలిక వచ్చుచుండుదురు. ఉద్యో 3—234

క. ...ఒండొరుతో తెన్నగఁ బొందిచుండుదురు. శాంతి. 4-111

వ. రాజులెల్లం బ్రతివత్సరంబు నింద్రోత్సవంబు సేయుచుండుదురు. ఆది. 3-24

17. కొన్ని యెడల తుమున్నంతములకు అనుప్రయుక్తమై భవిష్యదర్థమును సూచించును.

క. ...ననున్ ధర యేలింపఁగ నున్నారరు. ద్రోణ. 5-113

18. కొన్ని యెడల తుమున్నంతములకు అనుప్రయుక్తమై 'సిద్ధమగు', 'అభిముఖముగానుండు' అను నర్థమిచ్చును.

తరువోజ :- ఇది యిట్టివారల మిమ్మెయిఁజేయఁగా నున్నవిధి యేల కడవంగనిచ్చు. ఆది. 6-247

ఆ. స్వజనములును దాను భుజియింపనుండి యాన్నకస్తుకతిథికిచ్చెఁ బడె పొండ. ఆశ్వ. 4-259

ఉండెి. స్త్రీ. 2-84; ఉంటివి. కర్ణ. 2-112; ఉంతు ఆశ్వ. 2-57;
ఉందుము శాంతి. 8-441; ఉందురు ద్రోణ. 1-220;
ఉండెదు ఆశ్ర. 1-8; ఉన్నది విరా. 4-75;
ఉన్నె విరా. 2-27; సభా. 1-66; ఉన్నే విరా. 4-107;
ఉన్నాడు శల్య. 1-668; ఉన్నాఁడు అను. 5-118;
ఉన్నారము ఉద్యో. 1-276; ఉన్నారము ద్రోణ. 5-111;
ఉన్నారలు ద్రోణ. 2-264; ఉన్నారు విరా. 3-139; ఉద్యో. 1-259;
ఉన్నవాఁడు విరా. 1-18; ఆర. 1-374;
ఉన్నవారు ఉద్యో. 2-284; ఆర 2-146;
ఉన్నవారము శల్య. 2-172; ఉన్నవారలు ఉద్యో. 2-288;
ఉన్నవి స్త్రీ. 2-20; ఉన్నావు (విచార్యము)
ఉన్న విరా. 2-47; ద్రోణ. 2-128;
ఉన్నయది ఆది 2-144; విరా. 4-177;
ఉన్నయవి సభా. 1-183; ఉద్యో. 2-15;
ఉండెదు ఆది. 3-149; ఉండెదునని ఆది. 6-159;
ఉండెద ఆది. 6-236; ఉండెదము ఆర. 1-17;
ఉండెరు ఆర. 8-244.

**ఉక్కడంచు** దే. స. క్రి.

1. అవమానపఱచు.

సీ. పొలుపంబు మెఱసి దిక్కులఁ గాంతి పూరించు క్రొక్కారు మెఱు
ములు నుక్కడంచి. పిరా. 2-88

2. చంపు

ఆక్కర్ణు నుక్కడంచి యక్కుంతి సంతవు సంరంభంబు వారించెద.
ద్రోణ. 5-197

శ్లో. అహ మేవం వధిష్యామి మామ్ వైష మధుసూదన.
సం. భా. ద్రోణ. 174-85

**ఉక్కడఁగించు** దే. స. క్రి.

సంహరించు, చంపు

ఉ. ...ఆట్టియల, దక్కట భీముఁడైన మన యర్జునుఁడైన సు మ్మాద్రి
పుత్రులం, దొక్కరుఁడైన నీగఱ నుక్కడఁగింపరె యొక్క
ప్రేల్మిడిన్. ఉదో. 1-287

**ఉక్కడఁగు; ఉక్కడంగు** దే. అ. క్రి.

1. దుర్బలమగు, నశ్వత్వమగు.

తే. వారలందఱు నొండొరుఁ బేరువేరఁ, బిలిచికొని పీఁడె చనుదెంచె
భీముఁ డీనఁ,బొంటి యగపడ్డచోటన యుక్కడంగఁ, బొడిచి చంపు
దము. భీష్మ. 2-357

2. పవ్వాలించు.

చ. ఆవనితలంబు వ్రస్సెనో హిమాచల శృంగము వ్రయ్యలయ్యెనో,
శ్రవణ నిదారణంబయిన శబ్దము దా నిదియేమి యొక్కొ తైౖర
వమయి విన్పె నంచును బురంబునవారు భయంబు నొంది రం,
మదబలగర్వముల్ గలఁగె నుక్కడఁగెన్ మగధేశు సైన్యముల్.
సభా. 1-212

**ఉక్కఱు** దే. అ. క్రి.

1. గర్వము చెడు, మదమడఁగు.

క. వెక్కంద్ర నొక్కపోరన, నుక్కఱు భంజింతుఁ బంపు టుడుగుఁడు
రాజుల, దక్కటి చూపఱు లెంతయు, వెక్కసపడఁ జిత్రగతుల
విహరింతుఁ దగన్. విరా. 1-82

క. ఉక్కఱి నరపతికైనను మ్రొక్కము. ఉద్యో. 3-360

2. బలహీనమగు.

క. ఎక్కడఁ జూచినఁ దానై, యక్కజమగు కడిమికలిమి నరిసేనఁ గరం, బుక్కఱఁ దంత్రిపాలుం, డొక్కఁడ పాలియించె నీరణోత్సాహమునన్. విరా. 3-280

చ. మఱియు నరుండు సూతసుతు మర్మవిభేదన మాచరించిన, పెమ్మెయిఁ గులు గ్రమ్ము నమ్ముల విశిఖల ధైర్యము పేర్మి వాతఁ దు,క్కఱక పెనంగె కర్ణ. 3-304

3. గండుమీఱు

క. ఎఱుకలు గల కులశైలము, లెఱఁగు మెయిన్ రయము మెఱయ దివికి నెగసి కొట్టుఱుము జలధరము క్రియ ను,క్కఱి తద్వనమెల్ల నద్రువ నార్చుచు గడిమిన్. అర. 6-346

(ఈ యర్థమిక్కడ విచార్యము. ఉక్కు + అఱిలో 'అఱి'నకు అతిశయార్థము గానరాదు. 'ఉక్కు'పైన మత్వర్థకము 'అరి' చేరినదన నిచ్చట శకటరేఫమున్నది. లఘురేఫముగాఁ దీసికొనెదమన్న శకటరేఫముతోఁ బ్రాస నడచినది.

శ్లో స క్రోధోఽభ్యద్రవత్పక్షీ రావణం రాక్షసేశ్వరమ్
సం. భా. అర. 279-2 అని మూలము.

**ఉక్కలుఁడు** విశే.

బెట్టిదుఁడు, అసాధ్యుఁడు.

క. నలువురు పార్థుల నత్యు,జ్జ్వల శరవర్షముల ముంచి జలధరము, క్రియం, బెలుచన గర్జిల్లుచు ను,క్కలుఁడయి తన విక్రమంబుఁ గడఁకయుఁ జూపెన్. అర. 5-425

(ఉత్కల శబ్దభవమని సూ. అ. ని. 'మొక్కలుఁడు' అని కొన్ని ప్రతులు)

**ఉక్కాడు** దే. అ. క్రి. (√ఉక్కు)

బలము చూపు.

క. పెక్కంద్రతోడ నీరస, మొక్కతఱిన గొనక తఱఁగియున్న పగ

తుతో, నుక్కాడి బంధుభావముఁ, దక్కటి పగలయెడ వలయుఁ
దా నెఱపంగన్. శాంతి. 3-25

**ఉక్కివము** దే. వి.

మోసము, కపటము, కపటకృత్యము.

క. ఎక్కువ తక్కువ మాటలు, నుక్కివములు నెందుఁ గీడు లొందిం
చుటలుం, దెక్కు తన యన్నదమ్ముల, దిక్కుల నన్నియును సైఁపఁ
దేలము పేయున్. శాంతి. 2-359

ఆ. ఇట్టి కార్యమునకు నేనవశ్యంబును, వాదఁబడంగ నోప నుక్కివమున
సుతులతోడ నేలసుతులకు భేదంబు,సేయఁ గడఁగి తిదియుఁ జెట్ట
యనక. సభా. 2-180

విశే.

కపటము గలది.

క ఒకటి గలదు వత్తురు వేఁతోక గర్భంబునకు మృతులు నుక్కివ
మౌ వక్కకు నేటి బుద్ధి పీనుఁగు,నకు బ్రదుకలె గలుగునట్టి
నవ్వులు గలవే. శాంతి. 3-376

**ఉక్కివుఁడు** దే. విశే.

1. ఉక్కిడు, మూర్ఖుఁడు, బుద్ధిహీనుఁడు.

తే. సముచితములగు మాటలఁ జక్కఁబడక, తక్కనే నుక్కివుంతగు
ధార్తరాష్ట్రిఁ, గ్రూరతరముల నే నియ్యకోలువువాఁడ,నవని
కౌంతేయులకు నిచ్చునట్లుగాఁగ. ఉద్యో. 1-27

ఉ. అక్కట వాసుదేవు పను పాదరణంబునఁ జేయరైరి వీ,రెక్కడి
బుద్ధిమంతులని విందును నందును లోకమెల్లఁ జేరుకున్న బ్రమ్గు
టం దలఁపవొల్ల కపాయము నేసిరక్టె యీ, యుక్కివు లెందుమం
గలరె యొవ్వరువో ధృతరాష్ట్రినందనున్. ఉద్యో. 4-20

2. ఖలుఁడు, దుష్టుఁడు.

వ ...తవ త్ప్రతాపంబున నహుషునకుఁ బరాభవం బొనరించి నన్ను
రక్షింపక తక్కిన నుక్కివుండగు నతని పాపనిశ్చయంబున నాపద
వచ్చు. ఉద్యో. 1—174

**ఉక్కిస** దే. వి.

దగ్గు

క. ...వళీ, పలితంబులయ్యె వగరుసు, ఎలయేరును నుక్కిసయును దల
కొను దెంచెన్. ఆది. 8-191

**ఉక్కిడు** దే. వి. ఉక్కివుఁడు

మూర్ఖుఁడు.

ఉ. ఉక్కిని మనంబు గీడు పరికించుమె క్రొవ్విసఁ జేటు దప్పునే.
విరా. 8-7

**ఉక్కు** దే. వి.

1. ప్రతాపము. బలము.

ఉ. అక్కజమైన శౌర్యమును నద్భుత సంపదనొందు శక్తులం, ఉక్కని
మేనులున్ మొనకుఁజెల్వగు కైదువులు దగంగ నుక్కెక్కిన
యట్టి మేటి మగలించుక వారణశేఖరయుల్, వెక్కసమంద
నొచ్చియుఁ జలింపక పోరిరి పెక్కుతంగులన్. విరా. 8-168

క. చక్కనగుమనిన రక్కసుఁ, డక్కజముగఁ జెరిఁగి యియ్యయగు
నిప్పుడు నీ, యుక్కను లీరనుఁ జూచెదఁ, జిక్కన నిలుమనుచుఁ
గడు విజృంభించి పడిన్. ఆది. 6-208

2. గర్వము, పొగరు, మదము.

వ. విరోధివర్గం బుక్కుదక్కి వెక్కసపడి చూచుచుండ. విరా. 6-2

తే. పాండుపుత్రుల మాత్రకు భయము నాకు, నెక్కడిది వారి యుక్కు
మడఁతు. ఉద్యో. 4-216

3. పౌరుషము, పరాక్రమము.

క. ఉక్కును నస్త్రబలము మీ, కెక్కడియది పాలరైతి రిందఱు నని నీ,
యొక్కరుఁ గావఁగ మీరీ, తక్కువ కోర్చితిరి మిమ్ముఁ దక్కన
నేలా. ద్రోణ 2-266

4. అయస్సారము, కాచి శుభ్రముచేసిన యినుము.

వ. అభిమన్యుండు...అనేక యోధవీర విక్రమ సంకులంబునం, జిక్క

నడిఁ గుక్కు మ్రొక్కిన ట్లు నసుకి.

ద్రోణ 1-894; ఉద్యో. 2-178

**ఉక్కుతునియ** దే. వి.

ఉక్కు ముక్కవంటి వాఁడు, శూరుఁడు

గీ ద్రౌపదేయులు వాసుభద్రాసుతుండు. సుక్కుతునియలు గారె మి మ్మొక్కుమాఱ, నరుఁగొని యోర్పువాఁ డయి వచ్చు ధర్మ. పుత్రుఁ డిది నీకుఁ జూపంగఁ బోల దెట్లు. ఉద్యో 2-178

**ఉక్కుదక్కు** దే. అ. క్రి.

1. గర్వమడఁగు, మదమణఁగు.

వ ...విరోధి వర్గం బుక్కుదక్కి వెక్కసపడి చూచుచుండ

విరా. 5-2

2 నశించు, చెడు.

ఉ ఒప్పదె కూడి మన్కి మన కొప్పనివారల యుక్కుదక్కఁగన్.

ఉద్యో. 1-871

3. నిస్తేజమగు, బలహీనమగు.

(భీముఁడు) అక్కుమారసత్తకాఱ సమవర్తి సమీపంబున కనిచినం. దక్కటికుమారు లుక్కుదక్కి వెఱఁగుపడి యంతంత నొదిగిన

భీష్మ. 3-78

**ఉక్కుమడఁగు** దే. అ. క్రి.

1. చచ్చు, నశించు.

చ. ఉఱకవిరోధి సైన్యములు నుక్కుమడంగఁగ నుల్లసద్గతిం, బఱప రథ. ద్వపాళ్యములు పాండవమధ్యము తేరి వీథి యం,దఱవఱలై వడం గః. విరా. 5-61

2. మదమడఁగు, గర్వము చెడు, క్రొవ్వఱు.

వ. కౌంతేయాగ్రజుండు సైన్యసంతాన సమేతంబుగా నుఱవడించి భుజాటోపంబు చూపిన నవి (విరోధి సైన్యములు) మడిసియుఁ బడిసియుఁ జిక్కువడియు నుక్కుమడిఁగియు వెఱఁగుపడి చూచుచుండ. ద్రోణ. 5-98

**ఉక్కుమడఁచు** దే. స. క్రి. (√ఉక్కుమడఁగు)

1. చంపు, నాశనము చేయు.

ఆ. అని నివాత కవచు లను దానవుల నాఁతఁ డొక్కరుండ కాఁడె యుక్కుమడఁచె. విరా. 4-210

తే. (కర్ణుఁడు) పాండుపుత్రుల మాత్రకు భయము నాకు, నెక్కడిది ప్రేల్మిడిన వారి యుక్కుమడఁతు. ఉద్యో. 4-216

2. ప్రతాపమణఁగించు.

తే. నృపు లనేకులు నామీఁద నిగిడి రేను, ఉక్కువటిదెదఁ బాడుమీ యుక్కుమడిచి. భీష్మ. 3-11

**ఉక్కుమిగులు** దే. స. క్రి. (√ఉక్కు)

ప్రబలు, అతిశయిల్లు.

క. రెండు బలంబుల వారలు, నొండొరువులకంటెఁ జాల నుక్కుమిగిలి యొం,డొండ కడంగుచు మత్త్వ్యాల,చండస్థితి నొప్పి రపుడు జగతీనాథా. భీష్మ. 1-188

**ఉక్కుమీఱు** దే. అ. క్రి. (√ఉక్కు)

ఉక్కు మిగులు.

వ. సైంధవాది వసుంధరానతులం ద్రొక్కువడంజేసి యుక్కుమీఱిన మారుతియు. భీష్మ. 3-65

**ఉక్కుముట్టు** దే. స. క్రి. (√ఉక్కు)

ఉక్కు మిగులు.

సీ. ...ధృష్టకేతుండు సమర -తే- లంపటుండు శిఖండియు లావు వెరవుఁ గలరు నీయొడ్డ సమరశక్తి గలరు పాలఁ,దెంపు కల రుక్కుమట్టిన తెంపు గలరు, కోరి పతులుగఁ జేయు మహోహిణులకు. ఉద్యో. 4-109

**ఉక్కుమురియు** దే. అ. క్రి. (√ఉక్కు)

వ. అభిమన్యుండు.. అనేక యోధవీర విక్రమ సంకులంబునం ద్రొక్కువడి యుక్కు మరిసినట్లు సమసిన. ద్రోణ. 1-394

**ఉక్కుమెఱయు** దే. అ. క్రి. (√ఉక్కు)

గర్వము వెలిపఱచు, దర్పము అతిశయించు.

వ. సుషేణుండును నరిష్టుండును సుకేతుండును నుక్కుమెఱయ నొక్కటం దాఁకిన. విరా. 5-148

**ఉక్కుసెడు** దే. అ. క్రి. (√ఉక్కు)

బలము నశించు.

వ. శిశుపాల జరాసంధ శల్య కర్ణులు దర్పితులై తమతమ లావులు మెఱసి క్రమంబున నలువురు మాష యవ ముద్గ రోమ మాత్రంబులు దక్క గొనయం బెక్కించియు మోపెట్ట నశక్యంబయిన నుక్కుసెడి వెక్కస వారలం జూచి. ఆది. 7-178

**ఉక్కెక్కు** దే. అ. క్రి. (√ఉక్కు)

బలమతిశయించు.

ఉ. అక్కజమైన శౌర్యమును నద్భుతసంపద వొందు శత్రులుం, జిక్కని మేనులున్ మొనకుఁ జెల్వగు కైదువులుం దగంగ ను,క్కెక్కిన యట్టి కోటిమగ లించుక వారణలేక ఖేచరు,ల్వెక్కసమంద నొచ్చి యుఁ జలింపక పోరిరి పెక్కుభంగులన్. విరా. 3-168

**ఉక్కేడు** దే. అ. క్రి.

బలము చెడు.

శా. మేనుక్కేడి నీనందనుం,డెల్లం జూడఁగఁ దాఁటి యొండొక రథం బెక్కెం గురుగ్రామణీ. కర్ణ. 1-146

**ఉక్తము** సం. విశే. (అ. ఆ. అ.)

చెప్పఁబడినది.

వ. ఇట్లు పూర్వోక్త ప్రకారంబున. విరా. 1-178

సీ. ...సత్య,మన్నది గన్నది విన్నది యున్నరూ,పున నుక్తమగుట. అను. 5-181

**ఉక్తి** సం. వి. ఇ. స్త్రీ.

1 పలుకు, మాట.

క. చని పెడ వికసిల్లెడు వా,ననపద్మముతోడ ననిలనందనునకు నిట్ల

నియెఁ జతురోక్తిరీతి యుతని గూఢక్రోధవహ్ని దరికొల్పంగన్.
విరా. 2-270

2 వచనము.

వ. అట్లోయ లట్లు కెలన నేమతి సల్లాపంబులు సేయుచున్న యన్నర
నాథుని యారథికవరుల వచనంబులు విని పూర్వాపర్యాసంబు వలన
నయ్యుక్తి ప్రత్యుక్తుల పరిపాటి దేటపడిన నన్నిటిలో నీకొడుకు
డాఁగియుండుట నిశ్చయించి కల్య. 2-86; శాంతి. 4-156

3 వాక్యము.

వ. ఇందు దెలివొందునట్లుగా ధర్మార్థసమాధి యుక్తంబులగు నుక్తి
విశేషంబుల ననుగ్రహింపవలయు ననుటయు నద్దేవకీనందనునకు
దేవవ్రతుం డిట్లనియె. శాంతి. 2-117

ఉక్తుఁడు సం. విణ. (అ. అ. అ.)

అర్హుఁడు. తగినవాఁడు.

క. శౌర్యము సత్యంబును స్వాధ్యాయజ్ఞానమును భక్తితాత్పర్యము
గాంభీర్యముఁ గలిగినఁ గుడకుల,వర్య కులంబేల సిరికి వాఁడుక్తుఁ
డగున్. శాంతి. 3-99

సీ. ...ఊర్ధ్వలోకాధివాసమునకు వారుక్తులు.
అను. 5-425; కల్య. 2-328; శాంతి. 2-142, 302, 330

ఉక్థుఁడు సం. వి. అ. పుం.

అమోఘుని కొడుకు. చూ. అర. 5-169

ఉక్షము సం. వి. న్. పుం.

వృషభము, ఎద్దు.

సీ. అప్పురుషుం డింద్రుఁ డయ్యుక్ష మైరావతంబు. అది. 1-118, 98

ఉక్షధ్వజుఁడు సం. వి. అ. పుం.

శివుఁడు.

క. ...విరూపాక్షు మహోక్షధ్వజుఁ బ్రత్యక్షముగావించి మనుగతప
మున పేర్మిన్. అర. 3-49

**ఉగ్గడన** వై. వి. (సం. ఉద్ఘాటన)

ప్రకటనము, పైకిఁజెప్పుట.

నరల :- కొంక కు సద్గుణ కోటులెల్లను గోటికఁగుల నోలి నుగ్గడన
సేయుచు సత్యవ తునిఁ గానరే మునులార. అగ. 7-269

**ఉగ్గడించు** స. క్రి.

1 పలుకు.

సీ. ఉచితంబుగా నెటి నుగ్గడించిన మాట సభ యియ్యకొనమి
అను. 4-584

చ. అని యని యుగ్గడించు ధృతి యల్లలనాడికఁ దల్లడించు.
విరా. 2-31

ద. సమతము పేర్లు బిరుదు నుగ్గడించుచు నగ్గలిక నొంపునను.
ద్రోణ. 5-142

2. ప్రకటించు, తెలుపు, చెప్పు.

ఆ. అక్కుమారి చతురయగుట శిలండి వ. ర్తనమునెడఁ బ్రమాదమున
నెఱింగి, యుగ్గడింప నొల్ల కూరక యొఱుఁగనియదియపోలె నుండె
నాత్మ నొచ్చి. ఉద్యో 4-374

క. నగవుల లోఁబలి మాటలు, దగునే పెలి నుగ్గడింపఁ దనకేర్పడ నోం,
డ గడం బుట్టెఁ బలి విన నగునని చెప్పెడిదిగాక యూఱని తోడన్.
విరా. 1-180

వ. ఇట్లు దలఁచుటయును దివ్యజ్ఞాన మానీయుం డగు నమ్మునివరే
ణ్యుం డాక్షణంబ పొడసూపిన విదురుం డతని వచ్చుట యుగ్గడిం
చుచు వినయంబున నతని నెదుర్కొని వందనమస్కారంబు లాచ
రించి. ఉద్యో. 2-104

3. స్తుతించు, ప్రశంసించు.

సీ. ఒక్కొరువొండ ల వలనఁ బుట్టదుగదా కలకులందుఁ -తే- బుట్టి
నప్పుడు గాండీవిభుజ బలంబు, దలఁతురా భీమసేను గదావిహార,
ముగ్గడింతురె. ఉద్యో. 1-278

తే. సముచితంబుగఁ గూరలచంద ముగ్గడించి కుడుపు తెలుఁగు పుట్టించి

పలుకు నా సుయోధనుతో. ఉద్యో. 3-214

4. ప్రస్తావించు.

వ. అతనిచేత మున్ను చావకయున్న ప్రతర్దనాదుల నుగ్గడించి. శాంతి. 2-84

**ఉగ్గడువు** విణ.

అధికము, ఎక్కువ.

క. నడురేయి తీవ్రతాముఁడు, పుడమి వెలసెనను తలంపు పుట్టించుచు
నుగ్గడువగు తేజంబున వెలిఁగెడుఁ గర్ణుఁడు శాతశరములు గిరి
కొన దెసలన్. ద్రోణ. 5-195

**ఉగ్మలి** దే. వి.

ఆఁడుది, స్త్రీ

క. చిడిముడి పడుచు నెదురుపనఁ, గడగుచు హారములు చక్కఁగాఁ
దోఁచుచు మల్లడిగొనుచు దుర్విలాసం, బొదలిక వొడగూర్చుచుండ
నుగ్మలి యంతన్. విరా. 2-114

**ఉగ్రకుఁడు** సం. వి. అ. పుం.

కద్రువ కొడుకు, ఒక నాగముఖ్యుఁడు.

వ. కద్రూగర్భాండంబులు తరతరంబ యవిసిన నందు శేష...తక్షకార్కో
కోగ్రక కలశ పోతక.....మహోదరు లాదిగాఁగల వేవురు నాగ
ముఖ్యులు పుట్టిన. ఆది 2-4

**ఉగ్రత** సం. వి. ఆ. స్త్రీ.

1. క్రోధము.

శా. ...ఆలోమ న్నిశ్చింతుండై సతిశీలు వట్టికొని చౌర్చిన భీముఁ
డత్యుగ్రతన్. విరా. 2-327

2. భయంకరత్వము

ఉ ...వార్తకున్, మూందఱఁ బోయి గోధనము మట్టుకొనన్ వల
యున్ మహోగ్రతన్. విరా. 3-126

చ. మనుగడ దప్పువాక్కొ మునిమాటలు గైకొనవై తి నాటలంబున

నది యెంత యుగ్రత మహాబలురాకకు నోర్వఁగాల.

శాంతి. 3-394; కర్ణ. 3-229

ఉగ్రమయూఖుఁడు సం. వి. అ. పుం.

ఉ. విగ్రహ మేది నన్ను ధరణీవర రూపము వెల్వరించువాఁ, డుగ్రమయూఖ పాత్యముగ మన్నత దక్షిణపాణిఁజేసి ధూ,పాగ్రణి వాదు దక్షిణ కరాబ్జము పట్టెరి.

ఆది. 8-160

ఉగ్రము సం. విశ. (అ. ఆ. అ.)

1. భయంకరమైనది, క్రూరమైనది.

ఉ. అదియునుగాక కోలుపులినైనను గారెనుపోతునైన నున్మదకరినైన నుగ్రమృగనాథునినైనను గిట్టిముట్టి తె,ట్టదముగఁ గాలఁ గేలను గడిఁది మగంటిమి యుల్లసిల్లఁ బట్టుదు.

విరా. 1-88

2. ఉత్కటమైనది, మిక్కుటమైనది.

లయవిభాతి- అరయ నిది పెద్ద యని పరుల మొనఁ జిత్తమున, నరకు గొనకుగ్రమగు బరవసమెలర్ప.

త్రి. 2-72; ఉద్యో. 4-262

3. తీక్ష్ణమైన శక్తిగలది.

చూ. ఉగ్రమయూఖుఁడు.

ఆది. 8-160

4. దీర్ఘము, నిడుదయైనది.

చూ. ఉగ్రశ్రవుఁడు

స్వర్గ. 77

ఉగ్రశ్రవసుఁడు సం. వి. స్. పుం.

సూతుఁడు, రోమహర్షణుని కొడుకు

సీ. నైమిశారణ్య పుణ్యక్షేత్రమునఁ గుల,పతి శౌనకుండను పరమమౌని,...ద్వాదశ వార్షికోత్తమ సత్రయాగంబు, మొగిఁ జేయుచున్న నమ్మునుల కడకు, వచ్చి తాముగ్రశ్రవసుఁడను సూతుఁడు, రౌమహర్షణి సుపౌరాణికుండు -అ- పరమభక్తితోడఁ బ్రణమిల్లి యున్న సత్కథకు వలన మునినికాయమెల్ల, వివిధ పుణ్యకథలు వినువేడ్క నతనిఁ బూ,జించి రపరిమిత విశేషవిధుల -వ- అక్కథకుండు వెండియు నమ్ముని సంఘంబునకు నమస్కారంబు సేసి

యనేక పురాణ పుణ్యకథా కథనచతురుండు వ్యాసశిష్యుండైన రోమ
హర్షణునకుఁ బుత్రుండు వానిలోఁ బెక్కుకథ వినవలతురనిన నమ్మౌని
లిట్లని చెప్పసాగె. చూ. ఉగ్రశ్రవుఁడు. ఆది. 1-27, 28

**ఉగ్రశ్రవుఁడు** సం. వి. అ. పుం.

1. సూతుని పుత్రుఁడు, రోమహర్షణుఁడు.

వ. సర్పయాగ సమయంబునఁ బ్రవృత్తంబైన మహాభారతంబంతయుఁ విన్న
ఖ్యాతుండై రోమహర్షణ నామధేయుండును సాత్వతేయ
శిష్యుండును బండిత ప్రియుండును నగు సూతుపుత్రుండైన
యుగ్రశ్రవుఁ డనుయొక కథకుండు సమ్యగ్విపులకథాకథనుండు నాకర్ణిం
చిన వాఁడగుటను సమాశ్రితసత్వుండై యాత్మప్రవృత్తద్వైపా
యనను సమగ్రపాఠంబునఁ దివ్యకథా శ్రవణ విశారదుండై
యుండు నైమిశారణ్య పుణ్యక్షేత్రంబునందు శౌనకుం
డను కులపతి...సత్త్రయాగం బాచరించుచుండ.

క. అమ్మహాత్ముల కలవిశదముగాఁ సమ్మహాకథ సెప్పెన్.

స్వర్గ. 71-78

"ఉగ్రౌ సింహస్య శ్రవసీ ఇవ శ్రవసీ యస్య సః — ఉగ్రశ్రవాః"
(ఉగ్రుడైన సింహము చెవులవంటి చెవులు గలవాఁడు ఉగ్రశ్రవుఁడు -
లేక ఉగ్రశ్రవసుఁడు)

ఆదిపర్వమునఁ జెప్పిన దానికిని (చూ. ఉగ్రశ్రవసుఁడు) స్వర్గా
రోహణ పర్వమునఁ జెప్పిన దీనికి భేదము గానఁబడుచున్నది. ఆదిపర్వ
మున శౌనకాదులకు సూతుఁడను రోమహర్షుని పుత్రుఁడును నగు ఉగ్ర
శ్రవసుఁడు భారతము వినిపించినట్లుండెను. స్వర్గారోహణ పర్వమున
సూతుని పుత్రుఁడును రోమహర్షణ నామధేయుండును నగు ఉగ్రశ్రవుఁడు
శౌనకాదిమునులకు భారతము వినిపించినట్లుండెను. దీనింబట్టి ఉగ్రశ్రవ
సుఁడు, ఉగ్రశ్రవుఁడు ఒక్కఁడే యని తెలుచున్నది. కాని ఉగ్రశ్రవసుండు
రోమహర్షుని పుత్రుఁడు సూతుఁ డనువాఁడు (చూ. ఉగ్రశ్రవసుఁడు)
ఉగ్రశ్రవుఁడు సూతపుత్రుఁడు రోమహర్షణుఁడే. ఇవి పరస్పర విరుద్ధ
ములు - సంస్కృత భారతమున ఆదిపర్వమందు.

రోమహర్షణ పుత్ర ఉగ్రశ్రవాస్సౌతిః పౌరాణికో నైమిశారణ్యే శౌనకస్య కులపతేర్ద్వాదశవార్షికే సత్రే వర్తమానే- ఋషీనభ్యాగతా నుపతస్థే పౌరాణికః పురా సౌతిశ్రవాః- సకృతాంజలి స్తానువాచ.

సం. భా. ఆది. 8-1 అని గలదు.

స్వర్గారోహణ పర్వమున తిక్కన కవీంద్రుని పాఠమునకు ఆధారము గానరాదు.

సూ. ర. నిఘంటువునందు ఉగ్రశ్రవసుఁడు, ఉగ్రశ్రవుఁడు ఒక్కరే యనియు నితఁడు సూతుని కొడుకు రోమహర్షణుఁడనియుఁ గలదు. ఎట్లో తెలియకున్నది.

2. కురుకుమారుఁడు - ధృతరాష్ట్రుని కొడుకు. చూ. ఆది. 6-107

ఇతఁడు ద్రోణుని నాలవనాఁటి యుద్ధమున భీమునిచేఁ జచ్చెను.

**ఉగ్రసేనుఁడు** సం. వి. అ. పుం.

1. కంసుని తండ్రి స్వర్భానుని యంశమునఁ బుట్టినవాఁడు.

వ. స్వర్భాను డుగ్రసేనుండై పుట్టె. ఆది. 8-80

2. పరీక్షిత్తు కొడుకు, జనమేజయుని తమ్ముఁడు.

వ. జనమేజయుని తమ్ములు శ్రుతసేనుఁడును భీమసేనుఁడును నుగ్రసేనుండును ననువారలు. ఆది 1-58

3. మునికిఁ గశ్యపునకుఁ బుట్టినవాఁడు, గంధర్వుఁడు.

దక్షుని కూఁతురు ముని, ఆమె కశ్యపుని భార్య. చూ. ఆది 3-61

వ. మునియను దానికి భీమసేనోగ్రసేనాదులయిన గంధర్వులు పదార్వురు పుట్టిరి ఆది. 3-65

4 కురుకుమారుఁడు, ధృతరాష్ట్రుఁడు. చూ. ఆది. 6-107

ఇతఁడు పదునెనిమిదవనాఁటి భారత యుద్ధమున భీమునిచేఁ జచ్చెను.

**ఉగ్రాయుధుఁడు** సం. వి. అ. పుం.

1. పాంచాల కుమారుఁడు.

వ. లట్టియెడఁ బాంచాల కుమారులు వ్యాఘ్రకేతు సుశర్మ శుక్ల చిత్రోగ్రాయుధులును జయరోచమాన సింహసేనులును జలుదేరుల

మొత్తంబుతోఁ దమ్ముం గవిసినం గర్ణుం డయ్యేవమం|డవీరుల నెని
మిది భల్లంబులం దునిమి. కర్ణ. 2-272

2. ధృతరాష్ట్రుని కొడుకు, కురుకుమారుఁడు. చూ. ఆది. 5-107

ఇతఁడు భీమునిచేఁ జచ్చెను.

**ఉగ్రుఁడు** సం. వి. అ. పుం.

1. శివుఁడు.

ఆ. ధృష్టద్యుమ్నుఁ డుగ్రతేజుఁ డవికి నుగ్రునట్ల. ఉద్యో. 4-262

2. కురుకుమారుఁడు ధృతరాష్ట్రుని కొడుకు. చూ. ఆది. 5-107

భీష్మని చతుర్థదివస యుద్ధమున భీమునిచేఁ జచ్చెను. భీష్మ. 2-286

3. ఏకాదశ రుద్రులలో నొకఁడు.

తరువోజ. ...ఉగ్రుఁ డన విశ్వరూపుఁ డనఁ జెర్చి యా రుద్రు లర్చితు
లైరి. అను. 8-58

విశే. (అ. ఆ. అ.)

4. భయంకరుఁడు.

తే. ఉగ్రుఁడై దుస్ససేనుని యురము వ్రచ్చి, రుధిర ముగ్రతఁ ద్రావు
మరుత్తనూజు. కర్ణ. 3-229; విరా. 5-15

**ఉచథ్యుఁడు** సం. వి. అ. పుం.

అంగిరసుని వంశమువాఁడు.

తే. అంగిరస వంశసంభవుం డగు నుచథ్యుఁ, గోరి వింవుత్రి సోముఁడు
గారవమున నిచ్చె. అను. 5-340

**ఉచితపరుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

నీతి గలవాఁడు.

వ. ఉచితపరులగు నరపతులు దొలుతఁ జెప్పినవారిక సహాయత్వంబుఁ
జేయఁజూతురు. ఉద్యో. 1-37

**ఉచితత్వము** సం. వి. అ. న.

ఔచిత్యము.

వ కయ్యంపు టుచితత్వంబునం గలదె. కర్ణ. 2-317

**ఉచితము** సం. విశే. (అ. ఆ. అ.)

1. తగినది, యుక్తము.

వ. మఱియు నవసరోచితంబులగు వినోదంబులం బ్రమోదంబు పుట్టిం చుచు. విరా. 1-78; విరా. 4-204

2. విధింపఁబడినది, నియమింపఁబడినది.

వ. అనినఁ బాంచాలి సుదేష్ణ మందిరంబునం దా మచితాచరణంబున నునికియు. విరా. 2-274

3. న్యాయమైనది, నైతికము.

అ. అనుడు నతని కిట్లు లనుఁ బాండవాగ్రజుం డింద్రతనయుఁ డుచిత మెఱిఁగి పలికె. విరా. 5-365; ఆది. 8-14

4. సమంజసము.

చ. అనుడు విషణ్ణమైన హృదయంబున గారవ మొంద నైపుణంబున నుచితంబుమై నరసి. విరా. 1-248

5. ఒప్పిదము.

క. ...ఇ, ట్లనియెం బాంచాలి యుచితమగు చందమునన్.

విరా. 1—104

6. హితము.

తే. నీవు ధృతరాష్ట్రితో ధర్మనిష్ఠమైన, యుచిత మాడిన నందుఁ బో టొడ్డియున్న, దొరల భృత్యుల మనములు దిరుగఁబడవె.

ఉద్యో. 1-57

**ఉచ్చము** సం. విశే. (అ. ఆ. అ.)

1. ఉన్నతము, ఎత్తైనది.

వ. కనకమయోచ్చాసనంబున నున్న వ్యాసభట్టారకు. ఆది. 3-4

2. పెద్దది, బిగ్గఱయైనది.

మ. ...అత్యుచ్చ భైరవ హుంకార రవంబునన్ వియదగారంబెల్ల భేదిల్ల. ఆది. 6-18

**ఉచ్ఛ్రయము** సం. వి. అ. పుం.

సమూహము.

క. ...బ్రహ్మయ్యము గురుని బలముతో, నయ్యె యుధిష్ఠిరబలోచ్ఛ్రయంబున కధిపా. ద్రోణ. 3-287

**ఉచ్ఛ్రరణము** సం. వి. అ. న.

ఉచ్చరించుట, నోటఁబలుకుట.

క. సమర్థ పుణ్యాభిధాన సకృదుచ్చరణా. ఉద్యో. 4-427

**ఉచ్ఛ్రరించు** సం. స. క్రి.

వాక్రుచ్చు, పలుకు, చెప్పు.

క. కురుకుల విభుఁడగు ధర్మస్థిరమతి యగు నితఁ డనుచు ధృతిఁజేసి యుధిష్ఠిరుఁ డను నామముఁ దా నుచ్చరించె నాకాశవాణి జన వినుతముగాన్. ఆది. 5-97

**ఉచ్ఛ్రరితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉచ్చరింపఁబడినది, పలుకఁబడినది.

చ. ...అర్జునుఁ బోలఁగ నెవ్వ రెందు లే, రను జనఘోష ముచ్చరిత మయ్యె. ఆది. 6-95

**ఉచ్చారణము** సం. వి. అ. న.

ఉచ్చరించుట, పలుకుట.

వ. ...శంకరు దర్శించి సప్రణవోచ్చారణంబుగా దండప్రణామంబు లాచరించి. ద్రోణ. 2-368

**ఉచ్చిచను** దే. అ. క్రి.

ఉచ్చిపోవు. చూ. ఉచ్చిపోవు.

ఉ. ...అప్రతిహతాన్వయాగ్రగణ్యుం డదరించు వారసము లుచ్చిచనంగ. భీష్మ. 2-55

**ఉచ్చిపోవు** దే. అ. క్రి.

1. దిగఁబడి పైకి వెడలు.

క. తన దృష్టియు ముష్టియుఁ దగు, ననువున ముష్టి త్రి యేయుతనఁ

దప్పుడు డించిన కాయముల సపాటంబునఁ బదియుఁ బదేను మచ్చి
పోయెం గోలల్. విరా. 5-82; సౌస. 88

2. వాటుకొను, విచ్చిపోవు, విడిపోవు.

మ. ...మాయల్ పన్ను నేర్పింకఁ జెల్లదు మా నీకని యా సుయోధ
మని యుల్లం బుచ్చిపో వాడుమీ. ఉద్యో. 3-97

3. భేదిల్లు, చీలు.

తే. అలిగి యాతండు గడవైచి యక్కుమారు, ఘోటకంబుల సూతుని
గూల్చె నదియు, పట్టుకొనివైచె మగుడ నప్పాండుపౌత్రు,చేయి
వడి నుచ్చిపోవ నచ్చిత్రుఁ డధిప. కర్ణ. 1-69

"నిర్భిద్య దక్షిణం బాహుం, నిపపాత మహీతలే."

సం. భా. కర్ణ. 15-30

ఉచ్చు దే. అ. క్రి.

[దీనికి 'చను', 'పోవు – అను గమనార్థక ధాతువు లనుప్రయుక్తము లయిన ప్రయోగములే యెక్కువగాఁ గన్పించుచున్నవి. శ. ప. ప్రకోశమువారు భీష్మ. 3-489 (అది. 481) విరా. 3-162 క్రింద 'ఉచ్చి' యని ప్రయోగమిచ్చియున్నారు. భీష్మ. 3-481 లో 'ఉచ్చి'యను పాఠము గనఁబడుచున్నది 'ఉచ్చి' పాఠాంతరముగాఁ గూడ సం.మువ. కానరాదు. విరా. 3-162 లో వీరిచ్చిన ప్రయోగమునకు మాఱుగా "ఇరుమెయిఁ దొలిచి వెట్టిలఁ దూఱు నవియును'– అని ఆనంద, సం.ము. అకాడమి ప్రతులలోఁ గానవచ్చుచున్నది.]

1. దిగఁబడి వెడలు. చూ. ఉచ్చిపోవు[1].

2. వాటుకొను, విచ్చిపోవు, విడిపోవు. చూ. ఉచ్చిపోవు[2].

3. భేదిల్లు, చీలు. చూ. ఉచ్చిపోవు[3].

4. పైకివచ్చు, ఉద్గతమగు.

మ. మును పౌరభ్యము నివ్వటిల్లఁగ మహామోదంబునం దేఁటు లల్లిన
రొలిన్ వెడలంగ రేకులు సముల్లాసంబునన్ బిఱ్ఱమెక్కనయం
బెక్కుచు గ్రద్దె పొం దెడలి పీఁకం గేసరంబుల్ గడల్కొనఁ

కోడ్కొమధువుచ్చి చేరెలమిఁ గొల్పుం జెంది సంభోజముల్.
ఉద్యో. 2-110

(వుచ్చి, వుబ్బ- అనునవి పాఠాంతరములు- తి. వ. ప్ర. కోశము వారు ఈ పాఠ మీయలేదుగాని 'ఉబ్బ' క్రిందఁ బాఠాంతరము గుర్తుతో నిచ్చినారు.)

తే. ...కుంభజుండు గోపించి దొడ్డ,నారసం బేయ నమ్మశ్వత్థామ తనయు నురము వడిఁ గాడి వీఁపున నుచ్చిపోయె. భీష్మ. 3-19

స. క్రి.
భేదించు, చీల్చు.

వ. అవ్వీరవరు నారాచాది నానావిధ విశిఖ వ్రాతంబులు హేతిసంఘట్టనంబున మండుచుఁ గరుల నుచ్చిపోవుచుఁ దేరుల విఱుచుచు.
ద్రోణ. 2-18

**ఉచ్చైర్నాదము** సం. వి. అ. పుం.
పెద్ద ధ్వని.

క. పాదంబులు వెట్టుడుఁ ద,త్పాదప ఘనశాఖ విఱిగి బల్లన నుచ్చై,ర్నాదమున దిక్కు లద్రువఁగ, భేదిల్లె విహంగతతులు భీతిం బఱవన్. ఆది. 2-72

**ఉచ్చైశ్శ్రవము** సం. వి. స్. పుం.
ఇంద్రుని గుఱ్ఱము.

తే. జన్మవేళన యాతఁ డుచ్చైశ్శ్రవంబు, భంగి హేషించెఁ బృథివి గంపంబు నొంద,నప్పు డతని కశ్వత్థామ యని యొసఁగె, వేరు జనములు విన నశరీరవాణి. ద్రోణ. 5-349

**ఉచ్ఛిఖుఁడు** సం. వి. అ. పుం.
తక్షక కులమునఁ బుట్టినవాఁడు.

వ. పుచ్ఛాండక.....రణేభకోచ్ఛిఖ శరభ.....మహాహన్వాదులయిన తక్షకకులసంభవులును. ఆది. 2-212

**ఉచ్ఛిష్టము** సం. విశ. (అ. ఆ. అ.)
భుజింపఁగా మిగిలినది.

వ. అని తారతమ్య జ్ఞానహీనులగు నయ్యల్పబుద్ధులు చెప్పిన మచ్ఛిష్ట దర్శితం బగునదియును (కాక) కర్ణ. 2-57

వ. తొల్లి నాలాయనియైన ఇంద్రసేనయనం బరఁగిన పరమపతివ్రత మౌద్గల్యుండను మహామునికి భార్యయయి కర్మవశంబున నమ్ము నిం గుష్ఠవ్యాధిబాధిత త్వగస్థిభూత శరీరు వయోవృద్ధు...విశీర్య మాణ నఖత్వచుం బరమభక్తి నారాధించి తదుచ్ఛిష్టంబు కుడుచు చున్న.

తే కుడుచువెళ వాని పెనువ్రేలు కూటిలోన, దునిసిపడియున్న వ్రేల్ పుచ్చి తోయజాతి, యేవగింపక యుచ్ఛిష్ట మిష్టలీలఁ, దగిలికుడుచు చున్నంత నత్తరుణిఁ జూచి. ఆది. 7-255; 256; అర, 2-120

**ఉచ్ఛేదము** సం. వి. అ. పుం.

1. భేదించుట, చీల్చుట.

మ. ఘనపజాహతులం బ్రకాండ పరిఘా పాతంబులం దీవ్రశాత నఖోచ్ఛేదములం బ్రదీప్త శరవేగ క్రీడలం...శక్తిగేంద్ర నిశాచేం ద్రుంబోరు సాధన సమర్థ్యమూర్తి నొప్పెం గడున్. అర. 6-347

2. నాశనము చేయుట, సంహోరపఱచుట.

క. లోకోచ్ఛేదముఁ గర్మ,వ్యాకులతయుఁ గాక యుండవలయుటకై సు,శ్లోకా చతురాశ్రమములుఁ, గైకొని నడపిరి దృఢంబుగాఁ బూర్వములమల్. శాంతి. 6-278

**ఉచ్ఛ్రితము** సం. విశ. (అ. ఆ. అ.)

1. పలుకెత్తఁబడినది.

ఉ. ...చటుల వేగసముచ్ఛ్రిత పుచ్ఛగుచ్ఛ వి,స్ఫోటిత దిగ్విభాగుఁ డగుచుం జనుదెంచె సుషేణుఁ డత్తటిన్. అర. 7-37

2. ఎత్తైనది, మీఁదికిఁబోయినది.

చ. అతులితమై ద్వితీయ కనకాద్రియొకో యిది నా నిజాంగ ముచ్ఛ్రి తముగఁ బెంచి పుచ్ఛమువఁజేసి దిగంతములందుమన్న యమ్మన్నతిఁ గపినాథుఁ జూచి కురునందనుఁడు. అర. 8-348

**ఉజ్జగించు** స. క్రి.

విడుచు, త్యజించు, విసర్జించు

సీ. ...పోర నన్నార్తి యెపుడుఁ, జెప్పుదు రేను వాచేయునంతయుఁ
జేసితి నింక నిశ్చింతవృత్తి, నుగతికిఁ జనఁగోరి తగ నుజ్జగించెద, శా
స్త్రాసనంబును బాణములును - తే- దెలివి గలిగి మనుం డని పలికి
(ద్రోణుఁడు) ద్రోణ. 5-322

తే. లజ్జ పాటించి మది వెఱ యుజ్జగించి, రయము మెఱయ నప్పాం
చాల రాజసుతుఁడు. శల్య. 1-320; శాంతి 1-191

**ఉజ్జానకము** సం. వి. అ. న.

ఒకానొక తీర్థస్థానము.

వ. అర్ష్టిషేణాశ్రమంబున నుజ్జానకస్నాతుండై మర్త్యుం డఖిల పాపం
బులం దొఱంగు. అను. 2-88

**ఉజ్జ్వలత్** సం. శత్ర.

దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.

ప్రకాశించుచున్న.

క. ధృష్టద్యుమ్నుఁడు నుజ్జ్వల, దష్టాపదపుంఖ మార్గణావళి నయ్యు,
త్కృష్ట గజఘటలఁ గలఁచె. భీష్మ. 2-210

**ఉజ్జ్వలత** సం. వి. ఆ. స్త్రీ.

ప్రకాశము, కాంతి.

క. కల్పిత దృఢ చతురంగా, నల్పంబై గండుమిగిలి యాదవ బల
మ్మాకల్పోజ్జ్వలతఁ గొలువ నవి, కల్పుఁడు కృతవర్మ సనియె
గాఢస్ఫూర్తిన్. భీష్మ. 1-90

**ఉజ్జ్వలత్వము** సం. వి. అ. న.

ప్రకాశము, కాంతి.

తే. గంధకారి వేషంబు కతన మూర్తి, యుజ్జ్వలత్వంబు మఱువడి
యుండఁ బాండుతనయ మహిమ. విరా. 1-294; శాంతి. 5-15

**ఉజ్జ్వలము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశించునది.

చ. క ప్పగు మృదుమౌళి ముజ్జ్వలనఖాంకురశేష్ట యొనర్పు నెమ్మలిన్.
విరా. 1-247; విరా. 4-118

సీ. ఉరగంబుఁ దునిమి వే మరలి కర్ణునిమీఁదఁ. బదియేఁ బం[డెం]డుము బటుశరములు, విగిడించి యుజ్జ్వలంబగు దొడ్డవారసం బేసిన.
కర్ణ. 3-331

**ఉజ్జ్వలితము** సం. విశే. (అ. ఆ. అ.)
వెలిగింపఁబడినది, జ్వలింపఁజేయఁబడినది.

క. ఉన్నతకరదీప నికర ముజ్జ్వలితముగాన్. ద్రోణ. 5-148

**ఉజ్జ్వలుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. ప్రకాశించువాఁడు.

వ. వెడలి వివిధ వాహనారూఢులయి పౌరు లప్పూరువంశవరు నమగ మించి రిత్తెఱంగున మెఱయు మహిమ నుజ్జ్వలుం డగుచుం జని భాగీరథి యుత్తరించి పాండవోత్తముండు కురుక్షేత్రంబు ప్రవేశించి చనుచుండి. ఆశ్ర. 2-80; ఆశ్వ. 4-272; కర్ణ. 1-268

తే. ...మార్తాండు మాడ్కిఁ జూడ నుజ్జ్వలుఁ డగుచు నర్జునుఁడు వొలిచె. విరా. 4-254

2. శౌర్యము గలవాఁడు.

క. విను మవమానము వడి యిట్లునికిఁ బదయు పొగడు కంటె నుజ్జ్వలులై మార్కొనినది లెస్స యెట్లయినను వీరికిఁ బోటు మేలు వాకుం జూడన్. ఉద్యో. 1-342

3. పెంపొందువాఁడు.

ఆ. పుత్రమిత్ర బంధు భూరి సేవా సమన్వితముగాఁగఁ గొలిచి నిన్ను రాజ్యభార వాహనమునకుఁ బట్టంబుఁగట్ట నుజ్జ్వలుఁడ వగుదు రమ్ము వారికడకు (శ్రీకృష్ణుఁడు కర్ణునితో ననిన మాటలు)
ఉద్యో. 4-29

**ఉజ్ఝితము** సం. విశే. (అ. ఆ. అ.)
విడువఁబడినది.

వ. ప్రేతపత్త్రమభూతోజ్ఝితంబైన యాపానభూభాగంబు నమకరించు.

కురుక్షేత్రంబు. శాంతి. 2-84

**ఉట్టు** దే. అ. క్రి.

కాఱు, స్రవించు.

ఆ. ఆర్చి నెత్తు రుట్ట నమ్మస్తకము వట్టి, కొని యతం డుదాత్తఘోర భంగి. ద్రోణ. 5-205

చ. అరిపయి వీఁక నెత్తి చనునప్పుడుఁ దేనియ లుట్టునట్లుగా, నరపతి వానివారలు వినం బ్రియమాడుట మేలు. శాంతి. 3-21

**ఉడించు** దే. స. క్రి.

క్రుంగునట్లుఁజేయు, అణఁగించు.

క. తన దృష్టియు ముష్టియుఁ దగు,నమువున మున్నెత్తి యేయ నతఁ డప్పుడు డిం,చిన కాయము సపాటం,బునఁ బదియుఁ బదేను నుచ్చి పోయెం గోలన్. విరా. 5-82

అప్పుడు + ఉడించిన - అని ఆనందవారి పాఠము

ఉడించు శబ్దము నిఘంటువులఁ గానరాదు. అవుడు + డించిన అని విడదీయుట సమంజసమని తోఁచెడిని. చూ. డించు.

**ఉడికించు** దే. స. క్రి. (√ఉడుకు)

1. కోపము వచ్చునట్లు చేయు.

క. రిత్తయుపచారముల నే, మత్తముఁ దగు ధర్మతనయు నుడికించితి దుర్వృత్తులగు మత్సుతులకును, మిత్తియగుం ఘోర వగలు మిగులకయున్నే. ఉద్యో. 2-82

క. సమరమునకుఁ బరికొల్పుచు, మముఁ దలఁచిన మల్లికట్టు మాటలఁ దచ్చిత్తము లుడికించుచుఁ బాండవ, సమితిం గడగించువా రచట నెవ్వరొకో. ఉద్యో. 2-242

2. మనోవ్యథ పొందునట్లు చేయు, అంతస్తాప మొందఁజేయు.

క. పాంచాలురుఁ బాండవులు న్మదంచిత గర్వమున నవిరిఁ దఱిమి యొడలు మం,డించుచు నుండఁగ నిట్లుడి,కించెద వొకవలన నీవుఁ గీడు పలుకులన్. ద్రోణ. 5-35

(ద్రౌపది యుధిష్ఠిరునితో) సీ. ...అరిగణంబుఁ -తే- ద్రుంచి రాజ్యంబు
సేకొంటి తొలఁగిపోదుఁ, గాక యని యిప్పు డుడిగింప నీకుఁ దగునె
శాంతి. 1-89

శ్లో. కథమద్య పునర్వీర వినివర్తసి మానసం. సం. భా. శాంతి. 14-12

**ఉడిగించు** దే. స. క్రి. (√ఉడుగు)

ఉడుగఁజేయు.

1. మానిపించు, ఆఁపు.

క. భగదత్తు నేనుఁ గడరిన, వెగడునఁ బాండవుల మొనలు విఱుగు
టయు మహానగ మేటి వేగ మాఁగిన పగిది ఘటోత్కచుఁడు దాని
పరు వుడిగించెన్. భీష్మ. 3-85

2 విడుచు, తొలఁగఁద్రోయు.

సీ. నిముఁ బ్రజాసంహారమునకునై కల్పించి, వాఁడఁ గావున నీ మనంబు
నందుఁ, జోదము విచారంబు నుడిగింపుము. ద్రోణ 2-170

3. అణఁచు.

ఉ. ...వానినెల్లఁ బ్రగల్భించెన నీమదాంధ్య ముడిగించెద నిప్పుడ
శాలు ప్రోలి కేఁగించెద. ఆది. 6-294

**ఉడిగిమడుఁగు; ఉడిగిమడఁగు** దే. అ. క్రి.

అణఁగిమణఁగు.

క. వనమున ఫలమూలంబులు, దిని మునినై యుండఁగాక ధీరోద్ధతిమై,
ననిసేయ నీకు వచ్చునె. చను మచటికి నుడిగిమడిఁగి శాంతుఁడ
పోలెన్. (ఉడిఁగి మడఁగి - అని సం.ము) ద్రోణ. 4-241

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టు లనియె నీవత్సర, మొకఁడు నెట్టులయిన
నుడిగి మడిఁగి, సంకటముల నోర్చి చరియించి యాపద, నిస్తరించి
పిదప నెగడవలయు. విరా. 1-148

2. ఉపరతమగు, వ్యాపారము లడఁగు, నశించు.

తే. ఉపరతంబైన మనసుతో నుడిగి మడఁగు, నింద్రియములు పరమ
మొందెనేని దాన, మనసు మగుడదు విషయతృష్ణన చరించు.
శాంతి. 6-86

3. ప్రాణములు దక్కించుకొను, పాఱిపోవు.

(ద్రోణుఁడు దుర్యోధనునితో) క. ఏమి యువరాజ విభునకు, నేమమె సైంధవుని నేమిసేసె నరుఁడు నీ, వేమిటి కిట్లీ రథిక, స్తోమముతో విఱిగి తెందుఁ, బొంచ్చెద వింకన్.

క. అడుకులు దిన్నట్లగునే, కడుపునఁ గుట్టెత్తినపుడు గడుఁ బిఱిచితి వాఁ, డొడ తెలియఁగక పాండుసుతుల, నుడిగి మడుఁగ వలసె నిప్పు డొక సాత్యకిచేన్. ద్రోణ. 4-88, 89

**ఉడిచికొను** దే. అ. క్రి.

ఉపసంహరించుకొను, మరలించు.

కి. ధరణీ దిశాప్రసారిత, గురుకర నికరంబు లుడిచికొని దీర్ఘనిరం, తరగతి తిన్నఁడ పోలెను, హరిదశ్వుఁడు విశ్రమించె వస్త్రాద్రి దరిన్. ఆది. 6-174

**ఉడిపికొను** దే. స. క్రి.

మాన్పుకొను, పోఁగొట్టుకొను.

వ. అని వితర్కించుచుం గిరీటి యురియాడు చిత్తంబు మత్తలం బుడిపికొని నిశ్చయించి. విరా. 1-161; అశ్వ. 1-99; భీష్మ. 2-162

**ఉడివించు** దే. స. క్రి.

1. మానిపించు, ఆఁపు.

ఉ. ...మహోగ్రవ్రతమత సర్పయాగ ముడివింపుము నావుమ సర్పసంహతిన్. ఆది. 2-230

2. అణఁచు.

ఉ. వింతయె కాముశక్తి యుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్. ఆది. 7-58

**ఉడివోక** దే. వి.

విరమించుట, ఆఁగుట.

ఉ మండుచు వచ్చు దానిఁ బది మార్గణముల్ గొని వేగమొప్ప నా, ఖండల నందనుండు గడికండలు సేసినఁ జూచి యవ్వ డాతం బుడి

వోక లేక సమరంబున ఖడ్గము ఖేటకంబు ము;ద్గదంతఁ గొంచుఁ
దేరు డిగి తాఁ గవిసెన్ రయ ముల్లసిల్లఁగన్. విరా. 5-151

డివోవు దే. స. క్రి.

విరమించు, అవు
చూ. ఉడివోక. విరా. 5-151

డుకాఱు దే. అ. క్రి.

మనస్తాపము తొలఁగు, విచారముడుఁగు, మంట చల్లాఱు.

సీ ఈ వెంద్రుకలువట్టి యీడ్చిన యాచేయి దొలుతగాఁ దోరిలో
దుస్సనేను, తమ వింతలింతలు తునియలై చెదరి యీ,పతియున్నఁ
గని యుడు కాఱుఁగాక, యలుపాలఁ బొనపదు చిచ్చే యిది.
ఉద్యో. 3-117

డుకు దే. అ. క్రి.

పరితపించు, (భయదుఃఖాదులచే) తాపమునొందు.

సీ. విప్రులు పట్టరా వెలినొచ్చి యొదిగెదు, గవయంబు చాద్పునఁ
గర్ణభీతి, నుల్లల నడుకుచు నుందుదు. కర్ణ. 3-38

తే. చూచు వారల యుల్ల ముడుక. స్త్రీ. 2-14

తే. మదిఁ జింత పొనిపి యుడుకు లోక పెట్టి.
శాంతి. 1-282; శాంతి. 4-34

వి.

1. అంతస్తాపము, పరితాపము.

అ. ఒడి వచ్చినాఁడ నద్ధతి వాకేల, యుడుకుమాని నీవ యుర్విఁ యేలు
గుఱ్ఱములు నేనుఁగులు లేని బయలు నీ,తలనె కట్టికొనుము ధర్మ
తనయ. శల్య. 3-72

శ్లో. హతబాంధవ భూయిష్ఠా హతాశ్వాహత కుంజరా, వసాతే పృథివీ
రాజన్ భుంక్ష్వైనామ్ విగతజ్వరః. సం. భా. శల్య. 32-52

తే. నేలఁబోరలు,చన్న వారేమి సెప్పుదు నుడుకుపేర్మి.
స్త్రీ. 2-60; ఉద్యో. 3-117

2. బాధ, పీడ.

క. కడుఁ గ్రొవ్వి కాఁడు లోకము, నడుకులఁ బెట్టంగ వినివి యుగ్ర

తపమునం, గొడుకుఁ బడసి. అను. 4-407

విణ.

వేఁడియైనది, ఉష్ణము.

తే. ఉడుకుఁ గన్నీరఁ దడియంగ నొఱగుచును విశేష్టరై. స్త్రీ. 2-45

**ఉడుకువ** వి. (√ఉడుగు)

విశ్రాంతి, విరామము, ఉఱట, తెఱపి.

చ. ఉడుకువ లేని కయ్యమున కోర్వఁగ వచ్చునె నాకు ఉప్పిఱుగొను నొకమాటు నాగ్రహము డింపవు. విరా. 5—146

సీ. నావిరిఁ బొదివెడు మగల సందడిఁబడి, యురియుచు నునికి మడు కవయుము. విరా. 2-315

**ఉడుగఁబడియుండు** దే. అ. క్రి.

ఒదిగిపడియుండు.

క. దేవతలకైన నొక్కొక, చో వలయునకాదె శత్రుసూదన విధి కాలావాప్తికి మును దమ సద్భావంబు లడంచి యుడుగఁబడి యుండంగన్. విరా. 1-58

**ఉడుగు** దే. స. క్రి.

1. మాను, విడుచు, త్యజించు.

క. పెక్కంద్ర నొక్కపోరన, మక్కజ ఖండింతుఁ బంపు టుడుగుదు రాజాం, దక్కటి చూపఱు లెంతయు, వెక్కసపడఁ జిత్రగతుల విహరింతు దగన్. విరా. 1-82

తే. నా బుద్ధి వినవయ్య తమక ముడిగి. విరా. 2-78

క. జనులకు నొడఁబాటగు విధమున నడచుచు లోకనింద్యముల నుడు గుచు మీఁదని యొక కలిమి కుడుకక, మనుజులతోఁ బొంది పొసఁగి మను టొప్పు నృపా. ఉద్యో. 2-22

తే. నియత తపమును నింద్రియ విగ్రహంబు, భూరివిద్యయు శాంతికిఁ గారణములు, వాని యన్నింటికంటె మేలైన శాంతి, కారణము లోభ ముడుగుట, కౌరవేంద్ర.

ఉద్యో. 2-84; శాంతి. 5-208, 561; ఆది. 2-180

అ. క్రి.

1. విరమించు, ఆఁగు.

క. కదియుచుఁ దాయుచుఁ బట్టుచు, నుదలుచుచుం బడుచు లేచు
చుడుగుచు వడిగొం, చొదవెడు కినుకం గదుసెట్టినముగఁ బెనఁగిరి
చలంబు డింపక కడిమిన్. విరా. 2-348

క. ఉడుగుడగు మోహనాస్త్రము, విడువకు మను వెలుఁగుతోడ
వేగంబున నయ్యెడ శేఁగుదెంచి వారదుఁ, డెడపడు టించుకయు
లేక యిట్లను నాతోన్. ఉద్యో. 4-349

2. తప్పు, తొలఁగు.

ఉ. చూచుచుఁ జేరి వ్రేల్మిడుచుచుం దలయూఁచి విలక్షచిత్తయై,
యాచపలాక్షి ముక్కుపయి నంగుళముం గదియించి దీనికై,
గీచక యింతసేసితి సుశీలత్వము బొందుదుగాక యింక నప్లేచిన
నిట్టుగా కుడుగునే యనుచున్ వెఱ నందుచుండఁగన్.
విరా. 2-358

ఉ. పైపిఁడి పోయెఁగాక ధృతరాష్ట్రుఁడు గన్నది యేమి యాసథం
దా వఁదన్నఁ గీ డుడుగదా. కర్ణ. 3-224

3. బింకము వదలు.

చ. ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి మిచ్చిన దీనికిం దొడం,బడమని
దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై, నిడియెదనంచుఁ
దాఁ జరణ మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో, నుడిగి సభాసదుల్
పలుకకుండిరి తద్దయు భీతచిత్తులై. సభా. 2-30

విడి.

మాను, విడుచు, త్యజించు.

తే. చేయుచింతయు మేలైనఁ జేసి పిదప, వగచినట్టి దానము దమ్ముఁ
బొందకున్న, దానవిధి నిష్ఫలంబులు గాన రెండు, నుడుగుదాత
మహాఫల మొందఁగాంచు. అను. 5-189

ఉడుచు ప. క్రి.

ఉడిగించు, పోఁగొట్టు, తొలగించు.

అ క్రూరకర్ములయ్యు గోబ్రాహ్మణుల కగు, బాధ లుడుచు జనులఁ
బాపచయము, వెట్టి యొదలఁ బొంద వింద్రనందన నీకు, సమయ
భంగభీతిఁ జనఁగనేల. ఆది. 8-121

2. ఆఁపు, నివారించు.

వ. ...వారాశియుంబోలె బోరన మ్రోయుచున్న వాదిత్ర శబ్దంబు
లుడిగి. ఆది. 6-15

**ఉడుపతి** సం. వి. ఇ. పుం.

చంద్రుఁడు, నక్షత్రములకు రాజు.

సీ. జిహ్వ, యధ్యాత్మకము రస మారయంగ -తే- దాని యధిభూత
ముడుపతి దదధిదైవతంబు. అశ్వ. 2-148

**ఉడుపము** సం. వి. అ. పుం. న.

నీటినుండి రక్షించునది, తెప్ప.

వ. ...ద్రుహ్యువంశంబునవా రుడుపప్లవ సంచార్యంబైన దేశంబు
నకు రాజులుగా. ఆది. 8-195

**ఉడుపు** దే. స. క్రి.

ఉడిగించు.

1. పోఁగొట్టు.

వ. ...అనులేపనంబున నస్రగంధం బుడిపికొని. విరా. 8-2

క. కామక్రోధాద్యములగు, నీమానస వికృతు లుడిపి. శాంతి. 4-30

క. విను తెవు లుడుపఁగ భేషజమునకుం దలకొనిన చందమున.
శాంతి. 4-288

2. ఆఁపు, నిరోధించు, అడ్డగించు.

తే. ఇట్లు శత్రుంతపునిఁ ద్రుంచి యివ్విధమున, నొక్కఁడొక్కఁడ తల
పడు టుడుపఁ దలఁచి, వివిధ బాణపరంపర వెల్లిగొలిపె, భయ
రసము వట్టిపెట్టునఁ బగఱవారు. విరా. 5-78

సీ. సరుఁ దేది వాయుబాణమ్మున నమ్మునఁ, దూలింపఁ గుంభజాశైల
శరము -అ- వచ్చి యుడుప నలిగి. భీష్మ. 8-218; కర్ణ. 2-49

వ. వాఁడు పాండవ బాణంబులకెదురుగా నరదంబు సముచితరయంబున నడప నమ్మద్రపతి సముద్ర సముద్రేకంబు చందంబైన యా సైన్యంబు నరభసత్వంబు దెలియలి కట్టయుం బోలి యుడుపుట యచ్చెరువై యుండె. శల్య. 1-135

3. అణఁగించు.

ఉ. ...వీటికిం, బోవవు శత్రునే పుడిపి పోయెడు వాడవుగావు నీవు సైన్యావలియైనఁ దేర్పడక యాతం కెద్యుట లేదునేనియున్. విరా. 4-192

క. నిన్నయఱసచ్చి పోయితి,వు న్న యఱియు నేఁడు దీర్చి యుడిపెద నీ గర్వోన్నతి యుంకెట వోయెదు. ఉద్యో 4-341

4. చల్లార్చు.

వ. పెటిగివచ్చు కార్చిచ్చు నుడుపను బాషాణవర్షంబు వారింపను. ఉద్యో. 2-262

తే. త్రినయనుఁడు వచ్చి యాతనిఁ దేర్చి వారి, డాకెఱంగెటిగించి యయ్యగ్ని నుడిపె, నపుడు పుట్టెఁ దదీయోంద్రియ వ్రజమున, శోకయంగన రక్తాక్షి యుజ్జ్వలాంగి. శాంతి. 5-204

5. మాన్చు, తీర్చు.

వ. ఇట్లయ్యిరువురు వెండోరులం బట్టుకొని యేడ్చి రచ్యుతుం డుడుప నుడిగి తత్కాలోపగత సముచిత పరిజనానీత జలంబుల ముఖ ప్రక్షాళనంబు సేసికొనిరి. కర్ణ 3-109

**ఉడువు** సం. వి. ఉ. స్త్రీ. న.

నక్షత్రము

వ. అకాలసంధ్య నావహించినం దదుచిత వ్యాపార పారంగతంబులై పొడసూపిన యుడుగణంబులుం బోలె. విరా. 5-60

**ఉదుకువ** దే. వి.

ఉడుకువ.

చ. వారికి యుదుకువ లేని త్రిమ్మటన్. విరా. 3-95

(పాఠాంతరము)

**ఉతథ్యుఁడు** సం. వి. అ. పుం.

అంగిరసుని కొడుకు, బృహస్పతి యన్న.

సీ. మఱి యంగిరసుఁడను మానసపుత్రున, కయ్యుతథ్యుండు బృహ
స్పతియును, సంవర్తుఁడును గుణాశ్రయ యోగసిద్ధి య నూఁ
తురు బుట్టిరి. ఆది. 8-66; శాంతి. 2-400

**ఉత్కంఠ** సం. వి. ఆ. స్త్రీ.

ఇష్టప్రాప్తికై పడయు వేగిరపాటు, విరహము వలనఁ గలిగిన వికారము.

క. కైవేసి మదవికారోల్లాసంబున మేనువొంగ లఘుగతి నుత్కం
ఠాసవపాన విదాన,వ్యాసంగతరంగి తాంతరంగుం డగుచున్.
విరా. 2-329

**ఉత్కంపము** సం. విశే. (అ. ఆ. అ.)

ఎక్కువ వడఁకునది.

మ. (హరి) ధరణీ చక్రము గ్రక్కునం గదల దిగ్దంతావళ శ్రేణి కం,
ధరముల్ మ్రొగ్గఁబడన్ దిశావలయ ముత్కంపంబుగా నీ బలం,
బురలం దాఁకఁగ భీష్ముపైఁ గవిసె. భీష్మ. 3-262

వి. అ. పుం.

వడఁకు.

మ. ...కౌరవులు గోవర్గంబుఁ గొంపోవఁగాఁ, గని యేఁ గ్రమ్మఱి
రిత్తవోదునె భయోత్కంపంబు నీ కేటికిన్. విరా. 4-68

మ. ...దిశావలయ ముత్కంపంబు వొందెన్.
సౌప్తి. 2-122; అర. 7-254

**ఉత్కచము** సం. వి. అ. న.

ఒక పుణ్యతీర్థము.

వ. గంధర్వుఁడు పెద్దయుం బ్రొద్దు విచారించి యిచ్చోటికిం గుఱంగట
నుత్కచం బను తీర్థంబునం దపంబు సేయుచున్నవాని ధౌమ్యుం
డను బ్రాహ్మణునిఁ బురోహితునింగాఁ బ్రార్థింపుఁడు.
ఆది. 7-156

**ఉత్కటము** సం. విశే. (అ. ఆ. అ.)

అధికమైనది, మిక్కుటము, అతిశయము.

ఉ. కీచక ముఖ్యుఁ డప్డు...నుత్కట సంభ్రమంబు హర్షంబుఁ బెనం
గొనంగ. విరా. 2-118; విరా. 2-226

వ. అని తన మనంబునం గదిరిన యమజ వియోగతాపం బుత్కటం
బగుటయు వెండియు నిట్లనియె. విరా. 3-59; భీష్మ. 3-346

**ఉత్కరము** సం. వి. అ. పుం.

సమూహము, గుంపు.

సీ. భేరీస్వనముల నింగి బీఁటలు వోకుండఁ, గరికర శీకరోత్కరము
దడుపు. భీష్మ. 1-119; విరా. 3-154

**ఉత్కర్షణము** సం. వి. అ. న.

పైకి లాగుట, పైకి ఎగఁబట్టుట.

వ. .. ఆ సభ విభవంబు సూచువేడుక నందుఁ గ్రుమ్మరువాఁడ హరి
నీలబద్ధ స్నిగ్ధమణి స్థలంబునందు జలబుద్ధిం జేసి పరిధానోత్కర్ష
ణంబు సేసి విమల శిలాతల బుద్ధి నుదక పరిపూర్ణంబయిన వాపి
సొచ్చి కట్టిన పుట్టంబు దడియం ద్రెళ్లిన నన్నుం జూచి వృకోద
రుండు నగియె. సభా. 2-140

**ఉత్కర్షత్వము** సం. వి. అ. న.

శ్రేష్ఠత్వము.

వ. అనిన విని జనకుండు వర్ణంబుల యుత్కర్ష త్వాపకర్ష త్వంబులకు
మూలం బెయ్యది. శాంతి. 5-508

**ఉత్కర్షము** సం. వి. అ. పుం.

1. అతిశయము, గొప్పతనము.

క. అని హర్షోత్కర్షంబున, మన మలరఁగఁ బల్కి. విరా. 1-227

వ. అట్టి మహామూర్తిం గనుంగొని ధనంజయుండు విస్మయరోమ
హర్షణ ప్రహర్షోత్కర్షంబుతో ప్రణామంబులు సేసి. భీష్మ. 1-210

2. ప్రాశస్త్యము, శ్రేష్ఠత్వము.

క. హర్షంబును మానంబు న, మర్షము నపరాధమును నమదభావము

2. అధిక్యము.

ఉ. ఒక్కఁడ చన్నవాఁడు విజయుండు మహీరజ మెక్కు డయ్యె న. ద్దిక్కునఁ బాంచజన్యము యుదీర్ణత మ్రోయఁదొడంగె.

ద్రోణ. 3-129.

**ఉదీర్ణత్వము** సం. వి. అ. న.

గొప్పతనము.

వ. ఇట్లు ప్రసిద్ధ బలపరాక్రమంబులైన కర్ణు నుదీర్ణత్వంబు సెబుచుట కునై కవచకుండలంబులు భిక్షించి. శాంతి. 1-84.

**ఉదీర్ణము** సం. వి. అ. న.

1. గొప్పది.

అ. కురుబలంబు గెలిచి గోవులఁ గ్రమ్మఱఁ, దెచ్చు చెల్ల నీ యుదీర్ణ. బాహుబలము గాఁగ నీవు పలుకుము వెలిఁబుచ్చు, టుడుగు మధిపు పాల నొఁడు తెఱఁగు. విరా. 5-227

2 అతిశయించినది, అధికము.

అ. దివ్య పరిమళంబు నవ్యవికాసంబు, నల్లసిల్ల వచ్చి యుర్విఁ బడినఁ గాంచి రుచి యదీర్ణ కౌతుక చిత్తయై. దాని బుచ్చికొనియె మానవేంద్ర. అను. 2-207

ఉ. మేలి మదావళంబులును మేటిహయంబులుఁ దమ్మలింప నా, భీలతఁ బట్టి రాఁగ రథబృందముతోఁ గురురాజు కర్ణు దోర్లీలకుఁ దోడ్పడం గడఁగె రేణు వుదీర్ణముగా నతండు పాండవబలంబు పై నడరె శౌర్య సముద్భట బాహువీర్యుఁడై. కర్ణ. 2-156

3. గర్వించినది, ఉద్రేకము పొందినది.

తే. కర్ణనందనుఁ డిట్లుదుర్దీర్ణశక్తిఁ, బాండురాజ తనూజుల బలము వెల్లఁ, గమవు గొట్టంగఁ జొచ్చినఁ గినిసి నకుల, వాత్మజుండు శతానీకుఁ డతని దాఁకి. ద్రోణ. 1-198

**ఉదీర్ణుఁడు** సం. విశే. (అ. అ. అ.)

ఉద్రేకము పొందినవాఁడు.

వ. ...కోపంబు రూపంబు గైకొన్న కైవడి నదీర్ఘాకై యక్క-
ర్షుండు. ద్రోణ. 4-232; కల్య. 1-175

**ఉదుంబరము** సం. వి. అ. పుం.

మేడిచెట్టు.

వ. ఋతుకాలంబున నీ తల్లి యశ్వత్థంబును నీ వుదుంబరంబును
నాలింగనము సేసి భక్తితో మీమీ చరువు లుపయోగించునది.
అను. 1-110

నపుం.

మేడిపండు.

ఉ. కామ ప్రకృతి ప్రకృతి దనయందు విల్చు నిల్చినను దాన వికృతిం
తెందకుండఁ, బురుషుఁ డుదక మత్స్యముల యుదుంబర మశక
ముల సంగంబు కరణి గలుగ. శాంతి. 6-108

**ఉద్గతము** సం. విశే. (అ. ఆ. అ.)

1. పుట్టినది.

ఉ. ఉల్లము దల్లడిల్లఁ దను వుద్గత ఘర్మజలంబు దాల్చుచున్, డిల్ల
పడంగ. విరా. 2-91; శాంతి. 3-281

2. పైకి వచ్చినది, ఊటినది

వ. సరస్వతీ జలంబు తత్కూపంబున నుద్గతంబై యా సవనపతి నుద్ధ
రించె. కల్య. 2-155

3. బయలు వెడలినది.

తే. అచ్యుతాననోద్గతము వేదార్థమయము, యోగసాంఖ్యాత్మకము
నైన నాగమవృత్తము, గర్ణపుటపేయముగఁ జేయు గారవమున.
శాంతి. 6-389

తే. సత్యభామ గోపఁ మడరి వనితా స్వభావోద్గతాత్రు పూర,
యగుచు హరి యగ్రతలమున కరుగుదెంచె. మౌన 45

**ఉద్గతి** సం. వి. ఇ. స్త్రీ.

1 బయలు వెడలుట

క. పిక్కవనము దెసకుఁ జన నయ్యుటిల భయభ్రాంతచిత్తరైరి కావ్య
జలోద్గతి మొగముఁ గప్ప విట్లని, యతిరావముగా వానర్చె
వాక్రందనమున్. వి.శా. 3-18; శకు. 3-38

2. పుట్టుక, ఉదయము.

క. ఘృతములు పైఁ జల్లఁగ నచ్చితిఁ బొల్పిన సత్రవితాన్వితాం రవము
మూర్జిత సామగాన నాదోద్గతియును హోహారవంబుఁ గలసి చెలం
గెన్. మౌస. 1-142

**ఉద్గతుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

బయటకు వెడలినవాఁడు, పుట్టినవాఁడు.

వ. అప్పుడు తదీయ బ్రహ్మరంధ్రోద్గతుండును మహాజ్యోతిర్జ్వాలా
కృతియుం బ్రాదేశమాత్రుండు నగు పురుషు నొకరొక్కని
శాంతి. 4-166

**ఉద్గమము** సం. వి. అ. పుం.

1. పుట్టుక, కలుగుట.

దుర్గతి రోగోద్గమ చికిత్సకా. వి.శా. 2-364

2. పైకివచ్చుట, బయటకు వెడలుట, కాఁచుట.

మహాస్రగ్ధర:- బాష్పోద్గమము వొదువు వర్తింఋంబులన్,
భీష్మ. 1-214; అర. 3-264

**ఉద్గమించు** సం. అ. క్రి.

పుట్టు, కలుగు.

సీ. ఘోటకోత్తమరోమ కూపంబులం దెల్ల, నొక్కట ఘనధూమ
ముద్గమించి. అశ్వ 3-112

**ఉద్గాత** సం. వి. ఋ. పుం.

యజ్ఞమునందు సామవేదతంత్రము నడపువాఁడు.

వ. కౌత్సుం డుద్గాతగా... యాజ్ఞికు లగ్నిముఖంబు చేసి వేల్వం దొడం
గిన. ఆది. 2-210

**ఉద్గారి** సం. విశే. (న్. జీ. న్.)

కాఱునది, స్రవించునది, క్రక్కునది.

లయగ్రాహి :- దంతమణిరదన దంశోద్గారి రుధిరా ధరు... అర్ధ ముఖవీరుఁ గని — అర. 7-96

**ఉద్గీతము** సం. విశే. (అ. ఆ. అ.)

1. చెప్పఁబడినది.

తే. అతఁ డరణ్య కోద్గీతమైన వాక్య, సంచయము విమ్మగుణించి పఠించె నధిప. — శాంతి. 6-362

2. పఠింపఁబడినది, పాడఁబడినది.

శా. ఉద్గీతామ్నాయుఁడు... పారాశర్యుండు. — అర. 6-103

**ఉద్గీతి** సం. వి. ఇ. స్త్రీ.

సామగానము చేయుట.

క. ధౌమ్యుఁ డరిగె వి, చారజ్ఞుఁడు రౌద్రయామ్యసామోద్గీతిన్. — సభా. 2-308

**ఉద్దండ** సం. విశే. (అ. ఆ. అ.)

క్రూరాత్మురాలు.

వ. శునస్సఖుండు దన యభిధానం బభివ్యక్తంబుగా ముగ్గడించినం గృత్తి నీపేరు దెలియంజెప్పు విదితుేమి యనవుడు నతండు తేటపడం జెప్పి యుండం జెప్పవనియెద విట్లుంట తప్పుగాదె యిట్టి యుద్దం డవు మత్త్రిదండంబుపాలఁ బడుము. — అను. 3-222

**ఉద్దండత** సం. వి. అ. స్త్రీ.

1. భయంకరత్వము

ఉ. ... అంతం దుడివోక లేక సమదంబున ఖడ్గము ఖేటకంబు ను, ద్దండతఁ గొంచుఁ దేరు డిగి తాఁ గవిసెన్ రయ ముల్లసిల్లఁగన్. — విరా. 5-151

క. చండ భుజబలములై యుద్దండత నరుఁ డదర వెమరఁ దరమే నీకున్. — ఉద్యో. 4-48

2. విజృంభణము.

క. పాండవుల దిక్కు వీరు లఖండిత బలులైన వామోగంబునఁ బడి
యుద్దండత చూపఁగ లేరు శిఖండిని నొక్కరుని బంపఁగాని
కుమారా. ఉద్యో. 4-270.

**ఉద్దండము** సం. విశే. (అ. ఆ. అ.)
భయంకరమైనది.

ఉ. ... దోర్బలోద్దండ మహాసురప్రతతి దర్ప మడంచి ప్రియం
బొనర్చి యాఖండలుఁ డున్న గద్దియ సగంబున నుండె.
విరా. 1-86.

**ఉద్దండుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)
భయంకరుఁడు.

శా. ... వీరకేతుం డుగ్రంబున దాఁకి యగ్గురుని నూతు న్గాంచి
యేనమ్ము లుద్దండుండై తమవాడ నేయుటయు. ద్రో. 4-97

తే. కడఁగి వెనుకొన్న పాండవోత్కరము నొకడ, నిలువరించె
నుద్దండుఁడై నీ తనూజుఁడు. శల్య. 1-290

**ఉద్దవిడి** దే. అవ్య. క్రి.
శీఘ్రముగా, వడిగా, వెంటనే

ఆ. ఉద్దవిడిన పసుల నూఁచముట్టుగఁ దెత్తు, నతఁడు వెనుక వచ్చి
యడ్డుపడిన,చోటఁ గాఁడు రాజసూనుల నరయుదు.
విరా. 3-120, ఉద్యో. 3-389.

**ఉద్దహనము** సం. వి. అ. న.
కాల్చుట. తగులఁబెట్టుట.

శా. .. అప్పార్థుఁ డాగ్నేయాస్త్రం బరఁగొసి... రా, ధేయాఁగోద్ద
హనాభిలాష మెడఁదన్ దీపింప బెట్టేసినన్. కర్ణ. 8-287

**ఉద్దామత** సం. వి. అ. స్త్రీ.
భయంకరత్వము.

క. భీముని ముందటి బల ముద్దామతఁ గాఁకింగ నేసఁ దలవడి.
భీష్మ. 3-61

**ఉద్దామము** సం. విణ. (అ. అ. అ.)

1. అధికము.

శా. వీరాలాపముల్ వల్కి యుద్దామక్రోధ శిఖా కలాప వికటోదగ్ర భ్రూకుటిస్ఫూర్తియై. విరా. 3-189

2. కట్టిదము.

వ. ఉద్దామంబైన కామంబు విడువ వడకున్నఁ జిత్తంబు నిర్వృతి గలుగునే శాంతి. 4-44

3 భయంకరము.

క. ఈ మత్స్యపతి సహాయము,గా మాకుం దీర్పరాని కార్యము గలదే, సామాద్యుపాయపరుఁ డుద్దామ భుజా బలయుతుం డితఁడు కేవలుఁడే. ఉద్యో. 1-30

**ఉద్దాముఁడు** సం. విణ. (అ. అ. అ.)

1. భయంకరుఁడు.

తే. భీమనాదుండు భీముఁ డుద్దాముఁ డప్రతర్క్య తేజోమయుఁడు. శాంతి. 5-214

క. భీమార్జునులకు రణమున, నే మగలును బ్రతియె వీరు నేనను సైన్యోద్దాములమై నడచిన నే,భూమీశులు వెదరి బ్రదికిపోవం గలరే. ఉద్యో 5-28

1. అధికుఁడు

వ. విభవోద్దామా. విరా. 2-1

**ఉద్దాలకుఁడు** సం. వి. అ. పుం.

1. ఒక ముని.

వ. ఉద్దాలకు నధ్వరంబున. శల్య. 2-159

2. ఒక ముని,శ్వేతకేతుని తండ్రి.

వ. ఉద్దాలకముని నిజతనయు శ్వేతకేతుని విప్రులయొక మిథ్యోప చారుం డని యెఱింగియుఁ బరిత్యజించె. శాంతి. 2-188

(వీరిర్వురు నొక్కరే యైయుందురు)

**ఉద్దీపించు** సం. అ. క్రి.

1 విజృంభించు, చెలరేగు.

మ. ...కన్నె యయ్యంబ నృపతి భవత్పుత్రుమీఁది కోపమున నుద్దీపింప
చేతెంచి రయ్యభిమన్యుండును ద్రౌపదేయులును మాదద్దంతి
యాభాకృతిన్. భీష్మ. 1-110

2. ప్రకాశించు, వెలుఁగొందు.

వ. సాత్యకి...కృతవర్మనిం దాకి చేసిన నతండును దాఁగలేని మంట
చందంబున నుద్దీపించి సాయకజ్వాలలు నిగిడించిన నవి మగిడించి
యాపై వేయుండు. ద్రోణ. 4-38

3. ప్రజ్వలించు, మండు.

వ. ... ఇద్దురాత్ముండు సభలోన నసభ్యంబులగు మాటలు ద్రౌపది
నుద్దేశించి యాడిన నుద్దీపించిన కోపం బజాతశత్రునకుఁ బ్రియంబు
గా నడంచుకొని యుండిరి. కర్ణ. 2-214

**ఉద్దీపితము** సం. విశే. (అ. ఆ. అ.)

మిక్కిలి ప్రజ్వలింపఁ జేయఁబడినది.

క. చూపులు మిణుమిణుఁగొనఁగ, నేపారిన దానవేంద్రు నెసకంబున
ను,ద్దీపిత మగుపడగ భయద రూపంబునఁ ద్రాలఁగా నరుఁడు
రోసెంచెన్. ద్రోణ. 8-34

2. ప్రకాశింపఁజేయఁబడినది.

క. క్రేవులు దోరా దుర్గతిఁ, బ్రాపింపఁ గలార యుట్టి పాపితతతి ను
ద్దీపిత బోధమునం గని, మీపై కృపఁ జెప్పవలెపె మీకుం దెలి
యన్. అను. 8-20

**ఉద్దీపితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. రెచ్చఁగొట్టఁబడినవాఁడు.

క. పవనుని హిడింబసుతుఁడును, ద్రౌపదిపుత్రులు సుభద్ర తన
యుఁడుఁ గోపోద్దీపితులై. భీష్మ 3-180

2 ప్రకాశము చేయబడినవాఁడు.

క. నిత్యసత్యాత్మకోద్దీపితుఁడై. — శాంతి 5-64

**ఉద్దీప్తము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి వెలుఁగొందినది, ప్రకాశించినది.

శా. ...రాజ్యద్యావా సంవల్గిత్సోత్కృష్ట స్యందనముం గవద్దనువు మద్దీప్త ధ్వజంబుం దగన్, ధృష్టద్యుమ్నుఁడు వొల్చె నైజ విలసత్తేజో విరాజద్గతిన్. — భీష్మ. 1-117

**ఉద్దీప్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి ప్రకాశించినవాఁడు, వెలుఁగొందినవాఁడు.

శా. మద్రేశున్ వెగడొందనేసె నకులున్ మన్నించు సోదర ప్రభా. పోద్రేకంబున వొక్కపెట్ట రథవేగోద్దీప్తులై తాఁకినన్. — భీష్మ. 1-279

తే. గగనమధ్యంబునకు వచ్చు ఖరకరుండు, దేవి చూడంగరాక యుద్దీప్తుఁడగుచు, నెట్లు వెలుఁగొందు ద్రోణుఁడు నట్ల వెలుఁగు, చున్నఁ గనుఁగొని ధర్మజుం డురవడించి. — ద్రోణ. '-148

**ఉద్దీప్యమానము** సం. విణ. (అ. ఆ. అ.)

వెలుఁగొందుచున్నది.

సీ. రత్నయూపంబును రజత వరాహంబు నుద్దీప్యమాన మహోరగంబుఁ, గేతనంబుల వొప్పు ... భూరిశ్రవునకు సైంధవునకు రారాజునకు. — ద్రోణ. 3-288

**ఉద్దేశము** సం. వి. అ. పుం.

1. ప్రదేశము.

వ. ప్రోవులు గొనియున్న ప్రేవుల మాలావృగల యంచపిందు పేరాఁకలి నంటిముట్టిం బెట్టినఁ గుఱుకులు గట్టిన మృణాళనాళంబుల వొప్పు కమలాకరోద్దేశంబులఁ గ్రేణిసేయు ప్రదేశంబులును. — విరా. 3-236

క. చలదళిపుంస్కోకిలకుల, కలరవ ముఖరిత లతాంత క్రమఫలాళి, లలిత మహీరుహమాలా, విలసితోద్దేశముల విక్రమించుచు లీలన్. — అర. 4-6

వ శివితేశ్వరు వామబాహువు నిజవామభుజంబువయి విడికొని దక్షిణ హస్తంబున నతని గ్రుచ్చి కౌఁగిలించి మందగమనంబున వాశ్రమోద్దేశంబునకు మగిడె. అర. 7-267

2. లక్ష్యము, గురి, అనుసంధానము, గురిగాఁ జేయుట.

వ ...అపగయను మహానదిం బిత్రుతర్పణంబు చేసి పిత్రుదేవోద్దేశంబున నొక్క బ్రాహ్మణునకుం గుడువం బెట్టినఁ గోటి బ్రాహ్మణులు కుడిచిన ఫలంబగు. అర. 2.268

3. ఉదాహరణములతో వివరించుట.

వ అని నిర్దేశించి యుద్దేశరూపంబునం గర్మంబుల తెఱం గెఱింగించి యింక నేమి యడుగవల తడుగు మనిన. అను. 5-123

4. ఊహ, అనుకొనుట, తలంపు.

వ సైన్యద్వయంబును రయంబునం గలయం బెరసినం బెందూళి యెగసి తలిర్చఁ గవియు చెంచు తమంబునకుం దోడుపడి చూడ్కులు నిగుడ నీకున్నను దమకంబునం దమతమ పేళ్లు విరుదులు నుగ్గడించుచు నగ్గలిక పొంపునను నన్నల మద్దేశంబుల నద్దైవ నిర్దైవ వీరులు పోరుచుండ. ద్రోణ, 5-148

5. అభిప్రాయము.

క. జనకువకును స్వామిత్వము, తనయోద్దేశమునఁ గలిమి తత్త్వము యది యజ్ఞనకిఁ గలుగున కావున, జనుఁ బరిఁ బొందంగ నిమ్ము జన మత వాకున్. ఆది. 4-241

ఉద్దేశించు సం. స. క్రి.

1. గురించి

వ. గాంగేయుండు కౌరవేశ్వరు నుద్దేశించి ధర్మార్థ సంగతంబును, సువిహితంబునుగా నిట్లను విరా. 4-220

వ. అగ్రజు నుద్దేశించి భీభత్సుండు భీమసేనున కిట్లనియె. విరా. 5-305

వ. ద్రుపదుం దనపత్యయగు తన మహిషి విషాదంబు దీర్పందివురటను గాంగేయు తోడి రోషంబునను శివుని నుద్దేశించి తపంబు సేసిన

నద్దేవుండు ప్రత్యక్షమై. ఉద్యో. 4-369; భీష్మ 3-320

2 భావించు, అనుకొను, తలఁచు

వ. ఇంద్రుండు వానియొద్దకు వచ్చి నీవేమి యుద్దేశించి యుగ్ర తపంబుఁ జేసెద వనిన. అర. 3-258; విరా. 1-175

**ఉద్ద్యోతనము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశింపఁ జేయునది.

క. భూతంబుల సంసరణము, భూతభవద్భావి కార్యములు గర్మ సముద్ద్యోతన భంగియు నీయెఱుఁ జేసితి కావె కురువంశ శేఖర జన్మా. శాంతి. 2-101

**ఉద్ద్యోతమానము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశించుచున్నది.

తే. అర్జునుఁడు గవియించిన యంప మూఁడ, మంచు దళముగఁ గప్పిన మార్గణాఁకు, జాలముల వెస విరియించె శాంతనవసఖంగుఁ డుద్ద్యోతమాన ప్రతాపశిఖి. విరా. 5-169

**ఉద్ద్యోతితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రకాశము కల్పింపఁబడినది. ప్రకాశితము.

క అద్వయపురుషోపలాలిత, ముద్ద్యోతిత రోచిరుద్గమోగ్రం బగుని,ర్వేద్యము దివ్య జనన మన,వద్యంబది కార్ముకైకపరము గుమారా విరా. 4-121

2. బయల్వెడలినది, బహిర్గతమైనది.

క. పాతాళమునకుఁ జని యం,దాతతమై ప్రణవరూపమగు నాదంబు,ద్ద్యోతితము సేసె నది యా, దైతేయులు విని పటుప్రతాపంబెసఁగన్. శాంతి. 6-485

**ఉద్ధత** సం. వి. ఆ. స్త్రీ.

ఏడుగురు కుమార మాతృకలలో నొకతె - బాలగ్రహము. పది యాఱేడులు ప్రాయము వచ్చు వఱకు నరులను బాధించును. ఆ సమయమున మ్రొక్కినను, కొల్చినను, వేఁడినను కనికరముతో వదలిపోవును. అర. 5-245 ము. 250 వ.

**ఉద్ధతము** సం. విణ. (అ. అ. అ.)

1. పెచ్చు పెరిఁగినది. అతిశయించినది.

తే. ఉటిక యేచి త్రిగర్తులు నుద్ధతముగఁ, జెలఁగి మార్కొని పోదివి సంకులముగాఁగ. విరా. 3-211

2. మదించినది.

సీ. ఒక మత్తకరిఁ జూచి యొూటమై పోఁగిన మద్దతకరిఁ జేసి యొునఁగె జయము, శాంతి 3-93

3. కఠినమైనది. ఉరువైనది.

మ. పిడుగుల్బోని మహోద్ధతాస్త్రముల వాపింబుగా దైత్యు బి,ట్టడువన్. అర. 7-90

**ఉద్ధతి** సం. వి. ఇ. స్త్రీ.

1. గర్వము. దర్పము.

ఉ. విర్మలా, త్మూర్జిత కీర్తికారణ రణోద్ధతి పెల్పెలఁజూఱ జేటికన్. విరా. 4-186

క. వీనుతుఁడు సమర విహరో, ల్లాసంబున సంగరంబులం దొంగాఠం, గా సుస్వరమున వా కుం,తీమానునిఁ బిలిచె నుద్ధతిన్ రణము నకున్. శల్య. 2-208

2. అహంకారము, అభిమానము.

క. మతి నెప్పుడుఁ దా ధర్మ, స్థితి నూహించుచును హితులు సెప్పెడి వెర వు,ద్ధతిదక్కి యాచరించుచు, జితేంద్రియత గలిగి నడవఁ జెందు శుభంబుల్. దా ప్తి. 1-73

3. సంరంభము, ఆటోపము, వేగిరపాటు.

శా. ....శతా,నీకుం డుద్ధతి నేగుదెంచె సవిలాసీకంబు నుప్పొంగఁగన్. విరా. 3-145

4. ఔన్నత్యము. ఆధిక్యము.

ఉ. ... వనభూతి నుద్ధతిఁ గొల్పు మృగేంద్రపురీతిఁ గొఱ్ఱిల్లుచు నుండ. విరా 3-148

5. ప్రకోపము, ఉల్బణము.

మత్తకోకిల :— వృద్ధులై నరతిన్ జలంబును మీఁకయుం దఱుగంగ దుర్బుద్ధి వాటిల ప్రమగ్గి యింద్రియముల్ విశక్తతఁ బొంద దో, షోద్ధతిన్ రుజ లుత్పవింపఁగ వొందు రూపగు పాశసంబద్ధుఁ జేసి జముండు దివ్వఁగఁ గాయు నబ్బవముం దుదిన్. స్త్రీ 1-41

ఉద్ధతిమాన్చు మి. క్రి.

గర్వమణఁచు, చంపు

ఉ. తక్కినవార లాతనికి దవ్వుల చోటుల వారు వాయుజుం, డొక్కఁడ యింక సింహబలు నుద్ధతి మాన్పిన మాన్పవాఁ డతం, డక్కడ నిల్వెఁ గావలయు వాసతి ద్రౌపదిగాఁగ వోవు చే, యొక్కడుఁ దాఁకఁ గీచకుల నోర్వఁగఁ జాలమి మీ రెఱుంగరే. విరా. 3-115

ఉద్ధతుఁడు సం. విణ. (అ. ఆ. అ.)

1 గర్వముగలవాఁడు, అవినీతుఁడు.

వ అనిన విని యాజ్ఞ చేసి యిట్లను...ఒక్క కారణంబున నుద్ధతులగు విరోధుల చేతం బతులసన్నిధిం దలపట్టి యీడ్వంబడి వనంబునకరిగి విరా, 1-818

2. అహంకారి, స్వాతిశయము గలవాఁడు.

వ. ఇవ్విధంబున దురోద్ధతముం డుద్ధతుండై మఱియుం బెద్ద యెలుంగువఁ బలుకుచుండ. కల్క. 2-113; విరా. 3-118

ఉద్ధరణము సం. వి. అ. న.

1 మీఁది కెత్తుట.

క అమృత మథనమున మంథనకమము శిలోద్ధరణ కేళిఁ గైకొని సురసంఘమునకుఁ బ్రియ మొనరించిన, యతనియుఁ గూర్మాత్ము నంబుజాతుం గొలుతున్. శాంతి. 2-40

ఆ. ...కశ్యపుఁడు నిజోరువు నెత్తి, గ్రుచ్చి దాఁపుగాఁగ నిచ్చియెత్తె

వ. అదికారణంబుగా ధరణియుర్వియనం బ్రసిద్ధి వహించె నయ్యూరూద్ధరణ సమయంబునం గాశ్యపి గశ్యపుని వేఁడుకొని. శాంతి. 2-89-90

2. ఆపదనుండి తొలఁగించుట, రక్షించుట.

వ నీ వమ్మహారాజుచేత దండింపఁబడుటం బుణ్యాత్ముండవును వంశో
ద్ధరణ సమర్థుండవు నైతివి సంతోషింపుము - పొమ్ము
శాంతి. 1-169

వ నీగర్భంబున నున్నవాఁడు మహార్యానల సమ ప్రభుం డైన
పుత్రుం డక్షయకుల దుఃఖోద్ధరణ సమర్థుండు సుమ్ము నీవు
వగవక నీ యగ్రజునొద్ద నుండు మని జరత్కారువు మోరార్చి.
ఆది. 2-160

క. ధర్మతత్త్వోద్ధరణా. అను. 5-488

ఉద్ధరించు సం. స. క్రి.

1. పైకిఁదీయు, వెలువరించు.

వ. దేవయాని యను దానిఁ బ్రమాదవశంబున నిమ్నాతం బడి వెలువడ
నేరకున్న దానను నన్నుద్ధరించి రక్షింపు మనిన. ఆది. 3-148

వ. ఇమ్మడుపు మహామత్స్య సంకులంబు గావున నపాయంబు వొంద
కుండ నన్నుద్ధరించి యొండెడం బెట్టవే, యేను నీకుఁ బ్రత్యుప
కారంబు సేయఁబోవుదు ననిన. అర. 4-220

2. కాపాడు, రక్షించు, ఆపదనుండి తొలఁగించు.

వ. నీవింతకుఁ జాలుట యెవ్వరు వెఱుంగరే యెట్లును సంగరంబున
మమ్ముద్ధరింపు మనియె.
ఉద్యో. 2-244; శల్య. 2-155; కర్ణ. 3-179

3 (ముల్లు మొదలగు వానిని) వెలికిఁదీయు, ఊడఁదీయు.

వ. వివిధకరణంబయిన వా హృదయ శల్యంబు నుద్ధరింపుము.
ఆది. 6-180

4. తరింపఁజేయు, పుణ్యలోకప్రాప్తి గలిగించు

వ. లోకోద్ధారంబను తీర్థమాది కులంబు నుద్ధరించురు. అర. 2-268

ఉ. ఇక్కుల మెల్లను నుద్ధరింపఁగా, వచ్చిన పుణ్య దేవతవు.
సభా 1-152

ఉద్ధవుఁడు సం. వి. అ. పుం.

కృష్ణునకు హితుఁడైన యొకానొక యాదవుడు. ఆది. 8-176

ఇతఁడు యాదవులతోఁగలిసి రైవతకాద్రి మహోత్సవమునకేగెను. యాదవ వినాశకాలమునఁ దపస్సు చేసికొనుట కడవికిఁబోయెను.
మౌస. 88

ఇతనిని గురించి శ్రీ మదాంధ్ర భాగవతమున నిట్లు చెప్పఁబడినది.

క. సిద్ధవిచారు గభీరున్, వృద్ధవచో వర్ణనీయు వృష్ణిప్రవరున్, బుద్ధి నిధి సమరగురుసము, నుద్ధవుఁ గని కృష్ణుఁ డొయ్యన పలికెన్.
భాగ. దశమ. 1483

**ఉద్ధారుఁడు** సం. విణ. (అ. రిణీ. అ.)

ధరించువాఁడు.

సీ. అవ్వీరు లన్యశరాసనోద్ధారులై యతనిపైఁ బఱపిరి శితశరంబులు
కర్ణ. 1-90

**ఉద్ధురత** సం. వి. అ. స్త్రీ.

1. ఆధిక్యము, అతిశయము.

క. నరనాథ యింక భీష్ముని, దురమునకుం దేరు మేను దోర్బలవిభవో, ద్ధురతం బాండకుమారో,త్కరముం దత్సేనఁ బ్రమదంబడఁగింతున్.
భీష్మ. 3-167

2. దృఢత్వము, చేర్పు.

తే. గడగొని వైచె నద్ధురత నతఁడు. ద్రోణ. 8-248

**ఉద్ధురము** సం. విణ. (అ. ఆ. అ.)

1. సమర్థమైనది, నిర్భరమైనది.

క. భరమున నీ పోరెడు నెడఁ, బగను విషాదంబు నీవు బలిమి మెఱపి యుద్ధురవృత్తి జయము గొనినం, బరితోషముఁ బొందు నన్ను భావించి మదన్.
విరా. 2-198

2. అధికమైనది, దట్టమైనది.

క. శరవేగంబున సరుఁ డుద్ధురమారుతచండభంగి దోఁచెఁ దెల్పెన్.
విరా. 4-270

సీ. ...పద్మనాభుఁడును దీవ్రకోపాగ్ని తనదు చిత్తమున నద్ధురమై జనింపంగ.
మౌస. 61

**ఉద్ధురుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1 ధీరుఁడు, గట్టివాఁడు.

క. పరిభవము రెండు దెఱఁగులఁ, దరుణీ తోఁచినది పాట్పడఁ దగ దేర్త
వౌ యుద్ధురుఁడగు భీమ్మునిఁ జేర్పునా, కరము ప్రియంబెద్ది వ్వా
దయ గతముం జెప్పుమా. ఉద్యో. 4-287

2. సమర్థుఁడు.

చ. దురమున నర్జునప్రకట దోర్విభవంబు నెదుర్పఁజాలు నుద్ధురుఁ
డొకరుండు గల్గునె. శల్య. 1-88; శాంతి. 3-174

**ఉద్ధూతము** సం. విణ. (అ. ఆ. అ.)

ఎగురఁగొట్టఁబడినది, పైకిఁ జిమ్మఁబడినది.

సీ. తురగ ఖురోద్ధూత ధూళి యప్సరసల చిన్నిపువ్వుల తోడఁ జెలిమి
సేయ. భీష్మ. 1-104; ఆది. 2-288

**ఉద్ధృతి** సం. వి. ఇ. స్త్రీ.

ఆపద నుండి తప్పించుట, రక్షించుట, విమోచనము.

మ. యదువంశంబున వాసుదేవుఁ డనఁ గ్రీడార్థంబు జన్మించి...దేవ
ముని సమ్మానోద్ధృతిన్ ధూభరంబు దొలఁగించిన చక్రి నంబురుహ
నాభుం గొల్తుఁ గష్టాత్మునిన్. శాంతి. 2-47

**ఉద్వృద్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

పైకిఁ గట్టఁబడినది.

వ. (ఘటోత్కచుఁడు) పింగళోద్వృద్ధ జటాకలాపంబును.
ద్రోణ. 5-207

**ఉద్వృత్తము** సం. విణ. (అ. ఆ. అ.)

1. అధికము, ఉద్ధతము.

మ. భవనాశ్లేష దృఢబంధ సంయమిత కుంభద్వేగమై శాత వాఁ, డవలీ
లన్ మన యర్జున ద్విపము క్రోధావేశ దుర్దాంత దర్ప విలాసో
ద్వృత్తభంగి నే వదరి కౌరవ్యాంబుజ శ్రేణిఁ జిక్కువడం జేయదె.
విరా. 1-66

2. భయంకరము.

సీ. ఉద్భటాకార సముద్ధతి మునము లుత్తలపడఁ దోఁపంగఁ దల్లడిలుచు.
విరా. 4-243

**ఉద్భటుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఉద్ధతుఁడు; గర్వి, శౌర్యము గలవాఁడు.

ఉ. ... (భీముఁడు)... ఆక్రమించె వం,చానన మేణమం బొదువువ ట్లతఁ డూర్జిత శక్తి నుద్భటుం, డై వెగనెవ్ సమీరసుతు నల్కఁ గుఁ క్రాకిడిఁ ట్లు వీఁకతోవ్,
విరా. 2-350

2. భయంకరుఁడు

వ. కర్ణుండు...కోపాటోపంబున నుద్భటుం డగుచు నమ్మహారథుని తేరికి సమ్ముఖంబుగాఁ దనయరదంబు నడపించి.
కర్ణ. 3-247; అశ్వ. 4-68; విరా. 8-24

**ఉద్భవము** సం. వి. అ. పుం.

పుట్టుక, ఉత్పత్తి.

సీ. అవ్విధమున కుద్భవమ్మయి కౌశికుఁ డిమ్మహి గాధినామమ్మునఁ బరగె
శాంతి. 2-68

తే. అతని తలఁపునఁ బ్రభవించె నాకసంబు, దానియందు జలంబు లుద్భవము నొందె.
శాంతి. 4-82

**ఉద్భవించు** సం. అ. క్రి.

పుట్టు, జనించు.

వ. అప్పుల వలన నగ్నియు బ్రాహ్మణుల వలన క్షత్రియ జాతియు నశ్మంబు వలన లోహంబును నుద్భవించె.
ఉద్యో. 1-185

**ఉద్భవిల్లు** సం. అ. క్రి.

పుట్టు. జనించు.

చ. ఉరగకరయోఁదోరుం జలచి యొక్క బలంబుగ దేవదానవుల్, వడిగొని వార్ధి నిట్లు దరువం దరువన్ విష మద్భవిల్లి నల్గడలను విస్ఫులింగములు గప్పఁగఁ బర్విన.
ఆది. 2-15

**ఉద్భావన** సం. వి. అ. స్త్రీ.

ఊహించుట, భావించుట.

క. మత్సాఖ్యం బో యుద్భావన శ్రీకంఠుఁ డనఁగఁ బరగుము శర్వా.
శాంతి. 6-452

**ఉద్భావితము** సం. విణ. (అ. ఆ. అ.)

కలిగినది, ఏర్పడినది.

క. కావునఁ గుడువక పొలియదు, దేవాసురమునులకైన దేవి కరో్మ ద్భావిత ఫలమీ యర్థము, నీ వలవఱుపుము భవన్మనీషఁ దిరము గన్.
అను. 5-119

**ఉద్భాసి** సం. విణ. (న్. నీ. న్.)

మిక్కలి ప్రకాశించువాఁడు.

వ. ఇట్లు భగ్నబల సమాశ్వాసనోద్భాసియగు భీష్ము భుజబలంబు ప్రాపున.
విరా. 5-68

2. ప్రకాశించునది, మెఱయునది.

మాలిని :— హృదయపరోద్మోద్భాసి విజ్ఞానపారా.
ఉద్యో. 4-428

**ఉద్భాసితము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి ప్రకాశింపఁబడినది.

క ...సేవ్యపదారవింద యోగిక విద్యోద్భాసితమతిమూర్తిమయా.
విరా 5-1

**ఉద్భాసితుఁడు**

మిక్కలి ప్రకాశింపఁబడినవాఁడు.

క. అసుకృతము గదయెయ్యు మహోత్సాహయోగ సేవనారామత ముద్భాసితుఁడ వగుచు నిష్ఠావ్యాసంగ విహారివగు మనామయ లీలన్.
శాంతి. 5-260

**ఉద్భిజ్జము** సం. విణ. (అ. ఆ. అ.)

భూమిని భేదించుకొని పుట్టునది.

ఆ. ఉవిద పోఁక వెలుఁగు నుద్భిజ్జములు, స్వేదజముల కదియుఁ బాపు సంభవించు.
అను. 1-13

**ఉద్భిదము** సం. వి. అ. పుం.

మొక్క. (చీల్చుకొని పైకి వచ్చునది)

వ. జంగమ స్థావరంబుల యందు జంగమంబులు లెస్స యని జరాయువు నండజంబును ముద్భిదంబును స్వేదంబును వను జనకవిశేషంబుల జనియించి బహుపాదంబులు, ద్విపాదంబులును నైయుండు నందు మనుష్యులు మేలు. శాంతి. 5-99.

**ఉద్భూతము** సం. విశే. (అ. ఆ. అ.)

పుట్టినది, కలిగినది.

క. చైతన్య శక్తిఁ బరుషస,మేతత్వ విశేషమున వహించుఁ బ్రకృతిత,జ్జాతయగును బుద్ధి తదు,ద్భూత మహంకార మరియుఁ బొరయుం జిత్తున్. శాంతి. 4-270; కర్ణ. 2-165; అర. 1-182

**ఉద్భూతి** సం. వి. ఇ. స్త్రీ.

పుట్టుక.

తే ...మైత్రి సప్త,పదకృతోద్భూతి యని యొకు పలుకు వినవె. కర్ణ. 2-102; శాంతి, 4-77

**ఉద్భ్రుకుటి** సం. విశే. (ఇ ఈ. ఇ.)

బొమముడి గలవాఁడు

క. శకుని ప్రతివింధ్యుఁ దాఁకినఁ, బ్రకటబలుం డా యుధిష్ఠిర ప్రియసుతుఁ డు,ద్భ్రుకుటి యగుచుఁ గవిసెను సిం,హకిశోరము గజముఁ గొదవున ట్లతనిపయిన్. భీష్మ. 1-268.

**ఉద్భేదనము** సం. వి. అ. న.

భేదించుకొని వెలికి వచ్చుట, చిల్లుట.

క. మయూరంబులకు పత్త్రోద్భేదనంబును. శాంతి, 5-449.

**ఉద్భేదము** సం. వి. అ. పుం.

మొక్క (చీల్చుకొని పైకి వచ్చునది)

తే. స్వేద ము ద్భేద మండమ న్వినఁ బుట్టు, నధమ మధ్యమోత్తమ దశలైన భూతరాసులు. అశ్వ. 2-144.

**ఉద్భ్రాంతము** సం. విణ. (అ. ఆ. అ.)

సంక్షోభము చెందినది.

మ. ...ఉద్భ్రాంతులై యుంబుధు, ల్వారలెం గట్టల మీఁద. ద్రోణ. 5-377

**ఉద్భ్రాంతి** సం. వి. ఇ. స్త్రీ.

మిక్కిలి భ్రాంతి, మిక్కిలి సంక్షోభము చెందుట.

మ. ...సప్తాశ్వసపులు బిట్టుల్కి రథంబు నల్ దెసలకుం బోఁద్రొ న్నుద్భ్రాంతిమై. అర. 5-203

**ఉద్భ్రాజితము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కిలి ప్రకాశింపఁబడినది.

క. తేజోధనుఁడగు నరుఁ డుద్భ్రాజితగతి నడుము మెఱసి. విరా. 5-68

**ఉద్భ్రాజిష్ణుఁడు(వు)** సం. వి. ఉ. పుం.

మిక్కిలి ప్రకాశించువాఁడు.

క. తేజోరూపము బ్రహ్మము, ప్రాజాపత్యం బనంగఁ బరఁగి పురుషుఁ డు, ద్భ్రాజిష్ణు నిత్యనిత్యా, వ్యాజతుహిమ వెలుఁగుచుండు నకలంక పటిమన్. శాంతి. 5-98

**ఉద్యత్** సం. శత. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు)

పుట్టుచున్న, కలుగుచున్న.

శా. నానాగమ, క్షీరోద్యన్నవనీత లాలసిత నిత్యత్తత్వ సంభాసితా. అశ్వ. 2-174

శా. ఉద్దామోగ్రోర శిఖాకలాప వికటోద్యద్భ్రూకుటిస్ఫూర్తియై. విరా. 8-189

2. ఉదయించుచున్న.

మ. ఉద్యద్బాహుస్ఫురద్భటో, త్కరమున్ దిట్టనయట్లు గూలె. విరా. 5-290

3. ఉత్కృష్టమగుచున్న, శ్రేష్ఠమగుచున్న.

శా. ఉద్యద్గుణశ్రేణిరమ్యులు. ఆది. పీ 9

4. పై కెత్తుచున్న.

వ. ఉద్యద్గదాహస్తులయి. ఆది. 6-12

**ఉద్యతము** సం. విణ. (అ. ఆ. అ.)

1. పై కెత్తఁబడినది.

చ. ...అ|క్రుతాయు వు,ద్యతగద వొప్పఁ బట్టి దమజాంతకు|వేసె. ద్రోణ. 3-105

చ. ...అ,తనిపయి భీముఁ డుద్యతగదాస్ఫురణన్ నడచెన్ నరేశ్వరా. శల్య. 2-258

2. పూనినది, వహించినది.

చ. సురేశ్వరో,ద్యతకులిశంబుఁ బొందె హరి దత్వమయంబునఁ గౌర వేశ్వరా. శాంతి. 5-424; సభా. 2-51

3 ఉద్భవించినది, పుట్టినది.

స్రగ్ధర: ఆదివ్యా(స్త్రమునం దుద్యతమయి ఘన ఘోరాగ్ని యర్చిర్వితానం, బే దిక్కుం దానయై పెల్లెసఁగుచు. సౌప్తి. 2-61 అర. 4-246

4. సిద్ధమైనది.

వ. అఖిల లోకదహనోద్యతంబయిన నా కోపదహనంబు నిగృహీతం బయిన నన్ను దహించు నేమిసేయువాఁడ. ఆది. 7-146

చ. అతఁడు నివృత్తిధర్మము |ప్రయత్నమునన్ క్షివివరించె మోక్షణో, ద్యత మది. అను. 5-81

**ఉద్యతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

యత్నపడినవాఁడు, పూనినవాఁడు, సమకట్టినవాఁడు.

క. భూదేవో త్తమువాళి, ర్వాదంబులఁ |బ్రీతిఁబొంది వారలు, |ప్రస్థా, వాదరపరులగుటయు స,మ్మోదావహ పుణ్యకర్మములకు ద్యతుఁడై. విరా. 1-145

మ. నిశ్శంకం బతి|క్రూరక,ర్మములం దుద్యతులైన వారికి నశర్మ |ప్రాప్తి గాకుండునే. ఆది. 7-185

**ఉద్యమత్వము** సం. వి. అ. న.

సిద్ధమగుట.

మ. ...త, క్కిన దైత్యావలి విచ్చి నల్గడఁ బరిక్షీణోద్యమత్వంబునన్.
శాంతి. 2-442

**ఉద్యమము** సం. వి. అ. పుం.

1 పూనిక, యత్నము.

శా. దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర, ద్గర్వాంధ ప్రతివీరనిర్మథన విద్యాపారగుల్, విరా. 2-55

2. సన్నాహము, సిద్ధమగుట.

శా. ...ధరిత్రీనాథుండు రణోచితోద్యమము సంధిల్లంగ శస్త్రాస్త్రవ, ర్మానీకిక్రమదక్షులం బనిచె సద్యోవారికిన్ గ్రక్కునన్.
విరా. 3-142

క. అనుటయు నాతఁడు దగ నూ, ల్కొనిఁ దా మదితనినద కోదం డుండై, యనితర సులభోద్యమమున, ధనంజయుం డిట్టులను నతనితో మఱియున్. విరా. 5-155

**ఉద్యానము** సం. వి. అ. న.

1. ఆరామము, (విహారార్థము) తోఁట.

వ ఇత్తెఱంగున నొక్క యెడ నయినను గాలూఁదక లీలోద్యానంబు గలయం గ్రుమ్మరుచు. విరా. 2-305

2. అడవి.

సీ. ఖాండవోద్యానంబుఁ గావనేరక సిగ్గుపడి చన్న నిర్జర ప్రభునికంటె
కర్ణ. 2-24

**ఉద్యాపనము** సం. వి. అ. న.

వ్రతసమాప్తి కాలమున వ్రతఫలమునకై చేయు కార్యము.

వ. ...వ్ర, తంబున కుద్యాపనంబు సేయఁ, దలఁచి యర్థించునతఁడును.
అను. 2-59

**ఉద్యుక్తుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

1. సిద్ధమైన వాఁడు.

వ. అని పలికి మరణోద్యుక్తులై జలాగ్ని విష ప్రాయోపవేశాదు లుగ్గడించిన విని సంజయుం డతని కిట్లనియె.
కర్ణ. 1-24; శాంతి. 6-568

2. ప్రయత్నించినవాఁడు.

ఉ. పాలకడవ పెక్కు పసులతో డించిన, యూతఁ డెట్లు దాని నరసి కొనుచు, మందునట్లు లోన నునిచిన మనము వే,మఱక యాత్మ వెనకు తెలఁగు మేలు.

క. ఈ తెలఁగున నుద్యుక్తుండై. అశ్వ. 1-320, 321

3. పరిశ్రమ చేయువాఁడు, కృషి సలుపువాఁడు, పాటుపడువాఁడు.

వ. అగస్త్యుండు దనతపశ్శక్తి జేసి పుత్త్రకాముండైన విదర్భరాజున కొక్కకూఁతుం బుట్టించిన నది లోపాముద్రయను నామంబుతో జలంబులయందు నలినియుంబోలె వినీతునందు లక్ష్మియుంబోలె నుద్యుక్తునందు విద్యయుంబోలెఁ బెరిఁగి యౌవనంబు వాల్చి రూపవతియై. అర. 2-328

**ఉద్యోగత** సం. వి. అ. స్త్రీ.

ప్రయత్నము, పూనిక.

క. ఉద్యతులై కవలును ధృష్టద్యుమ్నుఁడుఁ గడఁగఁ దోన సౌభద్రుండున్, మాద్యద్గతిఁ గవియుడు నే,కోద్యోగత ద్రౌపదీసుతో త్కర మడరెన్. భీష్మ. 1-288

**ఉద్యోగపర్వము** సం. వి. న్. న.

భారతమునందలి యైదవ పర్వము. చూ. మహాభారతము.

**ఉద్యోగము** సం. వి. అ. పుం.

ఉద్యోగ పర్వము.

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానారసా. భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడఁగా. విరా. 1-7

2. ప్రయత్నము, పూనిక.

వ. ...ఎల్లవిధంగుల నిప్పటి కిదియె కార్యంబు మీకు నందఱకుంబోలెఁ బోలునేని దీని కనురూపంబగు నుద్యోగంబు సేయుండనిన. విరా. 3-117; శల్య 1-58

3. యుద్ధప్రయత్నము.

ఆ. అనఘ నీవు చెప్పినట్టులు చేసెద, మున్న పలికినాఁడ నన్నరేంద్రు-
కడిమి వాకుఁ జాలుగాఁడని యుద్యోగ, వేళయందు చెల్ల వినుచు-
నుండ. కల్కి 1-96

4. మానవము, పురుషప్రయత్నము.

మ. విను ముద్యోగము రెంటియందుఁ బర మర్థివ్రాత యుద్యోగవం-
తునకున్ దైవము తోడ్పడంగ ఫలసిద్ధుల్ సేకుఱున్ మానవం-
బన కొక్కొక్కెడ సిద్ధి దప్పిన వగల్ వొందంగ రానీక య-
ప్పని దైవోపహతంబుగాఁ గనుట భూపాలార్హ వృత్తంబగున్.
శాంతి. 2-167

**ఉద్యోగవంతుఁడు** సం. విణ. (త్. తీ. త్.)

మనుష్య ప్రయత్నము సేయువాఁడు.

మ. విను, ముద్యోగము రెంటియందుఁ బర మర్థివ్రాత యుద్యోగవం-
తునకున్ దైవము తోడ్పడంగ ఫలసిద్ధుల్ సేకుఱున్.
శాంతి. 2-167

**ఉద్యోగి** సం. విణ. (న్. నీ. న్.)

ప్రయత్నము చేయువాఁడు.

క. త్యాగమొక వెలవు శమసం,యోగం బుత్తరము దీని పూర్వము
సంతో,షాగమము మోక్షలాభో, ద్యోగికి నివి గమ్యభూవు లుత్తమ
ధిషణా. శాంతి. 5-343; ఆది. 1-42

**ఉద్యోగించు** సం. అ. క్రి.

1. పూను, కడఁగు.

శా. ఏమీ విక్రమ మొ చ్నెఱుంగండె త్రిగర్తేశుండు మద్గోధన,
స్తోమంబుం గొనిపోవు తెంపునకు నుద్యోగించెనే మేలు మే, లామై
తోడవె పోవుఁగాక యని వీరాలాపముల్ పల్కి. విరా. 3-139

2. ఆయత్తపడు, సిద్ధపడు.

వ. ... అతండు పయనంబునకు నుద్యోగించిన.

ఆ. అతని ననుపవేఁగి యతిథిసంప్రీతి నేతెంచునప్పు డయ్యధిష్ఠిరుండు.
ఉద్యో. 1-214, 215

**ఉద్ద్యోతితము** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశింపఁబడినది.

ఉ. ... భీమసేనుఁ డుద్ద్యోతితహేమభూషిత చతుర్దశమార్గణ విద్ధుఁ జేయఁడన్ ద్రోణ. 4-200

**ఉద్ద్యోతితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ప్రకాశింపఁబడినవాఁడు.

ఉ. అతఁడు చిత్రసేనుని శరాసన మేదెఱఁ ద్రుంచి ఘోటకవ్రాతము నొంచి మైమఱువు వ్రచ్చి శరంబులు మేన గ్రుచ్చి యుద్ద్యోతితుఁ డైనఁ జూచి. భీష్మ. 2-316

**ఉద్రిక్తము** సం. విణ. (అ. ఆ. అ.)

అతిశయించినది.

వ. ... రక్తంబులొద్రిక్తంబును నగు నదీప్రవాహంబు మహాప్రాది చె ద్రోణ. 5-34

శా. రౌద్రోల్లాసము మూర్తిసంకలన ఘోరంబై పొరిం బోర్వెవాఁ నుద్రిక్తంబగు నూత్నరక్తమున మగ్నోన్మగ్నతం బొల్చె.

శల్య. 2-264; కర్ణ 2-183

**ఉద్రేకత** సం. వి. అ. స్త్రీ.

విజృంభణము.

సీ. మద్రేశుఁ డంత నిలువక, రౌద్రంబున వాలు వెఱికి రయము మెఱయ నత్యుద్రేకత డాసి యుఱికి, భద్రకరింగరిమఁ దునిమి పడవైచె నిలన్. భీష్మ. 1-2-4

**ఉద్రేకము** సం. వి. అ. పుం.

1. విజృంభణము ; పెచ్చుపెరుగుట

క. ఇన్నగమునందు గాండివ, మున్నది యదిగాని మద్భుజోద్రేక విలాసోన్నతి కోర్వవు పెద్దయు. నన్నవలీలిండ్లుగ నుఱచ బలఁతి బలంబుల్. విరా. 4-105; శల్య. 1-168; కర్ణ. 3-291

2. అతిశయము.

క. నాకొడుకు పోటుమాటలు, వీకటికిఁ బొసఁగ వాఁడ వేరపు మోర్పో

ద్రేకమునఁ బలుకుచుండుట, మాకు సహింపంగరాదు మహాత్ము
విప్రా. విరా. 5-255

**ఉద్రేకి** సం. విణ. (న్. ఈ. న్.)

ఉద్రేకముగలవాఁడు.

తే. పాండవార్థమై యొక్కరుఁ బనుప మీకు, భరము మీయెలు కంటఁబ
పలుకు మీరు. తెలుఁగు పలుకంగ మిగిలియుద్రేకులైన వార
చెడువారు విమల విచార విభవ. ఉద్యో. 1-44

**ఉద్రేకించు** సం. అ. క్రి.

విజృంభించు, చెలరేఁగు.

వ. (ద్రౌపది భీమునితో) కావున మదీయ పరిభవాతిరేకంబునకు
నీ వుద్రేకించిన జనంబులు మఱల భేదింతురు. నీకుం బోలింపంగి
రహస్యభంగంబుగాకుండ పరిభంగంబు సేయుము. విరా. 2-208

**ఉద్వహనము** సం. వి. అ. న.

ఉద్ధరించుట.

వ. ... సత్యవతి కురువంశోద్వహనార్థంబు పారాశర్యుం దలంచుడు
నాతఁడు. ఆది. 4-288

**ఉద్వహుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. (వంశాదికము) ఉద్ధరించువాఁడు.

ఉ. ఈతఁ డజాతశత్రుఁడు ... కౌరవ కులోద్వహుఁ డార్యవినాయ
సంతత, ఖ్యాతచరిత్రుఁ డీఁబుతగద్దియకుం దగఁడే నరేశ్వరా.
విరా. 5-321; అశ్వ. 1-121; ద్రోణ. 5-419

2. మోచువాఁడు, వహించువాఁడు.

మ (యుధిష్ఠిరుఁడు సుభద్రతో) భవదీయాత్మజు వాత్మజుండు కురు
భూభారోద్వహుం డయ్యె యాదవనంబో త్తరుఁడైన వజ్రునకు
నింద్రప్రస్థరాజ్యరబు గౌరవదీప్తంబుగ నిచ్చివాఁడ మహా. 11

వి.

* సప్తవాయువులలో నొకఁడు

శ. ... ప్రవహాం … ఉద్వహుండు సంవహుండు వివహుండు ప్రవహుండు పరావహుండనం బవనులు సప్తసంఖ్యలరిమి నఖిల భువనవ్యాప్తులై చరియింతురు. శాంతి. 6-307

4. క్రోధవశగణాంశమునఁ బుట్టినవాఁడు.

వ. ... క్రోధవశగణంబువలన మద్రక ... శ్రుతాయు రుద్వహామణి మదీశ్వరాదు లనేకులు పుట్టిరి. ఆది. 3-80

**ఉద్వాసించు** సం. స. క్రి.

వదలిపెట్టు, విసర్జించు.

తే. అప్పుడు యాజకజనము లయ్యగ్నిచయము, నడవిలోన నుద్వాసించి యరిగె. అశ్ర. 2-165

**ఉద్విలాసుఁడు** సం. విశే. (అ. అ. అ.)

మిక్కిలి సంతోషించువాఁడు.

మాలిని: అమృతమయ విలాసా, యాగభోగోద్విలాసా. ద్రోణ. 5-483

**ఉద్విగ్నము** సం. విశే. (అ. అ. అ.)

వ్యాకులత్వముగలది, సంక్షోభించినది.

వ. దుర్యోధన దుశ్శాసన కర్ణ శకుని సైంధవ ప్రముఖులగు దుష్ట లోకంబు వధోలోకంబున కనుచునంతకు మదీయాంతరంగంబు చింతాభరభుగ్నంబును వమానపంకమగ్నంబును గోపోద్విగ్నంబును నై వేగిరపడుచున్నయది. విరా. 2-286; ద్రోణ. 3-185; శల్య. 2-277

**ఉద్వేజిత** సం. విశే. (అ. అ. అ.)

(దుఃఖాదులచే) వ్యాకులత నొందినది.

క. ద్విజభామినికి నదర్శము, ప్రజ గాంచినచిరమ నయ్యపత్యము శోకోద్వేజితయుఁ బతిభక్తయునై, త్యజించి యనుమరణనియత యగుట మహాత్మా. అను. 5-301

**ఉద్వృత్తము** సం. విశే. (అ. అ. అ.)

1. నీతిని అతిక్రమించి నడచునది, చెడునడత గలది.

తే. ...చిగురుఁ దఱచునఁ గెంజాయ మిగిలి చెలువు, వడయు గ్రొమ్మావి బాదుపున శార్గవుండు.

క. నెత్తురు వడసిన మూర్ఛా, యత్తుండై సొగయుటయును వాతనిఁ గని యుద్వృత్త క్షత్రియ దర్పో, పాత్తంబగు తేజ మొల్లఁజూచె తోఁచెన్. ఉద్యో. 4-321; 322

2. మేర మీఱినది, మిక్కిలి అతిశయించినది.

శా. ఆ, రంగాగారము సేరవచ్చి మదిలో రాగంబు ఘూర్ణిల్ల నిం, తిం గాముం డట తేఁడె యింతకని యుద్వృత్తాంగతోఁవ్వాదుఁడై. విరా. 2-380

తే. ...ఉద్వృత్త శౌర్య, మాన తుంగ ప్రభద్రక మాత్స్యతతులుఁ, దోడ బలువిడిఁ దఱుమంగ ద్రోణతనయు, మట్టి శస్త్రాస్త్రచయము లుంచుటయును. సౌప్తి. 1-178; శల్య. 1-116

3. పై కుబికినది, పొంగినది.

వ. కోపావేశంబు నొంది యుద్వృత్త తారకంబుల వారలనెల్ల వాలోకించి. శల్య. 2-89; ఆశ్వ. 3-82

**ఉద్వృత్తి** సం. వి. ఇ. స్త్రీ.

గర్వము, చెడువడత.

క. (త్రిగర్తులు) వేయుచుఁ బొడుచుచు వ్రేయుచు, డాయుచు నుద్వృత్తిఁ దఱుముటయుఁ బొడిచేసెను. వాయుసుతుఁడు రథములు నిరు, వేయిటి రథిరత్యమాతవితతుఁలుగాన్. విరా. 3-212

**ఉద్వృత్తుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)

గర్వి, అహంకారుఁడు.

క. రెత్తయు రక్తైదు వాఁడే, మత్తగజాయుతబలుండు మారుతియని యుద్వృత్తుఁడగు దుస్సేనుని, నెత్తురురము వ్రచ్చి త్రావు నీవుం జూడన్. ఉద్యో. 4-204; మౌస 46

**ఉద్వేగము** సం. వి. అ. పుం.

1. వ్యాకులత్వము, కలఁత.

మ. అనుచున్ గ్రక్కున లేచి రోషకలితం బౌ హాసమాపూతు స్మమ్మైన ముద్వేగము( బొంద(జేయ బలసామగ్రీ సమజ్జృంభణం,బున వానిం దలపట్టి వంచుటయు నేపుం జేపయుం జేప వా(, డనుమానింపక కెట్టుదల్పిగొని కోపాటోపదీప్తాంగు(డై. విరా. 2-340

2. భయము, వడ(కు.

క. అవమానమునకు( ద్రుపుం, డవు నమ్మృతము ద్రావినట్ల యంచిత సమ్మానవిధికి నుద్వేగము( బొం,దు విషంబున( బోలె శమ రతు(డు మునినాథా. శాంతి. 5-25

3. దుఃఖము, పరితాపము.

సీ. తలృనందను(డు చిత్తమ్మున నుద్వేగ, మావహిల్లంగ నై వ మకట యిట్లు, సేసెనే కి దేమి సేసిరొకో వీర, లిన్నరకమునకు నేగు దేర, వలసిన యట్టిది. స్వర్గ. 24

**ఉద్వేజితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. కలంత పెట్ట(బడినది, సంక్షుభితము.

సీ. రుద్రనారాయణ రూపప్రవర్తిత మూర్తి ద్వయము రణమునకు( బొచ్చి, పరమ సంరంభంబు వాటింప నుద్వేజితము లయ్యె నఖిల భూతములు శ్రుతులు. శాంతి. 6-444

2. వెలపింప(బడినది, భయపెట్ట(బడినది.

మత్తకోకిల: విక్రమో,ద్వేజితాహిత విష్ణుసన్నిభ విష్ణువర్ధన భూపతీ. ఆది. 8-323

**ఉద్వేలము** సం. విణ. (అ. ఆ. అ.)

మిక్కుటమైనది, అతిశయించినది.

శా. ...గీర్వాణుల్ మునుల్ సిద్ధుల్,వ్వీరుం బ్రస్తుతిసేయుచుం బొంగిరి రుద్వేల ప్రమోదంబునన్. అశ్వ. 4-42

**ఉనికి; ఉన్కి** దే. వి. (√ఉండు)

1. ఉండుట.

చ. అనిన మహేశ్వ యిట్లనియె నంతపురంతకు మధ్గృహం బున,దునికి సమ్మతించిరి. విరా. 3-67

ఉ. ఆ వరవాత్సుఁ డిట్టనియెను శశ్వదుములం బరికించి యునికి యుంచేవి.
విరా. 1-272

2. జీవనము; బ్రదుకు.

వ. మాకుం బాడఁ బాండవులు పొడవడంగి లేకపోయిరి గాని యీ లోకంబున మనికి గలిగిన నగపడకుండ పేరరు. విరా. 3-87

ఉత్సాహవృత్తము : పగల ప్రోకతైన యట్టి దుస్తరవు టునికి కొల్లఁబాటు దన్కఁ డించు కేనియున్. త్రి 1-48

శ్లో. నచాన్య జీవితే రాజన్ నిర్వేదస్సముజాయత,
తతైసివ మనుష్యస్య జీవితాశా ప్రతిష్ఠితా. సం.భా. త్రి. 5-2

క. అనువెడఁ గ్రీడి యితఁడు కృష్ణ మనేతయ చెప్పఁగాని లోక మదరియుం, బవవఁడు కృష్ణుని గావున, వనుమానము వలవ దమ్మ పొత్తు మునికిన్. మౌస. 1-114; ఆది. 4-182

3 స్థానము.

వ. ...బోయలు నీ కొడుకు మడువున డాఁగిన యునికిఁ జెప్పిన.
శల్య. 2-352

4. అవస్థ, దశ.

క. మనమునఁ గృప పుట్టెడు న,ట్లనయముఁ గీడైన యునికి తాతం డెఱైఁగ, గనియును విడుమర దావిన్, వినవంతుం జెప్పవే వివేక విరూఢా. త్రి 1-50

**ఉనికిపట్టు** దే. వి.

నివాస స్థానము, ఉండుచోటు (లాక్షణికము)

తే. ఉభయ సేనలు తమ తమ యునికిపట్ల కరిగె. భీష్మ. 1-302
(స్థిర నివాసము)

సీ. అగమసత్యధర్మాచారతపముల, కునికిపట్టులుగాఁగ వనజభవుఁడు, గలిగించె మును బ్రాహ్మణుల. శాంతి. 4-87; శాంతి. 4-287
(ఆశ్రయము)

ఆ. ...పాదుఁదెరువరి కునికిపట్టొసఁగు టొసఁగుఁ దమకుమోదయ
మఁలు. అను. 5-196

**ఉనిచికొను** దే. స. క్రి.

కూర్చుండఁబెట్టుకొను. (చూ. ఉనుచు)

క. భయశోకంబులు దనదు హృదయమునఁ బోఁగొన విరాట ధరణీ
నాథు ప్రియ సంభావనసేసె వినయ పూర్వముగాఁగ ద్రుపదనంద
నకుఁ దగన్.

వ. ఇట్లు సంభావించి యత్తరుణిం దన పరిసరంబున నునిచికొని తదీయ
వదనం బవలోకించి. విరా. 5-56; 57

**ఉనుచు; ఉన్చు** దే. స. క్రి. (√ఉండు)

1. ఉండునట్లుఁజేయు.

క. ఇట్లు సొచ్చి తటియం బని మధ్య ప్రదేశంబున విరాటనందను శీలా
పర్యంకం బరసి కని దాని కనతిదూరంబునం బాంచాలి నొకరిల
నునిచి పావాతల్పంబున నుండె. విరా. 2-328; స్త్రీ. 1-125

వ. అగ్రభాగంబున శిఖండి నునిచి. భీష్మ. 3-191

2 కూర్చుండఁబెట్టు.

వ. సగౌరవంబుగాఁ దోడ్కొని చనుదెంచి సముచిత సమున్నతాసనం
బున నునిచి వినయావనతుండయి. విరా. 1-159

వ. గాఢాలింగనము సేసి కనకాసనంబున నునిచి. ఉద్యో. 1-94

క. అమ్మునివరు నా పర్యంకమ్మున నయ్యంబ ప్రీతి నునిచి...తత్పార్శ్వ
మునన్

వ. ...చేయొక్క సెజ్జం గూర్చుండె. అను. 3-11, 12

3. ఉండిగమునకై నిలువు.

ఆ. అనిన సంతసిల్లి యద్దేవి సైరంధ్రి, మాఱిడిల్లఁ బలికి యునిచి
కొనియె, నంతిపురము చరిత కలవడ మెలఁగుచు, నుండె నవ్వ
ధూటియును ముదమున. విరా. 1-330

4. దాఁచియుంచు.

నీ కడుఁ బెద్దకాలంబు గంధపుష్పాదుల, నర్చించుచున్నాఁడ నను దినంబు, -అ- దొనఁ గరంబు భక్తి నునిచిన యున్నది, యహి మయంబు దారుణాస్త్రము. కర్ణ 2-45

క. మీ తండ్రి కుఱికి నఱికిన, పేరియు నీ కొలకు నునిచి తిపుడ నరుకుదువ్, నీ తులువ పలుకులకు నీకై తోఁచిన యుత్తరంబు నదియె దురాత్మా. కర్ణ. 2-329

5. నిశ్చింపఁజేయు.

క. అలుఁకై ధృతరాష్ట్రుఁడు పుత్రులు దాను గూడి మమ్ము దూర స్థులుగా, నిటు వెలువరించి లాజా, నిలయంబున మనిచెఁ బాపనిష్ఠిత బుద్ధిన్. ఆది. 6-80

6. పెలకొల్పు, నిలుపు, ఉఁపు.

తే. బ్రహ్మచర్య శిక్షాకన పరత గలిగి, జటిత యొండె ముండిత యొండె సంభవించి, మనసు వాయందు తిరముగా నునిచి యొండు, వస్తు వుల దెస పొల్లమి వర్తింగ. అను. 5-269

క. దేవుఁడుగా కితఁడు నరుఁడు,వా వచ్చునె విష్ణపెంపునం బ్రాణం బుల్, కావలసినపుడ విడువం,గా వేడుక నునిచినాఁడు గాదె తమపునవ్. స్త్రీ. 2-112

వ... ఒక్క మోహరంబుగా నమర్చి యిం ద్రగభాగంబునం దాను నిలిచి యిరుగెలంకుల నశ్వత్థామ సౌబలులనునిచి నడకొవ కల్యా నిలిపి. ద్రోణ. 5-142; భీష్మ. 8-414

7. స్థాపించు, అభిషేకించు.

క. వినుఁ డింద్రప్రస్థపురం,బునకు నధీశుఁడుగ వ్రజుఁ బోఁడిమితో నే, మునిచెర పీరెల్ల నతఁడు, మనుపంగాఁ దొంటియట్ల మను ఁడతోప్పె టన్. మౌస- 1-131

8. అమరుచు.

వఁ ...ఎల్లి నీవు మనయరదంబు పన్ని శైబ్యసుగ్రీవ మేఘపుష్పవలా

హారంబుల గనకమణి మాలికాలంకృతంబులం జేసి పూన్చి గరుడ
ధ్వజంబు సంఘటించి చక్రగదా ప్రముఖాస్త్ర శస్త్రంబులు దగు
తెఱంగున నునిచికొని మైమఱువు దొడిగి రమ్ము. ద్రోణ 2-364

9. నియమించు, ఏర్పఱచు.

క. కని కృతవర్మకు సారథి, వానర్చి తనకృత్యమునకు నునిచి కదఁగి
యా,శినివరు డెమకొన ధర్మ సు,తుని దొర లయ్యస్త్రగురుని,
దొదర నడరినన్. ద్రోణ. 4-24

క. ..జనకు నకుఁ గావలిగా, నునిచిన వాడయి చెమ్మదిఁ, జనిన హరిఁ
జావు చెప్పఁ జనియెద నకటా. మౌస. 1-56

10. రక్షించు, పోషించు, కాపాడు.

క. మొదలఁ గలిగించి జగములఁ, బదిలంబుగ నునిచి వానిఁ బనపడి
తనయం, దొదిగించి మఱియు నెమ్మియి, మదారగతి నడపు చిన్మ
యుని గొలుతు హరిన్. శాంతి. 6-414

ఆ. మా ఱుకొన్నవారి సీఱు సేయుము ప్రజ, నరసి మనుపు ధరణి
సురులఁ బ్రోపు, మఖిల బంధుజనుల నాశ్రితులను సుఖ, వృత్తి
మనుపు పెంపు వెలయ నధిప. శాంతి. 1-370

11. ఒదిగించు, అణఁగియుండునటులఁ జేయు.

క. మనమున నైంద్రియములు, నునిచి మనం బాత్మ నల్ల నొదిగిం
పఁగ నెక్కొని ప్రాణంబున పానం,బును వశ్యత నిలుచు యోగ
మున సిద్ధికై. అను. 5-267

12. (యజ్ఞము) నిర్వహింపఁ జేయు, ఊనుచు.

సీ. ఈతండ నిఖలావనీతలేశుల నోర్చి, రాజసూయము ధర్మరాజు
ననుచు. ఆది. 5-124

క. పరచక్రపతులచే భీ,కరుఁడై ధనరాసు లదిమి కప్పము గొని చె,
చ్చెరఁ దెచ్చియిచ్చి నన్నను, భరతకులశ్రేష్ఠుఁ డునిచె బహుయజ్ఞం
బుల్. ఆది. 6-125

సీ. అగ్రజు రాజసూయాధ్వర మునిచిన, యధిక సమర్థున కర్జునునకు
అర. 1-378

13. తలంచు, స్మరించు.

క. విను మొకయుంచుకపే సై,నము నారాయణునిఁ దలఁచినను సుగతిఁ గనున్, మనుజుఁ దనిన మది పెప్పుడు, నునిచిన యాతనికి బ్రాఁతి యు త్తమధిమ రా. అను. 4-371

ఉన్నట్లుల దే.

ఉన్నది యున్న విధముగా,యథా ప్రకారము.

క. నన్నడుగ నేల నీవును, న న్నిచుఁడు నేమి మాటలాడితి రది వా, కున్నట్టు లెఱుఁగఁ జెప్పుము, నిన్నే మెచ్చించువాఁడ నీరజ వద వా. విరా. 2-278

ఉన్నతము సం. విశే. (అ. అ. అ.)

1. ఎత్తైనది.

తే అట్ల చేయుఁ కు రుచిరోన్న తాసనములు.

విరా. 1-200; అది 6-4

క. సమ విషమ వివిధోన్నత, సమీప దూరస్థలములు సర్వకము లుగఁ జి,త్తము క్రియ నవిహతగతులను, సమరమహిం గ్రీడిరథము సను వివిధమై. (మొరకయైనది) విరా. 6-469;

2 ఎత్తఁబడినది.

వ. ఉన్నతంబులగు నవసవ్య కరంబుల నాకుంచిత సవ్యబాహుతలంబుల నప్పళించు చప్పుళ్లు గలసి యొక్కరుండ మల్లచఱచిన చందంబున నీతేర. విరా. 3-14

3. గొప్పది, అతిశయించినది.

క. విను బండారము పెరుఁగని, జనపతికి బలంబు మిత్త్రి సంపదయును గ.ల్గునె బలమిత్త్రివిహీనున, కొనరునె రాజ్యంబు విభవమున్నత మగునే. శాంతి. 2-171

ఉ. ఉగ్రుఁ దమానమహిమోన్నత చిత్తుఁ డజయ్య విక్రమో దగ్రుఁడు .........ధార్తరాష్ట్రాగ్రజుఁడు. విరా. 5-15

4. వాడవైనది.

వ. అనుచుఁ బురుషోత్తముఁ జిత్తమున నిలిపి యున్నతంబైన పూర్వ

కాయంబుతో మంద ప్రకారంబున మార్గణంబు లమ్మద్రపతి దెస
నిగిడింప... కల్కి. 1-267

**ఉన్నతి** సం. వి. ఇ. స్త్రీ.

1. ఉచ్చస్థితి, వృద్ధి

చ. ...విచ్చలవిడి రాజ్యలక్ష్మిఁ దగుచందమునం గొనియాడు మున్న
తిన్. విరా. 3-95

మ. ...పది పంచిన విని్కృంతింబునం జేసి యున్నతిఁ బొందం గల
వారమై యునికి కృష్ణా వేఁడు గావచ్చునే.
ఉద్యో. 3-30; శాంతి. 5-576; అను. 2-156

2 కీర్తి.

సీ. ...సకలజనముఁ, గొనియాడు సిద్ధులు, మునులు సేవింతురు,
ధర్మనందనుఁ డిట్టిదాత్తుఁ దగువె,-తే-యతని కున్నతి గావించి
రవిలజుండు, గవలు నెంతయు నీచేతి గాండివంబు. అశ్వ. 1-144

**ఉన్నతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

అధికుఁడు, గొప్పవాఁడు.

క. ...విభవోన్నతుఁడగు విరటుపాల నుద్భటవృత్తిన్. విరా. 2-4

క. అనవద్య ధర్మచరితంబున నున్నతుఁడైన సహుషు పుత్రుఁడు,
ఆది. 3-24

**ఉన్నద్ధము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉప్పొంగిన, పెరిగినది, అతిశయించినది,

శా. గీర్వాణ ప్రవిముక్త బాణకటల క్రీడా విలాసంబులై, గర్వోన్న
ద్ధ సురారి శీర్షములు పెంచెన్ ద్రొళ్లె. అర. 5-276

**ఉన్నమత్** సం. క్రి. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు)

పైకెత్తఁ బడుచున్న.

చ. జలధి విలోలవీచి విలసత్కలం కాంచి సమంచితావనీ, తల వహన
క్రమంబయిన దక్షిణ హస్తమునం బదున్నమద్గళదురు ధర్మవార్త
కణ క్రమకరాబ్జము వట్టి నూతిలో, వెలువడఁ గోమలిం దిగిచె.

విశ్రుత కీర్తి యయాతి ప్రీతితోన. ఆది. 8-144

అతిశయించుచున్న.

శా. దూతవ్యాజమునన్ సభాంగణములో దుర్యోధనుం డట్లు దు,ర్నీ
తిం గూరి యొర్చినట్టి యధముల్ నిష్కంప ధైర్యోన్నమ,తృత
ప్పారుడవైన నీ కొకనికిం జెల్లెన్ సహింపంగ. అర. 4-157

**ఉన్నయనము** సం. వి. అ. న.

పైకెత్తుట పైకెగుర వేయుట.

ఎ కోశధ్వజోన్నయనంబును, విరా. 3-286

**ఉన్నయునికి** దే.

ఉన్నవాడున ట్లు (ఉన్నట్లే).

క. పాండవాగ్రజుం డున్నయునికిన యన్యాదృశరూపం బలవడి
విరా. 1-194

**ఉన్నరూపు** దే.

యథార్థము, సత్యము. ఉన్న విధము.

ఉ. ...నాకు నంతయును నేర్పడంగా నెఱిగింపు డున్నరూ,పయ్యది
నావుడున్ నరవరాగ్రణి కయ్యతిము ఖ్యుం డిట్లనున్. విరా.1-190

ఆ.వె. నాకు, నున్నరూపు సెప్పవన్న పార్థ... ద్రోణ. 3-193

**ఉన్నిద్రత** సం. వి. అ స్త్రీ.

వికాసము.

మాలిని:- వశాంవహో,న్నిరసన చరణాబ్జోన్నిద్రతా రాజమానా.
కర్ణ. 8-401

**ఉన్నిద్రము** సం. విణ. (అ. ఆ. అ.)

1. నిద్రనుండి లేచినది.

సీ. అరవిరివెత్తావి నడలించు మున్నిద్ర,ఝట పీది కొరకు వికశితావలం
ఉద్యో. 2-112

2. జాగరూకత గలది. ఎచ్చరిక గలది.

మ. సతతోన్నిద్ర వివైక శక్తమునలా. శల్య. 2-420

8 విరవిరియైనది.

మాలిని:- నిరతిశయ సముత్సోన్నిద్రశారుణ్యభద్రా. శాంతి. 6-624

**ఉన్నిద్రుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ప్రకాశించువాఁడు.

వ. ...అప్పాండవాగ్రజుండు యాగంబున కుద్యోగంబు సేయుట వారులు సెప్ప నాకర్ణించి కుతూహలోన్నిద్రుండై (కృష్ణుఁడు) అశ్వ. 3-161

**ఉన్నేత** సం. విశే. ఋ. పుం.

రాజసూయ యాగంబునం దొక స్థానము వహించువాఁడు చూ- సభా. 1-292

**ఉన్మగ్నత** సం. వి. ఆ. స్త్రీ.

తేలుట.

శా. ఉద్రిక్తంబగు నూత్న రక్తమున మగ్నోన్మగ్నతం బొల్చి తర్ల ద్దూహోగ్రగదాయుగంబు...చెన్నువడసెన్. శల్య 2-264

**ఉన్మగ్నము** సం. విశే. (అ. ఆ. అ.)

తేలినది.

వ. అన్నియు నహంకార వ్యాప్తంబులయి యవ్యక్త సాగరంబున మగ్నోన్మగ్నంబు లగుచుండు. అను. 1-325; శల్య. 2-264

**ఉన్మత్తము** సం. విశే. (అ. ఆ. అ.)

మిక్కిలి మదించినది.

ఉ. చిత్తము లుల్లసిల్ల నల సింహకిశోరములొక్కమై మదోన్మత్త గజావళిం బొదువు మాడ్కి నరాతిబలంబు ముట్టి· ఉద్యో 2-140

**ఉన్మత్తవేషిణి** సం. విశే. (న్. ణి. న్.)

పిచ్చిదాని వేషము ధరించినది.

తే జీర్ణమై కదు మాసిన చీరగట్టి, ధూళిధూసరాలకములు దూలు చుండ, నబల యున్మత్త వేషిణియైన యచ్చి, కరణి నిట వచ్చుచున్నది కంటె దాని. అర. 2-115

**ఉన్మత్తుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

ఒడలు తెలియనివాఁడు, తైకెక్కినవాఁడు.

వ. కామాయత్త చిత్తుండును గర్వోన్మత్తుండును గావున జనసమూహంబు నరకుసేయక రహస్య ప్రకాశ విభేద విచారంబు దక్కి. విరా. 2-127

2. దుర్మార్గుఁడు, చెడునడత గలవాఁడు.

సీ. సన్మార్గరతయు మన్మత్త శిక్షయు నంచితోదయము గృపాతిశయము. విరా. 3-102

3. పిశాచాద్యావేశము గలవాఁడు.

వ. ఉభయసైనికు లున్మత్తులగతిం గవిసి. భీష్మ. 1-267

4. పిచ్చివాఁడు.

సీ. గోవు బ్రాహ్మణు బాలకుని వృద్ధు నంధుని సఖుఁ దోఁబుట్టువు జడుఁ బ్రమత్తు, మత్తుని గురుని మున్మత్తుని సుప్తుని సంగత భీతుని నస్త్రశస్త్రు, సిహతి నొప్పించుట విహితంబు గాదని యార్యులు చెప్పుదురు. శాంతి. 1-106

సీ. భూపాల యతఁడు కాశీపురిఁ బాయక, వర్తించు మున్మత్త వర్తనమున. ఆశ్వ. 1-45

5. మన్మథ వికారము గలవాఁడు, కామముచే మద మెక్కినవాఁడు.

సీ. అంతఁ బులోముఁడన్ వీర రక్కసుఁ డగ్ని, హోత్ర గృహంబున కొయ్యనచ్చి, యత్తన్విఁ జూచి యున్మత్తుఁడై యెవ్వరి, సతి యిది చెప్పుము జాతవేద... -అ- యనఁగ. ఆది. 1-128

**ఉన్మథనము** సం. వి. అ. న.

చంపుట.

చ. ...దేవతాసురపరిరక్షణోన్మథన కోవిదకటాక్ష విహార

భా. 8 4-455

**ఉన్మదము** సం. విశే. (అ. ఆ. అ.)

1 మదమెక్కినది.

చ. అదియు నుగాక కోయపులినైనను గారెనుపోతునైనను, న్మదకరినైన నున్మద మృగనాథునినైనను గట్టి ముట్టి. విరా. 1-88

2. గర్వించినది.

మ. ఈ వచ్చు నున్మద వీరావళికిన్ భుజావిభవవిన్యాసంబు గాన్పించి మా, న్పెద గర్వంబు మరల్పెదం బసుల వాదేఁ జిక్కు రా కెమ్మె యిన్. విరా. 4-268

3. చపలత్వము గలది.

మ. యదువంశంబున లోకరక్షణ పరుండై పుట్టి క్రేపల్లె నున్మద బాల్యంబు నడెంచి కంసముఖ నానాదైత్యులం ద్రుంచి. ద్రోణ 1-97

**ఉన్మదించు** సం. అ. క్రి.

పిచ్చి మాటలు పలుకు

సీ. శయానుండయ్యు నా సీమండయ్యుఁ బ్రియాశ్రేణిఁ గని యున్మదించెనేని నది పిశాచగ్రహము. అర. 5-268

**ఉన్మదుఁడు** సం. విశ. (అ. అ. అ.)

1. దురహంకారము గలవాఁడు, గర్వి

క. అది యట్టిద సందానము. దుది నెమ్మెయి గల్గునెట్లు దుర్యోధనుఁ డున్మదుఁడు ధృతరాష్ట్రి భూవిభు, హృదయంబు తెలంగు గొంత యెఱుఁగుదుమె కదా. ఉద్యో 1-339; ఉద్యో 2-218

1. ఉద్రేకము గలవాఁడు.

క. పదిటన్ ధృష్టద్యుమ్నునిఁ, బదియమ్ముల నతని సూతుఁ బటురయ మున నున్మదుఁడై నొప్పించినఁ గెం, పొందవిన మోము గాఁతి నవ్వు నొవ్వున నొప్పెన్. భీష్మ. 2-187; కర్ణ. 2-316

**ఉన్మాదము** సం. వి. అ. పుం.

1. మదము, మత్తు

క. అని వీడఁగఁ బల్కిన న, మ్మనుజాధము డంతఁ బోక మనసోన్మాదంబున దమ్ము నెదిరి పెలుఁగక, వనితకు నిట్లనియె గారవంపుఁ బలుకులన్. విరా. 2-51

2 వెఱ్ఱి.

ఉ. వైదిక ధర్మచారి జనవత్సల నీ మదిఁ బట్టుకొన్న యున్మాదము

హీన మానవు మనంబునఁ బుట్టిన కెల్లవోరి నున్మాదముఁ దీర్చు
చొప్పదు. శాంతి. 1-101

3. అతిశయమైన ఉద్రేకము.

మ. మదిరాత్ముండు గదంగి యున్నకు నతోన్మాదంబు రెట్టింప
విరా. 3-173

**ఉన్మాది** సం. విణ. (న్. సీ. న్.)

ఉన్మాదముగలవాఁడు, మిక్కిలి యుద్రేకము గలవాఁడు

శా. ...ఆ త్తుం గౌంతేయుం గిమ్మహీ వలయమున్ దుర్దాంత చంచ
ద్భుజా,సంగ మ్మూర్జిత చక్ర విక్రమకళా సంక్రీడనోన్మాదినై.
తిమ్మ. 2-168

**ఉన్మాదిని** సం. విణ. (న్. సీ. న్.)

ఉన్మాదముగలది, పిచ్చిది.

సీ. ఆఁకలి తృష నిద్ర లను వీని కెఱుఁగక యున్మాదినియుఁబోలె
మున్న దాని. అర. 2-108

**ఉన్మార్గము** సం. వి. అ. పుం.

తప్పుత్రోవ, చెడ్డనడత.

సీ .... దుర్వృత్తుల వధియించు రుద్రుని, గోవిందు దాసవు గురుని
బోడు-తే-మా మహాత్ముల దక్కు నున్మార్గ చరుల, దండితులఁ
జేత వినమె... శాంతి. 1-108

తే. విభుల సంపు, పేయ కున్మార్గములఁ దమ చిత్తములకు, వచ్చినట్ల
వర్తింతురు వనిత లధిప. మాన. 1-1[illegible]

**ఉన్మార్గయానము** సం. వి. అ. న.

దారితప్పించి నడచుట.

తరువో॥ :— అతి దుర్గమగు నరణ్యప్రదేశమున, నవనీపురం బోకఁ
దరుగుచుండ, మితిలేని ఘోరంపు మృగములు శరభ, మృగపతి
ప్రముఖములే మిక్కిలి భయము, మతి గావహించుచు మార్గంబు
నందు, మల్లడిగొనుడు నున్మార్గయానమున, ధృతి దూలఁ బన.
త్రి. 1-1[illegible]

**ఉన్మ్రీలితము** సం. విశ. (అ. ఆ. అ.)
బాగుగాఁ గలుపఁబడినది
వ వ్యాఘ్రమదకర్పూర కుంకుమోన్మిశ్రిత సుగంధం బులఁది.
అర 1-850

**ఉన్మిషత్** సం. శత్ర. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు)
1. ప్రకాశించుచున్న.
ఉ ఏమిట నిట్టులయ్యె నాకో యమ్మహిమాత్మకుఁ డంచు మున్మిష, ద్ధామము లైన యంగములఁ దాఁ గలయం బరికించి. మాప. 165
2. వికసించుచున్న.
చ. జలరుహావాత గమ్యగిరిసానువనంబుల వేఁటలాడుచుం, జలువుదమీ నిదాఘ దివసంబుల నీవును నేను మున్మిషన్నళిన రజస్సుగంధి యమునా ప్రవాహ తుంగ తరంగ సంగతా, విల తీర స్థలాంతర వికస్మిత నిర్మల హర్మ్య రేఖలన్. ఆది. 8-232

**ఉన్మీలత్** సం. శత్ర. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు)
ప్రకాశించుచున్న.
శా. బాలార్కద్యుతి పుంజ పింజర జటాభారంబుఁ బ్రావృష్ణవ, శ్రీ, లీలం బ్రవహించు నంగమము రోచిస్ఫార పండంబు నున్మీలన్నీల మృగాజినాంబరమునై నిర్వాణ దానక్రియా, శీలుండై న పరాశ రాత్మజుఁడు విచ్చేసెం గృపాలోలుఁడై. అశ్వ. 2-147; ఆశ్ర.2-1

**ఉన్మీలనము** సం. వి. అ. న.
వికాసము.
మాలిని— నిజతను విభవతోన్మీల వాల్పిన్నవాదా. విరా. 3-289

**ఉన్మీలితము** సం. విశ. (అ. ఆ. అ.)
1. వికసించినది, పుష్పించినది.
ఉ ... వసంతవిభ్రమో, న్మీలితబాలవల్లి క్రియ మేలగుచూడ్కులు మించి. అర. 6-148
2 విరివియైనది, విస్తృతమైనది
ఉ. వాలి యొలుంగు మాపి కృతవర్ముఁడు సైన్యము నిల్పారించి.

యున్మీలిత విక్రముం డగుడు మేమెయి వాతని దాఁకె నత్తృవి,
ద్యాలసితుండు సాత్యకి కల్య. 1-322; ద్రోణ. 2-110

**ఉన్ముఖము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉద్యుక్తము, సిద్ధమైనది.

వ. పాండవబలంబు సమయసముచితంబగు సమరవిరామంబునకు
సమ్ముఖంబగుట యెఱింగియు. ద్రోణ. 1-387

**ఉన్మూలనము** సం. వి. అ. న.

వేళ్లతోఁ బెల్లగించుట.

వ. నదీప్రవాహంబులు వృక్షోన్మూలనంబు సేయునట్లు. సభా. 1-131

**ఉన్మూలించు** సం. స. క్రి.

1. వేళ్లతోఁ బెల్లగించు, పెఱికివేయు.

తే. ఉదధి సుభగోష్ఠి నున్నవు నదులతోడ, మీకటంబుల తరువులు
మీరు వొంగి, తఱిమి పాఱినఁ గూలు వేతసములేల, పెఱికిపోవవి
మీకేమి ప్రియమొనర్చె - వ - వాని నున్మూలింప మీకు శక్యం
బుగామింజేసియో వానికిం జేటు వాటిల్ల దిదియేమి యనవుడు
గంగ యిట్లనియె. శాంతి. 3-57

2. నాశముచేయు.

మ. ముసలం బిట్టుచుఁ బవ్వ వృథతతు లున్మూలించుచున్.
అర. 3-152

**ఉన్మేషణము** సం. వి. అ. న.

(కన్ను మొ) తెఱచుట.

వ. మఱియు నొకవరంబు భవదీయ నయనోన్మేషణ కారణంబయ్యె.
అర. 7-272

**ఉన్మేషభూతము** సం. విణ. (అ. ఆ. అ.)

అభివ్యక్తమైనది, స్ఫురితమైనది.

మాలిని— విగమకుసుమ గంధోన్మేష భూతాభిధానా. విరా. 5-407

**ఉన్మేషము** సం. వి. అ. పుం.

1. అభివ్యక్తి, స్ఫురణము.

మ. నిజవంశోత్తమ వీరవృత్తమున కున్మేషంబుగా నాకపి ధ్వజుఁ డు
  త్సాహము సేయకున్న. ఉద్యో 4-16

మాలిని:— సిగమ కుసుమగంధోన్మేష ధూతాళిధావా. విరా. 5-407

2. వికాసము, అభ్యుదయము

మ నిను మన్నింతయు నమ్మి పాండవుల యున్మేషంబు సేఁ జేరితిం
  గాన. భీష్మ. 3-170

క. ...మహోవిద్యోన్మేషగాత్ర. స్వర్గ. 1

3. విజృంభణము, పెచ్చుపెరుగుట.

శా. నీరుం జాయఁగఁ జల్లి రాక్షసుల యున్మేషంబు మర్దించి.
  అను. 1—255

ఉప సం. అవ్య. (ఇది సమాస పూర్వపదముగానే యుండి తఱచుగా ఈ క్రింది యర్థములను దెలుపును)

1. ఆసన్నము, సమీపమున నున్నది

ఉపవనము. శాంతి. 6-262, ఉపనీతము. సభా 2-2;
ఉపగతము. కర్ణ. 3-109

2. సదృశము.

ఉపకీచకుఁడు. విరా. 3-9; ఉపపాండవులు. ఆది. 4-115.

3. అల్పము. చిన్నది.

ఉపపర్వము. ఆది. 1-66; ఉపాంగము. అర. 2-32, ఉపశాఖ. హ. త్రి. 1-15; ఉపమహీధరము. భీష్మ. 1-35.

4. అధికము.

ఉపనయనము. ఆది. 5-3; ఉపబృంహణము. శాంతి. 6-410

5. కొన్నిచోట్ల నిరర్థకముగాఁ గూడఁ గనఁబడుచున్నది.

ఉపసంజనితము. అను. 1-155. ఉపజనితము. కర్ణ. 1-27
ఉపభుక్తి. అను. 3-282 ఉపభోగము. శాంతి. 5-501

6. కొన్నిచోట్ల అర్థవిశేషమును గలిగించును.

ఉపకృతి. ద్రోణ. 3-380; ఉపవాసము. అను. 1-149; ఉపహారము విరా. 1-308; ఉపచారము. విరా. 5-367; విరా 3-44

**ఉపకంఠము** సం. విశే. (అ. ఆ. అ.)

దాపైనది, దగ్గఱనున్నది.

వ. ... ఋశ్యమూకశైలంబుఁ జేరి తదుపకంఠ ప్రదేశంబున విశ్ర మించి యున్నంత. అర. 6-368; అను. 3-62

**ఉపకరణము** సం. వి. అ. న.

1. ఉపకరించుట, ఉపయుక్తమగుట.

క. తరణి శశినేత్ర జగదుప,కరణచరిత్ర యోగగాత్ర. శాంతి. 3-580

2. సాధనము, పనిముట్టు, పరికరము.

వ. ప్రజాపతి ప్రజల సృజియించి పరంపరనె సంహారంబు లేమింజేసి భూమికిఁ దదీయభారంబు దుర్భరం బగుటయు నముసంధించి చింతాక్రాంతుఁడై తత్సంహారంబునకు నుపకరణంబు గానక కటకటంబడిన. ద్రోణ. 2-160

వ. యుధిష్ఠిర భీమ నకుల సహదేవులం యరదంబులు తురంగాది పరిక రంబు కట్టిట్టి వని యేర్పడంబలికి విరాటద్రుపదాదులకు వలయు నుపకరణంబులు గొలఁత లేమియు వెలిఁగించిన. ఉద్యో. 2-228; అశ్వ. 1-31; ఆది. 4-64.

3. చిహ్నము, లక్షణము (వస్త్రాభరణ మాల్యాదులు)

వ. ... వారివారికి నర్హ్యవేషంబుల నమగుణంబులగు నంబరాభరణ మాల్యాద్యుపకరణంబులు సన్నిహితంబులయినఁ జూచి సంతసిల్లి. విరా. 1-184

4. (రథ్యాదులకుపకరించు మైపూఁత మొదలగు) చిహ్నము, పరికరము.

సీ. మలయపవను సింపారు చోఁకున విగురొత్తు చిత్తంబు, వెలసి యొడొరులపైఁ బొలయుచూడ్కి, లాదట నుపకరణావలి వెద వెద, యాదరించుట రాగ మదరఁ దొడఁగె. విరా. 2-288

**ఉపకారకుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)

మేలొనరించువాఁడు.

సీ. వణిజులు లోక ప్రవర్తనంబులకెల్ల నుపకారకులు. అను. 5-18

**ఉపకారము** సం. వి. అ. పుం.

1. ఉపకృతి, మేలు.

సీ. ... కృప నుపకారమునకు, శాత్రవముగ నీవు సేసిన పురుషుఁ డా మేల్ దన, యలఘు పౌరుషమునఁ గలిగెనఁట. అను. 4-382

2. ఉపయోగించునది.

వ. అనిన విని యాజగత్కర్త యోషధులును ఫలమూలాదిభక్ష్య సంపదుపకారంబులుగా వృక్షలతాగుల్మంబులును గల్పించి. శాంతి. 2-114

**ఉపకారి** సం. విశే. (న్. ణీ. న్.)

ఉపకారము చేయువాఁడు, మేలుచేయువాఁడు.

మాఱిడి :- సర్వోపకారి. ద్రోణ. 1-392

వ. పరమోపకారియైన యీ బ్రాహ్మణునకు నేమి ప్రియము సేయ సమకూరునో యని. ఆది. 6-240

**ఉపకీచకుఁడు** సం. వి. అ. పుం.

కీచకుని తమ్ముఁడు.

వ. ఒక్క యుపకీచకుండు నిజసహోదరులం జూచి, విరా. 3-9

(వీరు మూటయైదుగురు. కీచకుని శవముతో ద్రౌపదిని గట్టి శ్మశానమునకుఁ దీసికొనిపోవు సమయమున భీముఁడు వీరినందఱినిఁ జంపి ద్రౌపదిని విడిపించెను.

చూ. (విరా. 3-9 మొదలు 29 వఱకు)

**ఉపకృతి** సం. వి. ఇ. స్త్రీ.

ఉపకారము.

క. (ధర్మరాజు సాత్యకితో) త్వరితముగఁ జనుము సఖుఁడు, గ్గురుఁడు గదా నీకు నర్జునుం డుపకృతి కృత్వరుత్తి నెగడెదు సత్తమ పురుషులు వేచు తఱి వచ్చె భుజవీర్యనిధీ. ద్రోణ 3-280

**ఉపక్రమము** సం. వి. అ. పుం.

ఉపాయము నెఱింగి ప్రారంభించుట, ఆరంభము, మొదలు పెట్టుట,

క. లేవకడ యుభయబలములు, నేవున నెలమియును పెరశ మెసఁగ
వెడలి యాఁటోపంబున రణసన్నా, హోపక్రమశీల మెఱయ
నుజ్జ్వలభంగిన్. ద్రోణ 1-214

2. కార్యము, పని

వ. ... వారల సంవాద ప్రకారంబు వ్యాపికేళుం డెఱింగి వీఁడు సంయమివరు మాట గీటునంబుచ్చి తన వలసినట్లు సేయువాఁడయ్యె నిప్పాపాత్ము ముపక్రమంబునకు నడ్డపడి మాటెదఁ గాకున్నఁ దుది వాచేయు తెఱంగున్నదియ కాదె యని వితర్కించి. సౌప్తి. 2—79

**ఉపక్రమించు** సం. వి. అ. క్రి.

తొడఁగు, పూను, కడఁగు.

వ. ... సూర్య సంకాశుండవగు నీవు సూర్యోదయ సమయంబునఁ బ్రకాశ ప్రకారంబైన పరాక్రమంబున కుపక్రమింపు మనవుడు నశ్వత్థామ కృపాచార్యున కిట్లనియె. సౌప్తి. 1—82 అశ్వ. 1-64

వ. ... కృష్ణార్జునులు సంతసిల్లి సన్నద్ధులయి రథంబెక్కి యగ్ని దేవుం జూచి సురాసురపరివృతుండయి సురపతి వచ్చినను జయింతు మింక శంకింపక ఖాండవ దహనార్థం బుపక్రమింపుమనిన నగ్ని దేవుండు హర్షించి. ఆది. 8—254 ఆది. 6-276

స. క్రి.

వ. ... ఇప్పుడు మీరిందఱు తెఱంగ నాయందు కారణ వ్యతిక్రమం బుపక్రమించి యత్యంత శత్రుం డయ్యె. సభా. 2-66

**ఉపగతము** సం. విశే. (అ. ఆ. అ.)

సమీపించినది, దగ్గఱినది.

వ. ... తత్కాలోపగత సముచిత పరిజనానీకజలంబుల ముఖప్రక్షాళనంబు సేసికొనిరి. కర్ణ 3-109

**ఉపగమము** సం. వి. అ. పుం.

1. జ్ఞానము. ఎఱుక.

సీ. శాస్త్రోపగమము నస్ఖలితదమము. విరా. 3-102

2. ప్రాప్తి, పొందుట.

మాలిని...శ్లాఘనీయ ప్రకమోన్య.న్మరుదుపగమ లీలామధ్యమావేందు బింబ, శరదమృతవికారోత్సారణానందరూపా. కల్కి. 2-432

**ఉపగిరి** సం. వి. ఇ. పుం.

ఒక దేశము, కొండ సమీపమునందున్న ఒక దేశము.

క. అతుల చతురంగసేనా, యుతుఁ డంతర్గిరి బహిర్గోపగిరుల భూప తుల నని వోర్చి కార్యో,న్నతిఁగొనియెను వారిచేత వావాధన ముల్. సభా. 1-234

**ఉపఘాతము** సం. వి. అ. పుం.

చోఁకు, బాధ

క. విను దెబ్బది యేండ్లగుదాఁ,కను మానవులకు గ్రహోపఘాతం బులు గల్గు ననంతరంబ గ్రహముల, పని వలవదు ముదిమియెల్ల పనులకుఁ జాలున్. అర 6-254

**ఉపచరణము** సం. వి. అ. న.

సీ. సంవర్తుఁ బిలిచి యాగన పాన్య మఖోపచరణముల్ నడిపించి. అశ్వ. 1-70

**ఉపచరించు** సం. స. క్రి.

1. గౌరవించు, సమ్మానించు.

వ. ... ఎవ్వారితోడ నెయ్యంబుగా బలుకం దగు ప్రణామ పీయ బాంధవమైత్రీ వాత్సల్యంబులకు నయ్యె ప్రకారంబుల మన్నసం బులుగాఁ బలికి యుచితంబులమైయ మపచరింపుము. ఉద్యో. 1-367

2. సేవించు, పూజించు.

తరల...తల్లి వచ్చిన భక్తితో, మపచరింపక లాఁతివై యిటు లూర కుండ ట యుక్తమే. స్త్రీ 2.27

అ. క్రి.

3. దుఃఖోపశమన మొనరించు.

వ ఇవ్విధంబున నాలింగనంబు సేసి సాంత్వవచనంబుల నుపచరించె. స్త్రీ 1-126

వ. నందుకుల తమవుల మీఁద వదనంబు బాష్పాంబుధారాక్రాంతంబుగాఁ బ్రకటాక్రందనంబు సేయుచుఁ బలవించుచుండెఁ గృష్ణార్జునులును సముచిత భాషణంబుల బోధించిరి. తక్కటివారును దగుమాటల నుపచరించిరి. సౌప్తి. 2-22

4. ఉపకరించు, ఉపయోగించు.

సీ. (గోవు) తోట శృంగంబులు వాలంబు రోమచ,యము శకృన్మూత్రము లఖిలవర్త-అ-నముల కుపచరించు. అను. 2-397

ఉపచారము సం. వి. అ. పుం.

1. ఇచ్ఛకము, ముఖప్రీతికై పలుకుమాట

వ. అని వారు మున్న విన్న కీచకవృత్తాంతంబున కనుగుణంబుగా నుపచారంబులు వలుకుచుండ నా బృహన్నల సైరంధ్రి కిట్లనియె. విరా. 3-45

2. పూజ.

వ. అతండును (విరాటుఁడు) ససంభ్రమ పరిజనసముపనీయమానంబులగు నానావిధోపకరణంబులం గౌంతేయులకు వివిధోపచారంబు లాచరించి మహార్హమజ్జన భోజనంబులు పెనడ. విరా. 5-367

3. సేవ.

వ. వారలంజూవె దేవతలు బ్రాహ్మణు లింద్రు నా రెల్లవారికి నమస్కారాద్యుపచారాదరణీయులు. శాంతి. 5-99

4. ఉపయోగము, భుజించుట.

తే. ... తియ్య పంటిపరువ, మాదరించి తదుపచార మాచరించు వెరవుగల యట్టి జనముల విధము దోఁప. అను. 5-425

5. సాంత్వనము.

క. ప్రభువుల నుపచారంబుల, విభుఁ దమలాగిల్లఁజేసి. శాంతి. 2-307

ఆ. ఉముక దిమచు నిట్టులుండి నీ తొల్లి ఉండి, లిలఁ దలఁచి యుమ్మలింతో
లేదొ, యన్నరూపు సెస్పవన్న గార్ధభరూప ధారణైక నిపుణ
దానవేంద్ర. శాంతి 4-391

ఉ. గాడిదరూపు దాల్చి యుముకల్ దినుచుండఁగఁ జూచి యుల్ల
సంబ్రాడెదు శక్ర. శాంతి. 4-396

**ఉమ్మడి** దే. అవ్య.

ఒకే కాలము, యుగపదర్థకము, 'ఒక్క' శబ్దపూర్వకముగానే దీనికి
తిక్కనగారి ప్రయోగము. నన్నయ ప్రయోగము కానరాదు.

ఒక్క యుమ్మడి. ద్రోణ 2-92; ద్రోణ. 1-132

చూ. ఒక్కుమ్మడి, ఒక్కయుమ్మడి.

**ఉమ్మలము** దే. వి.

సంతాపము, దుఃఖము.

ఆ. ఇంత తలర నేల యెమ్మెయి నైనను, గొమ్మ నలవరించి కూర్చు
టరుదె, యుమ్మలంబుదక్కి యూఅటతోడ నీ, వేగు మసలవలవ
దింక నిచట. విరా. 2-80

క. కనకమయ యూపమొప్పఁగ, నమాన విధమున నీవు యాగం
బొనరించిన యొప్పును నిప్పటి నీ, యునికియుఁ జూచి నాకు
నుమ్మలమయ్యెన్. శాంతి 4-390

**ఉమ్మలించు** దే. అ. క్రి. (ఉమ్మలము + ఇంచు)

1. తపించు, దుఃఖించు, శోకించు

ఉ. అక్కటయేమి వేడ్కపడి యానెదు నానవ మర్థిఁదేరఁగా, నొక్క
నిక్రృష్టఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గోసెక్కఁగఁ జేసి
నిన్ను నతిహీన విధాననియుక్తఁ జేతఁగా, నిక్కము యుమ్మలించి
తిది నెయ్యము కల్మియే సఖి. విరా. 2-98

తే. చనిన నయ్యేలవాఁగయు సంభ్రమంబు, దెచ్చికొని తా నెఱంగని
తెఱఁగు దాల్చి, కార్యమున నుమ్మలించి పాంచాలితోడ, నెఱుఁగు
వేఱొక భంగిగా నిట్టు లనియె. విరా. 3-155

2. విచారపడు, దీనత్వము పొందు.

వ. భీమ్మల గాంచి రట్లు సముచిత ప్రకారంబున గని యతనిం జరివే

ష్టి చి యాపీన లైరప్పు డచ్యుతుం డమ్మహాత్ము న్నాలోకించి
యుమ్మలించుచు నతఃతోడ. శాంతి. 2-99

"శ్లో. కించిద్దీనమనా భీష్మమితి హోవాచ కేశవః"
సం. భా. శాంతి. 50-12

3. విచారించు, ఆలోచించు, తలంచు.

వ. విరూపాక్షుండు విశాలాక్షుండను నామంబున నావిర్భవించి యీ
గ్రంథం బధిగమించి దాని నభ్యసించుటకు మర్త్యుల కాయుర్వృద్ధులు
పాలవనియు మ్మలించి యమ్మహానీయ తంత్రంబు సంక్షేప రూపం
బునం బదివేలధ్యాయంబుల వైశాలాక్షంబన నిర్మించె.
శాంతి. 2-203

ఉమ్మలిక; ఉమ్మలికము దే. వి.

1. ఇమ్మహిఁ దొల్లను నీమది, యుమ్మలికకుఁ జాల నొచ్చె నుర్వీవర.
ఉద్యో. 1-107

చ. ...ఉమ్మలికయు నబ్బు నాదుమది మందునకైనను లేదు కేశవా.
శాంతి 4-395

క. మునుముట్ట నెఱిఁగి శ్రాద్ధంబునకుం గైకొమట మేలు భూసురు
నిం గైకొని యరసి కాఁడనిన వ్రాతని యుమ్మలికంబు సెలచు
ధార్మికుసైనన్. అను. 3-182

2. కష్టము, ఇడుము, బాధ.

సీ నలుని పిఱుందఁ గానల కేఁగి దమయంతి మనుజులు వడసి యుమ్మ
లిక వడదె విరా. 2-284

వ. ఇవ్విధంబునఁ గృష్ణునితోడఁ దనయుమ్మలికంబు లన్నియుఁ ద్రవ్వి
కొని శోకంబు వెల్లిగొన. ఉద్యో. 3-181

ఉమ్మలికించు దే. అ. క్రి. ఉమ్మలించు (ఉమ్మలిక + ఇంచు)

చ. ...భీష్ముఁడెఱిఁగి వారికిట్లను సురగలార కాలగతి నాత్మఁదలంచి
యకాదె మేనిలో మనిచిన వాఁడఁ బ్రాణముల నుమ్మలికింపకుఁ
డించుకేనియున్. భీష్మ. 3-15

సీ. క్షత్ర ధర్మంబునఁ గైకొంటి మేదిని, యుమ్మలికింపక లెమ్ము వత్స
ఆశ్వ. 1-6

**ఉయ్యాల** దే. వి.

ఉయ్యేల.

సీ. ఓహారిపాహారి నుయ్యాల చేరుగా వెనుకొంచుఁ దెరలుచుఁ బెనఁగు వెడలు. విరా. 8-164

**ఉయ్యాలచేరు** దే. వి.

ఉయ్యేలకుఁ గట్టిన త్రాఁడు, ఉయ్యేలత్రాఁడు.

సీ. ఓహారిపాహారి నుయ్యాల చేరుగా వెనుకొంచుఁ దెరలుచుఁ బెనఁగ, వెడలు. విరా. 8-164

**ఉయ్యేల** దే. వి.

ఉయ్యాల.

చ. నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగత కారియైన యు,య్యేలయును బోలె నూఱడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చితాత్ముఁడై. అర. 2-78.

చ. ...సమీరణుఁడవ్ సఖుఁ డూఁచు చుండగా, మలియుచు మొల్లగుత్తులను మయ్యేల లొప్పఁగ నెక్కి యూఁగె దు,ర్లల దళిసీకులంబు. అర. 4-188.

**ఉరగకేతనుఁడు** సం. వి. అ. పుం.

సర్పము ధ్వజ చిహ్నముగాఁ గలవాఁడు, దుర్యోధనుఁడు.

వ వీరలలో నురగకేతనుండు లేఁడు. విరా. 4-250.

**ఉరగనివాసము** సం. వి. అ. పుం.

పాతాళలోకము.

వ. ఉరగనివాసంబుల నమకరించు తలంబులును. విరా. 8-238.

**ఉరగము** సం. వి. అ. పుం.

1. ఱొమ్ముతోఁ బ్రాకునది, సర్పము,

మ. మహోరగంబులం బెట్టియలం బెట్టి కట్టుచందంబున బంధించి విరా. 1-178.

2. దుర్యోధనుని ధ్వజచిహ్నము.

సీ. ...ఉద్దీప్యమాన మహోరగంబు కేతనంబుల నొప్పు ..రారాజు నకు. ద్రోణ. 3-238

3. ఒక పర్వతము.

సీ. ప్రాక్పయోనిధి ప్రాంతం బర్వతం బొక్కటి, ఘనశృంగ కలితా కార మగుచు, నురగ నామంబున నొప్పు. అను 1-220

**ఉరగుఁడు** సం. వి. అ. పుం.

నాగజాతివాఁడు.

క. సురలును నసురులు యక్షులు, నురగులు గంధర్వులును.

**ఉరము** సం. వి. స్. న.

రొమ్ము, వక్షము.

సీ. ప్రథమాద్రిఁ దోఁతెంచు భానుబింబమునా నురమునఁ గౌస్తుభ రత్న మొప్ప. విరా. 1-12; శాంతి 5-589

**ఉరలంబాఱు** దే. అ. క్రి.

విడిపోవు, చెదరు.

మ. ధరణీచక్రము గ్రక్కునం గదల దిగ్దంతావళ శ్రేణి కంధరము ల్మ్రొగ్గఁబడెన్ దిశావలయముత్కంపంబుగా నీబలంబు లురలంబాఱఁగ భీష్ముపైఁ గవిసె భీష్మ. 3-262

**ఉరలించు** దే. స. క్రి.

ఉరలఁజేయు, ప్రవహింపఁజేయు.

వ. తలలు చిదుముచు నంకుశంబులు రాల్చుచు, నెత్తురు లురలించుచు దండలు సెక్కుచు. ద్రోణ. 2-18; ద్రోణ 1-308, శల్య. 1-211

**ఉరలు; ఉరులు** దే. అ. క్రి.

(ఉరలు, ఉరులు పదములు విచక్షణలేకుండ ముద్రింపఁబడి యున్నవి. కొన్ని ప్రతులలో 'ఉరలు' చోట్ల 'ఉరులు' - 'ఉరులు' చోట్ల 'ఉరలు' గలదు. కావున కలిసియే యర్థమీయఁబడినది. నన్నయ

భారతమున 'ఉరలు' లేదు. తిక్కన భారతమనవే యీ యస్త వ్యస్త సముద్రణము)

1. స్రవించు, కాఱు.

వ. కరిహయతతిఁ బెల్లుగా నస్రు లురులఁ జొచ్చెను. భీష్మ. 1-9

వ. దమయంతి వానిసెఱింగి తన పుత్రులఁ దల్లిదండ్రుల బాంధవులం బ్రత్యేకంబ యడిగి యస్రుజలంబు లురుల నేడ్చుచున్నఁ జూచి. అర. 2-145; సభా. 2-289

2 దొర్లు, జాఱిపడు.

ఆ. పొదివి పలుపురేయఁ బోడువ వ్రేయఁగ భగ్నదంతి రక్తధార లొప్పెఁ, జెలువు రెట్టిగాఁగ కేవులు సెలయేఱులున్న బాచలమున నురలునట్లు. భీష్మ. 3-146

క. డెందము గలంగఁ గన్నీరందంద మొగంబుమీఁద నగ్గల మురులన్. మౌస. 196

3. పడు, రాలు.

క. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు, నిప్పు లురలు చూపులడర నిశితాస్త్రములం, గప్పె గురుని. ద్రోణ. 1-156

వ మత్స్యయంత్రం బర్జునుం డస్త్రమంబున నురులనేసి అది. 8-15; అది. 7-182

4. కూలు, విఱిగిపడు.

వ. బాహుకుండు విని వీని సెన్ని కాని నిశ్చయింపనేరనని తనరథంబు నిలిపి యా వృక్షుం బాతఃబంబ యురుజం దోచి యయ్యాకులంగల యాకులుం బండలు నెన్నిన బుతుపర్ణుండు సెప్పినయన్నియయిన. అర. 2-174

వ. భీమునకు మార్గనిరోధంబుగా మహావృక్షం బులులందోచి. అర. 3-316

క. గిరిగుహాంతర మురలన్. అర. 3-317

(గిరిగుహాముఖములకున్ - అని ఆనందవారి ప్రతి)

**ఉరవడి** దే. వి. (ఉరవు+వడి) ఉరవణి

1. మిక్కిలి వేగము.

సీ. ఉరవడి నేలు దెరలఁ బైఁ దోఁతెంచు ధూళివెల్లి పరిపఁ దూలభోక. విరా. 4-62

క. మోఁసి చనుదెంచు దుర్యోధన సేనా సముదయంబుఁ దఱియ సురవడిం, జననిమ్ము మనరథము నా, సునిశిత బాణము ల సమయ జూచెద దీనిన. శల్య. 1-346

2. శౌర్యము, పరాక్రమము.

క. తరువు వెసఁ బెఱికికొని నీ, వురవడిమైఁ గవిసితేని యుభయబలము న,చ్చెరు వందుచుఁ జూచి వృకో,దరుఁడవగుట యెఱుఁగకున్నె తద్విధమేలా? విరా. 3-206

క. కురుబలముఁ దొడరి గెలువఁగ, సురగణములకైన నరిది శూరోత్తమ నీ, వురవడి గెలిచితి భాగ్య,స్ఫురణంబును బాహుబలముఁ బొగడం దగదే. ద్రోణ 5-7; భీష్మ. 2-313

3. విజృంభణము.

వ. భయంకరంబగు నతిసంకులంబున సామజవాజిరథంబుల యురవడికి నోసరింపని కాలుబలంబులు. భీష్మ. 1-267

క, కురుపతి ధృష్టద్యుమ్నుని, యురవడి గద నిలువరించి యుద్ధతి మెఱయన్, శరపంచకమున నొంచెను. శల్య. 1-218

**ఉరవడించు** దే. అ. క్రి. (ఉరవణించు)

1. విజృంభించు, రేగు.

సీ. కసిమసంగిన మారి గడఁగి జీవులమీఁద నుగ్రతఁ గవియున ట్లురవడిచి. ఉద్యో 2-139

2. పరాక్రమించు.

వ. సాత్యకియు ధృష్టద్యుమ్నుండును నేకయ పంచకంబును విరాటుండు నతని కొడుకులుం దలకడచి యురవడించిన. భీష్మ. 1-280

3. వేగముగాఁ బరువెత్తు.

సీ. ... అచ్యుతుఁ జూచి రథ్యమ్ములు మేనుల నలుఁగు లుండ,గి.

మరవడింపవు వీరల సరకు గొనక, వీని నిప్పుడ యజ్జులు విడిచి తడవు, మనుడు. ద్రోణ 3-151

4. లంఘించు. దూఁకు.

వ. కురుకుమారు లమ్మారుతిం జుట్టుముట్టి విశిఖంబులు నిగిడించినం గోపించి దుర్మదుని తేరి కురవడించి తురంగంబులం గొరివుచ్చి సారథిం జదిపిన. ద్రోణ. 5-68

**ఉరవణి** దే. వి.

ఉరవడి.

వ. అమ్మోహరం బా సూతనందను మొన యురవడి సరకుగొనక మార్కొనియె. కర్ణ. 2-149

**ఉరవణించు** దే. అ. క్రి.

1. పరాక్రమించు.

వ. సౌబలుండు పేర్కొని విల్లెత్తి యత్తెఱపి నురవణించి పాండవ రథికులం గలంచె. కర్ణ. 1-151

చ. ... సంగరంబున, న్విదిత విభీతిమై నురవణించుటయున్ నృప ధర్మముల్. శాంతి. 2-224

శ్లో. నిత్యోద్యుక్తో దస్యువధే రణే కుర్యాత్పరాక్రమమ్. సం. భా. శాంతి. 60-10

2 కవియు, దుముకు.

వ ప్రాణంబులు మీకింత పేద య్యెనే యని పలికినమ నిలువక పైపయి వారు రవణించిన. అశ్వ. 4-48

**ఉరవు** దే. వి. ఉలవు

ఉచితము, అర్హము, తగినది.

క. అంఘూ :మర్త్యుల జీవన, మనిత్యమని యెఱిఁగి సుఖము నప్పుడు దుఃఖంబున యపుడు ధర్మ మేమఱకునికియ యెజ్జాతికైన నురవూహింపన్. శాంతి. 5-489; శాంతి. 4-43; శాంతి. 2-381

**ఉరస్థ్సలము** సం. వి. అ. న.

వక్షః పీఠిక.

వ. గంధమాదనంబున నేము దపంబుసేయుచుండ నక్కాలంబునఁ గాలాంతకుండు దక్షునియజ్ఞంబున కలిగిన నిటిక్షితం బఱతెంచి వాయురస్థలంబునొందిన మదీయకేశంబులు ముంజనిభంబులగుటం జేసి ముంజకేశుండను పేరు గలిగె. శాంతి. 6-441

**ఉరస్సు** సం. వి. స్. న.

రొమ్ము

క. తమలోన మాటలాడెదు, సమయంబున నొక్కరుఁడు విశాలో రస్కుం, డమితబలుఁడు. విరా. 2 5

**ఉరి** దే. వి.

1 వాగుర, ఉచ్చు, పశులను మృగములను పట్టుకొను రజ్జువిశేషము.

తే. ద్రౌపదీ రూపమను నురిఁ దగిలి తనదు, హృదయమను మృగ మత్తటి నుదిలకొనుచుఁ, గాముఁడను బల్లిదపువేఁటకాని బారిఁ, బడుట కెంతయు వాసింహబలుఁడు దలరి. విరా. 2-24

క. వల యురి యోవము గాలము, గలిగికదా మృగముఁ బక్షి, గజము ఝషము దక్షులు వట్టుదు రట్టుల తజ్ఞులు విజ్ఞానంబుకలిమిఁ జూతురు పురుషున్. శాంతి. 4- 81

ఆ. యోగబలము లేని యొక తంగి యోగి బల్, ద్రోఁపులేని మీను నేవులేని, మృగము వలయు నురియుఁ దెగిపోవ నుఱకంగ, లేని యట్లు భవము లోన నడఁగ. శాంతి, 5-578; శాంతి. 8-808

2. కంఠపాశము, చనిపోవుటకై గొంతునకు వేసికొనెడి ఉచ్చు.

గీ. వానిఁ దెగఁజూడవై తేని వాయుపుత్ర, నీవు గనుగొన నురినైన నీరనైన, నగ్నినైన విషంబుననైన నేను, మేనుదొఱఁగుదు. విరా. 2-229

**ఉరిపోయు** దే. అ. క్రి.

ఉచ్చు తగిలించు.

సీ. ఉభయ పార్శ్వంబుల నురిపోసినట్లవి వ్రేలిచచ్చిన. శాంతి. 4-40

**ఉరియాట** దే. వి. (√ఉరియాడు) ఉరియాడుట

సందేహము, శంక.

తే .. ఇట్లు...మీరు సెప్పంగ నురియాట మేలె      శాంతి. 1-275

శ్లో. న తే ఖిశంకే వచనమ్ యద్బ్రవీషి తపోధన,
అపరోక్షోహి తే ధర్మః సర్వధర్మవిదాంవర.
సం. భా. శాంతి. 32-10

**ఉరియాడు** దే. అ. క్రి.

1. కళవళపడు, కలంకఁజెందు

వ. అని విర్కిక్రించుచుం గిరీటి యురియాడు చిత్తంబు నుత్తలంబుచేసి కొని. విరా. 1-161

వ. ఇట్లు చింతించియున్న యన్నరేంద్రుం డన్నృపతి మనం బురియాడ నోయని శంకించి యతనితో మఱియు నిట్లను నిర్విధం బాచరించుటకు విచారంబు పలవదు. కర్ణ. 1-257

2. పరితపించు.

వ. పాండవులం బరిమార్చ్పనని నేఁడచేయక మఱిచేసిన రారాజు నిర్గత ప్రాణుండైన వాకెలసం బెవ్వరి కెక్కెడుఁ జక్కటితోడి బవరంబున నబ్బలమ్ముల గెలువరాదని యిట్లురియాడు నాచిత్తంబు చింతాపరంపర వాయ నీపక్షి విచేష్టితంబు లోచనగోచరం బయ్యె
సౌప్తి. 1-24

3. తొట్రుపడు, చలించు.

ఆ. అన్నరేంద్రుపాణి యల్లన తనకరాబ్జమునఁ గీలుకొల్పి బహుళ బాష్పకలిత పదనుఁ డగుచు గళమున నెలుఁ గురియాడ, వగచి యమ్మారాంతకుఁడు      శల్య. 2-361

4 డోలాయమానమగు, సందేహించు, వెనుకముందాడు.

క సతి దనపతి వచనంబులు, మతిఁజొనుపుం దెంపునూను మాన వెఱచు న,య్యతిథి ననుప నేయగ ద్రో,చు తలం పలవడుచుఁ దేయుఁ జూచుం దలరున్

తే. ఇట్టు లురియాడు చిత్తంబు నెట్టకేని, నాథుచెప్పిన ధర్మంబునకుఁ గొరగ,నూలుకొల్పి నిర్ణయమునఁ గీలుకొన్న, లజ్జ వేగునఁ బోలె వ్రాలంగ మోము
అను. 1-71,72; విరా. 2-102; ఉద్యో. 3-108

**ఉరియు** దే. అ. క్రి.

1. ఎరియు, కాలు. దగ్ధమగు, పరితపించు.

అ ఆవియ, తల్లులార కరము తప్పయి తోఁచుట, నుల్లి మలఁత పేర్మి మరియుచుండు. మా.స. 201

క. సుకుమారుఁడవఁదు గోపాలక వృత్తిపహించి యడవులం గ్రుమ్మ డుచు,న్నికి నాకకాదు పగవారికినైనను సకట మన మురియదే పగలన్. వి.రా. 2-210

క. తనలేనిచోటఁ బలువురు, నినుఁ జుట్టుకుముట్టి యొక్కనింజేరి వధించిన వంచనకు ధనంజయు, మన మెమ్మెయి నురియ నొక్కొ మన్మథమూర్తి. స్త్రీ. 2-78

2. రేఁగు, ఒరపిడి నొందు.

చూ. ఉరిసినపుండుల నుప్పుపెట్టు. ద్రోణ. 5-358

3. ఉడుకు, పచనమగు.

వ. పాకంబునకు రాకయుండ వెంకియుఁ దన సవరించిన కాష్ఠంబులు గ్రమంబున నిడి యనలంబు బ్రబలంబుసేయఁ గాష్ఠంబులు సమసెఁ గాని యా రేఁగుఁబం డ్లురియవయ్యె. శల్య. 2-197

శ్లో. తస్యాః పచంత్యాస్సుమహాన్ కాలోఽగాత్పురుషర్షభ నచస్మతాన్యపచ్యంత దినం చ క్షయమభ్యగాత్. సం. భా శల్య. 49-21 (వావిళ్ల)

**ఉరిసినపుండుల నుప్పుపెట్టు** దే. జాతీయము

రేఁగి ఒరపిడినొందిన పుండుమీఁద ఉప్పుపెట్టు.

(సహజముగా పుండు రేఁగి యొరపిడిపొంది మంటయు పోట్లు కలిగించు చుఁడు దానిపైని కోఁతగోసి మఱింత మంటలు పోట్లు పుట్టించు ఉప్పు గూరిన నెట్లుండునో అట్లు - ఏదో మనస్సున మిక్కిలి బాధపడుచుండ నెదుటివాఁ డేవేవో పొడువు మాటలాడి మన స్సును మఱింత బాధపెట్టునప్పుడీ జాతీయము నుపయోగింతురు)

తే. అరులు మనమీఁద నురవడి నరుగుదేర, నేము సిడిముడిపడుచుండు నిట్టులనుట, యొప్ప దురిసిన పుండుల నుప్పువెట్టి, దరయ తీసికి

నిన్ను నేమందుఁ బార్థ. ద్రోణ. 5-358

శ్లో. వపన్ వ్రణే క్షారమివ క్షతానాం శత్రుకర్శన
విదీర్యతే మే హృదయం త్వయా వాక్శల్యపీడితమ్
సం. భా. ద్రోణ. 198-15

**ఉరు** దే. అ. క్రి. ఉఱు

1. మేలగు, శ్రేష్ఠమగు, అధికమగు.

క. ఈ లోకమ యురుఁ గొందఱు, కాలోకమ కొందఱకు నిహంబును బరమున్, మేలగుఁ గొందఱ కధిపా, యే లోకము లేదు వినవె యిలఁ గొందఱకున్. అర. 4-174

(ఉరున్ - మేలనితోఁచును అని భావము)

2. తగు.

క. అన్నలుఁ దమ్ములు గలుగుట, యున్నతుఁ జేయు నృపునెంత యొఱు పిళ్లయినన్, మన్ననయు నీగియును సం,పన్నంబులు గాఁగ వారిఁ బాటించుటురున్. శాంతి. 2-366

క. రసకర్మజ్ఞు డుదారము, పసిండి సేతకుఁ బ్రయత్నపరుఁడై శుద్ధ,త్వ సమగ్రము సేయు క్రియ, న్విసువక పరిశుద్ధి జీవునికిఁ జేయుట యురున్. శాంతి. 5-417

**ఉరులఁద్రోచు; ఉరులంద్రోచు** దే. స. క్రి.

విఱిగిపడునట్లు పడవైచు.

వ. భీమునకు మార్గనిరోధంబుగా మహావృక్షంబు లురులం ద్రోచి యే కాయవ పథంబున కడ్డంబు శయనించి. అర. 3-316

**ఉరులంబడు; ఉరులఁబడు** దే. అ. క్రి.

ఉచ్చులోఁ జిక్కుకొను, వలలో దగుల్కొను.

తే. దాయ లొడ్డిన మాయజూదంపుటురులఁ, బడి కులంబున కాతఁ డిప్పాటు దెచ్చె. విరా. 2-225

**ఉరులంబుఱతెంచు; ఉరులఁబుఱతెంచు** దే. అ. క్రి.

పైకి దుముకు, డీకొను.

వ. ధూమ్రాక్షుండు రోషతామ్రాక్షుం డగుచు నతి నిబిడ బలాహ
కానీక భీకరంబై కాలుకొనుచున్న నిశాచర చక్రంబుతో నురులం
బలశెంచినం జలించి బలీముఖ బలంబులు దుర్బలంబులై తొలం
గిన. అర. 7-85

శ్లో. అభిదుద్రావ ధూమ్రాక్షో వేగేన మహాతా కపీన్
తస్య మేఘోపమం సైన్యమాపత ద్భీమదర్శనమ్
దృష్ట్వైవ సహసా దీర్ణా రణే వానరపుంగవాః
సం. భా. అర. 285, 5, 6

**ఉరులనేయు** దే. స. క్రి.

ఛేదించు, పడఁగొట్టు.

వ. మత్స్యయంత్రం బర్జునుం డక్రమంబున నురుల నేసి. ఆది. 8-15

**ఉరులు** దే. అ. క్రి.

చూ. ఉరలు.

**ఉరువు**[1] దే. స. క్రి.

మాను, విడుచు, త్యజించు.

ఆ. క్షరము నక్షరంబుఁ గానఁగఁ బోలు వేదార్థ చింతనమున నమ్మి
ధునము,నందుఁ బూర్వ మురివి యపరంబు చేపట్టి, నిలువ వలయు
నధిక నిష్ఠగలిగి. శాంతి. 6-144

గీ. ఊర్పు బొందువు వచ్చి ప్రేవురివి నంబు,శంతయును బుచ్చి పోదు
కగా నమరఁగట్టి. శాంతి. 3-499

చ అన విని సంశయం బురివి యమ్మునితో వరణీకనూజుఁ డిట్లను.
శాంతి. 6-321; అర. 8-168

**ఉరువు**[2] సం. విణ. (ఉ. ఉ. ర్వీ. ఉ.)

1. మిక్కిలియైనది, అధికము.

మ ...అత్యురు తేజుండు వరించుఁగాక యభిమన్యుం డి సరోజాననన్.
విరా. 5-368

**ఉర్వర** సం. వి. అ. స్త్రీ.

భూమి.

క. దారిద్ర్యముచే గుందుచు, నేరిని నడుగంగ బోవ కెంతయుఁ గృశ
తం, గూరిన విప్రున కుర్వర, వారని దయ సిగి ఫలము వాగ్గో
చరమే అను. 2-358; అశ్వ 4-5

**ఉర్వశీకృత్తికాయోగసిద్ధకీర్తి**

కృత్తికా నక్షత్రముగల దినమున లేదా కృత్తికా నక్షత్రముతోఁజేరిన పూర్ణిమ (కార్తిక పూర్ణిమ) యందు ఉర్వశియను తీర్థమున స్నానము చేసి ఏ ఫలితము వచ్చునో ఆ ఫలితముపచ్చునని పేర్వడిసినది లౌహిత్య మను పుణ్యజలాశయమున కిది విశేషణము. చూ. 1) ఊర్వశి 2వ యర్థము 2) ఊశ్వశి తీర్థము, ఉర్వశి ఊశ్వశి యనునవి రెండు నొకచే ఈ లౌహిత్యమను తీర్థము గంగానది సమీపమునం దుండెనేమో యనిపించు చున్నది.

ఉర్వశి యని గంగకు పేరు.

శ్లో. తథా భాగీరథీ గంగా ఉర్వశీ చాభవత్పురా,
దుహితృత్వం గతా రాజ్ఞః పుత్రత్వ మగమత్తదా.
సం. భా ద్రోణ. 60-6

కృత్తికా నక్షత్రమున గంగయందు స్నానముచేసిన ఏ ఫలితము గలుగునో అట్టి ఫలితము నిచ్చునదియని యైనను చెప్పుకొనవచ్చును.

సీ. ...ఉర్వశీ కృత్తికా యోగసిద్ధకీర్తి,యైన లౌహిత్యంబునందు
సుస్నాతుఁడై, పుండరీకాధ్వరమున ఫలంబుఁబొందు.

శ్లో. ఉర్వశీం కృత్తికా యోగే గత్వా చైవ సమాహితం,
లౌహిత్యే విధివత్స్నాత్వా పుండరీక ఫలం లభేత్.
సం. భా. అను. 25-45

**ఉర్వి** సం. వి. ఈ. స్త్రీ.

భూమి, నేల

వ ...తమముపర్వి నర్విం దోడ్తోన్. విరా. 2-321

ఒకప్పుడు భూమి అరాజకత్వము వలనఁ గలిగిన దోషములచే బుట్టిన దురితాధిక్యము పీడింపఁగాఁ బాతాళ లోకమునకుఁ బోయెను. అప్పుడు కాశ్యపుఁడు తన యూరువును గుచ్చి దానితో భూమినిఁ బైకెత్తెను. అధికారణంబుగా భూమి యుర్వియని ప్రసిద్ధికెక్కెను. శాంతి. 2-89,90

ఉరుత్వాదుర్వీ-ఘనమైనది గాన ఉర్వీ; ఊర్ణూయతే పర్వతైరిత్యుర్వీ ఊర్ణుఞ్ ఆచ్ఛాదనే పర్వతములచేఁ గప్పబడునదిగాన ఉర్వీ– అమ.

**ఉర్వీమృత్తిక** సం. వి. ఆ. స్త్రీ.

నేలమట్టి.

తే. శుక్రమగు నుర్వీమృత్తిక సురుచిరంపుఁ, బ్రతిమ గావించుకొని యందుఁ బరము నావ,హించి పూజావిశేషంబు లెల్లఁజేసి, నీవు దొలుమేనఁ గొలిచితి నిష్ఠతోడ. ద్రోణ. 5-416

**ఉర్వీజము** సం. వి. అ. పుం.

వృక్షము.

సమీపోర్వీజముల్ ప్రాఁకియుం. విరా. 3-27

**ఉర్వీతలము** సం. వి. అ. పుం. న.

భూప్రదేశము.

వ. సర్వాంగ సంగతోర్వీతలంబగు దండప్రణామం బాచరించిన. విరా. 4-149

**ఉర్వీధరము** సం. వి. అ. పుం.

భూమిని ధరించునది, పర్వతము, కొండ.

సీ. ఉర్వీధరంబుల నొప్పెడు ఠేవుఱఁ, జలుల కాంతికి మును మెఱుఁగు వెట్టి. ఉద్యో. 2-118

**ఉర్వీభృత్తు** సం. వి. త్. పుం.

1. కొండ.

శా. ...మహోగ్రాక్షపాతాపభూ,తోర్వీభృ ద్ఘన గండశైలములతో నూహింపఁ దుల్యంబులై. అర. 5-276

2. రాజు.

**ఉర్వీరసము** సం. వి. అ. పుం.

జలము, నీరు

వ. (సూర్యుఁడు) ఉత్తరాయణగతుండై యుర్వీరసంబు పరిగ్రహించి దక్షిణాయన గతిం బర్జన్యభూతుండై యోషధులం బడసి, అర. 1-89

**ఉర్వీరుహము** సం. వి, అ. పుం.

భూమియందు మొలచునది, చెట్టు.

క. ఉర్వీరుహ నివహముతోఁ బర్వతములు వెఱికి. ఆది. 4.7

**ఉఱుఁడు** ఉఱు ధాతువునకు వ్యతిరేకార్థక మహదర్థక ఏకవచన రూపము.

చూ. ఉఱు[2].

**ఉఱక** ఉఱు ధాతువునకు వ్యతిరేక క్త్వార్థకరూపము.

1. చూ. ఉఱు[2].

అవ్య.

2. అవలీలగ, సునాయాసముగ.

చ. ఉఱక యురంబు బాహువులు నొక్కొక యమ్మున నొవ్వనేసి నీ వెఱఁగి యొఱఁగి నన్ దొడరి తెక్కడఁ బోవఁగ వచ్చునంచు. ద్రోణ. 2-90

తే. పద్మనాభుని నొప్పించి పార్థు నొకటి, కొఱఁతగా నూఱుశరముల నుఱక నొంచె. కల్య. 2-8·1

3. నిర్భయముగా.

సీ. ...రారాజు ద్రోణతనయుండుఁ బుట్టిన తలమట్లు నల్లని, యవి సూతపుత్రు శిరోంబరంబు, పచ్చనియది కుంభసంభవ కృపాచార్య యుష్ణీషములు వెల్లలుఱక నీవు, దెమ్మి తవట్టును. విరా. 5-210

4. పలుకక, మాటాడక.

క. వెఱచఱవ నింతకంటెం, దఱచుగ బాణంబులేసి తడయక పగఱం బెఱుతునని యిసుము చల్లుచు, మఱక ధనంజయుఁడు రణజయో న్నతుఁ డరిగెన్. సభా. 2-305

5. వ్యర్థముగా, ప్రయోజనము లేకండ, నిష్కారణముగా.

అ. నీవు సూచుచుండ నీ యిష్టుఁ డిమ్మణి,మంతుఁ డిపుడు పనవు మదము పేర్మి, నన్ను నుఱక యమిసె నా మీఁద నిట్టి యుద్ధమునఁ డీల్గు నొక్క మమతు దేత. అశ. 4-31

**ఉఱదె** ఉఱు ధాతువునకు వ్యతిరేక అహమదర్థ కైకవచన రూపము తగదే - చూ. ఉఱు[1].

**ఉఱవు** విశ.

1. ఉచితము, యుక్తము.

ఆ. అంత తోడ వెల్ల యాపదలును దీఱు,వంశ మధిక గౌరవంబు నొందు, గూడి మనుట గలుగు గురు పాండవులకు ని,తెఱగు సూడ మీకు న ఱవకాదె. ఉద్యో. 3-380

2. తగవు, హితము.

తే. శక్రసుతేరైన నడపంగ జాలువాడ, నఱవుసెవ్వదు రథికునే నుఱగ నీను, గృష్ణసారథ్య ఘనుడగు క్రీడి గెలువ, దలచు నీకేను గడపుట దగు రథంబు. కర్ణ. 1-314

3. అధికము.

క. పొడువగ వ్రేయగ నతడుం, గడు నఱవగు నేర్పుకడిమి కలిమిం దనపై, బడకుండ గృపాణమ్మునం, గడు చిత్రపుగతుల నడిచె గైదువు లెల్లన్ భీష్మ. 3-96

క. ఉఱవగు వారుగపంటలు, గొఱియల పాడియును దఱచగుం బురుషులకుం, దెఱవల చట్టము లయ్యెద, రెఱచియ తుటియించు రక్తి నెల్ల జనంబుల్. అర 4-295

చ. ...ని,న్నుఱవుగ నేను వేడుకొన యుక్తుడగాక మొఱంగి నన్ను న,క్కఱపడి నీవు వేడుటది గర్జమె నిర్జితదైత్య చెప్పుమా అర. 7-366

**ఉఱికిపోవు** దే. అ. క్రి.

దుముకు, క్రిందికి దూకు.

ఆ. అనుశర్మ తేరియందున్న ఘనగదా, దండమెత్తికొని యుదగ్రవృత్తి, ఐరతదేహుడయ్యు దరుణ వయస్కున, ట్లవని క ఱికి పోయి యతని వ్రేసె. విరా. 3-217

**ఉఱిది** దే. విశ.

పాటి, సమానము.

సీ. చంద్రదత్త వ్యాఘ్రదత్తులు, వినుము సేనాబి దుఁడను నృపాలుఁడు రథోత్తముఁడు మారుతపుత్రు నెన యతం, డొక్కరుండును వారి యఱిలావు. ఉద్యో 4-268

**ఉఱు**[1] దే. అ. క్రి.

1. తగు, ఒప్పు, ఉచితమగు.

చ ...నీ,యఱు కడకేగి తోడుపడు మొద్దకు నెవ్వరినేని. ఉద్యో. 4-179

క. కులమునకు నఖిల లోకం,బులకు నపాయంబుసేయు పురుషాధము ని,మ్ముల దూషించి జగంబును, గులమును రక్షించు టుఱదె కువలయనాథా. ఆది. 5-111

క. నరవర సరపాన్నంబులుఁ, బరిమళ సద స్తువులును బరమశయన వి,స్తరములుఁ గ లాధీనత, నరుఁ డొందుం గాయు వాని నమ్మ మియ యఱున్. శాంతి 1-214

క. శివలింగ స్థాపనముఁ ద్రి,భువనములం బరమహితము పొందెం గరుణన్, ధవళాక్షిచేసితిం ద, త్ర్పవిమల లింగమున నన్ను భావించు టుఱున్. అను. 5-272

ఉ. .. ఒక నక్కనిచ్చి సింహమ్ముల విల్చికో లఱదె. సభా. 2-151; అను. 1-18; అను. 1-24; అను. 5-864

2. ఇష్టమగు.

క. తెలిపిగొని నీవు పొచ్చినఁ, బిఱుదనె చొచ్చెదము రిపులు పెల్లగిలం నం,గఱమును మాకిది యెంతయు, నఱుగట్టివరంబు దీని నొసఁగుము పుత్రా. ద్రోణ. 2-7

3. సరిపోలు, పోల్చు.

క. ఒకశులు సూచిన యదివా,రికిఁ బెట్టకనమలుటయును బ్రీతిం దనవం, శికిఁ దెచ్చిన చుట్టలు వే లొంత భంగింగుదువఁ గుడుపు మఱు విప భుక్తిన్. అను. 4-111

**ఉఱు**[2] (దీనికి వ్యతిరేకమునందే ప్రయోగములు కనఁబడుచున్నవి)

స. క్రి.

1. లక్ష్యపెట్టు, సరకగొను, పరిగణించు.

క. పిఱుదం గురుధరణీపతి, ; అచేతం బ్రాణములు ఘవారాతి బలం, బుఱని తెగువ ముందటఁ బెన్గొఱలుట చిత్తమునఁ బెట్టికొని విహరించెన్. ద్రో 2-87

అ. క్రి.

ఉఱఁడు సురేంద్రుడైన బలియుండు ఆది. 6-194; ఆది. 7-271

2. మాను, విరమించు, ఆఁగు.

తే. అతఁడు దివ్యాస్త్రజాలంబు నశియఁబు, సూప చతురంగ బలముల రూపుమాపి, యుఱక తఱిమి శిఖండికిఁ దెలిపిసూప, వాఁడి తూపులు భీష్ము పై వాఁడు నిగిచె భీష్మ. 3-381

చ. ఉఱక విరోధి సైన్యముల నుక్కు మడంగఁగ మల్లపద్ధతిం బఱప. విరా. 5-61

వ. పర్జన్య ప్రసాదంబున మహావృష్టి గొడుకులపయిం గురిపించి యయ్యురగుల విగతపరితాపులం జేసి కద్రువగర్వంబున నుఱక గరుడుని వినతనుం బనులు గొనుచున్నంత. ఆది. 2-47

3. జంకు, వెనదీయు.

చ. తఱిమి సుశర్మఁ గిట్టి యతిదారుణభంగి రణంబు సేయువాఁ డుఱక నిశాత సాయకము లొక్క మొగిం బది మేనియందు గ్రిక్కిఱియఁగఁ జేసి. విరా. 3-215

క. కురుబలము పొలియుటకు మది, నెఱియంగా నున్న నాకు నితఁడీ రాజున్, శిరము ఱక తన్ని యిమ్మెయిఁ, బరిభవ మొందింప వగవు పాటిలకున్నే. శల్య. 2-308

**ఉఱుకడ** దే. వి.

తగిన స్థానము.

చ. నీ, యుఱుకడ కేగి తోడుపడు మొడ్లకు నెవ్వరికేని ఉద్యో. 4-179

**ఉఱుకు** దే. అ. క్రి.

1. దుముకు.

క. ఎఱిఁగి పిలుపనిన వెసఁ బై, కఱుకుదు సాళువము గాకిఁబొడిచిన
భంగిన్. విరా. 2-282

క. మఱియు నొకవిల్లు గొనున, త్తెఱపిన విరథుఁ డగఁ జేయ ధృతిఁ గర
వాలం, బుఱికొని విభుఁడు నేలకు, నుఱికి యతనిమీఁద దపడరె
నుగ్రాకృతియై. భీష్మ. 3-27

సీ. ధనము లుత్కృష్టంబులను ధనంజయు మాటపాటిగాఁ గొనుము
సోపానభంగి, నున్నది మార్గంబు యోగసమారోహణమునకు
దానన నడచి కాక, వడి నుఱ్కపడ నీకు వచ్చునే ధనసంగ్రహంబు
భోగార్థకృతంబు దుష్టమగుటయుఁ గలదు యజ్ఞార్థకృతంబైన
నదియ నిచ్చెన బ్రహ్మపదము నంద. శాంతి. 1-144.

సీ. వాగవాగతోఁ దాఁకి పగులంగ నరదంబుఁ, బఱపియా తేరిపై కుఱుకు
వారు. విరా. 3-169; విరా. 4-218

2. పరుగెత్తు.

తే. ద్యూతమున గెల్పువేషమున నఱికి పుణ్యకాంతఁ దలపట్టికొని
సభాభ్యంతరమున, కీడ్చి వలువలొలుచుటయు నెఱిఁగి సుతులఁ,
జంపెనని భీముఁ జంపఁ దలంపనగునె. స్త్రీ. 1-146

3. తప్పించుకొనిపోవు, బయటపడు.

ఆ. యోగబలము లేని యొక భంగి యోగి బల్, ద్రోపులేని మీను
వేపులేని, మృగమువలయు నుఱియుఁ దెగిపోవ నుఱుకంగ, లేని
యట్లు భవములోన నడఁగు. శాంతి 5-578

4. పైపడు.

క. అరయుదవుగాని యిమ్మొహరమునకును డాపవించి యరదముఁ
బోని. మన్మరపడి నతనిక యుఱికెన, నరుమగ నెబ్బంగి నెవ్వ
రడ్డంబైనన్. విరా. 4-246

శ్లో. తస్యమూర్ధ్ని పతిష్యామి శశవతే పరాజితాః

సం. భా. విరా. 58-18

**ఉఱుము** అ. క్రి.

గర్జించు.

క. ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు, వఱలఁగ నలుగడలఁ బడ నవారిత వృష్టుల్. ఆది. 8-270

క. మెఱుము ధనుర్దండము, గుణ ముఱుముఁగ విశిఖతతి దొరుఁగ నొక్కటఁ దఱచై, పఱవ రుధిరంపుఁ గాలువ, లతిమతి ఘనఘుఁడు ద్రోణుఁ డడరె నరేంద్రా. ద్రోణ. 1-294

వ. మహాంబుదంబు చందంబునఁ బదలం దోఁచి మెఱుముచు నుఱుముచు. ద్రోణ. 5-225

చ. ఉఱుముచు వెల్లెడం బిడుగు లుగ్రగతింబడ ఘోరమూర్తియై. ద్రోణ. 1-89

వి.

1. మేఘధ్వని, గర్జనము.

క. మొగిలులు లేకయు నుఱుములు, గగనశోభలు చేసె. భీష్మ. 1-9

2. వీరహుంకారము.

క. ఒకమఱి కిరీటి కట్టెదిరికి నుఱుమునఁ బోయి రేవి రెండవ మాఱు యయ్యొకొమట కోర్వఁగ లేరై, రొకళ్లుఁ గురు రాజుసేన యోధులం లోనన్. విరా. 5-55

**ఉలి** దే. విశ. (ఇది వృత్తియందే కనఁబడుచున్నది)

అల్పము, చిన్నది. చూ. ఉలిగాలువ.

**ఉలికిపడు** దే. అ. క్రి. (√ఉలుకు)

(ఆకస్మికముగాఁ గలిగిన భయాదులచే) కంపించు, అదరిపడు, త్రుళ్లిపడు.

వ. ఏను సహస్రపాదుండను ముని ముఖ్యుండ నా సహాధ్యాయుండు ఖగముఖుం డను మునిముఖ్యుం డగ్నిహోత్ర గృహంబున నున్న నే నపహాసార్థంబు తృణమయ సర్పం బమ్మునిపై వైచిన నతం డులికిపడి నాకలిగి నీవు నిర్వీర్యం బైన యురగంబవగుమని శాపం బిచ్చిన. (అదరిపడి అని వావిళ్లవారి పాఠము.) ఆది. 1-156

**ఉలిగాలువ** దే. వి.

సన్నకాలువ, చిన్నకాలువ.

క. గురుఁడను జలనిధి గడచితి, కొరులును దలవంగ నాకు నులిగాలువ లీ, నరపతుల సరకుగొన నీ,వరదము సననిమ్ము నేఁటి యని కలయకమీ. ద్రోణ. 4-68

**ఉలియు** దే. అ. క్రి.

మ్రోయు, ధ్వనించు, అఱచు (పశు పక్ష్యాదులు) కూయు, ధ్వని చేయు.

చ. పిడుగుల పిండు విట్టులియు పెల్లునఁ బార్థుఁడు శంఖమొత్తిన్. విరా 4-171

సీ. తమతమ నియమిత స్థానంబులం గోలి నుండిరి తోరన నులిసె భేరులు. ఆది. 6-7

చ. అలుగుల మఁది యందుల మృగావలియున్ విహగంబులున్ భయాకులగతిఁ బొంది మూఁగలును గుంటులుఁ జీకులునైన యట్టులై, యులియక యున్నచో నడఁగియుండఁ. అర. 1-801

**ఉలివు** దే. వి.

1. శబ్దము, మ్రోఁత, కలకలము.

అ. వారు సంభ్రమించి వడిఁ గోల దివియలు, గొనుచు నులివు మిగులఁ గూడఁ బాఱి, నృత్తశాలఁ జొచ్చి రత్తఱి నా కల,కల మెఱింగి కీచక వ్రజంబు. విరా. 3-4

వ. కృతవర్మ సాత్యకులు లొక్క రథంబునను దుర్యోధనాది చతుష్టయం బొక్క రథంబునను బార్శ్వంబుల రాఁ గౌరులకుఁ గన్నులపండు వగుచు రాజమందిర ద్వారంబు చేర నరుగు నప్పటి యులివునకుఁ గొలువు వారెల్ల నత్యుత్సుకులై యెదురుచూడ రథోత్తమంబు నవతరించి యరవిందనాభుండు. ఉద్యో. 3-247

వ. అట్టి యవసరంబున బోరన మ్రోయు జనుల యులివును వాదిత్ర నాదంబును వారించి. ఆది. 7-168; ద్రోణ. 5-178

2. ఉత్సాహము.

క. మొనమునఁ గయ్యపువేడుక, బిగురొత్త మదాత్తమూర్తిఁ జెలువొందు గురుం, దగు రాజులు గౌరవులును, బొగడి రులివు మిగుల,

ప్రమదపూర్ణ హృదయులై. ద్రోణ. 1-55

3. చలనము.

ఉ. ఆ నినదంబు సాంద్రముగ నాకసమంతయు నిండఁ బర్వుడున్,
మానసముల్ గలంగి యభిమానము ధైర్యముఁ దూల విద్విష,
త్సేన నితాంత నిశ్చలతఁ జిత్రసమర్పిత మూర్తియో యనం,గా
నులివేది యుండియును గ్రమ్మఱఁ దేఱిరవంబు మానఁగాన్.
ద్రోణ. 1-239

(ఉలివు + ఏదు = చలనము వదలు)

శ్లో. తేన ఘోషేణ సంత్రస్తా సంశప్తక వరూథినీ,
నిశ్చేష్టావస్థితా సంఖ్యే హ్యశ్మసారమయీ యథా.
సం. భా. ద్రోణ. 18-9

**ఉలివేదు** దే. అ. క్రి.

చలనము లేకుండు.

చూ. ఉలివు. ద్రోణ. 1-239

**ఉలుకు; ఉల్కు** దే. అ. క్రి.

1. భయపడు, బెదరు.

తే. ...కరంబున నుదర మప్పళించి యమ్మరో రక్కసయంచు నుల్ల
ములుకువారునై పురజనంబులు దలంకి. విరా. 3-36

వ. ధర్మనందను గరువంపుఁ బల్కుల విధంబునకున్ మదిలోన నుల్కు-
చున్. ఉద్యో. 1-290

క. అలయుచుఁ బులుగుల యెలుఁగుల, కులుకుచు నుగ్రాతపమున
కోపక వృతం,బుల నీడల నిలుచుచు నెలుఁ,గులఁ బులులం జూచి
భయము గొని వగచుచున్. అర. 2-84

2. ఉడుకు, అసూయపడు.

క. జనులకు నొడఁబాటగు విధ,మున నడచుచు లోకనింద్యముల నుడు
గుచు మీఁ,దని యెఱుకని కలిమి కులుకక, మనుజులతోఁ బొంది
పొసఁగి మనుటొప్పు నృపా. ఉద్యో. 3-31

వి.

భయము.

క. ఉలుకును వెక్కసపాటును, దలఁకును జిమ్మదము తోడ ధాత్రీరమణుం, డలఘుతర విపుల వక్షస్స్థల రేఖాకాంతిఁ బరవశత్వముఁ గాంచెన్. విరా. 1-218

తే. ఉలివు విని యుల్లమునఁ గడు నులుకుపుట్టి. అను. 4-318

**ఉలుము** దే. వి.

కుష్ఠరోగము.

అ. ఉలుము గొన్నవాఁడు దొలుమేన నాఘూత, బంధనముల నొరుల ప్రపన్నుఁడవమ్ము సెలఁచినాఁడు. అను. 5-100

**ఉలూకము** సం. వి. అ. పుం.

1. గుడ్లగూబ.

తే. అచటి బయలెల్లఁ దానయై యక్కజంపుఁ, జందముని ఘోరమైన నిస్వనముఁ జండ,గతియు భూతవితాన భీకరముగా నులూక మొకటి వచ్చె భూలోకనాథ. హౌప్తి. 1-16; శాంతి. 3-210

2. ఒక దేశము.

యుధిష్ఠిరుఁడు రాజసూయము చేయుటకు అర్జునుఁ డుత్తర దిగ్విజయంబు సేయవేగి జయించిన దేశము. దీనికా కాలమున రాజు బృహంతుఁడు.

వ. మఱియు నులూక దేశాధిపతియగు బృహంతునిఁ బరాజితుం జేసి. సభా. 1-285

**ఉలూకుఁడు** సం. వి. అ. పుం.

1. శకుని కొడుకు.

ఇతనిఁ జంపుట నకుల సహదేవుల వంతుగ ధర్మరాజు నిశ్చయించెను. ఉద్యో 2-230

ఈతఁడు కృష్ణుని మీఁదఁ బార్థునిమీఁద బాణములు ప్రయోగించెను. ద్రోణ. 5-188

ఈతఁడు పర్వత ప్రతిముఁడు, ఈతనితో యుయుత్సుఁడు పోరాడెను. కర్ణ. 1-141 ను. 147 వఱకు

ఉతఁడు నకుల సహదేవుల బెదిరించి పోరాడెను. సహదేవుఁడు ఉతని తండ్రియగు శకుని సమక్షములోనే యితని తలను ఖండించెను.

శల్య 1-88

3. ఇతనిని దుర్యోధనుఁడు పాండవులంగని వాసుదేవ సన్నిధిని పాంచాల విరాట ప్రముఖులు వినుఁడలుకుమని పలుపని మాటలు గలిపి పుచ్చిన నగండును వెళ్లి యటులనే యక్షరము లిఱవోకుండ మాటలాడెను. ఇతఁడు శకుని పుత్రుఁడా మరొకఁడా నిర్ణయించుటకు సాధ్యము గాకున్నను అర్జునుఁ డితనిని "కితవసుతా" (ఉద్యో. 4-206) అని సంబోధించుట చేతను సం. భా. ఉద్యో. 159-6 లో "ఉలూక ద్రష్ట్ర కైతవ్య" యని యుండుట చేతను, ఇతఁడు కితవపుత్రుఁడని తెలుచున్నది. 'కితవుఁడు' అను పేరుగల వ్యక్తి భారతమున గానరాఁడు. కితవుఁడు అన వంచకుఁడు, మోసగాఁడు జూదరి యను నర్థములు గలవు. ఈ లక్షణములన్నియు శకునియందుఁ గలవు గాన ఇతనిని 'కితవసుతా' యని అర్జునుఁడు వ్యాఖ్యానించి యుండవచ్చును. దానింబట్టి ఈ రాయబారిగాఁ బోయినవాఁడు శకుని కొడుకే. శకుని కొడుకు గాకున్న నింత ధైర్యముగాఁ గృష్ణ పాండవ సమక్షంబున మాటలాడువాఁ డొకడుండఁడు.

ఉద్యో. 4-187 మొ. 210 వ.

**ఉలూచి** సం. వి. ఈ. స్త్రీ.

ఉలూపి - అర్జునుని భార్య - నాగకన్యక ఇరావంతుని తల్లి. ఈ యులూచి కథ మహాభారతమునందు ఆదిపర్వమునం దొక చోటను అశ్వమేధ పర్వమునం దొకచోటను గన్పించుచున్నది. రెండు చోటుల, జెప్పఁబడిన వారొక్కరే యయినను ఆంధ్ర భారతమున ఆదిపర్వ కథయందు ఉలూచి యనియు అశ్వమేధ పర్వత కథయందు ఉలూపి యనియుఁగలదు... ఆదిపర్వ కథయందు ఉలూపి శబ్దము లేదు. అశ్వమేధ పర్వ కథయందు ఉలూచి శబ్దము లేదు. సంస్కృత భారతమునందు రెండుతావుల ఉలూపి శబ్దమే యున్నది.

ఈమె యైరావత కులసంభవుండైన కౌరవ్యుని కూఁతురు. తీర్థ యాత్రలకై వచ్చిన అర్జునుని నాగలోకమునకుఁ దీసికొనిపోయి వివాహము

చేసికొనెను. సద్యోగర్భమున ఇరావంతుఁడను కుమారుఁడు జనియించెను. చూ. చరిత్ర. ఆది. 8-124 మొ. 134 వఱకు.

బభ్రువాహనుని ప్రేరేపించి అర్జునునితో యుద్ధము చేయించెను. కుమారునిచే హతుఁడైన నర్జునుని సంజీవని మణిచే బ్రదికించెను. అశ్వమేధకాలమున హస్తిపురము చేరెను.

చూ. అశ్వ. 4-58 మొ. 95 వఱకు.

పాండవుల మహాప్రస్థాన సమయమున ఈమె జనకుని కడకు భుజంగలోకమునకుఁ బోయెను. మహా. 1-23.

ఉలూపి సం. వి. ఈ. స్త్రీ.
చూ. ఉలూచి.

ఉల్క సం. వి. అ. స్త్రీ.

1. ఆకాశము నుండి రేఖాకారముగాఁ బడు తేజఃపుంజము - (ఇది అగ్న్యుత్పాదములలో నొకటి)

తే. అడరి కురుసేనపై గ్రద్ద లాడఁజొచ్చెఁ, బడుచునున్నవి యుల్క లిక్కడ. భీష్మ. 3-354

2. మంటలేని నిప్పు కణిక. (ఉల్కాస్యాన్నిర్గత జ్వాలా - అమరము)

వ. ఆ సంయమి చతురునిచే సర్వాయతన సన్నిరుద్ధంబై యాత్మ మూర్ధంబు భేదించి మహోల్కాకారంబున నాకసంబున కెగసి కొంత దవ్వరిగి యంత నంతర్హితంబయ్యె. అను. 5-468

ఉల్కము ఉల్క

(ఉల్కా శబ్దము 'అ' కారాంతముగాఁ గానరాదు. ఆనంద వారి ప్రతిలో 'ఉల్కము' పాఠముగను 'ఉల్కికలు' పాఠాంతరముగను ఈయఁబడినది. మిగిలిన ప్రతులలో 'ఉల్కికలు' పాఠము. ఉల్కము పాఠాంతరము. చూ. ఉల్కిక.

ఉల్కిక సం. వి. అ. స్త్రీ.
ఉల్క.

ఆ. రత్నకేతనములు రాజిత శేఖరంబులును రుచిరఘంటికలును శార్ఙ్గ, బాణనిహతిఁ దునిసిపడఁ గౌరవుల చేటు దెలుపు నుల్కికలును బోలె. విరా. 5-50. చూ. ఉల్క. ఉల్కము.

**ఉల్కాపాతము** సం. వి. అ. పుం.

ఆకాశము నుండి రేఖాకారమగు కాంతిపుంజము పడుట.

వ. ఆ సమయంబున మనదేశ మల్కాపాత శర్కరా వర్షాదులగు నుత్పాతంబులు గలిగె. శల్య. 1-387

**ఉల్కు** దే. అ. క్రి.

చూ. ఉలుకు.

**ఉల్ల** దే. సర్వ.

నాతిదూరము నాతిసమీపము గాని దానిని తెల్పును. ('ఈ' యని యర్థము)

తే. నా సఖుండు విరూపాక్ష నామధేయుఁ, డతని పురము మధువ్రజ
మదియు మూఁడు, యోజనము లిచ్చటికి దాని కుల్ల తెరువు,
వట్టి వే చని యాదైత్య భర్త గనుము. శాంతి. 8-486

శ్లో. గచ్ఛ సౌమ్య పథా౽నేన కృతకృత్యో భవిష్యసి.
సం. భా. శాంతి. 170-14

తే. ఉల్ల కాంచన రథముపై నున్నవాఁడు, ఘనుఁడు క్షేమం
కరుండు త్రిగర్తవిభుఁడు, మఱియు నినుఁ జూచుచున్నాఁడు
మగువ వాఁడె, దీప్తభుజుఁడు కళింగధాత్రీవరుండు. అర. 6-153

శ్లో. అసౌ తు యస్తిష్ఠతి కాంచనాంగే రథే హుతో౽గ్నిశ్చయనే
యథైవ, త్రిగర్తరాజః కమలాయతాక్షః క్షేమంకరో నామ స ఏష
వీరః సం. భా. అర. 254-7 (వాఠిళ్ల)

తే. ఉల్ల పద్మాకరము చెంత నుండి నిన్ను, మెచ్చి కనుఁగొనుచున్న
యునిద్రలితాక్షుఁ, డుత్పలాక్షి యిక్ష్వాకు వంశోద్భవుండు, సుబల
భూపతి పుత్రుండు సుభగుఁ డతఁడు. అర. 6-154

శ్లో. అసౌ తు యః పుష్కరిణీ సమీపే. సం. భా. అర. 254-8.

('ఇవర' అను పాఠాంతరము యుక్తముగాఁ గన్పింపదు.) (వాఠిళ్ల)

వ. అయ్యురగవల్లభు వచ్చునంతకు నుల్లవనంబున నిలిచెద.

శాంతి. 6-509

ఉల్లంఘించు సం. స. క్రి.

నిరసించు. త్రోసిపుచ్చు, మీఱు, అవదాటు.

వ. నీవిట వచ్చుట వినినయప్పుడు ధార్తరాష్ట్రులందఱుం గూడం బోలి తమలో నిశ్చయించిన తెఱంగు నీశాసనం బుల్లంఘించంగల వారు పాండునందనులకు నేమిటను నీకుందువారు ... అగుటం జేసి. ఉద్యో. 3-185.

వ. నీకు విజయంబుగోరి హితంబుపదేశించు నీ గోవిందు వాక్యం బుల్లంఘింపక. ద్రోణ. 5-311

వ. ఇంత ప్రమాదంబు నీవు గలిమిం దెగిసితి మేనయ్య మాతులాని యాజ్ఞ యుల్లంఘింప. కర్ణ. 2-214

ఉల్లతెరువు దే. వి.

ఈదారి. చూ. ఉల్ల.

ఉల్లము దే. వి.

1. హృదయము.

వ. అద్దివ్య వచనామృతంబు నా యుల్లంబున వెల్లిగొనినం బునఃపునః ప్రణామంబు లాచరించి. విరా. 1-19

2. ఇచ్ఛ. అభిలాష.

ఉ. చిత్తము మెచ్చి నావలనఁ జిక్కఁగ వెండియు నాలతాంగి యుత్ప్రేక్షయట్లు నాకుఁ దన యుల్లము దెల్లము సేయకున్కి దా, నత్తఱిఁ గ్రొత్తకాన్పగుట నడ్డము వచ్చిన సిగ్గుపెంపు నెమ్మత్తల మందఁజేయుటకునో తలపోసి యొఱుంగనయ్యెడున్. విరా. 2-4

ఉల్లల దే. వి.

ఉడుకుట (పరితపించుట) యందలి ధ్వని కనుకరణము

సీ. విప్రులు పట్టరా వెలిపొచ్చి యొదిగెడు, గవయంబు లాశ్నువఁ గర్ణభీతి, నుల్లమడుకుచు నుండుదు. కర్ణ. 3-83

క. ధనము గలవాఁడు మృత్యు వదనమున నున్నట్లు భయము దన చిత్తమునం, దమకఁగ నుల్లల నుడుకును, విను శిఖ చోరాది ముఖ్య విషయాపదకున్. శాంతి. 4-33

**ఉల్లలనుడుకు** దే. అ. క్రి.

మిక్కిలి పరితపించు (పరితాపముచే) తుకతుక మఱఁగిపోవు

చూ. ఉల్లల.

**ఉల్లలత్** సం. శత్ర.

చలించుచున్న, ఎగురుచున్న (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు)

క. లలితాచ్ఛ స్ఫటిక శిలాతలములపైఁ జాఱు విమలతరనిర్ఝరిణీ
జలపూరములను దారోల్లల దురుహారాలి సఙ్జ్వరం బగుదానిన్.
అర 3-283; అర. 4-188

**ఉల్లవనము**

ఉపవనము.

వ. అయ్యర్జునుఁ డల్లఖు వచ్చునంతకు నుల్లవనంబున నిలిచెద.
శాంతి. 6-663

శ్లో. అనేన నిశ్చయే నాహం సాధ్వీ సంప్రాప్తవానిహ,
ప్రతీక్షన్నాగమం దేవి వత్స్యామ్యస్మిన్ మహావనే.
సం. భా. శాంతి. 367-10

**ఉల్లసత్** సం. శత్ర. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు)

ఉల్లసించుచున్న, ప్రకాశించుచున్న.

శా. ...సాంద్రకుసుమ శ్రేణీ వికాసోల్లసద్రక్తాశోక తరువ్రజంబుల
క్రియన్ రంజిల్లి యొప్పెంగడన్. విరా. 5-38; విరా. 5-279

**ఉల్లసనము** సం. వి. అ. న.

1. ప్రకాశము, వెలుఁగు.

ఉ. అప్పుడు శంఖుఁ డెంతయుఁ బ్రియంబునఁ జెండ్లికిఁ బోవునట్లు
మో, మొప్పఁగ నస్త్రశస్త్రముల యుల్లసనంబున శస్త్రనేత్ర
ముల్, గప్పఁగ. విరా. 3—176

2. వికాసము, స్ఫుటత.

మహాస్రగ్ధర :- వసురుద్రాదిత్య గంధర్వ గరుడ భుజగ వ్రాతముల్
వైభవం బుల్లసనం బొందంగ సిద్ధు ల్మనముల ముదము ల్పర్వ
వింపంగ పార్థుల్, హసిత ప్రాంతంబులం బెల్లలమిఁ బొసఁగ
వశ్యాదరోత్కర్షముల్. స్వర్గా. 1-34

3. విహారము, విహరణము.

క. అఱచినఁ బఱచిన ప్రేళులు, గఱచిన నతఁ డించుకయును గరుణిం
పక యం,దఱ మఱము చేసె గుంపుల,కుఱికి యుఱికి ఖడ్గదారు
ణోల్లసనములన్. పా ప్తి. 3-7; పాస. 57

4 సంతోషము.

చ. ... సముదీరితోల్లసన కందళిత ప్రహసద్దయాలతా, సుమహ
దుపాశ్రయ ప్రమదశోభిత విశ్వజగన్మధువ్రతా. ఉద్యో. 4-426

**ఉల్లసమాట** వి. (√ఉల్లసమాడు)

ఉల్లసమాడుట, పరిహాసము చేయుట.

క. అని తను నుల్లసమాటకుఁ, గినిసి యనతనూజుఁ డేమ గ్రీడి నిచట
మా,ర్కొను వీఁకఁ గన్నులారం, గనుఁగొనుమీ నిలిచి యనుచుఁ
గవిసెం దెలుచన్. విరా. 5-182

**ఉల్లసమాడు** సం. అ. క్రి.

1. ఎత్తిపొడుచు, పరిహసించు, మర్మము దూఱనాడు.

సీ. ఈ రొమ్ము భేదింప నే మెవ్వరము వేర, మర్మమందుఁచు నీవు నచ్యు
తుండుఁ, బ్రద్యుమ్నుఁడను దక్కఁ, బార్థుండు మనల నుల్లస
మాడకుండ నీలావు మెఱసి, భేదించి మా కెల్లఁ బ్రియమొనర్పు
కుమార. ద్రోణ. 2-5

2. అపహసించు, గేలిసేయు.

సీ. తమ్మిరేకుల నుల్లసమ్మాడు తన మృదు,కర యుగ్మమునను శంక
రుని నేత్ర -అ- యుగ్మమల్లమూసి. అను. 4-419; కల్య. 2-315

**ఉల్లసము** దే. వి.

ఎత్తిపొడువు, పరిహాసము, ఎత్తిపొడుపు మాట. సోల్లుంఠన వాక్యము.

క. పరదోషము చెప్పఁగ నేర్తురుగా నాత్మీయమైన దోషంబు మదిం,
బరికింపఁగ నధములు నేర్తురె తలఁపక యుంటి వలుకతో నుంద
కుమీ. కర్ణ. 2-112, 113

వ. అని యుల్లసంబాడి మఱియును.

ఉ. గాడిద రూపుదాల్చి యుముకల్ దినుచుండఁగఁ జూచి యుల్లసం,

వాడెదు శక్రకాంతి సమయం బగుటన్ విను మింకఁ గొన్ని నీ,
వాడిన వాదు చిత్తమున నల్క యొకింతయుఁ బట్టక.
కళా. 2-215

**ఉల్లసములాడు** దే. అ. క్రి.
ఉల్లసమాడు.

తే. బాసటై వీరరథికులు బలసి యెంతయు, వాఁడొరుల గరువంబుగ
నుల్లసంబు, లాడుచును జేరి పడ తేర నత్యుదార,గతి శిఖండియు
నడచిరి శౌరసేంద్ర. భీష్మ. 1-112

**ఉల్లసితము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రకాశించినది.

ఆ. ఆర్చి పెలుచ నట్టహాసంబు సేసిన, నలిగి యతఁడు భల్లములఁ
దదీయ, భూరికంకటంబు పొలుపఱ నఱకి యు,ల్లసిత మకుట కుండ
లములు డుల్చె. కర్ణ. 3-388

2. గర్వించినది.

వ. సౌభద్రుండు రౌద్రరసోల్లసితమూర్తియై. ద్రోణ. 2-18

3. ఉద్రిక్తమైనది. రేకెత్తినది.

క. రాగ పరిలిప్తమానస, యోగంబున నింద్రియంబు లుల్లసితములై,
భోగులగుట యుడిపిన నప,రాగత సంసార దుర్విరామము సేయున్
శాంతి. 4-298

మ. మఱిఁ గారుణ్యము సేసి విప్రవరుఁ డీ మంత్రంబు వాకిచ్చె నే,నిది యే
చందమొ చూతునంచు నొకనాఁ డిచ్చన్ బుధుస్నాతనై, సుదతీ
రత్నము పూర్వశైలతటిపై శోభిల్లు తిగ్మాంశుఁ జూచి దశత్వం
కళ భంగి నుల్లసితమై చిత్తంబు రాగిల్లఁగన్. అర. 7-384

4. ప్రసిద్ధము, ప్రఖ్యాతము.

క. విమతమగు లోకరేచన,మున నన్ను విరించుఁడంద్రు బుధమత
రవియం, దనుపాధిక విద్యాస్ఫూర్తి, మనికిం గపిలాభిదాన ముల్లసిత
మగున్. శాంతి. 6-488

**ఉల్లసితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

1. ప్రకాశించినవాఁడు, గర్వించినవాఁడు.

ఉ. తెల్లని జోదు వెట్టుకొని తీవ్రగతిం జనుదెంచె మత్స్యభూవల్లభు
నగ్రనందనుఁడు వైరిమదాపహ విక్రమ ప్రకారోల్లసితుండు
వన్యబలం బుద్ధతిఁగొల్వ మృగేంద్రరేఖ శోభిల్లుచునుండ శంఖుఁడు
విశాలశంఖనినాద మొప్పఁగన్. విరా. 3-148

2. సంతోషించినవాఁడు.

ఉ. గాండివముక్త బాణములఁ గర్ణుఁడు గూలుటయుం దలంకి శల్యుం
డరదంబు దోలుటయు నొక్కమొగిన్ భవదీయసేన లొంగొండ
కలంగి పాఱుటయు నుల్లసితుండయి చూచి వాయుపుత్రుండు
మహావిరావమున రోదసి పిక్కటిలంగ వార్చెనన్. కర్ణ. 3-374

3. ఉత్సహించినవాఁడు. శల్య. 2-262

**ఉల్లసిలు; ఉల్లసిల్లు** సం. అ. క్రి.

1. సంతోషించు.

ఉ. అంబుజనాభ సముద్యదరుణాంశునిఁ గన్న విధంబునన్ వికా
సంబున నుల్లసిల్లి జనదారు విలోచనముల్ నిజోజ్జ్వలాంగంబున
కర్థిమై నభిముఖంబులుగాఁ జనుదెంచి దైవయోగంబున భూ
విభుఁ డుర్గంబులఁ దేరఁగఁ జంచి చూడఁగన్. విరా. 1-256

తే. ...ధర్మువు దప్పి యుధిష్ఠిరుండు, వడయ నొడఁబడఁ డయ్యింద్ర
పదవినైన, నుచితగతి నెండవడసిన నుల్లసిల్లు. ఉద్యో. 1-11

2. ఒప్పు, ప్రకాశించు.

ఆ. తనరు తాలబింబమున నమేయప్రభాపటలం బడరం గగన భాగ
మగుచు, నుల్లసిల్లి జగములెల్లను విలసిల్లఁ, బార్వతీశుశిరము మీఁదఁ
బొడిచె నినుఁడు. ఉద్యో. 2-114

తే. ఇట్లయిదు నుల్లసిలుట, వనఘ భూతంబు పంచభూతాత్మకంబు.
శాంతి. 4-88

చ ...మనోజ్ఞ సితచ్ఛవి నుల్లసిల్లు పుష్కరతురగోత్తములు దవు
దవ్వులఁ గాంచిరి చారులోచనల్. అను. 1-188

3. స్ఫుటమగు, వ్యక్తమగు.

చ. అదియును గాక కోలుపులిసైనను గారెమబోతుసైన నున్నదకరి సైన నుగ్రమృగనాథుని సైనను గిట్టిముట్టి పెట్టిదముగఁ గాలఁ గేలను గడిందిమగంటిమి యుల్లసిల్లఁ బట్టుదు నదలఁగంగ.

విరా. 1-88

4. విజృంభించు, చెలరేఁగు.

తే. అదఁగఁ బొదువుచు నలుక యంతంత కగ్గలించి యాయముల్ వొంచి దోర్లీల నెఱపి, యుల్లసిల్లిన ప్రసుకృకొండొరుల రౌద్ర, వృత్తిపొంచు చొండొరులను వెక్కసముగ. విరా. 2-347

5. దిక్కులందున బాణంబులు, పిక్కటిలఁగ నుల్లసిల్లి భీష్ముఁడు నరు తే, రక్కడ డించి ద్రుపదపిథుఁ, దుక్కుఱఁ దత్సేన మీఁద నురవడి గవిసెన్. భీష్మ. 1-292

6. కలుగు, పుట్టు.

చ. మనుజవరేణ్య నావలని మన్నన యట్టిదకాదె శత్రు మర్దన మొన రించి మత్స్య నగరంబున కుత్సవ ముల్లసిల్ల నీ చనుటయ వాకుఁ దేజమును సంపదయున్ గరిమంబుగాక. విరా. 8-225

సీ. ఉద్భట క్రోధ సముద్రేకములఁ బాదుకొలం దుల్లసిల్లెడు నరుణ రుచుల. శల్య. 2-265

7. ఉండు, నిలుచు.

వ మనవారును వెదలి భీష్ముం దగ్రభాగంబున నుల్లసిల్ల నీ కుమారు అమ్మహాత్ముఁ బరివేష్టింప. భీష్మ. 8-815

8. ప్రవర్తిల్లు

ఉ. ఆదిదేవుఁడగు మహాదేవు మీఁద నెవ్వాని మనసు భక్తిభవమున, నుల్లసిల్లు నతని నెల్లకార్యముల దగ్గఱవు నూనె గ్రహ వికార కృతులు అర. 5-267

9. పెంపొందు, వర్ధిల్లు.

వ. అట్టియెడఁ దమకు సపత్యంబై తతోదరుఁడగు నైరావణుండు పెనిచి యుపలాలింప నుల్లసిల్లిన యశ్వసేనాభిధానుం డగు నాగ

కుమారుండు సర్వముఖ శరాకారంబు గైకొని తపనోద్ధమునఁ.
కర్ణ. 2-816

తే. ఒక్కఁ డుజ్జ్వల తేజోమయుండు దోఁచి, జరయు మరణంబు లేక యసురల సురల నోర్వఁజాలిన బలముతో నుల్లసిల్లు మని వరం బిచ్చె నిచ్చిన నధికశక్తి.
అను. 1-851

**ఉల్లాసనము** సం. విణ. (అ. ఆ. అ.)

ఉల్లసింపఁజేయునది.

వ. మిత్రోల్లాసనంబును ద్రిగుణమణిజాంబూనదమయంబును జన ప్రస్తుతి పాత్రంబును హస్తికక్ష్యాత్మకంబును నగు నతని కేత నంబు గనకపుంఖ ప్రభా భాసితంబైన భల్లంబునఁ బడవేసిన.
కర్ణ. 3-357

(మిత్రోల్లాసనము = మిత్రులకు సంతోషము గలిగించునది)

క. శ్రీ సంక్రామణ నిపుణ, విలాసకటాక్షా విచిత్రితలంపట చిత్తో, ల్లాసన రక్షా వేద, వ్యాసవచో విభవలక్ష్య హరిహరనాథా.
శాంతి. 1-1

**ఉల్లాసము** సం. వి. అ. పుం.

1. ప్రకాశము.

క. హ్రీంకార మయమనోజ్ఞా, లంకారోల్లాస నిత్యలాలిత్యకరున్.
విరా. 1-82

2. ఆహ్లాదము, సంతోషము.

క. కైచేసి మదన వికారో, ల్లాసంబున మేనువొంగ లఘుగతి మత్కాం, తాసవపాన విధాన, వ్యాసంగ తరంగితాంతరంగుం డగుచున్.
విరా. 2-329

వ. చూచి తన్నప్పుడు గ్రమ్మఱ జన్మించిన వానిఁగాఁ దలంచి యాపదలకుం బాసి సంపదలకు భాజనంబనైతినని యూఱడిల్లి యుల్లాసంబున మరలె నిట్లు కర్ణ సాగరంబు గడవనీఁది పాండునందనులు పరమానందంబు వొందిరి.
కర్ణ. 3-396

3. వికాసము, స్ఫుటత.

వ. అనిన విని సంక్రోధహాసోల్లాస వికృతాననుండై మత్స్య మహీపా

తుండు. విరా. 5-258

4. ఉత్సాహము.

క. తమ తమ యొద్ది బలంబులు, క్రమ విరళములైన దొరలు గాండి
విపై న్యుగ్రముగఁ దలుముటయు వారఁడు, సమరోల్లాసమున
దివ్య శరతత్పరుఁడై, విరా. 5-65

5. విజృంభణము.

ఉ. ... వాస విశర ప్రతతిం దొరఁగించి ద్రోణుమహోల్లాసము మాన్చి
కౌరవ బలంబులు నెత్తురు వెల్లిఁ దేలఁగాఁ, జేసినఁ గర్ణ కర్ణ మముఁ
జేకొనవే యనుచున్ భయంబునన్. ద్రోణ. 1-882

వ. అతని వదంబునకై పాంచాల విభుని వేలిమిం బుట్టినవాఁడగుట
నవార్షితుండు దత్సమయ జనితోత్సాహ రోష విశేషాయత్త
చిత్తుండగుచు నమ్మహీసురవరు మీఁదం గవిసి యేసిన నదికి నొల్లని
యుల్లంబునం బరుని యుల్లాసంబు సహింపలేవి తేజంబునం బురికొని
యతండు ఘోరం బొడంగిన దివ్యాస్త్రంబులు ప్రవతిభాసింపక
యుండె. ద్రోణ 5-321

6. బొష్పవము.

శా. వ్యూహోద్భావము చూచి నన్నసదుగా నూహించెదో భీమ మద్బాహా
చండిమ పారదుర్దమగదాదండంబు దృప్యద్భవద్దేహోల్లాసము
నెట్లు దీనదశకుం దే నోపునో చూడుమీ, యాహాపుట్టెడు లాఁతి
చూపఱకు హాహాపుట్టు మీ వారికిన్. శల్య. 2-248

7. విస్ఫురణము.

శా. నిద్రాసక్తునిఁ గొంత మేల్కనినవానిన్ సుప్తబుద్ధాత్ముఁడై
యుద్రేకంబున శౌర్యసాగరమున బాహూల్లాసముం జూపఁ జం,
చద్రేఖం దిరమైనవానిఁ దన నుత్సాహోగ్రతం దాఁకి యున్ని
ద్రస్వైర సముద్ధతిన్ దొలియు వానిం దున్మె వేగాకృతిన్.
సౌప్తి. 1-178

8. వైభవము.

వ. భవదీయసభ యొప్పునకును రాజసూయంబు చెల్లిన యుల్లాసంబు

నకు నట్లసహ్యాపడి శాంతి. 3-121

9. చేష్ట, వ్యాపారము, కర్మము.

క. జాతుఁడు మృతుఁడగుట ధ్రువము, భూతోల్లాసము లనిత్యములఁ
విను సద్యః, పాతియగు శరీరంబున,కై తొలఁగుచె ధర్మపథము
నార్యుం డడుసఘా. శాంతి. 5-518

10. ఉద్రేకము.

క. నదిరయము వారణేంద్రుఁడు, గుదియించినయట్లపోలెఁ గురువర
దైన్యా, స్పదమగు విషయోల్లాసముఁ గుదియించును యోగ
సిద్ధి గురుహృద్బలుఁడున్. శాంతి. 5-582

**ఉల్లాసి** సం. విశే. (న్. సీ. న్.)

ఉల్లాసము గలవాఁడు.

మ. నరసింహుం డసురేంద్రుద్రవచ్చు కరణి న్రౌద్రం బుదగ్రంబుగా,
నుర మత్యుగ్రతఁ జీరి క్రమ్మ రుధిర మ్ముల్లాసియై దోయిట, న్వైర
వారం గొని త్రావు మెచ్చుఁ జవికి న్మేనున్ మొగంబున్ భయం
కరరేఖం బొరయంగ జల్లికొను నకార్యరవ్వుఁ జూచుం బోరిన్.

కర్ణ. 3-214; విరా. 1-7; విరా. 5-868; అను. 1-178

**ఉల్లాసితము** సం. విశే. (అ. ఆ. అ.)

ఉల్లసింపఁ జేయఁబడినది.

క. శ్రీ సాంగత్య విధాయి వి,కాసోల్లాసిత కటాక్ష కరుణామయ
మూర్తి. శ్రీ. 1-1

**ఉల్లి** దే. వి.

ఉల్లిగడ్డ, ఉల్లిపాయ ఇది 1) నీరుల్లి (పలాండువు) 2) వెల్లుల్లి (లశునము)
అని రెండు విధములు.

ఆ. మునగయుల్లి యడవిమునగ దుర్మాంసము, లానుగమ్మ మలిన
మైన యుష్ప్ర,కఱియ జీలకఱ్ఱ కరివేము గురుజ యుం,గువ ప్రవర్త
నీయకోటి యగుట. అను. 8-189

**ఉల్లికుట్టు** దే. వి. (√ఉల్లి)

ఎత్తిపొడువు, పోట్లంతనము.

చ. వినుమరిఁ జంపనుం దెలుప వేచుట లెస్స ప్రతాప భావణం,బున
వెడ నుల్లికుట్టులను బొంకుల వానిఁ గలంగఁ జేసి శేఁ,చినఁ దన
పూఁపు, దప్పనలు సేయని చందము నమ్మియున్న చా,కున్న మెలు
యంగఁ బల్కుచుఁ గడున్ మది నమ్మిక యుండఁగాఁదగున్.
శాంతి. 8-20

**ఉల్లికుట్టు మాటలు** దే. వి. (√ఉల్లి)

ఎత్తి పొడుపు మాటలు, సోల్లుఠ వచనములు.

క. సమరమునకుఁ బురికొల్పుచు, మముఁ దలఁచిన నుల్లి కుట్టుమాటలఁ
దచ్చి,తము లుడికించుచుఁ బాండవ, సమితిం గడఁగించు వార
చట నెవ్వరొకో – (ఉల్లకుట్టు – ఉల్లము + కుట్టు – అని-శ ర.)
ఉద్యో. 2-242

**ఉల్లిఖితము** సం. విణ. (అ. ఆ. అ.)

రాచుకొనఁబడినది, రాపిడి చేయఁబడినది.

స్రగ్ధర :— లీలం గల్లోల భాగోల్లిఖిత గగనమై. అర. 7-16

**ఉల్లేఖి** సం. విణ. (న్. నీ. న్.)

రాపిడి దేయునట్టిది, తాఁకునట్టిది.

వ. కైలాసశైల విలాసాపహాసి భాసుర గగనతలోల్లేఖి శిఖరరమ్య
హర్మ్యతలంబులను. ఆది. 7-166

**ఉవిద** వై. వి. (సం. యువతి)

1 స్త్రీ, ఆఁడుది.

వ. అన్నారాయణుండును శోకసంతాపితాంతఃకరణుండగుచు నుచిత
వచనంబుల నయ్యువిదల నెట్టకేలకు నూరార్చి. ద్రోణ. 2—839

2. భార్య.

తే. ... ఋచీకుఁడధిక, సమ్మదమున గృహస్థ ధర్మమ్ము నడుపు,
చుండి సంతానకాంక్ష నయ్యువిదతోడ. అను. 1-107

**ఉవ్విళులూరు; ఉవ్విళ్లూరు** దే. అ. క్రి.

1. త్వరపడు, తమకించు, తహతహపడు.

ఉ. వీనుల దియ్యమెక్క మును విన్కి బరస్పర రాగవృత్తి లో,
నూనినఁ జూచు వేడుకల నుప్పిరులూరెడు నెమ్మనంబులు.
విరా. 3-398

చ. పిలిచిన రాజులున్ మునులు ప్రీతి యెలర్ప బలోత్కరంబు
లిమ్ములఁ దమతోడరా మనము లుప్పిరు లూరఁగ యజ్ఞ వర్త
నంబులు గనుగొంటకై సకల భూవలయంబునఁ గల్గునట్టి
వార్తలు సనుదెంచిన. అశ్వ. 4-185

మ. అనినం గేకయ రాజనందన ప్రభూతాశ్చర్యయై యిట్లనున్, విను
నీ రూపము సూచి మా నృపతి యుప్పిళ్లూరు. విరా. 1-321

ఉ. ... అక్కడకుఁ దార్చి నేర్పునన్, శయ్యకుఁ దెచ్చెదం గుసుమ
సాయకు పూనికి నేఁడ తీర్చెదన్.

క. అని యుప్పిళ్లూరుచు వెసఁ జని. విరా. 2-245; 246

**ఉప్వెత్తుగొను** దే. స. క్రి. (ఉప్పు + ఎత్తు + కొను)
సిశ్శేషముగా చంపు, నశింపఁజేయు.

ఆ. కవల వారుఁ గొంతకు గమియఁ బాంచాల వర్గంబు వృష్ణి
వరులుఁ గడఁగి రేని, యొక్క మాత్రలోన నుప్పెత్తు గొనరె
దుర్యోధనాది శతము నుద్దవిడిన. ఉద్యో. 1-29

క. ఆఱువది కోటులు గపివరు, లుఱక జగత్త్రియము నొకట నుప్వెత్తు
గొనం, దఱిగొన్నయట్లు నడవఁగ, నెఱసి కుముదుఁ డరుగుదెంచె
నృపవరుఁ గనియెన్. అర. 7-86

**ఉశీనరుఁడు** సం. వి. అ. పుం.
ఒకానొక రాజు, అష్టవసువైన ప్రభాసుని భార్యకు ప్రియసఖయైన
జితవతి తండ్రి.

వ. మర్త్య లోకంబున నుశీనరపతి కూఁతురు జితవతి యను కోమలి
నా ప్రియసఖ. ఆది. 4-159

**ఉష్ట్రము** సం. వి. అ. పుం.
ఒంటె, లొట్టియ.

సీ. వినుతొల్లి యొక యుష్ట్రి మనితరసాధ్యతపంబు సేయఁగ
మెచ్చి బ్రహ్మ వచ్చి యర్థించినది యేమి యనిన—
శాంతి. 3-88; అశ్వ. 3-157

**ఉష్ట్రి** సం. వి. ఈ. స్త్రీ.
ఆఁడు లొట్టియ.
క. తురగియు నుష్ట్రియు ఖరియును, గురిసిన దుగ్ధములు నింద్యకోటి
గణితముల్, ధరణీసురాది జను ల,ప్పౌరువునఁ బోయిన నఘంబుఁ
బొందుదు రధిపా. శాంతి. 1-321

**ఉష్ణము** సం. విశ. (అ. ఆ. అ.)
వేఁడియైనది.
చ. దినమునవెల్ల నుష్ణకరదీప్తులు వర్షి రసంబుఁ బీల్చు.
శాంతి. 2-126

**ఉష్ణకరుఁడు** సం. వి. అ. పుం.
సూర్యుఁడు, (వేఁడియైన కిరణములు గలవాఁడు.)
సీ ... చంద్రముని నుష్ణ, కరుని జక్రింబులుగాఁబెట్టి. కర్ణ. 1-282

**ఉష్ణత్వము** సం. వి. అ. న.
వేఁడిదనము.
క. హిమకరుఁడు శైత్యమును న,ర్యముఁడు మహాతేజమును హుతా
శనుఁ డుష్ణత్వము విడిచిరేని గుర్వ,ర్థము నాచేకొనిన సద్వ్రతంబు
విడుతునే. ఆది. 4-223

**ఉష్ణినాభుఁడు** సం. వి. అ. పుం.
ఉష్మపులలో నొకఁడు. చూ. ఉష్ణపులు. అను. 3-192

**ఉష్ణిగంగ** సం. వి. ఆ. స్త్రీ.
ఒక తీర్థప్రదేశము. ఇచట స్థూల శిరసుని ఆశ్రమము గలదు. ఇచ్చట
మానక్రోధ త్యాగము ముఖ్యము ఇందు స్నానముచేసిన వారు కృతార్థు
లగుదురు. బహుశః ఇది ఉష్ణపు గుండముగల గంగానదీ ప్రదేశ
మేమో,

**ఉష్ణీషము** సం. వి. అ. పుం. న.

తలపాగ, శిరోవేష్టనము.

క. బలరిపుఁడిచ్చిన కుండలములు నుష్ణీషంబుఁ జిత్తమున భక్తిమెయిం
దలఁప నవి వచ్చె వెంద్రుక లలవడఁగాఁ దాచి ముడిచె నమర
దృఢముగన్. విరా. 4-164

**ఉష్ణీషి** సం. వి. న్. పుం.

శివుఁడు.

సీ చీరవాసుఁని ధన్వి సిద్ధు దండధరు మృగవ్యాధు నుష్ణీషిఁ గనక
బాహుఁ, బశుపతి వృషు భూతపతి. అశ్వ. 1-62

**ఉష్మపులు** సం. వి. అ. పుం. బహు.

దేవతలలోఁ గొందఱు పితరులుగా నిర్దేశింపఁబడిన వారు.

వీరు- 1. బలుఁడు, 2. ధృతి, 3. విపాప్ముఁడు, 4. పుణ్యకృత్తు, 5. పావనుఁడు, 6. పార్ష్ణిక్షేముఁడు, 7. సమూహుఁడు, 8. దివ్యసానువు. 9. వివస్వంతుఁడు, 10. వీర్యవంతుఁడు, 11. హ్రీమంతుఁడు. 12. కీర్తిమంతుఁడు, 13. కృతుఁడు, 14. విద్యుద్వర్చసుఁడు, 15. సోమవర్చసుఁడు, 16. సూర్యశ్రీ, 17. సోమపుఁడు, 18. సూర్యసావిత్రుఁడు, 19. దత్తాత్ముఁడు, 20. పుండరీయకుఁడు, 21. ఉష్ణీనాభుఁడు, 22 నభోదుఁడు, 23. విశ్వాయువు, 24. దీప్తి 25. చమూహరుఁడు, 26, సురేశుఁడు, 27. వ్యోమారి, 28. శంకరుఁడు, 29. భవుఁడు, 30. ఈశుఁడు, 31 కర్త, 32, కృతి, 33. దక్షుఁడు, 34. భువనుఁడు, 35. దివ్యకర్మకృత్తు, 36. గణితుఁడు, 37. పంచవీరుఁడు, 38. ఆదిత్యుఁడు, 39. రశ్మిమంతుఁడు, 40. సప్తకృత్తు 41. సోమపూర్వుడు, 42. విశ్వకృత్తు, 43. కవి, 44. అనుగోప్త. 45. సుగోప్త, 46. నప్త, 47. ఈశ్వరుఁడు, 48. జితాత్ముఁడు, 49. మునివీర్యుఁడు, 50. దీప్తరోముఁడు, 51. భయంకరుఁడు, 52. అనుకర్ముఁడు, 53. ప్రతీతుఁడు, 54. ప్రదాత, 55. అంశుమంతుఁడు, 56. శైలాభుఁడు, 57. పరమక్రోధి, 58. ధీరోష్ణి, 59. భూపతి, 60. స్రజుఁడు, 61. వజ్రి, 62. వరి. అను. 3-192

ఈ వరుసయందు నిర్ణయసాగర వారి ప్రతికిని నీలకంఠీయ వ్యాఖ్యాతకును తిక్కనగారి ఆంధ్రీకరణ మనుకూలించినది. వావిళ్ళ వారి ప్రతిలో

శ్లోకములు వెనుక ముందగుట మాత్రమే కన్పించుచున్నది గాని పేర్లలో భేదములేదు. ఈ మాత్రమునకే తిక్కనగారు నిర్ణయసాగర ప్రతిని ఆను సరించినవారనుటకు వీలులేదు.

**ఉష్మము** సం. వి. అ. న్. పుం.

వేసఁగి, గ్రీష్మము.

సీ. ...శత్రుప్రతాపోష్మ సమయంబు,గా మిత్రు జిహ్మాకేశారవంబు, లెసఁగంగఁ దోఁతెంచి యింద్రనందన మహోజలధరంబు.

ఆర. 6-186

**ఉసుఱు** దే. వి.

ప్రాణము.

క. ఉసుఱు సచ్చినవారలు వత్తురె. ద్రోణ. 2-185; శల్య. 2-56

**ఉసుఱుగొను** దే. అ. క్రి.

ప్రాణముదీయు. చంపు.

క. ...ఈ, పిశాచ్చాతని ప్రాణంబులు, గొన్నది యిది దీని యుసుఱుగొని యెద ననియెన్. అను. 1-7; ద్రోణ. 5-135

# ఊ

**ఊఁకించు** దే. అ. క్రి.

ఉంకించు, ఉత్సహించు, పూను.

శా. నీ తోడ్పాటున నేఁ త్రివిష్టపములన్ గెల్వంగ నూఁకింతు.

కర్ణ. 3-130

**ఊఁకువ** దే. వి.

విశ్రాంతి, ఊఱట, తెఱపి, విరామము.

చ. వలవదు రోయఁ బాండవుల వారొక యూఁకువ లేని త్రిమ్మటన్,
బలమతి వన్యసత్త్వముల పాల్పడి చచ్చినచోటఁ బూరియు,న్మాల
వదె యింత కింకిట మనోముద మస్ఖలితంబుగాఁగ వి,చ్చలవిడి
రాజ్యలక్ష్మిఁ దగు చందమునం గొనియాడు మున్నతిన్.
విరా. 3-95

"ఊఁకుట" అనునది పాఠము. "ఊఁకువ" యను వది పాఠాంతరము.

**ఊఁకొను** దే. స. క్రి.

1. ఊఁకొట్టు, మనస్సున పెట్టక విను, వినియు విననట్లు విను.

ప. మీరును వారును నొక్కటియై యున్న మీదిక్కు దేవతలకుం దేఁ
చూడరాదనిన నమ్మాటలు వెడ వెడ యూఁకొని ధృతరాష్ట్రుండు
విదురున కిట్లనియె. ఉద్యో. 2-49

ఉ. రక్కెపమాట లాడెదరు రాజును దమ్ములు వాఁడితోవ నీ,వొ
క్కటి యైనఁ గాదనగ యూఁకొనుచుండుట యంతకంటె మేలు.
ఉద్యో. 3-94

2. విను, ఆలకించు.

చ. ... కార్య మల్పబు,ద్ధుల వెడమాట లూఁకొనకు దోషము
నేగియు వచ్చు నెమ్మెయిన్. ఉద్యో. 3-331

**ఊఁగు** దే. అ. క్రి.

ఉయ్యలలూఁగు. చూ. ఊఁచు. అర. 4-138

**ఊఁచముట్టు** దే. క్రి. విశే.

(అరటి పొరలను దూఁట తగులు వఱకు వొలిచినట్లు); నిశ్శేషముగా,
మూలముట్టుగ.

ఆ. ఉద్ధవిడిన పసుల నూఁచముట్టుగఁ దెత్తు. విరా. 3-120

**ఊఁచముట్టుగొను** దే. స. క్రి. (ఊఁచముట్టు + కొను)

నిశ్శేషముగాఁ జంపు, చంపు.

గీ. కొడుక తమ్ములుఁ దోడ్పడఁగడఁగి శత్రు,వరుల గెల్చెదనంట
వొక్కరుఁడు దక్క, కుండ నీతమ్ముఁ గుఱ్ఱల నూఁచ ముట్టుఁగొని
యెనే విధి యేగతిఁ జనుదుఁ దెల్పుము. శల్య. 1-28

**ఊఁచికొను** దే. స. క్రి.

ఊఁగించుకొను, ఊఁగునట్లు చేసికొను.

ఉ. శాతనఖాగ్రఖండిత లసన్మదకుంజర కుంభముక్త ముక్తాతత
శైల కందర గుహాంతర సుప్తమృగేంద్ర కేసర, వ్రాతము
వేడ్క నూఁచికొన వారక చేరులు గాదె క్రోధ నిర్ఘాత
మహోగ్రు భీముఁ దెనకం దలపోయుట నీకు నెమ్మెయిన్.

అర. 6-176

**ఊఁచు** దే. స. క్రి. (√ఊఁగు) ఊఁపు

ఊఁగఁజేయు.

చ. దళిత నవీన కందళ కదంబ కదంబక కేతకీరజో, మిళిత సుగంధ
బంధుర సమీరణుఁడన్ సఖుఁ డూఁచుచుండఁగా, మలియుచు
మొల్ల గుత్తులను మయ్యెల లొప్పఁగ నెక్కి యూఁగె మ్మల్లల
దళినీకులంబు మృదుల ధ్వని గీతము విస్తరించుచున్.

చూ. తలయూఁచు.  అర. 4-183

**ఊఁటు** దే. స. క్రి.

పొడుచు.

సీ. చేతి సమ్మెటలను తేరుకోలల నేసి యంకుశంబుల నూఁటి యతి
రయముస, వాహనంబులఁ దోలువారును.  భీష్మ. 3-284

**ఊఁదు** దే. అ. క్రి.

(దీనికి మూలరూపము తమిలమున 'ఉమ్దు' - తమిలమున రేఫమునకు 'ఉ' కారోచ్చారణ ముండుమ గాన 'ను' లోపించి 'ఊఁను' అయినది రేఫము లోపించి 'ఊను' అయినది 'ఊఁదు, ఊను' (సమానార్థకములు) చూ. ఊఁదుకొను.

**ఊఁదుకొను** ఊఁదు (స్వార్థమున 'కొను' ప్రత్యయము)

నాటు, గ్రుచ్చు, దిగబడు.

వ. కాలుబలంబుల పీనుంగుపెంటలమీఁద నూఁదుకొనం గూలిన
ఘోటకంబులును.  ద్రోణ 2-60

(ఇది 'ఊఁదుకొను' అను పాఠమునకు పాఠాంతరము)

**ఊఁత** దే. వి. (√ఊఁదు)

1. ఆధారము.

క. చనుటయు ద్రౌపది యతనిం, గనియుం గానని విధంబు గైకొని చిత్తం,బున బెదరక తన ముందటి, పని వెరవున నుండె భీము పలుకుల యూఁతన్. విరా. 2-248

2 ప్రాపు, ఆశ్రయము.

వ (ధృతరాష్ట్రుఁడు) దప్పి యెక్కుడు గదిరిన గాంధారి తనువున మేను సేర్చి మూర్ఛిల్లుటయు నార్తి నొంది యక్కుంతీనందనాగ్రజుం డిట్లని పలవించె.

క. కరిదశ సహస్ర బలవి,స్ఫురితుఁడగు విచిత్రవీర్యపుత్త్రుఁ డొక తలో,దరి యూఁతగొనియె విధి, యె,వ్వరి హీనులఁ జేయఁ దకట వక్రుండైనన్.

చ, అనిలజు మేని చందమగు నాయసరూపము చూర్ణితంబు సే,సిన బలమానసీయుఁ డొక చేడియ నక్కట యాశ్రయించె. ఆశ్ర. 1-39,40,41

3. అవలంబనము.

చ. అరయఁగ రాజధర్మము సమాశ్రయమై నడపుం ద్రివర్గమున్. గురుతర మోక్ష ధర్మమునకుం దలఁపం దన ప్రాప యూఁత. శాంతి. 2-158. ద్రోణ. 1-358

సీ. అవశమై యొరఁగిన యంగవల్లిక పొంత,నున్న భూమీరుహం బూఁతగాఁగ, అర. 7-28

4. భావము, తలంపు.

క. ఇది నాయదియను నూఁత, న్మది నెయ్యది పట్టుకొల్పినను దాని తమై, తుదిఁ జేటు వొందె వానికి, వది శోకము నావహించు నత్యంతంబున్. శాంతి. 4-18

శ్లో కించిదేవ మమత్వేన యదా భవతి కల్పితమ్.
తదేవ పరితాపార్థం సర్వం సంపద్యతే తదా.

సం. భా. శాంతి. 174-44,45

౨. అడుగున వెడల్పుగను పైని సన్నముగను నుండునట్లు రెండు వైపుల మూఁత లేకుండ వెదురు పేళ్లతో అల్లిన మత్స్యగ్రహణ సాధనము.

క. వెరవున నూఁతల నెత్తెలఁగరముల మత్స్యములఁ బట్టి కడుసంతస మునం, బొరయుచుఁ ద్రాళ్లం గ్రుప్పఁగ, గరమూహించి మదిఁ బ్రాప్త కాలజ్ఞుండున్. శాంతి. 3-198

**ఊఁతకోల** దే. వి. (ఊఁత+కోల)

అవలంబముగాఁ బట్టుకొనెడు కఱ్ఱ, అవలంబము.

తే. అంధులకు నూఁతకోలగా నకట యొకని, నైన నిలుపక మూర్ఖర నదయ వృత్తి, మ్రింగి తందెవ్వఁ డేనియు మీకు నెగ్గు, లాచరింపని వాఁడు లేఁ డయ్యెనయ్య. స్త్రీ. 1-170

**ఊఁతగొను** దే. స. క్రి. (ఊఁత+కొను)

ఆశ్రయించు, ఆధారము చేసికొను.

వ. అకపిధ్వజుండు నిజధ్వజదండం బొక్కింత యూఁతగొనిన. ద్రోణ. 3-96; ద్రోణ. 1-40

**ఊఁదిచెప్పు** దే. స. క్రి.

నొక్కి పలుకు.

క. అతిథి నిమఁ గోరెనేనిని, మఱిఁ గింకిరిపడక యోల మూఁపగొనక నీ పతనికిఁ బ్రియంబు సల్పుము. పతికిం బతి పనువుసేయఁజను పెల్లడియున్.

క. అనియూఁది చెప్పి. అను. 1-69,70

క. విను మంత్ర భేదమున వచ్చిన కీడున కనఘ శాంతిసేయు టరిది గావున మంత్రులతో మంత్రావన నియమం బూఁది చెప్పవలయుం బమ్మి. ఆశ్ర. 1-69; శాంతి. 1-188

**ఊఁదిపట్టు** దే. స. క్రి.

పడకుండ గట్టిగా అని పట్టుకొను.

చ. కనుఁగొని ఫల్గునుండు దురగంబుల వాగెలువట్టి యొత్తి త,త్తనువులు నూల్కొనన్ నివిరి తత్పరతం దగ మత్స్యభూమిభృత్తనయుని నూఁదిపట్టి వికృతంబగు రూపము చక్కఁజేసి నెమ్మన

మొకథంగిఁ దేర్చి నరిమంయుగఁ గొఁగిటఁ జేర్చి యిట్లనున్.
విరా. 4-174

ఊఁదు దే. స. క్రి.

1. అధ్మానము చేయు, అగ్ని ప్రజ్వలనము మున్నగువాని కొఱకు నోటితో గాలి విడుచు, నోటిగాలితో (నిప్పు) రేఁగఁ జేయు,

సీ. అల్లన యూఁదెడు నప్పు డక్కొమ్మ వా,తెఱతావి తైర్థ్యంబుఁ ద్రిప్పుకొలఁప
అను. 1-48

క. పటు విశిఖపంక్తి యత్యు,త్కట రయమున విగుడఁ జేయఁగా నవ్విధ మూఁ,దుటయైన మంట దీప్తో,త్కట థంగిఁ గృపానలంబు బలములు వొంగన్.
విరా. 5-147

2. గ్రహించు, స్వీకరించు.

సీ. ...నీతులు వారుప,దేశింప వాని మూఁదిన మనంబు, గలిగి వర్తింపుము.
అశ్ర. 1-56

3 పట్టుకొను.

క. ఉరగపతి తలలపల నురు,తరజవమున వసుధలూఁది తత్పృష్ఠము ని,ర్భరపదు లూఁది మహామ,త్సరమున వడిఁ ద్రచ్చి త్రచ్చి జవముఁజే యున్నన్.
ఆది. 2-18

ఆ. వినఁగ నిష్టమైన విమమని ద్రుపదుచే, యూఁది యింటిలోని కొనర నరిగి.
ఆది. 7-245

4. ఆశ్రయముగాఁ జేసికొను, ప్రాపుగాఁ జేసికొను, ఆశ్రయించు.

చ. తన భుజశక్తిలేక యొరు దర్పమయూఁది పరాక్రమింప వచ్చిన నదిసెల్లునే...
ఉద్యో. 4-207

శ్లో. పరవీరం సమాశ్రిత్య యస్సమాహూయతే పరాన్.
సం. భా. ఉద్యో. 162-4

సీ. పొందు మామలతోడి పగకోర్చె నెవ్వని యుత్సాహమూఁది సుయోధనుండు.
కర్ణ 1-21

వ. వచ్చి యవ్విటపంబు నూఁది యశ్వాకంబుల నాలోకించి.
శా పి. 1-12

ఎందాఁక (√ఎంత)

ఎంత దాఁక.

గీ. ధరణిఁ బొగడిత యెందాఁకఁ బరఁగు నంత, కాలమును బుణ్య లోకము గలుగు నండ్రు. ఉద్యో. 2-67

గీ. ధరణి యెందాఁక మందు సుస్థిరత నీదు, కీర్తి యందాఁక నక్షయ స్ఫూర్తిఁ దాల్చి, నడవఁగల యది. శాంతి. 2-148

ఎందు అవ్య. ద్రు. (ఇది సందర్భమును బట్టి దేశము విషయము మొదలగు వానిని దెలుపును.)

1. ఏ చోట నైనను, ఏ తావునందు.

ఉ. ఎందున నిట్టి రూపు నరు లెవ్వరుఁ గాంచిరె నాక నారు సం, క్రందనసూతిం దగిలి కన్గొనఁ గాంచె. విరా. 2-26

వ. ఇక్కుమారున కెందు వివాహంబు సేయుద మని విదురునితో విచారించుచుండె. ఆది. 5-16 (ఎందు = ఏ తావున)

ఏ విషయము నందు.

క. అరయ నెందును గౌరవ, భారం బెడలంగ నీక పాతివ్రత్య, చారము మై ప్రర్తింతురు, సైరంధ్రీజాతివారు సౌజన్యమునన్. (ఎందు = ఏ విషయము నందు) విరా. 1-112

ఆ. ఎల్లదాని నేన యెఱుఁగుదు నెందు వా, రర్థ్య దాన యోగ్యుఁ డయ్యెఁ జెపుమ. సభా. 2-41

3. ఎల్ల యెడల, అన్నిచోట్ల.

ఆ. పరఁగు పొదరు పొదరు పల్లంబు పల్లంబు, గ్రామ గ్రామ దుర్గ మంపుఁ జోటు, దుర్గమంపుఁ జోటు దొన దొన గుహా గుహా,యాది గాఁగ నెందు నరసి యరసి. విరా. 3-82

వ. ఎందుమం జరియించు వారొక్క నాఁడు జమదగ్ని యాశ్రమంబు నకుఁ బోయి. శాంతి. 2-78

వ. వారలుం దెందునుం జరించుచుండి పంచచూడ యను నచ్చర పేర నొక్కెతం గాంచి. అను. 2-166; ద్రోణ 1-78

4. ఎవ్వరి యందైనను.

క. ఈ నలువుర భుజశక్తులం, తో నెనయఁగఁ జాలునట్టి దోర్బల మెందుం, గానము గావున వీరల, లోనఁ నెవ్వఁడో రణం బని గెలుపు సమకూరున్. విరా. 3-114

5. ఎప్పుడైనను.

క. అనుడు నుపేంద్రుఁడు మనుజేంద్రున కిట్లను దూత లెందుఁ దొలితొలిగుడువం, గానఁ గట్టఁ దొడఁగుదురె వచ్చిన కార్యము దీర్చి విడవఁ జేయుం డెల్లన్. ఉద్యో. 3-249

(దీనికిఁ గొన్ని విభక్తులు చేరుటయుఁ గలదు)

ఎందుండి

ఎచట నుండి.

క. ఎందుండి యేమి పనికై, యొందుల కరిగెదవు. శాంతి. 3-479

వ. అమ్మహీపతి మహాభాగ యెందుండి రాక యే దేశంబులఁ జరించితి. ఆశ్ర. 2-145

ఎందును

1. అన్నిటి యందు.

క. అని పలికి భీష్ముఁ డిట్లను, విను మెందుమదీప దాన విధి మేలని శంబునఁ జేయ నూర్ధ్వలోకంబును గర్తకుఁ బరమ దివ్య బోధము నిచ్చున్. అను. 4-40

ఆ. ... అమర, భావమున సుఖంబు జీవింతురని దీని, నేలఁ గనిన వాఁడ యెందుఁ బెద్ద. ఆది. 4-158

2. అంతట, సర్వత్ర.

మహాస్త్రగర - వజ్ర నిర్ఘోష మెందుం, జెలఁగం జొచ్చెన్, సౌప్తి. 2-65

ఎందేని

1. ఎక్కడనో.

వ. వృత్రాసురి ... నహుషునంత బలంబు లేమిం జేసి భయాకుల చిత్తుండై.

క. ఎందేనిఁ జనియె. ఉద్యో. 1-169,170

2 ఎచ్చటి కైనను.

క. దాని నెఱింగి గృహంబున, మానిత మగు చదువునందు మనసు గొలుప కెం,దేనిఁ జని చదువుదురు ద్రుతు, లానంత్యమునకుఁ దపస్వు లగుదురు విప్రుల్ అను. 2–159

## ఎందేనినుండి

ఎక్కడ నుండియో.

వ. శర్మిష్ఠ లజ్జావనత వదన యయి యిట్లను నెందేనినుండి యొక్క మహాముని నిఖల వేద వేదాంగ పారగుండు వచ్చి ఋతుమతినై యున్న నన్నుం జూచి నాకుఁ బుత్రోత్పత్తిఁ బ్రసాదించె. ఆది, 3–181

## ఎందేనియు

ఎక్కడకో.

వ. సైంధవుండు దన బాధలచేత నీ యాడినమాట విని వెఱచఱచి కురురాజు గొలువున్న చోటికిం జని సిగ్గఱి వన్ను నగ్గించి నీ ప్రతిన యెఱింగించి యతం డరిగిన మీరు గావలేరని పలికి తానెం దే నియుం బోయెద ననిన. ద్రోణ. 2–304

## ఎంపమగ్గులు దే. వి. బ.

ఎముకల ముక్కలు.

ఉ ... పోరి రుదగ్రులై గదల్, మండగ నెత్తురుల్ పెదర మాంసము పిండిగ నెంపమగ్గు లొం,డొండదరిత్రిపైఁ దొరఁగ. ద్రోణ. 2–122

## ఎంపపొడి దే. వి.

ఎముకల చూర్ణము.

క. ... బకమర్దనుఁడు ... యాతని మీఁద మఱి క్రమ్మఱం, గముకని నెంప పొడి సెఱఁగాం గేలన్. ద్రోణ. 5–82

## ఎఁడు ప్ర.

పరిమాణార్థకము.

గీ. అతఁడు పుడిసెఁడు నీ రన యవ్వ దతనిఁ దెంచి.

అశ్వ. 1–84; భీష్మ. 3–410 – అర. 6–115

ఎకవెక్కు దే. అ. క్రి.

పైకి వెక్కి వెక్కి యేడ్చు.

సీ. ఆసవుడు శోకవెక్కి యా బిడ్డ పైచి పోయెకు వారలకు.
(పాఠాంతరము) శాంతి. 3-377

ఎక్కఁబాఱు దే. స. క్రి.

అధిరోహించు

ఆ. విరథుఁడై యతఁడు వృషసేను రథమెక్కఁ బాఱుటయును గలఁగ బాఱె సేనలు. ద్రోణ. 4-161

శ్లో. హతాశ్వాత్తు రథా త్తూర్ణమవప్లుత్య విశాంపతే, స్యందనం వృషసేనస్య సమారోహ న్మహారథః. సం. భా. ద్రోణ. 129-39

ఎక్కటి పర్యా. వి.

1. ఒక్కఁడు, అసహాయుఁడు, పరాపేక్ష లేనివాఁడు.

ఉ. దక్కెను రాజ్యమంచు నకటా యిటు దమ్ముని భాగమీక వీ, వెక్కటి క్రమింగఁ జూచెదది యెట్లగుగున్, ఉద్యో. 2-52

క. ఒక్కరుని నీవు సంపక, తక్కిన నంతటనె ప్రతిన దప్పుటె విభవం, బెక్కఁగ మీయన్న వతం, డెక్కటి రాజ్యంబు చేయ నీఁడె కుమారా. స్త్రీ. 1-171

ఉ. ఒక్కరుఁడై నఁ గేశవు హితోక్తికి మేకొనఁడయ్యె నర్జునుం, డెక్కటి దాన చాలుఁ దమునందఱఁ దీవ్రశరాగ్నిఁ గాల్చు. ఉద్యో. 4-54

క. ఇక్కురువంశంబున నీ వొక్కరుఁడవ యున్నవాఁడ వుర్వీరాజ్యం, బెక్కటి చేకొని తేజము, దిక్కుల వెలిగింపు నంతతియుఁ బడయు మొగిన్, ఆది. 4-220

2. ప్రత్యేకమైనది, మఱొక దానితోఁ గలియనిది.

క. ఎక్కటి యిట్టివి దోషము, లొక్కొక మరి రెండు మూఁడు పొదవి బెరయుఁ దా, నక్కడు సన్నిపాతంబు. అశ్వ. 1-174

3. పాటిలేనిది.

ఉ. ఎక్కటి గాండివంబు మతి కెక్కి వెలుంగుట. ఉద్యో 2-194

4. కూరుఁడు.

చ రిపులఁ ద్రుంచి యశం బిల నించి పుత్రుఁ డెక్కటి దివి చూఱకో
ప్రియము గాకిది యప్రియమే తలంపఁగాన్. ద్రో॰ 2-25

5. దురాశ, పేరాస.

క. ఇక్కొక్క అగాముఁలోపల, నొక్కటి నీ చిత్తవృత్తి నొందెనా కయుఁ
నా. మెక్కొక్కటి గుడువఁ దలంచితొ, నిక్కము గతమేమి సెపుః
ని క సెకుటకున్. ఉద్యో. 2-2

శ్లో. కచ్చిచ్చ పరవిత్తేషు గృధ్యన్న పరితప్యసే.
సం. భా. ఉద్యో. 82-1

## ఎక్కటికయ్యము దే. వి.

ఒకనితో ఒక్కఁడే చేయు యుద్ధము, ద్వంద్వ యుద్ధము.

మ. ... ఫాలాక్షు నెక్కటి కయ్యంబునఁ గన్న ఫల్గుని భుజ
గర్వంబు. ఉద్యో. 2-17

## ఎక్కటి కార్యము వి.

ఒక్కఁడు చేయుపని, తోడులేని పని.

ఆ మమ్ము నేలు పెట్టి యొక్కటి కార్య, మాచరించుటాఁడ వగు
దగునె. శాప్తి. 1-8

## ఎక్కటిపోరు దే. వి.

ఎక్కటి కయ్యము.

వ. కౌంతేయాగ్రజుండు శాహదేవుతో నన్నదమ్ముల యిరువుర
యొక్కటి పోరు చూడుమని పలికె. శల్య. 2-14

వ. అప్పగ మనంబునఁ బెట్టికొని పదంపడి జరాసంధుం డక్కము
బాధు పుతు నెక్కటి పోరికిం బిలిచినం బోయి. శాంతి. 1-8

శ్లో. అహ్వాయ ద్వైరథే వాజౌ జరాసంధో మహీపతిః.
సం. భా. శాంతి. 5-

## ఎక్కటిజవరము దే. వి.

ఎక్కటి కయ్యము.

సీ. బహు దివ్య శరములు వడయఁడే యొక్కటి యవరాన మెప్పించి శివునిచేత. భీష్మ. 3–177

**ఎక్కటెక్కటి** (ఎక్కటి + ఎక్కటి)

ఒకనితో నొకఁడు.

చ. నరవర యొక్కటెక్కటి పెనంగఁగ భీమునిపై నఁ బన్నఁగాదు. శల్య. 2-116

ఆ. ఏను గర్జునుండు నెక్కటెక్కటి దలపడక యున్న నగరె పుడమి జనములు. ఉద్యో. 4-41

శ్లో. యదిహ్యాదద్య న గచ్ఛేయం ద్వైరథం సవ్యసాచినా
అకీర్తిస్స్యాద్ధృషీకేశ మమ పార్థస్య చోభయోః
సం. భా. ఉద్యో. 140-18

గీ. ఎక్కటెక్కటి పెనఁగిన యింత వట్టు, పెనఁకువలు నిట్టు లేచునే పృథివి నింక, జనము లీకురుపాండవ సంగరంబు, సెప్పికొం(డ్రు మనంబు లచ్చెరువునొంద. ద్రోణ. 1-178

**ఎక్కడ** దే. వి. (ఏ + కడ - వృత్తియందు ఔపవిభక్తికము - ఎక్కడి మాట)

1. ఏ చోటు, ఏ ప్రదేశము

క. మానవపతి నన్నెక్కడి, దానవు నీవనియెనేని. విరా. 1-90

వ. ఎక్కడఁ జూచినం దానయై. భీష్మ. 2-187

ఉ. ఎక్కటినుండి యెక్కడకు నేఁగెడినో.
విరా. 1-308; అను. 1-197

2. అత్యంత తారతమ్యమును దెలుపును.

క. ఇతఁ డెక్కడ మద్రమహీ, పతి యెక్కడ నితని కతఁడు పాటియె. ఉద్యో. 2-238

వ. ఏను రాజును నీవు పేద పాఱుండవు నాకును నీకును నెక్కడి సఖ్యంబు. ఆది. 5-219

3. అసంగతత్వము, పొసఁగమిని దెల్పును.

ఉ. ... సుయోధనుం, డెక్కడ భూమిలోన నగ మిచ్చుట యెక్కడ. ఉద్యో. 3-94

4. అనాదరమును దెల్పును.

ఉ. ... నా, కెక్కడి ప్రాణ మేటి తను వెయ్యది నిల్కడ యేమి చేయుదున్. విరా. 2-296

వ. పో పొ మ్మెక్కడి వాఁడ వని యదల్చి. కర్ణ. 3-70

క. ఎక్కడి తండ్రివి నీవే, నక్కౌంతేయులకుఁ గొడుక. ద్రోణ. 5-74

5. లోక వైపరీత్యమును దెలుపును.

ఉ. అక్కట వాసుదేవు పను పాదరణంబునఁ జేయరైరి వీ,రెక్కడి బుద్ధిమంతులు. ఉద్యో. 4-20

ఉ. ఎక్కడి మాట గొల్లతన మించుక యేనియు లేదు నీ దెసం. విరా. 1-281

6. ఆశ్చర్యమును దెల్పును.

మ. వలలుం డెక్కడఁ జూచె నొండెడ నసేవ్యఘ్మాజముల్ పుట్టవే. విరా. 2-188

ఉ. ... నీ బలం, బెక్కడఁ బోయె సైన్యపతులేలకొ యిక్కడరారు. శల్య. 2-401

7. ప్రశ్నార్థకమైన వ్యతిరేకార్థము నిచ్చును.

చ. ... నీ, వెఱిఁగి యెఱింగి నన్ దొడరి తెక్కడ వోవఁగవచ్చు. ద్రోణ. 2-90

వ. జూదరి యాలికి గరువతనం బెక్కడియది. విరా. 2-153

8. ఎప్పుడు, అకస్మికముగా నను నర్థమిచ్చును.

వ. ... ఎక్కడ వచ్చి యెవ్వరినేమి సేయుదురో యనుచు మేనులు వడంక. ద్రోణ. 5-325

9. సంబంధ వాచకముగా నుపయోగించును.

క. ఎక్కడ నడచును సత్యం, బెక్కడ ధర్మంబు పరఁగు నెక్కడఁ

గలుగుం జక్కటి నిలుచుం గృష్ణుం డక్కడ నతఁ డున్నకడన యగు జయ మధిపా. ఉద్యో. 2-317; ద్రోణ. 1-248

10. పలురకములుగా నుపయోగపడును.

సీ. నామీఁద గృపయుఁ బ్రియము నెక్కడవోయె. శల్య. 1-18
(ఎక్కడవోవు = కానరాకుండఁ బోవు)

తే. ఇంక నాఁటి చూలు లెక్కడివి. ఉద్యో. 3-362

వ. ప్రముక్కడి మూఁకలు సని యెక్కడెక్కడ నని తలపడిన
(ఎక్కడెక్కడ – అదలింపు మాటలు) విరా. 4–4

ఎక్కించు దే. స. క్రి. (ఎక్కునట్లుచేయు)

1. అధిష్ఠింపఁ జేయు, నిలుపు, మోపు.

క. ... పృథివీపతి నీ, తలన తన కార్య ఖడ్గం,బుల మోపెక్కించె,
విరా. 5-28

వ. నీ గౌరవంబంతయు నెఱింగి కాదె వహ్ని సమానుండైన యీ మహాముని నారాధించుటకు నీయందు భారం బెక్కించెద.
అర. 7-315

2. అధిరోహింపఁజేయు.

మ. ఇఁ తేజుం డలిభ క్తి గాంచనరథం బెక్కించి యక్కన్యఁ దో,డ్కొని తెచ్చెన్. ఆది. 4-191

సీ. ...ధర్మ,సుత విజయులఁ దనవితతకాహులయమళంబు నెక్కించి.
ఆది. 6—160

వ. ... కుంతీదేవిని ద్రౌపది నొక్క రథంబెక్కించి తోడ్కొని.
ఆది. 7-288

3. కలిగించు.

క. ధర్మనందనునిఁ దగం, గను మతఁడు రాజనని తన, మనమున నెక్కించు కొనఁడు మదగర్వంబుల్. శల్య. 1-59

ఆ. ఇక్కరంబు నెయ్య మెక్కింప వేరంగఁ, దగిలి సంతతంబుఁ దలఁ చుఁట్టి, తంగిమొలయఁ గీదు వలుపంగఁ గొనియాడ, వలఁతి సీటు సేయవలదె దీని. శ్రీ. 2-188

4. అధికముఁజేయు, అతిశయింపఁజేయు.

సీ. అంగుళంబుల నల్ల నలకలు గబళించి, కెమ్మోవి యాని యెక్కింతుఁ గాయ్యు. విరా. 2-310

4. (వారి) బిగించు.

గొనయం బెక్కించియు మోపెట్ట నశక్యంబయిన. ఆది. 7-178

6. ఉంచు, తూఁచు.

క. తక్కిన మూఁడాశ్రమములు, నొక్కదెస గృహస్థ ధర్మ మొకదెసఁ దుల యం,దెక్కింప వానితో న,య్యొక్కటి సరితూఁగె నందు రుర్వీశబుధుల్. శాంతి. 1-76

ఎక్కించుకొను దే. స. క్రి.

1. (రథముపై) కూర్చుండఁ బెట్టుకొను, అధిరోహింపఁజేయు.

వ. గోవిందుండు కర్ణుదెసం గనుంగొని నన్నునిచి వత్తుగాని రమ్మని కరంబు సాఁచి చెయివట్టి తన యరదం బెక్కించుకొని ఉద్యో. 4-19

2. ధరించుకొను, మీఁద మోపుకొను.

వ. జామదగ్న్యుం డదియెల్ల నెఱింగి యోటమి యెక్కించుకొని. ఉద్యో. 4-355

3. ఆరోహించుకొను.

వ. నీవు గొందఱ సర్జించితినని దుర్జయత్వం బెక్కించుకొనకు. ద్రోణ. 5-127

4. కలిగించుకొను.

వ. ...ధర్మనందనునిఁ దగం,గమ మతఁడు రాజనని తన, మనమున నెక్కించుకొనఁడు మదగర్వంబున్. శల్య. 1-59

5. పూనుకొను.

వ. ...పోటెక్కించుకొనని వానిమీఁదం బ్రయోగించినవానిన మరలి వధియించు. ద్రోణ. 3-88

శ్లో. అయుధ్యతి నమోక్తవ్యా సా త్వయ్యేవ పతేదితి,
హవ్యాదేషా ప్రతీపం హి ప్రయోక్తారమపి ప్రభో.
సం. భా. ద్రోణ. 92-51

**ఎక్కిడు** దే. స. క్రి. (ఎక్కుపెట్టు)

1. సజ్యముచేయు, నారితొడగు.

ఉ. చుక్కలు తోడుతోడఁ దలచూపదొడంగె మనోభవుండు వి, ల్లెక్కిడి చక్రవాకముల యిక్కలు రోయఁగఁ జొచ్చె. విరా. 2-3, 9

వ. తేరెక్కి యెక్కిడిన విల్లును మెచ్చువచ్చు నమ్ములును దొడలపైఁ బెట్టకొని. ద్రోణ 3-305

**ఎక్కు** దే. అ. క్రి.

1. సంతోషకరమగు, ఇష్టమగు, నచ్చు.

తే. అకట యొరుచిత్తమున కెక్కునట్లుగాఁగ, మెలఁగి యేమి విధంబునఁ గొలుచువాఁడు. విరా. 1-74

క. ...ఇ, య్యేవపుఁ బుట్టువు పుట్టిన, వావగ పెవ్వరికి నెక్క నళినదళాక్షీ. విరా. 3-50

వ. పాండవులం బరిమార్చు పని నేఁడ చేయక మఱచేసిన రారాజు నిర్గతప్రాణుండైన వాకెలసం బెవ్వరి కెక్కెడు. సౌప్తి. 1-24

క. ...దుర్వినీతకోటి ధనంబుల్, దన కెక్కినట్టి తప్పులఁ గొని ముజనులకిగి నృపతి గుణమంద్రు బుధుల్. శాంతి. 2-186

2. సమ్మతియగు.

క. అడుగకున్నను, నేమి వినుము చెప్పెదను మునీంద్రులకె క్కన్. శాంతి. 1-57

3. అధికమగు, అతిశయించు, హెచ్చు.

క. తమకును బలమెక్కిన తఱి, సముచితమగు విగ్రహంబు శత్రులకుత్సాహము మీఱినపుడు కర్తవ్యము సంధియనంగ విందుమూర్త్యుల చేతన్. శల్య. 1-56

వ. అట్లడరు నయ్యిద్దఱ వాశినివరుండు గినుక యెక్కిన యేత్తైఱం బికుక్కవఱిచె. ద్రోణ. 5-177

క. ఎక్కుడు దినముల శుభములు, నెక్కు నశుల వైభవములు నెక్క

దినమునం, దక్కక యుండెడు కాలము, నెక్కు మహాత్మతయు నెక్కు నిభపురనాథా. అను. 4-149

ఉ. ...వా, రేమయిరేమి మాకెలన మెక్కు వెలుంగుము మమ్ము మువ్వురన్. సౌ.ప్తి. 1-281

5. కలుగు, సంభవించు.

ఉ. ...గో, నెక్కఁగఁజేసి నిన్ను నశిహీన విధాన నియుక్తఁజేఁతగా, నీకు యుమ్మలించి తిది నెయ్యము తియ్యము కల్మియే నళి. విరా. 2-98

క. మహాత్మతయు నెక్కు. అను. 4-149

6. ప్రకటమగు, తెలియు.

వ. అతని లావును తీరంబును లోకంబున నెక్కియున్నయవి. విరా. 4-204

క. నినుఁ గీడు వొరయకుండఁగ, జనులకు నానిక్కు మెక్కు జననాయక నేననలంబుఁ జొప్పు వెడలెడఁ, గనుగొను మిచ్చమువు వాకుఁ గరుణింపు గగన్. అర. 7-160

7. మారెక్కను. ఎదురెక్కను

సీ. ఒక్కఁడు పెక్కండ్ర నెక్కిన విచ్చియుఁ, బొదివి చెలోక పోటు వొడుచు నెదలు విరా. 8-164

వ. ఇట్లెక్కమిగిలి యెక్కిన యర్జునానందనుం గనుంగొని శకుని తమ్ములు. భీష్మ. 3-91

క. పటురయమున నాశ్వము లొక్కటుఁ జెక్కండ్రెక్కి రథనికర ములు ఝుటితి, ప్రుటికాశ్రుతులుగ విహరించుట యెక్కుడు వేక్కపే ము సురగణమునకున్. శల్య. 1-128

8. ప్రీతి గలిగించు, మెప్పువచ్చు.

(భీముఁడు ద్రౌపదితో) కా. చింతాశల్యము వాసెనే భుజబలోద్రేకంబు నీ కెక్కెనే. కారిం బొందెనె రోషపావకుఁడు దుశ్చారిత్రునిం జూచితే. విరా. 2-858

క. పతిమదికి నింత యెక్కిన, యతివ గదా పుణ్యవతి. శాంతి. 3-311

9. ఎచ్చు, అదనమగు.

సీ. రెండవయేట నొక్కం దధిమాస మిరుదెక్కిన యన్నెలలెల్లఁ గూర్చి, కొనఁ బదుమూఁడు హాయనములు దప్పక, నిన్నటి తోడన నిండె. విరా. 4-232

తే. ... రెండును మూఁడు నాల్గు, నీ క్రమంబున నోపిన నెక్కినట్టి, దినము వెడ పెట్టి కుడుచుచు ధృతి నొకేఁడు, నడపు వారల తెఱఁగు లేర్పడఁగ వినుము. అను. 4-143

10. కదచు, గతించు.

క. ప్రొద్దు జామెక్కుటయున్. శాంతి. 3-500

11. వృద్ధి పొందు.

తే. ... షోడశంబు దాఁక, నెల్లవాఁడును ఋతుశక్తి యెడల కుండ నెట్టి కార్యము గల్గిన ఋతుమతీ సమాగమము దప్పనికున్న నాయు వెక్కు. అను. 4-126

12. వచ్చు, చేరు, లగించు.

చూ. కీర్తి కెక్కు, నుతికెక్కు ప్రసిద్ధి కెక్కు.

స. క్రి.

1. అధిష్ఠించు, ఆశ్రయముగాఁ గొను.

క. వల్లెయని రాజనందను, లెల్లను సమకట్టి రథము లెక్కి దిశల్ భే, దిల్లఁగ గర్జిల్లి నిశాతోల్లసిత కృపాణ కార్ముకోద్యతకరులై. ఆది. 6-64

2. ఒందు, పొందు.

ఉ. ... నేల కెం, పెక్కుచు వచ్చె. విరా. 2-319

సీ. బిగి యెక్కి యేర్పడంగఁ దెలుపును గప్పును వెలయంగ మెఱుఁ గెక్కి. విరా. 1-245

3. క్రమముగాఁ బొందు, ప్రాఁకు.

ఆ. చేతికుండ మోచి యే తెలివున పోటు, నాలు ప్రాకు నై పు ఋయు

గలుగు, పురుషునట్ల యోగ పరిణతుండును నాత్మ, నేమఱక విముక్తి కెక్క వలయు. శాంతి. 5-587

క. తేనియ కుండఁ గొనుచు నో,పానము లేమఱుట లేక ప్రాఁకిన క్రియ నా,త్మానందరసం బొక కణ,మైనఁ జిలుకనీక తుదికి నాతం డెక్కున్. శాంతి. 6-121

4. (చెట్టు మొదలగు వానిని) ఆరోహించు.

ఆ. ... పఱచి మహీజంబు, లెక్కి రందుఁ గొంద ఱుక్కడంగి. అర. 2-110; అర. 8-112; ఆది. 1-169. అర. 8-244

క్రి. విశే.

1, తగు, అర్హమగు.

చ. ... సురేశ్వరుఁడు సువర్ణనంబునఁ బ్రశంసకు నెక్కు విమాన మెక్కి యం,బరగతి వచ్చె. విరా. 4-234

2 అధికమగు.

క. ఎక్కుడు దినముల శుభములు, నెక్కు నతుల వైభవములు నెక్కు దినమునం, దక్కక యుండెడు కాలము, నెక్కు మహాత్మతయు నెక్కు నిభపురనాథా. అను. 4-149

వి.

సజ్యము, జ్యాసంధానము, నారి కూర్చుట.

వ. ... గాఁడీవంబుఁ బుచ్చుకొని యెక్కువెట్టి ముష్టి నలవరించి. విరా. 4-168

వ. కోదండంబు నెక్కుడించి కంకటం బూడ్చి, సౌప్తి. 1-65

ఎండ యెక్కు; కీర్తి కెక్కు, మతికెక్కు మొదలగు పదముల నాయా తావుల దు, జూడనగును.

ఎక్కుడించు దే. స. క్రి.

వింటి నుండి నారిని సడలించు.

వ. ఎక్కుడించిన పాండవాగ్రజుండు.

క. గనుజకులత్రాసకరంబును రిపు భంజనము రత్న భూషిత రూపం

బును గురుదేశాప్లావన,మును నగు నిజకార్ముకంబు మోపెక
లించెన్. విరా. 1-169-170, సౌప్తి. 1-65

ఎక్కుఁడు దే. విశ.

1. ఉత్కృష్టము, శ్రేష్ఠము.

తే. రాజు సర్వోత్తముఁడు ధర్మరాజి యందు, రాజవర్మంబ
యెక్కుడు. శాంతి. 2-289

ఆ. అర్థసిద్ధికంటె వరయ నెక్కుడు ధర్మసిద్ధి. శాంతి. 2-408

2. అధికమైనవాఁడు, గొప్పవాఁడు.

ఉ. ... ఇట్లు శత్రు దోశ్చండిమ కోహటించితి నిజంబునకున్ నరుఁ
డింత యెక్కుడే. విరా. 4-98

3. అధికముగా నాదరింపఁదగినది.

చ. ... నిను రాజరాజ యిమ్మడువున కీడ్చి తెచ్చె విధి మానము
ప్రాణము కంటెఁ జాల నెక్కుడగుట సెప్పఁగా వినవొకో కడు
నీచతఁ బొంది తక్కుటా. కల్య. 2-57

4. హెచ్చైనది.

చ. చిడిముడిపాటు లేక యతిశీఘ్రమునన్ ఘనకీర్తి వాతఁ దెక్కుడు
ముదమొప్ప నాన్నృపతిఁ గూలఁగ వైచె సురల్ నుతింపగాన్.
ద్రోణ. 3-250

5. స్థితికి మించినది, స్తోత్రమైనది.

ఉ. ... గెల్పునుతింపఁగ రాజపుత్రుఁ డయ్యెక్కుడుమాట కోరువక
యిట్లను నర్జునంబుతోఁ దగన్. విరా. 5-265

6. స్వాహంకారపూరితము.

ఉ చిక్కని పోటు మానిసి వినీ విను వారలు నవ్వ నేమిగా, నెక్కుడు
మాటలాడెదవు. ఉద్యో. 1-258

7. తన్నుఁ దాఁ బొగడుకొనుటకు సంబంధించినది. ఆత్మశ్లాఘనమైనది

సీ సంజయుతో మీరు శంకలే కాడిన యెక్కుడు మాటలు పెక్కు
గలవు. ఉద్యో. 4-191 - చూ. ఎక్కుడు మాటలు.

8. ఒకదాని కన్న నొకటి హెచ్చు.

క. ఎక్కుడు దినముల శుభములు నెక్కు. అను. 4-149

9. మించినది.

వ. సహదేవుం డా కైనేకు నుద్దేశించి మిమ్ము బాంచాలురం గడచిన బంధువులు మాకును మమ్మును మిమ్మును మిగిలిన బాంధవులా పాంచాలురకును వారకంటె మాకంటె నెక్కుడు సుహృజ్జనులు మీకును లేకునికి. ద్రోణ. 5-371

10. ముఖ్యము, ప్రధానము.

(మనస్సు ఇంద్రియములతో)

వ. నిజంబుగా నేను దొలంగితేని.

ఆ. అప్రయోజనంబులై యందు నాటిన, నిప్పులట్లు శూన్య విషయములును, బోలె మీ స్వరూపములు గాన మనలోన, నెక్కు దేవ చూవె యింత నిజము. అశ్వ. 2-33.38

క్రి. విశే.

అధికముగా, మిగుల.

వ. అప్పటి కప్పటి కెక్కుడౌదవు మదంబునం ద్రిగర్తాదులగు నమ్మోర్తురు పైపయిం గ్రమ్మి. కర్ణ. 2-317

క. కడు నమ్మియునికియును నెక్కుడు నమ్మమియును సుశీల కుశలత గా దెయ్యెడనైనను. శాంతి. 2-187

**ఎక్కుడుపడు** దే. అ. క్రి.

పైకెగయు.

చ. నడవ మదాత్మ యగ్ని యయి వావదనంబున నిర్గమించి యెక్కుడు పడి పద్మగర్భుకడకుం జనె. అను. 4-408

**ఎక్కుడుమాట** దే. వి. ఏక.

పొగడ్త.

ఉ. ... రాజపుత్రుఁడ, యెక్కుడు మాట గోరుదక యిట్లను నర్హాజనంబుతోఁ దగన్. విరా. 5-265

**ఎక్కుడు మాటలు** దే. వి. బహు.

1. ప్రావాంకార పూరిత వాక్యములు.

ఉ. చిక్కని పోటు మానిసి విపి వినువారలు నవ్వ నేమిగా, నెక్కుడు మాటలాడెదవు ఉద్యో. 1-253

2. తన్నుఁ దాను పొగడుకొను మాటలు, ఆత్మశ్లాఘన వచనములు.

సీ. సంజయుతో మీరు శంకలే కాడిన, యెక్కుడు మాటలు పెక్కు గలవు. ఉద్యో. 4-191

"శ్లో" యదేత చ్ఛ్రుత్వా వాక్యం సంజయో మహద్బ్రవీత్ సం. భా ఉద్యో. 159-8

**ఎక్కుపెట్టు; ఎక్కువెట్టు** దే. స. క్రి.

సజ్యము చేయు.

తే. ఒక్క విల్లెక్కు పెట్టంగ నుఱక. భీష్మ. 3-368

వ. గాండీవంబుఁ బుచ్చుకొని యెక్కు వెట్టి ముష్టి నలరించి. విరా. 4-198

తే. ఇట్టి యేఁ దేరుగడపంగ నెందు మత్తి, నెక్కు గాండీవ మేత్తెం నెక్కువెట్టి, రెండు దొనలను బూని కిరీటి యనికి, వచ్చు నేఁ డెల్లి యెందు బోవచ్చు మీకు. ఉద్యో. 2-180

**ఎక్కువ** దే. వి. (√ఎక్కు)

ఆధిక్యము, హెచ్చు.

క. హరి సత్త్వాది గుణంబులఁ, బొరిఁబొరిఁ గలిగించఁ జెంపఁ బొలి యింపఁగ భూవర యవి యెక్కువఁదక్కువఁ, బొరయుచుఁ బరి వర్తనంబుఁ బొందుచు నుండున్. శాంతి. 6-490

చ. పతిదెస కూర్మివాపుటకుఁ బట్టుగ నెక్కువ తక్కువంచు మన్నతు లగు మేదినీశులకు నావగఁ బల్కుటగాక. ఉద్యో. 4-240

ఉ. ...రాజపుత్త్రుఁ డయ్యెక్కువమాట కోరువక యిట్లను నర్హ జవంబుతోఁ దగన్. విరా. 5-265 (ఇది పాఠాంతరము)

**ఎక్కువ తక్కువ** దే. వి.

ఎచ్చు, తగ్గు

("ఎక్కువ, తక్కువ"-అను రెండు పదములు కలిసి ఏకపదముగను ద్వంద్వ సమాసమున బహువచనమునను మాత్రమే ప్రయోగములు గనం బడుచున్నవి. శాంతి. 6-490 లో ప్రత్యేక ప్రయోగముగాం గనం బడుచున్నను రెండు నవ్యవధిగనే ప్రయోగింపబడినవి )

చ. పతిదెస కూర్మివాపుటకుఁ బట్టగ నెక్కువతక్కువంచు మున్నతు
లగు మేదినీశులకు వావగఁ బల్కుటగాక. ఉద్యో. 4-248

(ఎక్కువంచు, తక్కువంచు)

క. వినుఁ డెక్కువ తక్కువలే, కనయము నెనసిన గుణత్రయంబును
('ఎక్కువదక్కువ' అనియుఁ బ్రయోగము) అశ్వ. 2-182

విణ.

క. ఎక్కువదక్కువ మాటలు, మక్కువములు బందిగీడు లొందించు
టలుం, జెక్కు దన యన్నదమ్ముల, దిక్కున నన్నియును నైరవ
దేఁము సేయున్. శాంతి. 2-359

ఎక్కువదక్కువలు దే. వి. బ. (ఎక్కువ+తక్కువ)

ఎచ్చుతగ్గులు.

వ. కావున నెక్కువదక్కువలు నిరూపించి. విరా. 4-185

వ. ఈ యెక్కువదక్కువలు విచారింపక. ఉద్యో. 2-222

వ. ఇత్తెలంగున నెక్కువతక్కువలు లేక యక్కజంబుగాఁ బోరువారి
భీష్మ. 2-46

వ. ఇట్లెక్కువ తక్కువలు లేక పోరిపోరి. ద్రోణ. 5-207

ఎగఁద్రోచు దే. స. క్రి.

పైకెత్తి పట్టు.

వ. నీలాశ్మరశ్మి స్థగితంబైన విమల మణిస్థలంబు జలాశయంబుగా
నగచి పరిధానం బెగఁ ద్రోచికొని. సభా. 2-86

ఎగచు

ఇది పొగచువంటిది. కాని నిర్ధారక ప్రయోగములులేవు 'ఎగయు' యొక్క ప్రేరణార్థకమైన 'ఎగయించు' దీనికర్థము అని సూ. అ. ని.

ఈ 'ఎగచు' ప్రయోగము భారతము ముద్రితప్రతులలో 15 తావు
లందున్నది. కాని కొన్ని ముద్రిత ప్రతులలో 'ఎగచు' ఉండుటయు లేక
పోలేదు. మనము చూచి నిర్ణయించు వ్రాతప్రతులు కవిత్రయమువారి
స్వహస్త లిఖితములు కావుగదా. తొట్టతొలుత ముద్రిత ప్రతియు వ్రాత
ప్రతినుండి వచ్చినదే కదా—'ఎగుచు ఎగచు' అని రూపాంతరముగా
గ్రహింపనగును. అట్టివి మఱికొన్ని గలవా అను ప్రశ్న నిరాధారము.
'ఎగయించు' అని చెప్పుకొనుటకు వేగణముక్రింద గానరావు. పైగా
అకర్మకముగాఁ గూడ దీనికిఁ బ్రయోగము గలదు.

అ. క్రి.

1. విజృంభించు.

వ. ఇత్తెఱంగునందునిమి తఱుము నతని దోర్విలాసంబు దుస్సహం
బగుటయుం బాండవబలంబులు దెరలినం గురుసైనికులు నలుగడ
లకు నెగచి రట్లు విజృంభించిన కుంభసంభవు నెదుర్కొని.
ద్రోణ. 1-298

స. క్రి.

1. వెంబడించు, తఱుము.

క. వెనుకొని విఱిగిన సైన్యము, గనుకనిఁ బాఱంగఁజేసి కౌరవ్యో
ద్రేకంబున ధృష్టద్యుమ్నుండును, దనకెలనం దఱుమ వాయుతన
యుం డెగచెన్. భీష్మ. 2-112

శ్లో. తతస్తాం కౌరవీం సేనాం ద్రవమాణాం తతస్తతః,
నిఘ్నన్ భీమశ్శరై స్తీక్ష్ణై రనువవ్రాజ పృష్ఠతః
సం. భా. భీష్మ. 58-19

చ. ...ఎంతయున్, భరమున నీ మొనల్ గలఁగి పాఱె నరేశ్వర వారి
సైన్యసంచయమెగపన్ మహీతలము సంభృతకంపము గాఁగ
నల్లడన్. కర్ణ. 3-9

వ. ...ఒక్కనాఁడు మహాగహనంబులఁ బెక్కుమృగంబుల నెగచి
చంపి తనచేత నేటువడి పాఱిన మృగంబు వెంటం దగిలి.
ఆది. 2-165; ఆది. 6-48

ఆ. వీరసేనసుతుఁడు వీరుండు హంసల, నడబెడంగుఁ జూచి నగుచు

వాని, నెగచి యెగచి యందు నెగయకుండఁగ నొక్క, హంసఁ బట్టుకొనియె నతిరయమున. అర. 2-12

క. నలి భగదత్తుఁడు గదువుల, వెలుచు పసులవాని యట్ల విలసద్గతి న బ్బలము నెగవ ధూళియు నా,కుల సంరావంబు గగనకుహరము నిండెన్. ద్రోణ. 1-882

1. త్రోలు (రథము మొదలగు వానిని)

తే. ...సారథి తొలఁగంగ నెగచె రథము. ద్రోణ. 5-164

చ. అనిపుడు మాతుఁ డెంతయురయంబునఁ దేరు వృకోదరాంతికం, బున కెగవంగ. కర్ణ. 1-149 చూ. ఎగుచు.

**ఎగయించు** దే. స. క్రి. (√ఎగయు) ఎగయఁజేయు

ఎత్తు.

వ. అనునెడ వాని యుగ్ర సముదాకృతియుం బటువాక్యవృత్తియుం, గని విని మల్లులెల్ల భయకంపితమూర్తులు దాల్చి మాఱువల్కను గమవిచ్చి చూడను మొగం బెగయింపను జాలకున్న విరా. 2-8

సీ. అతఁడు ఱెప్పల నెగయించి యప్పాండవోత్తముఁ దప్పక చూచి. అక్ర 2-60

క. ...ఇంచుకవడి మౌనము దగం దాల్చియుండి నతవదనుండై.

వ. పదంపడి నిట్టూర్పువిగిడించి మొగంబెగయించి భూపాలు వాలోకించి. దివ్య. 8-178,174

**ఎగయు** అ. క్రి. నెగయు

1. పైకిపోవు, ఎగురు.

సీ. ప్రమథులు గాని నేయుచును రక్తములు సల్లి, యార్వంగ మృగ రూపమై గగనంబున కెగసె నధ్వరము. శాంతి. 5-489

సీ. వెలఁది కటాక్షముల్ విభునిపైఁ గ్రమమున, నెగసి మోమునఁ జోఁకి మగిడివచ్చు. విరా. 5-895

వ. అట్టియెడ మున్ను తురంగముఖురాదులం దూలిన కెందూళియుం బైపయి నెగయఁ బరబలంబు నెత్తుట జొత్తిల్లుచు. విరా. 5-62

2. లేచు, ఉత్థితమగు.

సీ. మంకెనాఁ బరఁగు బ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై నర్తించు శిఖింప వలయునట్టి, గుజ్జు దోయిని బట్టగొని పీతి లంకించియుండ లంకియ తోన గండ మీఱి, పాఱె నకోక్కడియల్ పడియున్న గవప లొట్టై నుంగుపై నది యెగసె పఱప, కుభయ పార్శ్వంబుల మరిపోసిన ట్లవి వ్రేలి చచ్చినఁ జూచి విప్రుఁ డడలి. శాంతి. 4-40

3. కలుగు, పుట్టు, ఉద్భవించు.

ఆ అన్ని వెడఁద వాలి యమ్మ్మ లద్భుతముగ నొక్క ముష్టిఁ దొడిగి గ్రక్కనంగ, నతఁడు లీలఁ దునిమె నందఱ తలలును, ఘోరభంగి రక్తధార లెగయ. విరా. 5-149

వ తమ విడిసిన విప్రగృహంబున నున్నంత, నందొక్కపెట్ట యార్త ధ్వని యెగసిన విని కుంతీదేవి. ఆది. 6-239

4 వ్యాపించు, క్రమ్ము.

ఉ. బందొక విల్లుపుచ్చుకొని యుజ్జ్వలరోప మహోగ్రలార్చు లొంగొండ మొగంబుపై నెగయ మర్వి చలింప. ఉద్యో. 4-819

క. చిచ్చెఱ కన్నదరు లెగయ, విచ్చినఁ గపిలత్వ మొందె విబుధ ప్రకరం, బచ్చెరు వందుచు గన్గొన, నచ్చెరువ నొరకేయు లమల చరిత్రా. అను. 3-22

క. దరికొని దహనుం డెగసెను. వరుసను సహదేవు సకల వాహిని మూద్య, శక్తులవయిఁ దురగము లవయి, వరరథములవయిఁ బదాతి వర్గములపయిన్. శల్య. 1-250

5. వెడలు, ఉద్గతమగు.

తే. రథము మీఁదికిఁ జనుదెంచి పృథుల సైన్య, హర్ష భావన ధ్వనులుఁ దూర్యస్వనములు, నెగసి దివిముట్టు మైమఱువిడి తలిర్చు నెలమిఁ గోదండ తూణీరములు ధరించె, భీష్మ 1-169

విణ.

పుట్టు, కలుగు.

క. విని యా విప్రునితో ని,ట్లను నయ్యేలవాఁగ మన మనఘు ప్రేరే
పం,గనేఁగయు వాక్కు దదను వ,ర్తనము మనంబునకు నెవ్విధం
బునఁ గలుగున్. అశ్వ. 2-15

ఎగవంజను దే. స. క్రి.

తలుముకొని పోవు

క. మును సహదేవుం డెగ వం,జని నప్పుర యొండు దేరు సవరించు
కొనం, గనుట నది పేర్చి యతని,గొని పోయెను సంగరము
నకుం దొలఁగ గంగన్. కర్ణ. 2-367

ఎగవు దే. వి.

ఆవలి భాగము.

ఆ. ... పాండవేయుఁ డార్తిఁ, గూరి నిలువలేక కూర్చుండఁబడి
మూతుఁ, నరద మెగవు తొలఁగ ననియె నధిప. కర్ణ. 2-381

ఎగవెక్కు దే. అ. క్రి.

పై వెక్కిళ్లతో వడ్చు.

సీ. అనవుడు నెగవెక్కి యాబిడ్డ పైబడిపోయెడు వారలకు నడ్డ
పడుచు నక్క. శాంతి. 3-777

ఎగుచు దే. స. క్రి.

1. త్రోలు.

వ. ఇట్లు దుశ్శాసనుండు దోలి త్రాలుటయు.

క. సారథి యరదము భీష్ముని, తేరి వెనుక కెగిచె. భీష్మ. 3-344

2. పైకొను; కవియు.

క శాల హారిణములఁ బట్టెడు, లీలను విపినాటవీ చలిత కేసరి
శార్దూలేభ శరభములఁ దన, బాలత్వమునంద యెగిచి పట్టుచు
మఱియున్. ఆది. 4-6

3. వెంబడించు, తఱుము.

చ. అనిలజుఁ డుగ్రుఁడై ... పేద దు,ర్మములఁ జంపనేల యని
మానుగ గోవుకు గోగణంబులన్, గొనకొని రొప్పునట్టు లధికం
బెగిచెన్ బృథునందన హస్తుఁడై. ఆది. 6-78

క. నలిరేఁగి కలఁగి తద్బల,ములు విశ్వామిత్రు సైన్యముల కేను
మడుం,గులు పెరిఁగి మూడు యోజన,ములు వాఱఁగ నెగిచె
నొక్క మొగిఁ బ్రబలబలమున్. ఆది. 7-107; ఆది. 7-194

వ. ... ఇంద్రుడు శ్యేనంబై న నగ్ని కపోతంబై శ్యేన భయంబునఁ
బఱతెంచి శిబి మఱువుసొచ్చిన దాని నెగిచికొని వచ్చి శ్యేనంబు
శిబి కిట్లనియె, అర. 8-237 చూ ఎగచు.

ఎగురు దే. అ. క్రి.

ఉఱుకు, లంఘించు.

వ. అప్పాంచాల వరుండు.

తే. ...తలగోయుట తప్పించి, యెగిరె నగ్గురు తేరిపై కేపు మెఱయ.
ద్రోణ. 4-100, 101

ఎగువఁబడు దే. అ. క్రి.

నిరోధింపఁబడు, అడ్డగింపఁబడు.

ఆ. అగ్ని నేను నాకు నాహారమయ్యింద్రు, ఖాండవంబు దీనిఁ గాల్పఁ
గడఁచి యెగువఁబడితి ముంద,రింద్రు పంచిన మహా,జారుదాంబు
ధరశతంబు చేత. (ఎగువఁబడితి = అని పాఠాం) ఆది 8-288

ఎగ్గతము వై. విశ. (సం. ఏకాంతః)

ఏకాంతమైనది, నిర్జనమైనది.

(గాంధారి శ్రీకృష్ణుని శపించుట)

గీ, ...అయవ్వ యతఁ డెగ్గతంపు చోట, నరయ దిక్కెవ్వరును లేని
యట్టి తెగుట, నొందఁగలవాఁడుగాఁ బల్కి వొద్దనుండి వింటి.
మౌస. 157

వి.

ఏకాంత స్థలము, ఒంటరిగా నుండుచోటు.

తే. ఎగ్గతంబునఁ దానుఁ గారగ్గిఁ గాలె, నతు యవాతయై దీక్ష
వంతరంగ మలదురక...యెట్లుండుఁ జెపుము. ఆశ్ర. 2-168

ఎగ్గాడు దే. అ. క్రి.

నిందించు.

మ. పరిహాసంబునఁ దేలి భృత్యులయెడం బ్రహ్లాదముం బొందు భూ,
వరు నాజ్ఞం జన రిగిమెచ్చరు పనిన్ వంచింతు రెగ్గాడఁబో,త్తురు
కౌతూహల వేషభాషణములం దుల్యత్వముం బొంది యే, తురు
వారెల్ల పదంబు వేడుదురు సింతుర్ భూమి మాతోడ్డులన్.
శాంతి. 3-180

ఎగ్గు దే. వి.

1. కీడు, హాని.

సీ. ధార్తరాష్ట్రులు మూలతనయ సొబలులును, తెలుపన వేతురు
చిన్నసన్న. - ఆ. యెఱిఁగి రేనిఁ జాల నెగ్గు వాటిల్లు. విరా. 1-47

సీ ...నీ జనించిన యది యాదిగా,నుడుగక పాండవేయులకుఁ జాల
నెగ్గుసేసితి విషమిడి పెనుఁబాములఁ గఱపించి నీటిలోఁ గట్టిత్రోచి
లక్కయిల్ గాలిచి. ఉద్యో. 3-367

ఆ. అ,ప్పాండవులను గుఱిచి బహువిధంబులగు నిమిత్తములు నయం
బునఁ జూచితి, నెగ్గులేమ వారికెల్ల లగ్గు. ఆది. 7-28

2. తప్పు, నిషిద్ధమైన పని.

క. కావునఁ గౌరవ పాండవు లీ వసుధకునై పెనంగు నెగ్గే దైవం,
బేవంక ప్రాలె వారిక, పోవుం గాకిది నరేంద్ర పొగలకుమింకన్.
భీష్మ. 1-48

క. చేతఁగొని యుప్పునములుట, రాతిపయిని నుప్పుగొమట రాత్రి
దధి మధూ,పేతంబుగఁ గుడుచుట ధ,ర్మేతరములు రేయి నక్తు నెగ్గు
నరేంద్రా. అను. 4-110

(కర్ణుఁడు శల్యునితో)

ఆ. వావిలేక యెల్లవనితలుఁ బురుషులుఁ, గలయ మీరు నెగ్గుగాక
యుండు, మున్నుగల్లు పిదపఁ బన్నుఁబాలై పెరుఁ గుడురు సెప్ప
నేం గుణములింక. కర్ణ. 2-47

3. దోషము, అపరాధము.

శా. ...అట్టి శౌ,ర్యాలంకారు మహాత్ముఁ దా సరకుసేయం దమ్మ

తున్ మమ్మతం,దేలా కైకొను వాసుదేవోధనునియం దెగ్గది యూహింపఁగన్. ఉద్యో. 2-145

సీ. అల్లన నవ్వుచు నయ్యింతి యతనితో, నాథ నీయం దొకవాఁడు నెగ్గు, గలదె. అశ్వ. 4-87

ఆ. ధాత్రి శంతనుఁడు విచిత్ర వీర్యుఁడుఁ బాండు,రాజు నెట్టు లట్ల రాజరాజు, ప్రజకు సంతసముగఁ బాలించె నీయందు, నతనియందుఁ గలదె యధిప యెగ్గు. ఆశ్ర. 1-100

4. నింద,

చూ. ఎగ్గాడు.

క. కడు నమరక్రియ నేర్పుమ, గడఁకయుఁ గలవారి మఱక కడ వఁగ నెగ్గుల్, నొడివెడు వివేక శూన్యుల,కడ మండెడు నంతకంటెఁ గష్టము గలదే. ఆది. 8-149

5. చెడుశకునము, అశుభచిహ్నము.

క. ఖలుఁ డీ దుర్యోధనుఁ డె,గ్గులతోడన యుద్భవిల్లె గోమాయురుతం, బులు వించె దుర్నిమిత్తం,బులు పెక్కుపుట్టె వీని పుట్టినవేళన్. సభా. 1-178

6 చావు, అంగవైకల్యము.

ఉ. అగ్గినొరం దలంచునటు లర్జును నెక్కటిదాఁకఁ గోర్కి నీ,కెగ్గిది మాన మీ పలుకు లెవ్వరుఁ జెప్పఁగలేరు రూపఱ, నెగ్గఁగఁ గాల మయ్యెనొకొ నావచనంబు లొకింత కర్ణము,ల్డగ్గఱనిచ్చి యోధులు బలంబులుఁ దోడుగఁ బోరు టొప్పగున్. కర్ణ. 2-36

విశే.

1 కీడైనది, హానికరమైనది.

క. అంతిపురము చుట్టటికం, బెంతయుఁగీ డంతకంటె నెగ్గు తదీయో, పాంత చరకుబ్జవామన, షాంఢాదుల తోడి పొందుకలిమి తటు నకున్. విరా. 1-181

2. ఏవగింపు పుట్టించునది, అసహ్యమైనది.

ఆ. ఆపులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములు గాఁగఁ,

జలుపవలయు నృపతి గొలువున్న యెడల బాహిరములైనఁ గెలని కెగ్గులగుట. విరా. 1-187

**ఎగ్గుగొను** దే. స. క్రి. (√ఎగ్గు)

ఎగ్గుగా భావించు.

క. కావునఁ బ్రభుత్వ సంపద, నీవిభుఁ డాడినది యెల్ల నెగ్గుగొనక నా, చేవినుము నీదు ప్రతినకు, నేవిధి సేయనగు దానినేర్పడ ననఘా. కర్ణ. 3-88

**ఎగ్గులగ్గు** దే. వి. ద్వం.

కీడును మేలును.

ఆ. బుధుఁడు సూక్ష్మవిమలబుద్ధి నప్పురుషుని, నరసి కాంచి యతని యందు మనసు, డిగ్గవిడిచి యెగ్గులగ్గుమ బొందక, శుద్ధశాంతిఁ బరమ సుఖముఁ బొందు. శాంతి. 4-95

**ఎగ్గులాడు** దే. స. క్రి.

నిందించు.

వ నా కట్టిన పుట్టంబు నీకుం గట్టంగాదు గాకేమి యని గర్వంబున నెగ్గులాడి దేవయాని నొక్క మాతం ద్రోచి శర్మిష్ఠ. ఆది. 3-138

ఉ. ధీయుత యంచు ధర్మజ నదీసుత కృష్ణుల నెగ్గులాడుచుం, బోయె సదంబు వెల్వడి సపుత్త్రబలుండయి చైద్యుఁ డల్కతోన్. సభా. 2-15

**ఎగ్గులుపట్టు; ఎగ్గులువట్టు** దే. స. క్రి.

తప్పులుపట్టు, తప్పులుగాఁ దీసికొను.

క. జనవల్లభ యొకసమయము, విను మీతనితోడ నేను విచ్చలవిడిఁ దోఁచిన మాటలెల్ల వాడుదు, నను నెగ్గులు పట్టకుండిసం బొందొ నరున్. కర్ణ. 1-255

**ఎగ్గులుపలుకు; ఎగ్గులుపల్కు** దే. స. క్రి.

ఎగ్గాడు, నిందించు.

క. అలిగిన పలుగక యెగ్గులు, పలికిన మఱి వినవియట్లు ప్రతివచనం బుల్, పలుకక యున్నము వడి యెడఁ దలఁపక యున్నతఁడచూచె

ధర్మజ్ఞుఁ డిలన్. ఆది. 3-147

చ. ఇతనికి నిట్లు నమ్ముటక యెగ్గులు వల్కఁగఁ బోలెఁగాక. సభా. 2-61

## ఎచటు ఎచ్చోటు

తే. ధర్మదేవత నీదు సత్కర్మమునకు, మెచ్చి యొంతయు బ్రీతిమై నిచ్చినట్టి, వరము గలుగంగ మనమేమి వర్తనమున, నెచట నున్నను నొరులకు నెఱుఁగ నగునె. విరా. 1-61

ఆ. ఏది కులము నామమెయ్యది యెవ్వరి, దాన వేమి పనికిఁబూని యిప్పు డెచటు బుద్ధిఁదలఁచి యేఁగెద వింతయు, నెఱుఁగఁజెప్పు మాకు మెఱుఁగుఁబోఁడి. విరా. 1-312

## ఎచోటు ఎచ్చోటు

క. ద్రుపదనృపాలుని ధవళాతపత్ర మద్భుతము లెచోటు దాఁకక జిగియా,రి పొలిచె, స్త్రీ. 2-147

## ఎచ్చటు ఎచ్చోటు

క. మనయింట నిచ్చ టచ్చోటన కెచ్చటనైన నీ బృహన్నల మెఱఁగం, బఁయొదు మానిసి. విరా. 1-254

క. వచ్చితి ననవుడు విని జను, లచ్చెరువును సందియంబు నడరెడు మదితో, నిచ్చెలువ కడుపు కూటికి, నెచ్చటనే నిలుచుకట్టె యిది పలుకగునే. విరా. 1-299, కల్య. 2-54

## ఎచ్చొటు ఎచ్చోటు

తోటకము – గరుపాఱఁగ మేను ప్రకంపమునం, బొరిఁ దొట్రువడం బదముల్ దొలఁగం, జొర నెచ్చొటు లేమి ననువ్యయ దీ, ధర మొందినఁ జేడ్పడు భావము తోన్. స్త్రీ. 1-46

## ఎచ్చో క్రియా. ఎచ్చోటు

1. ఏ ప్రదేశమునందు.

ఉ. ... ఎచ్చో పనియించినం బిదపఁ జొప్పడుఁ గ్రమ్మఱ వచ్చి

కైకొనన్. విరా. 1-166

సీ. ... అరఁడెచ్చో నున్న, వాఁడొ కోయనుడు నవ్వారిజాతి. శాంతి. 4-387

ఎచ్చోటు దే. వి, ప.

ఎచటు, ఎచోటు, ఎచ్చటు, ఎచ్చొటు.

(ఏ + చోటు—చూ. అచటు)

ఏతావు, ఏచోటు.

క. ఎచ్చోట నున్న వాఁ డతఁ డిచ్చోటికి నేల రాఁడొ. విరా. 5-301

తే. ... ఎచ్చోట నెదురుగా మొఱఁగి రచట, మన రథం బల్లనల్లన చనఁగ నిమ్ము. విరా. 5-10

ఎట దే. వి. ప.

ఎచ్చోటు, ఎక్కడ.

వ. అయ్యింతి యింత నేవు నీ చేరువ నుండి యిప్పు డెట మెలఁగె. విరా. 2-61

క. ఇటు గర్వించుట నీచత, యెట వోయెదొ పొమ్ము. శాంతి. 4-398

వ. విధి వశంబున నన్నుం బాసి హృదయేశ్వరుం డెట యేనియుం బోయినఁ దదన్వేషణాసక్త చిత్తనై విపిన పరిభ్రమణంబు సేసెద. అర. 2-99

(ఎటయేనియున్ = ఎచ్చటికో) శాంతి. 5-266

క. ఏనెట నీవెట సుతుఁ డెట. ఆది. 4-99

(ఇట సంబంధము లేమిని దెల్పును.)

ఎటు దే. అవ్య. ఎట్టు

1. ఏవైపు, ఏదిక్కు.

చ. ... ఏమనునో యెటు సూచునొక్కొ యెవ్వరి దెస నెప్పుడే తలఁపు వచ్చునో యాతని కంచు. విరా. 1-129

2. ఏ ప్రకారము, ఏ రీతి.

వ. ధృతరాష్ట్రుఁడు సంజయునితో నిత్తెఱంగునం బన్ని బహులతిమి

రంబున సమరం బెటు చేసి రని యడిగిన. ద్రోణ. 5-142

చ. ... తత్ప్రమయంబున రెంటఁ గూడ నీ, వెరవున యూఁది చిత్తమున వేగిర పాటెటు లేక పొంచుమీ. అను. 1-272

(ఎటు = ఏ విధముగా నైనను)

ఎటులు దే. అవ్య. (√ఎటు)

ఏ ప్రకారముగా.

ఉ. . . . నీవు, స, మ్మానము చేసి నాకిటు లమాత్యుఁడవైన పదంబు కంటె మే, లై నతికెక్కు కోర్కి యెటు లారని చూచిన నొండుఁ గల్గునే. ఉద్యో. 1-98

ఉ. . . . క, య్యమ్ముల్ తెఱంగు సెప్పు మెటులయ్యెఁ బదంపడి సూతనందనా. ద్రోణ. 2-86

ఎట్టకునేని అవ్య. (ఎట్టకున్ + ఏని) ఎట్టకేని

చాల సేపటికి, చిట్ట చివరకు, అతి ప్రయాసమున, చాల కష్టము మీఁద.

ఉ. ఒల్లరు రాజు దేవులును నొద్దుల రాచిన చందనంబు మే, నెల్లఁ దెమర్పఁగా నలయ తేను శ్రమంపడి నిల్పి నిల్పి య, ల్లల్లన మార్దవం బొనరు నట్లుగ నెట్టకు నేని రాచి మీ, తల్లికి భక్తిఁ బెట్టెడు విధంబునఁ బెట్టుదు బ్రహ్మఁ దిట్టుదున్. విరా. 2-220

ఎట్టకేని అవ్య. (ఎట్టకున్ + ఏని) ఎట్టకేని

చాలసేపటికి, చిట్ట చివరకు, అతి ప్రయాసమున, అతి కష్టము మీదఁ.

తే. ఇట్లు ప్రార్థించి పాంచాలి యెట్టకేని, సింహబలు మందిరం బల్లఁ జేర నరిగి, యొల్లఁ బోవుచు బెబ్బులియున్న పొదరు, సొచ్చు లేడి చందంబునఁ జొచ్చుటయును. విరా. 2-112

వ. . . . ఇక్కార్యంబున దోషంబు లేదు వినిద్రకరణంబయిన నా హృదయ శల్యంబు నుద్ధరింపుమని ధృతరాష్ట్రు నెట్టకేనియు నొడుబఱిచి దుర్యోధనుండు. ఆది. 6-180

ఎట్టకేనియు దే. అవ్య. ద్రు.

ఎట్టకేని.

వ. ఈ దేవియును (కుంతి) బతిశోకదన శోవ సమకట్టినం బుత్త్రరక్ష ణార్థంబు మునిగణ ప్రార్థితయై యెట్టకేనియు ధృత ప్రాణ యయ్యె. ఆది. 5-166

**ఎట్టకేలకు** దే. అవ్య. ద్రు. (ఎట్టకున్ + ఏలకు)

ఎట్టకేని.

చ. అనుటయు నెట్టకేలకు ధరాధిపుఁ డట్టులకాక యంచు. విరా. 1-287

చ. ఒకరుఁడ తాను శిశి వెగడొందెదు రెండవ కన్ను నెట్టకేలకు దగఁ దేర్చునప్పుడు బలంబులతోఁ గురురాజు సూడ.విరా. 5-886

**ఎట్టి** దే. విశ. (ఎట్టు + ఇ)

ఎటువంటి.

ఆ. ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను బెద్దకాల మునికి తద్ద తగదు. ఆది. 4-65

తే. యోగి యెట్టి యాహారంబు లుడుగవలయు. శాంతి. 5-591

(ప్రశంసాదులను దెల్పును.)

ఉ. ఎట్టి లా వెట్టి పరాక్రమస్ఫురణ మెట్టి రయంబని పిచ్చలింపఁగన్. భీష్మ. 1-260

**ఎట్టిపాటివారు** దే. సర్వ. బహు.

ఎంతటి వారు.

ఆ. దైవ వశమున, నెట్టిపాటివారు నెట్లుఁగారె. శాంతి. 4-426

**ఎట్టిండు; ఎట్టిఁడు** దే. సర్వ. ఏక. (ఎట్టి + వాడు)

ఎటువంటి వాఁడు.

క. శివిరి సుత జన్మం బెట్టిం,డవు వొకొ దేవరుఁడు వాకు ననుచుం. ఆది. 4-252

క. ఇతఁ డెట్టిఁ డైన నేమగు, నతనికి సఖుఁడవై బిక మహత్తర సఖ్యం, బితనిం బాత్రముఁ జేయదె. శాంతి. 3-492; శాంతి. 4-418

**ఎట్టు** దే. అవ్య. ఎటు

ఏ విధము, ఏ ప్రకారము.

ఉ. ... ఇప్పు డిటు భ్రమంగుడుపాటునఁ బొందఁ జూచి వా,కెట్టు
మనంబు వట్టు ధృతి యెమ్మెయిఁ దూలక నిల్పఁ జెప్పుమా.
విరా. 2-192

**ఎట్టులు** దే. అవ్య. ఎటు, ఎటులు

ఏ విధముగా, ఏ ప్రకారముగా.

అ. అనిన ధౌమ్యుఁ డిట్టులనియె నీ వత్సర, మొకఁడు నెట్టులయిన
మడిగి మడిగి, సంకటముల కోర్చి చరియించి యీవల, విస్తరించి
పిదవ వెగడవలయు. విరా. 1-143

తే. ఎప్పు డెయ్యెడ నేమిట నెట్టులరయ, వలసె నెమ్మెయి వారయు,
మలసి దస్సి నొచ్చితియైనను. విరా. 2-214

**ఎట్టులొకొ** (ఎట్టులు + ఒకొ)

ఏ విధముగాఁ గానున్నదో - ఏ విధముగాఁ బరిణమించునో.

అ. ... ఇమ్మని, యేల సైఁచు నింక నెట్టు లొకొ. అర. 2-327

**ఎట్టెట్టు** (ఎట్టు + ఎట్టు)

ఏమేమి (ఆశ్చర్యమును దెలుపును.)

సీ. అనవుడు రాతుసుం దట్టహాసంబుతో, నెట్టెట్టు తీముండ
యీతఁడేమి. అర. 1-116

**ఎట్లొకొ** ఎట్లొకొ

ఏ విధముగాఁ బరిణమించునో.

క. ఇట్టగు చెయ్వఁగల వచ్చితి, మెట్టొకొ మన భంగి పిరలిందయును
గడున్ బెట్టదులు. విరా. 4-54

ఏపట్టున నైనను, ఎట్టి పరిస్థితి యందైనను.

అ. ఎట్టనియేని గూర్తు రింతులు మాకవి, విశ్వసించు వారు వెదఁగు
లెందు. అర. 2-164

**ఎట్లు** ఎటులు, ఎట్టులు

1 ఏ ప్రకారము.

వ. తత్ప్రకారంబు నడపెద నది యెట్లనిన. విరా. 1-48

2. ఏ ప్రదేశము, ఏ తావు.

(భీష్ముఁడు కర్ణునితో)

చ. చెవమిడి యోహాటించి యిటు నీవు దొలంగినఁ బోవ వచ్చునే-
కుపిత మనస్కుఁడై నరుఁడు గూల్పఁ గ్రమంబున దొడ్డలెల్లఁ జా
వ్న పిదప నెట్లుఁ బోచ్చెదు. ఉద్యో. 4-249

(ఎట్లుఁ బోచ్చెదు = ఏ తావునకుఁ బోయెదవు)

ఇది సం. ము అకాడమీ ప్రతుల పాఠము. ఎట్లుఁజచ్చెదు పాఠాంత
రము - అనంద ప్రతి ఎట్లుఁ జచ్చెదు—పాఠము ఎట్లుఁ బోచ్చెదు పాఠాంత
రము. ఎట్లుఁ జచ్చెదు = ఏ విధముగా నైనను జచ్చెదవు.)

3. ఇది వ్యతిరేక క్రియలపై 'పల' అను నర్థముతోఁ బ్రయోగింపఁబడి
యుక్తార్థమునందు నిశ్చయమును దెల్పును.

ఆ. ... ఇట్లు వడిన వీరలు వదవడి, తమకు నగ్గమైన తటి జయింప
రెట్లు - (నిశ్చయముగా జయించిరి.) విరా. 1-56

4. అన్ని విధముల.

ఆ. రాజు వొద్దఁ బలువురకు సంకటముగాఁగఁ దిరుగు పనుల కెంత
తేజమయిన, వాని బుద్ధి గలుగు వారొల్లర మీఁదఁ జేటు దెచ్చు
టెట్లు సిద్ధమగుట. విరా. 1-126

5. సంబంధ సర్వనామముగా నుపయోగించుట.

ఎట్లు - అట్లు

వ. మీతండ్రి నీకును దమ్ములకును వాసుదేవునకు నెట్లు ప్రియంబట్లు
చేయు వాఁడ కాక. ఉద్యో. 1-377

ఎట్లుచెప్పిన; ఎట్లుచెప్పిన దే. అ. క్రి.

ఏ విధముగా అమకొనినను, ఏ ప్రకారముగా ఆలోచించినను.

చ. ఇది చెను బాము చందమున నెంతయు భీషణమై జనంబులన్, వెద
రఁగఁ జేయు; నట్లగుటఁ జెట్టి చనన్ వలయుం దలంచి వా, హృద
యము దీనిఁ గాయుటకు నియ్యకొనం బోరదెట్లు చె (చె) ప్పినం,
దుది నొకచోట నైచుటయ తోఁచిన కార్యము నద్యోతుం గటా.
విరా. 1-160

**ఎట్లొకొ, ఎట్లొకో, ఎట్లొకొం, ఎట్లొకోం, ఎట్లొ-**

క. ముని వాయక మృత్యువు ప్రభు. వని యిందుము లోకముఁవకు వది
యెట్లొకొ. ద్రోణ 2-169 (ఏ ప్రకారమో)

క. ... వారు లి, త్రటి సికులు ద్రావక తె,ప్పటి లెట్లొకొ శ్రతు
సైన్య భీకర మూర్తి.
ద్రోణ. 3-160 (ఏమి కారణమో) ద్రోణ. 5-45

**ఎట్లొకో**

1. ఏమగునో, ఏది జరుగునో.

ఉ. ఎండకు వాన కోర్చి తన యిల్లు ప్రవాసవుఁ జోటువాక యాఁ
కొండు నలంగుడున్ నిదురకుం దలిచప్పెడు దప్పివుట్టె నొ,క్కం
డన యెట్లొకోయనక. విరా. 1-185

2. ఏమి కారణమో,

సీ. శుభ లక్షణాంగి యీ సుందరి సైరంధ్రి, యగుచెట్లొకో యని
వగచు వారు. విరా. 2-146; శాంతి. 6-398

3 ఎందులకు జరుగఁ గూడదు, జరుగ వచ్చును అని భావము.

చ. ... ఈ బలం,బుల కధినాథుగా ద్రుపద భూపతి బట్టముఁ గట్టి
చెట్లొకో. ఉద్యో. 4-99

ఉ. ... విక్రమా,ర్జిత వైరి భీముఁడును వారికిఁ దోడుగ నేఁగు
చెట్లొకో. ద్రోణ. 4-129

3. ఎటులం సాధ్యపడునో.

వ. మునుల వలన శూద్ర జాతి భామలందుఁ బ్రభవించిన వారికి
బ్రహ్మర్షిత్వంబు గల్గుటది యెట్లొకో యని వితర్కించి.
అను. 2-26

వ. బ్రాహ్మణునకు శూద్రజాతియందు భార్యా పరిగ్రహంబు సేయం
దగు నని యిందు నతనికి భార్యలు మువ్వురని నిర్దేశించితి రది
యెట్లొకో యనుటయు. అను. 3-230

**ఎట్లొకొం**

ఏమగునో, ఏది జరుగునో.

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రిం చెట్లొకొ యంచున్ భయం బొదవం. విరా. 3-27

ఎట్లొకొ

ఎట్లు జరుగునో, ఎట్లు సాధ్యపడునో.

క. ఏము నిను మత్స్యరాజ్య, శ్రీమహిమకు నెల్ల యుక్తుఁ జేయఁ దలంపం,గా మా మనోరథమునకు, నీ మాట విరుద్ధ మయ్యె నిది యెట్లొకొ. విరా. 1-286

ఎట్లో

సంభవము కామిని సూచించును.

క. మేలు దొరకొను విధ మెట్లో. శాంతి. 3-133

ఎడ[1] దే. వి.

1. స్థానము, చోటు.

తే. ఇట్లు దమదమ వర్తిల్లు నెడల సకల, జనములకు హృదయానురంజన మొనర్చి. విరా. 2-8

క. మన మొక యెవ్వర మీ యం,గనయుం దొనరుగు దేరఁగా నెయ్యెడఁ గో,యిన నెఱుఁగకుండుదురె. విరా. 1-59

వ. సరిగా రెండెడలకు, వరులు సమటఁ గోరి మనమునన్.
అను. 5-160

ఆ. ... పార్థు, నరిగి నెడక మనము నరిగి యతని యున్న చోన ప్రీతి మందున మిందుఁడ, నేల యనుచుఁ జారులెల్లఁ దెరలి,
ఆది. 6-142 అర. 2-178

2. ఎడము, అంతరము.

వ. అంత సంకుమఁతుఁడు శాంతుం డగుచు వచ్చి వట్టి యెడం గదిసి కవ్వడి గాంగేయుపైఁ గ్రూర వారాద వికరంబులు నిగిడించి పదం ద్రోచిన. భీష్మ. 3-411

వ. యోధవీరులుం గుమారులు వెక్క పెట్ట ధృష్టద్యుమ్నుం డొది విన నతండు ద్రోణ దత్త ప్రమోహన బాణంబున బారినందఱ నిశ్చేష్టితులం జేసినప్పుడు దప్పి దీర్చికొన నెడగని యనిలవందనుం

దొక్క మడవున మధురశీశిర జలంబులఁ బానంబుచేసి.

శివ. 2-378

3. అవకాశము, వ్యవధానము.

వ. ఇవ్విధంబునం గృపాశ్వత్థామ శల్యవృషసేనులు దెంపుచేసి సైంధవున కడ్డంబైనం జూచి యాసవ్యసాచి యతనిఁ దెగఁజూడ నెడ గానక యవుడుగఱచుచుఁ బ్రొద్దుదిక్కు గనుంగొనినఁ గేశవుం డిట్లనియె. ద్రోణ. 4-311

క. కొండొక యెడఁగని శాంతనవుం డాఖండల తనూభవుని డాయూఁ పుద్దండ భుజబలము మెఱయఁ బ్రచండాస్త్రశతముచేసె

విరా. 5-175

తే. శోకభయ కారణంబులు లోకమున ననేకములు దానఁ దలమూవు శోకములకు, భయములకు బుద్ధి నెడయీఁడు పండితుండు, మూఢుఁడవి ద్రోవనేరండు మునుఁగు వగల. శాంతి. 1-188

ఉ. వాకెడ యిమ్ములెమ్ము కురునాథు మనఃప్రియ ధర్మవర్తి నే, నేకత మెట్టులుండుదు మహీపతితోడనపోదు. ఆది. 5-144

తే. తేరు డిగ్గి పారించెఁ గ్రీడి గాండివ గుణంబు.

చ. ఎడగని యబ్బలంబు గడు నేర్తెఱఁ గిట్టి మహాస్త్రశస్త్రముల్గడు వడిఁ గుప్పఁగూరగఁ జలంబునబైఁ దొరగింప.

ద్రోణ. 3-151, 152

శ్లో. ఇదం ఛిద్రమితి జ్ఞాత్వా ధరణిస్థం ధనంజయమ్.

సం. భా. ద్రోణ. 99-42

4. సమయము.

క. అమరనగరంబున కరిగినయెడ మూర్వశి నన్ను నపుంసకుంగా శపియించిన. విరా. 1-87

వ. అదియును నిలిచి మాఱ్కొన్న యప్పుడును నడచు నెడనుగాదు.

శల్య. 2-305

క. గెలుపు నెడ జేయు నెడవడిఁ బిలుచునెడం బెనఁగునెడ నపారబలంబుల్, మెఱయునెడ భీమునకు నం,దొలుఁ గిడ్పడఁ దొడఁగి రుద్ధ

తులు రాజసుతుల్. ఆది. 5-164

సీ. ఇతని విక్రమ మాశ్రయించియకాదె య,య్యెడ లక్కయిల్లు వెల్వ
డఁగఁ గంటిమి. ఆది. 6-278; ఆను. 2-195

5. గడుపు, వ్యవధి.

వ. ...అద్దేవి నవహాపుకడకుం జని సముచితంబుగాఁ దదీయ సాంగ
త్యంబున కెడవలికి కొనివచ్చునది. ఉద్యో. 1-162; ఉద్యో. 1-166

(ఎడవలికి = గడువుగా మాటాడుకొని అని తాత్పర్యము)

ఉ. అల్లన యింతి యిట్లనియె నారసి వాసవు కర్మి లేమియుం, దెల్లము
గా నెఱింగికొని తేఁకువ వేకిట వచ్చుటొప్పు నా, యుల్లము కంకి
తం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె నీ,వెల్ల నెఱుంగు దిప్పు
డెడ యిచ్చుట యుక్తము నాకుఁ జూడఁగన్. ఉద్యో. 1-165

సీ. పలుకుల కెడలేదు కాటాసనము గొని,చనుదెమ్ము నా తోడ.
ఆది. 8-118

6. విరామము, విచ్ఛిత్తి.

తే. పుత్త్రి వినుమేము దతుని పుత్త్రి నన్నుఁ, గావకున కిచ్చె మా
తండ్రి బాల్యమునను, నన్ను నతఁ డంత యొల్లఁడు నాకుఁ బతికి,
నెపుడు నెడలేని పొందుగా నీవొసర్పు. అర. 5-259

7. తెఱపి, తీఱిక.

ఆ. వేగ జాముగలుగ నెదనిద్రఁ బొందుదుఁ,గాని రాజ్యభారకార్య
యుక్తి, నబ్జనయన నాకు నాహారనిద్రలం, నెడయు లేదునువ్వె
యెల్లప్రొద్దు. అర. 5-303

8. మధ్యము (నడిమి ప్రదేశము)

సీ. ...మాత్నముక్తాదామముల తోడఁ, గుసుమమాలిక నెడగ్రుచ్చి
ప్రేలఁ గట్టించి. విరా. 5-388

తే. ...మీ తండ్రి క్రీడిపై నదర నడుమఁ, జొచ్చె సాత్యకి యన్నదీసు
తుఁడు శక్తి,నైనవ మెయివాల్చి యది వట్టనైరె మగుడ, నాతఁడా
భీష్ముఁ డెడఁ దునుమాడె నధిప. భీష్మ. 3-285

క. కదిసి శరాసనగురు డిరు,వది యేను శరంబులేయఁ బార్థుఁడు వా నిం, గుదియించి విశాలాస్య, ప్రదరము లదరింపఁ గుంభభవుఁ డెడఁ ద్రుంచెన్. ద్రోణ. 8–75

క. అని మామఁ బలుకు పలుకులు, విని యశ్వత్థామ క్రోధవివశుం డయి గ్ర,క్కున వాల వెఱికికొని క,ర్ణుని దెసకుం గవియ భూవరుం డెడ సొచ్చెన్. ద్రోణ. 5-106

9. ప్రవేశము, చొరవ.

వ. ...పృథివి శాసింప భవదీయ విభవం బుజ్జ్వలంబై యొరుల కెడ లేక చెల్లుచున్న దెంత యొప్పగునో యటు విచారింపుము. ఉద్యో. 2-89

10. స్థితి, సందర్భము.

వ. విప్రుని దండించు నెడలునుం గలవు శుక్రుండును జెప్పిన వాఁడు వినుము. శాంతి. 2-174

వ. పద్మవ్యూహంబు సంఘటించునెడ వివిధ దేశంబుల రాజులు దళంబులును. ద్రోణ. 2-4

11. వీలు, అనుకూల్యము.

చ. ఎడగని వాలు బల్లెమున నేసె నెసం దునియంగ ద్రోణుఁడు. ద్రోణ. 2-112

క. ఇవి మీ కన్నియుఁ జేయఁగ, నవునని తలఁపకుఁడు భూసురావలి మంత్రో,ద్భవ దారుణ దహన శిఖల్, గవిసిన నెద్దియును జేయఁగా నెడ గలదే. ఆది. 2–182

12. దూరము.

చ. తడ వగుదెంచె బిమ్మికిఁ బ్రదక్షిణ వృత్తిగఁ దేరువోవ ని,మ్మెడ గలుగంగఁ బోయెఁ బసులిప్పుడ కూడుదమన్న. విరా. 4–171

(ఎడగలుగంగ = దూరముగా)

క. వేత్ర హస్తులు దొలంగు తొలంగుం డని నెడ గలుగ బడియ (ఎడ గలుగంగ = దూరముగా నుండునట్లు.) భీష్మ. 8–169

వ. పవమానసూనుం డవమాన పూర్వకంబున నీవెందులదాన వింత
ప్రొద్దేల వచ్చి తెట వోయె దెడ గలిగి పొమ్మనిన విని హిడింబ
యిట్లనియె. ఆది. 6-191

సీ. అడవిలో నిద్రావశాత్ములమై యున్న, మన నిద్రఁ దెలుపఁగా
దని హిడింబ, యెడ గల్గఁ గొని పోయి యొక్కటి నంపిన.
ఆది. 6-278

చ. ... అచ్యుతన్, అను తెడయేట గాంచు కౌశిపాలక.
విరా 2-247

13. ఆలస్యము, విలంబము.

క. ధరణీసురులకుఁ గడు, నెరగై నెడ నెఱిఁగి యెడయుఁ జేయుదురె
మహా,పురుషులని నరుఁడు విలుగొని. (ఎడయున్ = ఆలస్యమును)
ఆది. 8—119

14. విధము.

వ. ... అలోయల సమద వృత్తి నెట్టకేలకు నొకయెడ మాన్పి.
మౌస. 1-188

(ఒక యెడ = ఒక విధముగా — అతి కష్టము మీద—అని భావము)

15. అడ్డు.

వ, అనిన విని కుటిలం బగు నతని యభిప్రాయంబునకు రోసి యస్త్ర
గురుఁ డవ్వరంబునకు నేమియు నెడ వెట్టక యిచ్చు వాఁడుగా
మాహించి. ద్రోణ. 1-112

శ్లో. సత్య జిహ్మమభిప్రాయం, జ్ఞాత్వా ద్రోణోర్థ తత్త్వవిత్.
తం వరం సాంతరం తస్మై దదౌ సంచిన్త్య బుద్ధిమాన్.
సం. భార. ద్రోణ. 12-19

విణ.

16. అధికము, మిక్కిలి.

చూ. ఎడదవ్వు.

అవ్య. ద్రు.

17. అందు, విషయమున.

తే. ... తల్లి ప్రజలం, దెడ విరోధంబు వాటించు టెంత మేలు.
ఉద్యో. 3-265

క. మా తండ్రి యెడం జేసిన, పాతకము కతంబుగాఁగఁ బాంచాల నికృష్టాత్మునిమెద నిమ.
కర్ణ. 2-327

క. ... సజ్జన సేవ్య యన్న దానము, మును లధికంబండ్రు పాపములఁ బాపు నెడన్.
అను. 4-270

ఎడ2 వై. వి. ఎడఁద, ఎద్ద, ఎడ్డ, ఎడ, (సం. హృద్)

హృదయము.

తే. దీని కెడ నియ్యకొని వేడ్క నూని కృతిప, తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ.
విరా. 1—18

క. ... కుమ్మరి కోలమ పారెంటోలితిఁ దలఁచి చూడు మెడన్.
అను. 1—16

తే. ... బెట్టులూకుఁ, డదరి యన్న కులామజు నంపవెల్లి, ముంప నతఁడేచి పటు భల్లమున శిరంబుఁ, ద్రుంచె నన్నం దెడలు సంతోష మొంద.
శల్య. 1-336; విరా. 5-82

ఎడ3 విణ.

స్వల్పము.

ఆ. కర్షకునకు వేల కాలం మెఱుంగుట, యట్టి కాని కేది సంభవించె, నందు విలువ మొదలనగు లాభమున నెడ, వ్యయము గల్గుటయు శివప్రదములు.
ఆమ. 5-75

ఎడఁగాంచు దే. స. క్రి.

దూరమునఁ జూచు.

మత్త:—మహామునీంద్రుల యాశ్రమం బెడఁగాంచె నంభోరుహాక్షి పురా సమార్జిత పుణ్యకర్మ ఫలంబునన్.
అర. 2-96

ఎడఁజొచ్చు దే. అ. క్రి.

1. నడుమఁ జొరఁబడు.

ఆ. అప్పు డర్జునుండు దప్పక చూచి యా, బలము పసుల కడ్డపడక యుండ, నెడ సొరంగ వలయు నిటు రయ్యి కొనుమని పనిచె

మత్స్యభూమిపాల మతుని. విరా. 4-267

క. ఎడఁజొచ్చి చిత్రసేనుఁడు, వడముడిపై నేయ. భీష్మ. 3-57

2 అడ్డుపడు.

క. ద్రోణాచార్యుండు సుత,త్రాణ పరత్వమునఁ గృష్ణు తమ్ముని పై, నక్షిణోద్ధతిఁ గవియుడు గీ,ర్వాణాధిప సుతుఁడు వచ్చి వడి నెడఁ జొచ్చెన్. భీష్మ. 3-218

ఎడఁద వై. వి. ఎద్ద, ఎడ్డ, ఎద[2] (సం. హృదయము)

హృదయము, మనస్సు.

తే. వికట విస్ఫురదసిచర్మ వివిధ చిత్ర, గతులు చూపఁజ యెడఁద కద్భుతము సేయ. ద్రోణ. 1-171

తే. ఎడఁద నొగయించు మాటల నెలమి మిగుల. విరా. 2-64

ఎడఁబడు దే. అ. క్రి.

ఊఁటు గొను, విశ్రాంతిపొందు, తెంపు అగు.

క. ఎడఁబడక యహోరాత్రులు, వడిఁగొని చదివింప నిట్లు వలయునె. అర. 3-288

ఎడఁబాయు దే. అ. క్రి.

విడుచు, త్యజించు, పాయు.

ఉ. హా యమ ధర్మరాజ తనయా యమ నన్నెడఁబాయ నీకుఁ బ,న్నె యను. ద్రోణ. 2-242

ఎడగము దే. అ. క్రి.

వ్యవధి పొందు, అవకాశము పొందు, వీలు చూచుకొను.

చ. ఎడగని వాలు బల్లెమున నేసె వెసం దునియంగ ద్రోణుఁడు. ద్రోణ. 2-112

క. రేయును బగులును విదురుఁడు, నీయొద్దన యునికిఁ జేసి నేరము పలుకన్, మా యిష్టం బెటిఁగింపఁగ, ధీయుత యెడఁగంటి మిన్ని దివసంబులకున్. ఆది. 8-18

ఎడగర దే. వి.

చిత్త స్వాస్థ్యములేమి, నిద్రలేమి వలనఁ గలుగు వేగిరపాటు లేక తొట్రుపాటు.

చూ. ఎడగరపడు.

**ఎడగరపడు** దే. అ. క్రి.

చిత్తస్వాస్థ్యము లేకుండు, నిద్రలేమి వలనఁ గలుగు వేగిరపాటు లేక తొట్రుపాటును బొందు.

సీ. ...నీవు డస్సి,యున్నవాఁడవు నిద్రయును లేకయున్న నీ,వెడ గర పడితె దీ యడవిలోన. సౌప్తి. 1-61

శ్లో. చిరం తే జాగ్రత స్తాత స్వప తావన్నిశామిమామ్
విశ్రాంతశ్చ వినిద్రశ్చ స్వస్థ చిత్తశ్చ మానద. సం. భా. సౌప్తి. 4-4, 5 (వావిళ్ల)

**ఎడగలయు; ఎడగలుగు** దే. అ. క్రి.

1. దూరముగాఁ జేరు, దూరముగా నుండు.

క. నిలిచిన సకల జనులు నెడ,గలిగి బలసి నిలిచిరపుడు. కల్కి. 2-280

(ఎడగలసి — అని సం.ము పాఠము అప్పుడు నిదియే యర్థము)

వ. వేత్రహస్తులు దొలంగు తొలంగుండని సందడి నెడగలుగ జడియ. భీష్మ. 3-169

వ. ధృతరాష్ట్రుఁడు గొండొక యెడకలుగం జనియె. ఆశ్ర. 1-157

2. వ్యవధియుండు, సావకాశము చిక్కు.

క. ఇవి మీ కన్నియుఁ జేయఁగ, నవునని తలఁపకుఁడు భూసురావళి మంత్రో,చ్ఛ్రవదారుణ దహనశిఖల్, గవిసిన నెద్దియును జేయఁగా నెడగలదే. ఆది. 2-182

**ఎడతెంపి** దే. వి.

వ్యవధానము.

చ. ...భయంపడి యిద్దెస వచ్చెనేని న,త్తెఱగయిపోమె యంచు నెడ తెంపిగఁ గొందఱు వాయఁబాఱఁగన్. విరా. 5-61

(ఎడతెంపు-అని పాఠాం)

**ఎడతెంపు** దే. వి.

చూ-ఎడతెంపి.

**ఎడతెగు** దే. అ. క్రి.

ఎడపడు, విచ్ఛిన్నమగు.

క. ద్రోణుఁడు రయమున వేసిన, బాణము లెడతెగక యొక్క బాణము
బోలెన్, శ్రేణియయి పోవఁ బార్థుఁడు, రేణువు గావించుఁ గంటిరే
చిత్రగతిన్. విరా. 5-129; విరా. 5-41

క. జనవినుత యగ్నిహోత్రం,బును సంతానమును వేదములు నెడ
తెగఁగాఁ, జన దుత్తమ వంశజులకు. ఆది. 4-181; ఆది. 4-221

**ఎడత్రెవ్వు** దే. అ. క్రి.

ఎడతెగు, విచ్ఛిన్నమగు.

క. పెనకువ యెడత్రెవ్వక పదు, నెనిమిది దివసములు సెల్లె.
శల్య. 1-848

క. మడు వింకఁగఁ బాఱెడు నీ,రెడ త్రెవ్విన వొండుచోట తేఁగఁగ
రాదెప్పుడు నింకని నీళ్ళులుగల, మడువునకుం బోవలదె మనకిట్టి
యెడన్. శాంతి. 8-188

**ఎడదవ్వు** దే. వి.

మిక్కిలి కాలవ్యవధి, చాలాకాలము గడచుట.

క. ఎఱుఁగఁడొకో నన్ను నెఱిఁగియు, నెఱుఁగని యట్లుండు నొక్కొ
యెడ దవ్వగుటన్, మఱచెనొకో ముగ్ధు లధిపులు, మఱవరె బహు
కార్యభారమగ్నులు గారే. ఆది. 4-68

**ఎడదాఁటు** దే. అ. క్రి.

లంఘించు, ఉఱుకు.

చ. కరివతి జిట్టురం దిరిగి క్రమ్మఱ నూలొ్కని వృష్ణి వీరు ముద్ధుర
రథ మద్ధళించెనఁచి తొండమునన్ వెసనెత్తి వీచివై,చె రయము
మైనతం డిలకు జిత్రముగా నెడదాఁటి పోయె. ద్రోణ. 1-824

**ఎడమడుగు** దే. అ. క్రి.

నడుమమాను, మధ్యలో విరమించు.

క. ...తమకుఁ, దలరఁగఁ ద్రేపవెం గానెడ నుడుగున్. ఆది. 2-178

ఎడనెడ దే. వి.

అః క్రిందః క్రింద.

వ. పశ్చిమాభిముఖ ప్రయాణంబుల నెడనెడ వన్యాహారంబుల శరీర యాత్రలు నడుపుచు. విరా. 1-147

2. అప్పుడప్పుడు.

వ. తమకంబు నెడనెడ నతిముఖం ద్రథంబు దెసకు నతఁడు వాఱ విడిచిన విశిఖంబులు నూఱు గలవు. ద్రోణ 2-228

3. మధ్యమధ్య, నడుమనడుమ.

సీ. కజ్జంబులును బంద్లు గంధమాల్యంబులు, ధృతరాష్ట్ర సుతుఁడు పుత్తెరఁ బ్రీతి, నెడనెడఁ గొనివచ్చి యిచ్చిన వానినెల్లను వేడ్క నమభవించిన విధంబు-తే. నలిపి యనుభవ మొల్లక చనఁగ. ఉద్యో. 3-178

సీ. ఇరుప్రొద్దుగుడుచుచు నెడనెడఁ గుడువకయుండు వారందు సదోప వాసి. శాంతి. 4-368

ఎడపక దే. అవ్య. (ఎడపు ధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థకము)

1. తొలఁగక, విడక, వదలక.

వ. ...చలం బెడపక నీమఱంది యన్న కులానుజుల గిట్టి. శల్య. 1-360

ఆ. ...వాని, నడపకయు నిష్ఠయొనప కతఁడు. శాంతి. 2-222

క....అయ్యేవురు పతులందు ధర్మ వెడపకయుండుం, గావున. ఆది. 7-262

2. వారు, వీరు అను భేదము లేకుండ.

క. అడవులునేఱులు నవి నీ, వడసిన యవియట్లు పుణ్య భాగీరథి యిప్పుడమిఁగల జనులకెల్లను, నెడపక సేవ్యంబకాక యది నీయదియే. ఆది. 7-40

మవః పూర్వకముగా.

చ. ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితిమి. సభా. 2-30

శ్లో. మతిపూర్వ మిదం సర్వం చేదిరాజ మయా కృతమ్.
తస్మై నిగద సత్త్వం కారణాన్ త మే శృణు.
సం భా, స భా. 42-2

**ఎడపడు** దే. స. క్రి. (√ఎడ)

1. విడివడు, వీడు.

వ. కేంకడవన లక్ష్మీ పుత్రి నలంకరించు వడువున నెడపక యెల్లెడల నిగుడు విభాతికుసుమ కదంబ పరిమళంబునై యున్నంత
విరా. 2-240

2. ఒకటి వెంట నొకటి వచ్చు.

ఆ. బ్రదుకు చేటు పొగడు వడుట దూలొందుట, యీగి వేడుకొనుట యిట్లు మఱియుఁ, గలుగు సౌఖ్యదుఃఖములు వచ్చి యెడపడి, వాని కింత యేల వగవ నధిప.
ఉద్యో 2-79

శ్లో సుఖం చ దుఃఖం చ భవాభవౌ చ, లాభాలాభౌ మరణం జీవితం చ, పర్యాయశః సర్వమేతే స్పృశన్తి తస్మాద్ధీరో నచ హృష్యేన్న శోచేత్
సం భా, ఉద్యో. 35-47

3. ఆలస్యపడు, జాగు, తడయు.

క. ఉడుగుడుగు మోహనాస్త్రము, విడువకు మను నెలుఁగుతోడ వేడుకొన నమ్మొదడ కేఁగుదెంచి వారదుఁ, దెడపడఁ డీ చూయు లేక యిట్లను నాతఁడ్.
ఉద్యో 4-849

4. దూరమగు

సీ ముక్తి కామస్థితి సమ్మోహము మార్గము లను, నడచి పరంబున కెడపడకుండుదు ముక్తి వైరాగ్య మూలమూనె.
శాంతి. 6-174

**ఎడపు** దే. స. క్రి. (√ఎడయు)

1. విడచు, వీడు, తప్పించు.

సీ. తొడగిన యని చలం బెడపక యతిదుష్కరంబైన గడతేర్చు ప్రభు వులార.
విరా. 3-21; శాం. 2-222

వ. ఇట్లు దన తపోవనము యందు నమయుటయుఁ జలం బెడపక నీ వెలంప యన్నవాఁ లాలుబం గిట్టి.
శల్య. 1-880

2. తొలఁగించు.

క. నా కిడు దలఁపనేరక, శ్రీకిడెడవి పాడి యింత సేయక పుత్త్రీ,నీక సుహృద్బాంధవులం, బోకార్చితి బ్రతుకుటింకఁ బొసఁగునె చెపుమా
త్రి. 1–18

3. తప్పించు.

క. —కిలెడసిన జంత్రము, వడువునఁ బడవేసె నతని వాసవి యధిపా.
ద్రోణ. 3-79; ద్రోణ. 1-371

ఎడపెట్టు; ఎడవెట్టు దే. స. క్రి. (√ఎడవడు)

1. విడుచు, విడిచిపెట్టు.

గీ. దినము లెడపెట్టి కుడుచుచు. అను. 4–148

క. గెలుపును నోటమియనునవిఁ, గలుగవె యెడపెట్టి యెట్టి ఘనులకు నిమ్మైఁ, బలుకుదురే తగువారిం, తులువా నీకులము గుణముఁ దోఁచెం బ్రజకున్. ద్రోణ. 4_289

(ఎడపెట్టు = ఒక దానిని విడిచి యొకటి ఒకటి తరువాత నొకటి ఎడు పడి అని భావము).

2, అడ్డుగాబెట్టు, మితిగాఁ బెట్టు.

ఆ. గురుని ప్రతిన వింటె వెరవువ లావునఁ జేసి దీని బొంకు సేయవలయు నెలుఁగు మతఁడు నిమ్ము నెడవెట్టి పలికిన, వాఁడు గానఁ జెప్ప వలనె నీకు. ద్రోణ. 1–116

వ. అనిన విని కుటిలంబగు నతని యభిప్రాయంబునకు రోసి యస్త్ర గురుం డవ్వరంబునకు నేమేనియు నెడవెట్టి యిచ్చువాఁడుగా నూహించి. ద్రోణ. 1–112

శ్లో. తస్య జిహ్మ మభిప్రాయం జ్ఞాత్వాద్రోణోఽర్థ తత్త్వవిత్,
తం వరం సాంతరం తస్మై దదౌ సంచిత్య బుద్ధిమాన్.
సం. భార–ద్రోణ. 12–19

ఎడపొందు దే. వి.

మనసు తగిలియుండుట.

క. వలయుని దెస మాలిని చూ,డ్కల తెఱఁ గెడపొందుఁ దేలిపెడుం గంటిరె వీ,రలు వచ్చిన సమయంబున, దలఁపఁగ నొక్కటియ యవ్విధం బెట్లొక్కొ. విరా. 2-200

ఎడమ దే. విశే.

సవ్యము, డాపలిది.

ఉ. ధర్మము మాని యూరులు గదం బొడిచేసిన యంతఁ బోక దు,ష్క ర్ముఁడు వాయుజుం డెడమకాల శిరంబుఁ దన్నె సౌప్తి. 1-221

ఎడమడియు దే. అ. క్రి.

సమయము దాఁటిపోవు, అదనుచెడు.

క. కురుపతికి జయము గోరెదు, గురుపుత్త్రుఁడు మున్న యేలొకో యిటు తటికిం, బోరక యెడమడిసిను మఱి వెరవుం జేవయును జూప వేడుకపడియెన్. సౌప్తి. 1-207

ఎడమడుగు; ఎడమడువు క్రి. విశే. (ఎడమ + అడుగు)

1. వ్యత్యస్తము, తాఱుమాఱైనది.

క. నడిపింపఁగఁ బొడిపింపఁగ, నెడమడుపై కలఁగినప్పు డేర్పఱుపఁగ నేఁ, గడు నేర్తుఁ బేర్చువాఁడగు, కడిమియు నీ సైన్యమునకు గొనెవ గాదే. ఉద్యో. 4-214

2. విపరీతము, విరుద్ధము,

క. పొడవునఁ బ్రాయంబునఁ గడుఁ,గడిది బలంబునను జూడఁగా నసదృశు వీ,కొడుకని యాతని వెంతయు, నెడమడుగుగఁ జూప దెత్తె యిందఱు నగగాన్.

వ. ఇట్టి లోకవిరుద్ధంబులకే మోదుదు మయుక్తంబులయిన పలుకులు పలుకక. ఆది. 4-100, 101

ఎడమిచ్చు దే. అ. క్రి.

అవకాశమిచ్చు.

తే. అతిథులకు నెడమిచ్చి యాహారములను, భక్తివాత్సల్యములలోనఁ బంచిపెట్టి. ఆశ్వ. 2-170

(ఎడమిచ్చి = అతిథ్యమిచ్చి అని ఇక్కడ భావము)

**ఎడము** దే. వి.

1. నడిమి భాగము. మధ్య ప్రదేశము.

సీ. కవట లోఁదొంటితోఁ గదియుచు నెడములు మ్రింగి ప్రబ్బఁగ సొంపు మిగులు వాని. విరా. 1-162

2. చోటు, స్థలము, అవకాశము.

ఆ. అనఘ నీ ప్రయత్నమున నా శరీరంబు, పొదలె నిందు నాకు మొదల నెడము, పొలఁగట్లుగాన మేలుగ నొండొక యెడకుఁ గొంచుఁ బొమ్ము కదఁగి నన్ను.

వ. అనిన నతం డాజలచరంబులఁ గైకొనిపోయి యొక్క బావియందు విడిచిన నది యెప్పటి యట్ల యక్కజంబుగాఁ బొదలి తనకు నవ్వాపియందు నవకాశంబు పర్యాప్తం బగుటం జెప్పి యతనిచేత గంగమడుపున విడువంబడి కాలక్రమంబున నచ్చోటఁ దిరుగం బట్టు చాలకున్న నతం డెత్తికొనిపోయి సముద్రంబునం బెట్టిన నది వాని కిట్లనియె. అర. 4-221, 223

శ్లో. అథ మత్స్య మనుం దృష్ట్వా పునరేవాభ్యభాషత,
భగవన్ సాధుమేఽద్యాన్యత్ స్థానం సంప్రతిపాదయ.

సం. భా. అర. 147-14

సీ. గరుసులు గడవంగఁ గదలి యల్లల్లన, యెత్తుచు నెడముల మత్తరించి. అర. 4-228

**ఎదమేను** దే. వి.

వక్షస్థలము.

సీ. ఎడమేని నెత్తావి సుడియంగఁ బయ్యెద, సగము దూలించి పైముగుడ దిగిచి. విరా. 2-64

**ఎడయగు** దే. అ. క్రి. (√ఎడ)

దూరమగు.

చ. అను లెడయాటగాంచు నెఱిపాలిక. విరా. 2-247

**ఎడయాట** దే. వి.

సమీపమునఁ దిరుగాడుట.

చ. జను లెడయాట గాంచు నెఱి సాలక. విరా. 2-347
(ఇది పాఠాంతరము)

ఎడయిచ్చు దే. అ. క్రి.

1. గడువొసఁగు, వ్యవధి యిచ్చు.

ఉ. ...న్యాయుఁడ్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె నీ-
వెల్ల వెఱుంగు దివ్వ డెడయిచ్చుట యుక్తము నాకుఁ జూడగన్.
ఉద్యో. 1-165

2. అవకాశ మొసఁగు.

క. వగపున నెడ యీకుము నెవ్వగఁ గుందిన మానవుండు వైరుల
చేతం, దెగుగాని తనదు కార్యముఁ, దగ నొనరింపఁగ లేఁడు తగు
నే వగవన్. ద్రో. 2-357; అది. 5-144

3. తావొసంగు, చోటిచ్చు.

క. సీతయ్యె ననుచు నల్లన, యాతని శయనమున కరిగి యతఁడెడ
యీఁగా, నా తల్పంబున నొకదెసఁ, బ్రీత హృదయయై శయిం
చెఁ బృథ్వీనాథా. అను. 2-13

ఎడయుడుగు దే. అ. క్రి.

నడుమ విరమించు, విశ్రాంతి తీసికొను.

వ. భీమజరాసంధు లెడయుడుగక యొండొరులం బట్టియుఁ గిట్టియు
నడిచియుం బొడిచియుఁ దాచియుం ద్రోచియు మహాయుద్ధంబు
సేయుచు. సభా. 1-200

ఎడరు దే. అ. క్రి.

విఱుగు, భగ్నమగు.

చ. తడయక ఘోరదర్శన సుదర్శనపావకుచే దహింపఁగా, బడి పర
మేశ్వరోగ్రశరపావకదగ్ధ పురత్రయాభమై, కొడిరి ధరిత్రిమీఁదఁ
బడియెం దెడి సౌంభక మంత సాల్వుఁడుం, బడయె మదీయ చక్ర
పటుపాతరయంబున రెండు వ్రయ్యలై. అర. 1-198

వి.

1. భంగము, అవమానము.

చ ...మానినికిం దమఁదాన కాచికొ, లొఁగవిన దానఁజేసి సభఁబెట్టెము
దక్కినఁ బాండునందనుల్, ప్రతికిరి గాక యయ్యెడరు రాచకొ
మారుల కోర్పుఁబట్టదే ఉద్యో. 1-348

2. కీడు, హాని.

క. ఈనలువురుదక్కఁగ మగ,పేరల వొక్కొరుసకైనఁ జేడ్పడని
భటుం, గానం జెవి కెవరైనం, బూని తలఁగు నతఁడమావె పురుషుం
డెందున్. విరా. 2-231

ఆ. పుత్రదార బంధుమిత్రగ సక్తుఁడు రొంపిఁ, బడిన గజముచంట్ల యె
డరు వొందు, భోగజాలపరుఁడు వాగురాజాల సంప్రతిత మృగ
ఋషముల భంగిఁ దలరు. శాంతి 6-318

3. యుక్త సమయము, అదను, తఱి.

ఆ. తలఁపఁ గ్రూరమతులు దార్తరాష్ట్రులు గదు, వెగ్గుపేయఁ జూతు
రెడరు పేచి అర. 6-194

4. ఆపద

వ. ఇట్లు విరథుండును వికల హాసుండునునై విషణ్ణుండగు నన్నర
నాథుఁడు వెడంగగుటం గటకటంబడి యాకంకటంబు నిష్ఫలంబను
బుద్ధిం బుచ్చివైచి యొండొక కవచంబు దొడిగె నయ్యెడను గనుం
గొని శీఘ్రంబునం దత్సైనికోత్తములు చతురంగ బహుబలంబు
లతోఁ గలిసి కవ్వడిం జుట్టుముట్టె. ద్రోణ. 3-209

శ్లో. తం కృచ్ఛ్రామాపదం ప్రాప్తం దృష్ట్వా పరమధన్వినం,
సమావేతుః పరిప్సంతో ధనంజయ శరార్దితమ్.

సం.భా ద్రోణ. 108-32

ఎరలు వి. ఎడ

1. తావు, చోటు.

వ తనయొద్దంగల యోధవీరు లెయ్యెడల లేమి దెల్లంబయినను
మాకుఁ జేదోడు ధర్మంబు గలదు. ఉద్యో. 1-377

వ, మీరెల్లను వలయునెడల నిలిచి భీష్మునకుఁ గావలిగావలయు.

భీష్మ. 1-174

సీ. ఉన్నతంబులయి యెడలెక్కుచు. అర. ౩-౩౧౨

తే. నాలుగే యెడల మాత్రఁ గన్నదానం దృప్తుండనై యున్న మేలు. శాంతి 1-58

క. నాయట్లువడిన యంగన లేయెడలం గలరె. శాంతి. 1-58

ఆ. జలములున్న యెడలు వెలయఁజూచి, యనమవస్థలంబులని జను
 లెఱుఁగక, యుండునట్లుగా మయుండు సేసె. సభా. 1-12

2. సమయము.

తే. పఱియ వాపంగఁ దునియఁగా విఱువ వలయు, నెడలఁ గాళ్లఁ
 జేతులఁ దొడలఁబట్టి, కడఁగి యమువుగఁజేసి ప్రొయ్యెదుఁ గాని,
 కత్తిగొడ్డలి యతుగ వేఁ గట్టియలకు. విరా. 1-78

ఆ. అవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములు గాఁగఁ,
 జలుపవలయు నృపతి గొలువున్న యెడల శాహిరములైనఁ
 గెలని కెగ్గులగుట. విరా. 1-187

విణ.

అధికము.

క. దుర్జనునకు సంపద లెడలయ్యెను నాతని, మొదలిటి సంపదలతో
 సమూలంబు చెడున్. సభా. 2-202

ఎడల అవ్య. ద్రుత. ఎడ[1]

విషయమున, సందర్భమున.

ఆ. కథ జగత్ప్రసిద్ధ గావునఁ బూర్వపర్యార్థ యుక్తి సేయునట్టి యె
 డల, యత్నమించుకంత యయినను వలవదు. విరా. 1-42

క. శిలచేవ మ్రానుదెప్పగ, జలనిధిఁ గడవ దొరకొనిన చాడ్పునఁ
 బాత్రంబులు గాని యెడల దానంబులఁ బాపము విస్తరించు
 బుద్ధి దలఁచినన్. శాంతి. 1-330

ఎడలఁద్రోచు దే. స. క్రి.

ఎడలించు, తొలఁగద్రోయు, పరిత్యజించు

తే. మేలు గదువేగ దేయరు శాంపాశబద్ధులై యేమరుటఁజేసి పడఁతి

మనుజు,లింత యెఱుఁగుట సంసార మెడలఁ ద్రోచు,నట్టి విసు
వుటఁ బుట్టించు నది హితంబు. అను 5-289

**ఎడలించు** దే. స. క్రి. (√ఎడలు) ఎడలఁజేయు

1. తొలఁగించు, ఊడఁదీయు.

క. బంధుశతంబులు శౌర్యమ,దాంధములై శక్తిసంపదాభీలతమై, సింధుర సదృశత మున్నను, సంధుల సంధు లెడలించి చంపుదు రతనిన్. విరా. 1-325

వ. ఇట్లుత్తరుండు సమారూఢ శమీవృక్షుం డగుటయు నరదంబు పయి నిలుచుండి పాండవ మధ్యముండు వేవేగ విడువు మనవుడు నతండు నాయుధసంచయ బంధం బెడలించిన. విరా. 4-118

వ. ...ధర్మతనయుండు దన నికేతనంబున కరిగి యచట సకల పరిజనంబులుం దానును సన్నాహంబు లెడలించి శూన్యాకారులై యున్న సమయంబునం దమ్మునిడస కూరిమి వారం గూరిన వగ పెఁపున ధైర్యంబు సొంపఱి వివర్ణవదనుం డగుచు నిట్లనియె. ద్రోణ. 2-187

2. త్యజించు, విడుచు.

సీ. పన్నిన పగఱపై సన్నాహమంతయు, నెడలించి నడచుట యెట్టు లొకొ. భీష్మ. 1-154

తే. తాను గ్రోధాదు లెడలించుఁగాని ముక్తి,దెచ్చి యీదొక తంగి ముక్తికిఁ బథంబు,నగుట ననపాయమగు నుపాయం బనంగ, వలపె నీ నేర్పు పే రిందువంశవర్య. శాంతి. 5-871

3. వదల్చు.

సీ. కీలుకాఁ డెడలింపఁ గొడసిన బొమ్మల, కైవడిఁ బటుతురంగ వ్రజంబు. ద్రోణ. 3-62

**ఎడలు** దే. అ. క్రి.

తొలఁగు.

సీ. ...ద్రుపద, తనయా సుతభద్రలు ధర్మజుం డనుజు లా,శిశువు సంజీవితుఁ జేయకున్న -అ- బ్రదుక రన్వయమున కుదక పిండప్రదా,

నంబు లెడలు. అశ్వ. 3-170

చ. అలసత యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభుముందఱ నున్న వా, మిళిత సుగంధ బంధురసమీర వశంబునఁ దూలి వాలపై, వలువెడ లన్ బయల్పడియె వల్గుకుచంబులుఁ గటయుగ్మమున్, లలిత కృశో దరంబుఁ దరళ త్రివళీయుత రోమరాజియున్. ఆది. 4-43

2. వడలు.

వ. పయిఁబడిన వీరులం గీలెడలిన యంత్రంబులుం బోలె నేలఁగూల నేయుచు. భీష్మ. 3-187

క. అరయ నెందుమ గౌరవభారం బెడలంగనీక పాతివ్రత్యాచారము మై వర్తింతురు, సైరంధ్రీ జాతివారు సౌజన్యమునన్.

విరా. 1-112

3. తగ్గు, ఉడించు, నశించు.

సీ. కాళ్ల కొప్పిద మాఁదుకట్టుబ్జ్వాలము నేయంగ సంకులం బావు లంద మెడల, విరా. 1-228

క. గురువలుక వాక్సత్త్వస్ఫురణ మెడలెనండ్రు జనులు బొంకిరి.

ఉద్యో. 2-266

క. దర్పములై నట్టులు సమ్యగ్దర్పము లెడలె మండె వాయుధ చయ మున్. విరా. 4-88; విరా. 5-208; విరా. 1-294

4. విఱుఁగు, తునుఁగు.

సీ. ...చాపము సిడమెడల రెంటఁ జేసిన. భీష్మ. 3-19

5. చెడు.

క. అంబయు నట పాశ్చాలికడకుం బోయిన నతఁడు భీష్ముకోనిపోయిన దా, నిం బరచుం గైకొన ధర్మంబే తన్నాత్ర్య మెడలె మగువా నీకున్. ఉద్యో. 4-278

6. విభిన్నమగు.

(భీష్ముఁడు) క. కురువంశ మెడలం బర్చినఁ, బరమోపాయమున మగుడఁబడసెన్. ద్రో. 2-111

7. భిన్నభిన్నమగు.

క. సేనాపతిత్వమునకుం, బూని యొకఁడు నడపకున్నఁ బోడవడఁగదె
యీ,సేనయనిఁ గర్ణధార వి,హీనంబగు కలము జలధి నెడలిన
భంగిన్. ద్రోణ. 1-60

8. వికలమగు.

చ. తనువు ఘనాస్త్రశస్త్రములు తాఁకిన నొప్పిని దప్పిపుట్టెనా,మనము
వశంబు గాకెడలె మాటల చందము చూడ మీరు ద,స్సినయటు
లున్నవారలు. శల్య. 2-83

9. పగులు, భిన్నమగు.

సీ. ...నృప వినుము కడవకు సారెపై, నమర మృత్తిక యిడునపుడు విరి
యు,టయు వెరవారఁ బట్టఁగరాక చెడుటయు, వాని యెత్తెడు
నెడ వ్రయ్యుటయును -తే- నెత్తియొకచోట డించిన నెడలుట
యును, నెండి యవియుటయును నావమిడినఁ బగిలి,పోవుటయు
వాడు జనులచేఁ బొలియుటయును గలుగు గతిమేనికెట్లును గలుగుఁ
జేటు. స్త్రీ. 1-84

10. వృథయగు, వ్యర్థమగు.

వ. ...అవ్వాలమ్ములు నమ్మెయిన వమ్మైన విషాదంబున వాసుదేవుం
డు వాసవి కిట్లనియె.

క. మున్నెన్నఁడు నివ్విధమేఁ, గన్నదిగా దమ్ములెడలె గాండివములా,
వు న్నీ భుజముల శక్తియు, మిన్నకపోఁ జిత్రమిది యమిత్ర
ధ్వంసీ. ద్రోణ. 3-197

11. భేదమును బొందు,

తే. ఈగి మన్ననఁ గలఁగంగనీక పొదివి, యధికముగ గణముఖ్యుల
నాదరించి, పనులు గొనువది తమలోనఁ బాయకుండఁ, బ్రోవు
లెడలిన రాజ్యంబు పొలుపుదప్పు. శాంతి. 3-40

12. చచ్చు.

ఆ. గొడ్డు బతుగుఁ దెవులుగొంటఁ బ్రేగె పెడలిన, దాని నెచ్చెలిని

నూనమైన, యట్టి దాని వొకట నాయాసపడియున్న, దాని నీరు
గో ప్రదాన విదులు. అను. 2-402

క. కడుఁగూర్తుఁ గవ్వడికి న,య్యొగ్గదలు గలుగ నేను బ్రదికియుండు
దుఁగా కె,క్కడి బ్రదుకు నాకు నాతం,డెడలిన నప్పార్థుఁగాకు నెల్ల
విధములన్. ద్రోణ. 2-349

సీ. శరణన్న మ్రొక్కినఁ దురగాళి యెడలిన వారుతోడఁ బోరుచు
నున్న నెట్టి -ఆ- పగతునైనఁ జంపఁదగదు. శాంతి. 2-420

13. విఘ్నమగు, భంగపడు.

ఆ ఏను గర్తననుట యెఱుఁగమి దాఁగర్త,యేని నేమిఫలము నెడల
కుండి, సకల కర్మములును నాచరించుచు నున్న,వాఁడె కాన
కర్తగాఁడు దాను. శాంతి. 4-376

14 లయించు, హరించు.

క. ఆతనిఁ బొదువు సంకల్పం, బతుల జ్ఞానంబు దాని నడచును విజ్ఞా,
నితఁ దద్బలముఁ బిరుష దే,హితమం గాలంబు వరుస నెడలం
జేయున్. శాంతి. 5-76

స. క్రి.

విడుచు.

శా. ఉద్యద్విక్రములైన యీ ద్రుపద మత్స్యోర్వీపతుల్ విన్ను సం,
పద్యోగోజ్జ్వలుఁ జేయఁబూని కడఁకం బ్రాణంబు లీ నున్న నీట్లు
ద్యోగం బెడలంగ నేమిటికి నీ కుర్వీశ. భీష్మ. 2-18

తే. క్రియ లహంకారమునఁ గల్గుఁ గ్రియలవలన, దేహసంబంధ మెడ
లక తిరుగవలయు. శాంతి. 4-291

క. ... ఆ తం,డులు మెడలక మఱియు నేని నధికగయమునన్.
భీష్మ. 3-306

ఆ. ... మా,తలి ప్రతోద మెడలి ధరణిఁబడియె. అర. 4-68

ఎడపేయు దే. అ. క్రి.

1. జాగొనరించు, ఆలస్యము చేయు.

(కీచకుఁడు సుదేష్ణతో)

ఉ. బుద్ధులు సెప్పుచెల్లి నటుపో విడు మెమ్మెయి నైన సౌఖ్య సం,సిద్ధి యొనర్పు వాఁడ నెడసేసినఁ దాపము రూపుమాపు వా. వృద్ధియ కోరుదేని నవివేకివి నీవని నన్ను నిట్లసం,బద్ధము లైన వాక్యములు పల్కఁగ వే పిలిపింపు కోమలిన్. విరా. 2-76

క. కొడుకుల నిందఱ నిల్లడ, యిడి పరలోకమున కరిగె నెడసేయక యి,ప్పుడ వీరలఁ గురు వృద్ధుల, కడకుం గొనిపోవవలయు గజపురమునకున్. ఆది. 5-148

వ. పుత్త్ర మిత్ర బాంధవ బలసంపన్ను లైన ద్రుపదు నొద్దఁ బాండవు లుండు వా రైన వారలం గృష్ణ బలదేవులు యదువృష్ణి భోజాంధక వర్గంబులతో వచ్చి కూడిన నెవ్వరు సాధింప నోపరు గావున నెడసేయక ద్రుపదుండు పాండవుల విడుచునట్లుగా భేదింతము. ఆది. 8-22

2 తప్పించుకొను.

వ. సత్పాత్ర దానక్రియ నిర్వర్తించి తత్ఫలంబు మున్ను దనకు గోదాన ఫలంబిచ్చిన యతని కిచ్చు వాఁడయిన నతండును గొను వాఁడయి యుండి కొనక యెడసేసి తిరుగందిరుగ. శాంతి. 4-156

తే. అమరి యున్నాఁడ వా బారి కగ్గమైతి, పడుదు గాకింక నీకు నెక్కడకుఁ బోవ, ఎచ్చు నవపుడు విదియేల పెచ్చు పెరిఁగి, యాల మెడసేసి యనిలజ ద్రేలె దిట్లు. శల్య. 2-246

స. క్రి.

3. పరిత్యజించు.

క. తమియింప వలయు నొకఁ డెఱుఁ,గమి నీమే నన్న నంతఁ గట్టఁటఁ బడి ఘూర్ణమణుని కార్యస్థితి చిత్తములం దెడసేయునట్టి తరమే మీరల్. విరా. 4-325

4. ఉపేక్షించు.

ఆ. పెల వృద్ధరాజు లెడసేసిరో పార్థు, నరిగి నెడక మనము నరిగి యతని, యున్నచోన ప్రీతి మందర మిందుండ, వేల యమచుఁ

పౌరులెల్లఁ దెరలి. ఆది. 6-142

5. త్రోసివుచ్చు, తిరస్కరించు.

వ. కావున నిష్కార్యం బెడసేయక యొక్కరుం జనుపవలయు.
ఉద్యో. 1-20

చ. కురువంశ వర్య నీ,వలుగక విన్ము కుక్కలకు నావసథంబు
త్రివిష్టపంబునం, గలుగునె నీకు నిష్ఠురత గల్గదు దీనిఁ బరిత్య
జించినం, జలము గొనంగ నేల శుభ సంగమనం బెడసేతఁ గృత్యమే.
మహా. 1-54

**ఎడసొచ్చు** దే. అ. క్రి.

1. జాగగు, ఆలస్యమగు.

ఉ. వీనులఁ దియ్య మెక్క మును విన్కిఁ బరస్వర రాగవృత్తిలో,
మానినఁ జాచు వేడుకల మచ్చికలూరెడు నెమ్మనంబు లం,చ్చొ
నొక యింతసేపు నెడసొచ్చుట కోర్వక యుంద మన్న య,మ్మా
నినియుం గుమారుఁడును మారవికారము లంకురింపఁగన్.
విరా. 5-398

2. అడ్డపడు, అడ్డము వచ్చు.

వ. అప్పాంచాలసూనుండు సురనదీసూను మార్కొనుటయు మద్ర
నాథుం డెడసొచ్చి మహానలాస్త్రంబు ప్రయోగించిన.
భీష్మ. 3-55

క. అని మామఁ బలుకు పలుకులు, విని యశ్వత్థామ క్రోధ వివశుఁడయి
గ్రక్కన వాలువెఱికికొని కర్ణుని దెసకుం గవియ భూవరుం డెడ
సొచ్చెన్. ద్రోణ. 5-106

ఆ. నృపతి తోడఁ గూడి కృపుఁడును నెడసొచ్చె. ద్రోణ. 5-107

**ఎడు** అవ.

తద్ధర్మార్థకములందు ప్రథమైకవచన 'ము' వర్ణకము పరమైనపుడు ఆగమముగను, తృవర్ణకార్థమునందు ప్రత్యయముగను వచ్చును.

1. వర్తమాన కాలమును దెలుపును.

క. దిగ్గజములు మిన్నకయును, మ్రొగ్గెడు నుత్తమ తురంగములు

తాప్పజలం, బగ్గలము విడుచుచున్నవి. తగ్గెదుఁ గారణము లేక
తడఱిడి పడగన్. విరా. 4-87

2. తాచ్ఛీల్యమును దెల్పును.

క. కడు నమరక్తియు వేర్పును, గడఁకయుఁ గలవారి నుఱక కడనఁగ
నెగ్గుల్, వొడిచెదు వివేకశూన్యుల, కడ నుండెదు వంతకంటె
గష్టము గలదే. ఆది. 3-149

3. భవష్యత్కాలమును దెలుపును,

వ. ...నాగముఖ్యులనెల్ల వాసుకి చెలియలైన జరత్కారువునకు జర
త్కారుండను మహామునికిం బుట్టెడు వాఁడధికతేజస్వి యాస్తీ
కుండను మహాముని జనమేజయ సమారబ్ధ సర్పకుల ప్రళయంబు
వలన రక్షించును; ఆది. 2-137

4. భూతకాలమును దెల్పును.

సీ. కరుల ద్రుంచెడువేళ గిరుల దున్నాడు సం॥ కందను కైవడి గాన
వచ్చు. శల్య. 1-282

క. తడఁబడఁబడియెడు రవమును, బడి కాలెడు రవముఁ గాలి పలు
దెఱఁగుల ద్రవ్వెడు రవమును దిగ్వలయము, గడుగొని
ద్రమోయించె నురగకాయోత్థితమై. ఆది. 2-215

ద్రు.

5. ఆశీశ్శాప సంప్రార్థనములందు క్రియా ప్రత్యయములకు వచ్చు ఆదే
శము. దీనికి అచ్చుపరమైనచో 'మ' వచ్చును. ఆశీస్సునకు.

క. ...యయాతికి నీకును నయిన యీ వివాహమునం దపక్రమ
దోషంబు లేకుండెడు మని వరంబిచ్చి. ఆది. 3-169

శాపమునకు.

క. పతిహీనలైన భామినులు, లతి ధనవతులయ్యుఁ గులజలయ్యును
ననలంకృతులయ్యేడు మాంగల్య రహిత లయ్యెదుఁ గృపణ
వృత్తి నిటిమొదలుగాన్. ఆది. 4-229

ఎడ్డ ఎడఁద

హృదయము.

క. వికచ ముఖుఁడగుచు శాత్రవులకు హితులగునట్టి వారలం గని
భూపాలకుఁ డెడ్డ కత్తెరయు నాలుక లెల్లమునై మనంబులం
గన వలయున్. శాంతి. 3-268; శాంతి. 6-335

తే. వీఁడు దనకంచెః బ్రాజ్ఞుండు లేఁడు జగతి, నెందునని సంతతమ్ముఁ
దానెడ్డఁ దలఁచుఁ, దాన నిట్టయ్యెనంచు బ్రేమా నిరూఢబుద్ధి
నరుగుచున్నుండె నప్పురుష వరుఁడు. మహా. 1-36

**ఎడ్డ ఎడఁద**

హ్నాయము.

ఉ. ఏనొక పాపభావమును నెడ్డఁ దలంపకయుండు నట్లుగా,
అర. 2-215

**ఎత్తించికొనిపోవు** దే. స. క్రి. (√ఎత్తు)

మోయించుకొని పోవు.

వ. అచిరకాలంబునకు నిమ్మందు విహగపతిం బుత్తెంచి యెత్తించి
కొనిపోయి. శాంతి. 6-374

**ఎత్తించు** దే. స. క్రి. (√ఎత్తు)

1. పైకిలేవదీయించు (పతాకము మొ.) పైకి నెగురఁ జేయు.

వ. సన్నాహ సౌందర్యము నొంది శాలధ్వజం బెత్తించి మెఱసె.
విరా. 4-287; శల్య. 1-193

2. నాటించు. (డేరాలు మొ.) వేయించు.

వ. ...విశాల రమణీయంబైన బహిరంగణంబునం బటకుటీరం బెత్తించి
విడిసి. ఉద్యో. 3-147

**ఎత్తికొను** దే. అ. క్రి. (√ఎత్తు)

పూను, సిద్ధపడు. యత్నించు.

తే. ఇంత పాపంబు సేయంగ నెత్తికొందు. మయ్యొ రాజ్యలోభంబున
సఖులబంధు, జనుల వధియింపఁ దొరఁగితి మని రథంబు, మీఁదఁ
గూర్చుండఁ బడియెఁ జేయూదికొనుచు. భీష్మ. 1-188

"శ్లో॥ అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్."
సం. భా. భీష్మ. 1-45

అ. ఎట్టికష్టుఁడైన నిట్టి పాపముసేయ, నెత్తికొమనె ధరణి నీవుదక్క.
అర. 6-252

స. క్రి.

1. గ్రహించు, పట్టుకొను.

క. వేఁటాక్క విల్లెత్తికొని — విరా. 5-102

ఆ. అసురగర్మతేరి యందున్న శునగదా, దండ మెత్తికొని యుదగ్ర వృత్తి, జరతదేవులఁ దయ్యుఁ దరుజవయుస్కున, ట్లనని కుటిల పోయి యతని గ్రేసె. — విరా. 8-217

2. వహించు, మోయు.

గీ. వాయువేగంబుకైన తద్వాహనముల, భీమ్ముతేరెత్తికొని పాతెఁ బృథివి యద్రువ. — భీష్మ. 2-82

(భీముఁడు ఘటోత్కచునితో)

తే. అబల యిది తపస్వాత నిత్యాధ్వగమున, ఖన్నయైనది గజరాజ ఖేలగమున, దీని నీ వెత్తికొని చనుదెమ్ము మా కుమిపమున నని సుతు నియమించె నపుడు. — అర. 8-808

వ. వాఁడు బిత్ర్వచన చోదితుండై యిమ్మార్గం బతిఃరువశిలా విషమంబు పాదచారుల కగమ్యంబు గావున మిమ్ముందఱ నెత్తికొని యాశ్రమంబున నరిగెదనని ధౌమ్య పాండవ ద్రౌపదులం దా నెత్తుకొని బ్రాహ్మణుల నెత్తికొనం దిన రాక్షస బలంబులం బంచె. — అర. 8-307

3. నెత్తి బుజములు మొదలగు వాని మీఁదఁ బెట్టుకొను.

క. మహనీయ బహుళ పూజా, సహితంబుగ భోజనంబు సంతృప్తిగ న,మ్మహిఖాత్ముండు నడపి దుర్వహభారమునఁగఁ గనకరాశియు మణులన్.

చ. కుడిచిన పళ్ళెరంబున నకుంఠిత హర్షముతోడ నిచ్చినం, గడుమద మంది యెత్తికొని గాఢతరంబునం మార్చి మోవఁగా, మెడయును వీఁపు మూఁపులును మిక్కిలి గొవ్వనఁ గొంకుపోవ నెక్కుడు

వ. ఇట్లు పితామహు నెత్తికోలునకుం జిత్తంబు వికసిల్ల నమణ సహితం బుగా వితనిం బరివేష్టించి, భీష్మ. 1-108

క. తరతరమ ప్రజలఁ దునిమెఁదు, వరునప్పటి యెత్తి కోలునకు సుర విద్యాధరఖేచరులును భీతిం, బొరసిరి తమదెసకు నేమి పుట్టునో యనుచున్. (ఇట 'విజృంభణము' అని భావము) విరా. 5-64

2. సంకల్పము, ఇచ్ఛ.

ఉ. ...గద పందువు వేయఁగోరు వా, దయ్యపు నెత్తికోలు దుది దాఁకుట గాదె భుజంగ భంజనా. ఉద్యో. 3-67

క. పదివేలఁ బంపఁగా నో,పుదు నేనను నెత్తికోలు పుట్టిన యది నీ, పదునొకఁ డక్షోహిణులను, బదురున నడిపింతు నెదిరి సైన్యము గలతున్. ఉద్యో. 4-406

వ. అలసి డస్సి యెప్పుడెని మీర లద్దమాడుదు రప్పుడ కపింతు నిట్టిద నా యెత్తికోలు. అను. 2-381

3. పొందుట.

ఉ. ...నీ, కిసరమెత్తికోల్ గలిపి యిప్పుడు కార్యము దప్పఁజూచు నీ, వారలు ముట్టవచ్చిన నశక్యము వంతకు జాలరుఁజుమీ. ఉద్యో. 3-385

ఎత్తిచను దే. అ. క్రి. (√ఎత్తు)

దండయాత్రకుఁ బోవు.

సీ. చిగురులతో సంధివేసి యంబుజములు, పైకెత్తి చనునట్టి పదతలములు. విరా. 2-67

ఎత్తినడుగులనుండు దే. జాతి. (√ఎత్తు)

ఎత్తిన పాదములనుండి, మునివ్రేళ్ళమీఁద నిలఁచు (ప్రయాణమునకు సంసిద్ధముగా నుండు)

తే. గొంతి కొండ్రు రెల్లను గురువరేణ్య, యెత్తి నడుగుల నున్న వారత్తపస్వి నీవరిష్ట దర్శింపంగఁ బోవఁగోరి, యనియె నట్టు లయ్యిరువురు నాడుటయును. ఆశ్ర. 2-25

శ్లో. అగ్రపాద స్థితం చేమం విద్ధి రాజన్ వధూజనమ్.

సం.భా. అశ్వ. 24-17

**ఎత్తిపట్టు** దే. స. క్రి. (√ఎత్తు)

క్రిందఁ దగులకుండులాగున పైకెత్తియుంచు.

క. పార్థుం డట్ల చేయుదునని గాండివంబు పుచ్చుకొని మఱియు నమ్ము గొని మూఁడు వాలమ్ము లభిమంత్రించి పెడతలఁదాఁకి యెత్తి పట్టుకొని పుంఖంబులు భూమి మోచినిలుచునట్టుగా జేసినం దాత ప్రీతుండై.

భీష్మ. 3-422

**ఎత్తిపెట్టు** దే. స. క్రి. (√ఎత్తు) దెప్పిపొడుచు

తే. ...అబ్బురంగఁ బిక్కటి ముకుందు తోడవేను మీ రెమ్మెయి యూధి కెక్క. వెలుగఁగఁ గోరుట కతమునఁ దలఁచి దాని,నవిలసుతుఁడెత్తి పెట్టి నేమఁగఁగఁ గలదు.

అశ్వ. 1-168

**ఎత్తిపోవు** దే. అ. క్రి. (√ఎత్తు)

దండు వెడలు, యుద్ధమున కరుగు.

వ. అనిచియు నెత్తిపోయి గోధనంబుల గ్రహించిన

విరా. 3-117

**ఎత్తివచ్చు** దే. అ. క్రి. (√ఎత్తు)

తే. ...ట్టి యూనఁ బెఱఁబెట్టి పాండవులకుఁ దిగులు పుట్టింత మంతట దేశ మెత్తి, వచ్చి రేనియు నిర్జింపవచ్చు.

ఉద్యో. 3-391

**ఎత్తివిడియు** దే. అ. క్రి. (√ఎత్తు) దండెత్తి చనుదెంచు

దండు దిగు, యుద్ధమునకు సిద్ధపడు.

తే. ఎత్తి విడిసిన వారని యొల్లతప్పుఁ, బాండవులమీఁదఁ బెట్టిన బ్రదుకు గలదె.

ఉద్యో. 3-369

**ఎత్తివైచు** దే. స. క్రి. (√ఎత్తు)

పైకెత్తి క్రిందఁ బడవైచు.

ఉ. ...చ యమంగఁబట్టి చాళ్ళును చేతులు, వ్రేల మత్తగజను లీం మెఱయ, మట్టిఁలుపు నెఱయ మక్కున వాతము, సెత్తురొలుక మల్లు నెత్తివైచె.

విరా. 2-17

**ఎత్తిచె(పె)ప్పు** దే. స. క్రి. (√ఎత్తు)

ఉద్ఘాటించు, వెల్లడిచేసి చెప్పు.

వ. ...పాండవాగ్రజుండు వాని ప్రతిజ్ఞావచనంబు లెత్తి చెప్పి మొగ మోడ కదల్చిన. భీష్మ. 8-56

**ఎత్తు** దే. అ. క్రి.

1. కలుగు.

సీ. కొలువులోపల నిన్న కోపమెల్లెత్తినఁ, గలఁపక నిలిచిన ధైర్య మహిమ. విరా. 2-360

మ. అతులైశ్వర్య విభూతినొప్పు భవదీయంబైన రూపంబు సూ,చు తలం పెత్తెడుఁ బోలునేని దయఁ బతుః ప్రీతిఁ గావింపవే. భీష్మ. 1-206

క. అడుకులు దిన్నట్లగునే, కడుపునఁ గుల్లెత్తినపుడు. ద్రోణ. 4-89

క. కౌరవులు సేయు నవమతి, కారణముగఁ గోపమెత్తుఁ గర్ణుని వదవాం, భోరుహముం గనుఁగొన కమ,మారున్ వావశము గాక యంతన బుద్ధిన్. శాంతి. 1-18

2. (పోరుటకు) పూను, కడగు.

కి. నీ యనుజులు దివిజులకు న,జేయులు ధృతరాష్ట్రసుతులఁ దెలుచుట ప్రేఁగే, తోయజ నాళము గజము లీలాయత్తము గాదె యొత్తు మాహవమునకున. ఉద్యో. 4-112

3. దండెత్తు, పోరుటకై బయలుదేఱు.

ఉ. కౌరవసేన గాదు త్రిజగంబులు నొక్కట యెత్తి వచ్చినం,దేరు బృహన్నలా వశగతిం జరియించిన గెల్వవచ్చు. విరా. 4-22

క. బలవంతుఁడు పైకెత్తిన, బలహీనుఁడు ధనముగోలుపడిన యతఁడు ప్రము,చ్చిల వేచువాఁడుఁ గామా.కుల చిత్తుఁడు నిద్రలేక యుందురు రధిపా. ఉద్యో. 2-21

తే. ఎవ్వరిఁ గొని యతండు, కౌరవుంమీఁద నెత్తి రాఁగలుగువాఁడు. ఉద్యో. 2-168

సీ. వానయు సీతును వర్జించి ముందు వేసవి గాళ మున్న సస్యములవంటి,
లోద వెడు తలి నెత్తునది శత్రుసయి. శాంతి. 3-3

4. అతిశయించు, ఎక్కువగు.

క. దివ్వెన విఱిగినఁ బౌరులు, నవ్వుదురకు మేలుమేలు నను వాఁగకు
సి. క్రొవ్వలుగ దేనిఁ దలవదు, మెవ్విధి జనితేని నమచు నెత్తిన
ధీరన్. విరా. 4-71

ఉ. ఎత్తిన వేడ్కఁ గంధరము లెత్తి మొగంబులు సాఁచి...చిత్తజు తేఁ
రేలె విలసిల్లుచు జక్కవదోయి వేకువన్. ఉద్యో. 2-109

స. క్రి.

1. లేవదీయు, పైకిదీయు.

క. అని మనమునఁ దలపోయుచుఁ, దనతమ్ముని నల్ల నెత్తి దండది
దొరఁగంజను దెంచు నత్రుపూరము, కనుఁగవలో బ్రమింగి కొము
చుఁ గామిని పలికెన్. విరా. 2-70

క. పెనురొంపిలోపలను బ్రుంగిన ధేనువు నెత్తుపోలికిని.
శల్య. 1-158

ఉ. వంటిన కోశ భారమునఁ బ్రాణవిమోక్షము గోరి కంఠ దేశంబున
రాయి గట్టికొని సన్మనివాథుఁడు విశ్వామిత్రుఁడై, యంబుధిఁ
బొచ్చినం గడు భయంపడి వార్ధి లసత్తురంగ హస్తంబుల నెత్తి
పెట్టె దనసైకతతీరము చేర నమ్మునిన్.
ఆది. 7-119; విరా. 4-174

2. ఉన్నమితము చేయు, ఊర్ధ్వముగా నుండునట్లు చేయు.

వ. తమ కందువలు రోసి యెత్తిన మొదలును. విరా. 2-240

క. హయములఁ బూన్పుము రథమున, రయమున సిడమెత్తుము.
విరా. 5-42

ఉ. ఎత్తిన వేడ్క కంధరము లెత్తి మొగంబులు సాచి ... జక్కవ
దోయి వేకువన్. ఉద్యో. 2-109; విరా. 5-82

3 పైని బెట్టు, మీఁద నుంచు.

ఆ. నూత పుత్ర యితఁడు నాతఁల పెద్దమో. నెత్తి నమ్మియున్న

యిట్టిచోటఁ, బ్రాంతుపేయ వారుఁ గాదని స్థైరించి, యున్న
బ్రతికి తింక మూగకుండు. ఉద్యో. 4-251

శ్లో॥ సముద్యతోయమ్ భారో మే సుమహాన్ సాగరోపమః
సం. భా. ఉద్యో., 167-30

4. (అర్ఘ్యము, హవిస్సు మొదలగు వానిని) ఇచ్చు. సమర్పించు.

క. అమ్మంత్రము దనంగు హృదయమ్మున నక్కన్య విలిపి యాదిత్యుఁ గర్త్రమ్మెత్తి వారు నిమ్మ ప్రియమ్మున నీయట్టి కొడుకు నందుజమిత్రా. ఆది. 5-9

వ దివ్య ధిషణుఁ డగు ధిషణుఁడు గర్మ నిర్వాహక సన్నరపతితోఁ గనకై యెత్తిన పురోడాశ భాగంబు విష్ణు దెల్ల వేలుపులుంబోలె వారు దర్శన గోచరుండై కొనక యదృశ్యుండై కొనియె.
భా. 6-364

5 ఇచ్చు. ఒసఁగు.

ఆ. అట్టి యవసరమున నమ్మహీపతి యమ్మఁ దలఁచె నప్పుడే యజా బల విరోధి, మది విరోధ ముడిపి మసలక వచ్చి యుఱ్ఱాలు ప్రాణ మెత్తి ప్రమద మెసఁగ. శాంతి 1-271

6. చావు మొదలగు వాని నుండి ఉద్ధరించు, ఉజ్జీవింపఁ జేయు.

క. ... విగతాసులఁ దన, మృదు వచన ప్రశ్న మను నమృతమున నెత్తెన్. ఆది. 6-262

7. మోయు, వహించు.

వ. ... కృష్ణునిచేసన్న నర్జుని పనుపునం గనకరత్నమయంబగు నతని పాదపీఠం బతండు ప్రేల్చిన కాళ్లు దిగిచికొన నద్దాని ముద్దియ లెత్తి తెచ్చి వారుం బెట్టిన నేమను దానిం గరతలంబున నంటుచు ధరణీతలంబునఁ గూర్చుండె. ఉద్యో. 2-121

8. తీసికొను, గ్రహించు.

సీ. ఘన శరాసనముఁ బ్రదిఖండంబుగాఁ జేసి, వారాచ మొక్కటి వాఁడు మేన, వేఁటాశ నెల్లెత్తి వైపఁ బదునాలుగు, శాత బాణములఁ

శా-చాల సుతుఁడు, గళఁజాఁచెను. భీష్మ. 1-256

వ. ...విషమెత్తి క్రోలి యదియంగము వారట పెట్ట నమ్మెలం గివిసిన యట్ల. ద్రోణ 4-207

9. చేతఁబట్టుకొను, తైకొను.

వ. అంబికేయుండు ప్రసన్నవదనుండగుచుం బ్రతిష్ఠితంబులయిన కల శంబులలో నజ్జ్వలం బగు నొక్కటి ధౌమ్యుం డంది యానెత్తి యా భూపోత్తము నభిషేకించె శాంతి. 1-376

10. చేతులతోఁబట్టి పైకి లేవఁదీయు.

సీ. అనిరయె నప్పుడు పరమాహ్లాదమునఁ జనుదెంచి గంధర్వులు దేవ మునులు, మరుదశ్వి వసువులు మహితాదరంబున, దర్మెందు నింద్రుండుఁ దారు నమ్మ;హాత్ముని నెత్తి రథారూఢుఁగాఁ జేసి. మహా. 67

11. పూను, వహించు.

ఆ కారణంబు లేక కౌంతేయులకు బాల్య, మాది గాఁగఁ గీడె యాచరింతు, పుణ్యపరుల తోఁడఁ బుట్టువు లాయ్యెల, వైర మెత్తఁ దగునె వారి తోడ. ఉద్యో. 3-327

ఉ. ... అతం (భీముఁడు) డలుక నెత్తిక యాగద కాలదండ ము, ద్దామ విలాసుఁడై కురుకదంబములో విహరింపకుంచునే. ఉద్యో. 2-185

సీ. ... తారతమ్యముల్, వెరవునఁ బరికించి వేర మెత్త, వలయుట నెఱిగ్గి పలుకక యుండంగఁ, దగుట యూహించు టుత్తమంబు. అర. 1-78; ఉద్యో 2-69; ఉద్యో. 2-218

12. సంకల్పించు. తలఁచు.

సీ. ... తద్విపుల గుణోన్నతి పైఁ బక, దుర్యోధనుండు దుష్కారక మెత్తి - ఆ - దుర్ణయమున శకుని కర్ణ దుశ్శాసనుల్, గలసఁ బాండవులకు నలయ చేయఁ గడఁగె. అది. 3-12

13. పెట్టు. (తినిపించు.)

వ. శిష్టులైన పరిచారకు లత్తు లంగంబుల నీరికిందిగిచి భాజంబెత్తి

తడవి. ద్రోణ 3-305

శ్లో. పీతోపవృత్తాన్ స్నాతాంశ్చ జగ్ధాన్నాన్ సమలంకృతాన్.
సం. భా. ద్రోణ 112-55

14. పట్టి తీసికొని పోవు.

సీ. ఘన కాయ జవ సత్త్వ గజ కచ్ఛపములం బో, క్కెత్తున లీలమై
నెత్తె నతఁడె. అను. 1-270

15. అపహరించు.

తే కామ రసమున నతి తృష్ణుఁడై మనుష్యుఁ, డర్థ తృష్ణా పరి
తాంతరంగుఁడైన, గొఱియ నడవిలో నెత్తెడు కోలుపులియుఁ,
బోలె మృత్యు వాతనిఁ గొనిపోవు దేవి.
అను 5-285; శాంతి. 6-229

16. (కంఠస్వరము) హెచ్చు చేయు (ఈ యర్థమున ఎలుగు, గొంతు మున్నగు శబ్దములతోనే కూడి యుండును.)

క. అత్తఱి సీతనయుం డెలుగెత్తి రథికవరులతోడ నిట్లను.
భీష్మ 2—372

17. (దీపము మొదలగు వానిని) వెలిగించు.

సీ. దివియలోఁ బతుఁ బ్రువ్వు దివియ యెత్తినవారిఁ కాపంబు వొం
దునే. అను 5-58

18. ప్రయోగింప నుద్యమించు.

క. గురుసుతుఁడు భీమునకు నై, నరమాస్త్రం బెత్తె. అశ్వ. 3-172

19 తూచు,

తే ధనము కలిమియు లేమియుఁ బ్రాసునందు, నిలిపి యెత్తంగ ములు
మూపె నిర్ధనత్వ, మెక్కుడై దాని దిక్కున నెట్టులన్న.
శాంతి. 4-83

శ్లో. ఆకించన్యం చ రాజ్యంచ తులయా సమతోలయన్.
సం. భా శాంతి 176-10

20 (భిక్ష) యాచించు, అడుగు.

తే. తగువేళఁ బర్ణశాలలకు నరిగి, యెత్తగా భిక్ష. శాంతి. 1—58

వి.

1. మారు, తడవ, పర్యాయము (ఈ యర్థము 'ఒక్క' శబ్దపూర్వకము గనే యుండును.)

అ. ఇట్లు దఱిమెనేని నిప్పుడ యూరక డిగ్గి కృపాదులెల్ల నొక్కయొత్తుగాఁగఁ బిలుకమార్చు. ద్రోణ. 5-196

వ. దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేనాదులగు నీ కొడుకు లొండొరులఁ దగంబులెల్ల జయింపఁ జాలుదు రందఱు నొక్కమొగంబై క్రోధి నడచిన పద్మపాది నొక్కరునిన కాదు పాండవులనెల్ల నొక్కయొత్తునవైచి కొననోపుదురు. ఉద్యో. 2-282

సీ. ఘనశాయ జవసత్త్వ గణశచ్ఛపముల నొక్కయొత్తున లింపమై నెత్తి నితఁడె. అను. 1-270

2. సమ్మగడ, ఎన్నిక, యుక్తి.

ఉ. ఎత్తునఁ గొందఱు గౌరవుల నెల్లను మార్కొనిరేని గోవులం దెత్తు మహార్తమాత్రమున. చూ. ఎత్తునఁగొను. విరా 4-9

విణ.

సమానము, సమము.

వ. దివిజ దానవ గంధర్వాది సమస్త భూతంబులు నాతోడి యొత్తు రాకుండెడినట్టి దోర్వీర్యంబున వెలసి వర్తిల్లుదు.

శ్లో. దేవ దానవ గంధర్వ మనుష్య పతగోరగాః
నసమా మమవీర్యస్య శతాంశేనాపి పింశితాః
సం. భా. శాం. 12-17

క. ఈ యున్న రాజులందఱు, వాయుసుతున కొక్కయొత్తు.
ఉద్యో. 3-387, అను. 2-48

ఎత్తుదెంచు దే. అ. క్రి. (√ఎత్తు)

దండెత్తి వచ్చు.

వ. ద్రుపదుపయి నెత్తుదెంచిన ద్రుపదుండును భీతుండై బ్రాహ్మణుల మఱువుసొచ్చె. ఆది. 7-191

**ఎత్తువఁగొను** దే. స. క్రి.

నైపుణ్యముచే జయించు.

చదరంగములోఁ గాయనడపుట యెత్తనఁబడును. అట్టి యెత్తుల చేతనే ఆ యాటలో జయము కలుగును. అటులనే చదరంగములో నెత్తు వేయుటకుఁ జూపునట్టి యుక్తిఁజూపి (కౌరవులనెల్ల) తన వశముచేసి కొందునని యుత్తరుని వచనము.

ఉ. ఎత్తువఁ గొందుఁ గౌరవుల నెల్లను మార్కొనిరేని గోవులం,దెత్తు ముహూర్త మాత్రమున. విరా. 4-9

(ఎతెలం, ఎత్తల, ఎత్తుర, ఎత్తెర, ఎత్తర, ఇత్తెర) అనునవి పాఠాంతరములు

**ఎత్తులువట్టు** దే. స. క్రి.

(పూలదండలు) సరిపడునో లేదో యని ఉరువు మొదలగు వానిని సరి చూచు

సీ. పువ్వులు బహువిధంబులఁ గట్టి ముడికొక్కటంగిగా నెత్తులు వట్టి యిత్తు. విరా. 1-107

**ఎత్తువచ్చు** దే. అ. క్రి.

సరితూగు, సమమగు, సాటియగు.

వ. వారెల్లఁ దేజో ధైర్య పరాక్రమోపాయ విచారవివేకంబుల నా యెత్తువత్తురె. ఉద్యో. 2-265

**ఎత్తెదుచోటు** దే. వి.

దండు వెడలు ప్రదేశము.

వ. సుశర్మయు...వేగిరంపుఁ బయనంబులయ్యెను బ్రజల నోలాకు పడనీక యెత్తెదు చోట్లను విడిదల యందును లోనుగా నిస్సాణాదులయిన యుద్భట చిహ్నంబులు ప్రకటింపక. విరా. 3-131

**ఎత్తెల** దే. వి.

చేపలను బట్టుకొనెడి యొకానొక సాధనము.

క. వెరవున నూఁతం బెత్తెలఁ, గరముల మత్స్యములఁబట్టి కడ సంతసముం. బొరయుచుఁ బ్రాణ్లం బ్రువ్వఁగ,గర మూహించి మదిఁ బ్రాప్తకాలజ్ఞుండున్. శాంతి. 3-198

ఎ త్తెలగొను దే. స. క్రి.

వలతోఁ జేఁపలను బట్టినట్లు అనాయాసముగా (శత్రువులను) పట్టుకొను లేక వశము చేసికొను

ఎత్తెల = చేఁపలను బట్టువల - వలవేసి పెక్కు చేఁపల నొక్క పర్యాయము అనాయాసముగాఁ బట్టిన చందమునఁ గౌరవులనెల్ల నొక్కెత్తునఁ బట్టుకొందును. అని యుత్తరుని బింకపుమాట.

ఉ. ఎత్తెలఁగొందుఁ గౌరవులనెల్లను మార్కొనిరేని గోవులం, దెత్తు మహార్త మానమున. విరా. 4-9

(ఇది ప్రాతప్రతి పాఠము అని సూ. ని. ఇప్పటి ప్రతులలోనిది పాఠాంతరము) చూ. ఎత్తుఁగొను.

ఎద వై. వి. ఎడఁద

హృదయము, మనస్సు.

తే. ...సంతోష మెదనింద నెలవుకొనఁగ. విరా. 1-24

క. ...అహ్నాకపతియు సిగ్గెదఁ గదురన్. ఉద్యో. 1-118

క. వాలమ్మెలు దాఁకి ధరన్, వ్రాలు భటులఁజూచి యెదలు పగ లగఁగ మేనుల్, దూలఁగఁ దముఁ దాఁకకయును, వాలము పాలించి కొంద అవలఁ జనంగన్. విరా. 5-62

ఎది దే. సర్వ.

ఏది.

సీ. ...ఏకాదశేంద్రియ మూలిక మీఁకఁ, దింది సందడిఁబడి కుందక యుండెది యింపేసిఁ దనవంక కీర్తిఁజాలు, బుద్ధితత్త్వము గల్గు శుద్ధాత్మ కుఁడు. అశ్వ. 2-144

ఎదిరి దే. విశే. (√ఎదురు)

1. అన్యుఁడు ఇతరుఁడు.

క. ఎదిరికి హితమును బ్రియమును, మదికింపును గాఁగఁబలుకు మాటలు పెక్కై, యొదవినను లెస్స యటుగా, కిదియది యన కూరకుండి రొంతయు నొప్పన్. ఉద్యో. 2-59

2 ఎదుట నున్నవాఁడు, ఎదుట నున్నది.

క. అని పీడఁగఁ బల్కిన న,మ్మనుజాధముఁ డంతఁబోక మదనోన్మాదం,బునఁ దన్నెదిరి నెఱుఁగక, వనితకు నిట్లనియె గారవంపు బలుకులన్. విరా. 2-51

వి.

ప్రతిపక్షుఁడు, విరోధి.

క. మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు, నెమ్మి నెఱుఁగు దర్థసిద్ధి నెఱియెఱుఁగుదు వాక్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు, పొమ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్. ఉద్యో. 3-34

**ఎదిరివాడు** దే. వి.

ప్రతిపక్షుఁడు, విరోధి.

ఆ. ఎల్లభువనములను నేలుటకైనను, నిట్టి క్రూరకర్మ మెట్లు సేయు, వచ్చుఁగడఁగి యెదిరివారేమి చేసిన, మాఱుసేయ నాకు మనసురాదు. భీష్మ. 1-185

**ఎదురఁబడు** దే. అ. క్రి.

ఎదుటఁ గనఁబడు, చేఁజిక్కు, వశమగు, యాదృచ్ఛికముగా లభించు.

ఆ. ఎదురఁబడినవాని వదలక శార్దూల,శరభ సామజాది సత్త్వతతులఁ బట్టి తినుచునున్న యట్టి నాకిప్పుడు, భక్ష్యమైతి వీవు పాండుపుత్ర. అర. 4-111

**ఎదురీఁదు** దే. అ. క్రి.

నీటి ప్రవాహమునకు ఎదురుగా ఈఁతకొట్టు, బెట్టిదములగు కష్టములు డీకొని వానిని తరించుటకు ప్రయత్నించు.

చ. ...వారిజనాభుండు లేని దీనతం,బొరసి కృపైక భాజనతఁ బొందిన యప్పురిఁజూచి మానసం, బెరియఁగఁ జొచ్చె నేటికెదురీఁదిన చాడ్పున నేమి సెప్పుదున్. మౌస. 1-98

**ఎదురు** దే. అ. క్రి.

మార్కొను, ప్రతిఘటించు.

క. కావున నీ యుద్భట రథి,కావలి నివ్వీరుని గాచునట్లుగఁ బనుపం

3. అభిముఖుఁడు (ఎదురు మొగమైన వాఁడు) అభిముఖ, అభిముఖి.

క. ఎదురున్న రూపు వలుకఁగఁ, దుఃఖ గటగటబడవు. ఉద్యో. 1-368

వ. కొండ కెదురుగాఁ జనుదెంచిన వారిది యేమి యని యడుగ నశ్వత్థామ వచ్చి పొడుచుచున్న వాఁడనిన సౌప్తి. 1-197

సీ. ఎదురుగా వచ్చిన నెంత యేనియు దవ్వు, గలుగ వేశ్లోక ప్రోవ దొలఁగు వారు విరా. 2-36

4. ఎదుర్కొన సమర్థమైనది, ప్రతిఘటింపఁ జాలినది-సాటి, సమానము.

క. అశ్వత్థామ్నుగ్రిఁడ బాలుఁడఁ గాఁ,దుర్మర విద్యా ప్రౌఢిమై నిరూఢు లయిన యీశకుని జయద్రథ దుర్ముఖ, వికర్ణ కర్ణాది యోధ వీరులకెదురే. విరా. 4-63

తే. ...ఈ వీట వాబల్లి దునకు, నెదురు రథికునిఁ గాన ననేక హేతి, నిపుణ శార్దూల విక్రమ నీవు దక్క. శల్య. 1-91

వ నీకై మీ తండ్రి యిట్లు వేయఁడయ్యేనేని వాని కెదురెవ్వరు ద్రోణ 5-289

5. మాఱు, బదులు.

సీ కుల పర్వతావళి కులిశ భయంబున, నెవరి వాపోవు నల్లెదురు సెంఁగె ఉద్యో. 4-116

క్రి. విణ.

1. ఎదురుగా, అభిముఖముగా.

ఎ. నీకెదురై జయంబు గొనరాదు. ఉద్యో. 1-67

2 సమానముగా.

వ. సుయోధనుఁడు...భీష్ము కడకుంజని శోక గద్గద కంఠుం డగుచు నతనితో నిట్లనియె.

వ. అది విని నదీసూనుండు దాను నెదురు శోకించి యతని కిట్లనియె. భీష్మ. 3-76,78

ఎదురుకొ(ర్కొ)ను దే. స. క్రి. (√ఎదురు)

1. మార్కొను, తలపడు.

వ. సుశర్మ సామంత దమ్మొంతు సగడంబుగాఁ గొల్లల నేసి రథ సమూహంబుతో విరాట వ్యూహంబు నెదురుకొని. విరా. 3-182

ఉ. శాంతనవుండు నవ్వు నిజశంఖము కౌరవ రాజ సైన్యముల్ సంతస మంద నొత్తుచు ససంభ్రమలీల నెదుర్కొనంగ.
విరా. 5-164

క. గురుఁడవు గాక పగతుఁడవె, దురమునఁ గుపితుడగు నిన్నెదుర్కొన నా కొ,క్కరునకు శక్యమె యాపుర,హరున కగుంగాక యనుచు నరుగుచు నుండెన్. ద్రోణ. 3-78

2 ప్రత్యుద్గమించు.

క. హయములఁ బూన్పుము రథమున, రయమున నిడమెత్తు మిపుడ రావలయును గో,చయముఁగొని యస్మదీయ విజయ మభినందింపఁ బురము జను లెదురుకొనన్. విరా. 4-42

శా. చాటంబంపుఁడు పేర్మి నుత్తరు జయాశ్చర్యంబుఁ బిట్టాడంగ నా. కోటం బుచ్చుఁ డెదుర్కొనంగ.
విరా. 5-242; 889, ఉద్యో. 3-176

ఉ. ...అఖిలగేశ్వరు పత్ని యాతనిం, జెచ్చెరఁ దా నెదుర్కొని.
శాంతి. 6-574

అ. క్రి.

అభిముఖమగు, తారసిల్లు.

వ అసుకృతి నట సూర్యుండు దనరశ్ముల వహించినడప పద్మతంతు సన్నిభంబైన మార్గంబు ప్రవేశించి చనంబున నూతున్రొంకను శీత లుండును సుగంధియు సుఖస్పర్శుండును సప్తమారుత శ్రేష్ఠుండును నగు పవనుం దెదుర్కొని. శాంతి. 5-618

## ఎదురుగాలి దే. వి.

ఎదురుగా వీచునట్టి గాలి.

క. వలఁకులు మన చేరువఁ జెల్లఅచుట జెట్టెదురు గాలి యడరుట ప్రగడ్డల్, తలచయి యాడుట విశ్రుతవు, టలువులతో రేఁగి కాకు లఱచుట గంటే. కర్ణ. 2-116

**ఎదురుచను; ఎదురునను** దే. అ. క్రి.

1 ప్రతిఘటించు.

క. గురుఁడను సురుతరగిరి నిష్ఠుర భంగిం బట్టి వచ్చు సునిశిత బాణోత్కర చండ వేగనదికి నెదురు చన రాదయ్యె నపుడు ద్రుపదసుతునకున్. భీష్మ. 2-57

2. ఎదురుగాఁ బోవు.

వ. అని సమస్త జనంబులుఁ దదభిముఖులయి భక్తి యుక్తిం బ్రత్యుత్థానంబు సేయం దానును గద్దియ డిగ్గి యెదురు చని నమస్కరించి యతని యాశీర్వాదంబులు గైకొని సగౌరవంబుగాఁ దోడ్కొని చనుదెంచి సముచిత సమున్నతాసనంబున నునిచి. విరా. 1-189

క. చిడిముడి పడుచు నెదురు సనఁ, గడఁగుచు వారములు చక్కఁగాఁ ద్రోచుచు మల్లడి గొనుచు దుర్విలాసం, బొడలికి నొడఁగూర్చుచుండ నుగ్మలి యంతన్. విరా. 2-114

**ఎదురుచు; ఎదుర్చు** దే. అ. క్రి. స. క్రి.

ప్రతిఘటించు, మార్కొను.

క. పొదలెడి నప్పుడు శౌర్యోన్నద్ధుఁడగు నయ్యనిల తనయు మార్గణములు బెట్టిదముగఁ గవియుఁడు నోటమి, యెదురుప లేరైరి కురుకులేంద్రుఁడు వారున్. కర్ణ. 2-164

ఆ. అనఘ నీ కెదిర్చ యని సేయువాఁడనై, ము న్ననబ్జుఁ గొనఁగ నిన్నుఁగాన, నెమ్మి నచ్చినాఁడ. భీష్మ. 1-168

క. విను సైంధవుఁడు మహారథుఁ, డని బోక వెనంగు నతని నా ద్రౌపదికై, వెనుపటఁ బఱచిరి కుంతీ, తనయులు వారల కెదుర్పఁ దపముం జేసెన్. ఉద్యో. 4-222

క. పొదువుచు విచ్చుచుబలువిడి, నెదురుచు బాణచును మఱి మహీభాగము, గ్రక్కదలం గార్ముక విద్యాప్రవిదుఁడగు గురుతోడఁ బోరె వివిధ బలంబుల్. ద్రోణ. 1-144

చ. అనిలజవంబునం బఱచు నమ్మెరవాగ మెదిర్చి క్రమ్మఱిం,చిన పరికాఁడ పోలె. ఆది. 4-206

చ. దురమున నర్జున ప్రకట దోర్విభవంబు నెదుర్చఁజాలు న,ద్దురుఁ డొకరుండు గల్గెనె. కల్య. 1-88

**ఎదురుచూచు** దే. అ. క్రి.

ప్రతీక్షించు, నిరీక్షించుకొని యుండు.

వ. (కీచకుఁడు) అమ్మదిరాక్షిరాక కెదురు చూచుచుండె. విరా. 2-87

క. హాయముల మరల్పుమీ తల్లియు బంధులు నెదలు సంచరింప గుమురు గట్టయెదురు సూతురు వారికిఁ, బ్రియముగ శీఘ్రమ్మునం బురికిఁ బోవలయున్. విరా. 5-264 విరా. 4-81

**ఎదురునడుచు** దే. అ. క్రి.

అభిముఖముగా వచు, ఎదుర్కొనవచ్చు.

క. చరులఁ బనిచి యరుల తెఱం,గరయుచు వారెదురు నడచునట్టి యునని దె.వ్వ రవుం దెరువున డప్పిం, బోరసిన యెడ విడియుచోటఁ బోడచు టురవగున్. శాంతి 3-4

**ఎదురుపడు; ఎదుర్పడు** దే. అ. క్రి.

ఎదురువచ్చు ఎదుర్కొను.

క. కురుపతికిఁ బ్రియసేను డగు, బురుమిత్రుఁడు వేల్పుచేటి పుత్రుఁడుఁ బ్రాప్తై, యురిఁడి దళిమినవారికి, నరనందను డెమురుపడె గుణ ధ్వని సెలఁగన్. భీష్మ. 2-813

ఆ అరికృపాలు పెంపు నాత్మీయ శక్తియు, నెఱిఁగి మూఢవృత్తి నెదురుపడక, యుచితవృత్తి వగని యుద్ధతి మేవఁ, గడపి హీన బలుఁడ నెడక నిలుచు. శాంతి. 3.90

వ (గరుత్మంతుఁడు) అవ్విధవై రిని మూరెల మన్నసురలను మును లెదు గలయుం గనుఁగొని.

చ. ...తల్లి దానిదు కు టోర్వక నంద్రియుపక్ష్మ మీకెదు.ర్పడిన దురుద్ధతిన్ మఱచి బాంధవ సత్కృతి నాదరింపుఁడీ అను. 1-265; 266

**ఎదురుపలుకు** దే. అ. క్రి.

మాఱుపలుకు, ప్రత్యుత్తర మొసఁగు.

క. ఏ నొల్లఁగాక భస్మము,గా నిన్నుంజూతునే వికారియమడుం, డా వెదురు పలుకకంత,ర్ధానము వెసఁజేసె నతఁడు ధరణీనాథా.
అను. 2-208

**ఎదురువచ్చు** దే. అ. క్రి.

అభిముఖముగాఁ బోవు, వచ్చెడివారికి ఎదురుగాఁ బోవు.

వ. కల్యుందు నుపప్లావ్యంబునకుం జని స్కంధావారంబు దఱియం జొచ్చె ధర్మనందను నివాసంబున కరిగిన నతండు దమ్ములుం దానును ద్రౌపదీ సుభద్రలు నభిమన్యు ప్రభృతి పుత్రవర్గంబును నెదురువచ్చి కృత ప్రణాముండై. ఉద్యో 1-104

వ. కమల నాథుండు గదలిపోయి సూర్యాస్తమయ సమయంబునఁ గుశస్థలంబు సేరం జనునప్పు డందలి విప్రు లెదురువచ్చి కాంచి.
ఉద్యో. 3-147

తే. భవ్య విభవంబుతో నుపప్లావ్యపురము, సొచ్చి సంభ్రమమునఁ బాండుసుతులు దనకు, నెదురువచ్చిన వాల్లీన మెసక మెసఁగ
విరా. 5-378; సభా. 1-179

**ఎదురుపోవు** దే. అ. క్రి.

1. వచ్చువారికి ఎదురుగాఁబోవు, అభిముఖముగాఁ బోవు.

వ. ధర్మనందనుం డొక్కఁడుపోయం బోడఁగని దుర్యోధనుండు దొలఁగెం జెట్టుచేమల నడంగి యుండునో మీరు మెలంగునెడల నరయ వలయుననిన వాఁడును వృకోదరుని మృగయులలోని వాఁడగుటఁ దమ వారికి నెమరువోయి యమ్మాట తెలంగెఱింపటుం జేసి.
శల్య. 2-86

2. ప్రత్యుత్థాన మొనరించు ఎదురుగా బోవు.

సీ. సత్యవతి కొడుకందుల, కేతేర నందఱు నెదురువోయి. ఆశ్ర. 2-71

**ఎదురుశోకించు** దే. అ. క్రి.

దుఃఖించువానిని జూచి తాను వానితో సమానముగా దుఃఖించు.

వ. అనిన విని నదీసూనుండు దాను నెదురు శోకించియతని కిట్లనియె.
భీష్మ. 3-78

**ఎదురుసేయు** దే. స. క్రి.

ప్రత్యర్థిగా నిలువు.

క. శౌర్యాటోపంబున దోర్వీర్యంబున నస్త్రశస్త్ర విత్త్వమునను మాత్సర్యంబు సేయు వాఁడును, దుర్యోధనుఁ డెవ్వఁడు దన్నెదురు సేయంగన్. విరా. 6-12

**ఎదురెదురు** దే. వి. ఔ.

ఎట్ట యెదురు.

క. ఎవ్వరు వినినను దీనికి, నవ్వుదురని యెఱుఁగఁ దకట నా యెదురెదురన్, నివ్వచ్చుఁ జూపి సేనలు, గ్రొవ్వఁ బలుపలుకు లిట్లు ద్రోణుఁడు పలికెన్. విరా. 4-159

**ఎదురేచు** దే. అ. క్రి.

ప్రతిఘటించు, పోరికిదిగు.

క. పాండవులు శౌర్య మొల్ల రఖండితనీతి ప్రకార కార్యము మెచ్చై, యుండుదు రెదురేచినఁ దరిమం డుదు రార్పంగరాదు మరి యెవ్వరికిన్. ఉద్యో. 2-73

**ఎదురేయు** దే. అ. క్రి.

ప్రతిఘటించి బాణ ప్రయోగము చేయు.

వ. ముందటి పుట్టువున నంగనయగుట వాని కెదురేయకుండుదు. భీష్మ. 3-302

**ఎదురొడ్డు** దే. స. క్రి.

ప్రతిఘటింపఁ జేయు, డీకొనఁ జేయు.

మ. మహిషవ్యాఘ్రమృగజాదిసత్త్వచయమున్ మల్లవ్రజంబుం గృపారహితుండై యెదురొడ్డుచున్ వరుసఁ బోరం జూచు. విరా. 2-198

**ఎదుళ్లుచూచు** దే. అ. క్రి.

వ. కుంతిసంభవప్రముఖులైన మాన్యులును జని మాధవుతోడ మా యొద్ద నెల్లను గానిక లాయితంబులు సేసికొని మీవు విజయం చేయుటకు నెదుళ్లు చూచుచున్నవారమని పల్కి ప్రార్థించిన. ఉద్యో. 3-228

ఎద్ది దే. సర్వ.

ఏది.

క. ... ఇ, ద్దినములు గడపంగ నెద్ది తెలుఁగయ్యేడినో. విరా. 1-59

ఎద్దు దే. వి. (బహు) ఎడ్లు

సీ. అనఘ విశాఖ నెద్దు. అను. 2-379

తే. బలము లేఁ బ్రాయమును రూపుఁ గలుగునట్టి, గవప యెద్దు సద్ధర్మ విప్రునకు విచ్చి, నతఁడు సద్విధి గోదాన మాచరించి, నతని వడసిన గతిఁ గాంచు నవఘ చరిత. అను. 2-460

చ అమటయు భీతి వేడికొని యావులు వేయును నెడ్లవాలు నూఱును రథముల్ శతంబును. కర్ణ. 2-91

తే. కడఁక నెడ్లను దఱిమి రొప్పెదు నరాలి, యులివువిని యుల్లమున గడు నులుకు పుట్టి. అను. 4-318

ఎద్దుఁబట్టు దే. స. క్రి. (√ఎద్దు)

ఎద్దును బీజములు లేని దానిని గాఁజేయు, ముష్క హీనముచేయు.

సీ. పొలఁతి నపుంసకుల్ పూర్వభవంబున, నెద్దుఁ బట్టిన వారు. అను. 5-105

శ్లో. యే పురా మనుజాః భూత్వా ఘోర కర్మరతా స్తథా।
పశు పుంస్త్వోపఘాతేన జీవంతి చ రమంతి చ॥

సం. భా. అను. 221-31 (నిర్ణయ)

(ఎద్దు పట్టు - అని.సూ.ఆ.ని. అన్యప్రయోగము.)

ఎన దే. విశ.

సాటి, సమానము.

సీ. ఇత్తన్వి కెనలేమి కెదిరి పన్నిదము భాషా విభుతోనైనఁ బలుక రాదె. విరా 2-27

చ. ... మాతలియుం దలంప సీతని కెనరాఁడు. కర్ణ. 1-315

క. అతిరథుఁడు బాహ్లికుఁడు విను, మతులిత బలుఁ డితని యట్ల యాత్మజుఁడును విక్రమశక్తి సోమదత్తుం, డితనికి నీతనికి సమర మెన చెందిలికెన్. ఉద్యో. 4-230; స భా. 1-72

వి.
సామ్యము, పోలిక.

చ. ... వారల చెప్పెదు ధర్మవృత్తి నిచ్చెనయుఁగ నూఁది సత్పథముఁ దొలంగ కెక్కుము పవిత్రనూతి బ్రువ్వు నెనయుఁ గాకు మిఁథకుఁ దిప్పుం దన కళ్లుఁదు దాన యమ్మెయిన్. శాంతి. 6-287

ఎనమండ్రు; ఎనమండ్రురు దే. పర్యా. బహు. (√ఎనిమిది)
ఎనిమిది మంది (ఎనిమిదికి మహన్మహత్వార్థక రూపము.)

వ. అయ్యేన మండ్రను దక్కిటి దొరలను గమంగొని. ఉద్యో. 4-113

క. ... వనువుల, నెనమండ్రం గాంచి యెంతయుఁ బ్రీతిన్. ఆది. 4-126

క. వారలఁ బొదువనదరు బలు, తేరుల మొత్తముల మిగిలి దీప్తపటు రథో, దారులగుచు నెనమండ్రురు, వీరులు దఱిమిరి నితాంత వేగోజ్జ్వలులై. ద్రోణ. 3-216

ఎనమన్నూఱు దే. పర్యా. బా. (ఎనిమిది+నూరు)
ఎనిమిది వందలు.

వ. ఉత్తరపోషనపర్యం దళ్లెని శుద్ధ ధవళ వర్ణంబులై యొక్క కర్ణంబు నీలంబైన యుత్తమాశ్వంబు లెనమన్నూఱు దెచ్చి యిమ్మని పలికిన. ఉద్యో. 3-306

వ. అరువది యొక్క వేయు నెనమన్నూట డెబ్బది రథంబులు. ఆది. 1-81

ఎనయిక దే. వి. (√ఎనయు) ఎనయుట
పొందిక, ఒకదానితోనొకటి చేరుట.

క. అనఘ యనులోమమునఁ బోఁ, పుమ బ్రతిలోమమున లయము వొందుటయును గల్గుమ సర్వతత్త్వముల కవి, యొనయిక బ్రహ్మమును గలయు నేకత్వమగున్. అను. 4-186

ఎనయు దే. స. క్రి.
1. పోలు.

చ. ఎనయుదె నీవు పౌరుష విహీనుఁడ వర్థవిశేంద్ర నందనున్.

తే. ఉదయ ధరణీధరంబుపై నొప్పు దివస,నాథు నెనయుచు సిం
హాసనంబు మీఁదఁ, గొలిచె లీలావతీ కర కలిత చామ,రములు
వొలయంగ నుచిత జనములు గొలువ.
ద్రోణ. 3-5; శాంతి. 5-75

2. పొందు.

క. పరమ మగు యశము నీకును, ధరణింగలిగింపఁ బూని తాత్పర్యము
నం, బురుషవర నాదు బుద్ధి, స్ఫురణము నీ మనమునందుఁ బొని
పిత నెనయన్. శాంతి. 2-147; శాంతి. 4-276; శాంతి. 5-75

క. —ని సాత్యవతేయుఁడు గృప, నెంసి సుధాధారఁ బోలు నీక్షణము
గ, తనువున నిగిడించిన న,మ్మనిపతిఁ గీర్తించె భూతములు
ప్రీతములై. అను. 5-330

3. ఛేదించు, ప్రచ్చు.

క. ఆలోచన యూరథికుని, ఫాలస్థలి నోలి నెనయఁ బదినారసముల్,
గీలించిన నవి యచ్చట, నీలోత్పల మాలవోలె నెఱయం బొలిచెన్.
ద్రోణ. 4-230

శ్లో. తే లలాటం విభిద్యాస్య సూతపుత్రస్య మారిష,
వివిశుః శోభితా స్తేన వల్మీకమివ పన్నగాః.
సం. భా. ద్రోణ. 189-7

(స్థలమోలినేయ-అను పాఠాంతరమే సమంజసమేమో)

అ. క్రి.

1. సరియగు, సమానమగు.

క. ఈ నలువుర భుజశక్తుల తో, నెనయఁగఁ జాలునట్టి దోర్బల
మెందుం, గానము. విరా. 3-114

క. నెల్లుఁడు యమ తనయునితో, నెల్లగుణంబులను జాల నెనయుడు
నని తా.నుల్లమున నిశ్చయించుం, దెల్లంబో పోరఁ బగఱతో
నిట్లయ్యెన్. స్త్రీ. 2-104

2. కలుగు, సంభవించు.

క. కోకిల కుల గంధర్వా, నీక డంబు తెనసి తెగి ...

లోక భ్రమతీ మండలి, శాకల కల వాదములును గలసి చెలంగన్. అను. 4-417

3. వ్యాపించు, ప్రసరించు.

సీ. తునిసిన నెత్తురు నెనడుకు నెమ్ముల, నెఱచియుఁ గండలు నెనసి సమర - తే. - తలము ఘోరంబుగాఁ గపిధ్వజము ధవళహారులు శోభిల్ల. ఉద్యో 2-146

4. ఏకమగు, కూడుకొను.

ఆ. అనఁడు కాలకలితమైన కర్మమున సంసార వర్తనంబు సలుపు చుండు, స్వప్న సంప్రవృత్తి సలిపెడు నరు మాడ్కి, నింద్రియములతోడ నెనయ కెరసి. శాంతి. 4-195

తే. కేశ సలిపిరి భవన దీప్తికల తమిస్ర, విరుల నెత్తావి నెనయంగ కెరసి చెమట, పొడవు మేను లతని కంపు ప్రోచి తఱచు, టూర్పు గాడ్పుల పరిమళ ము ల్లసిల్ల. విరా. 2-288

5. సంగమించు, రమించు

క. వనితకుఁ బురుషునకుం దన, తన యంతన రూపాకం బొనవఁ జేయఁగ విన్నమవు గలుగ దొండొరువుల, నెనయుటఁ గాని శ్రుతి మతము నిట్లు మహాత్మా. శాంతి. 6-22

6. ఒప్పు.

క. అని యొక గుదిమీల నడుమ, నెనయంగాఁ దూఁటి కఱచి యిరు దెడలఁ ద్రాఁదొనరంగఁ బట్టుకొని క్రుచ్చిన చందము దోఁచ మూర్ఛఁ జెందిన భంగిన్. శాంతి. 3-195

7. కప్పు, ఆవరించు.

చ. ... పా, మొనసిన తోలు వాయుక్రియ నీవు దొలంగుడు పాపపుంజమున్ శాంతి. 5-188

8. సఖ్యము సేయు.

తే ... అన్నదమ్ముల, లేమి విధమునఁ దమతోన నెనసి నడచు, వార లెఱిఁగింపు మనుటయు గారవమున. అను. 4-120

ఎనవచ్చు దే. అ. క్రి. (√ఎన)

పాటివచ్చు, సమానమగు.

క. ధైర్యధనఁ డితఁడు ద్రోణాచార్యం డెనవచ్చు దివ్యశర విదుఁడు కృపాచార్యుఁడు. విరా. 5-9

ఎనిమిది; ఎన్మిది దే. సర్వా. ఔ.

ఏడు నొకటి.

వ. కౌరవపతి యరదంబున నెనిమిది సునిశిత విశిఖంబులు గ్రుచ్చి పేర్చిన. కర్ణ. 3-190

అ. ఎనిమిదింట ద్రౌణిని. ద్రోణ. 3-327

క. ఎనిమిదిటఁ జేరుఁకున్న నక్కురునృపాలు వొడలం గ్రుచ్చెన్. ద్రోణ. 4-42

క. విను మల్లేచి నకులుఁ బొడిచె నుదగ్ర ధ్వని నవేక వేదం డములం, దెనిమిదిటిఁ గూల్చె శాణము, లెనిమిది యెనిమిమలఁ దమ్ముఁ దేఱైల నధిపా. కర్ణ. 2-345

వ. పదునెనిమిదవ పర్వంబై స్వర్గారోహణము నాఁబరఁగె. ఆది. 1-64

సీ. ఐదు నెన్మిదియును నాలు కల్యుఁడు. ద్రోణ. 2-80

ఎనుపోతు దే. వి. (√ఎనుము)

దున్నపోతు, మహిషము.

చ. ...కోలు పులినైనను గారెనుపోతునైన...పట్టుదు. విరా. 1-88

వ నిత్యంబు నిలు వరుస నొక్క మావిని రెండెనుపోతులం బూనిన శకటంబున నపరిమిత భక్ష్య పిశిత మిశ్రాన్నంబు నించుకొని పోయిన దానిని వానిని నయ్యెనుపోతులను భక్షించుచు. ఆది. 6-265

ఎనుబోతు దే. వి. (√ఎనుము)

దున్నపోతు, మహిషము.

చ. వలసిన నేలు మేను బలవంతుఁడఁ గారెనుబోతు దంతి బెబ్బులి మృగనాథునిం దొడరి పోరుదు. విరా. 1—228

(శి.వ. ప్రతులందున ఈ తావున 'ఎనుబోతు' అని సబిందుకముగా మన్నది, వారు అసఁగా అకాడమి వారు ముద్రించిన భారత ప్రతి యందు ఇచ్చట నిర్బిందుకము గాఁగలదు సంశోధితము నందును ఈ యొక్క తావుననే 'ఎనుబోతు' అని నిర్బిందుక ప్రయోగము గలదు. మిగిలిన తావున ఎనుపోతు అనియే గలదు. ఈ సంఖ్యలో ఆనంద వారి ప్రతి యందు 'ఎనుపోతు' అనియె కలదు. మ్యా.శ.ని. వారు 'ఎనుఁబోతు' గాని ఎనుబోతు గాని ఈయలేదు. విచార్యము.)

**ఎనుబది** దే. సర్వ. ఔ.

ఎనిమిది పదులు, అశీతి.

తే. ఎందు మెనుబది నాలుగు వేల యోజనంబులని హేమ ధాత్రీ ధరంబు పొడవు — భీమ. 1-22

**ఎన్నండు; ఎన్నఁడు** దే. వి. ఔ. ఏనాఁడు

1. ఏదినము, ఏకాలము.

క. నీ పసులఁ గావఁబెట్టుము, భూపాలక నమ్ము నేను బూని యరసినన్, గోపంక్తులు రుజవడ వోరు, శేవద వెన్నఁడును దప్పఁ దేద్పర వెదటన్. — విరా. 1-278

ఆ. ఒలసి యెంత కాలముండిన నేను మీ, దానఁ గాన యొరుల దాము నన్ను, వెన్నఁ డయిన వారల కిచ్చుచో నముగకు, భోజ నమున నిల్పి పుచ్చుఁ డిపుడ. — ఆది. 6-267

2. ఎప్పుడను. ఎల్లప్పుడు

(ఈ యర్థమునఁ దఱచు ద్రుతాంతముగా నుండును.)

క. కని కొలువు సేసికొని మాఁడిని వాఁ జని పార్థి యిది మతిమస వృత్తంబున పొంతఁబోవ రెన్నఁడు, నను వేఁకఁదనంబు దోఁచు నట్లు చరింతున్ — విరా. 1-106

సీ. ...మతి, పాండు నందను లేక పత్నియందు కరమనురక్తులు గావుఁ దమలోన, వేంకటేశిల్లుదు రెన్నఁడయ్యు -ఆ- వారిక పతికిఁ బతులు పెక్కండ్రు గగుటది, పతుల కొక్క గాన యతివ. కృష్ణ సుందరాంగి వారి యందేం యపరక్త, యగు.

(ఎన్నఁడయ్యు = ఎల్లప్పుడును) — ఆది. 8-2

తే. (బలరాముఁడు) ఇట్టి దాని కోర్వక యెన్నఁడేనిఁ, గృష్ణు తోడనేఁ
జెప్పితిఁ గినిసి యిరు దెఱఁగు వారికిఁ దగఁ జెప్పి సంగతంబు,
సేయుమని యెంత చెప్పినఁ జేయఁడయ్యె. ఉద్యో. 4-168

(ఎన్నఁడేని = ఎన్నఁడో, ఏనాఁడో.)

మత్తకోకిల :- మదీయ భాషిత మెన్నఁడున్నని మోఘము గాదు
దిగ్ధరణి రవీందు లెఱుంగఁ గాన్. ఆది. 7-141

(ఎన్నఁడున్నని = ఏనాఁడైనను, ఎప్పటికిని.)

**ఎన్నఁడో చచ్చినయట్లు** దే. జాతి.
ఎంతకాలము క్రిందనో చచ్చినట్లు.
క. అని యతని జత్తు దేశం,బున నొక వాలమ్ము నవశమునఁ జెక్కును
గ్రుచ్చినఁ ద్రెళ్లి యెన్నఁడో చచ్చిన యట్లు రథంబు మీఁదఁ
జేష్టడి యుండెన్. ద్రోణ. 2-51

**ఎన్నాళ్లు(లు)** దే. వి. బ. (ఎన్ని + నాళ్లు)
ఎన్ని దినములు.
సీ. ...ఇంక నెన్నాళ్లు యుండెడి, గొంతి వనంబునఁ గూరడిమచు.
అశ్వ. 2-15

**ఎన్ని** దే. సర్వ. బ.
(ఎంత శబ్దమునకు అమహదర్థక బహు వచన రూపము సంఖ్యా, వాచకము.)
1. ఎంత సంఖ్య గలవి (ప్రశ్నార్థకము.)
సీ. వెతఁ నిట్టిదని యింతి నెమ్మనం బెన్ని. తంగుల నరసినఁ బట్టువడదు.
విరా. 2-47
క. భూవర నాకుం జోడం,గా విష్ణుఁడు దైవ మట్లు గావున నతఁడున్,
భావించు పెల్లవారికిఁ, గావించును మోక్షమయ సుఖము లెన్నిం
టన్. శాంతి. 5-509 (ఇది పాఠాంతరము.)
2. యావదర్థకము (ఇది తావదర్థకము నపేక్షించును)
వ. పాపాత్మురాలైన సురేష్ట దనకు మదిరారసంబు దేరం గీచకనివా
సంబునకు నన్నుం బనిచినఁ బోవుట కోడఁ బడక యెన్ని చెప్పిన

మఱియుం జెక్కుంద్రు రథికులుఁ గలరు. భీష్మ. 1-174

సీ. వినుము ధర్మములెల్ల విమల కృత్యంబుల, తపమెన్ని యెవ్వఁగా
ధర్మమిందుఁ గలదు. అను. 4–82; అర. 5-115

## ఎపుడు (ఎప్డు) ఎప్పుడు

ఎల్లప్పుడు.

క. సన్న్యాసి వేషమున రాజన్యునిఁ గని యెపుడుఁ గొలిచి సత్యత్వ
మునన్, మాన్యుఁడనై పుణ్య కథా, విన్యాస మొనర్తు నతనివేడు
కకుఁ దగన్. విరా. 1-69

ఉ. ...ఎప్డు వంగవా, జనములు నమ్మఁజాలి మరుసాయకముల్
దమ చిత్తవృత్తు లేచినఁ గొని వచ్చి యిత్తురు విశిష్ట ధనంబులు
నాకు లంచముల్. విరా. 2-384

## ఎప్పటి అవ్య. (√ఎప్పుడు)

ఎప్పటివలె, యథాప్రకారముగా (మరల, తిరిగి అని తాత్పర్యము.)

వ. విశ్వరూపా యీ రూపం బుపసంహరించి నీవగు నెప్పటి యాకా
రంబు గైకొనవే యనిన. అశ్వ. 3-51

చ. ... తగం దొలంగఁగాఁ, ద్రోవఁగ వాడి బంధులకు దుర్మతి పుట్టిన
యట్టి మర్త్యు వాఁ, డవిధినైన మందులిడి యెప్పటి బుద్ధిఘటించు
చాడ్పునన్. శాంతి. 6-192

## ఎప్పటిచందము

యథాప్రకారము.

వ. కుంభ సంభవ, వారికిం దప్పించుకొని పోయినం బోవమ్మని పలికి
డెందం బెప్పటి చందంబగుటయు నిశ్చల భావంబొందె.

ద్రోణ. 5-321

ఉ. ఎప్పటి చందముల్ విడిచి యేత్తెఱఁ దక్కిన చూడ్కులుం.

ద్రోణ. 1-14

## ఎప్పటిచొప్పు

యథాప్రకారము.

వ. మున్ను నిద్రించు ప్రక్క దక్కియుండు ప్రక్క నిద్రించు భార్గవు నట్లు గాంచి సంతోషించి పరిక్రాంతి దిగం ద్రావి యెప్పటిచొప్పున నడుగు లొత్తుచుండ మఱియు దినంబు లిరువది యొక్కటి ననివం బ్రబుద్ధుండై. అను. 2-307

## ఎప్పటియట్టులు; ఎప్పటియట్లు

యథాప్రకారము.

సీ. ఏనుఁగేంద్రుఁడు నిలుచుట గని సైన్యమెప్పటి, యట్టుల పురికొని. భీష్మ. 3—86

వ. దామోదరుండు ధృతరాష్ట్రునిమతం బొడఁగూడ నతని కన్ను లెప్పటియట్ల కావించి నిజ విశ్వరూప ప్రపంచంబు నుపసంహరించి. ఉద్యో. 3-411

## ఎప్పటివారలు

పూర్వమెట్లుండిరో వారు.

వ. ధృతరాష్ట్రుండును మగిడి కొలువు కూటంబునకు వచ్చి యెప్పటి వారలు పరివేష్టింప నుండె. ఉద్యో. 4-21

## ఎప్పుడు ఎపుడు, ఎప్డు

వి. ప. జా.

(దీని రూపాంతరములగు 'ఎపుడు' 'ఎప్డు' అనునవి ద్వితీయాది విభక్తులతోఁ గూడి యుండవు.

1. ఏ వేళ, ఏ సమయము.

చ. ... ఎవ్వరిదో యెప్పుడే తలఁపు వచ్చునో యీతని కంచుఁ జూర్కి సుస్థిరముగఁ దన్ముఖంబునన చేయుచు నుండుట నీతి కొల్వునన్. విరా. 1-129

2. యదార్థకము (ఇది 'అప్పుడు' అను దాని నపేక్షించును)

ఆ. ఒడలితోడ నీకు మర్త్యలోకమునకు, నరుగవచ్చు నెప్పు డరుగు దలఁపు, దోఁచె నప్పు డిదియుఁ దోడితైయు ప్రీతి నరుగుదెంచు ననియెఁ గురువరేణ్య. అను. 1-80; అర. 1-68

8. ఎల్లప్పుడు, అన్ని వేళల.

(ఈ యర్థమునఁ దఱచు సముచ్చయముతోఁ గూడియే యుండును)

ఉ. ఎప్పుడుఁ దాను బిట్టు నెలుఁ గేర్పడ ద్రౌపదితోడ నిట్లనున్. విరా. 2-147

క. నీ మాట మెయిన చేయుదు, మేమెయ్యదియైన నెందు నెప్పుడు మాకన్, దామోదర యశుభస్థితి, లేమి శుభము కలిమి నీదు లింపయ కాదే. భీష్మ. 2-9

4. పూర్వము, మునుపు.

వ. ఎప్పటి పాలికంనికిం బోవుదమనిన నతం డాద్వైపాయనప్రాదం, బాపీమలోనిది గామియెఱుంగుం గావున నమ్మాటకియ్యకొని. శల్య. 2-229

5. మొదటి నుండియు, చాల కాలము నుండియు.

క. గదఁగయ్య మెప్పఁడొకో చేయుదు భీమునితోడ ననుచు మల్లం బునఁ గోరదు నెప్పుడు నిప్పుడు నాకది యొదవెన్ విధికృతిం గృతార్థుఁడనైతిన్.

శ్లో. చిరకాలేప్సితం దృష్ట్వా హ్యవయస్థమిదం మమ, త్వయా సహగదాయుద్ధం త్రిదశై రుపపాదితమ్ సం. భా. శల్య. 57-40

ఎముక దే. వి. ఎమ్ము

అస్థి, బొమిక, బొక్కె

ఉ. కొన్నటి నప్పళించుకొని కోవెముకల్ మఱుమాడు. శాన్తి 1-18

వ. ఆ భూపాల్లభుం దతని బిరియెముకం గల వ్రేసిన, శల్య. 2-267

ఎముకయూట దే. వి.

మజ్జ మూలగ, ఎముకలయందుఁ బుట్టు నొకానొక జిగురు పదార్థము. దీనియందియే సంతానోత్పత్తి కారణభూతమగు శుక్రము పుట్టును.

సీ. ఎముక యూటి, చవిగొని యానుచు. స్త్రీ. 2-9

ఎమ్ము దే. వి.

ఎముక.

సీ. చతురంగములును జర్జరితంబులై యవయవ భేద మెఱుఁగని యట్లుగాఁగ, దుసిసిన నెత్తురు వెనడును నెమ్ములు, నెఱచియుఁ గండలు నెనసి సమరతలము ఘోరంబుగా. ఉద్యో. 2-144

**ఎంపనుగ్గు** దే. వి.

ఎముకల పొడి.

ఉ. ఎంప నుగ్గు లొం,డొండ ధరిత్రిపైఁ దొరఁగ. ద్రోణ. 2-122

**ఎంపపొడి** దే. వి.

ఎముకల పొడి.

క. కినిసి ఒక మర్దనుఁడు...క్రుమ్మెం, గనుకని నెంప పొడినెరఁ గాలంగేలన్. ద్రోణ. 5-62

**ఎయిదించు** దే. స. క్రి.

ఎయిదఁజేయు.

తెలుపు, ఎఱిఁగించు

క. చని యక్కుమారుఁ డేమన్యో నా యత్తెఱఁగెఱిఁగి మనకు నెయిదించుమ పుట్టిన కార్యమునకుఁ దగియెదు, పనియట విధిగెలువ వనమె బ్రహ్మకునైనన్. విరా 5-287

**ఎయిదికొను** దే. అ. క్రి.

1. కూడుకొను, ఒక చేదికిఁజేరు.

వ. మమతపతి కనుఁగనహితుఁడై సహస్రస్యందనంబుల తోడ నెన్ను దన్ని సిరిచెనంతఁ దక్కడి బలంబులు నెయిదికొని యమ్మెయిన్న దళంబుగాఁ గవిసిన. విరా. 5-2

2. దగ్గఱు, సమీపించు.

వ. పాంచజన్య రవం బాకర్ణించి సవ్యద వేగం బరియెదుకొనుమునిన దారుకుండు. ద్రోణ. 2-364

3. మార్కొను, ఢీకొను.

వ. అట్టియెడ నర్జునుండు కిఖండి వాలోకించి.

తే. నీవు భీష్మునకరిగిఁ దోపదేను, గలుగ నెఱపెం యతనిపైఁ

గవియు నెయిది,కొని మదీయ బాణంబులఁ గుప్పఁగూరఁ బఱపి కూల్చెద నీతనిఁ బటురయమున. భీష్మ. 3-333, 334

**ఎయిదు** దే. స. క్రి.

1. వెంబడించు, వెన్నాడు.

వ. అట్టియెడ ధర్మతనయుం డనిలనందను నవలోకించి సత్వరంబగు చిత్తంబుతో మత్స్యవిభుని వలను సూపుచు నిట్లనియె.

తే. ఇతని యాశ్రయమున మనమెల్ల బ్రదికి, యున్నవారము గావున నుగ్రరిపుల, పాలువడకుండ విడిపింపఁ బాడి యితని, నెయిదు మెయిదుము రథరయ మెసక మెసఁగ. విరా. 3-202, 203

2. తఱుము.

వ. ...సువర్మ లోనైన బంధుజనంబులు వాదిగాఁ గల పరివారంబు పలాయన పరాయణం బగుటయు వెనుకొని యెయిది గోధన వర్గంబు మరల్చి. విరా. 3-219

3. అందుకొను, చిక్కించుకొను.

ఆ. ఇట్లు పఱచుటయును నంతయు రయమున, నమ్మృగంబు వెనుక నరిగి యరిగి, యెయిద లేక ధామనీకుండు సొంపిఁ, బవరి తేరు వేగ పఱవు మనియె. హర. 4-337

4. చేరు, సమీపించు.

వ. ఆలోన సైంధవుండు సంభ్రమంబున వాతి కృపాణ చర్మంబులు గొని రథంబుడిగ్గ నుఱికి రయంబున నెయిది యదల్చినంగని జనక ద్వేషియగు నతని రోషంబగ్గలింప వాపురంధర పౌత్రుండు వార వుని విడిచి యద్దెసకు లంఘించి కవిసె. ద్రోణ. 1-170

వ. నిరామిషంబైన యీ చేతో ననిచేయం బనిలేదు. వీర లెయిది యడ్డపడి తడవు సేయకుండు నట్లుగా ముట్టికొని పసులం బెట్టించి దొరయును నెలగడవంబోవక యుండఁ గామవవలయు.

విరా. 4-?50

ఎద్దు దే. స. క్రి.

ఎయిదు.

1. పొందు.

ఉత్సాహ వృత్తము: ... ఏను లో,కావిలక్ష్యముదుపఁబూని యరుగు
దెంచితిన్ సుతా, భావజనిత దుఃఖ వార్ధి పారమెద్దు పుత్రకా.
ప్రి. 1-66

2. పైకెత్తు.

ఉ. అంతకు భీమసేనుఁడు రయంబెసఁగన్ గద నెద్ది పట్టి య,త్యంత
రయంబుమైఁ బిటిఁది కాతని ద్రోచిక నద్గదాపరి, భ్రాంతి వెలుంగ
నిల్చిన. ద్రోణ. 1-181

3. చేరు, సమీపించు, దగ్గఱు.

ఉ. అతఁడు సిక్కెనేని బలమంతయు విచ్చు మరల్పవచ్చు గో,వ్రా
తము నట్లయైన సుకరంబుగ నంతట వెల్లఁదీఱు నీ, యాతత సేన
యం దతని వారసి కానకయున్న వీరి ని,ట్లేతలడించి యాకదువు
నెద్దఁగఁ బోదముగాక వ్రేల్మిడిన. విరా. 4-247

అ. క్రి.

1. తప్పించుకొని పోవు.

ఉ. ధరణీశ్వర యింతకు మున్ను వీటికిం, బోవవు శత్రునే పుడిపి
పోయెదు వాఁడవు గావు నీవు సై,న్యావలి యైనఁ జేద్పడక
యాతల కెద్దుట లేదు నేనియున్. విరా. 4-192

2. తోడ్పడు.

(అభిమన్యుని మరణమునకు దుఃఖించుచు అర్జునుఁడు.)

చ. పలువురు సుట్టు ముట్టికొని బాణ కృపాణముఖాస్త్ర శస్త్ర పం,
క్తులఁ గడు నొంపఁగా దనకుఁ దోడ్పడువారలు లేక నన్ మదిం,
దలఁపఁడ యత్తఱిన్ రిపువధంబున నెద్దుము తండ్రి యేను గొం,
దలమునఁ బొంపకుండనని తాఁ బలుమాఱును జీరకుండునే.
ద్రోణ. 2-247

3. చను, పోవు, వెళ్లు.

చ. సచివులఁ జూచి యిప్పుడు వెసన్ మన మెద్దక తక్కినం బలు,

ఎయ్యేని ప.[1] (ఏ+ఏని) యచ్ఛబ్దార్థకము (తచ్ఛబ్దార్థకము నపేక్షించును)

వ. ఎయ్యేనివేల్పు సాహాయ్యకంబు సేసెను నవ్వేల్పు సముదెంచి నీ వశంబున నుండు. అర. 7-328; ఆది. 5-13

2. ఏదియో, ఎవరో - అని నిర్దేశార్థమును సూచించును.

వ. ఇతండు కిరాతరూప ప్రచ్ఛన్నుండైన యెయ్యేని యొక్క దివ్య పురుషుండు గావలయు. అర. 1-315

వ. ఏము వసిష్ఠ మునివరు శాపనంబునంజేసి మర్త్యలోకంబునం దెయ్యేనియు నొక్క స్త్రీయందు జన్మింపం బోయెదము. ఆది. 4-127

వ. ఇవి యెయ్యేనియు నొక్క ధనుర్వేదవిదుం డయిన బ్రాహ్మణు నపత్యం బగునని తండ్రినకుం జూపిన. ఆది. 5-188

ఎర దే. వి.

1. (భూతములకు వేయు) బలి, ఆహుతి.

క. సరసతులు వెల్ల భీష్మున, కెరగా నొప్పింపఁజాలి నే నడవులకున్, మరలం బోయెద. భీష్మ. 2-8; ద్రోణ. 3-185

2. పశుపక్ష్యాదుల యాహారము, మేఁత.

తే. భయము దక్కి యచ్చోటన పలితు దెరకుఁ, గ్రుమ్మరఁగ. శాంతి. 3-203

వ. ఎరలకై వచ్చి యట్లు దోఁచిన వయ్యొలుక. శాంతి. 3-304

వ. ఎరకుఁ జెసంగు దేగల చందంబునఁ జిత్రగతులం బోరి పోరి. ద్రోణ. 3-268

క. ...ఎరకై, వెరవునఁ గాకులుఁ గ్రోఁతులుఁ, బరువడిఁ జీకాకు పఱుచు తంగి నంచుచున్. ద్రోణ. 1-258

3. ఆహారము.

చ. ఫలము దళంబునుం దొడిమఁ ద్రాయుట రాలినవానిఁ గొంచువాఁ, డలిరెర నేసి గోరసము కార్యము సట్లుల నిర్వహించి. అను. 5-56

4. వ్యసనము.

చ. తిరుగుచుఁ బుట్టలం దొదలఁ ద్రిమ్మరు పాముల రోసిరోసి వి.ష్ణు-
రతర దీర్ఘదండమున డొల్లఁగ వ్రేయుచు వచ్చివచ్చి య,య్యెర
వోక దుండుభంబు నహిం గని వ్రేయఁగ దండమెత్తుఁడున్, హరి
హరి యంచు దుండుభ మహాహి భయంపడి పల్కు భార్గవున్.
ఆది. 1-152

ఎరఁగు దే. అ. క్రి. ఎఱఁగు

1. క్రిందికి దుముకు, దిగ్గనుఱుకు.

క. సహదేవుండును గదగొని, మహి కెరఁగినయవ్వు డొప్పె.
ద్రోణ. 1—161

2. ఉఱుకు, లంఘించు.

సీ. మృగంబు పై కెరఁగు సింగము పోలెఁ గిట్టి సత్యముని గిటడంచి.
శల్య. 1—379; కర్ణ. 3-256

3. నమస్కరించు.

ఆ ఎట్టి రాజులును మహీసురోత్తము లెదు,రరుగు దెంచువప్పు డధిక
భక్తి, నెరఁగి ప్రియము వలికి తెరువిత్తురు. ఆది. 7-111

ఎరగలి దే. వి.

ఉల్క. ఆకాశమునుండి రేఖాకారముగాఁ బడు తేజఃపుంజము.
చూ. ఎరగలువోవు

ఎరగలిచిచ్చు వి.

దావాగ్ని, కార్చిచ్చు, అగ్ని.

చ. ఎరగలిచిచ్చు కాఱడవి యెల్లను మ్రుక్కి వెల్లున వోక్క పాయగా, దరికొని
రూపడంచిన విధంబున. భీష్మ. 2-5

వ. ఇట్లెరగలిచిచ్చు గవిసి చుట్టుముట్టిన నమ్మనుఁ వాపుండును
నపాశ్రితులు నిరాహారులై యునికిం జేసి యొక్కచోటఁ దఱియ
మఱికి తొలంగిపోవ లేరైరి. అర. 2-152

ఎరగల్లువోవు

ఉల్కలు పడి కూలు.

వ. మిగిలిన మాతంగంబులు పెనంగిన కనక లిప్తకాండంబు లూడు
కొనం దాఁకిన నెరగళ్లవోవు కొండల కైవడిం బొలుచు నవి
యును. కర్ణ. 3-227

శ్లో. శరైః కనకపుంఖైశ్చ చిత్రా రేజు ర్గజోత్తమాః
ఉల్కాభి సంప్రదీప్తాగ్రాః పర్వతా ఇవ భారత.
సం భా. కర్ణ. 52-17

**ఎరగొను** దే. స. క్రి. (ఎర + కొను)

1. ఎరగాఁగొను, ఆహారముగాఁగొను, ఆహుతిగాఁగొను.

తే. కురుకుమారులు దమయంతిఁ గుడిచి క్రొవ్వి, మీఁ దెఱుంగరు
మాకేమి మేలుకాక, నాలుకలు గ్రోయు నర్జునానలము దళిసి,
యెరగొనం గని సంతృప్తి యొనక మెసఁగ. ఉద్యో. 4-12

2. మేఁత మేయు.

సీ. చలనంబు లేక జాజలి తపోనిష్ఠ నాసీనుఁడై యుండఁ బిచ్చికలు
గూఁడు, గావించెఁ దన్మస్తకంబున నమ్మౌనినము గారణముగ
నండములు గలిగి, పిల్లలై వర్తించి యెల్లెడ నెరగొన నరుగుచు.
శాంతి. 5-224

**ఎరవగువాఁడు** దే. సర్వ.

లేవబద్ధి గలవాఁడు, అమ్మ్యఁడు.

క. వైరుల దూతలు చెరవగు, వారు నిరాకృతులుఁ బాపవర్తులుఁ
దమకుం, దెరువగా వర్తించుట, నేరమి తుదఁ బోయి చేటునిందయు
నచ్చున్. విరా. 1-138

**ఎరవలి** దే. వి.

ఎరగలి, కార్చిచ్చు, దావాగ్ని.

తే. కనక భూషణ జాలంబు కనన గఱము, లెరవళుల ప్రోవు కొండల
నెనసియొప్పె, వల్గనంబుల హేషల వలన వల్గి ఘనతరంగంబులను
దురంగములు వొలిచె. భీష్మ. 1-83
('ఎరవళులు వోవు' - అని పెక్కు ప్రతుల పాఠము)

**ఎరవళ్లవోవు** దే. అ. క్రి.

ఉల్కలు పడి మండు.

చూ. ఎరవి ('ఎరవళులపోవు' - అని కొన్ని ప్రతుల పాఠము)

ఎరవు దే. వి.

కొంతకాలము వాడుకొని తిరిగి యిచ్చుటకు అడిగి తెచ్చుకొను సొమ్ము.

క. ఇమ్ముగ నరేశ్వర మాతుర, గమ్ముల నీ కార్యమయ్యెగాదే కడు లో, కమ్మున నొండ్లవి సొమ్ములు, రమ్మనగన్ వచ్చునే యెరవు సతమగునే. అర. 4-347

క. తన యొడ లెరవని నను మను, జనకును బంధుతతి సతమె శోకించిన వ, చ్చిన చచ్చిన జంతువు నె, మ్మన మధికము నొచ్చెగాక మహిత వివేకా. శాంతి. 1-220; స్త్రీ. 1-88

(ఇక్కడ 'ఎరవువంటిది, అనిత్యము' అని భావము)

2. భేదము, అరమరిక.

క. గురుభీష్మాదుల మనములు, దురమునకుం గొరకయుండ దుర్యోధను డాతురుడై యొడబడుపడగ విప్రరుచున నెరవైన యిచ్చ వడు బలమెల్లన్. ఉద్యో. 1-58

విశ.

1. ఎరవయినది.

చ. హరి గలుగంగ చేటికి భయంబున వచ్చితి నీదుగాండివం, బెరవుగ నిచ్చి నీవు వొగలెక్క హరిన్ రథిచేయగన్న వి,ష్ణురథుల విక్రమోగ్రుడగు సూతతనూభవు దర్పహాయులం, బొరిగొనదే సుయోధనుని బోదిమి దూలగ నొక్కమాత్రలోన్. కర్ణ. 3-65

2. అన్యము, లాతి, తనది కానిది.

వ. మమ్మెరవుగా దలంచి యిచ్చ్యెడ విట్టట్టన వలవదు పురంబున కరిగి యచ్యెడ నీకెట్లు ప్రియం బట్ల మన్నింపుమని రందుగంకుండు మఱియు విట్లనియె. విరా. 3-234

క. తనకుం దా నెరవని నను, నిను బంధులు సతమె యన్వివేకంబునవే జనుల యిట్లు శేయ నర్హులి, నను వగ నొందదది కారణముగవ రేంద్రా. శాంతి. 4-11

శ్లో. ఆత్మాపి చాయం న మమ సర్వా వా పృథివీ మమ
యథా మమ తథాన్యేషా మితి చింత్య న మే వ్యథా.

సం. భా. శాంతి. 174, 14

క. వరనాయక నీ యేలెడు, పురమున భూమిని మమత్వబుద్ధిగలుగక,
స్థిరవై యుండుటకుఁ గతం,బరయఁగవెద్ది వినుపింపుమది విశదము
గన్. ఆశ్వ. 2-91

**ఎరవుపడు** దే. అ. క్రి. (√ఎరవు)

కలహించు, భేదపడు, ద్వేషించు.

వ. అట్టియెడ సహదేవుం డావైనేయు నుద్దేశించి...మీలో మీరెరవు
పడం దగునే యలుకదక్కు మనునెడ. ద్రోణ. 5—871

**ఎరవుమాట** దే. వి.

ద్వేషపుఁబలుకు.

వ సురనదీసూను దిక్కు మొగంబై సుయోధనుండు నీకుం గోపింప
నగునే నన్నును గార్యభారంబునుం జూచి వా బ్రదుకునకై సర్వం
బును సహింపవలయునని తేర్చి యంగరాజుం గనుంగొని మీ
రిద్దఱు నొక్కటియై భరంపడి యిప్పని సక్కం జేసి కాక మీలోన
నిట్టి యెరవు మాటలేం యని పొదివి పలికి. ఉద్యో. 4-253

**ఎరవుసేయు** దే. స. క్రి.

తనదికాని దానిని గాఁజేయు, ఎరవు వస్తువుగాఁజేయు.

క. ధనములు బంధులు భోగము,లనియెడు నస్థిరములెల్ల నాత్మకెరవు
సేసిన శాంతి యలవడును మనమున శాంతిశ్రీ సమృద్ధిమోక్షము
నిచ్చున్. శాంతి. 4-346

**ఎరసేయు** దే. స. క్రి.

1. ఎరగాఁజేయు, బలియిచ్చు.

చ. అతని శిఖండి బాణముల కెర్లరసేసితి. కర్ణ. 3-120

క. ...అప్పాంచాలో, త్తరు నొక వారనమునకు, నెరసేసె.

శల్య. 1-214

2. ఆహారముగా గొనరించు.

చ. ఫలములు దళంబులుం దొడిమెలుఁ ద్రాళ్లుట గాలినవానిఁ గొంచు నాఁ,
కలి కెరచేసి గోరసము కార్యము నట్టుల నిర్వహించి. అను. 5-55

ఎరియించు దే. స. క్రి.

తపింపఁజేయు, పీడించు.

వ. బకునితోడంబుట్టువగు నలాయుధుం డను నసురేంద్రుండు వడ ముడివడినవైరంబు పెద్దకాలంబేనియు మనం బెరియింపం దలి వేచికొని యుండి యన్నిశా సంగ్రామంబునకు ససైన్యంబుగాఁ జనుదెంచి దుర్యోధనుం గని తన్నెఱిగించుకొని యతనితో నిట్ల నియె. ద్రోణ. 5-209

ఎరియు దే. అ. క్రి.

1. దగ్ధమగు, మండు, కాలిపోవు.

సీ. మతియొక్క వెవ్వగ మనమున జనియించె, వాఁడిలోయుండు గా రగ్గి యెరిసె. అశ్వ. 2-165

క. గురు కర్ణుల యస్త్రాగ్నుల, నెరసిన యడవిమున్న దీని నిటుగాకుం డం, దరపడి రక్షించితి సంగరము దెగినఁ దొలఁగి యుపుడు గాల విడిచితిన్. శల్య. 2-337

శ్లో. అస్త్రైర్బహువిధైర్దగ్ధః పూర్వమేవాయ మర్జున,
మదధిష్ఠితత్వాత్ సమరేన విశీర్ణః పరంతప.
ఇదానీంతు విశీర్ణోఽయం దగ్ధో బ్రహ్మాస్త్ర తేజసా.
సం.భా. శల్య. 62-18-19

2. పరితపించు, బాధపడు.

క. పరుల ధనమునకు విద్యా, పరిణతికిం దేజమునకు బలమునకు మనం, బెరియఁగ నసహ్యపడు న,న్నరుడు దేవులు లేని వేదనం బడు నధిపా. ఉద్యో. 2-58

క. శరవేదన సర్వాంగము, లెరియఁగ శాంతనవుడు పెదవులెండెడుఁ దృష్ణాతుర ముడుపదగిన నీరులు, వెరవునఁ దే నేర్తు వీవ వే తెమ్మనవుడు. భీష్మ. 3-428; ద్రోణ. 4-286

8. నశించు చచ్చు.

క. కౌరవులు దమదురితమునఁ, దా రెఱిసిరి కల్మషంబు దానఁ గలదె
భూ,భారము వహింపు బహు యజ్ఞారంభణ మాచరింపు మఖిల
హితముగన్. శాంతి 1-105

తోటక వృత్తము: తమతమ తప్పులఁ దా రెరియంగా, విమలమతీ
యిటు వీరికినై శో,కమున దహింపఁగఁ గాదు మనంబున్, సము
చిత మిత్తఱి శాంతము సుమ్మీ. స్త్రీ. 1-81

శ్లో. ఆత్మాపరాధాత్పుత్రాస్తే వినష్టాః పృథివీపతే,
మా శాన్ శోచస్వ రాజేంద్ర న హి శోఽకే స్తికారణమ్.
సం. భా. శాంతి. 8-85

ఎఱ దే. విణ.

ఎఱ్ఱనిది, అరుణము.

క. నిలిచి మహాస్త్రిం బెఱమం,టలు గ్రమ్మఁగ వేయుటయు
భీష్మ. 8-117

ఉ. నెత్తుటఁ దోఁగి నేల యెఱనింగి తెఱంగున నుండె నక్కుమా
రోత్తముఁ డందుఁ జంద్రుక్రియ నొప్పె. ద్రోణ. 2-127

ఎఱంగు; ఎఱఁగు దే. అ. క్రి.

1. వ్రాలు, దిగు.

ఆ. దానిమీఁద నుండి వాని రెంటిని ఘటిం,పంగ మదిఁ దలంచి పంచ
యోజ,నములు నిడువు గల్గు రమణీయ శాఖపై, గరుడుఁ డెలమి
నెఱఁగెఁ గురువరేణ్య.

క. ఎఱఁగిన యప్పెనుద్రేఁగున విఱుగుటయును. అను. 1-236, 287

వ. కొలంకుల చందంబు నొంద వాని కెఱఁగెడు కౌదమతుమ్మెద
పదవుం పగిదిఁ దొరఁగు వాఖఁడలతనయ ఖండిత పరవీర శాలా
యస వారాచశకలంబుల వలనము. విరా. 5-60

2. పడు, రాలు,

వ. శ్రుతవర్మ శిరంబు భల్లంబునం ద్రుంచిన నది ముఖకాంతి మెఱయం
జంద్రమండలంబు మహి కెఱఁగు తెఱంగుఁ దోపం బడియె.
కర్ణ. 2-216

3. నమస్కరించు.

క. మహోదారుఁడు గుంతీ చరణాం, భోరుహముల కెఱఁగి వినయ భూషణుఁ డగుచున్. ఉద్యో. 4-9

సీ అవకు సుఖాసీనుఁడైన వసిష్ఠ సంయమిఁ గాంచి భక్తిఁ బాదముల కెఱఁగి. శాంతి 6-3

వ. వేదవ్యాస మునివరు పాదంబుల కెఱంగి. అశ్వ. 1-137

వ అమ్నరపతి చరణంబుల కెఱంగి. అశ్వ. 3-139, ద్రోణ. 5-428

ఎఱక దే. వి.

పక్క ఱెక్క.

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము, తెఱచుచు వేఁగదరి దొగసి త్రెళ్లి వివశుఁడై, యఱచిన నోడకు మని హరి, నెఱి నక్కఁగఁ ద్రోచి యెత్తె నెగయంగఁ గృపన్.

ఉద్యో. 3-301; విరా. 2-240 కర్ణ. 2-72

('ఎఱకలు' — అని బహు వచనమునందే ప్రయోగము.)

ఎఱచి దే. వి.

మాంసము.

సీ. ...వెనదును వెమ్ములు నెఱచియుఁ గండలు వెనసి సమర -తే- తలము ఘోరంబుగా. ఉద్యో. 2-144

క. ఉఱవగు వారుగ పంటలు, గోతియుల పాడియును దఱచగుం బురుషులకుం, దెఱవలు చుట్టము లయ్యేద, రెఱచియు భుతియుంతు రర్థి వెల్లజనంబుల్. అర. 4-295; ఆది. 5-58; స్వర్గ. 82

ఎఱింగించు; ఎఱిఁగించు దే. స. క్రి.

ఎఱుఁగఁజేయు.

1 ప్రకటించు.

సీ హయ మదద్విరద రథా రూఢ దశత, ప్రకటించువారును ప్రాస శక్తి, కుంత తోమర గదా కుశలత్వ మెఱిఁగించు,వారునుగా నిట్లు వసుధలోన -ఆ- రాజసుతులంతోడ రమణఁ బాండవ ధృత

ధార్తరాష్ట్రసుతులు వృద్ధ రాజులొద్దఁ, దద్దయును ముదమునఁ దమ
తమ విద్యలు. మెఱసిరెల్ల జనులు మెచ్చి పొగడ. ఆది 6-11

క. కుంతీ తనయులు సమయము, శాంతత మై నడపి తమ భుజాబల
మును దుర్దాంతోద్యమ శౌర్యము వెలిఁగింతుమనుచు నున్న
వారు గిమకెఁద గదురన్. విరా. 1-13

2. తెలియఁజేయు.

క. అన విని తగుమాటల వా.తని కొండలపాటు పాండు తనయుండు
గ్రమం,బున డిందుపఱచి యరదము, సనఁగా వెలిఁగించి పట్టె
శంఖము మఱియున్. విరా. 4-178

తే. ఊర్ధ్వగతి కేఁగు మానవు లుండునట్టి, వెలవు లార్యులు శాస్త్రము
నిశ్చయమునఁ, గని యెఱిఁగింతు రవి నీవు వినుము నీకుఁ,దెలియు
నట్లుగఁ జెప్పెద ధీసమగ్ర. అశ్వ. 1-182

ఎఱుఁగఁబడు దే. స. క్రి.

తెలిసికొనఁబడు, కనఁబడు.

ఆ. వివిధ దుర్నిరూప వేషముల్ గైకొని, నిఖిల దిశల యందు
నిపుణ వృత్తి, నెఱుఁగునట్లుగా ననేకులఁ బుచ్చిన, నెల్ల నేఁటిలోన
నెఱుఁగఁబడరె విరా. 8-93

ఎఱుఁగమి; ఎఱుంగమి దే. వి.

అజ్ఞానము, అవివేకము.

క. ఎఱుఁగమి చీఁకటి నీ పెద్దఱికంబు దలంప నేమి తప్పు గలిగినన్,
మఱచి దయఁజూడు మిట్లం.దఱు నీకుం బనులు సేయఁ దగుదురు
వీరల్. విరా 5-367

చ తన మును పడ్డ బన్నములుఁ దమ్ములనిపైఁగల కూర్మి పేర్మి నీ,
జనపతి సైపకున్నె యది నక్కని రాజ్యము పాలు లేక తీ,ఱున
కొడఁబాటు గల్గిన నెఱుంగమి వెట్టరె చాలరైరి వీ,రన రొకొ
వానలేమి యని యాడరె లోకము వారు కేశవా. ఉద్యో. 3-102

ఎఱుంగు; ఎఱుఁగు దే. స. క్రి.

1. తెలియు, గ్రహించు.

7. విచారించు.

తే. వాలి యజ్ఞాతవాస సంవత్సరంబు, నిండకుండంగ మున్న పార్థుండు బయలు, మెఱసి సమయంబుదప్పె నీవెఱింగి దీని, కిది దగు నది సేయుము మేదినీశ. విరా. 5-368

8. అనుభవముచే గ్రహించు, అనుభవించు.

క. హరి కులిశక్షతి యెఱుఁగని, గురుతర పక్షములతోడి కులగిరి వోలెన్, గరుడుండు గగన గతి నురు, తరజవమున నరుగుదెంచి తల్లికి మ్రొక్కెన్. ఆది. 2-41

ఉ. ...వీఁడు నీ, చేతుల లావెఱుంగఁడు విశిష్టకుభం బిది నీకు ఫల్గునా. ద్రోణ. 3-188

9. క్త్వార్థకముపై వ్యతిరేకార్థక క్రియారూపమునఁ జేరి 'లేదు' అను నర్థము నిచ్చును,

వినియెఱుఁగఁడు = వినలేదు; చూచి యెఱుఁగఁడు = చూడలేదు.

క. ...ఇట్టి సభన్, మానవ లోకేశ్వరులం, దె న్నఁడుఁ జూచి వినియు నెఱుఁగ ధరిత్రిన్. సభా. 1-53

చొచ్చియెఱుఁగఁడు = చొచ్చుట యెఱుఁగఁడు - ప్రవేశించినవాఁడు కాఁడు - ప్రవేశింపలేదు.

క. బాలుఁడు సుకుమారుఁడు పెక్కాలములం జొచ్చి యెఱుఁగడనక మొనసొరం, జాలుదు చొరుమని పనిచితి. ద్రోణ. 2-141

ఎఱిఁగి ఎఱిఁగి = బాగుగా దెలిసికొని.

ఆ. ఎఱిఁగి యెఱిఁగి నన్ను వేశార్థసముపేతుఁ, బాడియయ్య యిట్టి పనికిఁ బనుప. అర. 2-86; అర. 3-321

ఎఱుక దే. వి. (√ఎఱుఁగు)

1. జ్ఞానము, తెలివి.

తే. క్రీడదెసఁ గౌతుకం బరియాడ రతుల, చవులు గొనియాడ వారు దీని సుఖంబుగాఁ గోరరెందు. విరా. 2-70

తే. ఏన నీవను ద్వైక్యంపు టెఱుక వోదముఁ, గాత గమనాగమనములు

గ్రాఁగిపోవ. శాంతి. 4-248

2. స్మృతి.

ఆ. ఎల్లవారు నెఱుక లెడలి చొక్కి క్కి నిద్రాతిశయము గూరినట్టు
లైరి. విరా. 5-208

3. ప్రజ్ఞ.

వ. పవట యనియెడు నగ్ని నెఱుక యనియెడు నీట నార్పుము.
స్త్రీ 1-92

శ్లో. పుత్రశోక సముత్పన్నమ్ శోకాగ్నిం జ్వలితం తథా।
ప్రజ్ఞాంభసా మహాభాగ నిర్వాపయ సదాప తవ॥ స్త్రీ. 8-49

4 ఆత్మానాత్మ వివేకము.

సీ. తారు గొందఱకు బాధకులయి నడచుట నరులచే బాధలఁ బడుట
గలుగు, నివి కాలభావ్యంబు లెఱుక గల్గిన వారుఁ బఱచితి వారు
నిచేఁ బడితి నమచుఁ, బురుషుండు ప్రియశోకమునఁ బొందఁడు.
శాంతి. 1-188

5. ప్రసిద్ధి.

సీ. పాండు కుమారులు...భూసురవరుల వలన, వేదంబులును ధనుర్వే
దాది విద్యలుఁ, గఱచుచుఁ గడలేని యెఱుకఁ దనరుచున్నఁ దద్వి
పుల గుణోన్నతి నైవక. ఆది. 8-12

ఎఱుకచే(సే)యు దే. స. క్రి.

తెలియఁజేయు, తెలుపు.

ఆ. ద్వారపాలు రచట వారింప శాంతిమై, నూరకున్నఁ జూచి వారు
వెఱచి,లోని కెఱుకచేసి లోఁగుచు వారు దన్నమున నరిగె నృప
గృహాంబు చేర. శాంతి. 6-268; ద్రోణ. 4-188

ఎఱుకపడు దే. అ. క్రి. (√ఎఱుక)

1. తెలియు, బోధపడు, స్పష్టపడు, ప్రకటితమగు.

క. హరి పలికిన విధమెంతయు, నెరనై యున్నయది వింటి యిమ్మాట
తెఱం, గరయఁదము తొలుత నీ వెను,వరి బంధం బెల్ల నెఱుకపడి
యెడుఁ బిదపన్. ఉద్యో. 3-314; స్త్రీ 2-167

ఆ శాపమిచ్చువాఁడు జనని యుత్సంగంబునందు నిద్రపోయినట్లు యుండి, యమరవరుల కళనకైన యవోఢ్యస్వ సం,శాపణంబు లెలుకపడఁగ వింటి. ఆది. 2-134

2. అనుభవించుచున్నట్లు తెలియఁబడు.

గీ. అధిక దుఃఖరోగార్తున కౌషధంబు, సురచిరంబుగ సౌఖ్యంబు చూపె యెందు, నొనర భార్యాసమేతుఁడై యున్న వాని. కెంతల యుద్యమ నాపద లెలుక వడవు. అర. 2-78

ఎలుకు దే. వి.

కిరాతుఁడు, నిషాదుఁడు.

తే. పఱప నోపకియున్న మైమఱచి పెండెఁ, జెనఁగియున్నను బ్రతికింప మొనసియున్నఁ, దెవులుగొని మృగములఁ దివిరి యేయ, రెలిచి యాహారముగ మను నెలుకులయిన. ఆది. 5-56

క. ఎలుకని యెఱుఁగక నిన్నున్, మఱకువ నెదిరితిని దీని మఱవుము నన్నుం, గఱకంఠా క్షమియింపుము, నెఱి నెవ్వరి కెఱుఁగ నగునె నీ చరితంబుల్. అర. 1-827

ఎలుకువ దే. వి. (√ఎలుఁగు)

అనురాగము, ప్రేమ.

తే. అవయవ భంగులందుఁ, దగిలి మఱపునఁ దడయు సిద్ధుల విరాల, నయన దీపుల నెలుకువ బయలువడఁగ. విరా. 5-895

క. ఎఱిఁగినఁ జేరఁడు చేరుట, యెలుకువమై మనకు దైవ మిచ్చినసిరి యిట్లఱిమిన యాలోగ్రక్కున,నలుకు మిటఁడు దెగిన మన మనః పీడ దెగున్. ద్రోణ 8-184

ఎలుగలి దే. వి.

పెరుగుట, పెంపు.

సీ. ...దమంబెలుఁగలి యధికంబైన, శ్రోత స్పర్శముఖప్రసృతి రజస్సు అ-పెరిగినపుడు మధ్యసరణి సత్త్వము వృద్ధిఁ బొంద మూర్ధ వృత్తిఁ బొందు. అశ్వ. 2-125

**ఎఱ్ఱ** దే. వి.

ఎఱుపు, ఆరుణ్యము.

సీ. ...పల్లవముల కట్టెఱ్ఱకుఁ బన్నువొసఁగి. విరా. 2-114

విశే.

ఎఱ్ఱనైనది.

క. నరుఁడలుక వొడమియును సుస్థిరుఁడై తన యెఱ్ఱనెరల చెలువునఁ గెంద మ్మరలం దెగడెడు కన్నుల నరుణచ్ఛవి నెఱయ... విరా. 2-132; కల్కి. 2-268

**ఎఱ్ఱఁదనము** దే. వి.

ఎఱుపు రంగు.

సీ. ఎఱ్ఱఁదనంబుఁ దనరిన మూఁపులు, నాయత స్ఫీతంబులైన బాహువులు వెడఁదయురంబునై పొలుచు నతఁడు భీముఁడు. ఆశ్వ.2-40

**ఎఱ్ఱన** దే. విశే. (ఎఱ్ఱ)

ఎఱ్ఱనిది.

సీ ఆశోకవతిమీఁదఁ గడు నెఱ్ఱనైన క్రేఁగంటి చూడ్కి, వినిడించి. మాన 1-45

**ఎఱ్ఱనవ్వు; ఎఱ్ఱని నవ్వు** దే. వి.

కోపముచేఁ గలుగు నవ్వు.

చ హాయముమీఁద సూతుపయి వానిని యంగములందు నస్త్ర సంచయ మదరించినం గమల దారుణ భంగిన నెఱ్ఱనవ్వు చె, న్నయి వికసిల్ల కల్లమున నన్నరసూనుఁడు త్రుంచె విద్విషన్నయ దవిలాస బాహు సముదగ్రత వాని శిరంబు గ్రక్కునన్. ద్రోణ. 2-64

క. అప్రసురాధిపు డెఱ్ఱని, నవ్వొలయఁగ మాఱుకొనె మృధా రహితుడై. కల్కి 1-248 (పాఠాం)

**ఎఱ్ఱనార్యుఁడు** వి.

ఎఱ్ఱ కవి- కవిత్రయములో మూఁడవవాఁడు.

సీ ఁమ్మఁడు ధరై న్నకతత్ప్రరాత్మ-తే-డెఱ్ఱ నార్యుడు (మా. అనుబంధము -వివరింపుటను) అర. 7.470,471

**ఎఱ్ఱని చూడ్కి** దే. వి.

కోపముగల చూపు, కోపదృష్టి.

ఉ. క్రోధవేగ సముదగ్రత నెఱ్ఱని చూడ్కిఁజూచి. విరా. 5-193

**ఎల** దే. విశే.

(వృత్తియందు 'ఎలమి'లోని 'మి' వర్ణము లోపించిన రూపము).

1. లేఁతది, కోమలము. చూ. ఎలదీఁగ.

2. అభినవము, నూతనము. చూ. ఎలజవ్వనము.

3. స్వల్పము. చూ. ఎలనవ్వు.

**ఎలచన్నుఁగవ** వి.

లేఁతచన్నుల జంట- బిగుతుగల చన్నులజంట.

సీ. మారేడుపండుల గారాము సెఱచు నీ, యెలచన్నుఁగవ వేడుకల
నొనర్చె. అను. 1-5,

**ఎలజవ్వనము** దే. వి.

నూతన యౌవనము.

తే. శ్రమములేదు ప్రతోదద్రవణములులేవు, నాతియును నేను నెల
జవ్వనంబుఁ గంటి, మిది మహాద్భుతతర మందుమే భవన్మ,హాను
భావత్వ మేమి సేయదు మునీంద్ర. అను. 2-314; ఆది. 3-27

**ఎలదీఁగ; ఎలదీఁగె; ఎలదీవ** దే. వి.

లేఁత తీఁగె.

సీ ఎలదీఁగఁ గప్పిన లలిత పరాగంబు, క్రియ మేన మేదినీరేణు వొప్ప
విరా. 2-188

సీ. సోలెడు నెలదీఁగెలీలఁ గ్రాలుచు వింత, చెలువంబు దలకొనఁ జేరి
నిలిచి (సం.ము ప్రతి, ఆకా-ప్రతి) విరా. 2-64

సీ. మావి మ్రోకల నెఁదీవలఁ జెన్నొందు తోఁటలకడ నలి తోడఁ
జెఁది. శాంతి. 3-332

**ఎలదేఁటి** దే. వి.

కొదమతుమ్మెద.

సీ. మకరంద రసపాన మదవిలోలంబులై, క్రాలెడి యెలదేఁటిగముల యులివుఁ. అర. 7-212

**ఎలనవ్వు** దే. వి.

చిఱునగవు, కొద్దినవ్వు.

క. తలచుట్టుచుట్టెఁ గుండలములు పెట్టెను ద్రిండు గాథముగఁగట్టెఁ గరంబుల వలయంబులు గనుఁగొని, యెలనవ్వొలయంగ నెక్కె నేత్రైల రథమున్. విరా. 4-165

**ఎలనాఁగ** దే. వి.

యువతి, స్త్రీ.

వ. కావున నా యెలనాఁగ నేమి య పాయంబునకైన నమ్మం జేర్పనైతేని గంధర్వ దర్పంబున నలందుని వందుదుఁ ననిన విరా 2-88

తే. ...అయ్యెలనాఁగయు సంభ్రమంబు, దెచ్చికొని తా నెఱుఁగని తెఱఁగు దాల్చి, కార్యమున్ మనమ్మలించి పాంచాలితోడ, నెఱుగు వేఁతోక ధంగిగా నిట్టులనియె. విరా. 2-155

**ఎలపఱుచు** దే. స. క్రి.

ఎలి చేసి అవమానించు.

క. పెట్టన రథలో వేవురఁ గట్టెదర నరాతిశనముగా రెంగయు వా, రెట్టితులువలో ద్రౌపది, నట్టెలపఱిచెడిరె జూదమాడరె యెదున్.

ఉద్యో. 1-344 (సం.శో.ము. అ.కా. ప్రతులు)

**ఎలప్రాయము** వి.

జవ్వనము.

క. ఎలప్రాయ మిచ్చితిని నీ,కలఘుమతి యిచ్చెదను మదాజ్ఞ మల్లం, బలరఁగఁ బెండిలిగమ్మనిఁ బలికి మఱియు నాతప్పంగి యిట్లని యెన్. అశ్వ. 2-78 (మూ. 79)

**ఎలమామిడి** దే. వి.

లేమామిడి, లేఁతదైన మామిడి చెట్టు.

ఉ. ...సుయోధనుం డదె యహీనబలంబులఁ గూర్చెఁ గర్ణుతో, మత్తగజంబు లీల నెల మామిడిఁ గూర్చిన భంగిఁ బాండుపుత్త్రో త్తమ వీనిఁ గూల్చు మతఁ డొంటిగ రాజ్యము నీకు చేకుఱున్. కర్ణ. 2-350

**ఎలమావి** దే. వి. ఎలమామిడి

లేమామిడి (తియ్యమామిడి అని మూ. అ ని)

వ. అప్సరపతులు నఱుకుడువడిన యెలమావి తోఁపంబుల చందం బగుటయు ద్రోణ. 2-85

**ఎలమి** దే. వి.

1. సంతోషము.

క. ఎలమియు నచ్చెరువును నరి, నెలసిపొదలు మానసమున నెంతయుఁ బ్రొద్దేఁ, గలలోనఁ గన్నచందము, దలఁచుచు నుండితిని భక్తి తాత్పర్యమునన్. విరా. 1-25 (మూ. 28)

తే. ఇవ్విధంబున నభిషేక మెలమిఁ జేసి. ఉద్యో. 4-159

2 ప్రేమ, అనురాగము.

సీ. ఎలమి నమ్మెలఁత నన్నెలయింపఁ దివిరినఁ నెడఁద కానందంబు నిక్కగాదె. విరా. 2-36; 1-10

3, అనుగ్రహము, దయ.

తే నామనంబు నానంద మగ్నమునఁ జేయ, నెలమి సన్నిధి సేసె సర్వేశ్వరుండు. విరా. 1-12

4. విలాసము.

క. అని పలికి గాఢనిశ్చయమున వదనం బెలమిఁ బొంద మును కలఁగిన నీ, మొనలెల్ల నొక్క మొగమున, నొనరిచి తలకొలిపె భూసురోత్తముఁ డనికిన్. ద్రోణ. 5-42

క. ఎలమియు వాటుటయును దన, వలచినయట్లివి యొఱంగ వావిధి చరితంబులు బలవంతంబులగుట, వలదె వివేకంబు పెద్ద వారికి నింద్రా. శాంతి. 4-397

4. పెంపు, అతిశయము, వృద్ధి.

క. అలుచైనను జగతుని దేవ, దలఁపు గలుగవలయుననిన దర్పోజ్జ్వల దో,ర్బలులగు కౌంతేయుల మన,మెలమికలిమి వచ్చి శేయిట్టుమట నగునే. విరా. 3-107

క. హీనస్థానమున విభవ,హీనత నిట్లుండి రివుల యెలమిఁగనియు నీ, మానసమున శోకింపమి, దానవకులంవాతి యెవ్విధంబునఁ గలిగెన్. శాంతి. 4-428

6. ఉత్సాహము.

తే. ఇవ్విధంబునఁ దమతమ యెఱుఁగు,లందఱును జెప్ప విని మరునంద మందు, దగవిచారించి కార్యంబు తెగువగాంచి. యెలమి వారలఁ గమఁగొని యిట్టులనియె. విరా. 3-112

క. సమరమునకుఁ దగు మద్యో,గమునఁ బ్రవర్తిల్లి కెలమిఁ గౌంతే యులు మృత్స్యమహీ వాథుఁడు సన్నా,హము సేసెన్ ద్రుపద విభుఁడు వాయిత మయ్యెన్. ఉద్యో. 1-49

7. ధైర్యము.

తే. శంఖ భేరీరవంబులు సామజముల, బృంహితంబులు వింత లే పృథుల సైన్య, పరిచయోదాత్తులగు నరపాలసుతుల, కెలమి బొందుము దీనికి వింతయేల. విరా. 4-175

8. క్షేమము, సౌఖ్యము.

ఉ. ఏనన వేఱ యొక్కఁడవె యిట్లనఁగాఁ దగునయ్య యిమ్మెయిం, గానన దేశవాసములఁ గాఱియ కోర్చి యడంగియుండి మీ, పూనిక దీర్చి మీకెలమిఁ బొందుట యెల్లను ఐజ్యదేవతా, మాన దయా సమృద్ధి నను బొందుట గాదె సురేంద్రనందనా. విరా. 5-346

9. సౌందర్యము.

క. వివిధాలంకరణంబుల, నవకాంతి వహించి పట్టణంబు విశాపో, త్సవ మాధవ లక్ష్మికి లలి,తవనం బై యెలమికలిమి తావల మయ్యెన్. విరా. 5-389

10. తెవులులేమి, ఆరోగ్యము.

సీ. నైజంబులైన-తే-కుసుమధూపాది గంధముల్ గొనుట వెలమిఁ దాల్పునని చెప్ప దరువు వేరంబు ఘ్రాణ, మున్నిశక్తి యిట్లయి దును నల్లసిలుట, వనఘ భూతంబు పంచభూతాత్మకంబు.
శాంతి. 4-88

11. విలాసము, శోభ.

క. అని తలఁచి నీదుపలుకులు, విని మెచ్చితి వరముగోరు విహగోత్తమ నీ, వనిన శుకంబు మహిజం,బునకుం బేరెలమి వేఁడె భూపవరేణ్యా.
అను. 1-157

ఆ అమర వల్లభుఁడు నమృతసేచనమున, భూజమునకుఁ దొంటిపొల్పు కంచె, మిగుల నెలమిసేసె మేలియాశ్రితు లిట్ల, మనకు రథిపుఁ గురుకుమారవర్య.
అను. 1-158

12 తోడ్పాటు, రక్షణము

(భీముని అర్జున సాత్యకులకు సహాయముగాఁ బంపుట.

తే పెక్కుచోటుల నెఱిఁగిన యుక్కులావు, గలుగు నీతనిఁ బనుచుట కలకవేల, యితఁడు గలయ నయ్యిరువుర కెలమివచ్చుఁ, బనుతు నేఁటు శోకంబు వాయలయు.
ద్రోణ 4-131

శ్లో. ఇతోఽగతే భీమసేనే సాత్వతం ప్రతి పాండవే,
సనాథౌ భవితారౌ హి యుధి సాత్వత ఫాల్గునౌ,
కామం త్వశోచనీయౌ తే రణే సాత్వత ఫాల్గునౌ,
రక్షితౌ వాసుదేవేన స్వయంచాస్త్రవిశారదౌ
సం. భా. ద్రోణ. 126-28, 24

ఎలయించు దే. స. క్రి.

1. కౌఁగిటఁ జేర్చు, కౌఁగిలించు

సీ. ఎలమి నమ్మోలఁత నన్నెలయింపఁ దివిరిన, నెడఁద కానందంబు నిక్కగాదె.
విరా. 2-86

2. వశమగునట్లుచేయు, లోఁబఱచు.

చం. చయ్యన నేగి యంబుజవిశాల విలోచనఁ గాంచి ప్రీతిమై, నయ్యెడ

నేకతంబు హృదయం బలరం దగఁ బిక్కి యొక్కమై, నియ్యకొనంగఁజేసి యెలయించెద నిక్కకు దార్చి వేర్పునన్, కయ్యకుఁ దెచ్చెదన్ కుసుమ సాయకు వూనికి నేడ తీర్చెదన్.
విరా. 2-245.

క. విను విషయ జ్ఞానమునకు, ననయంబును మనసు మూలమది కామక్రోధనిరూఢమగుచుఁ బురుషుని, ననిశము నెలయించు నింద్రియార్థంబులకున్. అర. 5-80

3. ఉన్ముఖమగునట్లు చేయు.

తే. ...బంతి, వింతఫంగుల కెలయించి వెకలిఁజేసి, యతిమత క్రీడనములకు నలవరించు. విరా. 2-810

4. కలిగించు, సమకూర్చు.

క. మానుషము దైవమును సరి,వేనేనని కార్యసిద్ధి నెలయింపఁగ వి,శ్వానందుఁ డయ్యె ధర్మజుఁ,డి నిర్మల భాగ్యమహిమ యేరికిఁ గలదే. ఆశ్వ 4-162

5. తీసికొనిపోవు.

వ. ఇట్లతిదూరంబయిగా నెలయించి యలయించిన నది రాక్షసమాయగా నూహించి రాఘవుం డమోఘబాణంబు దొడిగి తదయక యమ్మృగంబు జేసిన. అర. 6-828

## ఎలయు దే. అ. క్రి.

1. అగ్గమగు, తగు, భాజనమగు.

తే. రాజభావంబు తొడుసున గ్రుచ్చుకొన్న, మనసుతో మంచ కెన్నఁడో, మరచి యింద్రియము ల నిగ్రహించి స్వర్గాదు లవుడుఁ ద్రోచి, కేవల శాంతిసుఖంబున కెలయు టవను. శాంతి 5-896

2. సిద్ధపడు.

తే. ...శోణిత ప్రసరణంబు, నిరతిశయమైన వెరపోలి నిలిచి గదలు. వామకరముల నూఁదియు వారు మగుడఁ, బోరి కెలయుట నిర్భరాద్భుతముచేసె. శల్య. 2-282

3. ప్రవేశించు, ఆవేశించు.

సీ. విను తొల్లి ధర్మప్రవర్తనము లసహ్యంబులైన దానవులు మహాగ్రహ
మున, నరులయం దెలసిన నరవర వారలు దర్పరోషముల నధర్మ
వృత్తిఁ, దగిలినఁ గలఁగె వేదములు గ్రతువులు   శాంతి. 5-496

4. వర్తించు, మెలఁగు.

క. విను సత్త్వరజస్తమముల, యనుసరణము వలన వివిధమగు
యోనిగణంబున నెలసిన యాత్మత్త్వము, దమఁ బొడగ లేక
యవియ తానని యుండున్.   శాంతి. 6-12

5. కలుగు, పుట్టు.

క. ఎలమియు నచ్చెరువును సరి, నెలసి పొదలు మానసమున నెంతయు
బ్రొద్దేఁ, గలలోనఁ గన్నచందము, దలఁచుచు నుండితిని భక్తి
తాత్పర్యమునన్.   విరా. 1-25

చ. ...హోయని కిన్నర యక్షసిద్ధ సాధ్యులు దివినుండి యార్పు
చును దూర్యరవంబు సెలంగ నద్భుతం, బెలయఁగఁ బుష్పవృష్టి
గురియించిరి కర్ణుపయిం బ్రియంబునన్.   అర. 7-378

6. ప్రవణమగు, ఉన్ముఖమగు.

సీ. ఇంపారు లోఁకున ని గురొత్త చిత్తంబు, లెలసి యొండొరులపైఁ
బొలయు చూడ్కు, లాదట నుపకరణావళి వెదవెద, యాదరిం
చుట రాగమదరఁ దొడరి.   విరా. 2-238

వ. వాఁడు (ఘటోత్కచుఁడు) నాకు భక్తుండేనును (యుధిష్ఠిరుఁడు)
సహదేవు కంటెను వానికిఁ గూర్తునట్టి పట్టిలేకున్న నాకు శోకంబు
గాకుండునే యని తత్ప్రతివీరుని దెసకు నెలసిన యంతరంగంబు
శోకాక్రాంతంబగుటయు.   ద్రోణ. 5-257

సీ. పోటులనొచ్చి మేనును దప్పి గూరి చిత్తంబును బోరికెలయ-శే-
కునికిఁ జేసియుఁ దొలఁగితి నొదిగి పేర, దేర్చుకొని తలమునకు
నుదీర్ణ వృత్తి వచ్చువాఁడను.   శల్య. 2-84; అను. 3-136

7. లోనగు, వశమగు

తే. లలిత వివిధ విహారంబులకు లతాంగి యెలసి పొలసిన యట్టైన

చెలిమిఁగలసి, యతిమిత క్రీడ సలుపంగ నప్పళించి, వెనకతిత్త
బయలఁ గని విహ్వలించు. విరా 2-301

సీ. ఇంద్రియార్థంబుల తెలిసిన పురుషుండు, గాఢరాగంబునఁ గరఁగు
చుండు. అర. 5-81

8. ఒలయు, వ్యాపించు, ప్రసరించు.

క. ఎలసి పయివారి దంత ఘటల మదముల రాపువెట్టుటయుఁ
గౌరవ సేనల యేనుంగుల మదధారలు దొంకెం దొలయు మధ
కరము లుబ్బఁగఁగన్. భీష్మ. 1-141

వ. అవి యిట్లు శరణాగత రక్షణ ఫలసూచన ప్రకటనంబగు బుద్ధ
కపోతాఖ్యానంబు చెప్పిన విని యప్పితామహుని మీఁదం బ్రీతి
వినయ విస్తారవిలోకనం బొలయ నప్పాండవాగ్రజుండు.
శాంతి. 3-342

9. ఉండు.

చ. కలశము వహ్నిమీఁదఁ బను చందము గాదె నృపాలుఁ డర్జునుం,
దలపడఁబోక యాతని శితప్రదరంబుల వారి కగ్గమై, యొలసినఁ
గావఁగావశమె యీతని నీవును నేను మంది మొక్కలమునఁ
బోవనీఁదగదు గ్రమ్మఱ సైన్యము నిల్పు మవ్విభున్.
ద్రోణ 6-119

సీ. మృతిఁబొంది వేగ జన్మించినఁ బూర్వ దైహికములన్నియు బుద్ధి
నెలయు వాఁడు, జాతిస్మరుం డనఁ బను. అను 5-151

10. చేరు, ముసరు.

సీ. పవిక మదమున తెలయు తేఁటుల మొత్తములు వెలిగొడుగుల
చెలువుగొలుప. భీష్మ. 1-104

11 నెలకొను, నిలుచు.

క. శరతల్పగతుం డతఁడే, శరణంబుగ నాశ్రయించి సద్భావ వ్యాప్తి
రతుండగుటను వినుత, శ్రుతగత సద్విద్యందు నాడు భావం బెలసెన్.
శాంతి. 2-14

12. సత్తమగు.

తే. ఇంద్రియములెల్ల నట్టివ యొలసి యొందు, వలన మనసున్న దమ తమ వర్తనముల, విగుడనేరమి రెల్లంబు నృపవరేణ్య, యిట్టు లగు టట్లులకు నైన నెఱుఁగవచ్చు. శాంతి. 6-85

13. పొందు

సీ. వినుము మూర్ఖా నఁ జవిగొన దర్శన స్పర్శనము లాచరింప వినంగ నెలయు, నేమి సంకల్పంబు నెడఁజేర్చ నిష్టార్థములను ననిష్టార్థములను గోర,టయును వొల్లక. అశ్వ. 2-64

సీ. నెలయేఱులందలి తెలినీటఁ దనువుపొంపెలసిన గిరుల తెప్పలకుఁ జేర్చి. శాంతి. 8-382

14. చను, పోవు

సీ. (రాజులకు) వేటకు నెలయు టనుము, గాదు. అను. 5-66

# ఎలరారు దే. అ. క్రి. (√ఎలరు+ఆరు)

1. అతిశయించు, అధికమగు.

క. ఇవ్విధమున నాయితమై, క్రొవ్వెలరారంగ నిలిచి కురుపాండవులం,దెవ్వరు మును గడగిరి. భీష్మ. 1-232

2. ప్రకాశించు, ఒప్పు.

క. మునివర నాదగు చిత్తం,బునఁ గౌతూహలము సాల మొలతెంచె తలి,త్ముని నెలరారెడు నేర్పడ, వినిపింపుము మీఁది కథ సవిస్తారముగన్. అను. 4-447

# ఎలరు దే. వి.

1. అతిశయము, 2. ప్రకాశము. చూ. ఎలరారు, ఎలర్చు, ఎలర్చు.

# ఎలర్చు దే. అ. క్రి.

1. అతిశయించు.

ఉ. ఇట్టి ననన్ను నీ, విమ్మెయిఁ దూలవుత్తె యని యీశుఁ జూచుఁ గెంపెలర్పఁగన్. ఉద్యో. 3-298

ఉ. ...పాండవ శాఖా సంపదల్, పేర్చు నెలర్చు నింకఁ గురుబృం

దము లెల్లను దల్లడిల్లఁగన్. ద్రో. 1-42

చ. ... నీ భుజ, స్థిరత యొలర్ప నయ్యనిలదేవు బలంబును నీ బలంబు భా,సురముగ మాకుఁ బ్రాపును విశుద్ధయశోనిధి మారు తాత్మజా. సభా. 1-207

2. ఒప్పు

ఉ. కేసరి విక్రముండు కపికేతనుఁ గత్తఱి నైరివీరసం,హారకర ప్రకారమగు దర్ప మెలర్పఁగ. విరా. 4-82

3. ప్రకాశించు, శోభించు

తే. ...కపిధ్వజము ధవళ,హరులు శోభిల్ల నాగలపై హరి యొలర్ప. ఉద్యో. 2-144

4. సంతోషించు

క. గురుఁడును గృపుఁడును లోనగు, గురులను మోహింప శాస్త్రకుండు మొదలుగాఁ, గురుజాతి యొలర్పఁగ నృప్పరసతి శిష్యాభిషేచనం బొనరించెన్. ఉద్యో. 4-153

ఉ. మీయెడ చింత వాయఁగ సమీహిత యిద్ధియొనర్పఁ గోరితే, నీ యెడ కిప్పు వచ్చితి నభీష్టము వేఁడుము శంకరక్షి భూ,నాయక యొల్లశంగిని మనః ప్రియమందఁగ నిత్తునన్నఁ గాం,తేయు లెలర్పి రవ్వసుమతీపతి మోదము వొందె నెంతయున్. అశ్వ. 1-83

5. ప్రేరేపించు, ప్రేరణముచేయు.

తే. కలసి శుక్ల శోణితములు కరుడుగట్టి, యిను మమేధ్యమధ్యమునఁ బ్రవృద్ధిఁ బొంది, కాలవశత నప్పిండ మంగంబు లెల్లఁ, గలిగి శిశు వయి మారుగతి యొలర్ప.

క. వెడలునెడ గాఢపీడం బడి. స్త్రీ. 1-86; 87

ఎలర్పు దే. వి. (√ఎలర్పు) ఎలర్చుట

అతిశయము

ఉ. తచ్చిన సంభ్రమంబు గురువంపు టెలర్పున నుల్లసిల్లి. శాంతి. 6-574

**ఎలుఁగించు** (ఆనందవారి పాఠము)

**ఎలుఁగిచ్చు** (సం.ము ఆకా. పాఠము) (విరా. 4-288 లో)

**ఎలిఁగించు** (పాఠాంతరము) దే. స. క్రి. అ. క్రి.

1. బిగ్గరగాఁ బలుకు.

క. పనిచిన నాతఁడు నమ్మెయిఁ, జనిచ్చె రథంబు గోపసంఘము దిరమైకొని పొందు పసులవోడక, యని తానెలుఁగించి పీటికై మూల్కొలిపెన్. విరా. 4-288

2. కేకపెట్టు, పిలుచు.

క. పసరము వ్రచ్చి నెత్తురు దేనియ యిదె ద్రావెదం గదిసినముఁ గడిమిన్ మానుప దిక్కగలిగిన, వ్రావి మ్మెలుఁగింపు మీమొనం గల వారిన్. కర్ణ. 3-212

3. ధ్వనించు. (పక్షులు) కూఁతకూయు.

సీ చంచులఁ జిగురాకుఁ జించియాడుచు నలి, నెలుఁగించు గండుఁ గోయిలల సొంపు. ఆను. 1-181

**ఎలుంగిచ్చు; ఎలుఁగిచ్చు** దే. స. క్రి. అ. క్రి.

పిలుచు, సంబోధించు, కేకవెట్టు.

వ దుర్యోధన కృప దుశ్శాసనులు నశ్వత్థామ శకుని కృతవర్మలుం జై కొని యాధర్మనందను సైన్యంబు సమయింప నరిగి విచ్చిన నెలుంగిచ్చి పోనీక నిలిపి భీమ నకుల సహదేవ ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయులు గడంగి కౌరవ సైనికులం గనుపుగొట్టం దొడంగిన. కర్ణ. 3-178

**ఎలుంగు1; ఎలుఁగు** దే. వి.

1. కంఠస్వరము.

సీ. కలకంఠముల చేతఁ గఱచిన విద్య వీణల కిచ్చునట్టి తిన్ననియొలుఁగు. విరా 2-67

తే. అనిన నిది వోలునని యియ్యకొని యతాత, వైరి యల్లన నకులుని

వలను నూచి, నెమ్మనంబున మమ్మలికమ్మ గదుర, నెలుఁగు చందంబు వేఱుగా నిట్టులనియె. విరా. 1-91

2. పకులం : అవు, పతీకూఁత.

వ. చీఁకటి వానినంబ్రభాతంబను వింత మానిసి మెలంగి ముసుంగు వుచ్చినట్లు మేలుకని యొంకలు వొరల విదిచ్చి కూర్చొని కల గొంటం బలుకు వులుఁగుల యెలుంగులవలన నొండొంటిం దెలుపు కరణి నొప్పు ధరణీరుహంబులును. విరా. 2-240

3. ధ్వని.

ఉ. కిట్టుంఁబోయి యక్కొలువు తేఁకువవారలలోని కింకిఁదా, నట్టుల దుస్సవేమఁ దరయాకృతి ముందలవట్టి యీావ్వఁగా, నెట్టుసహించె మామ సతి యేడ్చు పెలుంగున కెట్టులోర్చెనీ, పట్టున నేమ మార యఁగ బంచుట కెట్టుల నేర్చెఁ గ్రమ్మఱన్. ఉద్యో. 1-347

చ అని పలవించు నయ్యెలుఁగు లావవమాన తమాయు దేర్పఁదన్, విని విరా. 3-22

## ఎలుఁగు² దే. వి.

ఎలుఁగుబంటు, భల్లూకము.

క. అలయుచుఁ బలుఁగుల యెలుఁగుల, కలుకుచు మగ్రాతపమున కోకక వృక్షంబుల నీడల నిలుచుచు నెలుఁగులఁ బులులం జూచి భయముగొని వగచుచున్. అర 2-84

## ఎలుంగు చలించు; ఎలుఁగు చలించు దే. అ. క్రి.

ఎలుఁగురాల్పడు, డగ్గుత్తికపడు.

ఉ. పంటిన కోపమున్ సమయ భంగభయంబును నగ్గలించి యుల్లంబు పెంపొంగఁ బతులం దగ నర్థులఁ జూచుచూడ్కిరూక్షం బగు చూడ్కి వాడుపదుకన్నియ నూచి నకాలన ప్రశాంతంబును మత్స్యనాథుఁడు వినంగ నెలుంగుచలింప నిట్లనున్. విరా. 2-139

## ఎలుంగు రాలుపడు; ఎలుంగు రాల్పడు దే. అ. క్రి.

డగ్గుత్తికపడు.

వ. అనుచు నెలుంగు రాలువడ వేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్త
చిత్తుండయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి.
ఉద్యో. 3-119

వ. వారలలోన సుభద్రాసూనుండు లేమియుం జూచి సవ్యసాచి
యడుగులు దొట్రుపడ నక్కొలువులో నికింతోయి కలయం గనుం
గొని యెలుంగు రాల్పడ నిట్లనియె. ద్రోణ. 2-282

వ. కొండొక సేపునకు మూర్ఛ దేఱి యన్నరపాలుం డెలుంగు రాల్పడ
నిట్లనియె. శాంతి. 2-12; అర. 4-356

**ఎలుంగెత్తి** దే. అ. క్రి. క్త్వార్థకము
బిగ్గరగా, ఉచ్చైస్స్వరముతో.

వ. సంశప్తక సమితితోడం దమకించి పోరిపోరి కౌరవ సైనికులు సింహ
నాదంబులు వింటి నప్పు డెలుంగెత్తియుయుత్సుం డాడిన మాటలు
నాకర్ణించితి. ద్రోణ. 1-258

తే. వలయు కొలఁది నెలుఁగెత్తి వర్ణసమితి, యచ్చుపడఁగ నశ్వత్థామ
సచ్చెననియె,నని పదంపడి యల్లన యతని చెవికి, వినఁగ రాకుండఁ
గుంజర మనియె నధిప. ద్రోణ 5-18

**ఎలుఁగెత్తిచెప్పు; ఎలుగెత్తి పల్కు** దే. స. క్రి.
బిగ్గరగాఁ బలుకు, ఉచ్చైస్స్వరముతోఁ బలుకు.

చ. కనుఁగొని సైన్యముల్ విఱిగి క్రందుకొనన్ వెనఁ జాఱ వాపగా,
తనయుఁడు సేననాఁగి యివిదైత్యుల మాయలుగాని లొంకు లొం,
కని యెలుఁగెత్తి చెప్పఁగ భయంబున నమ్మకపోయె నట్లువో,యిన
నసుదెంచెఁ గౌరవ మహీశుఁడు దీనత భీష్ముపాలికిన్.
భీష్మ. 3-135

ద. అని యెలుగెత్తి పల్కునలి నాడు మహోద్ధతిఁ ద్రుళ్లు
కర్ణ. 3-217

**ఎలుఁగుఁగుత్తిక** దే. వి.
డగ్గుత్తిక.

తే. .. ధర్మనందనుని యాననంబు వీక్షించి నిర్జరనాథ తనయుఁ,

దెలుఁగు గు_త్తికఁ దగులంగ నిట్టులనియె. ద్రో॰ణ. 2-252

**ఎలుఁగుపెంపు** దే. వి.

పెద్ద కంఠధ్వని

తే. వెనుక నరుగుచునున్న యవ్వేదమూ_ర్తితోడ సిద్ధ చారణులు దత్పుతుఁడు శై_ల,శృంగ విధ్వఁసియైపోక సెప్ప నెలుఁగు, పెంపు మిగుల శుకా యని పిలిచె నతఁడు. శాంతి. 6—388

**ఎలుఁగురియాడు** దే. అ. క్రి.

ఎలుఁగు చలించు, డగ్గు_త్తిక పడు.

ఆ. అన్నరేంద్రు పాణి యల్లన తన కరా,బ్జమునఁ గీలుకొల్పి బహుళ బాష్పకలిత వదనుఁడగుచు గళమున నెలుఁ గురి,యాడ వగచి యమ్మరాంతకుండు. కల్యా. 2—361

**ఎలుఁగు (ఎలుంగు) నూలుకొనంజేయు**

చలించు కంఠస్వరమును పదిలము చేయు.

వ. తత్ప్రదేశంబువనున్న కనక కలశ జలంబుల ముఖ ప్రక్షాళనంబు చేసి యెలుంగు నూలుకొనం జేసి యిట్లనియె. కల్యా. 2-362

**ఎలుఁగులిచ్చు** దే. స. క్రి.

పిలుచు.

ఆ. కెచ్చియచ్చు బలియుఁ దెచ్చియీఁగ, నొల్ల కెలుఁగు లిచ్చుచున్న వాఁ డమ్మను,బాధముండు మెచ్చుఁడన్యొ ననుచు.

ఆది. 6-290 (మూ. 289)

**ఎలుఁగువడఁకు** దే. అ. క్రి.

కంఠస్వరము చలించు, డగ్గు_త్తికపడు.

ఆ. అనిన పలుకులకు బృహన్నలఁ గనుఁగొని, యెలుఁగు వడఁక వాతఁ డిట్టులనియెఁ, బసుల దయ్యమెలుఁగుఁ బడతుల సంతోష, మేల వాకు ననికిఁ బాల నేను. విరా. 4-59

**ఎలుఁగునూపు** దే. అ. క్రి.

1. గట్టిగా అరచు, పెద్దకేక వేయు.

తే ఏచి దుర్యోధనుఁడు చేపిచి యెలుఁగు, సూపి పురికొల్ప నెంతయు
నేపు మిగిలి, మన బలంబులు పాండుకుమార సైన్య. సమితితోఁ
దాఁకె నత్యంత సంకులముగ. భీష్మ. 2-28

2. కంఠధ్వని వినిపించు.

ఆ. ఎచ్చట నున్నవాఁడవే మైతి ప్రాణానఁ, గలవె యేను నిన్నుఁ
గానకునికిఁ, దలఁకుచున్నవాఁడ ధైర్యధౌరేయ నీ, యెలుఁగు
సూపవే సురేంద్రతనయ. ద్రోణ. 1-262

3. పలుకు, మాటాడు.

ఆ. వచ్చి పర్ణశాల వాకిట నిల్చి య, త్తన్విఁ బిల్చె నతిథి దాని నల్లఁ
నూరకుండు మనియె నువిదయు భూసుర, శాపభీతి నెలుఁగు నూప
కుండె. అను. 1-75

ఎలుఁగెత్తు దే. అ. క్రి.

చూ. ఎలుంగెత్తి, ఎలుఁగెత్తి చెప్పు, ఎలుఁగెత్తి పలుకు.

ఎలుక; ఎల్క దే. వి.

మూషికము.

సీ. అడవిలో నొకమఱ్ఱి యడుగున లాఁగలఁ బవితుండునా నొక్క
యెలుక యుండు. శాంతి 3-203

క. నరనాయక శిశ్నోదర, పరాయణుండగుచు నొందు పరికింపని
దుర్నరుఁ డెలుకఁ బిల్లి వొదిలిన, పరుసున జరవొదువ ముక్తి బడ
యక పొలియున్. శాంతి 5-524

చ. అనుటయు నెల్క యిట్టులను. శాంతి. 3-218

ఎలువు దే. వి. ఎలుఁగు[2]

ఎలుఁగుబంటు, భల్లూకము.

సీ. ...పిశాచముల్ పూనుతేరు, లెక్క కప్పారెడు నెలువు చర్మపుఁ
గత్తళములతో ఖరనిస్వనములు నెలఁగ -తే- ననురపల్లభులగు
పలంబున ఘటోత్కచులు సముద్ధతిఁ దొడరి. ద్రోణ 1-163

4. ప్రతి, ఒక్కొక్క.

చ. ఒకరుని చేరి ప్రోవుమ దదున్నతి ప్రాపుమ గాంచి యెల్లవెంట
కుమ గొంఅంత లేక పొగడందగు సంపదవొంది. ఉద్యో. 2-77

**ఎల్లది; ఎల్లయది** సర్వ. (ఎల్లన్ + అది)

సమస్తము.

క. సతికిం బతిపనుపు సేయఁ బను వెల్లదియు. అను. 1-68

తే ఎల్లయందును దావసియించు వెల్ల, యదియుఁ దనయందు పసి
యించుటం బ్రదు వాసు, దేవుఁడను పేరి కర్థంబు. ఉద్యో. 2-326

**ఎల్లనాఁడు** వి.

ప్రతిదినము.

తే. ...ఇట్టులు షోడశంబు నాఁక నెల్లనాఁడును ఋతుసక్తి యొనఁబ
కుండ, నెట్టి కార్యము గల్గిన ఋతుమతీన, మాగమము దప్పని
కున్న వాయువెక్కు. అను. 4-26

**ఎల్లప్పుడు** వి. ఔ. (ఎల్లన్ + అప్పుడు)

సర్వకాలము.

క చుట్టము పగతును భేదం, బెట్టిబనులవలనఁ దగుల దెల్లప్పుడు
నెప్పట్టున సద్దానను మదిఁ, బుట్టదు సంతోషహాని బుద్ధాత్మున
కున్. శాంతి. 5-26; ఆశ్ర. 1-74

**ఎల్లప్రొద్దు**

ఎల్లప్పుడు

ఉత్సాహవృత్తము- ధరణినాథ వినుము మధువుధారలెల్ల ప్రొద్దునుం.
దొరఁగుచుండ నతఁడు దాని దోహలమున వానుచున్.

స్త్రీ. 1-48

**ఎల్లథంగులు**

అన్నివిధములు. సర్వథా.

క. అనుడు బృహన్నల యిట్లను, జనపాలక నందనుండు జయలక్ష్మిం
జే,కొమన కొలు చీరలు దెచ్చుట పనియే యటుసూడుఁ డెల్లథంగులఁ
దెత్తున్. విరా. 4-48

**ఎల్లయందు** క్రి.

సమస్తమునందు, ప్రతి వస్తువునందు.

తే. ఎల్లయందును దావసియించు నెల్ల, యదియుఁ దనయందు వసియిం చుటం గ్రదు వాసుదేవుఁడను పేరి కర్థంబు. ఉద్యో. 2-326

**ఎల్లయెడ** క్రి.

అన్నితావుల, ప్రతిచోట.

క. మిఱిమిఱి చీఁకటియప్పుడు, నటిమిఱి భటులుడుగ కదరి యని సేయంగా, వెలసి తమ మెల్లయెడఁ గ్రిక్కిఱిసిన మణిపాసి నిలిచి రింతను నంతన్ విరా. 8-96

**ఎల్లవలవ**

క. నీ పనుపు నవే క్రొకి కెద, నేపునహం కృతియు విడిచి యెల్లవలవ మే, లాపాదించుచు విపులు, శ్రీపాదము లాశ్రయించి చెందెదు శాంతిన్. అను. 5-354

**ఎల్లవాఁడు** సర్వ.

సీ. వెరపిట్ట తెలిఁగిడి వెంగలితనమని యెల్లవాఁడును దన యెఱిఁగి నట్టి, తెలఁగున నిజ కార్య సృష్టియ కయికొను, వారుల నేర్పులు పట్ల నొల్లఁడు, సాప్తి. 1-45

**ఎల్లవారు; ఎల్లవారలు** సర్వ. బహు.

అందఱు.

చ. వడిగొని గోగణంబుఁ దొడువం బరతెంచితి రెల్లవారు. విరా. 4-200; కల్కి. 2-11

క. అలోనవ భోజనతిన్, బాలమ్ముగఁ దొడవి రెల్లవారలు దాసం, దూఁగ కతఁడు బలుపిలుగొని, క్రాలుచు వారిమముఖ్య రథికుల నొంచెన్. ద్రోణ 4-29; కల్కి 2-141

**ఎల్లవి** వి. బహు.

సమస్తము.

ఉ. ...నేఁడిట్టఁడసైతి నెల్లవియుఁ దెల్లముగా వినవేర్తు నంబయా. విష్ణు.1-45; అను. 4-241

**ఎల్లి[1]** దే. వి.

ఛత్రము, గొడుగు.

ఉ. అల్లదె కంటె పాండుతనయాగ్రణి తేరు సితాశ్వయుక్తమై, తెల్లని యెల్లి నొప్పినది. కల్కి 1-138

క. ...మణిమయంపు టెల్లులు మెఱయం, గా నీ వేతెంతువు. శాంతి 4-339

**ఎల్లి[2]** వి. ఏ. ఔ. అవ్య.

1. నేఁటికి మఱునాఁటి దినము, రేపు.

తే. ఎల్లి యెల్లి విధంబుల నెందుఁ బొచ్చె, నేని నా ధర్మతనయుండు తాన వచ్చి, యడ్డపడెనేని నీవ పెంపారు కరుణఁ, గాచితేని నాకేఁ బదుఁ గీచకుండు. విరా. 2-282

వ. నీ నక్షత్రంబు రోహిణిగదా యెల్లి రేవతి నీకుఁ జంద్ర తారాబలం బులు గలవు. గమనంబునకు రేపకడయ మేలు. ఉద్యో. 3-180; అర. 2-168

2. సమీపములో జరుగనున్న దానిని సూచించుటకు ప్రయుక్తమగును.

క. మొనతలఁబడియెదు నీఁచెప్పిన యట్టుల తడవులేదు విరుదుతరై నీవును నీరు నిలువుఁడిదె భండన మెల్లియ వచ్చె మాటలు గమఁ డింకన్. ఉద్యో. 3-365

**ఎల్లిదము** దే. విశే. ఏలిదము

1. లఘువు. తేలికయైనది. చులకనయైనది. గౌరవములేనిది.

చ ...అన్నదమ్ములును బొందిన నేరి కపాత్ర్యులట్లుగా, కెరవయి నిర్విణం గెలని కెల్లిదమై పటిమోరు రెంతయున్. ఉద్యో. 2-88

ఉ. భూమిసురేంద్రులన్ దివిజపుంగవుఁ డాదిగ భక్తిఁ గొల్చుచో, నేమిట నొక్క వారు గడు నెల్లిదమై రిటు నీకు నిచ్చుటన్. అర. 5-16; అశ్వ. 1-81; ఆది. 6-282

2. అగౌరవ పఱుచునది. అవమానకరము.

తే. వేడఁ బొడిపూసి కట్టి యవ్వీరటుఁ డుత్తరుండు దోఁబడునేరఁ గొల్వుండు బుద్ధివచటి కేతెంచి కని విస్మయంబు నొంది, యెల్లి

దంబుగఁ దలఁచుచు నిట్టులనియె. విరా. 5-317

వి.

8. పరిహాసము.

క. మృదుభాషణముల దుర్జన, హృదయము ప్రసన్నతా మహిమఁ
బొందునె యెల్లిదముగఁ గొని యంతంతకు, మదమెక్కం గాక
దురభిమానము పేర్మిన్. ఉద్యో. 2-34

**ఎల్లినేఁడు** దే. వి. ఔ. అవ్య.

రేపు, ఈదినము.

అ. ఎల్లి నేఁటిలోన నెఱుఁగఁ బడరె. విరా 3-98

తే. వరుఁడువచ్చు, నిందు మీ పంపునేఁతకై యెల్లినేఁడు. మాన. 69

**ఎల్లుండి** దే. వి. ఔ. అవ్య.

రేపటి మావలి దినము.

వ. ...దమయంతి స్వయంవరం బెల్లియో యెల్లుండియో యయ్యెడు.
అర. 2-168

**ఎల్లెడ; ఎల్లెడలు** దే. వి. (ఎల్ల + ఎడ)

అంతట, అన్ని తావులు.

సీ. దమమును సత్యంబు క్షమయును నెల్లెడ వినుతింపఁబడు.
శాంతి. 5-540

చ. ...అంతనంత నదరి చింతు మెల్లెడలు దారుణ విక్రమణ క్రమం
బునన్. ద్రోణ. 2-8

తే. ...గురుని, బ్రతిన యెల్లెడఁ జాటించె రాజరాజు ద్రోణ 1-114

క. అనుమానము లేక తిరిగె నతఁ డెల్లెడలన్. ఉద్యో. 1-180

**ఎవఁడు** దే. సర్వ.

కిమర్థకము (ప్రశ్నమును తెలుపును)

సీ. ఆరామ, దెవనితోఁ బోరాడి యిరువది, మూఁడు దినములకు
వాఁడి దఱిఁగె. శాంతి 2-12

(ఇది తి. వ. ప్ర. కో—అనంతవారి పాఠాంతరము సం.ములో ఈ పాఠాం
తరము లేదు)

**ఎవరు** దే. సర్వ. బహు. (√ఎవఁడు)

కిమర్థకము. (ప్రశ్నమును దెలుపును.)

క. ఆ యిరువుర నోర్వ నెవరికైనను వశమే కర్ణ. 1-41

వ. ఇది యెవరి ఘోషం బని గోపాలకుల నడిగిన వార లిట్లనిరి. అర. 3-116

**ఎవ్వఁడు** దే. సర్వ. (ఏ+వాఁడు) ఎవ్వాఁడు. (బహు) ఎవ్వరు (మహతీ వాచకము గూడ నగును)

1. యచ్ఛబ్దార్థకము.

క. మనలోన నెవ్వఁడెమ్మెయి, పనివెంటను వీఁటు మనము పడ యుఁద మది యెల్లను నేర్పరించి యంతయుఁ, దనతన మది మున్న తెలుఁగు తథ్యము చెపుఁడా. విరా. 1-65

వ. ఎవ్వని యేని వీర్యంబున నిక్కన్యక యుత్పన్నయ్యె నట్టి యుపరిచరుం డను రాజర్షి. అది. 4-188

2 తచ్ఛబ్దార్థము నపేక్షించును. సంబంధ సర్వనామము.

క వాయనుచరులం దెవ్వఁడు, మీ యొక భయభక్తిలేక మిగిలి మెలఁగె నేనా యధముని దండితుఁగాఁ, జేయుదు నతఁ డెంతయుం బ్రసిద్ధు డయినన్. విరా. 1-102

ఆ. ఏమిట్టువాలు దాన నాకెవ్వరు, గడువు కాడు వెట్టి కట్టఁ జీర, యిచ్చి సాకతమున నేలుదు రట్టివా,రలకుఁ బనులు చేసి మెలఁగు బుద్ధి. విరా. 1-298

3. కిమర్థకము: (ప్రశ్నమును దెలుపుము)

వ. మఱియు దుశ్శాసనుండు వీరులందఱును గొడ్డుపోయిన వారలు పౌరుషంబుగల మానిసి యిందెవ్వం డనియె. ఉద్యో. 1-352

క. ...కురుపాండవులం, దెవ్వరు మును గడఁగిరి. భీష్మ 1-282

వ. అనుచు మందమంద సంభాషణంబుల సంబోధించు పాంచాలి పాణి స్పర్శనంబున మేలుకని యిది యెవ్వరనవుడు. విరా. 2-167; శాంతి 5-7

(ఎవ్వరు-ఎవ్వత-అని మహతీశాచస్త్రైక వచనమునఁ బ్రయోగము)

క. ఇదియొక చాపము విస్మయ, మొదవించుచుఁ గొండ చిలువ యొకో వాఁ దగియున్నది ఖచిత కనకకమల స.ముదయద్యుతి సముపగూహ నోజ్జ్వల మగుచున్

వ. దీనిం బాండవులయం దెవ్వరు ధరియింతురని. విరా. 4-118,119

(ఎవరు = ఎవ్వఁడు-గౌరవార్థక బహువచనము)

వ. వా రెవ్వరం టేని. ద్రోణ. 3-217

4. ఎంతటివాఁడు, ఏ పాటివాఁడు-ఎట్టివాఁడు

క. మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు, నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱుఁగుదు వా.క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు, పొమ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్. ఉద్యో. 3-34

క. క్షమియింప నెవ్వరము భూఁరమణుని కార్యమున కెవ్వరము ద్రోణుల చి.త్తము శాంతి నొందఁజేయుట, మముఁ దెలుచుట యిట్టులేల మాకొలఁదులకున్. విరా. 4-227

ఉ. ...ఎవ్వరున్. ధర్మజు పాటిగారు. విరా. 1-61

(ఎవ్వరు = ఎంతటి గొప్పవారైనను)

5. ఎల్లవాఁరు (ఈయర్థమున బహువచనముననే ప్రయుక్తము)

వ. తపోమహిమ నెవ్వరికంటెఁ బెద్దలైనవారి నుపయాజు నుపాసించి ఆది. 7-8

వ. సురపతి గురులైన బృహస్పతి సేసిన నీతిశాస్త్ర రహస్యంబులం దెవ్వరికంటె విదురుం డెంతయు విశారదుండు. సభా. 2-125

వ. అయోధ్యయ సురక్షితంబయిన రాజగృహం బెట్టు చొరవగువని శంకింపవలవదు దమయంతీ నివేశంబు ప్రవేశించు నవుడు నిన్ని వ్వరు వారింప నోడుదురు అర. 2-88 (ఎవ్వరు = అందఱు)

ఎవ్వత ఎవతె, ఎవ్వాతె

(కలంది పిమ్మనిశో)

క. ఏయది మొకసేరువు నిశ్లేయక ద్రోణుని యరుగు మెట్లుయినకు

మఁ, గ్గాయకములు నిను గూల్చెదఁ, ఆ యెవ్వతనైతినేమి సూచెదు నన్నున్. భీష్మ. 3-324

వ. ఇవ్వనిత యెవ్వత. శాంతి. 4-400; స్త్రీ. 2-81; అర. 7-348

ఎవ్వరివాఁడు

ఎవ్వరికి సంబంధించిన వాఁడు, ఎక్కడనుండువాఁడు.

వ. అమ్మహీపతి నీ వెవ్వరివాఁడవని యడిగెనేని పాండవాగ్రజునకు శాసనంబు సేయుదు ననంగలవాడ. విరా. 1-84

ఎవ్వాఁడు సర్వ. (ఏ + వాఁడు) (బహు) ఎవ్వారు, ఎవ్వారలు

ఎవ్వఁడు.

1. యచ్ఛబ్దార్థకము.

తే. అనుడు నతఁడిట్టు లనియె నాయతుల శాహు, బలముఁ దెనయంగ భవదీయ పతులు కారు, మూఁడు లోకంబులందు నెవ్వాఁడు లేఁడు. విరా. 2-56

తే. వైష్ణవియుఁ గల్మష ప్రజ ధ్వంసినియును, నైన యీయాను స్మృతి ప్రాజ్ఞుఁడైన నెవ్వాఁడు పఠియించు యజ్ఞదాన, సమయ ముల వాఁడు తత్ఫలశతము పడయు. శాంతి. 4-250

ఉ. పారవు ధర్మమున్ విమల సత్యముఁ బాపముచేత బొంకుచేఁ, బారముఁ బొంగలేక చెడఁబాటినదైన యవస్థ దమకెవ్వార లు పేక్షసేసి రది వారల చేటుగుఁ గాని ధర్మని, స్తారకమయ్యు సత్యశుభ దాయక మయ్యును దైవముండినన్. ఉద్యో. 3-278

2. కిమర్థకము.

తే. కౌరవులలోన నిప్పుడెవ్వారితోడ, ననికిఁ గడఁగుదువో చూచి కొనఁగ వలయు. భీష్మ. 1-179

ఎవ్వి[1] ఏది బహువచన రూపము.

చూ. ఏది.

ఎసఁగు దే. అ. క్రి.

1. అతిశయించు, ఒప్పు.

సీ. తన్వంగి మవ్వంపుఁ దనులత నెసఁగెను, సునుఁగాంతి వెల్లువ మునుఁగఁ బాఱ. విరా. 2-37

క. భూతాత్మక మైన యఖిల. ధాతు చయము వెలిగలేదు తను వా మొత్తం, బాతత జీవవ్యాప్తి స, మేతముగా నున్నఁ జేష్ట నెసఁగదు వత్సా. శాంతి 6-388

క. వసునిభుండు పైతృకంబగు, వసుధా రాజ్యంబు భీష్మవచనమున గత, వ్యసనుఁడయి శాల్వుఁ డేలం, బెసఁగంగ విచిత్రవీర్యుఁ డిద్ధయ శుండై. ఆది 4-186

2. కలుగు.

క. ఊరక యుండక పలువుర, తో రవమెసఁగంగఁ బలుకఁ దొడరుపక మిం, తేరువగం నాగరికులుఁ, దారు గలసి పౌరవలయు ధరణీశు కడన్. విరా. 1-127

సీ. ధర్మాభిసంరక్షితంబైన భూప్రజ లెంతయు నభివృద్ధి నెసఁగు చుండె. ఆది 5-8

3. జనించు, పుట్టు,

సీ. ప్రళయ కాలంబున జలముల విష్ణుఁడు యోగనిద్రాగతి నొంది మేలు,కాంచి లోకంబులు గావింపఁదలఁప నహంకార మెసఁగె బ్రహ్మాభిధాన, కలితమైత న్నాభికమలంబునం దిట్లు జనియించి యా బ్రహ్మ. శాంతి. 6-479

తే. జనవు వృత్రు రక్తమున నద్భుతము లెసఁగి, పుట్ట కొక్కెరై యవి జనలోక్యతావ, మొంది విప్రాదిక ద్విజయోగ్యతాభి, పన్న మలుగ వు ధర్మ సంపన్న చరిత. శాంతి. 5-488; ఆది. 8-61

4. క్రమ్ముకొను, వ్యాపించు.

క. వర్గములైనట్టులు స,మ్యగ్గౌరవము లెడలె మండె నాయుధ చయముల్, దిగ్గ్రామం బెసఁగె నం,దిగ్గము మనశాలియగుట దీనిఁ దగఁగన్. విరా. 4-88

5. సంతోషించు, ప్రీతిఁజెందు.

క. ఇమ్మెగ సరస్వతీ తీరమ్మునఁ బండ్రెండు వత్సరమ్ములు విధి

మార్గమ్మున సద్గుణ సముదాయ మ్మెసఁగఁగఁ జేసె నత్రి
యాగము నిష్ఠన్. ఆది. 4-8

(ఎసఁగఁగ-అని వ. వ. ప్ర-కోశము-ఇది పాఠాంతరముగ సం. ము మొ-
వానిలోఁ గానరాదు.

**ఎసకము** దే. వి.

1. విజృంభణము.

క. ఆ పన్నిద్దఱు సైన్యా, టోపస మేతముగఁ గవియుదురు పాంచాల, క్ష్మాపాల సుతుఁడు భీముఁడు, నేపారిరి నీదు సేన యెసకం బడఁగన్. భీష్మ. 2-378

2. అతిశయము, పెంపు.

తే. ...ఎంతయు వంతఁ బొందుఁ, జింత యెసకంబు వడిగొని చిక్కువఱచు. విరా. 2-292; శాంతి. 1-66

3. అవలీల, అనాయాసము.

ఉ. శావలి వారిఁ దోలి యెసకంబున గోవులఁ బట్టికొంటినం,...పెద మాటలేల ధరణీశ్వర. విరా. 4-192

4. విధము.

ఆ. అంతఁ దెలిసి రాముఁ డతికుపితాత్ముఁడై యేఱు వాఱ తెంచు నెసక మెసఁగ, నప్రమేయ శరము లడరించె నవి సత్వరముగ వేము ప్రతిహతములు చేసి ఉద్యో. 4-324

5. ఒప్పు.

క. ఈదేశము ప్రజ ధర్మజ్ఞు, నాదరసంభావనముల నాజ్ఞానిరతిన్, యాదవ వీరుల కలవాఁ, దేది తెలుఁగట్టి మనికి యెసకం బారున్ మౌస. 184

విణ.

1. అధికము, పెచ్చైనది.

క. స్వాతిగతుండగు శుక్రుం, డే తెలుఁగున నరుఁగఁ జేయు నెసకపు వర్షం, బా తెలుఁగున పాయక వర్షాతిశయం బావహించె నతఁడు

నరేంద్రా. కర్ణ. 3-42

2. ప్రియము.

ఉ. అంతట వృష్ణి భోజ కుకురాన్వయ భూవరులెల్ల నీదెసన్, బాంధవ సౌహృద ప్రణయభక్తి విశేషము లొప్ప నీ మనో,గ్రంథియడంగఁ జేయ నెసకంబునఁ బూనినవారు. అర. 4-160

ఎసకమెసఁగు దే. అ. క్రి. ఎసఁగు (ఎసకము + ఎసఁగు)

1. అతిశయించు.

తే. ఇతఁడు పుట్టిన కోలెను నెసక మెసఁగు, ధర్మమునఁ వర్తిల్లు.
విరా. 1-74

తే. తాను దొల్లిన కతన మత్స్యాకృతికు, నింట నిమ్మెయిఁ గ్రొత్త యొప్పెసక మెసఁగ, నమ్మహాదేవి యున్నెడ కల్గఁగల్గ, బాండురాజ తనూభవ పత్నియరిగె. విరా. 1-308

2. అభివృద్ధిఁబొందు, వర్ధిల్లు.

క. పలువురు క్రీడింతురు భూపతియాధిప యరయ మంచివారును గలఁగ,కుక్కల ధర్మవతుం డతమున, విల నిరపాయత్వ మొంది యెసకం బెసఁగున్. అను. 2-218

3. కలుగు.

తే. తాను దొల్లిన కతన మత్స్యాకృతికు, నింట నిమ్మెయిఁ గ్రొత్త యొప్పెసక మెసఁగ, నమ్మహాదేవి యున్నెడ కల్గఁగల్గఁ, బాండు రాజ తనూభవ పత్నియరిగె. విరా. 1-308

తే. విప్రుఁడేమిట దేవత్వవిభవ మొందు, నేమి కతమున సాధుత్వ మెసక మెసఁగు, నతనికెద్ది యసాధుత్వ మావహించు, మానసుం డగు నెద్దాన మహితమూర్తి. శాంతి. 5-566

4. పారమెయ్యు, అత్యుచ్చదశ బొందు.

క. ఒదవెడు తృష్ణ వెల్లిదమున, వదనము వడువళ్లి వట్టి తాసితరాజ వ్వదిరాకరసమానఁగ హృదయంబున నేత్ర యొసక మెసఁగెడుఁ దరుణి. విరా. 2-88

తే. సహజమైన యలంకారమహిమ నతిశ,యిల్లి మహనీయ వైభవ
మెసక మెసఁగ, వఱలు వరపతి మందిర ద్వారభూమి, పేర నరిగి
యా వేగులవారు ప్రీతి. పారా. 8-74

5. ముఖ్యమగు, ప్రధానమగు.

తే. సారమతిఁ బరికింపఁగఁ బౌరుషంబు, కంటె దైవంబు ముఖ్యంబు
గార్యసిద్ధి, కెచట నేనియుఁ బౌరుష మెసక మెసఁగె, నేని యది
దైవదత్తంబ యంత నిజము. శాంతి 4-41

6. పొందు పడయు.

క. పరమజ్ఞానం బెుద్దను, బరఁగిన నజ్ఞుఁడును బోధ భరితుఁడగు నిరం,
తర మేరుసమీపస్థితి, హిరణ్యరుచిఁ గాక మెసక మెసఁగిన పగిదిన్
అను. 8-825

శ్లో. సత్సంనికర్షే పరివర్తితవ్యం విద్యాధికాశ్చాపి నిషేవితవ్యాః,
సువర్ణశాంగచ్ఛతి సన్నికర్షాన్నీలఃఖగో మేరు మివాశ్రయన్వై
సం భా. అను 152-80 (సర్ణయ)

ఎసకొల్పు దే. స. క్రి.

పురికొల్పు, ప్రేరేపించు, ప్రోత్సహించు.

చ. కల శిష్టుని సువ్రతు వృద్ధు నార్యు భీష్ముని నెసకొల్పి పేరలకు
మంఖ్యఁడ వీవని యుబ్బఁజేసి యీ,నునఁ దలపెట్టి చంపికొనఁ
జూచె సుయోధనుఁ డింతయే మగున్. ఉద్యో. 4-207

సీ. నీకుఁ బ్రెగ్గడయునై వెయ్యంపుఁ జెలియునై, కయ్యంబునకు
నెపుఁగాలు ద్రవ్వఁ, బాండు పుత్రులతోడి పగకు నిన్నెసకొల్పుఁ,
గొలువున రజ్జులు పలుకునట్టి, రాధాసుతుం డర్ధరథుఁడు.
ఉద్యో. 4-234

శ్లో. ఉత్సాహయతి రాజం ప్త్వాం విగ్రహే పాండవైస్సహ.
సం. భా. ఉద్యో. 167-8

ఎసరు దే. వి. బొ.

వంటకై కాఁగఁ బెట్టినసీరు, పచనయోగ్య జలము.

సీ. కాఁగిన యెసరుల కరణిఁ బొరిపొరి కరనిధు లుప్పొంగి పొరలఁ

బడియె. ఉద్యో. 4-116

**ఎసలారు** దే. అ. క్రి. (ఎసలు+అరు)

ఒప్పు, అతిశయించు.

ఉ. ...నా పయిం గ్రొవ్వెసలార నీవు శరకోటి వెసం బరఁగించితేని నే నవ్వుదుఁ గాని కోపము మనంబునఁ బుట్టదు మా శిఖండిసీ. భీష్మ. 3-321

ఉ. ...అభుజగేశ్వరు పత్నియాతనిం, దెచ్చెరఁ దానెదుర్కొని విశిష్ట మావిరమై యుపాయనం, బిచ్చి తదీయ చిత్తమున శింపెసలారఁగఁ బాద్య మిచ్చినన్. శాంతి. 6-574

కి. అయ్యెడ కర్మంబుల దెస, నెయ్యం బెసలారఁ గలిగి నియమ నిరూఢుం, డయ్యున యన సూనృతంబుల, నయ్యెడు పొఖ్యంబు నిహమునందుఁ బరమునన్. అను. 3-806; విరా. 2-85; స్వర్గ. 61

# ఏ

ఏ¹ అవ్య.

1. అవధారణార్థకము.

క. నా వలని రాగమునవే నీ వెట్టితి. శాంతి 6-184

మ. ...ఏ, తెరువైనం దన యిచ్చతోఁ బడియె నింతేగాక యేఁ బాటదే. ఉద్యో. 3-358

చ. పనిచెద వజ్రమున్ అముని పాలికి వన్నరవాధువేగమే, యనుచు టకింత యెల్లిఁడమె యాతనికిన్ మన యాజ్ఞ యారయన్. అశ్వ. 1-81

2. నిర్దేశము (చూపుటను) బలపఱచును.

క. నాచేతి బలువుగని నీ,యాచార్యుం దోడి తొలఁగి యరిగెను నీవే,
త్రోచి యొట పోవువాఁడవు. ద్రోణ 4-9

ఏ² అవ్య.

1. ప్రశ్నార్థకము (ఇది సందర్భానుసారముగా ఆశ్చర్య ప్రశంసాదులను గూడఁ దెల్పును)

శా. ఈ దుర్యోధనుఁ డింత గర్వియగునే యీ యున్నవారెల్ల నాఁడే
దైన్యంబునఁ బొందు టొప్పదని చర్చింపఁడ, ఉద్యో. 3-378

(ఇట ఆశ్చర్యమును దెలుపును)

వ. నాయాడిన మాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికిన వచనంబు లంత యొప్పు నేయని యగ్గించిన ఉద్యో. 2-117; సభా. 1-7

(ఇట ప్రశంసను దెలుపును)

తే వారు కందమూలంబు లాహారంబులుగఁ, బొదలఁ బుట్టలఁ బడి యుండి పులుఁగు మెకము,ల నడ మేల్కానుచుండిరే యక్కటకట.
(ఇట దుఃఖమును దెలుపును) ఉద్యో. 3-188

ఏ³ సర్వ.

1. యచ్ఛబ్దార్థకము (ఇది తచ్ఛబ్దార్థము నపేక్షించును)

క. ...అచ్యుతుఁ డే దిక్కునఁ నుండు నెమ్మివా దిక్కునకు జయము గల్గునని యకుంఠిత కరుణన్. శల్య. 2-341

క ఏ నరుఁడు మానసము ధృతినూన నుచిత వృత్తినుండు నుదిలగొనక యొందైనను నెయ్యది యేనియు, వానికి దుర్లభము లేదు వసుధా ధీశా. శాంతి. 3-161; ద్రోణ. 2-161

2. కిమర్థకము (ప్రశ్నార్థకము)

మ. ఏ జనులు నిత్యాయుష్యులే చెప్పుమా. శాంతి. 1-225

వ. ఈ ప్రబంధమండలి కథినాథునిగా నే పురుషునిఁ జేర్కొను వాఁడనొ. విరా. 1-8

ఉ. ...ఇప్పుడ కాలుద్రొక్కి కేఁగించెదఁ జక్కనై నిలుము గిట్టి రణం
బున రాతసాధమా. ఆది 6-294

క. ...అంతకుపురి కేఁగించితిఁ బౌలోమ కాలకేయాసురులన్.
అర. 4-88

(ఎక్కడ కోపఁగించుకొనిపోయినాఁడు - అని వ్యవహారము)

ఏఁగు దే. అ. క్రి.

1. పోవు, వెళ్లు.

క. కొలువుగొన నొల్లకుండుట, గలిగినఁ బొమ్మనుట యంతికంబున
మేలే, వలసినకడ కేగెద నీ, తలఁపెయ్యది యానతిమ్ము ధరణీ
నాథా. విరా. 2-224

క. ...ఇంకఁ దడయం, జనదని ద్రౌపదికిఁ జెప్పి చయ్యన నేఁగెన్.
విరా. 2-361

తే. ఊర్ధ్వగతి కేఁగు మానవు లుండునట్టి నెలవులు. ఆశ్వ. 1-132

2. నడచు.

ఉ. ఇప్పటి భంగి నొక్కఁడుగు నేఁగెడు దానికి నోర్వ నెమ్మెయిన్,
విరా. 1-148

3. ప్రవేశించు. చొరఁబడు.

ఆ. ...పెట్టు నతనిఁ జేయొడ్డెడు, వానిఁ దలఁప నందు వరుఁడు పెట్టు,
వాఁడ యగుట నిక్కువం బింతమూఁదక, యిట్లు దీనవృత్తి కేఁగ
దలఁతె. శాంతి. 1-139

ఏఁగుదెంచు దే. అ. క్రి. (√ఏఁగు)

1. వచ్చు, పఱెంచు.

(ఇట 'తెంచు' ధాతువు వ్యతిరేకార్థకము దెలుపును)

క. ...వేగంబున నయ్యెడ కేఁగుదెంచి నారదుఁ, డెడపడు టెంచు
కయు లేక యిట్లను నాతోన్. ఉద్యో. 4-349

చ. కురుబల మేఁగుదెంచెనని గోవుల బిట్టుఱఁబట్ట. విరా. 4-20

చ. అహితుల కప్రభేద్యమగు నాపదమూఁడగు నేఁడు మత్ప్రజా,
మహులు చరించి రంతయుఁ గ్రమంబున నా కెఱుఁగంగఁ జెప్పుమా.
విరా. 1-44

వ. ...ఏఁడేట నింద్రోత్సవంబు సేయుచు. ఆది. 8-24

మ. తుది రాజ్యమ్ము సగమ్ము గొ మ్మడవియందుం బెరువంచించియుం,
బదుమూఁడేఁడులు నీవునుం దిరిగిరా పాలీకపోవచ్చునే.
ఉద్యో. 3-97

వ. బాసదప్పక తారును పాంచాలియు నొక్కటఁ బంద్రెండేఁడ్లు వనం
బున వసియించి. విరా. 4-138

తే. ఎన్నికొనుచుండఁ జనుచుండ నేండ్లు వివ్విధమున వాయువు
దోడ్తోడఁ దఱిఁగి జీవహాని వాటిల్లఁగా బుత్రయనవధాన, సద్రమో
హితుఁడై యున్కి నీకుఁ దగునె. శాంతి. 6-284

**ఏఁడు కాలము; ఏఁడుగాలము** దే. వి.

సంవత్సరము.

వ. ఇట్లు పాండవులు పాంచాలీ సహితంబుగా విరాటు నగరంబున
వర్తించుచుఁ గతిపయదినంబులు గొఱంతగా నేఁడు కాలంబు
గడపిన సమయంబున. విరా. 2-21

సీ. ఏడుకాల మయ్యతుల వ్రతము సల్పి,యఖిల భూలోక సౌఖ్య
ములఁ ద్రిదివ-తే-మోదమును గంద్రు. అను. 4-148

తే. కుడుపునకు ముందరొడ్డుం గోవునకు సమంచిత గ్రాసముష్టి
నిత్యంబు నేఁడు,గాం మిచ్చిన నతఁడెల్ల కామ్యములును, బ్రాహ్మ
ణుల కర్థి నొసఁగిన ఫలమువడయు.
అను. 2-415; ఉద్యో. 1-119

**ఏఁపు** స. క్రి.

(సూ.ఆ ని-లో ఈ క్రింది విధమునఁ గలదు-'ఏఁచు'మబట్టి సబిందుకముగా గ్రహింపఁబడినది. కాని నవనాథ, వి.పు. ప్రయోగములు నిర్బిందుకములనుటకు సాధకములుగా నున్నవి. ఇంకను విచార్యము—నవనాథ విష్ణుపురాణాది భారతేతర గ్రంథముల యందలి ప్రయోగములు చూపి

అందుండి యయ్యేకచక్రపురంబునకుం జనిరి.
శల్య. 2-199

**ఏకచక్రపురము; ఏకచక్రాపురము** సం. వి. అ. పుం. ఆ. స్త్రీ.

ఏకచక్రము అనుపేరుగల ఒక పట్టణము పాండవులు లాక్షాగృహము నుండి తప్పించుకొని వచ్చిన పిమ్మట బ్రాహ్మణవేషధారులై యిక్కడ భిక్షుక వృత్తిఁ గడపిరి-ఇక్కడనే భీముఁడు బకాసురుని జంపెను.

సీ. ఏకచైత్యుఁ దొడరి యాతంగి రూపఱఁజేసి, రక్షించె నేకచక్రాపురంబు. విరా. 1-74

వ. భీమసేనుండు హిడింబాసురుం జంపి వాని చెలియలి హిడింబను వివాహంబై యేకచక్రపురంబున కేగి యందు బకాసురుం జంపి విప్రులం గాచె. ఆది. 8-15

సీ. కడుఁ గ్రొవ్వి యేకచక్రంబున వారల, కేనింత యొల్లదమ్మేల యైతి. ఆది. 6-292

**ఏకచక్రము** సం. వి. అ. పుం.

ఏకచక్రపురము (లేక) ఏకచక్రాపురము.

సీ. కడుఁగ్రొవ్వి యేక చక్రంబున వారల, కేనింత యొల్లదమేల యైతి. ఆది. 6-292

**ఏకచరుఁడు** సం. విశే. (అ. ఈ. అ.)

ఒంటరిగా సంచరించువాఁడు.

వ. సర్వసంగ వర్జితులయి యేకచరులయి యనేకనికేతనులైన యతులును. ఆది. 3-222

**ఏకచారి** సం. విశే. (న్. ఈ. న్.)

ఏకచరుఁడు, ఒంటరిగా సంచరించువాఁడు.

వ. మాండవ్యుఁడను బ్రహ్మర్షి దొల్లి మహీతలయంబునం గల తీర్థంబు లెల్ల నేకచారియయి సేవించి. ఆది. 4-261

**ఏకడ** దే. వి. వ.

ఎక్కడ.

ఉ. ...నీ, కెక్కడ డాఁగవచ్చు గద నే నని సేయుటకుం గడంగినన్.
శల్య. 2-249

**ఏకత** సం. వి. అ. స్త్రీ.

1. ఏకత్వము, ముఖ్యము.

ఉ. ...మహోన్నతసైకతాత్మల యవక్రమనిమ్నల బొదవున్నలా.
ద్రోణ. 4-386

2. ఏకాగ్రత్వము.

ఆ. ...అవ్యను దేహం,దనుభవియింపు నేకతానిరూఢి. శాంతి, 2-28

3. ఒక్కటియగుట, ఐక్యభావము.

క. జనన ప్రళయంబులఁ దనకు బహుత్వంబు నేకతయు గోల్పిల్లన్.
శాంతి. 6-42

**ఏకతము** వై. వి. (సం. ఏకాంతమ్ - ప్రా. ఎక్కంత)

ఒంటరిపాటు, ఒక్కరుగాముండుట.

ఉ. చయ్యన నేఁగి యబంబుజ నేత్రం విలోచనఁ గాంచి ప్రీతియై,
నియ్యకొనంగఁ జేసి. విరా. 2-245

తే. కొలుమనఁగి గురుండు పాంచాలసేన, నంతము గొలకును దెచ్చె
నీవు గడఁగి, కౌరవులఁ జాయవలవు మేకతమయ్యె. నకని బది
మార్పఁ జేకొని యబ్బలంబు. ద్రోణ 5-301

**ఏకతుఁడు** సం. వి. అ. పుం.

1. ఒక ఋషికుమారుఁడు. వీని సోదరులు ద్వితుఁడు, త్రితుఁడు.

క. త్రితుఁడనఁగా ద్వితుఁడన నే, కతుఁ డనఁగఁ దపస్విసుతులు గలరా
విప్రత్రితయము ఋషాహుయకము, ప్రతుదిశలొనర్చి దేవగణముం
బడసెన్. శల్య. 2-154

(వీరే ప్రజాపతి పుత్రులుగ ఋగ్రింది సంఖ్యయందుఁ గలరు. కాని వరుస
క్రమమున భేదము గలదు. పైది కనిష్ఠానుపూర్వకముగాఁ గ్రిందిది
జ్యేష్ఠానుపూర్వకముగాఁ జెప్పఁబడినదని యెఱుఁగవలయును)

వ. ప్రజాపతి పుత్రులగు నేకతుండును ద్వితుండు త్రితుండును నను

మునిసత్తములు సదస్యులైరి. శాంతి. 6-861

శ్లో. అసన్ పూర్వయుగే రాజన్ మునయో భ్రాతరస్త్రయః,
ఏకతశ్చ ద్వితశ్చైవ త్రితశ్చాదిత్యసన్నిభాః
సర్వే ప్రజాపతి సమాః ప్రజావంతస్తథైవ చ.
సం భా. శల్య. 37-8,9 శ్లో.

శ్లో ప్రజాపతిసుతాశ్చాత్ర సదస్యాశ్చాభవంస్త్రయః
ఏకతశ్చ ద్వితశ్చైవ త్రితశ్చైవ మహర్షయః
సం. భా. శాంతి. 337-6 శ్లో. చూ ఉదపానము

**ఏకత్వము** సం. వి. అ. న.

1. ఒక్కటియగుట, ఐక్యభావము.

వ. అమ్మురహార పురహారుల యేకత్వంబు మనంబునం గొనియాడి
ద్రోణ 2-268

క. అనఘ యమలోమమునఁ దోఁపును బ్రతిలోమమున లయము వొందుటయును గల్గును సర్వగత్వముల కవి, యొనయిక బ్రహ్మముగు గలయు నేకత్వమగున్. అను. 4-184

2 ఒంటరిగా నుండుట.

క. ఏకత్వం బన్యత్వ మనేకత్వము గలుగు నీ మహిమ చంద మాలోకింప నిపుణులగు సు, శ్లోకులకుం బరమపదము సులభము గాదే
శాంతి. 4-286.

**ఏకపాద** సం. వి. అ. స్త్రీ.

అశోక వనమున సీతాదేవికి కావున్న రాక్షసస్త్రీలలో నొకతె.

వ అమ్మగువ కావున్న దనుజాంగనలు త్ర్యక్షియు, లలాటాక్షియుఁ, బ్రదస్తనియు నేకపాదయు దీర్ఘజిహ్వయుఁ బ్రజటయు నేకలోచనయు మొదలయినవారు. అర. 6-391

**ఏకపాదుఁడు** సం. వి. అ. పుం.

1. ఏకాదశ రుద్రులలో నొకఁడు.

వ మఱియు స్థాణునకు మానసపుత్రులైన మృగవ్యాధ శర్వ నిరృత్యైకపా దహిర్బుధ్న్య పినాకి దహనేశ్వర కపాలి స్థాణుభర్గులఁద

గా నేకాదశరుద్రులు పుట్టిరి. ఆది. 3-66

2. ఒకముని, అష్టావక్రుని తండ్రి.

వ. తొల్లి యేకపాదుండను మునివరుండు తన విద్యావిభవంబున సుజాత యను దాని వివాహంబై వనంబున ఘోరతపంబు చేయుచు ననవరతంబును శిష్యుల వేదంబులు చదివించుచున్న. అర. 3-287; అర. 3-286

ఇతఁడు ఉద్దాలకుని శిష్యుఁడనియు ఇతని పేరు కహోళుఁడనియు మూలమునఁ గలదు.

శ్లో. ఉద్దాలకస్య నియతః శిష్య ఏకో నామ్నా కహోళ ఇతి విశ్రుతోఽభూత్. సం.భా. అర. 132-6

3. సాగరద్వీపనివాసి-సహదేవుఁడు రాజసూయయాగ సందర్భమున దక్షిణ దిగ్విజయ యాత్రకుఁ బోయినపుడు వీరిని జయించెను.

వ. సహదేవుండు దక్షిణ దిక్కున కరిగి...సాగర ద్వీపవాసులైన నిషాదులం బురుషాదుల నేకపాదులం గర్ణప్రావరణుల ... వశగతులం జేసి. సభా. 1-260

విశే. (అ. ఇ. అ.)
ఒంటి కాలివాఁడు.

వ. అప్పుడు ప్రదీప్త వదనలుఁ బ్రజ్వలిత నేత్రులు నేకపాదలుఁ గరి తురంగ సింహ సూకరానన సమాన ముఖులును. సౌప్తి. 1-116

**ఏకపుత్త్రుఁడు** సం. విశే. (అ. అ. అ.)
ఒక్కఁడే కొడుకు గలవాఁడు.

క. వినవయ్య యేకపుత్త్రుఁడు ననపత్యుఁడు నొక్కరూప యని ధర్మజ్ఞు పులన్, విని నీకుఁ బోడుపుత్త్రుం, డనఘా తరయంగ నిష్ట మయినది నాకున్. ఆది. 4-180

**ఏకభక్తి** సం. వి. ఇ. స్త్రీ.
నిశ్చలభక్తి, ఏకాంతభక్తి, అవిచ్ఛిన్నభక్తి, అనన్యభక్తి.

చ. ...మఱియుదివ్య పరమాకృతి చేర్చిన యేకభక్తి భావనమునఁ

డోఁచు దీని జనవర్గము గానదు నీకఁ జూపితిన్. భీష్మ. 1-220

తే. అచరములును జరంబులునైన భూత, సముదయంబులు మణులు సూత్రమున నున్న, కరణి నీ యంద యున్నవి గాన సమత, నేక భక్తి నే, గొలెద నిమ్ము దేవ. శాంతి. 4-240

**ఏకభుక్తము** సం. వి. అ. న.

పగలు రెండుజాములు దాఁటిన తరువాత ఒకపూట మాత్రమే తినుట.

సీ. ఏకభుక్త వ్రత మొంతయు నిష్ఠ మాసం బెల్ల నడపిన సద్విజుండు. అను. 4-48

**ఏకమతము** సం. విణ. (అ. ఆ. అ.)

ఒక్కటే తలంపు గలది.

ఉ అందఱము నేకమతంబగు నిశ్చయంబుతోన్. అర. 7-18

**ఏకము** సం. విణ. (అ. ఆ. అ.)

1. ఒకటి (ఈ యర్థమున నిత్యైక వచనము)

వ. విశ్వావసుండు పంచవింశక తత్త్వంబునకుం బరంబు గలుగుటయు నది రూపింప నేకంబగుటయు వారద జైగీషవ్య దేవల కపిల శుక సుమంతు పైలాద్యులైన పరమమునుల గోష్ఠి వి శేషంబుల విందు. శాంతి. 5-148

క. ఏక ద్వి త్రి చతుర్వ్యూహాకారతఁ దోఁచుచుండు హరిభక్తజనా,లోకమున వాసుదేవా, ద్యేకః ప్రాప్తముగఁ దత్తదుచిత మూర్తిన్. శాంతి. 6-500; కల్య. 2-1; విరా. 4-160

2. ముఖ్యము.

సీ. ధర్మైకనిరతుఁ డాతం డొక్కరుఁడ చూవె. విరా. 2-189

**ఏకముఖత్వము** సం. వి. అ. న.

ఒకటిగా నుండుట, ఒకే యుద్దేశముతో నుండుట.

వ. పవమానసూనుండు సోదర భుజబలంబు లేకముఖత్వంబున చెప్పదుం గలుగు మనోబలంబు వలనం బలింపకుండె. కల్య. 2-297

**ఏకముఖము** సం. విణ. (అ. ఆ. ఈ. అ.)

1. ఒకవైపుననే యున్న ముఖము గలది. ఒకటే యుద్దేశముగలది.

వ. పేనియు నొక్కుమ్మడి నద్దిక్కు దఱిమినం గని కృష్ణార్జునులు విజ
సైన్యంబు సమస్తంబు నేకముఖంబు సేసి మార్కొనిరి
శల్య 1-231; అర. 7-14

2. ఏకాగ్రత గలది.

శా. భావం బేకముఖంబుగఁ జేసికొని యాపద్ధ్వాంత భానున్ మహా-
దేవుం...భక్తి బ్రౌఢతం గొల్చెదన్. దాప్తి 1-109

3. ఏకాధిపత్యము.

ఉ. నాకమ నీకు నేటికి రణం బొనరింపఁగ నేను బంప నీ వేకముఖం-
బుగా ధరణి యేలుము. శాంతి, 2-335

**ఏకరాత్రము** సం. వి. అ. న.

1. ఒకనాటి తీర్థము.

వ. ఏకరాత్రంబను తీర్థంబున నేకరాత్రోపవాసంబు సేసి బ్రహ్మ
లోకంబు వడయుదురు. అర. 2-267

2. ఒక్క అహోరాత్రము, ఒక రాత్రి.

వ. ఏకరాత్రంబను తీర్థంబున నేకరాత్రోపవాసంబు సేసి బ్రహ్మ
లోకంబు వడయుదురు. అర. 2-267

[తీర్థయాత్రలు చేయువారు ఒంటిపూట భోజనము చేయుట పగటిగాని రాత్రులయందు కేవలము ఉపవాసము చేయుచునే యుందురు గాన ఇచట అహోరాత్రము (ఒక పవలు + ఒక రాత్రి) అని చెప్పుటయే సమంజసము.]

**ఏకలవ్యుఁడు** సం. వి. అ. పుం.

హిరణ్యధన్వుఁడను ఎఱుకరాజు కొడుకు, ద్రోణుని వలన విద్యయుం
బ్రోదపడంగ వచ్చెఁ. ఆది. 5-60

చూ. చరిత్ర ఆది. 5-282; మొ. 246 వంక; ద్రోణ. 6-280

ఇతని కొడుకు అశ్వమేధ హయరక్షణార్థము వచ్చిన అర్జునునితోఁ
బోరాడి యోడిపోయెను. అశ్వ. 4-111,112

చూ. అనుబంధము చివరి పట్టికను.

**ఏకలోచన** సం. వి. అ. స్త్రీ.

అశోకవనమునందున్న సీతాదేవికి కాపున్న రాక్షస స్త్రీలలో నొకతె.

చూ. ఏకపాద. అర. 6-881

**ఏకవర్ణము** సం. విశే. (అ. అ. అ.)

ఒకేరంగు గలది (ఇక్కడ సుఖము అని భావము)

తే. కొన్నిటికిఁ బంచవర్ణముల్ గుసుమఫలము, లందు గొన్నిటి కేక వర్ణాంచితంబు, లవనిజములు గొన్నిటికి నవ్యక్త వర్ణ,కములు సౌరభ్యమాధుర్య సమధికములు. ఆశ్వ. 2-56

**ఏకవస్త్ర** సం. వి. అ. స్త్రీ.

ఒక్కచే వస్త్రముగలది, ముట్టుత,

ఉ. అక్కోమలి ప్రాతికామ పిలువంద నేక వస్త్రయు నధోనీవియు నవిరళ గళితనయనోదకబిందు సందోహ పరిపీడ్యమాన పీన స్తన పరి ధానాంతరయు. సభా. 2-212

వ. (దుశ్శాసనుఁడు) అనుచు డాయ వచ్చిన నేను రజస్వలను ముట్ట కుండు మేక వస్త్రను నయియున్నదాన మఱి గురుబంధు జనాధి ష్ఠితంబైన సభకు నెట్లు రానేర్తుననిన నీ వేక వస్త్రవైతే నేమి విగతవస్త్రవైతేనేమి నిన్నెట్లుం దోడ్కొని పోదునని బలాత్కా రంబున. సభా. 2-215

శ్లో. ఏకవస్త్రా అధో నీవీ రోదమానా రజస్వలా,
సభామాగమ్య పాంచాలీ శ్వశురస్యాగ్రతోభవ...

సం. భా. సభా. 66-18

శ్లో. సాకృష్యమాణా నమితాంగ యష్టిః
శనైరువాచాథ రజస్వలాస్మి.
ఏకం చ వాసో మమ మందబుద్ధే
సభాం నేతుం నార్హసి మా మనార్య.

శ్లో. రజస్వలా వా భవ యాజ్ఞసేని
హ్యేకాంబరా వా ప్యథ వా వివస్త్రా,
ద్యూతే జితా చాసి కృతాసి దాసీ
దాసీషు వాసశ్చ యథోపజోషమ్ సం. భా. సభా. 66-31, 33

స్త్రీలు ముట్టయిన మూఁడు దినములు ఒకే వస్త్రము ధరింపవలెను. అనఁగా రజోదర్శనమైనది మొదలు స్నానపర్యంతము వస్త్రము మార్చ రాదు. పోఁకముడి క్రిందికి వేయవలెను-స్నానము చేయరాదు-అని ధర్మ శాస్త్రము, వైద్యశాస్త్రముననే గాక సనాతనాచారమును.

కావున ఏకవస్త్రవసనము రజస్వలకుఁ జెల్లినది. ఈ సమయమున ఆంధ్ర స్త్రీలు వారు పైటవేయఁగు ఔత్తరాహులువారు మేలు ముసుఁగు నుండదు-"అవిరళశీతనయనోదకబిందుసందోహ పరిపీడ్యమాన పీనస్తన పరిధానాంతయు"-అనునది నన్నయగారి కల్పన.)

ఉ. ఆసిత కేశ ఏకవస్త్రయగునట్టి సమం గొని వచ్చి పెంచు దు,శ్శాసను
జూచుచుం గతు లసంభ్రములై తగు శిష్టలెక్క వ్యాయాసలు మాని
చిత్రముల యాకృతి నున్నయెడన్. ఉద్యో. 3-111

(మూలమ్ములో ఈ కావున ఏకవస్త్ర పదప్రయోగము లేదు, భీష్మ పర్వములోఁ గలదు.

శ్లో. యత్రైవ ద్రౌపదీ కృష్ణా ఏకవస్త్రా రజస్వలా,

శ్లో. సభామానీయ దుర్బుద్ధే అనాథా క్లేశితా త్వయా.

సం. భా. భీష్మ. 92-27,28 శ్లో.

విశే. (అ. ఆ అ.)

2. ఒక్కటే వస్త్రము గలది.

వ. ఇట్లేకతంబ యేకవస్త్రయై యోడ నెక్కవచ్చు వానిఁ నిరీక్షించు
చున్న సత్యవతిం జూచి యామునివరుండు దానియందు పరవ
శుండై, ఆది. 3-77

(ఇక్కడ 'ముట్టుత' అను అర్థము పొసఁగదు. ముట్టయి వాన వడపుట, ముట్టుకాలమున గర్భోత్పత్తియయి వీరిది శిశువుపుట్టుట అసంభవము.)

సూ. తత్ర ప్రథమే దివసే ఋతుమత్యాం మైథునగమనమనాయుష్యం పుంసాం భవతి, యశ్చ తత్రాధీయతే గర్భః స ప్రసవమానో విముచ్యతే. ద్వితీయేఽప్యేవం సూతికా గృహే వా, తృతీయేఽప్యేవ మసమ్పూర్ణా ఙ్గోఽల్పాయుర్వా భవతి.

సుశ్రుతము శారీరస్థానము. ద్వితీయాధ్యాయము 30 సూ.

పరాశర మహర్షి ముట్టుటను ఆసించెనని చెప్పుటయు గర్హ్యము. సత్య
వతి దాశవనిత. దాశవనితలు వివాహమునకు పూర్వము ఏకవస్త్రలుగా
నుండుట ఆచారమైయుండవచ్చును. ఇప్పటికిని మలయాళ దేశమున
ఏకవస్త్ర ధారణాచారము సనాతన మార్గావలంబులలోఁ గనఁబడుచున్నది
నేఁడును కొన్ని కులములందు మగపిల్లలు మేనమామ ధోవతులిచ్చు వఱకు
పంచెకట్టని యాచారమున్నది. ఇప్పటివఱకు అన్నిజాతులయందును ఆఁడ
పిల్లలకు వివాహకాలమున మేనమామలు తలఁబ్రాలుచీరె వల్లెవాటు
వస్త్రము నిచ్చు నాచారము విధిగాఁ గలదు. దీనినిబట్టి కన్యలు వివాహ
మగువఱకు ఏకవస్త్రలు అని రూఢియగుచున్నది. దాశకన్య రజస్వలా
సిద్ధి పొందినను వివాహము కాలేదుగాన ఏకవస్త్రము ధరించియుండును.
ఏకవస్త్రత్వము అవివాహితత్వ సూచకము. రజోదర్శన దినము మొదలు
పదాఱవ దినమువఱకు రజోదర్శనావకాశముండుటచే సంతానయోగ్య
అని సూచించుటకైనను ఏకవస్త్ర శబ్దముపయోగించి యుండవచ్చునేమో
ఇది నన్నయగారి స్వకీయ పదప్రయోగము. మూలమునం దీ శబ్దమి
తావున గానరాదు

**ఏకవస్త్రధరణము** సం. వి. అ. న.

ఒకే వస్త్రమును ధరించుట, దీక్షా వస్త్రమును ధరించుట.

అ. అనిన లెస్సగాకయని ధర్మసుతుఁ డేక వస్త్రధరణనియతి వఱలఁ నెల్ల
వారు నట్ల యేఁగు దేరఁగఁ బౌరులు, బలసి చనఁగఁ బనిచె బౌర
వేంద్ర. ఆశ్ర 2-168

**ఏకవస్త్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఒకే వస్త్రము ధరించువాఁడు పైనియుత్తరీయము లేనివాఁడు.

(దమయంతినలు నన్వేషించుట) వ. అంతనుండియు నమ్మహాను భావు
నేకవస్త్రు, నసితకేతను నన్వేషించుచు సైరంధ్రీ వృత్తంబు పేకొని.
అర. 2-118

**ఏకవారభోజి** సం. విణ. (న్. సీ. న్.)

దినమున కొకసారి భుజించువాఁడు.

తే. గ్రాసమాచ్ఛాదనంబు దక్కంగ నెవ్వఁ డర్థి నెయ్యది యిచ్చిన
నేకవారభోజియగుచు నమస్కార సఖ్యంమతి నిరాకృతి యహి

తుఁడై యతివెలుంగు. ఆర్య. 2-172

**ఏకవారము** సం. వి. అ. న.

ఒక పర్యాయము. చూ. ఏకవార శోతి.

**ఏకవింశతి** సం. వి. ఇ. స్త్రీ.

ఇరువది యొకటి.

మ. తితి నెందుం జరియించి భూపతుల నిశ్శేషంబుగా నేకవింశతి వారంబులు ద్రుంచి యాతఁడు దుదిన్ శాంతత్వముం బొందెను. శాంతి. 3-66

**ఏకవీరుఁడు** సం. విశే. (అ. అ. అ.)

ప్రముఖుఁడైన వీరుఁడు, యోధాను యోధుఁడు.

వ. అప్పుడు గరిన మధ్య భాగంబున భాసమానుండయిన మార్తాండు రెండవ మూర్తియుం బోలె నద్యేకవీరుండు వెలింగె. ద్రోణ. 2-60

**ఏకశృంగుఁడు** సం. వి. అ. పుం.

విష్ణుమూర్తి.

ఆ. ఒక్క శృంగమునన యుర్వియొత్తితి వరాహావతార లీల యతిశ యిల్ల, నట్లుంగుటఁ జేసి యార్య జనప్రియ, నాకు నేకశృంగనామ మయ్యె. శాంతి. 6-487

**ఏకాంతము** సం. విశే. (అ. అ. అ.)

1 రహస్యమైనది. ఇద్దఱకంటె నెక్కుడు జనములేనిది (చోటు)

వ. ...అన్నహా దేవింగాంచి శాసనుండు సంభ్రమ వినయంబులతోడం జేరి సూత గోత్రంబును రాధేయ నామంబునుం జెప్పి యభివాద నంబు సేసి నీవు వినయం బేసిన కారంబేమి నాకుఁ జేయం గలవని యొయ్యడి యానతిమ్మనినఁ గుంతి యేకాంతంబుగా నిట్లనియె. ఉద్యో. 4-58; శాంతి. 1-18

వ. పిలిచి యేకాంతంబున వతని కిట్లనియె. అను. 2-184

2. ఏకాగ్రము.

ఒక్క విషయమునే గుఱిగాఁ జేసికొనినది.

క. కామ క్రోధాద్యములగు, నీ మానస వికృతు లుడిసి యేకాంత గుహాం,రాముఁడవై నను వెదకుట, మా మేలొండెల్ల నుడుగు సులభ వివేకా. శాంతి. 4-80

శా. ...లోకాగమ,వ్యాప్తయైకాంత గృహాంబువాఁ బరఁగి నానావేద వేదాంత వి,ద్యాయుక్తంబగు దానిఁ జెప్పఁ దొడఁగెం దద్భార తాఖ్యానమున్. ఆది. 3-11

3. కేవలము, ముఖ్యము.

తే. నగిలి నిత్యంబు నేకాంత ధర్మనిరతుఁ, డగుట యుక్తమె పురుషుఁ డట్టి వాని,వెలయ వెలయ ధర్మకామంబులు విడుచుఁ బ్రాణ, విగతు సుఖదుఃఖములు రెండు విడుచునట్లు. అర. 1-244

## ఏకాంతస్థలము సం. వి. అ. న.

ఒంటరి ప్రదేశము, రహస్యప్రదేశము.

వ. అట గీచకుండు కందర్ప దర్ప గోచరుండై పరిజనంబుల వంచించి యేకాంత స్థలంబున. విరా. 2-291

## ఏకాంతి సం. వి. న్. పుం.

ఏకాగ్రచిత్తుఁడు, విష్ణుభక్తుఁడు

క, ఫలములు గోరక కర్మం బులు నడపుచు వాని విమల బోధాగ్ని హరి, బొలియించుచు నిర్ద్వంద్వత, నెలకొను నేకాంతి జనులు నినుఁ గందురు హరి. శాంతి. 4-236; శాంతి. 6-85,88,76

## ఏకాంతికము సం. వి. అ. న.

ఏకాంతము గలది.

వ. సాంఖ్యయోగ యుక్తులు బహిర్దర్శనులై నిశ్చయ రహితులై రేని నింద్రియ తత్త్వంబు గాన నేరరట మోహపంక మగ్నులగువారికి నుపవాసంబుల నియమంబుల వ్రతంబుల నెఱుంగ శక్యంబుగా దేకాంతిక ధ్యానపరుల కెఱుంగుట గలదు. అను. 1-879

వ. ....అర్ద్రేవు వాశ్రయింపు మతం డేకాగ్రచిత్తులై యారాధించిన వారికిఁ జేరువయగు. ఉద్యో. 2-325

వ. తెగ వాపుటయుం దదీయ స్థానకంబును ముష్టి ప్రకారంబును నేకాగ్రదృష్టిం గమంగొను గాండీవికి. ద్రోణ. 2-874

**ఏకాదశ** సం. విణ. (న్)

పదునొకండు, పదునొకండవ.

(ఇది తెమఁగున సమాస పూర్వపదముగనే యుండును.)

క. వారల నేకాదశ రుద్రులంగా నెఱుంగుము. అను. 3-57

వ. మెచ్చి భద్రమూర్తులైన రుద్ర విరుంచులు సన్నిధిసేసినం బెన్నిధి గన్న పేదచందంబున సంభ్రమించు వాకుం గరుణించి కృష్ణుండను నేకాదశనామంబును నప్రతిహతకాఱంబులు నొసంగిరి. విరా. 4-149

**ఏకాదశరుద్రులు** సం. వి. బహు.

పదొకండుగురు రుద్రులు—వీరు 1) అజపాదుఁడు 2) అహిర్బుధ్న్యుఁడు 3) త్ర్యంబకుఁడు 4) వృషాకపి 5) శంభుఁడు 6) కపాలి 7) రైవతుఁడు 8) హరుఁడు 9) బహురూపుఁడు 10) ఉగ్రుఁడు 11) విశ్వరూపుఁడు. అను. 3-57; 58

**ఏకాధిష్ఠితము** సం. విణ. (అ. ఆ. అ.)

ఏకచ్ఛత్రాధిపత్యమైనది.

క. ఈ కార్యసిద్ధియగుడును, నీ కతమున నఖిల ధారుణీ రాజ్యము నా, కేకాధిష్ఠిత మగు నిది, నీకును నిత్యోపభోగనిలయము కాదే. ఆది. 6-140

**ఏకాయనము** సం. విణ. (అ. ఆ. అ.)

ఏకాగ్రము, ఒక విషయమునందే లగ్నమైనది.

క. వాకును, మనసును గాయము, నేకాయన వృత్తి కాచ మొదలం తపముం, జేకొనునది యది లోక, శ్రీకి మృతంబునకు వెన్న క్రియ జనకమగున్. శాంతి 4-338

**ఏకార్థము** సం. వి. అ. పుం.

ఒకే ప్రయోజనము, ఒకే కార్యము.

ఆ ఎఱిఁగి యెఱిఁగి నన్ను నేకార్థసముపేతుఁ, బాడియయ్యె యిట్టి పనికిఁ బనుప. అర. 2-86

**ఏకార్థుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)

ఒక్కటే కోరికగలవాఁడు, ఒకే ప్రయోజనము గలవాఁడు.

వ. వారిం గూడిన రాజులెల్లను దిగ్విజయంబునాఁడు పాండవుల చేత భంగపడిన వారు గావునఁ గర్ణుతో నేకార్థులమై శత్రుము గెలుతు మింతియకాని యొండులేదని నిశ్చయించుకొని యున్నవారు. ఉద్యో. 3-285

వ. శునశ్శుఖుండను పరివ్రాజకుండు ఎచ్చిన వారిం గని వందనంబు సేసిన వారలభినందించి రతండు నమ్మునులంగలసి యేకార్థుండై సంచరించె అను 3-220

**ఏకాశ్వాసము** సం. వి. అ. న.

ఒకటే యాశ్వాసము గలది.

పద్యము - మహాప్రస్థానిక పర్వంబు సర్వంబు నేకాశ్వాసము మహా 80; మౌస. 227

**ఏకాశ్లేషిణి** సం. వి. ఇ. స్త్రీ.

ఒక దానియందే చేరినది. ఏకాగ్రమైనది.

క. రోషముఁ గామము రాగ, ద్వేషములును లేక భక్తి దిరమై యేకా, శ్లేషిణిగాఁ గొలుతు రవి, శ్లేషమనోనిలయవృత్తి సిద్ధులు నిన్నున్. శాంతి. 4-235

**ఏకాసనత** సం. వి. ఆ. స్త్రీ.

ఒకే పీఠముపైఁ గూర్చుండుట.

క పతి దనకు వేమి యిచ్చిన, నతిముదమునఁ బొందవలయు వాఙ్మయుఁడై నన్, మఱిఁ గొంకక యేకాంత, స్థితి నేకాసనత నుక్కిసెట్ట ప్రమదకున్. అను, 5-294

**ఏకీభూతము** సం. విణ. (అ. ఆ. అ.)

ఒక్కటిగా అయినది,

వ. కృష్ణద్వైపాయనుండను బ్రహర్షి తొల్లి వేదంబు లేకీభూతంబులై యేర్పడకున్న ఋగ్యజుస్సామాథర్వంబులుగా విభాగించి తన శిష్యులయిన పైల వైశంపాయన సుమంతు జైమినులం బంచి క్రమం బునఁ జతుర్వేద సూత్రంబులఁ జేయించి. ఆది.1-30; ఉద్యో.4-261

**ఏకోత్తరము** సం. విణ. (అ. ఆ. అ.)

ఒకటి ఎక్కువగాఁ గలది.

వ. ఈ రెండు వంశంబులవలన నేకోత్తరశత వంశంబులయ్యె (ఏకోత్తరశతము = నూట ఒకటి) సభా. 1-109

**ఏకోద్దిష్టము** సం. వి. అ. న.

ప్రేతము నుద్దేశించి మరణదినము మొదలు పదునొకండవదినమునఁ జేయు శ్రాద్ధము.

క. వినుము సపిండీకరణ,మ్మున నేకోద్దిష్టమునను భోజనవిధి వ,ర్జన మొప్పు నామతింపక, చన దామెతఁ గుడువఁబోవ సజ్జనవినుతా. అను. 4-122

**ఏగురు** దే. సర్వ. (ఏను + గురు - ఏను శబ్దమునకు మహన్మహత్యర్థక రూపము)

అయిదుగురు.

వ. కురురాజు మొదలగు నేగురు రథికులు పెలుచ నేసిరి ద్రోణ. 5-177; ఆది. 7-218

**ఏచు** దే. అ. క్రి.

1. విజృంభించు, చెలరేఁగు.

క. భుజబలదుర్జయుఁ డింద్రుం. డజయ్యుఁడవు నీవు నీకు నతనికి మీఁదో, విజయము దక్కదు మీరేచి జగంబులు నొవ్వ రణము వేయఁగ నేలా. ఉద్యో. 1-133

ఉ. ఏచిన యాపురత్రయము నేకశరంబున రూపుమాపఁగాఁ, జూచినఁ బోవుఁగాని పెఱచొప్పునఁ బోవదు. కర్ణ. 1-266

ఉ. ...ఈ,కావరమైన కీచకుఁడు కామనిపీడితుఁడై యలంతులం, బోవక యేచి పట్టుకొనఁబోయినఁ దూలెదఁగాక యిమ్మెయిన్. విరా. 2-228

2. మదించు.

తే. ఏచి మున్నీరు సేయూఁత నీద నగ్ని, మఱక వానుకి కోలలు వెలుఁగఁ గడఁగినట్లు గాదె రాధేయని వర్జునునకుఁ, బోర నెక్కటి మార్కొనఁ బూను టరయ, విరా. 4-218

అ. అధిక దర్పయుక్తమై బలీవర్దంబు, నగముదరి విదారణంబు సేయఁ, గాలు ద్రవ్వునట్లు గడుబలాఢ్యుల తోడ, నేచి పేఁడు విగ్రహింపఁ దొడఁగె. సభా. 2-188

3. అధికమగు, అతిశయించు.

మ. ...పౌత్రుని భూరిశ్రవసుం గనుంగొనుచు నింద్రుం గ్రేణి సేయంగ నేచిన పెంపొప్పఁగ బాహ్లికుం డరిగె నిశ్చింతయునం బోరికిన్. భీష్మ. 1-94

తే. ఎక్కుటెక్కటి పెనఁగిన నింతపట్టు, పెనఁకువలు నిట్టు, లేచునే పృథివి నింక, జనము లీ కురు పాండవ సంగరంబు, సెప్పికొంద్రు మనంబు లచ్చెరువు నొంద. ద్రోణ. 1-178

4. పెరుఁగు, బలియు.

సీ. నెగసిన కొనలేచి నింగి యంతంతకు,నవులఁ ద్రోవఁగఁ దనరారు దాని (శమీతరు చక్రవర్తి) విరా. 1-162

మానిని:–ఏచి తనర్చి తలిర్చిన క్రొవ్వుల నిమ్మగుశాఖల జొంపములం బూచిన మంచి యశోకములన్. ఆది. 4-20

క. ఏచిన పొదలఁ బొరల్పడఁ ద్రోచుచు, అర. 2-85

5. ఉత్సహించు.

చ. మనసుల నూలుకొల్పి యనుమానము లెల్లను బాచి యేచి వాహనములు వాయుధంబులును వాయితమయ్యెడు భంగిఁ జేయుచున్. విరా. 4-187

స. క్రి.

కలఁతపెట్టు, పీడించు.

చ. ...ఎవ్వు నంగనాజనములు నన్నుఁ జూచి మరుసాయకముల్ దము

చిత్తవృత్తులే, వినఁగొని వచ్చి యిత్తురు విశిష్ట ధనంబులు నాకు లంచముల్. విరా. 2-334

('లంచములిత్తురు'-అనునది తిక్కనగారి భావము)

**ఏటికి** దే. క్రియా. (ఏమిటికి -ఏమిలోని మివర్ణము లోపించి వచ్చిన రూపము)

ఎందుకు.

మ. భామా పల్కులిం కేటికిన్. విరా. 1-321; విరా. 3-225

**ఏటికెదురీఁదు** దే. జాతి.

ఏటి యందలి నీటి ప్రవాహమునకు ఎదురుగా ఈఁదు.

(నీటివాలున ఈఁదుట సులభము సుఖకరముం ఉద్దేశించిన భావు చేర వచ్చును. ఎదురుగా ఈఁదుచున్నచో మిక్కిలి శ్రమగలిగి యెప్పుడు నీట మునుఁగుదునో యని మానసిక బాధ యేర్పడును. తలకుమించిన కార్యము చేయ సాహసించినప్పు డీ జాతీయము నుపయోగింతురు. ఇక్కడ-ఏటికెదు రీఁదునప్పుడు పడు మానసిక బాధ అనుభవించు. అని యర్థము).

చ. ...వారిజనాథుఁడు లేని దీనతం, బొరసి కృపైక భాజనతఁ బొందిన యప్పురిఁ జూచి మానసం, బెరియఁగఁ బొచ్చె నేటి కెదు రీఁదిన చాడ్పున నేమి చెప్పుదున్. మౌస. 98

**ఏటికోళ్లు** దే. వి. బ.

నమస్కారములు.

క. ...వరమిండీ వేల్పులార వారనికరుణన్.

వ. అని ప్రార్థించుచు దైవంబుల కేటికోళ్లు నిరూపించుచు బహు ప్రకారంబులం బలుకుచుండిరి. ద్రోణ. 2-346, 347

**ఏటిది** దే. వి.

ఎటువంటిది, ఎంతమాత్రపుది.

చ. ....ఇట్లనఁదగునయ్య యే నిచట నైనది యింత యేటిదిన్. విరా. 3-225

క. యదుఁ డగ్రతనూజుఁడు వా,హ్యాదయసముద్భవుఁడు వాఁడయిన మద్వచనం, బిది యేటిది యని కడుదు,ర్మదుఁడై చేయక కృతావమానుం డయ్యెన్. ఆది. 8—198

**ఏటిమడ** దే. వి.

ఏటి యొడ్డు.

సీ. అనఘుఁడౌద్దాలకియను మహాముని దన, తనయుని బిలిచి యిధ్మ: ములు దర్భ, కట్టయు జలపూర్ణ కలశంబుఁ బువ్వులు మఱచి వచ్చితి నేటిమడఁ గుమార, కొనిరమ్ము వేగంబ చని. అను. 2-446

శ్లో. ఇధ్మా ధర్భాః సుమనసః కలశశ్చాభితో జలమ్, విస్మృతం మే తదానీయ నదీతీరాదిహా వ్రజ. సం భా. అను. 71-5

**ఏటిమాట** దే. వి.

ఎక్కటిమాట, వృథావచనము, అనవసరపు మాట.

చ. ...అ,వ్వనిత దరస్మిత స్ఫురిత వక్త్రముతో నిదియేటి మాట న,ల్లని యెడ గానగాదె తెమలం బలుకం బనియేమి వావుడున్. అను. 1-186

క. ధృతరాష్ట్రుండును బుత్త్రులు, నతిలోభంబునఁ బ్రజాక్షయము సేసిరి ధ,ర్మతనూజు గెలువవచ్చునె, మతిలేరై రింక నేటి మాటలు మన కున్. భీష్మ. 8-227

**ఏటు** దే. వి.

బాణ ప్రయోగము, బాణపుదెబ్బ.

ఉ. ఏటుల బ్రమ్మొగ్గువారి గని యించుక కొంకక. విరా. 8-168

వ. అని యివ్విధంబున నతం డేటు దప్పిన జోహారు వెట్టుటయు (ఏటు దప్పు = బాణప్రయోగము నిలిచిపోవు).

**ఏటులాడు** దే. అ. క్రి. (ఏటులు+ఆడు)

బాణములతోఁ బోరు, పోరు.

క. అతిముఖి పడరిన రథికుల, తఱచునకు సుభద్రకొడుకు దలఁకక

తా నం,దఱ కన్ని రూపులై యే,ౖతెఱ నవ్వుచు నేటులాడె ధీరత మెఱయన్. భీష్మ 2-88; ద్రో. 3-267

**ఏట్లాడు** దే. అ. క్రి.

ఏటులాడు.

బాణములతోఁ బోరు, పోరు.

వ. ఇవ్విధంబున నేట్లాడుచుం గదిసి గాఁడీవి గర్జున కిట్లనియె. విరా. 5-87; ద్రో. 3-180

**ఏడ** దే. వి. ఏ ($ఏ^2$+కడ) ఎక్కడ

(అసంగతము-పొసఁగమి తెల్పును.)

చ. అసమున మీఁదెఱుఁగక మహోగ్రహ వృత్తిఁ గడంగి చెచ్చెరం, బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాపఁడు కౌరవసేన యేడ యొం,టి సనుట యేడ వాకిది కడింది విచారము పుట్టె. విరా. 5-234

తరువోజ :- ఏనేడ నింద్రాదులేడ వారలకు నెప్పుడు మ్రొక్కుదు. అర. 2-47

**ఏడిక** వి. (సం. ఏడః)

మేఁక, గొఱ్ఱె.

సీ. శరభసింహవ్యాఘ్ర సత్త్వచయంబుల నేడికలెల్లెట్ల యెక్కియాడి. ద్రో. 2-210

**ఏడు** దే. సర్వ.

1. ఆఱునొకటి.

సీ ఏడు సాగరములు నిక్కడక్కఁబెట్టి, పలుచని రొంపిమై నలఁది కొనఁగ. విరా. 2-134

క. విన వేడగు పర్వము మేలనఁగా ద్రోణాభిషేక మాదిగఁ గల య,య్యోనిమిది పర్వములను. ఆది. 1-47

2. సప్తవ్యసనములు. ఇవి 1) ద్యూతము 2) వేఁట 3) స్త్రీ 4) మద్య పానము 5) అర్థదూషణము (ఇవి కామజములు) 6) వాక్పారుష్యము 7) దండ పారుష్యము (ఇవి క్రోధజములు).

తే. ఒకటి గొని రెండు నిశ్చలయుక్తిఁ దెల్చి. మూఁటి నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి, యేఁటిని గెల్చి యాఱిఁటి నెఱిఁగి యేడు, విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు.
ఉద్యో. 2-37 చూ. వివరణమునకై 'ఒకటి'

ఏడుగడ దే. విశే. ఏడుగడయు

భారత ప్రయోగములన్నియు 'యు' వర్ణకము తోడనే కన్పించుచున్నవి రెండును ఇంచుమించు సమానార్థకములుగనే యున్నవి. 'యు' వర్ణము సముచ్చయముగా భావించిన ఏడుగడ విశేషణము అగును, కానిచో అవ్యయమగును.

రక్షకుఁడు.

ఆ. బాలకేళిమీఁది భరము గ్రమంబున, విడువఁ గళలయందు వేడ్క నొనపి, నయముతోడ నర్తనంబుల శిక్షింపు, నెలఁత కేడుగడయు నీవకాదె. విరా. 1-251

తే. తొలుత నీవు నన్నడిగిన దొడ్డవిల్లు, గాండివము ఫల్గునన కేడు గడయు నదియ, సమరమున దేవదానవ సమితికైన, గెలుచు నక్రమమున దానిఁ బలన నతఁడు. విరా. 4-120

ఆ. అనిన నట్లకాక యఖిల ధర్మజ్ఞాన, ఘనుఁడు మనకునేడుగడయుఁ దాన, శౌరి నిశ్చయింప సంశయం బేటికి, సంఘటింపుఁ డుగ్రసమర విధము. ఉద్యో. 4-98

ఏడుగడయు అవ్య. ద్రు.

1. సర్వము, సమస్తము.

ఆ. ఎట్టిసాధ్వులకును బుట్టిన యిండ్లము, పెద్దకాలమునికి తద్ద తగదు, బతుంకదన యునికి సతులకు ధర్మువు, సతుల కేడుగడయుఁ బతుల చూవె. ఆది. 4-85

2. శరణ్యము, గతి.

వ. నీవు ప్రాజ్ఞుండవు ప్రబలుఁడవు విశేషించి నాకేడుగడయు నీవ కావున నీకును మదీయ హితం బవశ్య కర్తవ్యంబు. కర్ణ. 1-54

శ్లో. భవాన్ ప్రాజ్ఞతమో నిత్యం మమచైవ పరాగతిః-

సం. భా. కర్ణ. 11-28

ఆ. అనఘ నీవు నాకు నాచార్యునట్టుల, నేడుగతయుఁ గాన హితము
చెప్పఁదగు బలాధినాథుఁడుగఁ జేయ నర్హుని, వెల్ల వినఁగ నిశ్చ
యింపవలయు. శల్య. 1-77

శ్లో. గురుపుత్రోఽద్య సర్వేషా మస్మాకం పరమాగతిః,
భవాం స్తస్మాన్ నియోగాత్తే కోఽస్తు సేనాపతిర్మమ.

సం. భా. శల్య. 6-18

ఏడునూఱు దే. సర్వ. (√ఏడు)

ఏన్నూఱు, ఏడువందలు.

తే. ఏడునూఱు రథంబుల నేపుమాపె. విరా. 3-214

ఏడుమ్రొక్కులు దే. వి.

నమస్కారములు.

ఆ. అనఘ యేడు మ్రొక్కు లాబృహస్పతికి మ్రొక్కెద నతండు
నన్ను నదయవృత్తి నపహసించి తాను యాజకత్వమునకు, నెట్లుఁ
జేరకయున్న నేను బోయి. అశ్వ 1-75

(ఏడు మ్రొక్కులు = అనేక నమస్కారములు)

(వేయు మ్రొక్కులు అని-పాఠాం)

శ్లో. సంవర్తోఽయం యాజయితా ద్విజో మాం
బృహస్పతే రంజలిరేష తస్య,
నచైవాహో యాజయిత్వా మహేంద్రం
మర్త్యం సంతం యాజయ న్నద్య శోభేత్. అశ్వ 9-16

శ్లో. మరుత్తో బృహస్పతే రంజలిం ప్రాహిణోత్సః. అశ్వ. 9-22

ఏడ్చు దే. అ. క్రి.

రోదనము సేయు, శోకించు.

సీ. ...ఒక్కరుఁ బిలువుపెట్లు, సంపితి రిది మీకు సంతోష కాలమే
యేడ్తురుగా కార్యవేళ చెపుడ. ద్రోణ. 2-254

సీ. ఎలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు, విరా. 4-80

**ఏత్తెఱ** దే. వి.

1. అతిశయము.

ఉ. ఇమ్మహనీయ రూపమున యేడెఱఁ గన్గొని వేడ్కనీకు యోగ్య
మ్మగు భంగిఁ జెప్పితిమి గాని నరోత్తమ యొండుగాదు.
విరా. 1-226

ఉ. రోహిణి యొండె నొండెను నరుంధతి గాక మనుష్య జాతియే,
యీహరిణాక్షి చెల్వమున యేత్తెఱ చూడ్కుల నాఁచి కోలకా,దు
విరా. 1-295

2. ఏపు, చేవ, విజృంభణము.

చ. మఱియు నొకండు వించె పవమానతనూజుని చెయ్యిఁ జెన్నొదల్,
విఱిగి ధరిత్రిఁబడ్డయెడ వేగమె వచ్చి శిరంబుఁదన్నె నే,త్తెఱ గల
యప్డు శత్రు నవధీరితుఁజేయుట యొప్పుఁగాక యే, పఱిసఁ బరా
భవించిన జనావళి నవ్వరె నొవ్వరే మదిన్. శల్య. 2-387

సీ. అక్కుమారుఁడు దరహాసాభిరాముడై తళ్లమొక్కటి దొడ్గి విల్లు
దునిమి యేత్తెఱ నిరువదియేను దూపులు వడి నతరింప
శల్య. 1-254

మ. తఱికిం జొచ్చి కడంగిపోరు విజయున్ దొదప్పరం జూచి
యే,త్తెఱఁ బాంచాల సుతుండు సత్వరగతిం దేరద్దెపన్ సారథిం,
బఱపం బంచి. భీష్మ. 2-288

క. నిముఁ దలపడఁ జూచిన యా,తని యేత్తెఱ మంట నొరఁగఁ
దలఁచు మిడుతయు,బ్బున కెనయైనాకుం దోఁ,చిన యది గ్రమందింపు
మితని శిత విశిఖములన్. కర్ణ. 2-348; కర్ణ. 2-368

3. వడి, వేగము, రయము.

క. కేకయులేపుర బలములు, వాకులతం బొంద మార్గణాపారమునం,
జీకాకు పఱిచె భీష్ముఁ డ,నేకగతులఁ దన రథంబు నేత్తెఱ మెఱ
యన్. భీష్మ. 1-201

క. ఒక్కఁడని కడఁగి రథికులు, పెక్కండ్రు నిశాత విశిఖ భీమాకృతిఁ

వేఁ,రుక్కునఁ బొదివిరి వరు నతఁ, డెక్కుడు మద మొలయఁ జేతి
యేడ్తెఱ నూపెన్. (ఏడ్తెఱ = లాఘవము) ద్రోణ. 3-42

4. పూనిక.

మ. విరథుండై పొలివోని కీరమునఁ బృథ్వీభాగ సంచారియై, శరజాలం
బుల భీమసేనసుఁతు డాశ్చర్యంబుగా నీ మఱం,ది రథం బేడ్తెఱఁ గప్పి
కర్ణ. 1-149

5. శక్తి, సామర్థ్యము, నేర్పు.

చం. ...రూఢికి నెక్కిన సూతవృత్తిమై, నని నడిసన్న యేడ్తెఱ బృహ
న్నలకుం గల దంబుజాననా. విరా. 4-15

చ. ...ఎల్లెడల నాతని బాహు బలాఢ్యుఁడైన యొక్కని రథమేడ్తె
ఱం గడపంగా నియమింపుము రాజనందనా. విరా. 4-35

6. పరాక్రమము

ఆ. ఇట్లు దొరలు నొవ్వ నేడ్తెఱఁ దనచేతి, కొలఁది సూపి క్రీడి నెలఁగి
దేవదత్త మొత్తుటయు. విరా. 5-67

ఉ. ...తమునిండఁ దీవ్రశరాగ్నిఁ గాల్పఁ బెం,పెక్కిన పాండునంద
నుల యేడ్తెఱఁ దొల్లియుఁ దారెఱుంగరే. ఉద్యో. 4-54

7. తేజస్సు, కాంతి.

ఉ. ...నేల,కెం,పెక్కుచు వచ్చె దీవియల యేడ్తెఱ పోయగమండె.
విరా. 2-319

ఉ. అప్పుడు భీష్ము లేమి హృదయంబుల మమ్మలికంబు గూఁడగా,
నెప్పటి చందముల్ విడిచి యేడ్తెఱఁ దక్కిన చూడ్కు లొండొరుల్
నెప్పల మాటునం బొలయ నీ సుతుపాలికి వచ్చు రాజులం,
దిప్పు డతండు రావలవదే యని కర్ణుఁ దలంచి రందఱున్.
ద్రోణ. 1-14

8. ఉత్సాహము.

క. తలచుట్టు చుట్టెఁ గుండల,ములు పెట్టెను ద్రిండు గాఢముగఁ
గట్టెఁ గరం,బుల వలయంబులు గముఁగొని, యొలన వ్వాలయంగ
నెక్కె నేడ్తెఱ రథమున్. విరా. 4-165

సీ. అంత శల్యుండును శాంతనవుండును, నకులికిఁ ద్రౌపది యడరి భీము
అ-వేయఁ దొడఁగుటయును నేత్రైల ద్రౌపదేయులును దాసుఁ
గవిసి యుగ్రగతిఁ, బటు రయమున్నై సుభద్రాసుతుండు దు,ర్వార
విశిఖతతుల వారిఁ బొదివె. భీష్మ. 2-284

**ఏడ్పు** దే. వి.

రోదనము.

ఉ. తిట్టులఁ బోయి యక్కొలువు తేఁకువ వారలలోని కింతిఁ దా,నట్టులు
దుస్ససేనుఁ డదయాకృతి ముం దలపట్టి యీడ్వఁగా, నెట్టు సహించె
మామ సతి యేడ్పు చెలుంగున కెట్టు లోర్చె.
ఉద్యో. 1-847; ద్రోణ. 4-194

**ఏణము** సం. వి. అ. పుం.

పెద్దకన్నులుగల నల్లయిఱ్ఱి.

ఉ. ...ఎంతయు మదగ్రత నా బకవైరి గ్రక్కునన్, వాని నడంగ
బట్టి పడవైచి మహోగ్రత నాక్రమించెఁ బంచానన మేణముం
బొదువునట్లు. విరా. 1-850; శాంతి. 5-862; మౌస. 82

**ఏతద్** సం. సర్వ. (ద్)

ఈ (ఇది సమాస పూర్వపదముగానే తెనుఁగున నుపయుక్తము)

వ. జనక సులభా సంవాదం బను నితిహాసంబు గలుగు దాన నేతత్సం
శయంబు వాయు దానిం జెప్పెద వినుము. శాంతి. 6-169

వ. ఏతద్వ్రతానుష్ఠానంబు. అశ్వ. 4-79

వ. ఏతత్ప్రయోజనంబు.
శాంతి. 3-53; శాంతి. 4-337; శాంతి. 5-228

**ఏతదీయము** సం. విశే. (అ. ఆ. అ.)

దీనిది.

వ. నాఁడు రథస్థుండ నయిన నిన్ను నేతదీయం బయిన యర్థజాతంబు
వినిపించితినని యప్పురుషవరుతోడం బురుషోత్తముండు వెండియు
నిట్లనియె అశ్వ. 1-225

**ఏతన్మాత్రుఁడు** సం. విణ. (అ. అ. అ.)

ఇంతమాత్రమువాఁడు, సామాన్యుఁడు.

శా. ...మాద్రి పిన్నకొడుకేతన్మాత్రుఁడే చూడఁగన్.
విరా. 2-209

**ఏతాదృశము** సం. విణ. (అ. ఈ. అ.)

ఇటువంటిది, ఈ విధమైనది, ఇట్టిది.

క. మహితాత్మక యేతాదృశ, మహిమంబు సువర్ణమది సమంచిత తేజో,మహనీయము తద్దానము, మహత్త్వ మా శివుఁడ యెఱుఁగు మాకుం జూడన్. అను. 8-152; అర. 6-192

**ఏతెంచు** దే. అ. క్రి.

ఏఁగుదెంచు.

1. చనుదెంచు, వచ్చు.

తే. వేఁడఁ దొడివూసికట్టి యవ్వీరటుఁ డుత్తరుండు దోఁ జనుదేరఁ గొల్వుండు బుద్ధినచటి కేతెంచి కని విస్మయంబు నొంది, యెల్లి దంబుగఁ దలఁచుచు నిట్లులనియె. విరా. 5-317; విరా. 2-318

2. తీసికొనివచ్చు.

సీ. ...యాదవేంద్రు, శవము సుస్నాతంబుఁ జందన చర్చాన్వితంబుఁ జీనాంబరావృతంబు -తే- తంబు నాభరణ స్ఫురితంబు మాల్య,యోజితంబును గాఁజేసి యాజక ప్రయుక్త మంత్రతంత్ర స్ఫుట యోగమిం బొనర్ప నేతెంచె సామగానంబు సెలఁగ.
మౌస. 141

**ఏది** సర్వ. ఏది (√ఏ³ - ఏ శబ్దమునకు అమహన్మహత్యర్థక ప్రథమైక వచనము) బహు. ఏవి (అమహదర్థకము)

1. ప్రశ్నార్థకము.

ఆ. ఏది కులము నామమెయ్యది యెవ్వరి,దానవు. విరా. 1-318

ఆ. దీనికేది తుది యుపేంద్ర. స్త్రీ. 2-44

క. ...సంజయ, కైవారము పేసి దీవు కౌంతేయుల వా,రేవిరణసాధనమ్ములు,గా వెఱవక నడచువారు కౌరవుల పయిన్.
ఉద్యో. 2-222

ఆ. ఏది కారణముగ నెవ్వరెచ్చోట నీ, కేమి కీడొనర్చిరి.
విరా. 2-156

2. యచ్ఛబ్దార్థకము.

'అది' అను దానితో నన్వయము నపేక్షించును.

తే. ...పార్థుండు బయలు మెఱసి సమయంబు దప్పె నీ వెఱఁగి దీని,
కేటి దగు నది సేయుము మేదినీశ. విరా. 5-388

మ. ...హితము ధర్మంబున్ విచారించి చూ,చి తగుం బొమ్మని
యేది పంచి తది నిశ్చింతంబునం జేసి యు,న్నతిఁ బొందంగల
వారమై యునికి కృష్ణా నేఁడుగా వచ్చెనే. ఉద్యో. 3-80

3. కాకువును దెల్పును.

శా. బాలక్రీడ మహాసుర ప్రకరమున్ ఖండింపఁడే యెప్పుడుం, ద్రై
లోక్యంబును భక్తియుక్తిఁ దగ నారాధింపరే యట్టి శౌర్యాలం
కారు మహాత్ముఁ డా నరకు సేయం దచ్యుతున్ మమ్మతం, డేలా
కైకొను నా సుయోధనుని యం దెగ్గేది యూహింపఁగన్.
ఉద్యో. 3-145

ఎగ్గేది = ఎగ్గులేనేలేదు. అనఁగా అన్నియు ఎగ్గులే అని భావము.

ఏదు[I] అ. క్రి.

1. చెడు, తప్పు, తొలఁగు, నశించు.

క. అప్పుయుఁ బరిజనములుఁ దనుఁ, దప్పక కనుఁగొనుచు నుండఁ
దగవేది కరం, బొప్పని తమకము చిత్తముఁ గప్పికొనుట మత్త
లంబు గదురఁగ నచ్చెన్. విరా. 2-36

సీ. ఘోష యాత్రావిధిఁ గురురాజుఁ జెఱవట్టి, మానమేదిన చిత్రసేను
కంటె. కర్ణ. 2-24

శా. పెంపేదం దమకిట్టి తక్కువలు రూపింపంగనేలా ? ఉద్యో. 3-108

తే. తన కులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్రు, లన్నదమ్ములతో విగ్ర
హంబు గొనుట, కుమ్మలించి వివర్ణత నొందినట్లు. గంది యెంత
యుఁ జెలువేదెఁ జందురుండు.
ఉద్యో 2-107; శాంతి. 4-112; శల్య. 2-228 (సం.ము)

2. ఉడుగు.

మ. ...స,త్వరతన్ నల్గడఁ గాాఱ నవ్విభుఁడు గర్వంబేది వెల్వెల్లఁగన్.

కల్క. 1-302

ఆ. చలన మేది పుట్టుఁ జావును బిరువెట్టి, యామిపార్థిజనుల నపహ సించు, చెలిమి తోడలేమి కలిమి వాదింపని రమణమునికి యజగర వ్రతఁబు.

శాంతి. 4-62

సీ. వెగడునఁ జెయ్యేన వేగంబ తేటి సం,శ వ్రతు లర్జును సాయకముల.

(ఇది స. క్రి. యు నగును) కర్ణ. 2-229

3. లేనిదగు, పోయినదగు.

క. ముట్టఁబడి దీర్ఘసూత్రుం, డిట్టట్టరుగంగ నుపాయమేది యొక నిచేఁ, బట్టువడెఁ దనదు డెందము, పట్టువదలి చకిత వికల భావేం ద్రియుఁడై.

శాంతి. 3-198

స. క్రి.

పొందు.

శా. పాండుక్ష్మావరసూను సైన్యములు దర్పంబేదుడున్.

ద్రోణ 4-9-7

ఉ. ప్రల్లదమేది యిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రితుల్యుఁడై, ద్రె ళ్లుడు

సభా. 2-69

ఏదు[2] దే. వి.

ముఁడ్ల పంది.

వ. ఇట్లు విరథుఁడును విశిఖక్షత దేహుండునునై యతఁ డేదు వెరిగి నట్లు నీదు మఱందియగు వృషకు నరదంబుమీఁది కరిగె.

భీష్మ. 3-80

ఏదువెరుఁగు; ఏదువెఱుగు దే. అ. క్రి.

ముండ్లపంది విఱ్ఱఁవీ చు.

వ. ఇట్లు విరథుండును విశిఖతత దేహుండునునై యతం డేదువెఱఁగి నట్లు నీదుమఱందియగు వృషకు నరదంబు మీఁదికరిగె.

భీష్మ. 3-80

వ. సుభద్రా తనయుం డతని రథ్యంబులను సారథినిం జదియ మోఁది మనఃశోదుల యమ్ముల నేదు వెఱిగిన చందంబున సౌబలుని దెసకు నడచి యాతనికి నడ్డపడిన. ద్రోణ. 2-119

శ్లో. శరాచితాంగస్సౌభద్రః శ్వావిచ్ఛల్యవత్య దృశ్యత. ద్రోణ. 49-6

వ. అయ్యోధవరుండు దురగసారథి సహితంబుగా రథంబు శకలంబులు సేసి యతని తను వేద వెఱిగిన తెఱంగుగా మెఱుంగుటమ్ములు గిరికొల్పినం గెరలి యన్నిశాచర నాథుండు (ఘటోత్కచుండు) ద్రోణ. 5-207

శ్లో. సోఽదృశ్యత ముహూర్తేన శ్వావిచ్ఛలలితో యథా.
సం. భా. ద్రోణ. 176-55

సీ. ...అతఁడొండొక చాపమెత్తి తఱచుటమ్ముల నేదు వెఱిగిన చందంబు, నేపె రయంబునఁ జిత్రిసేసు. కర్ణ. 1-97

(ఏదు వెఱిగిన - అని సం.ము)

ఈ ప్రయోగములలో మొదటి ప్రయోగమునందు మాత్రమే ఆనంద, సం.ము లందు లఘురేఫము గన్పించుచున్నది. పెఱుగు = విజృంభించు అర్థములో శకటరేఫమే నిఘంటువులఁ గానవచ్చుచున్నది.

**ఏనగు; ఏనవ** దే. విణ.

అయిదవ.

వ. ద్రుపదు నేఁటికి డెబ్బదియేఁగు దివసంబునం బౌషమాసంబున శుక్లంబున నష్టమియు రోహిణివాఁడు స్వయంవరం బని ఘోషింపం బంచి. ఆది. 7-24

వ. ఏనవనాఁటి రాత్రి సమటయుం దెల తెలవేగునప్పుడు ధనంజయుండు సేనాపతి రావించి మకర వ్యూహంబు సంఘటింపుమని నియమించిన. భీష్మ. 2-344

**ఏనస్సు** సం. వి. స్. న.

పాపము.

క. మానసము లింద్రియముల, చేనియుఁ జేయంగబడిన యేనఃపుంజం

క్షీరకర్మలేతిహాసము. పీనుల నొక్కింత సిలుక విరియు సకలమున్.
స్వర్గ. 88

**ఏనాళ్లు** దే. వి. బ. (ఏను + నాళ్లు)
అయిదు దినములు.

క. నానాస్త్ర శస్త్రచయ జడ,శానలముం గవియఁ జేసి యత్యుగ్ర
త నే,నాళ్ళన యప్పాండవ, సేనా సాగరము నిపురఁ జేయుదు
నధిపా. ఉద్యో. 4-416

**ఏని; ఏనియు** నేని (ఏన్ అనునది 'ఏనియున్' అను దాని సంక్షిప్త
రూపము)

1. (చేదర్థకము.)

(క) పక్షాంతరమును దెల్పును.

వ. నా వలనం బ్రయోజనంబు గొనవలయునేని నొండుమాటలు
దక్కి పనులం బరికింప నియోగింపుము. విరా. 1-286

(కొనవలయునేని = కొనఁదలఁచిన పక్షమున)

ఆ. ఎఱిఁగిరేనిఁ జాల నెగ్గు వాటిల్లు (ఎఱిఁగిన పక్షమున) విరా 1-47

మ. అది కాదేఁ దెగి బంటవై యఱుము (కాదేన్ = కానిపక్షమున)
ఉద్యో. 8-98; విరా. 8-8; కల్య. 1-48

ఆ. సభకు వచ్చి ధర్మసందేహ మడిగిన, నెఱిఁగి చెప్పకుండిరేని సత్య,
లనృతదోష ఫలముసం దర్ధ మొందుదు, రనిరి ధర్మవేదులైన
మునులు. (చెప్పకుండిరేని = చెప్పని పక్షమున) సభా. 2-237

(గ) వికల్పమును దెలుపును.

క. మానవ నాయక యగ్రజుఁ,డైనను నమజన్ముఁడేని నన్యాయంబుం
బూని సహోదరులకుఁ గీ,డైన నతఁడు దండ్యుఁడందు రవనీపతికిన్
అను. 4-136

(అగ్రజుండు గాని యమజన్ముఁడు గాని) అర. 1-54

చ. సందేహములేమిని దెలుపును. -తే- పాండుపుత్రుల కేను దప్పని

మనంబు, గలుగుదాననయేని వోకమలమిత్ర, కీచకునిచేస నవ్వోక
కీడు తెరువు, వొరయకుండంగ రక్షింపు కరుణతోడ.
విరా. 2-109

2. అప్యర్థకము.

(క) ఉత్కర్షమును దెల్పును. (ప్రాశస్త్యమును దెలుపును.)

మ. వనితావేషము గల్గియున్నయది చెల్వం బొందుచుండంబుగా, దు
నిరూపింప మహోమహావతయు నిర్దోషత్వమున్ రాజసంబును బోలి
ల్లెడు నెవ్వఁడే నొక జగత్ప్రాణ్యంబు గ్రీడార్థమి ట్లాకారం దాల్చి స
రూపుగా వలయు మీరూహింపుఁడా యట్లగుచ్. విరా. 1-231

(ఎవ్వఁడేన్ = ఎవ్వరో యొకమహాత్ముఁడు)

ఆ. అడరు శోకవహ్ని యాఱ నేర, దింద్రపదవి నేరె నేనియుఁ గావున,
ఖండనంబు సేయకుండువాఁడ. భీష్మ. 1-198

(గ) అపకర్షమును దెలుపును (నికృష్టతను దెలుపును)

ఆ. ఎవ్వరేని యింటి కెద్దియే నొకటికి, నన్నుఁ బంపఁదగును నమ్మవాఁడ
గొలుచునెడ నమ్ముగొనను నీచములగు, పనులకేను బాలకునికి
సెప్పి. విరా. 3-96

(ఎవ్వరేని = ఒకానొక నికృష్టుని-ఎద్దియే నొకటికి = ఏదియో యొక
నికృష్టమైన పనికి) శాంతి 2-288

శా. ఎచ్చోనైనను నిల్పు బొంకటికి నేమేనిం గొనున్ రాత్రియై,నచ్చో
నెమ్మి శయించు నగ్నిపరిచర్యం బాసి వర్తించు (ఏమేనిన్ = ఏది
చిక్కిన అది)

చ... ప్రతిపుఁ డిట్లనియె నంబురుహానన యగ్నిసాక్షికంబునఁ బరిణీత
యైన పతిఁ బోల్పగ నొక్కతఁ గాని యన్యులన్, మనమున నేనియుం
దలఁప మానిని. ఆది 4-137

(చ) వివక్షింప వీలుగామిని దెలుపును

చ. అధిపుమఱంది సింహబలుఁ డప్పుడు మ్రొక్కఁగవచ్చి నన్ను న,త్యధిక
మనోజరాగమతియై కనుఁగొంచుఁ గడంగి యెన్నియేన్. విధము

లఁ బిల్కి వారుఁ దనవిన్నను వెల్లను జూపి చెప్పి మాపధనవిహీ
నతం జెనకినం గడునేవము పుట్టి యయ్యెడన్. విరా. 2-170

(ఏన్ని యేన్ = ఎన్ని యని వివరించి చెప్పుటకు వీలులేనన్ని)

3. నిర్ధారణము లేమిని సూచించును.

క. వచ్చితి వనవుడు విధి యను, లచ్చెర్వును సందియంబు నడరెడు
మదితో, నిచ్చెలువ కడుపు కూఁటికి, నెచ్చటనే నిలుచునట్టె యిది
పలుకగునే. విరా. 1-299; ఆది. 1-150; ఆది. 5-188

(ఎచ్చటనేని = ఈచోటాచోటు అనకుండ ఎచ్చటనైనను)

క. అట్టియెడం గొందఱు, జననిఁ దొఱఁగి యెక్కడేనిఁ జనిరి (ఎక్క
డకో-ఇదమిత్థమని చెప్పుటకు వీలులేదు.) అను. 1-196

వ. అది యెట్లని యడిగిన శర్మిష్ఠ లజ్జావనత వదనయయి యిట్లను
నెందేని నుండి యొక్క మహాముని సకల వేదవేదాంగ పారగుండు
వచ్చి ఋతుమతి నైయున్న నన్నుం జూచి నాకుఁ బుత్రోత్పత్తిఁ
బ్రసాదించె. ఆది. 3-181

(ఎందేనినుండి-ఎచ్చట నుండియో - ఇచ్చటనుండి యని చెప్పుటకు వీలు
లేదు.)

4. వాక్యాలంకారముగ నుపయోగించును.

ఆ. మనకుఁ బాండురాజ తనయ వర్గమునకుఁ, గయ్యమయ్యెఁ బెద్ద
కాలమేని, నెదురుచూచుచుండ నొదవె నివ్విధ మిందుఁ, బూనిచేయ
వలయు దాని విమము. భీష్మ. 1-75

(పెద్ద కాలమేని = పెద్ద కాలము)

ఉ. ఇంబుగ సర్వలోకజను లెవ్వనియేని ముఖామృతాంశు బిం,బంబున
నుద్భవంబయిన భారత వాగమృతంబు కర్ణరం,ధ్రంబుల నంజలిం
దవిలి త్రావుదురట్టి మునీంద్రలోక వంద్యుం బరముం బరాశర
సుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్. ఆది. 1-76

(ఎవ్వనియేని = ఎవ్వని)

('ఏని' కళగాఁ గూడఁ గొన్ని ముద్రితప్రతులఁ గానవచ్చుచున్నది)
ఎటయేని పోయెదన్. ద్రోణ. 2-288 సం ము

**ఏనిక** వి.

ఏనుఁగు.

సీ. ఏనిక బదమున కెలయు తేఁటుల మొత్తములు. భీష్మ. 1-104

**ఏనికపోరు** వి.

ఒక యేనుఁగు మఱొక యేనుఁగుతోఁ జేయు యుద్ధము.

వ. తమ మ్రోసిన లేనికపోరు సూచునట్లు సూడం బోరి పోరి

ద్రోణ. 4-262; శల్య. 1-171

**ఏనికలావు** వి.

ఏనుఁగు బలమంత బలము గలవాఁడు.

క. నీ నమ్మిన భూరిశ్రవు,డేనిక లావు. శల్య. 1-26

**ఏను**[1] నేను (బహు. ఏము)

వ. ఏనును భక్తిమయంబగు సాష్టాంగదండప్రణామం బాచరించి.

విరా. 1-13

ఉ. ...వంశమాట లే, నేర. ఉద్యో. 3-96

సీ. ఏము సంపితిమని యించుకేనియు నహంకారంబు వారికిఁ గలు
గదు. అను. 5-58

**ఏను**[2] సర్వ. బొ.

1. అయిదు.

తే. రాధాసుతుం డేసె నిరువదియేను వారాచములు. కర్ణ. 2-212

ఉ. ...తదీయ దేహముల్, ధీరుఁడు సూచెఁ దాశసముదీర్ణ తఁ
బొల్చినవాని నేసిటిన్. ఆది. 7-276

2. పంచజ్ఞానేంద్రియములు. 1) త్వక్కు 2) కర్ణము. 3) చక్షువు (కన్ను)
4) జిహ్వ. 5. ఘ్రాణము (ముక్కు.)

తే. ఒకటిఁ గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి, మూఁటి వాల్గింటఁ గడు
వశ్యములుగఁ జేసి, యేసిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు,
విడిచి వర్తించువాఁడు వివేకధముఁడు. ఉద్యో. 2-37

చూ. వివరమునకై 'ఒకటి'

ఏనుంగు; ఏనుఁగు వి.

గజము, దంతి.

ఆ. వసుమతీశుపాల వర్తించు నేనుంగు, తోడనైన దోమతోడనైన, వైరమగు తెలుంగు వలవదు. (ఏనుంగు = మిక్కిలి గొప్పవాఁడు)
విరా. 1-189

క. ....తామర, కొల నేనుఁగు సొచ్చినట్లు గురువుగఁ దొచ్చెన్.
విరా. 3-183

క. ఆ తే రయ్యేనుఁగెత్తె వాకసమునకున్. శల్య. 1-316

ఏనుఁగుకయ్యము వి.

ఏనుఁగుమీద నెక్కి చేయుయుద్ధము-పనిక కయ్యము.

వ. అక్కురునాథుం డేనుఁగు కయ్యంబునకు వెరవుగల గళింగ వంగాంగ మగధ సుహ్మ పౌండ్రాది దేశంబుల బలంబుల గవియించిన. కర్ణ. 1-342

ఏనుఁగుకొమ్ము వి.

అస్త్ర విశేషము.

క. అమ్ములఁ నేనుఁగు కొమ్ములను, నమ్మత్తగజమ్ము నొంచి.
భీష్మ. 2-246

ఏనుఁగునకు సిడులు సూపినట్లు; ఏనుఁగునకు సిళ్లుసూపినట్లు

జాతీయము.

ఏనుఁగునకు అంకుశములు చూపిన విధముగా, అంకుశములను జూచి యేనుఁగు విజృంభించినట్లు విజృంభించి-అని భావము 'సిడులు' అను బహువచన ప్రయోగము ఏనుఁగు విజృంభణాతిశయమును దెల్పును.

క. కనుఁగొని సాత్యకి యేనుంగునకు సిడులు సూపినట్లు కోపంబున భీష్ముని మీఁదఁ గవిసి యుజ్జ్వల, సునిశిత భల్లంబు నేసె సురలు నుతింపన్. అను 2-267

తే. అపుడు రాధేయుఁ డిమ్మెయి ననుజూపాటుఁ, జూచి యేనుంగునకు సిళ్లు సూపినట్లు, గవిసి హయముల మత్స్య భూకాంతు తనయు,

వేసి పం్రెండు శరముల వేసె నరుని. విరా. 5-314

**ఏనుఁగు మొగసాల వి.**

యామకుంజరములుండెడి ముఖశాల, మొదటిమొగసాల (యామకుంజరములు=మూఁడుగంటల కాలము కావలి కాచు ఏనుఁగులు.)

వ. వారాయణుండు సమ్మర్థమందగమనంబునం జని మణి తోరణ సుందరం బగు రాజమందిర ద్వారంబు ప్రవేశించి కక్ష్యాంతరంబులు గడచి యేనుంగు మొగసాలఁ జొచ్చి యరదంబు డిగ్గి.

ఉద్యో. 2-176; ద్రోణ. 3-7; శాంతి. 1-360

**ఏనూఱు దే. సర్వ. (ఏను² + నూఱులు)**

అయిదు వందలు.

వ. జయద్రథుండు రౌద్రం బెసంగు వేగంబు మెఱసి మెఱుంగుటమ్ము లేనూ ఱతనిపై నడరింప. భీష్మ. 3-56

**ఏపడఁచు దే. స. క్రి. (√ఏపు)**

1. గర్వమడఁచు—అణఁచు.

మ. ...ఏపడంపుము రిపు న్సంరంభివై. కర్ణ. 2-307

2. చంపు

క. ఏమె మేము గల్లసారెలు, గాని కపటపు వెత్తమాడు కుశలతఁ గాన్దోఁ వ్యవికారి యేపడంచును, ఘనకాపాంశై్వర తేఁ గాని దురాత్మా. శల్య. 2-281

**ఏపతరు దే. అ. క్రి.**

విజృంభించు.

మ. ...మన యశ్వద్వెపము క్రోధావేశ దుర్దాంత దర్ప విశాపో ద్భట భంగి నేపదరి కౌరవ్యాంబుజ శ్రేణిఁ జిక్కు, వడం జేయరా యొక్క ద్రవిమ్మెడిన నీటున్ వేడ్క పంధిల్లఁగన్ విరా. 1-56

**ఏపఱు దే. అ. క్రి.**

ఉత్సాహము చెడు, గర్వముడుగు.

వ. అట్టియెడఁ దమమీఁది మాకుమలు వడిఁ నం టెడి తిరిగెడు వాయగజ

స్యందనంబులు దురంగ మాతంగ స్యందనంబులు రూపణిన నేవతి
మెలంగు నర్యెయ్యె యారోహకులునై.

భీష్మ. 2-91; భీష్మ 3-289

క. మఱియును శరశతము మెయిన్. గిఱిగొలిపిన వృష్ణి వరుఁడు
గినియఁగలే కే,పఱియున్నఁ జూచి యార్చుచు, మెఱసిరి నీ తనయు
లుబ్బుమిగిలి నరేంద్రా. ద్రోణ. 3-271

ఏపారు దే. అ. క్రి. (ఏపు + ఆరు)

విజృంభించు, చెలరేఁగు

క. చాపాచార్యుఁడు సాత్యకి, చాపము దునుమాడి సూతు సమ్మూ
ర్ఛితుఁగా,నే పారి యేయ రథ,వ్యాపారము దాన నడపి యతఁ
డని సేసెన్. ద్రోణ. 4-52

క. అపస్నిద్ధలు సైన్యాటోప సమేతముగఁ గవియుడును బాంచాల,
క్ష్మాపాలనుతుఁడు భీముఁడు, నేపారిరి నీదుసేవ యొసకం బడఁగన్.

భీష్మ. 2-378

2. అతిశయించు, ఎక్కువగు

క. ఏపారి తొల్లి త్రేతా, ద్వాపరముల సంధి నొక్క వఱపుఁ ధరిత్రీ,
తాపంబుఁ జేసె జనముల, పాపంబున వత్సరములు పంద్రెం డధిపా.

శాంతి. 3-279

ఆ. దైవ విహిత మగుటఁ దప్పింపరాకున్న, యట్టి యల్పదుఃఖ మను
భవించి, తింక నిట సుఖంబు లేపార నాతోడ, విహరణం బొనర్పు
విమల చరిత. స్వర్గ. 42

శా. ఈడం బోవక వీఁకమైఁ బొడువఁగా నేపారు ఘోరాజి.

ఆది. 1-69

3. శోభిల్లు, ప్రకాశించు.

సీ. దీని వసించుటఁ దా నొప్పు చుండున,నేపారు మందిరం బెద్దియొక్కొ.

విరా. 2-30

సీ. కిసలయహస్త కెంగేల నేపారు క్రొ,మ్మించను లేయొండ మిగులఁ
బర్వ విరా. 2-37

4. ఒప్పు.

శా. ...ఉగ్రశ్లేమంగేమఁగుఁ దాఁకునట్లు సమరఁ జేపారఁగా నయ్యెడన్.
విరా. 5-191

5. అధికముగాఁ గలుగు.

మ. ...అబ్దు మండపము స శోభింపఁగా నేతుఁ గట్టలుకన్ జెబ్బులి
గోల వేసినటు లుగ్రాకార మేపారఁగన్. విరా. 2-281

ఏపు దే. వి.

1. ఔద్ధత్యము, గర్వము.

సీ నేలయు నింగియుఁ దాళముల్ గాఁ జేసి, యేపునరేఁగి వాయించి యాడ.
విరా. 2-184

శా. ఈ కౌరవ్యుల వెల్లఁ గాచికొనవే యేపొప్పరెందుం దుదిన్, శోకం
బొందక వేగమైఁ గదలి కృష్ణుం గూడఁబోవే నృపా. ఉద్యో. 4-24

2 పరాక్రమము.

క. .. నరుఁ డేపున ముట్టిన నతని పొంతఁ బోదుమె యధిపా.
విరా. 4-198

3. బలము, శక్తి.

ఆ. యోగబలము లేని యొకతఁ గియోగి బల్, ద్రోపులేని, మీను నేపు
లేని, మృగము వేయుఁ మరియు దెగిపోవ నుఱుకంగ, లేనియట్ల
భవము లోన వడఁగు. శాంతి. 5-578

4. అధిక్యము, అతిశయము.

సీ. ఏకారణంబున నేమయ్యెనో వానయేపునఁ దెగియెఁగా నొప్పు
నకట. శాంతి. 8-810

ఉ యుద్ధముమీఁది వేడ్కయు మహోగ్ర విరోధుల నల్కఁజేయు ధ
ర్మోద్ధతియున్ సుయోధనుని యున్నతి సైపని యేపు.
ఉద్యో 3-65

5. ఉత్సాహము.

ఆ. అప్పు డేపడంగి యన్నిసేనలు భీష్ము,రథము పొంత, కొదిగె.
విరా, 5-154

తే. ఏచి దుర్యోధనుండు చేవిచి యెలుఁగు, మూపి పురికొల్ప నెంతయు
నేపు మిగిలి, మానబలంబులు పాండుకుమార సైన్య, సమితితోఁ
దాఁకె నత్యంత సంకులముగ. భీష్మ 2-28

తే. అఁట వృత్తాంత మరయంగ నమదినంబుఁ, దగిన, వారలఁ
బుచ్చుచుఁ దలఁకుచుండు, నేను నదియాదిగాఁ జింత వేపుదక్కి,
క్రుక్కియుండియు రాజుల నఁక్కు మడఁతు. ఉద్యో. 4-161

6. విజృంభణము.

ఉ. ఆ పరమేశ్వరుం డితని కిప్పుడు దివ్యరథోత్తమంబునుం, జాపము
నస్త్రకోటియుఁ బ్రసన్నత నిచ్చి రణంబునందు నీ.యేపున కోర్వ
దేవతల కేనియు దైత్యులకేని రాదు పొ,మ్మేపగ జేని గెల్వుము
మహిం జరణం బిడకుండు మాటిలోన్. శాంతి. 2-437

7. ఏదము.

ఉ. ఇమ్మెయిఁ దమ్ముని దునుము నేపు గనుంగొని యోహటించి
శీఘ్రమున్నఁ జెంపఱం దొలఁగెఁ గర్ణుఁడు ద్రోణ. 2-56

మ. ...కుంభజుండు విలసద్దోర్దండ చండాకృతిం, దెరలం బైఁ జను
దెంచు నేపు మనలం దీర్పంగ నోపుం దుదిన్. ద్రోణ 5-303

8. అనురక్తి.

క. పాపంబులు కర్జము లతి,యేపునఁ జేయంగ నవియు నింపగు
ధర్మ, వ్యాపారంబు లకార్యము,లై పరిణతిఁ బొందెనేని నట్టుల
చెల్లున్. ఉద్యో. 2-69

9. వాఁడిమి.

వ. ...కృపాచార్యుల తూపుల యేపు రథ్యంబుల నొంచి సారథి
గ్రొవ్వడంచి యాద్రుపద నందను తనువు నెత్తుటం దోఁచి
యుల్లంబు గలంచె. కర్ణ. 1-156 (చూ-కర్ణ. 1-168)

10. శీఘ్రము.

తే. చేసినది సేయుచున్నది సేయవలయు,నది యనంగల కార్యంబు
లందుఁ దగులు. వాని మృత్యు నేపునఁ దనవశము ఁ జేయుఁ, గాన

కాలంబు వేమనఁగాదు తండ్రి.. శాంతి 4-38

సీ. దుఃఖంబు సుఖముమ దోడివ సంసారమునకుఁ దద్బాహ్యగతిఁ బోవు నారుని, యాత్మ నంబుదము గాద్భపహారించిన విధంబునవ నవి సెఱుచు నేపున. శాంతి. 1-213

శ్లో. తదస్య చేతనామాశు హాతత్యభ్రమివానలః.

సం. భా. శాంతి. 28-6

**ఏపుటడవి** వి. (√ఏపు + అడవి)

ఘోరారణ్యము.

సీ. అరులునేసిన మహా పరిభవక్లేశంబు, వాపంగ నోపక యేపుటడవి, మరు దుఃఖతుల సహోదరుల వందఱఁ బెట్టి, చనుదెంచి మిన్నక చనినవమ్మ, దగువారు జగములోఁ దెగడరే. అర. 1-294

"భ్రాతౄంప్రాన్ విపినే త్యక్త్వా" సం. భా. 37-86

(వార్పంగ కడగి యీయడవిలోన - అనుపాఠాంతరమే సరిపోవుచున్నది).

**ఏపుడుపు** దే. స. క్రి. (√ఏపు + ఉడుపు)

జయించు, నిర్జించు, త్రుంచు.

ఉ. ...శత్రు నేపుడిపి పోయెదు వాఁడవు గావు. విరా. 4-192

**ఏపుమాపు** దే. స. క్రి. (√ఏపు + మాపు)

1. గర్వమడఁచు, శ్రుక్కించు.

సీ. ఏడింట పాత్యకి యేపుమాపి ద్రోణ. 1-205

2. చంపు, సంహరించు.

వ. ఇట్లింద్రపౌత్రుండు గోపశేంద్రునిం దెగఁజూచినఁ జూచి యేచి తదీయ బంధుభూపతు లొక్కమ్మొగి నురవడించిన నతండు వారల యేపు మాపి. ద్రోణ. 2-96

**ఏపురేఁగు** దే. అ. క్రి.

విజృంభించు, చెలరేఁగు.

ఆ. తండ్రి పుత్త్రుఁ దన్నదమ్ముత్వరుడునాక యయ్యరు దెలుఁగు వారు

నేవుఁ దేఁగి, మఱియు వెలాఁదుఁ గాలిబంతుల ప్రయోగమునఁ జెలంగు దోఁచితే మనంగఁ గలదు. హంస. 5-8

ఆ. కౌరవేంద్రుఁ డాదిగాఁగల భూపతు, లెల్ల నలిగి కలయ నేవు దేఁగి. ఆది. 7-188

ఏప్రొద్దు వి.

ఎల్లప్పుడు, ఏనాఁడు.

క. బాబలు నీతియుఁ గర్ణుఁడు, బాబలమును గూడి తనకు సామ్రాజ్యం బీఁగా బలసి వెలయువాఁడై, యాబే లూఁబడు మనంబునం దే ప్రొద్దున్. కర్ణ. 1-222

ఏమఱు దే. స. క్రి.

1. మఱచు

ఆ. ...బాదుపతులు వెరవు లావు, నలఘు విక్రమంబుఁ గలుగు గంధర్వు లేమఱరు నన్ను నొక్కమాత్రమైన. విరా. 1-328

2. ఉపేక్షించు, అలక్ష్యము చేయు.

సీ. —చేరు నృపులకు వైరబంధ—ఆ—మెట్లు గలుగు దాని నేమఱకుంతుము, వారి యవులనున్న వారు మిత్త్రిలగుదు రెల్లభంగి నధిపయుదాసీను, లట సమీప వర్తులైన విభులు. ఆశ్ర. 1-66

ఉ. భీముఁడు ధార్తరాష్ట్రికుల భీషణ రోషుఁడు చిత్తమెప్పు డెట్లో మదమెత్తునో యతని యాగ్రహ వృత్తికి లోనుగాక మీ, రేమెయినైన వంచన వహించి తొలంగుట మత్సమీహితం, బేమఱకుండఁ గావలయు నివ్విధమార్గములోన జాతనిన్. విరా. 1-177

క. మఱచు నొకొ మఱవకుండియు, మెలఁగక యుండుదునొకో యనలు ఔటఁగియు నెడ నే, మఱునొకొ పుత్త్రిలఁ గావఁగ. ఆది. 8-314

అ. క్రి.

ప్రమాదపడు, మైమఱచు, జాగ్రత్త లేకుండు.

క. మన వంశంబున వృత్తం, బువు తెంపున నానాజాలు పుణ్యనదివి దు, ష్టములగు తులువం తులువులు గమఁ గొని తేమఱక మెలఁగఁగాఁ వలయునుఁబీ. విరా. 1-112

తే. మరగి నీమూ_ర్తిపైఁ గన్నుమనముఁ దగిలి,యుండనేమఱి యుండి యొకొక్కమాటు, దలఁచికొని వారిదెస మదినిలుపు నప్పు,డెఱుఁగ నగువారు తెలఁగెఱుఁగుటెల్ల. విరా. 2-202

చ. ...ఏ,మఱి శయనింతురే కడుఁబ్రమాదము సేసిరి బుద్ధిహీనులై. అది. 6-194

ఏమి దే. సర్వ. ఏ. బొవ. అనొ.

(ఇది వాక్యముచివర నున్నపుడును దీనికి హల్లుపరమైనపుడును వైకల్పికముగా 'మి' లోపించును)

1. యత్కిమర్థకము, ఏది, ఏ.

సీ. ...తానుబరుల...గీ...దిక్కు పలుకక డివియెల్లఁ బిక్కటిలఁగఁ, దానయున్నట్లు గనుచు నేమేని గుడిచి. శాంతి. 5-142

క. ఏమి కులంబున వాఁడొకొ, వామం బెద్దియగు వొకొ్క. విరా. 1-216

క. చీఁకటి రేయొదవ నేమిసేసెదొ చెప్పుమా. విరా. 2-271

క. నన్నడుగనేల నీవును, నన్నిచుఁడు నేమి మాటలాడితిరి. విరా. 2-278

ఉ. ఇయ్యరవిందగంధి కులమేమి చరిత్రము చందమెట్లు పే,రెయ్యది. విరా. 2-40

ఆ. తనది యనక యేమి ధనమునఁ బ్రియమందు, వెద్ది కుడువకుండ నెసఁగు దృప్తి. శాంతి. 5-198

క. పురుషుం డేమిట సుఖయగు. (ఏమిట = దేనిచేత) శాంతి. 4-39

వ. అశ్వికు లొక్కమొగిఁ జెక్కునం దునిసిపడి యేడింటి యంగంబులో యను సందేహంబునకుం బట్టయి యున్న పదాతి గాత్ర ఖండంబులును. (ఏమిటి = ఎవరెవరి) ద్రోణ. 1-377

క. మనకడకు నేమిటికి వ,చ్చెనొకో. విరా. 1-187

(ఏమిటికిన్ = ఎందులకు - అని భావము)

ఉ. చమిర కర్ణ శీము నటు లేటికిఁ దిట్టతి. ద్రోణ. 4-288

(ఏటికిన్ = ఎందులకు - అని భావము)

సీ. అర్థముల్ దుఃఖదోషాకరంబులు వినుమేమిటిపై వాఁ, తేమిఁజేసి,
పొరయవు నను దుఃఖములు మునినాయక మిథిల గాలంగ నేమి
యను వాకుఁ, గాలని యట్లుండె. శాంతిఁ 5-875

(ఏమిటిపై = దేని మీఁదను అని భావము)

2 ఎట్టిది, ఎంతటిది.

క. ఏమి తపం బొనరించితి, భూమీశ్వర. ఆది. 8-208

(ఏమితపము = ఎంత యుత్కృష్టమైన తపము)

క. పదివేవురు రాజులు దన, కెదిరి పొలిసి రాశిఖండి యేమిటివాఁడై,
తుదిఁబోయి తన్ను నాటిం, గదియుచుఁ బొలియించె నియతిఁ గడ
వఁగ వశమే. భీష్మ. 1-48

(ఏమిటివాఁడు = ఎంతటివాఁడు అనఁగా కొఱగానివాఁడు
స్వల్పుఁడు అని భావము)

సీ. ఏమిటివాఁడవై యిచ్చితి పుడమి నీకనియెడు మాట యిట్లాడె
దివుడు. శల్య. 2-74

(ఏమిటివాఁడవు = ఏమి యధికారము గలవాఁడవు - ఏమి
మార్గము పట్టినవాఁడవు)

ఉ. (కర్ణుఁడు దుర్యోధనుం జూచి యిట్లనియె) కర్ణము దప్పె నీ
యెదురఁ గష్టపు మాటలకేల యోర్తు రీ, దుర్జనుఁడైన శాంతనవు
దోర్బల మేటిది. ఉద్యో. 4-242; విరా. 8-225

(ఏటిది = ఏమాత్రపుది - ఎందుకుఁ గొఱగానిది)

3. సందర్భానుసారముగా దీని తర్వాత నుండదగిన విశేష్యము అధ్యా
హారమగును.

క. నరనాథుఁ గొలిచి యలవడఁ, దిరిగితి నాకేమి యనుచుఁ దేఁకువ
లేమిన్, మరియాదదప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టక
యున్నె. (ఏమి = ఏమి భయము) విరా. 1-122

ఉ. ...ఈతఁ డొక్కఁడున్, వర్జితుఁడైన నేమి ఉద్యో. 4-242

(ఏమి = ఏమి తక్కువ)

సీ. (అర్జునుఁడు) రామకృష్ణుల కడకేఁగి ప్రహర్షించుచు, జనభూమి యాశ్రమంబుగాని కడియ సందర్శనమునకుఁ జనియెదనని వారి, నా మంత్రితులఁ జేసి యేమి యనుచు-ఆ-టకును గోర కూర్చుటకును దారుకుఁడాది,యయిన తగిన వారి నర్హ్యవచన, రచన మెఱయఁ బనిచి యుచితాప్త కతిపయ, జనులు దోడరాఁగఁ జనియె నధిప.
మౌస. 156

(ఏమి యనుచుటకును. ఏది కావలసిన నది పంపుటకు)

అవ్య.

ప్రశ్నార్థకము.

1. (ప్రశ్న).

వ. కురువంశ నిస్తారకా, నీరాకకుం గారణమేమి. అశ్వ 4-89

వ. మహాత్మా నీతలం చేమి యని యడిగిన. శాంతి. 3-288

2. 'లేదు' అని అర్థము.

క. మును లోకము ధర్మపరుం, డనఁ బరఁగినవాడ విట్టి లనుచిత కృత్యం,బునకుఁ జనుదగునె దీనం, గనియెదు ఫలమేమి దూష్య గర్వఁ బేలా. శల్య. 2-269 (ఫలములేదు అని భావము)

ఉ. వైరివడిపోయెఁగాక దృతరాష్ట్రుఁడు గన్నదియేమి (కన్నది లేదు అని భావము) కర్ణ. 3-224

3. నిర్లక్ష్యమును దెల్పును.

ఉ. అర్జునుఁడైన నేమి సురలైనను నేమగు విద్విషచ్ఛిరో, పార్జితమైన గోధనముఁ బట్టితిమి. విరా. 4-186

4. అవసరములేమిని దెల్పును.

వ. ఇది చేసిరేమి చేయరైరేమి యమ్మహాత్ముల చేత నీ యపకారంబు విచారించిన దుష్టాత్ములు నష్టాత్ములు కాక యని పలికి.
ఉద్యో. 3-172

5. ప్రశంసను దెల్పును.

ఉ నీవును జూచి తట్టి సభ నేని మినబెడ దేయుగంబులన్, భూవలయం

ఖలో నదియపూర్వము సర్వమనోజ్ఞ మిష్టభో,గావహ మేత్రియం
బడసె నయ్య మహాత్ముఁడు దానవేమి సం,భావిత భాగ్యుఁ
డయ్యెను బ్రభాకర తేజుఁడు ధర్మజుం డిలన్. సభా. 2-95

(ఏమి భాగ్యుఁడు = వింత ప్రశంసనీయమైన భాగ్యముగలవాఁడు)

క. ఏమితపంబొనరించితి, భూమీశ్వర పుణ్యలోక భోగంబులఁ దే,జో
మహిమ ననుభవించితి. ఆది. 8-208

(ఏమి తపంబు = ఎంత ప్రశంసనీయమైన తపస్సు).

6 ఆశ్చర్యమును దెలుపును.

వ. ధృతరాష్ట్రిం డిది యేమి రథసంబని విదురు నడిగిన.
ఆది. 6-21; విరా. 5-272

7. ఏ మాత్రమును అను నర్థము నిచ్చును.

ఉ. భీముఁ దలంచినన్ మనము భీతిఁ గలంగుచునుండు వాకురే, లేమి
యు నిద్రరాదు ఉద్యో. 2-185

క. అనుజులకు వడ్డవడి యే,మిని జేయఁగ నేమిఁజూచి మెచ్చితిఁ గాక.
(ఏమియు = ఏ మాత్రమును, ఏ కొంచెమైనను.) ఉద్యో. 2-13

8. విధి ఆశీరాద్యర్థకంబగు 'కాక' ప్రత్యయంబుపైఁ జేరి కార్యసిద్ధి
యందు నిశ్చయ భావమును దెలియఁజేయును. నిశ్చయార్థద్యోతకము

క. అయైశ్వర్యము గ్రమ్మఱ, మాయుటకుం గారణంబు మాన్యచరిత
తే,దే యొక్క దుష్కృత మది యటు, చేయుంగాకేమియేల
చింతింపంగన్. (చేయుంగాక—చేయును)
శాంతి. 5-204; ద్రో. 1-85

ఏమని

ఏమి కారణము చెప్పి. ఏ కారణమున.

క. ఎవ్వరు నెఱుఁగక యుండఁగ, నివ్వనమున దపము సేత యిది
నిర్ణయ మే, నెవ్వారికడకు నేమని, యొవ్విధిఁ బోనేర్చుదాన నేటికి
బందుల్. ఉద్యో. 4-287; (ఇట లజ్జను సూచించుచు)

ఏమిగ; ఏమిగా ఎట్లుగా, ఎట్లు

చ. ...ఈతనిఁ బంపకుండ నేమిగ సమయంబు సేసితి. శల్య. 2-125

చ. ...వార్తలేమిగాఁ, బురవరఁ బొక్కుచున్ వినఁగ బుద్ధిఁ దలం
చెద. ద్రోణ. 1-102

ఉ. చిక్కని పోటుమానిసి విపీ విమవారలు నవ్వ నేమిగా, నెక్కుడు
మాటలాడెదవు. ఉద్యో. 1-253

**ఏమిర** టరి

ఉ. ఏమిర కర్ణ భీము నటు లేటికిఁ దట్టితి, ద్రోణ, 4-288

క. ఏమిర పసులని యార్వవు కర్ణ. 8-221

**ఏమీ** ఏమి. సర్వ. (ఏమి + ఈ)

కిమర్థకము.

1. ప్రశ్నమును దెలుపును,

క. తామరసనేత్ర నీ పే,రేమీ యెవ్వరి తనూజ విశ్లేం మహా,వ్యా
మోహితవై తనవుడుఁ, గోమలి సురరాజపుత్రకున కిట్లనియెన్.
ఆది. 8-129

2. సందేహమును సూచించును.

శా. ఏమీ నిక్కమె మున్నెఱుంగఁడె త్రిగర్తేశుండు మద్గోధన స్తోమం
బుం గొనిపోవు తెంపునకు నుద్యోగించెనే. విరా. 3-189

3. కౌతుకమును దెలుపును.

క. ఏమేమీ యని గోప,స్తోమముఁ బలుమాఱు నడుగుచున్ మెయి
వొదలన్, భూమీశుఁ డపుడు మంత్రుల, మోములు గనుఁగొని సగ
ర్వమున నిట్లనియెన్, విరా. 5-241

4 మేల మాడుటను (పరిహాసమును) దెలుపును.

శా. ఏమీ పార్థుఁడు నీవు దండిమగలై యీవచ్చు కౌరవ్యసం,గ్రామ
శోభను బాహుదర్పమునఁ దీర్పం బెద్ద మిట్టెక్కి మి,మ్మెమెల్లన్
వెలుఁగంది చూచెదముగాక. ఉద్యో. 3-65

5. అనాదరమును దెలుపును.

క. ఏమీ తగమను ధర్మము, నీమనమున వేఁడ పుట్టెనే గర్వము మ,
ద్దామ దురభిమానము, లా మఱచితి కర్ణ యాఛలం బెటు
వోయెన్. కర్ణ. 3-358

6. క్రోధమును సూచించును.

క. ...ఏమేమీ నొంచెనొ, యిమేడు వినుం దత్ఫలంబు నిప్పుడ కుడువం,గనియెడుఁగా కప్రావిల,ముగఁ బోదివెన వతని వసిరొ. ముని గోపమున్. అను 8-259

ఏమొ; ఏమొకొ; ఏమొకో (√ఏమి)

ఊహను దెలుపును.

క. వెడ తంత్రీపాలుం డనఁ, గతుహీవత విరటు పనులఁ గాచితి నౌ నీ. పుడమిగలదేమొ యను మ్మా,నడి కోర్చితిగాక నీకు శౌర్యము గలదే. ఉద్యో. 4-201 (పాఠాం).

క. ఇట్టివి యెల్లను గనుఁగొను, కట్టడితన మొందునట్లుగా నేమొకొ తొ,ల్పుట్టువునం జేసితి నీ,చుట్టల నిటు సూడకుండఁ జొప్పడ దయ్యెన్. స్త్రీ. 2-24

సీ. ... మోదమ గ్గలమయి మీయందుఁ గానఁబడయెఁ - తే. గారణం బేమొకోయని గారవమున, వాతఁ డడిగిన. అను. 4-348

ఏమో (√ఏమి)

1. సందేహమును దెల్పును.

క. ...మీ,లో నఖిమన్యుఁడు లేఁడే,మో వాకుం జెప్పఁడేల యూరక యుండన్. ద్రోణ. 2-283

2. ఎందుచేతనో.

క. సైనికులు నన్నుఁ గనుఁగొని, యాననములు వాంచి తొలఁగి యరిగెద రదియే,మో నేఁడు వేణువీణా,గాన స్వనములును వినఁ గలుగవు కృష్ణా, ద్రోణ. 2-228

ఏయది ఏది (ఏ+అది)

క. ఏయది భవదీప్సితార్థ మెఱిఁగింపవవా. శాంతి. 3-315

ఏయించు దే. స. క్రి.

1. బాణములచేఁ గొట్టించు.

వ. ...శిఖండింబురికొల్పికొని మీ తండ్రి నేయించుచు నతం డెన్ని
వింటి త్తిన నన్నింటిం దోడ్తోన తునుమాడుచుండె. భీష్మ. 3-394

2. చలింపించు

క. భూరి శ్రవుం డొక్కనితోఁ బోరంగ నేయించితి. శల్య. 2-326

**ఏయు** దే. స. క్రి.

1. (బాణాదులను) ప్రయోగించు.

సీ. సారథి నొచ్చిన తేరును గడపుచు, నేయుచుఁ గయ్యంబు సేయు
వారు. విరా. 3-170

2. (బాణములతో) కొట్టు.

క. ఆదవసరంబున నొక్కఁడ, ఐదియమ్ములు దొడి త్రిగర్తపతి వతం
బున్, వదనంబు నేసి విరటుఁడు, మదముసఁ దురగముల నేసె
మఱియుఁ బదింటన్. విరా. 3-183

**ఏయూరికిఁబోవు** దే. జాతి.

1. ఎక్కడకుఁబోవు, (కనఁబడకుండఁ బోవు, నశించిపోవు అని భావము)

ఉ. శూరుఁడ వంద్రు నిన్ మడువు సొచ్చుట శౌర్యము చొప్పె
మాన మే, యూరికిఁబోయె. శల్య. 2-55

శ్లో. సతే దర్పో నరశ్రేష్ఠ స చ మానః క్వ తే గతః॥
సం. భా. శల్య. 32-20

**ఏరి**

ఎక్కడనున్నారు.

వ. ఇగ్గందు ధర్మతనయుండ డేని భీమార్జున నకుల సహదేవులుం
బాంచాలియు నేరి యని యడిగిన. (పాఠాం) విరా. 5-322

**ఏరు** దే. వి.

నొప్పి

క. తలయేరును ముక్కునయు మొదల కొను దెంచెన్.
ఆది 8-191 అర. 7-270

**ఏరునేల** దే. వి.

రెండుకోసుల దూరము.

ఆ. ఏరు నేల కొలఁది నెడనెడ విడియుచు, బోవవలసియుండె భూమి
భార,వహుల దప్పి యెఱుఁగువాఁడగు నాధర్మ,నందనునకు ధరణి
నాధవర్య. అశ్వ. 3-158

శ్లో. గోరుతే గోరుతే చైవ వ్యవసత్సురు పర్షభః,
సా పురాభిముఖా రాజన్నువాహ మహతీ చమూః
కృచ్ఛ్రాద్ద్వివిణ భారార్తా హర్షయంతీ కురుద్వహాన్,
సం. భా. అశ్వ 65-21,22

(ఒకనాగటితో దున్నఁదగిన నేల-అని మూ.ఆ.ని)

ఏర్చికూర్చు దే. స. క్రి.

ఏఱిఏఱి ఒకచోటికి జేర్చు, వేఱుచేసి యొకచోఁ జేర్చు.

సీ. చందురు మనుఁగాంతి కందేర్చికూర్చి శ్యాగునకుఁ దెచ్చిన యట్లు
గొమరు మిగిలి. విరా. 2-52

ఏర్చికొను దే. స. క్రి.

ఎన్నికొను, ఏఱి తీసికొను (కావలసిన దానిని)

ఆ. మనము పూఁచిపట్టి మొనలేర్చికొన పోవఁ, బాండురాజ సుతుల
బలము గవిసి, గాసి చేయు. భీష్మ. 3-5; ద్రోణ. 2-270

ఏర్చు[1] దే. స. క్రి.

1. మండఁజేయు.

ఉ. ...అతఁడుం, జిచ్చున నేయి వోసిన విశేషము దోఁపఁగఁ భీమునొంచి
ము,చ్చిచ్చును నేర్చునట్టులుగఁ జేసెఁ దదూర్జిత సేన.
భీష్మ. 2-277

2. దహించు, కాల్చు.

ఉ. ఖాండవ మేర్చె దేవతలు గానని యీశ్వరుఁ గాంచె. విరా. 1-85

క. కార్చిచ్చు గవిసి మృగతతి, నేర్చు కరణి నేఁడు భీష్ముఁ డేచిన కడి
మిం, బేర్చి మనసేనఁ బొదివె. భీష్మ. 3-277; విరా. 4-37

క. రయమున ద్రిమింగుడు గాలము,క్రియ నెవ్వఁడు కంఠబలము
క్రిందికిఁ జన క,గ్నియపోలె నేర్చుచుండును. ఆది. 2-90

3 ధ్వంసముచేయు, నాశనముచేయు.

తే. వినుము ప్రాగ్జ్యోతిషాధీశుఁ డనుపమాన, శక్తి యీ భగదత్తుండు సమరంభుండు, గజముఁ నెక్కి తా వేనికశయ్యమైన, నేర్చు నైరావణము మీఁది యింద్రుఁబోలి. ఉద్యో. 4-232

ఏర్చు² దే. స. క్రి. (ఏఱు)

1. (కావలసిన దానిని) ఏఱు, ఎన్ను, నిర్ణయించు.

సీ. గోడిగ జాతిలోఁ గొదమపెంటుల నేర్చి, మావుల హత్తించు మార్దవంబు. విరా. 1—95

2. తీసికొను, కూర్చికొను.

క. అనుమాటకుఁ గాలానలుఁ,మును బోలెను మండి కయ్యమున కాయితమై, మొనలేర్చి వేగ యిచటికిఁ, జనుదెమ్మని భార్గవుండు సంరంభమునన్. ఉద్యో. 4-310

శ్లో. గృహాణ సర్వం కౌరవ్య రథాది భరతర్షభ.

సం భా. ఉద్యో. 179.48

3. (వ్యూహముగా) పన్ను, నిర్మించు, ఏర్పఱచు.

ఉ. అందఱు నింతకున్ వెనుకవై మొనలేర్చుచనంగ. విరా. 4-184

చ. ...భూ,వర భవదీయమైన బలవర్గము నొడ్డన మేర్ప వీఁకమైఁ, బలికొలుపంగ నిర్భయతఁ బోరెదు నట్లుగఁ దాను ముందరై,తిరముగఁ జేయఁజాలు నొకధీరు నొనర్పుము సైన్యనాథుగన్.

శల్య. 1-75

తే. భీష్ముఁ డొడ్డన మేర్చిన బెడఁగు పొలు, నొప్పెఁ గౌరవయోధుల యుబ్బు మెఱసె. భీష్మ. 3-11

5. వేఱుసేయు, తొలగించు.

సీ చందురు మనుఁగాంతి కందేర్చి కూర్చి బాగునకుఁ దెచ్చిన యట్లు గోమరు మిగిలి. విరా. 2-52

6. పొందు, చెందు.

వ, విను దుఃఖంబులఁ దెగద్రోఁచిన పురుషుఁడు సౌఖ్యసక్త చిత్తుఁడు

గాకారిన వైరాగ్యము తెందిన, ననుపమమును పరమపదము నమ్మోయి నేర్పున్. శాంతి. 4-105

**ఏర్పడు** దే. అ. క్రి.

1. తేటపడు, స్పష్టమగు.

ఉ. ....నీ, విట్టి తెఱంగు సేయుమని యేర్పడఁ జెప్పిన వాని కత్తఱిం, బుట్టిన సంతసంబుననువుం బరికించియు కాదె. విరా. 2-278

వ. అని యేర్పడం బలికిన. విరా. 2-159

క. జననుత కృష్ణ ద్వైపాయన ముని వృషభాభిహిత మహాభార దీయుక్తిమెయిన్. ఆది. 1-16

2. కంటికిఁ గనఁబడు.

ఉ. ఎక్కడదకుండి యెక్కడకు నేఁగెడినో యిది యొక్కకాంత రూ, పెక్కుడు పెంపుసొంపు మనకేర్పడుచున్నది. విరా. 1-303

క. పడిఁబడియెఁ బిడుగు లుడుగక, వడఁకె మహీతలము పాంసువర్షము గురిసెం, గడునెల్లనయ్యె దిశ లేర్పడకుండె వినుండు తిమిరపటలావృతుఁడై. అర. 3-369

తే. ఊరు మూల మేర్పడఁగ నయ్యువిద వలువు, దొలఁగె ననిలంబు చేత విధూతమగుచు, నమరులెల్లఁ బరాఙ్ముఖులైరి దాని, సాభిలాషుఁడై చూచె మహాభిషుండు. ఆది. 4-122

3. తెలియు

క. ... కీచకుఁడు నచ్చిన పిమ్మటఁ బుట్టినవ్యాకోపము తెల్లన్, విన వేడుక మన మలరెడు, ననఘా యేర్పడఁగఁ జెప్పుమనుటయుఁ బ్రీతిన్, విరా. 2-362

సీ. అభిలాష మేర్పడు నట్లుండఁగా బల్కు, వేడ్కతో మఱుమాట వినఁగఁ దివురు. ఆది. 3-38

వ. అక్కేకినిం జూచి యిక్కుమారు లిద్దఱు వా రౌదుకునుం గూఁతుచుం బోలిన వీరి నెత్తికొని దుఃఖించితి నని తన్నేర్పడకుండం బలికి దాని కిట్లనియె. అర. 2-199

4. వాసన గొలుపు, పరిమళించు.

వ. దాని శరీర సౌగంధ్యంబు యోజనంబునం గోలె జనులకు నేర్పడు నట్లుగాఁ బ్రసాదించిన నది గంధవతి యనియు యోజన గంధి యనియుఁ బరఁగి. ఆది. 3-41

5. ప్రకటితమగు, బయల్పడు.

క. అడరిపడి రథచతుశ్శ్రుతి, పొడిసేసి పరాక్రమం బపూర్వంబై యే, ర్పడఁ గరి హయ నర నికరము, బడలువడం దఱిమె వలి నథశ్చరు లార్వన్. విరా. 3-174

వ ఇల్వలుండును మునివరు శక్తికి భయంపడి విషణ్ణుండయ్యును బ్రస న్నుండ పోలెఁ దన వంచన యేర్పడకుండఁ గృతప్రణాముండై తదాగమన ప్రయోజనం బడిగిన వానికి నగస్త్యుం డిట్లనియె. అర. 2-349

6. కలుగు సంభవించు.

చ. ...కౌతుక, స్ఫురణఁ గరంబు దర్కరముఁ బొంద నయంబునఁ జేర్చి వాక్య వి,స్తర చతురత్వ మేర్పడఁగ సల్లపనం బొనరించు వర్తితో. విరా. 1-209

వ. గర్భయోని యందు ఋతుపుష్పరస సంయుక్తం బగుచు రేతంబు గాడ్పుచేతం బ్రేరితం బయి కలసిన నందుఁ బంచతన్మాత్రలు పొడ వయి క్రమంబున నవయవంబు లేర్పడి లబ్ధజీవుండయి యుద్భవిల్లి ఆది. 8-221; శాంతి. 6-209

7. ఒప్పు.

క. రాజవాహనములగు, వారువముల నతయ నేర్తు వల నేర్పడఁగన్ విరా. 1-261

8. సందేహము తీఱు, అనుమానము తొలఁగు.

ఆ. అనిన నీ తలంచినట్ల కాదేర్పడ, వినుము నాదుపతులు వెరవులావు, నలము విక్రమంబుఁ గలుగు గంధర్వు లేమఱరు నన్ను నొక్క మాత్రయైన. విరా. 1-329

9. వేఱుపడు, వేరుగాఁ గనఁబడు.

వ. కృష్ణ ద్వైపాయనుం డను బ్రహ్మర్షి తొల్లి వేదంబు లేకీభూతం బులై యేర్పడకున్న ఋగ్యజుస్సామాథర్వంబులుగా విభాగించి.
ఆది. 1-80

10 ప్రతిబింబించు.

వ తన విమల విజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుఁగు చుండు
ఆది. 1-80

**ఏర్పడుతెంచు** దే. అ. క్రి. ఏర్పడు (ఏర్పడు+తెంచు, స్వార్థ మున 'తెంచు')

1. స్పష్టపడు

సీ వెడవెడ మూఁగారి వింతయై యేర్పడు దేరని వళులలో నారు నిగుడ.
విరా 1-145; శాంతి 1-248

2. కలుగు

వ. ...వసంత సమయంబు నఖిల జీవలోకానంద జననంబై యేర్పడు దెంచిన.
ఆది 5-187

**ఏర్పరించు** దే. స. క్రి. (√ఏర్పడు) ఏర్పఱచు

1. నిరూపించు, నిర్ణయించు.

క. మనలోన నెవ్వఁ డెమ్మెయి, పనివెంటను విరటు మనము వదయుడ మతియొల్లను నేర్పరించి యందఱుఁ, దనతన మదినున్న తెఱఁగు తథ్యము చెపుడా.
విరా. 1-65

క. వినుమా భూతం బిట్టిది, యని కల రూపేర్పరింప నమరులకు వశం,బె నరేంద్ర తదాకృతిఁ, గనుఁ గొనినన్ భేదిల్లవలయుఁ గొండకునైనన్.
సౌప్తి 1-96

ఉ. ... బంధు సంఘముఖ్యుల విందుఁ దెత్తమొ విచార విదూర యుపేంద్రు భవ్యదే, హమ్మట గొంచుఁబోదమొ సమర్థ విధం బొకఁ డేర్పరింపుమా.
మౌస. 167

2 విభజించు, వేర్పఱచు

క. తను నేర్పరించి కేవలమును శాంతమునైన తత్త్వమును సంత.

తముం,గనుచున్న దన్ను వెలుగం, గనుఁజేతటి జూపు వెలుఁగు
గలుగుం బుత్రా. అశ్వ. 1-224

3. వివరించి చెప్పు.

తే. విధివశంబున మృతిఁ బొందు వివిధజంతు, నిచయమం దనహంకార
నిష్ఠుఁడైనఁ, బురుషుఁ గల్మషమేమియుఁ బొందనేర, దెట్టులంటేవి
విను మది యేర్పరింతు. అను. 6-57

4. విమర్శించు, యోచించు.

మత్తకోకిల. ఈ వికర్ణుఁడు బాలుఁడయ్యును నేర్పరించి యథా
విధిన్, దేవమంత్రియ పోలె ధర్మపుఁ దెల్పె. సభా. 2-286

5. ఎఱుఁగు, గుర్తుపట్టు.

సీ. నలుపురు వేల్పులు నలుఁదొట్టి యప్పు డే,కాకారులై యున్న
నందు నలుని, నేరర్పింపఁగ నేర కింద్రాదులను నలు, నెఱుఁగు ను
పాయ మింకెద్ది యొక్కొ. అర. 2-58

పర్పుటచు దే. స. క్రి. పర్పరించు

1. విభజించు.

తే. క్షరము నక్షరమును నఁ గలుగు రెంటి, నేర్పుటది మున్ను సెప్పితి
నింక నొకటి సెప్పఁ గలదు. శాంతి. 6-46

2. నిర్ణయించు, స్థిరపఱచు.

క. మొగమొప్పదు చూడెవ నీ, జగతీనాథునకు నే విచారించియునుం,
దగ దీనికిఁ గారణ మిది, యగునని యేర్పఱుపనేరనయ్యెద నెట్లున్.
విరా. 5-306

3. కనఁబఱచు, చూపు, తెలియఁబఱచు.

ఉ. ... అస్త్రాననఁ బట్టితెచ్చి హృదయం బలరంగ ననంగతంత్ర
విద్యా నిపుణత్వమేర్పఱిచెదం బ్రమదాంబుధి నోలలార్చెదన్.
విరా. 3-298

4. చక్కఁబఱచు.

క. నడిపింపఁగఁ బొడిపింపఁగ, నెడమడువై కలఁగినవ్వు దేర్పఱుపఁగ

ణేఁ, గడునేర్తుఁ దేర్చునాదగు, కడిమియు నీ సైన్యమునకు గొనిన
గాదే. ఉద్యో. 4-214

5 (వ్యూహము) పన్ను.

క. ... మొనలేర్పఱచెఁ గౌరవాన్వయముఖ్యా.
భీష్మ. 2-28 (పాఠాం)

(పన్పఱిచె — అని పాఠము)

6. పంచు.

వ వారల జీవనంబునకుఁ గొన్ని యలంతి పల్లియలైనను దుర్యోధను
నొడంబఱచి యేర్పఱచి తెఱంగు పఱచిన లెస్సయని చూచెదు.
ఉద్యో. 2-91

ఏఱు దే. స. క్రి.

1 మంచివిగాఁ జూచి గ్రహించు.

చ. వనిత మనోహరంబులగు వస్తువులెల్లను నేర్చి నేఱి పీ, కని నియ
మించి తెచ్చితి, విరా. 2-884

2. ప్రోవుచేయు.

వ. అక్కుసుమకోమలి సని యమ్మ లేఱికొని వచ్చి యిచ్చుచుండు.
ఆమ. 3-255

3. (క్రింద నుండి గింజలు మున్నగు చిన్న చిన్న వస్తువులను)ఒక టొకటిగా
ఎత్తు.

గీ. వారు నలువురుఁ జని తృణధాన్య మల్ప, మేఱికొని వత్తురాఁకలి
దీఱకుండు. అశ్వ. 4-220

సీ. ... కొంద ఱాకులేండినవి యేఱికొని ఆమ. 5-28

4. (కావలసిన వానిని) ఎన్ను, ఎంచు, గ్రహించు.

తే. ఏఱికొను మీవు వొకని మాయేవురందు, వాఁడు నీతోడఁ దగఁ
బోరువాఁడు వానిఁ, జంపి మహి యేలు వానిచేఁ జచ్చి త్రిదివ,
సౌఖ్య మొందుము చేసితి సమయ మేను. శల్య. 2-108

వ. మన బలంబులలో మేలేఱి పదునాలుగు వేలేనుంగులును......

గై కొనుండు, ద్రోణ. 8-31

5. ఎంచి ఖండించు, నఱకు, ఛేదించు,

(ఈ యర్థమున 'తలలు' అను పదముతోఁగలసియే ప్రయోగములఁ గనఁబట్టుచున్నది.)

సీ. ... అడియాస దొద్దకుఁ జొచ్చినఁ, దలలేఱి యుర్వికి బలియొనర్తు. మాస. 185

సీ .... మనమోపి సర్వ పాండవులకు బంపితిమేనిఁ బ్రచండ చక్ర, ధారఁ గౌరవకోటి తలలేఱి రాజ్యంబు గోవిందు డీకున్నె గొంతి కయిన. ద్రోణ 1-111

**ఏఱు$_2$** దే. వి. బొ.

నది.

క. అనదతనంబును బెడిదవుఁ దనమును లేకుండఁ బరఁగి దరియొత్తెడు, నేఱునుబోలె నొత్తవలయును, మనుజేంద్రుఁడు మార్తురం బ్రగమంబున నధిపా. శాంతి. 8-24; శాంతి. 4-356

**ఏఱుపఱుచు; ఏర్పఱుచు** దే. స. క్రి.

ఏర్పరించు. ఏర్పఱచు.

1. వేఱుసేయు, విభజించు.

తే. అర్జునుం డను పర్జన్య నస్త్రవృష్టిఁ, బల్లమును మిట్టునని యేఱు పఱుపరాక, యుండ నెత్తురు వెల్లు లొండొండ పెరిఁగె, మల్పి భూతభేతాళంబు లోలలాడ. ద్రోణ. 3-103

2. కల్పించు, కూర్చు.

క. విను మా బీజము పిండము, తనవునఁ జైతన్యరూపతం బరఁగి శిరంబును గేలుఁ గాలు నుదరంబు నురము వెన్ను నంగముల నేర్పఱుచున్. అశ్వ. 1-188

శ్లో॥ తతః స్పందయతేఽంగాని సగర్భశ్చేతనాన్వితః.

సం. భా అశ్వ. 18-8

సూ. తం చేతనావస్థితం వాయుర్విభజతి తేజ ఏనం పచతి ఆపః క్లేదయన్తి పృథివీ సంహన్తి ఆకాశం వివర్ధయతి, ఏవం వివర్ధితస్స యదా

హస్తపాద జిహ్వా ఘ్రాణ కర్ణ నితంబాదిభి రంగై రుపేత స్తదా శరీర మితి సంజ్ఞాం లభతే.

సుశ్రుతము – శారీరస్థానము – పంచమాధ్యాయము 2వ సూత్రము.

8. నియమించు.

సీ. అమరాధిపతి దొల్లి యాగంబుసేయంగఁ దొడఁగ మహాముని స్తోమములును, సురసంఘములుఁ గూడి కురుముఖ్య ఋత్విగ్గణ ముల నేర్పఱచి పొంపడర వేదిఁ గల్పించి. అశ్వ. 4-255

ఏలుపాటు దే. వి.

విభజనము, స్పష్టపడుట.

వ. కాలు చేయి తల డొక్క యని యేలుపాటు లేక వండం దఱిగిన యట్లున్న యొడలును. భీష్మ. 3-248

ఏల[1]; ఏలా దే. అవ్య. ఎందులకు

1. ఏకారణముచేత.

శా. ... నీవ పాండు సుతులం గుందింపఁగా సత్యముం, బాడిం దప్ప దొకప్పుడుం గినియరా బంధుత్వ మే లొల్లవో.

ఉద్యో. 3-384

క. ... మీ, లో నధిమన్యుఁడు లేఁ డే,మో వాకుం జెప్పఁ డేల యూరక యుండన్. ద్రోణ. 2-283

వ. వారలట యెవ్వలనికిం జని రేల మగిడిరి. స్త్రీ. 1-8

2. వలదు, కూడదు, అనావశ్యకము మున్నగు భావములను దెల్పును.

ఉ. కావలివారిఁ దోలి యెసకంబున గోవులఁ బట్టికొంటినం, చీవెడ మాట లేల ధరణీశ్వర యింతకు మున్ను విటికిం, బోవవు.

విరా. 4-192

ఉ. కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నాకొరు లేల సద్భటా, కీర్ణ విరోధి సైన్యముల గెల్వఁగఁ జాలుదు మేము. ఉద్యో. 2-295

క. జనములకు స్మృతిఁ జదువఁగ, విని [మొక్కిన యంత్యజునకు విశ్రుత గతి గ,ల్గునని సద్భ,క్తి జనిం,చిన యుత్తమ జాతిజునకుఁ

చెప్పఁగ నేలా. శాంతి. 4-258

3. ఏమి, ఏమిప్రయోజనము.

తే ఇంత ప్రొద్దెం యిచ్చోటి కేఁగుదేరఁ, గారణం బేమి యెవ్వరుఁ గానకుండ, నట్లుగాఁ జనుదెంచితె. విరా. 2-188

ఉ ... వతిసెప్పెడు వారల బుద్ధి వాఁడ మ,ఖ్నింపఁడ యింక నేల యగు నీ వడియూసల ఎచ్చి కిత్తగా,రింపక నూమకుఱు.

ఉద్యో. 1-314

ఆ. నీచేతఁ, భంగపడితి మింకఁ బలుకు లేల. భీష్మ. 2-121

తే. ఎవ్వరికిఁగాఁగ రాజ్యంబు వెల్ల భోగ,ములుమ గోరుదు రక్కు-మారులును వాదు, తమ్ములును లేరు తురగరథద్విపప్రహీన యయ్యె నీకోఁణియు నేల పెనఁగ. శల్య. 2-68

ఉ. ఈమునిపల్లె నుండు టిదియేల కరం బనురాగ మొప్పఁగా, భామిని వాకు భార్యవయి...సౌఖ్యముల మేలుగ నందుము ఉద్యో. 4-58

4. ఎట్లు.

తే. కొయ్య, కోలఁద్రవ్విన మాత్రిఁ బాతాళయాన, మేల సిద్ధింప నేర్చు. ఆశ్వ. 3-105

ఏల2 సం. వి.

ఏలకి, ఏలకుల తీఁగె.

కు. వివిధోత్తుంగ తరంగ ఘట్టన చలద్వేలా శవై లావలీ, లవలీలుంగ లవంగసంగతలతాలాస్యంబు రతించుచున్.

ఆది. 3-30; సభా. 2-110

ఏలకో దే. అవ్య. (√ఏల)

ఎందులకో.

క. కురుపతికి జయముగోరెడు గురుపుత్రుఁడు మున్నదేలకో యిటు తలిరిం కోరక. హరి. 1-207

వ. ఏడ్చుచున్నం జూచి యేలకో యిప్పుడు సైరంధ్రి యేడ్చుచున్న యది. విర. 2-145

**ఏలాపుత్రుఁడు** సం. వి. అ. పుం.

నాగరాజునకు తమ్ముఁడు.

వ. అనిన విని నాగరాజానుజుండైన యేలాపుత్రుం డిట్లనియె.
ఆది. 2-188

**ఏలించు** దే. స. క్రి.

పరిపాలింపఁ జేయు.

క. గురుఁడును నీవును మఱి ద్రోణేశ్వరుఁడును గర్ణుండుఁ గృపుఁడు బాహ్లీకుఁడు ననున్,ధర యేలింపఁగ మున్నా, కరు. ద్రోణ. 5-111

**ఏలిదము** దే. వి.

ఎల్లిదము.

ఉపేక్ష, నిరసనము.

క. బాలుఁడని నమ్మి రిపుతోఁ,నే విధమునఁ గలసియునికి యుదికార్యమె
ఆది. 6-116

శ్లో. కాలవత్కురుతే మూలం బాలః శత్రురుపేక్షితః,
గహనేఽగ్నిరివోత్సృష్టః క్షిప్రం సంజాయతే మహాన్.
ఆది. 168-108

**ఏలినది** (√ఏలు)

యజమానురాలు, ప్రభ్వీణి.

వ. ఇన్నాతిం దక్కటి యెలనాఁగ లేలినదానిఁబోలెఁ బొదవికొని యున్నవారు, స్త్రీ. 2-185

**ఏలినవాఁడు** వి. (√ఏలు)

ప్రభువు.

వ. సుశర్మయు నేలినవాని పనిఁబూని. విరా. 3-131

**ఏలినాతఁడు** వి. (√ఏలు)

ఏలిక, రాజు.

ఉ. ...ఏలినాతండొక ఛాయ చూపినను దత్పరతం బనిసేయు టొప్పగున్. విరా. 1-185

**ఏలిమాట** దే. వి.

1. స్తుతివాక్యము పొగడ్త.

సీ. పాలు పంపని యీశ యేలిమాటల నమ్మెలుక దీర్చెదరు. ఉద్యో. 3-6

చ. కురుపతి నిర్జితుండగుటకుం బవనాత్మజు డేను బూఁట పోటరితన
మెల్లఁ జూపుము కడంగుము నీవని యేలిమాటమై నరవర ధర్మ
సూనుఁడు వినన్ విజయం బొనఁగెన్ మఱందికిన్.
శల్య. 2-129 (మేలుమాట అని పాఠాం)

ఏలు దే. స. క్రి.

1. (రాజ్యాదికము) పాలించు, శాసించు.

తే. ఏలు మీలోకమెల్ల నీకేల రాధకొడుకు కితండను తక్కువ కొడుకుఁ
గుఱ్ఱ. ఉద్యో. 4-59

ఆ. ... జనుల నేలఁ గాని యెన్నండును, నొరులఁ గొల్చి తిరుగ
వెరవులేని, యట్టి నీవు. విరా. 1-97

క. ...జగమెల్లను నేలఁగఁదగు సముజ్జ్వలత యూహింపవ్.
విరా. 4-258

ఆ. దీని పాలు ద్రావి మానవుల్ పదియువేలేండ్లు జరయు రుజయు
నెఱుఁగ కమర, భావమున సుఖంబు జీవింతురట దీని, నేలఁగనిన
వాఁడ యెందుఁ బెద్ద. (స్వామ్యమున నుంచుకొను) ఆది. 4-158

2. పరిగ్రహించు. చేకొను.

తే. అనితఁబిని మక్కువ ననఁగి పెనఁగి, యింపు పొంపిరి వోవ నన్నేలి
కొనఁగఁ, దలఁచి పొందిన నది జన్మ ఫలముగాదె. విరా. 2-86
(ఏలు = భర్తగాఁ గైకొను)

క. అని హర్షోత్కర్షంబున, మనమలరఁగఁ బల్కి మత్స్య మనుజాధీశుం,
డనిలసుతు నేలె. (ఏలు = సేవకునిగాఁ గైకొను) విరా. 1-227

క. ఉత్తమ కన్యాజనములకు, నృత్తము గఱపంగ నాకు నేర్పు గలదు
తద్వృత్తమునకు వన్నెలుము, చిత్తమునకు నెక్కఁ బనులు సేసెద
నందున్. (ఏలు = సేవకునిగాఁ గైకొను) విరా. 1-88

చ. మనమున నూఱడిల్లు మనుమానము మానుము నన్ను నేలు మే,
పనులు మదాత్తవాగరికథంగుల నీమది కెక్కునట్లు నేర్పుము

భయభక్తులున్ మెఱయ రూపగఁజేసెద. విరా. 1-328

(ఏలు = సేవకురాలుగాఁ గైకొను)

3. సేవచేయించుకొను, పనిగొను

ఆ. ఏను గట్టువాలుదాన వాకెవ్వరు. గడపు కూడు వెట్టి కట్టఁజీర, యిచ్చి సాకతమున నేలుదు రట్టివా,రలకుఁ బనులుసేసి మెలఁగు బుద్ధి. విరా. 1-298

4. పోషించు.

తే. భార్యయును దాను బుత్రుఁ బంచికొన్న, వాఁడు పసుఁబెక్కిటి నేలువాఁడు కపట, కృత్యముల ముచ్చిమిని శిల్పకృతుల బ్రదుకు వారు, పంక్తిదూషకు లంద్రు పౌరవేంద్ర. అను. 3-175

ఏలుకొను దే. స. క్రి. (√ఏలు)

గోఁబఱచుకొను, వశముచేసికొను.

తే. ఇట్లు నీ వొక్కతెవె నన్ను నేలుకొంటి,గాక మాటలింకేటికిఁ గమలవదన. విరా. 2-385

ఏలుతీపు దే. వి. (√ఏలు)

పాలింపవలయునను పేరాస.

వ. అవినీతులైన నీ కొడుకులు పుడమియెల్లను దార యేలుతీపుఁ జూచెదరు. ఉద్యో. 2-279

ఏలుదెంచు దే. స. క్రి.

జయించు, అణఁచు.

సీ. కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్ళుఱికెడు వాలుగు సోగల నేలుదెంచి. విరా. 2-83

ఏలొకొ, ఏలొకో, ఏలొకోన్, ఏలొక్కొ దే. అ. (√ఏల)

ఎందులకో.

క. నన్నెఱిఁగి యెఱిఁగి యిట్లనఁ, జన్నె నీజిహ్వ వెక్కు శకలములై పోకున్నది యేలకొ. కర్ణ. 3-82

చ. ఇది మునికన్య యేని మఱి యేలొకొ యీలలితాంగి యందు

నా, హృదయము దద్దయుం దవిలె. ఆది. 4-30

సీ. కరచరణాద్యంగకంబు లేలొకో రత్న, భూషణ ప్రకరంబు పొందు దొఱఁగె...ఏలొకో చనుదేవు... ఏలొకో తోడురాదు... ఏలొకో వట్టరు. విరా. 1-166

తే. ఏలొకోయిప్పుడి విప్రునింట వార్త్రరవము వీతెంచె ఆది. 6-289

తే. విభుఁడ వజ్జనుల కిట్టు,లేలొకో నన్య చరితంబు లెన్న నీకు. కర్ణ. 2-111

మ. ...ఇతం డేలొక్కొ యత్యంతవిస్ఫుర తారోన్నతి నిమ్నుఁ డాఁకఁ దలఁపం డోద్యంబు. ద్రోణ. 3-185

**ఏవగించు** దే. అ. క్రి.

రోఁతపడు, అసహ్యపడు.

తే. చందవార్ధి కుట్టిమములఁ జరణతలము, లొందుటకు నేవగించు నయ్యువిద లిపుడు, నెత్తురుల తేవ మెక్కిన నేల బొరలుచున్న వారేమి సెప్పుదు నుడుకు పేర్మి స్త్రీ. 2-50; శాంతి. 1-363

గీ. కూడి లోనఁ దునిసిపడి యున్న క్రేల్ వుచ్చి తోయజాక్షి, యేవ గింపక యుచ్ఛిష్ట మిష్ట లీలఁ, దగిలి కుడుచుచున్నంత తత్తరుణిఁ జూచి. ఆది. 7-256

2. రోషపడు

సీ. అయ్యలఘు భుజుఁడు, ద్రోణ భీష్ములు తనతోఁ బాటి యను పలుకున కోర్వఁ డచ్యుతార్జునులు తనకు, నెక్కుడు నా విన్న నేవగించుచుమండు. కర్ణ. 2-318

3. తిరస్కరించు, త్రోసివైచు.

మత్తకోకిలము :— ఈ వికర్ణుఁడు బాలుఁడయ్యును నేర్పరించి యరూఢా విధిన్, దేవ మంత్రియపోలె ధర్మువుఁ దెల్పె నీతని బుద్ధి మీ, రేవ గింపక చేకొమందు. సభా. 2-286

**ఏవపడు** దే. అ. క్రి.

రోఁతఁజెందు, అసహ్యించు.

ఆ. కిల్బిషంబు గోశకృన్మూత్రముల సేవఁ బడుట. అను. 8-82

క. నీవు జతిమాలి కొడుకుల, చావునకును జేటునకును జాలక యిమ్మై,
పావిడిచి యఱచినం గడు, నేవపడరె జనులు నిన్ను నేమన నేర్తున్.
ఉద్యో. 2-210

**ఏవము** వి.

జుగుప్స, రోఁత.

చ. అధిపు మఱంది సింహబలుఁ డప్పుడు ప్రమొక్కఁగ వచ్చి...మాన
ధన విహీనతం జెనకినం గడు నేవము పుట్టి యయ్యెడన్.
విరా. 2-170

విశే.

1. నీచమైనది, నికృష్టమైనది.

చ. ... పేరు కంకుఁ డేవపుఁ గొలువైన వాకు నిలువన్ మదిగొల్పదు.
విరా. 1-197

2. రోఁత గలిగించునది, అసహ్యమైనది.

క. నాయున్న భామ దలఁపవ, యీ యెడ లీ చీర యిట్టి యేవపుఁ
జందం, బోయన్న మదన నిర్వృతిం, జేయుననుట యెంతయును
నిషిద్ధము గాదే. విరా. 2-49; విరా 8-50

తే. ప్రియతములై పుట్టి యేవంపుఁ జనులఁ గడువుఁ, బ్రోచికొను
వా రహంకారమునకు గర్వ, మాన మద దంభములఁ దొల్లి
మాన్యజనులఁ, బరిభవించిన తుచ్ఛులు పద్మనయన. అను. 5-106

**ఏవల** దే. వి. బొ. అనొ. ఎవ్వల (ఏ + వలను)

ఏప్రక్క, ఏవైపు.

క. ... మీరలందఱు, నేవలఁ జూచిన శిఖండి యెదురుం డెపుడున్.
భీష్మ. 1-81

**ఏవాఁడు** దే. సర్వ.

ఎవ్వఁడు.

క. ఏవాఁ డెమ్మెయిఁ జెప్పిన, నావసుధాధిపుఁడు దాని నను మోదించున్.
శాంతి. 4-341

ఏవురు దే. సర్వ. ఏగురు

అయిదుగురు.

క. మనమొక యేవుర మీ యం,గనయుం దో నడుగుదేరఁగా
వెయ్యేఁడ లో,యిన నెఱుఁగ కుందురు రె విరా. 1-59

ఏష్ట సం. వి. ఋ. పుం.

యజ్ఞమునందలి యొకానొక ఋత్విక్కు స్థానము.

వ. ... వరల పుత్త్రి శిష్య గణంబులు క్రమంబున మైత్రావరు
ణుఁడును...ప్రతిస్థాతయు, నేష్టయు, మన్నేతయు, సుబ్రహ్మ
ణ్యుండునుగా. సభా. 1-292

ఏసి దే. అవ్య.

1. వంతున.

తే. అందు మూఁడేసి ఋతువుల తయన నామం బగు.

శాంతి. 5-41; ద్రోణ. 3-78

2. పరిమాణమును దెలుపును.

మ. తలఁపం గూడునె యింతలేసి దొర లీరైన్యంబు చుట్టంబులుం,
తెలులుం దిట్టరె ఉద్యో. 3-95

# ఐ

ఐ

ఒకానొక యక్షరము.

(తత్సమేతర పదముల యందుఁ బెక్కు తావుల 'ఐ' కారము 'అయి'
గాను 'అయి' 'ఐ' గాను వికల్పముగా మాఱును.)

ఐదు — విరా. 2-27; అయిదు-ఉద్యో. 1-377

కైకొను - విరా. 1-114; కయికొను - విరా. 2-12

పైచీర - విరా. 1-211; పయిచీర. కల్య- 2-374

**ఐ** అవ్య. అయి.

1. అగుధాతువు యొక్క క్త్వార్థకరూపము.

క. నిర్భర విధ్వంస దశా, విర్భావము దెచ్చికొనుట వెరవై యున్నే. విరా 1-322

వ. అర్జునుఁడును బ్రీతుండై. విరా. 5-96

వ. క్రోధాయత్తచిత్తులై యున్నం గనుంగొని ఉద్యో. 4-202

2. చతుర్థి విభక్త్యర్థములగు, 'కి', 'కు'-లు చివరగల పదములకు అను ప్రయుక్తమగును. (సూ. ఆ. ని)

గీ. నేను వారలందఱును మఱచునట్లు సేయుదు నరునకునై కుమార. (నరునకునై = నరుని నిమిత్తము.) ద్రోణ. 5-250

ఆ ధాత నిన్ను నేమి ధర్మంబు నడుపుట,కై సృజించె దాని నాచరించి, యుండు నీవు నీకయొండయుండవే ధాతృ,నోదిత ప్రవర్తనుఁడవు గాక. (నడపుటకై = నడవు నిమిత్తము) శాంతి, 1-209

విరాటుఁడు పిల్వఁబంచె నర్తనమునకై. విరా. 1-243

అతనికై వగపేటికి. స్త్రీ. 2-35

ఉత్తమగతికై తార చనుదేర వికసించుచు శాంతి. 1-241

3. తనంతట తాను, స్వయముగా.

క. దుస్పరవగు నిను గర్కటి, గర్భము ధరియించునట్లు గైకొని నాకై, నిర్భర విధ్వంసదశా,విర్భావము దెచ్చికొనుట వెరవై యున్నే. విరా. 1-322

(నాకై = నాయంతట నేను-స్వయముగా)

క. ఏనై మేల్కొను నంతకు, ఘూనాయకవర్య నన్ను బోధింపకుఁడీ. (ఏనై = నాయంతట నేను) అను. 2-301

**ఐందవము** సం. విణ. (అ. ఈ. అ.)

చంద్రునకు సంబంధించినది.

ఉ. గుమ్మడిపువ్వుఁ దేనియయుఁ గూపము నైందవరేఖ కాంతియుం,
ఱ మ్మరయంగఁ గర్మఫల శోభన సంపద. శాంతి. 5-128

**ఐందవాతపము** సం. వి. అ. పుం.

చంద్రుని కాంతి.

సీ. ... పరమ ధర్మ — అ - మన్న రేంద్రునందు వా పూర్ణతర శర,
దైందవ వాతపంబునందుఁ బ్రీతి, సమమకా సమస్త జనుల చిత్తంబు
లా,నంద రసభరంబు నొందఁ దాల్చె. ఆది. 8-82

**ఐంద్రము** సం. విణ. (అ. ఈ. అ.)

ఇంద్రునకు సంబంధించినది.

వ. నివాత కవచు లనియెడు దైతేయుల మాతలి సారథికంబగు
నైంద్రస్యందనం బెక్కి యొక్కండన మూఁడు కోట్ల నిర్జించితి.
విరా. 4-149

వి. అ. పుం.

జ్యేష్ఠానక్షత్రము

సీ. ... ఐంద్ర, మనఁ బ్రభుత్వము పెంపు. అను. 8-169

**ఐంద్రాస్త్రము** సం. వి. అ. న.

ఇంద్రుఁడు అధిదేవతగాఁగల యస్త్రము.

(అర్జునుఁడు) ఐంద్రాస్త్రంబు ప్రయోగించిన నది నానాప్రకార
క్రూర శరకలాప రూపంబునం గవిసి కౌరవసైన్యంబు నొప్పింప.
భీష్మ. 2-164

**ఐకాక** దే. అవ్య.

అయిఁకాక, అగుట చేతఁగాని (లేకపోయినచో అని భావము)

మ. శవనాజ్ఞా దృఢ బంధ సంయమితకుంభద్వేగమై కాక నాఁ డవలీ
లన్ మనయర్జునద్విపము కౌరవ్యాంబుజ శ్రేణిఁ జిక్కువడం
జేయదె. విరా. 1-56

**ఐక్యము** సం. వి. అ. న.

ఏకమగుట, ఒక్కటి యగుట.

చ. ...వేఁ, బరువడి, దెల్పి యైక్యపరిభావ నిరూఢముగాఁగఁ జేసి

నవ్ కల్కి. 2-346

తే. ఏన నీవను నైశ్వర్యంబు పొలుకవోదముఁ,గాత గమనాగమనములు గ్రాఁగిపోవ. శాంతి. 4-248; శాంతి 5-110

**ఐతిహాసికుఁడు** సం. వి. అ. పుం.

ఇతిహాసము (పూర్వచరిత్రము) తెలిసినవాఁడు.

సీ. ఐతిహాసికు లితిహాస మనియు. ఆది. 1-31

**ఐదు** దే. సర్వ. ఔ.

1. అయిదు. నాలుగును ఒకటియును గలసిన సంఖ్య.

తే. కుసుమబాణుని బాణముల్ గూడ నైదు, గరఁగి నేరిమి వాటించి కరువు గట్టి,పోసి చేసి చైతన్య సంపుటము దిగ ఘు,టించిరో కాక యిట్టి. చేడియలు గలరె. విరా. 2-27

క. సూతుఁ ఐదింటను నైదిట, వాతని యంగంబు వొంచి. విరా. 5-77

2. 'యే యజామహే'-అను నైదక్షరములు గల మంత్రము.

గీ. నాలుగింటను రెండియు నాలుగింట,రెంట నైదింట మఱియును రెంట వేల్చి, యజ్ఞశీలు రారాధించునట్టి విష్ణుఁ, డిష్టదాయి ప్రసన్నుఁడయ్యెడును నాకు. శాంతి. 4-222

వివరమునకై చూ-నాలుగు

3. కామము, క్రోధము, భయము, నిద్ర, లోభము.

తే. అనఘ విను కామమును గ్రోధమును భయంబు, నిద్రయును లోభమును జాల నిందితములు, యోగిజనులకుఁ గావున మడుగ వలయు, వీని నైదింటి నచలావధాన వృత్తి. శాంతి. 5-116

4. జ్ఞానేంద్రియములు. 1) శ్రోత్రము (చెవి) 2) త్వక్కు (చర్మము) 3) చక్షువు (కన్ను) 4. జిహ్వ (నాలుక) 5. ఘ్రాణము (ముక్కు).

తే. ఇంద్రియములలో నొక్కటి యేనిఁ బట్టు,వదల వెడలిన నాగండిఁ బ్రజ్ఞగాఱు. నట్లు గావున మనను మున్నాఁగి వినికి, యాదియగు నైదుఁ గ్రమమున వాఁగవలయు, శాంతి. 5-119

ఐన విశే.

అను ధాతువు యొక్క భూతార్థక విశేషణము. అయిన.

వ. నిర్మలాంతరంగులైన యంతఃకరణంబుతోడ. విరా. 1-179

వ. జీర్ణంబులైన వస్త్రంబులు విడిచి. శివ. 1-196

ఆ. ఉచితమైన పాలు, పంచియుండు. ఉద్యో. 2-25

అవ్య. ద్రు.

అగుధాతువు యొక్క చేదర్థక రూపము.

1. అయిన యెడల.

తే. ...అర్థిని యెదురుచూచు, అలుగుదడవైన మగుడఁ గొనలయు నవివ. విరా. 2-120

సీ ...చక్కటితోడి కయ్యమైన, శిల మిమ్మంరకు చేల పాలుగఁ జేయుతే. కల్య. 2-325

2. అయినప్పటికిని

తే. ...భవదీయ దేహమునకు, నింత వెలయన వచ్చునే యేరికైన. అను. 2-275

వ. తిరువకుం దెచ్చియున్నవారి నైనం గాచికొనుకొ యని యూహించుచు. ద్రోణ. 4-156

క. తానైన నపుడు వక్రుం,డై నీతిపథంబు విడిచె నక్కట వరి మమ్మైనను జక్కని తెరువునఁ, బూని నడపుడనుచు నిపుడు బుద్ధులు చెప్పెన్. ఉద్యో. 1-311

(తానైన = తాను మాత్రము) (మమ్మైనను = మమ్ముమాత్రము.)

3. కాని, ఏని (వికల్పమును దెలుపును.)

ఉ. ... జనంబు లిట్టియం,దక్కట భీముఁడైన మన యర్జునుఁడైనను మాద్రి పుత్రులుం, దొక్కరుఁడైన నీ పగలు మొక్కడగింపరె యొక్క ద్రవేర్పడిన్. ఉద్యో. 1-287

ఆ. పరమ కరుణనైన బంధు భావంబున, నైన భూతలంబు నతిశయము నన, నైన నెల్లభంగి నర్థము రక్షింపఁ గోవఁదగు మహాను భావ

సీసం. ద్రోణ. 3-286

తే. అన్నమున దుగ్ధమునఁ బండ్లనైన మూలకోటిపైనను దగు
పారు నీటనైన, నిత్యమును జేయునది పితృకృత్య మోపి, నైశ్య
దేవ మవశ్య నిర్వాహ్య మనఘ. అను. 3-387

(ఇచ్చట పూర్వపూర్వము ప్రాధాన్యము గల వికల్పము.)

4. పూర్వోత్తర కార్యములకుఁ గల విరుద్ధ భావమును దెలుపును.

ఉ వారు మహాబలుల్ మరియు వారికిఁ బ్రాపు గలండు శౌరలం,
ఘోర జయింప రామియును బుద్ధి నెఱుంగుదు నైనఁ గౌరవ,
ద్వారమునుండు సేయు తగు మన్నన లెల్లఁ దలంచి చూచినన్,
భూరి వివేకయే విడిచిపోవుట ధర్మమె వీరకర్మమే. భీష్మ. 3-446

క. తనుఁ దాన చెప్పికొను టొప్పని పనియగు నైనఁ దంద్రి పరిభవ
మునకుం, గనలు గదిరి యిట్లంటిని, విను మేనేమనిన నేమి వృథవా
దధిపా. ద్రోణ. 5-340

వ. ఇట్టి సంబంధ మెవ్వరికిఁ బడయనగు.

క. విను మైనను పాపత్వం,బను దోషము కలదు

అది. 4-183; 189

5. అధిక్యమును దెలుపును.

క ఒక్కటి సురపతికైనను, బ్రొక్కము నృపధర్మమూఁది మొనఁ
తలఁ బడినన్, మిక్కిలి పేరును నిట దివి, నక్కజముగఁ బెంపుఁ
బడయవగుట మహేంద్రా. ఉద్యో. 3-360

క. గురు పుత్రుఁడు తేజోనిధి, సురాసురులకైనఁ దేఱిచూడన రిది.

విరా. 5-8

6. హైన్యమును దెల్పును.

ఆ. మత్స్యభూజనపాలపుత్ర యే నట్టిదైనఁ బనుతువయ్య నిన్ను.

విరా. 4-111

7. నిర్ధారణము లేమిని దెల్పును. (ఈ యర్థమున 'ఏ', ఎవఁడు ఎవతె)
మొదలగు వానితో సంబంధించి యుండును.

ఉ. ఏడు పోరికిం, గవ్వడి రాకయుండుఁ దోలఁగం గొని పోవఁగ

గాంచు వారి నీ, తెప్వరి నైనఁ బంపుము. ద్రోణ. 1-391

క. తాన సుతుఁడగుట తెలియం, గానగు మును లాత్మ వీర్యకలనం
బెచ్చో, నైనం జేయఁగ ముని భా,వామూనత ఋశ్యశృంగుఁ డా
దిగఁ గమటన్. శాంతి. 5-505

**ఐరావణము** సం. వి. అ. పుం.

ఐరావతము ఇంద్రుని యేనుఁగు.

ఉ. ... ఐ, రావణ దంతి నెక్కి యమరావతికిం జని యింద్రుఁ డా
శచీ దేవియుఁ దాను మోదమునఁ దేలె. ఉద్యో 1-205

**ఐరావతము** సం. వి. అ. పుం.

1. ఐరావణము, ఇంద్రుని యేనుఁగు.

వ. ఇంద్రుం డైరావతారూఢుండై లీలం దై త్రిలోక్యంబును జరించు
చుండె. శాంతి. 4-422

2 దిగ్గజము, తూర్పు దిక్కున నుండు ఏనుఁగు.

వ. ఐరావత సుప్రతీకంబు లను దిగ్గజంబు లయ్యగ్నిశిఖవుమీఁదం
బఱతెంచిన. అర. 5-207

**ఐరావతవర్షము** సం. వి. అ. పుం. న.

ఉత్తర సముద్రమునకు శృంగ వంతంబునకు మధ్యగల భూభాగము.

వ. ఉత్తర సముద్రంబు శృంగవంతంబు మధ్యమం బైరావత వర్షం
బన నొప్పు. భీష్మ 1-25

**ఐరావతుఁడు** సం. వి. అ. పుం.

1. తక్షకుని కొడుకుగ తెంచినవాఁడు, తక్షకుని తమ్ముఁడు.

వ అట్టి యెడఁ దక్షకు నపత్యంబై తత్సోదరుండగు నైరావతుండు
వెనిచి యుపలాలింప నుల్లసిల్లిన యశ్వసేనాభిధానుండగు నాగ
కుమారుండు. కర్ణ. 3-316

2. నాగరాజు.

వ. కుండలంబులు గొనిపోయిన భుజంగం బైరావతాపత్యం బనిన
విని యముత్తనిశిమ్యుండు. అశ్వ 3-106

ఐరావతి సం. వి. ఈ. స్త్రీ.

ఒక నది, పంజాబు నందలి రావి యనునది (చూ. అ. ని.)

సీ. కాళింది నర్మద ... పెన్న యైరావతి యనఁగ బ్రసిద్ధంబు లయిన నదులు. సభా. 1-71

ఐలుఁడు సం. వి. అ. పుం.

పురూరవుఁడు, వైవస్వత మనువు కూఁతురైన ఇలకును చంద్రపుత్రుఁడైన బుధునకును బుట్టిన వాఁడు.

ఇతని కార్గురు కొడుకులు గలరు. ఇతని వంశీయులు 'ఐలులు' అని పిలువఁబడిరి.

వ. తొల్లి యైలుండను పురూరవుండు వసుధ విప్ర క్షత్రియులం దెవ్వాని ధనంబై యుండునని వాయుదేవు నడిగిన శాంతి. 2-302

ఐలులు సం. వి. బహు.

కౌరవులు, పాండవులు (ఇలా పుత్రుఁడైన పురూరవుని వంశమువారు. చూ ఐలుఁడు.)

క. వీ రైలులుఁ బౌరవులును, భారతులును గౌరవులును బాండవులు నవన్, వీరలయి పరఁగిరి ఆది 4-118

ఐశ్వర్యము సం. వి. అ. న.

1. సంపద.

తే. ఆయురైశ్వర్య కీర్తుల నపహరించు, పరసతీ సంగమము.

విరా. 2-69; శాంతి. 5-404

2. ప్రతిష్ఠ.

మ. కురు సైన్యంబుల ముట్టి గెల్చి యెలమిన్ గోవర్గముం దెచ్చె ను. త్తరు బాహాబల శౌర్య సారము బుదాత్తంబులె గదే యెందు నెవ్వరు నెక్కాలము నిట్లు సేసిరె కులైశ్వర్యం బవార్యంబుగన్. విరా 5-247

3. శక్తి, సామర్థ్యము, పరాక్రమము.

మ. ... చటులాస్త్రదీయ విశిఖాగ్ని జ్వాలలం దాహులతుల్, పరునం

బెట్టుదు ధార్తరాష్ట్రితతి వైశ్వర్యం బవార్యంబుగన్.

ఉద్యో. 2-301

**ఐషీకము** సం. వి. అ. న.

సంస్కృత భారతము నందలి సౌప్తిక పర్వమందలి అవాంతర పర్వము.

వ. సౌప్తిక పర్వం, బైషీకంబు - అను శతపర్వంబులు గలిగి.

ఆది. 1-32

**ఐహికము** సం. విశ. (అ. ఈ. అ.)

ఇహలోక సంబంధమైనది.

వ. ఎయ్యది యాచరించి పురుషుం డైహికాముష్మిక సుఖంబులం బొందు.

శాంతి 3-42

# ఒ

ఒ అవ్య. ఓ.

1. ప్రశ్నార్థకము.

చ. (అశ్వత్థామ దుర్యోధనునితో) ... పౌరికల్కి వారలకు దోర్బలోన్నతిల నడంగిపోరె, యచ్చలమొ ఫలంబొ యింకయిన సంధి యొనర్చుట మేలు వారితోన్.

కర్ణ. 3-260

క. పవనకును నీకును బాంధవము గలదొ యతండు నిన్ను దయ రక్షింపన్, సవినయ వృత్తిని బ్రతికితొ, చెవులకు నింపొసగ నీజము చెప్పుము నాకున్.

శాంతి. 3-384

ఉ. సందియమేల సర్వగుణ సంపదఁ బాడఁగ బాహుకుండు భూవందితుఁడైన నైషధుఁ డవశ్యముఁ దానగు నా మనంబు నానందముఁ బొందుచున్నది ఘనంబుగ వాఁడిట వచ్చువాఁడొ యే నందులకేగు దానవొ రయంబున బాతవి విశ్వయించఁగన్.

అర. 2-302; అర. 2-98

2. సందేహమును దెలుపును.

క. విహరింప మానవాకృతి, సహితంబుగ మహికి వచ్చి( జనుదెంచిన వృద్ధమహితుడో హిమకరుడో శచీ, గృహమేధియొ కాక యితడు కేవల నరుడే  విరా. 1-215

క తతండు కాలివహ్ని పుత్రుడో, మాతలియో నలుడో. తొరులు మానవులు జవో, పేతముగ విట్లు రథహాయ, నీతి యెఱుంగుదురె ధారుణీవలయమున్,  అర. 2-171

3. సంభావన (ఊహ)ను దెలుపుమ

క. నిమిషాంతరమున ని ట్లక్రమమున మర్త్యులకు వేయ సమకూరునె- యు, త్తముడీతడు బ్రాహ్మణ రూపమున సురేశ్వరుడో హరుడో భానుడో గుహుడో.  ఆది. 7-184

4. ఆశ్చర్యమును దెలుపును.

క. తలకక మును సౌగంధికములు గొని యిప్పుడును దర్పమున నిందుల పుష్పములుగొని మణిమత్ప్రభృతుల, బలువుర వధియించె నెట్టి బలియుడో యనుచున్.  అర. 4-25

5. నిశ్చయమును దెల్పును.

ఉ. ... లఘుసారు లధీరు లసాహసుల్ నిరుత్సాహులు ద్రోహులై యొదిరి చత్తురో మందురో మానవేశ్వరా.  ఆది. 8-46

(చత్తురు = చచ్చెదరు)

6. అనాదరమును దెలుపును.

ఆ. వరదుడైన యీతడు వరమున నిది యొక్క, వదరు పుట్టె నెట్టి వరమొ యనుచు, దాని( బాలుడైన గామన్న నాశక, వాణి యిట్టు లనియె వసుమతీశ.  అర. 7-5

7. కాకుర్థకము.

ఉ. ... లఘుసారు లధీరు లసాహసుల్ నిరుత్సాహులు ద్రోహులై యొదిరి చత్తురో మందురో మానవేశ్వరా.  ఆది. 8-46

(మందురో = మనరు-బ్రదుకరు అని యర్థము)

**ఒంటమి** దే. వి. (√ ఒంటు)

పగ, వైరము.

క. ఒంటమిని లేని యొంటర, మింటరములు పలుకుటుచితమే యర్థ రథుండ,-టి నను నేమి తక్కువ, గంటి చెపుమ దీని నీవు గన్నది గలదే. ఉద్యో 4-287

శ్లో॥ పితామహా యక్షేప్తుం మామ్ వాక్యై రుపకల్పంతసి, అనాగసం సదా ద్వేషా దేవమేవ పదేపదే. సం భా. ఉద్యో. 167-11

**ఒంటరమింటరములు** దే. వి. బ.

ఎక్కువ తక్కువ మాటలు, పరుషవచనములు.

చూ. ఒంటమి. ఉద్యో. 4-287

**ఒంటి** దే. విశ. (√ ఒండు)

ఒంటరి, తోడులేనివాఁడు, ఏకాకి.

చ. అసమున మీఁదెఱుంగక మహోగ్రహ వృత్తిఁ గడంగి చెచ్చెరం, బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాపఁడు కౌరవసేన యెడ యొంఁటి సమటయెడ. విరా. 5-284

చ. ఇది గడు ముద్దరాలు పనులేమియుఁ జేయఁగ నేర దెంతయున్, మృదు వొక కీడుపాటునకు మేకొనఁజాం దుదాత్తచిత్త యొం,టి దిరుగు దాని కోర్వడు, విరా. 1-108

విశ.

ఏకాకిత్వము, ఒంటరితనము, తోడులేమి.

క. ఒంటిమెయిఁ దాఁక నా ము,క్కంటికి వశమగునె కృష్ణ గాండీవుల కర్ణ. 2-85

వ ఎల్లవారిం గలయంగమంగొని క్రమంబున నొంటిమైఁ జనుదెండని నియోగించి యతండు. విరా, 1-184

**ఒంటికంబము** వి.

అవిద్యా రూపమైన స్తంభము, అవిద్య యొక్క ఆధారము చేతనే శరీరము నిల్చుటచేత అవిద్య శరీరమను ఇంటికి ఒక్కటే స్తంభముగాఁ జెప్పఁబడినది.

క. ఏమి వేఁడు మఱుఁగుడు వాని నివ్వేదుఱ, పట్టఁ బదురుగలదె భ్రాంతిఁ
దొలఁగి, యొంటికంటి మొప్పు నింటి వాకిలు దొ,మ్మిదియు
నెఱియ మూసి నిదురవోఁడు. శాంతి. 4-17

**ఒంటికిఁజూచు** దే. అ. క్రి.

వేఱొక విధమునకుఁ బూనుకొను.

క ఏచి చలంబున నొంటికిఁ, జూచిన నప్పటికి మనకుఁ జూడం గార్యం,
బేచందమునం దెలఁగగు, నా చాలుట కోర్వవలయు నది యట్లుం
డెన్. విరా. 3-110

**ఒంటివడు** దే. అ. క్రి. (√ఒండు)

ఏకాకియగు, సహాయము లేనివాఁడగు.

తే. ... అభిమన్యు వీరుని సతని తమ్ముఁ, గుఱ్ఱలను గర్ణ నాఱడిఁ
గోలు పోయి, యొంటి వడితి మనియుఁ గడు నుమ్మలంపు మాట
లాడుదు ర్వీరిజనుల్ మఱుఁగు చుండ. ఆశ్ర. 2-15

**ఒండను** దే. స. క్రి. (√ఒండు)

1. నిందించు.

ఉ. పాండవ పక్షపాతమునఁ బల్కెదు నోరికి వచ్చినట్లు ని,న్నొండన
రామిఁ జేసి యిది యొప్పునె. విరా 4-98

2, వేఱు మాట పలుకు.

చ. .... మనం, బనవరతానురాగమున సంగజకేళి తఱింపు మింక
నొం,డని యెడ సేసితేని కుసుమాస్త్రుఁడు సైపఁడు నన్నుఁ బావకా.
అర. 5-201

**ఒండు** సర్వ. ఔ. (బహు) ఒండులు, ఒండ్లు

1. ఇతరుఁడు (ఈ మహాదర్థమున బహువచనమునందే ప్రయోగములు
గన్పించుచున్నవి.)

చ. విరటుఁడు దక్షిణంబునకు వీరుల సారథులన్ నిజాళికై, పురిఁగల
వారిఁ బిల్లఁగొని పోయిన నొండులు తేమిఁజేసె యు,త్తరుఁ డిట వచ్చు
చుండి యరదంబు దగం గడపంగ నెవ్వరుం, దొరకొనకున్న దా
నితనిఁ దోడ్కొని వచ్చినవాఁడు సూడగన్. విరా. 4-77

చ. ... తగ నొండులం గొలువఁగా వెర వెమ్మెయిఁగల్గు నక్కటా.
విరా. 1–108

వ. ఇట్లు సృజియించి యవ్విరించి యతని (దక్షుని) నాలోకించి ప్రజల సృజియింపుమని పంచిన నతండు పెద్దవా రొండ్లు లేర్రె కెవ్వియు సృజియించెద ననిన నప్పరమేష్ఠి...పెద్ద లెవ్వరులేరు సృజియింతువు గాక యనవుడు, సౌప్తి. 3-112; ఉద్యో. 1-278

2. ఇతరము, అన్యము.

ఉ. (కర్ణుఁడు కుంతితో) నీ పలు కెంతవోలినను నిర్ణయమిట్టిద కాని యొండులే దీపనిమీఁది భారమున నీవిట వచ్చితి గాన పాండవుల్, వేపడిరేనిఁ జంప నలనేయక చెప్పెద సవ్యసాచిపైఁ, గోపము పెద్ద వాఁడు సమకూరిన విట్టలఁ జంపుదుఁజుమీ, ఉద్యో. 4-68

క. యోగంబుఁ దపంబుఁ బరి, త్యాగంబును గాక యొండులగునె హితంబుల్, రాగము సరి దుఃఖంబును, త్యాగముఁ బోలెడి సుఖంబు నరయం గలవే. శాంతి. 5-386

తే. ... సంశయిత సంవేదనంబు, మనసు కృత్యంబు యకార్యము నకు నొండ్లు, సొరవు. అశ్వ. 2-29; శాంతి. 6-168

క. ఈ వ్యాధి యొంటఁ దీఱదు, దివ్యౌషధ యుక్తమైన దివిజ వనం బున్, హావ్యాశన భక్షింపు మ,హావ్యాధిశమంబు దాన నగు నీ కని నన్. ఆది. 8–248

ఉ. ... మీ, రొంకు విధంబు నేయు టిది యుక్తమె బ్రహ్మనియుక్తి యుండఁగన్. ఆది. 2-87; ఆది. 4-85

సీ. భూసుర ప్రవరులు భూతబలుల్ దెచ్చి, పెట్టు నీవారాన్న పిండ తతులు - తే - గడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడుచున్న యెలుకలుఁ బిల్లులు నొండు సహజ,వైరి వర్గంబులయు సహవాస మపుడు, సూచి ముశిక్తి కెంతయుఁ జోద్యమంది. ఆది, 4-28

(ఒండు = ఒక్కట అని యర్థము)

3. ఒకటి.

వ. ...అప్పరాతి వర్గంబులు దివియలు దెచ్చిన నద్దరణిపతియుండు రథం

బునకై చను గరికి మూఁడును దురంగంబున కొండొకు నియతం
బుగాఁ బట్టించి. ద్రోణ 5-144

క. విను జీవముతో నన్నుం, బనిచ్చుట యొండుదక్క సమరంబునఁ
గోరిన యది నీ కొసఁగెద, నింత సెడియెడు యనుట యన్న
నమ్మల కూర్మిల్. శల్య. 2-110

4. ప్రతి వచనము.

ఆ. ...అతఁడు వేఁడెడుఁగానకు, నేఁగుచుండి మనల నిప్పుడింత.
నూడవలదె యొండులాడక యప్పని, నలువు టొప్పు బాహుశాలి
నీకు. ఆశ్ర. 1-111

క. అనిన విని యొండు పలుకక, దనుజాధీశ్వరుఁడు వోయె దక్షిణ
దశకుం, జనియె సుదర్శనుఁడై దివి, కనిమిష నాథుండు గౌర
వాన్వయముఖ్యా. శాంతి. 4-410

ఒండుమెయి, ఒండుమై దే.

వేఱు విధము, మఱి యొకరీతి.

తే. వినుము నృపసత్త్వమును రజస్సును దమస్సు, ననఁగ గుణములు
మువ్విరి గొనుచు నాత్మఁ, బుట్టుకొను నొండు మెయిఁ దెగ విట్టల
ముగ, నొలయు వైరాగ్యమును కొడవలిన కాని. శాంతి. 4-162

శా. దేవా నాలవజాతి వాఁడ నిను నర్థిం గొల్వఁగా వచ్చితిన్, సేవా
దక్షత యొండుమై నెఱుఁగ నీ చిత్తంబునన్ మెచ్చునట్లే వండం
గడు నేర్తు. విరా. 1-218

ఒండె అవ్య. ద్రు.

పక్షాంతరమును దెల్పును.

వ. ...ఇది మనము మోహంబునం గానమి యొండె వారు లోభంబున
వచ్చుట యొండె నగు. విరా. 4-185

సీ. ...గుప్త నివాసమొండె, మాతువు మీఁదొండె మాటులేని
యరణ్య, తలమొండె మంత్ర విధానమునకు నర్హముల్.
ఆశ్ర. 1-58

వ. ఎడసేయక ద్రుపదుండు పాండవులను విడుచునట్లుగా భేదింత

మొండివలను గల వారలం బంచి కౌంతేయ మాద్రేయులను దమలో విరక్తులగునట్లుగాఁ జేయుంత మొండె నతిలలిత ప్రమదా జనంబులఁ బ్రత్యేకంబ ఱేపురకుం బ్రయోగించి ద్రౌపదివలన విరక్తిఁబుట్టింత మొండె నేపురకు నొక్కతియు యాంగుట కష్టంబు. ఆది 8-22

సీ. ఆయంబునందు నాల్గవ భాగమొండె మూఁడవ భాగమొండె సందర్భమొండెఁ,గాని మిక్కిలి పేయఁగా దువ్యయంబు.
సభా. 1-46

**ఒండొండ** దే. అవ్య. (ఒండు+ఒండు+అ)

1. వరుసగా, యథాక్రమముగా, క్రమక్రమముగా.

సీ. గాండివ గుణరవం బొండొండ చెలఁగంగ శరపరంపర లాకసంబు గుప్పఁ. ఉద్యో. 2-144

తే. అర్జునుండును పర్జన్య నస్త్రవృష్టిఁ, బల్లమును మిణ్గునని యేబు పజపరాక, యుండ నెతురు వెల్లువ లొండొండ పెరిఁగె. మట్టి భూత బేతాళంబు లోలలాడ, ద్రోణ. 3-108

క. పాండవుల విభవమటియా,ఖండలు విభవంబుకంటెఁ గడు మిక్కిలిఁదై, యొండొండ పెరిఁగి దిక్కులు, నిండెఁ దదీయ ప్రతాప నిర్మల రుచితోన్. సభా. 2-104

2. తోడ్తో, వెంటనే.

సీ. వెలవక ననుఁ జూచె వీఁడని యెదఁ గలు,షించిన నొండొండ చెమట నొడమ. విరా. 2-38

వ. ...నెత్తురొండొండ పరఁగి పరశురాము శరీరంబుఁ దోఁచిన నతండు మేల్కాని. శాంతి. 1-22

వ. ...సముదిత సాంద్రసంరావంబు రోదసీ కుహరంబు నిండిన నొండొండ మట్టలెత్తుకొని నేలమట్టవియుచు నద్రవం బసులు-వెసం దిరిగి మున్ను పవ్వచ్చుందు వచ్చిన జాడం గైకొని.
విరా. 4-265

**ఒండొండు** దే. సర్వ. బ. (ఒండు+ఒండు)

అన్యోన్యము, పరస్పరము.

సీ. కవట లొండొంటితోఁ గదియుచు నెదములు, మ్రింగి ప్రబ్బఁగ
సొంపు మిగులు దాని. విరా 1-162

సీ బహుళపదాతి దుర్భర భారమడరిన, మరగ కూర్మంబు లొండొం
టిఁ బొంద, విరా. 3-156

సీ. ధర్మ విదుండవై ధర్మార్థ కామంబు లొండొంటి బాధింపకుండ
నుచిత,కాల విభక్తముల్గాఁ జేసి. సభా. 1-25; శాంతి. 2-314

ఒండొక సర్వ. (ఒండు+ఒక)

మరియొక, వేఱొక.

తే. కౌరవాన్వయ సంజాతులై గారవమునఁ, జెఱఁగిఁనట్టి మీ రొండొక
నరునిఁ గొలిచి, మసలి వర్తిల్లి మానావమానములకు, నోర్చి యడఁ
కువతోడన యునికి యరిది విరా, 1-118

క. మనకేటి రాజ్య మొండొక, జనపదమున కేగి భైక్ష చర్యా విధి
జీవనము నడపికొని యుండుదము. శాంతి. 1-48

క. దీపంబువలన నొండొక. దీపము పుట్టించినట్లు. ఆది. 4-89

ఒండొకటి సర్వ. (ఒండు+ఒకటి)

1. ఇతరము, మఱియొక్కటి.

ఉ. నెయ్యము దప్ప నొండొకట్టివి చెవిఁ సోఁకెనె వాడు పల్కులం,
దియ్యెడ సంజయా. ఉద్యో, 1-304

2. వేఱు విధము, విపరీత పద్ధతి.

చ. అని శిశుపాలుఁ డొండొకటి నప్రియముల్ హరిఁ బల్కుచున్న చో.
సభా. 2-63

ఒండొకండు; ఒండొకఁడు దే. సర్వ. (ఒండు+ఒకఁడు)

1. ఇతరుఁడు.

శా. రాధేయుండును దుస్ససేనుఁడును ఘోరం బ్రావుగాఁ బాండవ
క్రోధజ్వాలల నార్తు నొండొకఁడు నాకుం దోడె నీ వింత నన్,
బాధం బెట్టకు. ఉద్యో. 2-251

ఉ. పేర్చిన మూఁక గూడ నదలింపఁగ గోత్తలం పేయఁ దిగ్వశా,దా
ర్పుల మార్పులంబుల రయంబున నీఱుగఁ గాల్చ వాటినీ, పేర్చిన
భంగి వారకొకఁడు నేర్చునె ద్రో. 1-42

2. ఇతరము, మఱియొకటి (ఈయర్థమున బొపవిభక్తికము)

తే. దినము వంధ్యంబు గాకుండఁ దివిరి యన్న,పానదానంబు లోదవిన
భంగిఁ జేసి, మఱి భుజించుటఁ బోలెడు మహితధర్మ. కార్య
మొండొకఁ డెందును గలదె యరయ. అను. 4-278

చ. ...ఉద్ధవుండు ధ్యానలఘు తపం బొనర్చుటకు వై విపినంబున కేఁగు
వాఁడుగాఁ, బలికిన దాని కొండొకఁడుఁ బల్కఁడ కృష్ణుఁడు,
కాల వేదితన్, మౌస. 1-88

వ. అవ్వసిత యవ్వనం బెట్టిదని యడిగిన నమహ్మద్విజుం డిట్లనియె.

ఉ. అంతకుఁ బిన్నలున్ పెదక నంతకుఁ బెద్దలులేవు దుఃఖ మ,త్యంత
ముఁజేయ బొఖ్యమెసలార వొనర్పఁగ నొండొకంటి యం,దంతటి
నేర్పులేదు. అశ్వ. 2-64, 65

ఒండొకరుఁడు దే. సర్వ. (ఒండు+ఒకరుఁడు)

మఱియొకఁడు.

ఉ. ...మత్స్యధరామిత్రు, ద్గేహమునందుఁ బేడియనఁ గిట్టవి యుండెనో
కాక యీ కురు,వ్యూహముతోడి కయ్యమున కొండొకరుం డిటు
లొంటి వచ్చునే. విరా. 4-76

ఉ. ...వీరలకాక వీరితో, నొండొకరుండు మార్కొ,నఁగ నోపునె.
భీష్మ. 2-47

(భూరిశ్రవుఁ డర్జునునితో)

ఉ, నీ దెసఁ జూడ నొండొకరునిం దగ మార్కొని పోరుచుండఁ జెం,
పేవ వినీచకర్మమున కియ్యకొనం దగునే భవార్యుఁడు.
ద్రోణ. 4-268

ఒండొరుఁడు దే. సర్వ. (ఒండు+ఒరుఁడు)

అన్యోన్యము, పరస్పరము.

(ప్రథమైక వచనాంతముగను మాత్రము ప్రయోగము కానంబడదు)

ఉ. ఒండొరు మీఱు కోర్కి మెయి నొక్కట వాసలవారు నొచ్చినన్.
విరా. 3-166

ఉ. ఒండొరు మీఁద సాయకము లొక్క మొగిం బఱఁగింతు రేపుమై,
నొండొరు బాణముల్ నఱకి యుర్విపయిన్ నెఱయింతు రుగ్రులై
యొండొరు మేనులన్ శరము లుచ్చిచనన్ నిగిడింతు రిట్టు లుద్దం
డతఁ బోరి రాజనిమదంబుల నొండొరు మీఱు వాసలన్.
ద్రోణ. 4-218

వ. ...అమ్మహా వీరులు దలపడువారై వీరోద్రేకంబునం జేసి యతి
లోకంబగు నవష్టంభంబున విజృంభించి యొండొరుల నవలోకించి రట్టి
యెడ. కల్య. 2-188

వ. అని యిట్లు గంగానసువు లొండొరులు సమయంబు సేసికొని చనిరి.
ఆది. 4-188

క. ఒండొరులకు రక్షకులై యుండుదురు. శాంతి, 2-200

వ. ఉబ్బునందలపడిన బెబ్బులుల కరణి నొండొరుల మేనులు నెత్తుట
జొత్తిల్లం జేసి. ద్రోణ. 3-268

ఒండొరువుఁడు దే. సర్వ.

ఒండొరుఁడు.

తే. భూరేణువు కతన రాత్రిగాక మున్న యొండొరువులఁ గానరైరి
విరా. 3-190

చ. అరదము మీఁదఁ మున్ బొలుచువాతఁడొ యిప్పటి యాతఁడో
దివాకరుఁడను సందియంబు భుజగంబుల చిత్తములందుఁ బుట్టి
యొండొరువులతోడ వారు కడు వాయ్యనఁ బల్కఁగ.
శాంతి. 6-608

క. అనిమిషవరుఁ డివ్విధమున, జనియింపఁగ జేసెఁ బగయ సంగతులై
వారును దెగి యొండొరువులతో,నని బెట్టుగఁ జేసి చచ్చిరందఱు
నధిపా. అను. 1-298

క. ఇరువురు నొండొరువులఁ గడు, సురుచిరముగఁ జూచి వాఁడి
చూడ్కులు దనకున్, శరములుగాఁ గొనియేసెను, మరుఁడయ్యిరు
వుర మనోభిమాన చ్యుతిగాన్. ఆది. 4-146

**ఒందించు** దే. స. క్రి. ఒందఁజేయు

1 కలిగించు.

క. తాను గాంధారియు నెద్దానిం గార్యంబుగాఁగఁ దలఁచి పనిచి
నన్, దానికిఁ గాదనవలదు, పూని యనుష్ఠింత మదియ పొగడొం
దించున్. సౌప్తి. 1-48

2. పొందించు.

సీ. ...వసంతంబు తానని చాద్పునఁ దగియెడు పాటితో ధరణి
ప్రజల,నుచిత వర్తనముల నొందించునది యిది, రాజ ధర్మములకు
రాజనుమ్మ. శాంతి. 2-178

క. ఇందుల తాత్పర్యము నీ.డెందము నొందించి యతి దృఢీకృత శీలా,
స్పందితుఁడవగుము తిరమై యిందిర నీకడవసించు నిశ్చపురవాధా
శాంతి. 517

వ. నీవ యేల వివాహంబు నొందించికొనియెదవు. అను. 1-87

**ఒందు** దే. అ. క్రి.

కలుగు, ఏర్పడు.

క వేగిన గౌరవ్య సేనలు, వేగమ త్రై పేసి యనికి వెడలెం దీ వో,ద్యోగత
భీష్ముని మున్నిడి, సాగరములు మేరదప్పు చందం బొందన్.
భీష్మ. 2-274

చ, అనుడు విషణ్ణమైన హృదయంబున గారవమొంద.
విరా. 1—243; అను. 1-25

వ. అవిలంబప్పురిఁ బౌరచిత్తముల కత్యాదరం బొందంగ నందిని
యన్నేటితరంగలం బెనఁగుచున్. ఆది. 8-79

శ్లో. నదీ చ నందినీ నామ సా పురీ ముపగూహతే

అను మూలమునుబట్టి "నందిని యన్నేటి తరంగల" అను పాఠమే
యుత్తమముగా నున్నది, "అర్థిని మిన్నేటి" అను పాఠాంతరము పొసఁగదు.

"విలసత్కూల ఘనవల్లి, యన్నిష్టసఖ మాఁది యున్నదాని.
ఆది. 8-140

"వృత్రుఁడన్నసుర గర్వించి" అర. 3-8 వలెనే ఇచ్చట 'అన్నేటి తరంగల' గ్రహించునది.

2. ఒప్పు (ఈ యర్థమున గొన్నిచట్ల వాక్యాలంకారముగా నుపయో గింపఁబడును)

సీ. ...అయ్యాయి బంధుల నందు నిందు, నందును నిలుచున ట్లొందఁగ నియమించి...(వాక్యాలంకారము) మౌస. 198

సీ. అందు ఋచీకున కొందంగ జమదగ్నియను మునివుట్టె. ఆది. 3-70

ఉ. ...వారలఁ బంపి తెచ్చి వా, కొందఁగ వండిపెట్టుము రసోత్కట మానవ మాంసఖండముల్. ఆది. 6-186

స. క్రి.

1. పడయు, పొందు.

క. మన్నన కుబ్జక యవమతి, దన్నొందిన స్రుక్కుఁబడక ధరణీశు కడన్, మున్నున్నయట్ల మెలఁగిన, యన్నరునకు శుభము లొదవు నావద లడఁగున్. విరా. 1-133

క. ఘృత మర్చిస్సంపదయయి, ఘృతార్చి రశిధాన మొందె. శాంతి. 6-435; శాంతి. 5-607; స్వర్గ. 39

2. తాఁకు, అంటు, స్పృశించు.

తే. పద్మాక్షుఁ డవ్విరూపాక్షునకు ధరాతలము జానుపాణి శిరంబు లొంద, మ్రొక్కి నిలుచుండి. ద్రోణ. 5-406

క. పద్మపత్రంబు నీరంబొందని యట్లు. అర. 1-24

3. జనించు.

ఆ. సకల జీవరాశి సుకృత దుష్కృత ఫల,మెఱిఁగి నడపుకున్న యిట్టి ధర్ముఁ, డొంద శూద్రయోనియందు మాండవ్యుచే, శప్తుఁడై య దేల సంభవించె. ఆది 4-260 (చూ. 258)

శ్లో. కిం కృతం కర్మధర్మేణ యేన శాపము పేయివాన్, కస్య శాపాచ్చ బ్రహ్మర్షేః శూద్రయోనావజాయత. సం.భా. ఆది. 107-1

(రతియందు) కలియు, కూడు.

సీ. ఏనవ వాఁడొంద నింతియు షష్ఠాహ్నమునఁ బొంద మగవాఁడుఁ బుట్టు. అను. 4-126

వ. ...అట్లొందిన యయ్యిరువురకును౦ బ్రభవించిన సౌరభేయీ కులంబాకమలాసను నిర్దేశించినట్టిదై సురాసుర ప్రముఖ నిఖిల జనంబులకు నమస్కార్యంబును సపర్యాభాజనంబును నయి రాజిల్లు. అను. 3-52

5, చేరు.

క. తముఁ గాచి వెనుకవచ్చిన, దమజ మహాబలము తనదు తను వొందిన వా,తనిచే విదిల్చి రథసంబునఁ దన్మందిరము ద్రుపద పుత్రిక వెడలెన్. విరా. 2-126

6. ఊను, పూను.

ఉ. ...మహాకవిత్వ దీ,క్షా విధినొంది పద్యమున గద్యములన్ రచియించెదం గృతుల్. విరా. 1-30

ఒక సర్వ. (సం. ఏకః)
(వృత్తియందుఁ బ్రత్యయము లోపించిన రూపము)

1. ఏకార్థము.

చ. వెలిచితిరేని విల్వుఁడొక వీరున కొక్కఁడ చాలు. విరా. 4-201

క. ఉడిగి మడుగవలసె నిప్పు డొక సాత్యకిచేన్. ద్రో. 4-89

చ. నుతజల పూరితంబులగు నూతులు నూఱిటికంటె నూన్నత, వ్రతయొకబావి మేలు. ఆది. 4-93

2. ఒకానొక.

ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియు దా నరదంబులతోడఁ గ్రోశమాత్ర మెుక్కక చోటి కల్గఁ జని. విరా. 1-58

క. విలువిద్య నొరులు పీకగ్గలముగ లేకుండ నిమ్ముఁ గఱపుదు నని మున్, పలికితి నాకు కాదీ, త్రిలోకముల కధికుఁ జూచితిమి యొక యొజ్జున్. ఆది. 5-289

3. సామాన్యము, సాధారణము.

ఉ. ...అ,ఖండబలుం దన్న గద్దియ నగంబునముందె మహానుభావుం
డీ,తం డొక మర్త్యుం జేరి యనుదాత్తత నెమ్మెయిం గొల్చువాం డొకో
విరా 1-85

క. నరుం డొక రథికుని యనుమతిం, బోరం దలంచునె మనుజసేన సుర
బలమైన,న్దైరలిచికొని నిచ్చల విడి, నరుగుం దన వలచినెడకు నది
యట్లుండెన్. ద్రోణ. 4-147

వ. యోగబలములేని యొక భంగి యోగి బలె, ద్రోపులేని మీను నేపు
లేని, మృగమువలయు నవియం దెగిపోవ ముఖకంగ,లేని యట్లు
భవములోన నడంగు శాంతి. 5-578

4. అన్యము. వేఱైనది.

ఉ. ఏ నిటులంటినా వలవ దింకను నీవును రాజుం దమ్ముఁలుం,గా మచి
తంబు సూచి మన కార్యము మీసుజనత్వముం జెడం,గా నొక
భంగి సేయక తగుం గురువర్గముతోడి సంధి మీ,కైన తెఱంగునన్
వలచినట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్. ఉద్యో.3-105

(ఒకభంగి = కాని విధము, భిన్నమైన పద్ధతి)

గీ. ...భీముఁడెచట నున్నాఁడు నా యెడ లెట్లు ప్రాణ, సహితమై
యుండు నతఁ డొక చందమైన, నేమిగతిం బోదు నక్కట యొఱుం
గం జెపుమ. (ఒక చందమైన = మరణించిన) భీష్మ 2-265

5. అనిర్వాచ్యము, ఇంతయని వివరించి చెప్పుటకు వీలులేనిది.

తే. అనిన విని కిన్కఁబూనిన యలంతినగవు, చెలువు మొగమున కొంత
క్రొత్తపాలు వానర్పఁ, బుండరీకాక్షుఁడను పెల్లం బోయి యన్న,
దరుణ కమలాక్షుఁడగుచు మురాంతకుండు. ఉద్యో. 3-364

6. తెగలు తెగలుగా విభజించునప్పుడు మొత్తమునకు వాడఁబడునది.

క మన మొక యేపుర మీ యం,గనయుం దో నరుగుదేరఁగా నెయ్యో
డం బో,యిన నెఱుంగకుండుదురె. విరా. 1-59

7. కొంచెము, అల్పార్థము.

చ. ఇది కడుముద్దరాలు పనులేమియుఁ జేయఁగనేర దింతయున్.
మృదు వొక కిడుపాటునకు మేకొనఁజాలదు    విరా. 1-108

చ. ...అక్కట యింతకుముంద రేమియున్, మనల నెఱుంగఁ డవ్వి
భుని మాటునఁ బూనిక దీర్చికొంటి మా,కనికొక యొగ్గు సేతఁ యుచి
తంబె    విరా. 5-313

8. కొన్నిపట్ల వాక్యాలంకారముగా నుపయుక్తము.

చ. వలపదు రోయఁ బాండవుల వారొక యూఱటలేని త్రిమ్మటన్,
బలమఱి వన్యసత్త్వముల పొల్పడి వచ్చినచోటఁ బారియు,న్మొర
వడె.    విరా. 3-95

క. వెలివిరిసి వచ్చు జలనిధి, పొలువునఁ దోఁతెంచు ధర్మపుత్రుని బలు
గో, ల్తల నిలువరింప నీవొక, చెలియలి కట్టవయి మమ్ముఁ జేకొను
మిచటన్.    భీష్మ. 3-241

ఒకండు; ఒకడు పర్యా. ఒక్కఁడు (ఇది అమహదర్థకమున ఔప
విభక్తికము)

1. ఒకటి.

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టులనియె నీవత్సర, మొకఁడు వెట్టులయిన
మడిగిమడిగి, సంకటముల గోర్చి చరియించి యావల, నిస్తరించి
పిదప వెగడవలయు.    విరా. 1-148

తే. అతఁడు నీ తొమ్ము ద్రొక్కిన యపు డొకండుఁ, జేయఁజాలవ
యగ్గురు పాయకములఁ, బాండవానీకములు విచ్చి పాఱ నెన్ని,
యొడల మార్కొంటి వాతని నెఱుఁగవెట్లు.    ద్రోణ. 5-389

తే. అందు మూఁడేసి ఋతువుల కయన నామ,కంబులగు నుత్తరాఖ్య
మొకండు దక్షి,ణాభిధాన మొక్కటియు గుణాభిరామ, యవి
యహస్సును రాత్రియు ననఁగఁ బరఁగు.    శాంతి. 5-41

గీ. ఒకటనై నను వారియం దొకరిలోని, చిదురపాలును బోఁడు.

చ. ఒకటను మేలుసేయని సుయోధనుఁడు.    స్వర్గ. 25

(ఒకటను = ఒక విషయమందైనను)

2. అన్యుఁడు, ఇతరుఁడు.

ఉ. ...వ్వన్మిఁ జఱఁగ జానసీని వొకనిం బరిఁగానని యట్లుగాఁగ మేన్,
గాఱయ వెట్టఁయైన వొడికంబుగ వండుదు వెల్లగూరలున్.
విరా. 1-77

3. ఒకానొక పురుషుఁడు, అల్పుఁడు.

సీ. ...ఎందు నుతికివెక్కి —తే— యున్న గంధర్వు లేవురు నమ్ము
నిట్టి లోకఁడు పఱుపంగ నూరక యునికి మూడ, పచ్చెరుపుగాదె
యెవ్వరి యాంద్రుఁడింకఁ, బరిభవంబునఁ బొందక బ్రదుకువారు.
విరా. 2-140

ఉ. ...ఇట్టి నమఁ బంకజనాభ యొకండు రాజసూ,యావభృథంబు
నందు శుచియై పెనుపొంతిన వేణి వట్టె యీ,యేవురుఁ జూడఁగా
సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే. ఉద్యో. 3-110

4. ఒక పురుషుఁడు.

(అర్జునుఁ డుత్తరునితోఁ గర్ణుని జూపి)

క. వీఁడొకఁడు కురుబలంబున, వాఁడి మగండనఁగఁ జాలువాఁ డిబ్బం
గిం, బోడిమిపెడియెను ద్రోణుం, వేడిమి యిట మనకు మునము
విక్రమమునకున్. విరా. 5-110

5. ఏకీభూతుఁడు, కలిసినవాఁడు.

ఉ. ఏ మునుపాండునందనులు నేక కులంబునఁ బుట్టి యొక్కచో, నే
మొకఁడై నఁదేసి గెడవెప్పు చరించిన యట్టి వార ము,ద్దామ బలంబు
శౌర్యమును దర్పము వారిక కల్గివాగసం, గ్రామమునన్ జయింతు
రనఁగా నొక నిశ్చయమెట్లు గల్గెదున్. ఉద్యో. 2-239

6. ఒక వ్యక్తి (ఎంతటి గొప్పవాఁడైనను లేక ఎప్పుఁడైనను అను
భావము సూచించును)

ఉ. వారిని వారి వారి నిటువర్ణన సేసెదుగాని మమ్ము మా,వారిఁ
దలంప విప్పుడమి వారికిఁ జాయను మాకు నంతయుం, తెరమ
మున్స్మృతి చె విధిసిద్ధము దీని నొకండు మాన్పఁగా, వేరఁ దలార
బంబు మది నెవ్వగ లేటికిఁ బట్టుకొల్పఁగన్. ఉద్యో. 2-240

7. కీడు, హాని.

క. అది యొకఁడుఁ జేయఁజాలక, విదళితశైలమగు తనదు విలసన మచటం, గుడియుట దనకుం దెలిసిన, మదమతి గిరిభేది కడకు మగుడం జనియెన్. అను. 1-258

**ఒక కాలము** వి.

ఏ కాలమందును, ఎప్పుడును.

(ఇది ఈ యర్థమందు సముచ్చయము గలిగి వ్యతిరేకార్థకముతోఁ గూడి యుండును.)

చ. ...నరేంద్ర యవ్వు సంగరమతి ఘోరమయ్యె నొక కాలము నట్టి వి నూడ మెయ్యెడన్. ద్రోణ. 3-117

శ్లో. కదాచిన్నాస్మాభిర్దృష్టం తాదృక్ఛ్న చ శ్రుతమ్.

సం. భా. ద్రోణ. 95-4

**ఒక కొండ** వి.

మిక్కిలి గొప్ప పదార్థము (అలంకారికము)

చ. కడువఁగఁ గట్టబంధులకుఁ గోటి విధంబులఁ బెట్ట అన్నము,ల్నడు ప వనేక ధర్మవిధులం బొగడొందఁగఁ జాలు నట్టియొక్కుడు సిరి యిచ్చి పేర్మి నొకకొండగ మన్నిన నీవు సావఁగా, నాడ బిటు లో మితిం గురుకులోత్తమ యొనొక సేవకుండనే. సౌప్తి. 1-224

**ఒకటఁ; ఒక్కట** అవ్య. ద్రు.

ఏక కాలమున, ఒక్కమాఱుగా.

క. ఒంటిమెయి నుండఁగా ముక్కంటికి నాశ్చపంబు గోరుం బట్టం, గంట యరిది యొక్కొకటన, రెంటిం బొరువంగవలయు రేవెర వారన్, అను. 1-223

**ఒకటి** సర్వ. ఒకటి (సం. ఏకః)

1. ఏకము. ఏకత్వ సంఖ్యాకము.

తే. మణిగణోజ్జ్వలంబైన విమానమొకటి, యంబరంబునఁ గాంచి.

భీష్మ. 2-268

క. .. ఇతిహాసమొకటి చెప్పెద నతిభా శాంతి. 3-470

2 ఒక సంగతి, ఒక విషయము.

ఆ. ఏను బుట్టి వేయు నిన్నూఱు మున్నూఱు, గఱవు వత్సరములు గాన నెందు, బాలు యౌవనస్థుఁ బ్రౌఢుని వృద్ధుని, జిట్టిపోయి మగిడి వచ్చువాని.

క ఒకటి గలదు వత్తురు వేఁటొక గర్భంబునకు మృతులు. శాంతి. 8-875, 876

ఆ. ఒకటి దెసను దృష్ట మొలయదు గావున. శాంతి. 1-127

చ. కడు పనిబిడ్డ పీఁడొకటి గాదవునా నెఱుంగఁడు. విరా. 2-218

క, తన మదిఁగదిరిన తమకంబున జిడిముడి పడుచు ద్రుపద పుత్రిక పై నూ, నిద వేడ్క దిగువ నొకటియుఁ, గమఁగొన వినలేక మదన కంపితుఁ డగుచున్. విరా. 2-243

(ఒకటి = ఒక వస్తువు. ఒక విషయము)

3. అన్యము, భిన్నము, వేఱైనది.

క. వేఱుగఁ గవినం బ్రకృతికిఁ, జాఱవిడిచి నట్ల తనదు సుజ్ఞానము న్శాస్త్రులు విడిచి తన కంటెను, మీఱ నొకటి లేమి,గాన్పుమెయి కొన వలయున్. అను. 4-207

వ. మిత్రుని కోరిన యది యిచ్చుచుండి దానికి మాఱుగా నొకటి పుచ్చుకొనుట పురుషార్థంబు తెరువే. సౌప్తి. 2-48

4. ఒక పని.

చ. —యొం,టి దిరుగు దానికోర్వ దొకటిం దనుదా సవరించు చొప్పెఱుం,గదు తగనొండొరులం గొలువఁగా వెరవెమ్మెయిఁ గల్గు నక్కటా విరా. 1-108

5 బుద్ధి

తే ఒకటిఁ గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి, మూఁటి వాల్గింటిఁగడు వశ్యములుగఁ జేసి, యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు. ఉద్యో. 2-87

ఒకటిన్ = బుద్ధిన్; కొని = గ్రహించి, పూని; రెంటిన్ = పుణ్యము పాపము అనువాని రెండింటిని, నిశ్చలయుక్తిన్ జేరి = అచంచలముగా

బుద్ధియందు నిలుచు నట్లుఁ జేసి అనఁగా ఏది పుణ్యము ఏది పాపము అను విషయము తెల్లవప్పుడు బుద్ధియందు విచారణలో మంచి; మూఁటిన్ = శత్రువులు, మిత్రులు, బాంధవులు అను ముప్పేరము; నాల్గింటిన్ = సామము, దానము, భేదము, దండము అను నాలుగు ఉపాయములను కడువశ్యములుగన్ + చేసి = తనకు మిక్కిలి స్వాధీనములో నుండునట్లు చేసి అనఁగా శత్రుమిత్ర బాంధవులు తనకెప్పుడు మిక్కిలి లోఁబడియుండు వారుగను సామభేద దండోపాయములను బాగుగా తెలిసి వాని వానిని ఆయా సమయములందు ఉపయోగింపవలసినంత వఱకు ఏమఱక ఉపయోగించి; ఏటిని గెల్చి = పంచ జ్ఞానేంద్రియములను (1. త్వక్కు, 2. చక్షువు, 3. శ్రోత్రము, 4 జిహ్వ, 5. ఘ్రాణము) జయించి; ఆఱింటిన్ + ఎఱిఁగి = సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయము అను నాఱు విషయముల యందు సంపూర్ణ జ్ఞానము గలిగి యాయా సందర్భముల యందు వానివాని ప్రయోగించుచు. ఏడు + విడిచి = సప్తవ్యసనములను. 1) ద్యూతము, 2) వేఁట, 3) స్త్రీ, 4) మద్యపానము, 5) అర్థదూషణము, 6) వాక్పారుష్యము, 7) దండ పారుష్యము అను వానిని పరిత్యజించి; వర్తించువాఁడు = ప్రవర్తించు వాఁడు; వివేకధనుఁడు = విజ్ఞానమను ధనము గలవాఁడు.

6. హాని, కీడు, ఉపాయము.

క. హితుఁడగు మంత్రిం గుటిలుల, యతి కపటోపాయములకు వగవడి
తెలుపన్, మఱిఁ దలఁతురె పతి సుపరీక్షితంబు గావింప కొకటి
వేయం దగునే. శాంతి. 3-78

వ. కుటిలంబున కొకటి పుట్టినం బ్రసిద్ధులయి గావున నది మీ తలఁప
నిలుచు నట్లగుటం జేసి. విరా. 4-224

ఆ. వాసవాత్మజుండు వసుధేశ నందను, ముట్టికొనిన నొకటి పుట్టె
నేని, మన ప్రయోజనంబు మఱియేమి పసులవి, యేటికొందు
ధనము లెల్ల నేల. విరా. 4-261

7. మేలు, ఉపకారము.

చ. అని విని సమ్మఁగాంచితి ప్రయత్నమునన్ వినిపింపు మీవు వచ్చిన

పని వాఱు నీ కొకటి సేసితినే యిటు వృతమూల హా,సుని క్రియ లేచిపోక తగు చొప్పగునే భవదీయవాంఛ పెప్పిన నది యేను దీర్తు మతి పెంపెసఁగం జను భూసురోత్తమా. శాంతి. 6-613

8. ఒక విధము.

క. అనవుడు భీష్ముఁడు ధృతరాష్ట్రిన కిట్లను నీవునుం గొడుకు నేమే ని,చ్చిన వొకటి యీగి లే,కున్నను వేఱొక్కటి దలంచు వా కెవ్వుఁడున్. ఉద్యో. 3-165

9. ఒకానొకటి.

క. ఒకవాఁడు గోవొకటి లేఁ,గకుఁ జన్నిచ్చుచును దానిఁ గనుఁగొని నీ విం,కకటా యెక్కడఁ జేరెద, వకృవులు వచ్చెదరు చంప నని పల్కుటయున్. అను. 3-85

క. శకట పథంబునఁ గీటం, బొకటి వెసం బాఱఁ గాంచె యోగీంద్రుఁడు జం,తుకలాప మానస దశా,ప్రకార సంవేది బాదరాయణుఁ డధిపా. అను. 4-316

క. ...బనము, వినినది కథయొకటి నీకు వినిపింతుఁ దగన్. అను. 2-181

ఒకటియగు; ఒక్కటియగు అ. క్రి.

1. అన్యథా యగు, వేఱొక విధముగా నగు.

క. అతఁడొకటి యైన నేనే, గతిఁబోదుం జెవుమ యెల్లకార్యంబులలో, నతనికిఁ దోడ్పడఁ బోవుట, యతిముఖ్యము దానిఁ జేయ మనము విచారా. (ఒకటియగు = మరణించు అనిభావము) ద్రోణ. 3-287

2. ఏకమగు.

వ. శాంతిప్రకారంబునం గార్యంబు నడపి యొక్కటియై మనుట యెడఁగూర్చి రమ్ము. ఉద్యో. 1-272

వ. మీరును వారును నొక్కటియై యున్న మీ దిక్కు దేవతలకుం దేటి చూడరాదు. ఉద్యో. 2-49

ఒకత వి.

ఒకతె.

క. నీ వొకతవేలఁ బదిసేవురనే వలచి పట్టి పెరకిన నర్థంబై వచ్చి
వలదు నా నిం, దేనాఁడు మగండు. విరా. 2-256

క. పని పంపఁగాని యొకతకుఁ, బనిసేయ నొల్లఁగ నన్నుఁ బనిగొను
నెడఁ బాం, డుని యగ్రమహిషి గొంకుచుఁ, బనిగల పెడు చందము
నన పనుచు నొల్లఁగనే. విరా. 2-219

ఒకతల; ఒక్కతల వి.

1. ఒకవైపు, ఒక పక్షము.

క. ఆ యిరువురు నొకతలయై, యాయోధమునకు నడచు నట్టిద
యేనిన్, వేయేల మనక కాదు, కై యెత్తెదఁ దాఁక నాయన
కైనను నకమే. ఉద్యో. 2-151

2. ఒక ఎత్తు.

క. ఇది యెల్లను నొకతల యీ, పదుమూఁడేడులును నాకు నావ
కొడుకుచే, నదయమగు కూడు గుడుచుట, యది యొకతల
యయ్యొనేమి యనఁగల దనఘా. ఉద్యో. 3-192

సీ. ఇది యెల్ల నొకతల యేపు మీఱఁగ నన్నుఁ దెనకుట యొకతల
చెప్పనేల. అర. 7-61

3. ఒక మొత్తము, ఒక గుంపు.

వ. ...అయ్యెడకు వచ్చు కౌంతేయులతో నీదెల్ల నొక్క తలగా
వెడలి వేడుక జూడం జనుదేర. శల్య. 2-362; శల్య. 1-100

ఒకనాఁడు; ఒక్కనాఁడు వి.

1. ఎప్పుడైన ఒకప్పుడు.

క. ఒకనాఁడేమును నావద, లకు విదుమరఁగాంచి విప్రులం బట్టలఁ
బెట్టుకొని ముఖముండఁ బడయుదు, మొకో యిప్పాటెందుఁ గలదె
యొరు లెవ్వరికిన్. విరా. 1-49

2. ఒకానొక దినము.

సీ. అరయంగఁ దప్పలేనంటి నీవంనఁ గీ, డొక నాఁడు సేసియు నొక్క
నాఁడు సేయవె. ఉద్యో. 3-366

సీ. ఒకనాఁడు పెనుమానయును గాలియును ముట్టి సకల జీవులకు
నాశంబు పుట్టునట్టిదియై శాంతి. 3-307; శాంతి. 3-392

క. అనవిని యొకనాఁ డొక్కెడఁ గనుంగొంటి గృష్ణు మౌస. 1-161

వ. ఒకనాఁడకొ్కరవేళ్వరు పేరోలగంబున సమస్త సేనాపతులం గల
యం గనుఁగొని. ఉ. 1-230

3. ఏ దినమునందును, ఎప్పుడును.

(ఈ యర్థమందు ఇది సముచ్చయము గలిగి వ్యతిరేకార్థముతోఁ గూడి
యుండును.)

ఉ. అక్కట ధర్మనందనుని యాస్యమునం దొకనాఁడుఁ గినుప,
ల్లొక్కఁడు లేదు. ఉద్యో. 2-68

సీ. అల్లనవ్వుచు నయ్యింతి యతనితో నాథ నీయందొకనాఁడు నెగ్గు,
గలదె ఉద్యో. 4-87

చ. అతిశయ రూపయౌవన గుణాధిక సుందరమైన యాసతి, ద్విత
యమునందు సంతతగతిన్ వివశుండయి రాజ కృత్యముల్, మతి
నొకనాఁడుఁ జేయక. ఆది. 4-104

ఒకపెట్టు; ఒక్కపెట్టు విణ.

1. ఒక్కసారి, ఒక పర్యాయము.

చ. అనిన సుయోధనుండు దమయయ్యకు నిట్లను నిట్టగంబు లన్నియు
నొకపెట్ట గ్రమిగినను పెట్టవ సర్వముగాచె నేనియు, న్వినుము
ముకుందుఁ డర్జునుని నెచ్చెలినాఁ జెపులార వించు నిం,క నతని
నొక్కటాముగనకుఁగా ధృతి పెంపఱ నాశ్రయింతునే
ఉద్యో. 2-322; విరా 3-131

2. ఆకస్మికము.

వ. అందొక్కపెట్ట యార్తధ్వని యొగసిన విని కుంతీదేవి యెంతయు
సంతాపించి ఆది. 6-240

ఒక పోఁకకుఁ బోవు జాతీ.

ఎందుకుఁ గొఱకాకుండు

చ. వినయము విద్యయుం గలుగు విప్రునియందును గోవునందు నొ,
ప్పు నెఱయు హస్తియందు నొకపోఁకకుఁబోవని కుక్కయందుఁ
దా,ని నడిచి తెచ్చి వండి తిను నీచవు మానిసియందు దుల్యదర్శ
నుఁలు దదంతరాత్ముని నిరంజనునిం గనునట్టి పండితుల్.
శాంతి, 5-109

ఒక థంగి వి.

ఒక విధము.

సీ. అకట మాతో మీరు నడవుల నికుసులఁ బొందితి రొకథంగి బోయెఁ
గాలము. (ఒక థంగిన = ఒకానొక విధముగా, సామాన్యముగా)
విరా. 1-47

క. మన శస్త్రాస్త్రంబులు దక్కిన యవియొక థంగి వీటికిని గాండి
వము,గొని పోయితిమేని సుయోధనునకు నగపాటు విశ్రుతం
బూహింపన్. (ఒకథంగి = ఒక విధమైనవి ఎక్కువగాఁ బరిగణింపఁ
దగినవి కావు) విరా. 1-158

ఆ. యోగబలములేని యొకథంగి యోగిబల్, ద్రోపులేని మీను నేవు
లేవి, మృగమువలయు నురియుఁ దెగిపోవ మఱుకంగ,లేని యట్ల
థవములోన నడఁగు. (ఒకథంగియోగి = శక్తిచాలని యోగి).
శాంతి. 5-578

ఒక మందు వి.

ఒక యుపాయము.

చ. అని మొన దేవదానవులకైనను గెల్వ వశక్య మిమ్మహాత్ముని
నొకమందు నెప్పెద సుతున్ హతుఁడయ్యెననంగ విన్నయం, తన
యితఁ డాయుధంబు దిగద్రావి యచేష్టతఁ బొందునప్పు డీ,తనిఁ
బరిమార్పవచ్చు నిది దప్పనుపాయము గల్గ దెమ్మెయిన్.
ద్రోణ. 5-805

ఒకమాటు వి.

ఒక్క పర్యాయము, ఒక్కసారి.

చ. ...వారలెల్ల నెమ్మనమున శంకలేక యొకమాటును నిక్కడఁ
జేరరెవ్వరున్. శల్య. 2-403

('ఒకమాటను'-ఆనందవారి పాఠము ప్రమాదపతితమేమో)

**ఒకమొగి; ఒక్కమొగి వి.**

1. ఒకే పర్యాయము-ఒక్కట (యుగపదర్థకము)

క. ఒకమొగి నఱువది యమ్ములఁ, బ్రకట బలుండైన పరశు రాముఁడు నాయం,గకములు దాఁకఁగఁ నశ్వ, ప్రకరము వావాట నూతువై బడనేసెన్. ఉద్యో. 4-317

చ. ...వాఁడు అక నిశాతసాయకము లొక్కమొగిం బది మేని యందుఁ గ్రిక్కిఱియఁగఁ జేసి. విరా. 3-215

2. ఐకకంఠ్యము, ఏకగ్రీవము.

వ. ...అవ్విప్రులందఱు నొక్కమొగిన మీ కులంబునకు దైవంబను కూలంబుగాపుతమని పాండుపుత్రుల దీవించి. విరా. 1-57

**ఒక యింత; ఒకింత సర్వ. ఔ. అనౌ.**

1. కొంచెము సేపు.

ఉ. ఇంతకు వేర్పు నీకు నొకయింతటిలోన మదీయ వాణి నత్యంత విభూతి బెంపెసఁగునట్టి నిమం గొనియాడఁజేఁత దా, నెంతటి పెద్ద. విరా. 1-21

చ. ఉఱక నరుండు ద్రోణసుతుయుగ్యములన్ వెస నొంచె నాతఁడుం, దెలిపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున వారిఁ ద్రుంచి. విరా. 5-141

2 కొంచెము.

మ. అరయం దప్పొకయింత నా వలన లేదు. ఉద్యో. 3-358

ఆ. ...నీకు నరయఁ గీడొకింతయైన లేదు. అను. 2-326

వ. ఇట్లుభయసైనికులు సాంద్ర సంతమసంబునం జేయునది లేక సంగ్రామంబు దక్కి తమకం బెక్కి నొక్కింతసే పూరకున్నంత. విరా. 3-186

**ఒకింతయేని ద్రు. కళ.**

చూ. ఇంతయేని.

**ఒకరు సర్వ.**

('ఒక్కఁడు'-నకని మహన్మహత్వర్థక ఏకవచన రూపాంతరము. బహు 96)

వచనమునందుఁ బ్రయోగము గానరాదు ఏకవచనమందైనను ఈ క్రింది తావునందు మాత్రమే కన్పించుచున్నది.)

ఒకఁడు, ఒకతె.

తే. ఒకటనైనను వారియం దొకరిలోని, చిదురపాలును తోలందు సిగ్గులేక, పాండవుల గెల్తు నేనని పలుకుచుండు, వీని రజ్జులు దులువలు వింద్రు తగిలి. ఉద్యో. 2-160

**ఒకరుఁడు; ఒక్కరుఁడు** సర్వ. బహు. ఒకళులు, ఒకళ్లు (ఇవి మహత్వార్థకములు కూడ నగును)

1. ఒక పురుషుఁడు, ఒకానొకఁడు.

తే. అరులు మిత్రు లుదాసీను లనుచు సంధి, విగ్రహాది షడ్గుణముల వెరవు లొకరుఁ, దలవరించుచు విజయంబు నాసపడుచు. నుండు నచె ముక్తి తెఱఁ గిటులున్నె యరయ. శా 8 6-197

క. కడుఁ జెడవు నిద్రవోయితి, బడఁతి ననుఁ దెలుపవలదె బలియుఁ డొకరుఁ డొక్కరుఁడు జవమునఁ బట్టి బలిం, బెదలఁగ ననుఁ దిగిచె వాఁ డెవ్వఁడు చెప్పుమా. అర. 7-26

క. తమలోన మాటలాడెదు, సమయంబున నొక్కరుండు విశాలోర స్కుఁ, డమితబలుఁడు పంచానన, సమమూర్తి స్ఫూర్తి యధిక సంరంభమునన్.

సీ. రాజ్యాధిపత్య సంప్రాజ్యత్వమున ధృతరాష్ట్ర పాండు సుతాం తరంబు గాన, రొకళులు జానపదోత్కరమునఁ బొగ, వర్గంబు నందును వసుమతిశ. ఆశ్ర. 1-16

క. ఒక మణికిరీటి కట్టెదిరికి మలిముసఁ బోయిరేని రెండవ మాఱి, య్యకొనట కోర్వఁగలేరై, రొకళ్ళుఁ గురురాజుసేన యోధులలో నన్. విరా. 5-65; మహా 1-20

2. అన్యుఁడు

చ. ఒకరుని కీర్తి ప్రోవుకు దరున్నతి ప్రాపుమ గాంచి యొల్లవెంటకును గొలంతలేక పొగడం దగు సంపదనొంది. ఉద్యో. 2-77

**ఒక విప్రుఁడు వి.**

చూ. సముద్రము.

**ఒక వెంటన్**

1. ఒక విధముగా.

ఉ వీరులు పెద్దద్రవ్య కొకవెంట నొడంబడి తేటి కాంతులై, కౌరవ కోటిఁ గూడి మనఁగా మది గోరుట పెంపుఁదాల్మియుం, గారుణి కత్వముం దగవు గాదె. ఉద్యో. 1-341

వ. వినతకు దాస్య మొందె నొకవెంటఁ దదీయ నిరాసహేతువై, యనఘవిచార వాకు నమృతాహరణంబు విధేయమయ్యె. అను. 1-251

2. ఒకానొకపని మీఁద-ఏదియేని కార్యార్థమయి.

చ. నరుఁ డొకవెంట నెన్నఁడు ప్రవాసగతుండగు నాఁటగోలె న,వ్వరుషుఁడు వచ్చువంతకును బావులు పూఁతలు మేలి చీర లా,భరణము లెక్కుడుం బువుల పాక విశేషము లాదరింప అను. 4-359

శ్లో. ప్రవాసం యది మే యాతి భర్తా కార్యేన కేనచిత్...

సం.భా. అను. 186-19 (నిర్ణ)

**ఒకళ్లవారు సర్వ.**

ఒకరిపై పక్షపాత బుద్ధి గలవారు.

వ. కావున వారొకళ్ళ వారుం గా రట్లుగాక పక్షపాతులై పూని పత్తురయేని నదిదేవత్వంబుగా దట్టి దేవత్వంబున నర్జునుండు సుర క్షితుండు గానేరఁడు. ఉద్యో. 2-282

**ఒకళులు; ఒకళ్లు**

చూ. ఒకరుఁడు.

**ఒకళ్లొకళ్లు**

ఒకరొకరు.

వ. గాండీవి గాంగేయు లొండొరుల చండ బాణంబులఁ ద్రుంచుచు వర్మంబులు సించుచు నొకొళ్ళొకళ్ళ పెలి మావులం బడగలం బాఁక నేయుచుం దేరి పోరు సమయంబున. భీష్మ. 2-42

వ. మన మొకళ్ళొకళ్ళకుఁ బ్రాపగుచు నేపారి పోరినం జుల్కన గెల్పు గొనవచ్చు. శల్య. 1-101

ఒకొ; ఒకో అవ్య.

1. సందేహమును దెల్పును.

క. వెఱవక సంకేతించిన, తెఱఁగున నయ్యేడకు నరుగుదెంచునొకో కొం,దఱఁ దెచ్చునొకో వెరఁగై. యఱిముఱి వెలిపుచ్చునొకో రహస్యంబెల్లన్. విరా. 2-277

క. ఒకనాఁడేమును నాపద,లకు విడుమరఁ గాంచి విపులం బట్టలఁ బె,ట్టుకొని సుఖముంతఁ బడయుదు,మొకో యిప్పాటు దుఃగలదె యొరు లెవ్వరికిన్. విరా. 1-49; ద్రోణ. 2-229

2. ప్రశ్నము దెలుపును.

తే. పాండు సుతులు శిఖండియుఁ బండశక్తి, మెఱయ నొక్కటఁ బైఁబడ్డ వెఱచి తాత, విడిచి నా పుత్రులందఱు విఱిగి యడవిఁ, గలసి రొకో యాతనికిఁ బడవలసె నకట. భీష్మ. 1-58

క. అనవుడు దుర్యోధనుఁ డా,తని మీరు వధింపమికి గతంబేమి యొకో, విసఁదగునేనిం జెపుఁడా, యనుటయు నిట్లనియె భీష్ముఁ డతనికి నెమ్మిన్. ఉద్యో. 4-271

3. ఊహను దెలుపును.

ఉ. ...మీ,యన్న పరాక్రమంబు వలదన్ననొకో దయమాలి తక్కటా. విరా. 2-166

క. ....కర్ణుఁడు పుట్టె సూర్యమం,డలమొకొ భూతలంబున బెడం గయి దీప్తి సహస్రకంబుతో, వెలిఁగెడు నా నిజద్యుతి సవిస్తర లీల వెలుఁగుచుండఁగన్. ఆది, 5-29

4. వ్యతిరేకార్థము నిచ్చును.

చ. మనుజులు సేయ నెవ్వరు సమస్తమునీశ్వరు నాజ్ఞ తెల్లెడు, న్వినుము కుఠారపాణి ధరణీరుహముల్ నఱకంగఁ దాప మొ ,దునొకో కుఠారమున్. (బందునొకో = బందదు) శాంతి. 1-277

చ. ...నీవు సమాధిఁ బ్రాణరోధనము మనోలయంబు సుకృతంబు
లుగా నొనరించి వెండి యో,గనిరతిఁ బొందెద తెలుఁగు గాదొకో
హింస. (కాదొకో = అవును) అశ్వ. 2-73

6. నిశ్చయార్థమును దెలుపును.

వ. కొడుకులు జయింప నోపుదురొకో యను వా సంజయు దిక్కు
మొగంబు సేసి. ఉద్యో. 1-256

ఒకొండు సర్వ.

ఒకటి.

వ. నాలుగువేలున్ మున్నూట పదునొకండు శ్లోకములు గలిగి.
ఆది. 1-36

చ. ... మీర లీ, యొనరిన సైన్యమున్ పదునొకొంటికి,
ఉద్యో. 4-140

ఒకొఁడు సర్వ.

ఒకఁడు.

క. ఉరు శస్త్రవృష్టి నాపైఁ గురిసినఁ దక్షణమె యొక్కొకొని పయి
నేమున్, వరుసఁ బదినేసి బాణము, లరుదుగ నేసితి మహాభయంకర
భంగిన్, అర. 4-61

ఒక్క ఒక

1. ఏకార్థము, ఒక్కదానిని దెల్పును.

వ. నియమాచరణంబునకు నొక్క సంవత్సరంబు గొలంత గలదు.
విరా. 1-318

2. ఒకానొక, నిర్దేశము లేమిని దెలుపును.

సీ. అగ్గోవు లవ్విభు నధ్వరంబునకుఁ బో,నుత్సహించుటయు నందొక్క
గోవు, మనము సుమిత్రుని ధనమాతఁ దమమతి, సేయక యెట్లు
వోఁజెల్లు ననిన. అను. 8-74

3. ఏకీభూతము.

ఉ. ఉడుగక యొండొరుం బిలిచి యొక్క బలంబున దేవదానవుల్,
వడిగొని వార్ధి నిట్లు దరువం దరువన్ విష ముద్భవిల్లి. ఆది. 2-15

4. అన్యము, వేఱైనది.

వ. మఱియు నొక్కమహనీయ కార్ముకంబు గొని కర్ణుండు గడంగె. కర్ణ. 1-129

5. అనిర్వాచ్యమైనది, చెప్పుటకు వీలుగానిది.

వ. ఏమయ్యెడ నేకాంతిక జనులకింత నంత నున్నంత భానుసహస్ర ప్రభా భాసితంబగు నొక్క దివ్య తేజోరూపంబు వారి యగ్రభాగంబునం దోఁచిన. శాంతి. 6-367

6. వాక్యాలంకారము.

సీ. అజుఁ డధ్వరంబు సేయంగఁ దలంచి ఋత్విజు నాత్మసదృశుని వెద[కి]
యెందుఁ, గానక తానొక్క గర్భంబు ధరియించి వెయ్యేండ్లకును
దుమ్మి వెలువరించె. శాంతి. 6-116

(ఇది పెట్టు,మాటు, మొగిన్, ఉమ్మడి మున్నగు శబ్దములకు ముందు చేరి యుగపదర్థకమగును. ఆయాపదముల నాయాతావులఁ జూచునది.)

## ఒక్కమహాద్విజుండు

ఒక గొప్ప బ్రాహ్మణుడు.

చూ. దండక విషయము. అర 5-10

## ఒక్కంత(లు) (ఒక్క+అంత)

1. సమానము, ఒకేరీతి.

క. సంతోషామృత సుఖిత, స్వాంతుండగువేని నట్టివాఁడు గృహంబుం,
గాంతార దేశమును నొ,క్కంతగ నిశ్చింత వృత్తి నతోఁడ్యుఁ
డగున్. శాంతి. 5-867

క. విని పృథివియును సరస్వతి,యును గోవును దానవిధికి నొక్కంత
లుగా, వినియుండుదు వీనిం బో,లిన దాతవ్యములు నొండు లేవని
యిందున్. అను. 2-411

2. కొంచెము.

ఉ. స్వాంతము కాపుగర్వ ఘనసంతమసాంధముగాఁగ శంక యొ,
క్కంతయులేక కీచకుఁ డహంకృతి ముంగలిగాఁగ మందపా,ల్యం

తర భూమిఁ జొచ్చి. విరా, 2-331

3. ఒక మొత్తము.

వ. శిశుపాలు సేనాపతి సునీథుం డను వాఁ డతిరోష పరుషవచనం బగుచు స్వాంత క్షత్రియులనెల్ల నొక్కంటం జేర్చికొని శిశుపాలు ననుమతంబున యుద్ధ సన్నద్ధుండయి యున్న సమయంబున. సభా. 2-82

**ఒక్కఁడు; ఒక్కండు** సర్వ. (√ఒక్క. చూ. ఒండు - అమహదర్థమున ఔపవిభక్తికము) బహు. ఒక్కండ్రు

1. ఒకటి.

వ. మఱియు నొక్కఁ డాకర్ణింపుము భువనప్రవర్తకుం డయిన కృష్ణుండు సారథ్యంబు సేయుట నప్పార్థు పరాక్రమం బసాధ్యం బై యుండు. కర్ణ. 1-237

వ. గురువాస గృహవాస వనవాస పరులగు బ్రాహ్మణుల కెల్లను శ్రేయః ప్రాప్తికిం దెరు వొక్కండ. అశ్వ. 2-96

సీ. ...నీ నాలుక యొక్కఁడయ్యు. ఆ. వ్రయ్యవలయు నూఱు వ్రయ్యలుగాఁగ, నట్లైనఁగాని చాల నతనిఁ బొగడ సభా. 2-41

వ. ఎదిరిన రూపంబులం బెక్కింటి నొక్క బాణంబునం బెక్కు బాణంబుల నొక్కంటి గూర్చి కేలి సలుపుచు భీష్మ. 2-187

మ. గురుపుత్త్రుండు గడంగి...శరమొక్కంటన మూర్ఛవుచ్చి వెస ధృష్టద్యుమ్ను ఫాలంబు నిష్ఠుర నారాచహతంబు సేయుటయు వాఁడుం దేరిపై సోలినన్. ద్రోణ. 5-397

వ. పాండవ పుత్త్రులైన పదునొక్కండ్ర యందును వంశకరుండైన యభిమన్యునకు విరాటపుత్త్రియయిన యుత్తరకుం బరిక్షిత్తుండు పుట్టె. ఆది. 4-115

2 అభిన్నము. ఏకీభూతము. సమానము.

చ. ఆహవభరులైన భోజులును నంధక వీరులు నొక్కఁడై దెసల్ చెవుడు పడంగ వార్చి యతిశీఘ్రగతి సాత్యకిఁ జుట్టుముట్టిరి. మౌస. 1-60

క. మనో బుద్ధులు వా,రరయఁగ నొక్కండ యందు రదియట్లుండెన్.
అను. 4-174

సీ. వీరుల పలుకులు వేల్పుల మతము నొక్కండ. ఆది. 7-254

3. ఒకానొకఁడు. నిర్దేశము లేమిని దెలుపును.

క. ఆపదఁబడి యొక్కఁడు స,ద్వ్యాపారముగాఁగఁ బూచి దాని నడవు. సౌప్తి. 1-46

ఆ. ఎట్టిఁగిదైన వెఱఁగ కేనియు నొక్కని, భంగపెట్టి విడప సంగతుఁ డుగఁ, జేసికొనుట మేలె, శాంతి. 3-78

4. ఒంటరివాఁడు, ఏకాకి.

చ. ...ఒ,క్కండన యెట్లొకోయనక కార్యముముట్టినచోట నేలినా, తఁడొక చాయ చూపినను దత్పరతం బనిసేయు టొప్పగున్.
విరా. 1-184; విరా. 2-270

5. ఒక పురుషుఁడు.

క. ఈ వెలవులఁ దోచును హరి,దా నొక్కఁడ యింద్రియ ప్రతతి కందండు. శాంతి. 6-502

తే. ఒక్కఁడై వెలిఁగెడు పురుషోత్తమాభిధాన వాచ్య విభ్రమ వాత్స ల్యకల్య. శాంతి. 2-10

సీ. శాస్త్ర యొక్కండ తత్పాసనంబునన యేఁ, బరియింతు నొక్కండ.
అశ్వ. 2-558

ఒక్కట ఒకట అవ్య. ద్రు. (√ఒక్క)

1. ఒకే పర్యాయము, ఒక్కమాఱు

సీ. కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్లుఱికెడు, వాలుగు సోగల వేలుదెంచి.
విరా. 2-83

తే. పాండుసుతులు శిఖండియుఁ బండశక్తిఁ మొఱయ నొక్కటఁ దైఁ బడ్డ. భీష్మ. 1-58

సీ. ద్రోణుండు మఱి పృషతున కుద్భవించిన ద్రుపదుండు నొక్కటఁ దొడఁగి యిష్ట. సఖులయి వేదముల్ సదివి. ఆది. 7-5

2. కూడ, కలిసి.

వ. ...దాస తప్పకతారును పాంచాలియు నొక్కటఁ బంౘ్రెండేడ్లు వనంబున వసియించి. విరా. 4-188

వ మీరును వారి జూడ వచ్చెదరేని యొక్కట బోదమురండు.
ఆది. 7-160; ఆది. 8-12

3. ఏకత్ర, ఒకచోట.

తే. కతఁగి భతింప నొక్కటఁ గలసియాడు,చున్న యెలుకల పిల్లుల యొండు సహజ, వైరివర్గంబులయు సహవాస మపుడు.
ఆది. 4-28

ఒక్కటి ఒకటి సర్వ. ఏ. (√ఒక్క - చూ. ఒండు)

1. ఏక సంఖ్యావాచకము.

వ. ...ఒక్కనాఁడు పెక్కుమృగంబుల వెగచి యొక్కటి నేనియు నేయం గానక. ఆది. 5-48

వ. ...కాదేని మఱియు నెండేనియు నొక్కటియగునట్లుగాఁ దనతోడఁ బుట్టువులేవురకు నిలువ తావులయి దిచ్చిన సర్వశాంతియగు
ఉద్యో. 1-377; విరా. 2-200

2. అభిన్నము. ఏకీభూతము,

క. దేవాసురవరు లొక్కటి,యై వచ్చినఁ జిక్కువఱచు నాహవమున నా, దేవవ్రతుఁడు. భీష్మ. 1-51

వ. ...మీరును నారును నొక్కటియైయున్న మీదిక్కు దేవతలకుం దేఱి చూడరాదనిన. ఉద్యో. 2-49

3. ఒకానొక్కటి.

సీ. గ్రద్ద యొక్కటి వచ్చి. శాంతి. 3-366

4. ఒక సంగతి, ఒక విషయము.

వ. నాకు నొక్కటి వినుటకుం గుతూహలం బెప్పుడుం గల్గియుండు.
అను. 2-291

ఒక్కటియగు అ. క్రి.

ఏకమగు, ఐకమత్యమును బొందు.

వ. శాంతి ప్రకారంబునం గార్యంబు వడసి యొక్కటియై మకుట
యొడఁ గూర్చి రమ్మని ఉద్యో. 1-272; ఉద్యో 2-49

**ఒక్కత** ఒక్కతె. సర్వ.

ఒక స్త్రీ.

వ. సుర గరుడ ఖచర విద్యాధర కిన్నర యక్ష సిద్ధ తరుణులలో
నీవరయఁగ నొక్కతవగు దివ్యరికిం జముదేరఁ గతము లొంకక
చెపుమా, విరా 1-314

**ఒక్కతి** ఒక్కతె సర్వ.

ఒక స్త్రీ.

ఆ. ...ఏకాంతమునఁ బత్ని, యొక్కతియును గొల్వ నూరకుండె.
ఉద్యో. 4-381

**ఒక్కతె** సర్వ. ఒక్కత

ఒక స్త్రీ.

క. తరుణులఁ బలాతపతులఁ, జరణంబులు లేనివారి శాస్త్రేయుల
నల్పర నొక్కతె యెట లోడ్కొని, యరుగంగా నేర్చు జరిత
యాపద గడవన్. ఆది. 8-318

**ఒక్కనాఁడు**

చూ. ఒకనాఁడు.

**ఒక్కపెట్టు**

చూ. ఒకపెట్టు.

**ఒక్కమాటు** వి.

ఒకప్పుడును, ఎల్లప్పుడు.

ఆ. ధీరుఁడై యభేద దృష్టియ పాటించుచుండునట్టి పురుషు నొక్క
మాటు, విధువ దర్శకంబు విభవంబు భాద్రున బోధలక్ష్మి పెంపు
భూపవర్య. శాంతి. 5-583

**ఒక్కమెయి; ఒక్కమై**

1. ఒక విధము.

ఉ. ఇచ్చ్వదలంచి యొక్క మెయి నిత్తఱిఁ బొందగు శేత యందగున్
(ఒక్క మెయిన్ = ఏదియో ఒక్కవిధముగా) ఢశా. 4-234

2. ఒకేసారి, హఠాత్తుగా.

ఉ. చిత్రము లుల్లసిల్ల నల సింహకిశోరము లొక్కమై మదోన్మత్త
గజావళిం బొదవు మాడ్కి నరాతిబలంబు ముట్టి. ఉద్యో. 2-140

ఒక్కమొగము వి.

ఏకీభూతము, కలసికట్టు.

వ. అందఱు నొక్క మొగంబై త్రోచి నడచిన సవ్యసాచి నొక్కరునిన
కాదు పాండవుల నెల్ల నొక్కత్తున వైచికొన నోపుదురు.
ఉద్యో. 2-222

ఒక్కమొగి

చూ. ఒక మొగి.

ఒక్కయుమ్మడి; ఒక్కుమ్మడి వి.

ఏకకాలము, ఒకేసారి, ఒక్క మొగి (యుగపదర్థకము.)

చ. గగన తలంబు నెత్తురులు గండలు నెమ్ములు నొక్క యుమ్మడిన్.
మొగిళులు లేకయుం గురిసె. ద్రోణ. 1-182; ద్రోణ. 2-92

వ ఇవ్విధంబున విరాటుండు దానును సేనయుం జేయంగల వారును
బరవసంబు సేసి యొక్కుమ్మడి నడరుటయు. ఫెశా. 3-182

ఒక్కరు సర్వ.

('ఒక్కడు'-నకు మహన్మహాత్యర్థక ఏకవచన రూపాంతరము. బహు
వచనమున నిందుఁ బ్రయోగములు గానరావు.)

ఒక్కఁడు.

చ. ...కుంభజుఁడు కాలుని నొక్కరుఁ బంచలాత్ము వెం,గలిఁ గడు
పెద్దఁ జేయుచుఁ బొగడ్తకుఁ బొచ్చె. ద్రోణ. 2-45

క. ...మాయం దొక్కరు నభీష్టమతి వరియింప, దోయజముఖఁ
బ్రార్థింపుము. అర. 2-45

తే. మేలుసేసిన రొక్కరిమెచ్చి వారి, కోర్కి దీర్చుట పెద్దల గుణమ

తాడె. ఉద్యో. 1-109

**ఒక్కరుఁడు** సర్వ. (బహు. ఒక్కళులు, ఒక్కళ్లు - ఇవి మహ త్త్వర్థకములు గూడ నగును.)

చూ ఒకరుఁడు.

1. ఒక్క పురుషుఁడు.

చ. విరటుఁడు చూచుచుండ నను వేపురముందట నట్లు ద్రోవ నొ, క్కరుఁడును గాదు గూడ దనఁగల్గెనె పోటరులైన భర్త లేవురు గలరంటి, విరా. 2-257; విరా. 2-5

క. కడవఁగ నొకళ్లు పసరము, నడచిన నొక్కళులు బెయ్య నడువ వల యునే. ఉద్యో. 3-91

2. ఏకాకి, ఒంటరి.

మ. ...ఒక్కరుఁడున్ గోవులలోనఁ జొచ్చు వలుసింగం బొక్కొనా నట్లు నొచ్చి రయంబార ననేకవీరశిరముల్ చెండాడె మద్దండుఁడై (చూ. ఒక్కొక్కరుఁడు) ఉద్యో. 2-188

**ఒక్కర్తు** సర్వ. ఒక్కతె

తే. బాలనొక్కర్తు నిక్కాన పాలుసేసి, నిష్ఠురుండనై యేనెట్లు నేర్తుఁ బోవ. అర. 2-79; అర. 3-266

**ఒక్కరూపు** వి.

1. సమానము,

క. వారలును వీరలును నా, కారయఁగా నొక్క రూపరైనను గార్యం, బీరెఱిఁగింప వలయునని, కౌరవపతి నన్ను నడిగెఁగాన నతనికిన్. విరా. 3-100

క. సరసాన్నముఁ బిణ్యాకము, సరిగాఁగ భుజింతు మృదుల శయ్యా తలమున్, ధరణియు శయనరుచికి నా, కరయంగా నొక్క రూప యసుర ప్రవరా. శాంతి. 4-69

2. ఒక్క ప్రాణి, ఒక్క వ్యక్తి.

వ. వారివారి బలంబులను మాత్స్యాదీక ప్రభృతి సైన్యంబులను

నొక్కరూపేనియుఁ ద్రిక్కుకుండ నొక్కరుండవ రెండు జాము
లలో నేలం గలిపితి. శౌ ప్తి. 1-106

**ఒక్కరొకరుఁడు**

ఒకరినొకరు-అన్యోన్యము.

ఆ. ...ఒక్కరొకరుని నొంపను, జంప, ఘాతము. కర్ణ. 1-229

**ఒక్కళులు**

చూ. ఒక్కరుఁడు.

**ఒక్కళ్లు**

చూ. ఒకొక్కక్కరుఁడు.

**ఒక్కించుక** అవ్య.

మిక్కిలి కొంచెము.

తే. చెలువ యింక నొక్కించుక సేపు నీ వనాదరంబున నెప్పటియట్ల
యున్న. విరా. 3-47

**ఒక్కిండ్లవారలు** సర్వ.

పరిజనముల యందలి గణములైనవారు. చూ. గణము.

క. విను మర్థార్జకులును గార్య నిపుణ మానసులు నాయుధాజీవులుఁ
ద్రిక్కను గల పనుల జనులుఁ గల, రనఘా యొక్కిండ్ల వార
లైన జనంబుల్. శాంతి. 3-88

**ఒక్కింత** సర్వ. ఔ. అనౌ.

చూ. ఒక యింత.

**ఒక్కింతసేసికొను**

కొంచె మూఱట గల్గించుకొను.

వ. అనిన విని సంజయుండు వెచ్చనూర్చి యిచ్చవడి మూర్ఛపోయిన
చందంబున డెందంబు మగుడం జేష్టలు దక్కియుండి కొండొక
సేపునకుఁ జిత్తం బొక్కింత సేసికొని. ఉద్యో. 2-169

**ఒక్కుమ్మడి** వి.

చూ. ఒక్క యుమ్మడి.

**ఒక్కెడ** వి. (ఒక్క + ఎడ)

1. ఒక్క సమయము.

ఉ. అక్కట మోసపోయి యడియాసలఁ జావక యున్నదాన ను,న్నొక్కెడ నే దురంత దురితోత్కట బాధలఁ బెట్టియున్న.

విరా. 2-226

2. ఒక చోటు.

తే. నీవుఁ దమ్ములు నొక్కెడ నిలిచి చూచు,చుండుఁడని పల్కుటయు

విరా. 3-205

**ఒక్కెత్తు** వి. (ఒక్క + ఎత్తు)

ఒకే పర్యాయము, ఒకేమాఱు.

వ అందఱు నొక్కమొగంబై త్రోచి నడచిన సవ్యసాచి యొక్కరునిన కాదు పాండవుల నెల్ల నొక్కెత్తున నైచికొన నోపుదురు.

ఉద్యో. 2-322

క. మన సేనల నొక్కెత్తునఁ, గొనఁదలఁచి కడంగివచ్చు గురుపుత్రుని మార్కొన ధృష్టద్యుమ్నునిఁ గా, వను శక్యమె నీకు నిచటి వారికి నధిపా.

ద్రోణ. 5-355

**ఒక్కెఱ** క్రి. విశే.

హఠాత్తుగా, ఆకస్మికముగా.

క. వెఱ చలువ నీరిలో నొ,క్కెఱగా నొక మొసలి చూడ్కికి నగోచరమై, వఱతెంచి కుంభ సంభవు, చిఱుదొడ పడిఁ బట్టుకొనియె శిష్యులు బెదరన్.

ఆది. 5-266

చ. వఱలఁగ రాముఁ డంత ననవద్యుఁడు వచ్చి బహుప్రలాపయై, యఱచుచు నున్న తల్లిని గృతాంత వశస్థితుఁడైన తండ్రి నొ,క్కెఱఁ గని తీవ్రశోక పరిఖేదహతుండయి.

అర. 3-153

**ఒకొ్క**1 ఒక

చూ. ఒక్కమొగి.

**ఒకొ్క**2; **ఒకో్క** ఒకో

1. సందేహమును దెలుపును.

సీ. కర్ణార్జునుల యందు ఘనుఁ డెవ్వఁడగు నొక్కొ, యను జనంబుల సందియంబు మాన్ప. విరా. 4-205

సీ. పరతి నన్నా జడఁ బలికిన భంగిన, నిచ్చమై నిక్కకు వచ్చునొక్కొ పొందునొక్కొ - నిక్క మొక్కొ - విడుచునొక్కొ - అనుచు నొక్కొ. విరా, 2-294

క. మా మనోరథమునకు; నీమాట విరుద్ధమయ్యె నిదియెట్లొక్కొ. విరా. 1-286

2. ఊహను దెలుపును.

అ. దివము గాని యింత భువనంబు సందిట, వట్టి రాత్రి లేని యట్టు గాఁగఁ, జేసెనొక్కొ విధి. విరా. 2-318

క. శంకర నిభుఁడగు విప్రుఁడ,యొంకర కోపాగ్ని యొక్కొ యనుచును జా తా,తంకుడయి. ఆది. 1-112

3. ప్రార్థనమును దెలుపును.

చ. ...దీః కిన్ నిష,వ్యపగతమైన జీవమది వచ్చు నుపాయము సేయ రొక్కొనా, శపము ఫలంబు నధ్యయన దానఫలంబులు నిత్తు వారికిన్. ఆది. 1—149

ఒక్కొండు ఒకఁడు (√ఒకొ్క[1])

1. ఒకటి

క. పాండవుల వలని కీడొక్కొండును లే దధిప నీదు కొడుకులు ధరణీ, మండల మంతయు ప్రమింగిరి. స్త్రీ. 1-83

ఆ. కమలభవుఁడు వారి కమరత్వ మొక్కొండు, దక్కఁ గోర్కెల్ల నక్కజముగఁ గరుణ నిచ్చె. ఆది. 8-94

2. ఒక్క, పురుషుడు.

క. పాండు నృపసుతులలో నొ,క్కొండైనను బొప్పఁ డింతకును. కర్ణ. 1-215

ఒకొ్కక; ఒకొ్కక్క (ఒక్క+ఒక) (ఒక్క+ఒక్క)

ఒకానొక.

త. దేవతలకైన నొక్కొక, చో నలయునశాదె శత్రుసూదన విధి
శా,లావాప్తికి మును దమప్ప్రధ్యానంబులడంచి యుడుగఁ బడి
యుండఁగన్. విరా. 1-53

వ. ధర్మనూనుండు...ఒక్కొక్కమాటు మధుర ప్రసంగముగా వాదిన
వెత్తంబున గెలిచిన విత్తంబులు దమ్ముల కొసంగుచుండు
(ఒక్కొక్కమాటు = అప్పుడప్పుడు అని భావము) విరా. 2-2

ఒక్కొక్కరుఁడు (బహు) ఒక్కొక్కళ్లు

ఒక్కొక్కఁడు, ఒక్కఁడొక్కఁడు.

వ. ...అయ్యష్టమ పుత్రుండు వసువులయం దొక్కొక్కళ్ళ చతుర్థా
ర్థంబులు వాల్చి సకల ధర్మమూర్తియయి పుట్టినవాఁడు.
(ప్రతివాని యొక్క అని భావము) ఆది. 4-116

ఒక్కొకొఁడు

ఒక్కొక్కఁడు, ఒక్కఁడొక్కఁడు

క. ఉరు శస్త్రవృష్టి నాపైఁ, గురిసినఁ దక్షణమె యొక్కొకొని వయి
నేమన్, వరుసఁ బదినేసి బాణము,లరుదుగ వేసితి మహాభయంకర
భంగిన్. (ప్రతివానియొక్క అని భావము) అర. 4-61

ఒక్కొట ఒకట (√ఒక్కొ)

ఏకకాలమున, ఒకేసారిగా

క. ఇట పాండవ కౌరవు లొ,క్కొట నందఱు గురునను జ్ఞగొని మృగ
యాలం,పటులై వనమున కరిగిరి. ఆది. 5-288

చ. ...ఇట్టు లొ,క్కొటఁ బడియెన్ హరార్జునుల ఘోరశరంబులు
పందిపై. అర. 1-305

ఒక్కుటి ఒకటి (ఒక్కొ[I])

ఏకము.

సీ. హరిహరబ్రహ్మ మహానుభావంబు లొక్కొటిగాఁగఁ గరఁగిన
గుటిక యనఁగ-తే-భానవి బాబు పుర్యాదిపై వెలింగె,
(ఒక్కటి అని సం.ము. ఒక్కటఅని వాదిళ్ళప్రతి) విరా. 2-141

ఒక్కొ్కమొగి

ఏక పర్యాయము-ఒక్కసారిగా.

మ. ....రారాజు సైన్యంబు లొ,క్కొమొగిం జెల్లగిలంగ జెట్టడరె
సక్రోధాంతరంగంబుతోన్. కర్ణ 2-352

ఒగి అవ్య. ద్రు.

1. క్రమముగా, వరుస ప్రకారము.

క. ఆదిత్య దైత్యదానవు, లాదిగఁగల భూతరాశి ననుసంభవమున్,
మేదినిఁ దదంశముల మ,ర్త్యోదయములు నాకుఁ జెప్ప మొగి నేర్ప
డఁగన్. ఆది. 3-58; ఉద్యో. 1-72

మధురాక్కరం తనర జనకుండు నన్నప్రదాతయును భయత్రాత,
యును ననఁగ నింతులకు మువ్వు రొగిన గురువులు. ఆది. 4-48

శ్లో. శరీరకృత్ప్రాణదాతా యస్య చాన్నాని భుంజతే,
క్రమేణై తే త్రయో ప్యుక్తాః పితరో ధర్మశాసనే.
సం. భా. ఆది. 93-28

2. పూనికతో, పట్టుదలతో.

తే. అస్త్రవిద్యలు గఱచి నాదైన యిష్ట,మొగిన తీర్పంగ నిందెవ్వఁ
డోపుననినఁ, జాయ మొగమిడి కౌరవుల్ పలుకకుండి,రేను దీర్చెద
నని పూనె నింద్రనుతుఁడు. ఆది. 5-224

3. వెంటనే, తక్షణము.

సీ. ....నాకుఁ....ఆ. గలశభవుఁ డగస్త్యుఁ డలిగి యత్యుగ్రాహి,వగు
మనియును శాప మొగిన యిచ్చె. అర. 4-119

4. చక్కఁగా, లెస్సగా.

ఆ. దార సంగ్రహంబు ధరణీశ రతిపుత్ర, ఫలము శీలవృత్తఫలము
శ్రుతము, దత్తభుక్తఫలము ధనము వేదము లగ్ని,హోత్ర ఫలము
లనియు నొగి నెఱుంగు. సభా, 1-51

5 కొన్ని యెడల వాక్యాలంకారముగా నుపయుక్తము.

క. ఘనముగ నయ్యింద్రోత్సవ, మొనరించు మహీపతులకు నొగి నా

యుర్వ్వి,ర్ధనమునగుఁ బెరుగు సంతతి, యనవరతము ధరణిఁ బ్రబలు
నభివృద్ధి యగున్. అది. 3-25

ఒచ్చెము దే. వి.

అవమానము, పరాభవము.

క. అని విదురు చెప్పినట్టిన, తుదిఁ గృష్ణుఁడు పాండుసుతులతో వేఱు
గునే, పదనే యీగికి నిచ్చిన, తెలిరి రనరె యొచ్చెమైనఁ బిమ్మట
వగరే. ఉద్యో. 3-163

శ్లో. అవమానశ్చ యత్ర స్యాత్ క్షత్రియస్య విశాంపతే,
న తత్కుర్యాత్ బుధః కార్యమితి మే నిశ్చితామతిః
సం. భా. ఉద్యో. 87-4

చ.....మానినికిం దమఁదాన కాచికో,లొదవిన దానఁజేసి సభ నొచ్చెము
దక్కనఁ బాండునందనుల్, బ్రదికిరిగాక యయ్యెడరు రాచకొమా
రుల కోర్చునట్టిదే. ఉద్యో 1-348

ఒజ్జ వి.

(ఉపాధ్యాయ శబ్దభవమని నైఘంటికులు అక్షర సామ్యము అర్థ పరి
పూర్ణతలేని 'ఉపాధ్యాయ' శబ్దము 'ఒజ్జ'కెట్లు ప్రకృతియో యొజ్జ
లకే యెఱుక.)

1. ఒజ్జ బంటిది,

సీ. ఎవ్వని చారిత్ర మొల్ల లోకములకు, నొజ్జయై వినయంబు నొఱవు
గఱవు. విరా. 2-191

2. ఉపాధ్యాయుఁడు.

తే మదమఁడింతికి నొజ్జయై మతకము లుమ, నదను నెఱిగించి వాకర
కనుచు నొకొ౯. విరా. 2-295

3. గురువు.

చ. పలుకులు వి టరే ధనువువక్షెడి వారికినెల్ల నొజ్జ ద్రోణుల విది
తుండు గుంభజుఁడు. ద్రోణ. 2-45

4. ఉపదర్శకుఁడు, ఉపద్రష్ట.

చ. వివి ధిషణుం దమర్త్యులకు విన్నను నొప్పుఁగ్రతు ప్రయోగముల్,

మనము దలిర్పఁగా నడపి మర్త్యునియాగము నొల్లఁగాఁగ జా,లనిది
నిజంబ యింక నమలాప మొనర్పక పొమ్ము వేఱ యొ,క్కని మఖ
దర్శనంబునకుఁ గై కొను మారసి నీవు వాపుడున్. ఆశ్వ. 1-41

5. ఋత్విజుఁడు.

ఆ. భక్ష్యభోజ్య లేహ్యపానీయముల మీఁద, సదములోని విప్రజనముల
మీఁద, వెగడు పడఁగఁ గాఁటి వెలపింత మొజ్జలు, తత్ప్రయోగ
విధులు దప్పి పలవ. ఆది. 2-131

**ఒజ్జతనము** వి.

ఒజ్జనము, ఉపాయత్వము, ఉపదర్శనము.

ఆ. అన్న నాకు మాన్యుఁ డాతండు నమువంగ, నాచరింతు నీదు యాగ
మునకు, నొజ్జతనము వేగ మూర్వీశ యగ్గురుఁ, గని యనుజ్ఞ వడ
యుము. ఆశ్వ 1-54

**ఒట్టిడు** దే. అ. క్రి.

శపథముచేయు, ఒట్టుపెట్టు.

వ. అందొకం డేనట్లు సేసితినేనిం బరలోకంబున విపులునిచన్న గతిం
బనుదునని శపథంబు సేసిన నమ్మాట వినుచు విపులుం డట నవం
బన మఱియు మార్గంబున నార్వురు జూదం బాడుచుండ వారైన
నొకం డట్ల యొట్టిడిన. అను. 2-210

**ఒట్టినమంట** దే. వి.

ప్రజ్వలించిన యగ్ని.

ఉ. పెట్టనికోట నీకు హరి భీముఁడు నర్జునుఁడున్ రణంబునం,దొట్టిన
మంట లా కొలఁది యోధుల సాత్యకియున్ విరాటుఁడున్.
ఉద్యో. 1-287

ఉ. అర్జునుం,డొక్కఁడ వైరిసేనలకు నొట్టిన మంట. ఉద్యో. 2-194

**ఒట్టు** దే. అ. క్రి.

ప్రజ్వలించు, మండు.

చూ. ఒట్టినమంట.

స. క్రి.

ఉంచు, పెట్టు.

ఉ. ఇట్టిది క్రూరకర్మమని యించుకకొంకక లక్కయింటఁ జిచ్చొట్టితి.
కల్కి. 2-184

వి.

శపథము, ప్రతిజ్ఞ.

వ. మార్గంబున వార్వురు జూదం బాడుచుండ వాదైన వోకం దట్ల యొట్టిడిన.
అను. 2-210

ఒడంగూడు; ఒడఁగూడు దే. అ. క్రి.

1. కలసి మెలసియుండు, స్నేహముచేయు.

క. క్షీరోదక గతిఁ బాండవ, కౌరవు లొడఁగూడి మనికి కార్యంబది నీ,వారసి నడవుము వారన,వీరనఁ గురుముఖ్య నీకు వేఱుం గలదే
ఉద్యో. 3-258

తే. అనుజతనుజులుఁ జెలులు వియ్యములు నటుగు, మాలిపోదురు నీకుఁగా మనుజనాథ, దొరకుఁ గులనాశనుండను దూఱు మేలె, పాండవులతోడ నొడఁగూడి మనుము
ఉద్యో. 3-347

సీ. తద్దయు శాంతుఁడై తక్కువ కోర్చి శత్రుని గని యొడఁగూడి మనఁగవలయు.
శాంతి. 3-38

క. ధృతరాష్ట్రి నెయ్యమున సం,తతసంగ్రీతులగుచుఁ బాండు తనయులు వినయాన్వితులు కుమార క్రీడా,ంచితులయి యొడఁగూడి ధార్తరాష్ట్రులతోడన్.
ఆది. 5-163

2. కలుగు, సిద్ధించు; లభించు, ప్రాప్తించు.

క. కడువడి నీవరుగఁగ వడ,ముడియును నీ వెనుక శీఘ్రమున నెయిదుం గ,వ్వడి కుశలియైన విజయం, బొడఁగూడును మనకు దీని కొదబడు మనఘా.
ద్రోణ. 3-297

ఉ. అట్టిద యేల చేయు ననయంబు నయం బొడఁగూడఁ బల్కి నీ,విట్టి తెఱంగు పేయుమని యేర్పడఁ జెప్పినవాని కత్తఱిం, బుట్టిన సంతసంబు ననువుం బరికించితి గాదె.
విరా. 2-278

వ. అనవుడు సంజయుండు దేవా నీ చిత్తంబున నిడి దీని నింతం గొని యాడినఁ గర్జం, బొడఁగూడునే యనిన వాసుదేవుం డిట్లనియె.
ఉద్యో. 1-345

క. ఒడఁగూడిన సామ్రాజ్యము, నడలున దిగద్రావి చనిన కళంకములు నిన్, గడుఁ బేదమనసువాఁడని, చెడ నాడుదురనిన మము నిసీ యనుటదుదే.
శాంతి. 1-117

శా. (గరుఁడుఁడు)...దుర్వారస్వైర విహారమొప్ప నమృత గ్రాహం బొడం గూడుదుం, దారావీథిఁ జనం దొడంగె మగడన్ దర్పం బెలర్పన్ వడిన్.
అను. 1-255

3. వర్తిల్లు, ఉండు.

క. వడవడియను మున్నింటిం, గడవం బెట్టంగ నోడకరణిం దగి తా, నొడఁగూడు ననిన సత్యము, గడచిన గుణ మింక నొంకు గలదే యరయన్.
ఉద్యో. 2-89

4. సమావేశమగు, ఒకచోటికిఁ జేరు.

క. అమవస గావున నేఁ డర్కమలఁజఁ గొలువఁగ మహర్షి గణములు పితృ సంఘములును బొదురు బ్రహ్మాండమునంగల వారలం దొడ గూడంగాన్.
ఆది; 5-66

ఒడఁగూరు దే. అ. క్రి.

సిద్ధించు, కలుగు, లభించు, ప్రాప్తించు.

క. పడియేడ్చినఁ గృష్ణుఁడు తగు, నుడువుల నూరార్చితన మనోరథ మిమ్మై, నొడఁగూడిన మానుషమగు; నొడలు విడిచి నిజపదంబు నొందుట కరిగెన్.
మౌస. 85 (పాఠాం)

ఒడఁగూర్పు దే. స. క్రి. (√ఒడఁగూడు) ఒడఁగూడఁజేయు

1. లభింపఁ జేయు.

క. ఆపదఁ గడవం బెట్టఁగ, నోపి శుభంబైన దాని నొడఁగూర్పను మా, కిపుట్టువునకుఁ బాండు, క్ష్మాపాలుఁడు నిమ్నఁజూపి చనియె మహాత్మా.
ఉద్యో. 3-6

క. రాజు యుధిష్ఠిరుఁడై హరి,దాజయమొడఁగూర్ప మన్న శత్రైు

న్యమునరా,రా యిట్లు సతతము సేయుమి; యీ జన్మము దుఃఖ భాజనం బగుటం జామీ. ఉద్యో. 2-286

ఉ. ....భక్తజనాభిమత ప్రదాన వి,ద్యాదయితత్వ మేర్పడ నయం బొడఁగూర్పుము. కల్కి. 1-276

2. సిద్ధపఱచు, అమర్చు,

వ. ....వాసుదేవుండు రేపకడయ వచ్చు నంతకుమున్న పురంబున నుత్సవంబు సాటుండని నిరూపించి వివిధ గంధమహిత మాల్యం బులు సంపాదింపను మణిభూషణ చిత్రాంబరంబులు సమకట్టను నరపాన్న స్వాదుపాన ద్రవ్యంబు లొడఁగూర్పను నేర్పరులగు తజ్ఞుల నియమించె. ఉద్యో. 3-155

సీ. మణిగణోజ్జ్వలమైన మన యరదంబున, జవనాశ్వములఁ బూన్చి చాపబాణఖడ్గాది సాధనోత్కర మొడఁగూర్చుము. ద్రోణ. 1-38

సీ. అఁగొని యొడఁగూర్చి యన్నంబు తినియకు వచ్చిన గురువని వాని తంగి. శాంతి. 1-64

చ. వల నధికంబుగాఁ గలుగు వైద్యులు శాస్త్రము లభ్యసించి మందుల నొడఁగూర్చ నేర్చి తమ దోషములారయు బుద్ధిగల్గి యార్తులకుఁ జికిత్స వేసెదరు. శాంతి. 1-215

3. సిద్ధింపఁజేయు, నెఱవేర్చు.

చ. ...ప్రియమువున జెప్పు డెయ్యెడ నిజాభిమతం బొడఁగూర్తు చెప్పుమా. విరా. 2-268

క. స్వాగతమే మీ యిద్దఱ, యాగమనంబునకు హేతువగు కోర్కి యను,ద్వేగంబున వెలిగింపుడు, వేగమ యొడఁగూర్తు నెల్ల విధముం దావిన్ ద్రోణ. 2-362

4. సమకూర్చు, కలిగించు.

క. ఛిడిముడిపడుచు నెదురుసనఁ గడఁగుచు పోరములు చక్కఁగాఁ గ్రోచుచు మల్లడిగొనుచు దుర్వితానం, బొదలి కొడఁగూర్చు

చుంద మగ్నలి యంతన్. విరా. 2-114

వ. శాంతి ప్రకారంబునం గార్యంబు నడపి యొక్కటియై మమత యొడఁగూర్చి రమ్ము. ఉద్యో. 1-272

ఒడంబడు; ఒడఁబడు దే. అ. క్రి.

1. అంగీకరించు, అనుమతించు, ఒప్పుకొను.

సీ. ఒడఁబడ్డయట్టిన నదరి పైకొనఁజూచి, చెన్నటి యగుట విశ్వేష్టఁ గోరయు విరా. 2-301; విరా. 4-24

క. కడువడి నీ వరుగఁగ నడఁముడియుచు నీ వెనుక శీఘ్రమున వెయి దుం, గవ్వడి కుశలిత్రైన విజయం, గొడఁగూడును మనకు దీని కొడఁబడు మనఘా ద్రోణ. 3-297

క. ...మేము వెలిగ నట వో, నొడఁబడనని పలికె బ్రాహ్మణోత్తముఁ డధిపా. శాంతి. 4-189; శాంతి. 3-167

చ. ఎడవక యర్ఘ్యమచ్యుతున కిచ్చుతి మిచ్చిన దీనికిం దొడంబడమని దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై, నిడియెద నంచుఁ దాఁ జరణమెత్తె సభన్ సహదేవుఁడు. సభా. 2-80; సభా. 2-9

2. సంతోషించు.

మాలిని: తమ్ములుఁ దానును ధర్మతనూజుఁడు ... అమ్మునినాథ వరేణ్యునకున్ వినయమ్మున మ్రొక్కి సమున్నత పీఠమ్మున నుంచి యథావిధి పూజ లొడంబడఁజేసి... ఆది. 8-91

3. మైత్రి సేయు.

చ. కడుఁ జనువాఁడునై పురుషకారియు దక్షుఁడునైన మంత్రి పెం, పడరఁగ రాజపుత్రుల మహాధనవంతులఁజేసి వారితో, నొడఁబడి పక్షమేర్పడఁగ నుండఁడుగా. సభా. 1-31

(మైత్రేయుఁడు దుర్యోధనునితో)

వ. వారికి వాసుదేవ ధృష్టద్యుమ్నులు సంబంధ సహాయులు జరామరణవంతులైన మనుజులు వారిం జెనకి యెట్లు జీవింతురు నీవు వారితో నొడంబడియుండు మిది కార్యంబు. అర. 1-103

స. క్రి.

సహించు, ఓర్చు.

ఉ. అక్కట మందభాగ్యునకు నట్టి తనూభవ రత్నమెవ్విధిన్, దక్క విధాత నిర్దయుఁ డొడంబడునే కడుమేలి వస్తువుల్, పెం గ దినంబు లుగ్గి. ద్రోణ 2-240

ఒడంబఱుచు; ఒడఁబఱుచు దే. స. క్రి. (√ఒడఁబడు) ఒడఁబడఁ జేయు

ఒప్పించు, ఆమోదింపఁజేయు.

వ. అమ్మొఱకుల నెమ్మొగయి నయినను.

క. ఒడఁబఱచి మాకు వారికిఁ, బడమి సగము గాఁగఁజేసి పొందు పొసఁగి యుం,డెడు నట్టి తెఱఁగు సేయుట, కడుమేలది గౌరవము సుఖంబును జేయున్. ఉద్యో. 3-77, 78

క. అనుజుం దతనికి నను వెమ, పొనరిన పంవర్తు భక్తి నొడఁబఱచి తగం, గొనివచ్చితి మత్క్రతుయాజన మీ యోగీశ్వరుండ చాలం జేయన్. అశ్వ. 1-76

ఒడంబఱుచు; ఒడఁబఱుచు దే. స. క్రి. (√ఒడఁబడు) ఒడఁబడఁ జేయు

ఒప్పించు, ఆమోదింపఁజేయు.

తే. వారికిఁ గర్తవ్యమగు పని నీకుఁ జేయఁ,దగవు గావున నెల్లవిధములఁ బూని, పాండవార్థంబు ధృతరాష్ట్రు పాలి కరిగి, నేర్పు వాటించి కార్యంబు దీర్పవలయు.

వ. అని చెప్పి యొడంబఱచి యతనితో మఱియు నిట్లనియె ఉద్యో. 1-54, 55

క. ఒడఁబఱిచి మాకు వారికిఁ, బడమి సగము గాఁగఁజేసి పొంది పొసఁగియుం,డెడు నట్టి తెఱఁగు సేయుట, కడుమేలది గౌరవము సుఖంబును జేయున్. ఉద్యో. 3-78

వ. ...దుష్యంతుండు గాంధర్వ వివాహ స్వరూపంబు చెప్పి శకుంతల నొడంబఱిచిన. ఆది. 4-58

("ఒడఁబఱచు" - "ఒడఁబఱుచు" అను రెండు రూపములు భారతమునందుఁ గనఁబడుచున్నవి. సూ. అ. ని. వారు "ఒడఁబఱుచు" ఈయలేదు, ముద్రిత ప్రతులయందు ఒడఁబఱచు ఒడఁబఱుచు - అను పదములు విచక్షణ లేకుండ నుపయోగింపఁబడినవి. కొన్నిట 'ఒడఁబఱుచు' ఉన్న తావుల 'ఒడఁబఱచు' కనుపట్టుచున్నవి)

**ఒడఁబాటు** దే. వి. (√ఒడఁబడు)

1. సమ్మతి, అంగీకారము.

క. అనుచు నొడఁబాటు లేకున్నను నయ్యుత్తరుని నొగల నడుకొన నిడి తానును రథమెక్కి రథికుఁడయి, చనియె నరుఁడు శమ్మివేర సమ్మదలీలన్. విరా. 4-84

వ. ...అక్కుంతి సంభవుండును వసిష్ఠుండును శ్రేష్ఠులగుట రాజుల కొడఁబాటు గాదో కదే యనినమం బలుకకున్న యన్నరపతి తోడం బవమానుండు మఱియు నిట్లనియె. అను. 5-346

2. ఒప్పుదల, ఒడంబడిక.

మ. జననీ నీవమృతంబు దెమ్మనిన యాసత్సూక్తి వాటించి యేఁ, జని నానావిధ కర్మకర్మఠుఁడనై సాధించి వేతెచ్చితిన్, విను నా నీ యొడఁబాటు సెల్లజనులన్ విన్పించితిం దెల్లగా, వినతం దోడ్కొని పోయెదన్ మనమునన్ విభ్రాంతి లేకుండుమీ. అను. 1-268

3. సంధి.

ఆ. మేలు గాక నీకుఁబోలి నట్లయిన నం, దరిగి యేము వారు నర్థిఁ బొంది,యుండు నట్లుగాఁగఁ నొడఁబాటు గావింపు, మెల్లభంగి మనకు నిదియ లెస్స. ఉద్యో. 3-33

క. అనినను వెండియు నొడఁబాటునకుఁ దొరని దానికిం గొడుకు తోడఁ గడుం, గినిసి ధరణీశ్వరుం డిట్లనుఁ గొలువునమున్న వార లందఱు వినఁగన్. ఉద్యో. 2-283

**ఒడమి** దే. వి.

ధనము, సొమ్ము, సంపత్తు.

ఆ. ఒడమి లేనివాఁడ నడపినఁగను నవాంష్ట్రి వినమి దాని నూఁద
వలదె. ('ఒడమి' - అనియు మూ. ఆ. ని.) శాంతి. 1-49

**ఒడయఁడు** దే. వి.

1. ప్రభువు, రాజు.

తే. కేవలనరతను కొడయని కేయవచ్చు, వాసుదేవుని మనమని వ్రజ
దేవు. మాన. 198

2. అధిపతి, ఆజ్ఞాపకుఁడు.

సీ. నీవు రాజవుగాక నీకేను రాజనే, గురుని మహారాజుఁ గురువ
రేణ్య, ఎటుసేయుమని పంప నే వొడయండనే. అశ్వ. 1-84

తే. ఇవ్విధంబున నభిషేక మెలమిఁజేసి, పరమభక్తి నక్షౌహిణీపతులఁ
జూపి, వీరికిని సైన్యములకును మీఁద యొడయ, లనుచుఁ బట్టంబు
గట్టె శంతనుతనూజు. (ఒడయఁడు=సేనాధిపతి) ఉద్యో 4-159

3. కర్త.

తే. ...జగత్త్రాణుఁ డొడలు, మనుపఁ జెఱుపంగ నొడయండు సమట
మగుడ, నరుగుదెంచుట వింతగా దతని కెందు. ద్రోణ. 2-176

4. అర్హుఁడు, యుక్తుఁడు, తగినవాఁడు.

ఆ. అందు నెలకొల్ల, లున్ననరుఁడు ముక్తి కొడయ డల్ల్రడు.
అను. 2-83

సీ. ...నీవు దక్కఁగ వారు హితముసెప్ప, నొడయఁ డెవ్వఁడు భవ
దుపదిష్ట పథమున, నిష్టమై నడచెద. అశ్వ. 1-80

తే. ధర్మజుఁడు మాకుఁ బ్రభుఁడె యాధర్మతనయు, నాజ్ఞ నేమేల
మొనరింతు మనిమిషేంద్రుఁ డొక్కరుఁడ మమ్ము శాసింప
నొడయఁ డన్య, లెందు నెవ్వరైనను భయమేమి మాకు.

(శాసింపనొడయఁడు - 'శాస్తా' అని మూలము)

**ఒడయుఁడు; ఒడయుండు** దే. వి. ఒడయఁడు

రాజు, ప్రభువు.

వ. వికృతవేషులగు పురుషు లిరువురు దమలో వివాదంబు సేయుచు

వచ్చి యవ్విభుండు మరల శాసింప నొడయతండు పొమ్మనుచు
విశ్వాకు ముందఱ నిలిచిరి. శాంతి. 4-154

శ్లో. ఇహాస్తి నౌ వివాదోఽయ మితయమ్ రాజాఽనుశాసకః
సం. భా. శాంతి. 198-85

ఉ. ఐనను మత్స్యదేశమున యాజ్ఞికతం బొడయండు గాన వా,శినర
నాథు దూఱఁదగు. విరా. 2-148; కర్ణ. 2-109

2. స్వామి, యజమానుఁడు.

ఆ. ...గృహ,యుక్తుఁ డోషధులకు నొడయుఁదగుట. శాంతి. 5-312
(గృహయుక్తుఁడు = గృహస్థుఁడు)

3. ఆజ్ఞాపించువాఁడు, శాసించువాఁడు.

ఆ. ధాత నిన్ను నేమి ధర్మంబు నడవుట, కైస్సృజించె దాని నాచరించి
యుండు నీవు నీకయొడయుండవే, ధాతృచోదిత ప్రవర్తనుఁడవు
గాక. శాంతి. 1-209

వ. ఉత్తమకీర్తిపతు లనేకు లీ కయ్యంబున మృతులైరి నిజప్రాణం
బునకు నొక్కరుఁడు నొడయండు లేక తక్కె. శాంతి. 5-201

4. కర్త.

తే. ...జగత్ప్రాణుఁ డొడలు మనుపఁ జెలుపంగ నొడయుండు సమట
మగుడ, నరుగు దెంచుట వింతగా దతని కెందు. శాంతి. 5-214

(ఈ పద్యము ద్రోణ. 2-176 గాఁ గూడఁ గలదు. అక్కడ 'ఒడ
యండు' అని యున్నది.)

తే. ...విను గ్రహచారంబు హేతువులుగ, నశుభములు శుభములు నరుఁ
డాచరించు, గ్రహము నేయించునే తాన కానిచేత, కొడయుఁ
డతు గాన ఫలములు గుడవ వలయు. అను. 5-129

5. హక్కు గలవాఁడు, అధికారి.

సీ. బ్రాహ్మణు నర్థంబు పదిపాళ్లుగాఁజేయ నాలుగు బ్రాహ్మణి నంద
నుండు, క్షత్రియాత్మజుఁడు భాగములు మూఁడును వైశ్యతన
యుండు రెండు శుద్రాతనూజుఁడొకపాలు గొనుటకు నొడయులు.
అను. 2-285; అను. 5-285

**ఒడయురాలు** దే. విశే. (√ఒడయుఁడు)

స్వామిని, యజమానురాలు.

సీ. ...తల్లిదండ్రులును బాంధవ జనులును, గారు నిన్నిఁగిఁకఁ గర్తలు
వినుము నీవ యొడయురాలవు. అర. 7-337

**ఒడలు** దే. వి. బొ. బహు. ఒడళులు, ఒడళ్లు

దేహము.

క. నా యున్నదాము దలఁపవ,యీ యొడ లిచిర యిట్టి యేవపుఁ
జందం, బోయన్న మదన వికృతిం, జేయునమట యెంతయును
నిషిద్ధముగాదే. విరా. 2-49

తే. సగము చచ్చిన యొడళులు జలచరములు, రక్తపూరంబు దో
యంబు ప్రచుర మాంస, పటలి పంకంబుగాఁగల బహునదీ ప్రవా
హములు వాఱె సంగరావని నృపాల. భీష్మ. 2-185

వ. ప్రొద్దెక్కిన నెండ కాఁకను రేయింటి యలజడియు నప్పటి యాఁక
లియు నొడళ్లు డిల్లపడం జేసినను మొగంబులు వెడంగు పఱిపినను
బోలివోని పౌరుషంబుల నయ్యిరువాగునుం గడంగి కలయన్ బెరసి
పెనంగె. ద్రోణ. 5-286

**ఒడి** దే. వి.

ఒడిపైఁ గట్టుకొను బట్ట, వస్త్రపుటి.

ఉ. వెట్టన యిట్టి యల్కమది నిల్పరి రక్కెన కాల్మిఁ జిచ్చొదిం,
గట్టిన యట్లు పెద్దయును గాలము. ఉద్యో. 3-118

(ఒడి = తొడ పై భాగము, పొత్తికడుపు పై భాగము)

**ఒడికము** దే. విశే.

1. మనోహరము, రుచికరము, కమ్మనైనది.

ఉ. ...నన్మిఁగఁగ బావపీని నొకనిం బిరిఁ గానని యట్లుగాఁగ మేన్,
గాఱియ పెట్టయైన నొడికంబుగ వండుదు పెల్లగూరలున్.
విరా. 1-77

2. సుఖకరము, హాయి గొల్పునది.

చ. కుడిచిన పిమ్మటం గుసుమ కోమలి విస్తృత పంస్తరంబుగా, నొడి

కవు సెజ్జ వేసి ప్రియుఁ డొయ్యన యందు శయింప. అర. 5-11

**ఒడియు** దే. స. క్రి.

1. హఠాత్తుగాఁ బట్టుకొను.

సీ. ఘోరగృధ్రము సుకుమార నాగాంగనఁ బటుగతి నొడియంగఁ బాఱుకరణి. విరా. 2-128

2. ఒడుపు వేసి పట్టుకొను, తటిమి పట్టుకొను.

క. ఎఱిఁగి పిలుచచిన వెనఁ దై కుఱుకుదు పాఱునము గాకి నొడిసిన భంగిన్, వెలుచలవం బొదువుదు. విరా. 2-281

వ. కర్ణుండు శక్తిపైఁ బ మలంగి వెరవున నొడిసికొని దానిన యవ్వడ ముడి యతనిపై వైచిన.

(ఒడిసికొని = ఒడుపు వేసి పట్టుకొని – కొను స్వార్థము)

**ఒదుచు** దే. స. క్రి.

1. ఓడించు, జయించు, గెలుచు.

ఆ. అమరులకు నజేయులగు కాలకేయుల, నొక్కరుండ కాదె యొడి చెఁ గర్ణ. విరా. 4–209; కర్ణ. 2-24

చ. ...పన్నిదము గెల్చిన శత్రువ వేను మాటమై నొడిచితి. అను. 1-266

గీ. మదముఁ గామంబుఁ గ్రోధంబు మత్సరంబు, లోభమును మోహ మును నములోని సహజ, వైరివర్గంబు నొడిచినవాఁడ యొడుచు, నక్రమంబున వెలుపలి యహిత తతుల. అది. 3-206

క. కడు నధికుతోడఁ దొడరినఁ. బొడిచిన నొడిచినను బరఁషు పురుష గుణం బేర్పడుఁగాక హీను నొడుచుట, కడిఁదియె పౌరుషము దానఁ గలుగునె చెపుమా. సభా. 1-123; అది. 8-256

2. అడఁచు, నశింపఁజేయు.

సీ. ...పుణ్య,పాప బంధంబుల నోపి బంధింపంగఁ బడక మనోవృత్తి నొడిచి. అది. 5-60

3. వధించు, చంపు.

తే. అతిథుల కెల్లఁ దలదంట్రి యట్టివాఁడ, యసురవిభుఁడు ఘటోత్క-

చుం డాహితింబు, కొడుకు నాలయా ఖండంబున నొడుచుఁ బగలు,
నతనికడ దానవానీక మగ్గలంబు. ఉద్యో. 4-268

4. బలాత్కారముగా గ్రహించు, అపహరించు.

తే. నా తనూజులు దుర్బుద్ధులై తెఱంగు, నీవుఁ దలఁపవ యాశక్తి
నీరజాతుఁ దొడిచి కొనియెను మొఱకు చేయున్న తియ్యపండు
వెస నాఁచికొనిన తెర్పరియుఁబోలె. ద్రోణ. 5-248

సీ. గాండీవ మాదిగాఁగల యాయుధావలు, లక్కవలయిన నవ్వు
డొడిచి కొనఁగ, మఱచిన వాఁడయ్యె మందాత్ముఁ డాధార్తి
రాష్ట్రుఁడు గాంధార రాజతనయు, వచనముల్ విని యక్షవతి
నెపంబున వానిఁ గష్టుఁడై కొన సమకట్టి మునల, ముగిడింపఁగా
దుష్టమతిఁ జేసి విదురుఁ బుత్తెంచె. అర. 1-55

5. గెంటు, పూనిత్రోయు, పడఁద్రోయు.

వ. ...మల్లయుద్ధ సన్నద్ధులై కిట్టుచుం బట్టుచుఁ దాయుచు ద్రేయుచు
నొడుచుచుం గొడుచుచు మఱియు ననేక ప్రకారంబుల వీరత్వం
బును విశారదత్వంబు సేనలకు వెఱఁగు పుట్టింపం బోరాడిరి.
ద్రోణ. 3-268

6. కలిగించు, ప్రసరింపఁజేయు.

సీ. సమర విలాసంబు చెమట నొప్పులకుండ హేతిదీధితులు కేయెండ
నొడుచు. భీష్మ. 1-119

ఒడుపు దే. వి. (√ఒడయు)

పట్టుకొనుట యందలి యనుకూలస్థితి.

వ. ఒడుపు దప్పిన మహానాగంబునుం బోలె నిట్టూర్పు నిగుడ నిట్టలం
బగు కోపంబు పెల్లున మల్లడి గొనుచుండె. విరా. 2-181

ఒడ్డగెడవు దే. విశే.

ఒక ప్రక్క కింది కొఱగి మఱియొక ప్రక్క పైకి లేచినది, తలక్రిందైనది, విపర్యస్తము.

ఆ. పుడమి యెల్ల నొడ్డగెడవయి గలవాలి,యుతముగాఁ గదంగి
యుగ్రమృత్యు, ముఖము మొరఁగఁ దివురు మూర్ఖత మాన్పుట,

యధికమైన పుణ్య మనఘచరిత. ఉద్యో. 3-288

శ్లో. పర్యస్తాం పృథివీం సర్వాం పాశ్వాం పరశుకుంజరామ్.

ఆ. కెడసె హయములొడ్డ గెడవయ్యె రథములు, చాపకట్టు వడియె సామజములు, భీష్మ. 2-165; భీష్మ. 3-319

వ. కొండొక క్రుంగిన చక్రంబు కుందమునుంగం దిగఁబడిన నొడ్డ గెడవై యరదం చేటునకు వసువీక తక్కిన మక్కటి యక్కర్ణుండు. కర్ణ. 3-350

ఒడ్డనము దే. వి. (√ఒడ్డు)

1. వ్యూహము.

వ. ఒక్క యక్షోహిణి యొడ్డనంబు దీర్చి. ఉద్యో. 1-221

క. అనురూపములగు మా యొడ్డనముల్ ప్రస్ఫురితములు ధృతంబులుగాఁ దీర్చినఁగాక తెఱంగగునే, యని మొనలేర్పఱిచెఁ గౌరవాన్వయముఖ్యా భీష్మ. 2-26 భీ. 3-12.

సీ. అనఘ సంశప్తకహననంబునకు నీవు, సనిన నొడ్డన కడంగి, వడచి ద్రోణునిఁ దలపడితిమి. 2-270.

2. ఒడ్డుట, అడ్డుపెట్టుట.

క. చేరి బహు చిత్రగతులం బోరంగా నొడ్డనములఁ బొలిపెం బలకల్. కర్ణ. 1-94.

మ. ఒకదిక్కుద్ధతిఁబూన్చి యొందు దెస వ్రేయన్ మేను వంచించి వ్రేఁతకు దప్పన్ వడి వ్రేయు నొడ్డనమువం దప్పించి వేగంబుగుంట దక నొప్పించు. శల్య. 2-57.

3. చక్రాకార ఫలకాస్త్రము, ఒకరకమైన పెక్కెము.

(ఈ యర్థమున తద్భవము. సం. అడ్డనమ్)

సీ... క్రమ్మఱంగదిసి పలకలు పడియలు గావించి యలుఁగుల నొడ్డనంబుల నంగవంచనంబులను వ్రేటు పోటుల సవరింపకుండం గాచి గాచికొనునోజ మెఱయుచుండిరి. ద్రోణ. 4-262.

శ్లో. అసిభ్యామ్ చర్మణి చిత్రే శతచంద్రే నరాధిప
విసృత్య పురుషవ్యాఘ్రౌ బాహుయుద్ధం ప్రచక్రతుః.
సం. భా. ద్రోణ 142-40

**ఒడ్డారము** దే. వి. (√ఒడ్డు)
పంతము. పోటి.

సీ. ...అవ్వధూటి, కేవల ధవళంబు నా విని యొడ్డారమునకు నేనదె
నల్లఁదనము కంటి...తే... వెనుకదెస నన్నవాదయ్యె.
అమ. 1-198

**ఒడ్డిమి** దే. వి. (√ఒడ్డు)
జూదమునఁ బందెముగాఁ బెట్టిన వస్తువు.

వ. ఆ శకుని యాడి యుధిష్ఠిరుఁ డొడ్డిన యొడ్డిమియు గెలుచుచు
వచ్చిన. ఉద్యో. 1-22

**ఒడ్డు**[1] దే. స. క్రి.
1. (వల మున్నగువానిని) ఒగ్గు. పఱచు, పన్ను.

తే. ఇందఱకు నిన్ని ఠంగుల నిడమ గుడువవలసె ధర్మతనూభవు
వలనఁజేసి. దాయలొడ్డిన మాయజూదంపు టురులఁబడి కులంబున
కాతఁ డిప్పాటు దెచ్చె. విరా. 2-225

వ. అప్పు డా భీవకాంతారణ్యంబున నేదిక్కు చూచినను దఱచుగా
నొడ్డిన యురులు దోఁచె. స్త్రీ. 1-47 ; శాం. 3-209

2. పందెముగాఁ బెట్టు, పెట్టు.

తే. అనఘ మామామ శకుని వాకై కదంగి, జూదమాడెడి నీతోడఁ
గాదు వాక, యీతఁడొడ్డిన ధనరాసు లెవ్వియైనఁ, దోఁడిగా నీకు
నీఁగలవాఁడ నేను. సభా. 2-174

ఆ. జూదమాడి ధర్మసూనుండు రాజ్యంబు, ననుజులను ప్రియాంగనను
పణంబు, గాఁగనొడ్డి యాడి కాఁడియఁ బడఁడె యట్లగుట దీని
తోడి యర్థిగీడు. విరా. 5-245

3. అడ్డముగాఁబెట్టు.

క. నా కొలఁది విచారింపక, నీకిట్లనఁదగునె మిన్నునేలయు నిమ్మైఁ,

గాక తిరుగంగఁబడినం, బోకె ముంజేతు లొడ్డి పోవఁగఁ ద్రోతున్.
ఉద్యో. 3-60.

క. కౌరవనాయక పాండుకుమారులు నీతోడి పొత్తు మనియెద మనఁగా, శ్రీ రా మోఁకాలొడ్డిన వారి విధమకాదె నీవు వలదమ
చెల్లన్. ఉద్యో. 3-342.

వ. అయ్యనిల తనయుండు సాధనవైకల్యంబున వెడంగు వడియుమ వెన్నికముమ్మ విన్వచ్చుచేతం:బచ్చిన సామజంబుల హయంబులఁ బచ్చికొని డాచేత నొడ్డుకొనుచు వలచేత వైచుచుఁ జెనంగె.
ద్రోణ. 4-286.

4. గుఱిచేయు, బలియిచ్చు.

క. అనిమిషవాథుం డిచ్చిన, ఘనశక్తికి నసురవొడ్డి గాండివిఁ దొలఁ గించిన హరివంచన పదపడి, మన మెల్లను దెలియ వినమె మను జాధిపా. కర్ణ. 1-216.

5. ఏర్పఱచు, అమర్చు, సిద్ధపఱచు.

సీ. విను మట్టి ధృతరాష్ట్రతనయులు గారె యీ, యొడ్డిన మొన లలో నున్నవారలు. భీష్మ 1-192.

6. (ధావాదికము పుచ్చుకొనుచుటకు) హస్తాదికము చాచు, పట్టు.

తే. అసివ నాతఁడు భయమంది యాత్మలోన. వొరుల యీఁగికి సకట చే యొడ్డకుండు, నట్టి వాకిది వలపెనే యనుచుఁ గరము, సాఁచె నవ్విప్రు దెసకు నిశ్చయము తోడ. శాంతి. 4-158

7. (చెవి) ఒగ్గు

ఆ. ఇట్టు లాడఁదగునె యిది నీక పోలు ని,న్నే మనంగ నేర్తు నిత్తెఱంగు, పాడిగాఁగఁ బూని పలుకంగఁ జెవియొడ్డి, యాదరించువారి నందుఁ గాక. ఉద్యో. 1-28; స్త్రీ. 1-24

8. (యుద్ధమునకు) పూను.

తే. పుడమిపాలు పాండవులకు నడుగఁబోయి, నీవు ధృతరాష్ట్రుతో ధర్మనిష్ఠమైన, యుచిత మాడిన నందుఁ బోటొడ్డియున్న, దొరల

భృత్యుల మనములు దిరుగఁబడవె ఉద్యో. 1-57

(పోటొడ్డు = యుద్ధమునకు సిద్ధపడు)

వి.

1 పందెముగాఁ బెట్టిన సొమ్ము.

వ. విరోచనుండును నంగిరసుఁడను విప్రుని కొడుకు సుధన్వుండును దమ తమ ప్రాణంబులొడ్డుగా నొడ్డి యొక్క ధర్మసందేహంబునకు సన్నిధంబున కరిగి వచ్చి ఉద్యో. 2-68

క. గురు డొడ్డుగఁ దమకంబునఁ, గురువీరులు పాండుపుత్రకుల యోధులు నిర్భర సముద్యత కళా, విరతిం గ్రీడించి యుద్ధనిపుణత మెఱయన్ ద్రోణ. 1-367

క. మనకును నితనికి సైంధవుఁ, డను నొడ్డున నయ్యె జూదము. ద్రోణ. 3-162

2. వ్యూహము ఒడ్డాము

ఉ. అగ్గలుపడి చీఁకటముల జేకలువాపి రథంబు ప్రచ్చివేఁ, డుక్కునఁ గ్రౌంచరూపమగు నొడ్డు గలంగఁగఁ జేసి భీష్ముఁ డే, డిక్కున దానయై. భీష్మ. 2-80

సీ. వారట మున్నర్ధచంద్రాకృతిగ నొడ్డు సంఘటించి. ద్రోణ 1-285

వ. భారద్వాజుండు పద్మవ్యూహంబు గావించినం గౌంతేయాగ్రజు నను మతి నభిమన్యుఁ డయ్యొడ్డు భేదించి ద్రోణ. 1-394

3 ఒడ్డుకొనుట. ఘటనము.

మ. పరిహాసంబునఁ దేఁ భృత్యులయెడం బ్రవిశ్వాసముం బొందుదురా, వరు నాజ్ఞం జన రీగి మెచ్చరు పనిన్ వంచింతు రెగ్గాడఁ బొత్తురు కౌతూహల వేషభాషణమునం దుల్యత్వముం బొందియేఁ, తురు వారెల్ల పదంబు వేఁడుదురు సింతుర్ భూమి మాఱొడ్డుచున్. శాంతి, 2-180

శ్లో. జర్జరం చాస్య విషయం కుర్వంతి ప్రతిరూపకైః సం.భా. శాంతి. 56-61

**ఒడ్డు²** దే. విశే.

పెద్దది, విశాలమైనది. అధికము.

వ. (సంజయుండు) మఱువాఁడు ధర్మతనయుం డొడ్డోలగంబున్న సమయంబు వేచి. ఉద్యో. 1-272

**ఒడ్డు³** దే. సర్వ. బహు. ఒడ్డులు. ఒడ్లు

అన్యుఁడు, అన్యులు.

(బహువచనమునందే దీని ప్రయోగము)

ఉ. ...నృపాలుఁడు...ప్రయోజ విదగ్ధుఁడై పలుకునొడ్డులకుం దగదట్లు సేయఁగన్. విరా. 1-128

తే. కుడుపునకు ముందరొడ్డుల గోవునకు సముచిత గ్రాసముష్టి నిత్యంబు నేఁడ, గాలమిచ్చిన నతఁడెల్ల కామ్యములును, బ్రాహ్మణుల కర్థినొసఁగిన ఫలము వడయు. అను. 2-415

ఉ. ఉత్పలగంధి నన్నుడుగు మొడ్లమ బంపుము కల్లుదేర. విరా. 2-98; శాంతి. 2-302

**ఒడ్డోలగము** దే. వి. (ఒడ్డు + ఓలగము)

పేరోలగము, నిండుకొలువు

సీ. మణిమయంబైన భూషణజాలముల నొప్పి, యొడ్డోలగంబున నుండఁగలదె. విరా. 5-204; ఉద్యో. 1-272

**ఒత్తరించు** స. క్రి. (సం. ఒత్తరము)

1. అతిక్రమించు మించు.

సీ. వితత వీరాగ్రహావేశాతిదర్పిత, చిత్తులై యొండొరు నొత్తరించు నుగ్రమహోద్ధతి నుద్భటాటోపతీవ్రములగు సమర విభ్రమము లంగ, సంగతంబులుగాఁగ. శల్య. 2-263

2. ఉద్రేకించు.

క. ....అఫల్గునుం బొదివిన నమ్మహాభుజుండు సారథుల సమయించియు దత్సేనాతురంగంబుల బడలు వఱచియు నబ్బలుమగలం దెరల్చి యొత్తరించి కెలనన దురంబుసేయు నమ్మరుత్తనయుం జేరంజని. కర్ణ. 3-179

**ఒత్తి** దే. అవ్య. (√ఒత్తు) గట్టిగా

1. నిర్బంధ పూర్వకముగా.

క. అనుడు విదురుఁ డాతని కిట్లను నిమ్మెయి నన్ను నొత్తి యడిగినఁ జెప్పం,జను నున్న రూపు సెప్పెద, విను మవధానంబుతోడ విమల విచారా. ఉద్యో. 2-51; శాంతి. 2-334; ఆశ్వ. 3-84

వ. నేను దైవాధీనతకతంబున బిడ్డల నొత్తి చెప్పను నియమింపనుం జాల. (ఒత్తిచెప్పు = నొక్కిచెప్పు) ఉద్యో. 2-198

2. హృదయ పూర్వకముగా.

ఉ. అత్తఱి భీష్మముఖ్యులగు నచ్చటి వృద్ధజనంబులెల్ల నో,రెత్తక యూరకుండిరి మహీశ్వరు చిత్తమెఱుంగకున్కిఁ డా, నొత్తి కుమారులం గినియ వోవఁడ యక్కట. ఉద్యో. 1-346

**ఒత్తికొను** దే. స. క్రి. (√ఒత్తు)

1. ఆక్రమించు. వశముచేసికొను.

మ. ఒకనాఁడా తమ ముందటం బలుమఱున్ వోరాటమై నేలయొ,త్తికొనంగా బవరంబులన్ గెలువఁగాఁ దెల్లంబుగాఁ జూచి పాం,డుకుమారాళి సహింపకుండుదురె. ఉద్యో. 1-279

వ. కొందఱు కొందఱ నివేశనంబు లధికాధికాపంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన. మహా. 19; ఉద్యో. 2-204

**ఒత్తిలి** దే. అవ్య. (√ఒత్తిలు)

బిగ్గఱగాఁ, గట్టిగా.

ఉ. అందఱివారలెల్లను జయంబునఁ బొంగుచుఁ బేరెలుంగు లం,దంద చెలంగఁగాఁ బలుక నార్వఁగ నొత్తిలి నవ్వ నాకసం,బందిన యట్టి మ్రోఁత విని యక్కడ వోవఁగ నుల్కి రద్దు. సౌప్తి. 1-6

**ఒత్తిలు** దే. అ. క్రి.

తప్పుకొను.

(శ్లేష్మము) క. కుత్తుకకు నడ్డపడు నూ,ర్పొత్తిలి పోవిక యాఁగు నూర్ధ్వశ్వాసం, బెత్తఁగఁ జేయును. ఆశ్వ. 1-173

**ఒత్తు** దే. స. క్రి.

1. అదుము, అణచు.

సీ. ఒత్తిన బెగ్గలం బొందక యుండొరు, బలువిడి నొత్తుచు నలవు మిగిలి. విరా. 2-347

2. నొక్కు, బలవంతపెట్టు.

క. అనుడు విదురుఁ డాతని కిట్లను నిమ్మెయి నన్ను నొత్తియడిగినఁ జెప్పం, జను నున్నరూపు సెప్పెద. ఉద్యో. 2-51; స్త్రీ. 2-157

3. (శంఖము మున్నగునవి) ఊదు.

చ. ...మనమునన్ రణకౌతుక ముల్లసిల్లఁగాఁ, బిడుగుల పిండు బిట్టు లియ వెల్లునఁ బార్థుఁడు శంఖ మొత్తినన్. విరా. 4-171

ఉ. శాంతనవుండు నప్డు నిజశంఖము కౌరవరాజ సైన్యముల్, సంతస మంద నొత్తుచు. విరా. 5-164

తే. విడియుఁటకు సూచకంబుగ విష్ణుఁ డొత్తెఁ, బాంచజన్యంబు ధర్మజ పార్థులాది, గాఁగఁ దమదమ వీరశంఖంబులెల్ల దొరలు నొత్తిరి దివి మ్రోఁతఁ దూఁటుగట్ట. ఉద్యో. 4-181

4. అద్దు.

వ. అవ్వారిశత్నంబుమ రయంబునం జేరి వ్రేటు గంటిం దొరఁగు రుధిరంబుఁ దనయుత్తరీయంబున మెత్తన యొత్తి యచ్చెరువవన్న కనక కలశ జలంబులం గరతలంబులం దడిపికొని తుడుచునప్పుడు. విరా. 5-260

5. ఆక్రమించు, వశపరచుకొను.

తే. ...కవలు మహోగ్రరిపుల, భూము లంతంత కొత్తుట పొగడఁ బడునె. ద్రోణ 1-278

వ. కొందఱు కొందఱు నివేశనంబు లధికాభిలాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన. మహా. 19

సీ. గరుసులు గడవంగఁ గదలి యల్లల్లనఁ బొత్తుచు జెడముల నుత్తలించి. అర. 4-228

6. చక్కఁజేయు.

ఆ. వెలరు వాలు దీవియల నల్లనల్లార్పు, పొర్ణగండ్లయందుఁ బొచ్చి పుడిసి, తిరిగి వేఁగుఁబోక తెమ్మెర లెలదీఁగ, కొనలవంక లొత్తు నవలఁ ద్రోచు. ఉద్యో. 2-112

7. పాదాదులు పట్టు, పిసుకు.

వ. ఏమింక వారి యడుగులొత్తను బాటిపోవనుం జాలము. ఉద్యో. 2-214

తే. వాలి యూరులు జఘనము మెత్తమెత్తన యొత్తి మురదంబున మల్లమూన్చు. స్త్రీ. 3-188

తే. అతని చరణయుగము, గరయుగంబున నొత్తుచు. శాంతి. 5-187; అను. 2-500; మౌస. 78

8. తుడుచు.

ఉ. దానికి నీవొడంబడితి ధర్మజుఁ డంతయుఁ బాధి సత్యముం, బాని వృకోదరార్జునులు బొంగులుగాఁ బెడచేతఁ గన్నునీరూనఁగ నొత్తుకొంచుఁ జని. ఉద్యో. 3-281

క. నరపతి యానందాశ్రులు, గరసరసిరుహముల నొత్తి కనుఁదని యఁగ న్నయ్యరువురఁ జూచుచు. ద్రోణ. 5-17; ద్రోణ. 5-364

శ్లో. పరిష్వజ్య తదా కృష్ణా వానందాశ్రుపరిప్లుతః.
ప్రమృజ్య వేదనం శుభ్రం పుండరీకసమప్రభమ్. సం.ద్రోణ. 149-4

క, ....అశ్రులు మఱియును గ్రమ్మం గరతలమున నొత్తుచుఁ జూచున్. మౌస, 1-164; ఆది. 4-108

9. తఱుము, వెంటాడు, వెంబడిపడు.

ఆ. అతని కప్పు డెదుర నమ్మొనఁ జెవ్వరుఁ, జాలరైరి సవ్యసాచి యొకఁడ, నిశిత విశిఖపంక్తి నిగిడించి నొప్పించి, యొత్తి భీష్ము వెనుక కొదుఁగఁ జేసె. భీష్మ. 3-378

శ్లో. అర్జునం ప్రాప్య గాంగేయం పీడయన్నిశితైః శరైః.
అత్యద్రవత సంహృష్టో వనే మత్తమివ ద్విపమ్.
సం.భా. భీష్మ. 117—54

10. ప్రశంసించు, అగ్గించు.

సీ. సంగరంబునఁ దన్వీసని శాంతిఁ బొందిన చిత్తంబుతోఁ దమసేవ
దిక్కుల. గనుఁగొని పిలుచవో కర్ణుఁడో కృపుఁడో సుయోధన
ఘోర నవ్వొత్తి యెప్పుడుఁ, జెప్పుదు రేను వారి నయినంతయుఁ
జేసితి. ద్రోణ. 5-322

11. మందలించు

మ. ....దుర్మద సంరంభ విశృంఖలుండయిన కౌరవ్యాధముం డెట్లు
వ్రాకెదురై ప్రాణముతోడఁ ద్రోవ నృపు నిక్కీలొత్తె సీమాక్రమ
ణన్. శల్య. 2-118

ఉ. నీకెనవచ్చు రాజరమణిన్ ధర నెందును గంటిమే నృపానీకము
వించుమంద సుతునిం దగు పల్కుల నంత యొత్తుదే, వాకది
సికెక్కఁ జిత్తమున. శల్య. 2-370

(ఒత్తు = కఠినముగా మందలించు; నిర్బంధించు అని సూ—ఆ—ని)

12. నిర్బంధించు.

క. మది మంతులైన వారికి, హితులగు వెరవుగలవార లెఱిఁగింతురు
దుస్థితి గాకుండఁగ గార్యము, గలిమొత్తియుఁ దప్పులిడియుఁ
గడపఁ బలికియున్. సౌప్తి. 1-80

చ. ...వాకు భీష్ముఁడు, గ్గురుఁడును దోడుచెప్పిరి మునుల్ బహుళంగుల
నొత్తిరత్తఱిన్. అశ్వ. 3.31

13. తెగఁగోయు, ఒరసికొనిపోవు.

క. అనదతనంబున జెడిదపుఁ, దనమును లేకుండఁ బరఁగి దరియొత్తె
డునేలను బోలె నొత్తవలయును, మనుజేంద్రుఁడు మార్తురం
బ్రగమంబున నధిపా. శాంతి. 3-24

14. రాపిడిపెట్టు, బాధించు, పీడించు.

క. అనదతనంబున జెడిగపుఁ, దనమును లేకుండఁ బరఁగి దరియొత్తెడు
నేలను బోలె నొత్తవలయును మనుజేంద్రుఁడు మార్తురం బ్రగమం
బున నధిపా. శాంతి. 3-24

అ. క్రి.

1. గ్రుచ్చుకొను, ఒత్తుకొను.

సీ. శయన తలంబున శయనించియును నిద్ర,వోవనియది దప్పిఁబొంది
కటికి —ఆ— వేలఁ గండ్లులొత్త నిద్రవోయిన యది. ఆది. 6-178

2. పుట్టు, జనించు, కలుగు.

తే ఉత్తమం బెద్ది నీ చిత్తమొలయు నెందుఁ, బురుషుఁ డెయ్యది
గల్గినఁ బొందు సఖల, కర్మబంధ మోక్షము నట్టి ధర్మమెఱుఁగఁ
జెప్పవే కరుణాలత చిగురులొత్త శాంతి. 5-542; ఉద్యో 1.326

వి.

1. ఒత్తుకొనుట వలనఁ గలిగిన ముద్ర, నొక్కు.

క. వెడలు వెడ గాఢ పీఠం,బడి సుడిపడి యోగి నొత్తువడి యొక
ఠంగిన్, వెడలఁగ గ్రహభూతము లొప్పుడు దొడఁగి యనేక దురి
తములు గల్పించున్. త్రి. 1-87

2. పీడ, బాధ.

వ. కౌరవులుం బాండవులు నొండొరులకుఁ బ్రాపై పొదలిన నెవ్వరికి
నజయ్యు లగుదురు పరుల యొత్తులేని రాజ్యము పూజ్యమహిమం
బరఁగు. ఉద్యో. 2-89

ఒత్తుకాఁడు దే. వి. (√ఒత్తు)

సుతిపోయువాఁడు.

వ. ...అతండును గుణధ్వని తంత్రీనాదంబుగా వావిండ్లవా రొత్తు
కాఁడుగా గాండీవంబు వీణగా వినోదంబు సలిపె. విరా. 5-78

ఒత్తుడు దే. వి. (√ఒత్తు)

పీడనము, బాధ.

సీ. ...ఒత్తుడు కౌరవుల వలనఁ బుట్టుమకదా. ఉద్యో. 1-278

(పాఠాంతరము)

ఒత్తువడు దే. అ. క్రి. (√ఒత్తు)

పీడితమగు, రాపిడిచెందు.

క. వెదలువెద గాఢపీడం,బడి సుడివడి యోని వొత్తువడి యొకతం
గిన్, వెదలంగ గ్రహఘాతము లప్పుడు దొడఁగి యనేక దురిత
ములు గల్పించున్. స్త్రీ. 1-87

**ఒత్తారవు; ఒత్తారువు** దే. వి. (√ఒత్తు)

ఒత్తుడు, సంపీడనము, పీడనము, బాధ.

క. అ త్తఱి సురఖచరాదుల, చి త్తములని జూచు వేడ్కఁ జిడిముడి
పడఁడా, నొత్తారవున నిరుదెఱఁగుల, నుత్తమ వీరులును దాఁక
నుంకింపంగన్. భీష్మ. 1-151

సీ. ఒత్తారు వొందుల, పలనఁ బుట్టదుగదా. ఉద్యో. 1-278

**ఒత్తారువు** దే. వి.

మల్లబంధ విశేషము.

సీ. ఒత్తారువున వలచిన యప్పుడు, గొనిపోవు నవలిఁ గూలవై చు.
విరా. 2-15

(మూఁడు తావులయందే యీ శబ్దము గలదు. (విరా. 2-15; ఉద్యో. 1-278; భీష్మ. 1-15) భీష్మ. 1-151 లో మాత్రము 'ఒత్తారవు' అని యున్నది. దానికి పాఠాంతరముగా ఒత్తారువు గలదు (సం.ము) మిగిలిన రెండు తావుల 'ఒత్తారువు' అనియే గలదు. 'ఒత్తారవు' పాఠాంతరముగాఁ గూడ లేదు మా.అ.ని. 'ఒత్తారవు' అను శబ్ద మొక్కటియే చూపి భీష్మ. 1-151 ఉదాహరణమిచ్చెను.

**ఒదరు** దే. అ. క్రి.

1. విజృంభించు, చెలరేఁగు.

వ. దైత్య సైన్యంబులు నిలువనోర్వక నలుదెసలం జెదరిన నొదరి
యదల్చి మహిషాసురుం డొక్క మహాశైలంబు పెఱికి యురుగేలం
దమర్చికొని యరుల మీఁదం గవిసిన. అర. 5-277

సీ. హుంకార ఘోరమై యొదరు బెబ్బులి మీఁద, లుఱక యెవ్వాఁడు
నేఁ దూఁచికొనియె. అర. 6-315

స. క్రి.

నిందించు.

వ. దుర్యోధనుండు విదురుం దూల నొదరె ప్రాతికామియను వానిం
బిలిచి. సభా 2-205

శ్లో ధిగస్తు క్షత్తారమితి బ్రువాణో దర్పేణమత్తో ధృతరాష్ట్రపుత్రః
సం. భార. సభా. 66-1

**ఒదవించు** దే. స. క్రి.

కలిగించు.

సీ. లోని తొంపము పవలును రెముఁ జీకటి నొదవించి పొదలంగ
నొప్పుదాని. విరా. 1-162; కర్ణ. 1-268

**ఒదవించుకొను** దే. స. క్రి.

సంపాదించుకొను.

క. ఇది దప్ప నిప్పు డియ్యెడ, నొండవదు ప్రాణంబు గాన నొండొక దిశ
యుఁన్, మది మోహింపఁగ మ్రుచ్చిమి, నొదవించు కొనంగ వలసి
యున్నది నాకున్. శాంతి. ?-286

**ఒదవు** అ. క్రి.

(ఉద్భవ శబ్ద భవమని సూ.ఆ.ని. అక్షర సామ్యముచే గాఁబోలు)

1. కలుగు, పుట్టు, జనించు.

క. అతనితో వొక్కొక మరి, కౌతూహల వృత్తి క్రింద గండొదఁగి
మృదు, ద్యూతంబునఁ గ్రీడింతుం,జేతో ముద మొదవ నతఁడిల్ప
బ్రోధిన్. విరా. 1-71

క. ఒదవెడు తృష పెల్లిదమున, వదనము వఱునట్లు వట్టె. విరా. 2-89

క. వనితకుఁ బిరుమునకుం దన, తనయంతన రూపొకం డొదవఁ జేయ
గ విన్ననువు గలుగ దొండొరవుల, నెనయుటఁగాని శ్రుతిమతము
నిట్లు మహాత్మా. శాంతి. 6-22

2. ప్రాప్తించు, లభించు, దొరుకు.

క. మన్నన కుబ్జక యవమతి, దన్నొందిన సుగ్రంబడక ధరణీకు
కడన్, మున్నున్నయట్ల మెలఁగిన, యన్నరునకు శుభము లొదవు
నాపద లడఁగున్.

(శుక్ర మాంసము ను జాది విశ్వామిత్రుఁ డమకొనిన మాటలు)

క. ఇది దప్ప నిప్పు డియ్యెడ, నొదవదు ప్రాణులకుగాన నొడొకండు.
శాంతి. 3-286

సీ. భరతకులోత్తమ ఫలమూలముల నుప,యోగింపు మెసఁగెద మెదవి తమకు, నెయ్యది యాహారమయ్యె నాతిథ్యంబు, దానన నడవుట ధర్మసరణి.
అశ్ర. 2-65; మౌస. 191

3. వచ్చు.

తే. చాలఁగాలంబు వోవక చతురులైన, వృద్ధజనముల బుద్ధులు వింద్రుగాక, ముదియ మతిదప్పి నోరికి నొదవినట్లు, పలుకు వెడఁగుల మాటలు పాటియగునె.
ఉద్యో. 4-243

క. ఎదురున్న రూపు వలుకఁగఁ, దుదిఁ గటకటఁబడవు నీవు దుర్జయమును జెట్టిదమును బెండుము నను పలు, కొదవదు నీ వాలుకకు నయోన్నత యెపుడున్.
ఉద్యో. 1-363

క. నా కొఱఁతఁ దీర్చి వచ్చితి, నీ కొఱఁతయ యింక నూతునింద్రెగఁ జూడన్, లోకము వంచింపను దగు, చీకటియే యొదవ నేమి సేసెదు చెపుమా.
విరా. 2-271

4. తగు, యుక్తమగు, అర్హమగు.

వ. రథంబెక్కిన యవసరంబున నొదవ సపరివారంబుగా నరుగుదెంచిన సాత్యకిం దన రథం బెక్కించుకొని,
ఉద్యో. 3-132

వ. తేరు తత్కాలంబున నొదవం దెచ్చిన నయ్యచ్యుతుండు మెచ్చుచు
ద్రోణ. 4-277; శల్య. 2-332; అను. 4-36

(ఒదవన్ = తగునట్లుగా, యుక్త మగునట్లుగా)

5. నెఱవేఱు, సిద్ధించు.

క. మనచేసిన సుకృతంబుల, వినుతఫలమునెల్ల నెల్లి విచ్చుఁడు సింధునరేంద్రుఁ జంపునట్లుగ, నొనరి యొదవవలయునని దృఢోక్తిఁ బలుకుచున్.
ద్రోణ. 2-344

6. తోడ్పడు, అదుకొను.

ఆ: నిన్నుఁ దృణముఁగాసేసి నన్నా దురాత్ముండు, బంధుహీనుఁ జేసె

బిఱువ వెడగు, దోఁచినప్పు డొదవి తొలఁగించు వానిఁగా, కమ్మ
నేల బంధుఁ డం|డు జనులు. కర్ణ. 8-44

7. ఏర్పడు.

క. ఈ సర్వము దేహాత్మాశ్రిత మిది దేహరూపైన పరమాత్ముని వి,
న్యాసమునకుఁగా నొదవి యు,పాసింతుం గరణరూపమై యా
కర్తన్. శాంతి. 4-274

8. ఉద్గమించు, బయలువెడలు.

తే. ఒదవు వృత్రు రక్తమున బుద్బుదము లెసఁగి, పుట్టుకొక్కులై యవి
జన భోజ్యభావ మొంది. శాంతి. 5-438

9. ఉపయోగపడు, ఉపయోగించు.

సీ. గోవులెక్కుడు తపోభావితాత్మకంబు...వినుత హోమముల
కెల్లను బాలుఁ బెరుగు నేయును నిచ్చుఁ గర్పనంబునకు నొదవు.
అను. 2-307

10. చమరెంచు, ఏతెంచు.

సీ. ...అమ్మ,హాత్మ్మఁ దండఁ జూచి యాన్నపాలు, కేలు దెమల్చుచు
మేలుసేసితి దైవయోగంబుగా దె నీ వొదవు టరయ.

అను. 5-458

శ్లో. దిష్ట్యా ప్రాప్తోఽసి కౌంతేయ సహామాత్యో యుధిష్ఠిర.
సంభా. అను. 278-26

11. తలపడు, పూను.

ఆ. అఖిల వానరేంద్రుఁ,డైన సుగ్రీవుతో, జెలిమి సేసి యిపుడు
శ్రమమువన. వీరవరుఁడు విన్ను విడిపించు పనికై, యొదవి
యుత్సహించి యున్నవాఁడు. అర. 6-394

12. పెరుఁగు, వృద్ధిపొందు.

క. క్రమమునఁ గామము రాగము, దమమునముల నొదవఁగా మదం
బెక్కిన వి,భ్రమమొందుచు విచ్చలవిడి, విమార్గచరితముల వేద
విధ్వంసకులై. శాంతి. 2-201

13. అమరు, ఒప్పు

క. అదె పార్థుఁడు దన మునుముప, కొదవిన వేనలఁ గలంచు నుతి
వతఁ డితనిం, గదియఁగ రాకుం డిక ముమ, పొదవుద మే సాత్య
కిం బ్రభూతబలములోన్. ద్రోణ. 5-178

**ఒదిఁగించు** దే. స. క్రి.

1. ప్రక్కకుఁ దొలఁగించు.

క. తక్కటి రథికజనులు వేరుకక్కవ నయ్యశ్వచయంబు నొదిఁగించి
యునుం, జిక్కువఱచియుం దునిమియు, వెక్కుడు ముద మొప్ప
మెఱసి రిభపురవాథా. కర్ణ. 3-286

2. ప్రవేశింపఁజేయు, చొనుపు, చొప్పించు.

సీ. పంచాత్మకంబైన పవనంబు నిగ్రహితమైనది భవదింద్రియములు
మనము, నందాఁగఁబడ్డ యవియును నదియును బుద్ధియం దొదిఁ
గించి. శాంతి. 2-8

శ్లో. వాక్సత్త్వం చ గోవింద బుద్ధే సంవేశితాని తే.
సం.భా శాంతి. 46.4

3. లీనముచేయు.

సీ. ఇల జలంబుల జలంబులు శిఖ శిఖ వాయువున వాయు వంబరఁబు
నరు నంబరంబు చిత్తమునఁ జిత్తం బహంకృతి నహంకృతి బుద్ధిఁ
దగ నొదిగించి. శాంతి. 4-243; శాంతి. 6-414

4. లయముచేయు.

క. మనసుగొని మనసుబుద్ధిం,గొని బుద్ధి నిదర్శనంబుగొని ధర్మనమున్,
విను క్రమమున నొదిఁగించినఁ, గను బుధుఁ డక్షరుని విష్ణు ఘన
బోధమయున్. శాంతి. 4-200

**ఒదిఁగిలు** దే. అ. క్రి.

ప్రక్కకొలఁగు, ఒత్తగిలు.

సీ. (కుంభకర్ణుఁడు) యొదిగిలి కనువిచ్చి పరాయని బిట్టావులించి
కొండొకదేశ లేచి పిల్చి. అర. 7-95

**ఒదుఁగఁబాఱు** ఒదుఁగు

తొలఁగిపోవు.

చ. తలకెదు వాసికిన్ మగఁడ బాణము నన్నదలించువాఁడ సీ పలుకకు
లీకున ట్లొదుఁగఁబాఱునె కూరుఁడు. విరా. 3-25

చ. పలికిన బ్రాహ్మణుం డొదుఁగఁ బాఱక నిల్చి. అను. 3-231

**ఒదుంగు; ఒదుఁగు** దే. అ. క్రి.

1. అడకువతోఁ బ్రక్కకుఁ దొలఁగు, అవయవములు ముడుచుకొని యొ
సరిల్లు.

తే. మట్టఁబడి మేనఁ గంపంబు పుట్టి యొదిఁగి, యుండువారుఁ గరం
బున మదరమప్పళించి యమ్మరో రక్కసయంచు నుల్ల ములుకు
వారు నై పురజనంబులు దులంకి. విరా. 3-36

2. తొలఁగు, వెనుకకుఁ దొలఁగు, వెనుదీయు.

చ. శనిమనుమందు నర్దమున శ్రమము నాలుగు నారసంబులన్, వెనుక
కొదుంగఁ జేసి... భీష్మ. 2-228; భీష్మ. 3-73

క. ఏలినవాని ధనంబులు, బాలురు బంధువులుఁ దారు బ్రదికిన దిన
ముల్, ప్రేలారిచి తింద్రాతని, యోలముగని పిదప భీతి నొదు
గుదు రాతిన్. విరా. 4-217; విరా. 5-164

మ. హరియుం బాండవులున్ మదీయపటుబాణాళీక్షతివ్యగ్రనిర్భర
సంతాప పరీతులై యొదుఁగ...విజృంభించెదన్. ద్రోణ. 5-339

3. దాఁగియుండు.

వ. త్రిగర్తపతి మొదలయిన యమ్మహీపతులుం దెరలి తమతమ
సైన్యంబులు నన్నివెలవులకుం జని యొదుంగుటయు గాంగే
యుండు గదంగుటయుం గని. భీష్మ. 3-16

వ. అతండు కేతనంబునకుం గుదురుగాఁ జెమరివరం గావించిన పీఠం
బు నడుగున నొదింగినం దేరిపయి నతనిం గానక భీమసేనుండు.
ద్రోణ. 4-236; కర్ణ 3-188

వ. ....చిత్తంబు గలంగినం జనం బాఱక యరదంబు డిగ్గి యచ్చట
నొక్కయెడ నొదిఁగి నిలిచెదనని వారలకుం జెప్పి యమ్ముదుమ

నటుల నొక్కపటపుగల పొద యీటమిం దూటి పొంచియుండిరి.
శల్య. 2-48

4. లీనమగు.

క. మొదలఁ గలిగించి జనములఁ, బదిలంబుగ నునిచి వానిఁ బదపడి తన యందొదిగించి మఱియు నెమ్మెయి, మదారగతి నడవు చిన్మయుని గొలుతు హరిన్. శాంతి. 6-414; శాంతి. 4-243

5. పాఱిపోవు, యుద్ధము నుండి తొలఁగు.

క. ఎటు వోవవచ్చు నిను ముందట నిడుకొని పోదమన్న తగు రాజుల నెక్కటి దోలెడి సాత్యకి న్నీవట దఱుముదుగాక యొదుఁగ నగునే నీకున్. ద్రోణ. 4-94

6. అడఁగు, నశించు.

సీ. లోకంబు లెల్లఁ గల్గుట నిల్చుటొదుఁగుట, తనయంద యగు మహోత్తరుని గొలతు. శాంతి. 2-20; శాంతి. 5-120

తే. స్వస్థతయు దుఃస్థతయు జడత్వమును గ్రమవిగణన సత్త్వరజస్తమోగుణము లవి సమీరితము లగు టడఁగుట యింద్రియంబు, లడరు టొదుఁగుట బుద్ధికృత్యములు పుత్ర. శాంతి. 5-167

**ఒద్ద** దే. వి. ఔ. అనో.

సమీపము, దాపు, దగ్గఱ.

ఆ. రాజునొద్దఁ బలువురకు సంకటముగాఁగఁ, దిరుగు పనుల కెంత తేజమయిన, వాని బుద్ధిగలుగు వారొల్ల రది మీఁదఁ జేటు దెచ్చు టెట్లు సిద్ధమగుట. విరా. 1-126

తే. యాజకులు దార యక్కరు రాజు భక్తి, యుక్తి నొద్దనుండగ నగ్నిహోత్ర హోమ,మాచరింతు రొక్కొక మరి యతఁడు పర్ణశాల వెడలి శూన్యాటవి సంచరించు. ఆశ్ర. 2-149

తే ఒక్క పుణ్యాశ్రమంబున యొద్ది యేట,విడిసి దివస ప్రవర్తన విధులు నడిపి. ఉద్యో. 3-146

**ఒద్దివారలు** వి. బ.

సమీపమునం దుండువారు.

వ. మత్స్యజనవిభుండు తన యొద్దివారితో నిట్లనియె.

ఉద్యో. 1-280

**ఒనఁగూడు** దే. అ. క్రి.

సిద్ధించు, వెలవేయు.

ఉ. భారత మర్థితో వినిన భక్తిఁ జరించిన శ్రీయు వాయువున్, భూరి యశంబునుం బ్రమదమున్ దృఢవిద్యయుఁ గల్గువారికే, కోరిక లైన వేగ మొనఁగూడు. స్వర్గ. 90

(నిర్బంధకముగ శ. ర. మా. అ. ని.)

**ఒనఁగూర్చు** దే. స. క్రి. (√ఒనఁగూడు) ఒనఁగూడఁజేయు

సిద్ధింపఁజేయు, పొందఁజేయు.

వ. ధర్మనందనుండు మద్రపతిం బ్రస్తుతించి ... సంభావించి యతనికి సముచితంబులగు మజ్జన భోజనంబు లొనఁగూర్చి. ఉద్యో. 1-214

(పాఠాంతరము)

**ఒనరించు** దే. స. క్రి. ఒనరుచు, ఒనరఁజేయు

1. కావించు, చేయు.

క. ...వ బృహన్నల, యను నామముతోడఁ 'గన్యకాంతఃపురవృత్తి మొనరించుచు లాసికతనమున నిపుణుండనై యతని మెచ్చింతున్. విరా. 1-59

చ. ...శిశుపాలుఁ డెంతయును భక్తిపరుండయి రాజసూయ ముస్నతి నొనరింపుమన్న యమనందను యత్నమెఱింగి రత్నకోటులు ధన రాసు లిచ్చె. సభా. 1-242

2. నిర్మించు.

ఉ. ....కైదువులెల్లఁ గేళ చర్మావృత సంచయంబుగ శవాకృతిగా నొనరించి కట్టినం, గోవరు దీని దిక్కొరులు. విరా. 1-166

క. మరువున నొనరించిన పంజరంబులోనున్న పులుఁగు బాడ్పన మేనం, బురుషవర జీవముండుట, పరికింపక యేమఱంగఁ బాడియె నీకున్. శాంతి. 6-228

తే. వరము పడసిన యాదైత్యవరులు దమకుఁ, బురము లొనరింప

దానవ పూజ్యమయుని, వేడికొనుటయు. కర్ణ. 1-261

3. సిద్ధపఱుచు, సిద్ధము చేయు.

క. ముదమునఁ గృష్ణుఁడు గుంతీసదనమునకుఁ జనియె నవుడు సమ్మోదమున నప్పేదురుం డోగిర మొనరించెదనని తన్నడుగ నట్లు చేయుం డనుచున్. ఉద్యో. 3-181

వ. అనిన విని కీచకుండు ముదిత హృదయుండయి నిజసదనంబునకుం జని వివిధ మధురసంబు లొనరించి సముచిత ఖాద్యంబులు సమకట్టి విరా. 2-82

4. కలిగించు.

తే. అర్జునునకుఁ ఖాండవ దహనాదులైన, విక్రమము లాబృహన్నలం బెంపు లావు గాదె జయ మొనరించె లోకంబు లెఱుఁగ.

విరా. 4-16; ఉద్యో. 1-37

5. పూను, వహించు.

క. ధైర్యధనుఁ డితఁడు ద్రోణాచార్యుల కెనవచ్చు దివ్యశరవిదుఁడు కృపాచార్యుఁడు మత్పితృసఖుఁ డాచార్యక మొనరించె మాకు శైశవము తఱిన్. విరా. 5-9

6. ఏర్పఱచు, నియమించు.

క. అనఘుల శాస్త్ర విధిజ్ఞుల, ననురక్తులఁ బితృపితామహక్రమమున వచ్చిన పురుషుల మంత్రులఁగా, నొనరించితె కార్యసంప్రయోగము పొందెన్. సభా. 1-26

క. ఇతని సమయింప నయ్యచ్యుతుఁడు ననుఁ బంచె నాకు నొనరించిన పాలితఁ డని తలంచి మొగ మ్ముగ్రత నొందఁగ శక్తిమీఁదఁ గను దో యొలయన్. శల్య. 1-274

7. కల్పించు.

ఆ. తనకుఁ దాన బంధ మొనరించు కొనియెడుఁ, బొత్తి నూలికాయ పురువు భంగి. శాంతి. 6-19

వ. ఒనఁగూర్చు, చేయించు

వ. ధర్మతనయానుమతంబున సంజయునకు సపరివారంబుగా సము
చిత ప్రకారంబున మజ్జన భోజనంబు లొనరించి మాల్యాను లేప
నా ద్యుపచారంబులు సేయించి. ఉద్యో. 1-380

**ఒనరు** దే. అ. క్రి.

1. కలుగు.

ఉ. ఒల్లరు రాజు దేవులును నొద్దులు రాచిన చందనంబు మే,నెల్లఁ
జెమర్పఁగా నలయ కేను క్రమంబడి నిల్చి నిల్చి య,ల్లల్లన మార్ద
వం బొనరు నట్లుగ నెట్టకునేసి రాచి మి, తల్లికి భక్తిఁ బెట్టెడు
విధంబునఁ బెట్టుదు బ్రహ్మఁ దిట్టుదున్. విరా. 2-220

ఆ. ఇట్టు లాడఁదగునె యేనేమి సేసితిఁ, గొలిచి కుడుచు పాడి నలవుఁ
జూడముఁ బలుకులెందు నెగ్గ పతికిఁ బుత్రులకును, సుమమలకు
హితంబ యొనర నడతు. ఉద్యో. 2-157

క. విను బండారమును పెరుఁగని, జనపతికి బలంబు మిత్త్రి సంపదయును
గ,ల్గునె బలమి త్త్రి విహీను న,తొనరునె రాజ్యంబు విభవమున్నత
మగునే. శా. తి. 3-171

క యాగంబునందు శ్రద్ధా,యోగము గల యశుచి శ్రద్ధ యొనరని
శుచి పు.ణ్యాగమ సంపదఁ దుల్యులు.గా గణించిరి నిరూపకత
నమరవరుల్. శాంతి. 5-247; శాంతి. 4-82

2. పొసఁగు, అనుకూలపడు.

మ. జనకుండన్ గరు భీష్ములుం దగిన కర్జం బావ్రులై నీకఁ బ్రీతి
నెటి గించు తెలంగఁగాదు తమ బుద్ధిం బోయి సంధాన మిట్లొనరం
జేయక యున్నఁ గృష్ణునకు నిన్నొప్పించు వారింత వట్టు నిజం
బిచ్చుట నింక నీ యునికి నెట్లుం గీడు పుట్టుంజుమీ. ఉద్యో. 3-373

3 ప్రోగగు, కూడు, ఒక చోటికిఁ జేరు.

చ. .. అందఱుఁ బిల్వఁగఁ బంచి వారితో,నని పని మాటలాడి విన
యంబునఁ బ్రార్థనసేసి మీరలీ, యొనరిన సైన్యముల్ పదునొ
కొంటికిఁ బ్రాభవ మాచరింపఁ బొ,చ్చిన సకలంబు వొప్పు నథిపే

కము గై కొమఁ దుత్సవంబుగన్. ఉద్యో. 4—140

4. దృఢమగు, దిటవగు, పదిలమగు.

క. అని యొకగుదిమీల నదుమ, వెనయంగా దూటికలచి యిరు దౌ
డలఁ ద్రా, దొనరంగఁ బట్టుకొని క్రుచ్చిన చందము దోఁప
మూర్ఛఁ జెందిన భంగిన్. శాంతి. 3-195

5. ప్రస్తుతికెక్కు, కీర్తిపొందు.

క. ఒనర జరత్కారు మునీంద్రునకు జరత్కారునకు సుతుండైన
మహామునివరు నాస్తీకుని ముద,మునఁ దలఁచిన నురగ భయముఁ
బొందరు జనులన్. ఆది. 2-286

6. ఒప్పు.

(ఇది 'ఒప్పు' వలెనే కొన్ని యెడల వాక్యాలంకారముగా నుండును)

క. ఒనరుఁ ద్రయోదశ పర్వం,బనఁగా - అనుశాసనికపర్వ మిలన్.
ఆది. 1-59

క. ...నా మేల్కను నంతకు నుండక యినుఁ డొనరఁగ వస్త్రాద్రికేఁగ
నోడఁడె చెపుమా. ఆది. 2-159

సీ. (యయాతి కొడుకులం జూచి) తన జవ్వనంబు నా కొనరంగ
నెవ్వఁ డీ,నోపు నాతండ సదీవ సకల, ధారుణీ సామ్రాజ్య భార
యోగ్యుఁడగు. ఆది. 3-95; ఆది 4—128

మ. ...ఎవ్వడే నొక జగత్పూజ్యుండు గ్రీడార్థ మిట్లొనరం దాల్చిన
రూపు గావలయు మీరూహింపుఁడా యట్లగున్. విరా. 1-281

7. లభించు, ప్రాప్తించు.

సీ. ...అనావృష్టి దోప -తే- మావహిల్లిన నతని కాహార మొనరఁ
జేసికొనుట దుర్ఘటమయి చెల్లుచుండ. అశ్వ. 4-220

ఒనరుచు; ఒనర్చు స. క్రి. ఒనరించు (√ఒనరు)

1. కావించు, చేయు.

క. సన్న్యాసివేషమున శ్వా,జన్యునిఁ గని యెవుడుఁ గొలిచి నత్యత్వ
మునన్, మానుష్యదనై పుణ్య కథా,విన్యాస మొనర్తు నతని వేడు

కతుఁ దగన్. విరా. 1-69

క. కని భక్తిం బ్రణమిల్లుడు, ముని యాతిథ్యం బొనర్ప మోదంబున వా, తని పాల ధర్మఫణితులు, వినుచుండఁగ నొక్కధరణివిభుఁ డే తెంచెన్. శాంతి. 3-156

క. దీనికి సదృశముగా మఱి, యే నేమి యొనర్తు నీకు నిష్టం బనినన్, మానుగ వాతోఁ జెలిమి మ,హానుతముగఁ జేయు మిదియ యిష్టము వాకున్. ఆది. 6-66

2. రచియించు.

ఉ. ...అం,దాదిఁ దొడంగి మూఁడు కృతు లాంధ్ర కవిత్వ విశార దుఁడు వి,ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్. విరా. 1-7

3. నిర్మించు, కట్టు.

వ. పసిడి యిట్టికలం జతుశ్చిత్యంబు నష్టాదశ కరాత్మకంబును గరు డాకృతియును గా యజనం బొనర్చి. అశ్వ. 4-180

4. ఇచ్చు, అర్పించు.

క. మునివరుడైన యగస్త్యుఁడు, సమ దెంచిన శతమఖుండు సమ్మతి మచితా,సనమిడి యర్ఘ్యముఁ బాద్యము నొనరిచి యిట్లనియె సవినయోక్తి నతనితోన్. ఉద్యో. 1-199

5. కలిగించు, తెచ్చిపెట్టు.

తే. అనిన విని కిన్క-బూనిన యంఁతినగవు, చెలువు మొగమున కొక క్రొత్తపొలు పొనర్పఁ బుండరీకాక్షుఁ డగుచెల్లఁ బోయి యప్పు, దరుణ కమలాక్షుఁడగుచు మురాంతకుండు. ఉద్యో. 3-864

తే. పొమ్ము గోరినయంతన సుఖము గలుగ, దది యుపార్జింపఁగా సిద్ధి యగుట నిజమె,కలిగెనేని యనేక చింతల నొనరుఁ, జెకుట చావుతోఁ దుల్య మయ్యెడుమ యేల. శాంతి 4-47

క. మరతంబు గుప్తమగుటయు, గురశుశ్రూషయును బ్రహ్మకుల భజనము వా,యురవాప్తిఁ జేయు లక్ష్మి కిరణబులగు మూర్ధ్వలోక

గతియు నొనర్చున్. శాంతి. 4-116; విరా. 2-286

6. ఏర్పఱచు, పంచు, విభజించు.

ఉ ...వాఁడి మూదిమొన యించుక మోపినయంత మాత్రయున్,
భూమి యొనర్చి పాండునృపపుత్రుల కిత్తువె. ఉద్యో. 3-368

7. ఒసఁగు, పెట్టు, ఇడు.

వ. అతం డాసన పాద్యార్ఘ్యనంబు లాచరించి మహనీయంబగు భోజనం
బొనర్చిన సంతృప్తి బొంది యవ్విదేహపతికి నానన్నంబగు నుచితా
సనంబున నాసీనయైయుండి. శాంతి. 6-171

8. సిద్ధముచేయు.

సీ. సమకట్టికొనుచు భోజ్యములు భక్ష్యంబులు, నానావిధముల నొనర్చి
కొనుచు. మౌస. 29

ఒప్పగించు వి. అప్పగించు (సం. అర్పణమ్)
వశపఱచు, అధీనము చేయు.

వ. అక్కుమారుండు నీపేర సారస్వతుండనం బరఁగుఁ బదంపడి పంద్రెం
డేం డ్లనావృష్టియైన నయ్యాపదఁ బొందకుండఁ జెక్కంద్రు
మునుల రక్షించి వేదాధ్యయనంబులు సేయించునని చెప్పి యొప్ప
గించిన సరస్వతి ప్రీతయై తనయుం గొని చనియె. శల్య. 2-208

ఒప్పనితనము దే. వి. (√ఒప్పు)
అపచారము, తప్పు.

క. .. ఇప్పని మనవారల యొప్పనితనమున మూఁడె నని వంతఁ
దలపోయకుఁడీ. మౌస. 12

ఒప్పనివాఁడు దే. వి. (√ఒప్పు)

1. శత్రువు.

ఉ. ఒప్పదె కూడి మన్కి మన కొప్పనివారల యుక్కుదక్కఁగన్.
ఉద్యో. 1-371

క. విను మేము గల్గసారెలు, గొని కపటపు జెత్తమాడు కుశలతఁగా
దొప్పనివారి నేపడంచుట, ఘనబాహాస్త్రైరకేళిఁ గాని దురాత్మా
శల్య. 2-281; శాంతి. 1-54

3. కురూపి; చక్కఁదనము లేనివాఁడు.

క. ధని యధనుఁడు రూపని యొప్పనివాఁడు వివేకి మూఢుఁడవుఁ దరోగుం, డనుగతరోగుఁ డనఁగ నెం,గవ పతిఁ బాటింపవలయుఁ గామధ్వంసీ. అను. 5-295

ఒప్పమి దే. వి. (√ఒప్పు)

1. కీడు, కష్టము, ఆపద.

క. మన్నన మానిసివైనీ, పున్నం గడు మేల కాక యొప్పమి గలదే. విరా. 1-288

ఉ. ఇప్పుడు చేతు చేసి కృపయేమియు లేక విహీనవృత్తి వా,రొప్పమిఁ బొందఁ జూచుటది యొప్పునె. ఉద్యో. 1-371

ఉ. ...గౌరిదేవి య,ట్లొప్పమి దండ్రికైనఁ గని యుల్లము బెగ్గిల వీతసంభ్రమలం, గవ్వఁగమౌళి భూషణము గాంచి ప్రణామము సేసెఁ జేసినన్. అను. 4-420; ద్రోణ. 3-206

2. ద్వేషము, పగ, వైరము.

తే. చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు,డడ్డపడి వారిలోఁ గొట్లాడి తైన, దాని మదుపంగఁ దొరకున్న వానిఁ గ్రూర, కర్ముఁడని చెప్పుదురు కర్మకాండ విదులు. ఉద్యో. 3-242

శ్లో॥ జ్ఞాతీనాం హి మిథోభేదే యన్మిత్రం నాభిపద్యతే,
సర్వయత్నేన మాధ్యస్థ్యం న తన్మిత్రం విదుర్బుధాః.
సం. భా. ఉద్యో. 62-15

3. అప్రియము.

సీ. ...మీ మహాన్వయంబున మహీ,విభులయం దొప్పమి వెదకిరైనఁ గానము. ఆశ్ర. 1-68

శ్లో॥ న జాత్వస్య చ వంశస్య రాజ్ఞాం కశ్చిత్కదాచన,
రాజాఽసీద్యః ప్రజాపాలః ప్రజానా మప్రియోఽభవత్.
(తప్పు, దోషము-అని మూ-అ-వి) సం. భా. ఆశ్ర. 11-15 విర్ధయ)

4. పరాభవము.

ఉ. అప్పుడు నీవుఁ గర్ణుఁడును నాడిన మాటలు గొల్వులోపలం, జెప్పెదు

సిట్టివే కలము శిలముఁ గల్గినే పుణ్యకాంతకల్లొప్పమి సేయు
తెల్లఁ గనియున్న జనంబులు వించుమండఁగాఁ, దపొప్కయింత
తేదను విధంబది నీక చనుం గుమారకా. ఉద్యో. 3-368

**ఒప్పరికించు** దే. స. క్రి. (√ఒప్పరికము)

1. ఉపేక్షించు

సీ. అదరి పోరాడక యన్నియశాహిణు లొప్పరికించెనె యొకనిఁ
గలన. భీష్మ. 1-58

చ. కొడుకులఁ గానరే నృపు లకింతికి తేజుల నెందు సమ్మెయిం, జెడు
తెరువైనచోఁ దగవు సెప్పక యొప్పరికించి చూతురే.
ఉద్యో. 2-10

2. త్యజించు, విడనాడు.

ఉ. అప్పుడు నీవు సూడఁగ ననంతము లైచరేంద్ర సైన్యముల్,
గప్పె ననేకసాయక నికాయములన్ వడి నన్ను నేనునుం, గుప్పనఁ
గూరలేసి రిపుకోటి వధించితి నంతలోన నన్నొప్పరికించె సైన్యతతి
యొక్కఁడనై రణభూమి నొచ్చితిన్. అర. 6-7

**ఒప్పఱు** దే. అ. క్రి. (√ఒప్పు)

1. చెడు.

సీ. సమర విశాసంబు చెమట నొప్పఱకుండ, హేతిదీధితులు రేయొండ
నొడుచు. భీష్మ. 1-119

2. చేడ్పడు, వివశత్వమొందు.

ఉ. ...వారు వాఁడొప్పరి తేర కూబరము యూఁతగ వ్రాలఁగనేని
యార్చినన్ భీష్మ 3-167

3 భంగపడు, వికలత్వము నొందు.

క. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు, నిప్పులురలు చూపులదర నిశితాస్త్ర
ములం, గప్పె గురునిఁ దనై న్యంగా, బొప్పతి తన బెట్టిదంపు టురవడిఁ దెరలన్. ద్రోణ. 1-156

4. భగ్నమగు.

ఉ. అప్పుడు శిఖిశాముఁడు శకాశుగముల్ గురుమేన గ్రుచ్చి తే రా

వ్రజ మూకమెల్లెంటి తురగోద్ధతి మాన్పి. ద్రోణ. 4-125

5. మఱుఁగుపడు, కాంతి చెడు.

తే. నివురు గప్పిన యొప్పులు నిప్పువోలె కల్యా. 1-368

**ఒప్పారు** దే. అ. క్రి. (ఒప్పు+ఆరు)

ఒప్పు.

సీ. పీతంపురోమంబుచేత నొప్పార నా విష్టుం దగుట శిపివిష్టుఁడనియు
శాంతి. 6-432; ఉద్యో. 1-92; అను 2-318

శా. ఆరూఢస్థితి నెల్ల దేశములు నొప్పారుం బ్రకాశంబుగన్.
అర. 4-318; చూ. ఒప్పు. ఆశ్ర. 2-38

**ఒప్పించు** దే. స. క్రి. ఒప్పగించు

1. స్వాధీనపఱుచు, అధీనము చేయు.

క. రుచిరమణిభూషణంబులు, నుచిత విహార ప్రకార యోగ్యాగార,
ప్రచయము సుందరగణికా, నిచయము నొప్పించువాఁడ నీకుం
దరుణీ. విరా. 2-128

2. ఒసఁగు, ఇచ్చు, అర్పించు.

క. (తనుత్రాణము) తెప్పించి తొడుగు మీవని, యొప్పించిన నిట్టునట్టు
నొఱవలుగా మైఁ, గప్పికొని యాబృహన్నల విరా. 4-39

సీ. ...అతఁడు (ఉచథ్యుఁడు) సర్వజలంబుఁ, ద్రావిన వరుణపురంబు
ధూళిమయమైన భయమంది మానినిఁ గొనివచ్చి, యొప్పించి ప్రణ
మిల్లి తప్పు వాపికొని మునికృప గాంచి చనియె. అను. 5-346

మ. జనకుం డంచున్ గురుభీష్ములుం దగిన కర్ణుం డాపులై నీకుఁ బ్రీతి
నెఱిఁగించు తెఱంగు గాదు తమ బుద్ధిం బోయి సంధాన మిట్లొ
నరం జేయక యున్నఁ గృష్ణునకు నిన్నొప్పింపుదు వారు.
ఉద్యో 3-372

శ్లో. స చేత్సంధాస్యతే రాజన్ స్వేన కామేన పాండవైః।
జిహ్వాః కిల త్వాం దాస్యంతి కుంతీపుత్రాయ కౌరవాః॥
సం. భా. ఉద్యో. 127-28

ఒప్పిదము దే. వి. (√ఒప్పు)

1. చక్కఁదనము, సౌందర్యము.

సీ. శాళ్ల యొప్పిద మాఁడుకట్టు నుజ్జ్వలము సేయంగ సంకుల బాహు లంద మెదల. విరా. 1-228

2 వేడుక, ఉత్సవము.

తే. పెండ్లి కని విల్వఁబంచినఁ బ్రియము తోడ, నేఁగుదెంచితి మిన్నాళ్లు నెల్ల యొప్పిదములఁ జూచితి మియ్యెడఁ దడవుగాఁగ, నిలువ దీఱదు పోయి రావలయు మాకు. ఉద్యో. 1-47

3 విధము.

క. తదవసరంబున సాత్యకి, మదమునఁ గౌంతేయుఁ గడచి మంత్రంబున బెట్టిదముగఁ బడవైచిన యొప్పిదమున నస్త్రమునఁ గూల్చె భీష్ముని మాతున్. భీష్మ. 2-80

చ. ఉదిత సమగ్రబోధుఁడగు యోగికి నిశ్చల దీపరూప సంపద సుఖసుప్తి భంగి ఘన పంక్తులు లేని వియత్తలంబు నొప్పిద మొదవుం దరంగముల వెల్లునఁదాఁ జలితంబు గాని వార్ధిదశ నతండకంపుఁడగు ధీపరివృత్తులు గల్గనేనియున్. శాంతి. 6-119

విశే.

1. యోగ్యము, తగినది.

క. బలిభిక్షము గడప కిడన్వలయును దేవపితృ పూజనంబుల కాలం, బులఁ బతి కుశమందుటఁ దత్ఫలంబుగాఁ గోరు టొప్పిదము సతికి శివా అను. 5-296

మ. ఇది యిట్లాలిని బంధులం దొఱఁగి కానీ యగ్నిలోఁ గూరె నొప్పిదమై యుండఁగ నిట్టి తెంప యొలయం బెంపారు వైరాగ్య సంపద. శాంతి. 3-327

క. అది లేనివాఁడు నరకాస్పదుఁడగు నటుగాన ధర్మపమఁ దగుటయ యొప్పిదము మనుజునకు నేఁ, జెప్పెద మఱియును వలయు దాని ప్రీతి వడుగుమీ. అను. 4-252

2. ఒప్పునది, మనోహరము.

మ. మదిరాక్షుండు గడంగి యన్నకు బలోన్మాదంబు రెట్టింప నప్ర
దర జ్వాలతికా క్రియా సముదిహార క్రీడనం బప్పు డొప్పిదమై
యోగ వియోగసంధులు నిరూపింపంగ రాకుండఁ గర్ణదలోపాం
తము వింతసేయ నడరెన్ రౌద్రంబు శోభిల్లఁగన్. విరా. 3-178

క. విదితంబై యుద్యోగము, మొదలుగఁ బదునొకఁడు పర్వములం
దెంతయు నొప్పిదమై యేనవ పర్వం బిదివా నుద్యోగపర్వ
మిమ్మగు సభలన్. ఆది. 1-48

ఒప్పు దే. అ. క్రి.

1. తగు, కూడు, ఉచితమగు.

మ. పదియేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం, దుది
ముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్.
విరా. 1-7

క. అప్పుయుఁ బరిజనములుఁ దమఁదప్పక కనుగొనుచు నుండఁ దగ
వేది కరంబొప్పని తమకము చిత్తముఁ గప్పికొనుట నుత్తలంబు
గదురఁగ నచ్చోన్. విరా. 2-86

తే. తప్పు సేసితి రిట్టులు దగునె వీర, లేమిగతిఁ బల్కినను నదియెల్ల
మనము, గైకొన వలయుఁ గాకిట్లు గాదు గూడదని నిషేధించు
టొప్పునె మనుజనాథ. విరా. 5-275

ఉ. శాంతనవుండు సర్వకురు సంతతికిం గలవాఁడు గాఁడె యత్యంత
హితంబు లీ పలుకు లాహవ మొప్పదు ధర్మమూర్తితో
ఉద్యో. 2-164

2. ఒప్పిదమగు, శోభిల్లు, ప్రకాశించు.

సీ. ప్రథమాద్రిఁ దోఁతెంచు భానుబింబమువాను, రమ్మునఁ గౌస్తుభ
రత్న మొప్ప. విరా. 1-12

సీ. వక్షస్స్థలంబున వనమాల గ్రాలంగ, వెలిమావు గెడల వాగెలు
ధరించి, వొగలపై హారి యొప్ప నచతర శేతువు, మెఱయంగ వర
ణంబు మెఱుఁగు లడర. ఉద్యో. 4-125

క. తను నొప్పెడుసతి యౌవన,మును మాళన మిట్టి నీకుఁ బోలఁడి యోగం,బన నింత చోరవ యెమ్మెయిఁ, బనుపడియెం జెపుమ దాఁపఁ బనిలే దింకన్. శాంతి. 6-187; విరా. 2-130

3. ఉండు తనరు.

వ. చీఁకటి శాపినం బ్రభాతంబను వింత మానిసి మెలంగి ముసుంగు పుచ్చినట్లు మేలుకని యొలకలు వొదల విదిర్చి కూర్చిగొని కల గొనం బలుకు పులుఁగుల యెలుంగుల వలన నొండొటిం దెలుపు కరణి నొప్పు ధరణీరుహంబులును విరా. 2-240

శా. ద్రోణాచార్య పితామహాదనొప్పి కృతహస్తుల్ బద్ధగోధాంగుళి త్రాణుల్ ...రంగ మధ్యమున నంతన్ నిల్చి రుదగ్రధను, శ్రేణీరమ్యులు ధర్మజ ప్రముఖులై జ్యేష్ఠానుపూర్వంబుగాన్. ఆది. 6-8; విరా. 8-236

4. ప్రశస్తమగు, ఉత్తమమగు.

ఉ. అబ్జగనసంభవులు ఇవుల యందలి క్రొత్తలు పుట్ట నిచ్చలున్, వే ళ్లొక భంగిఁ శాకములు విన్నను నొప్పఁగ జేసిదేసి. విరా. 1-77

వ. అవ్వరుణాభిషేకంబు కంటె కుమారాభిషేకం బొప్పె. కల్కి. 2-188

తే. దీని కంటెను నొప్పెడు వాని నొక్క లతు మొనవుల నిచ్చెద నతు యముగ. ఆది. 7-100

క. ఒప్పని గుణములఁ బరఁగెడు, నిప్పురుషాధములలోన నెల్లఁ గృతఘ్నుం, డొప్పఁడు. శాంతి. 8-470

(ఒప్పఁడు = అధమమగువాఁడు, నీచుఁడు అని భావము)

5. అందమగు, సుందరమగు.

ఉ. ఒప్పెడు మేనుఁ దెంపుగల యుల్లము నాగరికంపుఁ బందమున్, జెప్పక చూప కితని విశేషముఁ దెల్పెడు. విరా. 1-98

6. మెచ్చు, సంతోషించు.

ఉ. శారదీర యేనిఁ జారు చీనాంబరం,బై నఁ గట్టికొనిన యపుడు

హృదయ, మొప్పఁ దొప్పువడక యుండు రూపాదులఁ, బలమికొనవు చతురాదికములు. శాంతి. 4-80

7. బాగుపడు, జీవించు.

ఉ. అక్కట వాసుదేవు పదము పాదరమంబునఁ జేయరైరి పీ, రెక్కడి బుద్ధిమంతులని యిందును నందును లోకమెల్లఁ జే, రుక్కున బ్రమగ్గుటం దలఁప వొల్ల కపాయము సేసిరట్టి యీ, యుక్కువు లెందుమం గలరె యొప్పుదువో ధృతరాష్ట్రనందనుల్. ఉద్యో. 4-20

8. ఒదవు, ఒడఁగూడు.

ఆ. ఒంటిమైఁ గళింగు నురవడిఁ దలపడి, పుత్త్రిసోదరాప్త భూరి సైన్యహీనుఁజేసి కౌరవానీకములు సూడ,నుఱక తంగపెట్టి పఱపుటొప్పె. భీష్మ. 2-84

9. తోఁచు, స్ఫురించు.

ఆ. పొదివి పలువు రేయఁ బొడువ వ్రేయఁగ భగ,దత్తుదంతి రక్తధార లొప్పెఁ, జెలువు రెట్టిగాఁగ జేవురు సెలయేఱు, లున్నతాచలమున నురలునట్లు. భీష్మ. 3-146

10. ఉత్పత్తిలు, కలుగు.

ఉ. తెల్లని తోఁడు వెట్టుకొని తీవ్రగతిం జనుదెంచె మత్స్యభూ,వల్లభు నగ్రనందనుఁడు...శంఖుఁడు విభీషణ శంఖనినాద మొప్పఁగన్. విరా. 3-148

11. అలవియగు. సాధ్యమగు.

ఉ. వైదిక ధర్మచారి జనవత్సల నీమదిఁ బుట్టుకొన్న యు,న్మాదము హీనమానవు మనంబునఁ బుట్టిన వెట్టివోలె న,ప్పాదులఁ దీర్పు టొప్పదు. శాంతి. 1-101

12. రాణించు.

వ. ...సుదేవుం డను బ్రాహ్మణుండు—రాజగృహంబు సొచ్చి... దాని దమయంతిఁగా నెఱింగి...అపేత భూజంబైన వనభూమి యుం బోలె నొప్పకుండియుఁ దన పతివ్రతాగుణంబున నొప్పుచున్నయది. అర. 2-141

13. ఇంపగు, ఇష్టమగు.

తే. ఒప్పకున్నను వాత్మకులో క్త కర్మమూర్ధ్వగతిఁ తెర్పుఁ బరకర్మ మొప్పె నేని, నార్యజనములు గిల్బిషమం[డ్రు దానిఁ గాననదపుము నిజవంశకర్మ మధిప. శాంతి. 1-279

మ. ....ధర్మరతుండైన యజాతశత్రునకు నింద్రప్రస్థ మిమ్మర్ధ రాజ్యరమం బొందుముమీరు గొందఱయినంజాకున్న నీకొప్పదే. భీష్మ. 3-434

14. పూను, వహించు, పెట్టుకొను.

ఉ. ...అనవైౖ, తప్పు ఘటించి నీవునొక తాలిమిగల్గిన వాఁడవై వెసం, బొప్పినఁ దెల్ల నీదు నిలుపోవును జాతముగాక యిచ్చటన్. విరా. 5-98

15. (పెద్దలయెడ) మర్యాదగలుగు, సాధువగు.

వ. ...గురుకృపగాంగేయులకుఁ జగణ సమీపస్థలంబులంబడ రెండుమ గర్ణాభ్యర్ణ ప్రదేశంబులం జనరెండుమగా వాలుగేసి యమ్ముతేసిన నా సవ్య సాచిం జూచి యాచార్యుండు పరిసరవర్తులగు వాత్రజనంబులతో నల్లన యర్జుమం డింత యొప్పియుండునే యని యగ్గించి వెండియు. విరా. 4-250

వి.

1. చక్కఁదనము, అందము, కాంతి, శోభ.

తే. తాను బొచ్చినకతన మత్స్యవతీకు, నింటనిమ్మెయిఁ గ్రొత్త యొప్పుపక మెసఁగఁ నమ్మహాదేవి యున్నెడ కల్లకల్లఁ, దాండు రాజతమూశవపత్ని యరిగె. విరా. 2-208

సీ. తన యొప్పెదురఁ గన్నఁ దగిలి యెవ్వరికైన మలఁగి క్రమ్మఱఁ జూడవలయువాఁడు. విరా. 2-208

తే. దుఃస్థుఁడై యుండియును నొప్పు దొరుఁగకున్న, యన్నరేశ్వరుఁ గనుఁగొని. శల్య. 2-399

మ.... పొల్చె దుర్యోధనుం,డను రాజవ్విభు నొప్పునర్మదకుఁ గామావే శముం జేసినన్,వనితారూపముదాల్చి పొందె నతనిన్ వైదగ్ధ్య;

హృద్యంబుగన్. అను. 1-44; భీష్మ. 2-37

1 విధము, రీతి.

ఉ. ఆ, మఖపూర్వర తోడి జోడియగుమూర్తి యతీంద్రుని యొప్పు గంటిరే. విరా. 1-185

సీ. తలచుచునాఁ దెగిపడ్డ ధవళచామరములు, డిండీరముల యొప్పుఁ బుండరీకములు పొలుపున గరవాలములు మీనభంగియు. ద్రోణ. 1-146

ఉ. తారక శోభితాంబర విధంబునఁ బొల్పెసఁగంగ వాక్రమోదార తలంబు బంధు జనతాకలనంబునఁ దాను జందు వొప్పారవహించి విస్ఫురితుఁడై తనరెం గురు భర్త. ఆశ్ర. 2-38

(ఒప్పార = విధము పూర్తిగా)

3. మేలు,

తే. తగిన వేషంబు దనుఁదాన పొగడుకొనమి, వొచ్చియును గిడువలు కమి యిచ్చివగపకునికి దనకెంత నడవకయున్నఁ బథము, దప్పకుండుట నడువడి కొప్పుసేయు. ఉద్యో. 2-45

4. మర్యాద, గౌరవము.

సీ. అడరి పోరాటకు నదనైనచో నొప్పుపాలివోవఁ బోవుట వోలు నాకొ. భీష్మ. 1-154

5. అలంకారము.

క. కలిమికి నొప్పగు నీగియు, బలిమికిఁ దొడవైన యట్టి బలఁగము నైలోకుల చిత్తములకు వ్రేఁగము, కొలఁది మనన్ గొంతి పెద్ద కొడుకున కమరున్. విరా. 3-190

6. సుందర వస్తువు.

వ. మయుండు లోకంబులం గల యొప్పులందెల్ల నుత్తమ సారంబులు దిల ప్రమాణంబు లాహరించి. అను. 4-425

7. గొప్పవనము.

చ. వినయము విద్యయుం గలుగు విప్రునియందును గోవునందు

వా. వృషభోయు హస్తియందు శౌకపోకకుఁ బోవని తుక్కయందు దాని నడిచి తెచ్చి వండి తిను నీచపుమాలని యందుఁ దుల్యద, ర్శనులు దనంతరాత్ముని నిరంజనునిం గమనట్టి పండితుల్. శాంతి. 5–109

8. పెంపు

క. కనకమయ యూపమొప్పఁగ, నమాన విభవమున నీవు యాగం బొనరించిన యొప్పును నిప్పటినీ, యునికియునుం జూచి వాకు మమ్మల మయ్యెన్. శాంతి. 4–390

9 ఐశ్వర్యము.

తే. అతుల సౌభాగ్యభోగ సమగ్రమహిమ, నొప్పుచున్న నీ దేవుల యొప్పుసూచి, ధృతి దఱఁగి తమ్ముఁదాన నిందించుకొనుచు, హృదయమునఁ బాండవాంగన యెరియవలదె అర. 5–350

శ్లో. దారాణాం తే శ్రియం దృష్ట్వా దీప్తామద్య జనాధిప. సం.భా అర. 236–22

10. వాక్యాలంకారము.

సీ. కౌరవ సేనాముఖంబునఁ దిలకమై, యొప్పి రాధేయాది యోధవరులఁ, గొని పాండురాజనందనులసైన్యములతోఁ దొడరి. ద్రోణ. 1–75

మ. ...వికటాకారంబులై యుండ నొప్పి రణోర్వింబడియున్న భూపతులఁ జూపెన్. కర్ణ. 3-379

విణ.

మంచిది, యుక్తమైనది.

ఉ. ...వలినా, తండొక ఛాయ చూసినను దత్పరతం బనిసేయ టొప్పగున్. విరా. 1-185

ఉ ...వారికొక యాపద పుట్టకయుండఁ గాచుటొప్పై ధరఁ గీర్తికెక్కదె యపాయము సేసిన నింతపుట్టదే. విరా. 2–95

ఒప్పుగందు దే. అ. క్రి.

అందము చెడు.

సీ. ప్రస్వేదమునఁ దోఁగి ఘాలంబుతో నంటి, యుగ్మలి నీటుర లొప్ప
గండె. విరా. 2-156

**ఒప్పుగొను[1]** దే. అ. క్రి.

ఆరోగ్యమునుబొందు; రోగములేమినిఁ బొందు.

క. ఇంతకుమును చూచితి నతఁ,డెంతయు నొప్పుకొనియుండె నిదిగదుఁ
చిత్రం, బెంత వెసఁజచ్చెనమఁ దమఁ, జింతింపఁడు జనుఁడు మూఢ
చిత్తత్వమునన్. శాంతి. 4-446

**ఒప్పుగొను[2]** దే. స. క్రి.

స్వీకరించు. గ్రహించు.

అ. ఒప్పు గొనుము వీని నుర్వీశయని సుతు, నిచ్చి గంగ సనిన.
ఆది. 4-168

శ్లో. గృహాణేమం మహారాజ, మయాసంవర్ధితం సుతం
సం.భా ఆది. 107-35

వ. ధృతరాష్ట్రుండు...యుధిష్ఠిరు రావించి నీవు సర్వసంపదలు స్వరా
జ్యంబును నొప్పుగొని యె ప్పటియట్ల యింద్రప్రస్థపురంబున కరిగి
సుఖంబుండుము. సభా. 2-264

వ. ఇక్కుమారుండు మేరుగిరి శృంగంబును బోలె వా కెత్తికొన నశ
క్యుండయ్యె వీని నొప్పుకొను మనిన విని బృహద్రథుండు ముదిత
హృదయుండయి దాని కిట్లనియె సభా. 1-151

శ్లో. బృహద్రథ సుతస్సోయం మయా దత్తః ప్రగృహ్యతాం.
(ఒప్పుకొను—అని మూ.అ.వి) సం.భార. సభా. 17-50

**ఒప్పుమిగులు** దే. అ. క్రి. (√ఒప్పు)

ఒప్పారు.

తే. సమర కౌతుకియైన యజాతశత్రుఁ డొప్ప మిగిలెను మైమఱు
పూడ్చి. (ఒప్పుమిగులు = అందమతిశయించు) భీష్మ. 1-152

**ఒప్పుమెఱయు** దే. స. క్రి. (√ఒప్పు)

ఒప్పారు.

సీ. చక్రవాకంబుల చందంబుగొని వచ్చి, కుప్పలు సేసిన ట్లొప్పు మెఱసి
(ఒప్పుమెఱయు = అందగించు) విరా. 2-52

**ఒప్పెసఁగు** దే. అ. క్రి. (√ఒప్పు)

ఒప్పారు.

క. తొమ్మిది ఖండములైన వర్షమ్ములనం జాల నొప్పెసఁగు జంబూ-
ద్వీపమ్మున. భీష్మ. 1-24

**ఒయ్య** దే. అవ్య. క్రు.

మెల్లిగా, తిన్నగా.

తే. ధర్మనందను పలుకులు దనకు హృదయతాప మొనరింప మోముఁన-
దైన్యమొంద, నున్న పాంచాలి యిట్లని యొయ్యఁబలికెఁ, గనలి
కారితో గద్గదకంఠి యగుచు. ఉద్యో. 3-100

చ. కృపుని శరీరమొయ్య నొఱగెన్ రుధిరచ్యుతి మూర్ఛ వచ్చినన్.
ద్రోణ. 5-5

తే. అవని బడనీక శాఖఁ జంచువునఁ బట్టి, పట్టి వారల సుస్థితుల్
పల్లటిలక, యండ వెరవున ధరియించి యొయ్య నెగయఁ, జూచి
యవ్వాలఖిల్యులు చోద్యమంది. అను. 1-238; అర, 7-393

2. శీఘ్రముగా.

సీ. అంతఁ బులోముఁడన్ వింత రక్కసుఁ డగ్నిహోత్ర గృహంబున
కొయ్య వచ్చి. ఆది. 1-129

ఆ. శల్యుఁడట్లు నేలఁద్రెళ్లి చెచ్చెర లేచి, యొకలు దుడిచికొనుచు
నొయ్య జనియె, వానిఁజూచి నగుచు మామగా విప్రులు, భూరి-
సత్త్వ భీముఁ బొగడి రంత. ఆది. 7-202

**ఒయ్యన** దే. అవ్య. ఒయ్య.

1. తిన్నగా, మెల్లగా.

క. పొందైన తెప్ప విరసపుఁ, గ్రందయ్యెడు చందమైన రాజులవెల్లన్
ముందఱ రావించి క్రమం, బొందఁగ మముఁ బిలువఁబంపు-
డొయ్యన పిదపన్. ఉద్యో. 1-15

వ. (ద్రౌపది) అరుగుదెంచి యంతంత నవనీకాంతుఁగాంచి యధిక శోకాక్రాంతయై యార్తింగూరి యాక్రందనంబుసేయు నమ్మాద్రీ పుత్త్రుం డొయ్యన యయ్యంగన నరదంబు డించె సౌప్తి. 2-26

క. జడనిధి చందంబున నిమ్మడుతు వొప్పఁగ నిప్పుడేమి మాఁదెనె యిమ్మై, నడచిపడ రిత్త నెవ్వఁగ, లుడుగుఁడు మఱి చూచికొంద మొయ్యన తఱితోన్. శాంతి. 2-189

క. కడుమేలటు సేయుదమని, యొడుబాటుం బలుకుపలికి యొయ్యన పిదపన్.

అశ్వ 1-151; అశ్వ. 1-171; అశ్వ 3-191 అర. 6-232

2. క్రమముగా.

చ. ఇది ప్రళయాగ్ని పోలె దెసలెల్లను గప్పఁగ విస్ఫులింగముల్, వద లక వాయుసారథి జపంబునఁ దాఁటవచ్చె నేమిసేయుదు సుతు లార యీ బిలము నొయ్యనపోయి చొరుండు దీనిఁ గప్పెద ఘన పాంసు జాలముల మీను శిఖానల దాఁకకుండఁగన్ ఆది. 6-304

శ్లో. ఇనమూఖోర్వ్యస్త్రీలం భూమా వృక్ష స్యాస్య సమీపతః, తథా విశధ్వం త్వరితా వహ్నేరత్ర నవోభయః

సం. భా. ఆది. 256-16

ఒయ్యనొయ్యన దే. అవ్య.

మెల్లమెల్లగా. క్రమక్రమముగా.

తే రక్తసంసిక్తమైన ధరాతలమున, వార్తిఁ బొరలుచు నూర్పు లం దందపందడింప జీవంబు వెడల నుంకింపఁ జేష్ట, లొయ్యనొయ్యన యడఁగంగ నున్నయధిపు. సౌప్తి. 1-218

(ఒయ్యనొయ్యనన్-అని ద్రుతప్రకృతికముగా సూ.అ.ని. భారతేతర ప్రయోగములు చూపెను.)

ఒయ్యారము దే. వి.

విలాసము.

సీ. హారముల్ మెఱయ నొయ్యారంబుగా గుచ్చి యందంబు వింతగా నలవరింతు. విరా 1-107

**ఒర** దే. వి.

సామ్యము, సాటి.

క. అప్పుడు మధ్యందినమున, నొప్పిన యిను తోడఁ జాల నొరవచ్చి గురుం, డప్పాండవ బలములపైఁ, దెప్పదొరలఁ గురిసె శరతతిం దీవ్రముగాన్. భీష్మ. 2-881

**ఒరగు** దే. అ. క్రి.

ప్రక్కకు వ్రాలు.

క. అందొరగి కీచకుం డా, యిందీవరనయన నాత్మనిడి వేడ్కమెయిన్, డెందము చని విచ్చలవిడిఁ, గందర్పుఁడు వెట్టిఁ జేయఁగా నిట్లనియెన్. విరా. 2-809

సం.ము. అకాడమి తి వ.ప్ర.కో-పాఠములు లము రేఫలు ఆనంద

(ప్రతిపాఠము శకటరేఫము)

**ఒరయు** దే. స. క్రి.

1. ఎదుర్కొను, ఢీకొను.

ఆ. ఎలమిఁ గడచిపోవు బిలుచుఁ గ్రమ్మఱవచ్చి, ముక్కుముక్కుమీఁద మోపుఁ జుట్టు,వేచి తిరుగు నీఁక పీఁకలతో రాయుఁ, నొరయుఁ జిత్రగతుల మురియు నవ్వు. కర్ణ. 2-66

2. రాచు, సంఘర్షణము చేయు.

ఆ. వాని రసముపొంగి వాహినీమూర్తి నన్నగమునకుఁ బ్రదక్షిణంబు గాఁగ, నొరసికొనుచుఁ దిరిగి యుత్తరకురుభూము, లందుఁ జొచ్చి పారు నంబుధికిని. భీష్మ. 1-19; అర. 7-377

3. (ఒకరినొకరు) అతిక్రమించు, దాటు-తలకడచు.

సీ. మెఱయు తేజంబున మిఱుమిట్లుగొన నిద్ద, ఱచ్చట నొరసికొం చ రుగఁ జూచి. ఉద్యో. 2-147

శ్లో. తేషాం మనశ్చ తేజశ్చాప్యాదదానా దివౌజసా,
పూర్వదేవౌ వ్యతిక్రాంతౌ నరనారాయణౌ నృపి.

సం.భా. ఉద్యో. 48-5

**ఒరలు** దే. అ. క్రి.

అఱచు, విలపించు.

క. ...మనసై ,వ్యమ్మెల్లఁ బదియఁబఱచె భయమ్మున మొగ తిరిగి దిక్కు లద్రువ నొరలుచున్. భీష్మ. 2-246

**ఒరుఁడు** దే. సర్వ. (బహు.) ఒరులు

అన్యుఁడు, ఇతరుఁడు.

క. నరుఁడొక్కరుండు దక్కఁగ, గురుఁడు గడగినపుడు మాఱుకొనఁ బాపధరుం, డొరుఁడు గలడెఁ. విరా. 5-128

సీ. ...ఒరుని, వనితఁ దొల్లెనఁ బాదినవాఁడు అను. 5-99

క. నరులకు నాకుం దక్కఁగ, నొరులకు మీరూపు మాపకున్నది. విరా. 1-176

చ ...ఇట్టియోగఁ డెట్లొకొ యొరు వాక్రయించు. విరా. 1-98

క. ఇప్పొం దుఁ గలదె యొరులెవ్వరికిన్. విరా. 1-49

**ఒరులు** దే. సర్వ. ('ఒరుఁడు'-నకు బహువచన రూపము)

ఒకొక్కరు.

తే. కార్యవైభవ ప్రాభవకాచములకు, నొరులకైనఁ గై వారమై యుల్లసిల్లు, నొక్కరుని తివి యొల్లను నిక్కముట్టె విరా. 2-204

**ఒరువుఁడు** దే. సర్వ. (బహు. ఒరువులు - బహువచనమునందే ప్రయోగము)

ఇతరుఁడు.

ఆ. ధనము గలిగి యుండి ధవళాక్షి కుడువక, కట్టకుండు పరమ కిష్ట జనము, లొరువులొత్తి చెప్పుమపకారులై తొలు,పుట్టునందు మనిన యట్టివార. అను. 5-88; అను. 5-99

**ఒరువులవాఁడు** దే. వి.

ఇతరులకు సంబంధించిన మనుష్యుఁడు.

క. నేఁడింక నెఱిఁగి యొరువుల, వాఁడఁగదా యనుచు నేను వారిఁ దొలఁగినం, బోడిమిసెడదే మదిఁ గడు, బాఁడిగలదె వాకు నకట వారిజనాభా ఉద్యో. 4-85

**ఒఱ** దే. వి.

ఖడ్గాది కోశము.

వ. కరవాలంబు దాన నొఱ వెలికి విగుడుచున్నయది.

ఉద్యో. 2-146

**ఒఱగవాడు** దే. అ. క్రి. (√ఒఱగు)

తొలఁగఁ ద్రోసికొనుటకై పలుకు.

క. నీవును మృత్యువుఁ బాప సమావేశితమతుల కొఱగ వాడిన యం
తం తోవుచు మీపై దోషము లే వెఱకునె యిట్టులనిన యింతవ
మీకున్. అను. 1-29

**ఒఱగు** దే. అ. క్రి. ఒరగు

1. వంగు, వ్రాలు, వ్రేలఁబడు, పడు.

సీ తన యూర్పువెలుఁగునఁ దలఁకు వైరులు వొంగ, వొఱబుచు
నేలకు వొఱగె వేఁడు. భీష్మ. 1-47

మ. ...కరివ్రాతముల్ ధరదంతంబుల యూఁతగా వొఱగె మద్య
ద్భావము దృప్యత్కృటో త్కరముల్ దిట్టవయట్లు గూడఁ గలయం
దద్భాణ పాతంబులన్. విరా. 5-290

క. అఱకడ నిడి ప్రాఙ్ముఖుఁడై పఱచి జలధిలోనఁ బదలఁ బాఱెడు
నెరఁ జెయ్యుతి దప్పి నిలువఁజాలక, యొఱగిన గాలవుని డించె
నాకగిరి మీఁదన్. ఉద్యో. 3-310; ఆ. 4-385; కర్ణ. 2-39

2. క్రిందఁబడు, నేలకువ్రాలు.

క. ద్విరదము లొఱగెడివియు నెత్తురు గ్రక్కుచుఁ గూలెడివి...
అయ్యెఁ బవనపుత్రు మునుమునన్. భీష్మ. 2-218

క. మీరెల్లఁ జూచుచుండఁగఁ గౌరవ నికురుంబమునకుఁ గర్తయై
యొప్పారిన భీష్ముఁడు వడియొను, మేరువొఱగినట్టు లసమువిగుల
నరుదుకున్. ద్రోణ 1-31

ఆ. ఆయుధములు విడిచి యంగముల్ సోంగఁ, దలలు మొదలుఁ
బక్కనిలువ కొఱగ, వెల్లవారు వెఱక వెదరి చొక్కి నిద్రా

తిశయము గూరినట్టులైరి. విరా. 5-208

3. పక్షపాతము వహించు, ఒకరిపై నభిమానము పూను

ఆ. ఒఱగఁ బలికి లేని సుందుదు ప్రజ డేఁగ, గనిన పులుఁగుపిందు కరుణిఁ జెదరు. శాంతి. 3-374

**ఒఱటు** దే. విశే.

మూర్ఖుఁడు, మొఱకు.

ఆ. అలు బిడ్డ లొఱటులై లేమిఁ గుందుచుఁ, దెవులుచేతఁ బడుచు నవయ జనులు, మున్ను క్రోధ లోభముల నాస్తికతఁ బర,పీడనంబు చేసి చేర్చినారు. అను. 5-98

**ఒఱపిడి** దే. విశే. (ఒఱపు + ఇడి)

అయోగ్యుఁడు.

క. అన్నలుఁ దమ్ములు గలుగుట, యున్నతుఁ జేయు నృపు నెంత యొఱపిడియైనన్, మన్ననయు నీగియును సం,పన్నంబులు గాఁగ వారిఁ బాటించుటురున్. శాంతి. 2—356

**ఒఱపు** దే. వి.

1. నేర్పు, నైపుణ్యము.

క. పెఱవారలుఁ దమ మెలఁగెడు, తెఱఁగుల దొరకొన్న వింత తెరువుల నేర్పుల్, మెఱయుచుఁ బలిచిత్రము గొన, నొఱపు గలిగి మాన్యవృత్తి నుండుదురు దగన్. విరా. 2—21

2. పద్ధతి, విధము, రీతి. మార్గము.

సీ. ఎవ్వని చారిత్ర మెల్లలోకములకు నాజ్ఞయై వినయంబు నొఱపు గఱపు. విరా. 2-191

3. బాధ, తాపము.

సీ. అడవులఁ దిరిగెడునపుడు దుష్టదైత్యులచేత సైంధవునిచే నొఱపు లఁబడ్డ విషాదంబు. శాంతి 1-120

క. అఱపోఱడు కురుచ చేతులు, నోరవ శరీరంబు గలిగి యొరులకుఁ బాదం, గొఱగాకుండియు మన్మతు, నొఱపుల బడియెడు నితండు

యువతీ ప్రీతిన్. అర. 2-134.

4. ఉపాయము.

గీ. శక్రుతేరైన నడపంగఁ జాలువాఁడ, నొలవు సెప్పుడు రథికు నేమఱఁగ నీవు. కర్ణ. 1-514; (పాఠాంతరము).

విణ.

యుక్తము.

క. మొఁగలొలవుగఁ దీర్చి కొమఁడు, దనతన వాహనము లాయుధముల్ లెల్ల జనం,బును ననువుసేసి కొమఁ డొలిన యంతయు గాచి కొమఁడు బెదరక వసులన్ విరా. 4-89

ఒలలు దే. అ. క్రి.

అఱచు, విలపించు, ధ్వనిసేయు.

క. నెఱి దప్పఁబడి పెల్లుగ, నొలలెడి గరవాజి కరుల యులి వఱిశు మ్యం,డఱిమఁ ఱిఁ బడుటకు వగ మడఁ, బఱిగొన నిల పెలుచ నఱచు థఁగిఁ ఔలంగెన్. ద్రోణ. 2-182

సీ. తనయార్పు పెలుఁగునఁ దలఁకు వైరులు వొంగ, నొలలుచు నేలకు నొరిగె నేఁడు. భీష్మ. 1-47

2. క్రిందఁబడు.

తే. ఘూరి రయమునఁ గూలు మహీరుహంబు; తెఱఁగు దోఁప సుదతుఁ డొలలి కెడసె. ద్రోణ. 3-95; కల్హ. 1-365

శ్లో. పశాతాభిముఖశ్శూరో యంత్రముక్త ఇవ ధ్వజః,
శేతేస్మ నిహతో భూమౌ. సం.భా. ద్రోణ. 92-72-73 శ్లో.

ఒలవ దే. విణ

వక్రము, విశ్రుతము.

ఆ. ...పంగు వొలవగఁ గాలుసే, విఱిచి సాధుజములఁ బఱిచినాఁడు. అము 5-100

క. అఱపొలుడు కుఱుచచేతులు, నొలవ శరీరంబుఁ గలిగి యొరులకుం బాడం, గొలగాకుండియు మన్మథు,నొలపులఁ బడియెడు నితండు యువతీ ప్రీతిన్. అర. 2-134

2. కాఱుమాఱు, వ్యత్యస్తము, తల్లక్రిందు.

క. తెప్పించి తొడుగు మీవని, డుప్పించిన నిట్టనట్టనొఱవలుగాఁజైఁ, గప్పికొని యా బృహన్నల, యప్పుడు నగుపించె నచటి యబలా జనమున్. విరా. 4-39

శ్లో. ఊర్ధ్వముద్ధిష్య కవచం శరీరే ప్రత్యముంచత. సం.భా విరా. 36-25

ఒఱవతనము దే. వి.

వక్రత్వము, కుటిలత్వము,

తే. పిఱికితనము నేమఱుటయు నొఱవతనము, మెత్తఁదనమున గార్యంబు నత్తెఱంగు, నేరమియు విషయంబులఁ గూరుటయును, గలుగు పతికి మందరు సిరి దొలఁగిపోవు. అర. 6-84

ఒఱవలువోవు దే. అ. క్రి.

వంకరలు వోవు.

వ ఉబ్బున గుబ్బంబుల కుఱికి బదలువడ నఱిమి విసరిన నొఱవలు వోయిన సురియం జెరివి. (పాఠాంతరము) భీష్మ. 2-71

ఒలయించు దే. స. క్రి.

1. నిలుపు, ప్రదర్శించు.

తే. అచలభక్తి నిత్యంబు నా యందు నీకుఁ, గలిమిఁ జేసి నీయంతరంగమున నాదు, దివ్యరూపంబు నొలయించితిం బ్రమోద, భాజనం బైతి భీష్మ తపస్స్వరూప. శాంతి. 2-110

శ్లో. యతః ఖలు పరాభక్తిర్మయి తే పురుషర్షభ,
తతో మయా వపుర్దివ్యం త్వయి రాజన్ ప్రదర్శితమ్.
సం.భా శాంతి. 50-10

2 కలిగించు, పొందించు.

క. బలసి మనో వాక్కాయంబుల ద్రోహాభావ మఖిల భూతముల యెడం, గలిమి దమ శీల మది మేలొలయించును దాన మల్ల మూన్పము పుత్రా. శాంతి. 3-147

క. అనిన విని ప్రీతుఁడై య, జ్ఞవిభుఁడు గృహాస్థధర్మ సాకల్య

ష్ఠా.నని రూఢి వాడు చిత్తం.బున నొలయింపు భవదీయ పుణ్యపంక్తులన్. అను. 3-333

3. వైచికొను, వహింపఁజేయు

క. పలుకుపడి నతనిఁ బాపం.బులు విడుచుం బలికి నతనిఁ బొందును బాప్ం.బులు నొరుపాపము దనపై, నొలయింపఁగ నేల నిందయుడిగినఁగాదే. శాంతి. 5-658

ఒలయు దే. అ. క్రి.

ప్రకాశించు.

సీ. తెలిగన్నుఁ గవకు వెచ్చెలితియైన తేటఁన వ్వొలయంగ సరసంపుఁ బలుకు పలికి. విరా. 2-64

సీ. అరదముల్ దెరలించునప్పుడు పఱ మొగుల్ విరియించు బలుగాడ్పు విధము మెఱయు, హాయములఁ దెండాడ నరుగు చోట్లను లేళ్ళగమిఁ గిట్టు కోల్పులికరణి యొలయు. శల్య 1-282

2. కలుగు, జనించు,

చ. అనుడు విరాటు డుల్లమున నక్కటికం బొలయంగ నంగనం, గనుఁగొని కీచకుం గినియఁగాఁ దగు సత్త్వము లేమిఁ జేసి సాం,త్వనములు పల్కి. విరా. 2-144

క. అని యిట్లొలయు వితర్కం,బునెడ హృషీకేశుఁడైన పురుషోత్తము దర్శనమును క్రమమున వెతిఁగినఁ, మునివర్గము శిష్యవర్గమున్ బోధించున్ శాంతి. 4-328

ఆ. పౌర్ణమాసిఁ బూర్వపక్షాష్టమీ చతుర్దశుల నుభయపక్షవశత వచ్చు షష్ఠిఁ బంచమిని సునిష్ఠమై నుపవాసమున్న, వివిధ శుభము లొలయు నంద్రు. అను. 4-147

వ. అతని తోయస్తంభన వైదగ్ధ్యం బెఱుంగుట నొలసిన యుపాంటను ముందటి యట్లవారలతోడం జని చని. శల్య 2-46

3. అతిశయించు.

క. వే రుక్కునఁ బొదివిరి నరు నతఁ డెక్కుడు మద మొలయఁ జేసి

యే_్రైఆ మూ౯ెన్. ద్రోణ. 3-41

4. స్ఫురించు, తోంచు.

తే మోకవరులు కుచిస్థానముగఁ బ్రశంస, సేయుదురు విలసత్వ విశేష-
మెఱిఁగి, కాన యింపై శ్మశానంబు మానసమున, నొలసెఁ గావున
నయ్యెడ మనికి గలిగె. అను. 4-437

క. (మూతాత్మజుఁడు) మనమునఁ గుంతీ వాక్యంబును వొలసిన
నేయుటుడిగిపోయి కదిసి నవ్వునమో మొప్ప నతనికిట్లను వింటం
గదుపు లీల నల్లఁ బొడుచుచున్. ద్రోణ. 4-288

శ్లో. వ్యాయుధం వావధీచ్చైనం కర్ణః కుంత్యావచః స్మరన్,
ధనుషోఽగ్రేణ తం కర్ణః స్పృశిత్వా పరామృశన్.
సం.భా ద్రోణ. 139-67

4. వ్యాపించు, ప్రసరించు.

చ. అతని మొగంబుమీఁద నొలయన్ మధురంబగు చూడ్కి పార్వతీ,
పతి మృదురీతి నిట్టులను. శా ప్తి. 1-181

వ. అత్తపోధనవర్యుం డాదరమేదురావలోకనం బాభూపాలునిమీఁద
నొలయ నిట్లను. శాంతి. 3-360

వ ఆ సర్వలోక శరణ్యుండు గారుణ్యామృత మయంబైన చూడ్కి-
వా మీఁద నొలయ నిట్లనియె. అను. 1-377

6 ఉన్ముఖమగు, ఇష్టపడు.

సీ చెప్పిన విని యుధిష్ఠిరుఁడు ప్రస్థానంబునకు మది యొలయ నన్న
రుని తోడ. మహా. 4

7. పరివేష్టించు.

ఆ. ....(దమయంతి) మరసిద్ధ, పార్థివకన్య లట్టి సఖులు మూగ్వు,
రొలసి తన్నుఁ గొలుచుచుండఁగ మహి నొప్పుచుండె, అర. 2-4

సీ. సకల భూపతులుఁ గాయక భక్తియుక్తులై, యొలసి నీ పనులు
సేయుదురు పేర్మి. నలా. 2-102

8. కదలు, చలించు.

వ. దుశ్శాసనకరాకృష్ట వికీర్ణవేణి భరంబు వెనువెంట నొలయం బాంచాలి పంచపర్వతంబుల నడిమి నదియుం బోలెఁ బతులనడుమ భయవ్యాకులం చిత్తయైన. అర. 1-107

9. ఉండు, వర్తిల్లు.

తే. క్షరము నక్షరమును ననం గలవు రెండు, మూర్తులాత్మ కభిల భూతములను బూర్వ, మొలయు మృతమన దివమున నుండు నమృత, మనఁగ నపరంబు రెంటిని గను బుధుండు. శాంతి.5-111

తే. అమల ధర్మార్థ కామమోక్షముల గుఱిచి, యొలయు తెరువెద్ది యును నిందుఁగలుగు నదియ, యొండెడలఁ గల్గు దీన లేకుండు చొప్పు, దక్కొకంటను లేదు వేదజ్ఞులార. స్వర్గ. 82

శ్లో. ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ,
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న కుత్రచిత్.
సం. భా. స్వర్గ. 5-50

10. కలయు, కూడు, ఏకమగు.

తే. ఒలసి నీ పుత్రులెల్ల నొండొరుల తోడ, నెట్లొడంబడి యుండుదు రట్ల చేయవలయు. సభా. 2-181

ఆ. ఒలసి లోభమోహములు దోషసంసేవనం బొనర్పఁగా ఘనత్వ గాథ,యగు నవిద్య భూమిరై బహుకర్మ బీజముల కంకురాది శక్తు లొసఁగు. శాంతి. 4-344

క. అలఘులు రైభ్య భరద్వాజులు దమలో సుహృదులై విశుద్ధత పోని,శ్చలితమతు లివ్వనంబున, నొలసి తపంబొప్పఁ జేయుచుండిరి నెమ్మిన్. అర. 3-252

11. దిగు, అవతరించు.

ఆ. విష్ణుపదము వలన విధుని వలన సూర్యు,వలన మేరు రూపకలితుఁ డైన, విష్ణువలనఁ ద్రిపుర విజయమౌళి వలన, మఱి హిమనగమున నొలసె గంగ. అను. 2-118

12. సిద్ధించు, సమకూరు.

తే. గోవులకు మేలు సేయంగఁగోరు వాదు,చిత్తమున మద్వరంబున సిద్ధమైన, తెలఁగ యొులసె దైవికమయి దీని పెంప, యావ హించెదనని యిచ్చె నవ్వరంబు. అను. 8-128

13. వశమగు.

తే. ఇంద్రియంబుల వాశింటి నిట్లు విషయ,ములకు నొలయకయుం డంగ నిలువరించి, తలఁపు లుడిగి తేవియఁ బ్రమదమున వాను, శంగిఁ దృప్తుఁడవై యుందు పరము గాంతు. శాంతి. 5-181

14 సక్తమగు, తగులువడు.

క. ధనమేటికి నీ విప్రుని, మన మొులయఁగవలయు ధర్మమార్గంబున దానన సర్వసంపదలునగు, నని నిశ్చయమొంది వినయ మతిశయ మందన్. శాంతి. 5-348

శ్లో. ధర్మేఽస్య రమతాం బుద్ధిర్ధర్మం చైవోపజీవతు
సంభా. శాంతి. 271-26

తే. ఉత్తమంబెద్ది నీ చిత్తమొులయు నెందుఁ, బరుసుడెయ్యది గల్గినఁ బొందు సఖల, కర్మబంధ మోతము నట్టి ధర్మమెయిుఁగఁ, జెప్పవే కరుణాలత చిగురులొత్త. శాంతి. 5-542

15. ఆవేశించు, ప్రవేశించు.

వ తేజోరూపంబున నతని తనువున నావేశించె నిట్లు రుద్రుం డొలసిన యగ్గురునందమఁ దమంద హర్ష మయ మూర్తియై.
సౌప్తి. 1-184

శ్లో. అథావిష్టో భగవతా భూయోఽ జ్వాల తేజసా.
సం. భా. సౌప్తి. 7-66

16. ప్రతిష్ఠితమగు, స్థిరపడు.

క. నిర్మలమగు వేదాంతిక, ధర్మము నారాయణోదితంబై క్రియలం, గర్మఠుఁడగు బ్రహ్మమతిని, ధార్మికవర యొులసె నతఁడు దయ పిగురొత్తన్ శాంతి. 6-495

17. అలవడు.

క. ఏమను నిట్టుల మోహా,ధీనుఁడనై యాత్మఁగాంచు తెఱఁగొల
యుటకుం, బూని పడుదు వెయ్యది యో,గానం దెరువా కుశప్రకరం
బునకున్. శాంతి. 6-551

18. విజృంభించు, చెలరేఁగు.

క. ...ఖేదము గలిగిన నలఁతు రొలసి దస్యులు ప్రజలన్.
శాంతి 2—815

స. క్రి.

1 పొందు.

క. అమలంబగు నీ యితిహా,సము భక్తిఁ బఠించిన ప్రశాంతి యొలసి
దుః,ఖములం దొఱఁగి మనుష్యుం, డమృతత్వావాప్తి మహితుఁడై
వెలుఁగొందన్. శాంతి. 4-860

తే. ...వినుము నాదు, బుద్ధి యనవుడు నతఁడు ప్రబోధ మొలసి.
అను. 5-858

చ. అనుడు నజాతశత్రుఁ డిటు లన్నలు దమ్ములు శోకము గాఁగ కృష్ణ
వశల బంధుకోటులను బంపెడు తెంపొలసెన్. శాంతి. 5-872

మధ్యాక్కర :- తిలలందుఁ దైలంబు కాష్ఠముల యందుఁ దిరముగా
నగ్నిఁ గలుగు చెఱఁగి యుపాయ పూర్వమునఁ గడగి తత్సిద్ధి,
యలయక యుత్సాహవంతుఁడు వడయు నట్లనుత్సాహ, మొలసి
దైవపరుఁడది వడయంగమ నోపునె యెందు. అర. 1-234

2. అభిలషించు, కోరు

తే. శక్తి రాక్షస నిహతుఁడై చనిన శోక,దహన హతుఁడై వసిష్ఠుండు
దాసిఁ దలఁచి, కడఁ ప్రశాంతాత్ముఁ డయ్యు రాక్షస వినాశ, మొలసి
మనుమని వారింపకుండె నంత. ఆది. 7-149

ప్రహరణ కలితవృత్తము :- ఇది యిటులగు టెఱిఁగి పలికెవా,
పిదురుఁడు సభఁ గోవిదులు వొగడఁగా, నది వినియును నే నడపన
దురితం, బొపవెఁ గలక నే టొలయ కుడుగునే. స్త్రీ. 1-185

8. కొన్ని యెడల వాక్యాలంకారముగా నుపయోగపడి 'ఇష్టపడు, సమ్మతించు, కలుగు' అను నర్థముల సూచించును.

క. ఒలయు జరావ్యాధి ప్రభృతులు శారీరములు గాఢశోదక శోకాదులు మానసములు. శాంతి. 4-103

క. ఒలసి మనోవాక్కాయంబుల ద్రోహాభావ మఖిల భూతముల యెడం, గలిమి విను శీలమది. శాంతి. 3-147

ఆ. ఒలసి యెంతకాల ముండిన నేను మీఁదానఁగాన యొరుల ధనము నన్ను, నెన్నఁడయిన వొరుల కిచ్చుచో నసురకు, భోజనముగ నిచ్చి పుచ్చుఁ డిపుడ. ఆది. 6-257

తే. ...అడవిలోన, వొలసి పదునాల్గు వర్షంబు లుండ వానతిమ్ము రాముని. అర. 6-302

ఒలిపించు దే. స. క్రి. (√ఒలుచు)

(చర్మము, బట్ట మొ) ఊడదీయించు.

వ. సహదేవుం బనిచి ధర్మతనయుండు దాని చర్మం బొలిపించి. విరా. 1-160

తే. అన్నదమ్ములు వెత్తంబులాడి సతులఁ, దలలు వట్టి సభాస్థలంబులకు నీడ్చి, చీరలొలిపింతురే. ఉద్యో. 3-367

ఒలియు దే. అ. క్రి.

(చర్మము మొ) ఊడినదగు.

క. వదలక పెనఁగి పదుంద్రం, బదియేవుర వొక్కపెట్ట పట్టి ధరిత్రిన్, జెదరఁ బడవైచి పవనజుఁ, డదయుండయి వీఁపులొలియ నందఱ నీడ్చెన్. ఆది. 5-165

ఒలుకు; ఒన్కు దే. అ. క్రి.

1, స్రవించు, కాఱు, ప్రవహించు.

ఆ. ...ముక్కున వాతను, నెత్తురొలుక మల్లునెత్తివైచె. విరా. 2-17

తే. ఉచ్చిపోయిన యేటుల వొలుకు శోణితమున సర్వాంగకంబులుఁ దడిసి యొప్పె. ఉద్యో. 6-321

చ. ...గజంబుల వ్రేసిన నెత్తురొల్కఁగా, నతి పడె.
భీష్మ. 2-360; కల్కి. 2-285; స్త్రీ. 1-77; ఆది. 2-24

స. క్రి.

చల్లు.

తే. ...విప్రులును వనితాజనంబు, సేసలొలుక సింహాసనాసీనుఁడయ్యె.
విరా. 1-232; ఉద్యో. 3-182

వ. ఉమ శ్రీ సరస్వతీ శచీప్రముఖులైన పుణ్యాంగనలు దీవనలతో సేసలొలుక.
కల్కి. 2-183

వ. దాని నోడకుండుమని మునివరుండు హుంకారంబున రాక్షసు వారించి వానిపయి మంత్రపూతంబులైన కమండలు జలంబు లొలికిన.
ఆది. 7-125

**ఒలుచు; ఒల్చు** దే. స. క్రి.

1. (చర్మము, బట్ట మొ) ఊడఁదీయు, ఊడుచు.

ఆ. పసులు మరలె శత్రుబలములు పీనుంగు, పెంటలయ్యె రాజుఁబెద్ద దొరలుఁ, జీరలొలువఁబడిరి.
విరా. 5-222

శా. వారిరత్నము నట్లుదెచ్చి సభలో నవ్వారలుం జూడఁగాఁ జీరల్ ప్రోవులుగాఁగ నొల్చుటయు.
ఉద్యో. 1-232

వ. తగుసుపాయంబు చింతించువాఁ డప్పుడ చంపి తిత్తొలిచి గాలి గొనవైచిన తుక్కుకడిమంబు గనంగొని.
శాంతి. 3-225

2. పెఱుకు, పీఁకు.

సీ ...లోచన, గుళికల నొలిచి మ్రింగుచును.
స్త్రీ. 2-9

ఆ. ...గ్రద్ద లొలిచి తినంగ నీసుకృతపరుని నిట్లు సూడనలనె.
స్త్రీ. 2-185

3. (మనుష్యులను) దోఁచు (ధనాదులను) అపహరించు.

సీ ...వారలవాయి గొనక యప్పులును లన్నియును రజ్జులుగఁ గొనుచుఁ, జాముల నచట నచ్చట నొల్చికొనఁగ వాలోకించి యప్పీర లోకవరుఁడు.
మౌస. 185

**ఒల్లఁబాటు** దే. వి. (ఒల్లమి+పాటు - అని శ. ర.)

ఒల్లమి, అపేక్షింపమి ఉపేక్ష, నిర్వేదము.

ఉత్సాహ వృత్తము :- ధరణినాథ వినుము మధువు ధార తెల్లప్రొద్దు మం, దొరఁగుచుండ నతఁడు వాని దోహలమున నాకుచుం, బొరయఁ దెవ్వఁ దృప్తి వగల ప్రోకయైన యట్టి దు, స్తరవు టున్కి కొల్లఁబాటుఁ దక్కఁ డించుకేనియున్. స్త్రీ. 1-48

శ్లో. న చాస్య జీవితే రాజన్ నిర్వేదస్సముజాయత,
తత్రైవ చ మనుష్యస్య జీవితాశా ప్రతిష్ఠితా.
సం. భా. స్త్రీ. 5-20

తే. ఎవ్వరికిఁగాఁగ ధరణియు నెల్లసుఖముఁ, గోరెదము వారలందఱు వీరె వచ్చి, ప్రాణములు నర్థములు నొల్లఁబాటువేసి, శయ్యమునఁ జావ నలుము ట గంటిగాదె. భీష్మ. 1-182

విణ.

అనపేక్షితము, ఉపేక్షితము.

క. ...ఉద్వృత్త క్షత్రియ ధర్మోత్పాత్తంబగు తేజ మొల్లఁబాటై పోఁదెన్. ఉద్యో. 4-322

**ఒల్లఁబోవు; ఒల్లంబోవు** దే. అ. క్రి. (ఒల్లమి+పోవు - అని శ.ర.)

1. (దుఃఖ భయాదులచే) వివశత్వమును బొందు, ఒడలు తెలియమిని బొందు.

తే. ఇట్లు ప్రార్థించి పాంచాలి యెట్టకేని, సింహబలు మందిరం బల్లఁ జేరనరిగి, యొల్లబోవుచు బెబ్బులి యున్న పొదరు, సొచ్చు లేడి చందంబునఁ జొచ్చుటయును. విరా. 2-122; భీష్మ. 1-50

2. వైకల్యమును బొందు, వికలత్వమును బొందు.

చ. వెరవును లావునుం గలుగు వీరులు పోరులఁబడ్డ హీనతం, బొర సిరి మన్త్రశస్త్రహతి భూవర చిక్కినవారు నొల్లఁబోయిరి. శల్య. 1-45

తే. పలక పఱియలుగాఁజేసి యలుఁగు దునిమి, యొడల వాలంప పొదివింప నొల్లఁబోక, ద్రుపదపుత్రుండు గరవాలు దునియ

వై వ, నడుమఁ బోడిచేసె నాచార్య నందనుండు. భీష్మ. 2-22
(ఒల్లఁబోక = తెమడీయక - అని యర్థము)

3. మూర్ఛవోవు, స్పృహతప్పు.

చ. తలరు నలందురున్ నవయుఁ దావఫరంబున వెచ్చనూర్చు మేఁ, నలయఁగ నొల్లఁబోవు వెగడందుఁ గలంగుఁ బరిభ్రమించుఁ గొం, దలపడుఁ దల్లడం బడరి ధైర్యము దూలిన బెగ్గడిల్లు నిచ్చలవిడిఁ బేర్చు నెవ్వగల నందడి దెందముగంది చేడ్పడున్. విరా. 2-298

ఆ. అడ్డపడి గురుండు దొడ్డవారసము వ్రతుంబు దూఱనేయ సవ్య సాచి, యొల్లఁబోయి తెలిసి పెల్లేసె నక్కుంభ, జన్మమీఁద నిశిత సాయకములు. ద్రోణ. 3-63

ఒల్లమి దే. వి. (√వలచు)

1. ఇచ్ఛగింపకుండుట.

తే. అని సహోదరు లాజి నాయాసపడుట, కోర్వమియుఁ గౌరవులఁ జంపనొల్లమి యును, గలుగు నెయ్యంబు పెంపునఁ గరుణ నార్ద్రుఁ, డైన పవనజుఁ బరికొల్ప నాత్మఁ దలఁచి. ఉద్యో 3-53

ఉ. అక్కట మున్న పాండవుల కల్గఁగ నొల్లమి నెప్పరై తిరే.
భీష్మ. 2-119

చ. ...రాజనీతి యిట్లొడఁబడి చేయవచ్చి వధకొల్లమి యొప్పునె.
ద్రోణ. 5-352

2. అనాదరము.

తే. బ్రహ్మచర్య భిక్షాశన పరత గలిగి, జటితయొండె ముండితయొండె సంభరించి, మసను నాయంద తిరముగా నునిచి యొండు, వస్తువుల దెస నొల్లమి వర్తిలంగ. అను. 5-219

ఒల్లియ దే. వి.

వస్త్రము, పట్ట, చీర.

ఉ. శృంగములేని నీలగిరి చెల్వునఁ గ్రీడి కిరీటహీనుఁడ, యుయ్యం గను పట్టె వెల్లతలయొల్లియ మౌళి దృఢంబుగా నమ, ర్చెం గురునాథ
(తలయొల్లియ = తలపాగ, తలగుడ్డ) కర్ణ. 3-327

**ఒవ్వనిజనము**

సరిపడనివారు, గిట్టనివారు, శత్రువులు.

సీ. ...రంధ్రమొవ్వని జనంబు-తే-వేచు. ఆశ్ర. 2-188

క. ద్యూత క్రీడఁకు గొండొక, చేతుం గపటమున నొవ్వని జనంబులు నా,చేత ధనమెల్లఁ గొని పరి,భూతి యొనర్చిన విరక్తిపుట్టి వెడలి తిన్. విరా. 1-196

**ఒవ్వనివాఁడు** దే. సర్వ.

సరిపడనివాఁడు, గిట్టనివాఁడు, శత్రువు.

సీ. సంధిమై, నొవ్వని వారెల్ల నవ్వఁ దలఁచు, వంది కౌరవులలో వర్తింపనేలని, హరిసోఁడ వాడితి. ఆశ్ర 1-166

క. ఒవ్వని వారల యెదురన, యవ్విధమున భంగపడితి. అర. 6-16

ఉ. ఒవ్వనివారు నవ్వ మహిమోదధి ధర్మసుతుండు. విరా. 2-286

**ఒవ్వమి** దే. వి. (√ఒవ్వు)

1. గిట్టమి, ద్వేషము.

ఉ. ఎవ్వతెనేని ధాత సృజియించెఁ దగన్ మగవానిఁ గాఁగవా, కొవ్వమిఁ జేసి యట్టి నిను నుగ్మలి నేయఁగ నొల్ల వాపయాం, గ్రొవ్వెసలార నీవు శరకోటి వెసం బరఁగించితేని నే, నవ్వరుఁ గాని కోపము మనంబునఁ బుట్టదు సూ శిఖండినీ. భీష్మ. 3-332

క. ఒవ్వమి. గౌరవులకుఁ గడుఁ, దవ్వయి మతి వి పవేషధారుల మయి మ, మ్మెవ్వరు నెఱుంగకుండఁగ, నివ్విధమున నున్న నెట్టు నెఱిఁగితి కిరల్. ఆది 7-217

**ఒవ్వు** దే. అ. క్రి.

(దీనికి వ్యతిరేకార్థమునవే ప్రయోగములు గలవు.)

పరిపడ, గిట్టు, అనుకూలించు.

ఉ. ఒవ్వనివారు నవ్వ మహిమోదధి ధర్మసుతుండు దీనత, న్నెవ్వగఁ బొంద (ఒవ్వనివారు = పగవారు) విరా. 2-286

సీ. ...కూర్చువా రొవ్వకుండు,వారని తనకు నెవ్వరును గల్లక త్రివర్గ

చ్ఛ యెవ్వని చేత నీడవిడువఁ-తే-బరు. అశ్వ. 1-208

**ఒసంగు; ఒసఁగు** దే. స. క్రి.

1. ఇచ్చు.

వ. (బృహన్నలకు) చిత్రంబులగు చీనాంబరంబులిచ్చి మణిమయంబు లగు నాభరణంబు లొసంగి విరా. 1-248

ఆ. అఖిల రత్నపూర్ణ యగు వసుంధరయెల్ల, నొసఁగితేని యొసఁగు యోగ్యశాలి,యుక్తిలేని వాని కొసఁగకు మీ విద్య, తగిన పాత్ర మైనఁ దడయ కిమ్ము. శాంతి. 6-66

ఉ. ...సుబోధమందు సం,భావనసేసి పాలొసఁగు పాడియ కల్గిన శాల్యమాదిగా,నేవిధినైనను తెలుప నింతలు పాపము లాచ రించునే. ఉద్యో, 3-83

2. అర్పించు.

వ. అప్పరమ పతివ్రత భక్తి ప్రీతి వినయంబులు మనంబున నంకురింప లుదంకునకు నక్కుండలంబు లొసంగినం బ్రమోదం బెసంగ నాశీర్వా దంబుసేసి యాసంయమివరుండు. అశ్వ. 3-98

వ. కౌశికరుండగు తని యాత్మాంగంబుల నౌరసపుత్రునిని బ్రాహ్మణా ర్థంబుగా నొసఁగె. శాంతి. 5-82

3. కలిగించు, కావించు, చేయు.

క. ఇతఁడెవ్వఁ డొకొ్క రూపు ని,రతిశయమై మనకును బ్రియం బొసం గెడుఁ జూచితిరే. విరా. 1-258

వ. అమ్మేటి విలుకాఁ డలుకమానిన యలంతి నవ్వుచెలువంబు మొగం బునకు వింత చెన్నొసంగ విజృంభించి. కర్ణ 1-176

# ఓ

ఓ అవ్య.

1. సంబోధమును దెలుపును.

(ఇది సంబోధ్యవాచకమునకు ముందే ప్రయోగింపఁబడును)

క. ...ఇట్టి యేవపుఁ జందంబో యన్న మదన వికృతిం, జేయుననుట యెంతయును విషిద్ధము గాదే. విరా. 2-49

సీ. ...ఓ కర్ణ యోకృప యో సుయోధన వీర నన్నార్తి యెపుడుఁ జెప్పుదురు. ద్రో. 5-322

2. పిలిచినపుడు మాఱుపల్కుటయం దుపయుక్తమగును.

వ. ...శుకుండు మృగపక్షిశైల సరిత్సరసీతరుగుల్మలతలం గలయం గమంగొని మా తండ్రి నా వెనుకం జనుదెంచి నాదగు పేరం బిలిచెనేని మీరెల్ల నో యనవలయుండీ యనిన నవి యట్లచేసెద మనియె. శాంతి. 6-330; శాంతి. 6-334; శాంతి. 6-335

సీ. పేర్కొని పలుమాఱు బిలిచి యోయనుట లేకున్న నయ్యింటిలోఁ గన్నువఱపి. అను. 1-76

3. ఆర్తిని దెలుపును.

తే. ఒక్క దనుజాధముండు మొఱ్ఱో యనంగ, నన్నుఁ జెఱగొని పోయెడు నన్నలార, యెవ్వరిట విడిపింపరే యింత వట్టు,పుణ్యమునఁ బోవరయ్య కారుణ్యబుద్ధి. అర. 5-177

(ఒక్క దనుజాధముఁడు మొఱయో కదంగి - అని ఆనంద వారి పాఠము)

4. సందేహమును దెలుపును.

క. ఉపకారమొ బంటుతనమొ, కృపయో పెంపో సమగ్ర కీర్తి ప్రియమో, రిపు దుస్సహమగు నీరణ, నిపుణతకుం గారణంబు నెయ్యమొ యెఱుఁగన్. విరా. 3-227

ఉ. అతఁడు సమయకాల మంతయుఁ గడచిన వచ్చెనో యెఱుంగ వలయు నిజము. విరా. 5-372

క. ...ముక్తి గలదో లేదో, జనకున కరసెదఁ గాకని. శాంతి. 6-214; సభా. 1-213

5. ప్రశ్నమును దెలుపును.

చ. ...ఏను తె,చ్చెరఁజని కోటరంబు దగఁ జేయుదునో యటుగాక పాడిమై, వరవుడ మోపి చేయుదునొ వారికి మాధవ నిశ్చయిం పుమా. ఉద్యో. 3-112

క. కర్ణ వినమో,యడి కిరవుఁదులువ గెలుచునకొ పాండవులన్. ద్రోణ. 4-184

తే. అతివ పేనమె తగ దేవతాతిథి ప్ర,పూజనంబులు నడచునే పూర్వ వృత్తి, యెడలి యేను లేకునికి నేమేమి వికల మయ్యెనో చెప్పు మనవుదు నా మృగాక్షి. శాంతి, 6—576

6. శాక్యర్థము.

ఉ అప్పుడు ధర్మహానికి భయంపడి నిల్చితివో కడంకతో, నిప్పుడు వచ్చి వాఁడవు. విరా. 5-93

7. ఊహను దెలుపును.

ఉ. ...న,మ్న త్తలమందఁ జేయుటకునో తలపోసి యెఱుంగ నయ్యెఁ డున్. విరా. 2-84

ఉ. ...అసితచ్ఛవిఁ బొల్చు మహోభుజంగమో, నా విలసిల్లి ప్రేలఁగ. ఉద్యో. 3-114

వ. పరమోపకారియైన యీ బ్రాహ్మణునకు నేమి ప్రియము సేయ సమకూరునో యని చింతించుచున్నచో. ఆది. 6-240

8. ఎంత, ఎన్ని – అను సర్వనామములతోఁగూడి పరిమాణాతిశయమును తెలుపును.

ఉ. ...ద్రోణుని పాటుగాంచి యా,నంతయు నాత్మలోనఁ దెలియండు సుయోధనుఁ డెంత మూర్ఖుఁడో. శల్య. 1-352

ఉత్సాహవృత్తము :- శోకవహ్ని తాప మూ,ర్ఛితముగాఁగ బంధు జనుల చిత్త మెంతగుందునో. స్త్రీ. 2—152

9. ఎట్లు; ఏమి మొదలగు పదములతోఁగూడిన వాక్యములందు ప్రయుక్తమగును.

క. సైనికులు నమ్ముఁ గనుఁగొని, యానసములు వాంచి తొలఁగి యరిగెద రదియే,మో నేఁడు వేణువీణా, గానస్వనములును వీటఁ గలుగవు కృష్ణా. ద్రోణ. 2-228

క. ...ఎమ్మెన్ల ద్రావెదవో రిపులెట్టులు, గూలెదరో చూడు వారుఁ గురుబల మెదురే. ద్రోణ. 2-350

క. ...వృథా,మానల నెట్లు జయించెద,వో నమ్మము వా బలంబును గలితనంబున్. శల్య. 1-22

క. దానికి రోసి బృహస్పతి,తో నమరేంద్రుండు మేలు దొరకొను విధమె,ట్లో వావుడు భార్గవునిం, గానఁగఁ జను మతఁడు చెప్పఁ గరుణాన్వితుఁడై. శాంతి. 3-188

వ. ఇది యేమియో కాని నీవుత్తమ క్షత్రి ధర్మంబున సముపార్జించిన యుజ్జ్వల శ్రీ సుస్థిరతం బొందెదుమని యతనికి వాశ్వాసం బొనర్చి. శాంతి. 1-366

10. ఆశ్చర్యమును దెలుపును.

తే. కరము లెయ్యవి శిరమేది గాళు లెచటఁ, జొచ్చె గంధర్వవరులచేఁ జచ్చువారెల్ల నిట్టుల యగుదురో యితనితోడి, యటుకఁజేసిరో యిది కడు నక్కజంబు. విరా. 3-8

ఆ. ఇతఁ డపూర్వమనుజుఁ డెందుఁడి వచ్చెనో, యనుచు నదరిపడి లతాంగులెల్ల, వాసనములు డిగ్గి యవ్వ దభ్యుద్గత,లై రి మనములందు హర్ష మెసఁగ. అర. 2-39

11. కాలనిర్ణయము లేమిని దెలుపును.

క. అని యతని జత్రుదేశం,బున నొక వాలమ్ము వక్షమునఁ జెక్కను గ్రుచ్చినఁ ద్రెళ్లి యెన్నఁడో చచ్చిన యట్లు రథంబు మీఁదఁ జేడ్పడి యుండెన్. ద్రోణ. 2-51

(ఎన్నఁడో = ఎంత కాలము క్రిందటనో)

చ. ...ఇద్దురవస్థ యెన్న డో, తెగుటని సంతతంబును మదిం దలపో
యుదు నేమిసేయుదున్ విరా. 2-207

(ఎన్నఁడో = ఎంత కాలమునకో)

**ఓంకారము** సం. వి. అ. పుం. (అ+ఉ+మ్)

ఓమ్' అను ప్రణవాక్షరము - ఇది వేదపఠనమునకు ముందును చివరను ఉచ్చరింపఁబడును.

క. ఓంకారవాచ్యునకు వన,హంకార నిరూఢ భావనారాధ్యునకున్.
విరా. 1-32

**ఓంకారవాచ్యుఁడు** సం. వి. అ. పుం.

ఓంకారముచేఁ జెప్పఁబడువాఁడు, పరమాత్ముఁడు, సర్వేశ్వరుఁడు.

చూ. ఓంకారము.

**ఓమ్ నమో భగవతే వాసుదేవాయ**

ఇది ద్వాదశాక్షరీ మహామంత్రము (భగవంతుఁడైన శ్రీమన్నారాయణుని కొఱకే నేను. నా కొఱకుఁగాదు. ఆయన కొఱకే సర్వకర్మముల నాచరించెదను. నా కొఱకుఁగాదు నాకు నేను రక్షకుఁడగాను ఆయనయే నాకు రక్షకుఁడు - అని భావము)

వ. ఓన్నమో భగవతే వాసుదేవాయ నమః పురుషోత్తమాయ ...
నమో విష్ణవే ప్రభవిష్ణవే యని యిట్లు పెక్కు మహాజపంబు
అను 6—812

**ఓకస్సు** సం. వి. స్. న.

ఆశ్రయము, స్థానము, శరణము.

క. ఏక ద్విత్రిచతుర్వ్యూహాకారతఁ దోఁచుచుండు హరిభక్త జనా,
లోకమున వాసుదేవా,ద్యోకః ప్రాప్తముగఁ దత్తదుచిత మూర్తిన్.
శాంతి: 6-500

**ఓగిరము** వై. వి. (సం. ఆహారః)

అన్నము, ఆహారము.

క. ముదమునఁ గృష్ణుఁడు గుంతీ, సదనమునకుఁ జనియె నపుడు సమ్మోదమున నన్విదురుం డోగిర మొసరించెదనని తన్నడుగ నట్ల

చేయుం దనుచున్. ఉద్యో 3-181

**ఓఘమాల** సం. వి. అ. స్త్రీ.

సరస్వతీనదిరూపము - సప్త సారస్వతములలో నొకటి,

చూ. సప్తసారస్వతము. శల్య. 2-159

వ. ఒకమఱి యాపరమేష్ఠి యజ్ఞంబున...సుప్రభయు...ఓఘమాలయు ...అను నామంబుల వారివేషయుక్తమై సరస్వతి చని.

శల్య. 2-159

**ఓఘము** సం. వి. అ. పుం.

1. సమూహము

మ. ...ఘోటకవ్రజము కుంభత్స్యందనౌఘంబు. ద్రోణ. 2-307

2. ప్రవాహము.

క. అలిగి నరుఁడు భీముఁడు పితృగోత్రుల నయ్యస్త్ర గురుని గిట్టి శరౌఘం,బులఁ దేర్చిన. ద్రోణ. 5-132

**ఓఘరథుఁడు** సం. వి. అ. పుం.

ఓఘవంతుని కొడుకు.

ఆ. అతని కోఘవంతుఁ డనువాఁడు జనియించె, మదిత యతఁడు వాని కోఘరథుఁడు నోఘవతియు ననఁగ నుదయించి రయ్యోఘ, వతికి వావిభుండు వరుని నరసి. చూ. ఓఘవతి. అను. 1-62

**ఓఘవంతుఁడు** సం. వి. త్. పుం.

ఓఘరథుని తండ్రి, ఈతని కూఁతురు. ఓఘవతి.

చూ. ఓఘవతి.

**ఓఘవతి**[1] సం. వి. తి. స్త్రీ.

ఓఘవంతుని కూఁతురు. సుదర్శనుని భార్య. కురుక్షేత్రమునఁ తపస్వి. భర్తృనిదేశము ననుసరించి యీమె తన భర్త యింట లేనప్పుడైన నతిథి పూజనము చేయుచుండెను. ఒకనాఁడు సుదర్శనుఁ డాశ్రమమునందు లేని సమయమున ధర్మదేవత విప్రాకారము దాల్చి యోఘవతి వలన నతిథి పూజ కోరెను. ఆమె వి పుఁడుగనే భావించి యాతిథ్యదు లొసంగి యర్పించెను. అతిథి యేదికోరిన దానిఁ గావింపుమని భర్తృ శాసనము.

ఈ మాయావిప్రుడామె సంగమము కోరెను. అనుమానించియు, వెను
కాడియు నామె భర్త్రాజ్ఞ దలంచి యంగీకరించినటులఁ గన్పించెను. కపట
విప్రుఁ డామెను చేతులతో స్పృశించెను. ఇంతలో సుదర్శనుఁడు వచ్చి
విషయము గ్రహించి భార్య యతిథి కభీష్టము తీర్చుటయే తన కీతయు
సంతోషము నని పల్కెను. విప్రుఁడు వెలుపలికి వచ్చి తన నిజస్వరూప
మును జూపి సుదర్శనుని యచంచలాతిథి సత్కారదీక్షా వ్రతమునకు
మెచ్చుకొని మృత్యువును జయించు నటుల వరమిచ్చెను. ఓఘవతీ పతి
వ్రతాత్వమునకు భంగము గామిని ప్రసాదించి ఆమె శరీరము నుండి
ఓఘవతియనునదియై యాకురుక్షేత్రమునఁ బ్రవహించుచుఁ దనయందు
స్నానముచేసిన వారి సర్వవిధ పాపములు బోఁగొట్టి పవిత్రులను జేయు
నటులను ఓఘవతి రూపముతోడ పరలోకమున సుదర్శనునకు సేవచేయు
నటులను వర మొసంగి యంతర్హితుఁడయ్యెను.

సుదర్శనుఁడు అగ్నిహోత్రునకు సుదర్శనకుఁ బుట్టినవాఁడు చూ.
సుదర్శనుఁడు.

తెలుఁగు భారతమున సుదర్శనుని కుమారుఁడు ఓఘవంతుఁడు అతని
కూఁతురు ఓఘవతి — ఓఘవతి సుదర్శనుని భార్య.

క. అనలునకు సుదర్శనకును, జనియించె నుదాత్త గుణవిశాలుండు
సుదర్శన నామధేయుఁ డాన్నృపు డనూన ధర్మమునఁదాల్చె నవనీ
భరమున్ -వ- (ఆ సమయంబున) ఆ. అతని కోఘవంతుడను
వాఁడు జనియించె, నుదిత యశుఁడు వాని కోఘరథుఁడు, నోఘ
వతియు ననఁగ నుదయించి రయ్యోఘవతికి వావిభుండు వరుని
నరసి. వ. ఒరుల మెచ్చక. క. ఆలేమ సుదర్శనునకు, నాలింగా
నిచ్చె నద్దహన నందనుఁడున్. లోలతఁగై కొని పరిణయ, కేలి నడపి
విమల బుద్ధిఁ గృతనిశ్చయుఁడై. అను. 1-60, 61, 62, 63, 64

దీనిని బట్టి తాతకు మనుమరాలు పెండ్లామను అపభ్రంశత గానవచ్చు
చున్నది- సంస్కృతమున నిట్లున్నది.

శ్లో. ప్రతిజగ్రాహ చాగ్నిస్తు రాజకన్యాం సుదర్శనామ్,
విధినా వేదదృష్టేన వసోర్ధారామివాధ్వరే ॥

తస్యా రూపేణ శీలేన కులేన వపుషా శ్రియా
అభవత్ప్రీతిమానగ్ని ర్గర్భేచాస్య మనో దధే
తస్యాం సమభవత్పుత్రో నామ్నాగ్నేయ స్సుదర్శనః
సుదర్శనస్తు రూపేణ పూర్ణే దుసదృశోపమః
శిశురేవాధ్యగాత్సర్వం పరంబ్రహ్మ సనాతనమ్
అథౌఘవాన్నామ నృపో నృగస్యాసీ త్పితామహః
తస్యాథౌఘవతీ కన్యా పుత్ర శ్చౌఘరథోఽభవత్
తామోఘవాన్ దదౌ తస్మై స్వయ మోఘవతీం సుతామ్
సుదర్శనాయ విదుషే భార్యార్థే దేవరూపిణీమ్
సగృహస్థాశ్రమరత స్తయాసహ సుదర్శనః
సం. భా. అను. 2-35, 36, 37, 38, 39, 40 శ్లో.

దీనినిబట్టి సుదర్శుని కొడుకుగాఁడు ఓఘవంతుఁడు. ఓఘవంతుఁడు నృగుని తాత.

**ఓఘవతి²** సం. ఈ. (స్త్రీ).
కురుక్షేత్రమందలి ఒక నది. అను. 1-82
చూ. ఓఘవతి

**ఓచెల్ల** దే. అవ్య.
సంతాపార్థకము.
క. నా చేసిన కీడునఁ గడు, నీచుండగు నా తనూజు నేరమి నిమ్మై,
నోచెల్ల పార్థులకుఁ బుణ్యాచారుల కెందులేని యాపద వచ్చెన్.
అర. 5-327

**ఓజ** వి.
విధము. పద్ధతి, రీతి, పోలిక.
శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా,
తంగ స్ఫూర్జిత యూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చు నో,జం
గాంతార నివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వచ్చెం గుంతీసుత
మధ్యముండు. విరా. 4-95
క. తేజోధనుఁడగు నరుఁ డుద్భ్రాంతగతి నడుమ మొలపి బడబాగ్ని
దశం, బై జలనిధిఁ ద్రెక్కొనియెడు, నోజం గురుబలము పేర్మి

యుడిపెం దోర్దోన్. విరా. 5-58

ఉ. రాజులకెందు వారయఁ బరాక్రమ జీవనవృత్తి దక్క నొం,డొఁజ నిషిద్ధమంద్రుడు. ఉద్యో. 4-14

ఆ. మేలు దనకుఁ గోరు మేదినీశుఁడు మున్ను, దేవతలకు భూమి దేవ తలకుఁ, బూజ యాచరించు నోజ యత్నముఁ జేయవలయుఁ రెండుఁ గార్య ఫలకరములు. శాంతి. 2-166

క. రాజోచిత ధర్మంబుల, యోజ విశదతంగఁ జెప్పితి. శాంతి. 4-8

2. కౌశలము, నేర్పు.

వ. మఱియు నవేళ గతుల యోజలు మెఱయుచుఁ గొండొక నేవు విరాటునకు వినోదంబు సలిపి. విరా. 2-16

క. రాజునకుఁ దియ్య మెసఁగెడు, పూజావచనముల నెయ్యపుం బలుకులఁ జేరోజమెయి బంధు మిత్ర సమాజములకు మేలములఁ గుమారులకుఁ దగన్.

వ. ఇంపు పుట్టించుచు. ఉద్యో. 8-179,180

3. ఉత్సాహము.

సీ. ...ముంద, రోజమై బ్రాహ్మణ భోజనం బొనరించి, సపరివార ముగ విశాలరమ్య, పూత స్థలంబునఁ బుండరీకాక్షుడు, దమ్ముండుఁ దాను మత్స్యవ మెలర్ప. ఉద్యో. 8-229

తే. ఏనుండ వెఱవేల నాపగా త,నూజుఁ బొదువుఁడు మీరని యోజఁ జెప్పె, శక్ర తనయుండు తనయోధ జనులకెల్ల, భీష్మ. 8-406

క. రాజు గురుఁ డెల్లవారికి, రాజోత్తమ గురునియాజ్ఞ రంజిల్లఁగఁ జేరోజం జేసిన కృత్యమ్ము, మూ జగములు రెంటియందు శోభన మిచ్చున్. ఆశ్ర. 1-28

వ. హాలికుండెంతయు నోజతో దునఁగ సీరాగ్రంబునం జోఁకి ప్రాణు లనేకంబులు పచ్చు. అర. 5-57

4. పాడి, నీతి, ధర్మము, తగవు.

సీ. ధైర్యంబు వచనమాధుర్యంబు శౌర్య దైన్య క్రోధ లోభ నిరాస

కర్త-అ-మోజ యతనియందు నైజంబులు. శాంతి. 5-32

ఓజ² దే. వి.

ఉపాధ్యాయుఁడు. గురువు.

సీ. శకునిఁ జూచితె మురసంహార యితఁడు మాయాజాలములకు
నాఁ డోజ సకల మాయలు నీచేత మడిసె. స్త్రీ. 2-186

ఓజస్సు సం. వి. స్. న.

బలము, శక్తి.

రసధాతువు మొదలు శుక్రధాతువు వరకుండు ధాతువులయొక్క ఉత్కృష్టమైన తేజస్సే ఓజస్సు, దీనివలన శరీరమునకు హృదయము నందుడి సర్వవ్యాపియై బలము స్థైర్యము శక్తి మొదలగు గుణములు గల్గును. శుక్రము యొక్క స్వచ్ఛత, ఆధిక్యమును బట్టి దీని బలాబలము లుండును.

సీ. శశితారకమున నోజః ప్రాప్తి. అను. 8-168

శ్లో. ఓజస్తు తేజో ధాతూనాం శుక్రాంతానాం పరంస్మృతమ్
హృదయస్థ మపి వ్యాపి దేహస్థితి నిబంధనమ్"

ఓట దే. వి. ఓటమి, ఓటము (√ఓడు)

1. భయము, వెఱపు.

(ముని కుక్కకు శత్రుజంతువుల వలన భయము లేకుండఁ దత్త ద్రూపముల నిచ్చుట)

సీ. ఒక మత్తకరిఁ జూచి యోటమై నొదిఁగిన నుద్ధత కరిఁజేసి యొసఁగె జయము. శాంతి. 3-98

2. విజయము.

ఆ. మాట పొందెఱింగి యోటమై నల్లవ, శీరి కౌరవేంద్రు చిత్త
వృత్తి, కనుగుణంబుగాఁగ వావదూకుండగుచుఁ బ్రార్థించి యడుగ
కున్నఁ దెలుఁగువడదు. ఉద్యో. 1-21

3. అపజయము.

ఆ. ...అక్కిరీటి కోలుతలకు నోట లేక, దుష్కరంబు చేసి తుదిగన్న

పుణ్యాత్మ, కలితగతుల మేలుగలుగు మాకు. ద్రోణ. 1-221

4. కొంకు, సంకోచము.

ఉ. ఓటకొకింతయేనియు సుయోధను చిత్తమునందు లేదు నీ మాట
లం బోవునే దురభిమానము హెచ్చెడు పూనఁగాక.
ఉద్యో. 3-104

అ. వీఁడె వచ్చుచున్నవాఁడు పార్థుఁడు మన, మేమి సేయువార
మీవు దక్క, నొరులు నిలువరింప నోపెదు వారలే రోట లేక
కాఁకి యొర్వవలయు. విరా. 5-131

**ఓటమి** దే. వి. (√ఓడు)

1. అపజయము.

క. వినుము యుధిష్ఠిరు సైరణ, మనవారలు వెఱపుగా సమర్థింతురు
డీ, కొనఁగాఁ దగరని వానినఁ, గని యోటమి వెట్టినట్లు కౌరవ
నాథా. ఉద్యో. 2-12; ఉద్యో. 4-355

క. గెలుపును నోటమియును ననఁ గలుగవె యెడవెట్టి యెట్టి ఘను
లకు. ద్రోణ. 4-289

2. భయము, వెఱపు.

ఆ. ఒరుల వలనఁ బుట్టు నోటమియును వెగ్గుఁ, బొరయకుండ నరసి
పుత్త్రివరులఁ, దగిలి కాచునట్టి తల్లి సర్పములకు, నేల యలిగి
శాపమిచ్చెనయ్య. ఆది 1-159

**ఓటము** దే. వి.

భయము, వెఱపు.

గీ. అశ్వమేధమునకు నర్చితంబైన యీ, యశ్వరాజు నిట్టు లపహరించి,
ప్రముచ్చుగొంటిక యీ సముద్రదేశంబున, నోఁట మెనఁద లేక
యున్నవాఁడు. అర. 3-68

**ఓటాటు** దే. అ. క్రి. ఓటాఱు

1. ఓడిపోవు, పరాజయ మొందు.

ఉ. ఇంతకుమున్న వీఁక నెంతయు నోటటిపాటె నీవునా, పొంతకు
వచ్చి యింక నెటవో నగుసంచు. ద్రోణ. 2-99

2. భయపడు.

ఉ. ...వే,కన్పు శరాళి నూతుఁడు దెగన్ హరు లోటుఁజి గ్రేళ్లు వాఱఁగన్. ద్రోణ. 4-125

గీ. అధిపతియు నస్త్రగురుఁడు బేరగ్గలికలఁ, దఱుమఁ జతురంగములుఁ బేర్చి యుఱుక వారి, మొనలతోఁ దాఁకి గాండీవముక్త విశిఖ, శిఖల వేఁడిమి కోటఱి చెదరి పఱచె ద్రో. 5-138

**ఓటాయు** దే. అ. క్రి. (ఓట + ఆయు)

నిష్పత్త్వుఁడగు.

క. వేతోర విలుఁగొని యెమ్ములు, గీఱు మెఱుఁగు నారసములు గిఱి కొలిపిన నో,టాఱి మెయిం గ్రొన్నెత్తురు, వాఱ సతఁడు దేరి మీఁదఁబడి మూర్ఛల్లెన్. ద్రోణ. 5-188

క. కిమ్మీర మర్దమనిచే, నిమ్మెయి నోటాయఁ జెక్కు లేటులువడి ద,ర్ప మ్మెడలి మూర్ఛమునిఁగియుఁ, గ్రమ్మఱఁ గురువాతుఁ డెట్లు గడఁగెనొ యనికిన్. భీష్మ. 2-408

**ఓటుప(వ)డు** దే. అ. క్రి. (ఓటు + పడు)

1. అపజయమునొందు, ఓడిపోవు.

వ. రేపకడయ కద్రువయు వినతయుం జని యత్తురంగంబుఁ జూచి వినత యోటువడి కద్రువకు దాసియై నోపి పనులు సేయుచు న్నంత. ఆది. 2-87

ఆ ...మన్మథార్తు వన్ను,వొడిచి తిందు రాత్రి యుద్ధంబుసేసి, కా,మోపభోగ నిరతుఁ డోటు వడఁడ. ఆది. 7-62

వ. ప నోటువడితినేని నఖిల మహీరాజ్యంబు నీ యది నీ వోటు వడితేని దమయంతి నా యది యని పలికి యొడ్డి నలునితో జూదమాడి యోటువడిన. అర. 2-228

2. తిచ్చపడు, భ్రమాపడు, నిశ్చేష్టితుఁడగు.

వ. ఇట్లతని రూపాతిశయంబున కోటువడి చూచుచు నిజాంతర్గతం బున. విరా. 1-214

వ. తదుత్సాహంబున కోటువడి యాసైన్యంబు జనంబులు హాహా కారంబు లెసంగ దీనదశం బొందె. కర్ణ. 3-15

ఉ. ...వారలు పోర వారి దోర్బలలు సూచి కోటువడి రెండు బలం బుల యోధవీరులున్. శల్య. 1-322

3. మోహపడు, వలపుగొను.

వ అదియు నమ్మహీపతి రూపయౌవన సౌందర్య విలాసంబులు కోటు వడి మహానురాగంబున వానిన చూచుచున్నంత. ఆది. 4-145

వ. సహజ కుండల కవచాభిరామం బయిన తదీయమూర్తి విభవంబున కోటువడి దేవా భవత్సమాన రూప సుందరుండగు నందనుం గరు ణింపవేయని మనంబునఁ గోరుచు మంత్రోచ్చారణంబు సేయు చున్న. అర. 7-326; అర. 3-311

4. భంగపడు, వైఫల్యమునొందు.

క. త్వరితము సేయక కార్యము, చిరంతన విమర్శనముగఁ జేసి యొన రృన్, ధరణీశ్వర యోటువడఁడు, పురుషుఁడు సిద్ధియును వానిఁ బొందు దృఢముగన్. శాంతి. 5-262

స. క్రి.

(ద్యూతాదులందు) కోలుపోవు, పోగొట్టుకొను.

సీ. (శకుని) అనియను జూదంబునందుఁ బ్రాణ మోటు పడియె.

స్త్రీ. 2-136

ఓడ వై. వి. (సం. పోడః ప్రా. వేడో, బేడో)

నావ, పడవ.

క. నడవడియను మున్నీటింగడవం బెట్టంగ నోడకరణి దగి శాస్త్రోదఁ గూడు ననిన సత్యము, గడచిన గుణ మింక నొండు గలదే యర యన్. ఉద్యో. 2-39

క. వినుమయ్యేబులలో వాహనముల యోడలుగఁ జూడ నక్కుజ ముగు నుత్కృన నుద్దామ విహారం, బొనరించిరి వీరయోధు లుర్వీ నాథా. శల్య. 1-181; శాంతి. 1-585

**ఓడరేవు** వి. (√ఓడ)

సముద్రమునందుఁగాని నదియందుఁగాని ఓడలు నిలుచు రేవు.

చ. ...పరాశరుఁడమ్మునీంద్రుఁ డయ్యతివఁ దలోదరిం గనియె నయ్యమునానది యోడ రేవునన్. ఆది. 3-36

**ఓడవల్పు**

పడవ నడపు.

ఉ. ఎందులదాన వేశతమ యియ్యమునానది నోడసల్పుచున్, సుందరి నీకు మన్కి యిది నూడఁగఁ దా నుచితంబె. ఆది. 4-172

**ఓడి** దే. వి.

రయము—వేగము.

సీ. తెకిదంపు వట్టోడిఁ బడిన పేరడవి చందంబున బహుళ పరాతి చయము.

(వట్లోడి, దావాగ్ని మొదలగునవి పాఠాంతరములు)

**ఓడిపోవు** దే. అ. క్రి.

పరాజయమొందు.

ఆ. ఓడిపోయి డప్పినూని గట్టును శెట్టుఁ జేరి యొదిగియున్న వారిఁ గాఁగఁ, మనలఁ దలఁతు రరులు. సౌప్తి. 1-52; విరా. 5-305

**ఓడు** దే. అ. క్రి.

1. (యుద్ధాదులందు) అపజయమునొందు, పరాజితుఁడగు.

క. ...నిలువక వెఱ,నుఱికెం దన రథముమీఁది కోడితి పోపో,పిఱికి యని పలికి కుఱుముగ,నఱికెం దత్సేనఁ బార్థనందనుఁడు వడిన్.

ద్రోణ. 1-174; ద్రోణ, 1-301

క. పాండుపాగ్రజుఁ డయ్యర్జునుఁ జూచి వీని విడువుము, యని నోడిన వాని హీను నయశోవిధ్వన్. ఆది. 7-46

2. శంకించు, అనుమానించు, వెనుదీయు.

సీ. సుకవి నీమై చక్కఁ జూచుట కోడెదఁ, గనుఁబాటు వోరయునో యని తలంచి. విరా. 2-46

3. భయపడు, వెఱచు.

వ. నీ వోడకు మీ కూడిన కురుబలంబులం గెలిచి కర్ణ గాంగేయ కృప ద్రోణ ద్రౌణి దుర్యోధనులు గమంగొనుచుండఁ గదుపులం గ్రమ్మఱించెద. విరా. 4-149

క. తనుఁ జూపి యోడ కోడకు, వినతాసుత యనియె. అను. 1-375

ఉ. అ న్నవవారివాహ నివహమ్ములఁ జూచి భయప్రపన్నుఁడై, యున్న హుతాశనున్ విజయుఁ డోడకుమంచును మారుతాస్త్ర మ, త్యున్నతచిత్తుఁ డేసె. ఆది 8-276

క. తన వెనుక కోడిపాఱిన, ఘనయోధులఁ జూచి శౌరు గర్వ స్ఫూర్తిం, దనరుచు నోడకుఁ డోడకుఁ, డని పలుకుచుఁ దాఁకెఁ గర్ణుఁ డమరేంద్రసుతుసె. ద్రోణ. 1-383

శ్లో. తమాధి రథిరాక్రందం విజ్ఞాయ శరశైషిణామ్, మా భైష్టేతి ప్రతిశ్రుత్య యయా వతిముఖోర్జునమ్.

సం. భా. ద్రోణ. 32-51

సీ ...వాసవి తోడి కయ్యంబున కితఁ డోడె నవరె. శాంతి. 1-9

శ్లో. భీతో రణే శ్వేతవాహో దిమాం మంస్యతే జనః

సం. భా శాంతి. 1-30

4. పాఱు, పరుగెత్తు.

తే. ధూళి పెల్లుగ నెగయంగ నేల గోడివడఁకఁ జుమ్మూఁకఁ గని వడవడ వడఁకి, పాఱుదేరంగ నమ్మహాభాగుఁ డప్పు, డోడ కోడకుమని నన్నుఁ గూడవచ్చి. విరా. 5-286

5. లొంగు, వశుఁడగు.

ఉ. పాడియు సత్యముం గలరు పాండుతనూజులు నీకు పుత్త్రులం, బ్రాడికి నోడ రత్తెఱఁగు పాపము సేయఁగఁ జూచి తీవు న, క్కిట్టటు సేయకే లుడుగు గెల్వదె ధర్మువు. భీష్మ. 2-230

6. కోపించు, కినియు, కలుషించు.

చ. కమకనిఁగూడి దుర్జనులు గానక చూడక రేమొ పావ్యవాహ
మునకు నిన్నుఁగంటిమని యాడిన నందుల కోడి మమ్ముఁ బయ్యనఁ
బతు లుజ్జగించిరి ప్రియంబున నింకిట నీవు మాకు నందనుడవు
మమ్ముఁ బోవ విహితంబు గుమారక నీకవశ్యమున్. అర. 5-241

శ్లో. పరిత్యక్తా భర్తృభిర్దేవ సంమతైః,
అకారణా ద్రుషావిష్టై స్తు పుణ్యస్థానాత్ పరిచ్యుతాః
సం. భా. అర. 229-8

7 తుముస్నంత ధాతురూపముల చివరఁజేరి వ్యతిరేకార్థమును సూచించుచుం.

వ. ఎర్గానినేని తాల్చిన నాయుధంబులు దాఁక నోడునట్టి వాడని
వనజంబులు గలిగిన యింద్రమాల యను కమలమాలికయును.
ఆది. 3-24

(తాఁకనోడు = తాకని, తాకుటకు చాలని అని యర్థము)

స. క్రి.

(ద్యూతాదుల యందు) కోల్పోవు, పోఁగొట్టుకొను.

క తేరి పట మగలు నీకును, వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్,
వారిజలోచన నీవైఁ, గూరిమిగల మగని వెదకికొమ్ము మొరు
ననఁదే. ఉద్యో. 1-350; కర్ణ. 3-118

పిఱ.

(వృత్తియందు మాత్రమే భావవిభక్తికముగాఁ గన్పట్టుచున్నది.)

ఓడిది. ఓటలు వాటిఁది.

తే పందునకు బిడ్డ నిచ్చిన చందమొందు, బాదిలో వేయి వేల్పుటఁ
బోలు నోటి,కడవ నీళ్లులు వెట్టిన కరణియగు న పాత్ర జనులకుఁ
బెట్టుట శౌరవేంద్ర. కర్ణ. 1-382

ఓదనము సం. వి. అ. పుం. న.

అన్నము, వంటకము.

క. మునిపతి విశ్వామిత్రుఁడు, దనయాఁకలి కెందు మెలఁగి దైర్య
మెడలి యోదన మాంస మూలఫలంబులు, జనుల నడిగి యొందఁ
బడయఁజాలక దప్పెన్. శాంతి. 3-288

క. ఘృత నదులును నోదన పర్వతములు దధికుల్యములు నవారిత రస,
పూరిత బహు విధోపదంశోన్నత పుంజంబులును తత్క్షణంబున
గురిసెన్.

ఆది. 7-96

ఊదము వి.

ఏనుఁగులను బట్టుకొనుటకై త్రవ్వెడు గొయ్యి, అవపాతము.

క. వలయురి నూదము గాలము, గలిగిగదా మృగముఁ బక్షి గజము
ఝషము దంతులు వట్టుదు రట్టుల తల్లులు పెక్షానంబు కలిమిఁ
జూతురు పురుషున్. శాంతి. 4—181

ఊపమి దే. వి. (√ఓపు)

అసామర్థ్యము.

వ అర్జునుండు...యాదవ కళత్రంబుల వెల్లఁ దోడ్కొని వచ్చుచో
గాండీవ దివ్య బాణంబుల శక్తి దఱిఁగిన వనచర భయంబు వలనఁ
దత్కళత్రంబుల రక్షింప నోపమియు.

ఆది. 1-64; అను. 4-384; ఆది. 1-64; అను. 4-384

ఊపిక దే. వి. (√ఓపు)

ఓర్పు, తాలిమి, విసుగుతేమి.

సీ. ...విప్రభిక్ష యోపికగల్గి పెట్టుచు వర్తించు. అను. 4-353

ఊపు దే. అ. క్రి.

1. చాలు, సమర్థమగు

మ. ...రణలీలా దశరథన్ మన్మనో,రథముం దీర్పఁగ వీర లోపుదురు
దోర్గర్వం బఖర్వంబుగన్. విరా. 164; విరా. 1-79

ఆ శుక్లమునకు మనసు మాత్మరూపము మనో,బలము నిల్వరింపఁ
బక్వబుద్ధి, యోపుఁ దరుణవృద్ధు లోవ రక్షాన దౌర్బల్య మూఢ

వికలభావు లగుట. శాంతి. 4-308

ఉ. ...విప్రుఁ డోపు నోపఁ దలిశాంతుఁ డయ్యె నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్. ఆది. 1-100

2. ఇష్టపడు, సమ్మతించు.

ఉ. అక్కట యేము వేడ్కపడి యాచెడు వానవ మర్థిఁ జేరఁగా, నొక్క నికృష్టఁబంచుటకు నోపక చెప్పిన దిని నీవు గో, నెక్కఁగఁ జేసి నిమ్న నతిహీన విధాన నియుక్తఁ జేతగా, నిక్కము యుమ్మతించి తిది వెయ్యము తియ్యము కల్మియే సఖీ. విరా. 2-68

సీ, ...నాదగు జరాకారంబు దగిలి తాల్చి, తన జవ్వనంబు నాకొన రంగ నెవ్వఁ డినోపు నాతండ నదీప సకల, ధారుణీ సామ్రాజ్యభార యోగ్యుండగు. ఆది. 3-95; ఆది. 5-218

3. శ్రద్ధ గలుగు.

ఉ. ...యజ్ఞములుం దపంబులుం, జేసిన పుణ్యముం బడయఁ జేయును దానము లోపి నిత్యమున్. అను. 3-347

ఉ. మానవుఁ డోపి యాశ్వయుజమాసము రెండవ నష్టమిం దగంబూని దినత్రయంబు పరిపూరిత గోష్ఠశలంబునన్ వ్రతాధీనతఁ జెందయన్నమును ధేనువు మూత్రమూర బాలుఁ దానముం, గా నియతిన్ వసించి బహుకామ్య ఫలంబులఁ బొందు భూవరా. అను. 3-16

4. ఏమఱుపాటు లేకుండు, అప్రమత్తతతో నుండు.

తే. అగ్ని యోపి రక్షింతు రహస్యమైన, దాని వెలిపుచ్చ గర్భంబు దాల్చియున్న, యపుడు నాచవులెల్లను నవులఁబెట్టి, దాని కెయ్యది పథ్యముల్ దానిఁ గొందు. అను. 4-361

5. పనివడు, అక్కఅపట్టు.

సీ. దివిజు రాఁబడుఁ బ్రువ్వు దివియయొత్తినవారిఁ శాపంబు నొందునే యోపి దున్న, నాఁగేటిమొనఁ బచ్చు పొవాఁధ ప్రాణు

లన్నరుఁ జొంతుమే యథుష్మ. అను. 5-58

6. ఇది తుమున్నంతముల కనుప్రయు క్తమై తద్ధర్మానర్థకమగును.

సీ. రాజ నామమునకు భాజనంబై మహోద్భుత చరిత్రుండగు పురుషుఁ డొకఁడు, గలిమికి మూలంబు ఘన విశేషము గల్గనోవుఁ గౌరవ కులదీపజనన. (కల్గనోపు = ఉండవచ్చును) శాంతి. 2-197

ఉ. ఆసతి ద్రౌపద గాఁగనోవు. విరా. 3-115

(కాఁగనోపు = కావచ్చును)

స. క్రి. అ. క్రి.

సహించు, ఓర్చు, సైచు.

సీ తెవులుగోటులంబైనఁ దీర్పు సంకటమున, కోపి మును పటి యట్ల రూపు సేయ. విరా. 1-101

తే. ఎన్నఁడును మున్ను వారల యేపునోపఁ, గాన మెట్లు సముద్రంబు లోన బుట్టి,సైపఁ గొన్నంత గొమఁగాక వారి గెల్వ,మాకు శక్యం బె చవిగాని మాటలేల. భీష్మ. 2-282

వి.

ఓపిక, బలము, శక్తి.

ఉ. ...అన్నపైఁ, దప్పుఘటించి నీవు నోకశాలిమి గల్గిన వాఁడవై నెపం,బొప్పినఁ జెల్లె నీదు నిలుపోపును జాతముగాక యిచ్చటన్. విరా. 5-88

శ్లో. యోత్స్యే హి మయా పార్థ మత్ర పశ్యామి తే బలమ్. సం. భా. విరా. 58-56

ఓము దే. స. క్రి.

1. రక్షించు, కాపాడు, పోషించు.

చ. కొడుకులుఁ దమ్ములుం గలన ఘోరవుఁ జావులు పావఁజూచి యె, ట్లోడఁబడె నీదు బుద్ధి యెడుద లోముటకై నిను రాజరాజ యి,మ్మడువున కిట్టి తెల్పె విధి. కర్ణ. 2-57

ఉ. ధర్మసాధనంబు దనువు ధర్మము పరిజ్ఞానదాయి యట్లుగాన
తనువు, వోమవలయు మర్త్యుఁ డేమిట నేమఱ, కాత్మహితము గోరి
యనఘచరిత. అశ్వ. 1-164

సీ. ...పుత్త్రుల రాజ్యవైభవంబు విడిచి మేమోమక యడవికిఁ
బోయిన, తల్లికి వగచెద ధర్మసుతుఁడు, భీమసేనుండును బీభత్సుఁ
డును దన కడుపునఁ బుట్టిన కొడుకులట్టి. ఆశ్ర. 2—169

2. దాఁచు, వంచించు.

(భీష్ముఁడు దుర్యోధనునితో)

క. అనిన విని నవ్వి యతఁ డిట్లను నింతననేల నన్ను నని వారొయిడ
లో,మిన చోటుఁ గలదె వెలిదుర్యోధనికాయంబైన నకట తలఁకదె
చెపుమా. భీష్మ. 3-7

3. నిలుపుకొను, అఁపియుంచు.

చ. ...నీవు పోవఁగా, వాడ లిటు లోమితిం గురుకులోత్తము యేవాక
సేవకుంతనే. హ. పూ. 1-224

**ఓయన** దే. అవ్య.

ఒయ్యన, మెల్లగా, తిన్నగా.

క. ఈయగ్ని దేవుఁ డసురకు, నోయనఁ జెప్పుటయు విని మహోగ్రా
కృతితో, నాయసుర నమ్మ సూకర,మై యప్పుడ యెత్తుకొని
రయంబునఁ జనుచోన్. ఆది. 1-188

"భీతో ఒన్నకాచప్ప కాపాచ్చ కృగోరితప్రవిచ్చనై :"
సం. భా. ఆది. 5-33 (నిర్ణ)

**ఓర** అవ్య.

ప్రమత్తత, వెనుదీయుట.

ఆ. వీడె వచ్చుచున్నవాఁడు పార్థుఁడు మన,మేమిసేయు వార మీవు
దక్క,వారలు నిలువరింప జాలెడువారు లే,రోరసేక కాఁకి
తోర్వవలయు. విరా. 5-181 (పాఠాం)

**ఓరగించు** దే. స. క్రి. (√ఓర)

తిరస్కరించు.

చ. అని యని యుగ్గడించు ధృతి యల్లలనాడిన దల్లడించుచు న్నై,
కొను తలచోరగించు మదిం గోర్కులు పేర్చిన నప్పళించు.
విరా. 3-31

**ఓరగిలు** దే. అ. క్రి. (√ఓర)

1. ఒదుగు, తొలగు, వెనుదీయు.

గీ. కల్లు భూపాలకోటి మొగ్గరము లెల్లం, గలగం దిరుగుడు పడ నోర
గిలగం జెల్ల,గిల్లం దల్లడపడ రణక్రీడ సల్పె. భీష్మ. 1-268

2. ఒఱగు, వ్రాలు, పడు.

వ. అయనయ్యయుం దమ్ముండును గపిబలంబు లడల ధరణీ తలంబునకు
నోరగిలి విలయకాలపతితులయిన సూర్యేందుల చందంబున
నున్నం గని. అర. 7-125

**ఓరలువాలు** దే. అ. క్రి.

ప్రక్కలకు ప్రసరించు.

చ. లలిత తనూవిలాసముల లజ్జకతంబునం జేసి మున్నువి,చ్చలవిడిం
బట్టంగా వెరవుపాలక యోరలు వాలు చూపులన్, లలిందలక్రాలు
వోయునెడలం దగవొందిన నూలుకొల్పి యి,మ్ములం బచరింతు
రొండొరుల మోహనమూర్తులపై వధూవరుల్. విరా. 5-398

(ఓరలు వాలు చూపులు = క్రేగంటి చూపులు. వాలు చూపులు)

చ. ...న,వ్వొదవెడు మోముతో నతని నోరలు వాలంగం జూచు.
వాతం డె,య్యదిగత మొక్కొ నవ్వునకు నంచు మదిం దలపోయు
భూవరా. అను 1-281

(ఓరలు వాలంగంజూచు = ప్రక్క చూపులు చూచు)

**ఓరవాలు**

కనుకొలంకుల చివరల నుండి చూచు, కడగంటి చూపు చూచు.

వ. ఒక్కొక్క మరి వారి పిఱుంద నొరవాఱం దోఁచు జయద్రథు నేయం దీఱకున్న. ద్రో. 3-222

(ఒరవాఱం దోఁచు = కొంచెము ప్రక్కఁగాఁ వాఱఁగాఁ గనఁబడు)

**ఒరవోవు** దే. అ. క్రి. (√ఒర + పోవు)

1. ఒరగు.

తే. అతనిఁ గాంచితి నతఁ డప్రకటదర నడలు, చూడ్కి వామోము చక్కఁగాఁ బూడ కొర,వోవఁ జూచుచు దీనతఁబొంది యునికి,గని మనంబున శోకంబు గదుర నేను. శల్య. 2-9

2. వంకరపోవు.

వ. ఒరవోయిన నురియం జెరివి యవలీలం గాలంబులంబైఁ బడి చక్కం జేయుచు. దివ్య. 2-71

**ఒరి** దే. అవ్య.

నీచులను సంబోధించునపుడు ఉపయుక్తమగును.

తే. ఒరి ధాత్రీసురాధమ క్రూరకర్మ, కపటధార్మిక. పాత్రి. 2-59

వ. కర్ణు కొడుకుం గని యోరి సుషేణా పాలిసితి పొమ్మనుచు. కర్ణ. 2-169

**ఒరోరి** దే. అవ్య. (ఒరి + ఒరి)

నీచార్థక సంబోధనము.

సీ. కమఁగొని బంటారి తనయుం డోరోరి యీ, ప్రజ తేనచుండు సంరక్షకుండ. మాస. 185

**ఓరుచు; ఓర్చు** దే. స. క్రి. అ. క్రి.

సహించు, సైఁచు, తాళు.

తే. నీవు దుర్గాతిగామికి నీవపాతి, పరసతీ సంగమున వచ్చు పాపము నకు, నోతుమగాని సైరింపనోపఁ బచ్చ, విలుతు తూపుల తాఁకున కలరుఁబోఁడి. విరా. 2-58

క. ఒకమణి కిరీటి కట్టెఁబె,రికి సుఖమునఁ బోయిరేని యెందవమా ఆఁ,
య్యొకొనుట కోర్వఁగ లేరై,రొకళ్లుఁ గురురాజుసేనయోధుల
లోనన్. విరా. 5-55

ఆ. ...నీవును నాపద,నోర్చి భంగపాటు దీర్చికొనుము.

సీ. ...తాఁ,కోర్తురు పరులకు నోర్వరాని కోత్తలం గలరు.
ఉద్యో. 4-257

2. జయించు, ఓడించు.

సీ. సైంధవ యక్షపాంచాల త్రిగర్తుల, దీనన యోగ్చితి మానధనుఁడ.
(దీనన = ఈ గాండీవముచేత) విరా. 1-172

ఉ. రాజులనెల్ల నుగ్రసమరంబుల వేల్మిడి నోర్చి పేర్చి యీ, భూజన
కోటి నాదగు విభుత్వ సమగ్రత నాదరించి. విరా. 2-254

వ. ...అర్జునుండు...సురగణంబులతో సురపతి నోర్చి ఖాండవ దహ
నంబున నగ్నిదేవుం దనిపె. ఆది. 8-17

ఉ. పాండవ వీరులం గలన బాహుబలంబున నోర్చి యే సముద్దండత
నీవు దోల్లి ద్రుపదక్షితిపాత్మజఁ గొల్వులోనికిం, దెండని పుచ్చి
తద్దెసకుఁ దెచ్చుట పోలు నీతిఁగాదె యా,తండ మరల్పఁగాక
సముదగ్రత వచ్చు విరోధి నిప్పుడున్. విరా, 4-164

క. మన వానసీఁడు వలలుం,డను సూద్రుఁడు నాకుఁ దెల్ల మధికబలుల
నో,ర్చినవాఁ డనేకమల్లుల, నిను మెచ్చింపంగఁ జాలు నిజమది
యధిపా. విరా. 2-10

3. అనుభవించు.

ఉ. ...పురాకృతకర్మఫలవ్య మెవ్వాఁడును నేర్చునే తొలఁగనై వఁగ
నోర్వకపోవ చ్చునే. విరా. 1-288

4. సంహరించు, చంపు.

తే. ...ఎక్కటి కాలకేయ వర్గము[illegible]రిమార్చి నివాత కవచ,సంఘ
ముల నోర్చి గంధర్వ సమితి గెలిచి, ధార్తరాష్ట్రాగ్రజుని బెఱఁ

దలిగె నితఁడు. విరా. 5-333

ఆ. వనధివాసులగు నివాత కవచులను, దనుజు లాపురందరు నజయ్యు, లైన నతఁడు పనుప నర్జునుఁ దీర్చెను, మెచ్చి యక్కిరీట మిచ్చె నదివ. కర్ణ 3-324

తే. అర్జునుఁడు నన్ను దీర్చిన యట్టులైన, నెట్లు సెప్పుమ యనుడు మద్రేశుఁ డేను, గృష్ణు లిద్దఱ నొక్కటఁ గిట్టి తీవ్ర, బహుళ శరజాలముల పొలుపఱుతు ననియె. కర్ణ. 3-258

శ్లో. యది పార్థో రణే హన్యాదద్యమామిహ కర్హిచిత్,
కిం కరిష్యసి సంగ్రామే శల్య సత్య మథోచ్యతామ్.
సం. భా. కర్ణ 33-108

5. తొలఁగించుకొను, నివారించు.

ఆ. ...పృథివి యిట్టులను విప్రసేవను, విప్ర పూజనమున, విప్రహిత విధానమునను శాపతతిఁ దీర్చు మానవప్రతతి యొందు నివి నృపాలు పనులు. అను. 2-148

అ. క్రి.

1. సమకట్టు, సిద్ధపడు.

ఉ. (భూరిశ్రవుఁడు) నీదెసఁ జూడ నొండొకరునిం దగ మార్కొని పోరుచుండఁ జెం,పేది వినీచ కర్మమున కియ్యకొనం దగునే భవాదృశుం, డీ దురుపాయ మగ్గురుఁడొ, యింద్రుఁడొ, రుద్రుఁడొ నీకుఁ జెప్పె దా,మోదరుఁ డింత పాపమున దీర్పఁగఁ జేయునె నిన్ను నర్జునా. ద్రోణ. 4-268

ఉ. ...అ,య్యన్నయుఁ దమ్ముఁడుం దమకు నయ్యె సగం బిల వేఁడి కాన కి,ట్లున్నను వారి మార్కొనుట దీర్చితి నేనొక బ్రాహ్మణుండనే. ద్రోణ. 5-32

సీ. పాండుసూనులతోడఁ బగదీర్చ నెవ్వని యుత్సాహ మూఁది సుయోధనుండు కర్ణ. 1-21

ఉ. అవలవచ్చు నాపదల కన్నిటి కోర్చి లతాంగిఁ గూర్చి, కీచక
మాటలన్ మరలఁ జెన్నివిధంబులఁ జూపి చెప్పినన్. విరా. 2-78

2. ఓపు, చాలు, సమర్థమగు.

క. సేనాధిపత్యమును దగఁ బూనెద నను మార్కొనంగఁ బురుషుల
మర్విం,గాన గిరిటికి నొక్కని, కేనోర్వ నతండు శరము లెక్కు-
డెఱుంగున్. ఉద్యో. 4-149

క. ఇన్నగమునందు గాండివ,మున్నది యదిగాని మద్భుజో(దేక విలా,
సోన్నతి కోర్వవు పెద్దయు, నన్నున లివిండ్లు గుఱుచ లలఁతిబలం
బుల్. విరా. 4-105

చ. ...అ,య్యెడ కరుగంగ నోర్వక మహిం బెఱచోటఁ బలవించు
వారునై (ఓర్వక = ధైర్యసాహసము లేక-అని భావము)
ఉద్యో. 3-5

3. నిలువరించు, నిబ్బరించు

తే. దొరలు దలపడ్డ వాహవదోహలమున, నుభయబలములుఁ దమ
కించి యోర్వలేక, కలయబెరసి ఘూర్ణిల్లు కతన రాత్రి, గాక
మున్న యొండొరులఁ గానరైరి. విరా. 3-190

4. సమ్మతించు, అంగీకరించు

చ. ...అ,చ్చలమున నీ సుయోధనుని చావున కోర్చుట కాదె యింత
యున్. ఉద్యో. 2-287

ఓర్తు దే. పర్యా. ఏ.

1. ఒక స్త్రీ.

సీ. అతఁడు సరస్వతి నవగాహనము సేయుచుండి యాచేరువ నోర్తు
తడువు, గట్టక నీళ్ళాడఁగాఁ జూచి. శల్య. 2-160

తే. .. అర్ధేవపతియు, మునిపతియుఁ జూచుచుండ (గక్కున విమాన
మవతరించి యాసన్నరైయె యతివయోర్తు. శాంతి 5-6.

2. అన్యస్త్రీ.

అ. ..విధవ బోంటి, ఆశ్రమమునయందు భర్తృవంచన కెయివర్పి ధనము గూర్చిన యదియు మదంబు పేర్మి, నోర్పు మగని హరించిన యుగ్రమతి యును. అను. 5-106

ఓర్పు దే. వి. (√ఓర్చు)

క్షమ, సహనము, నిబ్బరము.

సీ. ..రేయు బగులు నిద్రయు నోర్పు నెఱుఁగక దయమంతి నలుఁడను ధరణినాథు-అ-వంద బుద్ధి నిలిపి కందర్పబాధిత యగుచునున్న యది, అర. 2-26; అను. 5-216

ఓర్వమి దే. వి. (√ఓర్చు)

సహింపమి, సైఁపమి,

తే. అని సహోదరు లాఁతి వాయానపడుట, కోర్వమియుఁ గౌరవుఁ జంప నొల్లమియును. ఉద్యో. 3-58

ఓలి దే. వి.

బాల్యక్రీడా సమయమున 'పట్టుకో చూతము' అని యితరుని, ప్రేరేచుటకై యుపయోగించు శబ్దము.

ఉ. రక్తనదులలోన రథయాన పాత్రముల్, వఱపి యోధవరులు బాహుబలము, వెలయ సమరకేళి సలిపిరి కూరత, నేది కడఁగి యోలి రాచిరాచి. భీష్మ. 3-395

ఓలగము దే. వి.

కొలువుకూటము, ఆస్థానమండపము.

(ప్రత్యేక ప్రయోగముగాన రాదు. పేరోలగము, ఒడ్డోలగము అను ప్రయోగములు మాత్రము గలవు)

చూ. పేరోలగము, ఒడ్డోలగము.

ఓలమావగొను (ఓలము[2]+అవ+కొను)

దేహము నపేక్షించు, యుద్ధమునకు వెనుదీయు.

వ. మాహిష్మతీ పతియగు నీలుం డతిరథుం డతనికి సహదేవునకుఁ దెగని పగ యైయుండు దానం జేసి యాలంబున నోల మాన గొనండు. ఉద్యో. 4-228

వ. ఆ సూతనందన ధృష్టద్యుమ్నులట్లు దార్కొనిన నయ్యిరువాగు నందు నొక్కరుండైన నోలమాసగొనక కడంగినం గోర ఘోరం బయ్యె. కర్ణ. 3-272

2. సందేహించు, వెనుదీయు.

క. అతిథి నినుఁ గోరెనేనిని, మఱిఁ గింకిరిపడక యోల మానగొనక నీ, వతనికిఁ బ్రియంబు సల్పుము, సతికిం బతివనువు సేయఁ జను నెల్లది యన్. అను. 1-84

**ఓలము**[1] దే. వి.

1. రహస్య స్థానము, మఱుఁగు చోటు.

క. జనములు సూచుచునుండఁగఁ, జనదు మలము మూత్రమును విసర్జిం పఁగ నప్పనులకు శౌచా చరణం,బున నవశ్యంబు నోలములుగా వలయున్. అను. 3-282; విరా. 2-321

2. చాటు, మాటు, మఱుఁగుపాటు.

తే. భావజున్మని వూనికి పారమెఱ్ఱు,నన్ను బంటుగా నేలుము వలిన వదన, యింక నీ సిగ్గుదెర యోలమేల నీకు. విరా. 2-118

వ. (భీముఁడు) అర్జునాస్త్ర పతితంబులైన చతురంగంబుల తిట్టల యోలంబు సొచ్చిన. ద్రోణ. 4-236

3. ఆపద, కీడు, నాశము.

క. ఏలినవాని ధనంబులు, వాలురు బంధువులుఁ దారు బ్రదికిన దిన ముల్, బ్రేలాపరిచి తింద్రాతని, యోలముగని పిదప భీతి నొదుఁ గుదు రాజిన్. విరా. 4-317

4. మూలము, జన్మస్థానము.

క. శోక శ్రమ తృష్ణలకున్, నీ కలిమియె యోలమగుట నీ కగపడు·

వాఁ, దే కర్తవ్యము గానం, దోశామను నిమ్నుఁ దొఱఁగియుండెద సుఖనై. శాంతి. 4-49

శ్లో. తృష్ణాశోకశ్రమాణాం హి త్వం కామప్రభవస్సదా.
సం.భా. శాంతి. 177-88

["మూలము"-అని పాఠాంతరము. ఆనంద (1916) ప్రతిలో 'మూలము' అనియే పాఠము గలదు]

**ఓలము**[2] దే. వి.

దేహము -చూ ఓలమూస గొమ.

**ఓలరాచు** దే. అ. క్రి.

జలక్రీడయందు పందెమువేయు, ఓలశబ్దము ప్రయోగించు.

చూ. ఓల. భీష్మ. 2-395

**ఓలలాడు** దే. అ. క్రి. (ఓలలు + అడు)

జలక్రీడచేయు, ఈఁదు, మునిఁగితేలు, స్నానముచేయు.

గీ. ...సంభృతోత్సాహ లీల,మల్లి భూత బేతాళంబు లోలలాడ, నిట్ట లంబగు నెత్తురు టేఱు వఱచె. ద్రోణ. 1-148; కర్ణ. 2-227

**ఓలలార్చు** దే. స. క్రి. (√ ఓలలాడు)

ఓలలాడించు, ముంచితేల్చు, (నీరు మొదలగు వానియందు) విహరింపఁ జేయు, స్నానమాడఁ జేయు.

ఉ. ...అజ్ఞానవనం బట్టి తెచ్చి హృదయం బలరంగ ననంగ తంత్ర విద్యా నిపుణత్వ మేర్పడిచెదం బ్రమదాంబుధి నోలలార్చెదన్.
విరా 2-298

వ. రక్తనది ప్రవాహంబు భవదీయ సేనా మధ్యంబునం బఱపి బేతాళ క్రవ్యాదాది భూతంబుల నోలలార్చె. భీష్మ. 2-168

వ. నిర్జర విహారస్థానంబుల ననవరత సురతకేళీ సౌఖ్యాంబుధి నోల లార్చు మనిన. అర. 1-368

**ఓలాకు** దే. వి.
క్షోభము, వ్యాకులత.
చూ. ఓలాకుపడు.

**ఓలాకుపడు** దే. అ. క్రి.
క్షోభపడు, వ్యాకులపడు.

వ. సుశర్మయు...గోగణంబుల యగపాటూహించి జతనంబుతో నడచుచుండియు వెసఁ గుందక వేగిరంపుఁ బయనంబులయ్యును బ్రజల నోలాకు పడనీక...వేగులవారి వలన విరాటు తొట్టియున్న యెడ యెఱింగి కదుపులం గాఱ్చిచ్చుచందంబునం బొదివి వెలిచిన.
విరా. 3-181

**ఓలి** వి. (సం. ఆళిః -ప్రా- ఓలీ)

1 వరుస. క్రమము, సొరిది

సీ. ఏమేమయని యోలి నెత్తిన పరదేశిదొరల పావడములు తోరణముగ. విరా 3-74

సీ. బ్రాహ్మణాదికముగఁ బరఁగు నన్నాలుగు జాతుల యుజ్జ్వల చ్ఛాయ లోలి, సొంపారు దెలుపును గెంపును బసుపుచాయయుఁ గప్పునయ్యె నంబ్రదార్య వర్యులు. శాంతి. 4-97

మ. అమితోగ్రాటవిలోనఁ గ్రుమ్మరు వరాహవ్యాళ శార్దూల ఖడ్గ మదేభాదులఁబట్టి తెచ్చి ఘనుఁడై కద్యాగ్రమోపాంత భూ,జ ములం దోలిన కట్టుచుం బలిమియై శాకుంతలుం డొప్పె.
ఆది. 4-63

ఉ. అమ్మెయి, పాపముల్ వోలియునంతకు దుఃఖములంది కీట జన్మ ములఁ బడి యోనులఁ గ్రమంబునఁబొంది మృగత్వ మానుష,త్వ ముల్మెల నోలిఁ బొందుదురు వారిను మెంతయుఁ గ్రాఁగి కల్మష,త్వ మ ణ్దొఱంగు మాడ్కి. అను. 5-172

2 వాక్యాలంకారముగా నుపయోగింపఁబడి కొన్నిపట్ల బాగు, పెల్లు, అధికము మున్నగు వర్థముల నిచ్చును.

మ. ధరణీచక్రము దిర్దిరందిరిగె మార్తాండుండు గుంఠితప్రభుండయ్యె దిశావితానము వడంకెన్ మిన్ను దిర్వైన్ మహీధర సంతానము లోలి గ్రక్కదలె. ద్రోణ. 5-377

సీ. తఱిమి సుశర్ముండు దాఁకి యర్జును నొంచి, కృష్ణుపై నమ్ములు గీలుకొలుప, నలిగి యన్నరుఁడు వాలంప శాలువ లోలి నదరించుటయు. భీష్మ. 3-234

క. ధరణియుఁ గాశ్యప వైశ్వానర మార్కండేయు లోలిన జగద్ధిత వాక్పరులై రి. అను. 2-88

చ. అవని యరాజకంబయిన యప్పుడ ధూర్వజలందు సర్వధర్మవులుఁ దొలంగు దేవమునిముఖ్యులు వాయుదు రోలి వృష్టి లేఁవు మఱి యర్థు పుల్ దఱుఁగు నందురు. ఆది. 4-249

**ఓషధి** సం. వి. ఇ. ఈ. స్త్రీ.

1. మందున కుపయోగపడు వనమూలిక.

వ. ...మంగళ తరువ్రజప్రచయంబున మహౌషధి నిచయంబున విహిత మంత్రంబుల నుచిత తంత్రంబుల ఋత్విక్పురోహిత సహితుండై తత్సంస్కార ప్రకారం బాచరించి. ఉద్యో. 4-157

2. ఫలించుట తోడనే నశించు మొక్కలు వరి మొ.

సీ. ...గోరూపయైన యవ్వసుమతి నమిత గణముఁ, బిదిచి యోషధులను బహురత్నములుఁ బిదికించి జనంబుఁ బోషించెఁ బృథుఁడు ద్రోణ. 2-211

ఆ. ...గృహాయుక్తుఁ డోషధులకు నొదయుఁ దగుట. శాంతి. 5-312

3 వృతలతాదులు.

సీ. ఓషధు లమృత మయ్యుత్తమ వస్తు సంతతిలోనఁ బుష్పవంతములు మేలు. అను. 4-5

**ఓషధినాథుఁడు** సం. వి. అ. పుం.

చంద్రుఁడు.

వ. అమ్మహోత్సవంబు గోపించి యఖిలదేవులు గోమమని శాపంబిచ్చిన నయ్యోషధి నాథుండు నానాఁటికిఁ గృశుండయ్యె. కల్కి. 1-148

**ఓషధీశుఁడు** సం. వి. అ. పుం.

చంద్రుఁడు.

క. జనులకు నింద్రుఁడు గ్రహములఁ, దినుఁడును దితరులకు నోషధీశుఁడుఁ బోలెన్, మనుజోత్తమ కడునెక్కుడుఁ దనము నదుల కెల్ల జాహ్నవి మహాత్త్వమునన్. అను. 2-115

**ఓష్ఠము** సం. వి. అ. పుం.

పెదవి.

మ. ...చల,ద్వికృతోష్ఠద్వయుఁడు. విరా. 3-24

**ఓసరించు** దే. అ. క్రి.

1. ప్రక్కకుఁ దొలఁగు, తొలఁగు పోవు.

వ. భయంకరంబగు నతి సంకులంబున సామజ వాజి రథంబుల యురవడికి నోసరింపని కాలుబలంబులు. భీష్మ. 1-367

వ. తడసిన కర్ణుండు దప్పు నితనికి నోసరించి పోవలయు. ద్రోణ. 4-12

వ. అతనివరుండు భూవరు విల్లు ద్రుంచి మేను గొంచిన నోహటించి యోసరించి డప్పి దీర్చికొని మగుడ నమ్మాధవానుజుం దలపడి. ద్రోణ. 5-300

2. పాఱిపోవు.

వ. ఆశ్రైనేయుండు దురంగంబులం జడిపిన నరదంబు దిగ్గమఱికి యోసరించి నగ్గాంధారవిభుం గని యులూకుండు. కర్ణ. 2-168

**ఓసరిలు** దే. అ. క్రి.

1. ఒదుగు, దాగు, నక్కు.

వ. ఇట్లు సొచ్చి తఱియంజని మధ్యప్రదేశంబున విరాటనందన శిలాపర్యంకం బరసి దాని కనతిదూరంబునం బాంచాలి నోసరిల నునిచి

తాఁకఁ దల్పంబున మండె. శిరా. 2—828

2. తొలఁగు, ప్రక్కకు తొలఁగు.

క. ఇంతయుఁ గనుంగొనియును శత్రుంతపుఁ డొకసరిఁ బాఱి యోహటిం మలరం, గాంగేయులతోడఁ దలపడి, వింతలయిన కూర్మనఖర విశిఖము లేసెన్. విరా. 5-75

క. ఒసరిలిపరచు మృగముల, నేసియు డాసిన మృగముల వెగిచి ధుళా సిన్, ప్రేసియుఁ బంపెను మృగయా, వ్యాసక్తి నపారఘోరవన్య మృగాలిన్. ఆది. 4-18

వ. (అశ్వత్థామ) కుంతిభోజతనూజు లొక్కపెట్ట పదుమువ్వు రతనిం బొదివినఁ బదుమూఁడు మేదితూపులం గీటడంచి కెరలి జము చందంబున గర్జిల్లి ఘటోత్కచుం గాల దండంబులోని కోలం దెరిపై ద్రెళ్ళ మూర్ఛిల్ల జేసిన నోసరిల వయ్యరదంబుఁ దోడన ధృష్టద్యుమ్నుండు గొనిపోవుటయు ద్రోణ. 5-84

శ్లో. తం హతం పతితం జ్ఞాత్వా ధృష్టద్యుమ్నో మహారథః,
ద్రోణేస్సకాశాత్ రాజేంద్ర అపనిన్యే రథాంతరమ్.
సం. భా. ద్రోణ. 156-189

**ఓహటించు** దే. అ. క్రి.

1. వెనుదీయు.

చ. వెపమిడి యోహటించి యిటు నీవు దొలంగినఁ జోవ వచ్చునే. ఉద్యో. 4-840

తే. ఆహవంబున నీవోహటించి, పోవసడివచ్చు నదికంటెఁ జావు మేలు శస్త్రజీవికిఁ బరలోక సౌఖ్య మమత,వింపు మమరత్వ సంపద వెలయు మంది. స్త్రీ. 2-88

సీ. త తియుండు...యుద్ధ తంత్రములకు నోహటింప కుండెడు మదిఁ జేర్చి. అను. 4-124

2. జంకు, బెదరు, వెనుదీయు, భయపడు.

ఆ. అనుచు సంచలించు నడియాసఁ గ్రమ్మఱఁ బాసఁ దలఁచి ధృతిఁ బట్టువెట్టి, మరుని కోహటించి యురియాడుఁ దుదిముట్ట, గాన నిశ్చయించుఁ గలఁగు దేఱ. విరా. 2-299

ఉ. (కర్ణుడు ద్రోణునితో)....కౌరవసేన కెల్ల నా, శ్యాండవ మేటి వీ బలము గర్వముఁ గుందఁగ నిట్లు శత్రుదో, శ్చండిమఁ గోహటించితి నిజంబునకున్ నరు డింత యొక్కడే. విరా. 4-98

ఆ. మర్మభేదులైన మార్గణంబుల కోహ, టించి సిగ్గుఁ బలము డిగ్గఁ ద్రావి, యెల్లజనములుఁ జూడఁ బొల్లఁదనంబున, గోర్చి యక్కుమారుఁ డోడి పాఱె. కర్ణ. 1-188

వ. చిత్తంబులు గలంగ రాత్రి యుద్ధంబునకు నోహటించుటం జేసి మన దొరలఁ బాండవ సైనికులు దఱిమినం జాల్మి వాదింపక తిరిగి పోయిరి. కర్ణ. 1-206

శ్లో. తే త్రస్యంతో మహేష్వాసా రాత్రియుద్ధస్య భారత
అపయానం తతశ్చక్రుస్సహితాః సర్వతోఽదిభిః

సం.భా. కర్ణ. 81-39

3. భంగపడు.

క. గాంగేయుచేత నెంతయు, భంగపడితి మనుచు నగచు పార్థాదులు దన్నుం గొలిచి చనఁగ విడి దల, కుం గడు విన్ననయిపోయెఁ గురువంశనిధీ. వ. ఇట్లు పాండవ వ్యూహంబు లోహటించిపోయిన.

భీష్మ. 3-272; 274

4. అలయు, స్రుక్కు.

వ నిజ జవకునకు నర్జునుం జూచి యుత్తరుం డిట్లనియె

చ. తను వెరఁగించి యట్లి మతిప్రియభారములున్న మాత కృంతక్ష మునకుఁ జొన్ని నేను బ్రమదంబున నప్పటి కియ్యకొంటి లోకము సమరంబు నట్లయది కయ్యమునకు మిత్రతకుం దగంగ రత్యములఁ

జరింపఁజేఁత భరమై తుదిఁ బల్కులు వోహటించిరిన్.
విరా. 6—334, 337

**ఓహారిసాహారి** దే. అవ్య. ద్రు.
అహమహమికతో, సాహంకారముగా.

వ. ...ఉభయ బలంబులుం బరికొని యోహారిసాహారిం బెనంగు చుండె. ద్రోణ. 3—140

సీ. ఓహారిసాహారి నయ్యూల చేరుగా, వెనుకొంచుఁ దెరలుచు బెనఁగు నెడలు. విరా, 3-164

క. పురికొనుచుం దెరలుచు నోహారిసాహారి నొక్కచోట నలవడు నొకచో, విరియు నొకచోటఁ దిరుగుం, దిరుగక యొకచోట రెండు తెఱఁగులు నొప్పున్. భీష్మ. 2-178

(గుంపులు గుంపులుగా-అని భావము)

**ఓహో** దే. అవ్య. (అహో శబ్దభవమని కొందఱు)

1. సంబోధమునందు వచ్చును.

వ. అద్దేవి దీవింపవొల్లక యుల్లంబు నిజతనూజుల మరణంబునకుం దాపంబువొంద శాపంబిచ్చు నదియై యజాతశత్రు మద్దేశించిన నత్తెఱఁగు...సత్యవతీసూనుం డెఱింగి తత్క్షణంబ సన్నిహితుం డయ్యె నక్కోడలిం జేరి యోహో శపింపకు శమింపుమని పలికి మఱియు నిట్లనియె. స్త్రీ. 1-150

క. ...ఓహో తనక క్రమ్మఱుమని, యాతతభయుఁ గ్రమ్మఱించె వాస్తీకుఁ డెడన్. ఆది. 2-284

2. ఆశ్చర్యము, సంతాపము, ఆక్షేపము మొదలగు వానిని దెల్పును (ఆశ్చర్యమునకు)

క. అతిభీషణ మిది యత్యద్భుత మోహో చాలు భూనభోమధ్య వ్యాపితమయ్యె భవద్దేహ,యశక్య ముపసంహరింపు మనవుడుఁ గపియున్. అర. 2-344; అర. 1-364

(సంతాపమునకు)

వ. అతి ఘోరంబగు నవ్వికారంబునకు సమాత్య సహితంబుగా సంతప్త చిత్తుండై వైచిత్ర వీర్యుండు గొదుకుచు నిట్లనియె.

క. ఓహో యిట్లనుట జగ,ద్ద్రోహం బిమ్మాట మఱవు

ఉద్యో. 3-169, 170

వ. కౌంతేయాగ్రజుఁ డోహో యెంత బెట్టిదంబులైన యిడుమల బడియెదరో వీరలని కారుణ్యం బొలయ నిలిచి.

స్వర్గ. 23; ద్రోణ. 2—184

(ఆక్షేపమునకు)

క. ఓహో యిట్టివిగలవే, బాహాదర్పమునఁ బరులఁ బరిమార్చి పదిన్, మాహాత్మ్యం బెడలఁగ భీష్మాహారత నొందఁ దలఁపనగునె నరేంద్రా. శాంతి. 1-48

# ఔ

ఔ ఉభ. - ఒకానొక యక్షరము

(కొన్నివట్ల తత్సమేతర పదముల యందలి 'ఔ'కు అవు 'అవు'నకు ఔ వచ్చును.

ఔనా. శాంతి. 2-394; అశ్వ. భీష్మ. 3-428

ఔడు. ఆది. 6-291; అవుడు. భీష్మ. 1-267

2. తగవు, హితము.

తే. మద్రవిభు వారి నమ్మెయి మార్తు రాఁగి,కొనఁగ మనకు మపే
క్షింపఁ జనువె యనుడు, నతఁడు నా మాట వినక వా తరిగి రెమ్మి
చేయు వారము చెప్పు మౌచిత్య మనియె.

వ. అని నన్ను నా పరివారంబును రక్షింపను దగ వెలింగింపను సర్వాం
డ వీవకావే యను మాటలాడిన. కల్కి. 1-297, 298

ఔట దే. వి.

1. చేటు పొందుట, హాని చెందుట.

క. ధన మపహరించుటయ తన్నకనిశమ్మఁ బనిగాఁగ బ్రదుకు నతిలుబ్ధుఁ
కున్, విను శత్రుచేత నౌటకు,ము మ దన ప్రజ చేన చేటు మూఁడు
నరేంద్రా. శాంతి. 2-188

2. అగుట.

చ. ...అచ్చుటన్, జను లెడ యౌట గాంచు నెఱి సాలక.

విరా. 2-247; శాంతి. 6-446

ఔడు వి. (సం. ఓష్ఠః)

పెదవి, అధరము.

ఆ. అలిగి యౌడుగఱచి యాఁకటి పెలుచన, నిలువలేక.

ఆది. 6-291, ఆది. 7-176

శ్లో. త్రిశాఖాం భ్రుకుటిం కృత్వా, సందశ్య దశనచ్ఛదన్.

సం.భా. ఆది. 168-8

ఔడుగఱచు క్రి.

(క్రింది) పెదవి గొఱుకు.

చూ. ఔడు.

ఔతథ్యుఁడు సం. వి. అ. పుం.

దీర్ఘతముఁడు. ఉతథ్యుని కొడుకు, [illegible]

యు నందురు ఈయన భార్య ప్రద్వేషిణి-చరిత్రకై చూ.
ఆది. 4-326; మొ 286 వంటు.

**ఔత్సుక్యము** సం. వి. అ. న.

ఉత్సుకత్వము, ఉత్కంఠ, ప్రియస్మరణాదుల వలనఁ గాల విలంబనమున కోర్వలేమి.

క. అని యడిగిన వైశంపాయనుఁ డమ్మనుజేంద్రచంద్రు నధికౌత్సుక్యంబున కలిమికిఁ దన హృదయంబున గాఢాదరము భరితముగ నిట్లనియెన్. విరా. 1-45

**ఔదల** దే. వి. (ఔ+తల)

అవుదల, తలముందఱి భాగము.

సీ. ...మోడ్పుఁగే లౌదల, గదియించి మిమ్ము వేఁడెద. అ ళ 1-97

**ఔదాత్త్యము** సం. వి. అ. న.

ఉదాత్తమైనది, ఉదాత్తత.

క. సత్య సరస్వతి వగు మౌచిత్య విశారదము నీదు చిత్తము నియమౌదాత్త్యంబు మెఱయ నాకు నమాత్యుఁడవై పూని నడవు మతైన్యంబుల్ ఉద్యో. 1-95; శాంతి. 8-448; అను. 4-352

**ఔదార్యము** సం. వి. అ. న.

ఉదారత్వము.

సీ. ...అనివార్య శౌర్యంబు దోర్బలౌదార్యంబు మెఱయ.
ద్రోణ 1-76

**ఔదుంబరము** సం. విణ. (అ. ఈ. అ.)

మేడి చెక్కతోఁ జేయఁబడిన.

వ. సమున్నతౌదుంబర పీఠంబునం బరమాస్తరణం బొనర్చి యంగపతి నందు నిలిపి. కర్ణ. 1-56

**ఔద్దాలకి** సం. వి. ఇ. పుం.

ఒకముని, శ్వేతకేతువు, అష్టావక్రుని మేనమామ, నాచికేతుని తండ్రి.

వ. ఇది యౌద్దాలకి రైన శ్వేతకేతు తపోవనం బిందు సరస్వతి మనుష్య
స్త్రీ రూపధారిణియై శ్వేతకేతుని సేవించె. అర. 3-237
విషయమునకై చూ. అను. 2-446; మొ. 462 వరకు

**ఔధేయుఁడు** సం. వి. అ. పుం.

ధర్మరాజునకు దేవికయను దానియందుఁ బుట్టినవాఁడు.

వ. ధర్మజునకు స్వయంవర లబ్ధయైన దేవికయను దానికి యౌధే
యుండు పుట్టె. ఆది. 4-115

**ఔద్ధత్యము** సం. వి. అ. న.

ఉద్ధతి.

క. సత్యపరాక్రముఁడగు నీ, సాత్యకి బాహాబలంబు సమర విహా
రౌద్ధత్యమునుఁ జూచెదుగాదే, యత్యాశ్చర్యంబు లితని యస్త్ర
విధంబుల్. భీష్మ. 2-12

**ఔనది** దే. వి.

భవిష్యత్కాలము, రాఁబోవు కాలము.

వ. ఇంక నౌదానికి నిట్టి కొఱగాములు సేయక బుద్ధిమంతుండవై
యుండు మనిన, నతండు లజ్జావనత వదనుం డగుచు నచ్చోటు
వాసి గంగాద్వారమున కరిగి యందు. అర. 6-253

(ఔదానికిన్ = ముందుజరుగఁ బోవు కాలమునందని యర్థము)

**ఔపనిషదము** సం. విణ. (అ. ఈ. అ.)

ఉపనిషత్సంబంధమైనది.

ఆ. శ్రుతులు నౌపనిషదసూక్తులు గోప్యరూపంబు లని సరోజభవుఁడు
సెప్పె. అను. 3-95

**ఔపరిమితము** సం. వి. అ. న.

ఔపరిమితము, నిరుపకరణము, సోమకరణము - అను సుకృతములలో
నొకటి—పాపవర్జనము (పాపములు చేయకుండుట)

పాపవిముక్తము (పాపములను వదలిపెట్టుట) అనునది అజ్ఞానులు తెలిసికొనలేరు. దీనికి యత్నముతోఁ బనిలేదు. వ్యయప్రయాసములు లేదు, పరలోక భయముచే పాపములను వదలిపెట్టినంత మాత్రమున సుగతి సౌఖ్యము చేకూరును-అది ఆత్మాధీనము అట్టిదాని యందలి సుకరత్వము తెలిసికొనఁ జాలక మానవులు నరకము పొందుదురు. బుద్ధిశీలురు వేదము వలనను వృద్ధసేవవలనను ధైర్యముపూని యింద్రియముల నిగ్రహించి ఊహా యౌపరికమును పొందుదురు దీనివలన స్వర్గమును బడయవచ్చును.

అను. 5-178-179

**ఔపాసనము** సం. వి. అ. పుం.

గృహ్యాగ్నియందు ప్రాతస్సాయంకాలములలోఁ జేయు హోమము.

సీ. అగ్నిహోత్రములందు నౌపాసనాది సాయంప్రాత రాహుతు లంత నుడిగె. అది. 1-140

**ఔరసుఁడు** సం. వి. అ. పుం.

ధర్మపత్నియందుఁ బుట్టిన కొడుకు.

వ. ...దీనరుండగు నీవి యాత్మాంగంబుల నౌరసపుత్రుని బ్రాహ్మ ణార్థంబుగా నొసంగె. శాంతి. 6-32

తే. పరమ సంస్కృతయగు జాత్మభార్యయందు, ధర్మవిధిఁ గలిగించిన తనయుఁ డనఁగఁ, దానయౌరసుఁడను సఖిజాన మొప్పఁ, బరఁగు నుత్తముఁ డాతఁడు ప్రథముఁ డధిప. అను. 2-248

చూ. కొడుకు.

**ఔర; ఔరా** దే. అవ్య. అగుర, అవుర

1. ప్రశంసను దెలుపును.

తే. అంబకై పూని వచ్చి బలాధికుండు, జామదగ్న్యుండు సాధింపఁ జాలకున్న, దాని భీష్ముఁ బాండవులకై పూనివచ్చి, కడిమి సాధించి తౌర శిఖండి పోర. భీష్మ. 1-55

క. అమ్మేటి మగఁడు దనదాసమ్యూఁతగ నిల్చి పోలి బదపడి కొలి పుల్లమ్మున నొందిన నౌరా, యిమ్మడి యని పొగడెఁ గొడుకు నెంతయుఁ బ్రీతిన్. అశ్వ. 4-60

2. ఆశ్చర్యమును దెలుపును.

క. అతఁ డొండొక వి త్తెత్తిన, నతిరయమున నదియుఁ దునుమ నాతం
డౌరా, శతముఖనందన యనుచును; ధృతి సేయక వింట శరత
తిం బరఁగించెన్. భీష్మ. 3-257

**ఔర్ధ్వదైహికము** సం. వి. అ. న.

ఉత్తరక్రియ, పరలోకక్రియ.

వ. ఇంతయు నెఱింగి శాంతినొంది పుత్త్రాదిజ్ఞాతులకు నౌర్ధ్వదైహి
కంబులు సేయించి సుఖవిగమ్ము. స్త్రీ. 1-61

వివ (అ. ఈ. అ)

ఊర్ధ్వదేహప్రాపకమైనది. చనిపోయిన వానికిఁ జేయు కర్మము మొద
లగునవి.

వ. దుర్యోధనాదులకు నంతకంటె విభవంబెసంగ ధృతరాష్ట్రుం డౌర్ధ్వ
దైహిక విధు లాచరించునట్లుగా నొనర్చి. శాంతి. 1-382

**ఔర్వానలము** సం. వి. అ. పుం.

బాడబము.

వ. ఔర్వుండు పితృదేవతాదేశంబునఁ దనకోపానలంబు సముద్రం
బులో వైచిన నది యౌర్వానలంబై నాశ్వముఖంబున నబ్ధి జలం
బులు ద్రావుచుండు.

**ఔర్వుఁడు** సం. వి. అ. పుం.

భృగువునకుఁ గుమారుఁడు చ్యవనుఁడు చ్యవనునకు మనువుతనయ యగు
ఆరుషియందు నూరువులనుండి యుద్భవించినవాఁడు ఔర్వుఁడు.
ఊరువులనుండి పుట్టుటచే నీతనికి 'ఔర్వుఁడు' అని పేరు వచ్చెను. ఇత
నికి ఋచీకాదులు నూర్వురు సుతులు గలరు. ఋచీకునకు జమ
దగ్ని పుట్టెను-జమదగ్నికి పరశురాముఁడు జనించెను.

ఆది. 3-20; విరా. 1-54

చరిత్రకై చూ. ఆది. 7-132 నుం. 148 వరకు.

**ఔశనము** సం. వి. అ. న.

తీర్థ ప్రదేశము.

చూ. మాహాత్మ్యము. కల్య. 2-168

**ఔశనస తీర్థము** సం. వి. అ. న.

ఔశనము అను తీర్థము. ఇందు స్నానముచేసి పాపవిముక్తులయి బ్రహ్మలోకంబు వడయుదురు. అర. 2-265

చూ. కల్య. 2-168

**ఔశనస వ్యూహము** సం. వి. అ. పుం.

ఒక రకమైన వ్యూహము.

శ్రీరామునితోఁ బోరునపుడు రావణుఁడు పన్నిన వ్యూహము. దీనికిఁ బ్రతిహతముగా శ్రీరాముఁడు బార్హస్పత్య వ్యూహమును పన్నెను. అర. 7-74

**ఔశీనరము** సం. వి. అ. పుం.

'ఔశీనరము' అను పేరుగల ఒక దేశము ఉశీనరము.

క. ద్రవిడ కళింగౌశీనర, యవన శక పుళింద నృపతు లవనిసుర వరా, భవమునఁ గాదే ధరణీ, ధవ పొందిరి తొల్లి శూద్రతా దైన్యం బిల్. అను. 2-143

**ఔశీనరుఁడు** సం. వి. అ. పుం.

ఉశీనర దేశస్థుఁడు.

వ. ఔశీనరు లెల్ల శైబ్యులకు పేర్చి సత్త్వవంతులై యుండుదురు. శాంతి. 3-11

వ. ఔశీనరుండగు శిబి యాత్మాంగంబుల నౌరసపుత్రునిని బ్రాహ్మణార్థంబుగా నొసంగె. శాంతి. 5-82

**ఔశీనరి** సం. వి. ఇ. స్త్రీ.

శూద్ర స్త్రీ. గౌతమునివలనఁ గాక్షీవాదులఁ గనెను. గిరివ్రజనివాసిని.

వ. దానఁజేసి యిప్పురంబు గిరివ్రజంబునాఁ బరఁగె నిందుఁ దొల్లి గౌత
ముం డౌశీనరియను శూద్రయందుఁ గాక్షీవాదుల సృజియించె.
సభా. 1–175

**ఔషధము** సం. వి. అ. న.

మందు.

ఉ. యక్షుఁ డెఱింగి వచ్చి యిటు లాఱడి చావఁగనేల చెప్పుమ, క్షాశ్
భవన్మనోరుజకు నౌషధమే నొనరింతు నన్న. ఉద్యో. 4–385

మ. ...ఔషధ మూఁదిచేసి తెవులు న్మర్దింపకున్నం దుది, న్వరమై
యుండదె. కర్ణ. 2–307

ఆంధ్ర మహాభారత నిఘంటువు

ప్రథమ సంపుటము

సంపూర్ణము